# ఆంధ్రభాషా వికాసము

ప్రొఫెసర్
గంటి జోగిసోమయాజి, ఎం. ఏ., ఎల్. టి.



త్రివేణి పబ్లిషర్సు
మచిలీపట్టణము - 1 & మద్రాసు - 1

# FOREWORD

Vidwan G. J. Somayaji, Reader in the Telugu Department of the Andhra University, deserves to be warmly congratulated on his "Andhra Bhasha Vikasamu" a book of outstanding merit in its line. It is a masterly contribution to Dravidian Philology in general, and more particularly to the origin and growth of Telugu language.

The author is well-equipped for this task. He is highly proficient in Sanskrit and in Telugu, and has enough knowledge of South Indian languages like Tamil, which is nearest the parent stock, and Kanarese. He possesses the needful historic sense, not very common amongst Pandits, and a penetrating critical insight. He is widely read, and deeply. He is familiar with the language of inscriptions, the indispensable requisite for this historical investigation. He is thus in every way fitted for the very difficult task of exploring Telugu Linguistics as a science and tracing its evolution.

I am not scholar enough to be able to pronounce judgment on the absolute value of this book. But such general knowledge as I possess leads me to believe that it is a work of extraordinary scholarship and merit. There have been, broadly speaking, two schools of thought, with respect to the affiliation of Telugu. Bishop Caldwell and the majority of Philologists have traced it to Dravidian sources, and given it a Dravidian affiliation, though, of course, it has absorbed into itself other elements, more especially those akin to Sanskrit and Prakrit, and is still continuing to absorb and assimilate foreign matter, as is but natural to a language living and growing and full of vitality. The rival school emphasises the affiliation of Telugu to Sanskrit and Prakrit; and one of the ablest exponents of this theory is Dr. Chilukuri Narayanarao, whose big book in two volumes, "History of Telugu Language", is amongst the publications of the Andhra University.

It appears to me, though I can only speak as a layman, that the weight of evidence and of authority incline towards the Dravidian School.

The Andhra University has to its credit another publication also dealing with the linguistic side of Telugu, namely Vajjala China Sita Ramaswamy Sastry's erudite volume, "Vaiyakarana parijathamu" a masterpiece which has to be taken into account. This book also upholds the Dravidian theory.

Without meaning to institute comparisons for which I am by no means qualified, I have a feeling that in some respects the range of Vidwan Somayaji's research is wider and of more arresting interest. I suppose the epoch-making book of Bishop Caldwell, the poineer explorer in this field, will always remain the leading classic on the subject, round which developments revolve sped by time and discovery. In the list of books, not many, that have to be mentioned in near order, though subsequent, Vidwan Somayaji's "Andhra Bhasha Vikasamu" or "Evolution of Telugu" will occupy very high rank. It keeps the Dravidian flag flying full mast; illumines many a dark corner by its far-reaching flashes of light and marks a further stage in the advancement of South Indian philology.

Sir C. RAMALINGA REDDY,
KT., M. A. (Cantab), HON. D. Litt.,
*Vice-Chancellor, Andhra University.*

WALTAIR
15-8-1947

# ఉపోద్ఘాతము

## ప్రథమ ముద్రణము - 1947

సుమారు పదునాలుగు సంవత్సరములనుండి ఆంధ్ర విశ్వకళాపరిషత్తువారి కళాశాలలో తెనుఁగు విద్యార్థులకు ఆనర్సు తరగతియందు ఆంధ్ర భాషాచరిత్ర మును బోధించుటవలనఁ గల్గినఫల మీగ్రంథము. ఆంధ్ర భాషాస్వరూపము కాల క్రమమున నెట్లు పరిణతమయి నేఁ డెట్టిస్థితికి వచ్చినదియో నిరూపించుటయే దీని యుద్దేశము. సంస్కృతాంగ్లభాషల సంపర్కము తెనుఁగు నెట్లభివృద్ధిపఱచినదో యిందు సక్రమముగ నిరూపింపఁబడినది. ఈ భాష అరవము, కన్నడము, మలయాళము మొదలయిన ద్రావిడభాషలతో నభిన్నమయి యేకరూపమున నుండియు కాలక్రమమున వానినుండి విడి నేఁ డీరీతి నెట్లు స్వతంత్రభాష యయి నదో వివరించితిని. ఉన్నతపరీక్షలకు అభ్యర్థులయినవారికిమాత్రమేగాక భాషాభిమానులును, భాషాభిజ్ఞులును నయిన సరసులకుఁగూడ నియ్యది పఠన యోగ్యముగ నుండవలెనని సంకల్పించి వ్రాసితిని. ఇందలి విషయములను గుఱించి విమర్శకులు వ్యాసరూపముగ నక్కడక్కడఁ బ్రచురించిన సిద్ధాంత ములును, పరిశోధన ఫలితములును లభించినంతవఱకు సంగ్రహించి, విరోధము లను పరిహరించి సమన్వయపఱచి, యేకవాక్యత కల్పించితిని. అజ్ఞాతములయిన విషయములలో నా యొనర్చిన పరిశోధనమువలని ఫలితమును సమకూర్చి దండ గుచ్చితిని. నిరూపించిన విషయములకు ప్రమాణములను, గ్రంథ సందర్భములను ఆ యా చోటుల పుటల క్రిందిపంక్తులలో పదిలపఱచితిని. ఈ విషయమున విజ్ఞానాభివృద్ధి చేసికొను నభిప్రాయముగలవారి యుపయోగముకొఱకు నా చూచిన గ్రంథముల పట్టిక నిచ్చితిని. ఈ దేశమున ఆంధ్ర గ్రంథములను, అందు ముఖ్యముగా భాషావిషయక గ్రంథములను గ్రహించి యాదరించు విశిష్టులు దీనిని పఠింతురుగాక యని యాసించుచున్నాను.

చాలకాలము శ్రమించి వ్రాసిన యీ గ్రంథమును స్వీకరించి యాదరిం చిన అన్వర్థబిరుదాంకితులయిన కళాప్రపూర్ణులు శ్రీ విక్రమదేవవర్మ మహా రాజులుగారికి నా కృతజ్ఞతాపూర్వకవందనములు. దీనికి ముఖబంధము రచించి వెలయించిన విశ్వకళాపరిష దుపాధ్యక్షులయిన శ్రీయుతులు కట్టమంచి రామలింగారెడ్డిగారికి సంతోషపూర్వకమయిన వినతి. ఈ గ్రంథమును ఆంగ్ల భాషలో వ్రాయుటకు సమకట్టి సుమారు నూరుపుటలు వ్రాసియుండగా నద్దానిని పరిత్యజింపఁజేసి తెనుఁగున వ్రాయుటకు న న్నొప్పించిన బ్రహ్మశ్రీ వఝల చిన

సీతారామస్వామి శాస్త్రులవారిని స్మరింపక తప్పదు. అనేక సందర్భములయందు నిరుత్సాహమువలన విరతప్రయత్నుడనై యుండ 'కర్మణ్యేవాధికారస్తే' యను గీతావాక్యమును బ్రసాదించి విస్మృతకంఠచామీకరన్యాయమున స్వస్వరూపానుభూతిగొలిపి యీ పనిని నిలిపిన భగవంతుని నిరంతరము స్మరింతును. వస్తుస్థితి విచారణ ప్రధానములయిన గ్రంథములను వ్రాసిన ఋషుల యుద్దేశము విజ్ఞానవ్యాప్తి మాత్రమే. అట్టిఫల మీ ప్రయత్నమువలన గలిగినఁ జాలును.

'యథారాజా తథాప్రజా' యను న్యాయమ్మున శ్రీ జయపుర సంస్థానాధీశ్వరులకు దివానుగా నుండి నన్నాదరించిన శ్రీ చెలికాని వెంకటరావు దొరగారిని, రివెన్యూ ఆఫీసరుగానున్న అరుణాచలముపంతులుగారిని, శ్రీ కరుణాకరము విశ్వనాథముపంతులుగారిని, ఇతర సంస్థానోద్యోగులను నన్ననేకవిధముల ప్రీతిపూర్వకముగ సత్కరించినందులకు సంస్మరించుచున్నాను.

ఈ గ్రంథమును మిక్కిలి ఓపికతో చాలకాలము శ్రమించి ముద్రణమునకుపయోగపడునట్లు చక్కగ వ్రాసి యిచ్చిన మా విద్యార్థులను, ఇతర పండిత బృందమును కృతజ్ఞతాపూర్వకముగ స్మరించుచున్నాను. ఇందలి శాసన విషయములను సేకరించుటకు వలసిన యనువులనుగూర్చి తమ శాసన పుత్రికలన్నిటిని నావశముచేసిన మదరాసు ఎపిగ్రాఫికు డిపార్టుమెంటువారిని స్మరింపక తప్పదు. నెలలకొలఁది వారి యాఫీసున పనిచేసి యనేకవిషయములను సంగ్రహించితిని. ఈ పనియందు నన్ననేకవిధముల ప్రోత్సహించి నా రచనను విని యుత్సాహపఱచుచుండిన మిత్రులకును నా వందనములు.

అనేకవిధములయిన పనులలో నిమగ్నులయి యూపిరితీయుటకుఁగూడ తీరికలేని కాలములో శ్రమమునకోర్చి ముప్పదిదినములలో ఇంతగొప్ప గ్రంథమును ముద్రించిన బి. ఎన్. కె. ప్రెస్సునకు నియంతలయిన శ్రీ బి. నాగిరెడ్డి గారిని, వారి సిబ్బందిని కొనియాడక తప్పదు.

అనేకులవలన గ్రహించిన విషయములను ఆ యా స్థలములయందు నిరూపించియే యున్నాను.

ఇట్లు
బుధజనవిధేయుఁడు
సోమయాజి

## ద్వితీయ ముద్రణము - 1968

మిక్కిలి యానందముతో నీ గ్రంథమును వ్రాసి యిది నా ధర్మమని ప్రథమముద్రణము చేసి ప్రచురించితిని. ఆ ప్రచురించుటలో తోడ్పడినవారి కందరికిని నా కృతజ్ఞత. దీనికి కృతిభర్తయయిన కీర్తిశేషులు శ్రీ విక్రమదేవ వర్మ మహారాజులుగారు చిరస్మరణీయులు. కేవల భాషావిషయకమయిన యీ గ్రంథమున కేమి యాదరణము గలుగగలదని శంకించుచుండిన నాకు అనేక విధముల తెనుఁగువారు తోడ్పడిరి. ప్రచురించిన ప్రతులు మూఁడేండ్లలో చెల్లి పోయినవి. 1933 మొదలు 1963-వ సంవత్సరమువఱకును 30 సంవత్సరములు ఆంధ్ర విశ్వకళాపరిషత్తులో లెక్చరరు, రీడరు, ప్రొఫెసరు పదవులయందు పనిచేసి యనేకములయిన యితర బాధ్యతలను వహింపవలసిన కారణములవలన ఈ గ్రంథమును తిరిగి ముద్రింపగలుగు నవకాశము లభింపలేదు.

నాదగ్గఱ 1922—1963 వఱకును సంస్కృతాంధ్రములును ఇతరవిషయములును పఠించి, ఎం.ఏ., పి.హెచ్.డి. మొదలయిన పట్టములను పొందిన విద్వద్యువకులు, జిజ్ఞాసువులు, పరిశోధకులు ఆంధ్రదేశమున నన్ని స్థలముల యందుమాత్రమేగాక, అఖిలభారతదేశమునందును, స్వీయప్రతిభావిరాజమానులు, వర్ధమానులు, పూర్యమాణాత్మాభిలాషులు వందల సంఖ్యలో నున్నారు. వారి కందరికిని నా యాశీస్సులు. నేను 1963 జూలై నెలలో అనేకులతోఁగలిసి ఆంధ్ర విశ్వకళాపరిషత్తునుండి విరమింపవలసి వచ్చినది. ఆనాఁటినుండియు నాకు తెలుఁగుతో సంబంధము చాలవఱకు తగ్గినదిగాని, నా వర్గములోనివారు అనేకవిధముల ఆ భాషకు సేవచేయుచు కీర్తిగాంచుచుండుటవలన నా మనోరథము శతశః ప్రగతిం గాంచినది. ఆ తృప్తి అనిర్వాచ్యము, అప్రతిమము. నాకు తెలుఁగు మాత్రమేకాక, ముఖ్యముగా సంస్కృతము, భాషాశాస్త్రము, ప్రకృతిశాస్త్రములు, దాక్షిణాత్యభాషలు, ఇతర వాఙ్మయములు, బోధనశాస్త్రము మొదలయిన యనేక విజ్ఞానవిషయములు సుపరిచితము లగుటం జేసి, కేంద్రప్రభుత్వము వారు ఆహ్వానించి, విజ్ఞానప్రపంచమునందున్న విశిష్టవిషయములను భారతీయ భాషలలోనికి తెచ్చు సంస్థయందు ప్రధానపరిశోధనాధికారిగా నియమించుటం జేసి, తెనుఁగు గౌతమినుండి, అఖండ విజ్ఞానసాగరమున ప్రవేశించుట కనువు లభించినది. ఇందలి యాప్లవనమున నాకు చిదానందప్రాప్తి సిద్ధించుచున్నది.

Without meaning to institute comparisons for which I am by no means qualified, I have a feeling that in some respects the range of Vidwan Somayaji's research is wider and of more arresting interest. I suppose the epoch-making book of Bishop Caldwell, the poineer explorer in this field, will always remain the leading classic on the subject, round which developments revolve sped by time and discovery. In the list of books, not many, that have to be mentioned in near order, though subsequent, Vidwan Somayaji's "Andhra Bhasha Vikasamu" or "Evolution of Telugu" will occupy very high rank. It keeps the Dravidian flag flying full mast; illumines many a dark corner by its far-reaching flashes of light and marks a further stage in the advancement of South Indian philology.

Sir C. RAMALINGA REDDY,
KT., M. A. (Cantab), HON. D. LITT.,
*Vice-Chancellor, Andhra University.*

WALTAIR
15-8-1947

# ఉపోద్ఘాతము

## ప్రథమ ముద్రణము - 1947

సుమారు పదునాలుగు సంవత్సరములనుండి ఆంధ్ర విశ్వకళాపరిషత్తువారి కళాశాలలలో తెనుఁగు విద్యార్థులకు ఆనర్సు తరగతియందు ఆంధ్ర భాషాచరిత్రము బోధించుటవలనఁ గల్గినఫల మీగ్రంథము. ఆంధ్ర భాషాస్వరూపము కాలక్రమమున నెట్లు పరిణతమయి నేఁ డెట్టిస్థితికి వచ్చినదియో నిరూపించుటయే దీని యుద్దేశము. సంస్కృతాంగ్లభాషల సంపర్కము తెనుఁగు నెట్లభివృద్ధిపఱచినదో యిందు సక్రమముగ నిరూపింపఁబడినది. ఈ భాష అరవము, కన్నడము, మలయాళము మొదలయిన ద్రావిడభాషలతో నభిన్నమయి యేకరూపమున నుండియు కాలక్రమమున వానినుండి విడి నేఁ డీరీతి నెట్లు స్వతంత్రభాష యయినదో వివరించితిని. ఉన్నతపరీక్షలకు అభ్యర్థులయినవారికిమాత్రమేగాక భాషాభిమానులును, భాషాభిజ్ఞులును నయిన సరసులకుఁగూడ నియ్యది పఠనయోగ్యముగ నుండవలెనని సంకల్పించి వ్రాసితిని. ఇందలి విషయములను గుఱించి విమర్శకులు వ్యాసరూపముగ నక్కడక్కడఁ బ్రచురించిన సిద్ధాంతములును, పరిశోధన ఫలితములును లభించినంతవఱకు సంగ్రహించి, విరోధములను పరిహరించి సమన్వయపఱచి, యేకవాక్యత కల్పించితిని. అజ్ఞాతములయిన విషయములలో నా యొనర్చిన పరిశోధనమువలని ఫలితమును సమకూర్చి దండగుచ్చితిని. నిరూపించిన విషయములకు ప్రమాణములను, గ్రంథ సందర్భములను ఆ యా చోటుల పుటల క్రిందిపంక్తులలో పదిలపఱచితిని. ఈ విషయమున విజ్ఞానాభివృద్ధి చేసికొను నభిప్రాయముగలవారి యుపయోగముకొఱకు నా చూచిన గ్రంథముల పట్టిక నిచ్చితిని. ఈ దేశమున ఆంధ్ర గ్రంథములను, అందు ముఖ్యముగా భాషావిషయక గ్రంథములను గ్రహించి యాదరించు విశిష్టులు దీనిని పఠింతురుగాక యని యాసించుచున్నాను.

చాలకాలము శ్రమించి వ్రాసిన యీ గ్రంథమును స్వీకరించి యాదరించిన అన్వర్థబిరుదాంకితులయిన కళాప్రపూర్ణులు శ్రీ విక్రమదేవవర్మ మహారాజులుగారికి నా కృతజ్ఞతాపూర్వకవందనములు. దీనికి ముఖబంధము రచించి వెలయించిన విశ్వకళాపరిష దుపాధ్యక్షులయిన శ్రీయుతులు కట్టమంచి రామలింగారెడ్డిగారికి సంతోషపూర్వకమయిన వినతి. ఈ గ్రంథమును ఆంగ్లభాషలో వ్రాయుటకు సమకట్టి సుమారు నూరుపుటలు వ్రాసియుండగా నద్దానిని పరిత్యజింపఁజేసి తెనుఁగున వ్రాయుటకు నన్నొప్పించిన బ్రహ్మశ్రీ వరుఖల చిన

సీతారామస్వామి శాస్త్రులవారిని స్మరింపక తప్పదు. అనేక సందర్భములయందు నిరుత్సాహమువలన విరతప్రయత్నుడనై యుండ 'కర్మణ్యేవాధికారస్తే' యను గీతావాక్యమును ప్రసాదించి విస్మృతకంఠచామీకరన్యాయమున స్వస్వరూపానుభూతిగొలిపి యీ పనిని నిలిపిన భగవంతుని నిరంతరము స్మరింతును. వస్తుస్థితి విచారణ ప్రధానములయిన గ్రంథములను వ్రాసిన ఋషుల యుద్దేశము విజ్ఞానవ్యాప్తి మాత్రమే. అట్టిఫల మీ ప్రయత్నమువలన గలిగినఁ జాలును.

'యథారాజా తథాప్రజా' యను న్యాయమ్మున శ్రీ జయపుర సంస్థానాధీశ్వరులకు దివానుగా నుండి నన్నాదరించిన శ్రీ చెలికాని వెంకటరావు దొర గారిని, రివెన్యూ ఆఫీసరుగానున్న అరుణాచలముపంతులుగారిని, శ్రీ కరుణాకరము విశ్వనాథముపంతులుగారిని, ఇతర సంస్థానోద్యోగులను నన్ననేకవిధములఁ బ్రీతి పూర్వకముగ సత్కరించినందులకు సంస్మరించుచున్నాను.

ఈ గ్రంథమును మిక్కిలి ఓపికతో చాలకాలము శ్రమించి ముద్రణమున కుపయోగపడునట్లు చక్కఁగ వ్రాసి యిచ్చిన మా విద్యార్థులను, ఇతర పండిత బృందమును కృతజ్ఞతాపూర్వకముగ స్మరించుచున్నాను. ఇందలి శాసన విషయములను సేకరించుటకు వలసిన యనువులనుగూర్చి తమ శాసన పుత్రికల నన్నిటిని నావశముచేసిన మదరాసు ఎపిగ్రాఫికు డిపార్టుమెంటువారిని స్మరింపక తప్పదు. నెలలకొలఁది వారి యాఫీసున పనిచేసి యనేకవిషయములను సంగ్రహించితిని. ఈ పనియందు నన్ననేకవిధముల ప్రోత్సహించి నా రచనను విని యుత్సాహపఱచుచుండిన మిత్రులకును నా వందనములు.

అనేకవిధములయిన పనులలో నిమగ్నులయి యూపిరితీయుటకుఁగూడ తీరికలేని కాలములో శ్రమమునకోర్చి ముప్పదిదినములలో ఇంతగొప్ప గ్రంథమును ముద్రించిన బి. ఎన్. కె. ప్రెస్సునకు నియంతలయిన శ్రీ బి. నాగిరెడ్డి గారిని, వారి సిబ్బందిని కొనియాడక తప్పదు.

అనేకులవలన గ్రహించిన విషయములను ఆ యా స్థలములయందు నిరూపించియే యున్నాను.

ఇట్లు
బుధజనవిధేయుఁడు
సోమయాజి

# ద్వితీయ ముద్రణము - 1968

మిక్కిలి యానందముతో నీ గ్రంథమును వ్రాసి యిది నా ధర్మమని ప్రథమముద్రణము చేసి ప్రచురించితిని. ఆ ప్రచురించుటలో తోడ్పడినవారి కందరికిని నా కృతజ్ఞత. దీనికి కృతిభర్తయయిన కీర్తిశేషులు శ్రీ విక్రమదేవ వర్మ మహారాజులుగారు చిరస్మరణీయులు. కేవల భాషావిషయకమయిన యీ గ్రంథమున కేమి యాదరణము గలుగగలదని శంకించుచుండిన నాకు అనేక విధముల తెనుఁగువారు తోడ్పడిరి. ప్రచురించిన ప్రతులు మూఁడేండ్లలో చెల్లి పోయినవి. 1933 మొదలు 1963-వ సంవత్సరమువఱకును 30 సంవత్సరములు ఆంధ్ర విశ్వకళాపరిషత్తులో లెక్చరరు, రీడరు, ప్రొఫెసరు పదవులయందు పనిచేసి యనేకములయిన యితర బాధ్యతలను వహింపవలసిన కారణములవలన ఈ గ్రంథ మును తిరిగి ముద్రింపగలుగు నవకాశము లభింపలేదు.

నాదగ్గఱ 1922—1963 వఱకును సంస్కృతాంధ్రములును ఇతరవిషయ ములును పఠించి, ఎం.ఏ., పిహెచ్.డి. మొదలయిన పట్టములను పొందిన విద్వద్యువకులు, జిజ్ఞాసువులు, పరిశోధకులు ఆంధ్రదేశమున నన్ని స్థలముల యందుమాత్రమేగాక, అఖిలభారతదేశమునందును, స్వీయప్రతిభావిరాజ మానులు, వర్ధమానులు, పూర్యమాణాత్మాభిలాషులు వందల సంఖ్యలో నున్నారు. వారి కందరికిని నా యాశీస్సులు. నేను 1963 జూలై నెలలో అనేకులతోఁగలిసి ఆంధ్ర విశ్వకళాపరిషత్తునుండి విరమింపవలసి వచ్చినది. ఆనాఁటినుండియు నాకు తెలుఁగుతో సంబంధము చాలవఱకు తగ్గినదిగాని, నా వర్గములోనివారు అనేకవిధ ముల ఆ భాషకు సేవచేయుచు కీర్తిగాంచుచుండుటవలన నా మనోరథము శతశః ప్రగతిం గాంచినది. ఆ తృప్తి అనిర్వాచ్యము, అప్రతిమము. నాకు తెలుఁగు మాత్రమేకాక, ముఖ్యముగా సంస్కృతము, భాషాశాస్త్రము, ప్రకృతిశాస్త్ర ములు, దాక్షిణాత్యభాషలు, ఇతర వాఙ్మయములు, బోధనశాస్త్రము మొద లయిన యనేక విజ్ఞానవిషయములు సుపరిచితము లగుటంజేసి, కేంద్రప్రభుత్వము వారు ఆహ్వానించి, విజ్ఞానప్రపంచముననున్న విశిష్టవిషయములను భారతీయ భాషలలోనికి తెచ్చు సంస్థయందు ప్రధానపరిశోధనాధికారిగా నియమించుటం జేసి, తెనుఁగు గౌతమినుండి, అఖండ విజ్ఞానసాగరమున ప్రవేశించుట కనువు లభించినది. ఇందలి యాప్లవనమున నాకు చిదానందప్రాప్తి సిద్ధించుచున్నది.

ఈ గ్రంథమును తిరిగి ముద్రింపవలసినదని నన్ను నియతోత్తరవర్తులుగా ప్రోత్సహించినవారిలో ముఖ్యులు : శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు, శ్రీ ఎస్. వి. జోగారావుగారు, శ్రీ తూమాటి దోణప్పగారు, శ్రీ పి. ఎస్. ఆర్. అప్పారావుగారు. వీరుగాక శ్రీ కె. వి. ఆర్. నరసింహంగారు, శ్రీ భద్రిరాజు కృష్ణమూర్తిగారు, శ్రీ కె. వీరభద్రరావుగారు, శ్రీ బి. రామరాజుగారు. ఇతరు లనేకులును అనేకపర్యాయములు ఈ గ్రంథమును ముద్రింపవలయునని ప్రోత్సహించుచునేయుండిరి.

నా గ్రంథము ముద్రింపబడినతరువాత నక్కడక్కడ కొన్ని విచారణలు ప్రకటితములయినవి. వానిని నేను పరిశీలించితిని. వానిలో సమాధేయములు లేకుండుటంజేసి వానిపొంతఁ బోను. వారికిని నా ధన్యవాదము. తెనుఁగు సంస్కృతజన్యమా యను ప్రశ్నము నప్పుడప్పుడు లేవదీయుచున్నారు. ఈ విషయమునుగూర్చి 1850 నుండి విశాలపరిశ్రమ జరుగుచునే యున్నది. అనేకులు చాల పరిశ్రమించియున్నారు. అవి యన్నియు అమెరికా, ఇంగ్లండు, ఫ్రాన్సు మొదలగు దేశములలో విశేషముగా ప్రచురింపబడి యున్నవి. తజ్ఞు లందరును వానిని పరామర్శించిరి. ఈనాఁడు ఆ చర్చ బాలురగ విచారణా సామర్థ్యమున కుపకారకము. అంతకంటె వైజ్ఞానికముగా సత్ఫలదాయకము గాదని యా పొంతఁ బోలేదు.

నా యెఱుకగొన్నవారి కందరికిని శుభపరంపర నొసంగుగాత మని యీశ్వరుని ప్రార్థించుచు, అహంకార మమకారములచే పృథక్కరింపబడిన నాయందలి చైతన్యము అఖండచైతన్యమునం గలియువఱకును, నాకు అధీతి బోధాచరణంబుల కవకాశంబును, ఆరోగ్యమును గల్పింపవలెనని ధ్యానించుచు విరమించుచున్నాను.

ఓమ్. సహనావవతు – సహనౌ భునక్తు – సహవీర్యం కరవావహై
తేజస్వినావధీతమస్తు – మా విద్విషావహై
ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

ఇట్లు
బుధజనవిధేయుఁడు
సోమయాజి

నయీ దిల్లీ
26–5–1968

# ఇందు సూచింపఁబడిన గ్రంథములు (తెలుఁగు)

| కర్త, లేక సంపాదకుఁడు | గ్రంథనామము | సంకేతము | ప్రచురణ వివరము |
|---|---|---|---|
| పాల్కురికి సోమన | బసవపురాణము | | ఆంధ్రపత్రికాలయము |
| బాలసరస్వతి | బాలసరస్వతీయము | | వావిళ్ల రామస్వామి శాస్త్రులు, మదరాసు |
| కేతన | ఆంధ్రభాషాభూషణము | | |
| కె. వి. లక్ష్మణరావు | లక్ష్మణరాయవ్యాసావళి | | విజ్ఞానచంద్రిక, విజయవాడ |
| రాళ్లబండి సుబ్బారావు | కళింగదేశ చరిత్రము | | ఆంధ్రహిస్టారికల్ రిసెర్చి సొసైటి, రాజమంద్రి |
| కోరాడ రామకృష్ణయ్య | ఆంధ్రభారతకవితావిమర్శనము | | ఆంధ్రపత్రికాలయము, మదరాసు |
| కె. నారాయణరావు | ఆంధ్రవాఙ్మయచరిత్రసంగ్రహము | | వావిళ్ల, మదరాసు |
| చి. నారాయణరావు | ఆంధ్రభాషా చరిత్రము 2 వాల్యూములు | ఆ. భా. చ. | ఆంధ్రవిశ్వకళాపరిషత్తు |
| రాజశేఖరుఁడు | కావ్యమీమాంస, ఆంధ్రీకర్త పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి | | |
| తెలికిచెర్ల వేంకటరత్నము | వ్యాససంగ్రహము, గిడుగు రామమూర్తి స్మారకము | | నవ్యసాహిత్య పరిషత్తు, గుంటూరు |
| కోరాడ రామకృష్ణయ్య | సంధి | | మదరాసు యూనివర్సిటీ |
| నన్నయ | ఆంధ్రశబ్దచింతామణి | | వావిళ్ళ, మదరాసు |
| చిన్నయసూరి | బాలవ్యాకరణము | | |
| వఝల చిన సీతారామస్వామి శాస్త్రి. | సీతారామపండితీయము, | సీ. పం. | ఆంధ్రవిశ్వకళాపరిషత్తు 1937 |
| అప్పకవి | అప్పకవీయము | | వావిళ్ల, మదరాసు |
| క. వీరేశలింగము | ఆంధ్రకవుల చరిత్రము | | హితకారిణీ సమాజము, రాజమంద్రి |
| వఝల చినసీతారామస్వామిశాస్త్రి, | చింతామణి విషయపరిశోధనము | | వావిళ్ల, మదరాసు |
| చర్ల నారాయణశాస్త్రి | నారాయణీయాంధ్రవ్యాకరణము | | విద్వజ్జనమనోరంజనీ ప్రెస్సు, పిఠాపురం 1937 |
| కలూరి వేంకటరామశాస్త్రి | బాలవ్యాకరణ గుప్తార్థప్రకాశిక | | లలితా ప్రెస్సు, రాజమంద్రి |
| గణపవరపు వేంకటకవి | ఆంధ్రకౌముది | | ఆంధ్రసాహిత్యపరిషత్తు, కాకినాడ |
| అడిదము రామారావు | అడిదము సూరకవి | | విజయనగరము |
| క. వీరేశలింగము | సంగ్రహవ్యాకరణము | | రాజమంద్రి |

| కర్త, లేక సంపాదకుఁడు | గ్రంథనామము | సంకేతము | ప్రచురణ వివరము |
|---|---|---|---|
| వావిలికొలను సుబ్బారావు | సులభవ్యాకరణము | | బ్రిటిషు మోడల్ ప్రెస్సు, మదరాసు |
| కుప్పుణ్ణయ్యంగారు | సర్వలక్షణసారసంగ్రహము | | చిత్తూరు |
| పింగళిసూరన్న | కళాపూర్ణోదయము | కళా. | వావిళ్ళ, మదరాసు |
| నాచన సోమన | ఉత్తరహరివంశము | ఉ.హరి. | ,, |
| అప్పల్ల జోగన్నశాస్త్రి | వైయాకరణ సిద్ధాంత కౌముదీ శరదాగమము | | వేదవ్యాస ప్రెస్సు, విజయనగరము |
| చిన్నకోట పెద్దన | కావ్యాలంకారచూడామణి | | వావిళ్ళ, మదరాసు |
| నాదెళ్ళ పురుషోత్తమకవి | పురుషోత్తమ కవీయము | | ఆర్యానందా ప్రెస్సు, మచిలీపట్టణము |
| జయంతి రామయ్యపంతులు | సూర్యరాయాంధ్ర నిఘంటువు 4 వా. | | ఆంధ్రసాహిత్య పరిషత్తు |
| రంగాజమ్మ | మన్నారుదాసవిలాసము | | |
| కె. వి. లక్ష్మణరావు | ఆంధ్రవిజ్ఞానసర్వస్వము | | ఆంధ్రపత్రికా ప్రచురణము |
| గిడుగు రామమూర్తి | భాషాభేషజము | | నవ్యసాహిత్య పరిషత్తు |
| వేదము వేంకటరాయశాస్త్రి | గ్రామ్యాదేశనిరసనము | | |
| అథర్వణుఁడు | కారికావళి (ద్వి. సీతారామకవి వ్యాఖ్య) | అ. కా. | వావిళ్ల, |

## సంస్కృత ప్రాకృత గ్రంథములు

| | | | |
|---|---|---|---|
| | మనుస్మృతి | | |
| | మత్స్య వాయు బ్రహ్మాండ పురాణములు | | నిర్ణయసాగర ప్రెస్సు |
| | ఐతరేయ బ్రాహ్మణము | | |
| విద్యానాథుఁడు | ప్రతాపరుద్రీయము | | వావిళ్ళ, మదరాసు |
| బాణుఁడు | హర్షచరిత్రము | | నిర్ణయసాగర ప్రెస్సు |
| వరరుచి | ప్రాకృతప్రకాశము (పి. ఎల్. వైద్య సంపాదితము) | | |
| చండుఁడు | ప్రాకృతలక్షణము (పి. ఘోషు సంపాదితము) | | కలకతా |
| మార్కండేయుఁడు | ప్రాకృతసర్వస్వము | | |
| లక్ష్మీధరుఁడు | షడ్భాషాచంద్రిక (త్రివేదీ సంపాదితము) | | బొంబాయి గవర్నమెంటు 1916 |
| భరతుఁడు | నాట్యశాస్త్రము | | బనారసు 1929 |

| కర్త, లేక సంపాదకుఁడు | గ్రంథనామము | సంకేతము | ప్రచురణ వివరము |
|---|---|---|---|
| దండి | కావ్యాదర్శము | | పూనా 1924 |
| త్రివిక్రముఁడు | ప్రాకృతశబ్దానుశాసనము | | ఆర్ష ప్రెస్సు, విశాఖపట్టణము |
| విశ్వనాథుఁడు | సాహిత్యదర్పణము | | నిర్ణయసాగర ప్రెస్సు |
| పండిత హరిగోవిందదాస్ | పాఇఅసద్దమహణ్ణవో 4 వా. | | కలకత్తా 1923 |
| త్రికమ్‌చంద్ | తైత్తిరీయప్రాతిశాఖ్యము | | మదరాసు యూనివర్సిటీ |
| భట్టోజీ దీక్షితులు | సిద్ధాంత కౌముది | | నిర్ణయసాగర ప్రెస్సు |
| జయాదిత్య | కా | | కాశీ సంస్కృత సీరీజు |
| మంగళదేవశాస్త్రి(సంపాదకుఁడు) | ఋక్‌ప్రాతిశాఖ్యము పార్షద వ్యాఖ్య | ఋ. ప్రా. | ఇండియన్ ప్రెస్సు, అలహాబాదు 1931 |
| అహోబలపతి | అహోబలపండితీయము | | మంజువాణీ ప్రెస్సు, ఏలూరు 1926 |
| మండ లక్ష్మీనరసింహాచార్య | ఆంధ్రకౌముది | | ఆర్ష ప్రెస్సు, విశాఖపట్టణము |
| భర్తృహరి | వాక్యపదీయము (రామకృష్ణశాస్త్రి సంపాదితము) | | బనారసు 1884 |
| యాస్కుఁడు | నిరుక్తము, దుర్గాదాస వ్యాఖ్య | | నిర్ణయసాగర ప్రెస్సు |
| పతంజలి | మహాభాష్యము | | ,, |
| నాగేశభట్టు | లఘుశబ్దేందుశేఖరము | | కాశీ సంస్కృత సీరీజు |
| భవభూతి | మాలతీమాధవము | | నిర్ణయసాగర ప్రెస్సు |

## తమిళ కర్ణాటాది గ్రంథములు

| | | | |
|---|---|---|---|
| నృపతుంగుడు | కవిరాజమార్గము | | మదరాసు యూనివర్సిటీ |
| తొల్‌కాప్పియనార్ | తొల్‌కాప్పియమ్ | | |
| | ఎఴుత్తదికారమ్ ఇళంపూరణర్ వ్యాఖ్యతో | తొల్. ఎఴు. | |
| | చొల్లదికారమ్ పి. ఎస్. సుబ్రహ్మణ్య అయ్యర్ గారి ఆంగ్లపరివర్తనముతో | తొల్. చొల్. | అణ్ణామలై విశ్వకళా. |
| కేశిరాజు | శబ్దమణిదర్పణము | శ. ద. | బేసిల్ మిషన్ ప్రెస్సు, మంగళూరు |
| నాగవర్మ | కర్ణాటభాషాభూషణము | | మైసూరు గవర్నమెంటు ప్రెస్సు, బెంగుళూరు, 1903 |
| కామతాప్రసాదగురు | హిందీ వ్యాకరణము | | ఇండియన్ ప్రెస్సు, ప్రయాగ. |
| పావనంది | నన్నూల్ (కాండిగై ఉరై) | | |
| ఆర్. రఘునాథరావు | కర్ణాటకభాషోపన్యాసమంజరి | | కాక్స్‌టన్ ప్రెస్సు, బెంగుళూరు, 1894 |
| ఆర్. నరసింహాచార్యులు | కర్ణాటక కవి చరితె. 2 వా. | | బెంగుళూరు |

## BOOKS IN ENGLISH ఆంగ్లగ్రంథములు


| | | | |
|---|---|---|---|
| Bishop Caldwell | Comparative Grammar of the Dravidian or South Indian Languages. C. G. D | Turbner | |
| Dr. Gopalachari | Early History of the Andhra Country. E. H. A. C. | Madras University | |
| Sircar Dinesachandra | Successors of the Satavahanas. S. O. S. | | |
| M. Krishnamachariar | A History of Classical Sanskrit Literature | Tirupati | |
| Uhlenbeck | Sanskrit Phonetics (Manual of) | Luzzac | |
| Siddheswara Varma | Phonetic Observations of Indian Grammarians. P.O I G. | | |
| Brugman | A Comparative Grammar of the Indo-Germanic Languages | | |
| Suniti Kumar Chatarjee | Origin and development of the Bengali Language | Calcutta | University |
| Dr. A. N. Narasimhia | Grammar of the Oldest Kanarese Inscriptions | Mysore | University |
| ,, | Dravidic Studies | Madras | ,, |
| R. Narasimhachary | Lectures on the History of Canar Language | Mysore | ,, |
| ,, | ,, Literature | ,, | ,, |
| Dr. Woolner | Introduction to Prakrit | Punjab | ,, |
| Hemachandra | Desinamamala Edited by Muralidhar Banerjee | Calcutta | ,, |
| Tarachand | Influence of Islam on Indian Culture | Allahabad | |
| Keay | Education in India | Longmans | |
| Giles | A short Manual of Comparative Philology | | |
| Noel Armfield | General Phonetics | Cambridge | |
| Mac Donnell. A. A. | Vedic Grammar | Turbner | |
| Burnell | South Indian Palaeography Elements of | Turbner 1878 | |

| | | |
|---|---|---|
| Daniel Jones | Outlines of English Phonetics | |
| P. S. Subrahmanya Satry | History of Grammatical Theories in Tamil P. S. S. | Journal of Oriental Research, Madras |
| Max Muller | The Science of Language | New york 1891 |
| Bhandarkar | South Indian History | |
| M. Srinivasa Aiyangar | Tamil Studies | Gaurdian Press, |
| Purnalingam Pillai | A Primer of Tamil Literature | [Madras |
| R. Dikshitar | Studies in Tamil Literature and history | Londan Luzac 1930 |
| P. T. S. Aiyangar | The History of Tamils | C. Coomaraswamy and Son, Madras |
| Belvalkar | Systems of Sanskrit Grammar | Poona 1915 |
| Burnell | Andhra School of Sanskrit Grammarians | Basel Mission Press, 1875 |
| Atchuta Menon | Ezuthaccan and his age | Madras University |
| Chakravarti | Philosophy of Sanskrit Grammar | Calcutta ,, |
| Vendryes | Language | K. Paul |
| Beal | Buddistic records of Western world | |
| Pischel Richard | Grammatic Prakrit Der Sprachen | Turbner 1900 |
| Sir George Grierson | The Eastern School of Prakrit Grammarians & Paisachi Prakrit | |
| Prof. Felix Lacote | Essay on Gunadhya and Brihat Katha | Bangalore |
| | Journal of the Mythic Society (Reprint) | |
| | Journals Periodicals *etc.* | |
| Sir George Grierson | Linguistic Survey of India | |
| | Epigraphia Indica | |
| Hultsch | Asokan Inscriptions | |
| | Select Inscriptions | Calcutta University |
| | Journal of the Bihar and Orissa Research Society | |

| | | |
|---|---|---|
| Dr. S. K. Iyengar | Historical Inscriptions of South India H. I. S. I. | Madras University |
| Epigraphic Dept. | South Indian Inscriptions S. I. I. ద. శా. గ. | Vol. 1-7 |
| | Epigraphia Carnatica 1-12 | Mysore |
| | Bharati. Old Volumes | Madras |
| | Indian Antiquary | |
| | Andhra Historical Research Society Journal | Rajahmundry |
| | Andhra Sahitya Parishatpatrika | Coconada |

# విషయసూచిక

## ప్రథమ భాగము


పుట

### ఆంధ్రభాష - 1-8

| | | |
|---|---|---|
| 1 | ఉపక్రమము | 1 |
| 2 | నేఁటి యాంధ్రభాషాస్వరూపము | 2 |
| | ఆంధ్రభాషాస్వరూపము (1947-వ సం.) | 3 |
| | ఆంధ్రము మాటాడు దేశపు ఎల్లలు (1947-వ సం.) | 4 |
| | భాషాప్రదేశముల నిరూపించు పటము | 6 |
| | ద్రావిడభాషలు - జనసంఖ్య (1951 జనాభా లెక్కలు) | 7 |

### ఆంధ్రభాషకు పేళ్లు - 9-34

| | | |
|---|---|---|
| 1 | ప్రామాణిక ప్రయోగము | 9 |
| 2 | ఆంధ్రశబ్దము మొదట జాతివాచకము | 10 |
| 3 | ఆంధ్రము దేశవాచక మెప్పటినుండి యయ్యెను ? | 12 |
| 4 | ఆంధ్రజాతికిఁ బూర్వ మీ దేశనామ మేమి ? | 14 |
| 5 | శాతవాహను లాంధ్రశబ్ద మేల వాడలేదు ? | 15 |
| 6 | ఆంధ్రము భాషాపరముగా నెప్పటినుండి వాడఁబడినది ? | 17 |
| 7 | తెలుఁగు శబ్దమునకు శాసనస్థ ప్రయోగములు | 18 |
| 8 | త్రిలింగ శబ్ద విచారము | 19 |
| 9 | త్రికళింగ శబ్ద విచారము | 24 |
| 10 | తెలుఁగు - తెనుఁగు శబ్దముల సంబంధము | 25 |
| 11 | తెలుఁగున కితర వ్యుత్పత్తులు | 25 |
| 12 | తెనుఁగు శబ్ద విచారము | 29 |
| 13 | తెనుఁగు దిగ్వాచి | 31 |

### తెనుఁగుయొక్క ప్రాచీనతా ప్రచారములు - 35-46

| | | |
|---|---|---|
| 1 | తొలుతటి తెనుఁగునాటి కెల్లలు | 35 |
| 2 | నృపతుంగుని కాలమున తెనుఁగు కన్నడముల విభాగము | 36 |

పుట

3 తెనుఁగునాటి నేలిన రాజులు 39

శాతవాహనులు 39

శాతవాహనుల తరువాతి రాజులు 41

4 తెనుఁగు వాడుచుండిన ప్రదేశము 45

తెనుఁగు ప్రాచీనతకు శాసనప్రమాణము - 47-57

1 తెనుఁగునాట ప్రాకృతవ్యవహారము 47

2 సంస్కృత ప్రాకృత శాసనములలోని తెనుఁగు 51

3 తెనుఁగు తొల్లిటి యవస్థ 55

తెనుఁగునకును ప్రాకృతమునకును గల సంబంధము - 58-84

1 ప్రాకృతముల స్వరూపమును, జరిత్రమును 58

2 సంస్కృత ప్రాకృతములకుఁ గల సంబంధము 67

3 ఆంధ్రదేశ వ్యవహారస్థ ప్రాకృతమునకును తెనుఁగునకును గల సంబంధము 69

4 పైశాచీభాష 75

5 తెనుఁగునకును సంస్కృత ప్రాకృతములకును జన్యజనకభావ సంబంధము లేదు 80

నన్నయకుఁ బూర్వపు తెలుఁగు - 85-105

1 ఆధారములు 85

2 నన్నయకుఁ బూర్వము ఆంధ్రభాషతో వ్రాయఁబడిన కొన్నిశాసనములు 87

3 ప్రాచీనభాషాలక్షణము 90

ధ్వనులు 90

విభక్తిప్రత్యయములు 96

శబ్దజాలము 98

పురుషనామములు 102

గ్రామనామములు 103

ఇతరద్రావిడభాషలతో తెనుఁగునకుఁ గల సంబంధము - 106-140

1 ద్రావిడభాషాపరిగణనము 106

2 తమిళభాషావాఙ్మయములు 109

3 కన్నడభాషావాఙ్మయములు 117

4 మలయాళభాషావాఙ్మయములు 120

| | | పుట |
|---|---|---|
| 5 | తుళుభాష | 123 |
| 6 | కొడగుభాష | 123 |
| 7 | అనాగరక భాషలు | 124 |
| 8 | ద్రావిడభాషల పరస్పర సంబంధము | 127 |
| 9 | ద్రావిడభాషలోని మాండలికమయిన యక్షర భేదములు | 134 |
| 10 | ద్రావిడ మాండలికము లేర్పడినవిధము | 139 |

## తెనుఁగు వ్యాకరణము పెరిగిన విధానము - 141-154

| | | |
|---|---|---|
| 1 | నన్నయకుఁ బూర్వమును, సమకాలికమును నయిన యవస్థ | 141 |
| 2 | భాషాభాగములు | 144 |
| 3 | క్రియాస్వరూపము | 147 |
| 4 | నన్నయ భాషలో స్థిరపడిన విశేషములు | 148 |

## తెనుఁగు వ్యాకరణముల చరిత్రము 155-177

వ్యాకరణ జాతుల విభజనము 155

## మొదటిజాతి గ్రంథములు - 155

| | |
|---|---|
| ఆంధ్రశబ్దచింతామణి | 155 |
| బాలసరస్వతీయము | 158 |
| అప్పకవీయము | 159 |
| అహోబలపండితీయము | 160 |
| కవిజనాంజనము | 162 |
| చింతామణి విషయపరిశోధనము | 162 |
| నారాయణీయాంధ్రవ్యాకరణము అను నన్నయాథర్వణకారికావళి | 162 |
| వికృతి వివేకము | 163 |
| ఆంధ్రకౌముది | 164 |
| హరికారికలు | 165 |
| సూత్రాంధ్రవ్యాకరణములు | 166 |

## రెండవజాతి గ్రంథములు - 167

| | |
|---|---|
| ఆంధ్రభాషాభూషణము | 167 |
| కావ్యాలంకారచూడామణి | 168 |
| కవిలోకచింతామణి | 169 |
| కవిజన సంజీవని | 169 |

| | | పుట |
|---|---|---|
| | సర్వలక్షణసారసంగ్రహము | 170 |
| | ఆంధ్రకౌముది-గణపవరపు వేంకటకవి | 170 |
| | ఆనందరంగరాట్ఛందము | 171 |
| | కవిసంశయ విచ్ఛేదము | 171 |

మూఁడవజాతి గ్రంథములు - 172

| | | |
|---|---|---|
| | బాలవ్యాకరణము | 172 |
| | ప్రౌఢవ్యాకరణము | 173 |
| | బాలవ్యాకరణ గుప్తార్థప్రకాశిక | 173 |

నాలుగవజాతి గ్రంథములు 174

ఐదవజాతి గ్రంథములు 174

తెనుఁగువ్యాకరణములలోని సంస్కృతవ్యాకరణానుకరణము - 178-194

| | | |
|---|---|---|
| | వివిధజాతుల స్వభావము | 178 |
| 1 | గ్రంథరచనాక్రమము | 180 |
| 2 | సంజ్ఞలు (పారిభాషికపదములు) | 182 |
| 3 | రూపనిష్పాదనప్రక్రియ | 187 |
| 4 | సూత్రములు | 190 |

తెనుఁగువ్యాకరణములలోని యాంగ్లవ్యాకరణానుసరణము - 195-204

| | | |
|---|---|---|
| 1 | వాక్యప్రకరణము | 195 |
| | (a) వాక్యలక్షణము | 195 |
| | (b) వాక్యజాతులు | 196 |
| | (c) వాక్యవిభజనము | 197 |
| | (d) శబ్దాతిదేశము | 197 |
| 2 | పదవర్గీకరణము | 197 |
| 3 | ఇతర విషయములు | 200 |

నన్నయనాఁటి తెనుఁగు - 205-225

| | |
|---|---|
| ధ్వనులు | 206 |
| సంధి | 211 |
| తత్సమములు | 213 |
| నన్నయ భారతమునందలి ద్వితీయాది విభక్తి ప్రత్యయములు | 217 |
| క్రియారూపములు | 223 |

పుట

మాండలికభాషలు - 226-244

1 స్వరూపము 226
2 మాండలికముల యుత్పత్తి, వృద్ధి 228
3 ప్రామాణికభాష 231
4 వ్యావహారికభాష 234
5 ప్రామాణిక, వ్యావహారిక భాషలకుఁ గల సంబంధము 239

తెలుఁగునందలి మాండలికభేదములు - 245-252

1 నేఁటి తెలుఁగు 245
2 మధ్యకాలపు తెలుఁగు 248
3 నేఁటి యాంగ్లాంధ్రముల తారతమ్యము 250

తెలుఁగులిపి దాని పరిణామము - 253-260

1 ఉత్పత్తి 253
2 పూర్వపు శాసనముల వ్రాతకును, ఇప్పటి వ్రాతకును గల భేదము 256
3 లేఖనచిహ్నములకును తెనుఁగుధ్వనులకును గల సంబంధము 258

తెనుఁగునగల స్వరములు, వానికిఁ బ్రాచీనద్రావిడభాషతోఁగల సంబంధము - 261 - 272

నేఁటి తెనుఁగునందలి స్వరములు 261
1 అ, ఆ ల చరిత్రము 262
2 ఇ, ఈ ల చరిత్రము
3 ఉ, ఊ ల చరిత్రము 264
4 ఎ, ఒ ల చరిత్రము 264
5 ఏ, ఓ ల చరిత్రము 267
6 ఐ, ఔ ల చరిత్రము 268

ముఖయంత్ర స్వభావము, ధ్వనుల యుచ్చారణ క్రమము - 273-284

1 వాగుత్పత్తి విధానము 273
2 స్వర వ్యంజన భేదము 275
3 స్థాన కరణ నిరూపణము 277
4 ఆభ్యంతర ప్రయతనము 279
5 బాహ్య ప్రయతనము 281

ఊనిక, స్వరము - వానివలన నచ్చులలోని మార్పులు - 285-292

1 ఊనికయొక్కయు, స్వరముయొక్కయు స్వభావము 285
2 వీనివలని మార్పులు 287

పుట

## ధ్వనుల మార్పు - 293-305


1 మార్పు స్వభావము

2 మార్పుల వింగడింపు 296

(1) వర్ణసమీకరణము (Assimilation) 296

(2) వర్ణవిభేదనము (Dissimilation) 297

(3) తాలవ్యీకరణము (Palatalisation) 298

(4) అనునాసిక్యము (Nasalisation) 298

(5) శ్వాసత, నాదత (Unvoicing, Voicing) 299

(6) లోపదీర్ఘత (Compensatory lengthening) 299

(7) స్వరభక్తి (Anaptyxis) 300

(8) Protheosis 300

(9) వర్ణనాశము (Synecope) 300

(10) Haplology 300

(11) వర్ణవ్యత్యయము (Metathesis) 300

(12) వర్ణాగమము (Addition of a Syllable) 300

(13) అనుచితవిభాగము (Wrong Splitting) 301

(14) సామ్యము (Analogy) 301

(15) సంప్రసారణము 302

(16) వ్యంజనాయామము (Doubling) 302

(17) సంయుక్తాక్షరములలోని కొన్నివర్ణములు తొలఁగుట 302


## సంధి - 303-328


1 లక్షణము 303

2 సంధికి హేతువులు 304

3 య, వ ల ఆగమము 306

4 ద్రుతప్రకృతికముల స్వభావము 310

5 ప్రకృతిభావనివారణకయి వచ్చు నితరాగమములు 315

6 ద్విరుక్త టకారము 316

7 ఉకార నిత్యసంధి 318

8 ఇత్వసంధి 319

9 అత్వసంధి

10 గ స డ ద వాదేశము 324

11 సంస్కృతాంధ్రముల సంధిస్వభావము 327

12 ప్రాకృతమున సంధి 327

13 ద్రావిడభాషలలోని సంధిపద్ధతులు, తుల్యములు 328

పుట

తెనుఁగునందలి హల్లులు : ప్రాచీన ద్రావిడముతోడి సంబంధము - 329-347

1 తెనుఁగున భ్రష్టమయిన హల్లులు
2 గ జ డ ద బ లు
3 చ జ ల చరిత్రము 332
4 య వ ల చరిత్రము 333
5 ర ఱ ల ళ అనువాని స్వభావము 336
6 టవర్గము—ట-డ-ణ లు 343
7 ఒత్తక్షరములు 345
హకారము

అర్ధానుస్వారము - 348-36

1 తెనుఁగునందలి యనుస్వారము
2 అనుస్వారము స్వభావము 351
3 అర్ధానుస్వారము : ఉత్పత్తి స్వభావములు 353
4 ఖండాఖండప్రాసము గలుగుటకు హేతువులు 355
5 సిద్ధసాధ్యములు 357
6 పరుషసరళములకు ముందే బిందువుండుటకు హేతువులు 359

ద్వితీయ భాగము

పద పదాంగ విభాగము : పదవర్గీకరణము - 361 - 367

1 భాషాజాతి విభజనము 361
2 సంస్కృత ద్రావిడాంగ్ల వైయాకరణు లొనర్చిన పదవర్గీకరణము 363

నామములు - 368-414

1 నామపద స్వభావము
2 నామవిభక్తులు
3 డుప్రత్యయ చరిత్రము 374
4 ముప్రత్యయ చరిత్రము 380
5 వుప్రత్యయ చరిత్రము 382
6 లుప్రత్యయ చరిత్రము 384

| | | పుట |
|---|---|---|
| 7 | ఋవర్ణక చరిత్రము | 395 |
| 8 | ద్వితీయాది విభక్త్యంగము | 397 |
| 9 | ఔపవిభక్తికములు | 400 |
| 10 | వచనము | 405 |
| 11 | లింగము | 408 |

విశేషణములు - 415-424

| | | |
|---|---|---|
| 1 | విశేషణముల స్వభావము | 415 |
| 2 | తెనుఁగువిశేషణముల స్వరూపము | 416 |
| 3 | సంస్కృతవిశేషణముల స్వరూపము | 420 |
| 4 | తర తమ భావనిరూపణ పద్ధతి | 423 |

క్రియావిశేషణములు - 425-429

| | | |
|---|---|---|
| | అవ్యయములు | 426 |

సంఖ్యావాచకములు - 430-445

| | | |
|---|---|---|
| 1 | విశేష్య విశేషణ రూపభేదము | 430 |
| 2 | ఒకటి మొదలగు పదముల చరిత్రము | 433 |
| 3 | విశేషణ రూపములు | 441 |
| | సంస్కృతాంధ్ర సంఖ్యావాచకములకు గల సంబంధము | 443 |

సమాసములు - 446-458

| | | |
|---|---|---|
| 1 | సమాస నిర్వచనము | 446 |
| 2 | తెనుఁగుసమాసముల లక్షణము | 450 |
| 3 | తత్పురుషాది సంజ్ఞల నిర్వచనము | 455 |

సర్వనామములు - 459-482

| | | |
|---|---|---|
| 1 | సంజ్ఞావివరణము | 459 |
| 2 | అస్మదర్థకము | 462 |
| 3 | యుష్మదర్థకము | 465 |
| 4 | ఆత్మార్థకము | 467 |
| 5 | నిర్దేశ సర్వనామములు | 469 |
| 6 | ప్రశ్నార్థకములు | 473 |
| 7 | సంబంధబోధకములు | 476 |
| 8 | అనిర్దిష్టార్థకములు | 479 |
| 9 | సార్వనామిక మూలరూపముల విశేషప్రయోగము | 481 |

పుట

## క్రియలు - 483-549


1 శబ్ద నిర్వచనము
2 ధాతువుల స్వభావము
3 తెనుఁగు ధాతువుల చరిత్రము 486
4 తెనుఁగు క్రియారూపముల స్వభావము 499
5 అచ్చ తెనుఁగు ధాతువులకు సంస్కృత ప్రాకృత జన్యత లేదు 505
తెనుఁగు క్రియావిభక్తులు 508
కాలవిభజనము - సంజ్ఞలు 512
వర్తమాన క్రియారూపములు 513
9 భూతార్థకములు 516
10 భవిష్యదర్థకములు 519
11 తద్ధర్మార్థకములు 520
12 క్రియాజన్యవిశేషణములు మొదలయిన యసమాపకక్రియారూపములు 529
13 చేదర్థకము 532
14 ప్రార్థనాద్యర్థకము 534
15 ప్రేరణార్థకము 541
16 కర్మార్థకము 543
17 కార్థకములు


## కృత్తద్ధితాంతములు - 550-558


1 కృత్తద్ధితల స్వభావము 550
2 కృత్ప్రత్యయములు 552
3 తద్ధితములు


## తెనుఁగునందలి పదజాలము - 559-586


1 విభాగము 559
2 తత్సమ తద్భవముల స్వభావము 563
3 ప్రాకృతసమభవము లే ప్రాకృతమునుండి వచ్చినవి 566
4 తద్భవములలోని యక్షరపరిణామము 567
5 తత్సమ తద్భవముల భేదము 568
6 అచ్చ తెనుఁగు 571
7 తద్భవ దేశ్యములను వేఱుపఱచుట యెట్లు 572
8 సంస్కృత మూలద్రావిడభాషల సంబంధము 578
9 అన్యదేశభాషాపదములు 581
10 అరవ పదములు 582
11 కన్నడ పదములు 583
12 అరబీ, పెర్షియను, ఉర్దూ, హిందీ భాషలతోడి సంబంధము 583
13 పాశ్చాత్యభాషాపదములు 585

## అర్థవిపరిణామము - 587-592


| | | |
|---|---|---|
| 1 | విపరిణామ హేతువులు | 587 |
| 2 | విపరిణామ విభాగము | 588 |
| I. | అర్థవ్యాకోచము | 588 |
| II. | అర్థసంకోచము | 589 |
| III. | అర్థసౌమ్యత | 589 |
| IV. | అర్థగ్రామ్యత | 589 |
| V. | సభ్యోక్తి | 590 |
| VI. | మృదూక్తి | 590 |
| VII. | కేవల సంకేతార్థములు | 590 |
| VIII. | లక్ష్యార్థములు | 591 |


## ఉపసంహారము - 593-599


| | | |
|---|---|---|
| 1 | సింహావలోకనము (1947) | 593 |
| 2 | 1947-వ సంవత్సరమునాఁటి భాషాస్థితి | 594 |
| 3 | కర్తవ్యము | 596 |
| | 1968-వ సంవత్సరమునాఁటి భాషాస్థితి | 597 |



సాహిత్యసమ్రాట్, కళాప్రపూర్ణ, విశ్వదాత

మహారాజశ్రీ విక్రమదేవవర్మగారు, డి. లిట్. (గౌరవ, ఆంధ్ర)

జయపుర మహారాజులు

ఆంధ్ర విశ్వకళాపరిషదధ్యక్షకల్పులు

శ్రీరస్తు

# కృతిసమర్పణ సందర్భమునందలి పద్యములు

శ్రీ వాణీ గిరిజల మా
యావేశితరూపలఁ దనయం దూనుచుఁ గా
ర్యావష్టంబగు బ్రహ్మము
శ్రీ విక్రమదేవపతికి శ్రేయము లిడుతన్.

సీ. అణువొండు వేఱొక్కయణువుతో సంధించి, సృష్టిగల్పించు విశేషశక్తి
తన బిడ్డఁ గాంచుటఁ దల్లిచూపులలోన వ్యక్తమై యలరు దయారసమ్ము
జగములఁజీకటి సమయించి వెలయించు సవితృమండలపు తేజంపురాశి
లోకంబు భ్రమయని లోనెంచి భేదంబుఁగానని యోగి విజ్ఞానగరిమ

యేమహామహు కరుణచే నెసగుచుండు
నట్టి యాద్యుఁడు శక్తి దయార్ద్రదృష్టిఁ
దేజమును జ్ఞానము నొసంగి రాజవరుని
స్థిరతఁ బ్రోచుత విక్రమదేవవర్మ.

చ. అరయఁ గవిత్వశ_ యలరారుట దుర్ఘట మద్ది పాండితీ
స్ఫురణఁ జెలంగుచుంట కడుచోద్యము, మీద ధరాపతిత్వముఁ
బెరయుట వింత, యీవియును నీశ్వరభక్తియు వీనిఁగూడు ట
బ్బురమగు, నిన్నిగూడ నిను బొందెను చిత్రము విక్రమప్రభూ.

గీ. కరుణ శాంతియు త్యాగమ్ము జ్ఞానతృష్ణ
ధర్మసంసక్తి యాస్తికకర్మరతియుఁ
గలిపి నీబుద్ధి నిర్మించెఁ గమలభవుఁడు
దివ్యగుణకర్మ విక్రమదేవవర్మ.

సీ. సంస్కృతాంధ్రోత్కళసాహిత్యసంతతి పయి నీకుఁ గలయట్టి పరమప్రీతి
సకలావనీమతసారసత్యంబుల యందు నీకున్నట్టి యమలరక్తి
పురుషార్థములలో నెపుడు ద్వితీయమ్ము ప్రథమసాధనమను నీ ధర్మబుద్ధి
లోకకల్యాణైకలోలతోద్యోగమ్ము సాగించు నీదు నుత్సాహశక్తి

పండితులయందు పామరమండలమున
త్యాగులందును సంతతోద్యోగులందు
పూజనీయతఁగూర్చి నీపుణ్యమూర్తి
తేజరిలఁజేసె విక్రమదేవవర్మ.

గీ. సహజమై యొప్పు నీయొక్క సద్గుణాళి
వివిధముగ నన్ను మును గౌరవించుప్రీతి
హేతువులుగాఁగ నర్పింతు కృతిని గొనుము
దివ్యగుణధుర్య విక్రమదేవవర్య.

(కృతిగ్రహణానంతరము)

మ. పదిరెండేండ్లు శ్రమించి కూర్చినది యీప్రస్థాన సిద్ధాంతి నీ
మదినిండారిన ప్రీతితోడ విని తన్మాహాత్మ్యముగ్గ్రహించి యొ
ప్పిదమౌరీతిని గౌరవించితివి, నీప్రేమంబు సద్భావమున్
మది నేవేళ స్మరించుచుండెదను సన్మాన్యప్రభావోదయా.

గీ. అఖిలదిక్కుల నీకీర్తి యలముకొనఁగ
నాయురారోగ్యములతోడ నలరుమయ్య
కవులపాలిటి కల్పనగంబ వనఁగ
దివ్యగుణకర్మ విక్రమదేవవర్మ.

# ఆంధ్రభాషావికాసము

## ఆంధ్రభాష

### 1. ఉపక్రమము

ఈ విశాలభూమండలమున నేఁడు వివిధభాగములలో భిన్నభిన్న నాగరకతలతో విలసిల్లుచున్న వేర్వేరు జాతుల జనులు కోటానకోటులుగా నున్నను ఆ యా జాతుల జనులందఱును అట్లే అనఁగా నట్టి నాగరకతతోనే యనాదిగ నా యా దేశములయం దుండిరని యూహింప వీలులేదు. నాగరకత దినదిన ప్రవర్ధమానమగుచున్నట్లును, నొక్కొక్క దేశము జనసంఖ్య యొక్కొక్క సంవత్సరము వర్ధిల్లుచున్నట్లును, నట్లు పెరిగిన జనులు నివసించుటకుఁ బూర్వము జనుల కప్రవేశ్యములయిన యరణ్యములు నేఁడు జనపదము లగుచున్నట్లును నేఁటి జనులకెల్ల స్పష్టమే. ఇట్లు క్రమక్రమ ప్రవర్ధమానులగుచున్న జనుల యొక్కయు వారి నాగరకత యొక్కయు నారంభావస్థ నూహించుట గోదావరివంటి మహానది యొక్క ముఖద్వారస్వరూపమును జూచి క్రమముగా వెనుకకుఁ బోయి తరువాత దాని జన్మస్థానమునకుఁ బోనక్కర లేకయే యచ్చోట నది యెట్లుండెనో యూహించుటవంటిది. జన్మస్థానమున నెట్లత్యల్పరూపమున నది ప్రవహించుచుండునో యట్లే యత్యంతప్రాచీనకాలమున నీ మానవ సంఘమును నత్యల్పసంఖ్యాకమయి మిక్కిలి ప్రాథమికావస్థనున్న నాగరకతతో నొప్పుచుండెనని యూహించుట యుక్తము.

నేఁటి పాశ్చాత్యశాస్త్రనిర్మాతలు మానవజాతిశాస్త్రమును, నాగరకతాభివృద్ధి నిర్ణాయకమార్గములను గనిపెట్టి యనేకములయిన వింతసిద్ధాంతములను జేసియున్నారు. వాని ననుసరించి మానవుఁడు చాలకాలమునకు ముందు అనఁగా నెన్నియో వేలయేండ్ల క్రిందట నేఁటి వానరములవలెనే చెట్లపయినిగూడ సంచరించుచు, మాట నెఱుంగక, నిప్పుచేసుకొనుట మొదలయినవి తెలియక యుండెనని యూహించుచున్నారు. ఈ వానరస్వరూపముగూడ సరీసృపములవంటి రూపముల నుండి క్రమక్రమమునఁ బరిణతమయి యనేకకాలమున కేర్పడినదని జాతిపరిణామవాదులు ( Evolutionists ) వాక్రుచ్చుచున్నారు. అంతదూరము మనము పోనక్కర లేదుగాని మానవునకు భాష యెట్లు లభించెననియు, నయ్యది భిన్నదేశములలో నేఁడు వెలయుచుండుట యెట్లు సంభవించెననియుఁ గొంచె మూహింపక తప్పదు.

నేఁటి మృగపక్ష్యాదులు తమ వేదనాదికమును చేష్టలతోడను, ధ్వనులతోడను వెలిబుచ్చుచుండుట చూచుచునే యున్నాము. మృగస్థితియం దున్నప్పుడు మానవుఁడు నట్లే చేయుచుండెననియు, నా ధ్వనులే కాలక్రమమున నభివృద్ధిచెంది స్పష్టపడి ప్రాథమిక భాషాస్వరూపమును బొందెననియు నంతకంతకు నయ్యదియే యభివృద్ధిఁ జెంది సారస్వతావస్థను గాంచి నేఁటిస్థితికి వచ్చెననియు నూహింపఁబడినది. ఒక్క భాషయే కాలక్రమమున మార్పుఁ జెంది మాండలికభేదములయి యా మాండలికములే భిన్న భాషలుగాఁ బరిణమించుటవలన ననేకభాషలయ్యెననియు, నట్టిభాషలన్నియు నొక్క భాషాకుటుంబముగాఁ బరిగణింపఁబడుచున్నవనియు భాషాశాస్త్రవేత్తల సిద్ధాంతము. భాష మానవుని స్వప్రయత్నమువలననే వెలువడిన సంకేతముల సమష్టిరూపము గావున నట్టిది యనేక దేశములయందు అనేక రూపములుగాఁ బరస్పర నిరపేక్షముగా బయలుదేరి యుండవచ్చును. కావున నాదిమభాషలు వేర్వేరుగా నుండగా వాని నుండియే భిన్న భిన్న భాషాకుటుంబములు బయలుదేరిన వనక తప్పదు.

ఇట్టి భాషాకుటుంబములలో నెద్దానికిఁ జేరిన దీ యాంధ్రభాష ? దీని ప్రాచీన స్వరూప మేమి? ఇది యె ట్లభివృద్ధిచెందినది? యను ప్రశ్నములకు నొసంగనగు సమాధానములే యీ భాషాచరిత్ర మనందగి యున్నవి. అట్టి ప్రశ్నలకు సమాధానముల నాలోచించుటకు ముందు మనము నిర్వచింపఁబోవు నాంధ్రభాష యెట్టిదనియు, నే యే దేశములయందు వాడఁబడుచున్నదనియు, నద్దాని కేనామ మెట్లు సంభవించినదనియు నిర్ణయింపవలసి యున్నది.

## 2. నేఁటి యాంధ్రభాషాస్వరూపము

క్రీస్తుపూర్వమునుండియు నేఁటివఱకు నీ యాంధ్రభాషాస్వరూప మెట్లు మారినదో నిరూపించుటయే యీ గ్రంథముయొక్క యుద్దేశము గావున నేఁటి స్వరూపమును దిఙ్మాత్రముగా దెలిపి యాతరువాత దానికి పూర్వ ముండిన యవస్థలను వివరించి సమన్వయించుట కార్యము. ఈ గ్రంథమును మొదట (1947-వ సంవత్సరములో) ప్రచురించిననాఁడు, తెలుఁగుభాషయొక్క స్థితికిని, నేఁటి భాషాస్థితికిని జాల భేదము గలదు. ఆనాఁడు భాషాప్రయుక్తరాష్ట్రవిభజనము కేవల మూహామాత్రముగానే యుండినది. నేఁ డది సిద్ధమయినది. తెనుఁగు మాటాడుచుండిన ప్రదేశము సహజముగా కలిసియుండినను, ఇతరములయిన విషయములలో ఐక్యము పొందియుండ లేదు. తెలుఁగుదేశము చీలిపోయి కొంత మదరాసు రాజధానియందును, మఱికొంత నిజాము పరిపాలనమునను, ఇక కొంచము మధ్యప్రదేశమునను చేర్పఁబడియుండినది. పరిపాలనప్రణాళికయందుగాని, విద్యాబోధనమునఁగాని నేఁడు తెలుఁగునకున్న ప్రాధాన్య మానాఁడు లేకుండినది. ఆంగ్లము, ఉర్దూ అను రెండుభాషల యొత్తిడియు నేఁడు చాల తగ్గిపోయినది. ఆంధ్రరాష్ట్రము 1953-వ సంవత్సరము అక్టోబరు ఒకటవ

తేదీన అసమగ్రస్వరూపమున నవతరించి, 1956-వ సంవత్సరము నవంబరు ఒకటవ తేదీన 'ఆంధ్రప్రదేశము' అను పేరితో పూర్ణస్వరూపమును పొందినది.

ఈ రాష్ట్రమున, ఆంధ్రదేశపురోభివృద్ధికి గావలసిన ప్రణాళికలలో భాషాభివృద్ధియు నొక ముఖ్యభాగముగ నంగీకరించి, శాసనసభలలోను, వ్యవహారములోను తెలుఁగును ప్రభుత్వము ప్రధానభాషగా నంగీకరించినది. విశ్వవిద్యాలయములయందు ఉన్నతవిద్యను బోధించుటకుఁగూడ తెనుఁగే వాడవలెనని నిశ్చయించి ప్రణాళికలను సాగించుచున్నారు. రాష్ట్రప్రభుత్వముయొక్కయు, కేంద్రప్రభుత్వముయొక్కయు చట్టములను తెలుఁగులోని కనువదించుచున్నారు.

నేఁడు సిద్ధపదార్థమయిన ఆంధ్రదేశముయొక్క పటము 6-వ పుటలో నీయబడినది. మదరాసునుండి గోపాలపురమువఱకును తూర్పుతీరమున సుమారు 600 మైళ్ళ దూరము ప్రసరించి 1,05,150 చతురపుమైళ్ల వైశాల్యముతో నొప్పుచున్నది. వైశాల్యమున భారతదేశములోని రాష్ట్రములలో నైదవ స్థానము పొందియున్నది. జనసంఖ్యనుబట్టి (సుమారు 360 మిలియన్లు) నాల్గవ స్థానమున నున్నది. ఉత్తర భాగమున ఓఢ్రదేశము, మధ్యప్రదేశమును, పశ్చిమమున మహారాష్ట్రమును, దక్షిణమున మైసూరు, తమిళ రాష్ట్రములును గలవు. నేఁటి యీ రాష్ట్రములన్నియు భాషాప్రయుక్త విభజనవలన నేర్పడినవే. ఉత్తరమున ఒడియా, హిందీ భాషలును, పడమట మరాఠీభాషయు, దక్షిణమున తమిళ, కన్నడములును తెలుఁగును చుట్టియున్నవి. రాష్ట్రవిభజనములో సరిహద్దు సమీపమున నున్న కొన్ని తెలుఁగుప్రదేశములను అందలి తెలుఁగువారిని, పొరుగు రాష్ట్రములలో చేర్చక తప్పినదికాదు. సరిహద్దుప్రాంతముల గూర్చిన వివాదము లింకను శమింపక అప్పుడప్పుడు వెల్లితలలు వేయుచునే యున్నవి. ఆంధ్రదేశమున తెలుఁగు మాతృభాషగా గలవారి సంఖ్య 3,42,53,363 (1951 జనాభా). ఇతర రాష్ట్రములలోని తెలుఁగువారి సంఖ్య 69,31,582. మొత్తము 4,11,84,945. ఈ సంఖ్య – భారతదేశమున హిందీ మాటాడువారికంటె మాత్రమే తక్కువ. అనగా తెనుఁగు జనసంఖ్యనుబట్టి రెండవది.

ఆంధ్రరాష్ట్రము సిద్ధింపకపూర్వము తెనుఁ గెట్లు చీలియుండినదో నేఁ డెట్టి యైక్యమును పొందినదో తెలిసికొనుటకును, మార్పును గుర్తించుకొనుటకును, నాఁడు వ్రాసిన మొదటిముద్రణములోని విషయములు క్రింద చిన్నయక్షరములలో ముద్రింపబడినవి.

## ఆంధ్రభాషాస్వరూపము (1947 సం.)

భారతదేశమునకు దక్షిణభాగమందున్న దక్కను పీఠభూమిలోఁ దూర్పుతీరమునుండి నడిమివఱకు నున్న కొంతప్రదేశమునను, మైసూరు, నిజామురాష్ట్రములలోఁ గొంత ప్రదేశమందును నివసించు జనులు నేఁటి యాంధ్రభాషను వాడుచున్నారు, ఈ భాషకు జనసామాన్య

ముచే నిత్యవ్యవహారమున వాడఁబడుపేళ్లు—తెనుఁగు, తెలుఁగు అనునవి. తూర్పుతీరమున సుమారు మదరాసునుండి నేఁటి యొరిస్సారాష్ట్రమునకు సుమారు 25 మైళ్లదూరములోనున్న బారువ యను పట్టణమువఱకునుగూడ నీ భాష ముఖ్యప్రచారములో నున్నది. సుమారు ఇరువదితొమ్మిది మిలియనులు అనగా రెండుకోట్ల తొంబదిలక్షల జను లీ భాష మాటాడుదురు. ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభ మొదలగు దైనిక పత్రికలును, భారతి మొదలగు మాసపత్రికలు నీ భాషలో వెలువడుచున్నవి. కొన్నివందల ముద్రణయంత్రములు ప్రతిదినమును దేశమంతట నెడతెగక పనిచేయుచున్నవి. నేఁటి ప్రభుత్వవిధానమున భాషాప్రయుక్తరాష్ట్రవిభజనమునఁ బ్రత్యేకాంధ్రరాష్ట్రము గావలయుననియు, నాంధ్రులు తమకుఁ బ్రత్యేకమగు జాతివికాసమును నిరూపించుకొనుటకు నవకాశములు గావలెననియు నిత్యము నాందోళనము చేయుచునే యున్నారు. మహాభారత రామాయణాది సంస్కృత పద్యకావ్యములును, నితిహాసములును, బరివర్తితాంగ్లగ్రంథములును, విద్యార్థి పాఠ్యపుస్తకములును, నవీన ప్రకృతిశాస్త్రసంబంధి గ్రంథములును వేనవేలేలేటఁ బునర్ముద్రితము లగుచున్న యీ యాంధ్రభాష నేఁటి నాగరక భాషలలో నొకటి. ఈ యాంధ్రభాషాశబ్దమువలన వ్యావహారికభాషయును, గ్రాంథిక భాషయునుగూడ నుద్దిష్టములే యని యెఱుంగునది.

## ఆంధ్రము మాటాడు దేశపు టెల్లలు (1947 సం.)

ఇతర భాషాప్రచారములేక ప్రధానముగా నాంధ్రభాష మాటాడు దేశము తూర్పు తీరము నానుకొని ఓఢ్రదేశము (ఒరిస్సారాష్ట్రము) లోఁ గొంతభాగమును, మధ్యపరగణాలలోఁ గొంతభాగమును, నిజామురాష్ట్రములోని కొంతభాగమును, మైసూరు రాష్ట్రమునఁ గొంత ప్రదేశమును, దక్షిణమున మదరాసువఱకు నున్న జిల్లాలలోఁ గొంతభాగమును గలిపికొని యా భాగములకు నడుమనున్న యుత్తరసర్కారులు, దత్తమండలములు అనఁబడు జిల్లాలను గూడియున్న భూభాగము. న్యాయముగా దీనినంతటిని దెనుఁగునాఁడనిగాని యాంధ్రదేశ మనిగాని పేరుపెట్టి యేకభాగముగా వ్యవహరింపవచ్చును. కాని యిది భిన్నభిన్న రాజకీయ రాష్ట్రములలోను, సంస్థానములలోను ముక్కముక్కలుగాఁ జేరియుండుటవలన దీని కా పేరు సమష్టిగా లేదయ్యెను.

ఉత్తరపు దిక్కున నీ భాషతోఁ గలిపి సరిహద్దుప్రదేశములయందు మాటాడునది ఓఢ్రభాష. సరిహద్దురాష్ట్రములలో జనులకు సాధారణముగా రెండుభాషలును బరిచితములు గానే యుండును. ఒరిస్సాదరిని బారువ యను పట్టణము ఉత్తరపుసరిహద్దుగా భావింప వచ్చును. ఈ పట్టణము బెంగాలు-నాగపురపు టినుపదారిపై కలకత్తాకు దక్షిణమున 407 మైళ్ల దూరమున నున్న రైలుస్టేషను గలపురము. బారువ సరిహద్దని చెప్పుటచే దాని కుత్తరమునఁ దెనుఁగు మాటాడువారు లేరని భావింపరాదు. ఆ ప్రదేశమునుండి తెనుఁగుయొక్క ప్రాబల్యము తగ్గుచుఁ గనుపట్టును. రెండుభాషలయొక్క సరిహద్దురాష్ట్రములయందుఁ గొంత ప్రదేశమున రెండుభాషలును మాటాడుచుందురు. ఒక దిక్కున ఒకభాష ప్రచారమును, రెండవ దిక్కున రెండవదాని ప్రాచుర్యమునుఁ గ్రమక్రమమునఁ దగ్గిపోయి పూర్ణప్రాబల్య మా దేశస్థభాషకుఁ గలుగుచుండును. బారువ కుత్తరమున మఱి యరువది, డెబ్బది మైళ్లవఱకు అనఁగా కళ్ళికోటవఱకునుగూడఁ దెనుఁగు వాడుక యుండునుగాని యది యంతకంతకుఁ దగ్గుచునే యున్నట్లును, ఓఢ్రము ప్రాధాన్యమును బొందుచున్నట్లు నా యా దేశములయందుఁ

జరించువారికి దెలియుచునే యుండును. *ఈ సరిహద్దురేఖ బారువనుండి పశ్చిమమునన్న కనుమలలోఁ బడి నైరృతిమూలగా బస్తరు సంస్థానములో నున్న సుంకము, బిజ్జి తాలూకాలలో నుండి బేలదిల కొండలవరుస ననుసరించి యింద్రావతీనదిని జేరుచున్నది. ఆ నది గోదావరిలో సంగమించుచోటువఱకును బోయి యీ విభాగము మధ్యపరగణాలలో నున్న చాందా జిల్లాలోని దక్షిణభాగమును, వున్ జిల్లాలోని దక్షిణభాగమును దనలో నిమిడ్చుకొనుచున్నది. అనఁగా నీ ప్రదేశములలో వాడు భాష తెనుఁగని భావము. ఈ రాష్ట్రమునఁ దెనుఁగునకు నవ్వలివైపున మాటాడు భాషలు గోండీ, మరాఠీ భాషలు. అక్కడనుండి దక్షిణముగా గోదావరి, మంజీరా నదుల కూడలిపట్టువఱకు బీదరు వైపు ఈ సరిహద్దురేఖ పోవుచున్నది. ఇక్కడినుండి తెనుఁగునకుఁ బొరుగుబాస కన్నడము. తరువాత నీ విభాగరేఖ నిజాము రాష్ట్రములోనున్న కొన్ని జిల్లాలను తెనుఁగుదేశముగా వేరుచేయుచు మదరాసు రాజధానిలోని బళ్ళారి జిల్లాలోఁ గొంతభాగమును, అనంతపురమునందలి తూర్పుభాగమునంతటిని, మైసూరు రాష్ట్రములోని తూర్పుభాగమును తెనుఁగుభాగముగా వేర్పఱచుచున్నది. అక్కడనుండి తిరిగి మదరాసు రాజధానిలోని ఉత్తరార్కాడు, చెంగల్పట్టు జిల్లాలలోఁ బడి యీ భాషా విభాగరేఖ తిరిగి తూర్పుసముద్రతీరమునఁ గలియుచున్నది.

ఈ తెనుఁగునాటికిఁ దూర్పుటెల్ల బంగాళాఖాతమే. నేఁటి యోఢ్రరాష్ట్రమునందు తెనుఁగువారనేకు లున్నారని పైవిభాగమువలన స్పష్టము. బరంపురము మొదలు పర్లాకిమిడి వఱకుఁ దెనుఁగువారును, ఓఢ్రులును గలిసియున్నారు. వీరు చాలవఱకచ్చటనే పుట్టి పెరిగిన వారుగాని పైదేశములనుండి వచ్చినవారు గారు. రెండు బాసలకునుగూడ సమప్రాధాన్యము గల యీ దేశభాగమునుండి యుత్తరమున ఓఢ్రమునకును, దక్షిణమునఁ దెనుఁగునకును ప్రచార మధికమగుచున్నది. గంజాము జిల్లాలోని మన్యములలో నల్పసంఖ్యాకులయిన యాంధ్రులు మాత్రమే గలరు. సముద్రతీరమునఁ దెనుఁగుజనుల సంఖ్య యధికము. ఋషికుల్యానదీ ముఖద్వారమువఱకును దెనుఁగుజనులు వసించుచునే యున్నారు. విశాఖపట్టణము జిల్లా మన్యములలోఁ దెనుఁగుజనులకంటె నోఢ్రులే యధికముగా నున్నారు. మధ్యపరగణాలలోని చాందా, యోట్మల్లు జిల్లాలలోను బస్తరు సంస్థానమునందును అనేకులు తెనుఁగువారున్నారు.

* గ్రియర్సనుగారి 'లింగ్విస్టికు సర్వే' IV వాల్యూము, పుట 577,




ఈ పటము లింగ్విస్టిక్ సర్వేనుబట్టి వ్రాయఁబడినది.

## ద్రావిడభాషలు - జనసంఖ్య (1951 జనాభా లెక్కలు)

| | | |
|---|---|---|
| తెలుగు | (ఆంధ్రప్రదేశము) | 3,42,53,363 |
| | (ఇతరప్రాంతములు) | 69,31,582 |
| | మొత్తము | 4,11,84,945 |
| తమిళము | | 2,65,46,764 |
| కన్నడము | | 1,44,71,764 |
| మలయాళము | | 1,33,80,109 |
| తుళు | | 7,87,624 |
| కొడగు | | 68,799 |
| గోండీ | | 12,32,886 |
| ఒరాయను (కురుఖ్) | | 6,44,042 |
| కువి (ఖోండ్, సామంతు) | | 2,08,561 |
| కుఇ | | 2,06,509 |
| కోయ | | 1,37,358 |
| బడగ | | 67,236 |
| కొలామీ | | 42,678 |
| రాజమహాలీ (మాల్తో) | | 23,857 |
| పర్జి | | 19,847 |
| కొండ (కూబి) | | 14,052 |
| నాయికీ | | 921 |
| తోద | | 879 |
| ఒల్లారి | | 797 |
| కోట | | 500 |
| కొండెకోర్ గదబ | (లెక్కలు సరిగా తేలలేదు) | — |
| బ్రాహుయీ | (పాకిస్తానుకు చెందిన కెలత్ ప్రాంతమున వ్యవహృతము. 1951 లెక్కలు లభ్యము కానందున 1931 లెక్కలు ఈయబడినవి) | 2,24,415 |

నిజాము రాజ్యమున నధికముగా వాడు భాష యాంధ్రమే. ఏ ఒక్క యితర భాష మాటాడువారి సంఖ్యకంటెనుగూడ నాంధ్రము మాటాడువారి సంఖ్యయే యెక్కువ. ఈ రాజ్యపు సాఁబాలుదేశము తెనుఁగునాడనియే యొప్పుకొనక తప్పదు. ఈ రాజ్యమునఁ దూర్పుభాగము తెనుఁగు. ఈ భాగమునకే 'తెలింగాణా' అని పేరు. ఇది యక్కడి తెనుఁగు వారివలన వచ్చిన నామమేగాని వేఱుగాదు. పశ్చిమభాగమందుఁ దెనుఁగునకుఁ బొరుగు బాసలు కన్నడమును, మరాఠీయు నై యున్నవి. బళ్ళారి జిల్లాలో సాఁబాలుకంటె నెక్కువగాఁ దెనుఁగువా రున్నారు. అనంతపురపు జిలాలో మడకసిరా తాలూకా తప్ప దంతయుఁ దెనుఁగు.

మైసూరునందు సుమారు ఆరవవంతు జనసంఖ్య తెనుఁగువారే. బెంగుళూరు, కోలారు జిల్లాలలో తెలుఁగుమాటాడువారే అత్యధికులు. సేలము జిల్లాలోని హోసూరు తాలూకాయును, చిత్తూరు, ఉత్తరార్కాడు జిల్లాలును తెలుఁగురాష్ట్రమనియే చెప్పనగును. పుత్తూరు, చిత్తూరు, తిరుత్తణి తాలూకాలలోని దక్షిణభాగములలోఁ దెనుఁగు తక్కువ. ఆపైని చెంగల్పట్టు జిల్లాలోని తిరువళ్లూరు, పొన్నేరి తాలూకాలు తెనుఁగు ముఖ్యముగాఁ గలవియే.

పై తెనుఁగుదేశమునకు దక్షిణముననున్న దేశమందుఁ దమిళము ప్రధాన ప్రచారము గని యున్నది. అయినను దెనుఁగువారు అక్కడక్కడ గుంపులు గుంపులుగా నీ దేశమున నున్నారు. వీరి తెలుఁగు, ప్రక్కనున్న అరవముచే నాచ్ఛాదితమగుట యరవపుఁ బలుకుబళ్లు కలిగి, యిక్కడి తెలుఁగువారికి వింత గొల్పుచుండును. తాము మాటాడు తెనుఁగున కచ్చటఁ బ్రచార మధికముగా లేకున్నను మాతృభాషనుమాత్రము విడువకయే తెలుఁగువారమని వీరు చెప్పుకొనుచున్నారు. ఈ దాక్షిణాత్యాంధ్రులసంఖ్య యత్యల్పము గాదు. తంజావూరు జిల్లా, పుదుక్కోట సంస్థానము, రామనాథము జిల్లా, శివగంగ జమీనుదారీ, తామ్రపర్ణనదికి దక్షిణముననున్న తిరునల్వేలి జిల్లాయందును దెనుఁగువారిసంఖ్య యధికము. అచ్చటి వీరి సంఖ్య యెక్కువయే యయినను దమిళులసంఖ్యకంటెఁ దక్కువయని చెప్పక తప్పదు.

సుమారు 68,000 చదరపుమైళ్ళ వైశాల్యము (ఇందు తెలింగాణా చేర్పలేదు) గలిగి గోదావరి, కృష్ణ, తుంగభద్ర, పెన్న మొదలగు పుణ్యనదులకు ప్రవాహభూమియై, విశాఖపట్టణము, రాజమహేంద్రవరము, కాకినాడ, గుంటూరు, నెల్లూరు, బెజవాడ యాదిగా గల పట్టణముల కునికిపట్టయి, సింహాచలము, మంగళగిరి, శ్రీశైలము, ద్రాక్షారామము, కాళహస్తి, తిరుపతి మొదలయిన పుణ్యక్షేత్రముల కిరవయి, సకలసస్యసంభరితమై యొప్పుచున్న దేశమున జనులు మాటాడుభాష తెనుఁగు. ఏకరాష్ట్రమని చెప్పనగు నీ దేశమందలి జను లక్కడక్కడ మతము మొదలయినవానిచేఁ గొంచెము భేదించినను దెనుఁగువారే యగుటచే నిట్టి మహాజనులయొక్క యభిప్రాయప్రకటనరూపమయి యైక్యసంపాదకతాహేతువయిన యాంధ్రభాషయొక్క చరిత్ర మూహింపవలసియున్నది.

# ఆంధ్రభాషకు పేళ్లు

## 1. ప్రామాణిక ప్రయోగము

నేఁటి యాంధ్రభాషకు **మూఁడుపేళ్లు** వాడుకలో నున్నవి. ఆంధ్రము, తెలుఁగు, తెనుఁగు. ఈ **మూఁడు** నామములు నేఁడభిన్నముగా నేకార్థబోధకములుగా నున్నవనుటలో విప్రతిపత్తి లేదు. ఇవి సామాన్య జనప్రవాదమునందే గాక సారస్వతమునందును నేకభాషాబోధకములుగా నున్నవి. ఆంధ్ర విశ్వకళా పరిషత్తు, ఆంధ్ర శబ్దచింతామణి, ఆంధ్రనామ సంగ్రహము మొదలగు పదము లన్నిటియందును ఆంధ్రశబ్దము వాఁడబడుచునే యున్నది. తెనుఁగు, తెలుఁగు, శబ్దములు అధికప్రాచుర్యమునంది సంస్కృతభాషాజ్ఞానలేశమును లేని, జానపదులచేతను వ్యవహరింపఁబడుచుండుట స్పష్టము. ఆంధ్రపదము విద్యాశూన్యులకుఁ బరిచితము కాదనుటయును గణింపఁదగిన యంశము. ఆంధ్రశబ్దము తెనుఁగు, తెలుఁగు శబ్దములతో నభిన్నముగాఁ బ్రాచీనకాలమున భారతముననే వాడఁబడినది. తిక్కన విరాటపర్వపుఁ బ్రథమాశ్వాసముననే 6, 7, 8, పద్యములలోఁ దెనుఁగుబాస యనుపదము వాడెను. పై యుదాహరణములలో "ఆంధ్రావళి మోదముం బొరయ" యని తెనుఁగువారినిఁగూర్చి వ్రాయుట స్పష్టము. తత్పూర్వమయిన నన్నయ భాగమున "తెనుఁగున రచియింపు మధిక ధీయుక్తిమెయిన్" అని నకారము ప్రాసఘటితముగా నుపయోగింపఁబడి యున్నది. నన్నయను గూర్చి వ్రాయుచుఁ దిక్కన "ఆంధ్రకవిత్వవిశారదుండు విద్యాదయితుం డొనర్చె మహితాత్ముఁడు నన్నయభట్టు దక్షుతన్" అని రచించియున్నాఁడు. రాజరాజుచే చేయించఁబడిన నందమపూండి శాసనమున (క్రీ. శ. 1053 సం.) తనకు మిక్కిలి స్నేహితుఁడైన నన్నె నారాయణుఁడు సంస్కృత కర్ణాట ప్రాకృత పైశాచి కాంధ్రభాషలయందుఁ గవిరాజశేఖరుండని నన్నయ వర్ణించియున్నాడు.[1] పై ప్రమాణములనుబట్టి తెనుఁగు, ఆంధ్రభాష యనునట్టివి నన్నయకాలమునకే తుల్యార్థము లనుట నిశ్చితము. నన్నయ తన గ్రంథమునఁ బ్రాసస్థానమున నకారము వచ్చునట్లు తెనుఁగు శబ్దమును వాడుటయు, తిక్కన వాడుకలో తెనుఁగు అను రూపము కనుపట్టుటయు, తెలుఁగు అను శబ్దము లకారముతోఁ బ్రాసస్థానమునఁ గనుపట్టమియుఁ బట్టి చూడ తెనుఁగుశబ్దము ప్రాచీనమేమో యను శంక పొడముును.

---

[1] చూ. 'ఎపిగ్రాఫియా ఇండికా' వాల్యూము 4. పుట 301. నందమపూండి శాసనమును కీలిహారన్ గారు ప్రచురించిరి. "యః సంస్కృత కర్ణాట ప్రాకృత పైశాచి కాంధ్రభాషాసు కవిరాజశేఖర ఇతి ప్రథితః."

## 2. ఆంధ్రశబ్దము మొదట జాతివాచకము

పై మూఁడు శబ్దములలో మిక్కిలి ప్రాచీనమయినది ఆంధ్రశబ్దము. ఐతరేయ బ్రాహ్మణమున ఆంధ్రశబ్దము జాతిపరముగా వాడఁబడియున్నది.[2]

విశ్వామిత్రుఁ డొకానొక సందర్భమునఁ దన కొడుకుల నేబదిమందినిఁ దనయాజ్ఞ నతిక్రమించినందున వారివంశస్థులు పుళిందులు, శబరులు, పుండ్రులు, ఆంధ్రులు లోనగువా రగుదురని శపించెనట. వీ రధములుగూడ నగుదు రని యెను. దీనిని బట్టి యాంధ్రు లొక జాతి జనులనియు, నధములనియుఁ దేలుచున్నది. ఐతరేయ బ్రాహ్మణము రచియించుటకుముందే ఆంధ్రు లార్యులకుఁ బరిచితులనియు విశ్వామిత్రుని శాపముచే వారు పతితులయి యార్యజాతికి దూరులయి యాచార వ్యవహారములందును వారికి భిన్నులయిరనియు మీదివాక్యమునుబట్టి యూహింపఁబడినది. మహాభారతమునందును[3] రామాయణమునందును[4] పాండ్య చోళ కేరళులతో నాంధ్రులు గూడ పేర్కొనఁబడుట స్పష్టము. అశోకునిచే ప్రచురింపఁబడ్డ ధర్మలిపిశాసనములలో 13-వ దానిలో నాంధ్రశబ్దము జాతిపరముగా వాడఁబడినది. ఆంధ్రులు తన రాజ్యము నందు వసించుచున్నట్లును, బుద్ధధర్మము ననుసరించుచున్నట్లును అందు తెలుపబడినది.[5] ఆంధ్రుల యుత్పత్తినిగురించి మనుస్మృతిలో నిట్లు వివరింపఁబడినది : కారావర స్త్రీయందు వైదేహునకుంబుట్టి వేటవలన జీవించువా రాంధ్రులు.[6] అనఁగా మనుస్మృతినిబట్టియు ఆంధ్రశబ్దము జాతిపరమే యని చెప్పుట తప్పదు. పురాణము లందును ఆంధ్రశబ్దము జాతిపరముగానే కనుపట్టుచున్నది.[7] కాని వీనికాల మిద మిత్థ మని చెప్ప వీలులేదు. ప్లినీ యను చరిత్రకారుఁడు ఆందరజాతివారు పరాక్రమ వంతు లనియు, వారికి లక్షపదాతులు, రెండువేల యాశ్వికసేనయును, వేయి యేనుఁగులును, 80 దుర్గములుగల పురములును గలవని చెప్పెను.[8]

ఇంతవఱకునుఁ జెప్పిన ప్రమాణము లన్నియు ఆంధ్రశబ్దమును జాతిపరము గానే నిరూపించుచున్నవిగాని దేశమునకుగాని, భాషకుగాని సంబంధము నిరూపించుట లేదు. ఇది మిక్కిలి ప్రాచీనావస్థ. అనగా ఆంధ్రరాజు లనెడి శాతకర్ణి రాజులు పాలించుటకుఁ బూర్వమునందలిది. ఆంధ్రభృత్యు లనియు, ఆంధ్రు లనియు వ్యవహృతులయిన యీ రాజులు దక్కనురాజ్యమును బాలించిన కాలము దాదాపు క్రీ. పూ. 73 మొదలుకొని క్రీ. శ. 218 వఱకు 3 శతాబ్దములుగా లెక్కింపఁబడినది. వీరికాలమునందు వీరు పాలించిన దేశమునకు ఆంధ్రనామము వీరు వాడినట్లు ఆధారములు లేవు.

[2] ఐత. బ్రా. Book VII. Chap III, Part 6. [3] భారతము, సభాపర్వము XXXI
[4] రామాయణము IV 41. [5] గిర్నారు శాసనము, 13. షాబాజుగఢీశాసనము, 13.
[6] మనుస్మృతి X 36. [7] మత్స్య వాయు బ్రహ్మాండ పురాణములు. [8] క్రీ. వె. 77 సం.

నేఁడు ఆంధ్ర మనఁబడెడు దేశమునకుఁ గేంద్రస్థానము గుంటూరిసీమ. ప్రస్తుతము గుంటూరునకు సుమా రిరువదిమైళ్ళదూరమున అమరావతి, ధాన్యకటకము అను రెండు గ్రామములు గలవు. ఇవి పెద్దగ్రామములే. కృష్ణానది యొడ్డుననే గలవు. అమరావతీ పట్టణముననే బౌద్ధులకుఁ బ్రధానమయిన స్తూప మొకటి గలదు. అది చాల ప్రసిద్ధమయినది. అనేక శిల్పములతో విరాజిల్లుచుండెడిది. ఇందలి శిలలపయి బౌద్ధ జాతకముల కథలన్నియుఁ బ్రతిమలరూపమునఁ జెక్కఁబడి నాఁటి యుత్తమశిల్పి నైపుణ్యము వెలయించుచున్నవి. నేఁడా స్తూపమంతయు విరుగఁదీయఁబడుటచే నది యుండిన స్థలమును, అక్కడి యాకారసూచకములయిన గోతులు దప్ప మఱేమియుఁ గనుపట్టదు. అందలి యుత్తమశిల లన్నియు నుత్తమవస్తుప్రదర్శనశాలలోనికిఁ గొంపోయిరి.

దీని దాపున నున్న ధాన్యకటక మను సంస్కృతనామమునకు ధన్నకడ యను ప్రాకృతనామము వాడఁబడినది. కృష్ణానదిమీఁద మచిలీపట్టణమునకుఁ బందొమ్మిదిమైళ్ళ దూరమున నున్న శ్రీకాకుళము అనుచోట శిముక అను రాజుచే రాజ్యము స్థాపింపఁబడి, తరువాత నటనుండి ధాన్యకటకమునకు రాజధాని మార్పబడినదని ఆంధ్రకౌముదిలోని గాథనుబట్టి యూహింపఁబడినది.

నేడు పైఠాన్ అని చెప్పఁబడు నగరమునకు ప్రాచీననామము ప్రతిష్ఠానము. ఆ పురముననే ఆంధ్రరాజులలో ప్రాచీనులు రాజధానిగాఁ బాలించిరనియు, తరువాతి వారు ధాన్యకటకమును రాజధానిగఁ బాలించిరనియుఁ జరిత్రకారుల యూహ.

ఈ శాతకర్ణిరాజుల శాసనములు, నాణెములు లభించిన దేశములఁబట్టి వారు పాలించిన రాజ్యముయొక్క వైశాల్యము లోనగునవి యూహింపఁబడుచున్నవి. వీరి శాసనములు నాసిక, కన్హేరి, కార్లె, నానాఘట్టము అను నాలుగు స్థలముల లోని గుహాలలో దొఱకుచున్నవి. ఇవి యన్నియు బొంబాయి రాజధానిలోని పూనా దాపున నున్నవి. అమరావతియందు నొక శాసనమును, మచిలీపట్టణమునకు దాపున నొకశాసనమును లభించినవి. బళ్లారి మండలములోని ఆదోనికి చేరువగా నొక శాసనము దొరికినది. పూర్వ పశ్చిమ సముద్రములకు నడుమ నున్నట్టియు (బందరునుండి పూనా, బొంబాయి వఱకును), దక్షిణమున కడప, కర్నూలు, నెల్లూరు జిల్లాలను గలిపికొని ఉత్తరమున సాంచీవఱ కున్నట్టియు విశాలప్రదేశమును శాతకర్ణిరాజులు పాలించిన ట్లూహింపఁబడియెను. నేఁటి గంజాము, విశాఖపట్టణము ప్రాయశః కళింగరాజు నధికారమున నుండి యుండవచ్చును.

మత్స్య వాయు విష్ణు పురాణములఁ బేర్కొనఁబడ్డ యాంధ్రరాజులు శాతకర్ణి రాజులే యనియు, వీరే యాంధ్రభృత్యులని వాకొనబడిరనియుఁ జరిత్రకారుల యూహ.

ఈ యాంధ్రరాజుల కాలమునఁ దమచే ప్రచురింపఁబడ్డ యేశాసనమునందును దా మాంధ్రులమనిగాని తాము పాలించుదేశ మాంధ్రదేశమనిగాని ఉదాహరింప

బడదయ్యె. ఈ బాహుళకము ముం దాంధ్రశబ్దము జాతిపరముగా ననేక ప్రాచీన గ్రంథములయందు వాడఁబడినట్లు సప్రమాణముగా నిర్ణీతమయ్యెను. ఆ యాంధ్రులు నివసించినదిగాని, పాలించినదిగాని యీ దేశమే యయినచోఁ దామః దాని నేల పేర్కొనలేదు ? ఆ కాలమున నీ దేశమునకు అనగా ఆంధ్రదేశమునకు వ్యవహారమం దేమినామ ముండెడిది ? నేఁటి యాంధ్రదేశమునకు ఆంధ్రదేశ మను వ్యవహార మేకాలమునుండి వచ్చినది ? ఈ ప్రశ్నములకు సమాధానము తెలియఁగవలయును.

## 3. ఆంధ్రము దేశవాచక మెప్పటినుండి యయ్యెను ?

ఈ దేశమున కాంధ్రదేశ వ్యవహార మెప్పటినుండి వచ్చె నను ప్రశ్నకు సమాధానము కనుఁగొను ముందు యత్నింతము. ఐతరేయ బ్రాహ్మణాదిగ్రంథము లందు ఆంధ్రదేశమునుగూర్చి విచారమే లేదని ముందు తెలిపితిని. క్రీ. పూ. 7:: నుండి క్రీ. వె. 218 వఱకుఁ బాలించిన యాంధ్రరాజుల కాలమునందును ఆంధ్రదేశమని వారిచే వ్యవహరింపఁబడలేదనియుఁ జెప్పితిని.

దక్షిణదేశమునుఁ గాంచీనగరము రాజధానిగాఁ బాలించిన పల్లవరాజులచే గుంటూరిదగ్గఱి ధాన్యకటకమును, బళ్ళారిమండలమువఱకు నున్న రాజ్యముకూడ ఆంధ్రరాజులనుండి క్రీ వె. 3 వ శతాబ్ది నడిమిభాగమునకే యాక్రమింపఁబడినట్లు శాసనములనుండి స్పష్టము. ఆ కాలమునకు పల్లవవంశములోని యువమహారాజు శివస్కంధవర్మ నిర్మించిన తామ్ర దానశాసన మొకటి ప్రస్తుతము నరసారావు పేటకుఁ బండ్రెండుమైళ్ళదూరమున నున్న మైదవోలు అను గ్రామమున లభించినది.[9] ఈ శాసనము తన తండ్రియొక్క ప్రతినిధిగా ధాన్యకటకమునఁ (ధరణికోట) బాలించుచున్న యధికారికి నాజ్ఞాపత్రము. ఇది పాళీభాషకంటె కొన్ని విషయములలో భేదించిన ప్రాకృతమున వ్రాయఁబడినది.

"అగివెస సగోత్తస గోనందిజస అంధాపథీయో గామో విరిపఱమ్. అమ్హేహి ఉదకాదిమ్ సంపదతో" అగ్నివేశస గోత్రునకు గోనందార్యునకు ఆంధ్రపథీయ మయిన గ్రామము విరిపఱ్ఱు మాచేత ధారాపూర్వకముగా సంప్రదత్తము అని దీని యర్థము. దీనినిబట్టి శాతకర్ణి రాజులపాలనము ముగిసిన వెంటనే విరిపఱ్ఱు అనఁ బడెడు నాంధ్రపథీయగ్రామము, అనగా ఆంధ్రపథమునకుఁ జేరిన గ్రామము అను పేరు ఆ రాజ్యమును క్రొత్తగా జయించిన శివస్కంధవర్మచే వాడఁబడిన దనుట స్పష్టము. ఆ కాలమున ఈ దేశమునకు 'ఆంధ్రపథ' మని పేరుండుట నిర్వివాదము. ఈ నామ మానాఁడే వచ్చినదనుట యసంభవము. అప్పటికి జనులలో నది వ్యాపించి యుండుట చేతనే శాసనకారులయిన పండితులును, లేఖకులయిన శిల్పులును, ఆ నామము నంగీకరించి వ్రాసియుండవలయును. తరువాత మహారాజయిన యా శివస్కంధవర్మ

---

[9] ఎపి. ఇం. వా. VI పుట 84-89 కాలము (సుమారు) క్రీ. వె. 284 వ సం.

చేతనే మఱి 23 వత్సరములకు వేఱొక తామ్రశాసనము నిర్మింపఁబడినది. ఇది బళ్ళారిజిల్లాలోని హీరహడగళ్లి యను గ్రామమునుండి వచ్చినది. ఇం దా ప్రదేశము 'శాతవాహనిరట్ఠము' (శాతవాహనరాష్ట్రము) అని పేర్కొనఁబడినది.[10] సుమారొక 100 సం.కు ముందు శ్రీ పుళుమావి అను నాంధ్రరాజుచే వేయింపఁబడిన 'జంగ్లిగుండు' శాసనమునను ఈ బళ్లారిజిల్లా 'సాతవహనిహార' (శాతవాహన హారము) అనియే పేర్కొనబడినది.[11] 'హారము', 'రట్ఠము' అనునవి నేఁటి జిల్లా శబ్దముతో సమానార్థకము లనియు, నవి యొక్కటేభాగమును నిరూపించుచున్న వనియు నభిప్రాయము గావునఁ బ్రాచీననామము శాతవాహనరాజులకు సంబంధించినదే వాడఁబడినదనియుఁ దేలుచున్నది. ఈ పై రెండు శాసనముల పోల్కినిబట్టి చూడ ఈ దేశమునకు అనగా నేఁటి గుంటూరుమండలస్థ దేశమునకు పల్లవరాజులకు ముందే 'ఆంధ్రపథ'మను పేరు వాడుకలోనున్న ట్లూహింపవచ్చును.

ఆమీద మల్లదేవ నందివర్మ యనునాతఁడు వ్రాయించిన దానశాసనములో (శక సం. 261 అనగా క్రీ. వె 339-340 సం.) ముడియనూ రను పేరు గల్గిన (సంస్కృతీకరణము చూడాగ్రామము) గ్రామము దానము చేయఁబడినది.[12] ఇందు "ఆంధ్రమండలే ద్వాదశసహస్ర గ్రామ సంపాదిత సప్తార్ధలక్ష విషయాధిపతేః" అని యున్నది. అనగా నాంధ్రమండలమందు పండ్రెండువేల గ్రామములను సంపాదించినట్టి ఏడున్నరలక్ష దేశమున కధిపతి యని భావము. క్రీ. వె. సుమారు 234 లో ఆంధ్రపథ మనఁబడిన దేశము క్రీ. వె. 340 సం. కు ఆంధ్రమండల మయినది. క్రీ. వె. 7వ శతాబ్దమున భారతదేశమునఁ బర్యటించిన హుయ్యాన్‌సాంగ్ అను చీనా దేశస్థుడు నేఁటి కృష్ణా గోదావరి జిల్లాలతో సమముగా గుర్తింపఁదగిన దేశము నాంధ్ర దేశ మనియెను.[13] సుమారు క్రీ. శ. 6-వ శతాబ్దమున నుండిన వరాహమిహిరుఁడు బృహత్సంహితలో నాంధ్రదేశమును బేర్కొనియెను. ఇక నాంధ్రదేశ మను వ్యవహారము బలపడి యనేక శాసనములలోఁ బేర్కొనఁబడుచు వచ్చుటచే నీ నామము సుదృఢమయినట్లు నిశ్చితము. క్రింది యుదాహరణములఁ బరికించునది. ఈశానవర్మ నిర్మితమయిన 'హారహ' శాసనము విక్రమార్కశకము 611 సం. అనగా క్రీ. శ. 555. సం. నఁ జెక్కఁబడినదానియందు "జిత్వాంధ్రాధిపతిమ్" అని వ్రాయఁబడినది. క్రీ. శ. 553 సం. నఁ జెక్కఁబడిన జవానుపూరు శిలాశాసనమున[14] "ప్రతిరంధ్ర మాంధ్రపతినా" అనియు, "అంధ్రసేనా భటేషు" అనియుఁ బేర్కొనఁబడినది. అంధ్రము ఆంధ్రము అను రెండునామములును శాసనములలోఁ గలవు. అంధ్రమే మొదటిదనియు, ఆంధ్రము తరువాతిదనియు నొక యూహ కలదు.

---

[10] ఎపి.ఇం. వా. I పుట 2—కాలము సుమారు క్రీ. వె. 257 వ సం. [11] ఎపి. ఇం. వా. XIV పుట 153. కాలము సుమారు 146 వ సం. [12] ఇ. అ. వా. XV పుట 175.

[13] Beal's Records of the western countries, Vol. II, Page 217.

[14] ఎపి. ఇం. వా. XIV పుట 117,

క్రీ. శ. 1072 వ సం. న జెక్కింపఁబడ్డ యశఃకర్ణదేవుని 'ఖైరా' తామ్ర శాసనమున "అంధ్రాధీశమరంధ్రదోర్వలసితమ్ భూపల్లి గోదావరి" అనియు వ్రాయఁబడినది.

తరువాత ఆంధ్రదేశ మను పేరు సుప్రసిద్ధమయి గ్రంథములందుఁగూడ నెక్కిన దనుట నిర్వివాదము.

పైని లేవదీసిన మూఁడు ప్రశ్నములలోను మూఁడవదానికి సమాధానము వచ్చినది. ఆంధ్రరాజుల యనంతరము రాజ్యమునకు వచ్చిన పల్లవరాజుల కాలములో 'ఆంధ్రపథము' అనఁబడి, యనంతరము 'ఆంధ్రమండలము' మొదలగు పదములచే నీ యాంధ్రదేశము వ్యవహరింపఁబడెననియే యీ సమాధానము.

## 4. ఆంధ్రజాతికిఁ బూర్వ మీ దేశనామ మేమి?

ఆంధ్రరాజుల పాలనకాలములో (అనగా క్రీ. పూ. మొదటిశతాబ్దములోను దరువాతి రెండు శతాబ్దములలోను) ఈ దేశమున కేమని వ్యవహార ముండెడిది? శాతకర్ణిరాజుల దానశాసనములలో నెందును ఆంధ్రము అను పేరు లేదు. ఆ కాలమున నితరులచే వీరి ప్రశంస చేయబడిన శాసనములు రెండు గలవు. రుద్రదమనుఁడు క్రీ. వె. 151 వ సం. న నొక శిలాశాసనమును వేయించెను. అందు "దక్షిణాపథపతేః శాతకర్ణేర్ద్విరపి నిర్వ్యాజ మవజిత్యావజిత్య సంబంధావిదూరతయా అనుత్సాదనాత్ ప్రాప్తయశసా—మహాక్షత్రపేణ రుద్రదామ్నా" దక్షిణాపథపతి యగు శాతకర్ణిని రెండుసార్లుగూడ నిర్వ్యాజముగా జయించి జయించి సంబంధము మిక్కిలి దూరము గాకుండుటవలనఁ జంపకుంట యను కారణమునఁ గీర్తిఁ గాంచిన మహాక్షత్రపుఁడయిన రుద్రదమనునిచేత" అని దీని యర్థము. దీనినిబట్టి శాతకర్ణి దక్షిణాపథమున కధిపతి యని తేలుచున్నది.[15] నాసికయందలి గౌతమబాలసిరి శాసనములలో నొక దానియందు "....పథేసరో" అను వాక్యము ముందున్న వాక్యములు భ్రష్టములై కనుపట్టుచున్నవి. దీనిని 'దక్షిణాపథేసరో" అని శాసననిర్ణేతలు చదివిరి.

దీనినిబట్టియు శాతకర్ణిరాజులకు దక్షిణాపథపతు లనియే పేరున్న ట్లూహింపఁబడినది.[16] ఈ శాసనమున నితఁడు "వాసిష్ఠీపుత్ర శ్రీ పుళుమాయి" అసిక, అసక, ముళక, సురాష్ట్ర, కుకుర, అపరాంత, అనూప, విదర్భ, అకరావతి దేశములకు రాజనియు; విజ్ఝ, ఛావత, సహ్యా, కణ్హగిరి, మచ, సిరిటన, మలయ, మహిద, సెటగిరి, చకోర పర్వతపతి యనియుఁ బేర్కొనఁబడినది. ఇతఁడు "శాత వాహనకులయశఃప్రతిష్ఠాపనకరుఁ" డని శాసనమునఁ దెల్పఁబడెను.

ఖారవేలుని హాతిగుంఫ శాసనమునఁ బశ్చిమదిశ పాలించు శాతకర్ణి యని పేర్కొనఁబడియెనే కాని పాలించు దేశముపేరు తెలుపలేదు.[17]

---

[15] ఎపి. ఇం. వా. VIII పుట 43. [16] ఎపి. ఇం. వా. VIII పుట. 60.
[17] 'Select Inscriptions' Calcutta University. page 207.

వింధ్యకు దక్షిణమున నున్న దేశమున కంతటికిని దక్షిణాపథ మను వ్యవహారము గలుగగా నా వ్యవహారముతోనే శాతవాహనకులయశఃప్రతిష్ఠాపకులగు శాతకర్ణి రాజులకును దక్షిణాపథపతు లనియే వ్యవహారమనుట స్పష్టము. శ్రీ పుళుమావిని గూర్చి పేర్కొనిన దేశములయందు ఆంధ్రపథమనిగాని, తెలుఁగు, తెనుఁగు, త్రిలింగము లనిగాని వాడుకలోనుండినట్లు ప్రమాణములు లేవు.

## 5. శాతవాహను లాంధ్రశబ్ద మేల వాడలేదు ?

శాతకర్ణిరాజులు పాలించిన దాంధ్రదేశమే యయినచో నట్లు వా రేల పేర్కొనలేదు ?

దీనికి సమాధాన మొసంగుట చాల కష్టమయినది. ఇదమిత్థ మను శాసన ప్రమాణములుగాని, గ్రంథస్థనిదర్శనములుగాని లేనప్పు డూహయే యాధారము. అట్టి యూహాకల్పితమయిన సమాధానమే ప్రస్తుత మీవలయును—ఆంధ్రులు విశ్వామిత్రుని సంతతివారనియు, వా రేలకో ఆర్యజాతికి దూరులయి నింద్యకోటిలోఁ జేరినవారుగా గణింపఁబడినవారనియు ముందు ఐతరేయ బ్రాహ్మణవాక్య సందర్భమున వివరించితిని. ఆంధ్రులు కారావరస్త్రీయందు వైదేహునకుంబుట్టి వేటవలన జీవించువారని మనుస్మృతియందలి ప్రమాణమును జూపితిని. ఇదియు నాంధ్రుల యౌన్నత్యము నిరూపింపఁజాలదు. శాతకర్ణి రాజుల పేర్లును, పరిపాలనాకాలమును, వా రాంధ్రు లనుటయును బురాణములయందు ప్రసిద్ధము. శాతవాహనవంశజులే శాతకర్ణిరాజు లనుటకు వారి శాసనములందే యాధారములు గలవు. శ్రీ పుళుమావి శాతవాహనకులయశఃప్రతిష్ఠాపనకరుఁడు. ఆంధ్రులు, ఆంధ్రభృత్యులు నను నామములు రెండును వీరినే యుద్దేశించి వాడఁబడినవని చాలమంది చరిత్రకారు లంగీకరించిరి.

వీరికి రాజ్యము లభింపకముందు హీనస్థితిలోనుండి క్రమక్రమముగాఁ దమ పరాక్రమమున ప్రతిష్ఠానపురమునను, అనంతరము ధాన్యకటక మనబడు నమరావతీ పురమునను రాజ్యము స్థాపించుకొని పాలింపఁజొచ్చిరి. ఈ వంశములలో మొదటివారి శాసనములు నాసిక మొదలగు ప్రదేశములలోనే ముఖ్యముగా గనుపట్టుచుండుటయుఁ, దరువాతివారి శాసనములుమాత్రమే ధాన్యకటకా ద్యాంధ్ర దేశములలో గనుపట్టుటయుఁ బరికించినచో వీ రుత్తరమునుండి దక్షిణమునకును, బడమటినుండి తూర్పునకు వచ్చినవారేగాని నేటి యాంధ్రదేశముననే పుట్టి పెరిగి యిక్కడి వాడుక భాషయగు తెనుఁగునకుఁ బ్రథమస్వరూపమయిన భాషనే మాటాడి యద్దానిని గారవించినవారు గారని యూహింపనగును. వీ రాదరించిన భాషలు సంస్కృత ప్రాకృతములు. వీరిశాసనములన్నియుఁ బ్రాకృతముననే యున్నవి. వీరిలో

నొక్కఁడయిన హాలుఁడు కూర్చిన 'సప్తశతి' మహారాష్ట్రీ ప్రాకృతమునకు సన్నిహితమయిన భాషలో నున్నది. గుణాఢ్యుని బృహత్కథలోఁ జెప్పఁబడిన కథ ననుసరించి శాతవాహనుఁడు మొట్టమొదట ప్రాకృతమునుమాత్రమే యెఱిఁగియుండెననియుఁ, దరువాత సంస్కృతభాషాపాండిత్యముగల భార్యయొక్క 'మోదకైస్తాడయ' యనువచనము సరిగ నర్థము చేసికొనజాలక యవమానితుఁడై యతఁడు వాతఁ గాతంత్రమను వ్యాకరణమును జదివి సంస్కృతమందు పాండిత్యము సంపాదించెననియుఁ దెలియుచున్నది. దీనినిబట్టి శాతవాహనుని మాతృభాష ప్రాకృతమే. అతని వంశములోనివారయిన శాతకర్ణిరాజు లందరును ప్రాకృతభాషావేత్తలే.

ఇట్టి వీరికిఁ బెద్దరాజ్యము చేపడి ప్రాముఖ్యము లభించినతర్వాత తమ ప్రాచీన బ్రాహ్మణత్వము తిరిగి సంపాదించుకొనవలెనని యత్నము చేసి రట్లు స్పష్టము. కాఁబట్టియే బాలసిరి యను రాజమాత తన కుమారుఁడయిన గౌతమీపుత్త్రశాతకర్ణి నిగుఱించి యీక్రింది విశేషములను శాసనమున వాడినది. 'ఏకబ్రాహ్మణుఁడు' ద్విజావరకుటుంబవివర్ధనుఁడు, ఆగమానిలయుండు, క్షత్రియదర్పమానమర్దనుండు, వినివర్తితచతుర్వర్ణసంకరుండు. ఈ యాంధ్రులగుఱించి జయస్వాలుగారు ఇట్లు వ్రాయుచున్నారు. "శిముకుఁడు కాణ్వాయనులతో సమానమయిన వర్ణమునఁ బుట్టినట్లు (అనఁగా బ్రాహ్మణజాతి) మత్స్యపురాణమున స్పష్టముగాఁ జెప్పఁబడినది. వాయు బ్రహ్మ విష్ణు పురాణములయందు శాతవాహను లాంధ్రజాతివారని చెప్పఁబడినది. వారి గోత్ర నామధేయములైన వాసిష్ఠి, గౌతమీ అనునవి వారి బ్రాహ్మణత్వము నిరూపించుచున్నవి. నానాఘట్టశాసనమున దానే ముఖ్యములయిన యాగములను జేసినట్లును, స్వయముగా వైదికకర్మల నెఱిఁగినట్లును మహారాణియొక్క మాటలనుబట్టి శాతవాహనులు బ్రాహ్మణు లగుట స్పష్టము" [18]

ఇట్లు కృతానేకమహాక్రతువులును, దేవ బ్రాహ్మణ భక్తులును, బ్రాహ్మణులు నయిన శాతకర్ణిరాజులు వైదికమతవిధ్వంసనకరములయిన ం ములకు దానము చేయుటయు వింతయే యని యూహించుట కవకాశము గల వచ్చును. ఐతరేయ బ్రాహ్మణ ప్రమాణముచేతను, మనుస్మృతిచేతను బతితులని యూహింపఁబడిన యీ యాంధ్రజాతి రాజులు తమ యధికారముచేతను, ఐశ్వర్యమువలనను యాగాదికములఁ జేసి బ్రాహ్మణులఁ దనియించియు, బౌద్ధులకు దానము చేసియు నున్నతిని, జనసమ్మతిని బడయవలయునని యత్నించుట స్పష్టము. అట్టివారు నిందకుఁ దావలమయిన యాంధ్రనామమును పరిహరించుట యుక్తమేకదా! వా రాంధ్రనామము తమ శాసనమునందు వాడకుండుట యా నామము తమ కిష్టము గాకుండుటవలననే యని యూహింపవచ్చును.

[18] బీహారు-ఒరిస్సా రిసెర్చి సొసయిటీ జర్నలు—పుట 265 - 266. Vol. XVI.

ఆంధ్రుల రాచరికము పల్లవుల హస్తగతమయిన వెంటనే వారి దేశమును ఆంధ్రపథ మని పేర్కొనుటయుఁ బైయూహనే బలపఱచుచున్నది. ఆ తఱువాత నీ దేశమున కాంధ్రనామ మవిచ్ఛిన్నధారగా వాడఁబడినది. పై విచారమునుబట్టి తేలిన సారాంశ మిది: ఆంధ్రశబ్దము మొదట జాతిపరము, తరువాత నిది దేశపరము నయినది. అనంతరమే దీనికి భాషాపరమయిన వాడుక స్పష్టము.

## 6. ఆంధ్రము భాషాపరముగా నెప్పటినుండి వాడఁబడినది ?

ఈ శబ్దము భాషాపరముగా నెప్పటినుండి వాడఁబడినది యను నర్థము విచారణీయము. "తిక్కన కాలమువఱకుఁ దెనుఁగునకు ఆంధ్రనామ మున్నట్లు నిదర్శనములు లేవు" అని ఆంధ్రభాషాచరిత్రకారులు, 10 పుట. ఇది ప్రామాదిక వచనము. తామే 31-వ పుటలో "ఈ భాష కాంధ్ర మను పేరు నన్నయభట్టరచితమయిన నందంపూడి శాసనమునఁ గానఁబడుచున్నది" అని వ్రాసియున్నారు.

"ఆంధ్రకవిత్వ విశారదుండు...నన్నయభట్టు", "పదియేనింటఁ దెనుంగుభాస", "తెనుఁగుభాస వినిర్మింపఁ దిపురుటరయ", "ఆంధ్రావళి మోదముం బొరయునట్లుగ" అనియు విరాటపర్వోపక్రమణికయందు తిక్కన పేర్కొనియుండుటచేత ప్రజ లాతని యుద్దేశమున నాంధ్రావళి యనియుఁ, దాను వ్రాయునది తెనుఁగుభాస యనియు, నన్నయ యాంధ్రకవిత్వ విశారదుఁడనియు స్పష్టము. ఆంధ్రము తెనుఁగు అను రెండును ఏకభాషావాచకములే. నన్నయ భారతము నాంధ్రభాషలో వ్రాసెనని చెప్పునుద్దేశముతో శ్రీకాకుళపు శాసనములలో నొకదానియందు శ. సం. 1195 అనగా క్రీ. శ. 1273 వ సం.న "ఆంధ్రీచకార వర భారతవంశవృత్తమ్" అని వ్రాయబడినది.[19] దీనినిబట్టియు నా కాలమున కాంధ్రము, తెనుఁగు శబ్దములు ఏకభాషాపరములనుట నిర్వివాదము.

ఇఁక నన్నయ తన భారతాదిని "తెనుఁగున రచియింపు మధికధీయుక్తిమెయిన్" ప. 16. అని తాను రచించినభాష తెనుఁగని వ్రాసెను. ఇందు నకారము ప్రాసఘటితము. తెనుంగునన్ మహాభారతసంహితారచనబంధురుఁడయ్యె జగద్ధితంబుగన్" 26 పద్యము. అనియుఁ జెప్పెను. "వేఁగీదేశంబునకు నాయకరత్నంబునుంబోని రాజమహేంద్రపురంబునందు" వ. 8. అని నన్నయ వ్రాసియుండెనేగాని యాంధ్రదేశమని వ్రాసియుండలేదు. సభాపర్వమునఁ బ్రథమాశ్వాసమున ధర్మరాజు రాజసూయము సేయు సందర్భమున "అంగ వంగ కళింగ కాశ్మీర కాంభోజ గౌడాంధ్ర సింహళ కేరళ కుంతల ద్రవిడ మరు యవన పతులును" వచ్చియుండిరని వ్రాసెను. సభా. ప్రథ. 284 వ.

[19] ఎపి. ఇం. వా. V పుట

నన్నయభట్టుచే రచియింపఁబడి రాజరాజనరేంద్ర కాలీనమయిన నందంపూడి తామ్రశాసనమున నారాయణభట్టునుగూర్చి ఆంధ్రభాషాకవిరాజశేఖరుఁడని వాడినట్లు ముందే చెప్పితిని. నన్నయకు సహాధ్యాయుఁడును, భారతరచనమునందుఁ దనకుఁ దోడయి నిర్వహించినవాఁడు నితఁడే కావునఁ దెనుఁగునకు నన్నయకాలమున ఆంధ్రభాష యను వ్యవహార మున్నట్లు స్పష్టము.

## 7. తెలుఁగు శబ్దమునకు శాసనస్థ ప్రయోగములు

ఇఁక నాంధ్రశబ్దము నటువిడిచి తెలుఁగు, తెనుఁగు శబ్దముల చరిత్రము నూహింపవలసియున్నది. "తెలుఁగు కవిత్వముఁ జెప్పందలఁచిన కవి" యని తిక్కన (నిర్వ. ఉ. రా. 1-6) ప్రాసఘటితముగా వాడియున్నాడు. అతనికి సమకాలికుఁడయిన కేతన (సు 1250 సం. క్రీ. శ.) తన యాంధ్రభాషాభూషణమున "తెలుఁగునఁ గల భేదంబులు" అని ప్రాసఘటితముగాఁ దెలుఁగు శబ్దమును మూఁడు నాలుగు చోట్ల వాడెను.[20] (క్రీ. శ. సుమారు 1650). బాలసరస్వతియుఁ దన గ్రంథాది పీఠిక యందు "తెలుఁగున్ వ్యాకరణంబు" అని లకారమే ప్రాసఘటితముగా వాడెను.[21] నన్నయ మాత్రము నకారమే ప్రాసఘటితముగా వాడెను. ప్రాచీనప్రతులయందును తెనుంగు అనియే ముద్రితపాఠము.[22] తెలుఁగు అను శబ్దము ప్రాసఘటితముగాఁ బాల్కురికి సోమనాథుఁడు బసవపురాణమున వాడియున్నాఁడు.[23] (కాలము క్రీ. శ. 1200 సుమారు). గ్రంథస్థ ప్రమాణములలో నెల్లను మొదటిదైన నన్నయ భారతభాగము ననుసరించి తెనుఁగుశబ్దము మొదటిదని తెలియుచున్నది. ఇంతమాత్రమునఁ దెలుఁగుశబ్ద మానాఁడు లేదని చెప్ప వీలులేదు. తెనుఁగు శబ్ద ముండెననుటకు విప్రతిపత్తిలేదు. తిక్కన, సోమన కవుల కాలమునకు తెలుఁగు శబ్ద మున్నట్లు ప్రమాణము ముందే నిరూపించితిని.

నన్నయకు ముందు తెనుఁగు, తెలుఁగు శబ్దము లెచ్చటనేని గలవా? అను ప్రశ్నమునకు సమాధాన మీయవలయును. నన్నయకు ముందు చాలకాలమునకే తెనుఁగు వాడుకలో నుండకున్న నాతఁ డానాఁటికిఁ దాను రచియించిన భాషను క్రొత్తగాఁ దెనుఁగని వ్యవహరింపడుగదా! కావున నా పదము వాడుకలో నుండి తీరవలెను. కాని శాసనస్థితముగాఁ గాని యితర గ్రంథస్థితముగాఁ గాని నన్నయకుఁ మిక్కిలి పూర్వము తెనుఁగు, తెలుఁగు శబ్దముల నెచ్చట నెవ్వరు భాషా దేశపరములుగా వాడి రనుట పరిశోధించి కనుగొనవలయును. నేను బరిశీలించినంతవఱకును గన్పట్టిన వాని నీక్రింద జూపుచున్నాను. శాసనములందు (నన్నయ తరువాత) తిలింగ, తెలింగ మొదలగు ననేక వికారములతో నీ శబ్దమే కన్పట్టును.

[20] ఆంధ్ర భాషాభూషణము 4-వ పద్యము. [21] బాలసరస్వతీయము పీఠిక 5-వ పద్యము. [22] విరాటపర్వము తిక్కన, I ఆ. 7, 13 పద్యములు. [23] బసవపురాణము. పాల్కురికి సోమన "తెలుఁగు మాట లనంగవలదు వేదముల కొలదియగాఁ జూడు డిల నెట్టు లనిన."

"త్రైలాంగరాయ స్థాపనాచార్యః" (క్రీ. వె. 1250 సం.)[24] విక్రమ చోళుని తంజావూరు శాసనమున (68 నెం.) తెలింగశబ్దము ప్రయుక్తము. "కుళత్తిళింగ వీమన్ విళంగల్" అని యం దున్నది. "కొలనికిఁ జేరిన తెలింగ భీముఁడు" దీని యర్థమని శాసనసంపాదకులు నిర్ణయించిరి. దీని కాలము 1115 సం. క్రీ. శ. (చూ. దక్షిణదేశ శాసనములు Vol II భాగము III పుట. 311. "తేలింగ తుంగ తరూన్మూలన దంతావళః." అను బిరుదము. క్రీ. వె. 1272 సం.[25]

"వంగ తిలింగ గూర్జర లస త్కర్ణాట గౌడాధిపాన్"[26] (సం. 1373) అనగా క్రీ. శ. 1316

"దేశస్స తత్రాస్తి తిలింగనామా"[27] "పురా తిలింగాన్ ప్రతి" అనియును (క్రీ. వె. 1358 సం.)

బసవపురాణమునందును (సుమారు 1200 క్రీ. శ.) కేతన యాంధ్ర భాషాభూషణమునను (సుమారు 1250 క్రీ. శ.) తెలుఁగుశబ్దము కన్పట్టిన తర్వాత మీఁది శాసనముల కిట విశేష ప్రసక్తి లేదు. అయినను తెలుఁగుశబ్దము వ్యుత్పత్తిని గూర్చి విచారించుచోఁ గొంతవఱ కుపచరించుననియును, దెలుఁగుశబ్దమున కెప్పుడు బహుళప్రచారము గలదు ? అను నర్థమును నిర్ణయింపనగుననియును పై శాసనస్థ ప్రమాణములు పేర్కొనఁబడినవి. తెనుఁగు, తెలుఁగు శబ్దములు నన్నయకాలమునకు ముందుగానే ప్రచారములో నున్నట్లుమాత్రము మన మిచ్చిన ప్రమాణములఁ బట్టి యూహించుటకు వీలు. ఎంతకాలమునుండి వాడుకలో నుండెనో యూహించుట దుష్కరము. *

## విచారము

ఇఁక నీ తెలుఁగు, తెనుఁగు శబ్దముల వ్యుత్పత్తినిగూర్చి విచారింపవలయును. తెలుఁగుశబ్దము త్రిలింగశబ్దభవమనియును, త్రిలింగము దేశవాచి యనియు తెలుఁగు శబ్దభవమే తెనుఁగనియు నొక వాదము గలదు.

విన్నకోట పెద్దన తన కావ్యాలంకారచూడామణియందు (క్రీ. శ. 1407) ఆంధ్రదేశము "శ్రీపర్వత కాళేశ్వర ద్రాక్షారామ సంజ్ఞవఱల....త్రిలింగదేశ మనఁదగుఁ గృతులన్." అని వ్రాసెను.

[24]ఎపి. ఇం. వా. 19. పుట 23. కణ్హరదేవుని మందపురశాసనము. [25]ఎపి. ఇం. వా. 18. పుట 199. తానా తామ్రశాసనము. [26]ఎపి. ఇం. వా. 12. పుట 18. లడ్నూ శాసనము. [27]ఎపి. ఇం. వా. 14. పుట 19 శ్రీరంగ తామ్రశాసనము. ముమ్మడినాయకుడు.

* నేను సేకరించినవి మాత్రమేగాక శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు ఇచ్చిన ప్రాచీనశాసనస్థోదాహరణములను తరువాతిపుటలో నొసంగుచున్నాను.

క. శ్రీక్షితిధర కాళేశ ద్రాక్షారామంబు లనఁగ దనరారెడు నీ
త్రిక్షేత్రంబుల లింగము లీక్షింప ద్రిలింగసంజ్ఞ నెన్నికకెక్కున్.

తే. తత్త్రిలింగ నివాసంబు తనరుకతన
నాంధ్రదేశంబు దా త్రిలింగాఖ్యమయ్యె
దెలుఁగగుచుఁ దద్భవము దానివలనఁ బొడమె.
వెనుక గొందరు దానినే తెనుఁగునండ్రు. 100 ప.

అప్పకవీయము క్రీ. శ. 1650

పలు కవుల కాలమునకుఁ దెలుఁగుశబ్దము త్రిలింగశబ్దభవమనియు, నా త్రిలింగములు ద్రాక్షారామాదులనియు నిశ్చితము. ఇంతకంటెను ప్రాచీనమయిన ప్రమాణము విద్యానాథకృతమయిన ప్రతాపరుద్రీయము నందలి శ్లోకము. అందు ప్రతాపరుద్రుడు 'త్రిలింగదేశ పరమేశ్వర' యని సంబోధితుఁ డయ్యెను.[28] అందీ దేశమునకుఁ ద్రిలింగసంజ్ఞ శ్రీశైల ద్రాక్షారామ కాళేశ్వరములందలి లింగములచే వచ్చిన దనునట్లు సూచితము. ఈతని కాలము సుమారు 1300. అనగా నప్పకవికి 350 సం. లకు ముందే యీ త్రిలింగదేశనామము ప్రసిద్ధమై యున్నది. సింగనాయకుని అక్కలపూండి శాసనమునందును (శ. సం. 1290—1368 క్రీ. వె.) త్రిలింగ

---

1. 985-1014 వఱకును బాలించిన రాజరాజునకు 'తెలింగకులకాల' యని బిరుదము గలదు. ఆతని సేనానాయకుడు 'తెలుంగర్' ను ఓడించెను. క్రీ. శ. 1012. ఎపి. కర్ణాటిక, వా. III నెం. 140. Sr. 2. మొదటి రాజేంద్రుఁడు. (1012-1044 సం.) 'తెలుంగర్' అని ఎపి. డిపా నెం. 30. సం. 1917 శాసనమున గలదు. శా. కాలము: 1022, సం.

2. "తెనుఁగు శబ్దమునకు ప్రాచీన శాసనప్రయోగములు కనుపట్టలేదు. దీనిని మొదట నకారము ప్రాసఘటితముగా వాడినవాడు నన్నయ. తెలుఁగుశబ్దము ప్రాచీన శాసనస్థము. తమిళ కర్ణాటక భాషావాఙ్మయములలోను ఆంధ్రులప్రసక్తి వచ్చినచోట 'తెలుంగ, తెలుంగు' శబ్దములే ప్రయుక్తము లయినవికాని తెనుఁగు శబ్దము కానరాదు. (చూ. తమిళములో- తెలుంగన్ = తెలుంగువాఁడు (కలింగత్తుప్పరణి 456. 12వ శతాబ్దము) తెలింగమ్ (తెలుఁగుదేశము) నన్నూల్, 272 మయిలైనాదర్ వ్యాఖ్యానము. (15వ శతాబ్దము) తెలుంగమ్, తెలుఁగుదేశము; తెలుఁగుబాస (నన్నూల్‌వృత్తి 273) కన్నడములో — తెలఁగు, తెలుఁగు; తెలుఁగుబాస (కన్నడ బసవపురాణము 14వ శతాబ్దము) తెలుఁగలిపి (పైది) తెలుంగిలి, తెలుఁగుదేశస్త్రీ. (శబ్దమణిదర్పణము - 13వ శతాబ్దము)

[28] ప్రతాపరుద్రీయము - నాటక ప్రకరణము-చతుర్థాంకము 21 శ్లో.
శ్లో. యైర్దేశ స్త్రిభిరేష యాతి మహతీం ఖ్యాతిం త్రిలింగాఖ్యయా
యేషాం కాకతిరాజకీర్తివిభవైః కైలాసశైలాః కృతాః
తే దేవాః ప్రసరత్ప్రసాదమధురా శ్శ్రీశైల కాళేశ్వర
ద్రాక్షారామనివాసినః ప్రతిదినం త్వ చ్ఛ్రేయసే జాగ్రతు.

దేశాధిపతి శ్రీమార్గ, 1316 వ సం. క్రీ. వె. త్రిలింగ గూర్జర ఇత్యాది యగు పూర్వోదాహృతశాసనమునను, 1358 క్రీ. వె. ముమ్మడినాయకుని శ్రీరంగ తామ్రశాసనమునను 'తిలింగనామా' యనియు బేర్కొనఁబడినది.[29] మీది ప్రమాణములఁబట్టి త్రిలింగమను పేరు క్రీ. వె. 1300 సం. నకే రూఢమై ప్రచార మున నున్నట్లు నిస్సంశయము. త్రిలింగము లుండుటచే నీ పేరు గలిగిన దనుటకును, ఆ స్థలములు మూడును ద్రాక్షారామాదు లనుటకును అప్పకవికి ప్రతాపరుద్రీయమే కాబోలును ప్రమాణము. ఈ త్రిలింగశబ్దమునుండి తెనుఁగు పుట్టినదా, లేదా యను ప్రశ్నమునకు సమాధానముగా శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుగా రొక వ్యాసము వ్రాసియుండిరి.[30] ఇందు సారాంశ మేమనఁగాఁ దెలుఁగు శబ్దమే ప్రాచీనము. తన్మూలముగాఁ ద్రిలింగమును గృతకముగా సృజించి రనుట. అట్లు జరిగినదో లేదో చెప్పనేరముగాని యాంధ్రనామములు మూలముగా నుంచుకొని వానిని సంస్కృతీ కరించుట గలదని చెప్పుటకుమాత్రము ప్రమాణములు గలవు. ముడియనూరు అను పదమును చూడాగ్రామమని సంస్కృతీకరించిరి.[31] కొలను అను పేరిని సరస పురి అనియు, కమలాకరనగరి యనియుఁ బేర్కొనిరి.[32] అట్లే చేంబ్రోలు అను గ్రామము తామ్రపురీ, తామ్రనగరీ అని సంస్కృతీకరింపఁబడియె. కాలము క్రీ. వె. 1213.[33] ఇట్లు తెలుఁగుశబ్దమే త్రిలింగశబ్దమునకు మాతృకయై యుండ వచ్చునని సంశయము గలుగుచున్నది. కాని వారు ఇంతకుముందు త్రిలింగశబ్దము లేమియే ముఖ్యాధారముగా గ్రహించి తమ యూహను బలపరుప యత్నించిరి. త్రిలింగశబ్దము పురాణమున నున్నదని వ్రాసిరి కాని యా పురాణముల కాల మెప్పుడో, యది యందు నవ్యముగాఁ బ్రక్షిప్తము గాదనుట యెట్లో యను నభిప్రాయ మును మనమునఁ బెట్టుకొని నే నద్దాని నిందు విమర్శింపఁబూనను.

ఇంతకంటె బలమగు ప్రమాణ మొకటిగలదు. ఇంద్రవర్మదత్తమయిన పుర్లీ తామ్రశాసనమున 'త్రిరలింగ వాస్తవ్యాయ' యను పదము గలదు.[34] ఇది 149 వ గాంగ సం.న రచింపఁబడిన ట్లందు గలదు. గాంగశకమునకు 878 చేర్పగా

---

[29] ఎపి. ఇం. వా. 14 పుట 90. [30] లక్ష్మణరాయ వ్యాసావళి - ప్రథమ సంపుటము 123 పుట. [31] మల్లవదేవనందివర్మ శాసనము ఇ. ఆ. వా. 15, పుట 175. క్రీ. వె. 340 సం. [32] ద. హి. శా. వా. II, భా. III, పుట 311. కాలము 1115 క్రీ. శ. [33] ఎపి. ఇం. వా. V, పుట 147 జయుని చేబ్రోలుశాసనము. [34] ఎపి. ఇం. వా. 14. పు. 360 ఇంద్రవర్మ పుర్లి తామ్రశాసనము. కళింగదేశ చరిత్రము, అనుబంధము, పుట 40. నేఁటి విశాఖపట్టణపు జిల్లాలో నుత్తరమున నున్న టెక్కలికి సమీపమున నున్న త్రిలిఙ్గ యను గ్రామ మిది కావచ్చునేమో ? ఇందు మఱియొక శాసనమును దొరకినది. కలింగదేశ చరిత్రము. అనుబంధము. పుట 29. ఈ సందర్భమున బిషప్పు కాల్డ్వెలుగారు తమ ద్రవిడభాషావ్యాకరణమున వ్రాసిన విషయము తప్పక స్మరింపఁదగినది. "త్రిలిఙ్గ శబ్దము ప్రాచీనకాలములోనే వాడుకలో నుండెనని హిందూదేశమునందలి బౌద్ధగ్రంథములలో నుండి విషయమును గ్రహించిన తారానాథుడు వ్రాసిన గ్రంథమునుండి యూహించు

వచ్చు 1027-వ సం. క్రీ. వె. అని లెక్క-వేయఁబడినది. ఇది నిశ్చితము గావచ్చునని యూహింతము. ఇందలి తిరిలింగ శబ్దము త్రిలింగశబ్దభవ మనియు, నది దేశ వాచి యని సందర్భమునుబట్టి స్పష్టమనియు, శాసనసంపాదకుల యూహ. త్రిలింగ శబ్దము తిరిలింగ మనుటలో విప్రతిపత్తిలేదు. కాఁబట్టి నన్నయ నాఁటికే త్రిలింగ శబ్దము తెలుఁగుదేశములో వాడఁబడియుండవచ్చును. ఇంకొక విషయము రెండవ ప్రతాపరుద్రుని కాలములో (1295-1321) నుండిన విద్యానాథుఁడు తన కాలములోఁ బ్రసిద్ధముగానుండి తాను దెలిసిన యర్థమే వ్రాయునుగాని వేఱుగాదు గదా! అతఁ డొక్క-డే కాక 1250 సం. నుండి 1360 సం. వఱకు నున్న శాసనస్థ ప్రమాణముల నింతకుముందే పేర్కొంటిని. అట్లు ప్రసిద్ధమగుటకు ముం దొక కొంతకాలము అది వాడుకయం దుండవలయును. తమ్ము సిద్ధి శాసనములు రెంటిలో "తిలింగ విద్యానృపతిః, తిలుంగబిజ్జ" యనియుఁ బేర్లు వ్రాయఁ బడినవి.[35] అందుఁ బొత్తపి యను పుర మాంధ్రదేశమునందలిదిగా వ్రాయఁబడెను. "జిష్ణు రాంధ్రేషు యః కృత్వా పురీం పొత్తపి సంజ్ఞితామ్" ఈ తిలుంగ పదమును త్రిలింగశబ్దభవ మగునేమో.

ఏది యెట్లయినను విద్యానాథుని మూఁడు దేవస్థానముల నడిమిదేశము మాత్రమే తెనుఁగునా డనుట పొసగదు. నేఁటి తెనుఁగుదేశమున కెల్లలు మును నిర్వచించి యున్నాను. అతిప్రాచీనకాలమునుండియుఁ దెనుఁగునాటి కెల్లలు నేఁటివానికి దాపునఁ గలవనియే తోఁచుచున్నది. ఇందుఁ గాళేశ్వర మెచ్చట గలదనుట పరిశోధింప వలెను. ఇది మంథెన కాళేశ్వరమనియు, నిజాముర్రాష్ట్రములో నున్నదనియు చెప్పఁబడినది.[36] కాని యిది కాళహస్తి యనుటకు రాజేంద్రచోడుని శాసనమున

చున్నారు. తారానాథునకుఁ బ్రమాణములయిన గ్రంథములు బౌద్ధమతము హిందూ దేశమున నశింపకమున్నే వ్రాయఁబడి యుండెను. ఇంతియకాక త్రిలింగశబ్దము టాలెమీ గారికిఁగూడఁ బరిచితమయియుండె ననవచ్చును" టాలెమీగారి కాలము-(క్రీ. వె. 150. సం.)

"Taranatha the Tibetan author already referred to who derived his information not from Modern Telugu Poets or Pandits but from Indian Buddhistical narratives (which having been written before Buddhism disappeared from India, must have been of considerable antiquity) repeatedly designates the Telugu Country Trilinga and describes Kalinga as a portion of Trilinga and Kalingapura as its capital. The name of Trilinga has reached Ptolemy himself at a time anterior probably to the date of the puranas." C. G. D. page 28.

Mc. Crindle *Ancient India* Edited by S. N. Majumdar, Calcutta 1927. pages 231—234.

[35] ఎపి. ఇం. వా. 7. పుట. 22 తమ్ము సిద్ధి శాసనములు, [36] లక్ష్మణరాయ వ్యాసావళి. 1 వ సంపుటము. Page. 12౩.

ప్రమాణమున్నది. రేనాండు అను పేర 7000 గ్రామములు నేఁటి కడప, కర్నూలు మండలములలో నుండినవి తెనుఁగునాడుగాఁ దెనుఁగుచోడుల యేల్బడిలో బహుకాలమునుండియు నుండెను. ఇట్లే వరాహవర్తనీ విషయ మని గంజాము జిల్లాలోను, కళింగదేశ మను పేర గోదావరి కుత్తరభాగమునను దెనుఁగునాడుగాఁ దెనుఁగుభాష యుండెడిదని యంగీకరింపక తప్పదు. కాఁబట్టి విద్యానాథుని కాలమునకుముందు వ్యవహారములోనున్న త్రిలింగదేశము నేఁటి తెనుఁగునాటి నంతటిని దనయందిమిడ్చుకొనలే దనుట స్పష్టము. తెనుఁగుదేశము దక్షిణపు టెల్లయు, అరవనాటి కుత్తరపు టెల్లయు నభిన్నములగుటచే అరవనాటి కతిప్రాచీన కాలముననే తొల్‌కాప్పియ మను వ్యాకరణమునఁ జెప్పిన యుత్తరపు టెల్లయే నాఁటి తెనుఁగువారికి దక్షిణపు టెల్ల యని యొప్పుకొనుట న్యాయ్యము. అందు వేంకటాద్రి యనఁగా తిరుపతి యరవనాటి కుత్తరపు టెల్లయని చెప్పిరి. ఇది తెనుఁగు దక్షిణపు టెల్లగదా ! విద్యానాథుని 3 లింగములును తెలుఁగునాటికిఁ బూర్వకాలముననే యెల్లలు గావనుట స్పష్టము. కాఁబట్టి విద్యానాథుఁ డొసఁగిన వ్యుత్పత్తి సరిగాదని భాసింపవచ్చును గాని యంతమాత్రముచే నా వ్యుత్పత్తి నిరాకరింపరాదు. తాను జెప్పిన మూఁడు దేశములును దెనుఁగునాట నున్నవా, లేవా యనియే విచారణీయాంశము గాని యవి యెల్లలా, కావా, యనుట యుద్దిష్టముగాదు. ఏ త్రిలింగములవలన నీ దేశమునకుఁ ద్రిలింగసంజ్ఞ గలిగినదో యనిమాత్ర మాతని శ్లోకమునఁ గలదు. కాఁబట్టి యీ దేశమునకుఁ ద్రిలింగసంజ్ఞ త్రిలింగస్థానమగుటచేఁ గలిగిన దనుటలో నభ్యంతరము లేదు. (శ. సం. 1091 అనగా **A. D.** 1169) వీర రాజేంద్రచోడుఁ డను వెలనాటిప్రభువుచే నీయఁబడిన దానశాసనమున ఆంధ్రదేశమునుగుఱించి యొక శ్లోకము గలదు.[37] అం దాంధ్రదేశమున కెల్లలు 1 తూర్పు సముద్రము, 2 కాళహస్తి శిఖరము, 3 శ్రీశైలము, 4 మహేంద్రాచలము అని చెప్పబడినది. ఈ మూఁడును శివక్షేత్రము లగుటచే వీనినిబట్టి చూచిన త్రిలింగ సంజ్ఞ సార్థకముగానే కన్పట్టును. ఈ మూఁటినిబట్టి వచ్చిన త్రిలింగసంజ్ఞకు క్రమముగా రెండవ వ్యుత్పత్తి కల్పితమయ్యెనేమో! తిరిలింగ శబ్దము నింతకంటెను ప్రాచీన మనదగు శాసనమునఁ జూపితినిగదా ! కాబట్టి యీ శబ్దము విద్యానాథుని కంటెఁ బ్రాచీనము, నన్వర్థము నయి యుండెననుట నిర్వివాదము.

ఇఁకఁ ద్రిలింగశబ్దవికృతు లనేకవిధములయినవి గలుగవచ్చును. త్రిలింగము—తిరిలింగము. చంద్రుఁడు—చందురుఁడు అనురూపమువలెనే. త్రిలింగము—తిలింగము. పదాదినున్న జడ్డరేఫకు లోపము ప్రమాను లోనగు పెక్కుశబ్దములందు గలదు. తిలింగమునం దాదినున్న ఇకారము ఎకారమయి తెలింగమును (తెలింగానా) తెలుంగును గావచ్చు ననుటలో విప్రతిపత్తిలేదు. ‘తేలింగ తుంగతరూన్మూలన దంతావళుఁడు’ (1272) ‘తిరిలింగవాస్తవ్యాయ’ (1027) ‘తిలిఙ్గ’ (1216) ‘తిలుంగ

[37] 1916-వ సం. ఎపి. డి. ఫా. తామ్రశాసనము. సంఖ్య 23.

విద్యాన్నృపతి' 'తిలుంగబిజ్జ' (1207) 'తిలింగనాయూ' (1358) అను వివిధ తద్భవ రూపములను శాసనములనుండి యింతకుముందే సప్రమాణముగా జూపితిని. కాఁబట్టి త్రిలింగ శబ్దమునుండి తెలుఁగు ఏర్పడియుండె ననుట నిస్సంశయము. కాని యిట్లు మాత్రమే యేర్పడిన దనరాదు. మార్గాంతరములచేతఁగూడ నియ్యది యేర్పడె ననుటకు హేతువు లున్నవి. క్రింద నీ యర్థము నిరూపింతును.

## 9. త్రికళింగ శబ్ద విచారము

గోదావరి కుత్తరమున మహేంద్రగిరివఱకు నున్న దేశము నేఁటి తెనుఁగు నాడే. ఈ దేశమున ప్రాచీనకాలమునుండి తెనుఁగుశాసనములు లభించుచునే యున్నవి. ఈ దేశమునకుఁ గళింగ సంజ్ఞ గలదు. కళింగములు మూఁడనియు, నవి యుత్కళింగము, మధుకళింగము, కళింగము ననియుఁ గళింగదేశసంచికయందు నిరూపింపఁబడియెను.[38] ఈ మూఁడు కళింగములకునుఁద్రికళింగమను సంజ్ఞగలదు. ఈ శబ్దము శాసనములలో సుప్రసిద్ధము. ద. హిం. శా. వా. IV నెం. 1010. పర్లాకిమిడి తాలూకాలోని ముఖలింగేశ్వరాలయమున లభించిన శాసనము. మహారాజాధిరాజ త్రికళింగాధిపతిః శ్రీమదనంతవర్మమహారాజశ్చోడగంగదేవః''

డిటో నెం. 1012. శ. సం. 1030.

''ఆకల్పం గుణధామ సోమలమహాదేవీ మనోమానసే।

హంసీ యాత్రికళింగమండలపతేః శ్రీగాంగచూడామణేః.''

డిటో నెం. 1025, శ. సం. 1035

''మహారాజాధిరాజ త్రికళింగాధిపతి శ్రీమదనంతవర్మదేవర.''

ఈ త్రికళింగమును అందలి కళింగమును బలుమారు భిన్నముగా, నభిన్నముగాను[39] భిన్నభిన్నకాలముల భిన్నభిన్నరాజులు పాలించిరి. ఇందు తెలుఁగు దేశము చాలవఱకుఁ గలదు. తెలుఁగుదేశములోని యేకదేశమునకు (ఇది గొప్ప ఖండముగాని యల్పముగాదు. 300 మైళ్లు పొడుగుగల సాగరప్రాంతమైన తెనుఁగు నాడు.) సంబంధించినది త్రికళింగము. ఆ త్రికళింగ శబ్దమే భిన్నరూపములను

---

[38] కళింగదేశచరిత్ర—రాళ్లబండి సుబ్బారావు. పుట 430-436.

[39] ఎపి. ఇండికా Vol. II Page 144. A. D. 1047 సం. కర్ణదేవుని గోహార్వ తామ్రశాసనములు "త్రికళింగాధిపతి శ్రీమత్కర్ణదేవ నిజభుజోపార్జితాశ్వపతి గజపతి నరపతి రాజాత్రయాధిపతిః" అని గలదు. ఎపి. ఇండికా Vol. Page 198. క్రీ.వె. 1192 అనంగభీముని శాసనములలో "త్రికళింగనాథయశసా" అని కలదు, ఎపి. ఇండికా " Vol. 19 బాదప అరుంబాక తామ్రశాసనము. క్రీ. శ. 970 "వేంగీదేశం త్రికళింగసహితం రక్షతిస్మ" అని కలదు. "త్రికళింగ మనునది ఇప్పటి గంజాము, విశాఖపట్టణము జిల్లాలును, వానికిఁ బడమట మధ్యపరగణాలలోని కొంతభాగము నయి యున్నది." అని ఆంధ్రభాషాచరిత్రకారులు 32-వ పుటలో వ్రాసిరి.

బొంది తెలుంగు కావచ్చును. త్రికళింగ = త్రిఅలింగ = తెలింగ = తెలుంగు మొదలగు రూపములన్నియు రావచ్చును. కాఁబట్టి విశాలభాగమయిన యేకదేశమునకు వాచకమయి త్రికళింగశబ్దభవమయిన తెలుఁగు తెలుఁగునాటికంతటికిని వాచక మయ్యెననుటలోఁ జిత్రమేమియు లేదు.

ఈయువిధమయిన రెండు భిన్నమార్గముల వచ్చిన రెండు తెలుగులగు తెలుఁగు శబ్దములు కాలక్రమమున నభిన్నమయి తెలుఁగు శబ్దము గల్గినదనుట సమంజసము.

## 10. తెలుఁగు - తెనుఁగు శబ్దముల సంబంధము

ఇఁకఁ దెనుఁగు శబ్దచరిత్రము పరిశీలించుటకుముందు తెనుఁగు — తెలుఁగుల సంబంధము విచారింపవలయును. తెలుఁగునుండి తెనుఁగును, తెనుఁగునుండి తెలుఁగును బుట్టినవని వేర్వేఱుగాఁ గొందరు చెప్పుచున్నారు. శబ్దవ్యుత్పత్తి మాత్రమున కేమయిన ప్రతిబంధకములు గలవేమో విచారింతము.

తెనుఁగు = తెలుఁగు అనియెడు నిరుదెఱంగుల మార్పులును భాషాస్వభావసిద్ధములే. లకార నకారములు రెండును దంత్యములే. పైగా నకారమనునాసికము. ఏకస్థానజన్యములయిన ధ్వనులు ఒకటిగా మఱియొకటి మాఱుననుటలో విరోధము లేదు. సంస్కృతమునందలి లాఙ్గల శబ్దము తెనుఁగున నాఁగలి యగుట ప్రసిద్ధము. మఱియు లచ్చి = నచ్చి, లా=నా, లేదు=నేదు, జన్మము = జలమము. లంజ = నంజ, అను రూపమున నుచ్చారణములో విశాఖపట్టణమండలమున నీమార్పు స్పష్టముగాఁ గన్పట్టును. ఇట్లే మునుఁగు ధాతువు నుండి ములుఁగు ధాతువు గల్గినది. ఇది కర్ణాటభాషలోఁగూడ ముళుంగు అను రూపముతో నున్నది. మునుఁగు ప్రాచీనరూపము. ఇట్లే చణక=సెనగ = సెలగ, అను పరిణామము కలిగినది. వాడుకలో రెండు రూపములును గలవు. పనవు = పలవు కాఁబట్టి తెనుఁగు=తెలుఁగు, అను రెండువిధములయిన మార్పులును సహజములే. తెనుఁగు ప్రాచీన మనువా రొకమార్పును, తెలుఁగు ప్రాచీన మనువారు వేరొకమార్పును దెల్పి యూరకున్నారు. కాఁబట్టి తెనుఁగు శబ్దప్రచారమునకుఁ దెలుఁగు శబ్దమును, దెలుఁగునకుఁ దెనుఁగును బరస్పర సహకారము లయ్యెనని యూహించుట లెస్స.

తెనుఁగు శబ్దమునకు ప్రకృతులుగా నున్న త్రిలింగ, త్రికలింగములు రెండును సంస్కృతములే.

## 11. తెలుఁగున కితర వ్యుత్పత్తులు

తెలుఁగు శబ్దమునకు దేశ్యపు వ్యుత్పత్తులు గొన్ని చెప్పిరి. తెళి+అగు= తెలుఁగు. తెళి యనగా తెలియు, తేట అను నర్థములో వాడఁబడిన

దీ ద్రావిడధాతువు. కన్నడభాషయందు కన్నడ కత్తురి, తెలుఁగు తేటు, అగవ అధ్వాన్న అని యొక సామెత గలదు. కన్నడము కస్తూరి, తెలుఁగు తేట, అగవ మధ్వాన్న మని దీని యర్థము.

తిలలవలె నుండు గోవు లెచ్చోట సహస్ర సంఖ్యాకములుగా నున్నవో యాదేశము తెలుఁగుదేశమని యొకచోఁ జెప్పఁబడియెను.[40]

తేల్ అను నది యొకటి గలదనియు, దానియొద్దునఁ గొంతకాలము నివసించి తరువాత నీదేశమునకు జనులు వచ్చుటచే వారు తెలుఁగువారైరని యొక మార్గము. ఆ నది తెలుఁగుదేశములోనిది గాదు. ప్రఖ్యాతమును గాదు. అక్కడ నుండుటచే నా నామము వీరికిఁ గల్గినదనుటకుఁ బ్రమాణమును లేదు. ఆ నది పూర్వనామ మేమో తెలియదు.[41]

మఱియొక వ్యుత్పత్తి విమర్శ్యంతము. చిలుకూరి వీరభద్రరావుగారు రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచికయందుఁ జాళుక్య ప్రశంస యనుపేర నొక వ్యాసమును వ్రాసిరి. అందు 85 వ పుటలో నిట్లున్నది: "కరణభాష" కన్నడభాష యయినది. "తెళుగన్నడ" భాషయే తెలుఁగయినది. కర్ణాటములోనిది కన్నడ భాష. తెలగాణ్యములోనిది తెలుగుభాష. ఇటీవలి బ్రాహ్మణులు తెలుఁగు భాషకుఁ గరణభాషాసంబంధము కర్ణకఠోరముగ నుండుటచేఁ గాఁబోలు శ్రీశైలము, ద్రాక్షారామము, కాళేశ్వరము అను త్రిక్షేత్రముల మధ్యనుండు దేశము త్రిలింగదేశమనియుఁ, దద్భవము తెలుఁగనియు వ్యుత్పత్తిఁ గల్పించిరి.

క. ధర శ్రీపర్వతకాళే, శ్వర ద్రాక్షారామ సంజ్ఞవఱలఁ ద్రిలింగా
కర మగుట నంధ్రదేశం, బరుదారఁ ద్రిలింగదేశ మనఁదగుఁ గృతులన్.

గీ. తత్త్రిలింగ పదము తద్భవంబగుటచే, దెలుఁగుదేశమనఁగఁ దేటపడియె.

కావ్యాలంకారచూడామణి. 1330 శా. శ.

కరణభాష యాంధ్ర ప్రాకృతభవ మగుటఁజేసి బ్రాహ్మణ క్షత్రియాంధ్రులు తెళుగన్నడమునకు సంస్కృతచ్ఛాయ మిక్కిలి కల్పించి యాంధ్రభాష యని వ్యవహరించుచున్నారు.

ఈ విషయమునే ఆంధ్రవాఙ్మయ చరిత్ర సంగ్రహకర్తలును వ్రాసిరి.

"చాళుక్య పరిపాలనారంభకాలములోనే తూర్పువారికిని, బడమటివారికిని భాషాభేదము లేర్పడి ముదురుటచేత పడమటివారిభాష హళగన్నడమనియుఁ దూర్పువారిభాష తెళుగన్నడమనియు (తెలుఁగు) వ్యవహారము పొంది ప్రత్యేక సారస్వతముల సృష్టికి హేతుభూతములై యుండెను. ఈ తెళుగన్నడము ప్రాచీ

[40] సరసాస్తిలవ ద్గావో యత్ర సంతి సహస్రశః, సదేశ స్తిలగుర్నామ' ఆంధ్రవాఙ్మయ చరిత్ర సంగ్రహము. పుట 6. [41] ఆంధ్రభారత కవితావిమర్శనము. పుట 17.

నాంధ్రభృత్యవంశమునకుఁ జేరి, సుప్రసిద్ధమై తూర్పునకుఁ బ్రసరించి వేంగి నతిక్రమించి నూత్నసంస్కారముల కవకాశ మిచ్చినదై యున్కి యాంధ్రభృత్యరక్త సంబంధముచే నాంధ్రులై యున్న చాళుక్యులకుఁ బ్రీతిపాత్రమై యున్నది."[42] పై నుదాహరింపఁబడిన విచారణను మనసునఁ బెట్టుకొనికాబోలు నాంధ్రభాషా చరిత్రకారు లీ క్రింది విషయమును తమ గ్రంథమున వ్రాసిరి.[43] "కన్నడభాష యయిదు తెఱంగులుగా నున్నదనియుఁ, దెలుగన్నడమనగాఁ గన్నడులు తమ మూలస్థానమును విడిచి దూరదేశమునకుఁ బోయి తమభాషను దేలికగా నుచ్చరించుటవలన గలిగిన భాష యనియు నొక కర్ణాటభాషాలాక్షణికుఁడు చెప్పి యున్నాఁడు. ఇట్లే కుఁడ యనఁగా గొండలయందున్న కన్నడులు మాటాడు భాష కుడగన్నడమనియు, అదియే నేఁటి కుడగు భాషగా వాడుకయం దున్నదనియుఁ జెప్పుదురు. ఈ సాదృశ్యము ననుసరించి తెళుగన్నడము తెలుఁగుగా వ్యవహరింపఁబడుచున్నదని యూహింపవచ్చును. శబ్దజాలమునందుఁ దెలుఁగు కన్నడములకు నూటికి డెబ్బదివంతున సమానముగ నున్నది. అట్లే ప్రత్యయాది సంబంధమును మిక్కిలి దగ్గరగా నున్నది. ఈ కారణముచేతఁ దెలుఁగు, కన్నడము లొకప్పుడు ఏకభాషగా నుండెననియుఁ, గాలక్రమమున మాండలికభేదమునుబట్టి యవి భిన్నము లయ్యెనని యూహించుట కవకాశము గలదు."

పై నుద్ధరింపఁబడిన మూడుభాగములలో నొక సామాన్యాంశ మగపడుచున్నది. అది, తెళుగన్నడము తెలుఁగుగా మాఱిన దనుటయే. (ఈ విషయమును గుఱించి భారతిలో చిలుకూరి వీరభద్రరావుగారును[44], కూరిగనూరి నరసింగరావుగారును[45] వ్యాసములు వ్రాసియున్నారు.)

పైదాని కుపబలముగాఁ దెనుఁగు కన్నడము లొకప్పు డొకేభాషగాఁ నుండెననియు, వాని రెంటికిని మూలస్వరూపముగా నుండిన భాష తూర్పున నొక విధముగాను, బడమట నొక విధముగాను మాఱిన దనుట. ఈ రెండుభాషలు నొక కాలమున నొకభాషగానే యున్నవనుటలో విప్రతిపత్తిలేదు. ఇవేకాదు. అరవ, కన్నడ, మళయాళము మొదలగు ద్రావిడభాషల కన్నిటికిని మూల మొక్కటే యనియు, అదియే మూలద్రావిడ మనియు మిక్కిలి ప్రచురమగు నొక సిద్ధాంతము గలదు. సంస్కృత ప్రాకృతములనుండి తెలుఁగుగాని యితర ద్రావిడభాషలుగాని జనించినవని చెప్పువారును ఈ భాషలయొక్క నియత సమీపసంబంధమును గాదనఁజాలరు. కాఁబట్టి తెనుఁగు కన్నడములకు మిక్కిలి సన్నిహితసంబంధము గలదా, లేదా యనుట వివాదస్థము గాదు, విచారణీయమును గాదు.

[42] ఆంధ్రవాఙ్మయ చరిత్ర సంగ్రహము. పేజి 12. [43] ఆ. భా. చ. పుట 84. [44] అరవద్దెలుగ్గణ్ణడ మన్ద్రిము కాదా, అది యాంధ్రిము కాలేదా; భారతి జూన్ 1932 పుట 1000. [45] 'కన్నడిగలు, తెలుగలు' భారతి-1930 పుటలు 426, 616, 1004.

ఇఁక విచారణీయ మేమనఁగా తెళుగన్నడము, తెలుఁగునకు మూల మగునా, కాదా యనియే. మొదట శబ్దశాస్త్రసంబంధమయిన యవకాశ మును జర్చింపవలసినది. తెళుగన్నడము తెలుఁగు గావలయుచో ళకారము లకారము, తుదినున్న 'న్నడము'నకు లోపము, తుదిని ఉత్వమును గలుగవలయును. ళకారమునకు లకారము వచ్చుననుటలో వింత లేదు. ఇది సర్వసమ్మతము. ఇఁకఁ దుది 'న్నడము'న కెట్లు లోపము రావలెను. ఉచ్చారణములో ఊనిక మొదలగునవి స్థానాంతరము పొందుటచేగాని, సమాసమును దప్పుగా విరుచుటచేఁగాని యని చెప్పవలయును. పదములు తెలుఁగున మాఱునప్పుడు గల యీరీతి నీక్రింద నిరూపించుచున్నాను.

(1) వెళ్ళిపోయి వచ్చినాఁడు—ఒళిపొచ్చాడు.
(2) వచ్చుతున్న వాఁడు—ఒస్తండు.
(3) పోయిపిడిచినవాఁడు—పూడ్సిండు.

మొదటి రెండును విశాఖపట్టణ మండలమునను, మూఁడవది మద్రాసునను వాడుకలో నున్నవి. ఈ పద్ధతి ననుసరించి తెళుగన్నడమును గుఱుచపఱుపవలయు ననిన 'తెళుగన్నడము—తెళుడము—తెన్నడమ్—తెండమ్' అనునట్టి దేదియో యొకరూపమును బొందునుగాని తెలుఁగు అనురూపము పొందుట యసంభవము. 'తెళుగన్నడము'ను దప్పుగా విఱిచి 'తెలుఁగు+అన్నడ' మను రూపమును గల్గించిరని చెప్పినచో ఈ 'అన్నడ' మేమయినది ? అట్లు చెప్పుట కాధార మేమి ? యను వానికి సమాధానము చెప్పవలయునుగదా ! అదియు యుక్తియుక్తముగను ప్రామాణికముగ నుండవలయును.

తెళుగన్నడము, హాళగన్నడము నొకభాషకే రెండు మాండలికభేదము లని పై వ్రాతల యుద్దేశము స్పష్టము. హాళగన్నడ శబ్దము కన్నడశబ్ద మయిన దనుట కన్నడభాషాసంప్రదాయమున కెంతయు విరుద్ధము. హాళగన్నడ, తెళుగన్నడములు రెండును గన్నడపదములు. మొదటిదానికిఁ బ్రాతకన్నడమని యర్థము. దీనికిఁ బ్రాచీనరూపము, పఴగన్నడము. పకారము హకారమయి యీ రూపముఁ బొందినది. హొసగన్నడ మనగా క్రొత్త, లేక సొగసయిన కన్నడమని యర్థము. హొసకుఁ బ్రాగ్రూపము పొస. ప్రాచీనగ్రంథములయందు పొసగన్నడము, పఴగన్నడ మను శబ్దములు వాడుకలో నున్నవి. తిరుళుగన్నడ మను పదము నృపతుంగరచితమయిన కవిరాజమార్గ మను లక్షణగ్రంథము (కాలము 850 క్రీ. శ.) నందుఁ బ్రయుక్తము. తిరుళ్ అనగా సారభూతమని యర్థము. అట్లే తెళుగన్నడ మనఁగాఁ దేటయగు కన్నడమని యర్థము. తెళు అనగా పలుచని, సన్నని, స్పష్టమయిన యని భావము. ఈ యర్థముననే యీ పదము సుభాషితకందమునఁ బ్రయుక్తమయినట్లు కిట్టెలుగారు తమ కర్ణాటశబ్దకోశమునం దుదాహరించిరి. జాను తెనుఁగు, అచ్చ తెనుఁగు, తేట తెనుఁగు లోనగు తెనుఁగు

విభాగములవంటిదే యీ తెలుగన్నడము. తేటగన్నడ మను విశేషార్థమున వాడఁబడిన యీ శబ్దమును హాళగన్నడ మను నవీనశబ్దమును గర్ణాటభాషలోని రెండు మాండలికములుగా నుదాహరించి యవియే తెలుఁగు కన్నడములకు మూలమని చెప్పుట యెట్టియుక్తి ?

ఈ తెలుగన్నడ పద మెవ్వ రేశతాబ్దమున వాడిరి ? ఏయర్థమున వాడిరి ? ఆ యర్థము నేఁటి తెలుఁగుభాషకుఁగాని దాని పూర్వరూపమునకుఁగాని చెల్లియుండె ననుటకుఁ బ్రాచీనప్రమాణము లెవ్వి ? అను నర్థములను నిర్ణయింపకయే వీనిని ముడిగట్టుట సాధ్యముగాదు. ఆంధ్రభాషాచరిత్రకారు లుదాహరించిన కర్ణాటలాక్షణికుఁ డెవ్వడో యతఁ డేసందర్భమున తెలుగన్నడ పదమును వ్యవహరించెనో యతఁ డేకాలమువాఁడో తెలియకయే యాతని యభిప్రాయము విమర్శింప వీలు లేదు. ఇంతకును దెలుఁగు శబ్దము కన్నడ శాసనములలోనే నన్నయకుఁ బూర్వమే వాడుకలో నున్నట్లు నిరూపితమగుటచేత నా కాలమునకుముందే యీ తెలుగన్నడపదమును వాడుకలో నున్నట్లు నిరూపింపవలయునుగదా ! అట్టిది యసాధ్యము గావున వీనిని పరాస్తములుగా నిశ్చయింపవలయును. భాషాశాస్త్రవిచారణయందలి ప్రథమావస్థలో నిట్టి పూర్వపక్షము లెన్నియేని బయలుదేరును. వానిని విమర్శించుట పాఠకులకు విమర్శనవిధానమును దెలిపి వారిని పటిష్ఠులఁజేయుటకుమాత్రమే ప్రయుక్తము.

ఇంతటితోఁ దెలుఁగుశబ్ద వ్యుత్పత్తిని గట్టిపెట్టనగును. పై విచారణవలనఁ దేలిన సారాంశ మేమనఁగా దెలుఁగుశబ్దమునకు త్రిలింగము మూలము కావచ్చుననియు, నయ్యది ప్రాచీన వైయాకరణసమ్మతమనియు, నయ్యది త్రికళింగ శబ్దభవమనుటలోఁగూడ నభ్యంతరము లేదనియు (ఈ వ్యుత్పత్తి మొదట కాంబెలుదొరగారిచేఁ జెప్పఁబడినది). రెండు విధముల నీ శబ్దము గల్గియుండవచ్చుననియు నొకదాని వాడుక నింకొకటి ప్రచురమును ప్రబలమునయి యుండవచ్చు ననుటయే.

## 12. తెనుఁగు శబ్ద విచారము

ఇఁకఁ దెనుఁగు శబ్దముయొక్క చరిత్రము నూహింపవలయును. మొదటి తెనుఁగు గ్రంథముననే తెనుఁగు శబ్దము నిశ్చితముగా వాడఁబడిన దనియు, నిప్పుడు లభించిన రెండు రూపములలో నిదియే ప్రాచీనతరమేమో యనియు ముందే నిరూపించియున్నాను.

తెలుఁగే ప్రాచీనమనియు, తెనుఁగుశబ్దము లకారము నకారమగుటచే వచ్చినదనియు నొక యభిప్రాయము అక్కడక్కడ గోచరించును. లకారము నకారము గావచ్చుననియు, నకారము లకారము నగుననియు ముందే చెప్పితిని. మునగ—ములగ. సనగ—సెనగ—సెలగ. మునుఁగు—ములుఁగు. తెనుఁగు—తెలుఁగు. పనవు—పలవు కావచ్చుననియు నింతమాత్రమున నేయే శబ్దము ప్రాచీనమో తెలుప వీలుగాదనియుఁగూడ ముందే వివరింపఁబడినది. లేక

రెండుపదములును భిన్నమార్గములలో వాడుకలోనికి వచ్చి తుద కేకార్థకములుగా వాడఁబడి యుండవచ్చును.

తేనె + అగు అను శబ్దముల కూడికవలనఁ దెనుఁగుశబ్ద మేర్పడియె నని యొక వ్యుత్పత్తిని జెప్పుచున్నారు. మొదట నెవ్వరు చెప్పిరో తెలియదుగాని గ్రియర్సన్‌గారు వ్రాసిన హిందూదేశపు లింగ్విస్టికు సర్వేలో వ్రాయఁబడినది.[46] ఈ వ్యుత్పత్తిని బండితప్రోక్తముగా కాల్డ్వెలుగారు నుదాహరించిరి.[47] ఈ వ్యుత్పత్తియు ముందు పేర్కొనఁబడిన నవీనవ్యుత్పత్తులవంటిదేగాని యంతకంటె దీనికిఁ బ్రామాణ్యము గన్పట్టదు.

త్రినగ మను శబ్దమునుబట్టి తెనుఁగుపదము కల్గిన దను వాదము గలదు. దీనికి మొదటికర్త లెవ్వరో యెఱుఁగము. త్రినగ శబ్దమున లేని యనుస్వారము తెనుఁగున నుండుటయు, తెనుఁగుదేశమున కెన్నఁడును త్రినగదేశమని వ్యవహారము లేకుండు టయు దీనికి బాధకములు అని తెలిపిరి.[48] త్రినగ వ్యవహారము తెనుఁగునాటి కెన్నఁడయిన గలదేమో సప్రమాణముగాఁ దెలియరాదు కాని యీ సందర్భమున నొకవిషయ మింతకుముందు చెప్పినదే వివరింపవలయును. క్రీ. శ. 1169 నకు సంబంధించిన దానశాసనమున వీరరాజేంద్రచోడునిగుఱించి "వింధ్యసేతుమధ్యం దక్షిణాపథం పరిపాలయామాస, సోయం పరపురంజయః నియోగా ద్రాజరాజస్య పాలయ న్నంధ్రమండలమ్", "పూర్వాంభోనిధి కాళహస్తి శిఖరి శ్రీమన్మహేంద్రాచల శ్రీశైలైర్వలయీకృతాంధ్ర విషయం శ్రీరాజరాజస్స్వయమ్" అని తెలుపఁ బడియె.[49] పూర్వాంభోనిధియును, గాళహస్తి శిఖరమును, శ్రీమహేంద్రాచలమును, శ్రీశైలము నెల్లలుగా నున్న యాంధ్రవిషయమును శ్రీరాజరాజు పాలించు చుండెనని దీని యర్థము. ఈ మూడుపర్వతములును ఆంధ్రదేశమున కెల్ల లనుటఁబట్టి త్రినగ శబ్ద వ్యుత్పత్తి కాధారము కలిగెననిన ననవచ్చును. కాని యిది త్రిలింగ శబ్దమునకును సాధకమగునని ముందుచెప్పితినిగదా ?

త్రిలింగ శబ్దము ప్రాచీనసమ్మతిని బడయుటచే నదియే యుక్తమని ముందు తేల్చితిని. త్రినగ శబ్దమునకు ప్రాచీనవ్యవహారముగాని ప్రామాణ్యముగాని కలుగు నని చూపునంతవఱకును నీ వ్యుత్పత్తి నంగీకరింప వీలులేదు. త్రినగ శబ్దములో ననుస్వారము లేమి యొక ప్రబల ప్రతిబంధకము కానేరదు. వక్ష్యమాణాంశమునుబట్టి తెలుఁగు శబ్దములలో సానునాసిక్యము కలుగుటగాని పోవుటగాని వింతగాదని తేలఁ గలదు. పెక్కుపదములలో నిర్నిమిత్తముగా సానునాసిక్యము కలుగుటయుఁ, బోవు టయు నున్నదియే. ఒక భాషకుఁగాని దేశమునకుఁగాని పుట్టుకతోనే పే రుండదను టయు, నది కాలక్రమమున నేర్పడుననుటయు యుక్తిసహము. మనుష్యులకుఁ బుట్టిన

---

[46] లి. సర్వే. వా. IV పుట, [47] C. G. D. పుట, 27,

[48] ఆంధ్రభాషా చరిత్రము, పుట 32, [49] ఎపి. డిపా. తామ్రశా. నెం. 23, సం. 1916.

తరువాత నామకరణము నియమముగా జరిగినట్లు భాషల కొకనాఁడొకపే రెవ్వరో పెట్టిరని యూహించుట వెఱ్ఱితనము. ఇప్పటికి వాడుకలో నున్న కొన్ని యనాగరక భాషలకుఁ బేళ్ళే లేవు. చచ్చుడివారను నొకజాతి మాటాడునది చచ్చుడిభాష. ఆ భాషకు లిపి మొదలయినవి లేవు. ఆ భాషనాడువారు 'మా బాస' అని వ్యవహరింతురు గాని వేరొకటి చెప్పఁజాలరు. అట్లే బాణుడును హర్షచరితమునందు 'భాషాకవేః' అని ప్రయోగించినాఁడు. తనదేశమందలి వాడుకభాష యని యా పదమున కర్థము. వస్తువునకు నామకరణము జరుగుటవలన ముఖ్యప్రయోజన మితరవస్తువుల నుండి వ్యవహారములో వేఱుపఱచి గుర్తించుటయే. భాషాముఖ్యప్రయోజన మభిప్రాయావేదనమే. అట్టి కార్యము జరుగునప్పుడు తక్కినఫలముల కంత ప్రాధాన్యము లేదు. తాము ప్రయోగించు సంకేత సామస్త్యమున కంతటికిని ఒకసంజ్ఞ కల్పించి యా సంజ్ఞచేఁ దత్సదృశప్రయోజనము గల యితరసంకేతరాశినుండి పృథక్కరించుట యున్నతనాగరకతాలక్షణము. కావున భాషకు సంజ్ఞ కాలక్రమమున నేర్పడును. సాధారణముగా నీ నామకరణ మేవేని కొన్ని విశేషగుణములఁబట్టి అనగా, ప్రజా దేశ నామములనుబట్టి కలుగును. ఆంధ్రము జాతినామమనియు, నది దేశనామ మయి తఱువాత భాషకు బ్రాకినదనియు ముందే నిర్ణయించితిని. ఇట్లే ఆంగ్లము మొదట జాతికినిఁ దఱువాత దేశమునకును జెంది యామీఁద భాషానామ మయినది.

## 13. తెనుఁగు దిగ్వాచి

పయివిషయమును మనసునం దుంచుకొని తెనుఁగు ఎట్లేర్పడినదో యూహింతము. ప్రాచీనకాలముననేగాక యీనాఁడుగూడ దిక్కులనుబట్టి వ్యవహారమున్నట్లు కనఁబట్టును. పాశ్చాత్యులు మనలను ఓరియంటల్స్ అని చెప్పుదురు. ఆ పదమునే వాడి మనము ఓరియంటల్ జాతులమని వ్యవహరించుకొందుము. మనపాలకులు ప్రాచ్య దేశమును నిర్దేశించుటలో మిడిలీస్టు అనియు, ఫారీస్టు అనియు పేర్కొందురు. మిడిలీస్టు అనగా మధ్యప్రాచ్యమనియు, ఫారీస్టు అనగా దూరప్రాచ్యమనియు నర్థము. ఈపదములే మధ్యధరాసముద్రప్రాంతమునకును, చైనా, జపాను దేశములకును వ్యవహారములో నున్నవి. మనలను ప్రాచ్యులని పాశ్చాత్యు లనుటయే చాలును. మొదట వారు దానిని సార్థకసంజ్ఞగా వాడిరి. దానిని మనము సంజ్ఞామాత్రముగానే గ్రహించి పరంపరగా వాడుచున్నాము. ఇదియే ప్రవాహన్యాయమున గలుగు వ్యవహారము. ఇంటిలోనున్న పిల్లలలోఁ బెద్దవానిని తల్లిదండ్రులు పెద్ద యని వ్యవహరింతురు. అది సంజ్ఞామాత్రమయి యితరుల వ్యవహారములోనికిఁ బోవును. అదే కాలక్రమమున స్థిరపడి కేవలసంజ్ఞ యగును. రాయలసీమవారు గంజాము, విశాఖపట్టణము జిల్లాలవారిని ఉత్తరాదివా రందురు. రాయలసీమకు కొంతకాలముక్రిందట దత్త మండలము అను వ్యవహార ముండెను. ఆ పదమునకు మూలము ఆంగ్లమునందలి సీడెడు డిస్ట్రిక్ట్సు (Ceded Districts) అని విదితమే. నేఁటి తెనుఁగుజిల్లావారి కరవలు

దక్షిణాదివారు. తెనుఁగుజిల్లాలోని యరవలు మేము దక్షిణాదివార మని చెప్పుకొను వారే. నేఁటి తమిళనిఘంటువునందు తెచ్చణాది — దక్షిణాది అను పదమునకు తెన్నాట్టాన్ ( South Indian, Southerner ) అను నర్థము నిరూపితము. ( మదరాసు యూనివర్సిటీ తమిళనిఘంటువు–పుట 2028. ). ఈ పదము పయిరీతి నేర్పడినదే. ఈ యుదాహరణములనుబట్టి నిశ్చిత మేమనఁగా : దిక్కుననుబట్టి వ్యవహార మేర్పడు ననుట. ఇదే కాలక్రమమున స్థిరపడి సంజ్ఞామాత్ర మగుటలో వింతలేదు.

ఇఁక ప్రాచీనకాలమున నాంధ్రదేశ మేరీతిని వ్యవహరింపఁబడుచుండెను ? అను ప్రశ్నకు ముందే సమాధాన మిచ్చితిని. వింధ్యకు దక్షిణమున నున్న భాగమంత యును దక్షిణాపథమే. శాతకర్ణి దక్షిణాపథాధిపతి యని రుద్రదమనుండు తనశాసన మున ననెను. రాజమాత బాలసిరి (దక్షిణా) పథేశ్వరుఁడని తన కుమారునిఁ బేర్కొనెను. అనఁగా నీప్రదేశమునకు దక్షిణమని వాడుక. నేఁటి తెనుఁగుదేశమం దుండిన జనసామా న్యము మాటాడుచుండిన భాష, తమిళాదిద్రావిడభాషాకుటుంబమునకుఁ జేరినదిగాని వేఱు గాదనియు, నియ్యది యాంధ్రులభాష యగు ప్రాకృతమునకంటెను, ఆర్యుల భాషయగు సంస్కృతమునకంటెను భిన్నము నను సిద్ధాంతము ముందు నిరూపింపఁ బడును. అట్టి యీప్రదేశమునకు సంస్కృతపదమున దక్షిణ మను వ్యవహారమును ముందు నిరూపించితిని. దక్షిణ మను సంస్కృతపదమునకుఁ దెనుఁగు తెనుఁగే. తెనుఁగు అనఁగా ద్రావిడభాషలలో దక్షిణమని యర్థము. నేఁటి యాంగ్లమునందలి " ఈస్ట ర్నరు ", "ఓరియంటల్సు" అనుపదము "ప్రాచ్యులు" అని పరివర్తన మొందినదిగదా ! అట్టి తెనుఁగు అను దిగ్వాచకపదమే మన దేశమునకును, భాషకును వాడుకలోనికి వచ్చినది. తెనుఁగుమాట, తెనుఁగునాడు, తెనుఁగువాడు, ఈ పదములన్నియు తెనుఁగునుండి కలిగినవే. తెనుఁగు శబ్దము దిక్కునుబట్టి వచ్చినదనుట సిద్ధాంతము.

ప్రాచీనకాలమున అనఁగా భారతదేశమున నీభాగమున దిక్కునుఁబట్టి వ్యవ హార మెక్కడనైన నుండినదా ? దిక్కునుబట్టి పే రేర్పడిన భాష లేవైన మనదేశము నం దున్నవా యని ప్రశ్నింపవచ్చును దక్షిణాపథము, ఉత్తరాపథము అను పేళ్లు సంస్కృతసారస్వతమున వైదికకాలమునుండియును సుప్రసిద్ధములయి ఆంధ్రులకాల మున శాసనస్థములని యుదాహరణములను ముందే యిచ్చితిని. ఆంధ్రులను అరవ గ్రంథములలోను అరవ శాసనములలోను వడుగర్ అని వ్యవహరించుచుండిరి. వడుగర్ అనఁగా అరవమున ఉత్తరపువా రని యర్థము. వడుగువళి యను పదము ఉత్తరాపథము అను నర్థమున వాడఁబడినట్లు బాణరాజుల శాసనమును ముందు ప్రమాణముగా నొసంగితిని. తెన్నాడు, తెంగలై, తెన్నాసిరియర్ అను పదములలో తెన్ అనునది దిక్కుగా వాడఁబడినది. ఈ మూఁడును తమిళపదములు. పంజాబుదేశమునకుఁ బశ్చిమమున వాడఁబడుభాషకు లహందా యను పేరు గలదనియు, నా పదమునకుఁ బశ్చిమమని యర్థమనియు, గ్రియర్సను

గారు నిరూపించిరి.[50] అట్లే పూర్వభాగపు భాషకు "పోవాడీ" యని పేరు.[51] పోవాడీ యనగా తూర్పునకుఁ జెందినదని యర్థము. ఈ రెండును పంజాబీభాషాభేదములు. దక్షిణమున మునల్మానులు మాటాడుభాషకు "దఖినీ" యను పే రున్నదని వారే వ్రాసిరి.[52] దఖినీ యనగా దక్షిణమునకు సంబంధించిన భాష యని యర్థము. అట్లే కొడగు లేక కుడగు అను ప్రదేశమునకుఁ దమిళమునుండి వచ్చిన దా పేరు, అయ్యది పడమట నుండుటనే. కుడ యనఁగా బడమర యని యర్థము. ఆ దేశమునకును, ఆ భాషకును, జనులకును కుడగు అను పదమునుండియే పేళ్లు గలిగినవి. కూర్గు అనునది నేఁటి యాంగ్లభాషా తద్భవము.

"తెన్" అను పదము నేఁడు తెనుఁగున నిత్యవ్యవహారములో దిగర్థమున భ్రష్టమయినది. తూర్పు, పడమర యనునవియే తెనుఁగుపదములు. మిగిలిన రెండును ఉత్తర దక్షిణములు సంస్కృతములే. "తెన్" అను మూలద్రావిడ పదము అరవము, కన్నడము, మలయాళము అను మూఁడుభాషలయందును ననేక రూపములయందు విశాలమయిన ప్రచారములోఁ గలదు. "తెమ్మెర" యందును "తెంగాయి" యందును "తెన్" శబ్దము గలదు. "తెన్నేరు" (తెన్నేటివారు) నందును గలదు.

తెనుఁగు అను శబ్దము కేవల ద్రావిడమయినను, తద్భవమైన నగును గాని సంస్కృతముమాత్రము గాదు. తమ్ముఁ బరిపాలించు నాంధ్రు లుత్తరాదివారగుటచేఁ బాలితులైన తెనుఁగువారు తమ్ము తెనుఁగువా రని వ్యవహరించు కొనుచుండిరని యూహింపనగును. పాలకులనుబట్టి వచ్చిన యభ్యాసములను, వ్యవహారములను ముందే యుదాహరించితిని. అయినను నొక చిన్న యుదాహరణము : తెనుఁగుదేశమున నుద్యోగమందున్న యొక మండలాధికారికి (బాహ్మణునకు) వైశ్యజనుఁడు క్రిస్మస్ కాలమున క్రిస్మస్‌కార్డును, క్రిస్మస్ కానుకను పంపి హాపీ క్రిస్మస్ కోరుటయును, దొరగా రని వ్యవహరించుటయును మనకు వింత గాదు. పాలకవ్యవహారమే పాలితులకు మేలుబంతి.

కాఁబట్టి దిగ్వాచకములనుబట్టియు, పాలకవ్యవహారమునుబట్టియు నామములును, వ్యవహారములును కలుగుననుట యుక్తియుక్తముగాను, స్వాభావికముగాను నున్నది. కాని తెన్ శబ్దస్వరూపమును విచారింపవలయును. అరవమున కుడక్కు (పడమర), మేర్కు (తూర్పు), తెక్కు, తెఱ్కు (దక్షిణము), వడక్కు (ఉత్తరము) అను పేళ్లు నాలుగుదిక్కులకు వాడఁబడుచున్నవి. తెంక, తెంకలు, తెంకు అను పదములు కర్ణాటకమున దక్షిణ దిగ్వాచకములై యున్నవి. మళయాళ

[50] లి. సర్వే. వా. 8. భా. I పుట, 234. [51] డిటో వా. 9. భా 1. పుట, 610.
[52] డిటో వా. 9. భా 1. పుట. 45.

మున తెక్కు అనగా దక్షిణము. ఈ భాష లన్నిటియందును పయిపదమునకు సమాసమున తెన్ అను రూపమే ముందు గన్పట్టును. అనగా తెన్ అనునదియే వీనిలో సమానాంశమేగాక మూలరూపమనుట నిశ్చయింపనగును. ఈ విషయము సమాసప్రకరణమునఁ జర్చింపఁబడును. ఈ తెన్ అనునదియే తెనుఁగునను గొన్ని పదములలో సమాసపూర్వావయవముగా నున్న ట్లుదాహరించితిని. ఇట్టి తెన్ అను పదమునకే కుప్రత్యయము చేరుటచేఁ దెనుఁగు అయినది. తెక్కు, తెఱ్ఱు (తెలుకు), తెనుఁగు, తెంకు మొదలగునవి ప్రాచీన ద్రావిడ మాండలిక భాషాప్రయుక్త రూపభేదములని యూహింపనగును. ఈ తెన్ అనునది కేవలము మూలద్రావిడమా, సంస్కృతమా యను విచారము వేఱు. సంస్కృతమున నున్న దక్షిణశబ్దము ప్రాకృతమున దక్షిన యను రూపమును బొందనగును. అరవమున నిది తెక్కణమ్ అను రూపమునుబొంది మిక్కిలి ప్రాచీనమయిన శిలప్పదిగార మను నట్టి యరవగ్రంథమునఁ బ్రయోగింపఁబడినది. (తెక్కణమలై) ఈ తెక్కణ పదమునుండియే తెక్కు మొదలయిన పదములు వచ్చియుండవచ్చునని వాదింపవచ్చును. కాని ఆ పద మెట్లు వచ్చినదను చర్చ యిచ్చట ప్రధానము గాదు. "తెన్" అను పదము మూలద్రావిడ మయినను, సంస్కృత దక్షిణ పద జన్య మయినను బ్రకృతము తెనుఁగుశబ్ద వ్యుత్పత్తికి సాధకమేగాని బాధకము గానేరదు.

తెనుఁగుశబ్దము దిగ్వ్యవహారిగా వచ్చి పాతుకొనియుండవచ్చునని యిప్పుడు చేసిన విచారణవలని ఫలితము. తెనుఁగుశబ్దము స్వతంత్రముగా నీ రీతిని వాడుకలోనికి వచ్చి నకారము లకారముగాఁ బరివర్తన గాంచి వేఱువిధముల వచ్చిన తెలుఁగుశబ్దముతో నభిన్నమై కాలక్రమముననే దేశమున కంతటికి వాచకము గావచ్చునని తోచుచున్నది. త్రికళింగశబ్దభవమును, త్రిలింగశబ్దభవమును తెలుఁగు గావచ్చుననుటను ముందే తెలిపితిని. కాఁబట్టి తెనుఁగుదేశములో వేర్వేఱు విధముల నేర్పడిన భిన్నపదము లేకీభూతములయి యభిన్నముగా నీ దేశమునకు వాచకముగా వాడుకలోనికి వచ్చిన వనుటయే సిద్ధాంతము.

# తెనుఁగుయొక్క ప్రాచీనతా ప్రచారములు

## 1. తొలుతటి తెనుఁగునాటి కెల్లలు

తెనుఁగుభాషయొక్క పేళ్లనుగురించి విచారణ సల్పినతర్వాత నా భాష కెంతటి ప్రాచీనత కలదు ? ఎంత ప్రచారము గలదు ? అను విషయములను విమర్శింపవలయును. ప్రచార మనఁగా నే యే దేశభాగములలో నే యే కాలములలో వాడుకలో నుండినది ? ఉండినట్లు నిదర్శనము లేవి ? అను ప్రశ్నలకు సమాధానములే.

నేఁడు తెనుఁగు నెంతమందిజనులు ఏ యే దేశభాగములలో వాడుచున్నారు ? అనఁగాఁ దెనుఁగుదేశపు టెల్ల లేవి ? అను విషయమును ముందటి ప్రకరణములోఁ దెల్పితిని. తెనుఁగుదేశమున కెల్లలు మొదటినుండియు నిట్లే యుండెనా, లేక తెనుఁగుదేశము మొదట నల్పముగా నుండి తరువాత విశాలమయ్యెనా ? లేక సంకుచిత మయ్యెనా ? అని ప్రశ్న. ఈ ప్రశ్నల కన్నింటికిని ప్రత్యక్షమయిన యుత్తరము నిచ్చుటకు వీలులేదుగాని లభించిన యాధారములనుండి యూహించుకొనవలయును. నన్నయకుఁ బూర్వము గ్రంథములే లేవు. ఆతని భారతమునందును వేంగీదేశమునుగూర్చి ముచ్చటించెనేగాని తెనుఁగునాటి నంతటినిగుఱించిన విమర్శనకు నవకాశ మీయలేదు. తెనుఁగుదేశమునకు నెల్లలను నిర్వచించినవానిలోఁ బ్రాచీనమయినది వెలనాటి వీరరాజేంద్రచోళుని శాసనము ( 1169 సం. క్రీ. శ. ). ఈ శాసనమునుగుఱించియు నందుఁ బేర్కొనఁబడిన యెల్లలనుగూర్చియు ముందు ప్రకరణముననే తెలుపఁబడినది.[1] మహేంద్రగిరియుఁ, గాళహస్తి శిఖరియు, శ్రీశైలమును, బూర్వసముద్రము నెల్లలు. అందలి మహేంద్రగిరియే (1084 సం. క్రీ. శ.) రాజరాజచోడగంగుని చేతి తామ్రశాసనమునఁ జెప్పఁబడినది. మన్నేరునదికిని మహేంద్రగిరికిని నడుమ నున్న తన రాజ్యములోని జనులనుగూర్చి శాసనము నుద్దేశించెను.[2] అప్పటి వేంగీదేశమునకు నీ రెండు ప్రదేశములు నెల్లలని సూచితము. మహేంద్రగిరి గంజాముజిల్లాలోని మందసా రైలుస్టేషను సమీపమున నున్నది. నాఁటికి నేఁటికిఁగూడ నాంధ్రభాషకు నుత్తరపు సరిహద్దు రమారమి మహేంద్రగిరియే యని చెప్పవలయును. గోదావరినుండి మహేంద్రగిరివఱకును నుండు ప్రదేశ మాంధ్రరాజుల యేల్బడిలో నుండుటయేగాక యనేకాంధ్రశాసనములకు స్థానమై యున్నది. గంజాము జిల్లాలోని కళింగపురమునకు దాపున ( 4 మైళ్లు ) నున్న దీర్ఘాసి యను గ్రామమున ( వనపతి శాసనము శ. సం. 997 క్రీ. శ. 1075 – 1076 సం.న )

[1] తామ్రశాసనము 1916 సం. నెం 23. ఎపి. డిపా. [2] ఎపి. ఇం. వా. VI పుట 335.

వ్రాయఁబడిన తెనుఁగుశాసనము లభించినది. ఈ భాగమున వాడుకభాష తెనుఁగనక తప్పదుగదా!

రాజమహేంద్రవరమునుండి గుంటూరుమండలమువఱకు నున్న ప్రదేశము తెనుఁగుదేశమునకుఁ గేంద్రస్థానము. ఇందు పెక్కు తెనుఁగుశాసనములు చాల ప్రాచీనకాలమునుండి దొరకుచునే యున్నవి. నెల్లూరుమండలమునను పెక్కు శాసనములు లభించినవి. నెల్లూరుమండల శాసనములు (౧౯౦౩) మూఁడు సంపుటములుగాఁ బ్రచురింపఁబడినవి. ఆ జిల్లాలో దక్షిణమునఁ దెనుఁగు నమీసముగా వ్యాపించినదని ప్రాచీనకాలమునందలి తమిళశాసన బాహుళ్యమునుబట్టి పరిశోధకు లూహించిరి. సూలూరుపేట, గూడూరు, వేంకటగిరి తాలూకాలలోఁ దమిళశాసనములే మిక్కిలి యధికము. తెనుఁగుశాసనము లల్పసంఖ్యాకములు, నూత్నములు.* అట్లే కడప, కర్నూలు మండలములలోను తెనుఁగు ప్రాచీనశాసనములు లభించును. కాఁబట్టి యీ ప్రదేశమంతయును దెనుఁగునా డనక తప్పదు. తెనుఁగుదేశమునకు దక్షిణపు సరిహద్దు కాళహస్తిశిఖర మని మున్ను చెప్పిన శాసనములోఁ గలదు. తమిళసారస్వతములో నెల్ల మిక్కిలి ప్రాచీనమైన (క్రీ. శ. ప్రథమశతాబ్దము) తొల్‌కాప్పియమునఁ దమిళభాష కుత్తరపుటెల్ల వెంకటగిరి, అనఁగా దిరుపతి యని తెల్పిన వాక్యమును ముందే యుదాహరించితిని. తిరుపతికిని, గాళహస్తికిని సుమా రిరువది మైళ్ళదూరము. విష్ణుక్షేత్ర మొకటి, శివక్షేత్ర మొకటి. క్రీ. శ. ఆరంభమునసే తెనుఁగుదేశమునకు దక్షిణపుటెల్లయును, దమిళమున కుత్తరపుటెల్లయును వెంకటగిరియే. శ్రీశైల మొక యెల్ల యని మీదిశాసనమువలననేకాక తఱువాతి లక్షణగ్రంథము లన్నింటియందును బేర్కొనఁబడుట ముందే తెలిపితిని. విద్యానాథుని ప్రతాపరుద్రీయము, పెద్దన కావ్యాలంకారచూడామణి, అప్పకవీయము అను మూఁటిలోను శ్రీశైలమునుగూర్చిమాత్ర మొక్కరీతినే వ్రాయఁబడెను. దీనిని బట్టి నిర్ణయింపదగిన దేమనఁగా శ్రీశైల మాంధ్రదేశస్థమును, చాల ప్రఖ్యాతమును ననుటయే. అనంతపురము, బళ్ళారి మండలములలోను దెనుఁగుశాసనములు చాల కాలమునుండి లభించుచున్నవి.

## 2. నృపతుంగుని కాలమున తెనుఁగు కన్నడముల విభాగము

కర్ణాటభాష వాడు దేశమునుగుఱించి తద్భాషలోని ప్రాచీనమైన "కవిరాజమార్గమున" (క్రీ. శ. 814—877) నీ రీతిని జెప్పబడియె. కావేరినుండి గోదావరి వఱకును ఉన్నచోట్లలోని కన్నడమునందును కిసువొళలు, కోపణ నగరము, పులిగెరె, ఒంకొంద అను నాల్గుపురములకు నడిమిదేశములోని కన్నడమే కన్నడము

* నెల్లూరుమండలశాసనములు—వేణుగోపాలచెట్టి—వా.1. ఉపో. viii పు. వి. వెంకయ్యగారి ఎపిగ్రాఫికల్ రిపోర్టు 1903—1904. పుట 7.

యొక్క 'తిరుళు' అనఁగా సారము.[3] ఈ యర్థమునుబట్టి యోచించినఁ గన్నడభాష గోదావరినుండి కావేరివఱకును బ్రచారములో నున్న ట్లెంచవలయునుగదా! కావేరినుండి గోదావరి యనగానే రాజమహేంద్రవరమువఱకును "గన్నడనాడే"యని నృపతుంగు డుద్దేశించెనని మనవారు కొందఱు భ్రాంతిపడినట్లు కొన్ని వ్రాతలను బట్టి యూహ్యాము. ఈ ప్రదేశమున నున్న భాష యగు తెనుఁగునకే కన్నడ మను పే రుండెనని కొందఱు. ఈ పద్యముమాత్ర మూఁతగా గొని తెనుఁగు కన్నడము లొకేభాష యని మరికొందఱు భ్రమపడినట్లు తోచెడిని. ఈ రెండు నొకప్పు డొక్క భాషగా నుండవచ్చునుగాని, నృపతుంగుని కాలమునమాత్రము గాదు. (814 మొదలు 877 క్రీ. శ.) ఆ కాలమునకు నధికారములో నున్న తెనుఁగుచోడులు వేయించిన సంపూర్ణాంధ్ర శాసనములు పెక్కులు కడపమండలములోను, తత్సమీపముననను లభించి యున్నవి. ఆ కాలమున కనేకవిధముల నాంధ్రభాష గుంటూరు, కృష్ణా, గోదావరి మండలములఁ బాతుకొనియుండెనని చెప్పక తప్పదు. కావేరీనది, పడమటికనుమ లలో కొడగుదేశమునఁ బుట్టి, మైసూరునఁ బ్రవహించి, సేలము, కోయంబత్తూరు జిల్లాలకు సరిహద్దుగాఁ బారి, తిరుచ్చిరాపల్లి జిల్లా దాటి, తంజావూరుజిల్లాలో డెల్టాగా నేర్పడి, నాగపురము దాపున బహుముఖములుగా సముద్రము చేరును. గోదావరినది మహారాష్ట్రములోని నాసికాత్ర్యంబకమునొద్ద బయల్వెడలి, యాంధ్రరాష్ట్రములో ప్రవహించి, రాజమహేంద్రవరము పైఁబడి గోదావరి డెల్టాగా నున్నచోటఁ బాయలై సంద్రము చేరును. గోదావరీ, కావేరీ ముఖద్వారములకుఁ గల దూరము సుమారు 550 మైళ్లు. ఈ కొలత పొడుగు, సుమారీ కొలతకంటె మిక్కిలి వెడల్పు గలిగిన భూభాగమంతయు ఈ రెండునదుల నడుమ కలదు. ఈ దేశమంతయును గన్నడ భాష మాటాడుచుండిన దేశమని నృపతుంగుఁడు తలంచెననిగాని, వ్రాక్రుచ్చెననిగాని భావించుట యుక్తిదూరము. బంగాళాఖాత తీరదేశమయిన పై భాగమున నెన్నడును గన్నడము వాడఁబడినట్లు నిదర్శనములు లేవు. ఈ భాగ మంతటిలో దక్షిణపు దేశమున దమిళమును, నుత్తరమున దెలుఁగును నెలకొనిన భాషలు. వేంకటగిరియే యీ రెండుభాషలకును సరిహద్దని ప్రాచీనుల ప్రమాణము పేర్కొంటిని. ఈ సాగర ప్రాంతములందుఁ దెనుఁగు తమిళ శాసనములు నృపతుంగుని కాలమునకు (805 క్రీ. శ.) ముందటివి తఱుచుగా లభించెను.

అట్లయిన నృపతుంగుని పద్యమున కర్థమేమి యని ప్రశ్నింపవచ్చును. ఒక చోటఁ గావేరితోడను, గోదావరితో వేఱొక్కటను గన్నడనాడు సంబంధించినదని భావమేగాని మొదలంటఁ గడముట్ట రెండునదులకు నడుమఁ గన్నడమే వాడఁబడిన దనుట గాదు. ఇదియే యిప్పటి కన్నడము వాడు దేశమునకు సరిపడును. పూర్వకాల

[3] కావేరియిందమాగో। దావరి వఱమిర్ద నాడదా కన్నడదొళ్। భావిసిద జనపదం వసు। ధావలయవిలీనవిశదవిషయవిశేషం॥ అదరొళగం కిసువొళలా। విదితమహాకోపణనగరదా పులిగెరెయా। సదభిస్తుత మప్పొంకుం। దద నడువణ నాడె నాడె కన్నడద తిరుళ్॥ 'కవిరాజమార్గము'

మునను నిది కన్నడప్రదేశ మనుట నిర్వివాదము. ఈ ప్రదేశ ముత్తరమున గోదావరి తోను దక్షిణమునఁ గావేరితోను సంబంధించిన దనుట సత్యమే. ఇవి యుత్తరదక్షిణ సీమలు. తూర్పు పడమరల సీమలను నృపతుంగుఁడు చెప్పలేదు. ఉద్దేశింపనులేదు. దీర్ఘముగానున్న యీ దేశము వెడల్పు 200 మైళ్లు. కావున నృపతుంగుని మాటనుబట్టి తెనుఁగు కన్నడము లొకేభాషగా నున్నవనిగాని రాజమంద్రివఱకుఁ గన్నడమే వాఁడబడినదనిగాని యూహించుట పొరపాటు.

ఇంతేగాక తిరుళుగన్నడ మనగా సారభూతమైన కన్నడము నాడుచోట్ల నాతడు పేర్కొనియున్నాఁడు. ఆ పురములు నాల్గు. నేవియో యెచ్చట నున్నవియో పరిశీలించిన మనకు స్పష్టముగా నాకాలపుఁ గన్నడభాషావైశాల్యము బోధపడక తప్పదు. కిసువొళలు అను ప్రదేశము మలాపహారీ నదీతీరమున నున్న పట్టదకల్ అను గ్రామము. పులిగెరె ఇది ధార్వాడజిల్లాలో నున్న లక్ష్మేశ్వరమను పట్టణము. ఒంకుంద ఇది బిజాపురపుజిల్లాలో నున్న హుంగుంద యని కొంద రును, బెళగాం ఉత్తర కనరా జిల్లాలలో నెక్కడనో యున్నదని కొందఱు నూహించిరి. కోపణ నగరము ధార్వాడజిల్లాలో ముళ్గుంద దాపున నుండెనని రైస్ దొరగా రూహించిరి. నేఁటి మైసూరురాష్ట్రమున హొసపేటకు సుమారు 30 కిలో మీటరుల దూరమున నున్న కోపల్ నగర మని వేఱొక యభిప్రాయము.[4] వయిరీతిని గుర్తించిన యీ ప్రదేశములు నాల్గును హద్దులుగా గల నృపతుంగుని తిరుళుగన్నడము నేఁటి కన్నడదేశముననే పరస్పరావిదూరములగు పట్టణముల నడుమనే యుండెను గాని మన విమర్శకులు భ్రమించునట్లు పూర్వాపరవార్ధిమధ్యదేశమంతయు వ్యాపింపలేదు.

ఈ నృపతుంగుఁడు తూర్పుచాళుక్యులతో ననేకయుద్ధములు చేసినట్లు తెలియు చున్నది. సుమారు 844 క్రీ. శ. శాసనము వేయించిన పండరంగు[5] (అద్దంకి పండరంగుని శాసనము) ఈ నృపతుంగునితో సమకాలికుఁడే. అప్పటి యద్దంకి శాసనమునుబట్టి చూచినను, ఆంధ్రభాష పద్యమయినట్లును కన్నడముకంటె స్పష్ట ముగా భిన్నముగా నున్నట్లును దెలియును. ఈ నృపతుంగుని రాజధాని నేటి మైసూరురాష్ట్రమున వాడీకి సుమారు 30 కిలోమీటర్ల దూరమున భీమానది సమీప మున మాన్యఖేటనగరము (నేటి మాళ్ఖెడ్) అని తెలియును. పై విచారణనుబట్టి తేలిన దేమనగా ఆంధ్ర కర్ణాట భాష లొకప్పు డేకభాషగా నున్నకాలము చాల ప్రాచీనమనియు, నది నృపతుంగునికాలము గాదనియును, ఆ కాలమునకుఁ బెక్కు శతాబ్దములు ముందే రెండుభాషలును వేర్పడియుండె ననుటయే. తెనుఁగు నేఁడు

---

[4] ఎపి. ఇండికా, వా. IV పుట 59. సలోట్కి స్తంభశాసనము; కర్ణాటభాషా, వ్యాకరణోపన్యాసములు. రఘునాథరావుగారు, పుట 50.

[5] ఎపి. ఇం. వా. XIX, 271—275 పుటలు.

రాయలసీమలో మాటాడుచున్నట్లే పూర్వకాలమందును వాడుకలో నుండె ననుట స్పష్టము.

## 3. తెనుఁగునాటి నేలిన రాజులు

తెనుఁగుదేశమునఁ గాలక్రమమునఁ బ్రచురింపఁబడిన శాసనములలోని భాషను, వాని కాలమును, నవి తెనుఁగుదేశములో నెందెందు ప్రచురింపఁబడినవి యను విషయములు విమర్శింపవలయును. నన్నయకాలమయిన క్రీ. శ. 1020-వ సం. నకుఁ బూర్వము గ్రంథములు లేకుండుటచే నా కాలమునకు ముందున్న భాషను బరిశీలింపవలెనన్న శాసనములే ప్రమాణము. కాఁబట్టి యా శాసనపరీక్షయే యాంధ్రభాషా స్వరూపనిరూపణమున కాధారము. ఈ శాసనములు సాధారణముగా రాజులచే దేవాలయాదులయందు వేయింపఁబడియుండును. అందులోఁ గొన్ని కాలమును తెలుపునవి, మఱికొన్నింటఁ గాలము స్పష్టముగా నిర్దేశింపబడదు. లిపినిబట్టియుఁ బేర్కొనఁబడిన రాజులపేళ్లనుబట్టియుఁ గాలము సుమారుగా నిర్ణయింపవలెను. కావున నాంధ్రదేశస్థ శాసనములలోని భాషను విమర్శించుటకుముందు ఈ దేశమున నెచ్చటెచ్చట నే యే రాజులు పాలించిరో సంగ్రహముగాఁ దెలియవలయును.

నన్నయ తన భారతము నంకితముచేసిన విష్ణువర్ధనుఁడు లేక రాజరాజ నరేంద్రుఁడు రాజమహేంద్రవరము రాజధానిగా క్రీ. శ. 1022-1063 సం. వఱకుఁ బాలించెను. అనఁగా దొలుతటినుండి 1022 సం. వఱకుఁ బాలించిన రాజులనుగూర్చి విచారింపవలయును.

### శాతవాహనులు

250—237 క్రీ. పూ. వఱకు నున్న కాలములో నశోకచక్రవర్తి తన ధర్మలిపులను (శాసనములు) హిందూదేశమంతటను వేయించెను. ఇవన్నియు నహింసాధర్మబోధకములు. ఈ శాసనములందు ఆంధ్రులు, చోళ చేర పాండ్య రాజులును స్వతంత్రులుగాఁ బేర్కొనఁబడిరి. ఈ కాలమునుండి (220 క్రీ. పూ.)[3] యాంధ్రరాజులు తమరాజ్యమును స్థాపించి వర్ధిల్లిరి. పురాణములలో నాంధ్రరాజు లని పేర్కొనఁబడి తాము శాతకర్ణిరాజుల మని చెప్పుకొనిన శాతవాహనకులసంభూతులయిన వీరు సుమారు 440 సం. (234 క్రీ. పూ. 207 క్రీ. వె. వఱకు) పాలించిరి. వీరు 30 మంది పురాణములలోఁ బేర్కొనఁబడిరి. వీరిని గాలమునుబట్టి రెండు తెఱఁగులుగా విభజించిరి. మొదటి 17 గురను బ్రాచీనులనియుఁ, దఱువాతివా రర్వాచీనులనియు వ్యవహారము. ఈ 30 మందిలోఁ జాలమంది నామమాత్రము తెలియఁబడిరి. వీరి శాసనాదిచిహ్నములు లభింపలేదు.

[3] H. I. S. I. పుటలు. 8-9.

ఈ యాంధ్రరాజులనుగురించి కొంత ప్రశంస యక్కడక్కడ గలదు. అశోకుని XIII వ ధర్మలిపిలోఁ దన రాజ్యసీమాంతమున నున్నవారుగాఁ బేర్కొనఁబడిరి. ప్లినీ (77 A. D.) ఆంధ్రరాజ్యమును బ్రశంసించెను. అమరావతీ స్తూపమునకు వీరు సాయముచేసి వృద్ధిపఱచిరని తెలియుచున్నది. వీరు కళింగమునకుఁ బశ్చిమమున బాలించుచుండినట్లు ఖారవేలుని హాతిగుంఫ శాసనములో (క్రీ. పె. 168 సం.) బేర్కొనబడిరి.[7] గుణాఢ్యరచితమగు బృహత్కథను కథాసరిత్సాగర మను పేర సోమదేవసూరి సంస్కృతములో రచియించెను. అందు శాతవాహనరాజుల కథలును గలవు.

ఈ వంశజులలో హాలుడను పదునేడవవాఁడు[8] కూర్చినది 'సత్తసఈ' యను శృంగారరసప్రధానమయిన 'సప్తశతి' యనఁబడు మహారాష్ట్రిప్రాకృతరచిత పద్యకావ్యము. లీలావతి యనఁబడు ప్రాకృతగ్రంథము హాలుని విజయములను బ్రశంసించునది.[9] ఈ రాజులు వేయించిన శాసనములు 24. ఇవన్నియుఁ బ్రాకృత భాషలో నున్నవి. అందు 8 నాసికలోను, 5 కన్హేరిలోను, 3 కార్లాలోను, 4 భిల్సాలోను, 2 నానెఘట్టమునందు, 1 మేకదోనిలోను, 2 అమరావతియందును, 1 కొడవలిలోను లభించినవి.[10] వీరు వేయించిన నాణెము లక్కడక్కడ దొరికినవి. పశ్చిమ హిందూదేశమున 10 నాణెములును, గోదావరిజిల్లాలోని ఎర్రగూడెము తాలూకాలోను, గుడివాడ, అమరావతికి దాపున మఱికొన్నియు, జోగల్తొంబిలోఁ గొన్నియు లభించినవి.[11] పై వానినిబట్టియు దీనికి సంబంధించిన మఱికొన్ని యాధారములఁ బట్టియు నీ రాజులచరిత్రము వ్రాయఁబడినది.

ఈ రాజులు క్రిందికారణములచేఁ బశ్చిమదేశప్రాంతములనుండి తెనుఁగు దేశమందలి అమరావతి (ధన్నకడ) ప్రదేశములకు వచ్చిన ట్లూహింపఁబడినది.

(1) ఆంధ్రు లనువారు వింధ్యపర్వతపరిసరముల నున్నట్లు ఐతరేయ బ్రాహ్మణమునఁ బేర్కొనఁబడుట.

(2) అమరావతీస్తూపములలో లభించిన శాతవాహన శాసనములు సిముక, కణ్హ, సిరిశాతకణి మొదలయిన ప్రాచీనరాజులను బేర్కొనకుండుట.[12]

(3) పైని జెప్పిన సిముక (వంశస్థాపకుఁడు) మొదలగువారికి సంబంధించిన విగ్రహములు, శాసనములును నానెఘట్టము, నాసిక లోనగుచోట్ల లభించుట.

[7] ఇ. ఆ. వా. XLII, 276, 281 పుటలు. [8] H. I. S. I. Dr. Krishnaswamy Iyengar. పుటలు. 324. [9] మానవల్లి రామకృష్ణ కవి. భారతి. వా. II, భా. I, పుట. 3. [10] E. H. A. C. by Gopalachari. పుటలు 7, 9, 12. [11] E. H. A. C. by Gopalachari. పుటలు 5-10. [12] ఎపి. ఇం. వా. XV నెం. 1-44 శాసనములు.

(4) శాతవాహనరాజులకుఁ బూర్వుఁడయిన కుభీరకో (కుభీరకుఁడు) అను నొక రాజుయొక్క వంశము తెనుఁగునాటిని బాలించుచున్నట్లూహించుట కాధారము గల్గుట.[13]

(5) గోతమీబాలసిరి నాసిక శాసనమునఁ బ్రాచీనశాతవాహనుల రాజ్యము లన్నియుఁ బేర్కొనఁబడెను. అందు ధన్నకడ లోనగునవి పేర్కొనకుండుట.

(6) పై శాసనములలో నత్యధికములు పశ్చిమభాగముననే లభించుట.

(7) గాథలును, ముందుచెప్పిన గ్రంథములును శాతవాహనుల ముఖ్యపట్టణమును బ్రతిష్ఠానగరముగాఁ బేర్కొనుట.

(8) ఖారవేలుని హాతిగుంఫ శాసనమున శాతవాహనులు కళింగదేశమునకుఁ బడమట నుండిరనుట.[14]

(9) మూఁడవరాజైన శ్రీ శాతకర్ణి భార్యయయిన నాయనికా 'మహారఠత్రనకాయిరో' (అంగీయ వంశజుఁడు) అనువాని కొమార్తె. ఈ మహారథులు పశ్చిమదేశపు శాసనములఁ బేర్కొనఁబడిన యుద్యోగులు.

(10) పశ్చిమ హిందూస్థానమందు లభించిన నాణెములపైఁ బ్రాచీన రాజుల ముద్ర లుండుట. వానిపయి మాళవ, ఉజ్జయిని ప్రదేశములకును సంబంధించిన చిహ్నములే యుండుట.

ఇంక ననేకములయిన యితరకారణములచేతను ఈ రాజులు తొలుదొల్తఁ బ్రతిష్ఠానవాసులయి యాతరువాత దమరాజ్యమును గాలక్రమమునఁ బెంచుకొని తెనుఁగునాట నున్న ధన్నకడమును పాలకస్థానముగా నంగీకరించుట స్పష్టము. ఈ రాజుల శాసనములన్నియుఁ బ్రాకృతములోనే యున్నవి.

ఈ రాజులలోఁ దుదివాఁడయిన పులుమావి III శాసనము మేకదోనియొద్ద లభించినది. ఈతనితోనే వంశ మస్తమించినది. వీరి సామ్రాజ్యము దక్షిణదిక్కున తూర్పుతీరమునందలి కడలూరు మొదలు బనవాసి వఱకును, ఉత్తరమునఁ గళింగదేశమునందలి దక్షిణభాగమునుండి నర్మదానది నంతటిని జేర్చుకొని విదిశ, ఉజ్జయిని, గుజరాతు మొదలగు ప్రదేశముల నన్నిటిని గలుపుకొనిన దేశము.

## శాతవాహనుల తరువాతి రాజులు

ఈ విశాల సామ్రాజ్యము చిన్నభాగములుగాఁ జీలి వీరితరువాత భిన్న వంశస్థుల యేల్బడిలోనికి వచ్చినది. అట్టివారిలో నిక్ష్వాకు లొకరు. వీరు ప్రాకృత శాసనములే వేసిరి. వీరివి కృష్ణాజిల్లాలోని నందిగామ తాలూకాలో నున్న

[13] ఎపి. ఇం. వా. II పుట 32.

[14] E. H. A. C. Pages 5-10. ఇ. ఆ. వా. XLII, 276, 281, పుటలు.

జగ్గయ్యపేటలోను, గుంటూరు జిల్లాలోని నాగార్జునకొండయందును లభించినవి.[15] వీ రాంధ్రుల యొద్ద మహాతలవరులు, మహాసేనాపతులుగా నుండి స్వతంత్రులయినట్లు తోచెడిని. ఆంధ్రరాజుల పద్ధతుల ననుసరించియే మాతృగోత్రనామములను ధరించియున్నారు. శాతవాహనసామ్రాజ్యములోని తూర్పుభాగము ఇక్ష్వాకుల చేతc బడినట్లు తోచును. పురాణములc బేర్కొనిన శ్రీపర్వతీయులును వీరే యని తోచును. పౌరాణికముగా నేడ్వురయినను శాసనముల మూలమున వీరు ముప్వురుగానే గన్పట్టుదురు.[16] వీరు పాలించినకాలము 50 సం. లు. 225 - 275. వీరి రాజధాని విజయపురి యని తేలుచున్నది. ధర్మామృత మను కన్నడ గ్రంథము ననుసరించి అంగదేశమునుండి ఇక్ష్వాకు యశోధరుc డను నొక రాజు వేగినాట నొక రాజ్యము స్థాపించుకొని ప్రతిపాలపురమును నిర్మించుకొనెనని తెలియుచున్నది. ఈ పురమే భట్టిప్రోలని సోమశేఖరశర్మగారు నిరూపించియున్నారు.[17]

బృహత్పలాయనగోత్రజాతులయిన రాజులు కొందఱు తెనుంగుదేశమును బాలించినట్లు తెలియుచున్నది. ఈ గోత్రమునకుc జెందిన రాజయిన జయవమ్మ (జయవర్మ) తామ్రశాసన మొక్కటిమాత్రమే లభించినది.[18] ఈ శాసనము కాలము నిర్ణయించుటకు నిశ్చితాధారములు లేవు. ఇది సుమారు 3-వ శతాబ్దము తుదిదై యుండవచ్చును. ఈ రాజు కృష్ణానదికి దక్షిణభాగమును పాలించియుండవచ్చును. ఈ రాజధానినిగూర్చి భిన్నమతములు గలవు. విజయ ఖందావారమయిన కూదూరనగరమునుండి ఈ శాసనము జారీచేయcబడినది. ఈ ప్రదేశము నేcటి మచిలీపట్టణము తాలూకాకుc జేరినదని యూహించుచున్నారు. ఇదియుc బ్రాకృతమే.[19]

వీరి తరువాతివారు శాలంకాయనులు. వీరే వైంగేయకులనియు వ్యవహరింపcబడుదురు. ఈ వంశములోనివాcడు సముద్రగుప్తునిచే నోడింపబడినట్లు అలహాబాదు స్తంభశాసనమునc బేర్కొనcబడినది.[20] ఈ వంశపురుషు లార్గురు క్రీ. వె. 320 - 470 వఱకుc బాలించినట్లు గణింపcబడినది. ఏలూరు సమీపమున నున్న పెద్దవేగి యను గ్రామమే వీరి రాజధాని.[21] ఇదియే వేంగీపురము. కుద్రాహారము వీరి పాలనములోనిదే. బృహత్పలాయన జయవర్మ శాసనములోని కుదూరహారము దీనితో నభిన్నమని యూహింపcబడినది. ఈ శాలంకాయన వంశజులు గుంటూరు, నర్సారావుపేట తాలూకాలలోని ప్రదేశములను బల్లవుల

[15]ఇ. ఆ. వా. XI పుట 257. ఎపి. ఇం. XX పుట 1—26. [16]*Succesors of the Satavahanas* by Sircar. Pages 1-39. (S O S). [17]E. H. A. C. Pages 129, 150—162. [18]ఎపి. ఇండికా. వా. VI. పుట 316. [19]ఎపి. ఇండికా. వా. VI P. 316. [20]*Corpus Inscriptionum Indicarum* Vol. III, No. 1. [21]ఎపి. ఇ. వా. IX. పుట 58.

నుండి యాక్రమించిన ట్లూహింపవచ్చును.[22] వీరిలోఁ గొందఱు పరమమాహేశ్వరులును, గొందఱు పరమభాగవతులు నని వారి శాసనములవలననే తెలియుచున్నది. వీరి శాసనము లయిదు లభించినవి.

(1) పెలూరు శాసనము. భాష ప్రాకృతము. ఎపి ఇం. వా. 9 పుట 56.
(2) కొల్లేరు శాసనము. ఇం. ఆ. వా. 5 పుట 175.
(3) పెదవేగి శాసనము. ,, ఇం. ఆ. వా. 1 పుట 92.
(4) కంతేరు శాసనము. ,, ఆంధ్ర హిస్టారికల్ రిసెర్చి సొసైటీ వా. V. పుట 26.
(5) ,, ,, ఆంధ్ర సాహిత్యపరిషత్తు వా. XI.

కందర నృపతికులసముద్భూతులైన ఆనందసగోత్ర రాజులు గుంటూరు మండలమున బాలించినట్లు వారి 2 తామ్రశాసనములవలనఁ దెలియుచున్నది. వీనినే గోరంట్ల[23] మట్టిపాడు[24] శాసనము లందురు. ఈ రెంటిలో నొకటి పూర్తి సంస్కృతము. రెండవది సగము సంస్కృతము, సగము ప్రాకృతము. వీరు నాల్గవ శతాబ్దము నడిమిభాగమున (350 A. D.) నుండిన ట్లూహింపవచ్చును.

గుంటూరిసీమలోని ధన్నకడనుండి యువమహారాజయిన శివస్కంధవర్మ దాన మానతిచ్చినట్లు ముందే పేర్కొంటిని.[25] దీనినిబట్టి పల్లవు లీ ప్రదేశమున అనగా కృష్ణకు దక్షిణమున నీ దేశము పాలించినట్లు తెలియుచున్నది.[26] మయిదవోలు శాసనము[27] హీరహడగళ్లి శాసనము[28] బ్రిటిషు మ్యూజియము శాసనము అను మూఁడు శాసనములు వీరి కాలమునందలివి గలవు. ఈ మూఁడును ప్రాకృతశాసనములే. ఈ శాసనముల కాలనిర్ణయ మిదమిత్థ మనరాదు. క్రీ. వె. 275 గాని 375 గాని యయి యుండవచ్చునని భిన్నాభిప్రాయములు.[29] ఈ పల్లవులు కృష్ణానదిని దాటిరని చెప్పుట కాధారములు లేవు. వీరి సంస్కృత, ప్రాకృత శాసనములు గుంటూరు, నెల్లూరు, బళ్లారి జిల్లాలలో లభించినవి. అనఁగాఁ గృష్ణకు దక్షిణముననే. వైంగేయకులయిన శాలంకాయనులు ప్రాయశః వీరిని జయించి పేరుపడ్డవారుగాబోలు.[30]

విష్ణుకుండిను లను రాజులుగూడ తెనుఁగునాటిని బాలించినట్లు శాసనములు గలవు. వీ రేడ్వురని కలదు. వీరి యధికారము సుమారు క్రీ. శ. 500 తో నారంభించి 670 వఱకును నుండిన ట్లూహించిరి. వీ రనేకాశ్వమేధాదులు చేసినవారు గావున వేదమతానుయాయులని[31] చెప్పనగును. వీరి శాసనము లయిదు. చిక్కుల్ల

[22] E. H. A. C. Page 167 ; 162-184. [23] ఇం. ఆ. వా. IX పుట 102.
[24] ఎపి. ఇం. వా. XVII పుట 328. [25] S. O. S. Page 56. [26] ఎపి. ఇం. వా. VI పుట 84. [27] ఎపి. ఇం. వా. I పుట 2. [28] ఎపి. ఇం. వా. VIII పుట 143.
[29] S. O. S. Page 150. [30] E. H. A. C. Page 167. [31] S. O. S. Page 112.

శాసనము[32] రామతీర్థ శాసనము[33] ఇపూరు శాసనములు రెండు[34] పొలమూరు శాసనము.[35] ఈ వంశమువారు శాలంకాయనులతర్వాత వారిరాజ్య మాక్రమించిరి. వీరి శాసనములు సంస్కృతములో నున్నవి.

వీరి పిమ్మటనే తూర్పుచాళుక్యులు ఆంధ్రదేశమును బాలించిరి. మొదటి వాఁడు కుబ్జవిష్ణువర్ధనుఁడు (615-633). ఈయనకు 27-వ పురుషుఁడయిన రాజ రాజనరేంద్రు డనెడు రాజరాజు 1022-వ సం. లోఁ బట్టాభిషిక్తుఁడయి రాజమంద్రి రాజధానిగా నాంధ్రదేశమును 41 సంవత్సరములు పాలించి నన్నయచే నాంధ్ర భారతమును రచియింపఁజేసి కృతినందెను. ఈనాఁటినుండియే తెనుఁగుభాష కొక స్థితియుఁ, బ్రాముఖ్యమును గలిగెను. ఈ రాజు లనేకశాసనములను వేయించిరి. ఇవి చాలవఱకు సంస్కృతములో గలవు. కాని వానిలోఁ దెనుఁగుపదములగు గ్రామనామములును, సరిహద్దులును గన్పట్టును. పూర్వముకంటె వీరి కాలము తెనుఁగుభాష యభివృద్ధి కధికాస్పదమయ్యె ననుట సత్యము. ఈ వంశజుఁడగు రాజరాజే మొదట తెనుఁగు గ్రంథమును వ్రాయించెను. చాళుక్యులనుగూర్చియు, వా రాంధ్రమునకుఁ జేసిన సేవనుగూర్చియు క్రీ. శ. 12 వ శతాబ్దమున (సం. 1150) నుండిన నన్నెచోడుఁడు తన కుమారసంభవమున నిట్లు ప్రశంసించెను.

కం. మును మార్గకవిత లోకం । బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెలుం
గు నిలిపి రంధ్రవిషయమున । జన సత్యాశ్రయుని దొట్టి చాళుక్యనృపుల్.

ఈ పద్యమునందలి సత్యాశ్రయుఁ డెవ్వఁడో నిర్ణయింప వీలుగాదు. నన్నయను బోషించిన రాజరాజనరేంద్రుఁడే యీతఁ డని యొకమతము. అట్లయిన నీతఁడు నన్నయ నేలపేర్కొనలేదని మఱియొక సంశయము. ప్రకృత మా విషయ మటుంచి 'యాంధ్రవిషయమున' ననఁగా నాంధ్రదేశమునఁ దెనుఁగుభాషను బోషించినవారు చాళుక్యు లనుట యీ కవి యభిప్రాయమని గ్రహింపనగును. పైని జెప్పిన సంస్కృత, ప్రాకృత శాసనములకును, దెనుఁగునకును నెంతవఱకు సంబంధ మను విషయము ముందు విమర్శింపఁబడును.

మీద నుదాహరించిన రాజు లందరును దెనుఁగునాటికిఁ గేంద్రస్థానమయిన కృష్ణా, గోదావరీ నదుల దగ్గఱిప్రదేశమందుఁ బాలించినవారేగాని వేఱుగాదు. రేనాండు 7000 గ్రామము లను పేరితో నేఁటి కడప, కర్నూలు జిల్లాలయందును నెల్లూరు జిల్లాలోను చోళమహారాజులు పరిపాలించినట్లు కడప జిల్లాలోని మాలెపాడు తామ్రశాసనములనుబట్టి తెలియుచున్నది.[36] ఇందుఁ బేర్కొనఁబడిన రాజగు పుణ్యకుమారుఁడు సుమారు 7-వ శతాబ్దమువాఁ డని యూహింపఁబడినది.

[32] ఎపి ఇం. వా. IV పుట 193. [33] ఎపి. ఇం. వా. XII పుట 133. [34] ఎపి. ఇం. వా. XVII పుట 334. [35] ఆంధ్ర హిస్టారికలు రిసెర్చి సొసైటీ జర్నలు. వా. VI, పుట 17.
[36] H. I. S. I. Page 354 ( Dr. S.K.I. )

ఈ రాజుల శాసనములు పూర్తిగా తెలుఁగువే. ఇవి కడప, చిత్తూరు, అనంతపురము మండలములకుఁ జెందినవి. ఈ చోట్ల లభించిన యనేకాంధ్ర శాసనములు ప్రచురింప బడలేదు. వాని లేఖనము లన్నియు మద్రాసుప్రభుత్వమువారి పరిశోధనాల యమున లభించును. వైదుంబమహారాజుల శాసనములు చిత్తూరు మండలమున లభించినవి.[37] ఇవి పూర్ణముగా నున్న తెలుఁగుశాసనములు. వారు 9-వ శతాబ్దమున నీ మండలమునఁ బాలించిన ట్లూహించిరి. వీరి తెలుఁగు శాసనములలో "సొరెమడి యుద్ధము" చాలసార్లు పేర్కొనఁబడినది. ఆ యుద్ధమున మరణించిన వారి జ్ఞాపకచిహ్నముగాఁ బాతిన ఱాలపై నున్న శాసనములు తెనుఁగున నున్నవి. సొరెమడి యుద్ధము 878 సం. క్రీ. వె. అని లెక్కవేయబడినది.[38]

## 4. తెనుఁగు వాడుచుండిన ప్రదేశము

రాజమహేంద్రవరమున కుత్తరమున మహేంద్రగిరివఱకు నున్న ప్రదేశమునఁ బ్రాచీనకాలమున నేభాష యుండెను ? ఆ ప్రదేశము కొంతకాలము విష్ణుకుండినుల యధికారమున నుండెను. తూర్పుచాళుక్యులు నీ భాగమును బాలించిరి. తూర్పు గాంగవంశజుల శాసనములు నిచ్చోట లభించుచున్నవి. ఇచ్చట లభించిన శాసనము లన్నియు సాధారణముగా సంస్కృతములోనే గలవు. పది, పదునొకండు శతాబ్దములనుండియు విచ్చలవిడిగాఁ బెక్కు తెనుఁగుశాసనములు లభించుచున్నవి. అరసవల్లి, దీర్ఘాసి, శ్రీకూర్మము, ముఖలింగము, మహేంద్రగిరి మొదలగు క్షేత్రములం దనేకములు లభించుచున్నవి. క్రీ. శ. 1000 నుండి పయిచోట్ల వేయింపఁబడిన తెనుఁగు శాసనములన్నియు దక్షిణదేశశాసనముల వా. V లో నెం. 1005—1352 వఱకును గలవు. నేఁటి బస్తరు సమీపమునను దెనుఁగుశాసనములు లభించినవి.

నేఁటి తెనుఁగుదేశమున నే యే వంశపు రాజు లెపుడెపుడు పాలించిరో దిఙ్మాత్రముగా నుదాహరింపబడియెను. నన్నయ్యకు ముందు, శాసనములే భాషా స్వరూపమును నిరూపించుట కాధారము గావునను, అట్టి శాసనములు వేయించిన రాజవంశజుల నామాదికము నెఱింగినఁగాని కాలనిర్ణయమున కనువుపడదు గావునను నియ్యది యావశ్యకమైనది. ఇంకొకవిషయ మేమనఁగా నేఁడు తెనుఁ గనఁబడు భూభాగమున నన్నియెడలను దెనుఁగు 8, 9 శతాబ్దములనుండి వాడుకలో నున్నట్లు నిశ్చయించుటకు ప్రబలప్రమాణములు శాసనములవలన లభించుచున్నవి. శాసన

[37] ఎపి. డిపా. నెం. 384, 400, 403, 405, 408—(కడపజిల్లా) 1904 సంవత్సరము. చిత్తూరు డిటో నెం. 287 సం. 1905. నెం. 518 సం. 1906.

[38] H. I. S. I. Page 397 (Dr. S.K.I.) ఎపి. డిపా. శాస. నెం. 296, 308, 309, 310, 322. సంవత్సరము 1922.

ములు దొరకినమాత్రమున నచ్చట నా కాలమున దెనుఁగు వ్యవహరింపబడుచుండె ననుట నిశ్చయమా యని యడుగవచ్చును. ఏరాజయినను దెనుఁగువాడు దండెత్తి పయిదేశమునకుఁ బోయి, యనగా నుత్తరహిందూస్థానమువంటి దేశభాగమున నితరభాష ప్రచారమున నున్నచోట దెనుఁగుశాసనములు వేయించినచో నచ్చటఁ దెనుగుభాష వాడుకభాష యనజాలముగదా యని యడుగవచ్చును. కాని నేఁటి తెనుఁగునాటికిఁ బ్రాచీనపుటెల్లలు ప్రాచీనప్రమాణములతో నిరూపించితిని. దొరకి నంతటికాలమునుండియు ధారావాహికముగా శాసనములు లభించుచున్నవని యన్నిభాగములనుండియు నుదాహరించితిని. ఆచోటనంతయు మన మెఱిగి నంతవఱకుఁ దెనుఁగుకంటె నితరభాష (సంస్కృత ప్రాకృతములు దప్ప) వాడినట్లు నిదర్శనములు లేనేలేవు. కాఁబట్టి నేఁటి తెనుఁగుదేశమున కేవి ఎల్లలోఁ బూర్వము నుండియు నవియే యెల్లలనియు నందు తెలుఁగే వాడుచుండిరనియు, సిద్ధాంతము ఏర్పడుచున్నది.

# తెనుఁగు ప్రాచీనతకు శాసనప్రమాణము

## 1. తెనుఁగునాట ప్రాకృతవ్యవహారము

తెనుఁగుదేశమున శాతవాహనుల పరిపాలనాకాలమునుండి తూర్పుచాళుక్యుల పాలనమువఱకు అనగా సుమారు (క్రీ. పూ. 220 మొదలు క్రీ. వె. 615 వఱకు) 830 సం.లు వాడుకలో నుండిన భాష యేది? దాని స్వరూప మేమి? ఆ భాషకును నేఁటి యాంధ్రమునకును నెట్టిసంబంధ మున్నది? అను ప్రశ్నములకు నా యా కాలముల నున్న శాసనములనుండి ప్రమాణములతో సమాధాన మిచ్చుట యీ ప్రకరణ ప్రయోజనము.

వాడుక లేక వ్యవహారము అను పదమునకు నర్థము నిర్వచింపవలయును. అనుదినము క్రయవిక్రయములకు సామాన్యజనులును, విద్యావిహీనులును, విద్యాధికులును వాడుట వాడుక. పండితులు శాస్త్రార్థచర్చచేయుటయు, వైజ్ఞానికచర్చలను జరుపుటయు నొక వాడుకయే. రాజాస్థాన, న్యాయసభలయందు జరుగు ప్రసంగములయందును భాష వాడుచునేయుందురు. గ్రంథరచనకు బండితులు భాషను వాడుదురు. వీని నన్నిటిని వాడుకగానే గ్రహింపవలసినది. నేఁటి యీ యాంధ్రదేశమున నీ యీ భిన్నవ్యవహారములలో నే యే భాష లెట్లెట్లు భిన్నములుగా వాడుచున్నారో మన కనుభవదూరము కాదు. మఱియు నొక్కటే యగు తెనుఁగున నెన్ని యంతరువులు గలవో చూచుచున్నాము. అట్లే ముందుచెప్పిన 830 సం. లందును వేఱు వేఱు వాడుకల కే యే భాషలు ఎట్లెట్లుపకరించుచుండెననియు, నందుఁ దెనుఁగున కెట్టి స్థానమనియు మనము తెలిసికొనవలయును. అశోకునికిఁ బూర్వ మెవ్వ రీ రాజ్యమును బాలించిరో తెలియదు. కాని యాతనిపిమ్మట బాలించిన యాంధ్రరాజులు వింధ్యపరిసరములనుండి వచ్చి పైఠాణ నగరము రాజధానిగాను దరువాత నేఁటి యమరావతినుండిన ధన్నకడ యను ప్రదేశము రాజధానిగాఁ దెనుఁగునాటిని బాలించిరని ముందు దెల్పితిని. వారు వేయించిన 24 శాసనములలోను 4 మాత్రమే నేఁటి తెనుఁగునాటిలోనివి. వీని నన్నింట భాష ప్రాకృతమే. జగ్గయ్యపేటలోని యిక్ష్వాకు శాసనములందును ప్రాకృతమే భాష. పల్లవుల శాసనములలోఁ గొన్ని ప్రాకృతములు, మఱికొన్ని సాంస్కృతికములు. జయవర్మశాసనము ప్రాకృతము. శాలంకాయనులవి కొన్ని సంస్కృతమునఁగూడ నున్నవి. విష్ణుకుండినులవి సంస్కృతములోనే గలవు. తుదకు నన్నయ్య వ్రాసిన నందంపూడి,[1] కోరుమిల్లి శాసనములును సంస్కృతములోనే గలవు. దీనినిబట్టి

[1] ఎపి. ఇం. వా. IV పుట 301. ఇ. ఆ. వా. XIV పు. 48-49.

నిర్ణయించుట యేమనఁగా నాంధ్ర దేశమున నతిప్రాచీనకాలమున శాసనాది రాజాజ్ఞపత్రములయందలి భాష ప్రాకృత మనియుఁ దరువాత సంస్కృత మనియుఁగదా !

ఆంధ్రరాజులు రాజ్యవ్యవహారమున కవలంబించినభాష ప్రాకృతము. వీరి సారస్వతమును బ్రాకృతముననే యున్నది. హాలుడు సేకరించిన 'సత్తసఈ' గాథా సప్తశతి యనునది మహారాష్ట్రిప్రాకృతమున నున్నది. వారు నిత్యవ్యవహారములో వాడుచుండినభాష ప్రాకృతమే యని[2] గుణాఢ్యుని బృహత్కథానువాదమయిన సోమదేవసూరియొక్క కథాసరిత్సాగరమునుండి తెలియుచున్నది. శాతవాహన మహారాజొకనాడు తన భార్యలతో జలక్రీడలాడుచుండగా నొకతె యాతనిచేఁ గొట్టబడిన నీటిజల్లులకుఁ దాళఁజాలక రాజుతో "మోదకైస్తాడయ" యని పలికెనట. మోదకైః అనగా మోదకములచే తాడయ కొట్టుము అన్న ట్లర్థముచేసికొని లడ్డువులతో నామెను బ్రహరించుటకు లడ్డువులు దెప్పించెననియు, నది చూచి యామె యతని యజ్ఞతను బరిహసించెననియును గాథ. ఈ సందర్భమునుబట్టి తెలియున దేమన రాజు కేవలము ప్రాకృతము నెఱింగినవాడేగాని సంస్కృతభాషానభిజ్ఞుడనుట యేగదా ! దీనినిబట్టి శాతవాహనుల దైనికవ్యావహారికభాష ప్రాకృతభాష యని నిశ్చయము. వారి శాసనములందును బ్రాకృతమే యున్నది. సంస్కృతము గాని యితర దేశభాష లేవియుఁగాని లేవు. ఇంతకుముందు తెలిపినట్లు వారు వేద మతావలంబులయి యజ్ఞాదులను జేయుచుండినను బౌద్ధులను సంతోషపఱచుటకయి దానములుచేసి జనులసమ్మతిని, మెప్పును బడయుప్రయత్నము చేయుచుండిరి. శాతవాహనుల రాజ్యకాలమున బౌద్ధులు మిక్కిలి ప్రతిష్ఠతోఁ దెనుఁగు దేశమున విరాజిల్లుచుండిరనుట స్పష్టము. ఆంధ్రదేశమున విజయనగరము దగ్గరనున్న రామతీర్థమునుండి దక్షిణమున నెల్లూరువఱకును నెన్నియో బౌద్ధాలయము లుండెడివి. వానిలో నమరావతి, జగ్గయ్యపేట మొదలగు ప్రదేశములలోనివి మిక్కిలి ప్రసిద్ధములు. బౌద్ధవాఙ్మయమంతయును పాళీ యనబడెడు ప్రాకృత భాషలో నుండిన దనుట నిర్వివాదాంశము. వారి మతగ్రంథములన్నియును బాళీలోనే యుండినవి. వారి ప్రచారమంతయు నందే. కావున బ్రాకృతభాషాప్రభావము మఱింత యధికమయ్యెను. తెనుఁగునాట నున్న రాజులు, మతాభిమానులు, మతాధికారులు, బుద్ధిమంతులు, రాజకార్యవ్యాపృతులు, దైనిక సారస్వత రాజ్య వ్యవహారములకుఁ బ్రాకృతమే వాడుచుండిరనుట పయి యుదాహరణములనుండి స్పష్టము. ఆంధ్రరాజు లంతరించిన తఱువాత వచ్చినవారిలో పల్లవులు సంస్కృతశాసనములను వేయించిరి. కందర విష్ణుకుండిన పూర్వచాళుక్యరాజులకాలములో మఱల సంస్కృతమును, వైదికమతమును నభివృద్ధిచెంది కాలక్రమమున బౌద్ధమతమును,

[2] శ్రూయతే చ కుంతలేషు శాతవాహనో నామ రాజా। తేన ప్రాకృత భాషాత్మకమంతః పుర ఏవేతి సమానం పూర్వేణ. (రాజశేఖరుని కావ్యమీమాంస)

ప్రాకృతమును పూర్తిగా నశించిపోయినవి. వైదికమతమునకుఁ బ్రాముఖ్యము కలిగి ప్రాకృతము నశింపగాఁ దలయెత్తిన సంస్కృతముతో దేశభాషయుఁ బ్రాచుర్యము నందినది. ప్రాకృతముకంటె సంస్కృతమునకుఁ గల నిత్యవ్యవహార నిరుపయోగత దేశభాషకు మఱింత యవకాశము గలిగించినది. వైదికమతానుయాయులును, బౌద్ధమతమునకుఁ బ్రధానమయిన ప్రాకృతమును దొలఁగఁగొట్టుటకు దేశభాషనే యెక్కువగా వాడుచుండిరని యూహింపవచ్చును.

సంస్కృత ప్రాకృతము లుండిన వనుటకు శాసనములును, గ్రంథములును బ్రమాణములుగదా! ఈ రెండునుగాక దేశభాష యున్న దనుట కేమి ప్రమాణ మున్నదని ప్రశ్నింపక తప్పదు. సంస్కృత ప్రాకృతములకంటె భిన్నమయిన దేశభాషయగు తెనుఁగు ఆంధ్రాది ప్రాచీనరాజుల కాలములో నుండెనో లేదో యనునది నిరూపింపవలసిన విషయముగాని 7, 8 శతాబ్దములలో నవిచ్ఛిన్నముగా దేశమందంతటను లభించిన యాంధ్రశాసనముఁ నుబట్టి యా కాలమునఁ దెనుఁ గుండె ననుటకు నేమాత్రమును సంశయము లేదుగదా! అంతకుఁబూర్వము తెనుఁగుభాష యుండెనా, లేదా? ఉన్నచో దాని రూప మెట్టిది? అది సంస్కృత ప్రాకృతములకంటె భిన్నభాషయా, లేక క్రీ. శ. తొలుతటి భాగమున నుండిన ప్రాకృతముయొక్క కాలక్రమజాతమయిన వికృతిభాషయా? అను నీ ప్రశ్నము లన్నిటికిని సమాధానము రావలయును. వీని కన్నిటికిని నొక్కొక్క ప్రకరణమునఁ గ్రమక్రమముగా సమాధానము తీయబడుచునేయుండును.

కువలయమాలాకథ యను పేరు గల యొక ప్రాకృతకావ్యము విక్రమశకము 835 అనగా క్రీ. శ. 777 వ సం. న వ్రాయఁబడినట్లు చెప్పఁబడినది. అందు దేశభాషలు పదునెనిమిది విధము లనియును, నందు నాంధ్రదేశభాష, కన్నడదేశభాష, తాయిదేశభాష యుదాహరింపఁబడినవనియును దెలియుచున్నది. అందలి యాంధ్రభాషనుగుఱించిన వాక్యములకుఁ తెలుఁగు "అందగత్తెలన్నా అథవా యుద్ధరంగమన్నానూ సమానంగా ప్రేమించేవాళ్లున్నూ, అందమైన శరీరాలు గలవాళ్లున్నూ, తిండిలో దిట్టలున్నూ అయిన ఆంధ్రులు, అటూ, పుటూ, రటూ అనుకుంటూ వస్తూండగా చూచాడు."[3] దీనినిబట్టి యా కాలమునకు దేశభాషలయొక్క స్మరణయు, నాంధ్రభాషయొక్క స్మరణయు నున్నట్లు స్పష్టమే. కాని యీ వాక్యము ప్రకృతము మన యాంధ్రభాషాస్థితిని స్థాపించుటకుఁ బ్రయోజనకారి గాదు. ఏమనగా నా కాలమునకే మనకు నాంధ్రభాషామయములైన శాసనములు లభించినవి గదా! కాఁబట్టి యీ ప్రమాణము స్థితస్థాపకమే. బృహత్కథారచనసందర్భములో నొక వాక్యము శపథరూపముగా గుణాఢ్యునిచేఁ జెప్పఁబడినట్లు కథాసరిత్సాగరములో గలదు. శాతవాహనరాజునకు సంస్కృతవ్యాకరణమంతను నాలు

[3] "ప్రాకృతగ్రంథకర్తలూ, ప్రజాసేవానూ" పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు (గిడుగు రామమూర్తి పంతులుగారి స్మారకవ్యాస సంగ్రహము. పుటలు 189—191)

మాసములలో బోధచేయగలనని శర్వవర్మ శపథముచేసి తన పందెము గెలుచు కొనుటకు ననువయిన వ్యాకరణము వ్రాసెను. ఆ శపథమునకెదురుశపథముగా గుణాఢ్యుఁడు "సంస్కృత ప్రాకృతములు, దేశభాష"[4] ఈ మూఁడిటిని విడిచివేయ గలనని శపథము చేసి చివఱకుఁ దన బృహత్కథను పైశాచీభాషలో వ్రాసెను. బృహత్కథను వ్రాసిన గుణాఢ్యుఁడు ప్రతిష్ఠానపురమునఁ బుట్టినట్లును, హాలుని కాలములో నున్నట్లును క్షేమేంద్రుఁడును, సోమదేవుడును దెలిపిరి.[5] గుణాఢ్యుఁడు హాలుని కాలములో (క్రీ. వె. 78) నుండినవాడు గావున నా కాలములో సంస్కృతము, ప్రాకృతము, దేశభాష యను మూఁడుభాష లుండినట్లు మనము పైశ్లోకమువలన నూహించుటకు వీలుపడుచున్నది. ఈతఁ డుద్దేశించిన దేశభాష ప్రాకృతముకంటె భిన్న మనక తప్పదు. అది యేది? ప్రాకృతజన్యమా? లేక స్వతంత్రమా? అది తెనుఁగు కన్నడములలో దేనినేని నుద్దేశించియుండెనా? యను ప్రశ్నములు లేవ దీయక తప్పదు.

క్రీ. శ. 631 సం. లో హిందూదేశమును దర్శించుటకు హ్యూయాన్‌త్సాంగ్ అను బౌద్ధసన్యాసి వచ్చి హిందూదేశములో ననేక భాగములను సంచరించెను. అతఁడు బౌద్ధమతము క్రమక్రమముగా నశించుచున్నదనియును, వేదమతము వర్ధిల్లుచున్న దనియును వ్రాసెను. కృష్ణానదీసమీపమున నున్న బౌద్ధాలయములను, మఠములను గూర్చి వ్రాయుచు నతఁడు మధ్యహిందూస్థానములో వాడునట్టి భాషకంటె భిన్నమైన భాష నా ప్రదేశమున నున్న జనులు వాడుచుండినట్లు దెలిపియున్నాడు.[6] ఈ కాలమున కప్పుడే తెనుఁగు బాగుగా ప్రచారములో నుండినట్లు మనము శాసనమూలమునఁ దెలిసికొనవచ్చును. కాఁబట్టి యతఁ డుద్దేశించిన భాష తెనుఁగు అనుటలో విప్రతిపత్తి గలుగదుగదా!

గుణాఢ్యుని కథయం దుద్దేశింపఁబడిన భాషాత్రితయవిభాగము ననుస రించి సంస్కృత ప్రాకృత భాషలు దేశమునందలి పామరజన వ్యావహారికభాషలు గా వనునట్లును, దేశభాష వేఱొకటి యున్నట్లును స్పష్టము. ఈ దేశభాష యను నది హిందూదేశమునందలి వివిధభాగముల ననుసరించి వివిధములుగా నుండెనని యూహించుట సమంజసమా, లేక యొక్కటియే దేశభాషయా? యని యడుగ వచ్చును. నేఁటికాలమున భిన్నములయిన భాష లుండినట్లే యక్కాలమున హిందూ దేశములోని భిన్నభాగములలో భిన్నభాష లుండిన ట్లూహించుట సమంజసము.

---

[4] షడ్భిర్మాసై స్త్వయా దేవ, శిక్షితశ్చే త్తతో మయా। సంస్కృతం ప్రాకృతం తద్వ ద్దేశ భాషా చ సర్వథా। భాషాత్రయమిదం త్యక్తం యన్మనుష్యేషు సంభవేత్॥

—కథాసరిత్సాగరము.

[5] *History of Classical Sanskrit Literature* - Mr. Krishnamachariar. P. 417.

[6] Beal's *Buddhistic Records of the Western World* - Vol II. Page 217.

"The language and arrangement of sentences differ from mid India, but with reference to the shapes of the letters they are nearly the same."

ఇవి ఆ యా దేశములకు సంబంధించిన ప్రాకృతభాషలయొక్క యపభ్రంశముల ప్రాచీనస్వరూపము లయి యుండవలయును. గుణాఢ్యుఁడు దేశభాషాశబ్దమును జాత్యేకవచనముగా నుద్దేశించి హిందూదేశములోని యెల్లభాగములయందు వాడుకలో నుండిన భాషలని యుద్దేశించెనా, లేక పైఠాను నగరమున దైనికవ్యవహారములో నుండిన భాష యనియా? ఎట్లయినను నది ప్రాకృత సామాన్యముకంటె భిన్నమే. ఆ కాలమున బైఠాను నగరమునను, తత్సమీపమునను వ్యవహారములో నుండిన భాషకును, నేఁటి కుంతలదేశమునందు (కర్ణాటదేశము) గాని, యాంధ్రదేశమునందుగాని మాటాడు తెనుఁగునకు సంబంధము కలదా, లేక కేవలము ఆర్యభాషోద్భూతమయిన యేదే నొక్క యపభ్రంశమా యనియు సంశయింపక తప్పదు. దీనికి సంబంధించిన విచారము మున్ముందు ప్రాకృతభాషకును దెలుఁగునకుఁ గలుగు సంబంధమును నిరూపించునపుడు వివరింపబడును.

ప్రతిష్ఠాన నగరమని చెప్పఁబడిన పైఠాను నగరము గోదావరీనదియొద్దున నేఁటి మహారాష్ట్రమున అవురంగాబాదు సమీపమున గలదు. నేఁ డా గ్రామమున కేమియును ప్రాముఖ్యము లేదు. అచ్చటనేగాక యా ప్రదేశమునఁ జాలదూరము వరకును వ్యవహారములో నున్న భాష మరాఠీ భాషయే. ఆ ప్రదేశమునఁ దెనుఁగుగాని, కన్నడముగాని యేనాఁడును వ్యవహారములో నున్నట్లు ప్రమాణములు గనుపట్టవు.

## 2. సంస్కృత ప్రాకృత శాసనములలోని తెనుఁగు

తెనుఁగుదేశమునఁ దెనుఁగుశాసనములు లభించుటకు ముం దుండిన రాజుల సంస్కృత ప్రాకృత శాసనములను బరీక్షించి, యం దేమి తెనుఁగుపదములు గలవని మొదట నిర్ణయింపవలయును. గ్రామములకును, మనుష్యులకును గల నామములు దేశమునందు వాడుకలో నుండిన భాషలోనే యుండునుగాని సాధారణముగా నంతకంటె విరుద్ధముగా నుండవుగదా! అందును, దానమిచ్చిన భూములును, గ్రామములును గుర్తుపట్టవలయుననిన సాధారణముగాఁ బామరజనవ్యవహారములో నున్న పే ళ్లుపయోగించిన స్పష్టముగాఁ దెలియునేగాని సంస్కృతీకరించినఁ దెలియుట కష్టముగదా! కాఁబట్టి యా పదములను బరిశీలించిన నవియే నాఁటి తెనుఁగుపదములని మనకు విశదమగును. ఆంగ్లభాషా ప్రాచీనచరిత్రమును బరిశీలించినపుడును నిట్లే ప్రాచీనగ్రామనామములు ప్రాచీనాంగ్లదేశభాషకు (ఆంగ్లోసాగ్జనుభాషకు) సంబంధించినవి గనుపట్టినవి.

నేఁటి తెనుఁగుదేశమునందలి పేళ్లను బరిశీలించి యవి యెట్లున్నవో తెలిసికొని ప్రాచీనకాలమున నుండినవానియందును నిటువంటి భేదములే యుండెనని యూహించుట యుక్తము గావున నేఁడు మన తెనుఁగునాట వాడుచున్న పేళ్ల స్వభావమును దిఙ్మాత్రముగాఁ బరిశీలింతము. శ్రీనివాసరావు, రామచంద్రుఁడు మొదలగునవి విద్యాధికులయందును, నాగరకులయందును బహుళము. ఇవి

సంస్కృత సమములు. పెంటి, పెంటయ్య, పోతి, పోతయ్య, ఎల్లమ్మ, ఎల్లయ్య, పుల్లమ్మ, పుల్లయ్య మొదలగు నచ్చతెనుఁగు పదములును, ఎంకమ్మ, రామక్క, నరసయ్య మొదలగు తెనుఁగుభాషాసంప్రదాయము ననుసరించి మారిన తద్భవ పదములును విద్యావిహీనులయందును, ననాగరకులయందును మిక్కిలిగా గను పట్టుచున్నవి. తాకూరు, సర్కారు, హుజూము మొదలయిన పేళ్లును గ్రామ్యచిత్ర ముగా గలవు. ఇవి యాంగ్లముయొక్కయు, హిందూదేశములోని యితర భాసల యొక్కయు సంపర్కమువలన వచ్చినవి. ఊళ్ళకును నిట్లే పేళ్లు గలవు. రాజ మహేంద్రవరము, విశాఖపట్టణము, విజయవాటిక, ధవళేశ్వరము, మంగళగిరి, సింహాచలము మున్నగు సంస్కృతనామములు కొన్ని గనుపట్టుచున్నవి. మిగిలిన వానికి, తాటిపాఁక, చేంబ్రోలు, వేములపాడు, గుత్తి, అనకాపల్లి, బొబ్బిలి, పలి వెల, ప్రత్తిపాడు, పెణుకుపఱ్ఱు, తెనాలి మొదలయిన యచ్చాంధ్రపదములు వాడుచున్నారు. ఈ పేళ్ళను బరిశీలించినయెడల నేవి సంస్కృతపదములో, యేవి యచ్చాంధ్రపదములో, యేవి తద్భవములో తెలియకపోదు. ఇట్లు ప్రాచీనరాజుల సంస్కృత ప్రాకృత శాసనము లన్నిటిని బరీక్షించి తెనుఁగుపదములగు మనుష్య గ్రామనామములను బృథక్కరింపనగును. వానినిబట్టి యానాఁడు తెలుఁగుండినట్లు మనకుఁ దెల్లము కాఁగలదు. ప్రాచీనుల సంస్కృత ప్రాకృత శాసనము లత్యల్పసంఖ్యా కము లగుటచేత నందు దేశభాషాపదము లంతగా లభింపవు. రానురాను శాసన ములు విరివిగా లభించుచుండిన కాలములలోని సంస్కృతశాసనములలోఁ జాల వఱకు సంస్కృత శ్లోకములతో విషయమంతయును వర్ణించి తుదిని దేయగ్రామము లును క్షేత్రములును దెనుఁగుననే వ్రాయంబడుచుండెను. తెనుఁగునకు గ్రాంథి కత్వము గల్పించిన నన్నయయే నందమపూణ్డి శాసనము సంస్కృతమున వ్రాసి "అస్య సీమానః"[7] అని తెనుఁగున నెల్లలను వ్రాసియున్నాఁడు.

తెనుఁగుపేళ్లయొక్క నిజమయిన స్వభావము మిక్కిలి ప్రాచీనములయిన శాసనములయం దంతగా గోచరింపదుగాని 10, 12 శతాబ్దములలో నతిబహుళ ముగా దొరకిన తెనుఁగుశాసనములను వేనిని బరీక్షించినను స్పష్టముగాఁ దెలియ గలదు. ఉదా :- (దక్షిణ హిందూస్థాన శాసనములు- వాల్యూము IV-పుట 201. శాసనము నెం. 663) గొడవుకామె, దాడెపోజు, కోటనాగ, పల్లెదామ, గోకన సూర, గడియనబూమ, వేమకఎఱియ, కొమ్మఎఱియ, పాదఱబోల్ల, కామకుప్ప, గసడకొమ్మ. ఇది గుంటూరు జిల్లాలోని నరసారావుపేట తాలుకా నాదెండ్ల మూల స్థానదేవర యాలయమునందు కుళోత్తుంగచోడుని (1070-1118 క్రీ. శ.) సామంతునిచే వేయింపఁబడిన శాసనము. ఇవి యన్నియును విద్యాధికులు గానట్టి జనుల పేళ్లు. విద్యాధికులును, యజ్ఞాది పవిత్రీకృతులును సాధారణముగా సంస్కృత భాషానామములనే నేఁటివలెనే సోమయాజి, షడంగవిత్తు మొదలయిన బిరుద

[7] ఎపి. ఇం. వా. IV పుట. 301.

నామములను గూర్చుకొని వాడుచుండిరి. బౌద్ధులు ప్రాకృతనామములను వాడు చున్నట్లు స్పష్టముగా గ్రహింపనగును. ప్రాచీన సంస్కృత ప్రాకృత శాసనములలోఁ గొన్నిటియందలి నామములును, సుమారు కాలమును గ్రింద పట్టికగా నొసంగబడినవి.

| పేరు | సుమారు కాలము | తెనుఁగుపదము |
|---|---|---|
| 1. పుళుమావి - జంగ్లిగుండు శాసనము (శాతవాహన) | క్రీ. శ. 200 | వేపూరు* (శాస. ప్రాకృ.) |
| 2. మయిదవోలు శాసనము - శివస్కంధవర్మ (పల్లవ) | 234 | విరిపఱ (ప్రాకృ.) |
| 3. జయవర్మ - కొండముూడి శాసనము (బృహత్పలాయనుడు) | 235 | పాణ్డూర ; కుడూర |
| 4. హీరహడగల్లి శాసనము- శివస్కంధవర్మ (పల్లవ) | 257 | చిల్లరెక కొండుక కొలివాల (భోజకస) ఆపిట్టి (వదివాన) గొలశర్మ, కొట్టశర్మ, గొల, కొట్ట శబ్దములు తెనుఁగు కావచ్చును. (ప్రాకృ.) |
| 5. చారుదేవి-బ్రిటిష్ మ్యూజియము శాసనము | 260 | కూళి (మహాతారక) అతుక (రైతుపేరు) దాలూర (గ్రామనామము) |
| 6. కోమర్తి శాసనము చండవర్మ | 340 | కొహెతూర |
| 7. గోరంట్ల శాసనము (ఆనందవంశజ-అత్తివర్మ) | 350 | తాంటికొంట (గ్రామే) (సంస్కృత) అంతుకూ్కర (గ్రామశ్చ)కొట్టి(శర్మణే) |
| ఆనందదామోదరవర్మ | | కంగూరు (గ్రామము) |
| మట్టిపాడు శాసనము | ,, | అగ్గిజ, వేణిజ్జ దానప్రతిగ్రహీతలు. |

*శాసనమున 'వేపుర' యని కలదు. 'క' స్వార్థప్రత్యయము. 'వేపురకే' యనునదియే పేరు. ఆదోని తాలూకాలోని వీరాపురముగాని, హడగల్లి తాలూకాలోని వేపార్లగాని కావచ్చునని యూహ. E. H. A. C. Page. 71.

ఇది వేపు+ఊరు=వేపూరు అని తోచుచున్నది. సమీపముననే బేవినహాళు అను గ్రామము కలదు. బేవినహాళు (కన్నడము) అనగాఁ దెనుఁగు వేపపాడు లేక వేపూరు అని యర్థము. [ఇది ప్రాకృతశాసనము.]

| పేరు | సుమారు కాలము | తెనుఁగుపదము |
|---|---|---|
| 8. ఒంగోడు శాసనము-రెండవ విజయస్కంధవర్మ | క్రీ. శ. 385 | విజయతామ్రాప్రస్థానాత్. (ఇది చేబ్రోలనియు, సంస్కృతీకరణమనియుఁ దెలియుచున్నది) ఒంగోడు (గ్రామః) గోల (శర్మణే) |
| 9. శాలంకాయనవిజయదేవవర్మ శాసనము | 388 | వెంగీపురే, పలూరే (ప్రాకృత) ముళుడ (ప్రముఖోగామో) |
| 10. కొల్లేరు శాసనము-శాలంకాయన చండవర్మ | 460 | విదేనూర (పల్లికా) కురవక (అగ్రహారే) (సంస్కృతము) మూలకుర (భోజకాః) |
| 11. పెదవేగిశాసనము-శాలంకాయన నందివర్మ శాలంకాయన స్కంధవర్మ | 500 | వేంగీపుర, ప్రాలూర (సంస్కృతము) అఱుతొఱె, ముణ్ణూర చెంచెఱువ, కంబురాంచెఱువ, మూలకుర, చిన్నపురే (నేటి చిన్నాపురము) |
| 12. రెండవ విక్రమేంద్రవర్మ చిక్కుల్ల శాసనము (సంస్కృతభాషలో తెనుఁగు తత్సమము) | 506 | ఱెందులూర, రావిరేవ (గ్రామ) రేగోష్టమ్ విజయరాజ్య సంవత్సరంబుళ్ |
| 13. ఒంగోడు శాసనము-రెండవ సింహవర్మ | 554 | ఒంగోడు (గ్రామః) కొండికి (గ్రామః) నఱూచేడు (గ్రామః) కడాకుదురు (గ్రామః) పెణుకుపఱ్ఱు (గ్రామః) కుండూరు (వాస్తవ్యాయ) (దేవశర్మణే) |
| 14. విష్ణుకుండినేంద్రవర్మ రామతీర్థము—తామ్రశాసనము | 635 | పఱకి (రాష్ట్రే) పేరువాడ (కగ్రామే) |
| 15. విష్ణుకుండిన తృతీయ మాధవవర్మ ఆంధ్రపరిషచ్ఛాసనము. | 635 | కుండూరు (వాస్తవ్యాయ) పులొంబూర (నామగ్రామ) |

తూర్పుచాళుక్యరాజులు పాలించిన కాలమునకు ముందాంధ్రదేశమును బాలించిన రాజవంశములవారు వేయించిన సంస్కృత ప్రాకృత శాసనములలోని గ్రామనామములు పయిని దిఙ్మాత్రముగా నుదాహరింపఁబడినవి. వీనినిబట్టి యా కాలమున నుండిన గ్రామనామములు నేటి నామములయొక్క యాదిమరూపము లనుట స్పష్టముగదా! దెందులూరు, రావిరేల, పరవాడ, చెంచెఱువు, కంబురాంచెఱువు

మొదలైన యనేకపదములు తెలుఁగుపదములని యంగీకరింపక తప్పదు. ఇవి సంస్కృత ప్రాకృత సమములుగాని, తద్భవములుగాని కావని పరీక్షించినఁ దోపకపోదు. ఆ నాఁటికి దేశమం దంతటను అనగా బళ్లారి మండలమునుండి (కళింగ మనంబడిన) బరంపురమువఱకును నక్కడక్కడ లభించిన శాసనములలోనివి (ఆంధ్రరాజయిన పుళుమావి మొదలుకొని విష్ణుకుండినేంద్రవర్మ వఱకును) అయిన పై పదములను బట్టి తెనుఁగు ప్రచారములోనే యుండెనని యంగీకరింపక తప్పదు. అట్లుగాకున్న నొక్కనాఁడే ఆఱు, ఏడు శతాబ్దములనుండి లభించిన శాసనములనుబట్టి యెఱుంగనైన స్వరూపము గల యాంధ్రభాష దేశమం దంతటను నుద్భూతమయ్యె ననుట యసందర్భముగదా! చిక్కుల్ల శాసనములోని 'సంవత్సరంబుళ్' అను పదము మిక్కిలి వింతయయినది. శాసనమా సంస్కృతములో నున్నది. అందు 'సంవత్సర' శబ్దమునకుఁ బరముగా నున్న బహువచనప్రత్యయము సంస్కృతప్రత్యయ మయిన 'జస్' అనునది గాదు. 'సంవత్సరంబుళ్' అను తత్సమాంధ్రరూపము వాడఁబడినది. ఇది యెట్లు సందర్భించిన దనఁగా నా కాలమున నా దేశమున దైనికవ్యవహారమున నున్న తెలుఁగుభాషనుమాత్రము బాగుగా నెఱింగి శాసనముఁ జెక్కు శిల్పి తనకుఁ బరిచితముగా నున్న తత్సమరూపమునే చెక్కియుండును. ఇది లిపికారుని దోసము గాని శాసనకారుని లోటు గాదని తోచుచున్నది. 'బు', 'శు' మొదలయిన ప్రత్యయములతోఁ గూడిన తత్సమపదములును వాడుకలో నుండె ననుట స్పష్టము.

విద్యార్థికుల నామముల స్వరూపమును, దానప్రతిగ్రహీతలనుబట్టి నిర్ణయింప వచ్చును. దేవశర్మ, రుద్రశర్మ, యజ్ఞశర్మ, భర్తృశర్మ, శివదత్త, షష్ఠికుమార, భవకోటిగోప మొదలయినవి కొన్ని పేళ్లు.[9] ఈ శర్మ మొదలయిన పేళ్ళు సంస్కృతమునుండి వచ్చినవి. గొల – శర్మ; కొట్ట – శర్మ మొదలగు శబ్దముల లోని ప్రథమభాగము తెనుఁగు అని తోచుచున్నది. అట్లే భట్టిప్రోలున దొరకిన బౌద్ధశాసనములయందును గొన్ని తెనుఁగు పేళ్ళు గలవు. కుర, బనవ, పోత.[10] ఇట్టి యల్పసంఖ్యాకములయిన శబ్దములుతప్ప బౌద్ధశాసనములలోని యితరనామము లన్నియును ప్రాకృతములే. 'తొరనసి', 'సమణ', 'కొసక' (కౌసిక), పిగలక (పింగళక), సామక (శ్యామక) మొదలయినవి కొన్ని యుదాహరణములు.

## 3. తెనుఁగు తొల్లిటి యవస్థ

ఇఁక నాఁటి తెనుఁగుభాష యవస్థ యూహింపవచ్చును. ప్రాథమికావస్థలో నాంధ్రరాజుల దైనిక రాజకీయ సారస్వత వ్యవహారములలోఁ బ్రాకృతమునకే ప్రవేశము. వారి పేళ్ళు ప్రాకృతములే. రాజపురుషులును రాజానుసారులే. రాజ

9 ఇ. ఆ. వా. V. పుట 50. పల్లవ యువమహారాజ విష్ణుగోపుని శాసనము.

10 ఎపి. ఇం. వా. I. పు. 523.

ప్రాబల్యముకంటెను మతప్రాబల్యము అధికమని చెప్పినను సత్యదూరము కాదు. తెనుఁగునాటి కేంద్రస్థానమున భట్టిప్రోలు, అమరావతి, జగ్గయ్యపేట, నాగార్జున కొండ యను ప్రదేశములు విశ్వవిఖ్యాత బౌద్ధాలయములు. విశాఖపట్టణ మండలము లోని విజయనగరముదగ్గర నున్న రామతీర్థము, అనకాపల్లిదగ్గర నున్న బొజ్జన్న కొండ మొదలగున వెన్నియో బౌద్ధమతప్రచారక స్థానములు దేశమునం దంతటను నిండినవి. ఈ స్థలము లన్నిటిలో నుండిన వేలకొలది బౌద్ధసన్యాసులు. తమ మత సారస్వతమునకుఁ బ్రమాణ ప్రచారములు ప్రాకృతభాషనే (పాళీ) గదా వెల యించుచుండుట! బౌద్ధగ్రంథములు, జాతకకథలు మొదలయినవన్నియును బ్రాకృతముననే గల వనుట తెల్లమే.

వైదికమతమునకుఁ బ్రధానములయిన వేద వేదాంగములకుఁ దావలము సంస్కృతము. పండితులు గ్రంథములను వ్రాయుట, ధర్మశాస్త్రములు మొద లయిన వన్నియును సంస్కృతముననే. ఇఁకఁ దెనుఁగున కెక్కడిచోటు? రాజకీయ, మత, సాంఘిక వ్యవహారములకును బండిత వ్యవహారమునకును దూరులైన యనాగ రకులును, దేశీయులును తమ నిత్యవ్యవహారములో నుపయోగించుచుండిన యత్యల్ప సంఖ్యాకములయిన పదములతో గూడిన తెనుఁగుభాషను గ్రామవాసులు, జాన పదులు మొదలగువారు వాడుచుండిరని యూహించుట లెస్స. జనబాహుళ్య వ్యవహారమున నుండిన దేశీయభాష కెట్లు ప్రచారము లేకుండ నుండె నను నాశ్చర్యము మన కక్కఱలేదు. దేశాభిమానము మూర్తీభవించి జాతీయత వెల్లివిరియుచు విజ్ఞానమును వెదజల్లుచున్న నేఁడు (1940 సంవత్సరపు పరిస్థితి), సుమారు పది శతాబ్దములనుండి ప్రచారములో నుత్తమవాఙ్మయము గల్గిన నేఁడు, తెనుఁగున కెట్టి యవస్థ పట్టినదో కొంచెము పరీక్షించిన తెనుఁగునాటి వ్యవహారము స్పష్టపడకపోదు. నడివీథిలో నాంధ్రులకొఱ కేర్పడిన యరవల ఫలహారపు టంగడికి 'జగన్మోహినీ విలాస్' అని యాంగ్లాక్షరములఁ బేరు. ఇది ఎవ్వరికి? తెలుఁగువారికా? కాదుగదా! క్రొత్తగా దేశాంతరమునుండి యిచ్చోటికి వచ్చిన తెలుఁగెఱుంగని తెల్లదొరకా? అతఁ డిం దడుగుపెట్టడు. చూడనయినఁ జూడడు. ఊరినుండి యూరికిఁ బోవు రథ్యలలో నాంగ్లభాషలో నున్నవి భిన్న భిన్న గ్రామ మార్గప్రదర్శక ఫలకములు. ప్రతి దినము నూరిలోఁ బంచిపెట్టు సినీమా నోటీసులలో రేట్సు అని యాంగ్లాక్షరములు, ఆంగ్లాక్షర నామధేయములు. విద్యావిహీనుల చరిత్ర మిట్లుండ విద్యావంతుల చరిత్రము లెట్లున్నవని యడుగ నక్కఱలేదు. అన్నకుఁ దమ్ముఁడు, స్నేహితున కింకొక స్నేహితుఁడు, తండ్రికిఁ గొడుకు వ్రాయు జాబు లాంగ్లముననే. విద్యార్థికులు చేరి ప్రసంగించునప్పు డాంగ్లమే వ్యవహారస్థభాష. తెనుఁగు మాటాడుట తక్కువ. ఇది యొకరి నిర్బంధమువలనఁ గాదు. ఇది యాంధ్రదేశమందున్న బహుపురాతనమగు ననుకరణవిధానము. ఎల్లెడలఁ బాలితులలో వెలయు పాలకానుకరణ స్వభావము. నాఁ డింతకంటె నెక్కువ యనుకరణ ముండక తప్పదుగదా! నేఁడును విద్యా

విహీనుఁడయి పట్టణముమొగ మెఱుఁగక పల్లెలోఁ గాలుసేతులు గష్టించి జీవించు రైతు వాఁడునది తెలుఁగే. వాని పదము లత్యల్పసంఖ్యాకములు. అతనికి సంస్కృత మపరిచితము. ఆంగ్ల మత్యంతదూరము. ఇఁకఁ బ్రాకృతము కలలోనిదిగూడ గాదు. నేఁటికిని నాఁటికిని వానిది తెనుఁగే. వాని దైనికవ్యవహారము మిక్కిలి సంకుచిత భావపూరితము. కొందఱికి లెక్కలుగూడ రావు. పదిదాటి కొందఱు లెక్కింపఁ జాలరు. వ్యావసాయికులుగా నున్నవారే నేఁడిట్లుండ, నాఁటి గిరివాసులు, మృగయాజీవులు మొదలయినవా రెట్లుండవలెనో యూహించుకొనుఁడు. అట్టివారి చేతిలో నుండియుండవలయును నానాఁటి తెనుఁగు. ఆ తెనుఁగే కాలక్రమమున నేఁటి స్వరూపమును జెందినది. ఆంధ్రరాజులును, ఇక్ష్వాకులును గతించి పల్లవులు మొదలయిన రాజులు స్థిరపడిన వెంటనే వైదికమతప్రభావము హెచ్చినది. శాసనములు సంస్కృతమయము లైనవి. ఇట్లనుటవలన వీరికిముందు సంస్కృతమునకును, వైదిక మతమునకును బ్రాధాన్యము లేదని తలఁపరాదు. శాతకర్ణిరాజులలో నొకఁడనేక క్రతుపూతమూర్తి. ఏక బ్రాహ్మణుఁడు. ఇక్ష్వాకువంశప్రభూతమహారాజు శ్రీ వాసిష్ఠీపుత్రశాంతమూలుఁడు అగ్నిహోత్రాగ్నిష్టోమవాజపేయాశ్వమేధయాజి. వీరి తఱువాత నాంధ్రదేశమును బాలించిన బృహత్ఫలాయన జయవర్మ శ్రీమాహేశ్వరపాదానుధ్యానము గలవాఁడు. పల్లవులు ధర్మమహారాజులు. కలియుగదోషావసన్నధర్మోద్ధరణనిత్యసన్నద్ధులు. శాలంకాయన విష్ణుకుండిను లందరును వైదికమతప్రవర్తకులు. శాతకర్ణిరాజు లనంబడిన యాంధ్రుల కాలము నుండియు వైదికమతమునకుఁ బ్రబలవైరి బౌద్ధమతము. అట్టి బౌద్ధమతము పూర్ణముగా దక్షిణ హిందూదేశమున నిర్మూలమగుటకుఁ బదివందల సంవత్సరములకుఁ బైగాఁ బట్టినది. బౌద్ధమతము నశించుటకుఁ బ్రాకృతభాషాప్రచారము నశింపవలె. నేఁటివలె ప్రాకృతము నామమాత్రావశిష్టము గావలె. అట్టి యవస్థ గలుగుటకు రాజులును, బ్రాహ్మణులును బ్రయత్నించుచునే యుండి యుండవలయును. ప్రాకృతమునకును సంస్కృతమునకును గలిగిన ప్రాధాన్యవిషయకమయిన పోరాటములోఁ గ్రమక్రమమునఁ బ్రాకృతము నశించినది. సంస్కృతము మతమువలనను, రాజకీయముగను, సులక్షణబద్ధమయిన విశాలసారస్వతనిధులవలనను సురక్షితమయినది. ప్రాకృతము నశింపవలె ననెడు రాజ బ్రాహ్మణులకు సంస్కృతము నిత్యవ్యవహారమునకుఁ గాకపోయెను. కాఁబట్టి దేశభాష యయిన తెనుఁగునకు బ్రాముఖ్యము నానాఁటను బ్రబలెను. మొట్టమొదటికాలమున సంస్కృత ప్రాకృతములు రెండింటికిని దగ్గియుండవలసిన తెనుఁగు, కాలక్రమమునఁ బ్రాకృతము నశించిపోగా, సంస్కృతము గ్రంథమాత్రశరణ్యము కాఁగాఁ బ్రాముఖ్యమును బొంది చాళుక్యుల కాలమునకు బలము గాంచఁ జొచ్చినది. ఏడవ శతాబ్దమునుండి తెనుఁగునకుఁ గొంత స్థితి గలిగినది. అది క్రమక్రమమున నభివృద్ధిఁజెంది రాజరాజుకాలమున భారతరూపమునఁ బరిణమించి సారస్వతరూపమును గాంచినది.

# తెనుఁగునకును బ్రాకృతమునకును గల సంబంధము

## 1. ప్రాకృతముల స్వరూపమును జరిత్రమును

తెనుఁగునకును బ్రాకృతమునకును గల సంబంధమును జర్చించుటకు ముందు ప్రాకృతముయొక్క స్వరూపమును, జరిత్రమును దిఙ్మాత్రముగాఁ దెలియవలెను. ప్రాకృత మను శబ్దము భాషాపరముగా వాడఁబడుచు ననేకములైన భిన్న భాషలను గుర్తించుట కుపయోగపడుచున్నది. కావుననే ప్రాకృతము లనంబడెడు కొన్ని భాషలు గలవని గ్రహించుట లెస్స. ఈ ప్రాకృతలక్షణములను దెల్పు వ్యాకరణములను సంస్కృతమున రచియించియున్నారు. వానిలో ముఖ్యమయినవి కొన్ని: వరరుచి ప్రాకృతప్రకాశము,[1] చండుని ప్రాకృతలక్షణము,[2] మార్కండేయుని ప్రాకృతసర్వస్వము,[3] లక్ష్మీధరుని షడ్భాషాచంద్రిక.[4] సాధారణముగా సంస్కృత సారస్వతముమాత్రమే చదివినవారికి సంస్కృతనాటకములలోని ప్రాకృతపద్యములును, గద్యములును పరిచితములయి యుండును. ఈ విధముగా నున్న ప్రాకృతభాషలకుఁ బయిని చెప్పఁబడిన లక్షణగ్రంథములుమాత్రమే గాక యనేక లక్ష్యగ్రంథములుగూడ గలవు. బౌద్ధమతానుయాయులును, జైనమతానుసారులును తమ మతగ్రంథముల ననేకములను ప్రాకృతభాషలోనే రచించిరి. ఇంతియగాక శాలివాహనుఁడు గూర్చిన గాథాసప్తశతి యను పద్యముల కూర్పు చాల ప్రసిద్ధిఁ బొంది బాణునిచే స్తుతింపఁబడెను. ప్రవరసేనుని సేతుబంధ మహాకావ్యమును, భాస నాటకములును బాణునిచే స్తుతింపబడిన గ్రంథములు.[5] ఎనిమిదవ శతాబ్దమందుఁ గాన్యకుబ్జదేశాధిపతి యగు యశోవర్మ యాస్థానమున నుండిన వాక్పతిరాజు అనఁబడిన కవిశేఖరుఁడు రెండువేల శ్లోకములు గల 'గౌడవహో' యను ప్రాకృతకావ్యమును వ్రాసెను. ప్రాకృతగ్రంథముల పేర్లు, తత్కర్తలను గురించిన విచారణయు 'ప్రాకృతగ్రంథకర్తలూ, ప్రజాసేవానూ' అను వ్యాసమునఁ బంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు చేసియున్నారు.[6] ప్రాకృతమునందు ఛందస్సునుగూర్చియు నొక గ్రంథము రచింపఁబడినది. దీనినే ప్రాకృత పైంగళ మని వ్యవహరింతురు.

---

[1] క్రీ. శ. ప్రథమశతాబ్దము—సుమారు. [2] క్రీ. శ. 9–10 శతాబ్దములు–సుమారు. [3] క్రీ. శ. 11–వ శతాబ్దము తరువాత—సుమారు. [4] క్రీ. శ. 16–వ శతాబ్దము – సుమారు. [5] బాణుని హర్షచరిత్రము ఉపోద్ఘాతము, "కీర్తిః ప్రవరసేనస్య ప్రయాతా కుముదోజ్జ్వలా । సాగరస్య పరంపారం కపిసేనేవ సేతునా॥ సూత్రధారకృతారంభైర్నాటకైః బహుభూమికైః। సపతాకైర్యశోలేభే భాసో దేవకులైరివ॥ అవినాశిన మగ్రామ్య మకరోత్సాతవాహనః । విశుద్ధ జాతిభిః కోశం రత్నైరివ సుభాషితైః॥" [6] గిడుగు రామమూర్తిపంతులుగారి స్మారక వ్యాససంగ్రహము. పుట 196–223.

ప్రాకృతము లనంబడిన యీ భాష లొక్క-కాలమునాటివిగాని, యొక్క-దేశమందలివిగాని కావు. కాలమునుబట్టియు దేశమునుబట్టియు భాష లెట్లు మారుచుండునో యట్లే యివియును భిన్నకాలములయందు భిన్నదేశములందు (అనఁగా హిందూదేశములోని వేర్వేరుభాగములలో) భిన్నరూపములను వహించియుండుట స్పష్టము. ఈ భాషల ననేకవిధములుగా ప్రాకృతలక్షణకర్తలే దేశవిభాగమునుబట్టి వివరించియుండుటయు విశదమే. ఈ భాషలకుఁ గల పేళ్లనుబట్టి యవి దేశభేదములచే నేర్పడినట్లు స్పష్టముగాఁ దెలియుచున్నది. భరతుఁడు నాట్యశాస్త్రమందు 'మాగధి, అవంతిజ, ప్రాచ్య, శూరసేని, అర్ధమాగధి, వాహ్లీక, దాక్షిణాత్య' అను నేడు భాషలను బేర్కొ-నెను.[7] దండి కావ్యాదర్శమునందు మాహారాష్ట్రి, శౌరసేనీ గౌడీ, లాటీ అను భాషలను బేర్కొ-నెను.[8] షడ్భాషాచంద్రికయందు భిన్నదేశజములయిన భాషలకు భిన్ననామములు గలిగినట్లు స్పష్టముగా బేర్కొ-నియున్నాఁడు. శూరసేనోద్భవమయిన భాష శౌరసేని యనఁబడుచున్నది. మగధోత్పన్నమయినదానిని మాగధి యని చెప్పుదురు. పిశాచదేశములయందు నియమిత మయినది రెండువిధములైన పైశాచిభాష యగుచున్నది.[9] ఇట్లు చెప్పఁబడిన యీ ప్రాకృతములు భిన్నజాతులవారికిని, భిన్నప్రాంతములకును వాడవలె నను నభిప్రాయమును సంస్కృతరూపకలక్షణకర్తలు వెలివరచిరి. సాహిత్యదర్పణమున నీచేతర పురుషపాత్రలకు సంస్కృతమును, తాదృశ స్త్రీపాత్రలకు శౌరసేని యనియును, ఇట్లే వేర్వేరుపాత్రలకు వేరువేరు భాషలను వాడవలయు ననియును వ్రాయఁబడెను.[10] అతఁడు వ్రాసిన శ్లోకము

[7]మాగ ధ్యవంతిజా ప్రాచ్యా శూరసేన్యర్ధమాగధీ । వాహ్లీకా దాక్షిణాత్యా చ సప్త భాషాః ప్రకీర్తితాః॥ నాట్యశాస్త్రము 117. [8]మహారాష్ట్రాశ్రయాం భాషాం ప్రకృష్టం ప్రాకృతం విదుః। సాగరః సూక్తిరత్నానాం సేతుబంధాది యన్మతమ్॥ శౌరసేనీచ గౌడీ చ లాటీచాన్యాచ తాదృశీ । యాతి ప్రాకృత మిత్యేవం వ్యవహారేషు సన్నిధిమ్॥ దండి. కావ్యాదర్శము 1-33-35. [9]శూరసేనోద్భవాభాషా శౌరసేనీతి గీయతే। మగధోత్పన్న భాషాం తాం మాగధీం సంప్రచక్షతే । పిశాచదేశనియతం పైశాచీద్వితయం భవేత్॥[10]పురుషాణామనీచానాం సంస్కృతం స్యాత్కృతాత్మనామ్ । శౌరసేనీ ప్రయోక్తవ్యా తాదృశీనాం చ యోషితామ్॥ ఆసా మేవ తు గాథాసు మాహారాష్ట్రీం ప్రయోజయేత్ । అత్రోక్తా మాగధీభాషా రాజాంతఃపురచారిణామ్ । చేటానాం రాజపుత్రాణాం శ్రేష్ఠినాం చార్ధమాగధీ । ప్రాచ్యా విదూషకాదీనాం ధూర్తానాం స్యా దవంతికా॥ యోధ నాగరికాదీనాం దాక్షిణాత్యాహి దీవ్యతామ్ । శకారాణాం శకాదీనాం శాకారీం సంప్రయోజయేత్॥ బాహ్లీకభాషా దివ్యానాం ద్రావిడీం ద్రావిడాదిషు । ఆభీరేషు తథాభీరీ చాండాలీ పుల్కసాదిషు ॥ ఆభీరీ శాబరీచాపి కాష్ఠపత్రోపజీవిషు । తథైవాంగారకారాదౌ పైశాచీ స్యాత్పిశాచవాక్ ॥ చేటీనా మప్యనీచానా మపిస్యా చ్ఛౌరసేనికా । బాలానాం షండకానాంచ నీచగ్రహ విచారిణాం ॥ ఉన్మత్తానామాతురాణాం సైవస్యా త్సంస్కృతం క్వచిత్ । ఐశ్వర్యేణప్రమత్తస్య దారిద్ర్యోపస్కృతస్యచ ॥ భిక్షుబంధధరాదీనాం ప్రాకృతం సంప్రయోజయేత్। సంస్కృతం సంప్రయోక్తవ్యం లింగినీషూత్తమాసుచ ॥ దేవీ మంత్రి సుతా వేశ్యా స్వపి కైశ్చిత్తథోదితమ్। కార్యత శ్చోత్తమాదీనాం కార్యోభాషా విపర్యయః॥ యోషిత్సఖీ బాలవేశ్యా కితవాప్సరసాం తథా। వైదగ్ధ్యార్థం ప్రదాతవ్యం సంస్కృతం చాంతరాంతరా॥ సాహిత్యదర్పణము 6-వ పరిచ్ఛేదము.

లనుబట్టి చూడగా నాతనికాలమున నా భాషలు వాడుకలో నుండకుండినట్లు స్పష్టము కాగలదు. ఈ శ్లోకములోని యభిప్రాయములనుగుఱించి మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు తమ 'ప్రాకృత భాషోత్పత్తి' యను గ్రంథమున నిట్లు వ్రాయుచున్నారు: 'నాటకలక్షణశాస్త్రకర్తలు విధించినప్రకార మీ భాషలన్నియు నాటకములలో నుప యోగింపఁబడుచున్నవో లేవో మనకుఁ దెలియదు. ఒకవేళ నట్లుపయోగింపఁబడినచో వీనికిఁ గల పరస్పరభేదము లిట్టివని విశదముగాఁ దెలియఁజేయుటకుఁ దగిన సాహాయ్య మొనర్చు నాటకముల మంచిప్రతులు మనకు లేవు. అయినను ప్రాచీనులు వ్రాసిన ప్రాకృత వ్యాకరణసహాయమువలన నీభాషల లక్షణములను బూర్ణముగాను, నిశ్చయము గాను దెలిసికొనగలిగియున్నారము. హేమచంద్రుడు శాకుంతలమునుండి రాజ భటులకు - జాలరివానికి జరిగిన సంవాదమును, ముద్రారాక్షసమునుండి క్షపణకుని సంభాషణమును, వేణీసంహారమునుండి రుధిరప్రియ యను రాక్షసియొక్క సంభాష ణమును, మాగధీభాషాలక్షణమున కుదాహరణముగా నెత్తియున్నాడు.''[11]

ఇట్లు భిన్నములుగాఁ జేర్కొనంబడిన భిన్నప్రాకృతముల యుత్పత్తిని గూర్చి దిఙ్మాత్రముగా సిద్ధాంతములుమాత్రము వ్రాయంబడుచున్నవి. ఈ క్రింద వ్రాయఁబడిన సిద్ధాంతములు భిన్నభాషలయొక్క స్వరూపమును దిలకించుటచేతను, ప్రాచీన గ్రంథములగు వేదములు, అవెస్త (పారశీకుల మతగ్రంథములు) మొదలగు వానిని బరిశీలించుటచేతను భిన్నజాతుల నాగరకత, స్వరూపము మొదలగువానిని బరీక్షించుటచేతను బండితులచే నంగీకరింపఁబడినవి.

ఆర్యు లనఁబడెడు నొకానొక జాతి జనులు మిక్కిలి ప్రాచీనకాలమున నేఁటి ఆసియా, ఐరోపాఖండములయొక్క సరిహద్దుభాగమున నేఁటి రష్యాదేశము యొక్క దక్షిణభాగమందలి విశాలమైన మైదానములలో పశులకాపరులయి, వానినే జీవనాధారముగా నుంచుకొని జీవించియుండియుండవలయును. ఆ స్థలము నుండి వారు కాలక్రమమున తూర్పుదిక్కునకును, పశ్చిమమునకును గుంపులు గుంపులుగాఁ జీలి పయనమయి క్రొత్త క్రొత్త నివాసముల నేర్పఱచుకొనుచు నొకరి కొకరు దూర మయిపోయి యుండవలయును. పయిని జెప్పఁబడిన మైదానముల లోనే వారిలోఁ గొందరు వ్యవసాయవృత్తి నవలంబించినవారుగాగూడ నుండి యుండవచ్చును. ఇట్లు మొదట నొక్కచోటనే యుండిన వీ రందరును నొక్క భాషనే మాటాడుచుండినవా రయ్యును నా యా వేరుపడిన గుంపుల భాషలు మారి రెండువిధములయిన భాషలుగా నేర్పడినట్లు తోఁపగలదు. ఒక భాగముపేరు 'కెంతుమ్' భాషలు. రెండవభాగముపేరు 'సతెమ్' భాషలు. ఈ రెండుశబ్దముల కును అర్థము తెనుఁగున 'నూరు' అను సంఖ్యావాచకము. ఈ 'నూరు' అను

---

11. చూ. ప్రాకృతభాషోత్పత్తి. పుటలు 49-50. మేడేపల్లి వేంకటరమణాచార్యుల వారు. ఆంధ్రపరిషత్పత్రికా ప్రచురణము.

సంఖ్యకు 'కెంతుమ్' అను శబ్దముయొక్క తద్భవములను వాడినవా రందరును గ్రమ క్రమమున నేటి పాశ్చాత్యభాషలకు మూలములయిన గ్రీకు, లాటిను, కెల్టికు, ట్యూటోనిక్ జాతులవారి భాషను మాటాడుచుండిరి. వీరు పశ్చిమదిక్కును గూర్చి వెడలిపోయినవారు. రెండవశాఖవారు తూర్పువైపునకు వచ్చిరి. వీరు 'నూరు' అను సంఖ్యకు 'సతెమ్' అను పదముయొక్క తద్భవము లయిన పదములను దమ తమ భాషలలో వాడుచుండిరి. ఆ భాషలే ఆర్యను, ఆర్మీనియను, ఫ్రిజియను, త్రేషియను, ఆల్బేనియను, బాల్టోస్లావానికు అను జాతుల భాషలుగా నేర్పడినవి.

ఇపుడు మనకు ముఖ్యముగా సంబంధించినవి తూర్పునకు వచ్చిన యీ ఆర్య జాతివారు మాటలాడిన భాషలే. క్రీస్తుపూర్వము సుమారు 2,500 సంవత్సర ములకు ముందే యీ ఆర్యులు ఉత్తరపు మెసపొటేమియానుండి పెరిషియా లోనికి వచ్చియుండవచ్చును. ఈ పెరిషియా దేశములోఁ గొంతకాలము స్థిరపడిన తరువాత వారిలోఁ గొందరు తూర్పుదిక్కు నాశ్రయించి హిందూదేశమును బ్రవే శించియుండవలెను. వీరికిని, వీరితో సజాతీయులయిన పెరిషియావాసులకును నడుమ హిందూకుష్ పర్వతములును, అఫ్ఘనిస్థానమును బెద్దదై దాటుటకు వీలు గాని యడ్డుగా నేర్పడిపోయినవి. ఈ జాతివా రందరును మొదట మాటలాడుచుండిన భాష యొక్కటియే యయి యుండినను గూడ వీరును వారును గలియకుండుట చేతను, గాలక్రమమున రెండు ప్రదేశములలో నుండినవారు వాడుచుండిన భాషలు స్వతంత్రముగాను, భిన్న భిన్నముగాను మారిపోవుచుండుటచేతను వేర్వేరు భాషలుగా నేర్పడిపోయినవి. రెండుశాఖలవారు తాము ఒక గుంపుగా నుండినప్పుడు అనుభ వించుచుండిన నాగరకతయు, విజ్ఞానమును, పూజించుచుండిన దేవతలనామములును గాలక్రమమున గొంచెము కొంచెముగా మారిపోయినవి. ఈ మారుదలయొక్క వేగము పెరిషియావాసులలో నధికము, హిందూర్యులలో నల్పము. కావుననే అతి ప్రాచీనములయిన దేవతానామములు మార్పులేకుండగనే ప్రాచీనరూపములతోనే వీరి గ్రంథములయందు గన్పట్టుచుండెను. ఇట్లు హిందూర్యులు మాటలాడుచుండిన భాషలే కాలక్రమమున మారుపాటును జెంది వైదికసంస్కృతము, పాణినీయ సంస్కృతము, పాళీ, ప్రాకృతములు, అపభ్రంశభాషలు, నేటి యుత్తరహిందూ స్థానభాషలు మొదలగువానికి మూలరూపము లయినవి. పెరిషియాలో నిలిచి పోయినవారి భాషలే నేటి ఐరేనీయభాషలకు మూలము లయినవి. ఇట్లు ఐరేనీ యార్యులును హిందూర్యులును వేరుపడిన కాలమునకే అనగా పెరిషియాలోని యార్యభాషలు ఐరేనియను భాషారూపమును బొందుచుండగానే యా ప్రదేశమును దాటి నాఁటి ఐరేనీయార్యులలో మఱికొందఱు హిందూకుష్ పర్వతములను ఉత్తరమార్గమునఁ జుట్టివచ్చి నేఁటి 'దరదస్థానము' నఁ బ్రవేశించియుండవలయును. ఈ దరదస్థానమును నేఁడు గిల్గితు, కాశ్మీరము, కాఫీరిస్తాను, కోహిస్తాను అను దేశములుగాఁ బేర్కొనుచున్నారు. ఇది హిందూస్థానమునకుఁ గేవలము నుత్తరపు

టగ్రభాగమున నున్నది. ఈ దరదభాషలనే పిశాచభాషలుగా గ్రియరుసనుగారు పేర్కొనుచున్నారు. ఇప్పుడు తూర్పువైపుననున్న ఆర్యభాషలన్నియును మూఁడు కుటుంబములుగా నేర్పడినవి. 1. ఐరేనియను, 2 దరద, 3. హింద్వార్యభాషలు.[12]

మనకు ముఖ్యముగా సంబంధించినవి హింద్వార్యభాషలేయని ముందే చెప్పితిని. ఈ హింద్వార్యులు క్రమక్రమముగా గుంపులు గుంపులుగా వచ్చి హిందూస్థానమునఁ జేరినట్లు వేదములనుండియే రుజువుపరుపవచ్చును. ఈ వేదమంత్రములు కాలక్రమమునఁ గొన్ని ఆరకోషియాలో (అనగా నేఁటి కందహారదేశమున), కొన్ని అఫ్ఘనిస్థానములోఁ, గొన్ని యమునానదీ సమీపమునఁ గూర్పఁబడి యనేక కాలమునకు రాశీభూతములై ఋగ్వేదాదికముగా విభజింపఁబడి వాడుకలో నుండినట్లూహింపఁబడినవి. (వేదము లనాదిసిద్ధములనియు, బ్రహ్మముఖనిర్గతములనియు, మనుష్యకృతములు గావనియుఁ బ్రాచీనహిందువులయొక్క విశ్వాసము) ఈ వేదములయందే భిన్న భిన్నములయిన మాండలికభేదము లుండినయట్లు వేదవిదులయిన పాశ్చాత్యభాషాచరిత్రకారు లూహించుచున్నారు.

ఈ హింద్వార్యులు మొదట నొకగుంపుగా వచ్చి కొంతకాలము స్థిరపడిన తరువాత మరల నొకగుంపుగా వచ్చి పూర్వము స్థిరపడినవారిని దక్షిణమువైపునకును బశ్చిమమునకును దరిమి మధ్యదేశమున (అనఁగా హిమాలయమునుండి వింధ్యము వఱకును, సిర్‌హింద్ మొదలు తూర్పున నున్న గంగా యమునా సంగమము వఱకును గల ప్రదేశము) తాము స్థిరపడిన ట్లూహింపఁబడినది. కావున నేఁటి మధ్యదేశ భాషలకును ఆ భాషల నన్నిప్రక్కల నావరించికొనియున్న భాషలకును నొక్క విధమైన భేదమే గనుపట్టుచున్నదని చెప్పుచున్నారు. నేఁటి రాజస్థానము, గుజరాతు, ఉత్తరప్రదేశములోఁ గొంతభాగము, పంజాబులోని దక్షిణభాగమును మధ్యదేశపు భాషలతో నిండియున్నది. మరాఠీ, బెంగాలీ, ఒడియా, బీహారీ, అస్సాము భాష, సింధీ, లహణ్డా, అను భాషలు బయటిభాగమునకుఁ జేరినవి.

ఈ హింద్వార్యు లుపయోగించుచుండిన వైదికసంస్కృతమునఁనే భిన్న మాండలికవిభేదము లుండినట్లు పండితులు కనిపెట్టియున్నారని ముందే చెప్పియుంటిని. అశోకుని (ధర్మలిపులు) శాసనములు రచియింపఁబడిన కాలమునకే అనగా సుమారు క్రీ. పూ. 250 సంవత్సరమునకే వైదికసంస్కృత పాణినీయ సంస్కృతములకంటె భిన్నములయిన ప్రాకృతభాష లుండెడి వని యా శాసనభాష నుండి స్పష్టపడుచున్నది. ఈ భాషలే జనులు మాటాడుచుండిన ప్రాకృతభాషలు. వీనికంటె భిన్నమయినది సంస్కృతము. అనగా సంస్కరింపఁబడినది యని యర్థము. వైదికకాలమున వాడుకలో నుండిన భిన్న మాండలికభాషలలో నొక్కదాని నుండియే పాణినీయసంస్కృత మేర్పడిన ట్లూహింపఁబడినది. ఆ వైదికకాలమున

12 లి. సర్వే. వా. I. పుట. 108.

నుండిన యితర మాండలికభాషలనుండియే అశోకకాలమునందలి ప్రాకృతములు కాలక్రమమున నేర్పడియుండవలయును. ప్రాకృతశబ్దమున కనేకార్థములు గలవు. ప్రకృతి యనఁగా స్వభావము. ప్రాకృత మనగా స్వభావసిద్ధము అని యభిప్రాయము.[13] ప్రకృతి యనగా సాధారణజనులు. సామాన్యులు మాటలాడు భాషయే ప్రాకృత మని యభిప్రాయము.[14] ప్రకృతిశబ్దమునకుఁ గల యర్థములను[15] బట్టి చూడఁగా సాధారణజనులు మాటలాడుచుండిన భాష గావున దీనికి ప్రాకృత మను పేరు రూఢ మైనదను నభిప్రాయము స్పష్టము.

అయినను లాక్షణికు లనేకులు ప్రకృతి సంస్కృతమనియు నా ప్రకృతినుండి సంభూతమయినది గావుననే ప్రాకృతమనియు వ్యుత్పత్తిని జెప్పిరి.[16] అనగా ననేక ప్రాకృత వ్యాకరణకర్తల మతమున నియ్యది సంస్కృతభవ మనుట నిశ్చితము. వీరి మతమున సంస్కృతము నుచ్చరింపలేక మాఱుపాటుతో స్త్రీపురుషులు పదముల నపభ్రష్టములఁ జేసి యుచ్చరింపగా నయ్యది ప్రాకృతమయ్యె నని యభిప్రాయము. మొదటఁ జెప్పిన మతము ననుసరించి స్వభావసిద్ధమయిన భాష ప్రాకృత మయి యుండగా నట్టిదానిని లక్షణకర్తలు వ్యాకరించి సంస్కరింపగా నయ్యది సంస్కృత మయ్యె ననియుఁ దోచుచున్నది. ఈ యభిప్రాయమునే మనసునం దుంచుకొని రుద్రటకృతకావ్యాలంకారమునందలి యొకానొక శ్లోకమునకు[17] వ్యాఖ్య వ్రాయుచు 11-వ శతాబ్దినుండిన జైనవిద్వాంసుడగు నమిసాధువు ఈ యభిప్రాయము ను వ్రాయుచున్నాడు : "ఎల్లజంతువులకును వ్యాకరణాదిక సంస్కారము లేని సహజమయిన వచనవ్యాపారము ప్రకృతి. దానినుండి కలిగినదిగాని, అదియే

[13] ప్రకృత్యా స్వభావేన సిద్ధమ్ ప్రాకృతమ్.

[14] ప్రకృతీనాం సాధారణ జనానా మిదం ప్రాకృతః

[15] ప్రకృతి ర్యోని శిల్పినోః। పౌరామాత్యాదిలింగేషు గుణసామ్యస్వభావయోః। ప్రత్యయాత్ పూర్వికాయాంచ॥ (అనేకార్థ సంగ్రహము) స్వామ్యామాత్యః సుహృత్కోశో రాష్ట్రదుర్గబలానిచ। రాజ్యాంగాని ప్రకృతయః పౌరాణాం శ్రేణయోపిచ॥(అభిధాన చింతామణి.) అమాత్యాద్యాశ్చ పౌరాశ్చ సద్భిః ప్రకృతయః స్మృతాః. (అభిధాన చింతామణి టీక.)

[16] ప్రకృతిః సంస్కృతమ్। తత్రభవం తత ఆగతం వా ప్రాకృతమ్.
హేమచంద్ర ప్రా. వ్యా.
ప్రకృతిః సంస్కృతం, తత్రభవం ప్రాకృత ముచ్యతే. (ప్రా. సర్వస్వము)
ప్రకృతిః సంస్కృతం తత్ర భవత్వాత్ ప్రాకృతం స్మృతమ్. (ప్రా. చంద్రికా.)
ప్రకృతేః సంస్కృతాయాస్తు వికృతిః ప్రాకృతీ మతా॥ (షడ్భాషాచంద్రిక.)
ప్రాకృతస్యతు సర్వమేవ సంస్కృతం యోనిః॥ (ప్రాకృతసంజీవని.)

[17] ప్రాకృత సంస్కృత మాగధ పిశాచ భాషాశ్చ శౌరసేనీ చ షష్ఠోఽత్ర భూరిభేదః దేశ విశేషా దపభ్రంశః॥ (కావ్యాలంకారము. రుద్రట 2—12)

గాని ప్రాకృత మనఁబడును.[18] అనేక ప్రాకృతకవులు ప్రాకృతమును అకృత్రిమమును స్వాదువునుగాఁ జేర్కొనిరి.

పై రెండు విధములయిన యభిప్రాయములును నొకదాని కొకటి విరుద్ధముగా నున్నట్లు గన్పించుచున్నవి. ఒక మతమున ప్రకృతి యనగా పూర్వకాలికమయిన సంస్కృతము. రెండవమతమున ప్రకృతినే సంస్కరింపగా సంస్కృత మేర్పడినదనుట. మొదటఁ జెప్పిన మాండలికభాషాభేదముల యస్తిత్వము నూహించినచో నీ వైషమ్యము తొలఁగిపోవును. ప్రప్రథమమున నుండిన వైదికకాలమునందలి ప్రాకృతములలో ( అనగా జనులు మాటాడు మాండలికభాషాభేదములు ) నొకదాని నుండి సంస్కరింపఁబడిన సంస్కృతరూపభాష బయలుదేరినది కావున సంస్కృతము ప్రాకృతభవమే యగుట సరిగదా ! మొదట సంస్కృత మేర్పడినకాలమునుండి దానితో నభిన్న మనఁదగిన ( మాతృభూత ) ప్రాకృతరాశియే క్రమక్రమమున వ్యవహారమున రూపాంతరమునంది నవీనరూపముల నందినది గావున ప్రాకృతము సంస్కృతజన్య మనుటలో విప్రతిపత్తి గలుగదు. సంస్కృతభాషకు బూర్వముండిన ప్రాకృతభాష సంస్కృతభాషకు యోని. సంస్కృతకాలముననుండి సంస్కృత భాషతో నత్యల్పమాత్రభేదము గలిగిన సంస్కృతతుల్య ప్రాకృతములు కారణము లగుటచే ననంతర ప్రాకృతములు సంస్కృతభవము లనుటలో వింతలేదు. కాబట్టి పూర్వాపరకాల సంబంధమాత్ర వివక్షచేత రెండు మతములకును గనుపట్టు వైరుధ్యము తొలఁగిపోవుచున్నది. ఇవియే పాశ్చాత్యవిద్వాంసు లయిన గ్రియరుసనుగారు మొదలయినవారి యభిప్రాయము లనుట స్పష్టము.[19] గ్రియరు సనుగారి మతమునఁ బ్రాకృతములు కాలమునుబట్టి మూడువిధములుగా విభజింప నగును. ప్రాథమిక ప్రాకృతములు. ఇవియే వైదికకాలమునందలి భాషలు. జను లా కాలమున దమ యభిప్రాయముల నొకరితో నొకరు దెలుపుకొనుటకు వాడు చుండిన వ్యావహారికభాషలు. వీని కన్నింటికిని అత్యల్పములయిన మాండలిక భేదములుమాత్ర ముండిన ట్లూహింపనగును. ఈ కాలమునందలి ప్రాకృతముల లక్షణము వైదికసంస్కృతమునుబట్టి యూహింపవలసినదే. ఈ ప్రాకృతములందు

[18] ప్రాకృతేతి. సకలజగజ్జంతూనాం వ్యాకరణాదిభి రనాహితసంస్కారః సహజో వచన వ్యాపారః ప్రకృతిః, తత్రభవం సైవవా ప్రాకృతమ్॥ ఆరిసవయణే సిద్ధందేవాణం అద్ధమాగహావాణీ, ఇత్యాదివచనాద్వా ప్రాక్ పూర్వం కృతం ప్రాక్కృతం, బాల మహిళాది సుబోధం, సకలభాషానిబంధనభూతం వచన ముచ్యతే, మేఘనిర్ముక్త జలమి వైకస్వరూపం తదేవ చ దేశవిశేషాత్ సంస్కార కరణాచ్చ సమాసాదిత విశేషం సత్ సంస్కృతాద్యుత్తర విభేదా నాప్నోతి, అతఏవ శాస్త్రకృతా ప్రాకృత మాదౌ నిర్దిష్టం, తదను సంస్కృతాదీని పాణిన్యాది వ్యాకరణోదిత శబ్దలక్షణేన సంస్కరణాత్ సంస్కృత ముచ్యతే॥

[19] లి. సర్వే. వా. I. పు. 121 - 123.

పాణినీయ సంస్కృతమునం దున్న వానికంటె ననేకములయిన భిన్నరూపములు గను పట్టుచునేయుండును. పాణినీయ సంస్కృతమునందు గ్రహింపఁబడని యా రూపములే కాలక్రమమున వర్ణనాశాది వికారములవలనఁ దరువాతి ప్రాకృతములలో నవీనరూపములుగాగూడ నేర్పడినవి.

తరువాతి భాషాపరిణామములనే ద్వితీయప్రాకృతములుగా శాస్త్రజ్ఞు లంగీకరించిరి. ఈ రెండవ ప్రాకృతము లేకాలమున నారంభమయినవి యను విషయము తెలియదు. కాని వాని ప్రాథమికరూపములు అశోకుని శిలాశాసనములలో స్పష్టముగా భిన్న మాండలికభేదములతో నగపడుచున్నవి. అయినను ప్రాథమిక ప్రాకృతములు క్రీ. పూర్వము 400 వఱకును, నటుతరువాత క్రీస్తువెనుక 100 వఱకు ద్వితీయప్రాకృతములును, నటుతరువాతఁ దృతీయప్రాకృతము లనఁబడెడి నేఁటి యుత్తరహిందూస్థాన భాషలును ప్రాముఖ్యమును గాంచిన కాలమని యూహింపవచ్చును.[20] పైని జెప్పిన మూఁడు రూపభేదములును గాలక్రమమున మెల్ల మెల్లగా నేర్పడినవి గాని యొక్కనా డేర్పడినవి గావు. కాఁబట్టి యీ భాషల యవస్థాభేదములైన మూఁడును గ్రమక్రమముగా గనుపట్టు భేదములుగాని వేరుకావు.

రెండవతరపు ప్రాకృతములను మూఁడుయుగములుగా భాగింపవచ్చును. మొదటియుగము క్రీ. పూ. 400 మొదలు క్రీ. వె. 100 వఱకు.

ఈ యుగభాషల కుదాహరణములు :

(1) హీనయాన బౌద్ధమతముయొక్క త్రిపిటకములు, మహావంశము, జాతకకథలు మొదలగు బౌద్ధగ్రంథములలోని పాళీభాష.

(2) పైశాచీ, చూలికాపైశాచి.

(3) జైనాంగగ్రంథములయందలి అర్ధమాగధీభాష.

(4) అంగగ్రంథములు గాని ప్రాచీనసూత్రములయొక్కయు 'పఉమచరిఅ' మొదలగు ప్రాచీనగ్రంథముల జైనమాహారాష్ట్రిభాష.

(5) అశోకుని శిలాశాసనములందలియు నంతకంటె ప్రాచీనశాసనములయు భాష.

(6) అశ్వఘోషుని నాటకభాష.

మధ్యయుగము క్రీ. వెనుక 100 – 500 వఱకు.

(1) తిరువనంతపురమునఁ బ్రచురింపఁబడి భాసుని వనంబడుచున్న నాటకములలోని ప్రాకృతము. కాళిదాసాదుల నాటకములలోని శౌరసేని, మాగధి, మాహారాష్ట్రి భాషలు.

---

[20] పాఇఅసద్ద మహణ్ణవో. ప్రాకృతశబ్ద మహార్ణవము. ఉపోద్ఘాతము, పుట 12. (పండిత హరిగోవిందదాస్ త్రికమ్‌చందుగారిది.)

(2) సేతుబంధము, గాథాసప్తశతి మొదలగు కావ్యములలోని మాహారాష్ట్రిభాష.

(3) ప్రాకృతవ్యాకరణములయందు లక్షణము వ్రాయంబడి యుదాహరింపఁబడిన మాహారాష్ట్రి, శౌరసేని, మాగధి, పైశాచీ అనెడి భాషలు.

(4) దిగంబర జైనగ్రంథములలోని శౌరసేని, శ్వేతాంబర జైనగ్రంథములలోని జైన మాహారాష్ట్రిభాష.

(5) చండుని ప్రాకృతవ్యాకరణమున నిర్దేశింపఁబడిన భాష. విక్రమోర్వశీయమునం బ్రయోగింపఁబడిన యపభ్రంశభాష.

## తృతీయప్రాకృతములు

క్రీ. వె. 1,000 సంవత్సరముల తరువాత నీ తృతీయప్రాకృతములకుఁ బ్రాముఖ్యము వెలసినది. వీనినే నేఁటి హిందూస్థానభాష లగు లహన్దా, పంజాబీ, హిందీ, గుజరాతీ, మరాఠీ, బంగాళీ, ఓఢ్రము మొదలయిన భాషలుగా నెఱుంగవలయును. ఈ భాషలయొక్క నేఁటి రూపములకును ద్వితీయప్రాకృతములకును నడుమ నపభ్రంశము లనెడి వేరొకయవస్థ గలదు. ఇవియే నేఁటి యీ వ్యావహారిక భాషలకు మూలమని గ్రియరుసనుగారి యభిప్రాయము.

పయి నుదాహరించిన ప్రాకృతముల చరిత్రనుబట్టి యొక్కటి స్పష్టపడక తప్పదు. క్రీస్తు పూర్వము 2,500 సంవత్సరములనుండియు వాడుచుండిన పదములు నేఁటికి అనగా క్రీ. వెనుక 2,000 సంవత్సరములకు దేశభేదమునుబట్టి అనేకవిధములయిన రూపభేదములను బొంది భిన్నభిన్న భాషలుగా నేర్పడినవి. వైదికకాలమున భవతి=ఉన్నది (భూధాతుజన్యమగు వర్తమాన ప్రథమపురుష రూపము.) హవఇ అను రూపమునుదాల్చి నేఁటి హిందీభాషలో హై అను రూపమును బొందినది. పయి యుదాహరణమునుబట్టి యీ భాషలలో నెట్టిరూపభేదము గలిగినదో గ్రహించుట స్పష్టము.

## దేశభేదమునుబట్టి కలిగిన ప్రాకృతభేదములు

వ్రాచడాపభ్రంశమునుండి నేఁటి సింధీభాష కలిగినది. మగధదేశమునకు సంబంధించిన (మాగధీభాషనుండి) మాగధాపభ్రంశమునుండి బంగాళీ, ఓఢ్రభాషలుత్పన్నములైనవి. ఈ మాగధాపభ్రంశమునుండియే నేఁటి బిహారిభాషగూడ నుత్పన్నమయినది. అస్సాముదేశములో వాడుచున్న అస్సాముభాషగూడ బంగాళీ భాషవలెనే మాగధాపభ్రంశమునుండియే కలిగినదని చెప్పవలయును. మగధశబ్దమునుండి కలిగినదియే మాగధాపభ్రంశము, మాగధి యనుట స్పష్టము. మగధ యనునది దేశనామము. అర్ధమాగధిభాషనుండియును, దదపభ్రంశమునుండియును

గల్గినదియే నేఁటి తూర్పు హిందీభాష. పశ్చిమహిందీ, రాజస్థానీ, గుజరాతీ, మొదలగు భాష లన్నియును శూరసేనదేశ మనంబడెడి మధ్యదేశమునందలి ప్రాకృతభాష యొక్క యపభ్రంశమునుండి కలిగినవని యూహింపఁబడినది.

## అపభ్రంశములు

వ్యాకరణబద్ధమయి గ్రంథస్థమయిపోయిన భాష మారదు గావునఁ బాణినీయ సంస్కృతము మారక యట్లే నిలిచిపోవుట మనకుఁ బరిచితమేగదా! అట్లే యనంతరకాలమునందలి ప్రాకృతములుఁగూడ గ్రంథస్థము లయి లక్షణబద్ధము లగుటను మాఱకుండ నుండిపోయినవి. వాడుకలో నుండిన ప్రాకృతములు మాత్రము కాలక్రమమున గ్రంథస్థభాషకంటె మారిపోయి యపభ్రష్టము లయి పోయినవి. ఈ యపభ్రష్టభాషలే యపభ్రంశములను నామముతో వ్యవహరింపఁ బడుచుండును. ఇవియే కాలక్రమమున నేఁటి తృతీయప్రాకృతము లనంబడు దేశ భాషలకు మూలము లైనవి. ఈ యపభ్రంశము లెప్పటినుండి యుండినవో స్పష్ట ముగాఁ జెప్ప నలవిగాదు గాని క్రీస్తువెనుక 7 వ శతాబ్దమున నుండె ననవచ్చును. బాణుఁడు హర్షచరిత్రమున భాషాకవిని బేర్కొని యున్నాఁడు. భాష యనఁగా నీ యప్రభంశమే కావచ్చును.

## 2. సంస్కృత ప్రాకృతములకుఁ గల సంబంధము

పాణినీయ సంస్కృతము లక్షణబద్ధ మగుటచేతను, గ్రంథస్థ మగుటచేతను, బండితుల యాదరణమునకు బాత్రమగుటచేతను, మతగ్రంథములయిన వందే యుండుటచేతను నద్దానికిఁ బ్రాముఖ్యమును, బ్రశస్తియుఁ గలుగక తప్పినదికాదు. వాడుకలో నుండిన ప్రాకృతములయందలి యపభ్రంశరూపములు వాడుకలోనే మారుచు నంతకంతకు సంస్కృతముతో మఱింత భిన్నతను గలిగి యుండినవి. ఈ ప్రాకృతములు సంస్కృతముతో సమకాలికమయిన యితర మాండలికభాషా రూపములను గలిగియుండుటవలనఁ బ్రథమావస్థయందే సంస్కృతముకంటె భిన్నము లయియుండఁ గాలక్రమమునఁ గలిగిన పయిమార్పులు వీనికిఁ గల భేదమును మఱింత వృద్ధిపఱచినవి. ఇట్టి ప్రాకృతములను జైనులును, బౌద్ధులును దమ మతప్రచార మున కంగీకరించుటవలన వానిలో గ్రంథరచనయు, నౌత్కృష్ట్యమును సంభ వించెను. అవి సంస్కృతమునందలి యనేకపదములను గ్రహింపవలసివచ్చినది. నిత్యవ్యవహారములో నుండు పదము లత్యల్పసంఖ్యాకమాత్రములుగానే యుండుట యేభాషలోనయినను దప్పదు గావునను, ఉన్నతాభిప్రాయములను, నుత్కృష్ట భావములను, గల్పనావిశేషములను దెలుపుటకు వలసిన పదము లెప్పుడును గ్రంథస్థ ములే యయి యుండుటచేతను, బండితులగువారు సంస్కృతమునే చదివి పాండిత్యము

గాంచుటచేతను, నట్టి గ్రంథము లాకాలమునకు సంస్కృతమునందే యుండుటచేతను సంస్కృతగ్రంథములనుండి పదములను గ్రహించుట ప్రాకృత గ్రంథకర్తలకుఁ దప్పినదికాదు. ప్రాచీన ప్రాకృతములనుండి ద్వితీయప్రాకృతములలోనికి వచ్చి సంస్కృతముతో నభిన్నములయిన పదములును, సంస్కృతగ్రంథములనుండి గ్రహింపఁ బడిన పదములును గలిసి ప్రాకృతమునందలి తత్సమము లయ్యెను. ప్రాచీన ప్రాకృతములనుండి వచ్చియు నపభ్రష్టము లయినవియును, సంస్కృతమునందలి పదముల నుచ్చరించుటలో నపభ్రంశతఁగాంచి క్రొత్తగాఁ జేరిన పదములును గలిసి తద్భవము లయినవి. సంస్కృత మూలరూపములనుగాని, సంస్కృతగత సజాతీయ రూపములనుగాని నిరూపింపఁజాలని పదములను లాక్షణికులు దేశ్యములుగా నంగీకరించిరి. కావుననే ప్రాకృతములందు మూఁడువిధములయిన శబ్దము లున్నవని లాక్షణికు లంగీకరించుట జరిగినది. ఇట్టి దేశ్యశబ్దజాలము ప్రాదేశికమాత్రముగా నుండుట సంభవించును. అనగా ప్రదేశమునుబట్టి భేదించు నన్నమాట.

ఈ క్రింది యుదాహరణములను బరికించునది :

ఉదకచంద్రసమా । ఇమి । కామగుణాః ప్రతిబింబ ఇవా । గిరిఘోష । యథా ప్రతిభాససమా। నటరంగ సమా స్తథ। స్వప్నసమా। విదితార్యజనైః ॥

( బౌద్ధగ్రంథము : లలితవిస్తరము )

ఈ శ్లోకములో నెన్ని సంస్కృతపదములో అనగా తత్సమములో చూచిన వెంటనే స్పష్టమగును.

నైతస్య దేవ కులధర్మ నరాష్ట్రధర్మః సర్వే జగస్య జర యౌవన ధర్షయాతి।
తుభ్యంపి మాతృ పితృ బాంధవ జ్ఞాతి సంఘో జరయా అముక్త నహి అన్యగతి ర్జనస్య.

బుద్ధదేవునితో ముసలివానినిగురించి సారథి చెప్పిన మాటలు.

అమిలం పాఉఅ కవ్వం పఢిఉం సోఉం చ జే ణఆణంతి.
కామస్స తత్తతత్తిం కుణంతి తే కహం ణలజ్జంతి॥ హాలుని గాథాసప్తశతి.
(ఛాయ) అమృతం ప్రాకృతకావ్యం పఠితుం శ్రోతుం యే నజానన్తి.
కామస్య తత్త్వచింతాం కుర్వంతి తే కథం నలజ్జంతే.
సావత్థియం కిర అదిణ్ణపువ్వకోనామ బ్రాహ్మణో అహోసి ॥ (పాళీ.)
( ఛాయ ) శ్రావస్త్యాం కిల అదత్తపూర్వకోనామ బ్రాహ్మణో అభూత్.
యథా ధనచ్ఛేదో నహోది తథా కరిస్సామీతి (పాళీ)
( ఛాయ ) యథా ధనచ్ఛేదో నభవతి తథా కరిష్యామీతి.

పై యుదాహరణములను బరికించినచో రెండువిషయములు తప్పక గోచరించును. తత్సమము లెట్లు ప్రాకృతములో నున్నవి యనుట మొదటిది. రెండవది సంస్కృతరూపములకును బ్రాకృతరూపములకును గల భేదము. కేవల ముచ్చారణములో సామాన్యముగా భాషలన్నిటిలో నెట్టెట్టిమార్పులు గలుగుచున్నవియో అట్టివానివలననే గలిగిన దనుట. కామస్య—కామస్స అనురూపమును జూచినచో, ప్రాచీనరూపమగు తెచ్చుతారు అనుదానినుండి నేఁటి వ్యావహారికమున నెట్లు తెస్తారు అనురూపము గలిగినదో అట్లే పయిమార్పును గాలక్రమమునఁ గలిగినట్లు తెలియకపోదు. అట్లే జానంతి—అణంతి యని యయినది. కథం—కహం. కరిష్యామి—కరిస్సామి.

## 3. ఆంధ్రదేశ వ్యవహారస్థ ప్రాకృతమునకును తెనుఁగునకును గల సంబంధము

ఇట్లు సంస్కృత ప్రాకృతముల సంబంధమును, బ్రాకృత స్వరూపమును గొంత తెలిసికొనిన తఱువాత నాంధ్రదేశములో నేప్రాకృతము వాడుకలో నుండినది, ఆ ప్రాకృతమునకును దెనుఁగునకును నేమి సంబంధము గలదు, అను విషయము నిరూపింపవలయును. తెనుఁగున కుత్తరపు దిక్కున సన్నిహితముగా నుండు భాషలు రెండు. ఒకటి ఓఢ్రము, రెండు మరాఠీ. మరాఠీభాష మహారాష్ట్రాపభ్రంశమునుండి కలిగినది. ఈ యపభ్రంశమునకు మూలము మహారాష్ట్రీ యనంబడి, దండ్యాదులచే ప్రకృష్టమయిన ప్రాకృతముగాఁ బేర్కొనంబడినది. ఓఢ్రభాషకు మూలము మాగధాపభ్రంశము. ప్రాకృతము మాగధి. ఈ రెండు ప్రాకృతములకును దెలుఁగుతో నెంత సంబంధమున్నది యని పరిశీలింపవలసియున్నది.

తెనుఁగు ఏదైన నొక్క ప్రాకృతమునుండి కలిగినదా ? అట్లైన నేప్రాకృతము నుండి కలిగినది ? అను విషయమే ముఖ్యముగా విమర్శింపఁదగినది. ఆ విమర్శనము కొఱకే పయి ప్రాకృతభాషాచరిత్రము దిఙ్మాత్రముగా నిరూపింపఁబడినది. ప్రాకృతమునుండియే తెనుఁగు ఏర్పడినయెడల బ్రాచీనకాలమున అనఁగా తెలుఁగుయొక్క స్వరూపము శాసనముల మూలమున నయినను దెలియఁబడనికాలమున నీ యాంధ్రదేశమున నేప్రాకృతము వాడుకలో నున్నది యను విషయమును దెలిసికొని యా ప్రాకృతమునకును దెనుఁగునకును నెట్టి సంబంధము అనగా జన్యజనక భావరూప సంబంధము గలదా యని పరిశీలనచేయుట కర్తవ్యము. అత్యంత ప్రాచీనకాలముననే తెనుఁగుదేశమున ననేక ప్రాకృతశాసనము లుండుటవలన నా శాసనములను బరిశీలించి చూచినయెడల మనకు విషయము సుబోధము కాక తప్పదు. అమరావతి, జగ్గయ్యపేట, ఘంటశాల, నాగార్జునకొండ, భట్టిప్రోలు మొదలగు స్థలములయందలి శాసనములలోఁ గొన్నిఁటినిఁ బరీక్షింతము. తెనుఁగుదేశమునకు గేంద్రస్థానమయి,

బౌద్ధమతమునకుఁ బట్టుకొమ్మయయిన గొప్పస్థల మమరావతి. అది యాంధ్రుల ప్రతిభకును ప్రభావమునకును స్థానము. ఆంధ్రరాజులలో నొక్కడయిన పుళుమావి కాలమునందలి శాసన మచ్చో లభించినది. దీనినిబట్టి యా శాసనమునందలి భాషతో ఒకప్రక్క నాంధ్రరాజులకును, వేఱొకప్రక్క బౌద్ధమతమునకునుగూడఁ గొంత సంబంధమున్న దనవచ్చును.

సిధమ్. రఞో వాసిఠీపుతస సామి సిరిపులుమావిస సవచ్ఛర.... పిణ్డసు తరియానమ్ కహూతరగహపతిస పురిగహపతిస చ పుతస ఇసిలస సభాతుకస సమ.... సగినికస భయా యచ సనాకానికాయ సపుతకస....తొ మహాచేతియే చేతికియానమ్ నికాసపరిగహే అపరదారే ధమచకమ్ దేధమ్మమ్ ఠాపిత.*

ఈ శాసనమునకుఁ దెలుఁగు :

సిద్ధమ్. రాజయిన వాసిష్ఠీపుత్ర శ్రీపులుమావియొక్క సంవత్సర (మున) పిణ్డసు తరియులైన, కహూతర గృహపతిచేతను పురి గృహపతియొక్క పుత్త్రుఁడును సభ్రాతృకుఁడును సమా (తృకుఁడును) సభగినీకుఁడును సపుత్రకుఁడును భార్యయయిన నాగానికతో గూడినవాడును నయిన ఇసిలునిచేతను చేతికీయుల నికాయముయొక్క పరిగ్రహములో నున్నట్టి (భగవంతుని) యొక్క మహాచైత్యమునకు అపరద్వార మున ధర్మచక్రము దేయధర్మముగా స్థాపితము.

పయి శాసనమునకు సంస్కృత చ్ఛాయ :

సిద్ధమ్. రాజ్ఞః వాసిష్ఠీ పుత్రస్య స్వామి శ్రీపులుమావేః సంవత్సరే పిణ్డసు తరియానామ్ కహుతర గృహపతేః పురి గృహపతేశ్చ పుత్రస్య ఋషిలస్య సభ్రాతృకస్య సమా (తృకస్య) సభగినీకస్య భార్యయా నాగనికయా చ సహ సపుత్రక (స్య) (భగవ) తో మహాచైత్యే చైత్యకీయానామ్ నికాయస్య పరిగ్రహే అపరద్వారే ధర్మచక్రమ్ దేయధర్మమ్ స్థాపితమ్.

మూఁడు రూపములలో నీయంబడిన యీ శాసనమును బరిశీలించినయెడల నీ భాషలకు గల సామ్య వైషమ్యములును, సంబంధ బాంధవ్యములును స్పష్టము కాఁగలవు.

సంస్కృతములోని పదములు కొన్ని యల్పములయిన (పరిణామ) రూప భేదములను మాత్రము గల్గి ప్రాకృతములోఁ గనుపట్టును. విభక్త్యంతమయిన పదముయొక్క సిద్ధరూపము వాడుకలో నుండగాఁ గాలక్రమమున వ్యవహారములో నేర్పడు నక్షరమాత్రభేద మా పదము నాశ్రయించి రెండవభాష యేర్పడినట్లు స్పష్టము. వాశిష్ఠీ పుత్రస్య యను పదమునకును, వాసిఠీపుతస యను పదమునకును గల భేదమును దిలకించునది. శి—సి, ష్ఠీ—ఠీ, త్త్రి—త, స్య—స. పై చిహ్నమునకు ముందున్న యక్షరము తరువాతి యక్షరపు రూపమును బొందినది.

---

*అమరావతిలోను, జగ్గయ్యపేటలోను గల బౌద్ధస్తూపములు (బర్గెస్సు) పుట 100.

ఇంకొక విధమయిన మార్పేమనగా : ఇకారాంతముగా గాని నకారాంతముగా గాని భావింపవలసిన పులుమావి శబ్దమును అకారాంతముగా భావించి షష్ఠీ విభక్తిరూపమున స్య యని చేర్చుట. ఈ రెండు విధములయిన మార్పులవంటి మార్పులతోడనే చాలవఱకీ భాషయంతయును నేర్పడియున్నదనుట స్పష్టము. ఇట్టి మార్పులన్నియును నన్నిభాషలయందును వ్యవహారములో నేర్పడుననుట భాషావిదులకు సుపరిచితమే. తెనుఁగున, క్రొత్త—కొత్త, కూతును—కూతురిని, మొదలయిన మార్పులును నిటువంటి వ్యవహారజాతములయిన మార్పులే.

పుత్త్రశబ్దము పుత యయినది. ఇదియే తెనుఁగునందలి పుత్త్రార్థక శబ్ద రూపమునకు మాతృకయైనచో నది పుత యనియో పొత యనియో మఱి యేదియో తత్సదృశరూపమును బొంది యుండవలయును, గాని తెనుఁగునందలి కొడుకు నకును ఇతర ద్రావిడభాషలందలి మగన్ శబ్దమునకును పైశబ్దముతో సంబంధము గనుపట్టదుగదా! అట్లే అందలి సపితుకస, సభాతుకస, భయాయ మొదలయిన శబ్దములకును దెనుఁగునందలి తండ్రి, అన్న, తమ్మ, పెండ్లము (ఆలు) మొదలయిన శబ్దములకును సంబంధ మించుకంతయును గనుపట్టదు.

ఇట్లే తెనుఁగుదేశమున సుప్రసిద్ధముగా నుండిన ప్రాచీనకాలపు ప్రాకృతశాసనములను వేనిని దెనుఁగుతో జేర్చి పరిశీలించినను బ్రకృతి ప్రత్యయములందు జన్యజనక భావము లేశమయినను గనుపట్టదు.

ఆ ప్రదేశమునందలి యీ క్రింది చిన్నశాసనమును దిలకించునది.

"సేనగోపస ముదకుతలస థభో"

సేనానాయకుఁడయిన మృదుకుంతలుని స్తంభము.

"సేనాగోపస్య మృదుకుంతలస్య స్తంభః"

జగ్గయ్యపేట బౌద్ధస్తూపమునందలి ఇక్ష్వాకువంశజులయిన రాజుల ప్రాకృత శాసనము :

సిధమ్. రఞో మాఢరిపుతస ఇఖాఖుణమ్ సిరివిరపురిసదతస సంవచ్ఛర 20 వాసాపఖమ్ 8 దివసమ్ 10 కమ్మాకరఠే ణడతూరే ఆవెనిస నాకచందస పుతో గామే మహాకాణ్డూరూరే ఆవేసని సిధధో అపణో మాతరమ్ నాగిలనిమ్ పురతో కతూనమ్ ఘరనిమ్ చ సముదనిమ్ బాలకమ్ చ మూలసిరిమ్ బాలికమ్ చ నాకబుధనికమ్ భతుకమ్చ బుధినకమ్ తస ఘరణించ కనికమ్ బాలకాచ నాగసిరి చందసిరి బాలికమ్ యసిథదనికమ్ ఏవమ్ నాతిమిత సమ్బధివగేన, సహా గామే వెలగిరియమ్ భగవతో బుధస మహాచేతియ పువాదరే ఆయకఖమ్భే 5 సవనియుతే అపణో దేయదమ్మమ్ సవసతానమ్ హిత సుఖాయ పతిఠాపితతి॥

తెనుఁగు : సిద్ధమ్. ఇక్ష్వాకువులలో మాఢరీపుత్త్రుఁడయిన శ్రీ వీరపురుషదత్తుని 20-వ సంవత్సరమున 8-వ వర్షాపక్షమున 10-వ దివసమున కర్మాంక రాష్ట్రమున

నడతూరిలో ఆవేశనియయిన నాగచంద్రుని పుత్త్రుడు మహాకాండురూరనెడి గ్రామమున ఆవేశనియయిన సిద్ధార్థుడు తన తల్లియయిన నాగిలానిని ముందుంచుకొని గృహిణియయిన సముద్రాణి మూలసిరి యనెడు బాలకుఁడు నాగబుద్ధనిక యనెడు బాలికయును భ్రాతయగు బుధినకుఁడు అతని గృహిణియయిన కర్ణికయు బాలకులయిన నాగశ్రీ చంద్రశ్రీ, బాలికయయిన సిద్ధార్థనికయును ఇట్లు అధికమయిన సమ్బన్ధివర్గముతోఁగూడి వెలగిరియను గ్రామమందు భగవంతుడయిన బుద్ధుని యొక్క మహాచైత్యపూర్వద్వారమున 5 ఆయక స్థంభములు సవ్యనియుక్తములయి తన దేయధర్మముగా నెల్లర హితసుఖముకొఱకు ప్రతిష్ఠాపింపఁబడినవి.

సంస్కృతము: సిద్ధమ్. రాజ్ఞః మాఢరీపుత్రస్య ఇక్ష్వాకూణామ్ శ్రీ వీర పురుషదత్తస్య సంవత్సరే 20 వర్షాపక్షమ్ 8 దివసమ్ 10 కర్మాంక రాష్ట్రే నడతూరే ఆవేశనినః నాగచంద్రస్య పుత్త్రః గ్రామే మహాకాణ్డురూరే ఆవేశనీ సిద్ధార్థః అత్మనః మాతరమ్ నాగిలానీమ్ పురతః కృత్వా గృహిణీంచ సముద్రాణీమ్ బాలకంచ మూలశ్రీమ్ బాలికామ్‌చ నాగబుద్ధనికామ్ భ్రాతృకమ్‌చ బుధినకమ్ తస్య గృహిణీంచ కర్ణికామ్ బాలకౌచ నాగశ్రియమ్ చంద్రశ్రియమ్ బాలికామ్ సిద్ధార్థనికామ్ ఏవమ్ నాతిమితసంబన్ధివర్గేణ సహ గ్రామే వెలగిర్యామ్ భగవతో బుద్ధస్య మహాచైత్య పూర్వద్వారే ఆయక స్తంభాః 5 సవ్యనియుక్తాః ప్రతిష్ఠాపితాని.

పయిశాసనమునందు ఆ కాలమున నుండిన బౌద్ధోపాసకులయొక్కయు, వారి బంధువులయొక్కయుఁ బేళ్లు తెలియనగును. ఇందును ప్రాచీన ప్రాకృతభాషలో నుండినవని యూహింపఁదగిన విభక్త్యంతసిద్ధరూపములే యెట్లు పరిణతిగాంచినవో తెలియనగును. ఇందలి భాషకును నేఁటి తెనుఁగుభాషలోని తత్తదర్థకాచ్ఛాంధ్ర పదములకును జన్యజనకభావ మెట్లు లేదో స్పష్టపడుచున్నది.

ఆంధ్రరాజులకాలములోనిదియు, బళ్లారి మండలములోనిదియు నయిన పులుమావి శాసనము: (జంగిలిగుండు శాసనము) సిధమ్. రఞో సాతవహనానమ్ సిరి పుళుమావిస సవ 8 హేమ 2 దివ 1 మస మహాసేనాపతిస ఖందనాకస జనపాదే సాతవహనిహారే. మికస కూమారదతస గామే వేపురకే వథవేన గహపతికేన (కొం) తానమ్ సంబేన తళాకమ్ ఖానితమ్. (ఎ. ఇం. వా. XIV పు. 155.)

తెలుఁగు: సిద్ధమ్. శాతవాహనులలో రాజయిన శ్రీ పుళుమావియొక్క ఎనిమిదవ సంవత్సరమున హేమంత ద్వితీయమాసము మొదటిపక్షము మొదటి దివసమున మహాసేనాపతి స్కంధనాగునియొక్క సాతవాహనిహార జనపదమునందు గామిక కుమారదత్తునియొక్క వేపుర (క) మను గ్రామమున వాస్తవ్యుఁడయిన గృహపతిచేత తటాకము ఖానితము.

సంస్కృతము: సిద్ధమ్. రాజ్ఞః శాతవాహనానామ్ శ్రీ పుళుమావేః సంవత్సరే అష్టమే హేమంతపక్షే ద్వితీయే, దివసే ప్రథమే, మహాసేనాపతేః స్కంధ

నాగస్య జనపదే శాతవాహనిహారే గ్రామికస్య కుమారదత్తస్యగ్రామే వేపురకే వాస్తవ్యేన గృహపతికేన (కొంతానమ్ ?) సాంబేన తటాకమ్ ఖానితమ్.

పయి బళ్లారిమండలములోని ఆంధ్రరాజుకాలమునందలి శాసనము యొక్క భాషను పరిశీలించినను నేఁటి యచ్చాంధ్రమునకు సంబంధమేమియు గనుపట్టదుగదా! ఇందు తళాకమ్ అని వ్రాసియున్నాడు. తెనుగుశాసనములలో నెందును చెఱువు అను పదమే కనుపట్టును. ఉ॥ కంబురాంచెఱువు. వేసెఱువుళు.

శివస్కంధవర్మ యొక్క హీరహడగల్లి తామ్రశాసనము : బళ్లారిమండలములో పల్లవమహారాజులచే వ్రాయింపఁబడిన యీ క్రింది ప్రాకృతశాసనమునఁ గొన్ని పరిహారములు వ్రాయంబడినవి. గ్రామములయందు రాజునకుగాని, రాజాధికృత పురుషులకుఁగాని కొన్ని హక్కులు గలవు. గ్రామమును దేవదేయముగాని, బ్రహ్మ దేయముగాని చేయునప్పుడు ఆ హక్కులను బరిహరించి దానము చేయుదురు. వానిని పరిహారము లందురు. అట్టి పరిహారము లిందు పేర్కొనంబడినవి. వానిలోని పదములకును, నేఁటి తెనుఁగుపదములకును నెట్టి జన్యజనకభావము కలదో పరీక్షింతము.

బమ్హణాణమ్ చిలెరెక కొండుకవాటకమ్ అకర యొల్లక విసేసిఖట్టావాసమ్ అదూధదదిగహణమ్ అరట్ట సంవినయికమ్ అలోణగుళచోభమ్ అకరవెట్టి కొంజల్లమ్ అపారమ్పర బలీవద్దగహణమ్ అతణకట్ఠ గహణమ్ అహరితక సాక పుఫ గహణమ్ ఏవమాదికేహి అట్ఠారసజాతి పరిహారేహి....(ఎ. ఇం. వా. 1 పు. 6.)

పయిపదములలోఁ గొన్ని పరిహారములకుమాత్రము స్పష్టముగాఁ దెలిసిన వానికిఁ గ్రింద ఛాయ వ్రాయఁబడినది.

అదూధ దధిగహణమ్—అదుగ్ధ దధిగ్రహణమ్—అనఁగా పాలు, పెరుగు గ్రహణము లేనట్లుగా నని యర్థము. దుగ్ధ శబ్దము ప్రాకృతమున దూధ మయినది: నేఁటి హిందీభాషలో దూధ్ అయినది. తెనుఁగునను, అరవమునను పాలు. దధి—దహి—దై యయినది. తెనుఁగున నిది పెరుగు. 'అలోణ గుళచోభమ్' 'అలవణగుడక్షోభమ్' లవణము, గుడము అనువాని క్షోభము లేనట్లుగా నని యర్థము. లవణము—లోణ మయినది. గుడము—గుళము. ఉత్తరహిందూస్థాన భాషలలో గూడ్ అని దీనికి పేరు. తెనుఁగున బెల్లము, ఉప్పు అరవ మలయాళ కన్నడములు నట్లే. 'అపారంపర బలీవద్దగహణమ్' 'అపారంపర బలీవర్దగ్రహణమ్' వరుసగా నెద్దులచే గ్రహణము లేనట్లు అని యర్థము. బలీవర్దము బలీవద్ద మయినది. బైల్ అని నేటి హిందీభాష. తెనుఁగున ఎద్దు. కన్నడము ఎత్తు. 'అతణకట్ఠ గహణమ్'—'అతృణకాష్ఠ గ్రహణమ్.' తృణము తణ మయినది. కాష్ఠము కట్ఠ మయినది. తెనుఁగున తృణము గడ్డి. కట్టశబ్దభవము కట్టె. అహరితక సాక పుఫ గహణమ్—'అహరితక శాక పుష్పగ్రహణమ్' — పచ్చని

కూరలు, పువ్వులు తీసుకొనకుండనని యర్థము. హరితక శాకమునకుఁ దెనుఁగు—పచ్చికూరలు, పుష శబ్దమునకుఁ దెనుఁగు పూవు.

ఆనాఁడు వాడుకలో నుండిన ప్రాకృతభాషలో సామాన్య ప్రయోజనమును గూర్చు పాలు, పెరుగు, ఉప్పు, కట్టెలు, బెల్లము, పూలు, ఎద్దు, గడ్డి మొదలగు తెనుఁగుశబ్దములకు నేశబ్దములు వాడుకలో నుండినవి (ప్రాకృతభాషలో) అను విషయము పయిశాసనమునుబట్టి స్పష్టముగదా! ఈ ప్రాకృతశాసనములోని భాషగాని, లేక తజ్జాతమయిన భాషాంతరముగాని తెలుఁగయినయెడల నయ్యదియు నుత్తరహిందూస్థానభాషలోని దూధ్, దహి, బైల్ మొదలయిన పదములవంటి పదములనే గలిగియుండునుగదా! తెనుఁగుగూడ సంస్కృతభవముగాని యన్య ప్రాకృతభవముగాని యయియుండె ననుటకుఁ బ్రమాణము లేదు. ప్రాచీనకాలమున నార్యు లెట్లు హిందూదేశమును బ్రవేశించిరి; వైదికసంస్కృతమునుండి భిన్న భిన్న ప్రాకృతము లెట్లు కలిగినవి యను విషయమును ముందు నిరూపించితిని. హిందూదేశమున నేఁడు వాడుకలోనున్న యుత్తరహిందూస్థాన భాషలును, వానికి మాతృకలయిన యపభ్రంశములును, వానికిఁ బూర్వములయిన ప్రాకృతపరంపరయును నేకకాలమున భిన్నమండలములలో వ్యవహారములోనుండిన యేకభాషయొక్క మాండలికరూపజాలము లనుట స్పష్టపడినది. కావుననే ప్రాకృతములలోని ప్రకృతి ప్రత్యయజాలమంతయు నీషద్వైషమ్యముమాత్రము గలిగియున్నట్లు స్పష్టపడుచునే యున్నది. హిందీగాని, మాహారాష్ట్రిగాని తెలిసినవానికి నేటి యుత్తరహిందూస్థానభాష లతిశీఘ్రముగాఁ బట్టుపడఁ గలవు. ప్రాచీన ప్రాకృతములలోఁగూడ నొక భాషయం దొక పదములో నొకవర్ణ మున్నయెడల మఱియొక ప్రాకృతమునఁ దత్సదృశవర్ణమాత్ర భేదముతో నా పదము కనుపట్టుచునే యుండును. ఈ క్రిందిపట్టికలోని ప్రకృతులను బరీక్షించునది. ప్రత్యయము లెట్లు భిన్నప్రాకృతములలో భిన్నరూపములను బొందినవో మున్ముందు తెలుపఁబడును.[21]

| సంస్కృతము | పాళీ | పైశాచీ | శౌరసేనీ | మాగధీ |
|---|---|---|---|---|
| లోక | లోక | లోక | లోఅ | లోఅ |
| *నగ | నగ | నగ | ణఅ | ణఅ |
| శచీ | సచీ | సచీ | సఈ | శఈ |
| *రజత | రజత | రజత | రఅద | లఅద |
| కృత | కత | కత | కద | కడ |
| *కర | కర | కర | కర | కల |
| వశ | వస | వస | వస | వశ |
| *మేష | మేస | మేస | మేస | మేశ |

[21] పాఇఅ సద్దమహణ్ణవో. ఉపోద్ఘాతము. పుట. 15. (ఉద్ధృతము.)

| సంస్కృతము | పాళీ | పైశాచీ | శౌరసేనీ | మాగధీ |
|---|---|---|---|---|
| సారస | సారస | సారస | సారస | శాలశ |
| *వచన | వచన | వచన | వఅణ | వఅణ |
| పట్ట | పట్ట | పట్ట | పట్ట | పస్ట |
| అర్థ | అత్థ | అత్థ | అత్థ | అస్త |
| *వృక్షః | రుక్ఖో | రుక్ఖో | రుక్ఖో | లుక్ఖే |

పై పదములను బరిశీలించినయెడల నా భాష లన్నియును నేకభాషాజాతము లని స్పష్టపడక తప్పదు.

పయిని నిరూపింపఁబడిన పట్టికలో పూ గుర్తించిన పదములకు సరియైన తెనుఁగు పదములును, ఇతర ద్రావిడభాషాపదములునుగూర్చి పరీక్షించినచో భాషా సంబంధమును, గుటుంబభేదమును స్పష్టపడగలదు.

| తెలుఁగు | అరవము | కన్నడము | మలయాళము |
|---|---|---|---|
| కొండ | కున్ఱు | కొండ | కున్ను, |
| వెండి | వెళ్ళి | బెళ్ళి | వెళ్ళి |
| చే(యి) | సెయ్ | కెయ్ | చెయ్ |
| గొటియ(ఱ) | కొఱ | కొఱ | కొఱ |
| మాట | మాట్ఱు | మాతు | మాట్టు |
| మ్రాను | మరం | మర | మరం |
| చెట్టు | చెడి | గిడ | చెడి |

పయిని నిరూపింపబడిన సంస్కృత ప్రాకృతపదములును, క్రింద నిరూపింపఁబడిన తెలుఁగు మొదలయిన ద్రావిడభాషాపదములును బరిశీలించినచో నవి రెండు భిన్న భాషలనుండి యేర్పడిన మాండలికభేదము లనుట స్పష్టపడక తప్పదుగదా

## 4. పైశాచీభాష

ఆంధ్రరాజయిన శాతకర్ణి కాలములోఁ బ్రతిష్ఠాననగరమున నుండిన గుణాఢ్యుఁడు చేసిన శపథమును, ఆతఁడు వ్రాసినదని చెప్పఁబడిన బృహత్కథనుగుఱించియు ముందే పేర్కొంటిని.

"సంస్కృతం ప్రాకృతం తద్వ ద్దేశభాషా చ సర్వథా । భాషాత్రయ మిదం త్యక్తం య న్మనుష్యేషు సంభవేత్." అనుటచేత సంస్కృతమును, ప్రాకృతమును, దేశభాషయును మనుష్యులయందు గలవానిని త్యజింతుననియు, మనుష్యసంబంధము లేని భూతభాష, లేక పైశాచీభాష నుపయోగింతుననియు నుద్దేశము. పయి

మూఁడిటియందును సంస్కృతము ప్రసిద్ధము. ప్రాకృత మనగా నేప్రాకృతమని మన మడుగవలసి వచ్చుచున్నది. ఆ దేశములో గ్రంథరచన కుపయోగించుచుండిన గ్రంథస్థ ప్రాకృతభాష యని యర్థము. హాలునికాలములోనిదయిన సప్తశతి (సత్తసఈ) యను గ్రంథము మనకు లభించుచున్నది. ఆ గ్రంథము అనేకులయిన కవులచే వ్రాయంబడిన పద్యముల కూర్పు. కావున నా కాలమున బహుళముగా గ్రంథరచనమున కుపయోగించుచుండిన భాష సప్తశతిలోని భాషయే యనవచ్చును గదా ! అది మాహారాష్ట్రీ యనెడు ప్రాకృతమే. ఈ మాహారాష్ట్రీకే ప్రాకృతము అను నామము రూఢమయినట్లు తెలియవచ్చుచున్నది. దండి తన కావ్యాదర్శమున మహారాష్ట్రి దేశాశ్రితమయిన భాష ప్రకృష్టమయిన ప్రాకృతమని నిర్వచించెను.[22] కావున గుణాఢ్యుని వచనముగాఁ జెప్పఁబడిన పై శ్లోకములో ప్రాకృత మనగా మాహారాష్ట్రీప్రాకృత మని భావము. పైఠానునగరమే తరువాతను మహారాష్ట్రా పభ్రంశజాతమయిన మరాఠీభాషాకావ్యములకును గేంద్రస్థానమయి యొప్పు చుండినది. ఇఁక నా శ్లోకములో నాతఁడు వచించిన దేశభాష యెయ్యది యను ప్రశ్నకు సమాధానము చెప్పవలయును. అది సంస్కృత ప్రాకృతము (మాహారాష్ట్రీప్రాకృతము)లకంటె భిన్నము గావలయునుగదా! సంస్కృత ప్రాకృతము లనెడి పదముల నేగాక, దేశభాష యను పదమును ప్రాచీనకాలమునుండియు ననేకులు ఉపయోగించియుండిరి. మహాభారతము, భరతుని నాట్యశాస్త్రము, వాత్స్యాయనుని కామసూత్రములు మొదలగు ననేకగ్రంథములయందు దేశభాషాప్రశంస చేయఁ బడినది.[23]

విక్రమశకము తొమ్మిదవ శతాబ్దమునకుఁ జేరినదని లెక్కింపఁబడిన 'కువలయ మాలాకథ' అను ప్రాకృతకావ్యములో పదునెనిమిది దేశభాషలును, ఆ భాషల పేళ్ళును ఉదాహరింపఁబడినవనియును తెలియవచ్చుచున్నది.[24] బాణుఁడు తన

---

[22] మహారాష్ట్రాశ్రయాం భాషాం ప్రకృష్టం ప్రాకృతం విదుః। సాగరః సూక్తిరత్నానాం సేతుబంధాది యన్మయమ్॥ (1-34 కావ్యాదర్శము.)

[23] నానాచర్మాభిరాచ్ఛన్నా నానాభాషాశ్చ భారత, కుశలా దేశభాషాసు రాః॥ మహాభారతము-శల్యపర్వము-46 - 103.

"అతఊర్ధ్వం వక్ష్యామి దేశభాషా వికల్పనమ్." } నాట్యశాస్త్రము
"అథవా ఛందతః కార్యా దేశభాషా ప్రయోక్తృభిః." } 17, 24, 46

"నాత్యంతం సంస్కృతేనైవ నాత్యంతం దేశభాషయా। కథాం గోష్ఠీషు కథయఁ లోకే బహుమతో భవేత్॥ కామసూత్రము 1-4, 50" అట్ఠారస విహి ప్పగారదేసీ భాసా విసారఏ. అట్ఠారసదేసీ భాసా విసారయా (జ్ఞాతధర్మ కథాసూత్ర) అట్ఠారసదేసీ భాసా విసారయా (విపాకశ్రుత) అట్ఠారసదేసీ భాసా విసారఏ (ఔపపాతికెసూత్ర) అట్ఠారస విహదేసి ప్పగార భాసా విసారఏ (రాజప్రశ్నీయసూత్ర)

[24] చూ॥ గిడుగు రామమూర్తిపంతులుగారి స్మారక వ్యాససంగ్రహము: పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు (ప్రాకృత గ్రంథకర్తలూ-ప్రజాసేవాను)

హర్షచరిత్రలో (8-వ శతాబ్దము క్రీ. వె.) భాషాకవి యను పేరితో దేశభాషాకవిని పేర్కొనినట్లు ముం దుదాహరించియున్నాను.

ఈ దేశభాషా శబ్దమును భిన్నకాలములలో నుపయోగించిన పయి గ్రంథ కర్తల యుద్దేశముచొప్పున నేకభాషావిశేషమే ఉద్దేశింపఁబడినదని యర్థము గాదు. వారి వారి కాలములలో నా యా దేశములయందు గ్రంథస్థవాఙ్మయమునకు భిన్నముగాఁ బ్రజలచే వాడఁబడుచుండిన దైనికవ్యవహారోపయోగి భాష యని యర్థము చెప్పవలయును. ఆ యర్థముచొప్పున ప్రాకృతములు దైనికవ్యవహారములో నుండి నప్పు డవియే దేశభాషలు. ప్రాకృతములు గ్రంథస్థములయి యపభ్రంశములు మాత్రమే వాడుకలో నున్నప్పు డవియే దేశభాష లని మన మూహింపవలయును. కాఁబట్టి సోమదేవసూరి వ్రాసిన పైశ్లోకములోని యభిప్రాయము గుణాఢ్యుని కాలములోని యవస్థను సరిగ నిరూపించుచుండినదని మన మొప్పుకొనినచో నందలి దేశభాషాపదమునకు సంస్కృతము, మహారాష్ట్ర ప్రాకృతము గాక మహారాష్ట్ర దేశమున సంభవించి వాడుకలో నుండిన యపభ్రంశవిశేష మనియే యర్థముచేయక తప్పదు.

కాఁగా నాతఁడు వ్రాసిన పైశాచీభాష యేది యను ప్రశ్న మిగిలియున్నది. పైశాచీభాషనుగురించి సోమదేవసూరి గ్రంథములోని కథనుబట్టి చూడగా నయ్యది పిశాచముల భాష యనియు, గుణాఢ్యుఁడు దానిని రక్తమునే మసిగా వల్లకాటిలో రచించెననియుఁ దేలుచున్నది. పిశాచము లనగా దయ్యములు లేక భూతములు అనియే భావము. కావుననే శపథమునుగూర్చిన శ్లోకములలో "మనుష్యేషు సంభవేత్" అని యేది మనుష్యులలో సంభవించునో ఆ భాషను బరిహరించి అని చెప్పియున్నాడు. కావున నిది మనుష్యభాష కాదని భావము. ఈ గ్రంథమును శ్రీ శాతవాహనమహారాజునకు వినిపింపఁబోవఁగా నాతఁడు విజ్ఞానమదముచే నద్దానిని నీరసమయిన పిశాచభాష[25] యని నిరసించినట్లు తేలుచున్నది. తరువాత గుణాఢ్యుఁడు నిరాశుఁడై యా కథను శిష్యులకుఁ జదివి వినిపించి యొక్కొక్క పత్రమును నిప్పులో వేసెననియు దెలియవచ్చుచున్నది. ఒక లక్షశ్లోకముల కథమాత్రము మిగిలినది

ఇట్లు నశించిన బృహత్కథను సంగ్రహముగా సంస్కృతమున ముగ్గురు రచియించిరి. బుద్ధస్వామి రచించిన బృహత్కథాశ్లోకసంగ్రహము. ఇది నేపాళ దేశమునుండి సంపాదింపఁబడినది. ఇది బృహత్కథానువాదక గ్రంథములలో నెల్లను బ్రాచీనమని పండితుల యభిప్రాయము.[26] రెండవది క్షేమేంద్రుఁడను

---

[25] పిశాచభాషాం తాం శ్రుత్వా తౌ చ దృష్ట్వా తదాకృతీ। విద్యామదేన సాసూయం స రాజైవ మభాషత, ప్రమాణం సప్తలక్షాణి పైశాచం నీరసం వచః। శోణితే నాక్షరన్యాసో ధిక్పిశాచ కథా మిమామ్.-కథా సరిత్సాగరము. లి. సర్వే. వా. I. 108-110.

[26] *Classical Sanskrit Literature* by M. Krishnamachariar. 412-422. *Essay on Gunadhya and Brihatkatha* by Prof. Felix Lacate. Page 1-45.

నాతఁడు వ్రాసిన బృహత్కథామంజరి. ఇతడు కాశ్మీరదేశపు రాజయిన అనంతుని కాలములో (1029-1064 క్రీ. వె.) నుండినవాఁడు. సోమదేవసూరి యనునతఁడును, బయిదేశముననే పయిప్రభువు నాస్థానముననే యుండినవాఁడు. ఈతఁడే కథాసరిత్సాగర మనుపేర సంస్కృత శ్లోకములలో బృహత్కథను వ్రాసియున్నాఁడు. కీ. శే. శ్రీ వేదము వేంకటరాయ శాస్త్రులవారు తెనుఁగున గద్యరూపమున దీనిని రచించియున్నారు. సోమదేవుఁడు మూలమున నెట్లున్నదో అట్లే వ్రాసితి నని చెప్పియున్నాఁడు.[27] అనఁగా నాతఁడు పైశాచీభాషాగతమయిన మూలకథను జూచియే వ్రాసియున్నాఁడని స్పష్టముకదా!

ఈ బృహత్కథకు నుత్తరహిందూస్థానపు సంస్కృత సారస్వతములోఁ జాల ప్రశస్తి గలదు. కాళిదాసుఁడు తన మేఘసందేశములో ఉదయనకథాకోవిదులయిన గ్రామవృద్ధులని వ్రాసియున్నాఁడు. ఈ ఉదయనకథ బృహత్కథలోనిదే. బాణుఁడు బృహత్కథను హారలీలవంటిదని స్తుతించినాడు.[28] సుబంధుఁడు బృహత్కథను బేర్కొనెను. దశరూపకకర్త యయిన ధనికుఁడు బృహత్కథను బేర్కొనియున్నాఁడు. ౯-వ శతాబ్దములో నుండిన దుర్వినీతుఁడను రాజు బృహత్కథను నొకానొక తామ్రశాసనములోఁ బేర్కొనెను. ఇట్లనేకవిధముల ననేకులచే పొగడ్తఁ గని వాల్మీకి, వ్యాసులతో సమానుడుగా గోవర్ధనునిచే స్తుతింపఁబడిన గుణాఢ్యుని బృహత్కథ చాల గొప్పదనుటలో సంశయము లేదు. అట్టి బృహత్కథను వ్రాసిన గుణాఢ్యుఁ డాంధ్రరాజగు శాతవాహనుని ముఖ్యపట్టణమయిన ప్రతిష్ఠాననగరమున జనించెను. నేపాలమాహాత్మ్య మను కథనుబట్టి యాతడు నేపాలదేశమునకుఁ బోయి యచ్చట తపస్సు చేసెనని తెలియుచున్నది.

పయి వృత్తాంతమునుబట్టి తేలిన దేమనఁగా నాంధ్రనగరములోఁ బుట్టిన గుణాఢ్యుఁ డొకానొక కారణమున నేపాలదేశమునకుఁ బోయి సంస్కృత ప్రాకృత దేశభాషలు గాక యితరమయిన పిశాచభాషలో బృహత్కథను వ్రాసి తేగా శాతవాహనరాజు తననిని, దద్గ్రంథమును దిరస్కరించెను. ఆ గ్రంథమునకుఁ బ్రచారము కాశ్మీర, నేపాళ దేశములనే యధికము. ఏలయనఁగా నా గ్రంథమును మూలముగా గొని వ్రాయఁబడిన మూఁడు గ్రంథములును ఆ రెండుదేశములలోనే బయల్వెడలినవి. ప్రతిష్ఠాననగరమున దానికిఁ దిరస్కారమేగాని, పురస్కారము కలుగలేదు. ఈ పైశాచీభాష పిశాచములు వాడిన దనియు, మనుష్యులు వాడునది గాదనియు ననుట యసంగతము. ఎక్కడనో యొక్కెడ జనులు మాటాడుచుండినదియే గావలయు. కాశ్మీర, నేపాళ దేశములకుఁ బయిగ్రంథములతోడను

[27] యథామూలం తథైవైత న్నమనాగ ప్యతిక్రమః, ఔచిత్యాన్వయరక్షా చ యథాశక్తి విధీయతే. [28] సముద్దీపితకందర్పా కృత గౌరీప్రసాధనా, హారలీలేవ నో కస్య విస్మయాయ బృహత్కథా॥ హర్షచరిత్ర. ఉపో.

దత్కర్తతోడను సంబంధము గలిగినట్లు నిశ్చయము గావున నా భాషకును నా దేశములకును సంబంధ ముండి యుండవలయునని యూహించుట సులభము.

ఈ పిశాచభాషనుగుఱించి యితరు లేమిచెప్పిరో పరిశీలించి వారి యభిప్రాయములను బయి గుణాఢ్యుని కథవలనఁ దేలిన సారాంశముతోఁ బరిశీలించి సమన్వయ పఱుపవలయును. సర్ జార్జి గ్రియరుసనుగారు నేటి హిందూస్థానమున కుత్తరమున మాటాడు కొన్ని భాషలు పిశాచభాష లనియు నవి దరద దేశమున మాటాడుచున్నా రనియు వానికి దర్దిక భాషలని పేరిడితి మనియు వ్రాసియున్నారు.[29] ఆ దేశభాగములలో నుండిన జనులనే పూర్వులు పిశాచములని చెప్పుచుండిరనియు, వారి భాషనుండి యపభ్రంశములుగా నేర్పడిన నేటి వ్యావహారిక భాషలకే పిశాచభాషలని పేరనియు వ్రాసియున్నారు. దర్దిస్థాన మనంబడిన యాప్రదేశము గిల్గితు, కాశ్మీరము, కోహిస్తాను, కాఫీరిస్తాను, చిత్రాలు అను భాగములను గూడియున్నది. ఈ ప్రదేశము లన్నియును హిందూస్థానమునకుఁ బశ్చిమపార్శ్వమున నుత్తరపుగోన నున్నవి. సమీపమున నున్న దేశభాషలను బరిశీలింపగా నీ భాషలు ప్రాచీనకాలమున పంజాబునంతటను వ్యాపించి నేపాళ దేశమువఱకు నుండినట్లు తెలుచున్నదనియు, వాని ప్రచారము కాలక్రమమున నశించినదనియు వ్రాసియున్నారు. కాఁబట్టి పయి గుణాఢ్యుని కథతో వారి యభిప్రాయము సమన్వయపడియే యున్నది.

ప్రాచీనులయిన సంస్కృతాలంకారికులును, ప్రాకృత వ్యాకరణకర్తలును పైశాచీభాషను బేర్కొనిరి. ప్రాకృతప్రకాశమునందును, ఆచార్య హేమచంద్రుని ప్రాకృతవ్యాకరణమునందును, షడ్భాషాచంద్రిక, ప్రాకృతసర్వస్వము మొదలయిన వ్యాకరణగ్రంథములందును, రుద్రటుఁడు, వాగ్భటుఁడు మొదలగు నాలంకారికుల చేతను నీ భాష యుదాహరింపఁబడినది. ఆలంకారికు లీ భాషను భూత భాషితమనియు, నాటకాదులలోఁ బిశాచములు, రాక్షసులు మొదలయిన పాత్రల కుపయోగింప నగు ననియు వ్రాసిరి. షడ్భాషాచంద్రికాకారుఁడు[30] పిశాచ దేశములను బేర్కొనెను. మార్కండేయుఁడు తన ప్రాకృతసర్వస్వమునందుఁ బ్రాకృతచంద్రికలోని వచనము నుద్ధరించి పైశాచీభాష 11 విధములని వచియించిన దానిని ఖండించి పైశాచీభాష త్రివిధమనియు, నయ్యది కైకయము, శౌరసేనము, పాంచాలము నని సిద్ధాంతపరచెను.[31] ఇదియు బైదానితో సరిపోవు చున్నది. ప్రాకృతచంద్రికాకారుఁడు చెప్పిన వాక్యములోని దేశము లేకదాని

[29] లి. సర్వే. వా. I పుట. 108—114. [30] పాండ్య కేకయ వాహ్లీక సహ్యా నేపాల కుంతలాః, సుధేష్ణ భోజ గాంధార హైవ కన్నోజనా స్తథా । ఏతే పిశాచదేశాః స్స్యుః.

[31] ప్రాకృతచంద్రిక 'కాంచీదేశీయ పాండ్యేచ పాంచాలం గౌడ మాగధమ్ । వ్రాచడం దాక్షిణాత్యంచ శౌరసేనంచ కైకయమ్ । శాబరం ద్రావిడంచైవ ఏకాదశ పిశాచజాః' కైకయం శౌరసేనం చ పాంచాల మితి చ త్రిధా పైశాచ్యః॥ (ప్రాకృత సర్వస్వము.)

కొంతటి దూరముగా నుండుటచేతను, నందలి ప్రాకృతములకును పిశాచభాషకుఁ జెప్పిన లక్షణములకును జాల భేద ముండుటవలనను నాతని యభిప్రాయము సరికా దని చెప్పక తప్పదు.

ఇట్టి పైశాచీభాషతో దెనుఁగున కెట్టి జన్యజనక భావముగాని యభేదము గాని కలుగుట యసంభవమని చెప్పనక్కరలేదుగదా! ఆంధ్రరాజగు శాతకర్ణి పాలించిన ప్రతిష్ఠాననగరమున గుణాఢ్యుఁడు జనించుటవలనను, నేఁటి తెలుఁగుభాష కాంధ్రమని పే రుండుటచేతను పైశాచీభాషకును దెనుఁగునకును సంబంధము గలదని భ్రాంతి కలుగుట కవకాశ ముండును. మహారాష్ట్రీప్రాకృతమునకును, నేఁటి మరాఠీ కిని స్థానమయిన ప్రతిష్ఠానమునకును నేఁటి తెనుఁగుదేశమునకును సుమారు రెండు వందలమైళ్ళ దూర మున్నది. భాషాస్వరూప స్వభావములలో నెట్టిసోదరభావమును నిరూపించుటకు వీలు లేదు.

## 5. తెనుఁగునకును సంస్కృత ప్రాకృతములకును జన్యజనకభావ సంబంధము లేదు

ఈ విషయమునుగురించి యింతకుముందే కొంత విమర్శనము చేయఁబడినది. ఆంధ్రదేశములో లభించిన ప్రాకృతశాసనములలో నుండిన భాషయును నయ్యది యెట్లు తెనుఁగునకు మాతృక కాఁజాల దను విషయమును గొంత వివరించితిని. తెనుఁగు ప్రాకృతజన్యము కాదనుటకుఁ గల యుక్తుల నీ క్రిందఁ గ్రోడీకరించు చున్నాను.

(1) తెనుఁగులోఁ గొన్ని ప్రాకృతభవములును, ప్రాకృతసమములు నున్న వెల్ల రును నంగీకరించిన విషయమే. అవి యెట్లు వచ్చియుండు నను విషయమును ముందు చెప్పినవానినిఁబట్టి యూహింపనగును. ఏ యే ప్రాకృతమునుండి పదము లెట్లెట్లు వచ్చిన వను విషయము మున్ముందు తెనుఁగుశబ్దజాలమునుగూర్చి విమర్శించు నపుడు తెలుపఁబడును. ఇట్లు నిశ్చయింపఁబడిన తద్భవములు పోగా మిగిలిన దేశ్య శబ్దజాలము, దైనికవ్యవహారోపయోగమునకు వలసినట్టి పదములగు ప్రాథమిక సంఖ్యావాచకములు, సంబంధబోధక పదములు, క్రియలు అగునవి తెనుఁగున మిగిలి యుండుటచేతను, వానికిఁ బ్రాకృతమూలములు చూపించుటకు వీలు లేకుండుట చేతను, నయ్యవి తెనుగున సిద్ధము లనక తప్పదు. కాఁబట్టి శబ్దప్రకృతుల విషయమున తెనుఁగునకును బ్రాకృతములకును జన్యజనకభావముగాని, సోదరభావముగాని యంగీకరింప వీలు లేదు.

(2) తెనుఁగునందలి నామవిభక్తి ప్రత్యయములు స్వతంత్రములయిన తెనుఁగు పదములుగానే యుండి కాలక్రమమునఁ దమ స్వాతంత్ర్యమును దొలఁగి ప్రత్య యత్వమునుమాత్రమే పొందియుండుట స్పష్టముగా నిరూపింపవచ్చును. ఇట్టి

ప్రత్యయములకును, ప్రాచీన వైదికకాలమునందు వాడుకలో నుండి నాఁటి ప్రాకృతములలోను, సంస్కృతమునను నీపత్తయిన రూపభేదముతో నుండిన ప్రత్యయముల వికారములుగా వచ్చి ప్రాకృతములోఁ గనుపట్టుచుండిన ప్రత్యయములకును సంబంధమేమియు లేకుండుటచేత తెనుఁగునకును, సంస్కృత ప్రాకృతములకును జన్య జనక సంబంధము లేదు. ఈ విషయము తిరిగి తెనుఁగు ప్రత్యయముల చరిత్రము విచారించు నపుడు వివరింపఁబడును.

(3) ప్రాకృతమునందలి ధాతువులను వేరుగా నిరూపించి సంస్కృతమునందువలె లకారప్రక్రియ నేర్పఱచుటకంటె సంస్కృత క్రియారూపములనుండి ప్రాకృత రూపములను గల్పించుటయే యుక్తము. ఏలన తిజన్త సిద్ధరూపములు వాడుకలో నుండినవి భిన్న భిన్న మార్గముల రూపాంతరములు పొందియుండుటచే నా ప్రాథమిక సంస్కృత ధాతురూపములనే వైయాకరణు లంగీకరింపవలసివచ్చెను. భవతి యను సిద్ధరూపమునుండి కాలక్రమమున హవది, హవఇ, హోఇ ఇత్యాది రూపములు భిన్న భిన్న దేశములలో నేర్పడినవనుటయే లెస్స. కావున వానికన్నిటికిని నొక్క ధాతుకల్పనమును, తిజన్తప్రక్రియయుఁ జేయుట సులభముగా సందర్భపడదు. అట్లు చేసిన ప్రయత్నముల కృతకత్వము స్పష్టమే. ఏప్రాకృతమును బరీక్షించినను నయ్యది యట్టి రూపములతోనే యున్నట్లు స్పష్టపడుచుండును. తెనుఁ గట్లుకాక తనంతట తా నేర్పడి వ్యాకరింపఁబడి యుండుటచేత వైయాకరణాంగీకృతము లయిన ధాతురూపములు స్పష్టముగా గనుపట్టుచునే యుండును. 'వచ్చుచున్నాడు' మొదలయిన వర్తమానాదికరూపములను బరిశీలించిన నందు ధాతువు వచ్చు అని స్పష్టపడును. అట్టి యీ ప్రాకృతాంధ్రములకు జన్య జనక భావముగాని, సోదరభావముగాని పొసగదు. ఇఁక సంస్కృతమునందలి ధాతువులను బేర్కొని తెనుగునందలి ధాతువులలో యత్కించిద్వర్ణసామ్యము గలవానిని వేఱుపఱచి జన్య జనకభావమును నిరూపింపఁ బ్రయత్నించుటగూడ నొకమార్గమే కాని యిది భాషాస్వభావమునకు విరుద్ధము. ప్రాకృతభాషలను పరీక్షించుటవలనను, తెనుఁగు మొదలయిన భాషలలోని తద్భవములను బరీక్షించుటవలనను, మనము తెలిసికొనిన దేమనగా వ్యవహారములో నుండిన సిద్ధరూపములైన భవతి, రామస్య మొదలగు వానివంటి రూపములను వాడుటలో నపభ్రంశము లేర్పడి క్రొత్తభాషలు పుట్టునుగాని ధాతుమాత్రములనుండి గా దనుట. తెనుఁగునందు పెరుగు, విరుగు, వెదకు, పలుకు మొదలయిన 'కు', 'గు' లు అంతమందు గల ధాతువు లనేకములు గలవు. ఈ 'కు, 'ంగు' లను 'కృ' ధాతువికారములుగా భావించి యా 'కృ' ధాతువే యితర సంస్కృతధాతువులతో సమ్మేళన మయి తెనుఁగు ధాతువులు పుట్టె ననవచ్చు నని ఆంధ్రభాషాచరిత్రకారుని మతము. యమ్ + కృ = ఈఁకు. కృశ్ + కృ = కెలఁకు ; స్తృ + కృ = తొలకు ; ఈ విధమయిన యభిప్రాయమున విచారణీయమయిన యంశ మొక్కటి సంస్కృతమునందలి ధాతువులను వైయాకరణులు

క్రియారూపముల సమానాంశములనుండి కత్తిరించిరి. భాష ధాతురూపముసమాత్ర ముండినకాలములో నవి యుపయోగింపబడుచుండగా వానిని విని తెనుఁగువారు గ్రహించిరని మనము తలంపవలయును. లేనిచో నా ధాతువులు ధాతుమాత్రమున తెనుఁగులోనికి రావుగదా! వైదికసంస్కృతముకంటెను దానికి మూలమయిన ఐరేనీయసంస్కృతమూలరూప మగు భాషకంటెను నెప్పుడో యెంతకాలమునకు ముందో యుండిన ధాతురూపములను మిక్కిలి యర్వాచీనమగు తెనుఁగు గ్రహించిన దని చెప్పుటకు వలనుపడదుగదా! అత్యంత ప్రాచీనకాలమున అనగాఁ జరిత్రము నకును, ఊహకును నందనికాలమున నెల్లభాషలును నేకాచ్క ద్వ్యాచ్క ధాతురూప ములుగా నుండెనేమో యను వాద మొకటి కలదు. అట్టి స్వరూప మొకప్పుడు సంస్కృతమున కుండిన నుండవచ్చునని యంగీకరించిననుగూడ నది యెంత ప్రాచీన కాలమున నుండెనోగూడ నూహ కందనిది. అట్టి ధాతువులనుండి మిక్కిలి యర్వాచీనములయిన తెనుఁగుధాతువు లేర్పడినవని యూహించుటకు మార్గము లేదు. ఇది చారిత్రకపద్ధతి గాదు. ఒకరూపమునుండి మఱియొకరూపమును బుట్టించు నప్పుడు నడుమ నుండు రూపము లెట్లుండినవో వాని నన్నిటినిగూడ నిరూపింపవలెను.

ధ్వనులలో నేవో కొన్ని యాదృచ్ఛికసాదృశ్యము లన్నిభాషలయందును గనుపట్టవచ్చును. అంతమాత్రమున జన్య జనకభావ మంగీకరించుటకు వీలులేదు.

(4) తెనుగునందలి కృత్తద్ధితప్రక్రియకును సంస్కృతమునందలి కృత్తద్ధిత ప్రక్రియకును సంబంధమే లేదు. అందు రూపములు కలుగు పద్ధతులకును, నిందు రూప ములు గలుగు మార్గములకును సామ్యముగాని జన్య జనకభావముగాని కనుపట్టదు. సంస్కృతమునందలి కృత్తద్ధిత సిద్ధరూపములకు వికృతులు ప్రాకృతమునందలి శబ్దములు. తెనుఁగురూపములు తెనుఁగుధాతువులనుండి తెనుఁగుప్రత్యయములు చేర్చుటచే నేర్పడినవి. సంస్కృతమునందలి ప్రత్యయము లనేకములు. భిన్నార్థము లేర్పడు టకు భిన్నప్రత్యయములు చేర్పఁబడుచుండును. సంస్కృతవ్యాకరణములో నున్న కృత్తద్ధితప్రణాళిక చాల విశాలమయినది. తెనుఁగు వ్యాకరణములోని దత్యల్పము. దానికిని దీనికిని సామ్యము లేదు.

(5) సమాసరచన: సంస్కృతమున దీర్ఘసమాసరచన గలదు. అనేకపద బహుళమయిన సమాసములు అనేకములుగా ప్రయోగింపఁబడినవి. తెలుఁగు సమా సము లత్యల్పపదఘటితములు. సంస్కృతమునందలి సమాసాంతకార్యములు తెనుఁగున లేవు. తెనుఁగున నున్న కొన్ని సమాసములలో సమాసాశ్రయవిధు లున్న వని కొందఱు వైయాకరణులు నిరూపింప యత్నించిరిగాని యది కేవల సంస్కృత వ్యాకరణసంప్రదాయజ్ఞానమువలనఁ గలిగినదే.

(6) సంస్కృతమునందలి ఏడు విభక్తుల విధానము దెనుగునఁ బ్రవేశించి నది. కాని యది తెనుగుభాషయొక్క స్వభావముతో నతుకదు. తెనుఁగున కంత

కంటె భిన్నమును సంక్షిప్తమును నగు విభక్తిప్రణాళిక యుక్తియుక్తముగా నుండును. ప్రాకృతమునందే సంస్కృతమునందలి వచన విభక్తివ్యవస్థ వైశాల్యమున సన్నగిల్లినది.

(7) సంస్కృతమునందలి వాక్యరచనమునకును దెనుఁగునందలి వాక్యరచనకును జాల స్వాతంత్ర్యమును నిరూపించు భిన్నత గలదు. సంస్కృతమునందలి కారక సంబంధ మంతయునుఁ దెనుగునకుఁ జొరదు. సంస్కృతవాక్యముకంటెఁ దెనుఁగు వాక్యము చాల నల్పమయినదియు, భిన్నమయినదియు నగు నిర్మాణము గలది.

(8) ధ్వనులవిషయమున సంస్కృత ప్రాకృతములకును దెనుఁగునకును జాల భేద మున్నది. తెనుఁగున ఒత్తక్షరములు (మహాప్రాణములు) లేవు. సంస్కృతమునను, ప్రాకృతమునను నవి మిక్కిలి బహుళము. తెనుఁగునందు హ్రస్వము లయిన ఎ, ఒ, చ, జ, ఱ, లు గలవు. సంస్కృతమున నయ్యవి లేవు. ప్రాచీన వైదికసంస్కృతముననే దానికి మూలమయిన భాషలో లేని టవర్గము హిందూ దేశములో నవ్యముగా గలిగినది. ఇతర ద్రావిడభాషలనుబట్టియుఁ దెనుఁగును బట్టియుఁ బరిశీలింపగా నీ మూర్ధన్యాక్షరములు తెనుగునకు స్వాభావికము లని తేలుచున్నది. ఎ, ఒ, ఐ, ఔ, చ, జ, లు ప్రాకృతమున నున్నవనుటలో భిన్నాభిప్రాయములు గలవు. ఉండినను నయ్యవి యందు ఏర్పడియుండ వచ్చును. ఆ కార్యమున కీ ద్రావిడభాషాసాహచర్యము హేతు వయియుండిన నుండవచ్చును. కావున నీ భాషలకు జన్య జనకభావము నంగీకరించుటకు వీలులేదు.

(9) సంధి విషయముననుఁ దెనుఁగునకును సంస్కృత ప్రాకృతములకును సామ్యము లేదు. సంస్కృతమున సంధి పలువిధములు. అందు పదగతమయిన యచ్చుయొక్క రూప మట్లే నిలువవలయు నను పట్టుదల లేదు. ( Agglutinative ) సంయోగాత్మకమయిన తెనుఁగు మొదలగు ద్రావిడభాషలలో పదమునందలి యచ్చులట్లే యుండుట మిక్కిలి సాధారణము. ప్రాకృతపదములు సంస్కృతమునందలి సిద్ధ సంధితో నట్లే మాఱి వచ్చినవి. కావున నం దదిగనుపట్టును. తెనుఁగున నట్టిది లేదు.

(10) తెనుఁగునందలి తిజ్విభక్తులు కేవలమును సర్వనామములే యనియు, నట్టివి విశేషముగా రూపపరిణతి నందలేదనియు సులభముగాఁ దెలియుచునే యుండును. సంస్కృతమునం దట్టి స్వరూపము మిక్కిలి ప్రాచీనకాలముననే మఱుగు పడిపోయినది. ఇంతియగాక యందలి తిజ్విభక్తులకును తెనుఁగు తిజ్విభక్తులకును జన్యజనకభావమును శంకించుటకు వీలులేదు. ఏలయన నందలి సర్వనామములు తెనుఁగులోని సర్వనామములకంటె భిన్నములు. ప్రాకృతమునందు సంస్కృతములోని తిజ్విభక్తులు మఱియు నరిగిపోయి రూపాంతరమును బొందినవి. భవతి—హావది—హావఇ—హోయి. తెనుఁగు: వచ్చుచున్నాడు.

(11) సంఖ్యావాచకములు, సర్వనామములు : ఇవి యేభాషకయినను ప్రాథమికములు. ఇవియే భాషకు వెన్నెముక. అట్టివి తెనుఁగున సంస్కృతములోనివానికంటె భిన్నములు, స్వతంత్రములును. ఇఁక ప్రాకృతమునందు సంస్కృతపదముల యపభ్రంశరూపములు గనుపట్టుచుండ వానితోఁ దెలుఁగులోని పదములు భిన్నములని చెప్పనక్కరలేదు. సంస్కృత ప్రాకృతములలో నున్న సంఖ్యావాచక భవము లయిన రూపములు తెనుఁగున గొన్ని లేకపోలేదు. కాని యవి తక్కిన తత్సమ, తద్భవముల తోడివే గావున జన్య జనక భావమునుగాని, సోదర భావమునుగాని యీ భాషలకుఁ దెనుఁగుతో నిరూపింప సమర్థములు గావు.

(12) క్రియల యొక్క కాలములు : లకార ప్రక్రియ మొదలగునవి సంస్కృతమునందు విశాలము. వైదికసంస్కృతమునందు విశాలతరము. తెనుఁగునందు ప్రక్రియ మిక్కిలి సంకుచితము. ప్రణాళిక, విభజన మొదలగునవి యత్యల్పమును, సంస్కృతముకంటె భిన్నమును. ఈ రెండింటికిని జన్య జనక భావమును నిరూపించుటకు వీలు లేదు.

(13) ఊనిక, స్వరము : వైదికసంస్కృతమున స్వరవైశిష్ట్యము గలదు. ఈ స్వరభేదము పాణినీయ సంస్కృతము యొక్క లక్షణమునందు దిఙ్మాత్రము గనుపట్టును. ఇప్పటికి సంస్కృతోచ్చారణ మా యా దేశములనుబట్టియు మారుచుండును. ప్రాకృతములో నెట్టి యూనిక యుండెనో నాఁటి నిర్వచనము లేమింజేసి తెలియరాదు. నేఁటి తృతీయ ప్రాకృతములును, వ్యవహారస్థములు నైన హిందూస్థానీయ భాషలలోని యూనికనుబట్టి వైదికసంస్కృతమునందలి స్వరవైశిష్ట్య మెట్లు పరిణతమయినది యను విషయము నూహింపవచ్చును. తెనుఁగు మొదలగు ద్రావిడభాషలలోని యూనికకును ప్రాకృతజన్యభాషలలోని యూనికకును స్వభావమున భేదము గలదు గావున వానికి జన్య జనక భావమును నిరూపింప వీలు లేదు.

(14) శబ్దముల లింగవిషయమునను తెనుఁగు మొదలగు ద్రావిడభాషలకును సంస్కృత ప్రాకృతములకును భిన్నతయు, స్వతంత్రతయు గలదు.

పయివిధములయిన భేదము లుండుటచే సంస్కృత ప్రాకృతములకును, దెనుఁగు మొదలగు ద్రావిడభాషలకును జన్య జనక భావముగాని, సోదరభావముగాని నిరూపింప వీలు లేదు. కాని యీ భాషలు చాలకాలము సరిహద్దుదేశముల వాడఁబడియుండుటచేతను, వెనుకప్రకరణములలో నిరూపింపఁబడిన యితర కారణముల చేతను సంస్కృత ప్రాకృతముల యొక్క ప్రభావమువలన దెనుఁగు మొదలగు ద్రావిడ భాషలలో ననేకములయిన మార్పులు, కూర్పులు గలిగియున్నవని నిరూపింపవచ్చును గాని వానివలన జన్య జనక భావమును సాధింప వీలుగాదు.

పయిని నిరూపించిన సారాంశములు ముమ్ముందు దా యా ప్రకరణములలోఁ జరిత్రాత్మకముగాను, బరిణామప్రదర్శనముగాను, సోదాహరణముగాను సిద్ధాంతపఱుపఁ బడుచునే యుండును.

# నన్నయకుఁ బూర్వపు తెలుఁగు

## 1. ఆ ధా ర ము లు

నన్నయకుఁ బూర్వ మనఁగా క్రీ. శ. 1022-వ సంవత్సరమునఁ బట్టాభిషిక్తుఁడయి భారతరచనాకారకుఁడయిన చాళుక్య రాజరాజనరేంద్రునకుఁ బూర్వకాలమని యర్థము. నన్నయ నాదరించిన తూర్పుచాళుక్యరాజవంశము తెనుఁగుదేశమున క్రీ. శ. 615-వ సంవత్సరమునఁ గుబ్జవిష్ణువర్ధనునితో నారంభమయినది. ఈ చాళుక్యవంశజులకు ముందుఁ దెనుఁగుదేశమును బాలించిన రాజులచరిత్రమును, నా కాలమునందలి శాసనములనుబట్టి తెనుఁగుయొక్క స్థితియును ముందుప్రకరణములో సప్రమాణముగ నిరూపించితిని. తూర్పుచాళుక్యవంశమునకు మూలపురుషుఁడైన కుబ్జవిష్ణువర్ధనునికిఁ బూర్వులయిన చాళుక్యులు బాదామి యను నగరమును బాలించుచుండిరి. ఈ బాదామినగరము నేటి గదగనుండి షోలాపురము పోవు నినుపదారిలో గదగనుండి 41 మైళ్ల దూరములో నొక స్టేషనుగా నున్నది. ఇప్పు డిది ప్రాముఖ్యములేని ప్రదేశము. దీనికే పూర్వము వాతాపినగర మని పేరు గలదు. ఈ ప్రాచీనచాళుక్యులలోఁ బ్రథముఁడయిన చారిత్రకపురుషుఁడు మొదటి జయసింహుఁడు. ఇతఁడు పాలించినకాలము క్రీ. శ. 500 (సుమారు). బిల్హణుఁడు వ్రాసిన విక్రమాంకదేవచరిత్రమున నీ వంశపు నుత్పత్తి వ్రాయఁబడినది.[1] బ్రహ్మయొక్క చుళుకమునుండి (పుడిసిలినుండి) హారీతుఁ డనియు, మానవ్యుఁడనియు నిరువురు వీరు లుద్భవించి రనియు, వారిప్రధాననగర మయోధ్య యనియు, నచ్చటినుండి వారు దక్షిణదేశమునకు వచ్చిరనియు నందుఁ జెప్పఁబడినది. తాము హారీతపుత్రుల మనియు, మానవ్యసగోత్రుల మనియుఁ దమ శాసనము లన్నిటియందును వీరు చెప్పికొనియున్నారు. రాజరాజనరేంద్రుని కోరుమిల్లిశాసనములోనిదని వీరేశలింగముపంతులుగారు తమ కవులచరిత్రమున వీరిచరిత్రము నిట్లు వ్రాసియున్నారు.[2]

"ఆ శాసనమందు రాజరాజనరేంద్రుని పూర్వుఁడైన విజయాదిత్యుఁడయోధ్యానగరమునుండి దక్షిణదేశముమీఁద దండెత్తివచ్చి యీ దేశమును పాలించుచుండిన త్రిలోచనపల్లవునితో యుద్ధముచేసి రణనిహతుఁ డయినట్టును, భర్తవెంట వచ్చిన యాతనిభార్య గర్భవతియై యుండియు నా యాపత్సమయములోఁ బురోహితుని, గొందఱు పరిచారికలను వెంటఁగొని ముదివేము అగ్రహారమునకుఁ

---

[1] భండార్కరుగారి దక్షిణహిందూదేశచరిత్రము. పుట 66—67.

[2] వీరేశలింగముగారి యాంధ్రకవులచరిత్రము, 1 వ భాగము. పుట 6-7.

దప్పించుకొని పారిపోఁగా విష్ణుభట్టసోమయాజి యను బ్రాహ్మణుఁ డామె నాదరించి తనయింటఁ బెట్టుకొని తాను గన్న కొమార్తెనువలెఁ జూచి యామెగర్భమున జనించిన పురుషశిశువునకు రాజోచితములయిన జాతకర్మాది సంస్కారములు నడిపి విష్ణువర్ధనుఁ డను పేరుపెట్టి పెంచినట్లును, అతఁడు తన తల్లి వలన సర్వవృత్తాంతమును విని చళుక్యపర్వతమునకుఁ బోయి తపస్సుచేసి తన తండ్రిరాజ్యమును వహించి, కదంబులను, గాంగులను జయించి నర్మదమొదలు సేతువువఱకున్న యేడుకోట్ల యేబదిలక్షల గ్రామములు గల దేశమునంతను పాలించినట్లును చెప్పఁబడియున్నది.''

ముందుఁ జెప్పఁబడిన జయసింహుని ప్రపౌత్త్రిని కొమారుఁడయిన రెండవ పులకేశివల్లభుఁడు చాల ప్రసిద్ధుఁడయి, వీరుఁడయి క్రీ. శ. 610-642 వఱకును బాలించెను. ఆతనికి ప్రియసోదరుఁడయిన కుబ్జవిష్ణువర్ధనుఁడు వేఁగీపురము రాజధానిగా 615-633 వఱకును బాలించెను. ఈతఁడే తూర్పుచాళుక్యులకు మూలపురుషుఁడు. ఈతని తరువాత 16-వ వాఁడైన అమ్మరాజ విష్ణువర్ధనుని కాలముననే రాజధాని రాజమహేంద్రపురమునకు మార్పఁబడెను. (918-925) ఈ వంశములో 27-వ ప్రభువయిన రాజరాజవిష్ణువర్ధనుఁడే భారతకృతిపతి. క్రీ. శ. 1022-1063 వఱకు నీతఁడు రాజ్యమును బాలించెను. ఈ చాళుక్యవంశజులు 6 లేక 7 శతాబ్దములు అవిచ్ఛిన్నముగా తెనుఁగునాటఁ బ్రభుత్వము వెలయించి తెనుఁగుబాస నుద్ధరించిరి.[3] కావుననే నన్నెచోడుఁడు తన కుమారసంభవము నవతారికలో ' తెనుంగు నిలిపి రంధ్రవిషయమున ' నని వ్రాసెను. అనఁగాఁ జాళుక్యరాజులు ఆంధ్రదేశమున తెనుఁగుబాసను నిలిపిరని యభిప్రాయము. ఈ విషయము ముం దుదాహృత మయినది.

ఈ చాళుక్యులు తమకుఁ బూర్వ మాంధ్రదేశపాలకులయిన విష్ణుకుండినుల నోడించి తమ రాజ్యమును స్థాపించినట్లు తెలియుచున్నది. చాళుక్యులకుఁ బూర్వము పాలించిన రెండవ విక్రమేంద్రవర్మ చిక్కుల్ల (సంస్కృత) శాసనములోనుండి ' విజయరాజ్యసంవత్సరంబుళ్ ' అను పదము నుదాహరించి తెలుఁగు ప్రత్యయముల యునికిని ముందే నిరూపించితిని.

ఇఁకఁ దూర్పుచాళుక్యుల శాసనములే నన్నయకుఁ బూర్వ ముండిన తెనుఁగు భాషకు నాధారములు. ఈ శాసనములు రెండువిధములు. సంస్కృతశాసనములు, తెనుఁగుశాసనములు. వీరి సంస్కృతశాసనములలో గ్రామనామములు, సీమలు మొదలయినవి విపులముగాఁ దెనుఁగుననే వ్రాయఁబడుచు వచ్చెను. ఇవి కాక వీరి కాలమునఁ బూర్ణములైన తెనుఁగుశాసనములును లభించుచున్నవి.

నన్నయకుఁ బూర్వము లభించిన తెనుఁగుశాసనముల కాలమును నిరూపించుటకు మూఁడువిధము లయిన యాధారములు గలవు.

---

[3] చాళుక్యసంతతి పాలనము సంవత్సరములు మొ. వీరేశలింగముగారి కవులచరిత్రము, 1వ భాగము. పుట 8-30.

i. శాసనములలోఁ బేర్కొనిన కాలగణనము.

ii. అం దుదాహరింపఁబడిన పాలకుల కాలముంబట్టి యూహించుట.

iii. అందలి లిపినిబట్టి యూహించుట.

రాజులు తా మొనరించిన దానములను, మహాకార్యములను దెలుపుటకయి వేయించిన శాసనములేకాక 'వీరశిలలు' అనఁగా వీరుల స్మారకచిహ్నములుగా నక్కడక్కడఁ గొన్ని శాసనములు లభించుచున్నవి. సామాన్యులు చేసిన దానములు నిరూపించుటకును శాసనములు వేయంబడినవి. పయి శాసనములు తామ్రశాసనములు, శిలాశాసనము లని రెండువిధములుగా నున్నవి. ప్రాచీనకాలమున వ్రాయింపఁబడిన యీ తామ్రశాసనములు ఆ శాసనమునందలి విషయగౌరవమును బట్టి యొక్కటిగాని, యెక్కువగాని వలసినన్ని రేకులలో వ్రాయఁబడి, యొక గుత్తిగా నొక రాగివలయముచే బంధింపఁబడి యుండును. ఆ వలయముపయిని శాసనదాతయయిన మహారాజుయొక్క యధికారముద్ర వేయంబడి యుండును. ఇది కాలక్రమమున నొకపురుషునుండి యింకొకనికి వంశపరంపరగా సంక్రమించు చుండును. అట్టివి కొందఱుపురుషులయొద్దను, లేక నేలలో పాతినవిగాను దొఱకు చున్నవి. శిలాశాసనములు దేవాలయస్తంభములపైని, నచ్చటి శిలలలోను, తటాకారామాదికముల సమీపమునను స్థాపింపఁబడి యక్కడనో లేక స్థలాంతర మునకుఁ గొంపోఁబడియో లభించుచున్నవి. అట్టివన్నియు నేఁడు సంపాదింపఁబడి శాసన పరిశోధనశాఖయందలి యుద్యోగులచేఁ జదువఁబడి పుస్తకరూపమున ముద్రింపఁబడు చున్నవి. అట్లు ముద్రించి ప్రచురింపఁబడినవి కొన్నియు, ప్రచురింపఁబడక యున్నవి కొన్నియును నీ క్రింద నుదాహరింపఁబడుచున్నవి.

## 2. నన్నయకుఁ బూర్వము ఆంధ్రభాషతో వ్రాయబడిన కొన్ని శాసనములు

(1) జయసింహవల్లభ మహారాజుల విప్పర్లశాసనము. కాలము క్రీ. శ. 641 ద. హిం. శా. వాల్యూము VI, పుట 208. నెంబరు 584 (గద్యము)

(2) పై మహారాజుచేఁ బయిసంవత్సరముననే వేయింపఁబడిన యింకొక శాసనము ప్రచురితము కాలేదు. మాచెర్ల డిప్యూటీ తహసీలుదారుగారి ఆఫీసులోఁ బడియున్న రాతిపై గలదు. (మల్లంపల్లి సోమశేఖరశర్మగారు చదివినది. గద్యము).

(3) పయినిచెప్పఁబడిన వాల్యూములో 585 నెంబరుగాఁ బ్రచురింపఁబడినది. ఇది యును ఆ కాలముదానివలెనే యున్నది. (641 క్రీ. శ.)(పద్యబంధమని తోచుచున్నది.)

(4) నెల్లూరుజిల్లాశాసనములు మొదటివాల్యూములో 287-వ నెంబరుగాఁ బ్రచురింపఁబడియున్నది. (శ్రీ) (పశ్చిమ) చాళుక్య విక్రమాదిత్యుని నాఁటిది. కాలము (655 క్రీ. శ.) సుమారు. (గద్యము).

(5) ద. హి. శా. VI వాల్యూములో 593 నెంబరుగాఁ బ్రచురింపఁబడినది. చేజెర్లలోని కపోతేశ్వరస్వామి దేవాలయములోని మండప స్తంభమున నున్నది. ఇందలి విషమసిద్ధి యనురాజు రెండవ విష్ణువర్ధనుఁడని యూహ. శాసనకాలము సుమారు 670 కావచ్చును. (గద్యము).

(6) లక్ష్మీపురపుశాసనము. కృష్ణా జిల్లా, దివి తాలూకా, లక్ష్మీపుర మను గ్రామమున నొక బ్రాహ్మణుని యింటి దొడ్డిలో నున్నది. శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారిచే భారతిలోఁ బ్రకటింపఁబడినది. కాలము సుమారు 680. (గద్యము.)

(7) ద. హి. శా. VI వాల్యూములో నెం. 250 గా ప్రచురింపఁబడినది. శ్రీ విష్ణువర్ధన మహారాజుల పరిపాలనలో 30-వ సంవత్సరమున వేయింపఁబడినది. గుంటూరు జిల్లా సత్తెనపల్లి తాలూకాలోని ధరణికోట గ్రామమునకు దక్షిణమున నున్న యొక పెద్దబండపయినిఁ జెక్కఁబడినది. కాలము సుమారు క్రీ. శ. 739 కావచ్చును. (గద్యము)

(8) అహదనకర శాసనము - దీనిని చాలమంది చాలసార్లు ప్రకటించిరి. ఇండియను ఏంటిక్వెరీ XIII వాల్యూమునందును, బర్గెస్సుగారిచే తమిళ సంస్కృత శాసనములయందును, శ్రీ కె. వి. లక్ష్మణరావుగారు, మల్లంపల్లి సోమశేఖరశర్మగారు, వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వేర్వేరుగా భారతిలోను, రాజరాజనరేంద్ర పట్టాభిషేకసంచికలోను బ్రచురించిరి. ఇందు చాలభాగము సంస్కృతము. క్రింది భాగము కొంత తెలుఁగు. దాని యర్థము దురవగాహము. కాలము 5-వ విష్ణువర్ధనుఁడని కొందఱు, 3-వ విష్ణువర్ధనుఁడని కొందఱు. కాలము సుమారు క్రీ. శ. 740 కాని, 840 కాని కావచ్చును. (గద్యము)

(9) మాలెపాడు సత్యాదిత్యుని శాసనము-ఎపిగ్రాఫియా ఇండికా XI వాల్యూములో 393-వ నెంబరుగాఁ బ్రచురింపఁబడినది. కాలము సుమారు 800. ఇది కడప మండలములో లభించినది.

ఈ సత్యాదిత్యుఁడు 'రేనాణ్డు ఏడువేలును' ఏలిన చోళమహారాజుల వంశములోనివాఁడు. రేనాణ్డు నేఁటి కర్నూలు కడప మండలములలో నుండిన ట్లూహింపఁబడినది. వీరి శాసనములు మఱికొన్ని లభించినవికాని ప్రచురింపఁబడలేదు. ఇవి యా మండలములందలి ప్రాఁదెలుఁగునకు నుదాహరణముగా నున్నవి.

(10) చాళుక్య భీమమహారాజ ధర్మవరపు శాసనము: ఇది నెల్లూరు జిల్లా శాసనములు, రెండవవాల్యములోని 966 పుటలోఁ బ్రచురింపఁబడినది. ఇది మూఁడవ విజయాదిత్యుని నాఁటిది. కాలము సుమారు 849. దీనిని శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు భారతిలోఁ బ్రచురించిరి. ఇందు సీసపద్యము గలదు. (పద్యమును, గద్యమును)

(11) పండరంగుని అద్దంకి శాసనము. ఇదియును పయి మూఁడవ విజయాదిత్యుని నాఁటిదే. పద్యబంధము. కాలము సుమారు 850. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు భారతిలోఁ బ్రచురించిరి.

(12) మూఁడవ విజయాదిత్యునినాఁటి ధర్మవరము శాసనము. దీని కాలము సుమారు 850 సం. నెల్లూరు జిల్లా శాసనములు-వాల్యూము II, పుట. 967. మల్లికార్జునస్వామి యాలయములో దొరకినది. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు దీనినిఁగూడ భారతిలోఁ బ్రచురించిరి. (గద్యము)

(13) కందుకూరు గ్రామమునందలి రామస్వామి యాలయములోఁ గట్టఁబడియున్న రాతిపై నున్నది. నెల్లూరిశాసనములు - వాల్యూము II, పుట. 544, నెం. 31, 32. ఇదియును పయి విజయాదిత్యునినాఁటిదే. ఇందును పండరంగు, గుణకెనల్లుణ్డు అను పేళ్లు రెండును వచ్చినవి. శ్రీ శర్మగారిచే భారతిలోఁ బ్రచురింపఁబడినది. (పద్యము).

(14) బెజవాడ యుద్ధమల్లుని శాసనము. ఎపిగ్రాఫియా ఇండికా వాల్యూము XV, పుట 150. ప్రచురింపఁబడినది. ఇందలి మొదటిభాగము మూఁడవ విజయాదిత్యునికాలములోను (అనఁగా సుమారు 880), రెండవభాగము రెండవ యుద్ధమల్లునికాలములోను (అనఁగా 927-934 పాలనకాలము) వ్రాయఁబడియుండును. ఇది పద్యమయము.

పయిని నిరూపింపఁబడినవి ప్రచురణము నొందిన ప్రాచీనశాసనములలోఁ గొన్ని. వీనినిఁబట్టి నాఁటి యాంధ్రభాషాస్వరూపమును నిరూపింపవచ్చును. ఇవిగాక శాసనసంపాదకశాఖవారిచే సంపాదింపఁబడి ప్రచురణ నందవలసిన ప్రాచీన శాసనములు సుమారు నూటివఱకును గలవు. వాని కాలము స్పష్టముగా నిరూపింప వీలులేదు. కాని లిపినిబట్టియు, భాషనుబట్టియు నయ్యవి నన్నయ్యకుఁ బ్రాచీనములని నిశ్చయముగాఁ జెప్పనగును. అట్టివానిలో నీ క్రిందివి ముఖ్యములు.

శ్రీ వైదుమ్బ మహారాజుల శాసనములు — వీరి శాసనములు చిత్తూరు జిల్లాలోని పెద్దతిప్పసముద్రము, చిప్పిలి, తుపాకులొల్లపల్లి, ముడివేడు, జుంజూరుకోట, రామానాయనికోట మొదలగు గ్రామములలో లభించినవి. సొరమడియుద్ధమునం బడిన వీరుల ప్రశంస యీ శాసనములలోఁ గలదు. ఆ యుద్ధము క్రీ. శ. 878-వ సంవత్సరమున జరిగెనని యూహింపఁబడినది. శాసనముల నెంబర్లు. 533-1906; 309-1922; 310-1922; 317-1922; 322-1922; 328-1922; 329-1922; 338-1922; 342-1922; 314-1922. రెండవది సంపాదన సంవత్సరము.

శ్రీ చోళమహారాజుల శాసనములు—వీరి శాసనములు కడప మండలములోని ప్రొద్దుటూరు, చిలంకూరు, ముద్దనూరు, కొనినేపల్లి మొదలగు గ్రామములలో దొరకినవి. వీరు మాలెపాడు శాసనమును వేయించిన సత్యాదిత్యునివలెనే చోళ మహారాజులు. సుమారు 7, 8-వ శతాబ్దములోనివని యీ శాసనముల నూహింప వచ్చును. ఈ క్రింద నీ శాసనములయొక్క సంఖ్యలు, సంపాదించిన సంవత్సరములు కొన్ని యీయఁబడినవి.

403-1904; 384-1904; 400-1904; 405-1904; 408, 408-ఎ-1904.

ఇవిమాత్రమేగాక యింక ననేకశాసనములు ప్రచురింపఁబడనివి సంపాదింపఁబడి శాసనపరిశోధనశాఖవారి కార్యాలయమునం గలవు. నెల్లూరు, గుంటూరు, కృష్ణా, కడప, కర్నూలు, చిత్తూరు, గోదావరి మండలములలో నాఁడు వాడుచుండిన తెలుఁగుభాషాస్వరూపము పయి శాసనములనుబట్టి నిరూపింపనగును. ఇంతియగాక ప్రాచీన సంస్కృత ప్రాకృత శాసనములలోని గ్రామనామములను, బురుషనామములను బరిశీలించినయెడల నప్పటి భాషాస్వరూపము మఱియుఁ జక్కఁగాఁ దెలియఁగలదు. పయిని బేర్కొనబడిన సంఖ్యలుగల శాసనములు నేను శాసనకార్యాలయమునకుం బోయి యెంతో కష్టముమీద పరిశీలించి వ్రాసికొని తెచ్చుకొంటిని. ఆనాఁటి కవి ముద్రితములు గాలేదు. నేఁ డవి ఎపిగ్రాఫికు డీపార్టుమెంటువారిచే దక్షిణదేశ శాసనములపేరను XI, XII మొదఁగు వాల్యూములలో నచ్చొత్తింపబడి ప్రచురింపఁబడినవి.

పైని వివరింపఁబడిన శాసనములను బరిశీలించుటవలన నేర్పడిన నాఁటి తెనుఁగుభాషాలక్షణములు క్రింద వివరింపఁబడుచున్నవి. పయిశాసనములు చాలవఱకు రాజాజ్ఞను బండితులచేఁగాని, నాగరకులచేఁగాని వ్రాయంబడినవిగాన కేవలము సంస్కృత ప్రాకృత సంబంధ మెఱుఁగని పామరుల తెనుఁ గెట్లుండెనో వీనిని బట్టి ప్రత్యక్షముగా నెఱుఁగ వీలులేదు. కాని వీనినిబట్టి యా భాష కల్పింపనగును. పయి శాసనములన్నియును సుమా రేడవశతాబ్దియందును, దరువాతను వేయింపఁబడినవి. కావున నంతకుముం దుండిన కాలమున అనఁగా నాంధ్రరాజుల కాలమునుండి యారవశతాబ్ది తుదివఱకును తెనుఁగు సంస్కృత ప్రాకృత భాషా సాహచర్యమున రూపాంతరమును బొందుచుఁ బరిణతమగుచుండె నని యూహింపక తప్పదు. ఈ ప్రాచీనభాషాలక్షణము నేఁటి భాషాలక్షణమునుండి యెట్లు భేదించుచున్నదో క్రింద తెల్లముకాఁగలదు.

## 3. ప్రాచీనభాషాలక్షణము

I. ధ్వనులు : ప్రాచీనాంధ్రశాసనములలో 'టి' అను రూపముననున్న యొక యక్షరము చాల ప్రచురముగాఁ గనుపట్టుచుండును. ఈ యక్షరమును, దాని యుచ్చారణమును నేఁటి భాషనుండి పరిభ్రష్టమయినది. నన్నయనాఁటికే యది భ్రష్టమయిన దనక తప్పదు. ఆతని భారతమున నీ ధ్వనికిఁ బ్రవేశమే లేదు. ఈ యక్షరమునకు సమానస్వరూపమును, నుచ్చారణమును గలయది కన్నడమునఁ బ్రాచీనభాషలో నుండినది. అయ్యదియు నేఁటి కన్నడమున భ్రష్టమయినది. ఈ యక్షరమునకుఁ గన్నడవైయాకరణులు 'రళ' మని పేరుపెట్టిరి. ఈ యక్షరమునకును, సంస్కృత ళకారమునకును, కన్నడమునందు (తెనుఁగునందును నియ్యదియే కలదు) గల ళకారమునకును గల భేదమును గుర్తింపలేక కవులు

తబ్బిబ్బుపడుచుండిరి.[1] నేటి యాంధ్రమునందు ర-ఱ లకుఁ గల భేదము నశించి పోయినది. ఉచ్చారణమున నశించిన యీ భేదమును నిఱుపుటకు నేటి పండితులు పడు శ్రమ యెల్లరకును విదితమే. ఈ యక్షరముతో సమానమైన యుచ్చారణ గలది నేటి తమిళమునందు గలదు. 'ழ' అని దానిని లిఖింతురు. అక్కడను నియ్యది వ్యవహారములోఁ గ్రమక్రమమున భ్రష్టమయి రూపాంతరమును బొందుచునే యున్నది.[2] కాని అరవమున గ్రాంథికభాషయం దిది నెలకొనియే యున్నది. పయి రెండుభాషలయందును నున్న యక్షరములతో నీ యక్షరము సమానోచ్చారణము గల్గియుండవలయును. ఆ 'ఴ' కార ముండిన శబ్దములు నేఁడు డకారముతోడను, ళకారముతోడను గన్పట్టుచున్నవి.

## ప్రాచీనశాసనములందలి యక్షరభేదములు

ట్టోలనాణ్డు విషయే (ఎ. ఇ. వా. XVIII, పుట 58.) 732 క్రీ. వె.

రామనిఘు తోఴనెడరిన (తోడ—ఇప్పటి తెనుఁగు)

చాళుక్యమహారాజు ధర్మవరపు శాసనము :

చోఴనింజేకొని కాచె (చోళని) ,, ,,

తా [ఴ] తోంట (తాడుతోట) ద. హి. శా. వా. IV నెం. 584, 641 ,,

విశేవని పొగఴ కుడుము ,, ,, 585 ,,

ఇఱెయొట్టు ఴిస్సి ; అఴిసిన పాపమ్బు—

యన్నదీ ట్టేకవరువుడు ,, 593 7-వ శతాబ్ది.

[1]కన్నడభాషయందును నీ భేద మెఱుంగక కవులు కష్టపడుచుండ నొకానొక వీరశైవ కవి హరీశ్వరుఁ డను పేరుగలవాఁడు, సుమారు 1165-వ సంవత్సరమున నుండినవాఁడు పయి భేదమును నిరసించుచుఁ దన గిరిజాకళ్యాణమున నిట్లు వ్రాసెను. “నోడువొడొం దక్కరమదు । మాడు దొడుచ్చరణె గరిదు మూఱుం తెఱనం। కూడె కవితతి విచారిస। బేడదఱిం ఱఱికుళక్షళంగళ నిదరోళ్.” కేశిరాజు (కాలము 1260) తన శబ్దమణిదర్పణ మను వ్యాకరణమునందు పయిభేదమును స్థాపించుటకు మిక్కిలి ప్రయత్నముచేసి భేదమును దెల్పు శబ్దముల పట్టికలను జాలగా నొసంగెను. (Page 23. Vol. I, కర్ణాటకకవిచరిత్ర). [2]Even the Tamils cannot pronounce this letter correctly and in some districts substitute ళ, య and స for it or omit it altogether. In Madras య and స are used by the lower classes while in Madura and Tinnevelly ళ is preferred. Page 135, *Tamil Studies* by M. Srinivasa Iyengar, M. A. (Gaurdian Press 1914).

వేంగి నాణ్టిం గొఱిల్చి (పండరంగని శాసనము)

యుద్ధమల్లుని శాసనము 9-వ శతాబ్ది.

| | | |
|---|---|---|
| భారనాశి ఱచ్చిన (వ్రచ్చిన) | | |
| ఊఱ్లి | 400 బి–1904 | |
| క్ట్రొచనవాన్టు | 351 –1905 | |
| వ్ట్రచ్చినవారు | 406 –1904 | |
| శ్రీమత్ చోఱమహారాజు [రే] నాణ్ణు | 408 –1904 | |
| ఎఱు [వే] ఱు నెఱింగా | | |
| (శ్రీమత్ చోళమహారాజు రేనాడు ఏడువేలు నేలంగా) | | |
| చెఱిఞ్చినవాణ్డు (చెఱిచినవాఁడు | 408 A–1904 | |
| నొఱుమ్బియు (నొళంబి) | 533 –1906 | 880 క్రీ. వె. |
| మఱిసి (మడిసి) | | |
| వక్కొట్వి మల్లుర (ఒక్కొళ్లమల్లుర) | 515 –1906 | |
| క్ట్రొచ్చె (క్రొచ్చె) | 307 –1922 | |
| వాణరాజులపై బఱి (బడి) | –1922 | |
| ఏఱువేళు మేళుచు నొఱమ్బితోఱి | | |
| కయ్యంబున (ఏడువేలు నేలుచు) | 314 –1922 | ,, |
| ఱిన్దు లూరావాసకాత్ | ఎ. ఇ. వా. IV పుట 193. 506 | ,, |
| ఱిల్లసీమా | ఎ. ఇ. వా. VI 347. | 1018 క్రీ. వె. |
| తాఱు గుమ్మిసీమ | V 31 | |
| పఱమఱి కట్ట } ఱిల్ల సీమ } | VI 34 | |
| తాంకఱిపొలము | పుట. | |

2. నవీనభాషలో నకార మున్నయెడల ణకారమును, లకార మున్నచోట ళకారమును మిక్కిలి ప్రచురముగాఁ గనుపట్టును. ఈ పదములలో ననేకములు నేఁటి కింకను ఇతర ద్రావిడభాషలగు తమిళ కర్ణాటాదికములలో ణ, ళ లతోనే యున్నవి. తెనుఁగునమాత్ర మవి న, ల లుగా మాఱినవి. ప్రాచీనకాలమున నచ్చతెనుఁగుపదములు తమిళ మలయాళములతో నభిన్నములుగా నుండె నని సిద్ధాంత పఱచుటకుఁ ఈ విషయము ప్రబలసాక్ష్యము. సంస్కృతపదములలో ణకారము ఉండవలసినచోట నియతముగా నకారమే వ్రాసిన ప్రదేశము లనేకంబులు గలవు. ద్రావిడభాషయగు తెనుఁగున మూర్ధన్య ణకారము హెచ్చుగా నుండుటచేఁ దెనుఁగున ణకారమును, సంస్కృతమున నకారమును గుర్తుగా వ్రాయసగాండ్రు పెట్టుకొని యుండవచ్చును.

ఆణతి ( ఆనతి ) 348—1904
వినియణ ( వినియన ) 384—1904
గొణిన ( కొనిన ) 400—1904
పణిగణి ( పనిగని ) 314—1922
ఎణ్బోది ( ఎనిమిది ) జయసింహవల్లభ శాసనములు ( రెండు 641 క్రీ. వె.)
ప్రభుం బణ్డ రంగుం బణ్బి ; గొణి ; అద్దంకి పండరంగని శాసనము
వేణ్డికొణి 401—1904
వేణ్డికొణి 400 బి—1904
మల్లఅయ్యణ —405—1904 650 క్రీ. వె.
ఓగణ్ణవన్డు, లఞ్చంబు గొణవాన్డు
పాపంబు గొణ్ణవాన్డు } 351—1905
నువుళదేవణ 182—33,34 650

సంస్కృత ణకారమునకు నకారము :

కిరనపురము ( కిరణపురము ); ఉత్తరాయన ( ఉత్తరాయణ ) 839-1922 సం.
భరనాసి ( వారణాసి ) 307-1922 సం.
భ్రమరాయమాస్ర ; ఆచరసుణ్ణు ; నివ్వఁహనోద్యోగమ్మున
బ్రాహ్మన ; నివ్వఁహనంబు (మూఁడవ విజయాదిత్యుని ధర్మవరపుశాసనము)
దక్షినము ద. హి. శా. వా. VI 250 739 క్రీ.వె.

లకారమునకు ళకారము :

పెడ్డబోళ ; పూసబోళ ఎ. ఇ. వా. XVIII, పుట 315 700 ,,
సంవత్సరమ్బుళ్ ఎ. ఇ. వా. IV పుట 193 506 ,,
ఆఱుపుట్ళు ; భటారళకు ; జయసింహవల్లభుని మాచెర్ల శాసనము 641 ,,
ప్రసాదంబుళు ; అడ్ళ ద.హి.శా. వా. VI నెం. 585 641 ,,
చెఱువుళు ; గవిలాళను ; కన్న్యళను.
నె. జి. శా. వా. III పుట 1152
కళరేని లక్ష్మీపురశాసనము ( భారతి ) 680 ,,
గళ్గిన ; వక్రంబుళేదు ; గళరేని. అహదనకరశాసనము ( భారతి )
చోటిమహారాజుళ్ ఏళన్ ;
చోటిమహాదేవుళ్ నెం. 400-1904 సం. 7-వ శతాబ్దము

| | | |
|---|---|---|
| గణపతిన్దళ్ఛి ; గళిగిన | 408ఎ-1904 | 7-వ శతాబ్దము |
| వేళ్పు | 351-1905 | |
| ఇరుభదిఎణ్ఋ ; ముత్తళూరిన్ | 364-1920 | 675 క్రీ. వె. |
| మన్మరళు | 281-1921 | 825 ,, |
| కుట్టమడువెళువాన్రు | 308-1922 | |
| పళ్గవిలో (పలికలో) | 307-1922 | |
| పళువేళుపళుచుడ్డి | 342-1922 | 880 ,, |

సంవత్సరంబుళు నె. జి. శా. వా. II, పుట 1151 9-వ శతాబ్దము.

3. శకటరేఫముయొక్క యుపయోగము చాల ప్రచురముగా నుండెడిది. నేఁడు లఘురేఫములుగా వాడుకలో నున్న పదము లనేకములు శకటరేఫము లున్నవిగానే కనుపట్టుచున్నవి. ఇంతియకాక నేఁడు శకటరేఫము సంయుక్తాక్షరములలో మీఁదనుగాని క్రిందనుగాని వ్రాయుట లేదు. కాని యాకాలమున ననేకము లయిన స్థలములలో నీ శకటరేఫమే సంయుక్తాక్షరములలో వాడఁబడుచుండినది.

| | | | |
|---|---|---|---|
| అఱ్లపట్టు | జయసింహవల్లభునిశాసనము (మూచెర్ల) | | 641 క్రీ. వె. |
| విత్పఱ్తి | ద.హి.శా. వా. VI నెం.585 | | 641 ,, |
| విట్టజుల, తూఱ్పు లక్ష్మీపురశాసనము | | | 680 ,, |
| మాఱ్పిడుగు రట్టగుళ్లు | | 384—1904 | 650 క్రీ. వె. |
| వైదుంబ వ్రోలు | | 346—1922 | |
| పాపంబుగొఱ్ఱ వాన్రు | | 351—1905 | |
| రేగోన్రన్నామగ్రామస్య | ఎ. ఇ. వా. IV, పుట 193 | | 506 |
| కటిపఱ్తియునేట్టె యు | | | |
| ముయ్యలికుఱ్ఱున చిన్తగుణ్ట | ఎ. ఇ. వా. VI, పుట 347 | | 1019 ,, |
| తాన్రికొన్ర (తాండికొండ) | Mattepadu plates of Damodaravarman ఎ. ఇ. వా. XVII, పుట 328. | | |

4. నేఁడు మనము పూర్ణబిందువు వ్రాయు స్థలములందు సాధారణముగా వర్గపంచమాక్షరముతోఁగూడిన సంయుక్తాక్షరములు వ్రాయంబడుచుండినవి. కాలక్రమముననే యనుస్వారప్రయోగము ప్రబలినది.

5. రేఫక్రింద మనము వేఱొక జడ్డను వ్రాయుట కలదు. నాఁడా రీతిగాక వలపలగిలక వ్రాయంబడుచుండెను. ఈ యభ్యాసము తరువాత చాలఁగాలము వఱకును (అనగాఁ నేఁటికి కొంచెముకాలము క్రిందటివఱకును) వాడుకలోనే యుండినది. అట్టి వలపలగిలక యున్నచోట్లఁ బూర్వాక్షరమునకు ద్విత్వము వ్రాయుట గలదు.

6. ఆకాలమునందలి రచనలలో ననేకములయిన పొరపాట్లున్నట్లు లీ కాలపు వారికిఁ గనుపట్టుచుండును. నేఁడు దీర్ఘము లుండవలసినచోట్ల హ్రస్వములును, పరుషము లుండవలసినచోట్ల సరళములును, 'శ ష స' లొకదానికొకటి మారు పాటుగాను మిక్కిలి సాధారణముగాఁ గనుపట్టుచునే యుండును.

| శాసనస్థరూపము | ఇప్పటిరూపము | శాసనపుగుర్తు |
|---|---|---|
| దేనికిసక్షి | దీనికిసాక్షి | 403—1904 |
| టిచ్చువన్టు | వ్రచ్చువాండు | ,, |
| మహారాజులాకు | మహారాజులకు | 384—1904 |
| వసన్తీశ్వరంబునా కిచ్చినది | వసంతీశ్వరంబున కిచ్చినది | ,, |
| దెన్నిల్పి | దీని నిల్పి | 400 ఎ—1904 |
| శూర్య్యగ్రహన నిమిత్యంబున | సూర్యగ్రహణ నిమిత్తంబున | 405—1904 |
| కొలనిస్తారాకుణ్డు | కులనిస్తారకుండు | 408 ఎ—1904 |
| మిళ్లిరజుల ఇచిననేల | మిళ్లిరాజుల యిచ్చిననేల | 497—1906 |
| దపినవారు | తప్పినవారు | |
| పుదలి ఎళ్లువాన్టు | బూదిలి పలువాఁడు | 797—1917 |
| నృపాణాం క్లాలే క్లాలే సర్వ్వా పాత్తిఁ వేంద్రాన్ | కాలే కాలే సర్వాన్ పార్థివేంద్రాన్ | 833—1917 |
| దేనిటిచ్చువాన్టు | దీనివ్రచ్చువాండు | 364—1920 |
| త్రైణేత్ర | త్రినేత్ర | —1922 |
| వ్రసినవరు ; సంవచ్చరంబుళు | వ్రాసినవారు ; సంవత్సరంబులు | 169—1917 |
| మూన్టకు న్నేణ్డు, తీనికి | మూఁడగు నేడు, దీనికి | ,, |
| దినికి, సక్షి | దీనికి, సాక్షి | 401—1904 |

పయి నీయంబడిన రూపములు కొన్ని మాదిరి మాత్రములుగానే యున్నవి. శాసనములం దెల్లెడను బయిరీతి వ్రాతలు మిక్కిలిగాఁ గనుపట్టుచుండును. దీనికిఁ గారణమేమో యూహింపవలయును. పయిరూపములలోని తబ్బిబ్బులు తత్సమముల యందును, దేశ్యములయందును గూడఁ గన్పట్టుచున్నవి. రెండిటికినిగూడ నాఁటి యుచ్చారణయే ప్రమాణముగా నుండవలయును. భాష స్థిరపడలేదు. భిన్నభిన్న మండలములలో భిన్నభిన్నములుగా నుచ్చారణ యుండెడిది. ఉచ్చారణము వ్యక్తులను బట్టికూడ మాఱుచుండు ననక తప్పదు. ఎవ్వరి యుచ్చారణ వారికే ప్రమాణమై యుండనోపు. ఇంకొక విశేష మేమనఁగా నుచ్చారణమాత్రము ననుసరించి వ్రాయు టయుఁ బ్రాథమికావస్థలోఁ జాలఁ గష్టమయిన కార్యమనియే యెఱుంగునది. సాక్షి యను పదము సంస్కృతము. ఇందు దీర్ఘ మున్నదని చెప్పి పండితులు

దిద్దుచుఁ జెప్పించుచుండుటవలనను, సంశయ మున్నప్పుడు కోశములు, వ్యాకరణములు, సారస్వతమునందలి యుత్తమకవిప్రయోగములును దిద్దుబాటులకుఁ బ్రమాణము లగుచున్నప్పుడును నీ తప్పు వారింపఁబడును గాని లేకున్న 'సాక్షి' యో 'సక్షి' యో యెటుంగ వీలులేదు. అట్లే తక్కిన వ్రాతలన్నియు వచ్చినవని యూహించుట సులభము. భాష యొక్క ప్రాథమికావస్థయందు నిట్టి వైవిధ్యము కేవల క్షణికావస్థాయి యయిన యుచ్చారణముమాత్రమే ప్రమాణముగా గల్గిన రచనలయం దెల్లచోట్లను గనుపట్టుచున్నది. ఆ కాలమునందలి స్థితి నూహించు కొనుటకు నేఁటి వ్యావహారికభాషావాదుల మని చెప్పుకొనువారి వ్రాతలు మిక్కిలి సహకారులు. 'వచ్చుతున్నది, వస్తుంది, వస్తూంది, వస్తోంది, ఒస్తోంది, ఒస్తూఉన్నది, ఒస్తూన్నది, ఒస్తూంది, వస్తాఉంది, వస్తాఉన్నాది, వేయడము, వేయటము, వేయటం, వెయ్యటం, వయ్యటం ; వెయ్యడము, వెయ్యటము, వయటము, వెట్టము,' అనున ట్లింకను భిన్నరూపములతోఁ గూడిన యుచ్చారణములు గనుపట్టుచునే యున్నవి. పయి రూపము లన్నిటిలో నేదైనను వారి కంగీకార్యమే. ప్రామాణికులుమాత్రము 'వచ్చుచున్నది' యనిగాని, 'వచ్చుచునున్నది' యనిగాని రెండు రూపములనుమాత్రమే యాశ్రయించుచున్నారు. వారి దృష్టిని పయి రూపము లన్నియుఁ దప్పులవలెనే కనుపట్టుచుండును. నేఁటివలెనే నాఁడును నుచ్చారణమున నిట్టి రూపవైవిధ్యమే కలిగియుండనోపును. ప్రాచీనశాసనముల నన్నిటిని జక్కగా వేర్పఱచి పదములను సాకల్యముగా జేర్చినచో నే యే పద మే యే కాలముల నే యే దేశభాగములం దుండెనో స్పష్టపడును.

(2) ప్రాచీనభాషయందలి విభక్తిప్రత్యయముల రూపములును, విభక్తుల యర్థములును నేఁటివానికంటె భిన్నముగా నుండె ననుట క్రింది యుదాహరణముల వలనఁ దెలిసికొన నగును. ఆ కాలమునందలి భాష యేర్పడుచుండుటచేతను, కేవల వ్యావహారికావస్థనుండి గ్రాంథికావస్థలోనికి వచ్చుచు నుండుటచేతను నేఁటి రూపముల కంటె నాఁటివి భిన్నములుగా నుండును. నేఁటి రూపములు సిద్ధములు, ప్రామాణికములు. అనేక శతాబ్దపరిణతివలన మాఱినవి.

| | | | |
|---|---|---|---|
| పుత్రుణ్డు | 403-1904 | అరివరజముణ్డు | 797-1917 |
| నాయుణ్డు | ,, | గణ్డసంకలిణ్డు | 300-1922 |
| ఆోగొణ్ణవణ్డు | | బాదిరాజెన్వాణ్డు-నె. జి. శా. వా. పుట 676 | |
| చెడువణ్డు | 315-1905 | పాతకుణ్డు-వృషసంవత్సరాదిసంచిక. శర్మగారు | |
| నిచ్చినవణ్డు | | ప్రభుచెల్వణ్డు | 533-1906 |
| మగణ్డు | | విట్టినాయకుణ్డు | 308-1922 |
| మదవుణ్డు | 535-1906 | కాశ్యపగోత్రుణ్డు, సత్యదితుణ్డు | ఎ. ఇ. XI, పుట 345 |

పయినిఁ జూపిన 'న్డు' అను నంతము లన్నియుం గాలక్రమమున 'ణ్డు', 'ండు' గా మాఱినవి. ఏకకాలముననే రెండురూపములు గన్పట్టుచుండును. క్రమక్రమమున 'న్డు' రూప మంతమొందినది. ఈ పరిణామక్రమ మంతయును విభక్తిప్రత్యయముల ప్రత్యేకచరిత్రలోఁ బూర్ణముగా విమర్శింపఁబడును. ఇవిగాక యీ క్రింది విధము లయిన రూపములును మహదేకవచనాంతములుగాఁ గనుపట్టుచున్నవి.

| | | | |
|---|---|---|---|
| | | శ్రీమహేన్ద్రిన్ | 797-1917 |
| కల్లెగణ్డ రామణ్డు | 342 -1922 | శ్రీ త్రిభువనాదిత్యన్ | 271-1922 |
| మల్యభణ్డను | 408ఎ-1904 | గొణకెనల్లాత } | చాళుక్యభీమమహారాజు |
| చామియన్ | 268 -1922 | నల్లాతణ్డు } | ధర్మవరపు శాసనము. |
| కార్తికేయుణ్డు (ధర్మవరపు విజయాదిత్య III) | | కామినీబొజంగమార్తణ్డఅల్గి | 342-1922 |

పణ్డరంగు (పండరంగని అద్దంకి శా.)
పులవ్వణ్డు 403-1904.

పయిరీతి ననేకవిధములుగా నుండిన మహదేకవచనప్రత్యయము కాలక్రమమున నన్నయనాఁటికి నొక్కరూపముతోడనే స్థిరపడి ప్రామాణిక మయినది.

ఇట్లే ము, వు ప్రత్యయములును భిన్నభిన్నరూపములతో భిన్నప్రదేశములలోను, భిన్నకాలములలోను వాడుకలోనుండి కాలక్రమమున నేఁటి రూపములతో స్థిరపడినవి.

ఉద్యోగమ్ము మూఁడవ విజయాదిత్యుని
ధర్మవరపు శా. 8 శతా.

పట్టనబున అహదనకర శా. రాజ్యమ్బున నె. జి శా. దర్శి 2
వక్రబు 403-1904 7-వ శతాబ్ది దమ్మ్మఁకు 384-1904
వక్రంబు 384-1904 ,, కల్పట్టనబు C. P. నెం 2-1914, 15, 8 శ.
సానవు C. P. నెం. 10-1908, 9
శ్రీ బ్రహ్మేశ్వరమ్ 268-1922 8 శతా.

ఇ ట్లనేకవిధములుగా నుండిన యీ ప్రత్యయములు నన్నయకాలమునకుఁ బ్రామాణికత్వమును బడిసి స్థిరపడినవి.

బహువచనప్రత్యయం బగు లువర్ణమును భిన్నభిన్న రూపములతో నేకశాసనమునందును భిన్నశాసనములయందును గనుపట్టుచున్నది. మిక్కిలి బహుళముగా బహువచన ప్రత్యయమున ' ళ ' వర్ణమే కనుపట్టుచుండును. ' లు ' వర్ణము యొక్క ప్రయోగమును లేకపోలేదు.

బ్రాహ్మణుళు, కవిలళాను. 403-1904; మహదేవుళు, తోటళు, పారళ 384-1904, భటారలకు 405-1904; పారళ్ల, గుడ్లకు 287-1905.

పయిరీతిని నేఁటి 'లు' ప్రత్యయమ్ముననుకుఁ బూర్వరూపంబు లన్నియు నన్నయకు ముం దుండిన శాసనములలోఁ గనుపట్టుచున్నవి. ఈ ప్రత్యయముల యొక్క చరిత్ర మును, బరిణామక్రమమును నా యీ ప్రత్యయములనుగురించి ప్రత్యేకముగ వ్రాయం బడు ప్రకరణమందు వ్రాయంబడును.

నేఁటి తెనుఁగునం దున్నవని చెప్పంబడునట్టి యితర ప్రత్యయము లన్నియును బ్రాచీనశాసనంబులం గనుపట్టవు. మిక్కిలి ప్రచురముగాఁ గనుపట్టు నితరప్రత్యయము లన్నియును దిఙ్మాత్రముగా నుదాహరింపఁబడుచున్నవి.

వేకవిలశాను 403-1904 నొటమ్బితోటి కయ్యంబున ముదుమడువున పోటున

మహరజు 314-1922 (878 క్రీ. వె.)

పారళజప్పిన 384-1904 రమణతో-యుద్ధమల్లుని బెజవాడశాసనము

రేనాణ్డాం (రేనాటిని) 342-1922 భటారలకు-405-1904

రాజ్యమ్బున 183-1933,34 గుడ్లకు-287-1905

అన్నేణ్టన్ ; జయసింహ 641 క్రీ. వె. శమ్మారికి-364-1920

అన్వయంబునవారు ,, ,, రాజుల ఇచిననేల 497-1906

వేంగినాణ్టిం గొటిల్పు, పండరంగని అద్దంకి. మహారాజులాకు, జయసింహ 641 సం.

వెన్నాజిలోఁజూచె చా. మ. ధర్మవరపు, దేనికి ,,

రామని తోటి ,, సామన్తపడువతో (పండరంగని అద్దంకి శాసనము)

ఒకాడు బోళచేత శవణగొణిరి 1941-42 సంవత్సరాదిసంచిక, పుట 14-15 శర్మగారు

సముద్రరంబు నాకుఁ బణిసేసిన (జయసింహ 641 క్రీ. వె.)

పళ్గవిలో 307-1922 వైదుంబుళచేత బట్ట [మ్] కట్టబడియె.

399-1922

వారిచేత పట్టం కట్టబడినవాన్రు 310-1922

పయిని నిరూపింపఁబడిన ప్రథమేతర విభక్తిప్రత్యయములు మాత్రమే గన్పట్టు చున్నట్లు తోఁచుచున్నది. మిగిలిన ప్రత్యయంబులు కాలక్రమంబున నేర్పడిన ట్లూహించుటకు బలమైన యవకాశము గలదు. సంస్కృత సంబంధమువలనఁ బెరిగిన యాంధ్రభాషారచనలు నన్నయకు ముం దుండిన కాలమున నేర్పడుచుండి నట్లును, బూర్ణవికాసమును మాత్రము బొందకుండినట్లును పయిదానినిబట్టికూడ స్పష్టమగుచున్నది.

(3) శబ్దజాలము : ప్రాచీన ద్రావిడభాషకుఁ జేరిన మాండలికభాష లలో నొకటియయి కాలక్రమమున వేఱుపడి ప్రత్యేకస్వరూపముతో నభివృద్ధి నందుచున్న యీ తెలుఁగునకు సంస్కృతభాషాసంపర్కము ఆంధ్రరాజుల కాలము నుండియుఁ గలిగినట్లు ముందే యనేక హేతువులచే స్పష్టపడినది. అప్పటినుండియు

గలిగిన యీ సంస్కృతభాషాసాహచర్యము సుమారు పదిశతాబ్దములకు, అనఁగా నన్నయనాఁటికి భారతభాషాస్వరూప మేర్పడుటకు హేతువయినది. ఈ పది శతాబ్దములయందును సంస్కృతభాష యెట్లు తెనుఁగును మార్చినదియు, నభివృద్ధి చేసినదియుఁ దుదికిఁ దా నెట్లీ బాసకుఁ గైవసమయినదియుఁ దెలిసికొనఁ బ్రయత్నించుటయే నన్నయకుఁ బూర్వ ముండిన యాంధ్రభాషాచరిత్ర మనక తప్పదు. ఈ భాషయొక్క స్వభావమునను స్వరూపమునను బాతుకొనియున్న ద్రావిడ స్వరూప స్వతంత్రతా లక్షణమును, సంస్కృత సంబంధమును నిరూపించుటయే యీ విచారణమునందలి ఫలితము. ఈ సంస్కృతసంబంధముగూడ నాంధ్ర దేశమునం దంతటను సమానముగ నుండలేదు. రాజులు, సంస్కృత విద్వాంసులు, సభలు గలిగినచోట నీప్రభావ మధికము. అట్టివాని సంపర్కము తగ్గినచోట నియ్యది యల్పము. ఈ క్రింది మాదిరిశాసనములను బరిశీలించునది.

1. శాసనము నెం. 584 దక్షిణహిందూదేశ శాసనములు. సంపుటము VI, పుట 208. కాలము సుమారు క్రీ. శ. 641.

స్వస్తి శ్రీమత్ సకలలోకాశ్రయ జయసింఘ మహారాజు లాకున్ ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరంబుళ్ ఎఱుంబొది అన్నేట్టి అమఁ పూణ్ణమనాణ్డుం ణ్లూవిండి రాజుల ముట్బు కలిముడిరాజుల్ ణ్లూవిండి సముద్రగంబు నాకు బణిసేసిన కల్చిపీఱిరుఙ్ల మద్దికదు మూఁటికి విత్పట్టి ఉత్తరంబున పులొంబున చెఱువు పడు మారికోటన్ ఎఱుంబొది పుట్బు అఙ్ల పట్టుసేను. తూప్పుఁన కోటి తాటితోంట శాయ పడువారంబు ఇచ్చిరి. పాఱపడువారంబు ణ్లూవిండీశ్వరంబున కళాకణ్డుగు మిచ్చి కుడుచువారు.

2. పయిశాసనముకంటెను బ్రాచీనమని శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు ( 1941-42 ) వృషసంవత్సరాది సంచికలోఁ బ్రకటించినది :

(1) "స్వస్తి శ్రీ సోట మహారాజుల్లొళన ఇన్పుఱోలి అణపోతులు రేవణ కాలు పుద్దణకాలు ఇచ్చిన పన్నస పెన్వాఱ ఇశఱేనికినిన్. తేని టచ్చిసవాన్డు పఞ్చ మహాపాతకున్డకున్.

(2) మణయ శమ్మణ గణయ శమ్మణ వృద్ధశమ్మణ ఇమువ్వుర ఒకాడు బోళచేత శవణగొణిరి. ఇఙ్లకా వెఱుగువారు. సమతిబోళుము విసబోళుము పట్టి ముకున రట్టొఙ్లు పుణ్యసాఙ్లు వన్టి బోళుము ఇన్దొఱు దినికిసఞి. అఱుగరాలన్వారు విషయ బోళకొణిరి.

3. [ కృష్ణా జిల్లా దివి తాలూకా లక్ష్మీపుర మను గ్రామమున నొక బ్రాహ్మణుని యింటి దొడ్డిలో నున్నది. మూఁడవ విష్ణువర్ధనుని తండ్రియగు మంగిదొగ రాజు క్రీ. శ. 675 నుండి 699 వఱకును రాజ్య మేలెను. ఇది యాతని కాలము లోనిది. ]

ఇది వేటూరి ప్రభాకరశాస్త్రిగారిచేఁ ప్రాచీనాంధ్రశాసనము అనుపేరను భారతిలో ప్రచురింపఁబడినది.

"స్వస్తిశ్రీ మగిదొగ రజులముద్లు విట్టజుల ప్రతమ
రాజ్యంబున కడువండ్లుల ఇచ్చిన రెన్డువటి
మిరియమ్బు బోళజకు ఱంగరిపె
డళిన రెన్డువట్టి పదేన్దుంబు అడ్లుప
ట్టుద్రుగ్గాదేవి నేలయు ఉలువుటరిబోళ
రెన్డట్టియు తూఱ్ప ఈరెన్డట్టి టిచువరు
కళరేని భారనాసి వేగవిలాళు వేడ్లు
ము వేశెలువుళు వేపురు పఞాను
చమ్బిన చన్నంగు."

(4) ఇది నెల్లూరుజిల్లా శాసనములలో కందుకూరు నెం. 31, 32 గా ప్రచురింపఁబడినది. క్రిందిది శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారి పాఠము. ఇది మూఁడవ విజయాదిత్యునినాఁటిది.

"శ్రీనిరవద్యుణ్డు సిత్తజాత సముణ్డు శివపదవర సేవితుణ్డ
ఖిలాణ్డాతతరిపు బలుణ్డా హావరాధరణ్డ యోధ్య సింఘా
సనుణ్డ గణిత దానాసనుణ్డు గజ.
లయుణ్డ....హాసనోన పణ్డరంగు వ్వి....ణియు
గాన్బి కొలది లేనికొట్టంబు ల్వోడిచి గొణకె నలాత
పతుపాతి సలలిత.........."

(5) సత్యాదిత్యుని మాలెపాడు శాసనము. కడప మండలము. ఎపి. ఇం. పుట 345 (8-వ శతాబ్ది)

"స్వస్తిశ్రీ చోటి మహారాజాధిరాజపరమేశ్వర విక్రమాదిత్య శక్తికొమర విక్రమాదిత్యుల కొడుకుళ్ కాశ్యపగోత్రుణ్డు సత్యదితుణ్డు సిద్దివేయురేనా ణ్డు ఏటువేల పలుచున్టి కొమటిపాఱు రేవశమ్మఁ కశ్యపగోత్రినికి ఇచ్చిన చిఱుమ్బూరి ఉత్త. శ తూర్పుఁన దిశ. జుగ్గి పొలగరుసు దక్షిణదిశ...
పాఱమ ఏనుమాఱుత్రుగాను తాగిరి దేనిసల్పినవానికి వేగుళవు
వేసెలువుళు వేవాన్టూల్లు నిల్పినమ్ పుణ్యమ్బు. దీనికి వక్రమ్బు వచ్చు
వాన్టు పుత్రవద్య స్త్రీవద్య గోవద్య పఞ్చమహాపాతకఞ్చేసినవాని లోకమ్బు
నున్డువాన్టు."

ఈ శాసనమునందలి చిఱుమ్బూరు కడప జిల్లాలోని కలమళ్ళ రైల్వేస్టేషను దగ్గఱనున్న నేఁటి చిలంకూరు అని నిశ్చయింపఁబడినది.

(6) అమ్మరాజు II (945-70) కలుచుమ్బఱ్ఱుశాసనమునందలి తెలుఁగు భాగము. ఎ. ఇ. వా. vii, పుట 177.

"పెద్దకలుచువు బఱితిశాసనము సేసిన భట్టదేవని కరహానంది భటార్లు గుమ్సిమియ రెట్టెడ్లు గాంపులు నుండి ..ను ...డ్డ తూమున నె (ని) వుట్లు విత్తుపట్టు ప్రసాదం చేసిరి.

భిన్న కాలములకును, భిన్న ప్రదేశములకును సంబంధించిన పై అఱు శాసనముల యందును గల సంస్కృతపదములును, దద్భవపదములును దీసివేయగా మిగిలిన యచ్చ తెనుఁగుపదములు స్పష్టముగా నిప్పటి రూపములకుఁ ప్రాచీనరూపము లని బోధపడక తప్పదు.

| ప్రాచీన రూపము | ఇప్పటి రూపము | ప్రాచీన రూపము | ఇప్పటి రూపము |
|---|---|---|---|
| ఎఱుంబోది | ఎనిమిది | రట్టొళ్లు | రెడ్లు |
| పూణ్ణమ | పున్నమ | పదేన్డుంబు | పదిపదుము |
| నాణ్డు | నాడు | రెన్డట్టి | రెండిటి |
| బణి | పని | కళరేని | కలరేని |
| విత్పత్తి | విప్పర్తి | బారనాసి | వారణాసి |
| పులొంబు | పొలము | వేగవిలాళు | వేయికవిలలు |
| అల్లు | ఆళ్లు | వేడ్లుము | వేయిగుళ్లను |
| తాటుతోంట | తాటితోట | వేశెఱువ్వళు | వేయిచెరువులు |
| పాఱ | పాఱుఁడు | వేవురుపఱాను | వేవురుపాఱులను |
| సోటి | చోళ | కొఱ్ఱంబు | కొట్టంబు |
| గొణిరి | కొనిరి | కొడుకుళ్ | కొడుకులు |
| బోళుము | (భోక్తలును) | చిఱుమ్బూరు | చిఱంకూరు |

పై శాసనములలోని భాషను పరిశీలించినచో శబ్దజాలములనుగూర్చి యీ క్రిందివిషయములు స్పష్టపడుచున్నవి.

1. అచ్చ తెనుఁగుపదములు చాలవఱకు అరవ కన్నడ పదములను బోలి యున్నవి.

2. అచ్చ తెనుఁగుపదములు కేవలము వ్యవహారముమాత్రమే ప్రమాణము గలవి గనుకను, దేశస్థులకు నిత్యవ్యవహారమునందలివి గనుకను కాలక్రమమున రూపాంతరము నంది నేఁటిరూపములుగా పరిణతము లయినవి.

3. సంస్కృత ప్రాకృతములనుండి తద్భవములుగా వచ్చిన సామాన్యపదము లును, మాఱుపాటు నొంది నేఁడు భిన్నరూపములతో వాడంబడుచున్నవి.

4. సంస్కృతమునుండి వచ్చిన తత్సమపదములు చాలవఱకు పండితమాత్ర ప్రయుక్తములు. ఆ పదములు ప్రవేశించిననాఁటికే వాని స్వరూప స్వభావములు

కోశ, వ్యాకరణ, కావ్యాదికములచే స్థిరత నందినవిగాన నప్పటినుండి యిప్పటివఱకును నొక్కరూపముననే యున్నవి. వానికి మాఱుపాటు లేదు. ఉచ్చారణ త్వరవలన గలిగెడి మార్పులును, ఇతరకారణములవలనం గలిగిన భ్రంశములును నందు గనుపట్టవు.

5. అచ్చతెనుఁగున నుండిన యల్పసంఖ్యాకపదముల కర్థమునందుగాని, భావవైశాల్యమునందుగాని నవ్యత్వమును, స్వాతంత్ర్యమును గలుగుట కవకాశము చాలగా లేదు. కొంచెము నూత్నభావము చెప్పవలసివచ్చినపుడు సిద్ధముగా నుండిన సంస్కృతపదకోశములలోనుండి యిష్టమువచ్చిన పదము నెంచుకొనుటకు వీలుగా నుండుటచేతను, నయ్యది పండితజనాంగీకారమును నగుటచేతను మొట్ట మొదట నసమస్తపదములును దరువాత దీర్ఘసంస్కృతసమాసములును బ్రవేశించి తుదకు నన్నయనాఁటికి తెనుఁగు దత్సమభాషాభూయిష్ఠ మయిపోయినది.

6. ప్రాచీన పురుషనామములనుగూర్చియు, గ్రామనామములనుగూర్చియు ముందుప్రకరణములలోఁ గొంత ప్రధానవిషయము ముచ్చటింపఁబడినది. అక్కడి యుదాహరణములు చాలవఱకు నాఱవ శతాబ్దికి ముందుండిన శాసనములలో నుండియే గ్రహించితిని. ఈ క్రింద మఱికొంత విపులముగాఁ జాళుక్యశాసనము లలోనుండి యుదాహరణము లీయఁబడును. దానప్రతిగ్రహీతలు సంస్కృత శాసనములలోనివారు విద్యాధికులగుటచే వారి పేళ్ళన్నియు శర్మ, భట్టు మొదలయునవి యంతమందు గలవిగానే యుండును.

## పురుష నామములు

తూర్కశర్మ, త్రేది (త్రివేది); దోణశర్మ (ద్రోణశర్మ); బోటిమ—అజ్ఞా పకుని పేరు - విజయాదిత్యుని ఏదేరుశాసనము. ఎ. ఇ. వా. V, పుట 118 (799-843)

తూక్కఁశమ్మఁ, దామోదరశమ్మఁ, పాణ్డరాంగః, కట్టయ (ఇది శాసన నిర్మాత హేమకారాగ్రగణ్యునిపేరు) మూఁడవ విజయాదిత్యునిది (844-888)

ఉమ్మరకన్థిబోళ్, ద్రోణభట్టః, పోతమయ్యాక్రమయిత, కదెయరాజః (పాణ్డరాంగుని మనుమఁడు) కొండాచాయ్యఁ (లేఖకుడు) — చాళుక్య భీముని బెజవాడ శాసనము. 888-918. ఎ. ఇ. వా. V, పుట 129.

నాగిపోతి (దాదిపేరు) ఇ. ఆ. వా. VIII, పుట 77. అమ్మరాజు I. 918-925

త్యాక్కియ (క్రమకః) విద్దమయ్య (క్రమకః), చాళుక్యభీముఁడు II (934-945) ఎ. ఇ. వా. V

పటవర్ధినీ (కులము) పమ్మవ (తల్లిపేరు) బల్లాలదేవవేలాభటుఁడు. దాన ప్రతిగ్రహీత బొద్దియ. [ అమ్మరాజు II (945-970) ఎ. ఇ. వా. V. ]

చామెక (అమ్మరాజు భోగకాంత) (అర్హనన్ది, అయ్యపోటి, సకలచన్ద్ర సిద్ధాంతః - జైనులపేళ్లు) పైరాజు నింకొక శాసనము. ఎ. ఇ. వా. VII, పుట 177.

ఇంద్రవమ్మఁ గొండనగూరు శాసనము ఎ. ఇ. వా. XVIII, పుట 1 3 క్రీ. వె.) ఇణ్ణులూర్ బోయ (మనుమనికి) కొణ్డివమ్మఁ ; సాతుల పేళ్లు : ఆలపాక బోళ్, సోమయాజుల వెల్లెక్కిబోళ్; మారటబోళ్, చోడబోళ్.

I కాటిశమ్మఁ — కడ ఎఱెం..., పృథివిపోత్తి (రాజప్రియదుహిత) ఎ. ఇ. వా. XVIII, పుట, 58. 732 క్రీ. వె. జయసింహ I (633-663)

వంగిపఱు వాస్తవ్యః భట్టగుఙ్డేన విరచితం కావ్యం ఘనవట్టబోరోజేన లిఖితః. ముసియసశమ్మఁ, గుణ్డమయ్య, ముసియ, క్రోవి (వంశము) - వేమలూర్పాడు శాసనము. అమ్మరాజు 945-970 క్రీ. వె.

వేదశమ్మఁ (609-642) రెండవ పులకేశి కొప్పరము శాసనము. 630 క్రీ. వె.

గొబ్బడి (విజ్ఞాపకుడు) ఎఱద్రోణశమ్మఁ, పృథివీగాముణ్డి — జయసింహ II --709) ఎ. ఇ. XVIII, 315.

సోమశమ్మఁ. జయసింహ I, 633-663 క్రీ. వె. వా. XIX, పుట 260.

కుప్పనయ్య : కలివమ్మఁ, మకరియరాయ. తాళ II సిరిపూండి శాసనము. 970 క్రీ. వె. ఎ. ఇ. XIX, పుట 148.

## గ్రామనామములు

కొఱ్ఱపాఱు, రామాటి, రెణ్డువటి, బోళరెణ్డువటి, వణ్డుపిఱెయు, మినిమిని, ఎ. ఇ. వా. V, పుట 118. 799-843. క్రీ. శ.

గుద్రవార (విషయము), ఉప్పఁటూరు, ట్టణ్డపాటు, అంగలూరు, వేల్పూరు, చవిటిపాటు. ఎ. ఇ. వా. V, పుట 122. మూడవ విజయాదిత్యుని కాలము (844-888)

ఉత్తరకణ్డేరువాడి (విషయము), కూకిపఱ్ఱు, (ఎల్లలు) పోతాయ్యఁంగారి చెఱువు, పరువులగుణ్ట, చాకిచెఱువు, చిన్తజేనిచెఱువు, జువ్విగుణ్ట, ఐరివియగుణ్ట. ఎ. ఇ వా. V, పుట. 129. చాళుక్య భీముని బెజవాడ శాసనము. 888-918.

ద్రుజ్జూరు (ఇప్పటి జుజ్జూరు కృష్ణానదియొడ్డున నున్నది) దాటుగుమ్మి, గొట్టిబ్రోలు, మల్కబోరము, అదుపు-మొదటి అమ్మరాజు మచిలీపట్టణపు తామ్ర శాసనము. 918-925 (ఇ. ఆ. వా. VIII, పుట 77) ఎ. ఇ. వా. V.

వజ్జిపఱ్ఱు (మహాగ్రామము), ఆకులమన్నాణ్డు, క్రక్కుటవ్వా, పెద్దకోడు. చాళుక్య భీమరాజు III బందరుశాసనము (934-945)

పామ్బఱ్ఱు, (ఎల్లలు) నోమిక్షేత్రము, పూతనపరియక్షేత్రము, ఇన్దనీచెఱువు, రట్టోడిచేను, గుమ్మచేని గరును, వేల్పుజేను, తూప్పఁనపన్నస, దామపియపన్నస, పెద్దత్రోవ, యేఱు, గణ్డశాల యప్పవయ్యరిపన్నాస, ఖాదిరాల మజ్జియపాటు, తిన్టూఱ్ఱో టమపాటు, జీవరక్షపాటు, రచ్చ. అమ్మరాజు II 945-970 ఎ.ఇ.వా. V.

అమ్మరాజు II మఱియొక శాసనము. ఎ. ఇ. వా. VII, పుట 177.

అత్తిలినాణ్డు (విషయము), కలచుమ్బఱ్ఱు, అరువిల్లి, కోరుకొలను, యిడియూరు, యుల్లికొదమణ్డు, శక్కఱకుఱ్ఱు, ఇట్టులకోటు, ఇడియూరి పొలగరుసు, కన్నరిగుణ్డు.

పటికి (విషయే) కుము౯లూర (ఇప్పటిపేరు గుమ్ములూరు) పోదునూఱ్కౄ (వాస్తవ్యుడు) విష్ణువర్ధనుఁడు I తిమ్మాపురము ఎ. ఇ. వా IX, పుట 317 (615-633) ఈ శాసనము తిమ్మాపురములో సర్వసిద్ధి తాలూకా విశాఖపట్టణం జిల్లాలో దొరకినది.

ఇంద్రవర్మకొండ నాగూరు శాసనము ఎ. ఇ. వా. XVIII, పుట 1. బందరులో దొరకినది. 663 క్రీ. వె. కొణ్డణగూరు, ముజుమ్మూరు, పగునూరు, చెఱుపూరు, ఇబ్బఱలి, ఇట్టులూర్.

నిడుపాఱు శాసనము - జయసింహ I 633-663.

గణ్డేఱువాటి, వ్యాఘ్రనదీ, వన్నేఱునదీ, గణ్డేఱురాజధానీ, నిడుబ్రాఱు (నిడుపాఱు) ఇది నేటి నిడమఱ్ఱు. గణ్డేఱు అనునది నేటి గుంటూరు తాలూకాలోని కన్తేరు అను గ్రామము.

విష్ణువర్ధనుఁడు III 709-746 ఎ. ఇ. XVIII, పుట 58 (732 క్రీ. వె.

ట్టోలనాణ్డు, జలయూరు, ఎలియేఱు, కాకణ్డివాడ.

అమ్మరాజు II వేమలూరుపాడుశాసనము. 945-970 ఎ.ఇ. XVIII, పు 228.

మేదలొఙ్కణ్డ, గట్టిపూణ్డి, టిజొఙ్కణ్డ, క్షేత్రసీమాని, ముయ్యలికుట్టునశమీ, గణ్ట, గుణ్టేటి అకటితివేవుల, గోను, వెంచ, పరువులు, పటియకటితి చటలలు, కుణ్ట, చలిగుణ్ట, ముయ్యలికుట్టున వెల్లటూయు, అణ్మణఙ్గూరు, అణ్డేకి, తూమియవెఁరియ పూణ్డి, కారఞ్చేడు.

రెండవ పులికేశి కొప్పరపు శాసనము 630 క్రీ. వె. (609-642) ఎ. ఇ. వా. XVIII, పుట. 257. కమ్మఱాష్ట్రము, ఇర్బులిగ్రామ, బలాకబల్వల (ము). కమ్మఱకారతటాక (ము), కొణ్డవెఱుపూర్, విరిపఱు.

రెండవ జయసింహుని పెణుకుపఱు శాసనము (696-709) ఎ. ఇ. XVIII, పుట 315. వఙ్గిపఱు, కమ్మఱాష్ట్రము, నిడుగట్టతటాక (ము), పూసబోళక్షేత్రమునకు పోవు పంథా ; జెడ్డబోళక్షేత్ర (ము).

మొదటి జయసింహుని పెద్దవేగి శాసనము (633-663) ఎ.ఇ.వా. XIX, పుట 260. కొమ్బఱు, ప్లేణ్టూరు, కన్థేఱువాటి విషయము.

తాళ II సిరిపూణ్డిశాసనము. ఎ. ఇ. XIX, పుట 148 (970 క్రీ. వె.)

శ్రీపూణ్డి (ఎల్లలు): మణ్డిముంకచింద, కొడమదువు, ఆదూరి సీమాంతే గోగుచేవు, కదముకోపు, కలవేలలగులపెద్దచింత, చిఱుశోదిమద్దలు, గోరగ పల్లము నుత్తరమున కద్దుంబొదలు, శాదియ బోలయపెదరియాకుఱంత. ఆదూరు నామ్ని గ్రామాటికా.

ఇంద్రవర్మ కొండనగూరు శాసనమున (663 క్రీ. వె.) ఇట్టులూర్ బోయస్య యని ఇట్టులూర్ అను నింటిపేరు గ్రామనామమువలనఁ గలిగినది కనుపట్టుచున్నది. నరసరావుపేట తాలూకా గుంటూరు జిల్లాలో నేఁటి ఇర్లపాడు అను గ్రామములోని సోమేశ్వరదేవాలయమున (1057 శక సం.) ఇట్టులూరి సోమేశ్వరదేవతకు అనుపేరితో (ద. హి. శా. IV, నెం. 926, 927) వ్యవహారము గనుపట్టుచున్నది. దీనినిబట్టి 'ఊరు', 'పాడు' అను శబ్దములు పరస్పరము మాఱుచుండె ననుట స్పష్టము.

పై పేళ్లనుబట్టి పాడు, పఱ్ఱు, చెఱువు, ఊరు, పట్టణము, పల్లి, గొఱ్ఱు అను పదము లంతమునందు గల నేఁటి గ్రామనామములే ప్రాచీనరూపములతోనుండి కాలక్రమమున నుచ్చారణమున మాఱుపాటును బొంది యిప్పటి రూపములను ధరించినటుల స్పష్టము. పాడు -పాఱు; పఱ్ఱు- పఱు—పఱు; చెఱువు—చెఱు; ఊరు—ఊర్; పట్టణము పట్టణబు; పల్లి—పళ్లి; గొఱ్ఱి—గొఱ్ఱు. పై రూపములలో మొదటిది నవీనరూపము. తరువాతిది ప్రాచీనరూపము. పయి యుదాహరణములవలన క్రీస్తు ప్రథమశతాబ్దినుండి పదునొకొండవ శతాబ్దివఱకును దెనుఁగుభాష యునికియు, స్వరూపమును సునిశ్చితము.

ప్రాచీనభాషయొక్క వ్యాకరణమును, వాక్యరచనయు సంస్కృత వ్యాకరణ ప్రభావ మను శీర్షికయందు విమర్శింపఁబడును.

# ఇతర ద్రావిడభాషలతో తెనుఁగునకుఁగల సంబంధము

## 1. ద్రావిడభాషాపరిగణనము

తెనుఁగు ద్రావిడభాషలలో నొక్కటి యనియు, సంస్కృత ప్రాకృతములతో నద్దానికి జన్య జనక భాష సంబంధము కాని, సోదరభావము కాని లేదనియు ముందుఁ గొంతవఱకు నిరూపించితిని. ఈ ప్రకరణమున నా ద్రావిడభాష లేవి, వానికిఁ దెనుఁగుతోఁ గల సంబంధమేమి యను విషయము విచారింపఁబడును.

ఈ ద్రావిడశబ్దము 'ద్రవిడ' శబ్దమునుండి యేర్పడిన విశేషరూపము. ఇది సంస్కృతశబ్దము. దక్షిణదేశమునందుఁ బ్రచారములో నున్న కొన్ని భాషలను బరీక్షించి యా భాష లనేకలక్షణములలోఁ గల సన్నిహితత్త్వమును గనిపెట్టి 'ద్రావిడ భాషలు' అను నామకరణము చేసినవారు బిషప్పు కాల్డ్వెల్లుగారు. ఈయన క్రైస్తవమతవ్యాప్తికయి దక్షిణదేశమున కరుగుదెంచి చాలకాలము తమిళము నందుఁ గృషిసల్పి, తరువాత యథావకాశముగా నితర ద్రావిడభాషలందును బాండిత్యమును సంపాదించి వాని పరస్పర సంబంధ సామ్యములను గుఱించి యనేక వ్యాసములను, విమర్శనములను బ్రచురించి తుదిని 'ద్రవిడభాషావ్యాకరణము'[1] అను పేరితో నొక గ్రంథమును 1856-వ సం. నందుఁ బ్రకటించెను. మఱి 19 సం. ల తరువాత 1875-వ సం. న నా గ్రంథమును బెంచి తిరుగఁ బ్రకటించెను. ఆ తరువాత మఱల 1913 లో నా గ్రంథము ముద్రింపఁబడినది. మదరాసు విశ్వకళాపరిషత్తు వారిచే నిది 1956-వ సం. లో పునర్ముద్రిత మయినది. ఇట్లు ప్రకటించిన యీ గ్రంథమే 'ద్రావిడభాషలు' అను పదము దక్షిణ హిందూస్థానభాషల నుద్దేశించి వాడుటయందును, ఆ భాషలకుఁ గల పరస్పర సన్నిహితసంబంధమును గనుంగొనుటయందును బ్రథమమును, బ్రమాణమును నయియున్నది. వారి మతముచొప్పున 'బ్రాహుయీ' యను నుత్తరహిందూస్థానభాషయగు ద్రావిడభాషాభేదముగాక ద్రావిడభాషలు 12. అందు ఆఱు నాగరకభాషలు, ఆఱు అనాగరకభాషలు నని వారి యభిప్రాయము.

### నాగరక ద్రావిడభాషలు

1 తమిళము, 2 మలయాళము, 3 తెలుఁగు, 4 కన్నడము, 5 తుళు, 6 కొడగు.

[1] *A Comparative Grammar of the Dravidian or South Indian family of Languages :* C. G. D.

## అనాగరక ద్రావిడభాషలు

1 తుద, 2 కోట, 3 గోండు, 4 ఖోండు లేక 'కు', 5 ఒరాయను, 6 రాజమహాలు. ఈ భాషలన్నిటినిగూర్చి కొంచెము కొంచెముగా ముందు వ్రాయబడును.

మీఁదఁ బేర్కొనఁబడిన భాషలన్నియును జాలవఱకు దక్షిణ హిందూస్థాన భాషలే. వీనిని గొంతకాలమువఱకును బాశ్చాత్యులు తమిళసంబంధభాష అని వాడుచుండినట్లును, దా నా పేరు సరికాదు గావున ద్రావిడభాష అను పేరు వీనికి రూఢపఱచుచున్నాననియును వీరు వ్రాసియున్నారు.[2]

ఈ ద్రావిడపదము సంస్కృతమున నంతకుముందుఁ బ్రసిద్ధముగా వాడఁబడుచునే యున్నది.[3] ఈ సంబంధముననే 'ద్రావిడీ' యను నొక భాషాభేదము సంస్కృతభాషావేత్తలచేఁ బేర్కొనంబడినదనియు, నయ్యది 'విభాష' యనియు, నయ్యది దక్షిణహిందూదేశ భాషలన్నిటినిగూర్చి యవ్వాని పరస్పరభేదములను స్పష్టముగా గుర్తెఱుంగకయే వాడంబడినదనియుఁ గాల్డ్వెల్లుగారు పేర్కొనియున్నారు.[4] మనుస్మృతియందును[5] మహాభారతమునందును[6] భాగవతాది[7] పురాణములయందును వాడంబడిన ద్రవిడశబ్దము ఆంధ్రశబ్దమువలెనే జాతిపరమని యంగీకరింపక తప్పదు. కుమారిలభట్టు (సుమారు 7-వ శతాబ్దము క్రీ. వెనుక) తన తంత్రవార్తికమునందు పదముల కర్థము చెప్పునప్పుడు అనుసరింపవలసిన సంప్రదాయములను విశదీకరించుచు "ఆంధ్ర ద్రావిడ భాషాయామ్" అని యుదాహరించెననియును, దానినిబట్టి యాకాలమున నాంధ్రులకును దమిళులకును నుండిన భాషల నొక్కటిగనే యూహించిరనియును కాల్డ్వెల్లుగారును, గ్రియరుసన్‌గారును వ్రాసిరి. కాని "తద్యథా ద్రావిడ భాషాయామ్" అని పాఠముగాని, "ఆంధ్ర ద్రావిడ భాషాయామ్" అనునట్టిది గాదనియు నిశ్చయింపబడినది.[8] ఏపాఠము యుక్తమైనను ద్రావిడశబ్దమున కచ్చటఁ దమిళమే యర్థ మనుట నిర్వివాదము. అత్యంత ప్రాచీనకాలమునుండియు జాతిపరముగా వాడంబడిన యీ ద్రవిడపదము భాషాపరముగాఁ గూడ వాడంబడినదనుట స్పష్టము. దండి దశకుమారచరిత్రమున

---

[2] C. G. D. Page 6. Page 3-6

[3] C. G. D Page 4. "It is a term however which has already been used more or less distinctively by Sanskrit Philologists as a generic appellation for the South Indian peoples and their languages and it is the only single term they seem ever to have used in this manner."

[4] C. G. D. Page 5. [5] మనుస్మృతి X, 43-44

[6] C. G. D. Page 5. [7] C. G. D. Page 5.

[8] ఇ. అ. వా. I. పుట. 235. తంత్రవార్తికము. III "తద్యథా ద్రావిడాది భాషాయామేవ", "ఓదనమ్ చోర్", "పాప్‌శబ్దమ్ సర్పవచనమ్."

'అస్తి ద్రవిడేషు కాంచీనామ నగరీ' యని దేశపరముగా వాడియున్నాఁడు. బాణుని కాదంబరియందు 'జర ద్ద్రావిడధార్మికస్య ఇచ్ఛయా నిస్సృష్టైః' అని జనపరముగా వాడియున్నాఁడు. ఇట్లు ప్రాచీనకాలమున నేయర్థమున వాడఁబడినను కాల్డ్వెల్లుగారి మతము ననుసరించి నేఁటికిమాత్రము ద్రావిడభాష లను పదము ముందుఁ బేర్కొనఁ బడిన భాషాసముదాయమునకుఁ బేరుగా రూఢమయినది గావున నేఁటి కా పదమును బయియర్థముననే గ్రహింపవలయును.

ఇంకొక విషయ మీ సందర్భమునఁ బేర్కొనక తప్పదు. ఆర్యజాతి యొకటి యనియు, ద్రావిడజాతి వేఱొకటి యనియు, నా జాతులకు భాషలయందుమాత్రమే గాక నాగరకతయందును, నభ్యాసములందును భేదము గలదనియు నా జాతి జను లిరువురునుగూడ భిన్నకాలములయందు హిందూదేశమును బ్రవేశించిరనియుఁ గొందఱి యభిప్రాయము. ప్రాచీనకాలమున నీ హిందూదేశమున నుండిన యాటవిక జాతివారిని వెనుకకుఁ ద్రొక్కి ఆఫ్ఘనిస్థానపు మార్గమున వచ్చి యిక్కడ ద్రావిడులు స్థిరనివాస మేర్పఱుచుకొనిరనియును, మఱికొంతకాలమున కార్యులు వచ్చి యీ ద్రావిడులను గ్రమక్రమముగా దక్షిణమునకుఁ దఱిమివేసి యుత్తరహిందూస్థానము నంతటిని దా మాక్రమించుకొనిరనియును గొందఱి యభిప్రాయము. మఱికొందఱు ద్రావిడు లిక్కడివారే యని తలంచుచున్నారు.[9] ఇట్లు విప్రతిపన్నమయిన విషయ మునుగుఱించి యిదమిత్థమని చెప్ప వీలుకాదు. ఇంతకు నీ యభిప్రాయములన్నియు నూహామాత్రములుగాని స్పష్టములయి నిర్వివాదములయిన ప్రమాణసిద్ధములు కావు. ఒకటిమాత్రము నేఁటికాలమున నంగీకరింపక తప్పదు. భారతదేశమునం దంతటను బ్రవహించిన యార్యనాగరకతాప్రవాహము దక్షిణమున నిలిచిపోయిన ద్రావిడ నాగరకతాస్రోతస్సులోఁ గలిసి యేర్పఱుపరాని యొక మహాప్రవాహ మయి వ్యాప్తిలో నున్నది. ఇంతకును మన పరిశీలన భాషావిషయమునఁగాని జాతి విషయమునఁ గాదుగదా! ఆర్యభాష లనంబడెడు నుత్తరహిందూస్థాన భాషలకును ద్రావిడభాషలుగా పైఁ బేర్కొనఁబడిన భాషలకును నెంతటి పరస్పర సన్నిహిత సంబంధ మున్నదని యంగీకరించినను, జన్యజనకభావ సంబంధముగాని, సోదరసంబంధము గాని లేదనుట సిద్ధాంతము. భాషామాత్రమునుబట్టి జాతి భిన్నత నేర్పఱచుటకును, సిద్ధాంతీకరించుటకును వీలుకాదు. ఒకజాతి తనభాషను సంపూర్ణముగా విడనాడి యన్యభాషను గ్రహించుట సంభవించినను సంభవింపవచ్చును. జాతులు పరస్పరము కలిసిపోయి యేర్పఱుపరాక కొంతకాలమున కొక్కటిగా నేర్పడుట యపూర్వము గాదు. భారతదేశమునందును నట్టి యవస్థయే యీ యార్య ద్రావిడ నాగరకతలకుఁ బట్టినదనియు, నా ప్రవాహములు రెండును గంగాయమునలవలె గలిసిపోయి భాష యందును, భావములందును, అభ్యాసములందును, ఆశయములందును, మతము

[9] C. G. D. Page 40

నందును, మర్యాదలయందును మిక్కిలి సునిశితదృష్టితోఁగాని యేర్పఱుప వీలు లేనట్లు నేఁడు దక్షిణహిందూస్థానమునఁ గన్పట్టుచున్నవి.

ఈ ద్రావిడభాషలు మాటాడు దేశమునుగూర్చి గ్రియర్సనుగా రిట్లు వ్రాయుచున్నారు.[10] "దక్షిణహిందూస్థానము నంతటను, సిలోను ఉత్తరభాగమునను ద్రావిడభాషలు వ్యాపించియున్నవి. గోవాకు నూరుమైళ్లు క్రిందికి అరేబియా సముద్రతీరమున నారంభించి యీ విభాగరేఖ పడమటికనుమల ననుసరించి కొల్లాపురమువఱకును బోవుచున్నది. అక్కడనుండి కొంత వంకఱగా నిజాము రాష్ట్రమును బ్రవేశించి బీరారులోని దక్షిణభాగమును దనయందుఁ జేర్చుకొని తూర్పువైపున బంగాళాఖాతతీరమును జేరుచున్నది. పై రేఖయొక్క తూర్పు భాగము నిరంతరరేఖ గాదు. చాందా, భందర అను ప్రదేశములకుఁ దూర్పున నున్న భాగము ద్రావిడభాషల మాటాడుజాతులతోఁ గూడుకొని యున్నది. ఆర్య భాషాభేదములు సమప్రదేశములం దంతటను వాడుకలో నుండుటచే నార్యభాషా సముద్రములో నక్కడక్కడ నున్న చిన్న చిన్న ద్వీపములవలె నీ భాషలు కొన్ని యెడల వాడఁబడుచున్నవి. ఇంకను నుత్తరమున మధ్యపరగణాలలోను, చోటా నాగపురములోను, గంగానదియొడ్డున రాజమహాలులోను నీ ద్రావిడభాషాభేదములు వాడుచునే యున్నారు. వాయవ్యదిక్కున బెలూచిస్థానమునను నొక ద్రావిడభాషా భేదము కనుపట్టుచునే యున్నది."

పయి భాషలయొక్క చరిత్రమును సంగ్రహముగా వ్రాసినతరువాత నీ భాషల కన్నింటికిఁ గల సామాన్యలక్షణములు పేర్కొనంబడును.

## 2. తమిళభాషావాఙ్మయములు

ఈ భాష దక్షిణహిందూస్థానముయొక్క యాగ్నేయభాగమునం దంత టను, సింహళద్వీపముయొక్క ఉత్తరపు సగపాలునందును వాడుచున్నారు. ఈ భాషకుఁ దూర్పుయెల్ల బంగాళాఖాతము. పడమటియెల్ల పడమటి కనుమలు. మద రాసునకుఁ గొంచె ముత్తరముననుండి చెంగల్పట్టు, ఉత్తరార్కాడు జిల్లాలలోఁ బడి (ఉత్తరార్కాడు జిల్లాలోని యుత్తరపు సగమును విడిచి) సేలము జిల్లాలోని వాయవ్యభాగముననుండి నీలగిరి, పడమటికనుమలవఱకును వెడలి, విభాజక రేఖ దక్షిణపువైపునకుఁ బోవుచు, మలబారు, కొచ్చి, తిరువాన్కూరు రాష్ట్ర ములలో నధికభాగమును మలయాళభాషకు విడిచి కన్యాకుమారి అగ్రమువఱకును బోవుచున్నది. ఈ భాషను మాటాడువారిసంఖ్య 2,65,46,764. ఈ దేశమునం దక్క డక్కడఁ దెలుఁగు మాటాడు జనులు దాక్షిణాత్యాంధ్రు లను పేరితోఁ గొందఱు

[10] లి. సర్వే. వా. IV, పు. 277-278.

వసించుచునే యున్నారు.[11] ఈ తమిళసోదరులనుగురించియు వారి ప్రాముఖ్య ప్రభావములనుగూర్చియు డాక్టరు కాల్డ్వెల్లుగా రిట్లు వ్రాసియున్నారు.[12] "సింహళ ద్వీపములోని యుత్తరభాగమునను, వాయవ్యదిక్కునను క్రీస్తుశకమునకు ముందే వలసపోయి క్రమక్రమముగా నక్కడి సింహళులను ద్రోసిపుచ్చి తామే స్థిరపడిరి. సింహళద్వీపమునం దంతటను కాఫీతోటలలోని కూలీలు తమిళులే. కొలంబోలోని ధనసంపాదకజాతులలో నధికసంఖ్యాకులు తమిళులే. శీఘ్రకాలములోనే ధన సంపాదన హేతువులయిన వృత్తు లన్నిటినుండియు సింహళద్వీపవాసులను దొలం గించి యా దేశమునం దామే ప్రవేశింపఁగలిగిరి. మదరాసురాజధానిలో నున్న యిరోపీయు లందఱిదగ్గఱను కమాను నౌకరులుగను, ఇంటిసేవకులుగను నున్నవారీ తమిళులే గాన దక్షిణహిందూస్థానములోని కంటోనుమెంటు లన్నిటియందును (జిల్లాభాష యేదియైననుగూడ) ముఖ్యభాషగా తమిళమే వినఁబడుచుండును. కాఁబట్టి మలయాళదేశమునందలి కన్ననూరులోను, కన్నడరాజ్యమునందలి బెంగుళూరులోను, తెలుఁగుజిల్లాయందలి బళ్లారిలోను, హిందూస్థానీ వాడుకలో నున్న సికిందరాబాదులోను బజారులలో సాధారణముగా వినఁబడుభాష అరవమే. పెగు, పెనాంగు, సింగపూరు మొదలగు దూరప్రాచ్యస్థానములలో వినంబడు క్లింగుల (కళింగుల) యందు అధికసంఖ్యాకులు అరవవారే. మోరేషసు, పడమటి యిండియా వలసస్థానములలోనికి వెళ్లిపోయిన కూలీలలో నధికసంఖ్యాకులు అరవవారే. ఇన్నియేల, ధనసంపాదనకు వీ లెక్కడఁ గలదో, ఎక్కడ ఉదా సీనులు, నిరుత్సాహులు, అభిజాత్యము గలవారు, వెనుకకు నెట్టివేయఁబడుటకు వీలుగా నున్నారో యక్కడనెల్లను ఈ తమిళులు గుంపులు గుంపులుగాఁ బ్రవేశించు చునే యుందురు. హిందూజాతిలో నెల్లను వీరు మిక్కిలి యుత్సాహభరితులు, సాహసము గలవారు, పట్టుదల కలిగి పనిచేయువారు, మూఢశ్రద్ధ లేనివారు. వీరిని తూర్పుదేశపు గ్రీకులనిగాని, స్కాచ్చివారనిగాని చెప్పవచ్చును." ఇంతయేల, చారి త్రకముగాను, అధునాతనముగాను బ్రాహ్మణులును, బ్రాహ్మణేతరులును నయిన తమిళు లనేకు లాంధ్రదేశమునకు వచ్చి స్థిరపడిపోయి తెలుఁగువారే యయిపోయిరి. నన్నయను బోషించిన రాజరాజు తమిళదేశమునందే పెరిగి చోళరాజ్యమునుండి వచ్చి వేంగిదేశపాలకుడుగా నుండినపుడు అనేక తమిళబ్రాహ్మణులు, సంస్కృత పండితులును, యుద్ధవీరులును నాయనతో నీ దేశమునకు వచ్చియుండవలయును. 1102-వ సం. న (నన్నయ చరమకాలమున గావచ్చునేమో) వీరచోడునిచే వేయింపఁబడిన పిఠాపురపు తామ్రశాసనమున[13] 528 మంది దానప్రతిగ్రహీతల పేళ్లలో 116 పేళ్లు నిస్సంశయముగా దమిళనామములే. మిగిలిన సంస్కృత నామములలోఁగూడ ననేకులు తమిళులే యయి యుండవచ్చునేమో. ఆ తరువాత

---

[11] జి. సర్వే. వా. IV. పు. 299. [12] C. G. D. పు. 6-7.

[13] ఎ. ఇం. వా. V. పుట. 70.

పుదూరుద్రావిడులు, ఆరామద్రావిడులు, పేరూరుద్రావిడులు, దిమిలద్రావిడులు, తుమ్మగుంటద్రావిడులు అను పేళ్లు గలవా రనేకులు గుంపులు గుంపులుగా వచ్చి తెలుఁగునాట స్థిరపడి తెలుఁగువారే యయిపోయిన విషయ మెల్లరికిని దెల్లమే. ఎలమంచిలిదగ్గఱ నున్న దిమిల యను గ్రామనామము ద్రమిళశబ్దభవమే యనుట చిత్రముగాదు.

ఇట్లనాదిగా వలసపోవుచుండిన యీ తమిళజాతి మాటాడుచుండిన తమిళ భాషకుఁ దమిళ మను పే రెట్లు వచ్చెననియు, నద్దాని కేమర్థ మనియు స్వల్పము యోచింపవలసియున్నది. ఇది దవిడశబ్దభవమనుటయే యుక్తముగ నున్నది. ఈ ద్రవిడశబ్దమునకుఁ బ్రాచీనరూపము ద్రమిడము. ద్రమిడశబ్దమునుండి వచ్చిన తత్సమనుయిన తిరమిడ శబ్దము అరవనిఘంటువులయందు లభించుచున్నది.[14] వరాహమిహిరుని బృహత్సంహితయందును (గొన్నిప్రతులలో) ద్రవిడ మను పాఠమే గలదు. ప్రాచీన మలయాళగ్రంథములయందును మకారయుక్తరూపమే కనుపట్టు చున్నది. పాళీభాషలో నున్న మహావంశములోను దమిలో, దామిలో యను రూప ములే వాడఁబడియున్నవి. సంస్కృతమునందలి శ్రమణశబ్దము సమణ శబ్దముగాను, ద్రోహశబ్దము దోహశబ్దముగాను ప్రాకృతములలో మాఱినట్లే ద్రమిళశబ్దము ప్రాకృతములో దమిళశబ్ద మయి యుండవచ్చుననుట స్పష్టము. పదాది నున్న రేఫ తెలుఁగుశబ్దములలోఁగూడ భ్రష్టమయి క్రొత్త, ప్రాత మొదలయిన శబ్దములు నేడు కొత్త, పాత మొదలయిన రూపములతో వాడఁబడుట స్పష్టమేగదా! ద్రవిడ శబ్దమునకుఁ బదాది నున్న రేఫ పోఁగా, నడుమనున్న వకారము మకారము కాఁగా, తుది నున్న డకారము ళకారము లేక 'ழ' కారము కాఁగా నేఁటి తమిళము అను రూప మేర్పడినదని కాల్డ్వెల్లుగారి యూహ. వ-మ లు తారామ్రగుట సంస్కృతము నందే సుప్రసిద్ధముగాఁ గలదు. ధ్వాంతు-ధ్మాంతు శబ్దములు రెండును కాకమునకుఁ బేళ్లు. మతుబర్థక ప్రత్యయములలో మాన, వాన, మిన, విన అనునవి యంతమందుఁ గల రూపములు గలవుగదా! ఇట్లు వకార మకారములు మారుపాటు చెందె ననుటలో వింతలేదు. ప్రాచీనమైన ద్రమిడశబ్దము దమిడము, దమిళము, దమిழము అను భిన్నభిన్న రూపములను భిన్నకాలములలోఁ బొంది నేఁటి తమిళము అను రూప మేర్పడినదని కాల్డ్వెల్లుగారి యభిప్రాయము. ఇదియే సమంజసము. కాని దాక్షిణాత్యులలో సుప్రసిద్ధులయిన తమిళులకు తమిళనామ ముండక సంస్కృతభవము నామమగుట యసంభవమని కొందఱి యూహ కావచ్చును గాని యీ గ్రంథముసఁ బేళ్లె ట్లేర్పడుననియు, నందు ముఖ్యముగా భాషల కితరులే నామకరణము చేయుట సంభవించుననియు, నట్టి నామమే కాలక్రమమునఁ బ్రచారములోనికిఁ రాఁగలదనియు సిద్ధాంతపఱచియే యున్నాను. తమిళరాజులు ధరించిన పాండ్యాది శబ్దములు సంస్కృతములే. తొల్కాప్పియమ్

[14] C. G. D. పు. 10-11.

అనునట్టి ప్రథమ తమిళగ్రంథమునందలి కాప్పియ శబ్దము కావ్యశబ్దభవమని యూహ. ఇది వృద్ధకావ్య గోత్రశబ్దమునకు వరివర్తనమనియు నొక రనిరి. ఏది యయినను మూలము సంస్కృతమేగదా! తొల్‌కాప్పియమునందు సంస్కృతవ్యాకరణ భాషాప్రభావము లెంతవఱకుఁ గలవో తద్‌జ్ఞులకు నిశదము కాకపోదు. ఆంధ్ర కర్ణాటాది శబ్దములుకూడ సంస్కృతములే యని చాలమంది యభిప్రాయము. కాఁబట్టి సంస్కృతభవమయిన తమిళము అరవభాషకు పేరుగా నుండె ననుటలోఁ బ్రతిబంధకము లేదు.

ఈ తమిళశబ్దము తమి, ఒంటి, ఏకాకిత యను నరవపదమునుండి యేర్పడి యుండవచ్చునని దామోదరపిళ్లెగారు చెప్పుచున్నారు. 'పింగలందై' యను అరవ నిఘంటువునందు తమిళ మనగా తీపి, కరుణ యని అర్థము వ్రాయబడినది. (ఇనిమై యుమ్ నీర్మైయుమ్ తమిటెనలాగుమ్) తమిళ్ అనగా తీపి యను నర్థమున చింతామణి (950 క్రీ. వె.) యందు ప్రయోగము కలదు. నైషధమును అరవమున వ్రాసిన కవి 'తమిళముకంటెను దీయని పలుకులు గలది' యని నాయికను వర్ణించెను.[15] తమిళ్ నుమ్ ఇనియ తీం చొల్లియలాళ్) తాంబ్రలిప్తి యను పద మే తమిళ మయినదని మఱియొక యభిప్రాయము. (తమ్+ఇళ్) తమ్ అనునది తమ యను నర్థముగల సర్వనామ మూలరూపము. ఇళ్ అనఁగా తీపి. కావున తమిళ మనగాఁ తీపి అని యర్థమని మఱియొక వ్యుత్పత్తి యీయంబడినది. ఈ వ్యుత్పత్తు లన్నియును నవీనములే కాని యత్యంత ప్రాచీనములైన దమిళ, ద్రమిడ శబ్దములు ప్రసిద్ధముగానే యుండినవి. తమభాష తీయనిదని తెలిసికొనుట కితరభాషల యొక్క కటుత్వమును దెలియవలెను. అప్పుడుగదా యీ పే రేర్పడిన దనవలెను. తమిళమునుగుఱించి యితర ద్రావిడ భాషావ్యవహర్త లేమిచెప్పుదురో మనము వినియే యున్నాము. "బొమ్మరాళ్ళ తమిళము", "తెనుఁగు తేటె, కన్నడ కత్తురి, అరవ అధ్వాన్న" అనునట్టి వాక్యములను బరిశీలించునది.

ఈ తమిళమున నున్న సారస్వతము చాల ప్రాచీనమైనది. ఇతర ద్రావిడ భాషలలో నున్న వాఙ్మయముకంటె నల్పతరమైన సంస్కృతాపేక్ష కలదియు, స్వతంత్రమును, మహత్తరమయిన కావ్యప్రణాళిక కలదియు నై యున్నది. లభించిన గ్రంథము లన్నిటియందును బ్రాచీనతమమైనది తొల్‌కాప్పియము. ఇది లక్షణ గ్రంథము. ఇందు ఎటుత్తు (అక్షరము) సొల్ (శబ్దము) పొరుళ్ (అర్థము) అను మూఁడు ప్రకరణములు గలవు. సంస్కృతవ్యాకరణసంప్రదాయములును, భాషాపద్ధతులు నీ గ్రంథకర్తకు సుపరిచితములు. అవ్వాని ప్రభావము గ్రంథమునందుఁ

[15] *Tamil Studies* by M. Srinivasa Iyangar, M. A., పుట 7. తమిళ్ శబ్దమున కితరత్ర యిట్టి ప్రయోగము లేదు. తీఁ-తమిళ్ (తీయని తమిళము), కొడుఁ-తమిళ్ (అప్రామాణిక తమిళము), తేనుఱైత్తమిళ్ (తేనె తమిళము), తణ్‌డమిళ్ (చల్లని తమిళము) మొదలగు ప్రయోగములు గలవు.

గనుపట్టుచున్నను సాంకేతికపదములయందును, భావములయందును, పద్ధతుల యందును విశేషమయిన స్వాతంత్ర్యమును గనుపట్టుచునేయుండును. ప్రాచీనకాలమున మూఁడు తమిళసంఘము లుండినట్లును, నా యా సంఘముల కాలమునందుఁ గొన్ని కొన్ని సుప్రసిద్ధములయిన గ్రంథములు వ్రాసియుండినట్లును పండిత సంప్రదాయసిద్ధమయి వాఙ్మయప్రమాణానుసరణమైన వృత్తాంతము గలదు. సంగమ్ అను తమిళపదము సంస్కృత సంఘశబ్దభవము. ఇది పండితసంఘమని భావింప వలయును. చాల ప్రాచీనకాలమునుండి దక్షిణహిందూస్థానమున నవిచ్ఛిన్నముగా వచ్చుచుండిన యీ సంప్రదాయము ననుసరించియేకాబోలు తన కాలమునందలి పరిస్థితులను బేర్కొనుచు నన్నయ పండితసభలను దన భారతావతారికయందుఁ బ్రశంసించెను.

ఇరయనార్ వ్రాసిన అహప్పొరుళ్ అను గ్రంథమునకు నక్కీరుని వ్యాఖ్యానమున నొక గాథ వ్రాయఁబడినది. ఈ యభిప్రాయమే తొల్‌కాప్పియ వ్యాఖ్యానకర్త యయిన నచ్చినార్కినియరుచేతను, చిలప్పదికారమ్‌పయిని అడియార్కునల్లారు వ్యాఖ్యానమునందును బేర్కొనబడినది. మొదటిసంఘమున 549 మంది కవులు గలరని యును, శివుఁడు, మురుగను (సుబ్రహ్మణ్యుఁడు) నం దుండిరనియును, అయ్యది 4440 సం. లుండి సముద్రముచేఁ దుడిచివేయంబడి నాశనమయిన మధురాపట్టణమున నుండెననియును, నాఁటి గ్రంథములు పరిపాడల్, ముదునారై, ముదుకురుకు, కళరి యావిరై యనునవియును, అందు 89 రాజులు కై సినవఝది మొదలు కడుంగోను అనువానివఱకును బరిపాలించిరనియుఁ జెప్పఁబడినది. అప్పటి లక్షణగ్రంథము అగత్తియము అనునది. ఇది అగస్త్యుడు అరవభాషకు వ్రాసిన వ్యాకరణమని చెప్పఁబడినది. ఇవి యన్నియు నేఁడు నామమాత్రములేగాని యుపలభ్యమానములు గావు.

రెండవ సంఘము: ఇది కపాడపురమున వర్ధిల్లినది. ఈ పట్టణముగూడ సముద్రముచే ముంచివేయఁబడినది. ఇందు అగస్త్యరు, తొల్‌కాప్పియరు మొదలగు 59 మంది సభ్యు లుండిరనియు, నందు 3700 కావ్యములు విమర్శింపఁబడిన వనియును చెప్పుచున్నారు. నాఁటి గ్రంథములే అగత్తియము, తొల్‌కాప్పియము, మాపురాణము, ఇసైనునుగము, బూతపురాణము అనునవి. కలి, కురుకు, వెండాళి మొదలైన గ్రంథము లానాఁడు వ్రాయఁబడినవనియుఁ జెప్పుచున్నారు. వీనిలోఁ దొల్‌కాప్పియము దప్పఁ దక్కినవన్నియు నామమాత్రావశిష్టములు. వెండేర్ చెరియన్ మొదలు ముడత్తిరుమారన్ అనువానివఱకును గల 59 మంది రాజులు పాలించినట్లు చెప్పఁబడినది.

మూఁడవ సంగము: ఈ సంగమునకు నక్కీరరు అధ్యక్షుఁడు. ఇది 1850 సంవత్సరము లుండినది. తిరుమారన్ మొదలు ఉగ్రపెరువళుది వఱకును గలిగిన 49 మంది రాజుల పాలనములో 49 మంది సభ్యులతో నుండినట్లు తెలియుచున్నది.

తిరువళ్లువరు వ్రాసిన తిరుక్కుఱళు అను గ్రంథమున 49 మంది సభ్యుల పేళ్లును జెప్పఁబడినవి. అప్పటి గ్రంథముల పేళ్లు : పేరినై, కూత్తు, పత్తుప్పాట్టు, సిట్రినై, వరి, ఎట్టుత్తొగై, పదినెణ్ కీళ్ కణక్కు. ఇందు కొన్నిమాత్రమే లభించుచున్నవి. కొన్ని నామమాత్రములే.

పయివిధమునఁ గవులచేఁ బేర్కొనఁబడిన సంగములనుగూర్చి యనేకు లనేకవిధములుగాఁ జర్చించి కాలనిర్ణయమును జేసియున్నారు. మూఁడు సంగముల కాలము క్రీ. వె. 1000 సం. లకే ముగిసినదని పూర్ణలింగముపిళ్లె[16]గారు. క్రీ. పూ. 5-వ శతాబ్దిని సంగము సుత్పత్తియయి యుండవచ్చుననియు, తిరుక్కుఱళు క్రీ. పూ. రెండవ శతాబ్దియందు వ్రాయఁబడి యుండవచ్చుననియును, తొల్కాప్పియ మంతకంటె రెండుశతాబ్దములు ముం దుండవచ్చుననియును దీక్షితరుగారి యభిప్రాయము.[17] క్రీ. వె. 150 తో మూఁడు సంగములు సమసినవని ఎమ్. శ్రీనివాసయ్యంగారు.[18] క్రీ. పూ. 1000 సం. లకే తమిళకవిత్వ ముండెనని P. T. శ్రీనివాసఅయ్యంగారు తెలిపిరి.[19]

ఈ విధముగా వర్ణింపబడిన తమిళ వాఙ్మయము క్రీస్తుశకమునకు ముందని యంగీకరింపక తప్పదు. అగస్త్యమహర్షి వ్యాకరణమును వ్రాసి అరవభాషను సంస్కరించెననియు, నాతఁడు వ్రాసిన వ్యాకరణముపేరు పేరగత్తియ మనియు దెలియవచ్చుచున్నది. ఈ యగస్త్యుఁడే మొదటిసంఘములో నుండెననియు, నాతని గ్రంథమే యా కాలపు భాషకుఁ బ్రమాణమనియు ముందు నుడివియుంటిని. ఈ విషయమునుగూర్చియే శంభురహస్య మను సంస్కృతగ్రంథమున నిట్లు చెప్పఁబడినది. శివపార్వతుల సంవాదములో శివుఁడు పార్వతితో నిట్లనియె : "పూర్వకాలమున నన్నుద్దేశించి యగస్త్యమహాముని తపస్సుచేసి నావలనఁ బ్రసాదింపఁబడిన జ్ఞానము గలవాఁడయి ద్రామిడీవ్యాకరణమును విధించెను. కావున ద్రామిడీ శబ్దముల కపభ్రంశత్వదోషము లేదు. అనార్షమయిన ఆంధ్ర, కర్ణాట, ఘూర్జరాదిక మపభ్రంశమని యెఱుంగునది"[20] దీనినిబట్టి అగస్త్యుఁడు కాశిని బాసి దక్షిణదేశమునకు వచ్చి కావేరిని వివాహమాడి తన యాశ్రమమును స్థాపించె నను కథను కూడ ననుసంధించినచో నగస్త్యునకును దమిళమునకునుఁ గల సంబంధము విశద

[16] పూర్ణలింగముపిళ్లెగారి తమిళ సారస్వతసంగ్రహ చరిత్ర. *Primer of Tamil Literature.* [17] *Studies in Tamil Literature* by Dikshitar Page 21. [18] *Tamil Studies* M. Srinivasa Iyangar, M.A., p. 199. [19] *History of Tamils* by P. T. Srinivasa Iyangar, M. A., p. 250.

[20] మా ముద్దిశ్య తప శ్చక్రే పురాగస్త్యోమహామునిః। మయా ప్రదత్తవిజ్ఞానో ద్రామిడీం వ్యాకృతిం వ్యధాత్। నాపభ్రంశత్వదోషోస్తి ద్రామిడీనాం గిరాం తతః। అనార్ష మాంధ్ర కర్ణాట ఘూర్జరాద్యం హి భాషితమ్॥ అపభ్రంశం విజానీయాత్.

మగును. పేరగత్తియ మని చెప్పఁబడు గ్రంథములోనుండి యీ క్రింది సూత్ర ముదాహరింపఁబడుచున్నది. "లక్షణములేక లక్ష్యము లేదు లక్ష్యములేక లక్షణము లేదు. నూవులనుండి నూనె తీయునట్లే లక్ష్యమునుండి లక్షణము గ్రహింపఁబడును."[21] ఈ మాటనుబట్టి అగస్త్యునకు ముందే కొంత వాఙ్మయ ముండియుండవలెనుగదా! తొల్కాప్పియరు అగస్త్యుని శిష్యుఁడయినట్లును, నాతని యాజ్ఞచేతనే తొల్‌కాప్పియము వ్రాసినట్లును చెప్పఁబడుచున్నది. బహుశః సంస్కృతవ్యాకరణాదికమును, ఐంద్ర వ్యాకరణ మర్యాదలను నాతఁడు అగస్త్యునినుండియే గ్రహించెనేమో! ఇప్పటికి లభించిన గ్రంథములలోఁ బ్రాచీనతమమయిన తొల్‌కాప్పియము క్రీస్తుశకమునకు ముందటిది యని చెప్పవలసివచ్చినప్పుడు, ఆ గ్రంథమును బరిశీలించినచో నక్కాల మున నుండిన వాఙ్మయము స్వభావము స్పష్టపడక తప్పదు. ఆ గ్రంథ మైంద్ర వ్యాకరణ సంప్రదాయమునకుఁ జెందినదని (ఐందిరమ్ నిఱైంద తొల్‌కాప్పియమ్) ఆ గ్రంథపీఠికయందు (ముగవురై) తొల్‌కాప్పియరు స్నేహితుఁడైన అదంగోట్టా సిరియరు వ్రాసిన వాక్యమునుబట్టి స్పష్టము. ఐంద్రవ్యాకరణసంప్రదాయము పాణినీయవ్యాకరణసంప్రదాయమునకుఁ బూర్వమనియు, స్వతంత్రమనియుఁ జెప్పుట గలదు.[22] తొల్‌కాప్పియమునుబట్టి పరీక్షించినచో నా కాలమున స్వతంత్ర మయిన విశాలగ్రంథావళియును, సారస్వతప్రక్రియయును, ఛందోమార్గములును నుండియుండక తప్పదని తోఁచును.

పయి వివరణమువలన నిశ్చితమయిన దేమనఁగాఁ దమిళసారస్వతము క్రీస్తుశకమునకే యుద్భవించి చాల ప్రశస్తి కెక్కియున్నదనుట. ఇఁక దాని స్వభా వమునుగూర్చియు పరివిధిగూర్చియుఁ బ్రక్రియనుగూర్చియుఁ గొంత ప్రసంగింప వలసియున్నది. తొల్కాప్పియమున సంధి సమాసాదికమునుగూర్చియు, అక్షర శబ్దాదికమునుగూర్చియు మాత్రమే కాక, యాప్పు (ఛందస్సు), అణి (అలంకారము) అనువానినిగూర్చియు, కవిసమయములనుగూర్చియు, రచనాసంప్రదాయములను గూర్చియుఁ జెప్పఁబడినది. పత్తుప్పాట్టు అను గ్రంథము పది గుత్తులుగాఁ గూర్చిన వివిధపద్యజాలముల సంఘాతము. అం దానాఁటి రాజుల పరిపాలనయు, జనుల యాచారములు, కవుల యాశయములు, యువతుల ప్రేమములు, పురుషుల పౌరు షము, వేము మొదలయిన వృక్షముల ప్రాశస్త్యమును, ఋతుధర్మములవలన నల్పులు మొదలు ఉత్తమోత్తములలోఁ గలుగు మార్పులును వర్ణింపఁబడినవి. ఆనాఁటి పట్టణములలోని జీవిత మున్నదున్నట్లు (మధురాపట్టణము సొగసు మదు

[21] ఇలక్కియమిన్రి యిలక్కణ మిన్రే, ఇలక్కణమిన్రి ఇలక్కియమిన్రే, ఎళ్లి నిన్రెణ్ణె యెదుప్పదుపోల విలక్కియత్తి నిన్రెడుపడు మిలక్కణమ్.

[22] Belvalkar, *Systems of Sanskrit Grammar; Aindra School of Grammarians*, Burnell.

రైకాంజిలో ) వర్ణింపఁబడినది. ఆనాఁటి బౌద్ధ జైన మతములకు, నా సంప్రదాయపు జనులకు దేశమునందుఁ గల ప్రాముఖ్యము, ప్రాధాన్యము, ప్రాబల్యము స్పష్టముగ, సజీవముగ నిరూపింపఁబడినవి. కవులు దా మెన్నడో వ్రాసిన కథలను జదివి సన్నివేశముల నూహించిగాని లేక సాంకేతికములయిన కవిసమయముల ననుసరించి మాత్రముగాని వ్రాయక ప్రత్యక్షముగా జరుగుచున్న జీవనవిధానమును, దైనందిన కార్యక్రమమును వర్ణించినట్లు స్పష్టపడక తప్పదు. కవులకు రాజులు చేసిన సమ్మానములు, రాజులకు సారస్వతమునందలి యాస్థ, గౌరవమును దప్పక గోచరించును. ఆ కాలమునకే బలవంతులయి, స్వతంత్రులయి, దేశభాషాభిమానులయి దేశభాషను, దత్పండితులను గౌరవించుచున్న పాండ్య, చోళ, చేర దేశరాజులు స్పష్టముగా సజీవమూర్తులయి ప్రాచీన తమిళసారస్వతమునఁ గనుపట్టుచునే యుందురు. ఒకచోట నొక కవి బీదతనమును, వాఁడు ధరించు చింపిగుడ్డలును, ఆతని బట్టలలో నల్లులు పెట్టిన గుడ్లనుగూడఁ గవి వర్ణించెను. ధర్మమునకును, ప్రేమమునకును వైరుధ్యము గలిగినపట్ల నాయకుఁ డెట్లు ప్రేమమునే యంగీకరించెనో కవి వర్ణించెను. ఎట్టుత్తొగై మొదలయిన పద్యసముదాయములయందును నపూర్వములును, హృదయంగమములును నైన వర్ణనలును, సన్నివేశములును లెక్కకు మిక్కిలి గలవు.

పయి గ్రంథములన్నియు మిక్కిలి దీర్ఘములుగాక కొన్ని పద్యముల సమూహములుమాత్రమే. తిరుక్కురళు, చిలప్పదిగారము, మణిమేగలై, జీవకచింతామణి యను విశాలగ్రంథముల ప్రాశస్త్యమును, రచనాక్రమమును వర్ణనాతీత మనుటలో విప్రతిపత్తిలేదు. తిరుక్కురళు అను గ్రంథము భర్తృహరి సుభాషితములు, వేమన పద్యరత్నములు అనువాని తీరున అపూర్వమగు రచనలతో నొప్పుచున్నది. ఈ గ్రంథము వ్రాసిన తిరువళ్లువరు సోదరియైన అవ్వైగూడ గొప్ప కవయిత్రియే. ఇలంగోవడిగళు అను యువరాజు వ్రాసిన చిలప్పదిగారము అను గ్రంథము విశాలమయిన కథాక్రమము గలిగి మిక్కిలి హృదయంగమముగా నుండును. ఇందలి కథ మఱియొకకథయొక్క యనుకరణముగాని, యనువాదముగాని కాదు. కణ్ణకి యను పేరి నీ కథయే నేఁడు చలనచిత్రముగా దమిళులవలన బ్రదర్శింపఁబడుచున్నది. ఆకాలమున వేర్వేఱు అవస్థలలో నున్న తమిళజాతుల జనులయొక్క నాగరకత, జీవనవిధానము, భోజనాదికము, గృహనిర్మాణము, పట్టణస్థితి మొదలగునవన్నియు నద్దమునఁ బ్రతిబింబించినట్లు కవి వర్ణించియున్నాఁడు. చేపలను బట్టి వానిని నెండబెట్టి జీవించువారి జీవితమును, వా రెట్లా వాసన కలవాటుపడి యుందురో యను విషయమును, సముద్ర వ్యాపారమును, ఐశ్వర్యమును, ఆ కాలమునందలి సంగీతము, నాట్యము, వాద్యవిశేషములు మొదలైన విషయముల నెన్నిటినో స్పష్టముగా, రసవంతముగా వర్ణించిన మహాకవి ఇళంగోవడిగళు. అట్లే మణిమేగలై యందు సీత్తలై సాత్తనారు అను కవి యనేకములయిన విషయములను జేర్చి యపూర్వమైన

గాథను వ్రాసియున్నాఁడు. ఆ గాథలో బౌద్ధమతముయొక్క ప్రాధాన్యము స్పష్టముగా గోచరించుచునే యుండును.

ఆ తరువాత బౌద్ధ జైన కృత గ్రంథములును, శైవసిద్ధాంత వాఙ్మయమును, కంబరామాయణమును, విల్లిపుత్తూరాళ్వారు భారతమును, నైషధము మొదలైన గ్రంథములును సంస్కృతసారస్వతప్రభావమున బయలుదేరిన యనుకరణములు, అనువాదములు మిక్కిలిగా వెలువడి తమిళదేశమున భక్తి, మతము, విజ్ఞానము, ధర్మము మొదలైనవానిని జనులకు విరివిగాఁ దెలుపుడు చేసినవి.

ఒక్కవిషయముమాత్రము చెప్పక తప్పదు. నేఁటి తమిళమునకు (సంగనూల్ వటిక్కు), సంఘకాల తమిళమునకుఁ జాల భేద మున్నది. ఆ భాషను వేఱుగాఁ జదువుకొనినగాని యది బోధపడదు. ప్రాచీనరూపములు పూర్తిగా మాఱి యర్వాచీనరూపము లయి, యధునాతనరూపములుగాఁ బరిణమించినవి. ఇంతటి ప్రాచీన సారస్వతము గలదుఁ గావుననే అనేక ధాతువులయొక్క ప్రాచీనరూపములు, తెనుఁగు, కర్ణాటాది భాషలలో లభింపనప్పుడు తమిళమున సాధారణముగ లభించుచునే యుండును.

## 3. కన్నడభాషావాఙ్మయములు

ఈ భాషకుఁ గర్ణాటమనిగాని, కన్నడమనిగాని వ్యవహారము గలదు. మొదటిది సంస్కృతమనియు, రెండవది తద్భవమనియుఁ బండితుల యభిప్రాయము. పయి రెండుశబ్దముల వ్యుత్పత్తిని నిర్ణయించి చెప్పుట సాధ్యపడదు. డాక్టరు గుండెర్టు గారు కర్+నాడు = నల్లనేలగల దేశమని యర్థము చెప్పి యిది ద్రావిడభాషా పదమనియుఁ, దరువాత సంస్కృతీకరింపఁబడినదనియు నూహించుచున్నారు. కరు+నాడు = ఎత్తయిన ప్రదేశము. కర్ణాటదేశము తీరప్రదేశములకంటె నెత్తగు పీఠభూమియను నభిప్రాయమునకు సరిపోవుచున్నదని కొందఱు నిరూపించియున్నారు. మైసూరునకు దక్షిణమున నొకదేశము పున్నాడు అను పేరితో నుండెననియు, నది పున్నాట యని సంస్కృతీకరింపఁబడినదనియు నట్లే కర్ణాటశబ్దము కన్నాడు శబ్దమునకు సంస్కృతీకరణం బనియు శ్రీ నరసింహాచార్యులుగా రూహించుచున్నారు.[23] కాని పున్నాడు శబ్దమును పున్నాట శబ్దముగా సంస్కృతీకరించిరిగాని పుర్ణాట శబ్దము గ్రహింపలేదుకదా! ఈ వ్యుత్పత్తికిఁ గల ప్రతిబంధక మేమనఁగా కర్ణాటశబ్దము కన్నాడశబ్దము గావచ్చునుగాని, కన్నాడశబ్దము కర్ణాటశబ్దము గానేరదు. ర, ణ లు సమీకరణమును బొంది న్న కావచ్చునుగాని యవి వేఱుపడి ర ణ లు గావనుట భాషాశాస్త్రవిషయము. కాఁబట్టి కన్నడశబ్దమునుండి కర్ణాటశబ్దము స్వతస్సిద్ధముగాఁ గలుగదుగాని యది కేవల కృతకమనుటకు బలమైన

[23] *History of Kannada Language* by **R. Narasimhachariar, Page 35.**

ప్రమాణము గావలయును. చిలప్పదిగారము అను తమిళగ్రంథములో కరునాడర్ అను రూపము గలదనియు, వేల్వికుడి శాసనములో (సుమారు క్రీ. వె. 990) కరు నాడగమ్ అని దేశము పేర్కొనఁబడినదనియు వారే చెప్పియున్నారు.[24] కరునాడు అను ద్రావిడపదమును, గర్ణాట మను సంస్కృతపదమును వేర్వేఱు మార్గముల వచ్చి క్రమముగా నభిన్నములయ్యేనని యోచింప నవకాశము గలదు. తెనుఁగువారు తమ భాషను తేనె+అగు అనియు, తమిళులు తమభాషకు తీపి, దయ యర్థ మనియును జెప్పుకొనఁగా కమ్మితు+నాడు=కన్నాడు అయ్యెననియు, (కమ్మితు అనఁగా కమ్మని యని యర్థము.) మంచిగంధపు వనములు, కమలాకరములును గల కమ్మనినాడు కన్నాడనుట యన్వర్థమనియు నేల చెప్పఁగూడ దనిరి. కర్ణాట శబ్దము వరాహమిహిరుని బృహత్సంహితలోను (6-వ శతాబ్దము), సోమదేవుని కథాసరిత్సాగరమునను, రాజశేఖరుని కావ్యమీమాంసయందును (సుమారు 900) బేర్కొనఁబడినదని వారే తెల్పియున్నారు.

ఈ కర్ణాటభాష మాటలాడు దేశపు టెల్లలగుఱించి ముందే కొంత వివరించి యున్నాను. ప్రాచీను లీదేశమునుగూర్చి చెప్పిన మాటలును గొంతవఱకు ముందే తెలుపఁబడినవి. ప్రాచీన మైసూరుసంస్థానమును, దాని నత్తియున్న కోయముత్తూరు, సేలము, అనంతపురము. బళ్లారి జిల్లాలలోని కొన్ని భాగములును కన్నడభాషాప్రాము ఖ్యము గలవి. ఉత్తరమున బీదరువరకును గన్నడదేశమే. అక్కడనుండి పశ్చిమ ముగా బోయి దక్షిణవైపు తిరిగి జాటు, దఫల్వారు ప్రదేశములను గన్నడభాషకుఁ జేర్చుచున్న దీ విభాజకరేఖ. సతారా జిల్లాలోని తాస్గామ్ తాలూకాలోను, ఔంద్ సంస్థానములోను గన్నడము వ్యవహారభాష. బెళగాము జిల్లాలోను, దానికి దక్షిణ భాగమునను, కొల్లాపురమువరకును గన్నడము ప్రచారములో నున్నది. ఇంకను దక్షిణపు వైపున పడమటికనుమలను హద్దుగా గొని హొనావరు వరకును బోయి సముద్రమును జేరుచున్న దీ విభాజకరేఖ. ఉత్తర కనరా, దక్షిణ కనరా జిల్లాలలో భాష కన్నడమే. నేఁటి మైసూరు రాష్ట్రము కర్ణాటభాషాప్రాధాన్యమువలన నేర్పడినది.

కర్ణాటభాషలోని యుపలభ్యమాన గ్రంథములలోఁ బ్రాచీనతమ మయినది నృపతుంగుని కవిరాజమార్గ మను లక్షణగ్రంథము. అమోఘవర్షుఁడు అను నామాంతరము గల యీ రాష్ట్రకూటరాజు మాన్యఖేటనగరము రాజధానిగా (నేఁటి మైసూరు రాష్ట్రమునందలి మల్ఖేడునగరము) క్రీ. శ. 814—877 వఱకును బాలించెను. తనది లక్షణగ్రంథము గావునఁ దనకు ముం దుండిన కవులలో దుర్వినీతాదులు అను కవులను బేర్కొనెను. దీనినిబట్టి యాతని కాలమునకు ముందే కవు లుండి యుండవలెనని యూహింపక తప్పదు. (6-వ శతాబ్దము తుదిని పాలించిన

[24] *History of Kannada Language* by R. Narasimhachariar, Page 34.

దుర్వినీతుఁ డీతఁడే కావచ్చును.)[25] శ్యామకుందాచార్యుఁ డను నొక పూర్వకవి చూడామణి యను పేరుగల యొక కన్నడ వ్యాఖ్యానమును 96,000 గ్రంథము గలదానిని రచించినట్లును తెలియవచ్చుచున్నది. కర్ణాటసారస్వతమును జైనులు, వీరశైవులు, బ్రాహ్మణులు గ్రంథములు వ్రాసి వృద్ధిఁబొందించిరి. సుమారు 12-వ శతాబ్దివఱకును కన్నడగ్రంథమును వ్రాసినవారు జైనులే. సుమారు 15-వ శతాబ్దమువఱకును ననేక వీరశైవ కవులును, గొంచెముమంది బ్రాహ్మణులును గ్రంథములు వ్రాసిరి. ఆ తరువాత ననేకులు బ్రాహ్మణులును, వీరశైవులును గ్రంథములను వ్రాయుచునే యుండిరి. ప్రాచీన జైనకావ్యము లన్నియును చంపూ కావ్యములే. వీనియందు సంస్కృత ఛందస్సులు విరివిగానే యున్నవి. ప్రాచీన వీరశైవగ్రంథములు వచనరూపమున నున్నవి. రగడ, త్రిపది యను దేశీయ ఛందస్సులతోఁ గూడియు నున్నవి.

కన్నడభాషలోనికి ఆదిపంప 902-941) యను కవి భారతకథలో ముఖ్య భాగమును గ్రహించి సంక్షేపించి తుదిని అర్జుననకుఁ బట్టాభిషేకమయినట్లు వ్రాసెను. ఇదియు తెనుఁగు భారతమువలెనే చంపువుగానే యున్నది. ఈతఁడు వ్రాసిన ఆదిపురాణ మను గ్రంథము జైనుల ఆదితీర్థంకరుఁడైన పురుదేవుని చరిత్రము. ఇదియును చంపువే. కావ్యఫక్కినే యున్నది.

పొన్న యను కవి (క్రీ. వె. 950 లో నుండినవాఁడు) శాంతపురాణ మను చంపూకావ్యమును రచించెను. ఇది 16-వ తీర్థంకరుఁడైన శాంతినాథుని చరిత్రము. ఇతఁడే 14 ఆశ్వాసములు గల (రామకథ) భువనైకరామాభ్యుదయ మను గ్రంథమును వ్రాసెనని వినవచ్చుచున్నది.

రన్నకవి (క్రీ. వె. 993) అజితపురాణమును, సాహసభీమ విజయమును (గదాయుద్ధము), రన్నకంద మను నిఘంటువును రచియించెను. ఈతని గదా యుద్ధము భారతకథాభాగమే. ఈతనికి కవిరత్న, అభినవ కవిచక్రవర్తి, కవికుంజ రాంకుశ మొదలగు బిరుదములు గలవు. పయి ముగ్గురకును రత్నత్రయము అను బిరుదము గలదు. వీరు ముగ్గురును దమ పూర్వులు వేంగీదేశవాసులని వంశా వళిలోఁ జెప్పుకొనిరి. 1050-వ సం. నకే కర్ణాటవాఙ్మయమున ననేక గ్రంథములు లక్ష్యలక్షణములు వ్రాయంబడినవి. కవిత్వప్రచారము, రాజాదరము కన్నడభాషకుఁ గలిగినవి. విశాలమైన యీ గ్రంథములయందు సంస్కృత సారస్వతప్రభావము పూర్తిగఁ దాండవించుచున్నది. పదములు, భావములు, వర్ణనలు, వాఙ్మయప్రక్రియ, రచనాపద్ధతి వీని యన్నిటియందును సంస్కృతవాఙ్మయానుకరణము తప్పదు. ఛందస్సునందు సంస్కృతపద్ధతి నిండిపోయినది. ప్రాచీన తమిళవాఙ్మయమున నున్న స్వతంత్రత, దేశీయకథాప్రాబల్యము, దైనందిన

---

[25] కర్ణాటకకవిచరితె, ఉపోద్ఘాతము, పు viii. అర్. నరసింహాచారిగారు,

జీవితప్రతిబింబనము ఇందు గనుపట్టదు. అట్లనుటనుబట్టి యీ గుణములు కొలదియో గొప్పయో కన్నడవాఙ్మయమున లేవని యూహింపరాదు. అట్లు లేకుండుట యసంభవము. తరతమ భావమాత్రము నుద్దేశించియే భేదము నిర్దేశింపఁబడుచున్నది. ప్రాచీనతమ మయిన సంస్కృతవాఙ్మయప్రభావము దక్షిణదేశవాఙ్మయము లన్నింటి యందు నెంతో కనుపట్టుచునే యుండును. అది ప్రాచీనతమిళమునం దత్యల్పము. తమిళ, కర్ణాట వాఙ్మయముల ప్రభావము ఆంధ్రమున గనుపట్టుచున్నది. ఈ ప్రభావము ముందు ముందు ప్రకరణముల వివరింపఁబడును.

## 4. మలయాళభాషావాఙ్మయములు

పశ్చిమ సముద్రతీరములో ఉత్తరమున కాసరగోడు అను ప్రదేశమునుండి దక్షిణమున తిరువనంతపురమువఱకును మలయాళము వాడుకలో నున్నది. ఈ మలయాళదేశమునకుఁ బడమటిహద్దు అరేబియా సముద్రమును, దూర్పు సరిహద్దు పడమటి కనుమలును నయి యున్నవి. దక్షిణ కనరా జిల్లాలోని దక్షిణభాగముననను, మలబారు జిల్లాయందును, కొచ్చి రాష్ట్రముననను, మైసూరు, నీలగిరి ప్రదేశములకు సమీపముననను, తిరువాన్కూరు రాష్ట్రమున నత్యధికభాగముననను ఈ భాష వ్యవహారములో నున్నది. దక్షిణ కనరా జిల్లాలో మలయాళమునకుఁ బొరుగుభాష తుళు. (కూర్గు) కొడగురాష్ట్రమున కొడగుభాషతోను, తూర్పువైపున తమిళ, కర్ణాట భాషలతోడను మలయాళమునకు సంబంధము గలదు.

మలయాళదేశమునకుఁ బ్రాచీనసంస్కృతనామము కేరళము. ఈ పదమునకు మలయాళమున కేరళమ్, చేరళమ్, చేరమ్, అనియు రూపములు వాడుకలో నున్నవి. కేరళదేశస్థునకు కేళన్ అనియు, కేళు అనియుఁ బేళ్లు గలవు. కేరళ శబ్దము అశోకుని శాసనములలో కేరళంపుత్రి యని గనుపట్టుచున్నది.[26] (క్రీ. పూ. 3 వ శతాబ్దము) ప్లినీ యను చరిత్రకారుఁడు[27] 'కెలొబొత్రస్' అనియును, టాలెమీ యనునాయన 'కెరొబొత్రాస్'[28] అనియును రెండురూపములను వాడిరి. ఈ రెండును కేరళమ్పుత్ర యను శబ్దమునకు సంబంధించినవే యనవచ్చును. కాఁబట్టి యీ పదము మిక్కిలి ప్రాచీనమని చెప్పక తప్పదు. ప్రాచీనకేరళదేశము[29] రెండు భాగములుగా నుండిన ట్లూహింపవచ్చును. సముద్రతీరప్రాంతమున కెప్పుడును కేరళ అను సంస్కృత వ్యవహారమును, చేర యను తమిళ వ్యవహారమును నుండిన ట్లేర్పడుచున్నది. కోయముత్తూరు, సేలము జిల్లాలును, మైసూరులోఁ గొంత భాగమును కలిసియుండిన నడిమిప్రదేశము మాత్రము చేర లేక

[26] కపూర్ డిగిరి అశోకధర్మలిపి. అశోకశాసనములు. హుల్ష్.
[27] C. G. D. పు. 17. [28] C. G. D. పు. 17. [29] C. G. D. పు. 18.

కొంగునాడు అను పేర వ్యవహారములో నుండెను. చేరరాజ్యముయొక్క యెల్లలను అవ్వై యను తమిళ కవయిత్రి యిట్లు వర్ణించియున్నది. ఉత్తరదిక్కున పల్ని యును, తూర్పున పెఱకోటయును, పడమట (కోళిక్కోడు) కళ్ళికోటయును, దక్షిణమున సముద్రమును నెల్లలుగా 80 కవతములు వ్యాపించియున్నది.[30] నేటి కేరళరాష్ట్రము భాషాప్రయుక్తవిభజనమున నేర్పడినది.

మలయాళ మనున దీ దేశమునకు ద్రావిడపదముగానే వచ్చినపేరు. మల యనగా నన్నిద్రావిడభాషలలోను కొండ యని యర్థమే. మలయాళ మనఁగా కొండనాడు, లేక కొండదేశ మని యర్థము. ఇది సంస్కృత మలయశబ్దభవము కాదు. ఈ శబ్దమును ప్రాచీనముగానే కనుపట్టుచున్నది. (సుమారు క్రీ. వె. 545) క్రిస్తియను టోపొగ్రఫీ యను గ్రంథమున సింహళద్వీపమునుగుఱించి వ్రాయుచు, దానికి సమీపమున మిరియాలు పండు దేశము మలె యను పేరుగలది యుండెనని వ్రాయఁబడెను. ఆళమ్ అను పదము ఆళ్=పాలించు, కలిగియుండు, ఏలు అను నర్థము కలిగిన ద్రావిడశబ్దమునుండి కలిగినది. మలైనాడు లేక మలై మండల మనియు నీ దేశమునకుఁ దమిళగ్రంథములఁ బే రుండుటవలనఁ బయి వ్యుత్పత్తి సరిగానే యున్నది.[31]

మలయాళభాష మిక్కిలి నవీన మనియును, అరవముయొక్క మాండలికభేదమే రూపాంతరమై యొక స్వతంత్రభాషారూపమున నేర్పడినదనియు ననేకుల యభిప్రాయము. ఈ యభిప్రాయము మున్ముందుఁ జర్చింపఁబడును.

గ్రంథజాలము గలిగి, నాగరకత కాలవాలమయిన ద్రావిడవాఙ్మయము లన్నింటియందును సంస్కృతప్రభావము నత్యధికముగ సూచించునది మలయాళము. రామచరితము, రామకథాపాట్టు అను రెండుగ్రంథములే మిక్కిలి ప్రాచీన మైనవి. వీనికాలము 10-వ శతాబ్ద మని యూహింపఁబడినది. రామాయణము లోని యుద్ధకాండమునందలి కథయే రెండు గ్రంథములయందును మనోహరముగా రచింపఁబడినది. తిరువాన్కూరు రాజులలో నొక్కఁడు మొదటిగ్రంథమును, రెండవదానిని అయ్యపిళ్లైఆశాఞ అనునతఁడును వ్రాసిన ట్లూహింపఁబడినది. దారుకావధ మని నామాంతరము కలిగిన కాశీనాటకము అనునది యొక దృశ్యప్రబంధము వంటిది ఆ కాలమునాఁటిదే లభించుచున్నట్లు తెలియుచున్నది. ఎనిమిదవ శతాబ్దమున భాస్కరరవివర్మపెరుమాళ్ళు, వీరకేరళచక్రవర్తి యను నిద్దరు రాజులచే నొసంగ బడిన తామ్ర దానశాసనములనుబట్టియు, నాఁటి మలయాళస్వరూపము తెలియ నగును. అందుఁ జాలవఱ కరవభాషయే యున్నట్లు కనుపట్టగలదు. దీనినిబట్టి అప్పటికి మలయాళము వేఱుభాషగా నేర్పడలేదు గావుననే యిట్లున్నదని కొందఱి యభిప్రాయము. 12-వ శతాబ్దమునకు ముందు కౌటిలీయార్థశాస్త్రమునకు నొక

[30] *Tamil Literature*—P. Pillai. Page 7.

[31] *Tamil Studies*—M. Srinivasa Iyangar. Page 341.

వ్యాఖ్యానము వ్రాయఁబడినది. అది గద్యము. పావకూత్తు అను నొక జాతి రూపకముగా కంబరామాయణము (అరవగ్రంథము) నాధారముగా గొని యొక గ్రంథము వ్రాయంబడినది. ఇది గురుశిష్యపరంపరగా నటకులచే నాడఁబడుచుండును.[32]

12 మొదలు 16-వ శతాబ్దమువఱకును మలయాళమున ననేక గ్రంథములు వ్రాయంబడినవి. అవి ముఖ్యముగా మూఁడు జాతులు : సందేశకావ్యములు, చంపువులు, ఖండకావ్యములు. ఉణ్ణునీలిసందేశము అను పేరుగలిగిన యొక కావ్యము మేఘసందేశము నాదిరిని వ్రాయఁబడినది సుప్రసిద్ధమైనది. తెలుఁగు, అరవముల లోని హరికథాకాలక్షేపములవంటి కూత్తు లనంబడిన గ్రంథము లనేకము లీ కాలమున వ్రాయఁబడినవి. పునమ్ అను కవి రామాయణచంపువును వ్రాసెను. మటిమంగళమ్ అను నొక నంబూదిరి బ్రాహ్మణుఁడు నైషధచంపువును రచించెను. కొన్ని స్థలపురాణములు వ్రాయంబడినవి. ఇట్లే భారతము, భాగవతము, సావిత్రీ మాహాత్మ్యము మొదలయిన గ్రంథము లన్నియును మలయాళములోనికిఁ దిగినవి. చెఱుస్సెరి యనునాయన భాగవత దశమస్కంధము ననుసరించి కృష్ణప్పాట్టు అను నొక గ్రంథము వ్రాసెను. తుఞ్జత్తెటుత్తచ్చన్ అనునాయన సుమారు 16-వ శతాబ్దాంతమున నుండినవాఁడు, మలయాళకవిత్వమునకుఁ బితామహుఁ డనంబడిన వాఁడు, అధ్యాత్మరామాయణము, మహాభారతము అను రెండు ముఖ్యగ్రంథము లనే కాక బ్రహ్మాండపురాణము, ఉత్తరరామాయణము, దేవీమాహాత్మ్యము, హరి నామకీర్తనము, చింతారత్నము అనువానిని రచియించి మలయాళకవిత్వమున కుత్తమస్థితిని గల్పించి మలయాళమున నీడులేని ప్రశస్తిని గాంచెను.

పయిని నిరూపింపఁబడిన గ్రంథము లన్నిటియందును సామాన్యలక్షణము సంస్కృతప్రభావమే. అనువాదములు, అనుకరణములు, సంస్కృతఛందస్సులు, సంస్కృతశ్లోకములలోని కల్పనలను భాషాంతరీకరించుట మొదలయిన పనులు జరిగినవి. ఆంధ్ర కర్ణాటుల వలెనే మలయాళులుగూడ సంస్కృతసారస్వతప్రభావమున సంస్కృతప్రవాహములోఁ బడిరి. భాషయంతయును ఆంధ్ర కర్ణాటముల వలెనే తత్సమభాషయే. ఇంకొక విశేష మేమనఁగా ఆంధ్ర కర్ణాట వాఙ్మయమున గేవల నామమాత్రముగ నున్న మణిప్రవాళశైలి యను నొకశైలి మలయాళమున మిక్కిలి ప్రబలమైనది. అది సంస్కృతవిభక్త్యంతపదముల నట్లే మలయాళవిభక్తు లక్కఱ లేకయే సిద్ధరూపములుగాఁ బ్రయోగించుట ; అనఁగా వృక్షేణ, దక్షాయ, పక్షిభిః అనునట్టి విభక్త్యంతములవంటివి భాషారచనలో విరివిగాఁ బ్రయోగింపఁబడుచుండెను.

15-వ శతాబ్దమున లీలాతిలక మను నొక లక్షణగ్రంథము మలయాళభాషా సంప్రదాయములను గ్రోడీకరించుచు సంస్కృతమున రచియింపఁబడెను. ఇది సుప్ర

[32] *Ezuthaccan and his age*—by C. Achuta Menon. Page 17,

సిద్ధమయిన లక్షణగ్రంథము 1868-వ సం. లో డాక్టరు గుండెర్టుదొరగారు మొట్ట మొదటి మలయాళవ్యాకరణమును మలయాళభాషలో వ్రాసిరి ఆ తరువాత కేరళపాణినీయము, కేరళకౌముది యను గ్రంథములు వ్రాయఁబడినవి. ఇట్లు విరివియైన వాఙ్మయము గలిగి ప్రసిద్ధికెక్కినభాష మలయాళము. దక్షిణహిందూదేశమం దంతటిలోను సామాన్యప్రజలయందు మలయాళదేశముననే సంస్కృతమునకు గౌరవాదరములు మెండు. అచ్చట నాయరులు, మీనసులు (మేనోనులు) మొద లయిన బ్రాహ్మణేతరు లందఱును సంస్కృతము నాదరముతో నభ్యసించుటయే గాక యా భాషావేత్తలను దక్కిన ద్రావిడభాషాదేశములకంటె నధికముగా నాదరింతురు.

## 5. తుళు భాష

ఈ భాష పయిభాషలవలె లిపియు వాఙ్మయమును గలిగియున్నది కాదు. ఈ జనులు సంస్కృతగ్రంథములను మలయాళలిపిలో వ్రాసికొను నాచారము కలదు. మంగుళూరులో బేసెల్ మిషను ముద్రాక్షరశాలవారీ భాషను కన్నడలిపిలో ముద్రించియుండుటచే నిప్పుడు కన్నడలిపియే వాడఁబడుచున్నది. ఈ భాష చాల పరిమితప్రదేశములో వాడఁబడుచున్నది. కనరా జిల్లాలో నున్న చంద్రగిరి, కల్యాణ పురి యను రెండునదుల నడిమిప్రదేశముననే వాడుకలో నున్నది. ప్రాచీనకాలముననను, నవీనకాలముననను ఈ భాషాప్రదేశమునకీ రెండునదులే సరిహద్దులని కన్పట్టు చున్నది అని కాల్డ్వెల్లుగారు వ్రాయుచున్నారు. వాఙ్మయము లేకున్నను తుళు భాష చాలవఱ కభివృద్ధిలోనికి వచ్చినభాష యని వారి యభిప్రాయము. ఈ ప్రదేశ మున నున్న యితరభాషల ప్రచారప్రాబల్యమునుబట్టి యిది శీఘ్రకాలములోనే రూపుమాయు నని యూహింపవచ్చును. కాని తుళుజనులు చాలవఱకు మార్పు నోర్చువారుగారు గావున నియ్యది యేదో యొకరూపమున వ్యవహారములో నుండు ననియును జెప్పవచ్చును. తుళుశబ్దమునకు మృదువు అని యర్థమనియు, నియ్యది ప్రజలను బోధించుచుఁ గ్రమమున భాషకును బేరయ్యె ననియు నూహించుచున్నారు. బ్రిగెలుదొరగారు ఈ భాష కొక వ్యాకరణమును వ్రాసిరి. దీని కొక కోశముగూడ నాంగ్లభాషలోఁ బ్రచురింపఁబడినది. ఇది కన్నడభాషకును, కొడగుభాషకును సమీపముగా నున్నది.

## 6. కొడగు భాష

దీని ప్రాచీనరూపము కుడగు. కుడ యనఁగా ప్రాచీనతమిళమునఁ బశ్చిమ మని యర్థము. తమిళులు దీనిని బశ్చిమదిక్కుగా వ్యవహరించుచుండుటవలన నీ దిక్కుపేరే దేశమునకు, దేశస్థులకును, భాషకు గ్రమక్రమముగాఁ బేరైనది.

ఈ దేశమునకు నేఁటి యాంగ్లవ్యవహారస్థనామము కూర్గు. ఇది యొక చిన్న జిల్లా. పడమటికనుమలనడుమ నున్నది. తూర్పున మైసూరు, పశ్చిమమున ఉత్తర మలబారు, దక్షిణ కనరా జిల్లాలు ఈ ప్రదేశమునకు సరిహద్దులు. ఈ దేశస్థులను కొడగులు అని వ్యవహరించునట్టి శాసన మొక్కటి 1174-వ సం. నాఁటిది మైసూరు జిల్లాలో దొరకినది.[33] ఈ భాషకు తుళుభాషాపదములు మిక్కిలి సమీప ముగా నున్నవి. దీనిని కన్నడభాషయొక్క భేదమని సాధారణముగా బరిగ ణింతురు. కూర్గుజిల్లాలో సూపరింటెండెంటుగాఁ బనిచేసిన మేజరు కోల్ దొరగారు ఈ భాష కొక వ్యాకరణమును, నందలి కొన్ని పాటలను బ్రచురించిరి.

పయిని నిరూపింపఁబడిన యయిదుభాషలును, తెనుఁగును ద్రావిడభాషల లోని నాగరకభాష లని కాల్డ్వెల్లుగారి యభిప్రాయము. తుళు, కొడగు భాషలు మాటాడు జనులలో ననేకులు నాగరకులయి పాశ్చాత్యవిద్యల నభ్యసించి దక్షిణ హిందూస్థానమునఁ గొప్ప యుద్యోగములలో నున్నవారు గలరు. నాగరకభాష లనంబడిన పయి రెండిటికే లిపి వాఙ్మయములు లేనప్పుడు అనాగరకభాష లనం బడెడు క్రిందివానినిగూర్చి వేఱ చెప్పనేల? ఆంగ్లభాషాప్రచారము హెచ్చి, మిషనరీలు క్రైస్తవమతప్రచారమున కా యా భాషలను జదివి, యాంగ్లముననో, సమీపస్థ లిపినో కోశ వ్యాకరణాదులను బ్రచురించుటవలన వాని యునికినిగూర్చిన ప్రచారము గలిగినది. అత్యంత ప్రాచీనకాలమున అనఁగా సంస్కృత ప్రాకృత సంబంధము లేనప్పుడును, గలిగినతరువాతఁ గొంతకాలమువఱకును దెలుఁగిట్లే యుండెననియు నూహించుట సులభము.

## 7. అనాగరక భాషలు

తుద లేక తొద, కోట, గోండు, ఖోండు, మాలెర్, ఒరాయను అను పేళ్ళతో నాఁలుభాషలు కాల్డ్వెల్లుగారిచే పేర్కొనఁబడినవి. అవిమాత్రమేగాక ఆ తరువాత తెలిసికొనఁబడిన భాషలును గలవు. వాని నన్నిటినిగూర్చి సంగ్రహ రూపమయిన యీ క్రింది విశేషములు వ్రాయఁబడినవి.* కేవల మాంధ్రభాషా వికాసముమాత్రమే యుద్దిష్టమయిన యీ గ్రంథమునందు, ఇంతకంటె నధికమయిన ప్రసక్తి యీ విషయమునకు లేదు.

**గోండ:** అనాగరక ద్రావిడభాషలలో అత్యధికజనసంఖ్య గల భాష. ఇందు అనేక మాండలికభేదము లున్నవి. ఆంధ్రప్రదేశమునందలి ఆదిలాబాదు మండలమునందును, మధ్యప్రదేశమునందలి ఛింద్వారా, బేతుల్, బస్తర్, చాందా, బాలాఘాట్, నాగపూరు, వార్ధా, యోట్మల్, భాంద్రా మండలములందును ఈ

[33] *Lectures on the History of the Kanarese Language.* Page 38.

* T. N. చిరంజీవి, శ్రీ తూమాటి దోణప్పగారిచే సహకృతము.

భాషావ్యవహర్తలు కలరు. డ్రెంచి, విల్లియంసన్, మిచెల్ మొదలగు పాశ్చాత్య విద్వాంసులు రచించిన కోశ వ్యాకరణములు, అనూదిత బైబిలు భాగములును ఈ భాషలోని వాఙ్మయము. (జనసంఖ్య : 12,32,886.)

**కురుఖ్ :** ఒరాయనులు - అను గిరిజనజాతివారు ఈ భాషను మాటాడుదురు. దీనినే ఒరాయన్ అనియు వ్యవహరింతురు. బీహారుప్రదేశములోని భాగల్పూరు, ఛోటా నాగపూరు ప్రాంతములయందును, ఒరిస్సాప్రదేశములోని సుందరగడ్, సంబల్పూరు మండలములయందును, మధ్యప్రదేశమునందలి రాయఘడ్, సర్గూజా మండలములయందును ఈ భాష వ్యవహారమున కలదు. గిజ్యార్డు మొదలగు క్రైస్తవమతప్రచారకులు వ్రాసిన కోశ వ్యాకరణాదులీ భాషలో కలవు. శరచ్చంద్ర రాయ్ మొదలగు పరిశోధకులు ఒరాయనుల ఆచారవ్యవహారములనుగూర్చి తమ రచనలలో పొందుపఱచినారు. (జనసంఖ్య : 6,44,042)

**కువి :** ఈ భాషావ్యవహర్తలను ఖోండు, కోందు, సామంతు, జాతాపు దొరలని ప్రాంతీయభేదముల ననుసరించి వ్యవహరింతురు. ఒరిస్సాప్రదేశములోని గంజాము, కలహంది, కోరాపుట్టి మండలములయందును, ఆంధ్రప్రదేశమునందలి శ్రీకాకుళము, విశాఖపట్టణ మండలములలోని మన్యప్రాంతములలో ఈ భాష మాటాడఁబడుచున్నది. విన్ఫీల్డు, ఫిట్జిరాల్డు, ఫూల్జా మొదలగువారు ఈ భాషలో కోశ వ్యాకరణములు రచించిరి. (జనసంఖ్య : 2,08,561)

**కుఇ :** ఈ భాషావ్యవహర్తలు కువి భాషావ్యవహర్తలకంటె భిన్నులు. ఒరిస్సాప్రదేశములోని గంజాము, ఫూల్బాని మండలములలోని మన్యప్రాంతములలో ఈ భాష వాడుకలో నున్నది. లింగము, లక్ష్మాజీ, విన్ఫీల్డు, పెరీరా మొదలగువారు ఈ భాషకు కోశ వ్యాకరణములు నిర్మించిరి. (జనసంఖ్య : 2,06,509)

**బడగ :** ఇది కన్నడభాషయొక్క మాండలికమని వేత్తల యూహము. పదియవ శతాబ్దమునకు ముందే కన్నడభాషనుండి వేఱుపడి స్వతంత్రభాషగా రూపొందినది. నీలగిరి కొండలలోని ఉత్తరభాగములలో ఇది వాడుకలో నున్నది. క్రైస్తవ మతప్రచారకులు అనువదించిన బైబిలుతప్ప ఈ భాషలో గ్రంథస్థసాహిత్యము లేదు. (జనసంఖ్య : 67,286)

**కొండ :** ఆంధ్రప్రదేశమునందలి విశాఖపట్టణ మండలము, ఒరిస్సాలోని కోరాపుట్టి మండలములలోని మన్యప్రాంతములలో నివసించు కొండదొర లను గిరిజనులు వాడు భాషను కొండ యని వాడుచున్నారు. దీనికే కూబిభాష యను వాడుకయును గలదు. కువి, కుఇ, కూబి — భాషలు ప్రాచీనమగు ఒక ద్రావిడ భాషాశాఖలోని మాండలికములై యుండునని ఊహింపనగును. ఆంధ్రప్రదేశ ప్రభుత్వమువారి ఆర్థికసాహాయ్యముతో, ఆంధ్ర విశ్వకళాపరిషత్తువారి యాజమాన్యమున ఆంధ్ర విశ్వకళాపరిషత్తునకు చెందిన తెలుఁగుశాఖవారు అరకులోయ ప్రాంతములో

నిర్వహించిన ఆదివాసుల భాషల సర్వేవలన కొండభాషకు కోశ వ్యాకరణములు సిద్ధమయినవి. డా. భద్రిరాజు కృష్ణమూర్తిగారు రచించిన కొండభాషావిషయిక కోశ వ్యాకరణములు, కథాసంపుటియు అచ్చులో నున్నవి. (జనసంఖ్య : 14,052)

**నాయికీ :** ఆంధ్రప్రదేశమునందలి ఆదిలాబాదు, కరీంనగర్ మండలములలోని కొండప్రాంతములలో నాయిక్పోడీ తెగ జనులు వాడు భాషను పరిశోధకులు నాయికీ అని వ్యవహరించుచున్నారు. ఈ భాషనుగూర్చిన పర్యాప్త పరిశీలనము జరుగవలసియున్నది. ఎం. బి. ఎమెనో, టిబరో గార్లు సేకరించిన పరిమితమైన భాషా విషయిక వివరములుమాత్రము అటనట నుట్టంకితములయినవి. ( జనసంఖ్య : 921 )

**ఒల్లారీ :** ఒరిస్సారాష్ట్రమునందలి కోరాపుట్టి మండలము దక్షిణభాగములోని మన్యప్రాంతముల వసించు ఒల్లారీ లేక హొల్లారీ అను తెగ జనులు వ్యవహరించు భాష ఒల్లారీ. సుధీభూషణభట్టాచార్యగారు ఈ భాషకు ఆంగ్లమున కోశ వ్యాకరణములు నిర్మించిరి. ( జనసంఖ్య : 797 )

**కోయ :** ఆంధ్రప్రదేశమునందలి వరంగల్లు, ఖమ్మంమెట్టు, ఉభయగోదావరుల లోని మన్యప్రాంతములందును, ఒరిస్సాలోని కోరాపుట్టి మండలము మన్యప్రాంతము లందును కోయజాతి జనులు వాడు భాష ఇది. జాన్ కెయిన్ అను క్రైస్తవ మత ప్రచారకుఁడు వ్యాసరూపమున ప్రచురించిన కొన్ని విషయములుతప్ప ఈ భాషను గురించిన వివరము లేవియు వెలుఁగునకు రాలేదు. పరిశీలనము జరుగవలసిన అనాగరక భాషలలో నిది యొకటి. ( జనసంఖ్య : 1,37,358 )

**కొలామీ :** ఆంధ్రప్రదేశమునందలి ఆదిలాబాదు మండలమునను, మధ్య ప్రదేశములోని యొట్మల్, వార్ధా మండలములను ఈ భాష వ్యవహారమునం దున్నది. సేతుమాధవరావుగారును, అమెరికాలోని కాలిఫోర్నియా విశ్వవిద్యాలయమున సంస్కృతభాషాశాఖాధ్యక్షులగు ఎం. బి. ఎమెనోగారును ఈ భాషకు కోశ వ్యాకర ణములు రచించిరి. (జనసంఖ్య : 42,678)

**మాల్తో :** ఈ భాషావ్యవహర్తలను మాలేరులు అనికూడ వ్యవహ రింతురు. ఈ భాషను రాజమహాలీ, మాలేరీ అనియు వాడుదురు. ఈ జాతి జనులతో అభిన్నులుగా భావింపఁబడు మాల్‌సహారి లను గిరిజనులకును మాల్తో మాతృభాష. బీహారురాష్ట్రములోని సంతాల్ పరగణా మండలములో ఈశాన్య భాగమునఁ గల రాజమహలు కొండలలో, గంగానది దక్షిణతీరమున ఈ భాషావ్యవ హర్తలు నివసించుచున్నారు. బంగాళీ, బీహారీ, సంతాలీ భాషా ప్రాంతములమధ్య ఈ భాషాప్రాంత మున్నది. ఈ భాషపై సంతాలీ భాషాప్రభావ మధికము. క్రైస్తవ మతప్రచారకులు, ఇతర పరిశోధకులు రచించిన కోశ వ్యాకరణములు కలవు.

(జనసంఖ్య : 23,857)

పర్జి : ఈ భాషావ్యవహర్తలను పొరజలు అని వాడుదురు. ఇది ప్రజాశబ్దభవము. ఒరియా భాషాప్రభావమువలన పొరొజ అయి పొరజ, పొర్జ, పర్జగా మారినది. పర్జజాతీయుల భాష పర్జి. బస్తరుప్రాంతములోని సుంకం జమీందారీ భాగములందును, జగదల్పూరు దక్షిణ భాగములందును ఈ భాష వ్యవహారమున నున్నది. లింగ్విస్టిక్ సర్వే ఆఫ్ ఇండియా సహాయసంపాదకులగు స్టెన్‌కొనోవ్‌గారు దీనిని గోండీభాషా మాండలికముగా భావించిరి. తర్వాతి పరిశీలనమువలన నిది ప్రత్యేకభాష యని నిర్ణీతమయినది. ఆక్సుఫర్డు విశ్వవిద్యాలయమునకుఁ జెందిన ఆచార్య టి. బరో గారీ భాషకు కోశ వ్యాకరణములను రచించిరి.
(జనసంఖ్య : 19,847)

**కొండేకోర్ గదబ :** ఆంధ్రప్రదేశమునందలి శ్రీకాకుళము మండలములోని సాలూరు పట్టణమునకు చేరువగాఁ గల కొండలలో నివసించుచున్న కొండేకోర్ గదబ అను జాతి జనులు వాడు భాష ఇది. కొండేకోర్ అనఁగా కొండలకు సంబంధించినవా రని అర్థము. గదబలలో వీ రొక తెగవారు. జనాభాలెక్కలలో వీరు గదబలలో చేర్పఁబడినారు. వీరిని పోయగదబ లని కొందఱు పరిశీలకులు వ్యవహరించిరి. డా. భద్రిరాజు కృష్ణమూర్తిగారు ఈ భాషావ్యవహర్తల జానపద గాథలను కొన్నింటిని సేకరించినారు.

**బ్రాహూఈ :** పశ్చిమపాకిస్థానమందలి బెలూచిస్థానములోని కెలత్ ప్రాంతమున బ్రాహుఈ లను ఆదివాసులు వ్యవహరించు భాష. డాక్టర్ బిషప్పు కాల్డ్వెల్లు దీనిని ద్రావిడభాషలలో నొకటిగా పేర్కొనినను ద్రావిడభాషా వర్గములోఁ జేర్పలేదు. కాల్డ్వెల్లునాఁటికి ఈ భాషావిషయికమైన కృషి అంతగా జరిగి యుండలేదు.

**తొద :** దీనినే తుద, తోడ అనియు వ్యవహరించుచున్నారు. నీలగిరి మండలము పశ్చిమపర్వతప్రాంతముల ఈ భాషావ్యవహర్తలు నివసించుచున్నారు. ఎం. బి. ఎమెనో, పోప్, స్టీవెన్సన్, రీవర్సు మొదలగువారు తొదజాతి జనుల ఆచార వ్యవహారములనుగూర్చియు, వీరి భాషాదికములనుగూర్చియు వ్రాసినారు.

**కోట :** నీలగిరి కొండలలోని కోట అను కొండజాతివారు వాడు భాష. ఎం. బి. ఎమెనోగారు ఈ భాషలలోని జానపదగాథలను అనేకము సేకరించి ఆంగ్లమున లిప్యంతరీకరణ, భాషాంతరీకరణములతో నాలుగు సంపుటములుగా ప్రచురించినారు.

## 8. ద్రావిడభాషల పరస్పర సంబంధము

పయిని నిరూపింపఁబడిన భాషలన్నియును ప్రాచీనద్రావిడభాష యని నేఁడు వ్యవహరింపఁబడుచు నూహాకల్పితమైన భాషయొక్క మాండలికభేదము లని సిద్ధాం

తము. మాండలికభేదము లనఁగా మండలము లేక దేశభాగము ననుసరించి వచ్చిన భేదము లని యర్థము. అత్యంత ప్రాచీనకాలమున నొక్క గుంపుగా నుండిన జనులు జనసంఖ్య వృద్ధియై వేర్వేరు దేశభాగములకు వలసపోయియు, వ్యాపించియు నుండ వచ్చును. ఒక్కొక్క భాగమున నుండిన రాజకీయ, సాంఘిక పరిస్థితులచేతను, శీతోష్ణాది వాతావరణ స్థితులచేతను, జనముల యుచ్చారణవలనను రూపాంతరిత మయి యొక్కభాషయే వేర్వేఱు మాండలికములుగా, క్రమక్రమమున భిన్నభాషలుగా నేర్పడినది. అనాగరక భాషలనుగూర్చి మనకు విశేషముగాఁ దెలియమిని నాగరకములయి లిపి, వాఙ్మయములు గలిగిన తమిళ, కర్ణాట, ఆంధ్ర, మలయాళముల నుండియే యుదాహరణము లధికముగా నొసంగఁబడుచుండును. పయిభేదము లన్నిటిలోను మిక్కిలి ప్రాచీనమయిన వాఙ్మయము గలిగిన భాష యరవము అని ముందే చెప్పియున్నాను. అట్టి యరవమునకు దేశ్యప్రభువుల ప్రోత్సాహ ముండుట వలనను, బండితులకుఁ బోషణయు, నాదరణమును గలుగుటవలనను, నక్కాలముననే వాఙ్మయము బయలువెడలినది. దీనికి ముఖ్యకారణ మా రాజు లా దేశభాషలోనే వ్యవహారము సల్పుట. [ ఇప్పుడు నూటి కరునది మందివఱకుఁ దెలుఁగువారు గలిగిన నిజాము రాష్ట్రమున రాజభాషయగుటచే నుర్దు ప్రఖ్యాతమయి ప్రాబల్యము నందుచున్నది. భారతదేశమునం దంతటను నాంగ్లమునకు గౌరవము, చెల్లుఁబడి గలిగి యుండుట రాజభాషయగుటనే.][1] అట్టి ప్రాబల్యము ప్రాచీనాంధ్రదేశమున తెనుఁగునకు లేకుండుటచేతను, సంస్కృత ప్రాకృతములకే ప్రాముఖ్యము గావునను దెనుఁగు క్రమక్రమమునఁ గ్రొత్తశబ్దములను జేర్చుకొని వాఙ్మయావస్థకు వచ్చుటకుఁ బండ్రెండు శతాబ్దములు పట్టినది. క్రీ. పూ. ఆంధ్రులు తెలుఁగునాటిని బాలించుచుండిన కాలమున నుండిన తెనుఁగునకును, నాఁటి వ్యావహారిక తమిళ, కర్ణాట, మలయాళములకును స్వరూపమున నత్యల్పభేదము మాత్ర ముండి యుండవలయును. నేఁటి రాయలసీమ తెలుఁగు, సాగరప్రాంతపు తెలుఁగు, మదరాసు తెలుఁగు, గంజాము జిల్లా తెలుఁగు ఎట్లు అత్యల్పభేదములతో నున్నవో, నాఁడును నీభాష లట్లే యత్యల్పమాత్ర భేదముతోనే యుండి యుండనగును. అరవభాష గ్రంథస్థమగుటచేతను, వ్యాకరణములు బయలుదేరుటను, మార్పువేగము మందగించి యా దేశమునకు స్వాభావికమయిన భేదవిశేషములతో మెలమెల్లగ మాఱుచు వచ్చి నేఁటి వ్యావహారికతమిళరూపమును బొందినది. తెనుఁగును నంతకంటె నెక్కువవేగమున రూపుమాఱి క్రొత్తభాషల సాహచర్యమున వింతరూపు దాల్చి పదునొకొండవ శతాబ్దమునకు భారతరూపమున స్థిరపడినది. ఈ నడిమికాలముననే వాఙ్మయస్థితికి వచ్చిన కన్నడము ప్రాచీనతమమయిన తమిళమునకు మిక్కిలి దగ్గరరూపముతోఁ గనుపట్టుచుండును. ఆ ప్రాచీనకన్నడమును గాలక్రమమున మాఱి నేఁటి హొస గన్నడరూపమును బొందినది. అట్లే మలయాళమును దమిళమునుండి వేఱుపడి

[1] ఈ విషయము 1945-46 సంవత్సరములలో ఆంధ్రప్రదేశ మేర్పడని నాఁటిది.

మొట్టమొదటి శాసనములలోఁ దమిళమునుండి విశేషభేదము లేకయే కాలక్రమమున రూపాంతరితమయి సంస్కృత బహుళమయి నేఁటి మలయాళభాష యయినది. తక్కిన భాషలనుగూర్చియు నిట్లే యోచించుకొనునది. పయి యభిప్రాయము లెస్సగా బోధపడుటకు రెం డుదాహరణములను గ్రింద నొసంగుచున్నాను.

సముద్రమునుండి యొక పెద్దపొర్లు భూమిపయికి బహుదూరమువచ్చి యట్లు వచ్చుటలో మార్గమునందున్న పెద్ద పెద్ద గుంతలను, పల్లములను నింపఁగాఁ బెద్ద పెద్ద విశాలములగు తటాకము లేర్పడె ననుకొందము. కాలక్రమమున నా యా స్థల భేదములనుబట్టియు, వాడుకనుబట్టియు, వైశాల్యమునుబట్టియు, నితరజలములు ప్రవేశించు లెక్కనుబట్టియు నా తటాకములు రూపాంతరితములయి భిన్నజలమువలె గనుపట్టుచు సామాన్యులకు భిన్నములుగానే తోఁచియు శాస్త్రజ్ఞులకు మాత్రము సూక్ష్మరూపపరీక్షచే నీ తటాకములన్నియు నిట్లేర్పడినవని విదితమగును. అట్లే యొక మహావృక్షము వివిధములై స్థూలములును సూక్ష్మములును నైన శాఖోపశాఖలచే నొప్పుచు నొక పెద్ద గాలిదుమ్ముచే నగపాలువఱకును బూడిపోయినచోఁ బయి శాఖలన్నియును నన్ని వృక్షములవలెఁ గన్పించుచుండును. నిపుణముగాఁ బరిశీలించెడివారికిమాత్ర మది యొకవృక్షమే యని తెలియనగును. ఇట్లే యీ ద్రావిడభాషల స్వరూపమును స్వభావమును నని యూహింపనగును.

నా వరే (అరవము) నే నొస్తునా (తెనుఁగు) నా బర్తేనె (కన్నడము) ఞా వరున్ను (మలయాళము) అను నాలుగు వ్యావహారికావస్థలోని రూపములును నొక్క మూలరూపమునుండియే యేర్పడినవని సూక్ష్మపరిశీలనమువలనఁ బండితులకే తెలియఁగలదు.

తెలుఁగు :—నే నొస్తునా—నేను ఒస్తున్నాను—నేను వస్తున్నాను - నేను వచ్చుతున్నాను - నేను వచ్చుతుఉన్నాను - నేను వచ్చుతుఉన్న అను - నేమ వర్చుతు ఉన్ట అను - నాన్ వర్కుతు ఇన్ట అన్ - అన్ వర్కు (తు) కు ఇన్ట అన్.

పయివిధమున నేర్పడిన వాక్యములోని నేటిరూపములను నిరూపించి తుది రూపములలో నత్యంత ప్రాచీనావస్థయందలి రూపవివరణ మెట్లు జరిగియుండినదో నిరూపింపఁబడినది.

అరవము :—నా వరే-నాన్ వరేన్-నా వరుకిన్టేన్-నాన్ వరుకుఇన్టపన్-అన్ వర్కు ఇన్టఅన్.

కన్నడము :—నా బర్తేనె-నాన్ బరుత్తేనె-అన్ బరుత్తు ఏన్-అన్ వర్తు ఏన్.

మలయాళము —ఞా వరున్ను-ఞాన్ వరున్ను-యాన్ వరుఉన్ను-అన్ వర్ ఉన్టు - అన్ వర్ ఉన్టు - అన్ వర్ ఇన్టు (ఏన్).

పై రూపక్రమమున తొలుత నున్న రూపము నవీనము, తుట్టతుది నున్న రూప మత్యంతప్రాచీనమును నయి యున్నది. పయివాక్యమును బరిశీలించినచో

నందలి నిర్మాణక్రమమును, పదధర్మమును సమానమని స్పష్టపడుచున్నది. నేను అను ఉత్తమపురుష సర్వనామము నాన్, నేన్, ఞాన్, యాన్, ఆన్ అను రూపములతో భిన్నమండలములలో నుండినది ఒక్కొక్క మాండలికమున నొక్కొక్క రూపముతో స్థిరపడినది. ఆ స్థిరపడుటయే నేటి భేదమునకుఁ గారణము. వర్ అను క్రియ వరు, బరు, (వర్చు), వచ్చు అను రూపములతో నాలుగు భాషల యందును గనుపట్టుచున్నది. ఈ వర్ ధాతువునకు, కు, చు, అను నాగమములు భిన్నభాషలలో నొకే యర్థమున వచ్చినట్లు స్పష్టముగాఁ గనుపట్టుచున్నది. ఇఁక వర్తమాన క్రియాప్రత్యయాంతరూపము ఏర్పడు ప్రణాళిక యన్నిటియందును సమానమే. చేర్చిన సహాయక్రియ యగు ఇరు=ఉండు అనునదియు నభిన్నమే. ఇరు అనురూపమే ఇన్టు అనురూపముతో నేకకాలమున నభిన్నముగా వాడఁ బడుచుండినట్లు తమిళమున నాగమములుగా వాడఁబడు కిఱు, కిన్టు అనునవి స్పష్ట పఱచుచున్నవి. ఈ ఇన్టు అనునది ఉండు అనియు ఉన్న అనియు రూపాం తరిత మయినది. ఇఁక దీని వెనుక నున్న ప్రత్యయములన్నియు వాక్యమున కాది నున్న ఉత్తమపురుష సర్వనామముతో నభిన్నమనుట స్పష్టము. ఇట్లే యన్ని విషయములలో తెలుఁగు మొదలయిన ద్రావిడభాషలు ఏకభాషాజనితములే యనుట క్రిందను నిరూపింపఁబడును.

తెనుఁగు మొదలగు ద్రావిడభాష లేక కుటుంబమునకుఁ జేరినవి. ద్రావిడ భాష లనంబడిన అరవము, తెనుఁగు, కన్నడము, మలయాళము మొదలయిన భాషలలోఁ గొన్ని సమానలక్షణములు గలవు. ఆ సమానలక్షణములవలననే వాని నన్నిటి నొక్క భాషాకుటుంబముగా నూహించియున్నారు.

(1) ప్రాచీనకాలమున నీ భాషలన్నియును హలంతములుగానే యుండినట్లు స్పష్టముగా నెఱుఁగనగును. కాని కాలక్రమమున వీనియందలి పదములు అజంత ములుగా నేర్పడు పద్ధతి బయలుదేరినది. ఆ పద్ధతి మిక్కిలి పరిపూర్ణతనందినది తెనుఁగుననే. ప్రాచీనాంధ్రభాషయందుఁ బదములు హలంతములుగా నుండెనని యూహించుట కనేకాధారముల నింతకుముందే నిరూపించితిని. నేఁటికిని పదాంత మున నున్న లు, రు, ను ప్రత్యయములు హలంతములు గావచ్చును. నవీన కర్ణాట భాషయం దెల్లెడలను భాష యజంత మయిపోయినది. ప్రాచీనకన్నడమునఁ బదము లనేకములు హలంతము లనుట స్పష్టము. అరవము, మలయాళము అను నీభాషల యందుమాత్ర మీ పద్ధతి మిక్కిలి ప్రాబల్యము నందలేదు. ప్రాచీనకాలమునుండియు రచియింపఁబడిన వ్యాకరణము లుండుట దీనికి హేతువేమో యనవచ్చునుగాని ప్రాచీనవ్యాకరణము గల హళగన్నడము, హొసగన్నడమున నజంతత నేలపొందె నను ప్రశ్నకు సమాధానము లేకపోవలసివచ్చును. ద్రావిడభాష లన్నింటియందు నజంతతా పరిణామముం గలదు.

(2) పదాంతమున హ్రస్వోకారమును, హ్రస్వమకారమును గలవని యరవ వ్యాకరణము లత్యంత ప్రాచీనకాలముననే గు కృత వ్యాకర ణానుసరణమున రచియించిన వ్యాకరణము గల తెనుఁగువా రీ రెండిటిని దమ గ్రంథములయందు విమర్శింపలేదు. కాని తెనుఁగు శబ్దముల యుచ్చారణములో మాత్ర మివి స్పష్టముగా నున్నవని యంగీకరింపక తప్పదు. 'గుఱ్ఱము' 'గుఱ్ఱమ్' అను వాని యుచ్చారణమునకును తెనుఁగున నుచ్చరింపఁబడు గుఱ్ఱ (ం) అను శబ్ద మునకును నంతమున భేదము గలదని యంగీకరింపక తప్పదు. ఇదియే హ్రస్వమ కారము. అట్లే వారు, నీవు మొదలయిన శబ్దముల తుది నున్న ఉకారమునకు ఉచ్చారణకాలము అర్ధమాత్రయే. ఇట్టి హ్రస్వోచ్చారణము అన్ని ద్రావిడభాషల లోను నియతముగాను, స్వాభావికముగాను గలదనుట నిశ్చయము.

(3) సంస్కృతభాషలో లేనివియు, నీ ద్రావిడభాషల కన్నిటికిని సమాన మును నైన కొన్ని ధ్వనివిశేషములు ఈ భాషలయొక్క ప్రత్యేకతను, బరస్పర సంబంధమును స్పష్టముగా నిరూపించుచున్నవి. ఎ, ఒ, చ, జ, ఱ, ఴ, అనునవి పరిశీలింపఁదగినవి. ర, ఱ ల ళ లఘ్వలఘుభేదము అన్ని ద్రావిడభాషలయందుమ మిక్కిలి ప్రాముఖ్యమును వహించినదిగాని కాలక్రమమున నీ భేదము విస్మరింపఁ బడుచున్నది. ప్రాచీనమయిన ఴ కారము భిన్న ద్రావిడభాషలలో భిన్నరూప ముల నందినట్లును, దెనుఁగున నయ్యది భ్రష్టమయినట్లును నింతకుముందే నిరూపింపఁ బడినది. ఐ, ఔ, ఋ, ౠ, ఌ, ౡ అను నచ్చులు లేకుండుటయు, ఒత్తక్షరములు లేకుండుటయు, ట, డ, ణ లయొక్క ప్రయోగము మిక్కిలి ప్రచుర ముగా నుండుటయు, పరుష సరళంబులకు ముందుమాత్రమే బిందువు కనంబడు టయు, ద్విత్వాక్షరములయందు భిన్నవర్గముల సంయోగ మత్యల్పమగుటయు నీ భాషలకన్నిటికిని సామాన్యలక్షణములు.

(4) పరుష సరళములయిన వర్గాక్షరముల మార్పులో నీ ద్రావిడభాష లన్నింటియందును నొక విధమయిన వైశిష్ట్యము గలదు. ప్రథమమీఁది 'కచట తప, లు తెనుఁగున బహుళముగా 'గసడదవ'లగు నను విషయ మిక్కడ నను సంధింపఁదగినది. ఈ పద్ధతి యితర ద్రావిడభాషలయందును బహుళము. అరవము నను, మలయాళముననను బదాదిని బరుషములును బదమధ్యమున సరళములును బ్రయోగింపఁబడుచుండుట సుప్రసిద్ధము. సంస్కృతపదములయిన దంతము, భాగ్యము మొదలగునవి తద్భవము లగునప్పుడు తందము, పాక్కియము అనురూపములను బొందును. అనునాసికమునకుఁ బరమున సరళములే బహుళము. పరుషములు విరళములు. ఈవిధమయిన యుచ్చారణము ద్రావిడభాషలయొక్క సామాన్యస్వభావమును స్పష్టముగా నిరూపించును. అనునాసికమునందలి

[1] తొల్కాప్పియము ఎళుత్తు. 12-13 సూ.

నాదసాహచర్యమునఁ బ్రక్కనున్న పరుషము సరళమగుట భాషలోని సుస్వర స్వభావమునకు లక్షణము.

(5) ఈ భాషలయందు సమస్వరత (Harmonic sequence) యనందగిన యొకానొక యజ్విశిష్టత గలదు. ఇది తెనుఁగున మిక్కిలి బహుళము. ఇతర ద్రావిడభాషలయందును నియ్యది గలదుగాని తెనుఁగున నున్నంతటి ప్రాబల్యము కనుపట్టదు.

ఉ. కత్తి+కు=కత్తికి, వాని+ను=వానిని.

(6) నామములు : ప్రథమావిభక్తిప్రత్యయము లేకయే ప్రకృతినే విభక్త్యంతముగా వాడుట. మహ దమ ద్భేదముమాత్రము పాటించి మూఁడు విధము లయిన సంస్కృత వ్యాకరణ లింగభేదము లేకుండుట, ఏకవచన బహువచనము లనంబడు రెండువచనములు మాత్రమే వాడుట, సంస్కృతమునందలి యేడు విభక్తుల విభజనము ఈ భాషలలో వైయాకరణులచే నెలకొల్పంబడినను నయ్యది యీ భాషల కతుకకుండుట, చరిత్రము తెలియఁగల శబ్దములు ప్రత్యయములుగాఁ జేర్పఁబడుట, ద్వితీయాది విభక్త్యంగము లన్నిటియందును నొక్కరీతినే యేర్పడుట మొదలగు సమానలక్షణము లీ భాషలయొక్క ప్రత్యేకస్వభావమును దెలుపఁగలవు.

(7) సర్వనామములు : వీనిలో నేక బహు వచన ప్రత్యయములందు సాధారణముగా నకార, మకారములు కనుపట్టుచుండును. రవర్ణముతోఁ గూడిన బహు వచనప్రత్యయము గూడఁ గలదు. పదములకు ముందు (అర్థభేదమును గల్పించుచును, గల్పింపకయును) నన్, మన్, తన్, నున్, ఎన్, మొదలయిన సార్వనామిక మూలరూపములు చేర్చుటచే నూత్నరూపము లేర్పడుచున్నవి. ఉ. ఎంబి, నంబి, తంబి, కై, ఎంగై, తాయ్, తండై, ఎండై, నుండై (అరవము). అన్న, నాన్న, అమ్మ, మామ్మ మొదలగునవి. ఉత్తమపురుష బహువచనమునందు రెండు రూపములు. ఒకటి యెదిరి నున్నవారిని గలిపియు, నొకటి కలపకయు (మనము, మేము అనువానితో సమమయినవి) వాడుకలో నుండుట యెన్నందగినది. సంస్కృతము నందలి యత్, తత్, ఇంగ్లీషునందలి Who, Which అను పదములతో సమానమయిన సంబంధబోధకసర్వనామముల వాడుక ద్రావిడభాషలలో, ప్రాచీన కాలమున నుండలేదనియు, నేఁటికిని వ్యావహారికభాషయం దది కనుపట్టదనియు, నట్టి సంబంధబోధకసర్వనామములకు బదులు క్రియాజన్యవిశేషణములు వాడఁ బడుచున్నవనియు స్పష్టము. ఇది ద్రావిడభాషల ప్రత్యేకతను నిరూపింపవచ్చును. గౌరవసూచకముగా బహువచనము వాడుటయు, దాని కేకవచనమే యర్థమగుటయు ద్రావిడభాషా సామాన్యలక్షణమే.

(8) విశేషణములు : విశేషణములు గుణవాచకములగు నామములేగాని వేఱుగావు. వీనికి విశేష్యములతోడి సమాన లింగ వచన విభక్తిత లేదనియే చెప్ప వచ్చును.

(9) క్రియలు : తెనుఁగునందలి తద్ధర్మార్థకమును, వ్యతిరేకార్థకమునందలి అకారవిశిష్టమయిన ప్రత్యేకరూపనిర్మాణప్రణాళికయు, సేవకుడను, మంచివాఁడవు మొదలగు విశేషణరూపముల వాడుకయు, కర్మార్థకప్రక్రియాహీనతయు నీ ద్రావిడభాషల పరస్పరసంబంధమును దెలుపుచున్నవి.

(10) పైయన్నిటికంటెను ముఖ్యమయిన విషయ మేమనఁగా నీ భాషల యందలి వాక్యనిర్మాణక్రమమును, రూపనిష్పత్తిక్రమమును నభిన్న మగుటయే. ఈ భాషలలోని పదములు అత్యల్పమైన యక్షరవైరూప్యముచే నొకదానినుండి వేఱొకభాషలోనికి మార్పు వీలగుటయు, ధాతురూపములు, సంఖ్యావాచకములు, మొదలగు భాషాప్రధానాంశములు అభిన్నములగుటయు వీని యేకకుటుంబతకుఁ గాదనరాని ప్రమాణములు.

ఉదాహరణములు

| | తెలుఁగు | అరవము | కన్నడ | మలయాళ | కురుఖు | మాల్తో | కూయి | గోండీ | బ్రాహుఈ |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | ఒకటి | ఒన్ఱు | ఒన్దు | ఒరు | ఒణ్టా | ఒర్త్ | రోణ్డి | ఉణ్డీ | అసిట్ |
| 2. | రెణ్డు | ఇరణ్డు | ఎరడు | రణ్డు | ఎణ్డ్ | ఇవ్ర్ | రిణ్డి | రణ్డ్ | ఇరట్ |
| 3. | మూఁడు | మూన్ఱు | మూఱు | మూన్ను | మూణ్డ్ | తీన్ | మూజ్జి | మూన్డ్ | ముసిట్ |
| 4. | నేను | నాన్ | నాను | ఞాన్ | ఏన్ | ఏన్ | ఆను | నన్నా | ఈ |
| 5. | మేము | నాఙ్గళ్ | నావుగళ్ | ఞఙ్గళ్ | ఏమ్ | ఏమ్ | ఆము | మమ్మాట్ | నన్ |
| 6. | మనము | నామ్ | నావు | నామ్ | నామ | నామ్ | నామ్ | —— | —— |
| 7. | నీవు | నీ | నీను | నీ | నీన్ | నీన్ | ఈను | ఇమ్మా | నీ |
| 8. | మీరు | నీఙ్గళ్ | నీవు | నీఙ్గళ్ | నీమ్ | | ఈరు | ఇమ్మట్ | నున్ |
| 9. | కన్ను | కణ్ | కణ్ణు | కణ్ణు | ఖన్ఖ | కనుత్ | కాను | కన్ | ఖన్ |
| 10. | చెవి | కాదు, సెవి | కివి | చెవి | ఖెద్దా | కెత్వుత్ | క్రిఉ | కవీ | ఖఫ్ |
| 11. | ముక్కు | మూక్కు | మూగు | మూక్కు | ముఈ | మునొత్ | ముఙ్గెలి | మునొస్సర్ | బాముస్ |
| 12. | పల్లు | పల్ | హల్లు | పల్లు | పల్ల్ | పలుత్ | పాల్గా | పల్ | దన్దాన్ |
| 13. | రా | వా | బా | వా | బరా | బర | బాము | వరా | బర్ |
| 14. | పది | పత్తు | హత్తు | పత్తు | దస్సే | దస్ | దసు | దస్ | దహ్ |
| 15. | వా(నోరు) | వాయి | బాయి | వాయి | బై | తొరొత్ | సుదా | టుడ్డా | బా |
| 16. | తల | తలై | తలె | తల | కుక్కు | తలిత్ | లెజ్జా | చుట్టీ | కాటుమ్ |
| 17. | వెండి | వెళ్ళి | బెళ్ళి | వెళ్ళి | రుపా | చన్దిత్ | దార్బా, రుపా | చాన్దీ | జర్ |
| 18. | అన్న | అణ్ణన్ | అణ్ణ | అణ్ణన్ | ఖాఇ | బయ | దాదా | తమ్ముర్ | ఈలుమ్ |
| 19. | తమ్ముడు | | తమ్మ | తంబి | బాఇ | బయ | దాదా | తమ్ముర్ | ఈలుమ్ |
| 20. | పెంటి(ఆడుది) | పెణ్ | హెణ్ణు | పెణ్ | ఆలీ | పెలిత్ | ఆసా | ఆర్ | జఇఫహ్ |

పయిరూపములు గ్రియరుసనుగారి లింగ్విస్టికు సర్వేనుండి గ్రహింపఁబడినవి. సమానార్థకములయిన శబ్దములు సాధారణముగా నన్ని భాషలయందును గొంచె మించుమించుగా నొక్కరూపముతోనే యున్నవనుట స్పష్టము. కొన్ని కొన్ని భాషలలోఁ గొన్ని రూపములు వాడుకలోనుండి తొలఁగుటవలన సంస్కృతభవము లయిన రూపములుగాని, సమీపస్థ భాషలలోని యితర రూపములుగాని వాని స్థానమునఁ జొతుకొనిపోయినట్లు స్పష్టపడుచున్నది. పది శబ్దమునకు సమాన ద్రావిడ రూపములు అరవము, తెలుఁగు, కన్నడము, మలయాళములలో మాత్రమే గలవు. కాని దశ శబ్దభవమయిన యుత్తరహిందూస్థాన పదమే తక్కిన యయిదుభాషల లోను గనుపట్టుచున్నది. ఈ భాషలయందుఁ బ్రాచీనరూపమగు పది వాడుకలో నుండుటకు హేతు వీ భాషల ప్రాచీన లిఖితసారస్వతమే. గోండీభాషలో పద్ అను రూపముకూడ వాడుకలోనున్నట్లు కనుపట్టుచున్నది. వెండి శబ్దమునకు నవనాగరక ద్రావిడభాషలలో రుపా, చాన్దీ మొదలగు రూపములు వాడుకలోనికి వచ్చి ద్రావిడ శబ్దము మఱగిపోయినది. స్త్రీ యర్థముగల శబ్దములు ఆలు, పెణ్ అనునవి రెండును వాడుకలో నుండగా కొన్ని ద్రావిడభాషలయందు ఒకరూపమును, మఱి కొన్ని భాషలయందు రెండవరూపమును వాడుకలో నిలిచినట్లు స్పష్టపడుచున్నది.

## 9. ద్రావిడభాషలోని మాండలికమయిన యక్షరభేదములు

ఈ యుదాహరణములలో సమానార్థకమయిన శబ్దములు నాలుగు ద్రావిడభాషలనుండియును గ్రహింపఁబడినవి. వానిరూపమునం దత్యల్పభేదము మాత్రమే కన్పట్టుచుండును. ఒకయక్షరము ఉచ్చారణమున వేఱొకయక్షరముగా మాఱుచుండుట మన మాంధ్రభాషలోనే యొకకాలముననే యొక్కదేశ భాగముననే చూచుచున్నాము. వచ్చు-ఒచ్చు; వస్తున్నది-వస్తోంది; చేసినాడు-చేసాడు మొదలగు రూపములు పయియభిప్రాయముల కుదాహరణములు కాకపోవు. ఇట్టి మాండలికభేదములే ప్రాచీనకాలముననుండి యొక్కరీతిగనే భిన్నశబ్దములుగా మాఱి కాలక్రమమున గుఱుతింపరానంతటి స్వరూపభేదమును వహించి భిన్న భాషలుగా ద్రావిడభాష పరిణమించినదని యూహించుట సులభముగదా!

(1) పదాదిని ఇకారమును, ఎకారమును భిన్నద్రావిడ మాండలికములలోఁ గనుపట్టుచునే యుండును.

| తెలుఁగు | అరవము | కన్నడము | మలయాళము |
|---|---|---|---|
| ఎల (లేత) | ఎళ | ఇళ | ఇళ |
| చెదఱు | కెదఱు | సిదఱు | చితర్ |
| వెలుఁగు | బెళంగు | విళంగు | విళంగు |

| తెలుఁగు | అరవము | కన్నడము | మలయాళము |
| --- | --- | --- | --- |
| చెదలు | గెదలు | సిదల్ | చితల్ |
| చెఱ | సెఱె | సిఱై | చిఱ (అడ్డు) |
| పెర (ఱ) | పెఱ | పిఱ | పిఱ |
| నీడ | నెటిలు | నిటిల్ | నిటిల్ |
| ఎడరు | ఎడరు | ఇడరు | ఇడరు |
| కెడవు (పాటు) | కెటివన్ (ముదుసలి) | కిటివన్ | కిటివన్, కిళవన్ |
| పీనుఁగు | పెణం | పిణం | పిణం |
| నెనడు | నెణం | నిణం | నిణం |

పయిని నిరూపింపఁబడిన మార్పు సామాన్యమేగాని సార్వత్రికముగాదు. కొన్ని శబ్దములలో మార్పు లేకయే కనుపట్టుచుండును.

| | | | |
| --- | --- | --- | --- |
| ఇరులు | ఇరుళు | ఇరుళ్ | ఇరుళ్ (ల్) |
| ఇనుము | ఇరుమ్బు | ఇరుమ్బు | ఇరుమ్బు |
| ఇరవు | ఇరవు | ఇరు (క్కై) | ఇరిప్పు |

(2) పదాంతమున దమిళశబ్దములలో ఐ యనియు, తెలుఁగు మలయాళములలో అ యనియు, కన్నడమున ఎ యనియు నుండుట సాధారణము.

| తెనుఁగు | మలయాళము | కన్నడము | అరవము |
| --- | --- | --- | --- |
| ఎర | | ఎరె | ఇరై |
| తల | తల | తలె | తలై |
| కోరిక | | కోరిక్కె | కోరిక్కై |
| నడత | | నడతె | నడత్తై |
| పిల్ల | పిళ్ల | పిళ్లె | పిళ్లై |
| కొల్ల | కొళ్ల | కొళ్లె | కొళ్ళై |
| అర | అర | అరె | అరై |
| ఎడ | ఇడ | ఎడె | ఇడై |
| తెర | తిర | తెరె | తిరై |
| నన | నమ్బు | ననె | ననై |

(3) పదాదినున్న తెనుఁగులోని ఒకారమునకు బదులు ఇతరభాషలలో సాధారణముగా ఉకారము కనుపట్టును.

| తెనుఁగు | అరవము | కన్నడము | మలయాళము |
| --- | --- | --- | --- |
| కొఱడు | కుఱడు | కొఱడు | కుఱడు |
| దొర | తురై | దొరె | |
| మొలక | ముళై | మొళె | మొళ |
| పొగడు | పుగழ் | పొగళ్ | పుగటు |

| తెనుఁగు | అరవము | కన్నడము | మలయాళము |
|---|---|---|---|
| కొలను | కుళం | కొళను | కుళం |
| మొదలు | ముదల్ | మొదల్ | ముదలు |
| ఒదవు | ఉదవు | ఒదవు | ఉతకు |
| ఒడలు | ఉడల్ | ఒడల్ | ఉడల్ |
| పొదరు | పుదర్ | పొదఱ్ | పుద |
| పొనలు | పునల్ | పొనల్ | పుణల్ |
| పొడ | పుడై | పొడె | పుడ |
| కొరలు | కురల్ | కొరల్ | కురల్ |

(4) పదాదినున్న అరవములోని ఆకారము తెలుఁగు కన్నడములలో నక్కడక్కడ ఏగా మాఱును.

| | | | |
|---|---|---|---|
| నానుపు (ఆలసించు) | నాణ్ | నేణ్ (సిగ్గుపడు) | ఞాణ్ |
| జాన | జాణ్ | గేణ్ | చాణ్ |
| నేను | నాన్ | నాన్ | ఞాన్ |
| ఏనుగు | యానై | ఆనె | ఆన |
| ఏలు | ఆళ్ | ఆళు | ఆళు |
| ఏఁడు | ఆండు | ఆండు | ఆండు |

(5) ఒక మాండలికభాషలో దీర్ఘమున్నయెడల నింకొకదానియందు హ్రస్వ ముండవచ్చును.

| | | | |
|---|---|---|---|
| ముప్పు | మూప్పు | ముప్పు | మూప్పు |
| అరయు | ఆరాయ్ | అరయ్ | ఆరాయు |
| అరయమి | అఱియామై | అఱియమె | అఱియాయ్మ |
| తప్పక | తప్పాదె | తప్పదె | తప |

పై రూపములయందు అచ్చులమార్పులు దిఙ్మాత్రముగ నిరూపింపఁబడినవి. హల్లులలోఁగూడ నిట్టి యల్పభేదములతోడనే పదములు భిన్నభాషలలో వాడుచున్నారు.

## హల్లుల మార్పులు

(1) 'కచటతప'లు భిన్నభాషలలో 'గజడదబ'లుగా మాఱవచ్చును.

| తెనుఁగు | అరవము | కన్నడము | మలయాళము |
|---|---|---|---|
| పొగ | పుకై | పొగె | పుగ |
| గట్టు | కట్టు | గట్టు | కెట్టు |

| తెలుఁగు | అరవము | కన్నడము | మలయాళము |
| --- | --- | --- | --- |
| గూడు | కూడు | గూడు | కూడు |
| గుడ్డి (గ్రుడ్డి) | కురుడు | కురుడు | కురుడు |
| గూని | కూన్ | కూను | కూన్ |
| చాఁగిలు | | జాగిసు | |
| చుండు | చొండు | జొండు | చుండు |
| చొల్లు / జొల్లు | చొల్లు | జొల్లు | చొల్లు |
| డాలు | టాళ్ | డాళ్ | |
| డేగ | ఛేకై | డేగె | |
| దండు | తండు | దండు | తండు |
| దాఁటు | తాండు | దాండు | తాండు |
| పచ్చ | పచ్చ | బచ్చ | పచ్చ |

(2) క, చ, స, లు భిన్నభాషలలో గనుపట్టుచుండును

| | | | |
| --- | --- | --- | --- |
| చిఱు | సిఱు | కిఱు | చెఱు |
| చెదఱు | సెదఱు | కెదఱు | చితర్ |
| చెయి | సెయ్ | | కయ్ |
| చెదలు | సిదలు | గెదలు | చితల్ |
| జేన | సాణ్ | గేణ్ | చాణ్ |

(3) య, స లు రెండును ఏకశబ్దములో గనుపట్టుచుండును.

| | | | |
| --- | --- | --- | --- |
| ఉసురు | ఉయిర్ | ఉసిర్ | ఉయిర్ |
| పయిరు | పెసఱ్ | పెసఱు | పయఱు |
| పేరు | పెయర్ | పెసరు | పేరు |

(4) ల, ళ, ఱ, డ, ర అనునవి తారుమారగుచుండును

| | | | |
| --- | --- | --- | --- |
| ప్రోలు | పొఱ్ఱల్ | పొఱల్ | పొఱల్ |
| క్రింద | కీఱ్ఱ్న్ద | కెఱగె | కీఱ్ |
| ప్రొద్దు | పొఱ్ఱుతు | పొఱ్ఱు | పొఱుతు |
| మ్రోఁగు | ముఱ్ఱంగు | మోఱగు | ముఱంగు |
| మొఱఁగు | ముఱ్ఱకు | ముఱుగు | |
| కోడి | | కోఱి | కోఱి |
| అడలు | అఱ్ఱల్ | అఱలు | అఱల్ |
| ఊడిగము | ఊఱ్ఱియం | ఊఱిగం | ఊఱియం |

| తెలుఁగు | అరవము | కన్నడము | మలయాళము |
|---|---|---|---|
| కొలను | కుళం | కొళం | కుళం |
| మొల | ముళై | మొళె | మొళ |
| ఏలు | ఆళ్ | ఆళ్ | ఆళు |
| కల్లు | కళ్ | కళ్ | కళ్లు |

(5) వ, బ లు తారుమారగుచుండును.

| | | | |
|---|---|---|---|
| వాయి | వాయ్ | బాయ్ | వాయ |
| వచ్చు | వర్ | బరు | వరు |
| వగ | వకై | బగె | వక |
| వాలు | వాళ్ | బాళ్ | వాళ్ |
| వీచు | వీసు | బీసు | వీసు |

(6) ఒకభాషలోని యనుస్వార మింకొకదానిఁ

| | | | |
|---|---|---|---|
| ఒఱగు | ఉఱంగు | ఒఱగు | ఉఱంగు |
| ఐదు | ఐందు | ఐదు | |
| తొలఁగు | తుళంగు | తొళగు | |
| తోడు | తోండు | తోడు | తోండు |
| ఎమ్ము | ఎలుంబు | ఎలుబు | ఎల్లు |
| గూడు | కూండు | గూడు | కూడు |
| మూడు | మూన్ఱు | మూఱు | మూను |
| దిద్దు | తిరుందు | తిర్దు | తిరుత్తు |
| మందు | మరుందు | మర్దు | మరున్ను |
| రెండు | ఇరండు | ఎరడు | రండు |
| వెలుఁగు | విళంగు | బెళగు | విళంగు |
| వేము | వేంబు | బేవు | వేప్పు |
| పాము | పాంబు | పావు | పాంబు |

(7) ఒకభాషలోని ద్విత్వము మఱియొకభాషలో నుండదు.

| | | | |
|---|---|---|---|
| పేట | పేట్టై | పేటె | పేట్ట |
| సరకు | సరక్కు | సరకు | సరక్కు |
| తోఁపు | తోప్పు | తోపు | తోప్పు |
| ఆట | ఆట్టం | ఆటం | ఆట్టం |
| కూటము | కూట్టం | కూటం | కూట్టం |
| తోఁట | తోట్టం | తోటం | తోట్టం |

(8) తెలుఁగున న, ల లున్న చోట్ల నితరభాషలలో ణ, ళ లుండును.

| తెలుఁగు | అరవము | కన్నడము | మలయాళము |
|---|---|---|---|
| కన్ను | కణ్ | కణ్ణు | కణ్ణు |
| మన్ను | మణ్ | మణ్ణు | మణ్ణు |
| ఎన్ను | ఎణ్ | ఎణి | ఎణ్ణు |
| పని | పణి | | పణి |
| అన్న | అణ్ణన్ | అణ్ణ | అణ్ణ |
| వెన్న | | బెణ్ణె | వెణ్ణ |
| ఆన | ఆణై | ఆణ | |
| కొలను | కుళం | కొళం | కుళం |
| మొల | ముళై | మొళె | మొళ |
| ఏలు | ఆళ్ | | ఆళు |

పయి నీయంబడిన యనేకోదాహరణములం బట్టియు, ముం దీయంబడిన యుపపత్తుల నాధారముగా గొనుటవలనను, తెలుఁగు మొదలయిన భాషలన్నియు నొక్కకుటుంబమునకుఁ జెందినవనియు, నొక్క ప్రాచీనభాషామాండలికము లనియు విస్పష్టముగాఁ దెలియుచునే యున్నది. నేఁటి తెలుఁగు మొదలగునట్టి యొక్కొక్క భాషలోని మాండలికభేదములయం దెట్టి మాఱుపాట్లు గలవో యట్టి భేదములే ప్రాచీనద్రావిడభాషామాండలికభేదములయిన నేఁటి ద్రావిడభాషల యందును నున్నవని స్పష్టముగాఁ దెలియకపోదు.

ప్రాచీనాంధ్రమున అనఁగా నన్నయకు ముందుండిన భాషయందు ణకారయుక్తములును, ళకారయుక్తములును, ఴకారయుతములును నయిన పదములనేకము లుండినట్లును, నయ్యవియే నేఁటి భాషయందు న, ల, డ, ర లుగా మాఱినట్లును నిరూపించియున్నాను. నేఁటి తెనుఁగున న, ల లున్న చోటుల తమిళ కన్నడాది భాషలలో ణ ళ లున్నట్లు మీఁద నీయఁబడిన యుదాహరణములవలన స్పష్టమగుచున్నది. కాఁబట్టి నన్నయకు ముందుండిన భాష యంతయును ప్రాచీన తమిళ కర్ణాటములతో సమానలక్షణములు గలదిగా నున్నట్లు స్పష్టపడక తప్పదు. ప్రాచీనాంధ్రమున ఴకారముయొక్క యునికియు, బాహుళ్యమును ముందే నిరూపింపఁబడినవి. కాఁబట్టి క్రీస్తుశకముయొక్క ప్రథమశతాబ్దమున మన తెనుఁగు భాష నాఁటి యరవ కర్ణాటములకు నత్యంత సమీపస్థితియం దుండెనని యూహింపవచ్చును.

## 10. ద్రావిడ మాండలికము లేర్పడినవిధము

ప్రాచీనద్రావిడభాష నాఁడు జనులందఱును దక్షిణహిందూస్థానమున నుండిరి. వీరికిఁ గేంద్రస్థానములు పాండ్య చోళ చేర దేశములు. అక్కడనే దాని మొదటి

స్వరూపము లిఖితరూపమున వాఙ్మయస్థితిని క్రీస్తుపూర్వముననే పొందియుండెను. కాఁబట్టి ప్రాచీనరూపములును, ద్రావిడధాతువుల యొక్క వివిధరూపములును నందే గనుపట్టును. అచ్చ తెనుఁగుపదములకంటె నచ్చతమిళపదముల సంఖ్యయు, రూప వైశాల్యము నధికమే. మఱి కొంతకాలమునకు నవఁగా నాలేదు శతాబ్దములకుఁ గన్నడభాష వాఙ్మయస్థితికి వచ్చినది. సంస్కృతముతో నరవముకంటెఁ గన్నడమునకు సంబంధము హెచ్చు. ఇందలి తద్భవములసంఖ్య తెనుఁగు తద్భవముల సంఖ్యకంటె హెచ్చు. ఆ తరువాత మఱి మూఁడు నాలుఁగు శతాబ్దములకుఁ దెనుఁగునకు వాఙ్మయస్థితి వచ్చుటవలన నప్పు డది మఱింత రూపాంతరిత మయిపోయినది. తమిళమునుండి క్రీస్తుపూర్వమే విడిపోయియు, వాఙ్మయస్థితి వచ్చువఱకును నట్లే మాఱుచునే వచ్చుచుండిన తెనుఁగుభాష, దక్షిణమున నుండిన తెనుఁగువారును, ఉత్తరమునుండి వచ్చిన ఆంధ్రులును దెనుఁగునాటనే గలిసిపోయి తెనుఁగువారి సంఖ్య యెక్కువ యగుటచేఁ గ్రమక్రమమున స్థిరపడినది. మలయాళము సుమారు పదునొకొండవశతాబ్దమునకుఁ దమిళముయొక్క మాండలికభేదముగా నేర్పడి కాలక్రమమున 13-వ శతాబ్దమునకుఁ గొంతభేదమును, స్వాతంత్ర్యమును దాల్చినది. ఇట్లే పశ్చిమమున నున్న కొడగుభాషయు నేర్పడినది. మలయాళము నేఁటి తమిళమునకుఁగూడ మిక్కిలి సమీపము. ప్రాచీనకన్నడము తమిళమునకు దగ్గఱగానే యుండును. ప్రాచీనాంధ్రమును తమిళ కర్ణాటములును దగ్గఱగా నున్నట్లే వింటిమిగదా!

ఈ భాషలే కాలక్రమమున స్థిరపడి భిన్నభాషలుగా నేర్పడినవి.

# తెనుఁగు వ్యాకరణము పెరిగిన విధానము

## 1. నన్నయకుఁ బూర్వమును, సమకాలికమును నయిన యవస్థ.

వాఙ్మయమును, వ్యాకరణమున కొక యనుశాసనమును బయల్వెడలిన తరువాతనే భాషకు స్థైర్యము కలుగుననియు, నంతకుముందు భాష ద్రవరూపమున నుండి శీఘ్రపరిణామమునకుఁ బాల్పడుననియు ముందే చెప్పితిని. నన్నయకు ముం దుండిన తెనుఁగుభాషయొక్క రూపమునుబట్టి పరిశీలించినచో నయ్యది తమిళ కర్ణాట భాషలకు మిక్కిలిదగ్గఱగా నుండి యా భాషలతోఁ గల సంబంధమును నిరూపించునట్లు స్పష్టము. ఆ కాలముననే అనఁగా (క్రీస్తుపూర్వమునుండి) ఆంధ్ర రాజుల పాలనకాలమునుండి నన్నయకాలమువఱకును సంస్కృత ప్రాకృతముల సంబంధము తెనుఁగున కుండినట్లు సంస్కృతభాషాపద్ధతి, ఆ వ్యాకరణ విధానము, అందలి పద పదార్థ విభజనము, దానిలోని విభక్తివివేకము మొదలగు ప్రణాళిక యంతయును గ్రమక్రమముగఁ దెనుఁగునకుఁ బ్రాకినది. ఇట్లు ప్రవేశించు టలో రెండు భిన్నములయిన యంతరువులు గలవు. వ్యాకరణ మను పేర ననుశాసనము బయలు వెడలకమున్ను సంస్కృతభాషఁ జదివినవారివలన వాడుకలోనికిఁ దేఁబడిన పద్ధతులు, పదములు మొదలగునవి మొదటి యంతరువునకుఁ జెందినవి. ఇట్టి కాలములో నీ యనుకరణమును, అనుసరణమును వ్యక్తిమాత్రమునుబట్టి ప్రస రించుచుండును. అనఁగా నొకవ్యక్తిమాటలు విని యింకొకరును, వారి వ్యవహార మును విని మఱియొక్కరును ననుకరించుట జరుగుచుండును. ఈ విధమైన ప్రసార మునకుఁ బ్రాబల్య మంతగా నుండదు. అన్యభాషాపద్ధతుల ననుసరించి భాష కను శాసనము బయలువెడలినతరువాత, ప్రామాణికమయి విషయమునుండి విషయాంత రమున కా యనుసరణము శరవేగమునఁ బ్రాకిపోవును. ఒక భావమును దెలిసికొనుటకు భావాంతరజ్ఞానము గావలసివచ్చుటచే నయ్యదియుఁ దెలిసికొనవలసినదే. ఇది ప్రామాణికమయిన పద్ధతిగా నేర్పడగానే బుద్ధిమంతులగు నభ్యాసకులు అహమహమి కతో ముందుకుఁ బరుగెత్తుచుందు రీ యనుసరణమునందు. ఇది రెండవ యంతరువు. ఈ క్రింది యుదాహరణమును బరీక్షించునది. తెనుఁగునందలి క్రియలలోఁ గాల విభజన మత్యల్పమయినపద్ధతిని మిక్కిలి ప్రాచీనకాలమున జరుగుచుండినది. తద్ధ ర్మార్థక మను నొక్క రూపము మూఁడుకాలములయందును వాడుచుండిరి. భూత కాలికరూపములును వాడుకలో నుండినవి. ఇట్టి భాషకు లక్షణ మేర్పఱుపవలసి వచ్చినపుడు పెరిగిన వ్యాకరణవిభాగము గలిగిన సంస్కృతమునందలి భూత భవిష్య ద్వర్తమాన కాలిక రూపభేదము మనసులో నుంచుకొని వ్యాకర్త తనకుఁ బరిచిత

మయిన కాలవిభజనప్రణాళికను, దదర్థభేదములను ఈ రూపములకు సరిపెట్టుటకుఁ బ్రయత్నించును. దానివలన సంస్కృతవ్యాకరణమర్యాద భాషలోఁ బ్రవేశించును. తరువాత నందలి భూతాది శబ్దములకు లక్షణనిర్వచనము గావలయును. 'భూతంబునా విద్యమాన ధ్వంసప్రతియోగి' యని లక్షణము. ఈ లక్షణమునఁ గల 'ధ్వంస', 'ప్రతియోగి' యను పదముల బోధకుఁ దార్కికసంప్రదాయములు తెలియ వలయును. ఇట్లే యుత్తరోత్తరసాపేక్షంబుగ భాషవలన భావము, భావముకొఱకు విభజనప్రణాళిక, ప్రణాళికకొఱకు సంప్రదాయమును అనంతముగాఁ బెరిగి విజ్ఞానము పెరుగుటయు సంభవించుచుండును. తెనుఁగునందలి లింగవిభజనము మహ దమహత్తు లని ద్వివిధముగానే యున్నది. అనఁగా తెనుఁగులో అది, వాఁడు అను రెండు సర్వనామముల ననుసరించియే క్రియావిభక్తిప్రణాళిక యేర్పడినది. కాఁబట్టి భాషాలింగబోధప్రణాళిక రెండువిధములే. దీనిని గ్రహించియుఁగూడ తెనుఁగు వైయాకరణులు సంస్కృతమునందలి మూఁడు లింగములను, అర్థము నాశ్రయింపని కేవల భాషారూపలింగమును, దానితోడి స్త్రీవాచక స్త్రీలింగాది పదములను, వానికి సంబంధించిన న్యాయ వ్యాకరణ శాస్త్రమర్యాదలను దెనుఁగు వ్యాకరణ విచారణలోనికిఁ దెచ్చిపెట్టవలసి వచ్చినది. ఇట్టి యనుకరణము నాఁటి శాస్త్రమునందుమాత్రమే గాదు. నేఁటి జీవనవిధానమునందును గన్పట్టుచునే యున్నది. పాశ్చాత్యులయిన మన పాలకులనుండి వారి భాషను మనము నేర్చుకొనుచున్నాము. భాష ననుసరించి మన పరిసరములకు సరిపడినను, సరిపడకున్నను వారి వేషము నలవఱచుకొనుచున్నాము. దానితోఁగూడ వారి స్నానము, పానము, భోజనము, భాజనము మనలో విజ్ఞాన వంతులకు, విత్తవంతులకు విహిత మగుచున్నది. ఇట్టి సంస్కృతవ్యాకరణానుకరణము, తెనుఁగున నెంతవఱకు నెట్లెట్లు ఏ యే మార్గముల నెక్కాలమునం గలిగినది యని క్రింద విమర్శింపఁబడును.

నన్నయకుఁ బూర్వము తెనుఁగువాక్యరచనాప్రణాళిక మిక్కిలి యసం కీర్ణముగాఁ గనుపట్టుచున్నది. ఈ క్రింది వాక్యములు పరిశీలించునది.

1. చోటిమహాదేవులు తారు పుణ్ణి వస నీశ్వరమ్బు నమ్బుల్లవట్టమ్బున.... రెణ్డు....తోటళు....ఇచ్చినది.

2. స్తితిచెటిఞ్చిన వాణ్డు భారణాసి వ్రచిన వాణ్డు.

3. విక్రమాదిత్య బెమ్పణాధిరాజ ప్రథమప్రియ పుత్తుృన్డు......ఇచ్చిన క్షేత్రమ్బు....దేనికి సఱి పులవుణ్డు. వక్రబు వచ్చువాన్డు....వారణాసి వేకవిలళాను టచ్చువన్డు.

పయినున్న మూఁడు వాక్యములలోను ముఖ్యముగా పరిశీలింపవలసిన విష యము నేఁటి సమాపకక్రియావాచకమగు శబ్దరూపము కనుపట్టకుండుటయే. కర్త, క్రియ, కర్మ యను భేదము స్ఫుటపడకుండఁగనే వాక్య ముండవచ్చును. ఏకపద మాత్రమే వాక్యము కావచ్చును. చెట్టును జూచి 'చెట్టు' అనినచో 'ఇది చెట్టు' అను

భావము గల పయి పదమాత్రమే వాక్యము. 'చెట్టు మంచిది' అనునదికూడ వాక్యమే. ఏ వాక్యమునందలి భావమయినను ఉద్దేశ్య విధేయములు అను రెండుభాగములుగా విభజింపవచ్చును. పయి తెనుఁగువాక్యములు మూఁడిటిలోను వైయాకరణాంగీకృతమగు సమాపకక్రియ కనుపట్టదు. కాని ఉద్దేశ్య విధేయ భేదముమాత్రము స్పష్టముగాఁ గనుపట్టుచునే యున్నది. 'స్థితి చెఱిచినవాఁడు వారణాసియందుఁ జంపినవాఁడు' అను నర్థముగల రెండవవాక్యమున నిద్దరు పురుషులు చెప్పఁబడి యున్నారు. వారి యభేదముమాత్రము అధ్యాహార్యము. పయి వాక్యాభిప్రాయ మేమనఁగా 'మేము చేసిన యీ స్థితిని (నియమమును) ఎవ్వఁడేని చెఱచెనేని వారణాసిక్షేత్రమున హత్యచేసిన నెంతపాపము కలుగునో అంతపాపము ఆ చేసినవానికిఁ గలుగును.' అసంకీర్ణ రూపమయిన ప్రాచీనవాక్యమునకును, వ్యాఖ్యారూపమయిన నేఁటి వాక్యమునకును భావ మొక్కటియే యయినను ప్రణాళికయం దెంత భేద మున్నదో స్పష్టపడుచున్నదిగదా! 'స్థితి చెఱిచినవాఁడు' అను పదమునకు 'స్థితిని చెఱుపఁగలవాఁడు' అని భావ్యర్థకత్వము. అట్టి పురుషునకు కాశీక్షేత్రమున హత్యచేయఁగలవానితో నభేదము ఊహింపఁదగినది. ఈ అభేదము సాక్షాత్తుగా సిద్ధించినది కాదు. కేవలము పాపసంపాదకతుల్యత్వమున నౌపచారికము. ఇంతటి భావమును జెప్పుటకు వాక్యప్రణాళిక యేర్పడలేదు.

మూఁడవ వాక్యమున రెండు అభిప్రాయములు గలవు. 'దానకర్త క్షేత్రమును ఇచ్చిరి' అని మొదటిది. 'దీనికి సాక్షి పులవుండు' అనుట రెండవది. దీనిలో 'ఇచ్చుట, పులవుఁడు' అను రెండు విషయములుమాత్రము తెలుపఁబడినవి. ఇచ్చుటకును పులవునకును గల సంబంధము సాక్షిత్వము. ఈ సాక్షిత్వము పులవునియందున్నట్లు చెప్పుటకు రెండు పదములను గూర్చుటయేగాని అస్తిత్వమును నిరూపించు క్రియ చెప్పఁబడలేదు. పులవునకును, ఇచ్చుటకును గల సంబంధము 'కి' అను విభక్తిప్రత్యయముచేఁ జెప్పఁబడినది. ప్రాచీనభాషయందలి సామాన్యలక్షణము వైయాకరణోక్తమయిన సమాపకక్రియారూపము లేకపోవుటయే. ఇంతమాత్రమునఁ గ్రియారూపముల కత్యంతాభావమని యూహింపరాదు. భూతకాలిక క్రియారూపములు కనుపట్టుచునే యుండును. 'ఇచ్చిరి', 'వ్రాసెను', 'పడ్డె' అను క్రియారూపములవంటివి గలవు. నేఁటి వర్తమాన భవిష్యద్రూపములు భాషలోఁ గాలక్రమమునఁ గలిగినవని క్రియాప్రకరణమున నిరూపింపబడును. పయివిధమున సంక్షిప్తరూపములయిన వాక్యములం బోలిన వాక్యములు నేఁటికిని తెనుఁగునఁ గలవు. అయ్యదియే తెనుఁగుయొక్క స్వాభావిక ప్రాథమికరూపమును నిరూపించును.

ప్రాచీనభాషలోఁ గల సామాన్యలక్షణము లీ క్రింద నిరూపింపఁబడుచున్నవి.

1. సాధారణముగా వాక్యమున సమాపకక్రియ లేకుండుట.

2. కొన్ని ధాతువులయొక్క భూతరూపములును, దద్ధర్మార్థరూపములును మాత్రమే వాడఁబడుట.

3. క్రియాజన్యవిశేషణములు మిక్కిలిగాఁ బ్రయోగింపఁబడుచుండుట: వచ్చినవాణ్ణు, చెటిఇచ్చినవాన్ని, రోగొణ్ణివన్ను, క్ట్ొచ్చినవన్ను.

4. పదముల సంబంధమును దెల్పుటకు కి, కు, ను, న మొదలగు నత్యల్ప సంఖ్యాకములయిన ప్రత్యయములనే వాడుచుండుట.

5. అస్తిత్వము, అభేదమును నిరూపించునట్టి ఉండు, అగు ధాతువుల క్రియారూపములు ఉక్తములుగాక యధ్యాహృతములుగా శ్రోతయూహకు మాత్రమే విడిచివేయుట. పయివాని కుదాహరణములు నన్నయకుఁ బూర్వపు భాష యను ప్రకరణమున నీయంబడినవానిలోనుండి గ్రహింపనగును. ఇట్టి పద్ధతియు వాక్యరచనమున గలిగినభాష కావ్యరచనోపయోగి కావలసిన యవస్థ పట్టగానే తన స్వరూపమును మార్చుకొనవలసివచ్చెను.

## 2. భాషాభాగములు

ప్రాచీనములయిన తెనుఁగుపదములు ఏరీతిని వాడుకలో నుండినవో యేరీతిని భాష పెరుగుచుండినదో పరిశీలించి యా భాషలో నున్న పదములకుఁ గల సామాన్యలక్షణములను పదవిభజనమును జేయుట యుక్తము. అనఁగా వ్యాకరణమునందలి యభిప్రాయములు, విభజనపద్ధతి, సాంకేతికపదములు మొదలగు ప్రణాళిక యంతయు భాషయొక్క పెరుగుదలనుబట్టియు, నందలి క్రొంగ్రొత్తదారులనుబట్టియుఁ బెరుగుచుఁ గ్రొంగ్రొత్తగాఁ గల్పింపవలసినదే. కాని సంపూర్ణమయి మిక్కిలి విశాలమయిన యన్యభాషావ్యాకరణమర్యాదల నన్నిటిని దెచ్చిపెట్టి యా పద్ధతులపై, యా భావములచొప్పున దీనిని విమర్శింపఁబూనినచోఁ గొన్ని సరిపడును. కొన్ని సరిపడవు. తెనుఁగు సంస్కృత ప్రాకృతముల ననుసరించిన దనుటలో విప్రతిపత్తి యుండరాదు. ఈ ప్రకరణమునకు మొదటఁ జెప్పినట్లు నన్నయకుఁ బూర్వమున నుండిన తెనుఁగుభాష యభివృద్ధి మొదటి యంతరువునకుఁ జేరినది. నన్నయకుఁ దరువాత వచ్చినది రెండవ యంతరువువంటి యభివృద్ధి. అనేకభాషల యొక్కయు, బహువ్యాకరణములయొక్కయుఁ బరిచయమును, పాండిత్యమును గల వారికిఁ బ్రాచీనాంధ్రభాష యెట్లెట్లు సంస్కృతభాషాసాహచర్యమున మారినదియు నేఁడు సూక్ష్మపరిశీలనమువలనం దెలియకపోదు.

పైరీతిని వచ్చిన మార్పులు బోధపడుటకు నేఁటి తెనుఁగునుండి యుదాహరణముల నొసంగుచున్నాను. నేఁటి ఆంగ్లవ్యవహారమును, మన విద్యార్థికుల యాంగ్లభాషాపాండిత్యమును తెనుఁగువాడుకను మార్చుచునే యున్నవి. ఈ క్రిందివాక్యమును బరిశీలించునది. 'ఇది యేమని పిలువఁబడును?' 'ఇది పుస్తకమని పిలువఁబడును.' ఇది నేఁటి తెనుఁగున పిల్లలకొఱకు వ్రాయంబడు వాచకముల

యందును బ్రవేశించియున్నది. పై భావముల నారీతిగాఁ జెప్పుట తెలుఁగుభాషకు నూత్నము. 'దీని నేమందురు? దీని పేరేమి? ఇది యేమి?' అను మూఁడు ప్రశ్నములును 'దీనిని పుస్తక మందురు. దీని పేరు పుస్తకము. ఇది పుస్తకము.' అనునట్టి సమాధానములును దెలుఁగునకు స్వాభావికములని గ్రంథస్థభాషను బట్టియు, వ్యవహారబాహుళ్యమును బట్టియు స్పష్టము. పిలుచు ధాతువునకు ఆహ్వానించు అను నర్థమునఁ బిలువఁగాఁ బలుకగలయట్టి వ్యక్తినిగూర్చియే వాడుక. నామనిర్దేశమునందు మాటలాడు మనుష్యులనుగూర్చి పలుకునపుడుగూడ 'అను' ధాతువు నుపయోగించుటయే తెనుఁగుస్వభావము. ఈ క్రింది ప్రయోగములను జూచునది. 'వరుణుఁ డను మునిచేత' 'అరుణుఁ డనంగా నుదయించె' (నన్నయ భారతము-ఆదిపర్వము) నామనిర్దేశమునకుఁ గానట్టియుఁ బైగా నచేతనములకు నన్వయింపనిదియుఁ దెనుఁగునకు వింతయైనదియు నీ ప్రయోగ మెట్లు తెనుఁగునఁ జొచ్చినది యని యడుగవచ్చును. అతఁరాభ్యాసమైనదగ్గఱనుండియు నాంగ్లమునే పఠించుచు నందే తన జీవితసామర్థ్యమునంతయు వినియోగించు విశిష్టుఁడు 'This is called a book' అను నాంగ్లవాక్యమును మనసులో నుంచుకొని 'call' అను పదమునకు 'పిలుచు' సమానార్థకమని (Translation method) పరివర్తన విధానమున నాంగ్ల మభ్యసించినవాఁడు గావున నా సంస్కారమువలన నా వాక్యమునకుఁ దెనుఁగు వ్రాయును. అయ్యది విశిష్టులవలన విద్యాప్రణాళికయందుఁ బ్రవేశించుటఁ గాలక్రమమున దానికి వాడుక యేర్పడును. కాని సుమారు మూఁడు కోట్లయాంధ్రులలోని జనబాహుళ్యము 'అను' ధాతువునే వాడుదురు గాని యీ యర్థమునఁ 'బిలుచు' ధాతువును వాడరు. ఇంకొక యుదాహరణము. అతి నవ్యవ్యాకరణములయందు 'భాషాభాగములు' అను పదము ఆంగ్లమునందలి Parts of speech అను భావమునకు సరిగా వాడుకలో నున్నది. అందు 'సముచ్చయములు' అని యొక పదము ప్రయోగింపఁబడినది. ఆంగ్లవ్యాకరణమును జదువుకొని యందలి 'Conjunctions' అను పదమునకు సరిగాఁ దెనుఁగు రచించినవారి ఫక్కికలోని దీ పదము. ఆంగ్లమున 'and, but, if' మొదలగు సముచ్చయములు (Conjunctions) ఎన్నియో కలవు. ఈ పదములకు సమానార్థకము లయిన వాని నన్నిటిని సముచ్చయము లనిరి. 'మఱియు, కాని, అయితే, అయినప్పటికిని' మొదలగు పదము లీ జాతికిఁ జేరినవి. వీనిని మన ప్రాచీనవైయాకరణులు అవ్యయము లనిరి. ఇది సంస్కృతపదము. భావమును సంస్కృతభాషాగతమే. మూఁడు లింగము లందును సమానరూపమును దాల్చునదియు, నెల్లవిభక్తులను నొక్కరీతిగానే యుండునదియు, మాఱనిదియు నవ్యయమని లక్షణము.* ఇదియును దెనుఁగునకుఁ గ్రొత్తగా వచ్చిన విభజనమే. కాని ప్రస్తుత ముదాహరణమును

*సదృశం త్రిషు లింగేషు సర్వాసు చ విభక్తిషు, వచనేషు చ సర్వేషు య న్న వ్యేతి త దవ్యయమ్.

రించి పయి సముచ్చితత్వానుసరణ మెంతవఱకు సముచితమో నిర్ణయింతము. 'Rama and Krishna' అను వాడుకవంటి వాడుకను 'రాముడు మఱియుఁ గృష్ణుఁడు' అను రీతిని తెనిఁగించినవారు గలరు. 'Madras and Southern Maharatta Railway' అను పదమునకుఁ దెనుఁగు 'మదరాసు మఱియు దక్షిణ మహారాష్ట్ర రైల్వే కంపెని' అను రూపమునఁ బ్రచారములోనే యుండెడిది. ఈ యుదాహరణమును విన్నవారు పయి తెనుఁగుసేత తెనుఁగాడ నేరనివారు వ్రాసినదని సమాధానము చెప్పి తమకాలమున ననంతముగా జరుగుచున్న భాషా పరిణామమును మఱవంజూతురు గాని యది సరిగాదు. నేరమియు నేరమియును అపేక్షాబుద్ధివలన నేర్పడునవి. పయి తెనుఁగుసేఁత చేసినవారికంటె మఱి కొంచెము అధికమయిన నేరిమి కలవారి భాషలో మఱియొకవిధమయిన యనుకరణము కనుపట్టక తప్పదు. దీనికిఁ గారణము అన్యభాషయందలి యధికాదరము, అభ్యాసము, పాండిత్యమును గాని వేఱొండు గాదు. ఇది తెలియకుండగనే వచ్చు మార్పు. ఈ రీతినే నన్నయకు ముందుగల తెలుఁగులోను మార్పుగలుగుట కవకాశ ముండినది.

అచ్చతెనుఁగు పదములలోఁ (ద్రావిడభాషలో) బ్రాచీనకాలమున లింగబోధకప్రత్యయములు లేకుండెననియు, ఉండినను వాని ప్రయోగ మత్యల్పమనియును మున్ముందు లింగమునుగూర్చిన ప్రకరణమున నిశ్చయింపఁబడును. అట్టి పదములకు పురుషవాచకత్వము గల్పించుటకయి 'అన్' అను పురుషార్థకమయిన ద్రావిడభాషాపదము ఎల్ల ద్రావిడభాషలయందును జేర్పఁబడుచు వచ్చినది. దీనిని బట్టి సంస్కృతభాషాసంపర్కము ప్రాచీనద్రావిడభాషకు మాండలికత్వభేదము రూఢము కాకముందే బయలుదేరె ననియు, నట్టిసంబంధ మొక్కొక్క మండలమునఁ గాలక్రమమున నధికమును, నింకొకమండలమున నల్పముగాను గలిగినదనియు నభిప్రాయము స్పష్టపఱుపఁబడుచున్నది. ఇరామన్ అని అరవము రామన్ అని ప్రాచీనకన్నడము. మలయాళమునను నిదేరూపము. తెలుఁగున నేఁటిరూపము రాముఁడు. రామన్ అను శబ్దమే కాలక్రమమున రాముఁడు అను రూపముగా మాఱినట్లును, అన్‌ప్రత్యయమునందలి నకారమే నేఁటి డుజ్వర్ణక మయ్యెననియు ప్రత్యయప్రకరణమున నిరూపింపఁబడును. నన్నయకుఁ బూర్వకాలముననే యీ డు, ము, వు, లు అను ప్రత్యయము లేర్పడినవి. ఇవి యేర్పడుటకు నాధారములు తెనుఁగుభాషాగతములు. కాని సంస్కృతభాషలోని లింగ వచన విభక్తిభేదము తత్సమరూపమునఁ దెనుఁగునఁ బ్రవేశించి సంస్కృతభాషా ప్రణాళిక ననుసరించి తెనుఁగునఁ వ్యాపించి బహుళమయి స్థిరపడుట జరిగినది. నామముల విషయమున నేర్పడిన పయి లింగ వచన విభక్తిపరిణామము సర్వ నామములయందును బయిరీతినే సిద్ధమయినదని యూహించుట లెస్స.

## 3. క్రియాస్వరూపము

ఈ సందర్భమున నొసంగవలసిన యుదాహరణములును, పరిశీలింపవలసిన యాధారములును నన్నయకు ముం దున్న ఆఱేడుశతాబ్దములకు సంబంధించినవే యని యెఱుంగనగును గాని కాలముమాత్రము స్పష్టముగా నెఱుంగరానివి గావున నేరూపము ప్రాచీనమో, ఏది యర్వాచీనమో తెలియుట కితరాధారములను గనుఁగొనవలసి వచ్చుచున్నది. క్ఱొచ్చె[1], వ్రాసెను[1], చేసిరి[2], ఏళ్గె[3], నచ్చిరి[4], పడియె[5] మొదలగు భూతకాలిక క్రియారూపములు వాడుకలో నుండినవి.

గొణ్డురి[6], అగు[7] మొదలగు తద్ధర్మార్థకరూపములు సమాపకక్రియలుగా నక్కడక్కడఁ గనుపట్టును. ఇవి యీ సందర్భములలో భావ్యర్థకములే.

ముప్పదిమూన్టకునేణ్డు,[8] ఇందు అగు అనునది తద్ధర్మార్థకక్రియాజన్య విశేషణము.

ఎత్తిఞ్చె[6] కట్టిఞ్చె[6], ఎత్తించిరి[9], పెట్టించె[9] ఇవి ప్రేరణార్థక భూతకాలిక క్రియారూపములు.

వెల్వరిఞ్చినన్[6], అను చేదర్థకరూపము మెచ్చక[6], ఎఱుంగక[10] అను వ్యతిరేకక్త్వార్థకములును ప్రయుక్తములే.

కట్టిఞ్చి[11], విడచి, పడి[12], పొడిచి[12] మొదలగు క్త్వార్థరూపములును గనుపట్టుచునే యున్నవి.

వైదుమ్బుళచేత పట్టమ్ కట్టబడియె[5], వారిచేత పట్టమ్ కట్టబడినవాన్డు[13], ఈ రెండు వాక్యములయందును పడు ధాత్వనుపయోగము గల కర్మార్థకము కూడఁ గనుపట్టుచునే యున్నది.

పయి యుదాహరణము లన్నిటిలోను 'అస్వమేదమ్బున ఫలమ్బు అగు' 'పాతకున్డు అగు' అను రెండువాక్యములయందు 'అగు' అను సమాపకక్రియ వాడఁబడినది. 'అగు' అను క్రియారూపమక్కఱలేక వ్రాయుటయుగూడ నర్థబోధకమును, నత్యంత సాధారణమును నగుట నీ 'అగు' అను సమాపకక్రియ వాడుట యొక క్రొత్త యభ్యాసమే. ఇది సంస్కృతభాషావ్యాకరణజ్ఞానమువలన

---

[1] ఎపి. డిపా. శా. నెం. 307 సం. 1922. [2] నెం. 400. సం. 1904. [3] నెం. 300, 342. సం. 1922. [4] నెం. 329 సం. 1922. [5] నెం. 308, 309. సం. 1922.

[6] యుద్ధమల్లుని బెజవాడ శాసనము. నెం. 811. సం. 1917. [7] { నెం. 329 సం. 1922, నెం. 287 సం. 1905,

[8] నెం. 169. సం. 1917. [9] నెం. 408 సం. 1904. [10] నెం. 339. సం. 1922.

[11] పాండరంగుని అద్దంకి శాసనము. [12] నెం. 374 సం. 1904. [13] నెం. 310 సం. 1922.

వచ్చినదే. వాక్యమునఁ గ్రియ ప్రధానమనియు, దాని స్వరూప మిదమిద్ధమనియు పాతంజల మహాభాష్యాది వైయాకరణగ్రంథములయందుఁ జేయంబడిన సిద్ధాంత ములయందు నాఁటి పండితులకుఁ జాల పరిచయము గలిగియుండినదని యూహింపక తప్పదుగదా! ఆ యభ్యాసమునఁ గాలక్రమమున వీనియం దభ్యాహృతములయిన క్రియలగు 'ఉండు, అగు' ధాతువుల రూపములు నన్నయకుముందే కొంచెము కొంచెము ఉక్తము లగుచుండఁ గాలక్రమమున నది గ్రాంథికవ్యవహారమున స్థిరపడి నట్లు నిరూపింపనగును.

## 4. నన్నయ భాషలో స్థిరపడిన విశేషములు

నన్నయ భారతమును బరిశీలించి పూర్వమున నుండిన రచనావిధానము (వ్యాకరణ విషయము) ఏమి స్థిరపడినదియో యీ క్రింద వివరింపఁబడును.

1. తనకు ముందు ప్రాచీనకాలమున నుండిన తత్సమపదప్రయోగమును నన్నయ యంగీకరించి స్థిరపఱచెను. ముం దుదాహరించిన శాసనములయందుఁ గల తత్సమబాహుళ్యము నాధారముగాఁ జేసికొని, తనకు ముం దుండిన కర్ణాటభాషా కావ్యపద్ధతిని మనసులో నుంచుకొని నన్నయ దీర్ఘసంస్కృతసమాసములను భారతమున నంగీకరించెను.

నన్నయకుఁ గొంచెము ముందు శకసంవత్సరము 928, అనఁగా క్రీ. శ. 1006 సంవత్సరమున వేయింపఁబడి, గుంటూరు జిల్లా బాపట్ల తాలూకా నాగేశ్వరస్వామి యాలయములో లభించిన శ్రీమ దాహవమల్లదేవుని పాలనమునకుఁ (997-1008) జేరిన శాసనములలోని భాషను దిలకించునది. రాజరాజు 1022-1063 వఱకును నాంధ్రదేశమును బాలించెను. అనఁగా నీ శాసనము రాజరాజపట్టాభిషేకమునకు 16 సంవత్సరములకు ముందు, నన్నయతో సమకాలికమే యనవచ్చును. (ద. హిం. శా. వా. VI. నెం. 102.)

"స్వస్తిశ్రీ సకళభువనవల్లభ శ్రీమ దాహవమల్లదేవ శ్రీపాదపద్మారాధక। పరమణ్డళసాధక। సకళజగదుత్తంస। విప్రవంసాళంకార। సత్తిగనంకకాఱ। సాహిత్యవిద్యానిధి। వినయరత్నాంబుధి। శంకరకింకర। కొంకణభయంకర। సమ దారాతిమత్తమాతంగమస్తకస్థళవిదారదారుణఖరనఖరపంజర। సామన్తవజ్రపంజర। నిజభుజపరాక్రమనిర్జితప్రతిమల్ల। దుగ్గఁత్రయమల్ల। పరబళజలనిధికబళనబడవానలో దంగదావానల। వాజికుళకమళభాను......"

పయి శైలి నాఁటి పండితుల కలవాటుపడిన (620 కీ. వె.) కాదంబరి రచనలను (650 క్రీ. వె.), దశకుమార చరిత్ర ఫక్కిని, సముద్రగుప్తుని అలహాబాదు శాసనమును (380 క్రీ. వె.), వత్సభట్టి మందసారప్రశస్తిని (472 క్రీ. వె.) దలపించు చునే యున్నది.

కన్నడదేశమున క్రీ. శ. 941 సం. అనఁగా 80 సంవత్సరములకు ముందుండి భారతకథను విక్రమార్జునవిజయ మను గ్రంథముగా రచియించిన ఆదిపంపని గద్యమును దిలకించునది.

"ఇదు విబుధజనవినుత జినపదాంభోజవరప్రసాదోత్పన్న ప్రసన్నగంభీర వచన రచన చతురకవితాగుణార్ణవ విరచితమప్ప విక్రమార్జున విజయదోళ్."

ఆతని ఆదిపురాణమునుండి కందము.

అళినినదద మదకోకిళ, కళనినదద జతియోళఖినయం నెగట్ద్వె నెగం
లళితమనే నాడిసిదనొ, మళయానిళనర్తకం లతా నర్తకియా.

పయిరెండిటిని బఠించినతరువాత నీ నన్నయపద్యమును జూచునది.

ఉ. శారదరాత్రు లుజ్జ్వల లసత్తర తారకహారపంక్తులన్
జారుతరంబులయ్యె వికసన్నవకైరవగంధబంధురో
దారసమీరసౌరభము దాల్చి సుధాంశు వికీర్యమాణ క
ర్పూరపరాగపాండురుచిపూరము లంబరపూరితంబులై.

పయిదానినిబట్టి నన్నయకాలమునకుముందు తన దేశమునం దుండిన శైలి యును, దనకు ముం దుండిన కర్ణాటకావ్యశైలియును గలిసి నన్నయశైలిగా సిద్ధమై తరువాతి తిక్కన శ్రీనాథాదులకు మూలమై ప్రామాణిక మయినదనుట సిద్ధాంతము.

2. నన్నయకుఁ బూర్వము వేయఁబడినయ ట్లూహింపఁదగిన శాసనముల లోని భాషను బరిశీలించి యందలి వాక్యలక్షణమును ముందు నిరూపించితిని. వాక్యమున సమాపకక్రియ లేకుండుటయే యయ్యది. అట్టి యభావమును గ్రహించి సంస్కృతభాషాపండితులు ఆ లోటును బూర్తిచేయఁ బ్రయత్నించి యుండ వచ్చును. 'పాతకున్డు అగు', 'అస్వమేదంబున ఫలంబు అగు' అని మీఁద నీయం బడిన యుదాహరణములను జూచునది.

నన్నయ తన భారతభాగమున ననేకస్థలములయం దీ లోటును బూరించి వాక్యరచనమును జేసెను. ఈ క్రింది యుదాహరణములను జూచునది.

| | | |
|---|---|---|
| ఆదిపర్వము. | ప. | |
| ఆశ్వా. I | 38 | రమ్యమగు సభాపర్వ మిలన్. |
| | 72 | వారికి విపుల ధర్మారంభసంసిద్ధి యగున్. |
| ,, | 86 | అగు ననిమిత్తాగమంబు లయిన భయంబుల్. |
| ,, | 98 | గాకున్నదయ్యేనని. |

| | | | |
|---|---|---|---|
| ఆదిపర్వము. | | ప. | |
| ఆశ్వా. | II | 32 | నల్ల లేదయ్యె నేని. |
| ,, | ,, | 159 | ఏల బోధింపవైతని. |
| ,, | ,, | 219 | అవసర మూస్త్రీకున కిప్పుడయ్యె నంబుజనేత్రా. |
| ,, | III | 5 | మీ పంపు సేయరైరి. |
| ,, | ,, | 12 | పొరయరైరి వారు దురితవిధుల. |
| ,, | ,, | 13 | దంష్ట్రిలు నాటవయ్యె. |
| ,, | IV | 30 | నమ్మ నేరనయ్యెదను. |
| ,, | ,, | 250 | వృష్టి లేదవు. |
| ,, | V | 70 | విముక్తుండనయితి. |
| ,, | ,, | 110 | జగజ్జనసంక్షయజననుం డగుఁ బ్రమత్తత్వమునన్ |
| ,, | ,, | 141 | నాకేశాధిష్ఠితమగును. |

పయివాక్యములలో 'అగు' ధాతువుయొక్క సమాపకక్రియారూపములను జేర్పకయే యర్థబోధ కావచ్చును. అట్లర్థబోధ జరుగుచుండుటయే ప్రాచీనమగు తెనుఁగువాక్యమునకు లక్షణము. దాని స్వరూపపరిణామమున 'అగు' ధాతురూప మనుబంధమగుట యొక నూత్నావస్థ. తనకు ముందు చాలనల్పముగా నుండిన యీ యభ్యాసమును నన్నయ స్థిరపఱచెను. ఇట్లనుటచే నన్నయ గ్రంథమున 'అగు' ధాతు విరహితములయిన ప్రయోగములు లేవని యూహింపరాదు. అవియుఁ గలవు. ఈ క్రింది యుదాహరణములను బరికించునది.

| | | | | |
|---|---|---|---|---|
| ఆదిపర్వము | I | అశ్వా | 81 | దీని త్రిగుణంబు గుల్మంబు |
| | ,, | ,, | 143 | లోకపాలకుండవు |
| | ,, | ,, | 150 | ఉపాయము సేయరో క్కొ |
| | II | ,, | 56 | దాస్యమువలన విముక్తులగువారము |
| | ,, | ,, | 63 | విప్రుం డున్నవాఁడేని |
| | III | ,, | 161 | ఎనయైనవారు |
| | IV | ,, | 236 | వీరలు....ఉద్భవించినవారు |
| | V | ,, | 68 | రా నేరరు |
| | ,, | ,, | 70 | పుణ్యలోకంబులు లేవు |
| | ,, | ,, | 211 | ఎవ్వరు నేరరు |
| | VI | ,, | 96 | ఎందు లేరు |
| | ,, | ,, | 100 | ఏమిసేయువాఁడను ? |
| | ,, | ,, | 179 | పాండుమహాదేవి నిద్రవోయినది |
| | ,, | ,, | 222 | అవి పడయంబడినయవి |

ఇట్లు అనుబంధములుఁగా జేరిన ధాతురూపములే కాలక్రమమున నర్థభేదము గూడ నిరూపింపఁగలవయ్యేను. ఈ విషయము క్రియాప్రకరణమునఁ జర్చింపఁ బడును.

పై ప్రయోగములను మనస్సులో నుంచుకొనియే బాలవ్యాకరణ, ప్రౌఢ వ్యాకరణ కర్త లీ రీతిని సూత్రించిరి.

"భూతంబున లజికి లిడంతంబగు నగు ధాతు వనుప్రయుక్తంబగు" బా. వ్యా., క్రి. ప., సూ. 114.

"వ్యతిరేకక్రియ యర్థత్రయబోధకం బగు" ప్రౌ. వ్యా., క్రి. ప., సూ. 8.

నమ్మనేరను, పొరయరు మొదలగు వ్యతిరేకార్థములును, విముక్తుం డను మొదలగు ను, రు లంతమందుగల రూపములును నన్నయమతమున విశేషణము లగుటచే వాక్యపరిపూర్తి కతఁడు అగు ధాతురూపమును వాడుచు వచ్చెననుట స్పష్టము. ఈ రీతియగు వాక్యములు ఛందోబద్ధరచనలకు ననేకస్థలములం దనువుపడు ననుటయు నొక విశేషమే.

3. సంబంధబోధకసర్వనామములతోఁ గూడిన రచనయుఁ దెనుఁగునకు నొక విశేషము. ప్రాచీనభాషయందు వచ్చినవన్తు, రోగొణ్ణవన్తు, క్కొచ్చినవన్తు మొదలయిన శబ్దముల ప్రయోగ ముండిన ట్లుదాహరించితిని. సందర్భమునుబట్టి వచ్చినవాఁడు అనఁగా ఎవ్వఁడు వచ్చినవాఁడో యాతఁ డని యర్థము. ఈ యెవ్వఁడు అతఁడు అను శబ్దములను యత్తదర్థకములని తెనుఁగు వైయాకరణులు వ్యవహరించుచున్నారు. ఈ రెండు శబ్దములకును నిత్యసంబంధమనియు, నొక్కటి ప్రయోగించిన రెండవది యధ్యాహార్యమనియు సంస్కృతవ్యాకరణ మర్యాద. ఈ వాడుకను ఆంగ్లభాషలో Relative (pronouns, adverbs) construction అని వ్యవహరింతురు. ఈ యాంగ్లపదము ననుసరించి కల్పింపఁబడిన పదము సంబంధబోధక సర్వనామములు అనునది. ఆంగ్లవ్యాకరణమర్యాద ననుసరించి యిది రెండు వాక్యములకుఁ గల సంబంధమును నిరూపించుచు, సర్వనామముగానో క్రియావిశేషణము గానో (adverb) కూడ పనిచేయుచుండును. "వచ్చినవాఁడు పాతకుఁడు" అను వాక్యమునకు వివరణము 'ఎవఁడు వచ్చినవాఁ డగునో యాతఁడు పాతకుఁ డగును.' ఇందు రెండు వాక్యములు గలవు. రెండు సమాపకక్రియలును, రెండు కర్తలును గలవు. వాని సంబంధమును జెప్పునవి యత్తదర్థకములయిన 'ఎవ్వఁడు, అతఁడు' అనునవి. రచనలో సంక్షేపస్వరూపమయిన ప్రాచీనవాక్యము తెనుఁగునకు స్వాభావికము. తెనుఁగువారు ఇతర ద్రావిడభాషాభ్యాసముతో సమానమయిన తమ పద్ధతి ననుసరించి తాము కల్పించుకొనినది. నేఁటికిని బహుళప్రచారమున నున్న దదియే. కాని రెండవ ప్రణాళిక అర్థవిశేషబోధయందును, వాక్యశోభయందును, ఛందోరచన యందును నుపకారకమగుటచేఁ గావ్యరచనోపయోగి యనుట నిస్సంశయము. ఇది

యును సంస్కృతవ్యాకరణానుసరణముననే తెనుఁగునఁ బ్రవేశించినదనుట స్పష్టమే గాని యయ్యది తెనుఁగునందలి భాషాస్వభావము ననుసరించియే కలిగి నన్నయచే వ్యాపింపఁజేయబడి భారతమున కెక్కిన దనుట స్పష్టము. ప్రాచీనశాసనములలో నీ ప్రయోగ మంతగాఁ గనుపట్టదుగాని ముం దీ ప్రకరణమున సూచింపఁబడిన ఆహవ మల్లదేవుని కాలమునందలి శాసనమున నొక్కవాక్యము కలదు. క్రీ. వె. 1006. " వేంగినాణ్టి కెవ్వరు రాజులైరి వారుం భూవ్వఁస్థితిం దప్పక పాలించువారు. దీని నద్ధప్పినవారు ప్రయాగ వారణాసి యళిసినవరా........" (ద. హిం. శా. వా. VI. నెం. 102)

ఈ ప్రణాళికనే నన్నయ తన భారతమున నవలంబించెను. సంస్కృతవాక్యములను దెనిఁగించు సందర్భమున నియ్యది కొన్నియెడల ననుకూలముగఁ గనుపట్టక తప్పదు. క్రింది యుదాహరణములను జూచునది.

ఆదిపర్వము. I ఆ. 30 ఏయది హృద్యం బపూర్వ మేయది యెద్దాని
,, వినిన నెఱుక సమగ్రం
బై యుండు నఘనిబర్హణ మేయది
యక్కథయ వినఁగ నిష్టము మాకున్.

VIII 43 ని న్నెద్ది గఱపిరి నెమ్మితోడ దానిన చేయు
,, ,, 110 ఎవ్వఁడు పొడిచి యొడిచె నతనినె వలతున్.

ఈ క్రిందిపదములు సంబంధబోధకములుగా నన్నయచేఁ బ్రయోగింపఁబడినవి.

1. ఏయది 2. ఏవాని 3. ఎవ్వనియేని 4. ఎందేని 5. ఎవ్వఁడు 6. ఎవ్వఁడేని 7. ఎవ్వనిం 8. ఎంతకు 9. ఎద్ది 10. ఏ (యాయుధమ్ము) 11. ఎందేనుండి. ఈ ప్రయోగముల మొత్తపు సంఖ్య 25. నన్నయ వ్రాసిన నాలుగువేల పద్యములయందును సుమారు 25 ప్రయోగములనుమాత్రమే చేయుట యీ వాడుకయొక్క విరళప్రచారమునే సూచించుచున్నది.

ఈ ప్రయోగము తెనుఁగున నెట్లు బయల్వెడలినదో చెప్పవలసియున్నది. ఇందు రెండువాక్యములు గలవని ముందే నిరూపింపఁబడినది. ఒకటి ప్రశ్నార్థకమయిన 'ఏ' శబ్దముతో నుండును. రెండవది నిర్దేశకమయిన 'ఆ' శబ్దముతో మొదలిడును. ఈ రెండును అవ్యవహితములయిన రెండు భిన్నవాక్యములే యని యును మొదటిది ప్రశ్నమును రెండవది సమాధానగర్భితముగాను వచ్చి కాలక్రమమున నీ రీతిగా సంస్కృతభాషాప్రణాళికాజ్ఞానమున నేర్పడి వాడుకలోని కెక్కిన దనుట స్పష్టముగా నున్నది.

ఈ క్రింది యుదాహరణమును జూచునది.

నన్నయ. ఆదిపర్వము. ప్రథమాశ్వాసము. ప. 231-232.

క. ఏ నింద్రసఖుఁడ నీవును, భూనాథ సురాధినాథపుత్త్రుండవు నీ
తో ననిసేయుట యుచితమె, యే నోడితిఁ జెప్పు మెద్దియిష్టము నీకున్.

వ. దానిన చేయుదు ననిన....

మొదటి పద్యమున నియ్యది స్పష్టముగాఁ బ్రశ్నము. కావుననే 'చెప్పుము' అని యడిగెను. ఎద్ది ప్రశ్నార్థకముగదా! సమాధానము రా నక్కఱలేకయే 'దానిన' అని యుత్తరవాక్యము నందుకొనెను.

సంభాషణము నడుమ వచ్చిన యీ క్రింది ప్రయోగమును దిలకించునది.

"ఏ యాయుధంబున నెమ్మెయిఁ బోరంగ నిష్ట మయ్యది యుత్సహింపుఁడు" సభా పర్వం 1-198.

ఇట్లు నన్నయచే నంగీకరింపఁబడిన రచనాప్రణాళిక తరువాతివారికి మార్గ దర్శక మయ్యెను.

పయియర్థమునందు 'నీ కిష్టమయినది' యను తెనుఁగుభాషాప్రణాళిక సంక్షేపరూపమును ప్రయోగబహుళమును ననుట స్పష్టముగదా!

4. తెనుఁగులోనికి నన్నయ బహుళముగాఁ బ్రవేశింపఁజేసినవానిలోఁ గర్మార్థకప్రయోగ మొక్కటి. ఇట్లనుటవలన నన్నయకుఁ బూర్వము కర్మార్థకప్రయోగము లేదనిగాని, యది యేర్పడలేదనిగాని యర్థముకాదు. అట్లు లేనిదానినిగాని, యేర్పడుట కవకాశము లేనిదానినిగాని భాషావేత్త యెవ్వాఁడును దన కావ్యమునఁ బ్రవేశించుట కంగీకరింపఁడు. అట్లుచేయుట కృత్రిమముమాత్రమే గాక యప్రామాణికము ననుట నిస్సంశయము. కర్మార్థకప్రయోగము ఆర్య భాషలయందును మొదట నుండలేదనియుఁ దరువాతఁ గాలక్రమమున నేర్పడిన దనియును భాషాతత్త్వవేత్తల యభిప్రాయము. ఆర్యభాషలలో నెట్లు ఇయ్యది కాలక్రమమున నేర్పడినదో యట్లే ద్రావిడభాషలలోను స్వతంత్రముగ నేర్పడిన దనుటలో సంశయము లేదు.[14] కాని యద్దాని నొక ప్రణాళికగా గ్రహించి దానికి వివిధరూపయోగ్యతయు, ప్రయోగబహుళతయు నేర్పఱచుటలో నన్నయ

[14]The passive is a form acquired gradually by the diverse Indo-European languages long after the system of their conjugation was completed in its principal lines. Mr. Breal. *Semantics* p. 85. The primitive Aryan verb possessed no passive voice, in fact the passive is a comparatively late creation. *Science of Language* by Prof. Sayce. Vol II. p 158. *A Comparative Grammar of the Indo-Germanic Languages* Vol. IV, page 972. *Origin and Development of the Bengali Language* Vol. II, page 653. (Suniti Kumar Chatterjee.)

సంస్కృతవ్యాకరణసంప్రదాయము నుపయోగించె ననుట నిస్సంశయము. ద్రావిడ భాష లన్నిటియందును 'పడు' ధాతువుతోఁగూడిన కర్మార్థకప్రయోగము చాల విరళము. కర్మకుఁ బ్రాధాన్యము నిచ్చి కర్త్రపేక్ష లేకుండఁ జెప్పుట కర్మార్థము యొక్క ముఖ్యలక్షణము. ఇట్లు చెప్పుట కనేకమార్గములు గలవు. సాధారణముగాఁ దెనుఁగులోని వాడుక ప్రయోగములను ఁలకించునది.

1. ఇల్లు కట్టిరి. 2. ఇల్లు కట్టివేయడమైనది. 3. ఇంటిపని పూర్తియైనది. 4. ఇల్లు కట్టించివేస్తిమి. 5. సీసా పగిలినది. 6. మాట తెలిసినది. 7. రాముఁ డను వాఁడు. 8. చేసిన పని. 9. అది చెప్పలేదు. 10. బెల్ల మెట్లమ్ముతున్నది. ఈ పయి ప్రయోగముల నన్నింటిని 'పడు' ధాతువు ననుబంధముగాఁ బ్రయోగించి 1. ఇల్లు కట్టఁబడినది. 2. సీసా పగులగొట్టఁబడినది. 3. మాట తెలియఁబడినది. 4. రాముఁ డనఁబడువాఁడు. 5. చేయఁబడిన పని. 6. అది చెప్పఁబడలేదు. 7. బెల్ల మెట్లమ్మఁబడు చున్నది—అను రూపములలో వ్యవహరించుట చాల నరుదు. సాధారణముగా పడు ధాతువుతోఁ గూడిన కర్మార్థకమునకు గ్రంథమే శరణ్యము. నిత్యవ్యవహారమునఁ బ్రచార మల్పము.

ఇట్టి కర్మార్థకప్రణాళిక తెనుఁగునను, నితర ద్రావిడభాషలయందును గాల క్రమమున నేర్పడినది. నన్నయకుముందు శాసనములలో రెండు ప్రయోగములు లభించినవి. "వైదుమ్బుళచేత పట్టమ్ కట్టబడియె. వారిచేత పట్టం కట్టబడినవాన్రు" (పడుధాతు వెట్లు స్వతంత్రమయ్యుఁ గాలక్రమమున ననుబంధమాత్రమై కర్మార్థక ప్రయోగమునకు దారితీసె నను విషయము క్రియాప్రకరణమునఁ జర్చింపఁబడును). ఇట్టి ప్రయోగముల నాధారముగాఁ గొని సంస్కృతభాషాసంపర్కము గలవాఁడు గావుననే నన్నయ సంస్కృతవాక్యములను దెనిఁగించుటయందు 'పడు' ధాతువు ప్రయోగమునకుఁ బ్రాచుర్యము దెచ్చెను. నన్నయచే వ్రాయఁబడిన భారతభాగము నంతటిని బరిశీలించినచో 59 ప్రయోగములు కర్మార్థకములయిన పడుజ్యను బంధముతో లభించినవి. అందు దేశ్యధాతువులు 45, తత్సమధాతువులు 14. సంస్కృతభారతమునందు విశేషముగాఁ బ్రయోగింపఁబడిన యీ కర్మార్థకము తెనుఁగునందలి సంస్కృతవృత్తములలో ఛందస్సౌకర్యమును కలిగించు ననుట గూడ నన్నయ కుపకారకమే యయియుండును.

పయి విచారణమంతయు నన్నయనాఁటి భాషాపద్ధతులనుబట్టి రచియించినది. వ్యాకరణము లేర్పడి విభజన ప్రణాళిక వెలసినప్పుడు గలిగిన మార్పులను వివరించుటకు మున్ను తెనుఁగునుగూర్చి వ్రాయంబడిన లక్షణగ్రంథముల (వ్యాకరణముల) చరిత్రము దిఙ్మాత్రముగా నిరూపింపఁబడును.

# తెనుఁగు వ్యాకరణముల చరిత్రము

## వ్యాకరణ జాతుల విభజనము

ఆంధ్రవ్యాకరణములను స్వరూప స్వభావములనుబట్టి నాలు గై దు విధములుగా విభజింపవచ్చును. అందు

మొదటిది : సంస్కృతభాషలో శ్లోకరూపమునఁగాని, సూత్రరూపమునఁగాని వ్రాయంబడి యితరులచే వానికిఁ దెనుఁగు గద్యరూపమునఁగాని, పద్యరూపమునఁగాని వివరణములు, టీకలు మొదలగునవి కలిగినవి.

రెండవ జాతి : ఛందస్సు మొదలయిన యితర విషయములతోఁ గలిపిగాని, వేఱుగాఁగాని పద్యరూపమునఁ దెనుఁగున రచియింపఁబడినవి.

మూఁడవ జాతి : తెనుఁగున గద్యరూపమున సూత్రఫక్కిని, వ్యాఖ్యాన ఫక్కిని రచియింపఁబడినవి.

నాల్గవ జాతి : ఆంగ్లమున నాంగ్లేయులచే నాంగ్లేయులకొఱకు ఆ భాషా ప్రణాళిక ననుసరించి వ్రాయంబడినవి.

ఐదవ జాతివి : ఇతర ద్రావిడభాషాజ్ఞానమువలనను కాలక్రమరూపపరిణామ జ్ఞానమునను నేర్పడిన ప్రణాళిక గలవి.

ఇట్లీ యైదుజాతులలోని ముఖ్యగ్రంథములను వేర్వేరుగాఁ బేర్కొనుచున్నాను.

## మొదటిజాతి గ్రంథములు

### ఆంధ్రశబ్దచింతామణి

ఆంధ్రశబ్దచింతామణి యను పేరిట వ్యవహరింపఁబడుచు నన్నయకృతముగాఁ బ్రసిద్ధమయిన గ్రంథము సంస్కృతమున (82 లేక 88) ఆర్యావృత్త శ్లోకములలో నున్నది. ఇది నన్నయకృతమని విశ్వసింపనయినచో నియ్యదియే తెనుఁగునకుఁ బ్రథమవ్యాకరణము. ఈ గ్రంథమునకుఁ బ్రచారము లేకపోవుటచేతనో మఱి యేకారణముచేతనోగాని యెలకూచి బాలసరస్వతి యను మహోపాధ్యాయుఁడు టీక వ్రాసి వెలయించువఱకును దీని ప్రశంస వినరాలేదు. అతని పీఠికయం దిట్లు వ్రాసియున్నాఁడు.

అని యిష్టదేవతా ప్రార్థనంబుఁ జేసి మున్నొక్కనాఁడు విద్యానగరిలో నచింత్యాకారణోపాగమస్నేహసాహాచర్యుండగు శివయోగివర్యుచే దై వచోదనం

బరిప్రాప్తమయిన యాంధ్రశబ్దచింతామణి గ్రంథంబునకు లోకోపకారార్థంబుగాఁ డీకఁ గావింపఁగోరి నెమ్మనంబున

ఉ. ఏమి మహోద్భుతం బిది హారీ హరి యెక్కడి యాంధ్రశబ్దచిం
తామణిఫక్కి యెక్కడి మతంగనగంబు యుగాదిసంభవుం
డై మని చన్న నన్నయమహాకవి యెప్పుఁడు సిద్ధుఁ డెవ్వఁ డా
హా ! మదగణ్యపుణ్యసముదగ్రతఁ జేకుఱెఁగాదె యిన్నియున్.

"ఇది తొల్లి సకలకవితాప్రవర్తకుండగు శబ్దశాసనుండు సకల కవి హితంబుగా యథోచితసూత్రగర్భంబులగు నార్యావృత్తంబులఁ బంచ పరిచ్ఛేదకంబుగా సమకట్టె." ఈ గ్రంథమును నన్నయకృతము గాదనియు, బాలసరస్వతియో మఱి యెవ్వరో దీనిని రచించి గ్రంథప్రచారమునకుగాను నన్నయపేరు పెట్టిరనియు వీరేశలింగముపంతులుగారు ఆంధ్రకవులచరిత్రములో రచియించి యున్నారు.[1] ఈ యభిప్రాయమును జాలమంది ప్రతిఘటించిరి. వాదోపవాదములు జరిగినవి. ఇప్పటికిని నన్నయకృతము గాదని నమ్మువారు గలరు. అట్టివారికి ముఖ్యహేతువు లేవనగా

1. చింతామణిలో నథర్వణాచార్యుల పే రుండుట.
"నమ్యోత్తోహ్యథర్వణాచార్య మతాత్"

2. పదాది యకారము నంగీకరించుట.
"అద్యాః క్రియాసు భూతార్థద్యోతిన మాద్యగం వినా సర్వాః
సర్వత్రాజ్వత్కార్యం జ్ఞేయం యస్య ద్రుతప్రకృతికేభ్యః."

3. ప్రథమపురుషక్రియలయందలి యుకారమునకు సంధి నిత్య మనుట.
"నిత్యమనుత్త పురుషక్రియా స్వితః"

4. వర్తమానార్థకమునకు ఉన్నానుబంధమును, భవిష్యదర్థమునకు కల యనుబంధమును విధించుట.
"వసతిరనుబంధకస్స్యా ద్యత్ర లడర్థో వివక్షిత స్తత్ర"— 75 శ్లో.
"అస్తిరనుబంధకస్స్యా ద్యత్ర ల్నడర్థో వివక్షితో ధాతోః"- ,,

5. కేతన పెద్దనలు నన్నయవ్యాకరణమును బేర్కొనకుండుట.

6. కవిభల్లటులు మొదలగువారిని పేర్కొనుట.
"కవిభల్లటైః క్రియాణాం నామ్నాంచోల్లోపఇష్యతే వ్యాప్తః."

7. శబ్దశాసనబిరుదము నన్నయకు భారతరచనవలననే వచ్చినదని యర్థమగు పద్యమును జక్కన తన విక్రమార్కచరిత్రమునందు వ్రాయుట.

[1] వీరేశలింగము. కవుల చరిత్రము. ప్రథమభాగము. పుట. 43 పునర్ముద్రణము.

8. నన్నయనుండి సారంగధరుఁడు (ఈతఁడు చారిత్రపురుషుఁడుగాఁడు) నేర్చుకొనె నని అప్పకవ్యాదులు చెప్పిన కథ విశ్వసనీయము కాకుండుట.

పయిహేతువు లన్నింటిని విమర్శించుచు బ్ర. శ్రీ. వజ్ఝల చినసీతారామ స్వామిశాస్త్రులవారు 'చింతామణి విషయపరిశోధనము' అను గ్రంథమును ప్రచురించి ఆంధ్రశబ్దచింతామణి నన్నయకృతమే యని నిర్ణయించియున్నారు. వీరి మతమున నీ క్రిందివి సిద్ధాంతములు.

1. నన్నయ తనకాలమునుండి, భారతాదిని ప్రశంసింపఁబడిన పండితసంఘములలోని పండితుల మతములను సూచించుటకు "ప్రవదంతి, విదుః కేచిత్, విదంతి శాస్త్రారః, ఇత్యన్యే, ఇష్యతే, కథ్యంతే" మొదలగు పదములను వాడియున్నాఁడు. కవిభల్లటుఁడు నన్నయతరువాతివాఁ డనుట నిరాధారము.

2. చింతామణి ఆంధ్రవ్యాకరణ ప్రాథమికావస్థను నిరూపించుచున్నది.

3. భారత, చింతామణు లేకకర్తృకము లనుటకు సూచనలు గలవు.

4. చింతామణి ముఖ్యముగా సంస్కృతసమ శబ్దసాధనపరము.

5. సిద్ధిర్లోకాద్వ్యాశ్యా యను సూత్ర మద్దాని ప్రథమత్వమును నిరూపించుచున్నది.

6. పదాది యకారాంగీకార ప్రశంస, యకార మెచ్చట అద్విశిష్టము, ఎచ్చట ఎద్విశిష్టము అను సందేహమును నిర్ణయించు నుద్దేశముతోఁ జేయంబడినది. అట్టిది దైనికవ్యవహారమున నాఁడును నేఁడునుగూడ వినఁబడుచున్నది. అంతియేగాని పదాది యకారవిధి పరమార్థము గాదు.

7. పదాది యకారసందర్భము భారతప్రయోగవిరుద్ధము గాదు.

8. ప్రథమపురుషక్రియేకారసంధ్యభావము నన్నయభారతమున పాదమధ్యమున నెచ్చటను లేదు. పాదాంత వాక్యాంతమున రెండుచోట్ల గలదు. పాదాంతమున ఉకారాంతములకుఁగూడ సంధి లేదు. కావున పాదాంతమున సంధి వైకల్పితమని భావము.

9. సిద్ధుని కల్పన మా కాలము స్వభావమునుబట్టి చేయఁబడినదిగాని యది విశ్వసనీయము కాదు.

10. అథర్వణకారికావళికిని, జింతామణికిని గల యాంతరంగికసంబంధమును బట్టి చింతామణి యథర్వణునికంటెను ముం దనక తప్పదు.

11. చింతామణిలోని యథర్వణుని పే రున్న పాఠ మపపాఠము.

ఈ పైని చెప్పినవి మొదలుగాఁగల యనేకాభిప్రాయములను వెల్లడించి నన్నయకర్తృత్వమును శాస్త్రులవారు స్థాపించియున్నారు. చింతామణి నన్నయ

కృతము గాదనుటకుఁ బ్రబలమయిన యేదే నొక సాక్ష్యము చూపువఱకును గ్రంథస్థనిదర్శనములనుబట్టి వీలులేదు. సూక్ష్మముగాఁ బరిశీలించినచో చింతామణి, భారతము లేకకర్తృకము లనుట మాకును సమ్మతమే.

ఇట్టి యాంధ్రశబ్దచింతామణి సంస్కృతమున నార్యావృత్తములలో సంజ్ఞ, సంధి, అజంతము, హలంతము, క్రియ యను పేళ్ళతోఁ గూడిన యయిదు పరిచ్ఛేదములలో వ్రాయఁబడినది. ఆ కాలమునం బండితులందఱికిని సంస్కృతభాష వచ్చియే యుండెనని యూహింపక తప్పదు. పాండిత్య మనఁగా సంస్కృతభాషాజ్ఞాన మనియే యర్థ మనక తప్పదు. నేఁడు పిల్లవాఁడు చదువుకొనుచున్నాఁ డనఁగా ఏక్లాసని యడుగుటయు, ఇంగ్లీషే యని యర్థముచేసికొనుటయు సర్వసామాన్యసూత్ర మెట్లో నాఁడు నట్లే చదువనఁగా సంస్కృతజ్ఞానమని గ్రహింపవచ్చును. ఇఁక వ్యాకరణ ప్రయోజనము పామరజనులకొఱకును, దైనందినవ్యవహారమాత్రమునకును గాదు గదా! పండితజనులకొఱకును, గావ్యభాషానుశాసనమునకును నగుట నయ్యది సంస్కృతముననే యుండవలెను. నన్నయ చేసినది గొప్పపని. భాషకు వ్యాకరణమును గ్రొత్తగ వ్రాయుట. నేఁటి పద్ధతినిబట్టి అది 'రీసెర్చివర్కు'. అట్టిదానికి పండితసమ్మతియు, వ్యాప్తియుఁ గలుగవలెనన్నచో పండితులభాష యగు సంస్కృతముననేగదా యుండవలెను. నేఁడు తెనుఁగునుగూర్చి యేదే నొక గొప్పవిషయమును 'రీసెర్చిని' వ్రాసి దాని నాంగ్లమున వెలయించిననే దానికిఁ బ్రచారమును, బ్రాశస్త్యమును గలిగి దత్కర్తకుఁ గీర్తియు, ధనస్ఫూర్తియుఁ గలుగుచున్నవి. నన్నయగ్రంథముతోడనే యాంధ్రభాషావ్యాకరణమునకు మార్గము స్థిరపడిపోయినది. నాఁటినుండి నేఁటివఱకును వ్రాసిన పండితవర్యులును, విమర్శకధుర్యులును నా మార్గముననే చిన్న చిన్న లేశములయందుమాత్రము దమ నేర్పును, గూర్పును జూపుచు గ్రంథరచనను జేయుచు వచ్చిరని మున్ముందు స్పష్టపడగలదు.

## బాలసరస్వతీయము

1932-వ సంవత్సరమున శ్రీ వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రిగారిచే సంస్కరింపఁబడి వావిళ్ళవారివలనఁ బ్రచురింపఁబడినది. ఆంధ్రశబ్దచింతామణి యేర్పడిన తరువాత సంస్కృతవ్యాకరణమయిన పాణినీయము నెట్లు ఛాత్రులు గురువుగారియొద్ద పాఠము చెప్పుకొనెడివారో యట్లే యాంధ్రవిద్యార్థులును దీనిని పాఠము చెప్పుకొనుచుండిరని యూహింపవచ్చును. అట్లు శిష్యులకుఁ దాను తెనుఁగున బోధింపవలసివచ్చుట చేత నా యభ్యాసము ననుసరించియేగాబోలు బాలసరస్వతి మహోపాధ్యాయుఁడు చింతామణికి వచనరూపమయిన టీకను వ్రాసి వెలయించెను. కృత్యాద్యంతములఁ బద్యములను వ్రాసెను. అప్పకవి తనకాలమును క్రీ. శ. 1656-వ సంవత్సరమని వ్రాసికొనుటచేతను, నంతకుముందు కీలకసంవత్సరమున బాలసరస్వతి కా గ్రంథము లభించెననుట చేతను నా వత్సరము 1608 యని తెలుచున్నది. కాని బాలసరస్వతిమాత్రము

ఆ గ్రంథము దనకు కీలకసంవత్సరమున లభించినట్లు వ్రాయలేదు. 'ము న్నొక్కనాఁడు విద్యానగరిలో...శివయోగివర్యుచే దైవచోదనం బరిప్రాప్తమయిన యాంధ్రశబ్ద చింతామణి గ్రంథంబునకు లోకోపకారార్థంబుగాఁ డీక గావింపంగోరి' యని వ్రాసి యున్నాఁడు. ఇందు వచనమున సూత్రభావమును వ్రాసి, తెనుఁగుభాషనుండి యుదాహరణము లిచ్చి లక్ష్యసిద్ధిని గల్పించియున్నాఁడు. అక్కడక్కడ పద్యముల నుదాహరించియున్నాఁడు. ఈతఁడు భాష్యాది బహుశాస్త్రపరిచయోదాత్తుఁడు. కౌముదీ నాటక కావ్యకవి. చంద్రాపరిణయాది సత్కృతిప్రస్తు. యాదవరాఘవపాండ వీయ కర్త. పండితవంశమునఁ బుట్టినవాఁడు. సంస్కృతవ్యాకరణ పారిభాషికపదముల కును, దెనుఁగునకయి నన్నయచేఁ గల్పింపఁబడిన పారిభాషికపదములకును నాతఁడు తన టీకలోఁ వివరణమును వ్రాసెను. ఈ టీకయొక్క ముఖ్యప్రయోజనములు: పయిరీతినున్న పదముల భావమును వెలయించుట, ఆర్యాశ్లోకములను సూత్రములుగా విభజించుట, సూత్రార్థమును దెలుపుటయందు పాణినీయసూత్రవిచారమునందలి పద్ధతిని ప్రవేశపెట్టుట యనునవి.

## అప్పకవీయము

ఇది చాలఁ బ్రసిద్ధమయి పద్య గద్య రూపమయిన విపులాంధ్ర వ్యాఖ్యానము. ఇది యసంపూర్ణమగుటచే దీనియందలి వ్యాకరణభాగమునకు విశేషవ్యాప్తిగాని ప్రశస్తిగాని లేదు. ఆంధ్రశబ్దచింతామణి నిమిత్తమాత్రమేగాని యనేకవిషయ ముల నందు లేనివానిని, కర్తచే నుద్దేశింపఁబడనివానిని గ్రహియించి యిం దీతఁడు వ్రాసెను. కావ్యభేదములు, నాయకాదిలక్షణము మొదలయిన యలంకారశాస్త్ర విషయముల నీతఁడు రచియించెను. రెండవ యాశ్వాసమునందుఁ గొంతభాగ మును, మూఁడు నాలుగులను బూర్తిగను ఛందోవిషయములే విశాలముగఁ బ్రపంచించి యనేక పూర్వలక్ష్యలక్షణగ్రంథములనుండి సోదాహరణముగ విషయమును గ్రహించి నిరూపించెను. పంచమాశ్వాసమున సంధిపరిచ్ఛేదమును బ్రారంభించి కొంతవఱకు వ్రాసి గ్రంథమును విడిచివేసెను. ఇతనికి (1656-వ సం. క్రీ. శ., 1578 శా. శ.) మన్మథ సంవత్సరమున కల వచ్చినట్లును, దాను గొండవీటి పడమటిదిశ నున్న తంగెడ విషయమున గామేపల్లిని నప్పు డున్నట్లును వ్రాసికొనియున్నాఁడు. దీనినిబట్టి యీతఁడు నేటి గుంటూరుమండలమున నుండినవాఁ డనుట స్పష్టపడుచున్నది. ఈ గ్రంథమునందలి యుపోద్ఘాతమున 85 వ పద్యమునఁ దాను అంబికావాదము అను యక్షగానము, కాలజ్ఞానార్ణవ మనెడు జ్యోతిషగ్రంథము మొదలయిన గ్రంథములను రచియించినట్లు వ్రాసికొనియున్నాఁడు. ఈతఁడు సంస్కృతమునందుఁ బాండిత్యము గలవాఁడని చెప్పనక్కఱలేదు. ఎనిమిది పరిచ్ఛేదములుగా ఎలకూచి బాలసరస్వతి సకలభాషాకవిమహోపాధ్యాయ ప్రణీతాంధ్ర వ్యాఖ్యానగ్రంథం బాధారంబుగా రచియింపఁబూని అయిదు పరిచ్ఛేదములుమాత్రము వ్రాయఁగల్గెను. "ప్రయోగశరణా

వైయాకరణాః" యను న్యాయము ననుసరించి సుమారు నూరు గ్రంథములనుండి 800 పద్యములకుఁ బైగా తన లక్షణ గ్రంథములో నుదాహరించినాఁడు. పూర్వ లక్షణగ్రంథములను బహు లక్ష్యగ్రంథములను బరిశీలించి తాను వ్రాసిన లక్షణములకుఁ దగిన లక్ష్యముల నిచ్చుట యీ గ్రంథమందలి ముఖ్యవిశేషము. ఇట్టి పద్ధతి నవలంబించుటలో నీతఁడు ప్రథముఁడు గాకపోయినను ప్రధానుఁడని యంగీకరింపక తప్పదు. "సకల గ్రంథములను జదువక తెలియునె లక్షణప్రపంచం బెల్లన్" అనియును, "గ్రంథములన్నియు వెదకి వెదకి సారమెల్ల వివరింపంగన్" అనియును దన గ్రంథమునఁ గంఠోక్తిగాఁ జెప్పుటచే నీతని బహుగ్రంథపరిచయము స్పష్టపడక తప్పదు. ఈ గ్రంథమును స్వభావముచేత రెండవజాతివానిలోఁ జేర్పవలసినదేగాని, యాంధ్ర శబ్దచింతామణి నాధారము చేసికొనిన ప్రత్యక్షవ్యాఖ్యాగ్రంథ మగుటచేత నిందే చేర్పవలసి వచ్చినది.

## అహోబలపండితీయము

గాలి నరసయ్య యను పేరుగలిగిన యహోబలపండితుఁడు ఆంధ్రశబ్ద చింతామణికిని, అథర్వణకారికావళికిని గలిపి వ్రాసిన వ్యాఖ్యారూపమయిన గ్రంథము. దీనికిఁ గవిశిరోభూషణ మను నామాంతరము గలదు. ఈతని కాలమునుగూర్చి స్పష్టముగాఁ జెప్ప వీలులేదు. బాలసరస్వతిని, అప్పకవిని తన గ్రంథమునఁ బేర్కొనుటచే నితఁడు 1700 సంవత్సర ప్రాంతమున నుండెనని యూహింప వచ్చును. అప్పకవియు, బాలసరస్వతియు వ్రాసిన సిద్ధుని కథలనుగూర్చి యీతఁ డుపోద్ఘాతరూపమునఁ దన గ్రంథాదిని సంస్కృతశ్లోకములలో వ్రాసెను. ఇరువురికిని రెండు పుస్తకములు లభించిన వనియును, అం దనేక పాఠభేదములు గలవనియును, నందు తాను బాలసరస్వతి పాఠములనే గ్రహించెననియును జెప్పెను.[2] తిరిగి నన్నయభట్టే తన గ్రంథమునకు వ్యాఖ్య వ్రాసికొను నుద్దేశముతోఁ దన రూపముతో జన్మించెననియుఁ జెప్పుకొనియెను.[3] పూర్వవ్యాఖ్యానముల రెండింటి యందును గల న్యూనతలం దెలుపుచుఁ దన వ్యాఖ్య కవసరమును స్థాపించెను. బాల సరస్వతి టీక కేవలము తెలుఁగుమాటలతో నుండి సూత్రభావమునుమాత్రమే

---

[2] మత్స్యేంద్రనామ సిద్ధేంద్రమహిమ్నా సిద్ధతాంగతః। జగ్రాహ వ్యాకృతిం తస్మాత్తవిర్బాలసరస్వతీ॥
ఎలకూచికులాంభోధి శరద్రాకానిశాకరః। సమస్త కవితాదక్షో వత్సరే కీలకాహ్వయే॥
తత్రపంచపరిచ్ఛేదాః శబ్దశాస్త్రే నియంత్రితాః।ఆర్యావృత్తైస్తత్సంఖ్యాసమ్మితాస్యాద్గజైర్గజైః॥
మతంగశైల విప్రేంద్రాదన్యద్వ్యాకృతిపుస్తకమ్। కాకునూర్యప్పకవినాగృహీతం తత్రషడ్గతాః॥
పాఠభేదాస్తు బహవో దృశ్యంతే పుస్తకద్వయే।మయాప్రాయస్సరస్వత్యాః పుస్తకంపరిగృహ్యతే॥
అప్పార్యపుస్తకారూఢ పాఠభేదాద్యదుత్థితం।మయాసంగృహ్యతేరూపంతదప్యాథర్వణోక్తితః॥
[3] ప్రసిద్ధ సారంగధరేన టీకా మపి స్ఫుటీకర్తు మతీవహర్షాత్
వాతూలవంశేఽవతతార భూయః శ్రీనన్నవిద్వా నహమేవ సోఽస్మి॥

చెప్పుటచే శక్తిలేనిదయ్యెను. పండితుల కది తృప్తి యీయఁజాలదు. అప్పకవి టీక శ్లోకముల కిముడనిదై కవులకు సంతోష మీయం జాలదు."[4] ఇంతియగాక యధర్వణకారికలలోని సార మంతయును గ్రహించి తన వ్యాఖ్యానమందుఁ గూర్చి పెట్టెను గావున నా యధర్వణఫక్కికను పండితులు పరిశీలింపవలసిన యవసరము లేదనియుఁ జెప్పెను.[5] అహోబలపతి యనేక శాస్త్రసంప్రదాయముల నెఱింగిన వాఁడు గావున సంస్కృతమునందలి అలంకార, వ్యాకరణ, తర్క, మీమాంసా శాస్త్రముల సాంప్రదాయములను, రహస్యములను దన వ్యాఖ్యానమునఁ జొనిపి సిద్ధాంతముల నన్నిటిని సమన్వయపఱచి విపులగ్రంథమును వ్రాసెను. అనేక స్థలములయందు నన్నయను ప్రథమాచార్యుఁడనియును, అధర్వణుని ద్వితీయాచార్యుఁడనియును దన గ్రంథమునందే పేర్కొనియున్నాఁడు. సంస్కృతవ్యాకరణమును రచించిన పాణిన్యాచార్యుని స్థానమును నన్నయ్యయును, వార్తికములను వ్రాసిన వరరుచిస్థానము నధర్వణుఁడును దెనుఁగు వ్యాకరణమున నధిష్ఠించుట కర్హులని యాతని యభిప్రాయము తేటపడుచున్నది. దానినిబట్టి పాతఞ్జల మహాభాష్యమునకు సమానమయిన భాష్యము తన గ్రంథ మను నుద్దేశముతో నాతఁ డున్నట్లూహింపనగును. విచారణయు, విరచనమును మహాభాష్యఫక్కిక ననుసరించియే చేసినట్లు స్పష్టమగుచునే యున్నది. ఈ వ్యాఖ్యానమునందు విచారణ చేయునప్పుడు మూలసిద్ధాంతములయొక్క స్వరూపమును, స్వభావము నూచముట్టుగ వివరించియే యర్థనిరూపణముఁ జేయుచు వచ్చెను. చింతామణి యభిప్రాయములను బూరించుచును, సవరించుచు నున్న యధర్వణకారికల నా యా సందర్భములయం దొసంగుచు, లక్ష్యముల నిచ్చుచు, నక్కడక్కడఁ గవిప్రయోగములను వివరించుచు నీతఁడు వ్యాఖ్యానమును సాగించెను. చింతామణి, అధర్వణకారికావళి, అహోబల పండితీయము నను మూఁడుగ్రంథములతోడను నాంధ్రవ్యాకరణమునకుఁ బాణిని, కాత్యాయన, పతంజలులు సిద్ధించి రనవచ్చును.

నన్న యాధర్వణుల గ్రంథములకుఁ బయి మూఁడుటీకలును బ్రసిద్ధములును, బ్రశంసనీయములును నయి యున్నవి. తరువాత మఱికొన్ని టీకలు బయలువెడలినవి గాని యవి వీని మార్గమునే యనుసరించినవి.

[4] టీకా బాలసరస్వతీకవికృతా శుద్ధాంధ్రవాగ్గుంభితా।
సూత్రప్రోతపదార్థమాత్రకథనప్రక్షీణశక్తిస్తతః।
క స్తుష్యే ద్భువి పండితః కవివరః కించాత్ర పద్యామితో।
గ్రంథోప్యప్పకవే ర్ముదం దిశతి నో విద్వత్కవీనాం ఘనామ్॥

[5] యస్సారోఽధర్వణగ్రంథే సోప్యత్రైవ విధీయతే,
తేన తత్ఫక్కికాలోకలోలతా త్యజ్యతాం బుధైః.

## కవిజనాంజనము

కిమ్మూరి నరసరాజకృతము. అముద్రితము. ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమున R. No. 521, 322 గా నున్నది. బాలసరస్వతీయము సంక్షేపరూపము గావునఁ దనచే విస్తారముగ వ్రాయఁబడినదని కవి వాకొనియున్నాఁడు. అహోబల పండితునిఁ బేర్కొనినాఁడు. ఆతని యభిప్రాయములను జాలవఱకు వ్రాక్రుచ్చియున్నాఁడు. ఆంధ్రభాషలో నున్నది.

కీర్తిశేషులయిన శ్రీ పాటనంది రామశాస్త్రులవారు ఉద్ద్యోతినీ నామకమయిన టీక నొకదానిని ఆంధ్రశబ్దచింతామణికి వ్రాసి యాంధ్రపత్రికాలయమునఁ బ్రచురించిరి. వావిళ్ళవారు తమ పుస్తకాలయమున నొక టీక నొక పండితునిచే వ్రాయించి ప్రచురించిరి.

## చింతామణి విషయపరిశోధనము

శ్రీ వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రిగారు పయిపేరను చింతామణిలోని కొన్ని సూత్రముల యభిప్రాయములును, పాఠభేదములును, చింతామణి కర్తృత్వమును, అథర్వణకృతికిని నన్నయ కృతికిని గల సంబంధమును వివరించుచు, దీర్ఘ పరిశోధనాఫలితమయిన యొక గ్రంథమును 1931 సంవత్సరములోఁ బ్రచురించిరి

## నారాయణీయాంధ్రవ్యాకరణము అను సన్నయాథర్వణకారికావళి

పయి పేరున చర్ల నారాయణశాస్త్రిగారు నన్నయసూత్రములను, అథర్వణకారికలను జోడించి వానికి సమానార్థకములుగా నాంధ్రమ్మునఁ బద్యములుగా సూత్రములను బ్రచురించిరి. వారి పుత్త్రులయిన చర్ల గణపతిశాస్త్రిగారు పయి పద్యముల కాంధ్రగద్యమున వివరణమును, గద్యరూపమున సూత్రములను రచించిరి. బాల ప్రౌఢ వ్యాకరణములును, బాలసరస్వతీయాది వివరణములును వీరికిఁ బరిచితము లగుట నందలి విశేషాభిప్రాయములను బద్ధతులనుగూడఁ వివరించుట లక్ష్యయుతముగా నీ గ్రంథము వెలయుచున్నది. నేఁటివఱకుఁ బ్రాయికముగా బయల్వెడలిన ప్రామాణికవిచారణలయొక్కయు, విమర్శనములయొక్కయు సార మిందుఁ గలదు. పద్యరూపమయిన లక్షణగ్రంథములయొక్కయు, వివరణరూపములయిన విచారణములయొక్కయు ఫలితములన్నియు నిందుఁ గ్రోడీకరింపవలెనని కవి చాల శ్రమపడి యీ గ్రంథమును రచించెను. లక్ష్యప్రదర్శనమును నిందుఁ జక్కఁగాఁ జేయఁబడినది.

# వి కృ తి వి వే క ము

వికృతివివేకము లేక అధర్వణకారికావళి, త్రిలింగశబ్దానుశాసనము అను పేరుగల రెండు గ్రంథములు అధర్వణవిరచితములుగా మనకు లభించుచున్నవి. వికృతివివేకము అను గ్రంథమునందలి కారికలు తత్పూర్వమగు చింతామణి యభిప్రాయములను సవరించు నభిప్రాయముతో వ్రాయఁబడినట్లు శ్రీ వఝ్ఝల చినసీతారామస్వామిశాస్త్రిగారిచే దేశమునందు బాగుగాఁ బ్రచురింపఁబడినది. ఈ కారికలు స్వతంత్రములుగాని సంపూర్ణములుగాని కావు. అహోబలపతి వ్యాఖ్యానమునందీ కారిక లన్నియు నక్కడక్కడ సందర్భోచితముగఁ బేర్కొనఁబడినవి. ఈ కారికావళిని ద్వితింత్రిణీ సీతారామకవిచే రచియింపఁబడిన కవిజనమండన మను టీకతోఁ గలిపి శ్రీ వఝ్ఝల చినసీతారామస్వామిశాస్త్రులవారి యుపోద్ఘాతముతో వావిళ్ళవారు ప్రచురించిరి. ఈ గ్రంథముయొక్క కర్తృత్వమునుగూర్చియు శ్రీ కం. వీరేశలింగముగారు శంకించిరి. ప్రాయశః ఈ కారికలను అహోబలపతియే వ్రాసి యధర్వణుని పేరు పెట్టియుండవచ్చునని యూహించియున్నారు. ఈ యూహకుఁ గారణ మేమనఁగా నందలి సూత్రములు కొన్ని యాధునికములయిన అకారాంత సంస్కృతీయ సంధియు,[6] శ్లేషకవిత్వమునందలి సఖండ నిర్బిందు సమ్మేళనము[7] మొదలగువానిని సూత్రించెననియు, గ్రంథాంతమున పూజ్యపాదు డయిన యకలంకుని స్మరించెననియు[8], నా యకలంకుఁడు కర్ణాటవ్యాకరణమును సంస్కృత సూత్రములతో వ్రాసి తన కాలమును క్రీ. శ. 1604 తో సమమయిన శకవర్షము 1526 గా వ్రాసికొనె ననుటయే. ఈ గ్రంథము చాల నాధునికమని పంతులుగారి యభిప్రాయము. ఈ యుక్తులు బలమయినవి కావు. కర్ణాటవ్యాకరణము తెనుఁగు వ్యాకరణమున కెట్లు ప్రమాణమగును? అందును కారికావళి శేషగ్రంథముగాని స్వతంత్రగ్రంథము గాదు. కర్ణాటకశబ్దానుశాసనము స్వతంత్రగ్రంథము. ఇఁకఁ గారికలయందుఁ గ్రొంగ్రొత్తగఁ జేర్చబడుచు వచ్చుచుండినను గ్రంథమునకు నష్టము లేదు. అట్లు చేర్పఁబడిన కారికలును గొన్ని యుండిన నుండవచ్చును. ఇంత మాత్రముచేత గ్రంథమునకు నన్యకర్తృత్వము నారోపింప నక్కఱలేదు. బాలసరస్వతికి ముందే కొన్ని కారికలు బ్రచారములో నుండిన ట్లూహించుట కవకాశము లున్నవనియును, నట్టి కారికల యభిప్రాయమునే బాలసరస్వతి తన గ్రంథమున వ్రాసియుండవచ్చుననియు శ్రీ సీతారామశాస్త్రిగారు వ్రాసియున్నారు.[9] పరంపరాయాతముగా వచ్చుచున్న యీ కారికావళి యధర్వణకవికృతము కాదనుటకు హేతువులు స్థాపితములు కాలేదు.

---

[6] క్వచి త్సంస్కృతీయోఽపి ప్రాణోప్యత్ర చ్యుతో భవేత్. అ. కారిక

[7] శ్లేషే సఖండ నిర్బిందో శ్లేషణం క్వచి న్మతమ్

[8] ప్రమాణ మకలంకస్య పూజ్యపాదస్య లః

[9] బాలసరస్వతీయ పీఠిక. పేరా. 6.

త్రిలింగశబ్దానుశాసన మని యొక వ్యాకరణ మథర్వణునిచే వ్రాయఁబడినట్లు ప్రచారమున నున్నది. ఇది ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమున 1245 నెంబరుగా వర్ణింపఁబడియున్నది. 'ఇతి చతుష్షష్టికళాధుర్యాథర్వణాచార్యవిరచితే త్రిలింగ శబ్దానుశాసనే దశమః కాండః' అని తుదిని వ్రాయఁబడియున్నది. తాను తనకుఁ బూర్వములయిన యనేక ఫక్కికలను జూచి బహుమతములను విచారించి వ్రాసినట్లు వ్రాయంబడియున్నది.[10] "అసమగ్రము. పది కాండము లున్నవి. వ్రాత మంచిది కాదు. తప్పు లున్నవి. శైథిల్యము. గ్రంథపాతము చాల హెచ్చు. అనేక దోషము లతో నుండుటచే నీ గ్రంథము సరిగా నర్థమగుటలేదు. కాని యీ గ్రంథమందలి లక్షణములనుబట్టి చూడగ నిది పదునైదవశతాబ్దికిఁ బూర్వపుది గాదని తోఁచు చున్నది" అని సంపాదకులు తుదిని వ్రాసియున్నారు. ఈ గ్రంథస్వరూపమును బాగుగఁ బరిశీలించి విమర్శించి ప్రచురించినంగాని కర్తృత్వము మొదలగు విషయములు తేలవు.

అథర్వణాచార్యకృత భారతమునుండి పద్యములు లక్షణగ్రంథముల నుదాహరింపఁబడినవి. అథర్వణఛందస్సులోనివని రెండు పద్యములనుగూడ శ్రీ వీరేశ లింగముపంతులుగారు ఉదాహరించియున్నారు. ఈ యథర్వణుఁడు తిక్కనకాల ములో ననఁగా 1260 ప్రాంతమున నుండినవాఁ డని పంతులుగారు వ్రాయుచున్నారు.[11]

## ఆంధ్రకౌముది

మండ లక్ష్మీనరసింహాచార్యకృతము. ఈ గ్రంథము సూత్రములు నాగరి లిపియందును, ఉదాహరణములు తెనుఁగక్షరములలోను 1895-వ సంవత్సరమున ఆర్షముద్రాలయమున పి. వి. రంనాథస్వామిగారిచే ముద్రింపఁబడినది. ఇది మండ లక్ష్మీనరసింహాచార్యకృతమనియు, నీతఁడు వేంకటపతిరాయల విద్యాగురు వయిన రామానుజాచార్యులయొక్క ప్రపౌత్రుఁడు ననియు నీ గ్రంథపీఠికయందు

[10] జయతి ప్రసిద్ధం లోకే సర్వలక్షణ లక్షితమ్। శబ్దం త్రిలింగశబ్దానా మధ్వరణక వేః కృతః। శబ్దబ్రహ్మేతి విఖ్యాతశ్చోథయో...।...చతుర్వేద విదాంవరః। కరోమిశబ్దం శబ్దానాం త్రిలింగానాం సలక్షణమ్। బార్హస్పత్యాని సర్వాని కాణ్వం వ్యాకరణం విదన్। నానావిధ ప్రయోగాంశ్చ జ్ఞాత్వా వివిధఫక్కికాః। ఆంధ్రే సంస్కృత మర్యాదాభిజ్ఞైః సాధు విచారితాన్ కరో మ్యాథర్వణం శబ్దం సర్వలక్షితలక్షణమ్। జ్ఞాత్వాబహూని బహుషు బహుధా బహుభి ర్బహు। హేమ చంద్రాదిమునిభిః కథితం చాంధ్రలక్షణమ్। అథ వక్ష్యామి సూత్రాణి ప్రయోగానుసరేణవై। రామఃది ప్రాతిపదికం నామేతిచ నిగద్యతే। కని విన్యాదయస్సర్వే ధాతవశ్చక్రియా స్త్వమీ॥ ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారము కేటలాగు. వా. V పుట 1568.

[11] ఆంధ్రకవుల చరిత్రము, ప్రథమభాగము, పుట 263.

వ్రాయఁబడినది[12]. ఈ వేంకటపతిరాయలు విద్యానగర పాలకవంశజుఁ డనినచో 1614-వ సంవత్సరమున రాజ్యమునకు వచ్చెను. ఆతనితరువాత 60 సంవత్సరములకు (3×20; పురుషము 20 సం.లు) నుండినవాఁడని యూహించినచో 1670 ప్రాంతపువాఁ డనవచ్చును.

పరిభాష, సంధి, అజంతము, హలంతము, కారకము, క్రియ అను నారు పరిచ్ఛేదము లిందు గన్పట్టుచున్నవి. గ్రంథము సంస్కృతసూత్రములలో నున్నది. పాణినీయసూత్రముల పద్ధతిని వ్రాయఁబడినది. అనేకసూత్రములు చింతామణిని, కారికావళిని అనుసరించి వ్రాయఁబడినవియే. తెనుఁగున నుదాహరణములుమాత్రము గలవు. సంస్కృతభాషలో వృత్తి గలదు. కొన్ని మాదిరిసూత్రములు: "అఇఉణ్, పటఙ్, కుర్చ్ కర్మణి, తోడ సహార్థే, తోడుతళ్చ, భూజ్యాదిః పరిణతిః" వైయాకరణసిద్ధాంతకౌముదియందువలెనే యక్కడక్కడ ప్రక్రియకూడఁ జూపఁబడినది.

## హరికారికలు

శిష్టు కృష్ణమూర్తిశాస్త్రిగారిచే వ్రాయంబడినది. (క్రీ. శ. 1790-1870) "గోదావరి మండలమునందలి రామచంద్రపురము తాలూకాలోని గొల్లపాలె మను గ్రామములో 1790-1800 సంవత్సరమునకు నడిమికాలములో జనన మందెను. రామచంద్రపురపు జమీందారగు కాకర్లపూడివారి సంస్థానమునఁ బ్రధానపండితుఁడుగా నుండెను. ఈయన సంస్కృతమున యశోల్లాస మను కావ్యమును, వల్లీపల్లవోల్లాసము, మదనాభ్యుదయము నను భాణములను, రామాయణకథను జెప్పు కంకణబంధమును, హరికారికలను, నీలశైలనాథీయమును, ఆంధ్రమున సర్వకామదాపరిణయమును, వేంకటాచలమాహాత్మ్యమును, వీఱారణ్యమాహాత్మ్యమును, పంచతంత్రమును, వసుచరిత్ర వ్యాఖ్యానమును రచించెను. కాళహస్తిలో, నీయన

[12] శ్లో. కణ్వం శేషం కతి తనుభవం రావణమ్ పుష్పదన్తమ్। విష్ణుం చంద్రం సురగురుమహం సోమచంద్ర న్నమామి॥ ఖ్యాత్వా స్వత్యం రావణీయం కాణ్వమాథర్వణం విదఽకరోమి సారస్వత త్రిలింగశబ్దానుశాసనమ్ ॥ నకులీ శారదా దేవీ కటాక్షామృతవర్ధితః॥ దిగంతర పరివ్యాప్త కీర్తి జ్యోత్స్నా విరాజితః। సుకరో వేంగినాటీయః విష్ణుభక్త స్సుమంత్రవిత్। ధన్యస్సహస్రావధానీ హ్యష్టభాషాసరస్వతీః ॥ శ్రీ కామదేవమిశ్ర ద్విరదదంతావళద్విషః। శ్రీ గోపీనాథమిశ్రేంద్రప్రియమిత్రస్య ధీమతః। శ్రీమతో వేంకటపతిరాయ విద్యాగురోః ప్రభోః। అవతారస్య వాల్మీకే రంశస్య చ బృహస్పతేః। వాక్పతే రుత్తరమణిసార గ్రంథకృతో నిధేః। సతో రామానుజాచార్య దిగ్గజస్య మహాకవేః। ప్రపౌత్త్రో వేంకటాద్ర్యార్య సూరే ర్నప్తా విపశ్చితః। శ్రీ వేంకటాచార్యమణేః పౌత్త్రః కాశ్యపగోత్రవాన్। నాంచారమాంబాతనయ స్సూనుర్వరదయజ్వనః। లక్ష్మీనృసింహసుకవిరాజోఽహం మండవంశజః॥ పూర్వమేవాంధ్రభాషోత్పత్తి ర్భగవద్భిః కణ్వ పుష్పదంత సోమచంద్ర రావణ నిర్జరాచార్యాదిభిః మహర్షిభిః భగవతా వాల్మీకినా చ ప్రోక్తా ప్రాకృతాదిషు—ఆంధ్రకౌముదికే త్రిలింగశబ్దానుశాసన మని నామాంతరము. ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారము కేటలాగు. వా. V, పుట 1544-45.

కును చెన్నపురి శాస్త్రపాఠశాలలో నాంధ్రపండితుఁడైన పరవస్తు చిన్నయసూరిగారికిని, సిద్ధాంతకౌముదిలోని సూత్రవిచారము కొంత నడిచెను. అంతకుఁ బూర్వము కొంతకాలముక్రిందటఁ జిన్నయ్యసూరి బాలవ్యాకరణమును రచించెను. దానితో సరిపోల్పందగిన యాంధ్రవ్యాకరణ మావఱకు వేఱొకటిలేదు. ఇట్లుండగాఁ గృష్ణమూర్తి గారిచేఁ జేయబడిన వ్యాఖ్యానముతోఁగూడిన హరికారిక లనఁబడెడి యాంధ్రవ్యాకరణ సూత్రగ్రంథ మొకటి యటుతరువాత నల్పకాలమునకు వెలువడెను."[13] ఈ హరికారికాగ్రంథము బాలవ్యాకరణ గుప్తార్థప్రకాశికానుబంధముగా శ్రీ కల్లూరి వేంకటరామశాస్త్రిలుగారిచేఁ బ్రచురింపఁబడినది. ఇది కృష్ణమూర్తిశాస్త్రిగారిచే వ్రాయంబడియుండగా దానిని చిన్నయసూరియే తెనిఁగించెనని వీరి యభిప్రాయము.[14] ఇది సరికాదని యనేకులు ఖండించిరి. చిన్నయసూరిగారి గ్రంథము స్వతంత్రమనియే సిద్ధాంతము. అట్టి గ్రంథమును వ్రాయుటకు వా రెంతయు సమర్థు లనుట కనేక ప్రమాణములు గలవు.

## సూత్రాంధ్రవ్యాకరణములు

చిన్నయ్యసూరిగారు నేఁటి యాంధ్రభాషకు మహోపకారమును జేసి బాల వ్యాకరణమును రచించినవారు. వీరు 1806-వ సంవత్సరమున జనించినట్లును, 1842-వ సంవత్సరమున నీ సూత్రాంధ్రవ్యాకరణమును రచియించినట్లును స్పష్టముగాఁ దెలియు చున్నది. ఆంధ్రసాహిత్యపరిషత్తున నియ్యది 27-వ సంఖ్యగాఁ బ్రచురింపబడినది. (1) సంస్కృతసూత్రాంధ్రవ్యాకరణము, (2) ఆంధ్రశబ్దానుశాసనము అను తెనుఁగుసూత్రములును, (3) పద్యాంధ్రవ్యాకరణము అను పేరను బయి సూత్రాదికము నభిప్రాయమే పద్యములలో నున్నది. ఈ మూఁడును నందుఁ గలవు. గ్రంథరచనా కాలమును స్పష్టముగా గ్రంథాంతమున వ్రాసిరి. వీరు శాత్తాద (సాతాని) వైష్ణవ సంప్రదాయములోనివారు. మదరాసు ప్రెసిడెన్సీ కాలేజీలోఁ దెనుఁగుపండితులుగా నుండెడివారు. ఈ సంస్కృతసూత్రాంధ్రవ్యాకరణములు సంజ్ఞ, సంధి, అజన్తము, కారకము, సమాసము, తద్ధితము అను ప్రకరణములుగా విభజింపఁబడియున్నవి. సూత్రములన్నియుఁ బాణినీయసూత్రఫక్కినే యనుసరించుచున్నవి. అక్కడక్కడ చిన్నచిన్న వృత్తియు నత్యల్పముగా నీయంబడినది. ఈ సూత్రములన్నియును చింతామణి, కారికావళి అనువానిపై నాధారపడినట్లు స్పష్టపడుచుండును. ఈ క్రింది సూత్రములను మాదిరిగాఁ బరిశీలింపనగును. "సిద్ధిర్లోకతః, ఏషావికృతిః, అచఃప్రాణాః, నాచి, ఉతఃసుపోవా దీర్ఘస్యనామ్నో హ్రస్వః, అపయః ప్రకృతేస్సః, ఒరుస్సమానాధి కరణే సమాసేపూర్వస్య."

[13] వీరేశలింగముగారి ఆంధ్రకవుల చరిత్రము III భాగము, పుట

[14] బాలవ్యాకరణ గుప్తార్థప్రకాశిక, అనుబంధము.

పయిని నిరూపింపఁబడిన వ్యాకరణములన్నియును చింతామణి వికృతి వివేకముల నాధారముగాఁ జేసికొనినవే. కొన్ని వ్యాఖ్యారూపములు. కొన్ని వివరణ రూపములు. మఱికొన్ని వానియర్థమునుమాత్రమేగాక రూపమును, శైలిని, ప్రణాళికనుగూడ ననుకరించినవియే యని స్పష్టపడుచునేయున్నవి. సంస్కృతమున నున్న పాణిని సూత్రములు, వరరుచి వార్త్తికములు, పతంజలి మహాభాష్యము, కాశికావృత్తి, భట్టోజీదీక్షితుల వైయాకరణ సిద్ధాంతకౌముది యను గ్రంథములే వీని రూపమునకు **మూలములు.**

## రెండవజాతి గ్రంథములు

వీనికిని సంస్కృతమూలములు గలవు. భామహుని కావ్యాలంకారము, వామనుని కావ్యాలంకారసూత్రములు, వృత్తి, దండి కావ్యాదర్శము మొదలయిన గ్రంథములను సంస్కృతములోఁ జదివి తెనుఁగున కావ్యవిచారము, అలంకారలక్షణము, ఛందస్సు, వ్యాకరణము అను వీనినెల్లను కొంచెము గొంచెముగాఁ బద్యబంధముగాను, జంపూరూపముగాను వ్రాయనుద్దేశముతో బయలుదేరిన గ్రంథములు. కవికి పరికరములన్నియు నుండవలసినవి గావున వాని నన్నిటి నొక్క గ్రంథముగా వ్రాసి కవులు గాబోవువారికిఁ బఠనీయములుగా నుంచవలయు నను నుద్దేశమీ కర్త్తల యందు స్పష్టపడుచున్నది. ఈ గ్రంథములలోని వ్యాకరణప్రకరణములు చాల నల్పములును, నసంపూర్ణములును నయియున్నవి. అట్టివాని నీ క్రింద నుదాహరించుచున్నాను.

## ఆంధ్ర భాషా భూషణము

ఇది తెనుఁగునకు మొట్టమొదట వ్రాయంబడిన చిన్న పద్యరూపాంధ్ర వ్యాకరణము. ఇది న్యాయముగా కావ్యవిచారాదికమును చెప్పు లక్షణగ్రంథములలోఁ జేర్పఁదగినది కాకున్నను పద్యరూపమగుటచే నిందు జేర్చితిని. సుమారు రెండువందలు కందములు, గీతములు, సీసములు గలది. కావ్యాలంకారచూడామణిలోని నవమోల్లాసము (వ్యాకరణభాగము) మాత్ర మెంతయుండునో యిదియు నంతియ యుండును. ఈ చిన్నిగ్రంథమును వ్రాయుచుఁ దత్కర్త్తయగు కేతన తెనుఁగునకు మున్నెవ్వరు నెన్నడును లక్షణము వ్రాయలేదనియును, దానే క్రొత్తగ వ్రాయుచున్నాననియును నుపోద్ఘాతమున వ్రాసెను.[15] దీనినిబట్టి యాంధ్రశబ్ద

[15]క. మున్ను తెనుఁగునకు లక్షణ, మెన్నఁడు నెవ్వరును జెప్ప రేఁ జెప్పెద వి
ద్వన్నికరము మది మెచ్చగ, నన్నయభట్టాది కవిజనంబుల కరుణన్.

తే. సంస్కృత ప్రాకృతాది లక్షణముఁ జెప్పి, తెనుఁగునకు లక్షణముఁ జెప్పకునికి యెల్లఁ
గవిజనంబుల నేరమిగాదు నన్ను, ధన్యుఁగావింపఁదలఁచిన తలఁపుగాని.

క. భాషావేదులు నను విని, యా షణ్ముఖ పాణినులకు నగు నెన యని సం
తోషింప నాంధ్రభాషా, భూషణ మను శబ్దశాస్త్రమును రచియింతున్.

చింతామణి నీతఁడు చూడలేదని తోఁపక తప్పదు. ఆంధ్రకౌముదియందును గణపవరపు వేంకటకవి (క్రీ. శ. 1750) సంస్కృత ప్రాకృతములకు లక్షణములు వ్రాసి తెనుఁగున కావిధమున లక్షణము వ్రాయకుండుట తన్ను ధన్యుఁజేయుఁ నుద్దేశమున నని వ్రాసెను. (చూ. చింతామణి విషయపరిశోధనము : 51 వ పేరా). అంతమాత్రమున నంతకుముందు లక్షణగ్రంథములు లేవని చెప్ప వీలులేదుగదా! ఇదియు నట్టిదే కావచ్చునేమో యని యభిప్రాయము.

చింతామణి సంస్కృతసమశబ్దశాసనప్రధానమనియుఁ, దరువాతి భాషా భూషణాదులు అచ్ఛికశబ్దసాధనప్రధానములు ననియును విషయపరిశోధనమునఁ బేర్కొనఁబడినది. ఈ యభిప్రాయము సత్యమనుటలో సందియము లేదు. ఉభయ కవిమిత్రుఁ గవితఁజెప్పి మెప్పించియున్నానని కేతన వ్రాసియుండుటచేత నతనితో సమకాలికుఁ డయినవాఁ డగుట నీతఁడును సుమారు 1250-వ సంవత్సరమున నుండినట్లు వీరేశలింగముపంతులుగా రభిప్రాయపడుచున్నారు. అల్పమయినను, అసంపూర్ణ మయినను నీ గ్రంథము తెనుఁగు వ్యాకరణముయొక్క వివిధభాగములను స్పృశించి యున్నదనుట ప్రశంసార్హము.

## కావ్యాలంకారచూడామణి

విన్నకోట పెద్దనకృతము. విన్నకోట పెద్దన విశాఖపట్టణము జిల్లాలోని యెలమంచిలి తాలూకాలోఁ బాలించిన విశ్వేశ్వరభూపుని కీ గ్రంథమును కృతి యిచ్చెను. ఈతఁడును ఆ మండలమువాఁడే యని యూహింపనగును. పయి తాలూకా లోని పంచధారల యను గ్రామమునొద్ద వేయఁబడిన శాసనములో విశ్వేశ్వర భూపునిచేఁ జేయంబడిన యుద్ధము (శక సం. 1329. క్రీ. శ. 1407) ప్రశంసింపఁ బడినది. ఆ యుద్ధవిషయమునుగూర్చి శ్లేషగాఁ గావ్యాలంకారచూడామణి 7 వ యాశ్వాసమున 41 వ పద్యమునఁ గవి సూచించియున్నాఁడనియును, ఈ గ్రంథము క్రీ. శ. 1404 న వ్రాయంబడి యుండవచ్చుననియును సిద్ధాంతము.[16] ఈ గ్రంథము వేదము వేంకటరాయశాస్త్రులవారిచేతను, వావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రులవారిచేతను, ఆంధ్రపరిషత్పత్రికాధిపతులచేతను వేర్వేఱుగాఁ బ్రచురింపఁబడినది. ఇందుఁ దొమ్మిది ఉల్లాసములు కలవు. విద్యానాథుని ప్రతాపరుద్రయశోభూషణమును (క్రీ. వె. 1300), విశ్వనాథుని సాహిత్యదర్పణమును (క్రీ. వె. 1350) గూడఁ దిలకించి తన గ్రంథము నీతడు వ్రాసియుండనోపు. విభావాదులు, రసభేదములు, నాయకాది భేదములు, కావ్యభేదములు, అలంకారములు, దోషములు, ఛందస్సు మొదలగువాని నెల్లను మొదటి యెనిమిది యాశ్వాసములను జక్కగా రచియించెను. ఇది

[16] చూ. ఎపి. ఇం. వాల్యూము XXV, పుట 335—336. మల్లంపల్లి సోమశేఖరశర్మ గారు. భారతి వాల్యూము V, భాగము 2 (1928), పుట 489.

తెనుఁగునఁ గల లక్షణగ్రంథములలోఁ బ్రాచీనమును, బ్రశంసనీయమును నయి యున్నది. నవమోల్లాసమున వ్యాకరణభాగమును రచియించెను. సంజ్ఞా, తత్సమ, సంధి, విభక్తి, తద్ధిత, క్రియాప్రకరణముల నీ యుల్లాస ముల్లసిల్లుచున్నది. ఇందలి లక్ష్య లక్షణములు కవికృతములే కాని యన్యగ్రంథోద్ధృతములు గావు.

## కవిలోకచింతామణి

వెల్లంకి తాతంభట్టువిరచితము (ప్రాచ్యలిఖితగ్రంథభాండాగారము కేటలాగు పుట 1597, నెం. 1278). దీనినిగుఱించి సంపాదకు లిట్లు వ్రాసిరి : "కవిచింతామణి యని, కావ్యానుశాసన మని పేళ్లుగల యీ కావ్యలక్షణగ్రంథము వెల్లంకి తాతంభట్టు అను కవివరునిచే రచింపఁబడినది. ఇందు భాషాలక్షణాధికారము, వర్ణనిర్ణయాధి కారము, వళిప్రాసాధికారము, దోషాధికారము అను నా ల్గధికారములు సంపూర్ణముగఁ గలవు. ఇంకను కొంత గ్రంథము ఉండవలెను. ఇందు దండి, భామహుల గ్రంథ ముల ననుసరించియుఁ, బ్రాచీనాంధ్రకవుల రచనాసంప్రదాయముల ననుసరించియుఁ గావ్యలక్షణము, వ్యాకరణము చెప్పఁబడినది. పిల్లలమఱ్ఱి పినవీరనవఱకును గల కవుల రచన లిందు లక్ష్యములుగాఁ గైకొనఁబడినవి. అధికారాంతములయందు కవి బిరుదగద్యములు భిన్నములుగా నున్నవి."

గద్యలు - ఇది యష్టభాషావతార వెల్లంకి తాతంభట్టు ప్రణీతంబైన కవి చింతామణి యను కావ్యానుశాసనంబున భాషాలక్షణాధికారము.

ఇది శబ్దవర్ణనీయ వెల్లంకి తాతంభట్టు.........వర్ణనీయాధికారము.

ఈ కవిని పేర్కొన్నవారియొక్కయు, ఈ కవి పేర్కొన్నవారియొక్కయు కాలనిర్ణయమునుబట్టి యీతఁడు క్రీ. వె. 1500 సం. నుండినవాఁడని యూహింపనగును.

## కవిజన సంజీవని

ముద్దరాజు రామనకృతము. ఈ గ్రంథము వావిళ్ళవారిచే 1930-వ సంవత్సర మునం బ్రకటింపఁబడినది. ఈ కవికి ముద్దరాజు రామభద్రకవి యను నామాంతరము గలదు. ఈ కృతికే కవిజనసంజీవని, కవిలోకసంజీవని, కవిసంజీవని యని నామాం తరములు గలవు. ఇందు నాలుగు ప్రకరణములు గలవు. 1. యతిప్రాసప్రకరణము, 2. శబ్దప్రకరణము, 3. సమాసప్రకరణము, 4. సంధిప్రకరణము. ప్రథమ తరంగము పుస్తకమునందు సగముకంటె నధికము. మిగిలిన మూఁడును నత్యల్పములు. ప్రాచీనలాక్షణికులు గనిపట్టిన లక్షణములనే యక్కడక్కడ లక్ష్యములతో నొసం గెను. "శాబ్దికస్తవనీయ కైయట ముఖ్య శబ్దవిద్యానిరూఢి", "కవిస్తోమ స్తుతానేక నాటకాలంక్రియాపాటవంబు" గలవాఁడ నని చెప్పుకొని యున్నాఁడు. ఈ యల్పగ్రంథమునం దా పాండిత్యప్రయోజనమున కవకాశ మంతగాఁ గనుపట్టదు.

ఇతఁడు ఆముక్తమాల్యదనుండియు, మనుచరిత్రమునుండియు ననేక లక్ష్యముల నొసంగి యుండుటవలన 1550 సం. నకుఁ దరువాతివాఁ డనక తప్పదు. అప్పకవికి ముందువాఁడు గావున 1550—1600 నడిమికాలమున నుండినవాఁ డనవచ్చును.

## సర్వలక్షణసారసంగ్రహము

క్రీ. శ. 1740. కూచిమంచి తిమ్మకవికృతము. ఇందు మూఁడాశ్వాసములు గలవు. మూఁడవది రేఫ అకార నిర్ణయప్రకరణము. ద్వితీయమున ప్రాసవళినిర్ణయమును, శబ్దప్రకరణమును గలవు. ఇందుఁ గొన్నిశబ్దముల స్వరూపమును, నర్థవిశేషము లును వివరింపఁబడినవి. తెనుఁగుభాష స్వరూపము, వర్ణము, సంధి, విభక్తి యను భాగములు గలవు. ఇం దా యా విషయములను లక్ష్యలక్షణ సమన్వయ పూర్వకముగ నిరూపించెను. లక్ష్యములు ప్రాచీన ప్రామాణికకవుల ప్రయోగ ములే యీయఁబడినవి. ఈతఁడు క్రీ. శ. 1690—1760 వఱకును నుండెనని శ్రీ వీరేశలింగముపంతులుగారు వ్రాయుచున్నారు. ఈతఁ డీ లక్షణగ్రంథమును మాత్రమేగాక మఱి 9 గ్రంథములను, ప్రబంధాదికమును రచియించెను. 1. రాజ శేఖరవిలాసము, 2. రసికజనమనోభిరామము, 3. అచ్చతెనుఁగు రామాయణము, 4. నీలాసుందరీపరిణయము మొదలగునవి. ఈతఁడు గోదావరీ మండలమునందలి పిఠాపుర సంస్థానమునందలి కందరాడ యను గ్రామమునకుఁ గరణము. ఈతని గ్రంథములలో నెనిమిదవదగు సర్వలక్షణసారసంగ్రహము క్రీ. శ. 1740-వ సం.కు సరియగు శా. శక సంవత్సరము 1662 న ముగించిన ట్లందే వ్రాసికొనియున్నాఁడు.

## ఆంధ్రకౌముది — గణపవరపు వేంకటకవి

ఇది ఆంధ్రసాహిత్యపరిషత్తువారిచే 36-వ సంఖ్యగాఁ బ్రకటింపఁబడినది. ఇది యొక సీసమాలిక. సుమారు వేయిచరణములు గలది. సర్వలక్షణశిరోమణి యను గ్రంథమునందలి వ్యాకరణభాగ మీ గ్రంథము. ఈ సర్వలక్షణశిరోమణి లోని యొక్కొక్క (భాగమునకే) యుల్లాసమునకే భిన్నములయిన పేళ్ళు పెట్టి కవి వెలయించెను.[17] ఆంధ్రనిఘంటువు, గణ యతి ప్రాస లక్షణము, నిఖిల రేఫ అకార నిర్ణయపద్ధతి, షట్ప్రత్యయప్రస్తారము, అలంకారములు, కావ్యలక్షణము,

[17] శ్రీకరమ్ముగను సంస్కృతమునకును బ్రాకృతమునకునుఁ గల లక్షణములు చెప్పి తెనుఁగున నా విధమ్మున లక్షణము చేయరాకున్కి యదియు నేరంబుగాదు తొల్లిఁటి సుకవుల కెల్లను నను ధన్యుఁ గావించ తలఁపింతెకాని ‘యనుచుఁ గుకవిజనాజ్ఞానఘోరాంధతమసముఁ బోఁగొట్టఁగల్గు కౌముదివిధాన, నిల మున్ను తెలుఁగున నెవ్వా రెఱుంగని యాంధ్రకౌముది యనునట్టి కృతిని సీసమాలికగాఁగఁ జేసితి నిపు డున్న కవులకు రానున్న కవులకెల్ల నుపకారముగ నిది యెపుడు నాచంద్రతారార్కమై కౌముదియటుల వెలయు. ఆంధ్రకౌముదియొక్క యవతారిక. ఇట్లు వ్రాయుట లాక్షణికుల కభ్యాసమయినదిగాఁబోలును.

రసవిచారము మొదలగు విశేషము లనేకము లీ గ్రంథమునఁ జేర్పఁబడినవి. ఈ వ్యాకరణభాగమున ననేకములయిన వ్యాకరణవిషయములు పూర్వకవులును, లాక్షణికులు నుదాహరించినవానినే కవి వ్రాసియున్నాఁడు. ఇతఁడు ప్రబంధరాజ వేంకటేశ్వరవిజయవిలాస మను ప్రబంధమును వ్రాసియున్నాఁడు. ఈ కవి చిత్ర బంధ కవిత్వములయం దసమానప్రజ్ఞ కలవాఁడు.

ఈతని నివాసము గణపవర మని యుపోద్ఘాతమున వ్రాయఁబడినది. ఈతఁడు పేర్కొనిన లాక్షణికులను, కవులనుబట్టి యీతఁడు 18-వ శతాబ్దమున నుండినవాఁడని యూహింపవచ్చును. (క్రీ. శ. 1750) ఈతఁడు "కర్ణాట తుండీర చోళ పాండ్యమండలప్రముఖాఖిలమండలాఖండదత్త" బహువిధ పారితోషికములు గలవాఁడు. ఈతఁడు విజయరంగచొక్కనాథునికాలమున నుండినవాఁడేమో యని తోఁచుచున్నది, యని పరిష్కృతగ్రంథ ప్రశంసాకారుని యూహ.

## ఆనందరంగరాట్ఛందము

కస్తూరిరంగకవి కృతము. నాలుగాశ్వాసములు గల గ్రంథము. కేవలము ఛందోవిషయములను దెలుపు నుద్దేశముతో వ్రాయఁబడినది. చతుర్థాశ్వాసమునఁ గొంతభాగమువ్యాకరణ విషయములను నిరూపించుచున్నది. "ఇతఁడు సాంబనిఘంటువు, కృష్ణార్జునసంవాద మనియెడి యైదాశ్వాసముల కావ్యమునుగూడ రచియించెను. ఇతఁడు 1790-వ సంవత్సరప్రాంతములయందు తంజావూరు సంస్థానమున నుండినవాఁడు" అని వీరేశలింగముపంతులుగారు వ్రాయుచున్నారు. ఈతఁడు తన ఛందోగ్రంథమును ఆనందరంగపిళ్ళెగారి కంకితముచేసెను. ఈ యానందరంగపిళ్ళె యనునాతఁడు పుదుచ్చేరిలో చాలకాలము ఫ్రెంచివారికి దుబాషుగా నుండి గౌరవ కీర్తుల నెనసినవాఁడు. ఈయన (1736-1761) తన దైనికచర్యను వ్రాయుచు నా కాలమునందలి రాజచరిత్రను దేశచరిత్రమును దెలుపుడుచేసెను.[1] కాఁబట్టి యీతఁడుకూడ 18-వ శతాబ్ది రెండవభాగమున నుండిన ట్లూహింపఁదగును.

## కవిసంశయ విచ్ఛేదము

అడిదము సూరకవిరచితము. ఇది వ్యాకరణవిషయము ప్రధానముగాఁ గలిగిన పద్యగ్రంథము. దీనియందు రసాది కావ్యవిచారము లేదు. ఇందు మూఁడు తరంగములు గలవు. తృతీయము తద్భవప్రకరణము. కవి తద్భవముల యొక్కయు, వాని ప్రకృతుల యొక్కయుఁ బట్టిక నొసంగెను. ధ్వను లెట్లు తద్భవములయందు మారునో సూత్రరూపమున నిరూపించెను. ఇది యెంతయును బ్రశంసార్హము. ప్రాచీనము

[1] *Dairy of Anandaranga Pillai* by C. S. Srinivasachari.

లయిన ప్రాకృతవ్యాకరణముల పద్ధతి యిం దవలంబింపఁబడినది. ప్రథమ, ద్వితీయ తరంగములయందు లక్షణవిశేషములనే చాలవఱ కుదాహరించి పూర్వకవులనుండి ప్రయోగముల నొసంగెను. పూర్వులు వ్రాసిన లక్షణములనే తిరిగి తిరిగి వ్రాయక, తనకుఁ దోఁచిన విశేషములనుమాత్రము చెప్పుట మిక్కిలి ప్రశంసనీయమగు మార్గము. ఈతనియందు స్వతంత్రతాబుద్ధి గలదు. ఈతఁడు క్రీ. శ. 1720-1780 వఱకును జీవించియుండెనని అడిదము రామారావుగారు వ్రాయుచున్నారు. ఈతఁడు విశాఖపట్టణముజిల్లాలోని విజయనగరమున కైదుమైళ్ళ దూరమున నున్న రేగ యను గ్రామమునకుఁ జెందినవాఁడు. ఇతఁడు చంద్రమతీపరిణయ మను నామాంతరముగల కవిజనరంజనమును, ఆంధ్రాలోకమును (భాషాంతరీకరణము), ఆంధ్ర నామశేష మను నిఘంటువునుగూడ రచియించెను.[19]

## మూఁడవజాతి గ్రంథములు

మూఁడవజాతికిఁ జేరినవి సూత్రరూపమున నాంధ్ర గద్యమున వ్రాయఁబడిన వ్యాకరణములు. ఇదియే తెనఁగున కుపయోగపడెడు స్వరూపము. తెనుఁగు వ్యాకరణములు సంస్కృతమున రచియింపఁబడినవి తద్భాషానభిజ్ఞులకు నిరుపయోగములు. తెనుఁగునకుఁ బ్రాధాన్యము గలుగుకొలఁదిని వానికిఁ బ్రచారము తగ్గిపోవుచున్నది. పద్యము గణబద్ధ మగుటవలన పాదపూరణాదికమునకుఁ బొల్లు పదములు వేయుటయుఁ, గొన్నిస్థలములయం దర్థవైశద్యమును, శబ్దసౌలభ్యమును దొలఁగిపోవుటయు సంభవింపక తప్పదు. ఈ స్థితి యర్థబోధకును స్పష్టతకును బ్రతిబంధకము గాఁబట్టి పద్యవ్యాకరణములు హృద్యములుగాని యనవద్యములుగాని గాకుండెను. కాఁబట్టి పయిరూపమే తెనుఁగునకు శరణ్యమును గణ్యమును నయి యున్నది. ఈ పద్ధతిని వ్రాయంబడిన గ్రంథములలో నాద్యమును బ్రధానమును బాలవ్యాకరణము.

## బాలవ్యాకరణము

ఇది చిన్నయసూరిగారిచే వ్రాయంబడిన గ్రంథము. ఈయననుగుఱించి యింతకుముందే వ్రాసియున్నాను. నేఁటి యాంధ్రవ్యాకరణరచనాశక్తికిఁ బితామహుఁ డితడే. పయినిఁ జెప్పఁబడినట్లు తెనుఁగుగద్యమున సూత్రరూపమున వ్రాయంబడుటవలనమాత్రమేగాక, సూత్రముల సౌష్ఠవమునను, గ్రంథగౌరవమునను బాలవ్యాకరణ మనంతరవ్యాకరణములకెల్లను బునాది యైనది. దానికిఁ బ్రచారమును, బ్రామాణ్యమును నేర్పడినవి. ఈయనకు ముం దుండిన చింతామణిని, కారికలనుగూడఁ జక్కగా నీయన యుపయోగపఱచుకొనెను. తక్కిన గ్రంథ

---

[19] అడిదము సూరకవి, పుట 7. అడిదము రామారావుగారి ప్రచురణము,

ములమాట చెప్పనక్కఱలేదు. ఇది మిక్కిలి సుప్రసిద్ధమగుటచే దీనినిగూర్చి విశేషము వ్రాయలేదు. చిన్నయసూరిగారు వ్రాసిన యాంధ్రశబ్దానుశాసనము అను గద్యసూత్రాంధ్రవ్యాకరణమును, బద్యాంధ్రవ్యాకరణమును గలవు. అవి పరిషత్పత్రికాధిపతులచేఁ బ్రచురింపఁబడినవి.

## ప్రౌఢవ్యాకరణము

ఇది శబ్దరత్నాకరమును వ్రాసి కీర్తిగడించిన శ్రీ బహుజనపల్లి సీతారామాచార్యులుగారిచే రచియింపఁబడినది. వీరు మదరాసులోని గవర్నమెంటు నార్మలు స్కూలులోఁ బండితులుగాఁ బనిచేసిరి. వీరిచే వ్రాయంబడిన శబ్దరత్నాకరము చెన్నపట్టణపు దేశభాషాగ్రంథకరణసభవారిచే 1912-వ సంవత్సరమున ముద్రింపించి ప్రచురింపఁబడెను. అంతకుముందు చాలకాలమునకే యీ నిఘంటువు పూర్తియయి యుండవలెను. ఈ గ్రంథము వ్రాసినతరువాతనే వీరు ప్రౌఢవ్యాకరణమును వ్రాసిరని వీరి గ్రంథపీఠికనుబట్టి తెలియును. వయసు వీరికి అఱువది దాటినతరువాత వ్రాసిన గ్రంథ మియ్యది. "తుద కిప్పుడు తద్భారతాది గ్రంథపరిశోధనంబుచే దొరకిన విశేషలక్షణప్రయోగముల నేర్చి కూర్చి త్రిలింగలక్షణశేషం బను నొక యపూర్వవ్యాకరణమును దీని వ్రాసితిని. ఇందలి లక్షణము లసాధారణములనియు, నియ్యది విద్యార్థుల కత్యంతోపకారకమనియు మంచిమనసుతోఁ బరికించువారి కెల్లఁ జక్కఁగాఁ దెల్లము కాఁగలదు." ఈ గ్రంథమునుగూర్చి వీరు వ్రాసికొనిన దెంతయు సత్యము. బాలవ్యాకరణముయొక్క ప్రయోజనమును, బ్రామాణికత్వమును గ్రహించి యందు గతార్థమయినదానిని విడిచి దానికి సవరణరూపముగా నీ గ్రంథమును వ్రాసిరి. ఇం దనేకములయిన లక్షణవిశేషములు కూర్పఁబడి యున్నవి. బాలవ్యాకరణముచేత సాధింపరానివియును, భారతాది గ్రంథములలోఁ గల విశేషప్రయోగములును నిందు సంగ్రహింపఁబడినవి. చింతామణికిని, గారికలకును నెట్టి సంబంధము గలదో యట్టి సంబంధమే యీ రెండు వ్యాకరణములకుఁ గలదు. దీనికిఁ ద్రిలింగలక్షణశేష మను పేరు పెట్టుటలోనే యిది శేషగ్రంథ మనుట నిశ్చితము. సీతారామాచార్యులుగారును చిన్నయసూరిగారును సమకాలికులును నేకపత్తనవాసులును నయి యుండిరి. సూరిగారినిగుఱించి యనేక ప్రశంసావాక్యములను ఆచార్యులుగారు వ్రాసిరి.

## బాలవ్యాకరణ గుప్తార్థప్రకాశిక

ఇది కల్లూరి వేంకట్రామశాస్త్రిగారిచే వ్రాయంబడిన విపులమయిన వ్యాఖ్య. ఇం దనేక విశేషములు సంగ్రహింపఁబడి, సంస్కృతవ్యాకరణమర్యాదలు, ప్రయోగములు సమన్వయింపఁబడినవి. వీరి పాండిత్యమును, బరిశ్రమయుఁ బాఠకులకెల్ల విశదముగాక తప్పదు.

శ్రీ వీరేశలింగముపంతులుగారు వ్రాసిన సంగ్రహవ్యాకరణమును, వావిలికొలను సుబ్బారావుగారు వ్రాసిన సులభవ్యాకరణమును, తా. వెంకయ్య వ్యాకరణమును, కుప్పుణ్ణయ్యంగారిచే వ్రాయంబడిన సర్వలక్షణసారసంగ్రహమును ఇంక ననేకములు గలవుగాని గ్రంథవిస్తరభీతిచేత వాని నుదాహరింపలేదు. ఇప్పటికి వ్యాకరణరచనా క్రమమునకు ముఖ్యపద్ధతిగా నేర్పడిన గద్యాంధ్రవ్యాకరణములలో బాల, ప్రౌఢములు ముఖ్యములేగాక, నిరుపమానంబులును ప్రామాణికంబులును నగుటచేతను, వానికే యధికప్రచారము కలిగియుండుటను వానినిమాత్రము ముఖ్యముగా నుదాహరించితిని గాని యితర వ్యాకరణములుగూడ నక్కడక్కడఁ గ్వాచిత్కములుగా నుదాహరింపఁ బడును. నవ్యులు వ్రాసిన యనేకవ్యాకరణములను బేర్కొనుట కిచట తావు లేదు. కారణ మేమనఁగా పయిచరిత్రము అభివృద్ధియొక్క మార్గమును సూచించునది గాని సర్వస్వము గాదు.

## నాలుగవజాతి గ్రంథములు

నాలుగవజాతి నాంగ్లభాషయందు ఆంధ్రభాషాధ్యేతలకొఱకయి వ్రాయం బడినవి. ఆంగ్లేయులు మనదేశమునకు వచ్చి మనభాషను పఠించుటకొఱకు యత్నముచేయఁగా నట్టివారి సదుపాయముకొఱకు వ్రాసిన గ్రంథములగుట నవి యా భాషయందే కలవు. ప్రప్రథమమున సివిలు సర్వీసు ఉద్యోగి యగు ఎ. డి. కాంబెలుదొరగారు 1816-వ సం. న నొక తెనుఁగువ్యాకరణమును, దరువాత 1817-వ సం.న మామిడి వెంకయ్యగారి సాయమున సి. పి. బ్రౌనుదొరగా రొక వ్యాకరణమును, ఆర్డెనుదొరగారు 1873-వ సం. న నొక వ్యాకరణమును వ్రాసిరి. దేశమునందలి తెనుఁగుపండితుల కియ్యవి యుపయోగకరములు గాకున్నను, వ్యాకరణచరిత్ర విషయమున వీనికి మిక్కిలి ప్రాముఖ్యము గలదు.

ఈ గ్రంథములు వ్రాసినవా రాంగ్లభాషావేత్తలు. ఆంగ్లవ్యాకరణజ్ఞానము కలిగిన పరిణతబుద్ధు లయిన వారికొఱకు ఈ గ్రంథములను వ్రాసియున్నారు. సంస్కృతాంధ్రభాషలయొక్క సంబంధము నెఱుఁగక హైందవనాగరకతతోను, శాస్త్రీయాభిప్రాయములతోడను నియత సంబంధములేక యాంగ్లదేశమునఁ బెఱిగిన యాంగ్లవ్యాకరణప్రణాళిక ననుసరించి యీ గ్రంథములు వ్రాయఁబడియుండుటచే నొక భాషాపద్ధతి యింకొకభాష కెట్లు సరిపడునో, యెట్లు సరిపడదో తెలిసికొనుటకు సాయపడుచున్నవి. ఇందలి పారిభాషికపదములు, వాక్యవిభజనము, పద పదార్థ వివేకము మొదలగునవి మిక్కిలి నవ్యమార్గము ననుసరించియుండును.

## ఐదవజాతి గ్రంథములు

ఇతర ద్రావిడభాషాజ్ఞానమువలనను, చరిత్రజ్ఞానముతోఁ గూడిన రూప పరిణామవివేకమునను వ్రాయంబడిన వ్యాకరణము లీ జాతికిఁ జేరినవి. ఈ రీతిని

వ్యాకరణములు వ్రాయుటగాని, ప్రయత్నము సాగించుటగాని ఆంగ్లమునందలి భాషాచరిత్రను బోధించు గ్రంథములయొక్క సంస్కారమువలననే కలిగినది. పాశ్చాత్యులకు హిందూదేశముతోడి సంపర్కమువలన సంస్కృతభాషాజ్ఞాన మలవడినది. దానివలన నైరోపీయభాషలకును, సంస్కృతమునకును గల సంబంధము బోధపడి భాషాసంబంధనిర్ణాయకశాస్త్ర మొకటి క్రొత్తగా బయల్వెడలినది. అట్లు బయలుదేరుటవలనఁ బ్రపంచమున నున్న భాష లన్నియుఁ గొన్నికుటుంబములుగా విభజింపఁబడుటయు, భాష కాలక్రమమున మాఱుచుండునని తెలియుటయు జరిగినది. ఆ సంస్కారము గలిగి యనేకభాషలును, వ్యాకరణములును నెఱింగిన కొందఱు పండితులు క్రైస్తవమతబోధనకై యీ దేశమునకు వచ్చి తెనుఁగు మొదలగు దేశభాషలను దేశీయపండితసాహాయ్యమునఁ బఠించుట యేర్పడినది. వారును, వారివంటి యితరులును బహుభాషాసంబంధబోధకము లయిన వ్యాకరణములను వ్రాయుట ప్రారంభమయినది. అందు ద్రావిడభాషలకుఁ గల సంబంధమును గనిపెట్టి యవి యన్నియును ఏకభాషాజాతములని నిర్ణయించి ద్రావిడభాషాసామాన్యమునకు వ్యాకరణమును మొట్టమొదట బిషప్పు కాల్డ్వెల్లుగారు 1856-వ సంవత్సరమున నాంగ్లమున వ్రాసి ప్రచురించిరి. తిరిగి పెంచి వ్రాసి 1875 లో ముద్రింపించిరి. 1913-వ సంవత్సరమున నయ్యది తిరిగి ముద్రింపఁబడినది. ఆ మహాగ్రంథమే యిప్పటికిని ద్రావిడభాషల విషయమున ప్రమాణము. ఈ శాస్త్రము పట్టపరీక్షకుఁ బాఠ్య మగుటచే దీనికి నాంధ్రదేశమున నధ్యేతలును, గొంత ప్రచారమును గలదు. ఈ గ్రంథమునఁ దెనుఁగువ్యాకరణ మితర ద్రావిడభాషావ్యాకరణములతోఁ బోల్పఁబడి వ్యాఖ్యానము చేయఁబడినది. కాల్డ్వెల్లుగారికి అరవమున గొప్ప పాండిత్యమును, తెనుఁగు మొదలగువానిలో నంతకంటెఁ గొంత తక్కువ పాండిత్యమును గలదు. అనేకభాషల వ్యాకరణముల నెఱింగి జ్ఞానవైశాల్యము గలిగించుకొనిన పండితుల కా యీ భాషలలో నొక్కదానియందే పరిశ్రమ సల్పిన వారివలెఁగాక తత్తద్దేశవిషయికవిజ్ఞానమునఁ గొంత లోటు కనుపట్టవచ్చును. అది సహజమేగాక యనివార్యమును. కొన్ని సందర్భములను బొరపాట్లునుగూడ సంభవింపవచ్చును గాని యవి క్రమక్రమమునఁ దొలఁగింపఁ దగినవియే. అంతమాత్రమున వ్రాసినవారి జ్ఞానమున కొక దొసఁగు వొసగదు.

ఇఁక నిట్టి వ్యాకరణములను వ్రాయుట పరిశోధన విషయము. ఆ పరిశోధన కధికారము వలయునన్న సంస్కృ తాంధ్ర తమిళ కర్ణాట మలయాళ భాషలయందు మంచి జ్ఞానము కావలయును. అందు సంస్కృతాంధ్రములయందు అధికమయిన ప్రవేశము గలుగవలయును. పయిగా నాంగ్లభాషయందు నేర్పుమాత్రమేగాక యా భాషయొక్క పరిణతిని దెలిసికొనిన భాషాశాస్త్రజ్ఞానము గావలయును. ఇన్ని నేర్చుకొనినతరువాతఁ బ్రతిభయుఁ, బరిశోధనయందలి యనివార్యమయిన యిచ్ఛయుఁ గలిగినఁగాని యీ గ్రంథము వ్రాయుటకు వీలుపడదు. భారతీయ

విజ్ఞానవిషయముననను, అందును ద్రావిడభాషావిషయికముగఁ బరిశ్రమచేయు ప్రతిభావంతు లత్యల్పసంఖ్యాకు లగుట నీ జాతిగ్రంథములు బయలుదేరుట కవకాశము చాలతక్కువ. ఏవియయిన బయలుదేరినచో నయ్యవి యపసిద్ధాంతముల కును, అప్రమాణములయిన వాక్యములకును దావలమగుచుండుటలో వింత లేదు. సాధారణముగా నాంధ్రదేశస్థుల కితర ద్రావిడభాషలు నేర్చుట కవకాశములు తక్కువగా నుండుట, బుద్ధిమంతులును సమర్థులును ధన గౌరవ సాధకములయిన విద్యాంతరములను, వృత్త్యంతరములను ననుసరించుటయు నీ యవస్థకుఁ గారణ మయినది. అనేకములయిన శ్రమల కోర్చి భాషాభిమానమే ప్రథానముగాఁ బనిచేసి ప్రతిఫలము నపేక్షింపక తమ గ్రంథములను తెనుఁగువారికిఁ బ్రసాదించిన యీ క్రిందివారి ప్రయత్నములు తప్పక ప్రశంసింపఁదగినవి. వీరు వ్రాసిన తెనుఁగు గ్రంథములుమాత్రమే భాషావిషయమున పేర్కొనంబడును.

1. శ్రీయుతులు కోరాడ రామకృష్ణయ్యపంతులుగారు. వీరు మదరాసు విశ్వకళాపరిషత్తులో చాలకాలము పనిచేసి భాషావిషయమున గ్రంథములు ప్రచురించిరి. "సంధి" యను నామమున ఆంధ్రభాషాసంధినియమముల చారిత్రక పరిశీలనము విపులముగాఁ జేయఁబడినది. గ్రంథము 258 పుటలు. ద్రావిడభాషా సమానపదములు (Dravidian Cognates) అను పేర పయి భాషలలోని సమానపద ములను పర్చి కూర్చి ప్రకటించిరి. ఇది మిక్కిలి యుపయోగకరము. వీరి గ్రంథ ములు ప్రశంసనీయములు, ప్రామాణికములు.

2. శ్రీయుతులు చిలుకూరి నారాయణరావుగారు. ఆంధ్రభాషాచరిత్ర మను పేర రెండు సంపుటములు గల మహాగ్రంథమును ఆంధ్రవిశ్వకళాపరిషత్తు వారి యాజమాన్యమునఁ బ్రచురించిరి. ఇం దాంధ్రభాష సంస్కృత ప్రాకృతజన్య మనుటకు తాము సేకరించిన సాక్ష్యము నంతటిని ఒకచో జూపియున్నారు. అనేకములయిన ప్రాచీనాంధ్రగ్రంథములనుండి ప్రయోగములను లెక్కకు మిక్కిలిగా నొసఁగియున్నారు. వారి గురువుగా రయిన శ్రీ గిడుగు రామమూర్తిపంతులు గారు వాఙ్మయమునుండి గుర్తించుకొనియుండిన యనేక ప్రయోగముల నుపయో గించుకొన్నారు. ఇట్లు మహోపకారకమయిన విషయములను సేకరించి యాంధ్రుల కృతజ్ఞతకుఁ బాత్రులయిన వీరిని తప్పక యభినందించుచున్నాను. కాని యీ గ్రంథమునందలి ప్రథానప్రణాళికతోగాని, సిద్ధాంతముతోగాని యైక్యభావమును జూపింపఁజాలనందులకుమాత్రము చింతిల్లుచున్నాను.

3. బ్రహ్మశ్రీ వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రిగారు వైయాకరణ పారిజాత మను పేర ఆంధ్రవిశ్వకళాపరిషత్తు ప్రచురణముగా వెలయించిరి. చింతా మణి, కారికావళుల కియ్యది విపులమయిన వ్యాఖ్య. మొదటి కొన్నిసూత్రములు మాత్రమే 660 పుటల గ్రంథ మయినది. 'అద్దంత్యస్తాలవ్యః' ఇత్యాది సూత్రము

వళికును 'ప్రాకృతే తద్భవేచాపి' యను కారికవళికును వ్యాఖ్యానము చేయఁబడినది. అనేక విషయములు సంస్కృత ప్రాకృత తమిళాది వ్యాకరణములనుండి యుద్ధృతములయి సంగ్రహింపఁబడినవి. రేఫ ఱకార విషయమునను, అనుస్వార సందర్భమునను, ధ్వనిప్రపంచమునను, తద్భవ ప్రకరణమునను అనేక విషయములను గ్రహించి అరవ, కర్ణాట, మలయాళ భాషలలోనుండి యుదాహరణములను నిరూపించిరి. ఇది మిక్కిలి యుపయోగకరమయిన ప్రామాణికగ్రంథము.

[ఈ గ్రంథము మొదటిముద్రణ మయినతరువాత, సీతారామస్వామి శాస్త్రిలవారి ఆంధ్రవ్యాకరణసంహితాసర్వస్వమును, ద్రావిడభాషాపరిశీలనమును ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారు ప్రచురించిరి.]

4. ద్రావిడభాషలు అనుపేర 150 పుటలుమాత్రము గలిగిన చిన్న పుస్తకము. ద్రావిడభాషలకు వ్యాకరణాదికమునఁ గల సంబంధము బోధపడుటకును, వానికి సంస్కృత ప్రాకృత భాషాజన్యత లేదనుటకును, కళాపరిషత్తులలోని విద్యార్థులకొఱకు నాచే వ్రాయఁబడి వాడుకలో నున్నది. పయి ముప్వురు గ్రంథకర్తలయొక్క గ్రంథములలోనుండి గ్రహింపఁబడిన విషయముల నన్నిటిని అక్కడక్కడ గుర్తించితిని.

# తెనుఁగువ్యాకరణములలోని

# సంస్కృతవ్యాకరణానుకరణము

## వివిధజాతుల స్వభావము

నేఁడు ప్రచారములోఁగల వ్యాకరణములయొక్క స్వరూప స్వభావాదులను దిఙ్మాత్రముగా నుదాహరించినతరువాత వానిలోని సంస్కృతాది వ్యాకరణాను కరణములు క్రింద నిరూపింపఁబడుచున్నవి.

పయిని జూపింపఁబడిన యయిదు జాతులలో నున్న మొదటి మూఁడును స్వరూపమునందుఁ గల భేదమాత్రము నుద్దేశించి వేర్వేఱుగా నిరూపింపఁబడినవి గాని వాని విషయమునందుఁగాని, తద్విభజనములోఁగాని భేద మంతగా లేనివి. అన్నియు సంస్కృతవ్యాకరణచ్ఛాయలుగానే యుండినవి. ఇట్టి యనుకరణ మెట్లు సంభవించెనో నన్నయకుఁ బూర్వమును, సమకాలికము నయిన యవస్థలోఁ గొంత నిరూపించితిని. అందు ముఖ్యముగా వ్యాకరణపూర్వావస్థయే నిరూపింపఁబడి నదిగాని యది వ్రాయఁబడిన క్రమముగాని, తదనంతరావస్థగాని నిరూపింపఁబడలేదు.

ఈ వ్యాకరణము లన్నిటిలోఁ జింతామణియే ప్రథమ మని చెప్పితినిగదా! తత్కర్తకు సంస్కృతవ్యాకరణపాండిత్య ముండినదనుట నిర్వివాదము. భావము లను చిత్రించుటకు భాష యెట్లుపకరణమో యట్లే శాస్త్రనిర్మాణమునకును త ద్విచారమునకును బునాది పారిభాషికపదములును, పదార్థవర్గీకరణమును నై యున్న వనుట నిర్వివాదము. అట్టిది జరిగినఁగాని శాస్త్రరచన కవకాశము లేదు. అనఁగా నీ క్రింది యుదాహరణమువలన స్పష్టపఱుచుచున్నాను. వైద్యశాస్త్రమును రచి యింపవలె ననిన వ్యాధులపేళ్లు, వాని లక్షణములు, ఓషధుల స్వభావము, స్వరూపము మనసునందు స్థిరపడవలె. వానికిఁగల సంబంధమును, నివారక-నివార్య భావరూపమున నున్నదానిని గుఱించిన కల్పనలు, విచారణ, పూర్వపక్ష సిద్ధాంత ములు మొదలగునవి యేర్పడి శాస్త్రము పెరుగును. అట్లే తర్కశాస్త్రమున మొదట పదార్థవిభజనము జరిగినతరువాత లక్షణాది నిరూపణమును, సంబంధ విశేషవిచారమును జరుపఁబడును. కాఁబట్టి యేశాస్త్రమునకైనను కొన్ని మూల సిద్ధాంతము లేర్పడకముందు శాస్త్రము పెరుగదు. అట్లాంధ్రవ్యాకరణము పెరుగవలె నన్నచో, తెనుఁగుభాషను విభజింపవలయునన్నచో, మూలభావము లెచ్చటినుండి రావలెను. స్వతస్సిద్ధముగా నా భాషను మాటాడు జాతియొక్క యౌన్నత్యమువలన, నాగరకతాప్రభావమువలన, అందలి మేధావుల బుద్ధిశక్తి

వలన, వారి విభజనసామర్థ్యమువలన స్వాభావికముగా నేర్పడి, విషయము ననుస రించి పెరుగవలయును. అట్టి యవకాశము తెనుఁగుమాత్రము మాటాడువారికి లేదని ముందే నిరూపించితిని. ఒక్క యుదాహరణము నేఁటి స్థితినుండి గ్రహించునది. పాశ్చాత్యనాగరకతతో మనకు సంబంధము కలిగినది. ఆ నాగరకతవలనఁ గలిగిన యనేక శాస్త్రములను మనవారు నేర్చుకొనుచున్నారు. భౌతికశాస్త్రము (Physics), రసాయనశాస్త్రము (Chemistry) మొదలగునవి నేర్చుకొనునప్పు డా శాస్త్రములయందలి మూలసిద్ధాంతములను నేర్చుకొని వానిమూలముననే జ్ఞానాభి వృద్ధిని జేసికొనుచున్నాముగదా! అంతేకాని హైందవుల ఫిజిక్సుగాని, కెమిస్ట్రిగాని మనము క్రొత్తగా సృజించుటలేదు. అట్లే నాఁటి పండితులును జేసియుండవచ్చును. స్వతంత్రమయిన పద పదార్థ విభజన, వాక్యవర్గీకరణము మొదలయినవి కలుగలేదు. కలుగుట కవకాశములు లేవు. కాఁబట్టి సంస్కృతవ్యాకరణమందలి పారిభాషిక పదములు, మూలసిద్ధాంతములు, వాక్యవిభజనము మొదలగువానినే గ్రహించి తెనుఁగునకుఁ బట్టించిరి. ఆ పద్ధతియే చింతామణిచే నారంభింపఁబడి మొదటి మూఁడుజాతుల గ్రంథములవారిచేతను ననుసరింపఁబడినది. కాఁబట్టి వాని పద్ధతి యేమనఁగా వారు చదివిన సంస్కృతవ్యాకరణముచొప్పునఁ దెనుఁగును విభ జించుటయేగాని వేఱు గాదు. అట్లు విభజించుటయందు వా రెంతవఱకుఁ గృత కృత్యు లయిరి? ఎంతవఱ కా యనుసరణము తెనుఁగునకు సరిపడును? ఎంతవఱకు సరిపడలేదు? ఎంతవఱకు సరిపడకున్నను మొదటఁ బ్రవేశపెట్టఁబడినది గావున నా వర్గీకరణము ననుసరించి భాషయును, వ్యాకరణమును బెరిగినవి? ఎంతవఱకు సరిపడక యంధప్రాయముగా నున్న దీ యనుసరణము? ఈ విషయముల విచా రణయే వీలయినంతవఱ కీ ప్రకరణమునఁ జేయఁబడును. తిరిగి ముందుఁ రాబోవు ప్రకరణములయం దీ విచారణమే చేయవలసివచ్చుచుండును గావునఁ గొన్ని సూచనామాత్రముగాను, గొన్ని యసంపూర్ణముగా నుండును.

ఇఁక నాలు గైదు జాతుల గ్రంథములలోఁ గొంత వైలక్షణ్యము గలదు. నాలుగవజాతి గ్రంథములలో నాంగ్లవ్యాకరణము ననుసరించియే విభజన జరిగినది. అనఁగా నందలి పరిభాషయు, నందలి మూలసిద్ధాంతములు నిందుఁ బ్రవేశపెట్టి రచన చేసిరని భావము. ఐదవజాతి గ్రంథములయందు సంస్కృతసంబంధముగాని, సంస్కృతమునుండి తేఁబడి తెనుఁగునఁ బ్రవేశపెట్టఁబడిన వ్యాకరణమర్యాదనుగాని త్యజింపకయే వీలయిన స్థలములయందును, నవసరములయినచోట్లను నింకను నధిక మయిన సంస్కృతవ్యాకరణవిచారణయు, నితర ద్రావిడభాషలయొక్క పోలికయు, నాంగ్లవ్యాకరణభావములును జేర్పఁబడి కొంతవఱకుఁ జరిత్రాత్మకముగ వ్రాయుటకుఁ బ్రయత్నములు జరిగినవి.

1. గ్రంథరచనాక్రమము, 2. సంజ్ఞలు, 3. రూపనిష్పాదనప్రక్రియ, 4. సూత్ర ములు అను నాలుగు విభాగములయందును బయి యనుసరణము వివరింపఁబడును.

## 1. గ్రంథరచనాక్రమము

అనఁగా విషయవిభజన మిందుఁ బరిశీలింపవలసినది. చింతామణియందు సంజ్ఞా, సంధి, అజంత, హలంత, క్రియాపరిచ్ఛేదంబులు నిరూపింప నగును. కావుననే బాలసరస్వతీయముననుu, అహోబలపండితీయమునను గద్యాలయందుఁ బయివిభజనమే యనుసరింపఁబడినది. ఇది పాణినీయశాస్త్రపద్ధతియే. అందలి పరిభాష, సంధి, అజంతము, హలంతము, స్త్రీప్రత్యయము, విభక్త్యర్థము, సమాసము, తద్ధితము, తిఙన్తము, కృదన్తము మొదలగు వరుసయే యిం దనుసరింపఁబడిన దనుట స్పష్టము. బాలవ్యాకరణమున సంజ్ఞ, సంధి, తత్సమము, ఆచ్ఛికము, కారకము, సమాసము, తద్ధితము, క్రియ, కృదంతము, ప్రకీర్ణము అను పరిచ్ఛేదములు చేయంబడినవి. ఇది చింతామణి విభజనముకంటె విశాలతరము. అజంత హలంత పరిచ్ఛేదములకంటె తత్సమాచ్ఛికము లను విభజనము బాగుగా నుండుటయేగాక తెనుఁగునకు సరిపడినది. తెనుఁగు శబ్దముల యొక్క హలంతత ప్రాచీనకాలముననే అనఁగా నన్నయనాటికే పోయినదని యూహింపవచ్చును. సంస్కృతమునందుండు వణిజ్, వాచ్, రుష్ వంటి హలంతశబ్దములు తెనుఁగున లేవు. తత్సమశబ్దములకును, ఆచ్ఛికశబ్దములకును భేద ముండుటవలన నట్టి విభజనము చిన్నయ యవలంబించెను. నన్నయ విచారణమునందలి ప్రాధాన్యము తత్సమశబ్దములకుమాత్రమే గావున నం దజంత హలంత భేదముమాత్రము పాటింపఁబడినది. చింతామణి తత్సమశబ్దసాధనప్రధాన మను సిద్ధాంతము నింతకుముందే యుదాహరించితిని. కారక, సమాస, తద్ధిత, కృదంత, ప్రకీర్ణ పరిచ్ఛేదంబులు చింతామణికంటె బాలవ్యాకరణమున నధికములు. ఈ పరిచ్ఛేదములు చిన్నయ వ్యాకరణమునఁ బెరుగుట నన్నయవిధానము యొక్క పూర్ణపరిణామమే. నడుమ నుండిన యహోబలపండితీయాది గ్రంథములయందలి విచారణ యొక్క ఫలితమే యిది. కొంత విభక్త్యర్థవిచారము చింతామణియందే కలదు. అట్టిదానిని మఱింత యధికముగాఁ బెంచి కారకప్రకరణ మను పేర చిన్నయ దన వ్యాకరణమున వెలయించెను. సమాసప్రకరణముగూడ హలంతప్రకరణముననే యంతర్భూతమయిపోయినది చింతామణియందు. బాలవ్యాకరణమున నయ్యది వేఱు ప్రకరణమయి విశాలమయినది. కృత్తద్ధిత పరిచ్ఛేదములలోఁ జింతామణిలో లేని యనేక విషయము లుండుటం జేసియు, నందు సంస్కృతవ్యాకరణమునందలి రూపనిష్పాదన ప్రక్రియయే యనుసరింపఁబడుటయు స్పష్టముగాఁ గనిపెట్టనగును.

ఆ యా పరిచ్ఛేదములయందలి విషయరచనాక్రమముగూడ సంస్కృత వ్యాకరణము ననుసరించినదిగానే యున్నది. పాణినీయమున మొదట మాహేశ్వర సూత్రంబులు పేర్కొనంబడియుండుటచేతఁగాబోలు బాలవ్యాకరణమునందును మొదట సంస్కృతమునకు వర్ణంబు లేబది యని వర్ణసమామ్నాయముతోడనే ప్రారంభింపఁబడినది. ఒక్క విషయమును బరిశీలించునది. ఆంగ్లవ్యాకరణములను

మనము చదువుచునే యున్నాము. ఒక్కదానియందైనను మొదట నాంగ్లమున కక్షరము లిరువదియాఱనియు, నా ధ్వను లిన్ని యనియు విచారణము రాదేల? తెనుఁగున నిట్లే యుండుటకు సంస్కృతానుసరణమే హేతువు. ఆంగ్లభాషాప్రాధాన్యము దేశమున వెలసినతరువాత వ్రాయంబడిన కొన్ని వ్యాకరణములం దీ పద్ధతి మారిపోయినది. సి. కుప్పుణ్ణయ్యంగారిచే వ్రాయఁబడి సర్వలక్షణసారసంగ్రహ మనుపేర 1878-వ సంవత్సరమునఁ బ్రచురింపఁబడిన పుస్తకములో మొదట (Classification of words) శబ్దస్వరూపనిరూపణము అను విషయము ప్రారంభింపఁ బడినది. ఆంధ్రభాషయందలి పదంబులు పదునొకండు విధంబులు అని మొదటి సూత్రము. ఆంగ్లవ్యాకరణమునందున్న Article, Interjection మొదలగు పదములకు 'ఉపపదము, ఆశ్చర్యార్థకము' అను సంజ్ఞ లాంగ్లవ్యాకరణము ననుసరించి కల్పింపఁబడినవి. ప్రౌఢవ్యాకరణమునందుఁ దుదని వాక్యపరిచ్ఛేదము అను నొక ప్రకరణము వ్రాయఁబడినది. దీనియందలి విషయము చాలవఱకు సంస్కృత వ్యాకరణముల ననుసరించి వ్రాయఁబడినదే యయినను ఈ వాక్యవిచారణము, దానికి లక్షణము మొదలగునవి తెనుఁగువ్యాకరణమునఁ బ్రవేశపెట్టఁబడుట, తమకాలమున నాంగ్లపాఠశాలలో బోధింపఁబడు నాంగ్లవ్యాకరణమునందలి వాక్యవిచారణమును జూచియే యనుట నిస్సంశయము. ఇట్లే కుప్పుణ్ణయ్యంగారి వ్యాకరణమునందును 6-వ ప్రకరణము వాక్యమే విషయముగాఁ గలది. ఇం దీ ప్రకరణ ప్రవేశముమాత్రమే గాక యిందలి విభజనముగూడఁ గేవల మాంగ్లవ్యాకరణానుసరణమేగాని వేఱు గాదు. ఇట్లే పయి వ్యాకరణములలో 'వ్రాతయందలి గుఱుతులు' వాక్యవిరామ చిహ్నములు (Punctuation marks) గ్రహింపఁబడెను. ఇది కేవ లాంగ్లానుసరణమే గాని వేఱుగాదు. వావిలికొలను సుబ్బారావుగారి సులభవ్యాకరణమునందును, వీరేశలింగముపంతులుగారి సంగ్రహవ్యాకరణమునందును వాక్యపరిచ్ఛేదము గలదు. వీ రందఱును నాంగ్లపాఠశాలలలోఁ బనిచేసిన తెనుఁగుపండితులు గావున వారి గ్రంథములయందు నా భాషాసంస్కారము తప్పక కనుపట్టుచునే యుండును.

నన్నయాథర్వణుల గ్రంథములయందు సూత్రములుమాత్రమే గన్పట్టును. కాని వాని వివరణముగాని, యుదాహరణములుగాని కనుపట్టవు. ఇవి పాణిని సూత్రములను, వరరుచి వార్తికములను ననుసరించినవి గావున నా పద్ధతినే వ్రాయఁ బడినవి. తరువాతఁ బయలుదేరిన యహోబలపండితీయమునఁ బాతఞ్జల మహాభాష్యపు ఫక్కిక యనుసరింపఁబడిన విపులమయిన విచారణము సలుపఁబడినది. బాల వ్యాకరణమునాఁటికి వైయాకరణ సిద్ధాంతకౌముది దేశమునం దెల్లను బాఠ ప్రవచనాదులయందు మిక్కిలి ప్రచారములో నుండుటచేతను, నద్దానికిఁ బ్రాధాన్యము గలుగుటను చిన్నయ యద్దాని రచన ననుసరించెను. తానే సూత్రములను, వృత్తిని, ఉదాహరణములనుగూడ నొసంగెను. అనఁగా భిన్నకర్తలచేఁ గూర్పంబడిన సూత్ర వార్తిక తతివలన భట్టోజీచే రచింపఁబడిన వైయాకరణ సిద్ధాంతకౌముదియే

యీతని రచనకు మాతృక యయ్యెను. పాణినీయపక్కినే యనుసరించి సూత్రాంధ్ర వ్యాకరణమును చిన్నయసూరి సంస్కృతముననే రచియించెననియు ముందే యుదాహరించితిని. ఆంధ్రశబ్దానుశాసన మను పేరను దెనుఁగునను బైసూత్రముల ఛాయనే సూత్రములను రచియించెను. ఈ రెండును పరిషత్పత్రికాధికారులచేఁ బ్రచురింపఁబడినవి. చింతామణ్యాదులు బాలవ్యాకరణమున కెట్లు మార్గదర్శకము లయినవో సాధారణముగా నవ్యసూత్రాంధ్రవ్యాకరణములన్నిటికిని బాలవ్యాకరణ, ప్రౌఢవ్యాకరణములు మూలమగుటచే నవ్వానినెల్లను విశేషముగా విమర్శించుట యందలి యవసరము కనుపట్టదు. ఆంధ్రకౌముది యను నామమునను గణపవరపు వేంకటకవి వైయాకరణ సిద్ధాంతకౌముది ననుసరించినట్లు కనుపట్టుచునే యున్నది.

ఇఁక రెండవజాతి లక్షణగ్రంథములు ముఖ్యముగా భామహుని కావ్యాలంకారము, వామనుని కావ్యాలంకారసూత్రవృత్తులు అనునవి మాతృకలుగాఁ గలవి యని ముందే తెలిపితిని. ఆ రెండుగ్రంథములయందే కవితాలక్షణాదికము గాక కొంత వ్యాకరణవిచారము చేయంబడినది. ఆ వ్యాకరణవిచారము సంపూర్ణము గాదు. ఒక క్రమము ననుసరించినది కాదు. కవులకు శబ్దశుద్ధి కావలయును. దుష్టప్రయోగములు పరిహరింపవలయును. కొన్నిశబ్దములు సుప్రసిద్ధములయిన ప్రాచీనవ్యాకరణముల సమ్మతి నందకున్నను సాధువులే యనియు, నయ్యవి ప్రయోగ సిద్ధమయిన సాధుత్వమును బొందినవనియు నుద్దేశించి యెత్తి చూపఁబడినవి. తెనుఁగున నుదాహరింపఁబడిన లక్షణగ్రంథములలోఁ గొన్ని యిట్లే యసంపూర్ణములయి యక్కడక్కడ కతిపయవిషయములుమాత్రము గలిగియున్నవి. తెనుఁగువ్యాకరణ మత్యల్పమగుటచే కావ్యాలంకారచూడామణివంటి గ్రంథములయందుఁ గొంత క్రమసాపేక్షముగ గొంతసంపూర్ణత నుద్దేశించి వ్రాసియున్నట్లు తోఁచెడిని. కాని క్రమక్రమంబున సంస్కృతాలంకారికగ్రంథములవలెనే వ్యాకరణవిషయములు పరిత్యజింపఁబడి కావ్యలక్షణాదికము వేఱుగా రచియింపఁబడుచు వచ్చినది.

## 2. సంజ్ఞలు (పారిభాషికపదములు)

ఇంతకుముం దనేకసందర్భములలోఁ బదము లెట్లు భాషనుండి యింకొక భాషలోనికి వచ్చునో సూచించితిని. పదమును దెచ్చుకొనుటకుఁగాని, కల్పించుటకుఁ గాని ముందు భావము సిద్ధపడవలెను. భావము అనఁగా అర్థము మొదట బుద్ధిస్థము గానిచో పదముయొక్క ప్రయోజన ముండదు. సిద్ధమయిన యర్థమును జెప్పుటయే పదముయొక్క ప్రయోజనము. కాఁబట్టి భావమును అనఁగా తెనుఁగువ్యాకర ణాదికమునందలి పదార్థవిభజనము అంతయును సంస్కృతవ్యాకరణమునుండియే తెచ్చినప్పుడు ఆ యా భావములకు వాచకములయిన పదజాలమును (సంజ్ఞలను) గూడ సంస్కృతమునుండియే అనఁగా పయిభాషనుండియే గ్రహించుట సుసాధ్యమే గాక సాధారణమయినపద్ధతి. దీనికి హేతు వేమనఁగా పద పదార్థములకుఁ గల

నియతసంబంధమే. ఒకపదమువలన నొకయర్థము బోధింపఁబడు ననుట లోకము యొక్క వాడుకపయి నాధారపడియున్నది. దీనినే రూఢి యని శాస్త్రజ్ఞులు చెప్పుదురు. పదములకును అర్థములకును గల సంబంధ మిట్లు రూఢము కావలయును. అట్లు రూఢమయినంగాని యా పదము శక్తముగాదు. అనఁగా నా పదమునకు నా యర్థమును బోధించుటలో శక్తి లేదు. శక్తి యనఁగా పదమునకును బదార్థమునకును గల సంబంధమే. ఇదియే యర్థబోధకత. ఇదియే రూఢిపై ననఁగా జనాంగీకారము పయి, ప్రయోగబహుళతపయి నాధారపడియున్నదంటిని. ఈ క్రింది యుదాహరణ మును గ్రహించునది. కలెక్టరు అను పద మున్నది ఇది యాంగ్లపదము. తెనుఁగు పదము గాదు. ఒక జిల్లాయధికారి హోదా. అట్టి యధికారి అనఁగా అర్థము కల్పింపఁ బడినపుడు దానికి సంజ్ఞ యగు కలెక్టరు అను పదముకూడఁ గల్పింపఁబడినది. ఆంగ్లభాష తెలిసిన యాంధ్రు లీ పదము నాంగ్లములో వాడుదురు. ఆ యర్థమును దెనుఁగునఁ జెప్పవలె. దానికి వాచకమయి, శక్తమయినట్లు దమకుఁ బరిచితమయిన కలెక్టరు పదమునే వారు వాడుదురు. కాని క్రొత్తదయిన తెనుఁగుపదమును గల్పింపవలయునని వారికిఁ గోరికగాని, ప్రయత్నముగాని యుండదు. వారి కా పదము శక్తమయి పరిచితమయి యుండుటయు, తెనుఁగుపదమును గల్పింపవలయు నిది యన్యభాషాపద మను వివేచన మా క్షణమున వారి కుండకుండుటయు, అట్టి కల్పనా శక్తి వారికి లేకుండుటయు మొదలగు ననేకములలో నొకటిగాని, యన్నియుఁగాని కారణము లయి యుండును. విజ్ఞుల విధానమే యిట్లుండ నజ్ఞుల యనుసరణము చెప్ప నక్కఱ లేదుగదా! ఇట్లే పదములు (అందును ముఖ్యముగా సంజ్ఞలు, పారిభాషిక పదములు) ఒకభాషనుండి యింకొకభాషలోనికిఁ బోవును. ఈ రీతిని సంస్కృత వ్యాకరణములోని నిరర్థకసంజ్ఞలును, సార్థకసంజ్ఞలును దెనుఁగునకు సాధారణముగా సంజ్ఞామాత్రములుగానే వచ్చినవి. అట్లుగాక భావమునుమాత్రమే గ్రహించి దానికిఁ గ్రొత్తసంజ్ఞలను దేశభాషలోఁ గల్పించి యా సంజ్ఞలను ప్రచారము లోనికిఁ దెచ్చి వానిని రూఢము లొనర్చుట రెండవ పద్ధతి. ఈ పద్ధతియును గలదు. కాని మొదటి పద్ధతి సులభము. కేవల స్వాభావికము. రెండవది దుర్లభము, కృత కము. ఇంతియగాక రెండవపద్ధతి నవలంబించుటకుఁ గొంత స్వాతంత్ర్యము, ఆత్మప్రాధాన్యము, కొంత సారస్వతస్థితియును గలుగవలె. తత్సమపదములు సిద్ధసమాసములు నెప్పుడు తెనుఁగునఁ జొచ్చి యుత్తమరచన యేర్పడినదో నాఁడే పారిభాషికపదములకును దారి నిశ్చితమయిపోయినట్లే. ఇంతియగాక వేఱొక లాఘవముగూడఁ గలదు. భాషలో నధికభాగము తత్సమమే యయినప్పుడు తత్సమపదవివరణమున కొక పరిభాషయు, అచ్చికపదములకు వేఱొక పరిభాషయు నేర్పడుట శ్రమకు హేతువేగాక భాషాప్రవాహములను రెండింటిని నేకముచేయక వేఱుచేయుచునే యుండును. కాఁబట్టి తెనుఁగు వైయాకరణులు సంస్కృత వ్యాకరణపరిభాషనే గ్రహింపవలసివచ్చినది.

ఈ గ్రంథములలో మొదటిది చింతామణి. అట్టి చింతామణి, కారికలు, అహోబలపండితీయము నను త్రితయమును బరిశీలించుటకుముందు తెనుఁగున వ్రాసిన తెనుఁగు వ్యాకరణములలోనికెల్లను నాద్యమయి, సంక్షేపస్వరూప మయిన యాంధ్ర భాషాభూషణమును దిలకింతము. ఆతఁడు గ్రహించిన సంస్కృతసంజ్ఞ లీ క్రింద నీయఁబడుచున్నవి.

1. సంధి 2. సమాసము 3. విభక్తి 4. క్రియ 5. అచ్చు 6. హల్లు 7. అవ్యయము 8. ప్రథమాది విభక్తుల పేళ్లు 9. సమాసముల పేళ్లు 10. మాత్ర 11. అంతస్థము 12. ఊష్మము 13. భూత భవిష్య ద్వర్తమానములు 14. కర్తృ కరణ కర్మంబులు. ఈ పదములు తనకాలమునకుఁ జాల సుప్రసిద్ధములయి ప్రచారములో నుండుటచేతనే యాతఁడు తన చిన్నవ్యాకరణమునఁగూడ వీనిని గ్రహించెను. కర్ణాట మలయాళ వ్యాకరణములుగూడ నీ పద్ధతినే యవలంబించెను. కాని అరవ వ్యాకరణముమాత్రము భిన్నమార్గమునే యవలంబించినది. అరవపదములనే పయియర్థము లిచ్చునట్లు వాడిరి. ఆ పదములును, ఆ భావములును అరవభాష కనాది యనియు సంస్కృతమునుండి పద మెల్లరవు తెచ్చుకొనలేదో, భావమును గూడ నల్లరవు దెచ్చుకొనలేదని కొంద అనవచ్చును. కాని అరవవ్యాకరణము వ్రాసిన తొల్‌కాప్పియనారుయొక్క సంస్కృతవ్యాకరణపాండిత్యమును, పయి పదముల యర్థములయొక్క సమానత్వమును, విభజనప్రణాళికయును జూచినచో సంస్కృతమునుండి భావమును గ్రహించిరనియే యూహించుటకు వీలుపడుచున్నది. ఇంతకును అరవమునకు వ్యాకరణము వ్రాసినవాఁ డగస్త్యుఁడు. ఆతఁడు సంస్కృత భాషావ్యాకరణపండితుఁడేగదా! ఇఁక నరవపదములను బరిశీలించునది. 1. సంధి= పుణర్చి; అనఁగా కూడిక యని యర్థము. 'పుణర్' అనునది ద్రావిడధాతువు. కూడు అని యర్థము. కన్నడమున 'పొణర్' అని రూపము. మలయాళమున 'పుణరుగ', తెనుఁగున 'పొనరు', 'ఒనరు' అను రూపములను పొంది, పొందిక యను నర్థములో వాడుకలో నున్నది. 2. సమాసము=తొగై. ఇది తొగు ధాతువునుండి వచ్చిన భావార్థకము. తొగు అనఁగా గుంపుకూడు, గుత్తిగట్టు అని యర్థము. 'తొంగల్' (కన్న), 'తెచ్చల్' (మల), తెనుఁగున తొగ యనఁగా సమూహము. 3. విభక్తి. ఇది సంస్కృతమునందలి 'వి' పూర్వక భజ్ ధాతువుపయి 'తి' యను భావార్థకప్రత్యయము. విభజనము లేక వేఱుపాటు అని యర్థము. అరవమున దీనికి 'వేట్రుమై' యని సంజ్ఞ. వేఱు అను మూలద్రావిడధాతువు పయి చేరిన 'మై' యను భావార్థకప్రత్యయముతోఁ గూడి యేర్పడినది. ఈ పదముతో సమానమయిన తెనుఁగురూపము 'వేఱిమి'. ఈ ధాతువు మలయాళ కన్నడములను గలదు. 4. క్రియ=వినై (మల) వినె, పని, కర్మ యని యర్థము. 5. అచ్చు. ఈ పదము సంస్కృతమునఁ బాణిని యుపయోగించిన ప్రత్యాహారము వలన వచ్చినది. 'అ ఇ ఉ ణ్', 'ఋ ౡ క్', 'ఏ ఓ ఙ్', 'ఐ ఔ చ్' అను

నాలుగు మాహేశ్వరసూత్రములను గూర్చి 'అ' మొదలు తుదినున్న 'చ్' వర్ణముతోఁ గలిపి యుచ్చరించిన అచ్=(అచ్చు) అగుచున్నది. అరాకాది చకారాంతమునఁ అకును బై సూత్రములలోఁ గల యక్షరములని యర్థము. హల్లు అనునది కూడ హాల్ అను ప్రత్యాహారమువలననే కలిగినది. దీనిని కేవలము సంజ్ఞామాత్రముగఁ దెనుఁగున వాడిరి. అచ్చునకుఁ బ్రాణ మనియుఁ బేరు గలదు. ఈ పదమునకు సరియయిన పేరు అరవమునందు ఉయిర్. ఇది ద్రావిడపదమే. దీనికిఁ దెనుఁగున సమానపదము ఉసురు. కన్నడమున ఉసిర్. 6. అట్లే హల్లు అను పదమునకు వ్యంజనము అని సంస్కృతము. మెయ్ అనఁగా శరీరము అను పదము అరవము. ఈ పదము తెనుఁగు మొదలగు ద్రావిడభాష లన్నిటిలోను గలదు. ఇట్లే అరవవ్యాకరణమున సంస్కృత పారిభాషికపదము లన్నిటికిని ద్రావిడపదములే వాడఁబడినవి. విశాలమయిన విచారణకలిగి స్వతంత్రములయి నవియు, సంస్కృతమునుండి గ్రహించి తమ భాష కనుకూలముగా నమర్చుకొనిన వియు నగు సంప్రదాయములును బద్ధతులను గల విశాల తమిళవ్యాకరణము క్రీస్తుపూర్వమే యరవమునకుఁ గలదు. అనఁగా నన్నయకు సుమారు వేయి సంవత్సరములు ముందనుట భావము.

ఇఁక నన్నయ వాడిన సంస్కృతనామము లన్నియును వివరించుట లాభకరము గాదని చెప్పి సంస్కృతవ్యాకరణమున లేని తెనుఁగువ్యాకరణమర్యాదలకు నేర్పఱచిన సంస్కృతసంజ్ఞలనుమాత్రము పేర్కొందును. 1. వక్రః (ఎ, ఒ), 2. వక్రతమః (ఐ, ఔ), 3. ద్రుతః (పొల్లనకారము), 4. సరళాః, 5. పరుషాః, 6. స్థిరాః, 7. కళాః, 8. ద్రుతప్రకృతయః, 9. ఔపవిభక్తికాః, 10. మహత్, 11. అమహత్, 12. మహతీ, 13. ఉపకృతి, పరిణతి, సంవృతి, 14. తద్ధర్మః (లకారములందు). నన్నయ వ్రాసిన వ్యాకరణము సంస్కృతముననే గావున సంస్కృతసంజ్ఞలన్నిటిని వాడుటమాత్రమేగాక తెనుఁగునకు స్వాభావికమయి సంస్కృతమున లేని తెనుఁగుస్వభావములకుఁగూడ సంస్కృతసంజ్ఞలే యేర్పఱచెను. అవియే తరువాతి వైయాకరణుల కందఱకునుగూడ ప్రామాణికమయిన పరిభాషగా నేర్పడెను. ఈ పద్ధతినే అథర్వణాహోబలపతులును ననుసరించిరి. కావుననే అథర్వణుఁడు తన కారికలయందు 'అనుక్తస్య కార్యస్య వక్తా భవతి పాణినిః' అని యాంధ్రవ్యాకరణమునఁ జెప్పఁబడని విశేషము లన్నియును పాణినిగ్రంథము నుండి గ్రహింపవలయునని తెల్పెను. అహోబలపతి సంస్కృతములోని తర్కాలంకార మీమాంసాది శాస్త్రముల సంప్రదాయములను, విచారణములను దన వ్యాఖ్యానమున నింపివేసెను.

ఆంధ్ర కౌముదిని రచియించిన గణపవరపు వేంకటకవి సంస్కృతవ్యాకరణమున నుండిన యనేకములయిన యితరప్రత్యయములను, బద్ధతులను తెనుఁగున నిరూపించెను.

'కచటతప లకు గజడదబ లగును' అను భావమును జెప్పుటకయి యాతఁడు 'జశ్త్వరీతులు' అను నొక పదమును వాడెను. 'జశ్' అనునది 'జబగడదశ్' అను

మాహేశ్వరసూత్రమునకుఁ బ్రత్యాహారము. జశ్త్వమనఁగా కచటతప లకు గజడదబలు వచ్చుట యని భావము. కారకప్రకరణమున కర్తృ కర్మ కరణ సంప్రదానాపాదానాధికరణము లనెడు కారకములను, స్వతంత్రకర్త, హేతుకర్త, కర్మకర్త, అభిహితకర్త, అనభిహితకర్త యను భేదములను, ఈప్సితకర్మ, అనీప్సిత కర్మ, ఈప్సితానీప్సితకర్మ మొదలగు భేదములును ఇంక ననేకములయిన యాచారాది క్విప్ప్రత్యయార్థాదులును దెచ్చి తెనుఁగు నుదాహరణము లొసంగుటకుఁ బ్రయత్నించుట చాలవఱకు జరిగినది. వీని కన్నిటికిని తెనుఁగున సమన్వయముగాని, ప్రవేశము గాని యనవసరముమాత్రమేగాక చదువరులకు శ్రమహేతువే యగును. క్రియాప్రకరణమునందు సంస్కృతమునందలి దశవిధ లకారములును, 'లఙ్, లిట్, లుఙ్' అనువానికిఁ గల పరస్పరభేదములు నుదాహరించెను. అద్యతనానద్యతన భేదంబులను నిరూపించు నీ ప్రక్రియ లౌకిక సంస్కృతమునసే నశించినది. తెనుఁగున నేనాఁడును లేనిది. దానిని తెనుఁగునఁ బ్రవేశపెట్టుట యేమి యను సందర్భింపదు. ఆపయిని హేతుమణ్ణిజర్థము, ధాతుమణ్ణిజర్థము, నామధాతు ప్రక్రియ, క్యజర్థము, ఆఖ్యానార్థము, భావకర్మార్థము మొదలయినవాని నన్నిటిని సోదాహరణముగ పేర్కొన యత్నించెను. అంతటితో నూరకుండక "ఈవలఁ కెవ్వరీ త్రోవ గాననియది తెలివిడిఁజేసెదఁ దెలియుఁడింక" అనియు వ్రాసెను.

సంస్కృతవ్యాకరణమునందలి సంజ్ఞలను దెనుఁగున వాడునప్పుడా సంజ్ఞలకు నీ వ్యాకరణమున లక్షణము వ్రాయుట యవసరము. అట్లు వ్రాయకున్నచోఁ జదువరులకు నా సంజ్ఞలు ముందే పరిచితము లయి యుండవలయును. అట్లు పరిచితము లగునా లేదా యని విచారింపక వానిని గ్రంథమందుఁ బ్రవేశపెట్టుట యుక్తము కాదు గాని యాంధ్రవ్యాకరణములం దట్లు లక్షణములు వివరింపఁబడలేదు. చిన్నయసూరి తన గ్రంథమున కొన్ని సంజ్ఞలకు లక్షణంబులు వ్రాయఁజొచ్చెను. ఈ ప్రయత్నమును జాలస్థలములఁ జిన్నయ చూపించెనుగాని యది సార్వత్రికము గాదు. కొన్ని స్థలములయందు లక్షణములు వ్రాయకయే గొన్నిటిని బ్రయోగించెను. ఈ పొరపాటు పండితులకు సాధారణ మయినదియే. ఒకవిషయమును పారిభాషికపదములతోఁ జెప్పుటకంటె వానిని తొలగించి చెప్పుటకుఁగాని, వానిని వివరించి చెప్పుటకుఁగాని యెక్కువ నేర్పును, సామర్థ్యమును గావలయును. ఈ క్రింది వివరణములను బరికించునది. ఇవికాక యింక ననేకములు గలవు.

1. ఉపధ యనఁగా దుదివర్ణంబునకు ముందువర్ణము. సంజ్ఞ - 7 సూ.
2. ద్విరుక్తముయొక్క పరరూప మామ్రేడితం బనంబడును. సంధి - 10 ,,
3. స్వత్వం బనఁగా ద్రుతంబునకుఁ బ్రకృతిభావము. ,, - 17 ,,
4. ఏకత్వసంఖ్యను బోధించు ప్రత్యయం బేకవచనంబు,
   బహుత్వంబును బోధించు ప్రత్యయంబు బహువచనంబు. తత్స - 11,12

5. ప్రకృతిజన్యబోధంబునందుఁ బ్రకారంబు భావంబు.
6. ఆగమం బనఁగా వర్ణాధిక్యంబు. సంధి - 3.
7. సంశ్లేష మనఁగా మీదిహల్లుతోఁ గూడికొనుట. ,, - 17.
8. నామం బనఁగాఁ బ్రాతిపదికము. తత్స - 21.
9. ధాత్వర్థఫలాశ్రయంబు కర్మమునాఁబడు. కా - 2.
10. ధాత్వర్థవ్యాపారాశ్రయంబు కర్తనాఁబడు ,, - 3.
వీనిలోఁ గొన్నిటికి వ్యాఖ్యాంతరాపేక్ష స్పష్టమేగదా !
వివరణము చేయకయే యనేకములయిన సంజ్ఞావాచకములను వాడెను.

ఈ క్రింద వ్రాయఁబడిన యట్టివానిని గొన్నిటిని బరిశీలించునది. సవర్ణంబులు - సంజ్ఞా-7, శతృతుమానంతర్య చేదాద్యర్థకంబులు—సం—13, లఘువు-అలఘువు—సం—18, బహుళము-సంధి—4, క్త్వార్థము-సంధి—8, నిరవకాశంబు-సంధి—9, వర్గయుక్కు-సంధి—16, స్త్రీసమంబు-సంధి—35, వ్యవస్థితవిభాష-సంధి—36, వృత్తి-సంధి—45, ప్రాతిపదికము-తత్స—21, ఉపసర్జనము-తత్స—78, పూరణార్థకము-ఆచ్ఛి—25; ఆఖ్యాతము-కారక—1.

పయిసంజ్ఞ లన్నియును సంస్కృతవైయాకరణులకుఁ బరిచితములే. కాని సాధారణముగా సంస్కృతవ్యాకరణములలో సంజ్ఞల కన్నింటికిని అక్కడి కక్కడనే నిర్వచనము జరిగినది. అట్లు లేనివానికి విపులములయిన వ్యాఖ్యానాదులచే విశేష ప్రచారమును గలిగినది. కాని తెనుఁగువ్యాకరణముల నట్లు లేకుండుట వానిబోధ కుపకారకము గాదు.

పయివిచారణమువలన నేర్పడిన దేమనఁగా చింతామణ్యాదులకాలము నుండియును వాడుకలో నుండిన తెనుఁగువ్యాకరణములోని సంస్కృతపరిభాష చిన్నయసూరికాలమునఁ జాలవఱకుఁ బరిపూర్ణత నొందినది యనుటయే.

## 3. రూపనిష్పాదనప్రక్రియ

సిద్ధమయి వాడుకలోనున్న పదములకుఁ బ్రకృతి ప్రత్యయవిభాగముచేసి రూపములకు సాధుత్వము సంపాదించుటయే సంస్కృతవ్యాకరణమువలన లభించిన ముఖ్యపద్ధతి. అనఁగా వాడుకలోనున్న శబ్దములలో సుశబ్దములను, ప్రయోగార్హము లయినవానిని గ్రహించి యా రూపము లేర్పడుటలోఁ గల సమానలక్షణములను సూత్రీకరించుట. రూపనిష్పాదనమునందు లాఘవమే ముఖ్యముగాని చరిత్రాత్మక దృష్టి లేదు. ఈ పద్ధతినే తెనుఁగువ్యాకరణముగూడ నవలంబించినది. ఈ యుదాహరణమును గ్రహించునది. రాముఁడు, కృష్ణుఁడు మొదలగు పదముల తుదినున్న డు వర్ణము ప్రత్యయమనియు, రామ, కృష్ణ యనునవి ప్రకృతు లనియుఁ దెలుపుట, రాముఁడు, కృష్ణుఁడు అను రూపములు సాధువులేగాని రామఁడు,

కృష్ణఁడు అనునవి సాధువులు గావనియు, నపభ్రష్టములనియుఁ దెలుపుట. పుంలింగంబగు మహద్వాచకంబునకు డుజ్జగు" బా. తత్స. 22. 'మహతస్సోర్డుజ్ అనితో భవే త్పుంసి" చింతామణి. పయిఫక్కి పాణినీయమునుండి గ్రహించినదే. పయిఫక్కిలో ననుసరింపఁబడిన పద్ధతులు కొన్ని గలవు.

1. ఒకరూపమున కనేకసూత్రములను భిన్నస్థలములలోఁ జెప్పినవాని నుప యోగించి సమన్వయపఱుచుట—రామునికి అను రూపమును సాధింపవలయును. రామ అని ప్రాతిపదికము. "పుంలింగం బయి మహద్వాచకం బయిన నామంబు తుదియత్వంబున కుత్వంబగు" అనుసూత్రముచే రాము సిద్ధించినది. "డుమంతం బునకు ద్వితీయాద్యేకవచనంబు పరంబగునపుడు నిగాగమంబు సర్వత్ర విభాష నగు" రామునికిని, రామునకును సర్వత్ర యనుట నగాగమబాధనార్థము. (బా. వ్యా. తత్స. 23) "కువర్ణకంబు పరంబగునపు డుకార ఋకారంబులకు నగాగమం బగు" 28 సూ. "ఇకారంబుమీఁది కు ను వు క్రియావిభక్తులమీఁది యుత్వంబున కిత్వంబగు." 26 సూ. "కు యొక్క లోపల షష్ఠి" 6 సూ. "ద్రుతాంతము లయిన పదములు ద్రుతప్రకృతికములు" 12 సూ. "ప్రథమా కయి షష్ఠి యొక్కేతరము లయిన విభక్తులు....ద్రుతప్రకృతికములు." 12 సూ.

ఇన్ని సూత్రములు గలిసి ప్రవర్తించుటవలనఁ బయిరూపము గలిగినది. ఇట్లే యేకప్రకరణంబున నున్న సూత్రములును, భిన్నప్రకరణంబుల నున్న సూత్రంబులును గొన్నియెడలఁ గలిసి యొక్కొక్కరూపమును సాధించుట కుపయోగపడుచున్నవి. ఈ ప్రక్రియ సంస్కృతవ్యాకరణమునుండి వచ్చినదియే. అక్కడి సూత్రరచన వైయాకరణసిద్ధాంతములచొప్పున సాధురూపములను బంధించు గ్రంథికయి యేర్పడిన ప్రణాళిక ననుసరించినది. చాల క్లిష్టమయిన విధానమున రచియింపఁ బడినది. చదువరులకు సుశబ్దాపశబ్దబోధనమాత్రోపయోగి కాదు. బుద్ధివైశద్య సంపాదనకుఁగూడ హేతు వయినది. విశేషమయిన యర్థవిచారము, కృత్స్నవిచారము అనునట్టి శాస్త్రప్రణాళిక యుపరిసౌధముగా గలిగిన పునాది. క్లేశకరమయిన యీ పద్ధతియే తెనుఁగున నవలంబింపఁబడినది. అట్లవలంబించినవారిలో నెల్లరయందును పాణినీయములోని యుత్తమగుణములతోడి రచనమును జేయఁగలిగినవాఁడే చిన్నయసూరి. కావుననే యాతని వ్యాకరణమున కీడులేని ప్రశస్తి గలిగి సర్వ పండితాంగీకారమును బొందినది. మఱియొకమార్గము లేదే, యిదియే మార్గము గదా యని యడుగవచ్చును. అట్టి మార్గాంతరము లేకపోలేదు. చిన్నయయే యద్దానిని సర్వనామప్రకరణంబున ననుసరించి బహుశబ్దంబులకు రూపంబులమాత్ర ముదాహరించి యూరకుండెను. వానిలోఁ గొన్ని పూర్వసూత్రములఫక్కిని సాధింపఁగలవి లేకపోలేదు. రామశబ్దమునకు రూపములపట్టిక నిచ్చి యిట్టి వన్నియు నిట్లే యూహించుకొనునది యని వ్రాయుటయు నొకఫక్కి కాదన లేము. ఆ ఫక్కి కర్తకును, అభ్యస్తకును సులభమయినదే. అట్టి పద్ధతిలో

సందేహములు నిలిచిపోయి యెల్లవిషయములు తేలవని సమాధానము చెప్ప వచ్చును. ఇందుమాత్రము సర్వసందేహములు తీరి సర్వశబ్దములు సాధువులయ్యె నని చెప్పుటకు వీలున్నదా? ఎప్పుడయినను వ్యాకరణము మార్గదర్శకమేగాని భాషాధ్వగుని గమ్యస్థానమువఱకుఁ గొనిపోవు వాహనము గాదు. రెండు మూఁడు పద్ధతులలో మొదటిపద్ధతియే ప్రధానముగా తెలుఁగువైయాకరణు లేల యంగీక రించి రనువిషయము సమాధేయముగాని యిచ్చట నేపద్ధతి యుక్తతర మను విచా రణము ప్రధానము గాదు గావున నీ విచారణను బెంచ నవసరము లేదు. సంస్కృత వ్యాకరణమున నుపయోగింపఁబడినది గావుననే యీ పద్ధతిని తెనుఁగువైయాకరణు లనుసరించి రనుట సమాధానము.

(2) ప్రత్యాహారమనెడి సంస్కృతఫక్కికను దెనుఁగునకు దింపి రూపములను సాధించిరి. ఈ ఫక్కిక సూత్రలాఘవముకొఱ కేర్పడినది. వల్లెవేయుటకును, బుద్ధి యొక్క స్ఫురణశక్తిని బెంచుటకును నుపయోగించును. 'లకారంబునకు డు ము వు రు ను ముణ్ణగు.(బా. వ్యా. క్రి. 8)అని సూత్రించి డుణ్ణు, వుణ్ణు మొదలగు ప్రత్యా హారక్రమమును జిన్నయ క్రియాపరిచ్ఛేదంబున నడిపించెను. ఇది పాణినీయాను సరణమే. కొంత క్లేశకారి కాకపోలేదు. మార్గాంతరములును గలుగకపోవు.

(3) ఇత్సంజ్ఞలను వాడి వానికి ఫలమును నిరూపించుట. ఇది పాణినీయము నందలి పద్ధతియేగాని వేఱు గాదు. 'లజి, కజి, మిజి' మొదలగువాని నేర్పఱచి జీత్తగుట, నట్టిది పరమయినప్పుడు ధాతువు నుత్వంబున కత్వంబగును, అని సూరి విధించెను. 'ఫక్' అని సంస్కృతమునఁ బ్రత్యయము. నడాదులయిన శబ్దముల కంటె నీ ప్రత్యయ మపత్యార్థమునఁ బాణినిచే విధింపఁబడినది. అందలి 'ఫ' కారమువలన 'ఆయన్' అను ప్రత్యయాంతరము తత్స్థానమున వచ్చునని సూత్రాం తరముచే విధానము. కకార మిత్సంజ్ఞ యగుటచేత ఆదివృద్ధి. అనగా 'న' వర్ణము నకు బదులు 'నా' యని వచ్చును. 'నాడాయన' అని ప్రకృతి సిద్ధించును. ఇది సంస్కృతమునందలి యుదాహరణము.

4. కొన్ని రూపములను క్రమనిష్పత్తి చేయుటకు వీలుపడకయో, లాఘవమని యెంచియో నిపతించుట పాణినీయఫక్కియే. అట్టి సూత్రము లనేకములు, అనేక శబ్దముల గుత్తశములు కొన్ని పాణినీయమునఁ గలవు. ఈ క్రిందిసూత్రమును దిలకించునది. 'అచతుర, విచతుర, సుచతుర, స్త్రీపుంస, ధేన్వనడుహ, ఋక్సామ, వాఙ్మనస, అక్షిభ్రువ, దారగవ, ఉర్వష్ఠీవ, పదష్ఠీవ, నక్తందివ, రాత్రిందివ, అహర్దివ, సరజస, నిశ్శ్రేయస, పురుషాయుష, ద్వ్యాయుష, త్ర్యాయుష, ఋగ్యజుష, జాతోక్ష, మహోక్ష, వృద్ధోక్ష, ఉపశున, గోష్ఠశ్వాః' ఈ సూత్రమునందు హలంత ములు గావలసిన శబ్దము లజంతములు కాఁగా వాని నన్నిటిని గ్రహించి పాణిని నిపతించెను. అనఁగా యథారూపగ్రహణంబుననే యంగీకరించె ననుట. బోధకొఱకు పయిసూత్రము సంధి విడదీసి విరామచిహ్నములతో 25 శబ్దముల నేర్పరించితిని.

వయి ఫక్కికనే మనసునందుంచుకొని 'కద్రువ నాగమాత', 'వేధః పురోధ పురోధసుఁడు' మొదలగు సూత్రములను చిన్నయ రచించెను. వీనియందును రూపములు నిపతింపఁబడినవి.

5. గణనిరూపణము : సంస్కృతవ్యాకరణమున సమానరూపాదికము గల వానిని గొన్నిటి గ్రహించి వాని నొక గణముగా నేర్పఱచి పాణిని రూపనిష్పాదనక్రమమును నడిపెను. ఉదా. గౌరాదులు, శకంధ్వాదులు, ఖండికాదులు, పాశాదులు మొదలయిన గణముల ననేకములను పాణిని యేర్పఱిచెను. చాలవఱకు నీ గణములలోని శబ్దము లనేకము లేర్చి పట్టికగా గూర్చి యనుబంధములుగా నీయఁబడినవి. ఈ గణములు కొన్ని పరిపూర్ణములు. అనఁగా నితరశబ్దములు చేర్ప రానివి. కొన్ని యాకృతిగణములు. అనఁగా అట్టి రూపములుగలవానిని ఆ గణములలోఁ జేర్చుకొననగుననియు, నీ పరిగణనము కేవలము మార్గదర్శకముమాత్రమే యనియు నూహ. గౌరాదులు అనఁగా గౌరశబ్దము మొదలుగాఁ గలవి గౌరాదులు. ఈ శబ్దములకు 'జీష్' (ఈ) అను ప్రత్యయము స్త్రీలింగరూపమున వచ్చును అను నుద్దేశమున 'షిద్గౌరాదిభ్యశ్చ' యని సూత్రించెను. అంద్వాదులు, కుశాదులు, మగాదులు మొదలగు గణంబులు ఆంధ్రవ్యాకరణంబులయందు గనుపట్టుచున్నవి.

6. ఆదేశాగమాది విధానమును సంస్కృతము ననుసరించి తెనుఁగున బ్రవేశించినదియే. ఈ విధానము కేవలము రూపనిష్పాదనమే యుద్దేశము గలది గాని చారిత్రకదృష్టి నంతగా లెక్కచేయనిది. అనఁగా అలౌకిక మని యర్థము. బాలురు మొదలయిన రూపంబులలో 'లు' ప్రత్యయంబులోని లకారంబునకుబదులు రేఫ విధింపఁబడినది. బాలురు అను రూపము సిద్ధమయినది. 'రు' అను మహద్బహువచన ప్రత్యయాంతరము తెనుఁగునఁ గలదనియు, నయ్యదియే యిచ్చట వచ్చినదనియుఁ జెప్పుట యుక్తము. ఈపక్షమున రకారము వైయాకరణవిహితాదేశమాత్రము. అంతియకాని లువర్ణము రాలేదు. దానిస్థానమున రువర్ణము రాలేదు. టుగ్, అయిక్, అవుక్, అరక్, ముక్ మొదలగు నాగమంబులఁ బరిశీలించునది. ముపర్ణలోపము చరిత్రాదులయందు విధింపఁబడినది. దీనిని లోప మనుట సరిగాదు. లౌకికముగా వచ్చిన ముపర్ణము లోపింప లేదు. ముపర్ణము రానే లేదు. అలౌకికముగా (శాస్త్రీయముగా) వచ్చిన ముపర్ణమే లోపించినది. ఇట్లనేకంబులు ముందుముందు నిరూపింపఁబడును.

## 4. సూత్రములు

వ్యాకరణమును సూత్రరూపమున వ్రాయుటయు సంస్కృతమునుండి యనుసరించినదే. ఆ సూత్రరచన యందే పెరిగినది గావుననే దాని లక్షణమును నందుండి గ్రహింపఁబడినదే. అల్పతమాక్షరసంఖ్యతో గూడిన రచన, అర్థ విషయికముగా సందేహమును గల్గింపనిది, నిస్సారమయిన భావములుగాని పద ములుగాని లేనిది, వ్యాప్తి గలది, దోషరహిత మయినదియును సూత్ర మగు

చున్నది.[1] ఇట్లు రచించిన సూత్రములు ధారణచేయుటకు సులభముగా నుండును. నన్నయ యిట్టి సూత్రరచననే చేసెనుగాని వానియందు పయిలక్షణము లన్ని యును బట్టవు. పొల్లుపదము లనేకములు గలవు. రచనయందు బిగువు తక్కువ. సందేహమునకుఁ దావులు లేకపోలేదు. ఈ విషయమునఁ బాణినిసూత్రములే మన కాదర్శప్రాయములు. నన్నయ తన గ్రంథము నార్యావృత్తములలో వ్రాయ వలసివచ్చుటచే ఛందోనియమముకొఱకుఁ గొంత శ్రమపడవలసివచ్చినదని యంగీకరింపక తప్పదు. పదముల సార్థక్యమును బరీక్షించినను, అర్థసంక్షేపక శక్తి నవలోకించినను, సూత్రసారళ్యమును శోధించినను చిన్నయరచనను మించిన రచన యాంధ్రవైయాకరణు లెవ్వరిచేతను గాలేదనుట సత్యదూరము కాదు. పాణినిసూత్రములయందలి ఫణితిని జక్కఁగాఁ దేఁగలిగినవాఁడు చిన్నయ. అతఁడు తెనుఁగుగద్యమున రచియించుటవలనను నట్టి బిగువయిన రచన పొసఁగినది. ఇట్టి రచన నారంభించినవాఁడు నన్నయ. పరిపూర్ణతను బొందించినవాఁడు చిన్నయ.

(a) పాణినీయసూత్రములను బతంజలిమహాభాష్యమును మనస్సునం దుంచుకొనిగాని, యా సూత్రములోని ప్రతీకము నెత్తికొనిగాని రచనము చేయుట చింతామణియందు విశేషముగాఁ గలదు.

సిద్ధిర్లోకాద్ధ్రుశ్యా—అని నన్నయసూత్రము. 'సిద్ధే శబ్దార్థ సంబంధే' యను పాతంజల మహాభాష్యవాక్యము నెత్తికొని వ్రాసిన దియ్యది.

సంస్కారార్థోనియమః—ఇదియును సుశబ్దాపశబ్దవిషయమునఁ బయి భాష్య మునఁ జేసిన యభిప్రాయమును గ్రహించి వ్రాసినదే.

విరళాన్ పేచోషాదికశబ్దాన్ ప్రవ్యాహారంతు శబ్దజ్ఞాః—'అస్త్యప్రయుక్తః, సంతివై శబ్దా అప్రయుక్తాః, ఊష, తేర, పేచేతి' అను పాతంజల భాష్యార్థమును మనసులో నుంచుకొని వ్రాసినదే పయి సూత్రము.

కర్మప్రవచనీయకే కూర్చిః-కర్మ ప్రచనీయ యుక్తే ద్వితీయా (పాణిని 2-3-8)
తోడసహార్థేటాసః— సహాయుక్తేఽప్రధానే (పాణిని 2-3-19)
పట్టీతి తు పంచమీ గుణేహేతౌ—విభాషా గుణేఽస్త్రియామ్ (పా. 2-3-25)
కంటేఽన్యారాదాదేః-అన్యారాదితరర్తే దిక్శబ్దాంచూత్తరపదాజాహియుక్తే(2-3-29)
లోపల నిర్ధారణోద్భవా షష్ఠీ—యతశ్చ నిర్ధారణమ్. (2-3-41)
యొక్క చ శేషే షష్ఠీ— షష్ఠీ శేషే (2-3-50)
విషయనిమిత్తాదిజా తథైవాఽన్యా—నిమిత్తా త్కర్మయోగే (వార్తికము)

పయిని నిరూపింపఁబడిన పద్ధతినే చిన్నయకూడ ననుసరించెను.

(b) చిన్నయ, పాణిని రచియించిన సూత్రములను, నన్నయ రచించిన సూత్రములను, అథర్వణుని కారికలను తెనిఁగించి తన గ్రంథమున నిముడించెను.

---

[1] స్వల్పాక్షర మసందిగ్ధం సారవ ద్విశ్వతోముఖమ్। అస్తోభ మనవద్యంచ సూత్రం సూత్ర విదో విదుః॥

| నన్నయ. | చిన్నయ. |
|---|---|
| ద్రుతాఖ్యోనః | నకారంబు ద్రుతంబు. సంజ్ఞ-11 |
| క్త్వార్థేతో న భవే త్సదా | క్త్వార్థంబైన యిత్తునకు సంధి లేదు. సంధి-8 |
| న వికృతిశబ్దాత్పరతస్సాంస్కృతికానాం భవంతి గసడదవాః | తెనుఁగులమీఁది సాంస్కృతిక పరుషంబులకు గసడదవలు రావు. సంధి-14 |
| ద్రుతస్య సర్వత్ర లుక్సమాసేషు | సమాసంబున ద్రుతంబునకు లోపంబగు. సంధి-24 |
| పరుషాణాం గసడదవా స్స్యుః పదాద్ద్వంద్వే | ద్వంద్వంబునం బదంబుపయి పరుషములకు గసడదవ లగు. సంధి-15 |
| నలడాదే రంతరుతశ్చ | ఆచ్ఛికంబులఁ బదమధ్యంబుల నలడరల యుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు. ప్రకీ-17. |
| అన్యేషాంచ ప్రయోగమహితానాం | లాతి యచ్చునకుసహిత మొకానొకచో నుడి నడుమ లోపంబు గానంబడియెడి. ప్రకీ-18. |
| స్త్రీపశుజడాన్వినాఽన్యే మహదాఖ్యా స్తద్విశేషణానీహ | స్త్రీతిర్యగ్జడ భిన్నంబులును వాని విశేషణంబులును మహత్తు లనంబడును. తత్స-17. |

పయి యుదాహరణంబులు దిఙ్మాత్రముగా సూచింపఁబడినవిగాని గ్రంథమునం దెల్లను నిట్టివి కలవు. తనకు ముం దుండిన యాంధ్ర వ్యాకరణమగు చింతామణిలోని సూత్రంబులను దెనిఁగించుటయందు విశేషము లేకపోవచ్చునుగాని, పాణినీయమునందలి సూత్రముల నున్నవాని నున్నట్లే యనేకస్థలములయందు చిన్నయ తెనిఁగించి తన వ్యాకరణంబునఁ బ్రవేశపెట్టెను.

| | |
|---|---|
| ప్రాతిపదికసంబోధ నోక్తార్థంబులం బ్రథమ యగు. కార-1 | ప్రాతిపదికార్థ లింగ పరిమాణ వచనమాత్రే ప్రథమా (ఇదియే మూలము.) |
| కర్మంబున ద్వితీయ యగు. కార-2 | కర్మణి ద్వితీయా. |
| క్రియాసిద్ధిం బ్రకృష్టోపకారకంబు కరణంబు. కా-4 వివరణము. | క్రియాసిద్ధౌ ప్రకృష్టోపకారకం కరణ సంజ్ఞం స్యాత్. కౌముది |
| గతి బుద్ధి ప్రత్యవసానార్థ శబ్దకర్మాకర్మకంబుల క ప్రేరణంబునం గర్తయగునది ప్రేరణంబునం గర్మంబగు. క్రి. 123 | గతి బుద్ధి ప్రత్యవసానార్థశబ్దకర్మాకర్మకాణా మణి కర్తా స ణౌ. 1-4-52. |
| ధాతువునకు క్రియా 1 | ధాతోః 3-1- 91. |
| వర్తమానంబున లట్టగు ,, 2 | వర్తమానే లట్ 3-2-123. |
| భూతంబున లిట్టగు ,, 3 | పరోక్షే లిట్ 3-2-115. |

పయిరీతిని అనేకసూత్రముల పరివర్తితరూపములును, కొంచెము కొంచెము సవరించిన రూపములును చిన్నయ వ్యాకరణమునం బ్రవేశించినవి.

(c) ఒకానొక ప్రకరణమునందుఁ గల సూత్రముల వరుసయును పాణినీయము నుండియే గ్రహింపఁబడినది అనఁగాఁ బాణినీయమున నవలంబింపఁబడిన సూత్రముల పౌర్వాపర్యము ననుసరించుచు ననేకసూత్రముల నొక్కసూత్రముగాను, ఒక సూత్రము ననేకములుగాను విభజించి చిన్నయ వ్రాసెను.

అపాయ భయ జుగుప్సా పరాజయ ప్రమాద గ్రహణ భవన త్రాణ విరామాంతర్ధి వారణంబు లెద్దాననగు దానికి వలన వర్ణకంబగు. కార—9.

| | | |
|---|---|---|
| ధ్రువమపాయేఽపాదానమ్ | 1-4-24 | |
| అపాదానే పంచమీ | 2-3-28 | అపాయ. |
| భీత్రార్థానాం భయహేతుః | 1-4-25 | భయ, త్రాణ. |
| పరాజేరసోఢః | 1-4-26 | పరాజయ. |
| వారణార్థానా మీప్సితః | 1-4-27 | వారణ. |
| అంతర్ధౌ యేనాదర్శనమిచ్ఛతి | 1-4-28 | అంతర్ధి. |
| భువః ప్రభవః | 1-4-31 | భవన. |

జెగుప్సావిరామ ప్రమాదార్థానా ముపసంఖ్యానమ్. వార్తికము. జుగుప్సా విరామ ప్రమాదములు. పంచమీ విభక్తే 2-3-42 గ్రహణ.

పయి నీయంబడిన పాణినీయసూత్రముల యొక్కయు, వార్తికముల యొక్కయు భావము నొక్కసూత్రంబుననే గ్రహించె ననుట స్పష్టము.

కర్తృకరణయో స్తృతీయా 2-3-18

చేతవర్ణకంబు కర్తకగు కార—3

చేతవర్ణకంబు హేతుకరణంబులకు గ్రహ్యాదియోగజంబగు పంచమికిని బహుళంబుగా నగు. కార—4

పయి పాణినీయసూత్రమునందలి భావమును గ్రహించి రెండుగా భాగించి మూఁడవ సూత్రమునను, నాల్గవదాని భాగంబునను సరిపుచ్చెను. ఇట్టి వనేకములు గలవు.

కారకప్రకరణమునందలి సూత్రములవరుస యంతయును ప్రాయికముగా సిద్ధాంతకౌముదియందలి విభక్త్యర్థప్రకరణమునందలి వరుసపయినే యాధారపడి యున్నది.

కాలాధ్వనోరత్యంత సంయోగే 2-3-5. ఈ పాణినీయసూత్రమున కాలాధ్వములు గ్రహించుటచేతనే చిన్నయసూరి కాలాధ్వములకుం (ప్రాయికంబుగా ప్రథమ యగు) కార-25. అని సూత్రించెనని గ్రహించుట సులభము. ఇట్టి వనేకములా యా సందర్భములలో నిరూపింపఁబడును.

(d) సూత్రములను రచియించిన పాణిని కా యా సూత్రములయొక్క పౌర్వాపర్యక్రమమును, బాధ్యబాధక భావమును, పరస్పరసంబంధ నిర్ణాయక ప్రణాళికయును ఏర్పఱుపవలసివచ్చినది. ఇట్టి విషయములను పాణిని తన వ్యాకరణమున వాచ్యముగానే సూత్రించెను. కొన్ని యర్థరూపమున సిద్ధించినవి. శాస్త్రమును జాలకాలము పఠించిన పండితు లనేకములయిన యీ పద్ధతులను, నిర్ణయములను, అన్వయసరణిని పరిభాషలుగా నిర్ణయించిరి. అట్టి పరిభాషలు శతసంఖ్య గలవు. వాని నన్నిటిని గ్రహించి 'పరిభాషేందుశేఖర' మను పేర విపులమయిన వ్యాఖ్యతో సోదాహరణరూపముగ నాగేశుఁడు వ్రాసెను. ఆ పరిభాషలయందలి సారమునే అక్కడక్కడ చిన్నయ తన బాలవ్యాకరణమున నతిదేశించి వ్రాసెను. అట్లా పరిభాషల నుపయోగించునపుడు కొన్నియెడల వివరణము చేయకయే విడిచెను. "ప్రథమేతరవిభక్తి విధి నిరవకాశంబు గావున దీనిని బాధించెడిని" సంధి-9. ఇందు నిరవకాశ మనుపదము పారిభాషికము. 'నిరవకాశా హి విధయః సావకాశాన్ విధీన్ బాధంతే' అను పరిభాష యిం దనుసంధింపఁబడినది. నిరవకాశములయిన విధులు సావకాశములయినవానిని బాధించునని దీని యర్థము.

ఇట్లే క్రియాప్రకరణమున 50, 64 సూత్రములకుఁ గలుగు ప్రసక్తిని నిర్ణయించునపుడు మఱియొక పరిభాష నుపయోగించెను.

"కృతాకృతప్రసంగి నిత్యంబునాఁబడు" 50 వ సూత్రంబున గుణించు, గుణియించు అను వికల్పరూపములను సాధించునపుడు జయించు అను నిత్యరూపమునుగూడ సాధింపవలసిన యవసరము గలిగినది. 'జి + ఇంచు' అని యుండఁగా 'నిత్యంబగుటంజేసి యయుగాగమంబు రాఁగా యాంతంబగుటంజేసి యియుడాగమంబు లేదని యెఱుంగునది. కృతాకృతప్రసంగి నిత్యంబునాఁబడు' అని సూరి రచియించెను. 'కృతాకృతప్రసంగి నిత్యమ్' అను వాక్యము నీ సందర్భమున నుదాహరించెను. పయి సందర్భమున సూరిగారిని విమర్శించుచు గుప్తార్థప్రకాశికాకారులు వేఱొక విషయమును నుడివిరి. 50వది పూర్వసూత్రము. 64వది పరసూత్రము. రెండుసూత్రములును నొక్కచోఁ బ్రవర్తింపవలసివచ్చినపుడు పరసూత్రము వచ్చునుగాని పూర్వము రాదని వ్యాకరణ సంప్రదాయము. "పూర్వపరనిత్యాంతరంగాపవాదానా ముత్తరోత్తరం బలీయః" అను పరిభాష నుదాహరించిరి. పరత్వమే యిక్కడఁ జాలును. నిత్యత్వ మక్కఱలేదు. పూర్వసూత్ర నిత్యత్వ సందర్భముననే కృతాకృతప్రసంగమునకుఁ బ్రవేశమని వారు వ్రాసిరి.

పయి నీయంబడిన యనేకమార్గముల సూత్రరచనమునందు నాంధ్ర వ్యాకరణములలో సంస్కృతవ్యాకరణానుసరణము గనుపట్టుచునే యున్నది. ఇట్లనేకవిధంబులఁ గలుగు నీ యనుసరణ మక్కడక్కడఁ బ్రాసంగికముగా ముందు నుదాహరింపఁబడుచునే యుండును.

# తెనుఁగు వ్యాకరణములలోని యాంగ్లవ్యాకరణానుసరణము

పయిరీతి నాంధ్రవ్యాకరణమునందు సంస్కృతవ్యాకరణప్రభావ మెట్లు వర్తిల్లినదో సంగ్రహముగాఁ దెలిపితిని. నేఁటి తెనుగునం దాంగ్లభాషాప్రభావ మెట్లు ప్రకాశించుచున్నదో ముందే యక్కడక్కడ సూక్ష్మముగాఁ దెల్పితిని. దాని ప్రయోజన మెంతవఱకనఁగా నన్యభాష ప్రాధాన్యము వహించినపు డా యన్యభాష ప్రభావ మెట్లు హీనస్థితినున్న దేశభాషపైఁ బరిఢవిల్లునో తెలిసికొని ప్రాచీనకాలమున నుండిన సంస్కృతాంధ్రభాషాసంబంధ మూహించుకొనుటమాత్రమే. పయి విచారణమే స్పష్టతకొఱకును, ప్రామాణికత్వముకొఱకును మఱికొంచెము చేయఁబడుచున్నది. ముందు నిరూపించిన ప్రౌఢ, సులభ, సంగ్రహ వ్యాకరణముల రచియించిన వారును, సర్వలక్షణసంగ్రహకర్త యగు కుప్పణ్ణయ్యంగారును ఆంగ్లపాఠశాలలలోఁ బనిచేసినవారే. పయి యాంగ్లభాషాప్రభావము పదవిభజనమునందును, ముఖ్యముగా వాక్యప్రకరణమునను గనుపట్టుచుండునని ముందే దెల్పితిని.

## 1. వాక్యప్రకరణము

(a) వాక్యలక్షణము : ప్రౌఢవ్యాకరణమున 'వాక్యమునా యోగ్యతాకాంక్షా సహితంబగు నర్థము గల యాసత్తియుక్త పదసముదాయము' అను లక్షణము సాహిత్యదర్పణమునుండి యున్నదున్నట్లే తెనిఁగింపఁబడినది.[1] 'విషయబోధకము వాక్యము. ఉద్దేశ్యవిధేయభిన్నంబు విషయంబు' అని సూత్రింపఁబడెను. ఆంగ్లవ్యాకరణములలో వాక్యలక్షణ ముండుటఁ జూచి ప్రాచీనాంధ్రవ్యాకరణములలో నంతకుముందు లేని యీ ప్రకరణమును దత్కర్త ప్రవేశపెట్టెనుగాని విభజనప్రణాళికయును లక్షణనిర్వచనమును సంస్కృతమునుండియే గ్రహించెను. వీరేశలింగముపంతులుగారు 'ఒకక్రియతో నన్వయించు పదసముదాయము వాక్య మనంబడును'[2] అని లక్షణ మేర్పఱచిరి. వీరి మతమున నసమాపకక్రియలు క్రియలేగనుకను, ఒక వాక్యముననే యనేక సమాపకాసమాపకక్రియ లుండునని యంగీకరించిరి గనుకను లక్షణ మవ్యాప్త మనవచ్చును. ఈ లక్షణమును, దాని వివరణమును ఆంగ్లవ్యాకరణమునందలిదానికి బరివర్తనమే యగునేమో! 'భావపూర్తి గలిగి సమాపకకారకక్రియలలో

[1] వాక్యం స్యా ద్యోగ్యతాకాంక్షాసత్తియుక్తః పదోచ్చయః-సాహిత్యదర్పణము.

[2] సంగ్రహవ్యాకరణము-63 పుట.

నొక్కటితోఁ జేరిన పదసమూహము' అను కుప్పుణ్ణయ్యంగారి లక్షణమునను అసంపూర్ణ వాక్యము గ్రహింపఁబడలేదు గనుక నవ్యాప్తమే యగుచున్నది. "సంపూర్ణ మసంపూర్ణమని వాక్యంబు ద్వివిధంబు" అను ప్రౌఢవ్యాకరణసూత్రమునను ఆంగ్లము నందలి Complete and Incomplete sentences అనువాని ఛాయ గలదు.

(b) వాక్యజాతులు: ఆంగ్లమునందలి వాక్యములు మూఁడువిధములు. Simple, Complex and Compound అనునవి. ఈ మూఁడిటిని గ్రహించి తెనుఁగున సామాన్య, సంశ్లిష్ట, ద్వంద్వ వాక్యము లను పేళ్ళను గల్పించి తెనుఁగున సంగ్రహ వ్యాకరణ కారుఁడు ప్రవేశపెట్టెను. ఉపవాక్య మనుపేరు Subordinate sentence అను నాంగ్లపదమునకుఁ బరివర్తనముగాగూడ వాడెను. పయి మూఁడు వాక్యములనే కుప్పుణ్ణయ్యంగారు లఘువాక్యము, అలఘువాక్యము, క్లిష్టవాక్యము అను మూఁడు పేళ్లతో వ్యవహరించెను. ఉపవాక్యములు నాలుగువిధములని వివరించి ఆంగ్లము నందలి Adjectival clause, Adverbial clause, Noun clause అను మూఁడుపేళ్ళను నామవిశేషణోపవాక్యము, క్రియావిశేషణోపవాక్యము, విశేషణోపవాక్యము అని పరివర్తించి పైఁగా ఉపమానోపవాక్యము అను పేర నొకదానిని గల్పించి చేర్చెను. ఈ విభాగమునకంతటికిని లక్షణమును ఆంగ్లవ్యాకరణములో నున్నదానినే యెత్తి తెనుఁగునఁ బరివర్తించెను. పైఁగా వీరేశలింగముగారు ద్వంద్వవాక్యమునకే Compound sentence మహావాక్యము అను పేరుగూడఁ గల్పించిరి. 'మహావాక్యము' అను పదమునకు ప్రౌఢవ్యాకర్త ఇట్లు లక్షణము వ్రాసెను. వాక్యసముదాయము మహావాక్యము నాఁబడు. అయ్యది రామాయణాదికము.[3] పయి రెండుపట్లను మహా వాక్యసందర్భమున భేదము కన్పించుచున్నది. రెండవది ప్రమాణసిద్ధము. మహా వాక్య మను పదము సంస్కృతగ్రంథముల నొకయర్థమున వాడంబడినది. ఆ యర్థ మున దానికి శక్తిగలదు. సంస్కృతపదములన్నియును దెనుఁగునఁ దత్సమములుగాఁ బ్రవేశించుట చాలకాలమునుండి యుండుటచేతను సంస్కృతపదములన్నియుఁ దెనుఁ గున శక్తము లగుచున్నవి. వాని యర్థమును బ్రమాణసిద్ధ మగుచున్నది. Compound sentence అను నర్థమున నీ పదము శక్తము గాదు, యుక్తమును గాదు. కాఁబట్టి యీ పద మన్వార్థబోధకమే యగునుగాని యేతదర్థబోధకము గానేరదు. పయిగా నీ వాక్యవిభజనప్రణాళిక తెనుఁగునకుఁ బట్టదు. ఎల్లేని పట్టించుటకు శ్రమపడి ప్రయత్నించినను గూడ వీరు కల్పించిన లక్షణములును అవ్యాప్తములో, అతి వ్యాప్తములో యగుట సంభవించుచునే యున్నది. సంస్కృతాంగ్లములలో నున్నట్లు క్రియాపదప్రాధాన్యము గల వాక్యము తెనుఁగున సిద్ధము కాలేదుగావున నిట్టి విభజనము తెనుఁగుస్వభావమునకు సరిపడనిది యనుట క్రియాప్రకరణచరిత్రమునుబట్టి స్పష్టము కాఁగలదు.

---

[3] వాక్యోచ్చయో మహావాక్యం, యథా రామాయణ మహాభారత రఘువంశాది. సా. ద సంగ్రహవ్యాకరణము. పుట 64; సర్వలక్షణసారసంగ్రహము. పుట 20.

(c) వాక్యవిభజనము: Analysis of sentences అనఁగా వాక్యమును తద్గతావయవములనుగా విభజించుట యను ప్రణాళిక వీరిచేఁ దెనుఁగున బ్రవేశపెట్టఁబడినది. కర్తను, కర్మను, క్రియను, తత్తద్విశేషణములను వేర్వేఱుగా నొకపథకమున నిరూపించు నభ్యాసము ఆంగ్లపాఠశాలలయందుఁ గలదు. ఇది పాఠశాలలో బాలురచేఁ జేయింతురు. దానిని జూచియే వీరేశలింగముగారును, కుప్పుణ్ణయ్యంగారును దానికి దమ వ్యాకరణములఁ బ్రవేశమును గలుగఁజేసిరి. ఆ పథకమును, నందలి శీర్షికలును ఆంగ్లవ్యాకరణములలోనివానికిఁ బరివర్తనములే.

(d) శబ్దాతిదేశము : Parsing అను నొక యభ్యాసము ఆంగ్లవ్యాకరణములం గలదు. అందు వాక్యములోని యొక్కొక్కపదము ఏజాతికిఁ జెందినది, వాక్యములోని కర్తృ కర్మ క్రియలలో నెద్దానితో దాని కెట్టి సంబంధమున్నది యను విషయము తెలుపఁబడును. ఈ వాడుకగూడ నాంగ్లవ్యాకరణములయందలిదే. బాలురచే నుపాధ్యాయులందఱును నున్నతపాఠశాలలలో నాంగ్లమున జరిపించునదియే. అట్టి పద్ధతిని తెనుఁగువ్యాకరణమునఁ బైయిరువురును బ్రవేశపెట్టిరి. శబ్దలక్షణక్రమము అని దీనికి కుప్పుణ్ణయ్యంగారు నామకరణము చేసిరి. శబ్దాతిదేశము అని వీరేశలింగముగారు పేరిడి 'ఒకవాక్యమునందలి పదముల సంబంధనిరూపణము చేయు విధము శబ్దాతిదేశ మనంబడును' అని లక్షణము చేసిరి. ఈ అతిదేశశబ్దము సంస్కృత వ్యాకరణమున నర్థవిశేషమున రూఢమయియున్నది. మీమాంసాశాస్త్రమున రూఢమయియున్నది.[4] అట్టి యర్థవిశేషమున రూఢమయియున్న శబ్దములను ఇతరార్థములయందు వాడుట యుక్తముకాదు. శబ్దశాస్త్రమునకు విరుద్ధము. ఉద్దిష్టార్థముకంటె విరుద్ధార్థమే స్ఫురించుచుండును. పండితులు సంస్కృత కావ్యపఠనమునఁ జెప్పించు ఆకాంక్షకును, ఈ పార్సింగునకును సంబంధము లేదు.

## 2. పదవర్గీకరణము

పదముల జాతులను వర్గీకరణముచేయునప్పుడును, సంజ్ఞావాచకములను గల్పించునప్పుడును ఆంగ్లవ్యాకరణములనుండి కొన్నియభ్యాసములు పైవ్యాకర్తలచే నిందుఁ బ్రవేశపెట్టఁబడినవి.

(a) సర్వనామములను వివరించుచు సంగ్రహవ్యాకరణమున 'సంబంధ సర్వనామములు' అను పదము Relative Pronoun అను పదమునకు సమానముగా

---

[4] అతిదేశోనామ ఇతరధర్మస్య ఇతరస్మిన్ ప్రయోగాయ ఆదేశః. అన్యత్రైవ ప్రణీతాయాః కృత్స్నాయా ధర్మసంహతేః । అన్యత్ర కార్యతః ప్రాప్తి రతిదేశః స ఉచ్యతే. ప్రాకృతాత్ కర్మణో యస్మాత్తత్సమానేషు కర్మసు । ధర్మప్రవేశో యేన స్యా దతిదేశ స్స ఉచ్యతే. శాస్త్ర కార్య నిమిత్త వ్యపదేశ రూపాతిదేశమని యిది యైదు విధములు.

వాడఁబడినది. వీనినే సంబంధబోధకసర్వనామము అని యిందే స్థలాంతరమున వ్యవహరించితిని. వీనిని పూర్వులు యత్తదర్థకము లనిరి. 'యత్కిమర్థకము' అని ఎవఁడు శబ్దమును సూరి (బా. వ్యా. పుట 42) వ్యవహరించెను. కిమర్థకము లనుటకు బదులు పంతులుగారు ప్రశ్నవాచకసర్వనామములు అని Interrogative Pronouns అను పదమును తెనిఁగించిరి.[5] విశేషణసర్వనామములు అను పదమున Pronominal adjectives అను భావమును బరివర్తించిరి. నిర్దిష్ట సర్వనామములు, అనిర్దిష్ట సర్వనామములు అను పేరను Demonstrative Pronouns, Indefinite Pronouns అను పదములను తెనిఁగించిరి. ఈ Demonstrative Pronouns అను పదమునే నిర్దేశకసర్వనామము అను పేర నింతకుముం దీ గ్రంథమున వ్యవహరించితిని.

(b) క్రియలను సమాపకక్రియ లనియును, అసమాపకక్రియ లనియును రెండు విధములుగా పై వైయాకరణులందఱును విభజించిరి. నన్నయగాని, చిన్నయగాని పై విభజన మెక్కడను ననుసరించినట్లు కనుపట్టదు. ఇది ఆంగ్లమునందలి Finite and Infinite verbs అను భావము ననుసరించి కల్పింపఁబడినది. పయిగా సులభవ్యాకరణమున సమాపకక్రియకు లక్షణము కల్పించిరి. 'కార్యము కొఱత లేక ముగియునట్లు చెప్పునది సమాపకక్రియ' (పుట 111 సూ. 4) ఈ లక్షణ మెంతయు నవ్యాప్తము. చేయుచున్నాఁడు అను పదమువంటి వర్తమానార్థక రూపము లన్నియును కార్యము జరుగుచున్నట్లు చెప్పుచునే యుండుటవలన నయ్యవి యన్నియును లక్షణమునఁ బరిహరింపఁబడినవి. ఇది యనిష్టము. కార్యము పూర్ణముగ ముగియనట్లు చెప్పునది యసమాపకక్రియ. చేయుచున్నాఁడు మొదలయినవి యిందుఁ గ్రహింపఁబడినవి. లక్షణ మతివ్యాప్తము.

(c) పయిరీతిని సిద్ధములయిన యసమాపకక్రియలను రెండువిధములుగా సులభవ్యాకరణమును, మూఁడువిధములుగా సంగ్రహవ్యాకరణమును విభజించినవి. "క్త్వార్థకము లోనగు క్రియలు క్రియాకాంక్షాసమాపకములు. క్రియాజన్యవిశేషణములు నామాకాంక్షాసమాపకములు"[6]. అవ్యయములు, విశేషణములు, విశేష్యములు అని యసమాపకక్రియలు మూఁడు విధములు.[7] పయిరూపమున నున్న విభజనభేద మేల యేర్పడినదని యూహించుట సులభము. ఆంగ్లవ్యాకరణమున నున్న యభిప్రాయములను, విభజనమును దెచ్చి తెనుఁగున వాడఁబడుచున్న వ్యాకరణవిభజనప్రణాళిక కతికింపఁ బ్రయత్నించుటయే పై వైవిధ్యమునకుఁ గారణము. ఇంకొకవిషయ మేమనఁగా, వీరి సంజ్ఞ లన్వర్థములు గావు. లక్షణములు దుష్టము లగుచున్నవి. నామాకాంక్షాసమాపకక్రియకు 'చదివెడు' అను క్రియా

[5] సంగ్రహ వ్యాకరణము. పుట 28, 29.

[6] సులభవ్యాకరణము. పుట 111-112.

[7] సంగ్రహ వ్యాకరణము. పుట 32-33.

జన్యవిశేషణ ముదాహరణముగా సులభవ్యాకరణమున నీయఁబడినది. 'చదివెడు' అనునది కార్యమును సమాప్తముగాగాని, యసమాప్తముగాగాని తెలుపదు. ఆ పక్షమున నయ్యది సమాపకమును గాదు, అసమాపకమును గాకపోవలసివచ్చును. కాఁబట్టి సమాపకాసమాపకములకు భేదము నన్యత్ర సాధింపవలసినదేకాని పయి లక్షణమునఁ గాదు. సంగ్రహవ్యాకరణకారుఁడు పయి త్రిధావిభజనమును మాత్రము తెలిపి యవ్యయములకు నుదాహరణముల నిచ్చి (తుమున్ క్త్వా శత్రర్థకములను) యితరములకు నొసంగలేదు. సులభవ్యాకరణకారుని యుదాహరణమును ముందే పరిశీలించితిని. ఇక మూఁడవది యగు విశేష్యాసమాపకక్రియలకు (ధాత్వర్థకాదు లని నామాంతర మాతని మతమున) ఉదాహరణము ఊహ్యాము. చేయుట మొదలగు భావనామ మని యూహింపవచ్చును. అట్లయినచో 'అసమాపకక్రియ కానే కా దీ చేయుట.' చేయుట యను పదమున కాంగ్లమున Doing లేక To do అని పరివర్తనము. అం దీ రెండును విశేష్యములుగా వాడనగును. వీనిని Infinite verbs అని వాడి రాంగ్లవైయాకరణులు. దానికి తెనుఁ గియ్యది. వారి విభజనమందలి ప్రధానవిషయము వేఱు. మన వ్యాకరణముల పద్ధతి వేఱు. మూలసిద్ధాంతములో వీని కైక్యము లేదు. కావుననే యీ తబ్బిబ్బులు.

సంగ్రహవ్యాకరణకారుఁడు "మఱియు సహాయక్రియలు, స్వతంత్రక్రియలు, న్యూనక్రియలు అని క్రియలు ముత్తెఱంగులుగా నుండును. సహాయక్రియలకే యుపక్రియ లని పేరు" అని సూత్రించెను. ఈ విభజనమును Principal verbs, auxiliary verbs and defective verbs అను నాంగ్లవిభజనము ననుసరించినదే. ఉండు, కలుగు, పడు, కొను అనునవి యుపక్రియలుగా నుదాహరింపఁబడినవి. అనఁగా auxiliary verbs అని యర్థము. ఆంగ్లమునందలి auxiliary verbs కును, పయి క్రియలకును చాల భేద మున్నది. I am going వాక్యములో am అనునది సహాయ క్రియ యయ్యు స్వతంత్రక్రియకన్న భిన్నపదము. రెండును రెండు భిన్న క్రియాపద రూపములు. తెనుఁగున 'ఉండు' మొదలయినవాని రూపములు ధాతువునకుఁగాని, తద్రూపములకుఁగాని అనుబంధములుగాఁ జేర్పఁబడి యేకపద మగుచున్నవి. వీని ననుబంధము లని ప్రాచీనులు వ్యవహరించిరి. ఇదియే వీని స్వభావమును సరిగా నిరూపించుచున్నది.[8] సంగ్రహవ్యాకరణకారుఁడు "క్రియలేని వాక్యమును ఉండును. వచ్చినవాఁడు ఫల్గునుఁడు" అని యుదాహరించెను. (పుట 64) వీరి మతమున 'వచ్చిన' మొదలయినవి యసమాపకక్రియలని ముందే నిరూపించితిని. అట్లయిన క్రియ లేకపోవుట యెట్లు? అసమాపకక్రియతోడి సంపూర్ణ వాక్యము గలదని చెప్పవలెను. ఇదియును స్వవచోవ్యాఘాతమే యగును. పయిగా నీ యుదాహరణము వెనుకనే కుండలీకృతముగా "అయిన నిట్టిచోట్లఁ గ్రియ యధ్యాహార మయి యుండును" అని వ్రాసిరి. ఇం దొక సమాపకక్రియ యధ్యాహారము

[8] భవతి రనుబంధక స్స్యాత్, అస్తి రనుబంధక స్స్యాత్—చింతామణి—క్రి. ప.

చేసికొనవలసివచ్చునుగదా వారి మతమునందు ? అట్లయిన నేమని యుండవలయును ? 'వచ్చినవాఁడు ఫల్గునుఁడై యున్నాఁడు' అనవలెనా ? ఇది తెనుఁగునకు సరసమును, స్వాభావికమును నయిన కల్పనకాదు. పయిగా 'వచ్చిన' యనునది కార్యమును పూర్ణముగ ముగియుసట్లుగ చెప్పుచున్నదే ! దీనిని పై మతమున నసమాపక మనుట యెట్లు ?

(d) సంగ్రహవ్యాకరణకారుఁడు (పుట 70) అవ్యయముల లక్షణమును వివరించెను. "అవ్యయములు క్రియలతోడను, విశేషణములతోడను, ఇతరావ్యయములతోడను అన్వయించును" అని వ్రాసి, 'మిక్కిలి' అను పదము నుదాహరణముగా నిచ్చెను. "వాఁడు మిక్కిలి నడపును, వాఁడు మిక్కిలి మంచివాఁడు, వాఁడు మిక్కిలి చక్కఁగాఁ జదువును." ఈ మూఁడు ఉదాహరణములయందును వారి లక్షణము పట్టును. ఈ లక్షణము ఆంగ్లమున నున్న Adverb అను పదమును, దదర్థమును మనసునం దుంచుకొని యేర్పఱిచినది. కావుననే యసంపూర్ణము. 'మిక్కిలి కన్ను, మిక్కిలి వాఁడు' మొదలయిన స్థలములయందు మిక్కిలి విశేషణ మగుచున్నది. ఇది విశేషణ మనుట శబ్దరత్నాకరాదులనుబట్టి చూడనగును. మిక్కిలి=అధికము. తెనుఁగుభాషాస్వభావమునుబట్టి విశేష్య—విశేషణములకుఁ గల భేద మత్యల్పమని ముందు నిరూపింపఁబడును. అప్పుడు దీనిని విశేష్యముగాఁగూడ వాడవచ్చును. అట్లయినచోఁ బయి యవ్యయలక్షణము పోయినది. తెనుఁగునందలి యవ్యయముల లక్షణము ఆంగ్లమునందలి Adverb కంటె సంస్కృతావ్యయములకే సమీపతరము. ఎల్ల యనునది తెనుఁగువైయాకరణుల మతమున నవ్యయమే. పయిదానికిని సంగ్రహవ్యాకర్త లక్షణము కుదురదు.

## 3. ఇతర విషయములు

ఇం కొకటి రెండు విషయములనుమాత్రము నిరూపించి యీ ప్రకరణమును ముగింపవచ్చును. సులభవ్యాకరణకారుఁడు కర్తలక్షణమును వివరించుచు నీ క్రిందిరీతిని వ్రాసెను.

(a) సూ. 5. "ధాత్వర్థవ్యాపారాశ్రయము కర్త.
,, 6. కర్త—పదము మాత్రము. వస్తువ్యాపారము క్రియ.

ఉదా : పక్షు లెగిరెను. "ఇచట కర్త పక్షు లను మాటయేగాని యాకాశమునఁ బోవు పక్షు లను జీవజంతువులు కావు." అని వ్రాసెను. ఈ రీతి విభజనము సంస్కృతవ్యాకరణమునకును, దెనుఁగువా రవలంబించిన ప్రణాళికకును నెంతయును విరుద్ధము. సంస్కృతవ్యాకరణమున కర్తృ కర్మాది శబ్దములు అర్థములకే ముఖ్యముగా సంజ్ఞలు గాని తద్వాచకశబ్దములకు గావు. కొన్ని స్థలములందు శబ్దార్థ

ములకుఁ గల యభేదమునుబట్టి తత్తద్వాచకపదమును లక్ష్యబోధకముగాఁ గ్రహింపనగును. కావుననే యట్టి యర్థమును వివరించుటకుఁ బాఠములఁ జెప్పు పండితులు 'కర్తృవాచకపదమునకుఁ బ్రథమావిభక్తి' యని స్పష్టపఱచి చెప్పు చుందురు. కర్త పద మెన్నటికిని గాఁజాలదు. అది యెప్పుడును నర్థమే సంస్కృతాంధ్ర వైయాకరణ మతమున. ఆంగ్లమున కర్తృత్వము శబ్దమాత్రధర్మమని నిరూపింపవచ్చును. అట్టి యభ్యాసమునుబట్టియే యిట్టి సూత్రరచన చేయవలసిన యవసరము వీరికి వచ్చినది. ఈ క్రింది యాంగ్లవ్యాకరణాభిప్రాయమును దిలకించునది. "క్రియ కర్త్రర్థకరూపమునుండి కర్మార్థకరూపమునకు మార్చఁబడినపుడు, కర్త్రర్థకప్రయోగమున నున్న క్రియయొక్క కర్మ, కర్మార్థకప్రయోగమునఁ గ్రియకుఁ గర్త యగుచున్నది."[9] పైవాక్యములోని యర్థమునుబట్టి పరిశీలించినచో కర్తృత్వ, కర్మత్వములు ఆంగ్లవ్యాకరణమునుబట్టి శబ్దధర్మము లనుటయే సత్యము. ఈ సంస్కారమును మనసునం దుంచుకొనియే సులభవ్యాకరణకారుఁడు పయిరీతిని సూత్రించుట కవకాశ మేర్పడినది. కాని యీ సంప్రదాయ మెంతయుఁ దెనుఁగు వ్యాకరణాభిప్రాయములకు విరుద్ధము. కర్మార్థకప్రయోగము నుద్దేశించి 'చేత వర్ణకంబు కర్తకగు' అని బాలవ్యాకరణకారుఁడు సూత్రించెను. కర్తకు అనఁగా కర్తృవాచకపదము అని లక్షణాసిద్ధము. ఇది యెల్లయెడలను జెల్లవలసిన ప్రణాళిక. ఇట్టి లక్ష్యార్థసిద్ధి కర్తృకర్మకరణాదు లగు నెల్లకారకములకును జెల్లవలసిన ప్రణాళిక గావునఁ బయిరీతిని ఒక్క కర్తకుమాత్రము సూత్రింపవలసిన యవసరము లేదు. కాఁబట్టి యిది యాంగ్లసంస్కారజన్యమే యనుట సిద్ధము.

నేఁటి యాంగ్లభాషాబోధక పాఠశాలలందు వచ్చుచుండు వైరుధ్యము నీ క్రిందిరీతిని గణియింపనగును. "రామునిచేతఁ గుక్క గొట్టబడెను" అను వాక్యము నిచ్చి కర్త యేది యని ప్రశ్నించినచోఁ దెనుఁగుక్లాసున రాముఁడు అని బాలుఁడు వ్రాయవలయును. The dog is beaten by Rama అను వాక్యమున Subject ను ఇంగ్లీషుక్లాసున వ్రాయుమనినచో dog అని వ్రాయవలయును. వీనికి వ్యత్యస్తముగ నొకక్లాసున నితరసంస్కారమున నితరాభిప్రాయమును వ్రాసిన విద్యార్థులను, నట్లు వ్రాయుటవలన నుపాధ్యాయులలో నేర్పడిన వివాదములను నేను స్వయముగాఁ గని విని యున్నాఁడను.

(b) సర్వలక్షణసారసంగ్రహకర్త గ్రంథముమొదటనే "ఆంధ్రభాషయందు పదంబులు పదునొకండు విధంబులు" అని సూత్రించి ఉపపదము=Article అని వ్రాసెను. ప్రత్యయము = Preposition అని నిరూపించెను. ప్రౌఢవ్యాకరణ

[9] *High School English Grammar* by Wren. Page 95. "It will be noticed that when the verb is changed from the Active to the Passive voice the object of the transitive verb in the Active voice becomes the subject of the verb in the Passive voice."

కారుఁడు "పదము లవి నామంబులు క్రియ లవ్యయంబు లని త్రివిధంబులు" అని సూత్రించెను. (వాక్య. 3) సంగ్రహవ్యాకరణకారుఁడు "కొందఱిమతంబున శబ్దములు మూఁడువిధములు గలవి" అని వ్రాసి తన మతమున "విశేష్యములు, విశేషణములు, సర్వనామములు, క్రియలు, అవ్యయములు అని పదము లయిదు విధములు గలవి" యని సూత్రించెను. సర్వనామములు విశేష్యములును విశేషణములునుగూడ నగుననియు, సర్వనామములుగూడ నామములే యనియు, విశేష్య విశేషణభేదము కల్పితమే యనియు నేర్పఱుపఁదగిన ప్రౌఢవ్యాకరణకారుని యాశయము నాదరింపక కేవ లాంగ్లభాషాసంస్కారమునే యంగీకరించి Nouns, Pronouns, Adjectives, Verbs and Adverbs అనునట్టి యాంగ్లవ్యాకరణవిభజన యొక్క సంగ్రహరూపమునే యంగీకరించెను. కుప్పణ్ణయ్యంగారు పదునొకండు విధములను గ్రహించిరి.

(c) ఆంగ్లమునందలి Articles అనునవి మూఁడు. a, an, the, అనునవి. మొదటి రెండును అనిర్దిష్టార్థమున వాడుదురు. మూఁడవది నిర్దిష్టార్థమున నుపయోగపడును. ఇవి నిశ్చితముగా విశేషణములే. అట్లయిన వీనికి వేఱుగ వర్గీకరణమేల యను ప్రశ్న రాకతప్పదు. ఇవి చారిత్రకముగా విశేషణములే యయ్యును వాని ప్రయోగబహుళతవలనను, అర్థవిశేషబోధకతాశక్తివలనను వీనిని పృథగ్జాతిగా గ్రహింపవలసివచ్చినది. ఈ యుద్దేశమే ఆంగ్లవ్యాకర్తలు వ్రాసిరి.[10] ఈ మూఁడుపదములకును సమానార్థకములుగాఁగాని సజాతీయము లనిగాని యెంచి ఆ, ఈ, ఒక అనువాని నొకజాతిగాఁ బేర్కొనవలసిన యవసరమే లేదు. మొదట Article అను శబ్దమునకు ఉపపద మనునది సరియగు సంజ్ఞ కాదు. అది అన్వర్థమున రూఢము.[11] ధనుర్వేద మనుచోట ధనుః అనునది ఉపపదమని కేవల విశేషణార్థమున వాడుకగలదు. ఇంటిపేరు మొదలగువానియందును రూఢము. వ్యాకరణమునను అర్థవిశేషణమున రూఢము. ఆంగ్లమున a, the అనువానికి సాధారణముగా ప్రయోగము తప్పదు. A house is built అనిగాని, The house is built అనిగాని చెప్పవలయునే గాని రెండును లేక ప్రయోగించుట సంప్రదాయము కాదు. అట్లే ఆ యిల్లు లేక ఒక యిల్లు అనియే తెనుఁగున బ్రయోగింపవలసిన యవసరము లేదు. సందర్భమునుబట్టి 'ఇల్లు' అను పదమునకే 'ఒక యిల్లు' అనిగాని, 'ఆ యిల్లు' అనిగాని యర్థము చెప్పనగును. ఇది తెనుఁగువారి కెల్లరకు స్పష్టమే.

---

[10] The adjectives a or an and the are usually called articles. They are really demonstrative adjectives. Wren: *High School Grammar.* Page 49

[11] ధనురుపపదమ్ వేదమ్, కిరాతా. 18-44 ధనుర్వేదము.
తస్యాః సరాజోపపదమ్ నిశాంతమ్, రఘువంశము 16-40.
ఆర్యశర్మన్ కథమ్ నిరుపపదమేవ చాణక్యమితి న ఆర్య చాణక్యమితి. ముద్రా. రా. 3. ఉపపదమతిఙ్. పాణిని 2-2-19.

ఇంతియగాక I have a black and white dog అనియు, I have a black and a white dog అనియు గల రెండు ఆంగ్లవాక్యములలో మొదటిదానికి నలుపు తెలుపు రంగులుగల కుక్క నాకున్నది యని యర్థము. రెండవదానికి నాకొక నల్ల కుక్కయు, తెల్లకుక్కయుఁ గలవు అని భావము. ఇట్టి భేదము 'a' అను పదమును ప్రయోగించుటచేతనే యేర్పడుచున్నది. ఇంత యర్థభేదము కల్గునట్లు ఆ పదముల వాడుక యాంగ్లభాషాస్వభావమునఁ బాతుకొనిపోవుటచేత వారి కా విభజన మవసరము. మన కది యనవసరము. అయినను ఇది యాంగ్లభాషాజ్ఞానసంస్కారజన్యముగా వచ్చినది.

(d) విభక్తి యనఁగా preposition అని యాంగ్లీకరించిరి. ఈ రెండిటికిని స్వరూపమునఁ బోలికయే లేదు. అర్థబోధకతయందుమాత్రము కొంత గలదు. Preposition అనఁగా నామాదికమునకుఁ బూర్వమున విభక్త్యర్థమందుఁ బ్రయోగించు శబ్దవిశేషము. తెనుఁగున విభక్తి మనకుఁ బరిచితమే. In, at, of మొదలయిన బహుసంఖ్యాకములగు నాంగ్లశబ్దములకును, తెనుఁగువిభక్తులకును ముడిపెట్టుట యుక్తముగాదు. ఈ ప్రిపోజిషనులను వాడుటచే విభక్త్యర్థములను దెలుపుట సర్వభాషాపరిణతియం దొక యవస్థను సూచించును. సంస్కృతమున నున్నట్లు విభక్తిప్రయోగప్రణాళిక తత్పూర్వమయిన యవస్థాంతరమును సూచించును. కాఁబట్టి యీ రెండుపదములకును సంబంధము లేనే లేదు.

ఆంగ్లభాషాప్రచార మధికముగా నుండుటచేతను, నద్దానికే గౌరవమును కలిగియుండుటను నందలి వాడుకలు తెనుఁగునఁ బ్రవేశపెట్టఁబడినవి. సంస్కృతమును, నాంగ్లమును దెనుఁగునకు విజాతీయములేగదా ? ఋణపడవలసివచ్చినప్పుడు దేనికయిన నేమి ? ఆంగ్లమర్యాదల నేల తెచ్చుకొనరాదు ? అని ప్రశ్నింపవచ్చును. వాస్తవముగా సమాధానము చెప్పవలసివచ్చినప్పు డేభాషనుండియైనను ఎవ్వరి శాస్త్రములనుండియైనను బద్ధతులను, విజ్ఞానమును మనము తెచ్చుకొనవచ్చును. అట్లు దీసికొనిరావలసినదే. మనకు లేనప్పుడు తెచ్చుకొనకుండఁగూడ నున్నచో నేనాఁటికి నభివృద్ధి గలుగదు. కాని సంస్కృతాంధ్రముల సంబంధము నేఁటిది గాదు. రెండువేల సంవత్సరములనాఁటిది. సారస్వతావస్థకు రాకముందు సుమారు వేయిసంవత్సరములు సంస్కృతముతోఁ గలసి తెనుఁగు పెనగి సంస్కృతమునంతటిని దనలోని కిముడ్చుకొనినది. ఆ వ్యాకరణప్రణాళిక లన్నియును గ్రహించి తన స్వభావమునకు ననురుద్ధమయినను, విరుద్ధమయినను వానినే యనుసరించి పెరిగినది. తెనుఁగునందలి భాషావిభజనవిజ్ఞానమునకుఁ బునాది సంస్కృతమే. కావున సంస్కృతమునుండి భావములను దెచ్చిపెట్టినచోటుల కొంతవఱకయిన నవి యతుకును. ఆంగ్లసంబంధము తెనుఁగున కట్టిదికాదు. అల్పకాలముక్రిందటనే యేర్పడినది. అప్పటికే తెనుఁగున వాఙ్మయము, వికాసము, వ్యాకరణము రూఢము లయినవి. కాఁబట్టి తెనుఁగునేలపై నున్న సంస్కృతపు బునాదులపయి నాంగ్లశిఖరములను నెలకొల్పుట సులభమయిన పనిగాదు.

ఆ కారణముననే పయి పండితుల ప్రయత్నములో వెలితి కలిగినది. ఇట్లనుటవలన నిపుణతతో వైరుధ్యము లేనట్లు భాషాస్వభావమును బరికించి వ్రాయువా రుండఁగూడ దనుట కాదు.

ఇంకొక విషయము. సంస్కృతమున నున్న వ్యాకరణవిషయిక విమర్శలును, తత్సంబంధమయిన విచారణలును వైదికకాలమునుండి పెరిగి విశాలమయి యున్నవి. వానినే గ్రహించినచో నట్టివానియందు దోషములు గన్పట్టుట సాధారణముగా సంభవింపదు. బహుముఖముల బహుకాలములఁ బ్రవహించిన సంస్కృతవ్యాకరణస్రవంతియం దెక్కడే నొక సాధకమార్గము కనుపట్టుచునే యుండును. కాని యాంగ్లమున నున్న నేఁటి భాషాశాస్త్రమునఁ బూర్వ సంస్కృతవైయాకరణులచేతఁ జేయఁబడిన రచనలును, అనేక స్వతంత్రవిచారణలును పుంజీభూతములయి వ్రాయఁబడియే యున్నవి. వాని సారము నంతటిని గ్రహించి చేయు విమర్శలుగాని విభజనలుగాని వేఱు. ఏవేని కొన్ని ప్రాథమిక విషయములందుమాత్రము ఆంగ్లపద్ధతులను గ్రహించి చేయు విభజనలు అతుకవు. దోషభూయిష్ఠములుగానే కనుపట్టుచుండును.

పయి విమర్శనమున మాదిరిగా గొన్ని వ్యాకరణము లుదాహరింపఁబడినవి. వానిలోని విషయములను విమర్శించుటయందలి యుద్దేశము స్పష్టము. అన్యవిజ్ఞానమెట్లు భాషాస్వభావమునఁ బ్రవేశించుచున్నఁ దను విషయమును బరీక్షించుటయే యభిప్రాయముగాని, వారి ప్రయత్నములయందు దోషములు చూపుట కాదు. భాషాభిమానముతో గ్రంథరచనము చేసిన పైవారందఱును వంద్యులు, అభినంద్యులు అనుట నా మతము.

# నన్నయనాఁటి తెనుఁగు

నన్నయకుఁ బూర్వము తెనుఁ గెట్టిరూపమున నుండినదో ముందుప్రకరణములో వివరించితిని. నన్నయ యా భాష నెట్లు సంస్కరించి యభివృద్ధిపఱచెనో యను విషయముగూడ ముందటిప్రకరణములోనే చాలవఱకు స్పష్టపఱచితిని. ఇంక నాతనికాలమున నుండిన భాషాస్వరూపమును నిరూపింపవలసియున్నది. దాని కాధారములేవియో ముందుఁ దెలిసికొనవలయును. నన్నయను బ్రోత్సహించిన రాజరాజు (క్రీ. శ. 1022 మొదలు 1063 వఱకును) బాలించినట్లు సిద్ధాంత మగుట చేత నన్నయ యా కాలముననే యుండియుండవలసి యున్నది. రాజరాజు పాలనమునకు ముందును వెనుకను గూడ నన్నయ జీవించియుండవచ్చును గనుక నా శతాబ్దము నంతటిని (1000-1100) నన్నయకాలముగాఁ బరిగణించి సాధారణముగాఁ బదునొకండవశతాబ్దపు తెనుఁగే నన్నయనాఁటి తెనుఁ గని వ్యవహరింపనగును. కాఁబట్టి నన్నయ వ్రాసిన భారతభాగమగు రెండున్నరపర్వముల గ్రంథము నా కాలపు తెనుఁగుగా గ్రహింపఁదగును. ఇంతియగాక యా కాలములో బయల్వెడలిన శాసనస్థభాషయును విమర్శింపఁదగినదిగానే యున్నది. ఆ శతాబ్దమున వేఁగీదేశమును బాలించినవారు నలుగురు రాజులు. 1. శక్తివర్మ (1003-1015) 2. విమలాదిత్యుఁడు (1015-22) 3. రాజరాజు (1022-1063) 4. రాజేంద్ర కులోత్తుంగచోడదేవుఁడు(1063-1112). వీరిలోఁ బ్రథములయిన శక్తివర్మయొక్కయు, విమలాదిత్యునియొక్కయు శాసనము లల్పసంఖ్యాకములు. అవి సంస్కృతమున నున్నవి. రాజరాజుకాలపు సంస్కృత తామ్రశాసనములు కోరుమిల్లి (ఇ. ఆ. XIV, పుట 48), నందమపూఁడి (ఎపి. ఇండికా. వా. IV, పుట 303) లో వేసినవి ముఖ్యములు. ఇందలి గ్రామసీమలు మొదలగునవి తెనుఁగునఁ గలవు. తరువాతి వనేకములు శిలాశాసనములు లభించినవి. అవి యన్నియును శాసనపరిశోధకశాఖవారిచేఁ బ్రచురింపఁబడినవి. వానిలో ననేకములు ద. హిం. శాసనములయొక్క IV-V-VI సంపుటములలో నున్నవి. నాల్గవ వాల్యూమునందలి ద్రాక్షారామము, పాలకొలను, నాదెండ్ల మొదలయిన దేవస్థానములలో ముఖ్యము లయిన శాసనములు గలవు. అట్లే యితరములయిన వాల్యూములలోను ననేకము లయిన యితర శాసనములును, 11-వ శతాబ్దమునాఁటివి గలవు. వానినిబట్టియు నా కాలపు భాషయొక్క స్వరూపము బోధపడును.

శాసనభాషకును భారతభాషకును గొంత భేద ముండక తప్పదు. ప్రయోజనమునందును విషయవైశాల్యమునను శాసనములకును భారతమునకును భేద ముండుటచేతనే గొంతవఱకట్టి భాషాభేద మేర్పడక తప్పదు. పయిగా భారత

కర్తకును, శాసన రచయితలకును గూడ భాషాజ్ఞానవిషయమున భేదము కలుగక తప్పదు. అయినను నాఁటి శాసనస్థభాషకును గ్రంథస్థభాషకును గొన్ని విషయములలో నేఁటి గ్రాంథిక వ్యావహారిక భాషల కున్నంతటి వైరూప్యము కన్పట్టదు. భారతముగాని శాసనములుగాని నాఁటి యాంధ్రభాషాస్వరూపము నంతటిని నిరూపింపఁగలవని భావించుట యుక్తియుక్తము కాదు. భారతములోని కెక్కని వాడుకలా కాలమున నుండియుండక తప్పదు. అట్టి రూపములు కాలక్రమమున మాఱి నేఁటి వ్యావహారికరూపము లయి వాడుకలోనికి వచ్చియుండవచ్చును. నేఁటి వాడుక రూపములయిన తెస్తూ, తెస్తాను మొదలగువానికి మూలములయిన రూపములు గూడ భాషలో నుండగా వానిని లెక్కింపక నన్నయ తనకు మంచి వని తోఁచిన వాడుకరూపములగు తెచ్చుచు, తెచ్చెదను మొదలగు వానివంటి రూపములనే యంగీకరించియుండవచ్చును. గ్రాంథికరూపము లట్లే నిలిచిపోయియున్నవి. ఇతరము లయిన వాడుకరూపములు కాలక్రమమున వ్యాపించి మారుపడి బహుళము లయి నేఁడు వాడుకలోఁ గనుపట్టుచున్నవి. కాఁబట్టి నాఁటి వాడుక నంతటినిగూడ నూహించుటకు భారతముగాని, శాసనములుగాని చాలవు. అయినను గొంతవఱకు నాఁటి భాషాస్వరూపము వానినిబట్టి తెలియకపోదు.

నన్నయభాష నేఁటివారి కర్థము కానట్టిది గాదు. నన్నయకుఁ బూర్వకాలమున నుండినభాష నేఁడు మనము వాడుచున్నట్టి తెలుఁగుకంటె చాలభిన్నము. సాధారణముగా మన కర్థముకాదు. కొన్నిపదముల కర్థము తెలియనే లేదనుట యింతకుముందే నిరూపింపఁబడినది. నన్నయ భారతమును రచించిననాఁటినుండియును భారతభాష సర్వపండితసమాదరణను బొందుటవలన నయ్యదియే నేఁటికిని ప్రామాణికభాషగా వెలయుచునే యున్నది. భారతము నేఁటివారికందఱకును సామాన్యముగా పఠన పాఠనములకు యోగ్యముగానే యున్నది. కాఁబట్టి భారత భాషకును, నేఁటి గ్రాంథికభాషకును జాలవఱకును సమానాంశము కలదు. నిపుణతతోఁ బరిశీలించి విభజించినచోఁ బండితులకుఁ గొన్ని భేదములు కనుపట్టక తప్పదు. అట్లు క్రింద నిరూపింపఁబడిన ప్రాచీనరూపములకు నేఁడు కొంచెమయినను బ్రచారము లేదని భావించుట పొరపాటు. అట్లు వ్రాసినవారును, వ్రాయఁగలవారును నుండిన నుండవచ్చును. ఈ క్రింద వ్రాయఁబడిన భాషావిశేషములు ప్రాయికములని భావింపవలయును.

[ నన్నయకుఁ బూర్వము వాడుకలో నుండినభాష యను పేర వ్రాయంబడిన ప్రకరణములలోఁ జెప్పఁబడిన విషయమునుగూడ నీ సందర్భమున ననుసంధించునది. ]

## ధ్వనులు

1. ప్రాచీనభాషలో మిక్కిలి ప్రచురముగ నుండినదనియు, తక్కిన తమిళ కర్ణాటాది భాషలతో సమానమయిన యుచ్చారణము గలిగినదనియుఁ జెప్పఁబడిన

టికారమునకు భారతమున స్థానము లేదు. అనఁగా నన్నయ తన కాలమున నెచ్చోటనయిన నుండిననుగూడ నీ యక్కరమును, దాని ధ్వనిని ప్రామాణికముగా గ్రహింపలేదని యర్థము. తనకు ముందుండినకాలమున నంత విరివిగా నుండిన ధ్వని యొక్కనాడు తటాలున మాయమైపోవదు. అది వ్యవహారమునుండి శీఘ్రముగ భ్రష్ట మగుచుండగా నా విషయమును గ్రహించి నన్నయ యద్దానికిఁ దన భారతమున స్థానము లేకుండఁ జేసికొనెను. కాని యక్కడక్కడ శాసనములలో నన్నయ తరువాతను, నాతని కాలముననుగూడఁ గనుపట్టుచున్నది. ఇవి చాల నరుదు. ఇద్దియు దీని భ్రంశమునే నిరూపించుచున్నది. ఈ క్రింద నిరూపింపఁబడిన యుదాహరణములఁబట్టి గ్రహింపవలసిన విషయ మొక్కటి గలదు. అరవశబ్దమును, అరవ సంప్రదాయమును గల చోట్లను తప్ప తక్కినయెడల నెల్లను నీ టికారము నశించిన దనుటయే యది. ఈ టికారస్థానమున డ, ళ, అ, లలో నొక్కటి స్థిరపడుటను గూర్చి ముందే తెలిపితిని. పదునొకండవశతాబ్దమున నరుదుగా గనుపట్టు శాసనస్థ టికారమున కుదాహరణములు.

ద. హిం. శా. IV నెం. 1015-జీవితమాటి ; నటిపంగలవారు 1084 క్రీ. శ.
(జీవితమాడ ; నడపగలవారు)

V నెం. 66 —ఆట్వినికి, తిరువాముటి, వెరువాముటి ఈ మూఁడును అరవపదములు. కావుననే టికారముతో వ్రాయఁబడినవి. అందే 'తిరువా ముడి' యని డకారముతో నున్న రూపముగూడ కలదు. 1090 క్రీ. శ.

ద. హిం. శా. వా. V నెం. 81-రజనరయన విణ్ణగరాటువారికి 1107 క్రీ. శ.
రాజనారాయణ విణ్ణగరాళ్వారు

| | | |
|---|---|---|
| ,, ,, V నెం. 1023-విట్విరయణ్ణు | 1113 | ,, |
| ,, V నెం. 1039-చోటిణ్ణికూతుటు | 1121 | ,, |
| ,, V నెం. 1083-నటిపంగలవాణ్ణు | 1108 | |
| ,, ,, V నెం. 1106-మేటియదణ్ణనాయక | 1093 | |
| V నెం. 1281-పటిమనాయకురాలు | 1142 | |

2. పదాంతముననను, బదమధ్యముననను నుండిన ణ-ళ-ల ప్రయోగము చాలవఱకు తగ్గిపోయినది. వినియణ, పణిగొణి, నువులదేవణ మొదలగు పదముల వంటి వన్నియును నన్నయగ్రంథమున వినియన, పనిగొని, దేవన మొదలగు నిప్పటిరూపములనే పోలునట్లు మారిపోయిన వనుట స్పష్టము. కాని శాసనములందు మాత్ర మక్కడక్కడ నీ ణ-ళ-లు క్వాచిత్కముగాఁ గనుపట్టుచునుండును. అదియును ప్రాచీనవాసనను జూపుచుండును.

ద. హి. శా. వా. V, నెం. 76 భీమణొజ్జులు. 1097 క్రీ. శ.

రాజనారాయణ 'పిణ్ణగరాట్ట్వరు' అను పదమే సుమారు 1107-వ సంవత్సరమున నింకొకశాసనమున 'రాజనరయణి విన్నెగరాడ్వారి' యని (ద. హి. శా. వా. V, నెం. 62.) వ్రాయఁబడినది. దానినిబట్టి ణకారము నకారముగాను, టకారము డకారముగాను మాఱుచున్నట్లు నిర్వివాదముకదా.[2] ముందటిప్రకరణమున నుదాహరింపఁబడిన చెఱువుళు, సంవత్సరంబుళ్, కన్యళు, బోళు.[3] మొదలయిన పదములవంటి పదములలోని ళకారము లకారముగానే కనుపట్టుచున్నది.

3. శకటరేఫమును సంయుక్తాక్షరములో క్రిందియక్కరముగా వ్రాయునభ్యాసముకూడ చాలవఱకు నశించినదని చెప్పక తప్పదు.[4] శకటరేఫముయొక్క వాడుక నన్నయకుఁ బూర్వపుకాలముకంటె నన్నయకాలమున తగ్గిన దనక తప్పదు. కాని శకటరేఫమునకును లఘురేఫమునకుగల భేదముమాత్ర మనేక శబ్దములలో నర్థభేదముతో నన్నయగ్రంథమునఁ గనుపట్టుచునే యుండును. అది కాలక్రమమున తగ్గి నేఁటికి బూర్తిగా వ్యావహారికభాషలోను, జాలవఱకు గ్రాంథికముగను నశించినదని యంగీకరింపక తప్పదు.

4. నేఁటి బిందువునకు బదులు వర్గపంచమాక్షరము సంయుక్తాక్షరమున మొదటియక్షరముగా వ్రాయఁబడు నభ్యాసము మిక్కిలిగా నుండినది. నన్నయకాలమునను నట్లేయున్నదని శాసనములఁబట్టి తెలియుచున్నది.[5] వలపలగిలకయొక్క ప్రయోగమును బ్రాచీనకాలమున నుండినట్లే యున్నది.

5. యడాగమము సంధ్యభావస్థలములయందు నేఁడు విహితమై యున్నది. నన్నయకాలమునను నట్లే యుండినదని నన్నయభాషనుబట్టి స్పష్టపడుచున్నది. అంతకంటె ప్రాచీనకాలమునను బదాదిని యడాగమము గలుగుచుండినట్లు స్పష్టమే. అట్టి యడాగమము సంధ్యభావస్థలములయందేగాక యితర స్థలములయందును గనుపట్టుచున్నట్లును బ్రాచీనభాషనుండి తెల్లము. ఈ క్రింది యుదాహరణములఁ బరికించునది.

[2] ద. హి. శా. వా. V 63. కామనయ్య 1097 సం. క్రి. శ IV 1009 చామబోల చెందన. 1092 సం. IV 1011 నెం. బాదబోలదొడ్డన 1073 సం.

[3] IV నెం. 1010. బోలవసమున 1055 సం. IV నెం. 1008 సంవత్సరంబులు 1047

[4] ద. హి. శా. వా. IV 1020-పెమ్మఁ నడిగల్లు 1118 ,, బోయంగల ,,

,, IV 1006-ప్రోలణ్డు 1080 IV 1008 యావ్వఁరు 1047

,, IV 1011-రాకుదిరి క త్తిఁ రాజు 1073 IV 1015 ప్రోలునాణ్డి 1084

,, IV 1011-అఖణ్డ వ త్తిఁ ఒక్కట్టి సరియింప్పంగ్గలవారు

,, IV 1014-అచన్దిక్కఁము 1088 సం.

సం. నెం.
1904-304-సంవత్సరంబుల్ యేనగునాణ్డు సు. 650. క్రీ. శ.
,, -405-ఇచ్చినది యూరి పడుమటిగుణ్ణ
1900-306-రచ్చయిల్లు ; రట్టోళియిచ్చినది
1934-182-నువుళదేవణ యిచ్చె 650
ఎ. ఇ. వా. XIX పుట 146-పెదరియాకుజంత 970
,, ,, XV ,, 150-బృందమ్బు గొనియుండువాన్టు 890 ,,
1917-నెం.833-చట్టపాఖ్యేన యింద్రకీతే 905 ,,
1904- ,, 384-సంవత్సరంబుళ్ యేనగు 650 ,,

పయి యుదాహరణములు స్వల్పసంఖ్యాకములు. సాధారణముగాఁ బ్రాచీన శాసనములలో నన(గా నన్నయకు ముం దుండిన శాసనములయందు రెం డచ్చులు అవ్యవహితముగ వచ్చిననుగూడ యడాగమములేక వ్రాయుటయే బహుళము. ఈ క్రింది యుదాహరణములను బరికించునది.[6] నన్నయగ్రంథమున సంధ్యభావస్థలముల యందు యడాగమము నియతముగాఁ నున్నది. పదాదిని యకారము శ్రుత మగుచున్నట్లును, సంధియందు మఱఁగిపోవునట్లును చింతామణినిబట్టి నిశ్చయింపనగును.[7] ఈ పయి విషయములను దిరిగి స్పష్టతకొఱకు వ్రాయుచున్నాను.

1. నన్నయకు ముందు యడాగమము రచనలయందు కనుపట్టుట చాల స్వల్పము.

2. యడాగమములేని వ్రాతలే బహుళము.

3. నన్నయ యడాగమములేని సంధ్యభావస్థలముల నట్లే విడువఁడు.

4. చింతామణి పదాది యకారము నంగీకరించెను.

5-6 అద్దంకి పండరంగని శాసనము—భూమి ఎనుబొదివుడ్లు—సం. 845 క్రీ. వె.
ఎపి. డి. 1904-నెం. 43—ప్రియపుత్రున్టు ఇచ్చిన క్షేత్రంబు ,, 650 ,,
,, ,, 1906-నెం. 497—రజుల ఇచ్చిన నేల ,, ?
,, ,, 1917-నెం. 797—పుదిలిఎళ్లువాన్టు ,, 790
,, ,, -నెం. 833--పదిపడగు న్రేణ్ణ ,, 905
,, ,, 1920-నెం. 364—సికుళతురి ఇరళమ్మార్గరికిన్ ,, 695
,, ,, 1922-నెం. 307—రాజుల పళవిలో ,, 890
,, ,, ,, మహేణ్డ ఎళపెన్ ,, 890
,, ,, 342 మార్తణ్డ అగ్గి ,, 890

7 ఆ. శ. చి. సం. 17, 27. సూ.

పై వానినిబట్టి యి ట్లూహింపనగును. నన్నయకుముందు యడాగమముతోఁ గూడిన యుచ్చారణము కాలక్రమమున నభివృద్ధి యగుచుండగా నద్దానిని గ్రహించి నన్నయ ప్రమాణీకరించి తన భారతమున నవలంబించెను. ఆ తరువాత నయ్యది ప్రమాణమయి నేఁటికిని రచనలో నున్నది. నన్నయకు ముందు మిక్కిలి ప్రాచీన కాలమున నీ యడాగమము ఉచ్చారణములో సార్వత్రికముగా నుండక కొంచెము కొంచెముగా గలిగి నన్నయకాలమునకుఁ బూర్ణవికాసము నొందియుండవచ్చును. లేదా మిక్కిలి బహుళముగా నీ యుచ్చారణము ప్రాచీనకాలమున నుండినను గూడ ప్రాకృతరచనలలోని యవ్యవహితాచ్చులయవస్థను గ్రహించి యట్లే యచ్చులను మాత్రము ప్రాచీనశాసనములలో వ్రాసియుండవచ్చును. ఈ రెండుపక్షములలో మొదటిదే సమంజసమని తోఁచుచున్నది.

6. ద్విత్వమునొందిన శకటరేఫముల యుచ్చారణము నన్నయకాలమున నేఁటి యరవభాషలోని యుచ్చారణముతో సమానముగా నున్నట్లు ఊహించుట కాధారములు గలవు. 'ఱ్ఱ' యను ధ్వని యరవము 'ట్ర' యను ధ్వనివలె నుచ్చరింపఁబడును. ఇది శబ్దశాస్త్రమునకు విరుద్ధముగాదని ముందు నిరూపింపబడును. రాజరాజు తండ్రి యయిన విమలాదిత్యుని రణస్థిపూణ్డి శాసనమున (ఎపి. ఇండికా. వాల్యూం VI, పుట 347, కాలము 1019 క్రీ. వె.) 'ముయ్యాలి కుట్టున' అని రెండుసారులు టవర్ణము తోడనేయున్నది. నన్నయవ్రాసిన నన్దమపూణ్డిశాసనమునను "కుట్రు" అనియే యీ పదము కలదు.[8] దీనికి నేఁటిరూపము ముయ్యేలగుట్ట. చూ. శబ్దరత్నాకరము. మూఁడు + ఎల్ల + గుట్ట యని దానికి విభాగముగా వారు వ్రాసియున్నారు. బ్రౌనుదొరగారును దమ నిఘంటువున నట్లే వ్రాసియున్నారు. ఈ పదము మల్లిదేవుని పిఠాపురపుశాసనమున (1195 సంవత్సరమున) ముయ్యని కుట్టు అనియును, రెండవ కులోత్తుంగుని 1127-1158 చెల్లూరు తామ్రశాసనమున[9] ముయ్యనికుట్ర యనియును నకారముతో కనుపట్టుచున్నది. ఈ రూపము లన్నియు నభిన్నములనియును, లకారమునకు నకారము నాఁటి వ్యావహారిక భాషయందలి యుచ్చారణసామ్యమువలన వచ్చినదనియును నూహింపక తప్పదు. కుఱ్ఱు అనునది నన్నయకాలమున (1050 సం.) కుట్రుగా నుండి, 1150-వ సంవత్సరమునకును ఆ రూపముననే యుండి, 1200 సంవత్సరమున కుట్టుగా మాఱినట్లు పయిప్రయోగములఁబట్టి స్పష్టము. (ముయ్యేలగుట్ట - ముయ్యలగుట్ట రూపాంతరములు.)

7. "క్ష" యను నక్షరమునకు నన్నయభారతమున కకారముతోనే యతి కలదుకాని షకారముతో లేదనియు, నక్కాలమున నిందు కకారమునకే ప్రాధాన్య ముండెననియు నాంధ్రభాషాచరిత్రకారులు వ్రాసియున్నారు.[10]

[8] ఎ. ఇ. కా. వా IV పుట. 301 ముయ్యాలికుట్రసీమా 3 సార్లు ముయ్యాలికుట్రున గొల్లరేవసీమా [9] ఎ. ఇ. IV. పుట. 59, [10] ఆ. భా. చ. పుట. 1330.

క్షకారమునకుఁ బ్రాకృతమున ఖకార మాదేశముగా వచ్చుట శా ప్రసిద్ధము. వృక్షః = రుక్ఖో; రక్షతి = రక్ఖఇ; క్షణః = ఖణో; క్షమా = ఖమా. ఇట్లుండిన ఖకారోచ్చారణము ప్రాకృతసంపర్కమునఁ గలిగి నిలిచియుండగా నద్దానినే నన్నయ యంగీకరించియుండవచ్చునని యూహింపవచ్చును. కాని క్షకారముతో నున్న శబ్దములు గొన్ని నిత్యముగాను, కొన్ని వికల్పముగాను (క్షేత్రం- ఛేత్తం, క్షమా - ఛమా, క్షణః - ఛణో) ఛకారముతోగూడ ప్రాకృతమునఁ గనుపట్టుచున్నవి. కాని యీ యుభయవిధములయిన యుచ్చారణములలోను నన్నయ కభిమత మయినదియో లేక యత దుండిన ప్రదేశములోనిదో ఖకార మని యూహింపవచ్చును.

కేవలము క్షకారమునందు కకారమునకుమాత్రమే యతి వేయుటవలననే యీకాలమున క్షవర్ణమునందు కకారమున కుచ్చారణములోఁ బ్రాధాన్యమనుటకు వీలులేదు. పయిరూపమున క్షవర్ణము ప్రాకృతములో మాఱి యుచ్చరింపఁబడు చుండినట్లు ప్రమాణాంతరముచేత సిద్ధమగుటయుఁ, బయిదానితోఁ గలిపి పరిశీలించినం గాని య ట్లూహించుటకు వీలుగాదు.

8. ఇట్లే జ్ఞకారములోను జకారమునకుమాత్రమే యతి నన్నయవేసె ననియు, నందుచే నా కాలమున జకారమునకే యుచ్చారణమునఁ బ్రాధాన్యమని యును చి. నా. వ్రాసిరి.[11] వారు చూపిన యుదాహరణములలో జ్ఞా ధాతు జన్యపదములును, యజ్ ధాతుజన్యమయిన యజ్ఞము అను పదరూపములును నున్నవి. ఈ రెంటియందును జకార మున్నదని శబ్దవిదులకుఁ దెలిసినదే. జ్ఞా ధాతువునకు జానాతి మొదలగు రూపములయందు జా యనునది యాదేశమనుట సుప్రసిద్ధమే. యజ్ ధాతువులోనిది జకారమేకదా! ఇందు జకారముతోఁగాక వేఱు దేనితో యతివేయవలసినది? రెండవది ఞకారమనియు, నది చవర్గపంచమ మనియుఁ దెలుచున్నదిగదా! కేవల ఞకారయుక్తపదములు తెనుఁగున లేవుకదా! ఇంతమాత్రమునుబట్టి యానాఁటి యుచ్చారణమును నిర్ణయించుటకు వీలు లేదు.

## సంధి

(1) నన్నయకుఁ బూర్వపు శాసనములలో సంధ్యభావస్థలము లనేకము లుండి నట్లును, యడాగమము సంధ్యభావస్థలములలో నన్నయ సార్వత్రికముగాఁ జేసినట్లును ముందే నిరూపించితిని. అట్టి ప్రాచీనభాషకు ఉత్వసంధియొక్క నిత్యత్వము నంగీక రించి తన భారతమున నట్లే వ్రాయుటంజేసి నేఁటికిని నయ్యదియే ప్రామాణిక మయి యున్నది. కాఁబట్టి రాముఁడు+అక్కడ—అనునట్టి ఉకారసంధియందు నన్నయ భాషకును, నేఁటి ప్రామాణికభాషకును భేదము లేదు.

[11] ఆ. భా. చ. పుట. 1331

(2) 'కర్మధారయసమాసమున పేర్వాదిశబ్దముల కచ్చుపరంబగునపుడు టుగాగమంబు విభాషనగును' అని బాలవ్యాకరణము. దీనినిబట్టి నేఁటి భాషయందు, పేరురము, పేరుటురము అని రెండురూపములును నుండును. పదునొకండవ శతాబ్దమునాఁటి తెనుఁగుభాషయందుఁ "గర్మధారయంబునందు పేర్వాదిశబ్దముల కచ్చు పరంబగునపుడు టుగాగమము రాదు. పేరు+ఉరము=పేరురము, పేరుటురము కాదు" అని ఆంధ్రభాషాచరిత్రకారులు వ్రాసిరి.[12]

(3) ఉత్తరమించి, దక్షిణమించి, యను ప్రయోగములు శాసనములలో నుండగా వానియందు మువర్ణము లోపించినదని, ఆ. భా. చరిత్రకారులు వ్రాసిరి. ఇందు మువర్ణమును లోపముగాఁ జెప్పనక్కఱలేదు.[13] ఉత్తరా-దక్షిణా యని ఆకారాంత స్త్రీలింగములయిన సంస్కృతశబ్దంబులు తుదిహ్రస్వముగాఁగా, ఉత్తర-దక్షిణ యను హ్రస్వరూపములతోనే వచ్చినవనుట యుక్తము. "దీర్ఘాణాం హ్రస్వః స్యాత్" అను చింతామణిసూత్రము సుప్రసిద్ధము. ఉత్తర+మించి—అనఁగా ఉత్తరనుమించి యని యర్థము స్పష్టము.

(4) మేన+అత్త - అనుచో 'మేనయత్త' యనియేగాని మేనత్త యను సంధిరూపము భారతమున లేదని వ్రాసిరి.[14] తరువాతిభాషలో నిది మేనత్త యగుట స్పష్టమే. "స్త్రీవాచక తత్సమ సంబోధనాంతములకు అకారాంతములకు సంధి లేదు" అని చిన్నయసూరి రచించెను. ఇది నన్నయభాషయందే వర్తించును. తరువాతి కావ్యములయం దీ నియమము కొంతవఱకు తొలఁగిపోయెను. కొంద ఱీ సంధిని జేసి యుండిరి. గంగ+అనుకాసె, నెలత+ఇచ్చెను అను స్థలములలో గంగనుకాసె, నెలతిచ్చెను. అను రూపములవంటివి నన్నయభారతమున లేవు.

(5) క్త్వార్థకమయిన ఇకారమునకు - అనఁగా చేసి, చూచి మొదలగు రూపములపయి నున్న ఇకారమునకు సంధి గలుగదు. ఇది తర్వాత ప్రబంధములయం దచ్చటచ్చటఁ గవులచే వాడఁబడినది. అనవలసి + అంటిగాక = అనవలసంటిగా కెఱుఁగవా యొకమాటనె మర్మకర్మముల్ (విజ-I-16-1.) ఇట్టి ప్రయోగములు ఇతర కవులయందును గ్వాచిత్కముగా గలవు.

(6) ఏమి - మఱి, కిమర్థి - అది - అవి - ఇది - ఇవి - ఏది - ఏవి అనువానితోఁ గూడిన యొక యాకృతిగణంబునుగూర్చి వాని తుదినున్న ఇకారమునకు సంధి వైకల్పికముగా నగునని చిన్నయసూరి చెప్పెను. ఈ పయి శబ్దముల ఇకారమునకు నన్నయ సంధి చేయలేదని, ఆంధ్రభాషాచరిత్రకారులు వ్రాసిరి. దానినిబట్టి నన్నయభారతములో లేని యీ సంధి కాలక్రమమునఁ గవులచేఁ జేయఁబడుటవలనఁ జిన్నయసూరివలన వైకల్పికం బని సూత్రింపఁబడుట సంభవించినది.

---

[12] ఆ. భా. చ. పుట 1334

[13] ఆ. భా. చ. II, 1338 [14] ఆ. భా. చ. II, 1339

(7) ప్రథమపురుషమునను, మధ్యమపురుషమునను నన్నయభాగమున క్రియయందలి ఇకారమునకు సంధి నిత్యముగానే యున్నది. కాని తరువాతి గ్రంథములయందు ప్రథమపురుషమునకుఁగూడ సంధి వైకల్పిక మయినది. కావు ననే చింతామణియందు "అనుత్తమ పురుషక్రియల యికారమునకు సంధి నిత్యము" అని సూత్రింపఁబడినది."[15] తరువాతఁ బ్రథమపురుషమునందలి యికారమునకుఁగూడ గ్రంథములయందు సంధి కనుపట్టుచు రాఁగా నథర్వణుఁడు "ప్రథమోత్తమపురుషల యందు రెంటనుగూడ సంధి వైకల్పిక"మని సూత్రించెను.[16] నన్నయభారత భాగమున రెండుస్థలములయందు ప్రథమపురుష సంధ్యభావము గలదు. కాని యవి రెండును పాఠాంతములగుటఁ బై నిషేధము దానికి సంభవింపదు.

(8) నన్నయ భారతభాగమున పుంపులయొక్క ప్రయోగము చాల విరళ ముగాఁ గనుపట్టుచున్నది. ఇట్లు పుంపులు సమాసమునందు వచ్చిన స్థలములు నాలుగుమాత్రమే.[17]

ఆది, IV. 221. బలితంపు రక్కసు. VII. 260. విరుద్ధంపువరము. అర. I. 49. వీని పుట్టిన పాపంపువేళ. అర. III. 300. పరుసంపురాలపై. ఇం దేవియును ప్రాసవిశ్రమస్థలంబులలోనివి కావు. కొన్నింటికిఁ బాఠాంతరములుగూడఁ గలవు. ఈ పుంపులు నన్నయకాలమున నుండిన శాసనములలో నున్నవి.

(క్రీ.శ.1055) ద. హి. శా. వాల్యూము IV. నెం. 1010 లోహపుదివియ.
(క్రీ.శ.1053) ,, ,, ,, ,, ,, ,, 1011 ,,

(9) అందు, ఇందు, ఎందు శబ్దములపయి నవ్యభాషలో అలి, అను నాగమము రాఁగా, అందలి, ఇందలి, ఎందలి, అను రూపములు వచ్చునని వ్యాకర ణములు ఘోషించుచున్నవి. ప్రయోగములును నట్లే యున్నవి. నన్నయ వ్రాసిన భారతమునఁ బయిరూపములు లేకపోవుటయేగాక, అందుల, ఇందుల, ఎందుల అను రూపములే వాడఁబడియున్నవి.

| | | | | |
|---|---|---|---|---|
| అందుల | — | ఆది. | VI | 235 |
| ఇందుల | — | ఆది. | VI | 123 |
| ఎందుల | — | ఆది. | VII | 2 |

## తత్సమములు

(1) సంస్కృతమునందలి అకారాంత పుంలింగశబ్దములు తెనుఁగులోనికి వచ్చునపుడు సాధారణముగా ఉత్వమును డుజ్వర్ణకమును గూడి రాముఁడు

[15] నిత్యమనుత్తమ పురుష క్రియాస్వితః. ఆ. శ. చిం.

[16] ప్రథమే చోత్తమే చైవ క్రియే తోవా భవే చ్చ్యుతిః. అ. కారికావళి.

[17] ఆ. భా. చ. పుట 1851.

మొదలగువానివంటి రూపము లేర్పడునని వ్యాకరణములు ఘోషించుచున్నవి. ఇది నేఁటిస్థితి. రాముఁడు అను రూపమునకు, రామన్ అనునది పూర్వరూప మనియు, రామండు అను రూపములవంటి రూపములు నన్నయకు సమకాలికములయిన శాసనములలోఁగూడ గలవనియు, డుజ్వర్ణము యొక్క చరిత్రము నిరూపింపఁబడినప్పుడు వివరింపఁబడును. ఇట్లు తనకాలములోని ఉత్తముల భాషలో నున్న రాముఁడు మొదలగువానినే నన్నయ బహుళముగా నంగీకరించెనని యాతని గ్రంథమునుండి స్పష్టపడును. ఈ విషయమున నన్నయభాషకును, ఇప్పటి ప్రామాణికభాషకును భేదము లేదు. అసుర, మూర్ఖ, దూత మొదలయిన కొన్ని డువర్ణాంతవిరహితరూపములు నన్నయభాషలోఁ గన్పించుచున్నవి. అవి యిప్పటికిని బ్రమాణములే. ఇవియును డుప్రత్యయచరిత్రమును దెలుపుట కుపయోగించును.

(2) నన్నయగ్రంథమున గద్దియ, లొట్టియ అనునట్టి ఇయాఁతరూపములు గలవు. "ఏదంతతా చ నామ్నా మన్యతరస్యా మియాన్తానామ్" అను చింతామణిసూత్రము ననుసరించి ఇయాంతరూపములు ప్రాచీనము లనియు, ఎవర్ణాంతరూపము లర్వాచీనము లనియు తోఁచుచున్నది. ఆంధ్రభాషాభూషణమున కేతన మల్లె మొదలయిన ఎకారాంతరూపములు దుష్టములనియు, ఇయాంతరూపములు యుక్తములనియు వ్రాసెను. ఈ విషయమును ఖండించుచు కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణసారసంగ్రహమున ఎకారయుక్తరూపములును గలవనియు, నవి ప్రామాణికములనియుఁ జెప్పి యర్వాచీనకవుల ప్రయోగముల నుదాహరించెను. దీనినిబట్టి యూహింపవలసిన దేమనఁగా ఇయాంతరూపములు ఎవర్ణాంతరూపము లగుటకుఁ గొంతకాలము పట్టెననియుఁ, బ్రాచీనకాలమున ఇయాంతములు బహుళమనియుఁ దేలుచున్నది. నన్నయభారతమున 'ఎ' వర్ణాంతరూపములు మృగ్యములు.

(3) మిత్ర, పాత్ర శబ్దములు రెండును అర్వాచీనభాషలో (ఉభయలింగములు గావున) మిత్రము, మిత్రుఁడు—పాత్రము, పాత్రుఁడు అను రూపములతోఁ బ్రయోగింపఁబడినవి.

"మిత్రుఁ డనియును సద్గురుపుత్రుఁ డనియు అధికవైరాగ్యసంపత్తి యబ్బెనేని యతని కందఱు మిత్రంబు లరసిచూడ", "లేరె యితరుల్ నీ లీలకుం బాత్రముల్", "తరుణికిం బ్రాణమిత్రంబు ధవుఁడు" మొదలగు ప్రయోగంబుల నొసంగి యహోబలపతి "ప్రయోగాశ్చాప్యుభయత్రాపి వర్తంతే" అని వ్రాసియున్నాఁడు.[18] "మహద్వాచక మిత్ర పాత్ర శబ్దంబుల అత్వమున కుత్వము వచ్చి డుజ్జు చేరును. అమహద్వాచకములందువలె వీని అత్వముమీదనే మువర్ణము చేరుననుట

[18] అహోబలపండితీయము. పుట 223 'మహతస్సోర్డుజనితోభవేత్పుంసి' అను సూత్ర వ్యాఖ్యాన సందర్భము.

నన్నయభారతములో గానరాదు. పాత్రుఁ (ఆది i-9), మిత్రులఁ (ఆది ii-195) పాత్రునకు (ఆది- iii - 23,203), మిత్రుఁ (ఆది i-22)."[19]

పయిప్రాతనుబట్టి పాత్రము మొదలగు ప్రయోగము లర్వాచీనము లన్న మాట యూహింపనగును.

(4) జగత్ అను తకారాన్తపదము జగము, జగత్తు అను రెండురూపము లతోఁగూడ నర్వాచీనభాషయందు వాడఁబడుచున్నది. "జగదింద్రజిత్తుల తకారంబునకు లోపంబు విభాషనగు" తత్సమపరిచ్ఛేదము బా. వ్యా. 79 సూత్ర. "జగము అను రూపమేగాని జగత్తు అనురూపము నన్నయభారతమున లేదు."[20]

(5) 'విశ్వకర్మాదులకు స్త్రీత్వంబగును' అని చిన్నయ సూత్రించి విశ్వకర్మ యను రూపమునుమాత్రమే సాధించెను. నన్నయభారతమున విశ్వకర్మ యనియే రూపము. కాని, విశ్వకర్ముని యని యర్వాచీనరూపమును గనఁబడియెడి. ప్రౌ. వ్యా. దీనిని సాధించెను. ఇదియుఁ దక్కినరూపముల సామ్యమున నేర్పడి గ్రంథముల లోని కెక్కినదియే గాని ప్రాచీనముగాదు. 'శ్వఁ శబ్దముయొక్క సప్తమ్యేకవచన రూపము తెనుఁగున ప్రథమైకవచనరూప మగును' అని వ్రాసి 'దేవశుని' యని (ఆది- 1-83) ఆ. భా. చరిత్రకారు లుదాహరించుట భ్రాంతిమూలకము. ఇక్కడ 'శునీ' యని స్త్రీలింగమునకు 'శుని' యని తత్సమము.

(6) అర్వాచీనభాషలో అంగిరుఁడు - అంగిరసుఁడు, ప్రచేతుఁడు - ప్రచేతసుఁడు అను రీతిని రెండువిధములయిన రూపములును నుండగా "మహద్వాచకంబు లగు సాంతంబుల కంతలోపంబేని, ద్వితీయైకవచనాంతతుల్యత్వంబే నగు" (తత్స. సూ-81) అని చిన్నయసూరి సూత్రించెను. తరువాతికాలమున వికల్పముగా వచ్చు నీ రెండురూపములలో నన్నయగ్రంథమున సకారాంతరూపములే బహుళము లగుటంజేసి యా సకారవిరహితరూపము లర్వాచీనము లనియు, గ్రమక్రమమున నేర్పడినవనియుఁ దేలును. ఉగ్రశ్రవసుఁడు (ఆది viii - 189), పృథుశ్రవసుఁడు (ఆది 1-87), దుర్వాసుఁడు, పురూరవుఁడు, ఊర్ధ్వరేతుఁడు, అను రూపములుగూడ భారతమున నుండుటంజేసి బహుళము లనవలసివచ్చెను.[21]

(7) 'సాంతంబుల తుది సకారంబునకు లోపంబు బహుళంబుగా నగు' అని చిన్నయసూరి సూత్రించి, ఉరము - ఉరస్సు, వక్షము - వక్షస్సు, మొదలగు సాంతంబులకు రెండు వికల్పరూపంబు లుండునని నిరూపించెను.

నన్నయభారతమున 'శిరంబు' (ఆది V - 256), నభము. (అర 1-285) అనువానిం బోలిన మువర్ణాంతరూపములేగాని స్సువర్ణాంతరూపములు లేవు.[22]

[19] ఆ. భా. చరిత్రము పుట 1361 రెండవవాల్యూము విషయము 5
[20] ఆ. భా. చరిత్రము పుట 1363 రెండవవాల్యూము విషయము 3
[21] ఆ. భా. చరిత్రము పుట 1365 విషయము 9-10.
[22] ఆ. భా. చ. వాల్యూము ii పు. 1365.

దీనింబట్టి చూచిన మనస్సు, తపస్సు మొదలయిన రూపము లర్వాచీనము లనుట స్పష్టము. ఈ సకారాంతములలో అర్వాచీనభాషలో పయఃప్రభృతులకు మువర్ణాంతరూపములు లేక కేవలము పయస్సువంటి రూపములుమాత్రమే యుండుటయు పరిశీలింపఁదగినవిషయమే. ఇట్లే అర్చిస్సు, జ్యోతిస్సు అను శబ్దములకు అర్చి, జ్యోతి యనియేగాని అర్చిస్సు, జ్యోతిస్సు అను రూపములు నన్నయభాగమున లేవు. ఇవియు నర్వాచీనములే.[23]

(8) ఇట్లే మహిమ, మహిమము అను రెండుశబ్దములును అర్వాచీన భాషలో నుండగా, మహిమ యను రూపమే నన్నయభాషలోఁ గలదు. మహిమఁ (ఆది. I, 6-49), (ఆది. II, 86.)

(9) నన్నయభారతములో 'హనుమంతుఁడు' మొదలగు మతుబంత రూపములు గలవు. 'హనుమానుఁడు, భగవానుఁడు' మొదలగు రూపములు అర్వాచీనములు. చిన్నయసూరి రెండు రూపములును సాధించి "ఒకానొకచో మహత్వంబునందు మతుప్రకారంబున కానాదేశంబు విభాషనగు" అని సూత్రించెను. హనుమ (అర. III, 314) యను రూపమును నన్నయచే ప్రయోగింపఁబడియెను.

(10) నన్నయకాలమునకు ముందుండిన శాసనములలో బహువచనప్రత్యయము కళ్ - గళ్ - మొదలగువానియొక్క రూపాంతరముగా నుండినట్లు నన్నయకుఁ బూర్వ ముండినభాష యను విషయమున సూచింపఁబడినది. ఆ 'కళ్' శబ్దమునుండి విడివడియే నేఁటి లువర్ణము బహువచనప్రత్యయముగా నేర్పడిన దనుట సిద్ధాంతము. నన్నయభారతమునుబట్టి చూచినచో లువర్ణ మప్పటికే బహువచనప్రత్యయముగా నంగీకరింపఁబడి యాతనిచేత వాడఁబడిన దనుట స్పష్టము. అట్టి లుప్రత్యయముయొక్క సంయోగముచేతనే పూర్వమునందున్న - డువర్ణ, ళువర్ణాదికము కాలక్రమమున నేఁటి 'ళ్లు' వర్ణరూపమును బొంది బహువచనార్థమున వాడఁబడుచున్నది. ఈ 'ళ్లు' వర్ణము నన్నయ కాలమున కేర్పడినదా, లేదా? ఏర్పడి క్వాచిత్కముగా నుండినచో దానిని నన్నయ యంగీకరించి ప్రామాణికభాషగా వాడెనా? యని ప్రశ్నము. నన్నయ వ్రాసిన భారతభాగమున నిప్పుడు లభించుచున్న ముద్రితప్రతులలో ననేక స్థలములలో 'ళ్లు' వర్ణము బహువచనప్రత్యయముగాఁ గనుపట్టుచున్నది. అది నన్నయ కంగీకృత మగునా, లేదా? యను విషయము బహువచనప్రత్యయ మగు లువర్ణకముయొక్క చరిత్రను వివరించునపుడు విచారింపఁబడును. ముద్రిత పాఠములలో గనుపట్టు 'ళ్లు' రూపము లున్నచోట్ల కొన్ని స్థలములయందుఁ 'డ్లు' వర్ణమే నన్నయచే వ్రాయఁబడియుండినను, నయ్యవి ప్రాసవిశ్రమాది నిర్బంధ స్థలములు గాకుండుటచేతను, వచనముల నడుమనే సాధారణముగా వాడఁబడుట

[23] ఆ. భా. చ. వాల్యూము ii, పుట 1366

చేతను వానిని నేటివారు తమకాలపు భాషాసాహచర్యమునుబట్టి వ్రాసియుండిన
నుండవచ్చును. తొమ్మిది శతాబ్దములు వ్రాతప్రతిగా నుండిన గ్రంథములలో
మార్పులు వచ్చియుండనగునని యూహించుటలో ప్రతిబంధకము లేదు. ప్రకృత
సందర్భమున "ళ్లు" వర్ణకము నన్నయ యనేకస్థానములలో వ్రాసియుండడని
యూహించుట కవకాశము కలదనిమాత్రము చెప్పుచు నీ విషయము స్థలాంతర
మున విమర్శింప నవకాశము కలదని విడువఁబడుచున్నది.

## నన్నయ భారతమునందలి ద్వితీయాది విభక్తి ప్రత్యయములు

నన్నయకాలమున భాష యేర్పడుచుండెననియు, నట్టిదానికి ప్రకృతి ప్రత్యయ
విభాగము సంస్కృతవ్యాకరణపండితులు సంస్కృతవ్యాకరణప్రణాళి ననుసరించి
చేసిరనియును ముందే తెల్పితిని. ప్రత్యయముల చరిత్రమును, అర్థములను,
వివరించి ఆ యా ప్రత్యయముల రూపపరిణామక్రమమునుగూర్చి తెలుపునపుడు
మఱల నీ విషయము చర్చకు రావలయును. కావున నన్నయభారతమున నే యే
ప్రత్యయము లే యే యర్థములయందు వాడఁబడియుండినవో యవ్వానికిని, నేటి
భాషకును నేమయిన భేద మున్నదేమో యను విషయమునుమాత్ర మిచ్చుట
సంగ్రహముగ తెలిపి విరమింపనగును.

(1) 'ను' వర్ణకము—ఇది ద్వితీయ, తృతీయ, పంచమి, సప్తమి యనఁబడు
విభక్త్యర్థములలో వాడఁబడినది. ద్వితీయావిభక్తి యనంబడిన యీ ప్రత్యయము
స్వరూపము 'ను' అనియే చిన్నయ మొదలయినవారిచే నంగీకరింపఁబడినది. ఇది
'ని' యనియు, 'న్' యనియు రూపాంతరమును బొందునని పయి వైయాకరణుల
యభిప్రాయము. నన్నయగ్రంథమునందుమాత్రము దీనికి సాధారణముగా 'న్'
అనియే రూపము కనుపట్టుచున్నది. 'ను'వర్ణము విభక్తి యను మతమున 'ఉ'వర్ణ
మునకు 'ఇ'వర్ణ మాదేశమగుటయు, లేక లోపము కల్గుటయును అంగీకరింపఁ
బడుచున్నది. పొల్లునకారమే విభక్తి యను పక్షమున ఉ, ఇ అనునవి యేదే
నొక్క కారణమునఁ జేరిన వనవలయును.

| | | |
|---|---|---|
| ద్వితీయ : | తనరగఁ బుట్టించె నుర్విఁ దన యంశమ్మున్ | ఆది. III ఆ. ప. 54 |
| | తోడ్కొని తెచ్చెన్ దన తల్లి సత్యవతినిన్ | ఆది. IV ఆ. ప. 192 |
| | పాండవేయసింహులను బరాజితులఁ జేసితి | సభా. II ఆ. ప. 186 |
| తృతీయ | కశ్యపప్రజాపతి యజ్ఞమహిమను వినతకుం బుట్టి | ఆది. II ఆ. ప. 89 |
| | పర్వంబుల నేనిటం గృపాయితమై వెలయు | ఆది. I ఆ. ప. 56 |
| పంచమి | గరుడుని వినతనుం బనులుగొనుచున్నంత | ఆది. II ఆ. ప. 48 |
| | పునర్భవభీతి నపారవ్యామోహపాశబంధచ్యుతుఁడై | ఆది. II ఆ. ప. 140 |
| సప్తమి : | నేలఁగండ్లులొత్త నిద్రవోయినయది | ఆది. VI ఆ. ప. 179 |

(2) కువర్ణకము—ఇది 'కి' యను రూపాంతరమును బొందుచున్నది. షష్ఠీ ప్రత్యయమని వైయాకరణులచే విభజింపఁబడినది. సంబంధ సామాన్యమునందును, అనేక సంబంధవిశేషములయందును నియ్యది వచ్చుచున్నట్లు భారతమునుబట్టి తెలిసికొననగును.

ప్రథమ : నాకు సనామ్ని యయినదాని వివాహంబు గావలయు ఆది. II 151
నేను వివాహంబు చేసికొనవలయును అని భావము.

ద్వితీయ : యయాతి గర్వంబునకు సహింపక యింద్రుం డలిగి ఆది. III 211
గర్వంబును అని అర్థము.

తృతీయ : ఇది తొల్లి నాకు వరియింపఁబడిన భార్య ఆది. I 131
నాచే అని యర్థము.

చతుర్థి న కీఁ గాంచితి ఆది. I 96
మహాత్ముఁడు సంప్రదానము.

పంచమి దానికి భీతుఁడనై (దానివలన నని భావము) ఆది. III 189

షష్ఠి సంబంధ సామాన్యమున వచ్చు 'కు' వర్ణకమునకు లెక్కయే లేదు. ఈ ప్రయోగములను దిలకించునది.

| | | |
|---|---|---|
| నా కభిమతము | ఆది. III | 117 |
| నీ కెఱిగింపవలసె | ,, ,, | 118 |
| అమరావతి కరిగి | ,, ,, | 122 |
| వినత కపకారముచేసిరి ; సమబుద్ధి కజుడుమెచ్చి | ,, ,, | 125 |
| కుత్తుకకు డిగక | ,, II | 60 |
| పలుకుల కలిగి | ,, V | 55 |
| ఇంద్రుఁడు దానికిం గరుణించి | అర. I | 86 |

సప్తమి : చిత్తమ్మిప్పుడు పుట్టె నాకు ధర్మస్థితిమై ఆది. II 148
కోరిక నాయందుఁ గలిగిన దని భావము.

(3) గుఱిచి-గుఱించి—తపనుగుఱిచి తపము భక్తి సేసె అర. I 68
గుఱించి యనునది చాల విరళము. (ఉద్దేశించి యని భావము.)

(4) చేతన్—బ్రహ్మచేత ననుజ్ఞాతుండై ఆది. I 31 తృతీయ (కర్త్రర్థకము)
తత్తుకుచేత ననంతంబయిన యర్థంబుగొని-నుండి యని భావము-పంచమి.

(5) చేన్—ఎలుకచేఁ జచ్చుకంటె ఆది. VIII 308.
అమరారులచేఁ గ్రమ్మరంగ నమృతముఁ గొనియెన్ ఆది. II 17.

(6) తోడన్—ఇట్టులనియెఁ గరుణతోడ. ఆది. I -9 తృతీయ.

(7) తోన్—రత్నావళితోన చల్లుదు. ఆది. II 191 సహార్థము, తృతీయ.
ప్రమతితోఁ జదివె నెల్ల శాస్త్రములు. ఆది. II 159 ఉపయోగము, పంచమి.

(8) చేసి — ఇది బిందుపూర్వకంబుగ వచ్చును. బిందుస్థానమున నున్న నకారంబుపయి ఏవార్థకమయిన అకారము వచ్చునపుడు బిందువు రావలసిన యవసరము లేదు. ఇట్లే యూహించునది.

ధూమకేతనహతిఁ జేసి చేసె గృతాంతనికేతనాతిథిన్. ఆది. I 124

ఇచ్చట ధూమకేతనహతి కరణము - తృతీయ.

ఏకవిప్రసంబోధనఁ జేసి చేసె-ఇది హేతువు-పంచమి. ఆది. I 125

దానన చేసి. ఆది. I 80

నీ కులిశాభిరక్షణస్ఫురణన చేసి. ఆది. II 47

(9) మెయిన్ - మైన్—

రచియింపు మధికధీయుక్తి మెయిన్. ఆది. I 16

ధీయుక్తితో, అని యర్థము - తృతీయ.

అలుకమెయి మున్న పలికితి. ఆది. I 179

అలుకవలన నని భావము. పంచమి.

సుఖనిద్రమై నిట్టు లున్న వాని(నిద్రయందున్న వాని)సప్తమి. అర. III 321

(10) కై - కయి—

అనఘ మా మామ శకుని నాకై కడంగి. సభా. II 174

నాకొఱకు నని యర్థము - చతుర్థి.

(11) పొంటెన్ —

కరుణ గాశ్యపునకు నిచ్చె నఖిలలోక హితంబుపొంటె. ఆది. II 185

లోకహితముకొఱకు నని భావము.

(12) తదర్థము : ఇది చతుర్థ్యర్థమున వాడఁబడినది.

నీ తదర్థము కాఁగ దేవవినిర్మితం బిది. ఆది. II 208

నీ తదర్థంబులై నిఖిలవేదంబులు వర్తిల్లు - సభా. I 259

(13) వలనన్ : అపాయాద్యర్థంబుల నీ వలన వర్ణకంబు పంచమ్యర్థంబున వాడంబడినది.

పాండుకుమారుల రాష్ట్రంబువలనఁ బాపి - అపాయము - సభా. II 313

వనచరభయంబువలనఁ దత్కళత్రంబు రక్షింపనోపమియు - త్రాణము. ఆది. I 65

తక్షకువలని భయంబు - భయము. ఆది. II 186

యమువలన వరంబులు వడసి - గ్రహణము. ఆది. I 39

కశ్యపువలనఁ జరాచర భూతరాశియెల్లఁ బుట్టి - భవన. ఆది. II 59

భూసురులవలన వేదంబులు గఱచుచు - ఉపయోగ. ఆది. III 12

14) కంటెన్ : పురుషుకంటె మున్ను పరలోక మేగిన సతియ-
పూర్వము (అన్యార్థాది యోగజము.) ఆది. I 256
కార్తవీర్యుకంటెను వీరుఁడగుట - నిర్ధారణము. ఆది. V 124

(15) ఉండి :
రాజ్యభరంబు తాల్చిన యంతనుండి. ఆది. II 225
ఆకాశంబుననుండి అర. II 216
హరుశిరంబందుండి అర. III 84
అయోధ్యనుండి అర. II 187
నీరిలోనుండి అర. III 122

(16) కోలెన్ :
నాటంగోలె ద్విజిహ్వులు నాఁబరగిరి ఆది. II 123
నూరేండ్లంగోలె ఆది. VIII 149
యోజనంబునంగోలె ఆది. II 40

(17) 'న' వర్ణకము సంబంధార్థమున గలదు.
ఎలజవ్వనంబున విలసనము. ఆది. III 27
అలసభావంబున పొలుపును. ,, ,, ,,
యొక్కయని యర్థము.
భిన్నకుంభమున తోయములట్టులు ఆది. II 1-57
అందలి యని యర్థము.
సద్యోగర్భంబునన్ - ఉదితుండయ్యెన్ ఆది. III -44
(హేతువు) పంచమి.
పెంపున వృథ సేయఁగాఁ దగదు ఆది. III -232
పెంపుతో (తృతీయ)
అనిమిషత్వంబునం బొందిన తన నయనంబులు ఆది. VII -75
(ద్వితీయ) అనిమిషత్వమును అని భావము.
అహిలోకమున కరిగె భూవివరమునన్ ఆది. I -103

(18) ఇ - సంబంధార్థము.
ఈనాటి రాజును ఆది. VI -269
ఇతని భావము ,, ,, 279
వారియనునయించు సితకృష్ణతంతురాజి ఆది. I -119

(19) అ - సంబంధార్థమున సాధారణముగా బహువచనములపయిని వచ్చును.

| | | | |
|---|---|---|---|
| పలుకుల ముద్దును | ఆది. | III | 27 |
| హింససేసినవారల యేగు గతికి | ఆది. | VII | 146 |

(20) లోను :

| | | | |
|---|---|---|---|
| నీరిలోన దోఁచు తారక ప్రతిబింబము | ఆది. | V | 207 |
| ధనములలో నత్యుత్తమ ధనములు | | V | 201 |

(21) లోపల :

| | | | |
|---|---|---|---|
| వేల్పులలోపలఁ బెద్ద ధర్మువున సత్యమునన్ | ఆది. | V | 92 |

(22) లో : ఇద్దఱలో నం దెవ్వరి. ఆది. VIII 110

(23) అందు :

| | | | |
|---|---|---|---|
| వాగ్దర్పణంబునం దేర్పడ వెలుంగుచుండ. అధికరణము - సప్తమి. | ఆది. | | 31 |
| అవివేకియందుఁ బ్రయుక్తంబులయిన. కీఁగూర్చి - యని యర్థము. ద్వితీయ. | ఆది. | III | 313 |
| ద్రౌపదియందు సమయక్రియయును. కూర్చి - ద్వితీయ. | ఆది. | I | 35 |
| నీవు మాయందుఁ గుడిచి. మాతో - తృతీయ. | అర. | III | 390 |
| నాయం దధికధనంబు గొనిపొమ్ము. నానుండి యని యర్థము - పంచమి. | ఆది. | II | 193 |
| నిజరాజ్యభారం బంశుమంతునందు సమర్పించి. కొఱకు - చతుర్థి. | అర. | III | 71 |

పయిపట్టికలో నన్నయచే వాడంబడి నేఁడు ప్రత్యయములని వ్యవహరింపఁబడుచున్నవానిని నిరూపించితిని. నన్నయ వాడుక నేఁటికిని వైయాకరణులకును, రచయితలకును ప్రమాణమే గనుక నందలి ప్రయోగములు నేఁటిభాషలోఁగూడఁ గలవు. కొన్ని కొంచెము కొంచెముగా వ్యవహారాదికమున భ్రష్టమగుటయు, మఱి కొన్ని క్రొత్తవి ప్రత్యయములుగా నుపయోగింపఁబడుటయును నేఁటిభాషనుబట్టి చూచినచో స్పష్టపడును.

కూర్చి - కొఱకు - పట్టి - యొక్క - అనునవి నేటి వైయాకరణులచే విభక్తులుగా నంగీకరింపఁబడినవి. వీని ప్రయోగము నన్నయభారతములో లేదు.

ఇవి నవీనముగాఁ బ్రత్యయత్వము నొందినవి. నన్నయభాషలో వాడఁబడినవని ముందు నిరూపింపఁబడిన ప్రత్యయములలో - చేసి - వలన - పొంటె - కోలె - మెయి-గుఱించి - అనువాని యుపయోగము వ్యవహారములో నేఁడు భ్రష్టమయినది. "వలన" యనునది - వల్ల - యనురూపాంతరమును బొంది నన్నయ వాడుకకంటె చాల తక్కువగా వాడఁబడుచున్నది. 'చేసి' కొంచెము వినఁబడును. తక్కిన నాల్గును పూర్తిగా నశించినవి. ద్వారా - గుండా - ఉంచి - అనునవి క్రొత్తగా వాడుకలోని కెక్కినవి. నన్నయనాఁటి వాడుకలకును ఇప్పటి వాడుకలకును భేదము లీ క్రిందను నిరూపింపఁబడుచున్నవి.

| నాఁటి భాష | | నేఁటి భాష (వాడుకభాష) | |
|---|---|---|---|
| 1. | వేదములు వసిష్ఠుతోఁ జదివె | 1. | దగ్గర-వద్ద-చదివెను |
| 2. | శకుని నాకై కడంగి | 2. | నాకోసము పూని |
| 3. | అన్వేషించు పొంటెన్ | 3. | అన్వేషించుటకు |
| 4. | జనమేజయుని చేయు సర్పయాగము | 4. | జనమేజయుఁడు చేయు సర్పయాగము |
| 5. | యయాతికి నలిగి | 5. | యయాతిమీద నలిగి |
| 6. | మీకుం గరుణించి | 6. | మీ (యందు) (పయి) మీద గరుణించి |
| 7. | వానికి మార్కొనంగన్ | 7. | వానితో మార్కొనఁగన్ |
| 8. | నాకు సంతసిల్లి | 8. | నావల్ల సంతసించి |
| 9. | సంహార మొడంబడవలసెన్ | 9. | సంహారమున కొడంబడవలసెను |
| 10. | వేటవచ్చి | 10. | వేటకువచ్చి |
| 11. | కార్యము గడంగు | 11. | కార్యంబునకుం గడంగు |
| 12. | వానిన కడంగుము | 12. | వానికే కడగుము |
| 13. | అంతికంబున వచ్చి విహరించు | 13. | అంతికంబునకు వచ్చి విహరించు |
| 14. | ఇట యేల వచ్చితి | 14. | ఇట కేల వచ్చితి |
| 15. | ఎక్కడం గదలనేర | 15. | ఎక్కడికిం గదలనేర |

పయిని నిరూపించిన పట్టికలంబట్టి రెండు విధములయిన ప్రయోజనములు గలవు. మొదటిదానివలన నన్నయ భారతభాగమున నే యే శబ్దములు ప్రత్యయములుగాగాని, ప్రత్యయార్థములను దెలుపుటకుఁగాని వాడఁబడినవి యనుట. రెండవ పట్టికవలన నన్నయకాలమునందలి వాడుక నేఁటి వాడుకకంటె నెంత వఱకు భిన్నమయి యున్నది యనుట.

పయి పరిశీలనమువలన నీ విషయము స్పష్టమగుచున్నది. భాష యేర్పడుచున్నది. కొన్ని పదములు స్వార్థమున వాడంబడుచు క్రమక్రమమున సంబంధార్థమున స్థిరపడుచున్నవి. ఆ పదములను, ప్రత్యయములను, ప్రయోగములను బట్టి ఏడు విభక్తులు గల సంస్కృతపు ప్రణాళికయందలి ఏడు గళ్ళయందును వైయా

కరణులు సర్దిరి. అది చక్కఁగా కుదురకపోవుటవలననే ఒక ప్రత్యయమే 4,5,6,7, విభక్తులయందు కనుపట్టుటయు, స్వతంత్రములయిన శబ్దములే విభక్తు లనంబడుటయు సంభవించినదనుట స్పష్టము. 'కు, ను, స, ఇ, అ,' అను నేకాచ్కములయిన వానిని ప్రత్యయములుగాఁ జెప్పి, యితరములను స్వతంత్రశబ్దములుగా గ్రహించి ఏడు విభక్తుల క్రమముపొంత పోకుండుట యొకపద్ధతి కాదనఁజాలము. ఇదియే తెనుఁగునకు కుదిరిన ప్రణాళిక యనవచ్చును.

# క్రియారూపములు

నన్నయభాషలోని క్రియారూపము లనేకములు నేఁటికిని గ్రాంథికభాషలో వాడఁబడుచునే యున్నవి. కొన్నిరూపములుమాత్రము కాలక్రమమున మాఱి నేఁడు భిన్నములుగాఁ గనుపట్టుచున్నవి. కొన్ని వాడుకనుండి పరిభ్రష్ట మయినవి. అట్లు నన్నయభారతములో నుండియు నేఁటి వ్యవహారమున మాఱినవానిని మాత్ర మీ క్రింద నుదాహరించుచున్నాను. నన్నయగ్రంథమున నుండిన వర్తమాన క్రియారూపము లనందగిన యీ క్రింది (క్రియాజన్యవిశేషణములు) రూపములు వ్యవహారమున మాఱి వకార యకార లోపము నంది క్రమమున నకారలోపమునుగూడఁ బొందినవి.

(1) అతినిర్మలంబై యొప్పుచున్నయది. ఆ. II 31. తల్లిదండ్రుల యిడుములు వాయుట యెందును గలయది ఆ. II 51. ఇట్లు యవర్ణమధ్యమయిన రూపమే ప్రాచీనమయినది. దీనితరువాత నడిమి యకారంబునకు లోపంబు గలిగి కలది, ఉన్నది మొదలయిన రూపములవంటివి కలిగినవి. ఉన్నది అను నవీనరూపములుగూడఁ గ్వాచిత్కముగాఁ గలవు.

నాకు నదియ తక్కియున్నది యేనెట్లు దానిఁ బాతు. ఆ. II 71. త్రిభువనలక్ష్మి యి ట్లేలకోయున్నది యివ్వనమున. ఆ. VII 73. శరీరశస్త్రములు బొల్పుగనున్నవి. ఆ. V 200. వార్తయంద జగము వర్తిల్లుచున్నది. స. II 51.

(2) ఉన్నాఁడు, ఉన్నావు, ఉన్నారు మొదలగునవి యంతమందుఁగల నేఁటి వర్తమానార్థక క్రియారూపములు నన్నయభారతమున లేవు. వీనికి ప్రాచీనరూపములయిన 'ఉన్నవాఁడు' మొదలగునవి యంతమందుఁగల రూపములు క్వాచిత్కముగా క్రియారూపములవలెఁ బ్రయోగింపబడినట్లు గనుపట్టును.

ఇ త్తరుశాఖ విడువనేరకున్నవాఁడు ఆ. II 76

(3) ఎడిన్ - ఎడున్ అంతమందుఁగల పదములు (తద్ధర్మార్థకంబులుగా) వర్తమానార్థమునను, భూతార్థమునను, భవిష్యదర్థమునను నన్నయభారతమునఁ

గలవు. అట్టిరూపములు నేఁడు వాడుకనుండి తొలఁగిపోయినవి. ఇంతియగాక కవుల ప్రయోగములుగూడ చాల తక్కువ.

వినం గడువేడ్కయయ్యెడున్ - అగుచున్నది అని యర్థము ఆ. I 128

ఇతండు నూపెడిఁ - చూపగలడని యర్థము ఆ. VI 45

(4) అగుధాతువుయొక్క సహాయకరూపములు అంతాగమంబు లగుచుండును. అట్టి యభ్యాసము నేఁడు లేదు.

కాకున్నదయ్యెను ఆ. I 98

పంపు సేయరైరి ఆ. III 5

దంష్ట్రిలు నాటవయ్యె ఆ. III 13

నమ్మనేరనయ్యెదను ఆ. IV 30

వృష్టి లేదవు ఆ. III 250

(5) చేదర్థకము సమాపకక్రియారూపమువెనుక " ఏని యని చేర్చుటచే నేర్పడుచుండునది.

నల్ల సేసితి రేని నాకు దాసియగు మన వినత ఆ. II

అతఁ డపత్యంబు వడసెనేని ఆ. II 144

నీ వెఱుంగుదేని ఆ. II 169

ఇప్పటి వాక్యరచనము ఈ రీతిగా నుండదు. వాడుకలో చేస్తే. పడసితే, ఎఱిగితే అని యుండును. గ్రంథములయందు చేసినచో-యెడల-అట్లయిన మొద లయినవి కనుపట్టును.

(6) అన్నంతములయిన రూపముల వెనుక ననుబంధములుగాఁ జేరు క్రియలు అవ్యవహితములుగా నుండుట యిప్పటి వాడుక. నన్నయగ్రంథమున నవి వ్యవహితముగా నుండును.

అగునె ధర్మక్రియాలోపంబు హృదయంబులో సహింప ఆ. II 159

క్రోధిగాఁ దపస్వికిఁ జన్నె ఆ. II 174

చెప్ప నుత్పలదళనేత్ర విందుమ యపత్యము మేలని ఆ. V 90

నేఁడు సహింపనగునే, కాఁజనునే, చెప్ప విందుము అనియే ప్రయోగము.

(7) తెంచు అనునది ధాతువున కనుప్రయుక్తమగుట నన్నయభారతమున నధికముగాఁ గలదు. అట్టి యభ్యాసము నేఁడు పోయినదని చెప్పవచ్చును.

అగుదెంచు-నెగయుదెంచు-తలకొనుదెంచు మొదలగునవి,

నీరిలోననుండి నెగయుదెంచె ఆ. V 173

తలయేరును నుక్కిసయును దలకొనుదెంచెన్. ఆ. III 191

పయిని నిరూపింపఁబడిన నన్నయభారతములోని విశేషములను, ఆతనికిఁ బూర్వమున శాసనములయం దుండిన భాషాస్వరూపమును బరిశీలింపఁగా నీ క్రింది విషయములు నిర్ణీతము లగుచున్నవి.

(1) ప్రాచీన ద్రావిడభాషామాండలికమయిన తెనుఁగుయొక్క ప్రథమావస్థ నన్నయకు ముందటిభాష.

(2) నన్నయకాలమున దానికి మొదట సంస్కారము జరిగినది.

(3) నేఁటి భాషాస్థితికిని, నన్నయభాషాస్వరూపమునకును భేదము కలదు. ఆ భేదము భాషాపరిణతియొక్క క్రమపరిణామమును నిరూపించుచున్నది.

(4) నన్నయ వ్రాసిన తెనుఁగునకును, నేఁటి తెనుఁగునకును వీనిని భిన్న భాషలుగా గ్రహింపవలసినంతటి భేదము లేదు. అనగా హళగన్నడ, హొసగన్నడములకుగాని, ప్రాచీన, నవీన తమిళములకుఁగాని గలయంతటి భేద మేర్పడలేదని యభిప్రాయము.

(5) నన్నయకుఁ బూర్వపు తెనుఁగుయొక్క స్వరూపము నేఁటి తెనుఁగు కంటె ననేకవిషయములలో భేదించుచుఁ గొన్నియెడలఁ బండితులకుఁగూడ సులభముగాఁ నర్థము గాన ట్లున్నది.

# మాండలికభాషలు

## 1. స్వరూపము

మండల మనఁగా దేశభాగము. నేఁటి గోదావరి, విశాఖపట్టణము మొదలగు జిల్లాలను, ప్రాచీనకాలమున తెనుఁగుదేశమున నుండిన వేఁగినాఁడు, కమ్మనాఁడు, ములకనాఁడు మొదలగు ప్రదేశములను మనము మండలము లని వ్యవహరింప వచ్చును. ఇంతియగాక మండల మనఁగా ఒక గుంపు లేక రాశి. ఒకజాతి జనులను గాని, ఒకసంఘముయొక్క విభాగమునుగాని మనము మండలమని వ్యవహరింప వచ్చును. అట్టి మండలమునఁ గలిగినది మాండలికము. అట్టి భాషావిశేషమునే మాండలికభాష యని వాడుచున్నాము. ఈ పద మింతకుముందు చాలసారులు వాడఁబడినది. ఆంగ్లమున భాషాశాస్త్రములో వాడిన (Dialect) డైలెక్టు అను పదమునకు సమానార్థముగా దీనిని వాడుచున్నాము. ఈ డైలెక్టు అను పదమునకు ఉపభాష, లేక ప్రాదేశికభాష అను పదములుకూడ సమానార్థములుగా వాడి యున్నారు. కాని క్రింద నిరూపింపఁబడనున్న మాండలికభాషాస్వరూపమునుబట్టి యిది కేవల మొక్కప్రదేశమునం దుండు జనుల భాషనుమాత్రమేగాక ఒకజాతి జనులు వాడు భాషను లేక ఒక కాలమునందు సమానలక్షణములతో నొప్పుచుండిన భాషాంతర్భాగమునుగూడ సూచించు ననువిషయము స్పష్టము కాఁగలదు. కాఁబట్టి యితరములయిన పయి రెండుపదములకంటె మాండలిక మను పదమే యుక్తముగా నుండుట, నయ్యదియే యిందు వాడఁబడినది. బరంపురమునుండి మదరాసువఱకును, బందరునుండి బళ్ళారివఱకును గల దేశమున ముఖ్యవ్యవహారములో నున్న భాష యంతయును తెలుఁగని యెల్లఱకును దెలిసినదే. కాని యీ తెలుఁగంతయు నొక్కరీతిని నొక్కవిధమయిన క్రియారూపములతోనే ఒక్కయర్థమును బోధించుట కొక్కపదముతోనే వాడుదురని చెప్పుటకు వీలులేదు. ఆ యా దేశభాగములు తిరిగి భాషను విన్నవారి కా భేదము స్పష్టపడును. విశాఖపట్టణమండలమున జనులు మాటాడునప్పు డుండు స్వరవిశేషము గోదావరివారి స్వరవిశేషముతో భేదించును. అంతియగాక పదస్వరూపమునందును భేదము గలుగుచునే యుండును. వారు 'ఒళు పొచ్చాను' అని సాధారణముగా పలుకుదురు. దీని కర్థము వచ్చితిని యనుటయే. వెళ్ళిపోయివచ్చినాను, అను పదముల సంఘటన కాలక్రమమునఁ బొందిన రూపాంతర మియ్యది. వెడలు అను ప్రాచీనధాతురూపము వెడ్లు అయి, వెళ్ళు అయినది. దానిపయిని పోవు అను సహాయక్రియ చేర్చి వెళ్ళిపోవు అను శబ్దపల్లవము కల్పింపఁబడినది. వచ్చివేయు, పెట్టివేయు మొదలగువానిలోని వేయు ధాతువువంటిదే యీ పోవుధాతువునను ప్రయోగము. ఆపయిని వచ్చుధాతువు.

ఆపయిని సార్వనామికపరిశిష్టమయిన క్రియావిభక్తి యగు ఆను అనునది. ఇట్లేర్పడిన దీ రూపము. పదాది వకారమునకు ఒకారము. ళ్ల అనుదానిలోని ద్విత్వము నశించినది. నడుమను వకారముపోయి, ఒ అను రూప మేర్పడినది. పయిరూప మేర్పడునప్పుడు గలిగిన పద్ధతులను రెండువిధములుగా భాగింపవచ్చును. శబ్దపల్లవములుగా ఒక ధాతువునకు ధాత్వంతరము చేర్చుట తెనుఁగున నున్నదియే. అట్టి ధాతువులయిన వెళ్ళు, పోవు, వచ్చు ల కేకత్ర సమావేశము కలుగుటయు, అట్టివాని సాహచర్యములేకయే వచ్చు ధాతువు మాత్రముననే యర్థబోధ గల్గుటయు ననునవి రెండువిధములు. ఒకపద్ధతి యొకమండలమునను, రెండవది రెండవ మండలమునను గలదు. వచ్చాను, ఒచ్చాను అనునవి గోదావరి, గుంటూరు మండలములలో వాడుటగలదు. ఇవి యిట్లుండ దత్తమండలములలో వచ్చినాను, చేసినాను, చూచినాను మొదలగు రూపములు వాడుకలో నుండును. సర్కారులలో వచ్చాను, చేసాను, చూచాను మొదలగు రూపములు వాడుకలో నున్నవి. వచ్చినాను మొదలగునవి ప్రాచీనములనియు, వచ్చాను మొదలయినవి నవీనములనియు స్పష్టము. కాఁబట్టి ఒళుపొచ్చాను, వచ్చాను, వచ్చినాను, ఒచ్చాను, ఒచ్చినాను అనురూపము లన్నియు మాండలికభేదములని తెలిసికొనుట సులభము. ఇట్టి మాండలికమయిన భేదము భిన్నవిషయముల నాశ్రయించి యుండును. శబ్దముల నుచ్చరించు స్వరవిశేషమునను, శబ్దములయొక్క రూపాంతరత యందును, భిన్నభిన్న శబ్దముల ప్రయోగమునందును నియ్యది కనుపట్టుచుండును. మొదటిది మాటలాడునప్పుడు వినినచోఁ దెలియును. రెండవదాని నుదాహరించితిని. తీరస్థమండలములయందు పప్పుబద్దలు అని వ్యవహరించు నర్థమును బేడలు అను శబ్దముతో దత్తమండలమునఁ దెలుపుదురు. ఇచ్చట ఉచితము అనగా వెలలేక ఇచ్చినది అను శబ్దమునఁ బలుకు నర్థమును పూసాటు అని యచ్చట చెప్పుదురు. ఇచట అరుగు అను పదమునకు అచ్చట ఉద్దరి యందురు. ఇట్టి భేదములను మనము మాండలికభేదములని చెప్పుచుందుము.

ఈ భేదములు దేశమునుబట్టిమాత్రమేగాక సంఘమునుబట్టియు, వృత్తులనుబట్టియు నేర్పడుచుండును. బ్రాహ్మణులు మాటాడుభాష యొకటిగా నుండును. వారి మాటలలో విశేష సంస్కృతపదము లుండును. వారిలోని యంతర్భాగమయిన వైదికులయందు వైదికపరిభాషయని యొకవిధము గలదు. ఈ రోజున 'వయం దేవస్య' యెక్కడ, అనగా భోజన మెక్కడ యని భావము. వేదమున 'వయం దేవస్య భోజనమ్' అని భోజనమ్ అనుపదము 'వయం దేవస్య' తరువాత వచ్చినది. ఇట్టి పద్ధతిని, వారు తమ యభిప్రాయములను దెలుపుకొందురు. ఇట్లే రాజులు మాటలాడునప్పుడు 'దద్దయ్యగారు' అని వ్యవహరింతురు. వైశ్యులకు వారి పరిభాష, వారి పద్ధతియుఁ గలదు. నాలవజాతివారి భాషలోను మఱికొన్ని భేదములు గనుపట్టుచుండును. ఇట్టి భేదము లన్నియు మాండలికములని పేర్కొననగును,

కాని యీ స్వల్పభేదములు స్పష్టముగా నున్నను, వీరందఱును మాటాడు భాష తెనుఁగే. అందు సమానాంశము గలదు. అది తెనుఁగాడువారి కందఱకును దెలియుచునే యుండును. కాఁబట్టియే యీ భాషాసామ్యమును దెనుఁగని వ్యవహరింతుము. మనుష్యుల ముఖాద్యంగములనుబట్టి వ్యక్తులను మనము భిన్నులుగా గుర్తింపఁగలుగుచున్నను, వారియందు సమానాంశము లేకపోలేదు. అది యీ వ్యక్తి లక్షణముకంటెనుగూడ ప్రాముఖ్యమును వహించి పురుషత్వ మనుష్యత్వాది నిరూపణము స్పష్టముగా నొనర్చుచునే యుండును. మాండలికభేదసహితమయిన యీ తెనుఁగుగూడ నట్లే యని యూహించుట సులభము.

పయివివరణముచే మాండలికత్వ నిరూపణము గొంతవఱకు స్పష్టపడియుండ వచ్చును. దీని ముఖ్యలక్షణములు: 1. ప్రధానభాషాంతర్గతమయి యుండుట. 2. పరిమితమయిన ప్రదేశమునుబట్టిగాని, ఉపయోగివర్గమునుబట్టిగాని యేర్పడి యుండుట. 3. ప్రధానభాషతోడి సామీప్యమును నిరూపించుచు స్వతంత్రమయిన సారస్వతాదులుగాని, నాగరకతగాని లేకయుండుట. ఈ మూఁడు విధములయిన ప్రధానలక్షణములు గలిగియుండిన యీ మాండలికత్వ మనునది యపేక్షాబుద్ధి వలన నేర్పడుచుండుననుట యింకొక విశేషము. ఇది సామాన్యమయిన భాషోత్పత్తివిధానము ననుసరించి యేర్పడిన వ్యవహారము. ఒక భాషయొక్క మాండలికములుగా నుండిన భేదములు కాలాంతరమున రూపాంతరము నొంది సోదరభాషలుగా నేర్పడుట గలదు. ప్రాచీన ద్రావిడభాష యనున దొక్కటి దక్షిణహిందూస్థానమున విరివిగా వాడుకలో నత్యంతప్రాచీనకాలమున నుండినది. అద్దాని శాఖలే నేఁడు అరవము, తెనుఁగు, మలయాళము, కన్నడము మొదలగు భాషలుగా నేర్పడినవి. నేటి యీ సోదరభాషలు స్వతంత్రములయ్యు ప్రాచీనద్రావిడభాషాపేక్షను మాండలికములని వ్యవహరింపనగును. అనఁగా వీనికి ద్రావిడ మాండలిక భాషలు అను వ్యవహారము గలదనుట. నేటి తెనుఁగుననే దక్షిణదేశపు తెలుఁగు, రాయలసీమ తెలుఁగు, ఉత్తరసర్కారుల తెలుఁగు, మధ్యపరగణాల తెలుఁగు, బొంబాయి తెలుఁగు, గ్రాంథికపుభాష అనువానిని తెనుఁగుభాషామాండలికములని వ్యవహరింపనగును. ఇంతియగాక యీ పదమును జిల్లాకును జిల్లాకును గల యత్యల్పములయిన యుచ్చారణభేదములను, స్వరభేదములను, రూపభేదములను ఉద్దేశించి వాడుటయు గలదు.[1]

## 2. మాండలికముల యుత్పత్తి, వృద్ధి

భాషకు వ్రాతయు, సారస్వతమును లేనప్పుడు ఉచ్చారణయే దానికిఁ బ్రమాణము. ఈ యుచ్చారణము త్రిక్షణావస్థాయియని తార్కికుల మతము,

1 లి. సర్వే. వా. I

భాషయొక్క యుత్పత్తి వ్యక్తుల ప్రయత్నముననే యనుట నిస్సంశయము. అనఁగా నొక వ్యక్తి తాల్వాద్యవయవముల స్పందముచే వాయుచలనము గలిగించి శబ్దస్వరూపమయిన ధ్వనిని గల్గించును. దీనివలన నా ధ్వనియొక్క సంకేతమున కలవాటుపడినవానికి అనఁగా నధికారికి ఆ వక్తచే నభిప్రేతమయిన యర్థము స్ఫురించును. ఇది వ్యక్తులలో బుట్టి, చిన్న చిన్న సంఘములకుఁ బ్రాకుచుండును. ఆ సంఘములయందుగాని, ఆ గ్రామములయందుగాని దానికి తాత్కాలికముగా చెల్లుబడి గలుగును. ఆ ధ్వనులే వ్యక్తుల ప్రయత్నములచేతను ఇతరములయిన కారణములచేతను మాఱుపడినప్పుడు వాని యర్థబోధకతయందలి మార్పుగూడ నచ్చట నల్పసంఖ్యాకులకు విదితమగుచునే యుండును. మనము నేఁడు సూక్ష్మముగ బరిశీలించినచో నొక యింటి మాటలకును, మఱియొక యింటి మాటలకును భేదము గనుపట్టుచునే యుండును. ఇట్టి భేదమే భాషయొక్క ప్రాథమికావస్థయం దుండె నని యూహించుట స్పష్టము. కాఁబట్టి భాషయొక్క స్వాభావికావస్థ మాండలికత్వమే యని చెప్పవచ్చును. అప్పు డది ద్రవరూపమున నుండును. ఒక్క పదమునకే భిన్నరూపములు ఏకస్థలమునను, భిన్నస్థలములయందు ప్రచారములో నుండును. రూపబాహుళ్యము, రూపవైవిధ్యమును ఆ కాలమునందలి భాషయొక్క లక్షణములు. లిపి లేక, కేవలము వ్యావహారికావస్థయందున్న భాషలలో నీ లక్షణములన్నియుఁ గనుపట్టునని చెప్పఁబడినది.[2] "కొన్ని మాండలికములు స్వల్పకాలములోనే నశించుచున్నవి. కొన్ని క్రొత్తగ నుద్భూతము లగుచున్నవి. పెద్దవా రెవరైనను, విశిష్టులైనవారు, ఏదే నొక పదమును వాడినచో నది భాషయందు చేరిపోవుచున్నది. ఒక ద్వీపమునకుఁ గ్రొత్తజను లెవ్వరైనను వచ్చినచో వారు వాడిన మాటలన్నియు వీరు గ్రహించుట నయ్యవి వీరి భాషలోని భాగమే యగుచున్నవి. మఱికొన్ని ప్రదేశములలో కొన్ని కొన్ని గుంపులుగా నివసించు జనులు అప్పుడప్పుడు చేరి ప్రసంగించియు, సమావేశముల నేర్పరచుకొనియుఁ దమ భాషయొక్క సౌష్ఠవమును నిలుపుకొనుచున్నారు. తల్లిదండ్రులును, సమర్థులును నయిన పెద్దవా రందరును పిల్లలనుమాత్ర మొక్కచో విడిచి మాసములఁ లెక్కను దూరదేశములకుపోయి తిరిగి వచ్చునప్పటికి వారి పిల్ల లాడు మాటలలోఁ గ్రొత్త క్రొత్త పదములు, క్రొత్త పదసంఘటనలు నేర్పడుచుండును. దూరప్రదేశమునకు వేటలకుఁ బోయి జనులు సంవత్సరము లయినతరువాత తిరిగి వచ్చునప్పటికి మిగిలినవారి భాష మాఱిపోవును. ఇట్లే ప్రాకృతావస్థయందు భాషలు మాఱిపోవుచుండుననుట యుక్తియుక్తముమాత్రమేగాక యనుభవసిద్ధము ననుటలో విప్రతిపత్తి లేదు."

శాసనస్థ భాషనుబట్టి చూచినచో తెనుఁగు నన్నయకుఁ బూర్వము పై యవస్థతో సజాతీయమయిన యవస్థయం దుండెననుట నిర్వివాదము. నన్నయకుఁ

---

[2] *The Science of Language* by Max Muller. Vol. I. pages 54-58.

బూర్వమునందలి భాష యను ప్రకరణమున 6-వ సంఖ్యగా నిచ్చిన ప్రయోగము లను దిలకించునది. అంతియగాక యీ క్రింది పదముల వైవిధ్యము భిన్నశాసన ములనుబట్టి గ్రహింపనగును.

(1) తూఱువ్వు నూడ్ల బాదెయ్య రట్టొడ్లు. (1904-408) కాలము 7-వ శతాబ్ది

తుఱుగు నూడ్ల బాదెయ రాట్టొడ్లు (1904-408 A) ,,

తూపుఱన (1905-340)

(కడప, చిత్తూరు జిల్లాలలో)

పై శాసనములలోని మూఁడు రూపములు నేఁటి తూర్పు అను పదమునకు నాఁటి రూపములు. ఇందు తూరు = ప్రవేశించు, అనునది ధాతువు. వు, గు, పు అనునవి ప్రత్యయములు. మూఁడు రూపములును ప్రాచీదిశ యను నర్థ మున, సూర్యుఁడు ప్రవేశించు దిక్కు గావున నేర్పడినవి. ఆ మూఁడిటిలో నేఁటికి ప్రామాణికముగా నిలిచినది తూర్పు అనునది మాత్రమే. తక్కినవి నశించినవి.

(2) అట్లే పయి రట్టొడ్లు అను శబ్దము నేఁటి రెడ్లు అను శబ్దమునకుఁ బూర్వరూపము. దాని కేకకాలముననే భిన్నరూపములు శాసనములయందు లభించును. రట్టొడ్లు (1905-341), రట్టకుడి (1904-403), రట్టగుళ్ళు, రట్టగుడ్ళు, రాట్టగుళ్ళు (1904-400), రట్టడ్ల (1900-400B), రట్టోళి (1920-306), రాడ్లు (1904-408A). రట్టకుడి, రట్టోళి యనునవి ఏకవచనములు. తక్కినవి బహువచనములు.

(3) ఎళ్లువాన్లు-1917-797, ఎఱంగా (1904-408),

ఎళ (1906-495), ఏళ్గవి (1922-307), ఏళుచుణ్డి (1922-338).

ఇవి యన్నియును ఏలు (పరిపాలించు) ధాతువుయొక్క మూలరూపములు.

(4) బారణాసి (1904-384), వారనాసి (1904-405), బారణసి (1904-408 A), వారణాసి (1905-287), బరాంనాసి (1922-337), బరనసి (1917-811). పయిరూపము లన్నియును వారణాసి యను సంస్కృతశబ్దమునకు మాండలిక రూపములు.

(5) దినికి (1904-401), దేనికి (1904-403), దెన్నిల్పి (1904-400 A), తీనికి (1917-169). దీని అను నేఁటి శబ్దముయొక్క మాణ్డలికరూపము లియ్యవి.

(6) నఙు (1904-401), సాఙు (1904-403)

(7) పొడుచి (1917-797), పొడిచి (1922-328)

(8) చమ్పిన వన్లు (1904-401) ఎళ్లు వాన్లు (1917-797)

(9) కున్తులు, కున్తులు (1904-401), కున్తుళ్ - (1922-281)

(10) గవిలళు (1904-401), కవిలళాను (1904-403)

(11) వేఙ్డికొని (1904-400 B.), వేఙ్డికొణి (1904-405)

(12) పాఱువారికి (1922-338), పాఱుళ్లు (1905-287), పాఱుళ (1904-384) బ్రాహ్మణు లని యర్థము. (పారుఁడు, పారువాఁడు అని నన్నయ ప్రయోగములు) పయిని నిరూపించిన శాసనము లన్నియును నన్నయకుఁ బూర్వమున వ్రాయం బడినవే. వీనినిబట్టి నన్నయకుఁ బూర్వము తెనుఁగునకుఁ గేవల మాండలికత్వమే యుండెననుటయు, సామాన్యముగాఁ గేవల మాండలిక స్థితినిగుఱించి చెప్పిన మాటలును, నప్పటి భాషనుగూర్చి సమన్వితములును, సోదాహరణములును నయ్యె ననక తప్పదు.

## 3. ప్రామాణిక భాష

పయిరూపమున మాండలికావస్థలో నున్న భాషయందుఁ గావ్యములు పుట్టి, సభలు జరుగుచుండి, విచారణలు ప్రబలినప్పు డా భాషకు స్థైర్యము గలుగును. ద్రవరూపముపోయి ఘనీభవన మేర్పడును. నోటిమాట యానోటినుండి మఱియొక నోటికిఁ బ్రాకి మాఱుచునే యుండును. లిఖితము మాఱదు. అట్టి లేఖనము లేనప్పుడు భాష ఝరీవేగమున మాఱిపోవుననియు, దేశమంతయును భిన్నభిన్న రూపములనుండి చీలిపోవుననియు ముందుఁ జెప్పితినిగదా. నన్నయకుఁ బూర్వ ముండిన తెనుఁగుభాషలో నెన్ని మాండలికభేదములు గనుపట్టినను అఖిలాంధ్ర దేశమున విశేషవైవిధ్యము లేక, ఏకపదముయొక్క భిన్నరూపములను గుర్తించు నంతటి యైక్యమైనను ఏల నిలిచియున్నదని ప్రశ్నింపవచ్చును. పయిని చెప్పిన యభిప్రాయములు కేవల నాగరకతాహీనములయిన ఎడారివారును, చిన్నద్వీపముల లోనివారును, అయిన జనుల నుద్దేశించినవి. తెనుఁ గట్టిది గాదు. తెనుఁగుదేశము నంతటను నన్నయకుముందు పది, పండ్రెండు శతాబ్దముల కాలము ఆర్యనాగరకతను, విద్యలను, శాస్త్రములను, సంస్కృత ప్రాకృత భాషలను నుపయోగపఱచుకొను చున్న రాజులును, బ్రాహ్మణులును, బౌద్ధులును ననేకులు నివసించియుండిరి. వీరివలని సంఘటనలు, సమావేశములు మొదలగునవి భాషకుఁ గొంత స్థిరత గల్పించి యా రూపమును కొంతవఱకయినను నిల్పినవి.

భాషకు స్థిరత వచ్చినతరువాత భాషలోని మాండలికరూపములు చాల నశించును. కవు లేమాండలికములను గ్రహించిరో యవియే నిలుచును. వానినే శిష్టులు వాడుదురు. ఏకరూపత యేర్పడుచుండును. ఇట్టి యవస్థ లేనిది గావుననే నన్నయ నొక్కసారిగా భారతమువంటి మహాగ్రంథమును దెనుఁగున వ్రాయుమనిన రాజాజ్ఞను నెఱవేర్పఁజాలనేమో యను భయంబుననే 'భారత భారతీ సముద్రము దఱియంగ నీఁదను విధాతృనకైనను నేరఁబోలునే, అయినను,

దేవా, నీ యనుమతంబున, విద్వజ్జనంబుల యనుగ్రహంబునం జేసి నా నేర్చు విధంబున నిక్కావ్యంబు రచియించెద' నని తొడంగెను.[3] తొడంగి నారాయణభట్టు సాహాయ్యముండియు 2½ పర్వములను వ్రాసి తిక్కనదాఁనిని ముగింపఁజాలకయే కాలధర్మము నొందెను. అదిమొదలు నన్నయ వ్రాసిన భాషయే ప్రామాణికభాష యయినది. తిక్కనయు నామార్గమునే యనుసరించెను. "తద్రచనయ."[4] కా నన్నయభట్టు ననుసరించినవాఁడు ఎఱ్ఱన. తన నృసింహాపురాణమునందు నన్నయ తిక్కనలకు వెలియైె తత్పూర్వమయినభాష 'కాసట బీసట'[5] యని ఎఱ్ఱన వ్రాకుచ్చుటకు వా రిరువురివలనను భాషకు గలిగిన స్థైర్యమును, తత్పూర్వభాషయొక్క స్థితియు నెఱింగినవాఁడగుటయే హేతువని యెఱుంగునది. 'తాఁబల్కిన పల్కులాగమములై' పొల్పొందునని తిక్కనను ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశమున నుతించెను. తరువాత లక్షణగ్రంథములు మొదలయినవి ప్రబలి తెనుఁగు లక్షణబద్ధ మయ్యెను.

ఉ. ఆదిని శబ్దశాసనమహాకవి చెప్పిన భారతంబులో, నేది వచింపఁగాఁ బడియె నెందును దానినెకాని సూత్ర సం, పాదనలేమిచేఁ దెలుఁగుబల్కు మఱొక్కటి కూర్చి చెప్పఁగా, రాదని దక్షవాటి కవిరాక్షసుఁడే నియమంబు చేసినన్.

క. ఆ మూఁడు పర్వములలో, నా మాన్యుఁడు నుడువు తెనుఁగు లరసికొని కృతుల్, తాము రచించిరి తిక్కన, ధీమణి మొదలైన తొంటి తెలుఁగు కవీంద్రుల్.

పయి యప్పకవి మాటలనుబట్టి ప్రామాణికభాషను గవు లట్లే రక్షించుకొనుచు, నద్దాని నభ్యసించుచు వచ్చుచుండిరి గావుననే యఖిలాంధ్రదేశమున నొక్కభాషయు, నొక్కనాగరకతయు, నొక్కవిధమైన కావ్యభావజాలమును గలిగి యాంధ్రత్వము నిలిచినది.

ఇట్లే ప్రామాణికాంధ్రభాషను లాక్షణికులు రక్షించుచుండిరని చెప్పవలసిన యావశ్యకత లేదు. "నియమము సంస్కారముకొఱకనియు, నట్టి సంస్కారము లేకపోవుటచే భాష గ్రామ్యమనియు, నపభ్రంశమనియు పేర్కొనంబడు ననియు" యాంధ్రశబ్దచింతామణి కర్త.[6] "సమ్మూలవంతమగుటచేతను, రూఢమగుటను, సాధువులచే గ్రహింపఁబడినదగుటచేతను అపభ్రంశత్వము లేదు. నియమాభావము చేతనే యది గలుగుచున్నది. విద్వాంసులయొక్క ప్రవృత్తి యా గ్రామ్యత్వ నివారణముకొఱకే యయినది. మేమును దానికొఱకే చాలవఱకును బ్రయత్నించుచున్నాము. పామరాదిజనులచే ప్రయోగింపఁబడుచున్నదే గ్రామ్య మనఁబడుచున్నది. కవిత్వమునం దపశబ్దదోషమును గొంచెమయినను సహింపము" అని

[3] భారతము. ఆదిపర్వము, అశ్వా, పద్యము 19-20,

[4] అరణ్యపర్వము. భార. [5] నృసింహ పురాణము ఎఱ్ఱాప్రెగ్గడ. ఆ. I

[6] అనియ మాద్గ్రామ్యం హి యత్త్వపభ్రంశః (సంస్కారార్థోనియమః)

అథర్వణులు వ్రాసిరి.[7] "అందులోన గ్రామ్య మనఁగ నెవ్వరు నొప్ప రొరుల దెగడుచోట నొప్పు నదియు" అని కేతన. (13-వ శతాబ్ది). ఇట్లే యనేకవిధములఁ బ్రాచీనకవులచే రక్షింపఁబడి తెనుఁగు పందొమ్మిదవ శతాబ్దమువఱకును దన స్వరూపమును జాలవఱకు మాఱకుండ గ్రాంథికముగా నిలువఁబెట్టుకొనినది.

ఇంతవఱకును నిలువంబడిన పద్ధతి యొక్కటి. ఆ పయిని గల్గిన సంచలనము మఱియొకటి. పాశ్చాత్త్యులతోడి సంఘర్షణము గలుగువఱకును సంస్కృతభాష, భాషాప్రామాణ్యమును. శాస్త్రములపై మర్యాద, లక్షణము ననుసరింపవలెనని పట్టుదల, అపశబ్దములఁ బ్రయోగించుట దోషము, పాపము అను నభిప్రాయములు ప్రామాణ్యమును నిలుపంబెట్టినవి. పాశ్చాత్త్యులు మనకు పాలకులై మనదేశమున స్థిరమైనరాజ్యమును నెలకొల్పి, విద్యాప్రణాళికను దాము వశపఱచుకొని దేశీయ భావప్రవాహములకును, ఆశాతరంగములకును హేతుభూతులు కాఁజొచ్చిరి. (1817-1855) సంవత్సరముల నడుమ బందరులో మదరాసు సివిలు సర్వీసులో నుద్యోగిగా నుండిన శ్రీయుతులగు సి. పి. బ్రౌనుదొరగారు ఆంధ్రభాషను, ఆంధ్రగ్రంథములను అనేకవిధముల నుద్ధరించిరి. దేశమున వివిధములయిన స్థలములనుండి వ్యయప్రయాసముల కోర్చి వ్రాతప్రతులను దెప్పించి పండితులకు వేతనములనిచ్చి ప్రామాణికములయిన ప్రతులను దయారుచేయించిరి. అతఁడు తన జీవితచరిత్రమున వ్రాసిన మాటలనుబట్టి యీ క్రింది విషయములు స్పష్టము లగుచున్నవి. తాను సంపాదించిన యొక్కొక్క ప్రతిని దెచ్చి పరిశీలించి చాలప్రతులలో నున్న మంచి పాఠముల నేర్చి కూర్చి యామూలాగ్రముగా నున్న యొక్క ప్రతిని దయారుచేసి యా గ్రంథమును ముద్రించుచు వచ్చెను. ఈ పద్ధతి నాతఁడు 1826-వ సంవత్సరమున నారంభించెను.

ఇది నాఁటినుండి నేఁటివఱకు నా తీరుననే జరుగుచున్నది. వ్రాతప్రతులను బరీక్షించినచో నవి చాల హేయముగా నుండును. చదువుటకు సుగమముగా నుండవు. తప్పులు కుప్పలుగా నుండును. అపప్రయోగములు, అగ్రాంథికములు, సందర్భములు లేనివి, అధికపాఠములు, అర్థము కుదురని పద్యములు, గణదోషములు, యతిప్రాసముల దోషములు మొదలయినవి లెక్కింపరానివి యెన్నియో కూడుకొని యసమగ్రములయి యుండును. ఇట్టి పుస్తకము లన్నిటిని సంపాదించి వానినుండి సాధువయి కవి కభిప్రేతమయిన మూలమును దయారుచేయుటలో చాలక్లేశము లున్నవనుట కేవల స్వభావోక్తి. ఒక్కొక్కచోట మహాకవి గ్రంథములలో నర్థముకాని పద్యములు, అన్వయములేని రచనములు దిద్దరాక సంపాదకులను గష్టపెట్టుచుండును. ఇట్టి ప్రతులనుండి సాధుపాఠములయిన ప్రామాణికగ్రంథములను రచియించుటలోఁ బ్రామాణికమయిన యాంధ్రభాషకు మఱల

[7] సన్మూలవత్త్వా ద్రూఢత్వా ద్గృహీతత్వా చ్చసాధుభిః। నాపభ్రంశత్వ మేవస్యా న్నియమాభావతస్తు తత్, కవితోపాశ్రితం దోషం నైవ కించి త్సహామహే.

గొప్పస్థితి కలిగినది. పండితప్రయుక్తమై, సలక్షణమై, సాధువై, కొంచె మించు మించుగ నేకరీతిగా గ్రంథకర్తలచే పొందుపఱుపఁబడిన ప్రామాణికభాషాప్రవాహము లేఖకులయు, పాఠకులయు, పామరులయు అజ్ఞత యను సైకతములలోఁ బడి యత్యల్పరూపమున మాత్రమే యుండగా బ్రౌనుదొరగారి ముద్రణప్రణాళికయు, సంపాదనపద్ధతియు నద్దానికి బాహుళ్యమును, వైశాల్యమును గల్పించి రక్షించి నది. ముద్రణయంత్రములు నెలకొని గ్రంథములన్నియు ముద్రించుట జరిగినది. ఇట్లుండ నాంధ్రభాషకు చిన్నయసూరిగారు బాలవ్యాకరణమును, బహుజనపల్లి సీతారామాచార్యులుగారు ప్రౌఢవ్యాకరణమును వ్రాసి, ప్రామాణికభాషకుఁ బట్టు కొమ్మలైరి. వీరేశలింగముగారు ఆంధ్రభాషలోని కనేకములయిన సాహిత్య మార్గములను ఆంగ్లమునుండి తెచ్చిపెట్టి యనేక గ్రంథములను రచియించిరి. నవలలు, నాటకములు, కథలు, కథానికలు, పద్యములు, గద్యములు నిరంతరము పండితుల చేతను, భాషాభిమానులచేతను వ్రాయఁబడుచుండినవి. వూండ్ల రామకృష్ణయ్య గారు అముద్రితగ్రంథచింతామణియందు అముద్రితగ్రంథసంపాదనప్రయత్నము గావించిరి. ఆంధ్రదేశమునం దంతటను నాటకసంఘములు, కవిజనసమాజములు, గ్రంథమాలలు బయల్వెడలినవి. కవులు, శతఘంటకవులు, ఆశుకవులు ప్రబలిరి. తిరుపతి వేంకటకవులు దేశదేశముల నవధానములు సల్పిరి. ఆంధ్రపత్రిక, భారతి మొదలయిన పత్రికలును తెనుఁగున బయలుదేరినవి. మదరాసునుండి బరంపురము వఱకును, బందరునుండి బళ్లారివఱకును ఒక్కటే నియమబద్ధమయిన భాష ప్రామాణికమయి యీషద్వైషమ్యములతో తెనుఁగుదేశముయొక్క యైక్యమును అన్య మార్గమున సంపాదింపరానిదానిని భాషారూపమున సంపాదించిరి. అదియే గ్రాంథికాంధ్రభాష. నన్నయకాలమునుండి నేటివఱకును కొంచె మించు మించుగ నొక్కరూపముననే వాడుకనందుచు దేశమున నున్నది.

## 4. వ్యావహారికభాష

గ్రాంథికభాష అను పేరుతో తెనుఁగుభాషయొక్క ప్రామాణికస్వరూపము ఎట్లేర్పడి యెట్లు విరివిచెందినదో ముందు నిరూపించితిని. నన్నయకు ముందుండిన యాంధ్రభాషాస్వరూపమును, నది యెట్లాతనిచే సంస్కరింపఁబడినదో యను విషయమునుగూడ నిరూపించితిని. తన కాలమున నాంధ్రదేశమునం దంతటను నన్నివిధములయిన జనులచేతను వాడఁబడు తెలుఁగు నంతటిని నన్నయ తన భారతమున కెక్కించెననిగాని, వాడుకలో లేని కృతకపదములను సృజించెనని గాని చెప్ప వీలులేదనియు ముందిచ్చిన యుదాహరణములనుబట్టి స్పష్టమేగదా. ఆతనిచే వాడఁబడిన రూపములు ప్రామాణికములయి తరువాతివారికి గ్రాహ్యము లయినవి. ఆతనిచేఁ గ్రహింపఁబడని యనేక రూపములు నశించియుండును. కొన్ని రూపాంతరమునంది నేటికి వాడుకలో నున్నవి. 'తూఁటువ్వు, తూఁటుగు,

తూర్పు ' అను వాడుకలోనుండిన మూఁడురూపములలో తూర్పు అనునదియే నేఁటికి నిలిచినట్లు ముందు నిరూపించితిని. అట్లే తన కాలమునఁ గొంతవఱకును వాడుకలో నుండిన ట్లూహింప వీలయిన, టికారయుక్తపదములును, శవర్ణాంత బహువచనములును, ఙకారయుక్తరూపములును నన్నయ గ్రహింపక విడుచుటచే నేఁడు పూర్తిగ నశించినవి. భారతము చదివి ప్రామాణికభాష వ్రాయవలె ననువా రత్యల్పసంఖ్యాకులుగా నుండినవా రగుటను, కేవలము భాషను దైనిక ప్రయోజనముకొఱకే వాడుచుండినవారే యత్యధికసంఖ్యాకు లగుటవలనను వాడుకలోని భాషకును, ప్రామాణికభాషకును దూరము హెచ్చు కాజొచ్చి నది. భాష వాడునట్టివారి సోమరితనమువలనను, అజ్ఞతవలనను, అసమర్థత వలనను, మఱికొన్ని యితరహేతువులవలనను భాష మాఱుచుండుననుటయు, నది యెట్లు మాఱుచుండుననుటయు ముందు విశదీకరింపఁబడును. అట్లు దినదినమును పదములు మాఱుచునేయుండును. దానివలననుగూడఁ బ్రామాణికభాషకును, వ్యావహారికభాషకును దూరము హెచ్చయిపోయినది. కాఁబట్టి గ్రంథముల యందు ప్రామాణికభాషను వాడవలసినదనియు, నద్దానిని వీలయినంతవఱ కేక రూపముగ నుంపవలసినదనియు నుద్దేశించి పూర్వలాక్షణికులు వాడుకలోని యప భ్రష్టరూపము లనంబడెడు వానిని, నియమదూరమయిన వానిని, సంస్కారము లేనివానిని గ్రామ్యములని పరిహరించుచు వచ్చిరి. నియమదూరమయినదియు, అపభ్రంశమును గ్రామ్యమని ఆంధ్రశబ్దచింతామణి. దీని కుదాహరణముగా నరపాలులు, శుభాలు, శైలకన్యా అను పదములు బాలసరస్వతి చూపించెను.[8] ఇందు నరపాలురు అని యుండవలెను. శైలకన్య అని హ్రస్వము గలుగవలెను. ఈ రెండును ప్రామాణిక రూపములకంటె భిన్నములయినవనియు, లక్షణబద్ధములు గావనియు నాతని యూహ. పాలురు, అనుదానికిఁ బ్రతిగా పాలులు అని వాడువా రుండకపోరు. ఇందు లువర్ణ యుక్తరూపమే మొదటిదయి యుండగా, పాలురు అనునది తరువాతిరూపమయి యుండవచ్చును. లేదా లువర్ణముచేరిన రూపముగూడ వాడుకలో నుండియుండవచ్చు ననుట కభ్యంతరములేదు. ఈ రెంటిలో నొకటి ప్రామాణికము. రెండవది గ్రామ్యము. 'పామరాది జనులచేఁ బ్రయోగింపఁబడినది గ్రామ్యమని చెప్పఁబడుచున్నది' అని యథర్వణుడు వ్రాసెను.[9] ఆంధ్రభాషాభూషణమున, గ్రామ్యభాషనాఁగ గల వైదు తెఱగులు[10] అని గ్రామ్యమునుగూడ నొకతెఱగు తెలుఁగుగానే కేతన యంగీక రించెను. 'అందులోన గ్రామ్య మనగ నెవ్వరు నొప్ప రొరులఁ దెగడుచోట నొప్పు నదియు' గ్రామ్యమున కుదాహరణము. తెచ్చుతారు, మమ్మూ, యేగ, కొంటూ, మోసేటివారు, వోకుమీ, యీడే, యినుతి, వేయకుండాఁడు మొదలగువాని నొసంగెను. ఇందలి తెచ్చుతారు అను పదము నన్నయచేగాని, యితరులచే

---

[8]బాలసరస్వతీయము పుట 150 వావిళ్ళ. వజ్ఝల చినసీతారామశాస్త్రి. [9]పామరాద్యైః ప్రయుక్తం య త్తద్గ్రామ్య మభిధీయతే. అ. వా. [10]ఆ. భా. భూ. ప. 18. 20. 25.

గాని పూర్వులచే నంగీకరింపఁబడలేదు. నన్నయకాలముననునిది వాడుకలో నుండి యుండవలె, లేదా తిక్కనకాలమున నుండెననుట తప్పదుగదా. అదియే నేఁటి వాడుకలో తెస్తారు అను రూపమును పొందినదనుట నిశ్చయము. ఇంకను నపభ్రష్టరూపములు తెత్తారు, తెత్తరు అనునవి నేఁడు గలవు. ఇవి యన్ని యును గ్రామ్యములని పూర్వు లనిరి. వ్యావహారికములని మనము అనవచ్చును. వస్తాడు, తెస్తాడు, తెచ్చేని, వచ్చేని మొదలగునవి గ్రామ్యములని చిన్నయ సూరి యుదాహరించెను. పూర్వులచే గ్రామ్య మనఁబడినదానిని మన మిప్పుడు వ్యావహారిక మనుచున్నాము. పైదానినిబట్టి వ్యావహారికము లేక గ్రామ్యము యొక్క లక్షణ మిట్లు నిశ్చితమగుచున్నది. (1) వ్యాకరణముయొక్క క్రమమును గాని, శబ్దముయొక్క స్వరూపమునుగాని యెఱుగకయో, అనవహితులుగా నుండియో, సోమరితనమువలననో, భ్రాంతిచేతనో తెలిసినవారును, శిష్టులును వాడుచు నిరంతరప్రయోజనమును వెళ్ళబుచ్చుకొను భాష. (2) అపండితులు, అజ్ఞులు అయినవారు నిరంతరము వాడుచుండెడు భ్రష్టరూపములు. ఈ రెండు విధములయినది గ్రామ్యమని పూర్వుల యూహ యనుట స్పష్టము. అగుతుంది, అవుతుంది, అవుతది, ఔతది, ఔద్ది, అగుద్ది అను రూపములన్నియు వినఁబడుచునే యుండునుగాని యివియన్నియు నెవ్వరు వాడినను గ్రామ్యము లనియే పూర్వుల యూహ. నేఁటి వాడుకలలో శిష్టులు వాడునట్టి యింగ్లీషుసమము లన్నియును వ్యావహారికము లేగాని ప్రామాణికములని యెవ్వ రనఁగలరు? ప్రామాణికేతర మయిన భాషయంతయును వ్యావహారికమే. ప్రామాణిక మన నేది యనియు, నేవ్యాకరణము ప్రమాణ మనియు వాదించి లక్షణమున నవ్యాప్తియు, నతివ్యాప్తియుఁ జూపవచ్చునుగాని యింతకంటె నిద్దానిని సునిశితముగా నిరూపించుటకు వీలులేదు. భాషను మూఁడుతెఱంగులుగా విభజింపనగును. (1) ప్రామాణికభాష - వచ్చు చున్నాడు అను రూపమువంటిది ప్రామాణికముగాదని యెవ్వరు ననరు. ఇట్టిదంతయు మొదటి తెగ. (2) సందిగ్ధము - వల్ల, నుంచి, గుండా మొదలగునవి. ఇట్టివి కొందఱు గ్రహించినవే. కొందఱు అపభ్రంశము లనిరి. వీనినిగురించిన వివాద మెప్పుడును నున్నది. (3) కేవలగ్రామ్యము - ఒస్తాండోడు, తోత్తడు, ఒళ్ళొచ్చుడు, ఒత్తడు మొదలగునవి. ఇట్టి రెండవదానిలోఁ గొంత భాగమునుగాని, యంతటినిగాని మూఁడవవిభాగము నంతటిని గలిపి గ్రామ్యమనిగాని, వ్యావహారిక మనిగాని యనవచ్చును. ప్రాచీనకాలమునుండియు గ్రామ్య మను పదము చాలగా వాడుటవలన అర్థమునఁ గొంచెము నీచతను రూపించునట్లు మాఱగా నద్దానికి వైయాకరణులు చెప్పిన యర్థమును గ్రహింపక, యాలంకారికులు చెప్పిన యసభ్యము అను భావమును గ్రహించి ఆ పదమును బరిహరించి వ్యావహారికము అను పదమును కీ. శే. శ్రీ గిడుగు రామమూర్తిపంతులుగారు వాడిరి. తరువాత నది వాడుకలోనికి వచ్చెను. వాడుకభాష యనబడుదానికి గ్రామ్యము అను పదమువలని నీచతాస్ఫురణ

తాత్కాలికముగా బోయెనుగాని కాలక్రమమున నన్నిశబ్దముల యర్థమును భ్రష్టమగునట్లే వ్యావహారికమను పదమును భ్రష్టముకాక తప్పదు. అట్లయిన పదముల విపరిణామమును వేఱుప్రకరణమునఁ జర్చింతును. కాని వ్యవహారము మూఁడు విధములని, (గ్రంథవ్యవహారము, రాజకీయవ్యవహారము, దైనికవ్యవహారము) ముందే నిరూపించి తిని. కావున కేవల దైనికవ్యవహారముమాత్రమే వ్యవహారమనియు, నితరము గాదనియు నూహించుట యుక్తముగాదు. గ్రాంథికభాష యనుటకంటె దానిని ప్రామాణికభాష యనుటయే యుక్తము. దీని జీవనమును, ముఖ్యలక్షణమును గ్రంథస్థమగుటమాత్రమేగాదు. అఖిలాంధ్ర దేశమునఁ బ్రమాణముగా నెన్నఁబడుటయే యనక తప్పదు.

ఇట్లు వ్యావహారికముగా నుండిన భాషను లాక్షణికులును, గ్రంథకర్తలును, గ్రంథప్రయోగయోగ్యమని యేనాఁడు నంగీకరింపలేదు. ఏనాఁడును ప్రామాణిక భాషకును, వ్యావహారికభాషకును భేదము కలుగక తప్పదు. ఒకటి శాశ్వతముగా నుండి దేశములో నెల్లెడలను వక్త పరోక్షముననుగూడ జను లర్థము చేసికొనుట యుద్దేశముగా గలది. రెండవది తాత్కాలికమయిన ప్రయోజనము గలిగి ఎదుటివా రర్థముచేసికొనుట కుద్దేశింపఁబడినది. మొదటిది కొంతయేని సంస్కారము గలిగి భావస్ఫూర్తియందును, భాషావిషయముననుం గొంత యధికారము గలవానికొఱ కేర్పడినది. వ్యావహారికభాష నానాముఖముల జాతినిబట్టియు, వృత్తినిబట్టియు, దేశభాగమునుబట్టియు-వేయేల-వ్యక్తులనుబట్టియు ఎంతయో కొంత భేదించుచునే యుండును. కాఁబట్టి యిది యనేకవిధములుగా నుండి బహువిధముల భూమిపయిఁ బడి నిలువయయిన వర్షజలములవలె నుండును. శోధించి పానముచేయుట కేర్పరుపఁబడిన జలమువంటిది ప్రామాణికభాష. ఇట్లనుటవలన నదులయందలి జలములు మొదలగునవి పానయోగ్యములు కావనిగాని, యందఱు సంపాదించి సేకరించుకొనిన జలములును నిర్మలములనిగాని చెప్ప వలనుపడదు.

ఆంధ్రశబ్దచింతామణికి వ్యాఖ్యారూపమైన బాలసరస్వతీయము భిన్నములగు వ్రాతప్రతులలో భిన్నరూపములతో వ్యావహారికభాష నున్నదనియును, బాలసరస్వతి మాత్ర మట్లు దాని నుద్దేశింపక ప్రామాణికభాషలోనే వ్రాసె ననియును బాలసరస్వతీయపీఠికలో శ్రీ వజ్ఝల చినసీతారామశాస్త్రిగారు నిర్ణయించియున్నారు.[11] కేతన కాలమునందును, నన్నయకాలమునందును అవిచ్ఛిన్నముగా నుండిన వ్యావహారికభాషా ప్రవాహమే మాఱుచు బాలసరస్వతీయము వ్రాసికొనినవారు వాడుకొనుచుండిన నాఁటి భాషగా నేర్పడినది. విశ్వనాథనాయకుని స్థానాపతిచే వ్రాయంబడి, రాయవాచక మను పేర సాహిత్యపరిషత్తుచేఁ బ్రచురింపఁబడిన గ్రంథములో నాఁటి వ్యావహారికభాషా స్వరూపము గొంత తెలియవచ్చును. మన్నారుదాసవిలాస మను పేర రంగాజమ్మచే 1660 సంవత్సరమున వ్రాయఁబడిన యక్షగానమున నాఁటి వివిధములయిన వ్యావహారిక

---

[11] బాలసరస్వతీయ పీఠిక. పేరాలు 21, 22, 23. వావిళ్ళ ప్రెస్సు.

భాషలు, కరణములు, స్త్రీలు, పండితులు మొదలగువారు వాడునటువంటి తెనుఁగు భాషాభేదములు నిరూపింపఁబడినవి. కాని కవయిత్రిమాత్రము ప్రామాణికభాషనే వాడినది. ఇంకను దక్షిణహిందూదేశ శాసనములు IV, V వాల్యూములలో భిన్న భిన్న కాలములందును, భిన్న భిన్న దేశములందును వ్రాసిన శాసనములు ప్రచురింపఁబడినవి. వానిని బరిశీలించినచో నానాఁటి వ్యావహారికభాషలలోని రూపములు తెలియఁగలవు. శ్రీ వేదం వేంకటరాయశాస్త్రిలుగారు వ్రాసిన గ్రంథములలో కొన్ని యెడలను, శ్రీ వావిలికొలను సుబ్బారావుగారు వ్రాసిన సులభవ్యాకరణమునను తమనాఁటి వ్యావహారికభాషల స్వరూపమును నిరూపించియున్నారు.

ప్రాచీనకాలమున కౌళ్లు, కదపాలు, దరఖాస్తులు, దస్తావేజులు మొదలగు రాజకీయవిషయములను, లేఖలను, టీకలను, పరిమితప్రయోజనము గలిగి విద్యావిహీనులయినవారికొఱ కేర్పడిన పాటలు, కీర్తనలు మొదలగువానియందును వ్యావహారికభాషాప్రభావము లేకపోలేదు. యక్షగానములు మొదలగు నాటకములలో పాత్రవిశేషములయందును, శాసనములయందును గొంతవఱకును వ్యావహారికభాషారూపములును, భేదములును గనుపట్టుచునే యుండును. ఇట్లు అనాదిగాను, అనంతముగాను ఉండిన వ్యావహారికభాష యీ శతాబ్దముతొలుత నొకవిధమైన వివాదమునకు విషయముగా నేర్పడినది. శ్రీయుతులు గిడుగు రామమూర్తి పంతులుగారు నేఁటి ప్రామాణికాంగ్లభాషను (King's English) గ్రాంథికమయిన దాని నెల్లరును జదువుకొనినట్లే చదువుకొనినవారు. తెలుఁగున గొప్ప పరిశోధన చేసినవారు. "ఆంగ్లమునందలి శిష్టుల వ్యవహారమునకును, గ్రాంథికభాషకును భేదము స్వల్పము, ఇట్టి యైక్యము తెలుఁగున నేల కలుగఁగూడదు?" అని యూహించి వ్యావహారికభాషనే వాడవలసినదనియు, నందే గ్రంథవ్యవహారమంతయు జరిపింపవలసినదనియును బెద్దవాదమును లేవదీసిరి. ఆ వాదము నాంధ్రదేశమునం దంతటను వెలయించి పండితులతోఁ బరిషత్తులయందు వివాదములు సలిపిరి. సుమారు 1910 సంవత్సరమునకు వారి వాదమునకుఁ జాలఁ బ్రాముఖ్య మేర్పడినది. వారి కెదురుగా నిలిచినవారిలో శ్రీ జయంతి రామయ్యపంతులుగారును, ప్రస్తుతము జయపుర మహారాజులు శ్రీ విక్రమదేవవర్మగారును, పీఠికాపుర సంస్థాన ప్రభువులును ముఖ్యులు. శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిలవారు మొదలగు పండితు లనేకులు రామమూర్తి పంతులుగారికి విరుద్ధులుగా నిలిచిరి. రామమూర్తిపంతులుగారి వాదములోని సారాంశము: 1. గ్రాంథికభాష చచ్చినభాష, 2. అందెవ్వరు వ్రాసినను తప్పులుండక మానవు, 3. అది పండితులకే తెలియదు, 4. వ్యావహారికభాష జీవద్భాష, 5. అది సుబోధముగా నుండును, 6. ఎల్లరకును తెలిసినది, 7. పండితులు గ్రాంథికభాష పేర వాడునది కృతకము. అది గ్రాంథికమునుగాదు, వ్యావహారికమును గాదు.

పయిరీతిని వారు దేశదేశములు తిరిగి వాదించి పెద్ద పండితుల పుస్తకములలో తప్పులు చూపించి ఎవ్వ రేమి వ్రాసినను అపప్రయోగములను నేను చూపింపగల

ననియు, గ్రాంథికభాష వ్రాయఁగలవాఁడు ఒకఁడును లేడనియు చెప్పి వివదించి యనేకస్థలములలో గెలుపుపొందిరి. వీరి ప్రయత్నములవలన విద్యాశాఖాధి కారులును ఈ వాదములోని యభిప్రాయమును గ్రహించునట్లు, తమ పలుకుబడి వలన ఎస్. ఎస్. ఎల్. సి. బోర్డులో తమ సిద్ధాంతమును అంగీకరించునట్లు చేసిరి. విద్యార్థులు క్రొత్తతెలుఁగులో వ్రాయవచ్చు ననిరి. నేను 1915-వ సంవత్సర ములో తెలుఁగు కాంపోజిషను స్కూలు ఫైనలు పరీక్షలో వ్రాసితిని. క్రొత్త తెలుఁ గనఁగా పిల్లలమగు మేము లక్షణము చెప్పుకొనియెడివారము. ఎవ రెట్లు మాటలాడిన నట్లు వ్రాయవలయునని. అనగా ఇష్టము వచ్చినట్లు ఇంగ్లీషుపదములు, వాడుకలోని అపభ్రష్టరూపములు గుప్పించి వ్యాసములు వ్రాసితిమి. నాకు మార్కులు ఎక్కువగానే వచ్చినవి. 'ఎంత చండాలంగా రాస్తే అన్ని యెక్కువ మార్కులు' అని పిల్లలు పల్కు మాటలు నా చెవులలో ఇప్పుడును వినఁబడుచునే యున్నవి. అంతటితో పండితులును, భాషాభిమానులును ఊఱకుండలేదు. ఇంకను అప్పటికి అనేకులయిన ప్రాచీనపండితులును, భాషాభిమానమును, భాషావిషయిక మయిన పట్టుదలయు దేశమున నుండుటవలనఁ బయిప్రచారమునకుఁ బెద్దకట్ట వేసి విశ్వవిద్యాలయములలోను, గ్రంథనిర్ణాయకసభలలోను తమ వాదమును నిలువ బెట్టుకొని వ్యావహారికవాదమును తొలగించిరి. నేఁ డీ వాదమునకు దేశములో గొంత పలుకుబడి గలదు. కొందఱు పత్రికాధిపతులు వ్యావహారికభాషతో ప్రచురణ సలుపుచున్నారు. ప్రచారము జరుగుచునే యున్నది. పయివాక్యములు 1947 లో వ్రాసినవి. ఆ తరువాత నేఁటి పత్రికలు, గ్రంథములు మొదలగువానిలో (1968 లో) వ్రాయునట్టిభాషయు, ఉపన్యాసములలోని భాషయు మిక్కిలి యుత్తమ స్థితికి వచ్చినది. ఇది ప్రతిభావంతులయిన రచయితలవలన జరిగినది.

## 5. ప్రామాణిక, వ్యావహారిక భాషలకుఁ గల సంబంధము

పయిరీతిని గ్రాంథిక, గ్రామ్యములకుఁ (ప్రామాణిక, వ్యావహారిక భాషలకు) గల సామాన్యస్వరూపమును, తెనుఁగున నీ వాదముల చరిత్రయును వ్రాసి యింక రెండిఁటికిని గల సంబంధమును నిరూపింపనున్నాను. ప్రామాణికవ్యవహారమున గ్రంథరచన జరుగుచుండుటవలన ఉన్నతభావములు, విశాలపదసంచయము, దీర్ఘ వాక్యరచన, క్రొత్తక్రొత్త రచనాప్రణాళికలు బయలుదేరుచునే యుండును. వాడుకలో నట్టివానికి తావులేదు. గ్రాంథికవ్యవహారమునుండి దైనికవ్యవహారము లోనికి పద్ధతులు రాక తప్పవు. అట్లే దైనికవ్యవహారములోని రూపాంతరిత పదములు కొంచెము కొంచెముగా (గ్రాంథికము) ప్రామాణికభాషలోనికిఁ బ్రవే శించుచునే యుండును. ఒకదానినుండి యింకొకటి మిక్కిలి దూరమయి తేజస్తి మిరన్యాయమున నుండఁజాలదు. అవి కొంతవఱకు క్షీరనీరన్యాయముననే వర్తించు చుండును. నన్నయనాటి గ్రాంథికభాషకును నేటి గ్రాంథికభాషకును గల

భేదమును, అందు ప్రవేశించిన మార్పులును, ఈ గ్రంథమునం దంతటను దెలుపఁబడుచునే యున్నవి. ప్రామాణికభాషయును మాఱుచునే యుండును. మాఱదని భాషావేత్తలుగాని, వైయాకరణులుగాని చెప్పరు. తెలుఁగువైయాకరణులును చెప్పలేదు. నన్నయ 'సిద్ధిర్లోకాద్ధృశ్యా' యని నిర్వచించెను. అధర్వణుఁడు లోకములోని 'చేయడము', 'రుచింపు' మొదలగు రూపములవంటివానిని వినియు వానినే నంగీకరింపను అని వ్రాసెను.[12] వైయాకరణులు కేవలము వృక్షశాస్త్రజ్ఞుల వంటివారు మాత్రమే గారు. అనఁగా వృక్షశాస్త్రజ్ఞుఁడు ప్రపంచమునందలి వివిధ జాతులను బరిశీలించి వాని లక్షణమునుమాత్రమే వ్రాయును. వానిని గ్రహించుట యుక్తమా, యయుక్తమా యని విచారింపఁడు. తోటమాలి తోటలోఁ బుట్టుచున్న కలుపును, ఎండి రాలిన యాకులను నుండనీయఁడు. ఇట్టి పనినిగూడ వైయాకరణులు అన్నిదేశములయందును, అన్నిభాషలయందును తమపయిని వేసికొనిరి. లోకములోని మంచివాడుకకు, ప్రామాణికమయిన వాడుకకు, యోగ్యమయినదానికే లక్షణము వ్రాయుదురు. పతంజలి, 'గావీ, గోణీ, గోతా, గోపోతలికా' మొదలగు నపభ్రంశములు గలవనియు, నవి ప్రయోగయోగ్యములు గావనియును వ్రాసెను.[13] 'కింగ్సు ఇంగ్లీషు' అను గ్రంథములో పండితులు శిష్టులువాడు భాషలోని యనన్వితములను స్పష్టముగాఁ జూపించిరి. ఇట్టి మార్గమునే తెనుఁగువైయాకరణులును నంగీకరించిరి. కాఁబట్టి తెనుఁగువైయాకరణులనుగాని, తెలుఁగువ్యాకరణములనుగాని మనము నిందింప నక్కఱలేదు. చిన్నయసూరిగారు వ్రాసిన లక్షణము అపర్యాప్తమగుటచేత బహుజనపల్లి సీతారామాచార్యులుగారు లక్షణశేషమును వ్రాసిరి. కవి లక్షణమూలముగాను, గ్రంథముల మూలముననను సల్లక్ష్యము నెఱింగినవాఁ డయ్యును దన కాలములోని వ్యావహారికములను అప్రయత్నముగాను, ఉద్దేశపూర్వకముగాను బ్రవేశపెట్టుచునే యుండును. అట్టివానిని కాలక్రమమున వైయాకరణులు వీలయినంతవఱ కంగీకరించుచునే యుందురు. కొన్ని ప్రాచీనప్రయోగములను లాక్షణికు లంగీకరింపలేదు. అట్లు చేయుటలో వారికి హేతువులును, బద్ధతియుఁ గలవని యూహింపవచ్చును. క్త్వార్థకేకార సంధియును, అరి సమాసములును అంగీకరించుటలో లాక్షణికులు చాల ననిష్టమును సూచించుచున్నారు. ఈ రెండును తెనుఁగుభాషాస్వభావమునకు విరుద్ధములు. కాఁబట్టి క్వాచిత్కములయిన యిట్టి వాడుకలను బ్రమాణీకరించి సార్వత్రికముగా నీ యభ్యాసమును వైయాకరణు లంగీకరింపలేదు. కొందరు కవులు గణ యతి ప్రాస నిర్బంధముల కోడి యప్రశస్తరూపములను వాడి రనుట గ్రంథస్వభావములను నిష్పక్షపాతముగాఁ బరిశీలించినవారికి గ్రొత్తగాఁ దోపదు. కాఁబట్టి లాక్షణికులు

---

[12] ప్రతిక్రియ మడాంతత్వం శ్రూయతే న చ గీయతే. క్వచి దింప్వంతతాం కేచి దూచిరే న హి మే రుచిః.

[13] పాతఞ్జల మహాభాష్యము. పస్పసాహ్నికము.

కవిప్రయోగము లన్నింటిని నట్లే యంగీకరింపవలెననిగాని, యంగీకరించిరనిగాని పల్కుట న్యాయము గాదు. యథార్థమును గాదు.

'ప్రయోగశరణా వైయాకరణా' యను వాక్యము తా మంగీకరించిన ప్రయోగ విషయమునవే వర్తిల్లునుగాని యప్రశస్తములని తమకుఁ దోచినవానినిగూడ వా రంగీకరింపవలసిన దనుట నుద్దేశింపలేదు. 'రెండో, మూడో, చేతురు, కోతురు, రాజుకు, అందుకు, ఇరువై, వాండ్లు, వాళ్లు, చేదాము, చేతావాతా, చేసేటి, నవ్వేరు, చేస్తిని, చేస్తాను' మొదలగు వ్యావహారికరూపములను, వానిని ప్రయోగించిన కవులను, సందర్భములను శ్రీ గిడుగు రామమూర్తిపంతులుగారు ఏర్చి తమ బాలకవిశరణ్యమున విపులముగా వ్రాసియున్నారు. కాఁబట్టి గ్రాంథికభాష వలన గ్రామ్యభాషయును, గ్రామ్యమువలన గ్రాంథికమును పరస్పరము మాఱుచునే యుండును. ఈ విషయమునుగూర్చి కొంత శ్రీ గిడుగు సీతాపతిగారు 'కళింగదేశ శాసనములయందలి తెలుఁగుభాష' యను వ్యాసమున వివరించియున్నారు.[14]

ఇక గ్రాంథికభాషనుగూర్చి 238-వ పుటలో చెప్పఁబడిన సారాంశరూపములయిన దోషము లెంతవఱకు సత్యములో వరుసగా విమర్శింపవలయును. 1. గ్రాంథికభాష చచ్చినభాష యనుటలో నర్థమేమనఁగా నది వ్యవహారదూర మయిన దనుటయే. 'చచ్చినభాష' యను పదము ఆంగ్లమునందలి Dead language అనుదానికిఁ బరివర్తనము. ఈ విశేషణము లాటిను, సంస్కృతము మొదలగు భాషలకు వర్తించును. అవి నేఁటి వ్యవహారమునకు మిక్కిలిదూరము లయినవి. నేఁటి ప్రామాణికాంధ్రభాష యట్టి యవస్థకు రాలేదు. మన పండితులు వ్రాయు భాష యెల్లరకును నర్థమగునట్టిదియేగాని భిన్నము గాదు. 2, 3. వీనిభావము ఒక్కయభిప్రాయముపైనే యాధారపడియున్నది. తప్పులపయిని; 'తప్పు' అనఁగా భావ మేమియో ముందు తెలిసికొనవలయును. కొన్ని నియమములను జేసికొని వాని ననుసరింపకపోయినయెడల తప్పని చెప్పుదుము. ప్రామాణికభాషకుఁ గొన్ని నియమములు గలవు. అవ్యాప్తములో, అతివ్యాప్తములో అయిన లక్షణములును గలవు. వానిలో దోషములు కనుపట్టుచునే యుండును. కావున లక్షణము ఇంకను తెగలేదు. వేదలక్షణము నిర్వచించిన యప్పుడు ఋగ్వేదభాష్యము నుపోద్ఘాతమున శ్రీ విద్యారణ్యులవారు చేసిన వికల్పముల కన్నింటికిని సమాధానముల నిచ్చుట క్రమముగానే యుండినది. కావ్యమునకును, వేదమునకును లక్షణనిర్వచనము సరిగా చేయలేకపోయినను, పదార్థములుమాత్రము సిద్ధము గావనుటకు వీలులేదు. పర్యాప్తలక్షణమునుబట్టి చూచినప్పుడే గ్రంథకర్తల భాషలో తప్పులు కనుపట్టుచుండును. అట్టి సమయమున నపర్యాప్తలక్షణము నాధారముగ జేసికొనినచోఁ దప్పులు మఱియు నెక్కువయగునుగదా? ఇక వ్యావహారిక భాషయందుఁ గల నియమము లెట్టివి? ఏలక్షణమును జెప్పినను లక్ష్యలక్షణసమన్వయ

[14] కళింగదేశచరిత్ర—పుట. 105-119.

మును నిరూపించుట సులభము. 'దాంట్లోంచొచ్చాఁడు' ఇది వ్యావహారికము. 'దానిలోనుంచి వచ్చినాఁడు, దానిలోనుంచి ఒచ్చినాడు' వంటివైన యెన్ని సమీపరూపములు వ్రాసినను అవి తప్పులే యగును. 'దానిలోనుండి వచ్చినాడు' అని గ్రాంథికరూపము. ఇట్లే పంతులుగారు వ్యావహారికభాషలో వ్రాసిన పుస్తకములనుండి యెచ్చటనయినను ఇట్టితప్పుల నెత్తిచూపుట సులభము. అనఁగా సరిగా మాటాడున ట్లుండకపోవుటయే యీ మతమున తప్పు. ఈ పక్షమున వ్యావహారికభాషలో నెవ్వ డెవ్వరు వ్రాసినను తప్పు లిట్టివి రాక తప్పదు. కాఁబట్టి దోషములు గ్రామ్య గ్రాంథిక భాషలకు రెండిటికిని దప్పవు.

4, 5, 6. ఇందుఁ జెప్పఁబడినవియును విమర్శనకు నిలువవు. గ్రామ్య గ్రాంథిక భాషలు రెండును నిరంతరము గొంచెమో గొప్పయో మాఱుచుండు నను సిద్ధాంతము నిరూపించితిని. గ్రంథములుగూడ సాధారణులచేత నిత్యము చదువఁబడుచుండుటచేతను, నిత్యవ్యవహారమును మార్చుచుండుటచేతను నందలిభాషయును జీవద్భాషాంశమే యగునుగాని వేఱుగాదు. రెండును జీవద్భాషలేగాని మృతభాషలు గావు. ఎల్లరకును తెలియును, సాధారణప్రజలకుఁ దెలియును అని వ్యావహారికభాషనుగూర్చి చెప్పుమాటలు పరీక్షకు నిలువనివి. ఎల్లర కనగా నెవ్వరికి? పసులమేపుకొని జీవించు సొమ్ముల కుఱ్ఱవానికి నేఁడు వ్యావహారికభాషలో వ్రాసిన శ్రీరామమూర్తిపంతులుగారి బాలకవిశరణ్యము అర్థము అగునా? కాదుగదా? ఏమి యడ్డంకి? వాని కధికారము లేకపోవుటయేగదా హేతువు? ముఖ్యముగా నర్థముగావలసినది భావము. దాని కధికారము గావలయును. శాస్త్రమే భాషలో వ్రాసినను అధికారము లేనివానికి బోధపడదు. అట్లే కావ్యబోధకును గొంత సంస్కారమును, నాగరికతయు, విజ్ఞానమును గావలయును. తరువాతిది భాష. దానికి కొంత భాషాజ్ఞానము గావలయును. 'వాక్కు' అను సంస్కృతపదము పరిచితమయినఁగాని దానియర్థము స్ఫురింపదు. ఈ పదము నర్థము నెఱుగనివానికి తదర్థబోధకతకు వలసిన యోగ్యతయున్నను లాభములేదు. కాఁబట్టి భాషయందును భావమునందును గొంత యధికారము కలవానికే యేభాషయందలి రచనమయినను ఉపకరించును. 'ఎల్లరకును', 'సాధారణప్రజకును' వ్యావహారికభాషావాదుల మనువారు వ్రాసిన వ్రాత లర్థములగునని భ్రమించుట న్యాయముగాదు. అధికారము, యోగ్యత గలవానికొఱకే రెండు వ్రాతలును ఉద్దేశింపఁబడినవి.

కాఁబట్టి గ్రాంథికభాష యర్థముకానిది, వ్యావహారిక మర్థమగును అను నభిప్రాయము యథార్థముగాదు. ఈ వ్యాసము వ్రాయుచున్న సమయమున నాచేతి కొక ప్రకటన (వ్యావహారికభాషావాదులు వ్రాసినది) చేరినది. అందలి, యీ వాక్యమును విమర్శించుచున్నాను. "వీరి రాజాస్థానకథావళి, ఆంధ్రయువకులలో దేశభక్తిని, స్వార్థత్యాగాన్ని, ధైర్యసాహసాలను పురికొల్పింది." ఇదేమి వ్యావ

హారికమో చూడవలసినది. 'కొల్పినది' యనుటకు బదులుగా 'కొల్పింది' యనుట, 'త్యాగమును' అనుటకు బదులు 'త్యాగాన్ని' అని వ్రాయుట, 'దేశభక్తినిన్నీ, త్యాగాన్నీ, సాహసాలనున్నూ,' అని వ్రాయుటయే వ్యావహారిక మనుట నిర్వివాదము. ఇది తప్పుగదా ? ఇట్టి తప్పు లుండక తప్పదు. 'దేశభక్తిని', 'సాహసాలను' అనునవి గ్రాంథికరూపములు. వ్యావహారికము అను రచనలోనికి వచ్చినవిగావా ? గ్రాంథికమయిన 'చేయుచున్నాఁడు,' అను రూపములవంటివి తెనుఁగు వచ్చినవానికి అర్థము గావనుటలో సత్యములేదు. 'వచ్చినవాఁడ నయితినేని,' యను నన్నయ రచనమునుగాని (గ్రాంథికరచనము), దయ్యము (దేవుడు) అనునట్టి పాతపదము లనుగాని నేఁ డెవ్వరును గ్రాంథికభాషలో వాడరు. గ్రాంథిక వ్యావహారిక భాషల కెప్పుడును సన్నిహితసంబంధ ముండక తప్పదు. శ్రీ రామమూర్తిపంతులుగారి వ్యావహారికభాషాబహిష్కారవిమర్శనము అను వ్యాసములోని యీ క్రింది వాక్యములు పరిశీలించునది. "పరిషద్బహిష్కారము పాటించకుండా వ్యావహారిక భాషలో పుస్తకములు, వ్యాసములు అనేకముగా రచించి ప్రకటిస్తున్నారు. సభలలో అందరూ వ్యావహారికభాషలోనే యథేచ్ఛముగా ఉపన్యాసములు చేస్తున్నారు. గోదావరీ కృష్ణవేణీ నదీప్రవాహములవలె సర్వసౌభాగ్యప్రదమై దేశనాయకుల ముఖములనుండి వాస్తవమైన దేశభాష వెల్వడి దేశస్థుల వ్యవసాయము సఫలము చేస్తున్నది. దాని యోగ్యత, దాని మాధుర్యము, దాని ప్రాశస్త్యము అందరు చవిచూస్తున్నారు. దాని సౌలభ్యము, దాని ప్రాచుర్యము దానిని అందరికీ ఆదరణీయముగా చేస్తున్నవి" పుట 5. పయిరచన వ్యావహారికమా ? గ్రాంథికమా ? యను విషయమును పరిశీలించినచో సత్యము బోధపడక తప్పదు. ముపర్ణాంత పదములను ముపర్ణాంతములుగా వాడుకలో నెవ్వరును ఉచ్చరింపలేదు. కాఁబట్టి యవి గ్రాంథికములే. వ్యావహారిక నియమమున నవి తప్పులే యనవచ్చునుగదా ? అందరికీ లోని దీర్ఘమును, చేస్తున్నారు లోని స్తు అనునదియును వ్యావహారికములు. ఈ వాక్యమంతయు నర్థముచేసికొనగలిగినవారు అందరును, అందరికిని, చేయుచున్నారు అను రూపముల నర్థముచేసికొనజాలరని భావించుట యుక్తమగునా ? అందరికిని అనుదాని యపభ్రంశరూపమే 'అందరికీ' అనునది. పయిని నిరూపించినవి గాక గ్రాంథికభాషకు కృతకత్వమును నొకానొక దోషమును నిరూపించియున్నారు. చొచ్చు ధాతువునకు 'చొరి' యను క్త్వార్థకరూపమును పండితులు కృతకముగా సృజించిరి. అని శ్రీ రామమూర్తిపంతులుగారు వ్రాసియున్నారు.[15] అట్లే శిష్టవ్యావహారికభాషకు వ్యాకరణము వ్రాయుచున్న యనుశాసకులు "మాతృనాజ్ఞ" అను రూపమును సాధించిరి. ఇట్టి కృతకములు వ్రాయుటకు గ్రంథకర్తయే హేతువుగాని వారు వ్రాయుభాష గ్రాంథికమా, వ్యావహారికమా ? యను విషయ మేమాత్రమును గాదు.

[15] రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచిక. పుట, 118.

ఇక పరిశీలనమునఁ దేలిన విషయ మేమనఁగా నేఁటి గ్రాంథికభాషావాదులు వ్రాయు భాష యెట్లు గ్రాంథికము గాదో, యట్లే వ్యావహారికవాదులు వ్రాయు భాషయును వ్యావహారికము గాదు. ఈ రెండిటికిని గల భేదము అత్యల్పము. 'చేస్తూ' వంటి స్తవర్ణ యుక్త రూపములను, 'ఉంటుంది' మొదలగు టవర్ణ యుక్త రూపములను, సముచ్చయ 'ను' స్థానమున వచ్చిన దీర్ఘమును, 'చేసే, చూసే' మొదలగు ఏకారాంత తద్ధర్మార్థకవిశేషణములను, 'న్నూ, న్నీ' అను సముచ్చయములను, చేయడము మొదలగు అడాంతరూపములును ననియతముగా చేర్చి గ్రాంథికభాషనే వ్యావహారికభాషగా గిడుగు రామమూర్తిపంతులుగారు వ్రాసియున్నారు. దీర్ఘ సంస్కృతసమాసములను అట్లే చొప్పించి దానిని వ్యావహారికభాషగా వ్రాయువారు లేకపోలేదు. ఇఁక నేఁటి భాషాస్థితినిగూర్చి గ్రంథము తుదిని వ్రాయుదును.

(శ్రీ) రామమూర్తిపంతులుగారినిగూర్చి కొంచెము వ్రాసి యీ విషయమును ముగింతును. వీరు గొప్ప పండితులు. భాషాభిమానము గలిగి ఆత్మలాభమును గణింపక గొప్ప ప్రచారమును సలిపిరి. వారి గ్రంథములను నవ్యసాహిత్య పరిషత్తువారు ప్రచురించి, భాషకు గొప్ప యుపకృతిని చేసిరి. వీరి వాదమువలనను, ప్రయత్నమువలనను నేఁటి తెనుఁగున రెండు మార్పులు గలిగినవి. 1. పుస్తకములు వ్రాయువారికి పండితులవలని భయమును, జంకుగొంకులును పోయినవి. నిర్భయముగా దోషము లుండునేమో యను సంశయము వీడి గ్రంథములు వ్రాయుచున్నారు. ఇది గొప్పవిషయ మనుట నిర్వివాదము. 2. గ్రంథకర్తలు ప్రామాణికభావమును వీడి తలకొకరీతిని వ్రాయుచున్నారు. ఇది భాష కంత మంచి మార్పు గాదు. కాని ఇట్టిస్థితికి కేవలము రామమూర్తిపంతులుగారి సిద్ధాంతము మాత్రమే హేతువుగాదు. దేశమునందలి స్వాతంత్ర్యభావము, విప్లవవాతావరణము గూడ సహకారు లయినవి. ఇంతకును ఇవి యన్నియును అల్పములయిన కారణములు గాని దేశభాషలపయి విశిష్టుల కుండు ఉపేక్షాభావము, ఉపసర్జనత్వము, వైజ్ఞానిక వ్యవహార విదూరతయు నేఁటి భాషావైవిధ్యమునకు ముఖ్యములయిన హేతువులని స్థలాంతరమున నిరూపింతును.

# తెలుఁగునందలి మాండలికభేదములు

## 1. నేఁటి తెలుఁగు

మాండలికభేదము లేర్పడుట ప్రాదేశికభేదముచేతను, వృత్తిభేదమువలనను, సన్నిహితములయిన యితరభాషలవలనను, ఒకభాగమునుండి ఇంకొకభాగమునకు జనుల రాకపోకలు, సంబంధబాంధవ్యములు లేకుండుటవలనను అగునని యింతకుముం దనేకస్థలములఁ జెప్పితిని. గ్రాంథికభాష, వ్యావహారికభాష యనునవి రెండు భిన్నములయిన భాషాభేదములుగా గ్రహించినచో గ్రాంథికభాష ప్రామాణికమును, పండితప్రయుక్తము నగుటవలనను, దానికిఁ బ్రచార మెల్లెడల నుండుటవలనను, నందు మాండలికభేదము లుండవని యంగీకరింపక తప్పదు. అత్యల్పభేదముతో నది యెల్లెడలను నొక్కతీరుననే యుండును. గంజాము జిల్లాలోని తెలుఁగునకు ఓఢ్ర సంబంధమును, *నిజాము రాష్ట్రములోని తెలుఁగునకు నక్కడి రాజకీయభాషయగు నుర్దూయొక్క యొత్తిడియు, బళ్లారి జిల్లాలోని తెలుఁగునకు గన్నడముయొక్క సంపర్కమును, అరవదేశములోని దాక్షిణాత్యాంధ్రుల తెనుఁగున అరవభాషయొక్క ప్రాబల్యమును గనుపట్టుచునే యుండును. ఇదిగాక సాధారణముగా నొక్కొక్క జిల్లాకును ఉచ్చారణయందో, ఊనికయందో, శబ్దవిశేషముల ప్రయోగముననో యీషద్వైషమ్యము గనుపట్టుచుండునుగాని యవి యన్నియును నత్యల్పము లగుటవలన గణనీయములు గావు. స్థూలదృష్టిని రాయలసీమ (దత్తమండలము) లోని తెలుఁగునకును, సర్కారులలోని తెనుఁగునకును గొంతభేద ముండును. ఇదియు నల్పమే యనక తప్పదు. ఈ మండలములలోని భేదములు సాధారణముగా నీ క్రింది జాతులుగా విభజింపనగును.

1. ఒక పదముయొక్క యపభ్రంశావస్థలోని భిన్నములయిన యంతరువులును, సంబంధములును భిన్న మాండలికరూపములలో కనుపట్టుచునేయుండును. బళ్లారిజిల్లాలో చేసినాను, ఉండినాడు, తినినాక, అయినాక అనువానివంటి రూపములు వాడుకలో నున్నవి. సాగరప్రాంతమున చేశాను, ఉన్నాడు, ఉణ్ణాడు, తిన్నాక, ఆనక అను రూపములవంటివి వాడుకలో నున్నవి. మొదటివరుస ప్రాచీనములనియు, రెండవ వరుస నవీనములనియు స్పష్టము. అనగా వాని భ్రంశతలో మొదటివి కొంచెము వెనుకపడిన వనుట.

2. పైరూపములు సాగరప్రాంతమునఁ బామరజనుల వ్యవహారములో నింకను భ్రష్టములయినవి సేసినను, సేసిన, తిన్నడు, తిన్నా, ఉన్నడు మొదలగు

*ఇది 1947 వ సంవత్సరములోని పరిస్థితి,

రూపములును వినఁబడును. అవుద్ది, ఉంటుడు, సేస్తుడు, యెనక, యేంది, యింటడు, యెలుగు, సూత్తడు, సొప్తడు, సేసుకుంతే, సెప్తవు, బావు (బాబు), ఉండడు, ఒల్పొత్తే, కూకుడుంతే (కూర్చుంటే), అంతడు (అంటాడు), అమ్మోరు (అమ్మవారు), సెయ్యాలి, చెయ్యాలె, పోవాల్సింది, సెబ్దము (చెప్పుతాము), యేసుకో (వేసికో), నంజకొడుకు (లంజకొడుకు), ఇనుకొంతడు (వినుకుంటాడు), ఎత్తది మొదలగు రూపము లనేకములు వినఁబడుచుండును.

3. సమానార్థకము లయిన భిన్నశబ్దములు ఒకొక్కమండలమున స్థిరపడుటచే రెండవది తెలియబడకుండుట-పంది (నెల్లూరు), పమిటది (విశాఖపట్టణము), అద్దె (విశాఖపురి), బాడుగ (నెల్లూరు), బేడలు (బళ్ళారి), పప్పు (గుంటూరు, గోదావరి).

ఇట్లు పయిరీతిని భేదములు పరిశీలించినచో స్పష్టపడును. కాని వీనినన్నిటిని ప్రకృతము మాండలికభేదములుగాఁ బరిగణించి యూరకుండవలసినదేగాని వీనికిఁ బ్రామాణికత్వమునుగాని, గ్రంథరచనాయోగ్యతనుగాని కల్పింప వీలులేదు.

గ్రియరుసనుగారు వ్రాసిన లింగ్విస్టికు సర్వేలో తెలుఁగునుగూర్చి కొంత వ్రాయఁబడినది. అందు తెలుఁగులోని మాండలికభేదములుగా ఆఱింటిని బేర్కొని యున్నారు. ఆ సందర్భమున నిట్లు వ్రాసిరి. "తెలుఁగు దేశభాషగా వాడునట్టి ప్రదేశములందంతటను నొక్కరూపముననే గనుపట్టదు. ఉత్తరసర్కారులలో వాడు భాష చాలవఱకు నిర్మలమయినది. ఆ యా భాగములలో నున్న భేదములను విభజించి మాండలికభేదములను బరిగణించుటకుఁ దగిన యాధారములు లేవు. చాలభాగము ఈ సర్వేలోనిది గాదు. ఉత్తరహిందూస్థానమున లభించిన తెలుఁగుయొక్క మాండలికభేదములు (Dialects) ప్రామాణికభాషనుండి విశేషముగా భేదింపవు. కోంటావు, సాలేవారీ, గోలరీ యను పేళ్ళతో చాందా జిల్లాలోని తెలుఁగు వ్యవహరింపఁబడుచున్నది. నిశ్చితముగా ధ్వనులయందును, ప్రకృతిప్రత్యయవిభాగము నందును గనుపట్టు భేదము లత్యల్పములగుట నయ్యవి వేఱుమాండలికములుగాఁ బరిగణింపఁ దగవు."[16] వారు పరిగణించిన మాండలికభేదముల పేళ్లు.

(1) కోంటావు - ఇది చాందా జిల్లాలోని కోమట్లు వాడునది. సాలెవారు వాడునది సాలేవారీ. ద్రిమ్మరులయిన గోలర్లు వాడునది గోలరీ. కాని యీ మూఁడును ప్రామాణికభాషతో నభిన్నముగానే యున్నవిగాని భేదింపవు. (జనసంఖ్య 7,512).

(2) కామాఠీ - బొంబాయి సమీపమునకు వలసపోయి యచ్చటఁ జాల కాలమునుండి స్థిరపడి ఇటికపనివలన జీవించువారు వాడునది. తెలుఁగువారే యచ్చట స్థిరపడి భాష మాఱిపోవుటవలన నీ రూపమున నపభ్రష్టమయినది. (జనసంఖ్య 12,200).

[16] లి. సర్వే IV వా. పుటలు 577, 594.

(3) దాసరి - బెలగాము జిల్లాలోని తెలుఁగుదాసర్లు వాడునది. వీరు ద్రిమ్మరులయిన బిచ్చగాండ్రు. (జనసంఖ్య తెలియదు).

(4) బేరాడీ - బెల్గాము జిల్లాలోని యనాగరకజనులు వాడునది. వీరు గ్రామములలో కావలివారుగను, కూలీలుగను, పాలేళ్లుగను బనిచేయుదురు. (జనసంఖ్య 1,250).

(5) వడరీ - బొంబాయి రాజధానిలో ద్రిమ్మరులుగా నుండి కోరీపని (రాలు తీయుపని) చేసి జీవించువారు. (జనసంఖ్య 30,959).

గ్రియరుసనుగారు నిరూపించిన ప్రామాణికభాషనుండియును బయి మాండలికభేదములనుండియును మాదిరివాక్యములను నిరూపించుచున్నాను.

1. ప్రామాణికభాష.

ఒక మనుష్యునికి యిద్దరు కుమారులు వుండిరి. వారిలో చిన్నవాడు 'ఓ తండ్రీ, ఆస్తిలో నాకు వచ్చేపాలు యిమ్మ'ని తండ్రితో చెప్పినప్పుడు ఆయన వారికి తన ఆస్తిని పంచిపెట్టెను. కొన్నిదినము లయినతరువాత ఆ చిన్నకుమారుడు సమస్తమున్ను కూర్చుకొని దూరదేశమునకు ప్రయాణమై వెళ్లి తన ఆస్తిని దుర్వ్యాపారమువల్ల పాడుచేసెను.

2. కోంటావు - ఒక మనిషికి యిద్దరు పిలగాండ్లు వుండిరి. వ్హాండ్లో చినవాడు తండ్రితో అంటాడు. 'తండ్రీ, యేదో మాలమతది నాకు వచ్చవలది అది యివ్వు. వెనక వాడు పిల్లనికి ధనము పంచి ఇచ్చిండు. వెనక కొన్ని దెవసాలకు చిన్నపిల్లడు అంతసొమ్ము జమాజేషి దూరదేశానకు పోయినాడు. యింక అక్కడా అవిచారముతో నడ్చి తనసంపత్తు పాడుగొట్టినాడు.

(మాలమతది = ఆస్తియొక్క, వచ్చవలది = రావలసినది, వచ్చు ధాతువు నుండి అన్నంత క్రియగా రా, ఆదేశములేకయే యేర్పడిన రూపము. వలసినది, అనుదాని యపభ్రష్టమే వలది. ఇచ్చిండు = ఇచ్చినాఁడు. )

(3) కామాఠీ - వక్కమనిషికి ఇద్దరు కొడకులు ఉండుండ్రి. చినోన్డు తండ్రికి అంటడు, 'అయ్యా, నా అంతుకు యేమిజిందగి అస్తది అది నాకు ఇయ్యానా.' మరి తాను అది ఇద్దడ్కి పంచి ఇచ్చిండు, తోడ్యం దినాలు కాలే ఇంతట్లా చిన్న కొడుకు తనది అంత హిస్సాజమాచేసి దూరదేశంకు యెల్లిపోఇండు.

(ఉండుండ్రి = ఉండియుండిరి, అంటడు = అంటాడు, అంతు = వంతు, జిందగీ = ఆస్తి, అస్తది = వస్తది, ఇద్దడ్కి = ఇద్దరికి, ఇచ్చిండు = ఇచ్చినాఁడు, తోడ్యం = తోడెము = కొంచెము, హిస్సా = వంతు, యెల్లిపోఇండు = వెడలిపోయినాడు.)

(4) దాసరి - ఒకోక్కడోకోక్కడ్ మనిసికె ఇద్దర్ మగపిలగాళు ఉండ్లి, వాళ్ నోన చిన్నా పిలగడు తన తండ్రికె అనె, 'తండ్రీ, నీ బదకల్ నోన నాకె వచ్చ్యట్టిపాల నాకె ఈ.' తండ్రి వాళ్ నోన తన బదక పంచి ఇచ్చె, చిన్నా పిలగడు తన పాలతిస్తోని

దూరము నాట్కా సినావద్దల్ ఆవలేదు. అంతట్లోన్న వాడు శన ఖర్చ్ సేసి తన బదక అంత పాడ సేసె.

(ఒకొక్కడొకొక్కడ్ = ఒకానొక, ఉండ్లి = ఉండిరి, నోన = లోన, బదకల్ నోన = బ్రదుకులో = ఆస్తిలో, వచ్చ్యట్టి = వచ్చేయట్టి, తిస్కొని = తీసికొని, సినా= సానా = చాలా, వద్దల్ = ప్రొద్దులు, ఆవలేదు = కాలేదు, శన = శానా = చాలా)

(5) బేరాడీ - ఒకని కొకనికిని గిరెస్తనక్ ఉద్రు పటి బిడ్లా ఉడ్రి, వర్దానాన్ సణ్ణ్ కొడక్ తన్ అఇకె అండె. 'అయ్యా, నీ జిందగినాన్ నాకి వసన్ పాల్ ఈయి' అంటండె. అయ్యి వర్దానాన్ తన్ బదక్ పంచి శిదె.

(గిరెస్తనక్ = గృహస్థునకు, ఉద్రు = ఇద్దరు, పటి = మగ, ఉడ్రి = ఉండిరి, వర్దానాన్ = వారిలో, సణ్ణ్ కొడక్ = చిన్నకొడుకు, అఇకె = అయ్యకు, అండె = అనెను, జిందగినాన్ = ఆస్తిలోను, వసన్ = వచ్చిన, అంటండె = అంటు అనెను.

(6) వడరీ - ఒక మనసికి ఇద్దరు కొడకులు ఉన్నారు. ఇంకా చిన్నకొడుకు వారిలో తన అయ్యాకు అన్యా, 'అయ్యా, నా పాలకు వచ్చిన సంసార నాకు ఈ.' ఇంకా వాడు తన సంసార పంచి ఇచ్చ. ఇంకా షనాదినాలు అయిండలేదు. చిన్న వాడు కుడ్యస్కిన్య ఇంకా దూరదేశానికి పోయా.

అన్యా=అనియెను, సంసార=ధనము, పంచియిచ్చ=పంచియిచ్చెను, షనా= శానా, కుడ్యస్కిన్య=కూడవేసికొనియెను.

పయిని నిరూపించిన జాతుల జనులందరును తెనుఁగు ప్రవాహమునుండి చీలి పోయి యక్కడక్కడ నిలిచిపోయినవారనుట స్పష్టము. చదువు, నాగరకత, మాతృ భాషాప్రవాహముతో సంబంధము లేనివారనుటయు స్పష్టమే. కావుననే వారి భాష మాఱి వేగముగా నపభ్రష్టమగుచున్నదనుట నిర్వివాదము. ముందు మాండలిక భేదము లేర్పడు పద్ధతులు తెలుపఁబడినవి. వాని కివి యుదాహరణములు కాక తప్పదు. కొంతకాలమున కీ మాండలికములు సమీపమున నున్న కన్నడము, హిందీ మొదలయిన భాషలను గలిసి మఱింత భ్రష్టములయి నశించియయినఁ బోవును లేక గుర్తింపరానంతటి రూపభేదమునయినం బొందును.

## 2. మధ్యకాలపు తెలుఁగు

ప్రాచీనకాలమున వివిధములయిన జాతులవారు వాడిన యపభ్రంశములు మన్నారుదాస విలాసమున నీయంబడినవి. క్రింది యుదాహరణములు పరిశీలించునది.[17]

[17] మన్నారుదాస విలాసము. యక్షగానము, పుట. 47, కాలము. 1659 క్రీ.శె. (సుమారు)

## పురోహితుల మాటలు

కొండుభట్ల మాట—అవునోయి యల్లు సోమయాదులు నూరు తరాలనుంచి యీ యింటికి తగులైన పురోహితుండ నే నుండంగా నీ వెవ్వండి కొడకవు నా స్వాతంత్ర్యం కొంగుముడి రూక తీసుకపొయ్యేటట్టుగా.

నరసంభట్ల మాట—వోరి వోభలభట్టిగా నగరింటి దానధర్మాలల్లా తవాప్యర్థం మమాప్యర్థం అంచున్ను ఇరుజీవి యెరుంగకుండా అంతా అంటించుకొని కాదనిపించుక పోయినవార్ని వినవా వెనకటికి, నీవైన బుద్ధికలిగి వుండరా.

మధ్యస్థం మఱొక పురోహితుని మాట—వోయి వుండరోయి, యిషుబడి అషుబడి యిటువంటిమాటలు నగరబడెనాయనా అందరికి బహుశ్రేయస్సు వచ్చీనే. నగర వచ్చిన ఆదాయమల్లా సరిగా పంచుకతీసుకుందామోయి. మనలో మనమేనా కొట్లాట, యింతట చాలించరోయి.

## ముత్తైదువలు

రంగావొఝుల తిమ్మక్క—యేమో ప్రోలుభట్లు యల్లమ్మ, నగరింటిపెండ్లి నాఁడయినా వొక వక్కబద్ద వేసుకొని నమలరాదషవో.

యల్లమ్మమాట — అవునషే గంగావఝుల తిమ్మక్క, నాకు వక్కబద్దా వొకటి కొదవా, చాలుచాలు నిన్న మావారు సుక్కరారం సంతలో పిండికూర కంచున్ను గానుగబిండి దెచ్చిరి. పెండ్లి పందిట్లో నోరు మెదలించవలెనంచున్ను యింత దెచ్చుక తించునానింతే.

## ఎఱుకత మాట

అమ్మాయమ్మ, అమ్మాయమ్మ, శెయిసూపు, శెయిసూపవే దుండి, దనము గల శయ్యో, దాన్యముగల శెయ్యో, బంగారుశయ్యో, బాగ్గములశయ్యో దుండి, అటు నిటు సూడక నే సెప్పే గురి వూంకొని వినవే వూంకొని వినవే దుంఽి, కండ్లంటే తోడు, కడుపంటే కొడుకు, కంటెంటే మగండు, వొండే, రేండే వొండు.

## హెగ్గడికత్తె మాట

వో సామి యెవరో విలాసవతి యట వచ్చినానని యిన్నపం శేయిమనె.

## శాస్త్రుల మాటలు

వజ్రకుంఠ మల్లుభట్టిగాండు యేమోయి అనే అట్టు ఆయనా నా బ్రదుకు. యిషువంటి బ్రహ్మిష్ఠో బ్రహ్మకొడుకును యేమోయి అనవచ్చునా, వోరి నీవలె వుభయతోబట్టి ప్రాయశ్చిత్తం చేసుకోక వుంటినషరా.

వోరి నీవు పుట్టి మూండా యిత్తారాలులే, నిన్నటి సుదుపడవు. నావంటి యోగ్యుణ్ణి జూచి, యేమి వదరేవురా, శునకంవలె! పాదరక్షులు దీసి రెండు ప్రహరింత్తు మో.

వోరి వృద్ధగార్ధభమా, నోరుగలదంచున్ను నెత్తి నోరుబెట్టుక కూయవచ్చి నాండవు. కపోలతాడనం శేతునో, త్వమేవ గార్ధభః। త్వమేవ శునకః। త్వమేవ సూకరః॥ తాళరోయి యేలకూశేరు.

## గొల్లల మాటలు

వోరె బక్కలావాంటివాండు, పొట్టిపొడుగాంటివాండు, వొకకన్ను వూనం వొకకన్ను తెలియదు. చెవిటివాండు, కాలు కుంటుతా వచ్చునే నిమ్మపండువలె నల్లని బాంపండు వాండురా.

వోరెవోరె ఆ బాపణ్ని యేల వాకిలివిడిస్తివిరా, వానిచేత నేమైనా పర కాలు నాచుకోంట్టివో దివాళికి రూకా, పొంగటికి రూకా, వుగాదికి రూకా, తలమూయ పాంతా, ఆ ముచ్చు బాపండురాని కాళ్లె యిరగ్గొట్టెగాని.

## కటికచేరువకాని మాట

యెవంఢ్రా వోరి మనవాండ్లు యేలినవారు కోవిలకు నామతిరుతానకు వేంచ్చేస్తా వుండారు. తొలంగించ్చరావోరి. లేరయా వోయి లేరయా, యెయెయరా వోరి. అల్లా బాంపనవాంణ్ని తోయరా ; ఆ ముసుంగువాణ్ని లేపరా.

పయివిధముస నిరూపింపఁబడిన మాండలికము లన్నియును బ్రామాణిక భాష కెప్పుడును దూరములుగానే యుండినవి. అయినను, అనేకములయిన గ్రాంథిక పదములు, ప్రామాణికరూపములును వీనియందు లేకపోలేదు.

అట్లే గ్రాంథికభాషయందును నానాఁటి వ్యావహారికరూపములును బ్రవే శించుచునే యుండును. ప్రామాణికభాష యని గ్రియర్సనుగారిచే నుదాహరింపఁబడిన వ్యావహారికమునకును, నేఁటి గ్రంథవ్యవహారమునకును విశేషదూరము లేదు.

## 3. నేఁటి యాంగ్లాంధ్రముల తారతమ్యము

నేఁటి వ్యావహారికవాదులు కొందఱు ఆంగ్లమునందలి ప్రామాణికభాష యగు రాజభాష ( King's English ) కును, ఆంగ్లేయులలో విశిష్టులు మాటాడు భాషకును అభేదముగదా, అట్టి యభేదము నేఁటి గ్రాంథిక వ్యావహారికరూపములకు తెనుఁగున లేదేల ? అట్టి యభేదమును సంపాదించుటకు వ్యావహారిక మను పేర నియమదూర మయినదియును, కేవల వ్యక్తినిష్ఠమయినదియు నగు భాషను ఎవరియిష్టము వచ్చినట్లు వా రేల వ్రాయరాదని యడుగుచున్నారు. ఆంగ్లభాషకును మనభాషకును జాల భేద మున్నది. వారి భాషకు ముఖ్యవ్యవహారము గలదు. అనగా రాజకీయ, వైజ్ఞానిక, దైనిక వ్యవహారముల కొక్కటే భాష. భాషను మేధావులు, విశిష్టులు పఠింతురు. చక్కఁగా వ్రాయుటకుఁ బ్రయత్నింతురు. అట్టి భాషస్థితి వేరు. మన భాషకును దేశమున ముఖ్యవ్యవహారము కలిగినప్పుడు విజ్ఞులంద రా భాషనే

యున్నతప్రయోజనములకు వాడుదురు. మనవారు వైజ్ఞానికముగ వాడునది యింగ్లీషు. తెనుఁగునఁ బ్రయత్నమును, బరిశ్రమమును గేవలము ఉపసర్జనమాత్రము. శిష్టవ్యవహారములో తెనుఁగున మూఁడువంతులు పయిగా నింగ్లీషే. కాఁబట్టి యీ భాష యెట్లున్నను, అధికులకుఁ బ్రతిబంధకము లేదు. దీనియందు ప్రయత్నము జరుగదు. కాఁబట్టి వ్యావహారికమును బాగుపఱచి ప్రామాణికమగు రూపములను నిలుపుటకు మార్గములు లేవు. ప్రామాణికభాష గొంత పరిశ్రమవలనగాని లభింపదు. అట్టి పరిశ్రమ లేనప్పుడు దానిని త్యజించుటయో, లేక భ్రంశము గూర్చుటయో గాక మఱియొక మార్గము లేదు. ఇట్టి ప్రయత్నమే నేఁడు జరుగుచున్నది.

ఇంకొక ప్రతిబంధకము కలదు. తెనుఁగున మూఁడువంతులు సంస్కృత సమములు. క్రొత్తభావములకు సంస్కృతసంజ్ఞలు కల్పించుకొని తెనుఁగునఁ జేర్చికొనుట మన యలవాటు. మన పూర్వుల కలవడిన మార్గము. మన మా మార్గమునే నేఁడును అవలంబించుచున్నాము. కాని జాతీయనాగరకతకుఁ బ్రాధాన్యము తగ్గినవెంటనే సంస్కృతభాషాపాండిత్యమును తగ్గినది. ఆ చదువునకు విలువ లేదు. కావున దాని నభ్యసించువారును తగ్గిరి. చెప్పువారునుగూడ లేకుండఁబోవుచున్నారు. రామణీయకము, రమణీయము ; సహాయము, సాహాయ్యము ; స్వతంత్రము, స్వాతంత్ర్యము మొదలగు జంటలకుఁ గల యర్థభేదములు తెలియక యొకదాని కొకటి గ్రంథములలోఁ బ్రయోగించుట సంభవించుచున్నది.

దేశమునఁ దెనుఁగే ముఖ్యభాషగా వెలసినచో నద్దానికి వైశిష్ట్యము గలుగక తప్పదు. శ్రేష్ఠులు శ్రేష్ఠమయిన వాడుకను జూపుదురు. దానియందు వారికి పట్టుదల కలుగును. అప్పు డద్దాని నితరులు అనుసరింతురు. గ్రాంథికవ్యవహారమును, శిష్టవ్యవహారమును నొక్కటియే యగును. తెనుఁగుపండితుఁడు ఉపాధ్యాయులందఱిలో నల్పతమమయిన వేతనము నందుచు నెల్లర యుదాసీనతకుఁ బాత్రుఁ డగునప్పుడు దేశమున భాషకు గౌరవము కలుగదు. అది కలిగిననాఁడే యనేకులకు విద్య వ్యాపించిననాఁడే ప్రామాణికభాషకును గ్రాంథికభాషకును అభేదము గలిగి యయ్యది యొక్కరూపున నుండును. అది లేనంతవఱకీ భాషకు భ్రంశము యొక్క వేగ మధికముగానే యుండక తప్పదు. కారణ మేమన భాషాపాండిత్యమును, సామర్థ్యమును నొక్కచోటను, అధికారమును, బలుకుబడియు, మాట చెల్లుబడియు మఱియొకచోటను నుండును. ఈ రెండిటికిని ఏకాధికరణత గలిగిననాఁడే భాషకున్నతస్థితి.[18]

---

[18] శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారి యుపోద్ఘాతము. కుప్పణ్ణయ్యంగారి సర్వలక్షణ సారసంగ్రహము.

తెనుఁగుపండితుని తరగతిని పరీక్షించుటకు పరీక్షాధికారి వచ్చెను. ఆయన విద్యార్థులను (తెనుఁగువ్యాకరణమునుగూర్చి) ప్రశ్నించెను. విద్యార్థి సమాధానము తెలుంగక సంస్కృత

ఇంకొక సందేహమును గొందఱికిఁ గలుగుచున్నది. మాండలికములుగా నున్న యనేకరూపములును, అనేకపదములును నష్టమగుచున్నవిగదా ; వీనికన్నిటికిని సారస్వతమున ప్రయోగము లేదే యనుటయే యయ్యది. అట్లు నశించుటయే స్వభావము. మాటాడుచుండిన మాటలకెల్లను, స్థైర్యముగల సారస్వతమునఁ బ్రవేశము గలుగదు. లోకములో కోట్లకొలఁది చిన్న చిన్న మొక్కలు పుట్టి మాడుచునేయున్నవి. వానికన్నింటికిని చిరస్థాయిత్వము లేదే యని విచారించుటవంటిదే యియ్యది మాండలికములన్నియు నశించి యెయ్యది ప్రామాణికమయి గ్రాంథికమగునో దానికే చిరస్థాయిత్వము. లేనిది నశింపక తప్పదు. అట్టిదానివలన భాషకు లాభమును లేదు, నష్టమును గలుగదు.

వ్యాకరణసూత్రము లగు 'వృద్ధిరాదైచ్, అదేంగుణః, ఇకోగుణవృద్ధీ' మొదలయిన వాని నేకరువు పెట్టెను. పరీక్షాధికారి తన యజ్ఞతను జూపించుట కిష్టపడక సమాధాన మంగీకరించి యూరకుండెను. పండితులును తెలిసియు దిద్దరైరి. ఇట్టి పరిస్థితులు ఇతరశాస్త్రవిషయకములు (పాశ్చాత్యజ్ఞానవిషయకములు)అగు తరగతులలో జరుగుట కవకాశము లేదు. పరీక్షకు లాయా విషయములను బరిశీలించినవారుగానే యుందురు. తెనుఁగునుగూర్చిన యిట్టి యవస్థకు, దేశమున వైజ్ఞానికవిషయమగు నౌదాసీన్యమే హేతువు.

# తెనుఁగులిపి దాని పరిణామము

## 1. ఉత్పత్తి

మనస్సున భావవికాసమును అర్థవివేచనయును గలుగుట మానవునికిని పశువులకును గల భేదము. ఇట్టి యర్థమును ఇతరులకుఁ దెలియఁజేయు ప్రయత్నము యొక్క పరిణామమే భాష. ఇట్టి వాగ్రూపమయిన భాష చాలకాలము ప్రచారములో నుండినతరువాత నద్దానిని స్థలాంతరమునకుఁ గాలాంతరమునఁ దీసికొని పోవలసిన యవసరము కలుగఁగా నా యవసరమును దీర్చుకొనుటకై లేఖనచిహ్నములు బయలుదేరినవి. వీనినుండియే లిపి యుత్పన్నమయినది. ఎట్లు భిన్న భిన్న దేశముల భిన్నజాతుల ప్రయత్నమూలమున భిన్నభాషలు భిన్నకాలములఁ బుట్టియుండినవో యట్లే భిన్నములయిన లేఖనసంకేతములును బయలుదేరి యుండవలయును. కావుననే లోకములో ననేకములయిన లిపులు నేఁడు ఉపలభ్యమానములగుచున్నవి. అందు కొన్ని యేకలిపిజాతములు. కొన్ని భిన్నలిపిజాతములు. వానిలో మన నేఁటి తెనుఁగులిపి యెట్లుద్భవిల్లినదో తెలిసికొనవలసియున్నది.

నేఁడు వివిధదేశములలో వాడుచున్న లిపు లన్నిటికంటెను బ్రాచీనములయి యనేకములయిన లిపులకుఁ బూర్వరూపములయిన లిపు లయిదు తెలుఁగులుగా నున్నవి. (1) ఈజిప్షియను లిపి—ఇది క్రీ. పూ. 3,000 సంవత్సరములకు ముందుఁ బుట్టియుండునని యూహచేయఁబడినది. ఇది యీజిప్టుదేశములో ప్రాచీనకాలమున వాడుకలో నుండినది. ఇది బొమ్మలరూపమున వ్రాయఁబడుచుండెడిది. (Hieroglyphic) హైరోగ్లిఫికు లిపి. (2) కీల లిపి—(Cuneform) క్యూనిఫారము లిపి. ఇది పారశీకము, బాబిలోనియా, అసీరియా మొదలయిన దేశములలో వాడుకలో నుండినది. ఇది బాణాగ్రములవంటి యాకారముగల గుర్తులతో నుండునది. (3) క్రీటులిపి—ఇది మధ్యధరాసముద్రమునందలి క్రీటు అను ద్వీపమునందు వాడుకలో నుండినది. మట్టిపెంకులమీద వ్రాసి కాల్చినవి యనేకములయిన వ్రాతలు దొరకినవి. ఇది క్రీ. పూ. రమారమి 2,000 సంవత్సరములకు ముందటిది. (4) సెమిటిక్ లిపులు—ఈ లిపి సిరియాదేశమునందు వాడుకలో నుండినది. ఇది క్రీ. పూ. సుమారు 2,000 సంవత్సరములకు ముందు వాడుకలో నుండెనని యూహ. దీనినుండి యనేకములయిన లిపులు పుట్టినవనియు, నన్ని లిపులయందును నియ్యది ప్రధానమనియు నేఁటి శాస్త్రజ్ఞుల యూహ. (5) ఫొనీషియా లిపి—పయి సెమిటిక్ లిపులలో నియ్యది ముఖ్యమయినది. దీనినుండియే నేఁటి యాంగ్లాక్షరములు మొదలయినవియు, ప్రాచీన గ్రీకు లిపియు నేర్పడినవి,

నేటి హిందూదేశములోని లిపు లన్నియును జూలవిఱ కొక్క-లిపినుండియే పుట్టినవి. ఈ లిపుల కన్నిటికినిగూడ సెమిటిక్ లిపులే పూర్వరూపములని కొందఱు పాశ్చాత్యపండితుల యూహ. కాని హిందూదేశమున లిపులు, అక్షరములు, లిపి కారులు, జ్యోతిషశాస్త్రము మొదలయినవన్నియు నుండినట్లు ఋగ్వేదాదులను బట్టియు, వాని యంగములనుబట్టియు స్పష్టపడుచుండుటచేతను, ఋగ్వేదముయొక్క- కాలము క్రీ. పూ. 5,000-3,000 సంవత్సరములు అని నిర్ణయింపఁబడియుండుట చేతను, హిందూదేశమునందలి ప్రాచీనలిపి ప్రపంచమునందలి యన్నిలిపులకంటెను ప్రాచీనతమ మనియును, స్వతంత్ర మనియు ఊహింపఁబడినది.

మోహెంజోదారో, హరప్ప అనునట్టి ఉత్తరహిందూస్థానమునందలి గ్రామము లలో లభించిన కొన్ని పెంకులపై ముద్రలు కానవచ్చినవి. వానిపయిని బొమ్మలును, కొన్ని యక్షరములును గనుపట్టినవి. కాని వానిని స్పష్టముగ గుర్తుపట్టి చదివిన వారు లేరు. ఇవి యత్యంతప్రాచీనములు. వీని కాలమును నిర్ణంచుటకుఁగూడ నాధారములు తక్కు-వ.

క్రీ. పూ. 272-231 వ సంవత్సరమువఱకును మగధవంశజుఁడయి హిందూ దేశమునంతటిని బాలించిన యశోకచక్రవర్తి వేయించిన ధర్మలిపు లనఁబడెడి శాసనములే మనకు లభించిన ప్రాచీనాక్షరములు. ఇవి పెద్ద పెద్ద బండలమీద హిందూదేశములో ననేకస్థలములలో ప్రాకృతభాషలో వ్రాయంబడినవి. ఈ లిపియే హిందూదేశమునందలి నేటి లిపులన్నిటికి మూల మని పండితులు నిశ్చయించిరి. ఈ శాసనములు రెండు విధములు. హిందూదేశపు వాయవ్యదిగ్భాగమున నున్న శాసనములుమాత్రమే ఖరోష్ఠి లిపిలో వ్రాయఁబడినవి. ఇది నేఁటి యురుదూవలె కుడినుండి యెడమకు వ్రాయఁబడును. తక్కి-నవన్నియు ఎడమనుండి కుడివైపునకు వ్రాయంబడిన బ్రాహ్మి లిపిలోనే యుండినవి. ఈ బ్రాహ్మి లిపియే మనదేశములోని లిపులకు మూల మయినది. తంత్రశాస్త్రములందు దేవతల నామములకుఁ బ్రాచీన కాలమునుండియు గుర్తులు గలవు. ఆ గుర్తులనుండియే యీ యక్షరములు పుట్టి కాలక్రమమున నశోక లిపిగా మాఱినవని యొక యూహ.

చాలకాలమునుండి జనులు తాటియాకులపయిని, చెట్టుపట్టలపయిని, వస్త్ర ములపయిని వ్రాయుచుండినట్లు సారస్వతమునుబట్టి తెలియవచ్చుచున్నను అవి యన్నియును నశించిపోయియుండెను. కావున నేఁడు దొఱకవు. ప్రాచీనులు వేయిం చిన శిలాశాసనములు, తామ్రశాసనములును నేఁడు లభించుచున్నవి. శాసనములు వేయించిన రాజులకాలమునుబట్టియు, వారి పేళ్లనుబట్టియు నాయా కాలమునందలి లిపు లకుఁ బేళ్లు కల్పింపఁబడి వాని పరిణామక్రమము నిర్ణయింపఁబడినది. మన ముచ్చరించు శబ్దస్వరూపములు మాఱినట్లే యక్షరముల స్వరూపముగూడఁ గాలక్రమమున మాఱి భిన్నలిపు లేర్పడినవి. మౌర్యుఁడయిన యశోకునినాఁటి లిపితరువాతఁ బ్రాచీన

మయినది భట్టిప్రోలు స్తూపమునందు లభించిన బౌద్ధశాసనములలోని లిపి. ఇది క్రీ. పూ. రెండవ శతాబ్దము నాఁటిది. ఆ తరువాతివి కుషాణులు, శకవంశజులు, క్షత్రపులు వేయించిన శాసనముల లిపులును, శాతవాహనవంశజు లయిన రాజులు వేయించిన నాసిక శాసనములయందలి లిపియును. తరువాతిది జగ్గయ్యపేటయందలి యిక్ష్వాకురాజుల శాసనములలోని లిపి. ఆ తరువాతిది పల్లవరాజులగు శివస్కంధవర్మ మొదలగువారి శాసనములలోని లిపి. కదంబరాజులనాఁటి కన్నడలిపి, (క్రీ. వె. 6-వ శతాబ్దము) రాష్ట్రకూటులనాఁటి కన్నడలిపి, కళింగదేశములోని శాసనముల లిపి ఇవి యన్నియును ప్రాచీనశాసనములలో ముఖ్యలిపులు.

## దాక్షిణాత్య లిపులు

క్రీ. పూ. 250 అ

క్రీ. వె. 100-200 గుహా లిపి గుప్త లిపి

క్రీ. వె. 350 చేర లిపి చాళుక్య లిపి వేంగీ లిపి

నాగరి

పశ్చిమచాళుక్య లిపి

క్రీ. వె. 1000 పురాతన గ్రంథాక్షరములు వట్టెళుత్తు పూర్వచాళుక్య లిపి

ప్రాచీన జావా లిపి

సంధికాలపు లిపి ప్రాత నందినాగరి

క్రీ. వె. 1300 నడిమికాలపు ప్రాచీనమలయాళము గ్రంథాక్షరములు హళకన్నడము ప్రాత తెలుఁగు ఇప్పటి నందినాగరి

అరవము

క్రీ. వె. 1400 నేఁటి మలయాళ లిపి గ్రంథాక్షరములు ఇప్పటి కన్నడ లిపి ఇప్పటి తెలుఁగు ఇప్పటి జావా లిపి

పై పట్టికకును, వ్యాసవిషయమునకును ముఖ్యాధారములు. 1. ఆంధ్రవిజ్ఞాన సర్వస్వము లోని వ్యాసము, 2. బర్నెలుగారు వ్రాసిన సౌతిండియను పేలియాగ్రఫీ, 3. ఓఝా కృతమయిన భారతీయాక్షరవికాసము,

పయిపట్టికనుబట్టి నేఁటి అరవము, మలయాళము, కన్నడము, తెలుఁగు అను నాలుగు భాషలయొక్కయు లిపు లెట్లు పరిణతము లయి నేఁటి రూపమును బొందినవో స్పష్టపడును. అశోకుని శాసనములయందలి లిపి యశోక లిపి యనఁబడినది. గుహా లిపి యనునది నాసిక, కన్హేరి మొదలగు స్థలములయందు గనఁబడిన లిపియే. ఆ తరువాతనే చేర, చాళుక్య, వేంగీ లిపులని మూఁడు విభాగము లయి కాలక్రమమున నేఁటి ద్రావిడలిపులకు మూలము లేర్పడినవి. ఈ మూఁడు లిపులకును గుహా లిపికిని భేదము స్వల్పము. వేంగీ లిపియందు తలపయిని అక్షరములకు అడ్డగీటులు ఏర్పడినవి. అట్టి యడ్డగీటులే నేఁటి తలకట్టులుగా మాఱినవి. ఇవియే కన్నడాక్షరముల నెత్తిపయిని వంకరగీటులుగా నేర్పడినవి. చాళుక్యులు పూర్వచాళుక్యులనియుఁ, బశ్చిమచాళుక్యులనియు రెండు తెగలుగా నేర్పడినట్లు చరిత్రలో స్పష్టము. ఆ యా రాజుల శాసనములలోని యక్షరముల కా యా పేళ్లు పెట్టఁబడినవి. ఈ పూర్వచాళుక్య లిపియందే నన్నయభారతము వ్రాయంబడి యుండెను. నన్నయచే వ్రాయంబడి చెక్కింపఁబడిన రెండు శాసనములు నందమపూడి శాసనము, కోరుమిల్లి శాసనము అనునవి లభించుచున్నవి. తరువాతిది సంధికాలపు లిపి. పూర్వ పశ్చిమ చాళుక్యరాజ్యములలో క్రీ. వె. 1200-1350 వఱకును వాడిన లిపి యిది. కన్నడమనిగాని, తెనుఁగనిగాని నిరూపింపరాని యొక్క లిపియే వాడుకలో నుండినది. ఆ తరువాత 14-వ శతాబ్దమునుండియు ఆంధ్ర కర్ణాటముల లిపులు విడిపోయి నేఁటి తెలుఁగు కన్నఁడ లిపు లేర్పడినవి.

## 2. పూర్వపు శాసనముల వ్రాతకును ఇప్పటి వ్రాతకును గల భేదము

(1) నేఁడు బిందువునకు గల ప్రాచుర్యము ప్రాచీనశాసనములలో లేదు. అనఁగా బిందువులు మనము వాడుచోట వర్గపంచమాక్షరములను వాడుచుండిరి.

ఉ. పణ్డు, రక్షిఞ్చి. ఇది క్రమంబున పండ్డు అనియు, నేఁటికి పండు అనియు, పఁడు అనియు మాఱినది. అట్లే రక్షించ్చి, రక్షించి అనియు వర్ణక్రమము ఏర్పడినది.

(2) తూప్పున, పెగ్గడ, ధమ్మ్ర నివ్వహనోద్యోగమ్మ. (గుణగ విజయాదిత్యుని ధర్మవరపు శాసనము.) పేమ్మని, నుతధమ్మ మూత్తి. ద. హి. శా. వా. IV, నెం. 675. కాలము 1139. క్రీ. శ.

పయి వ్రాతలో వలపలగిలుకయు, ప్రక్క యక్షరమునకు ద్విత్వమును గొంతకాల ముండినది. కాలక్రమమున ద్విత్వముపోయి వలపలగిలుక మాత్రము నిలిచినది. ద. హి. శా. వా. IV, నెం. 698. కాలము 1563 క్రీ. శ.

ఆచంద్రాకస్తాఇ. సమపణ. నెం. 699. కణాటక 1545 క్రీ. శ. 'సమర్పణ' మొదలగు రీతిని నేఁటి వ్రాత.

(3) పద్యాంతమున నుండిన ద్రుతమును, 'ను', 'ని' అను రూపములతోనే వ్రాయుచుండిరి. కాని యిప్పటివలె 'న' కారపుపొల్లు లేదు. వెలుంగ్గుచు నొప్పెను. కందపద్యము తుది. ద. హి. శా. వా. IV, నెం. 700. క్రీ. వె. 1261 సం.

వెలుంగంగాను—చంపకమాల పాదము తుది. నెం. 666 - 1138 సం.

శూలపాణికిని— ,, నెం. 672 - 1138 సం.

(4) బిందుపూర్వక "డ్ల" వర్ణమును వ్రాసి విడిగా నుచ్చరించుచుండి రనుట యీ క్రింది యుదాహరణమునుబట్టి స్పష్టము.

ఆచారపరుండు నాదెండ్లం జారుతరంబగు. వా. IV, 672 - 1138 సం. నాదెడులయని చదువవలయును. లేనిచో గణభంగము.

(పౌరుషనిరతః) పౌషహ నిరతః. వా. IV, 673 - 1139 సం.

ఇట్టి వ్రాతలవలన వ్రాయసగాండ్రకును, గొన్ని యెడల గావ్యకర్తలకును మాత్రావిభజనము స్పష్టపడలేదని తెలియును.

(5) ఋకారస్థానమున గుడియును, రేఫమును వ్రాయుచుండుట సామాన్యమైన యాచారము.

భిత్యక్రిత్య, వినయేన, మ్రిడాయ - వా. IV, 683 - 1142 సంవత్సరము
గుణాలంక్రిత - నెల్లూరు శాసనములు. వా. II, పుట. 966 ,,
ప్రిధివి - అహదనకర శాసనము.

(6) ఎ, ఏ లకు నుచ్చారణములోఁ గల భేదమును దిలకించి వ్రాతలో నిరూపించుట చాల నవీనము. అనగా హ్రస్వమయిన ఎకారమునకుఁగూడ ఏకారమే వ్రాయుట జరుగుచుండినది. దీనికిఁ గారణము సంస్కృతములో హ్రస్వములయిన ఎ, ఒ లు లేకుండుటయే. కాఁబట్టి యీ లిపిలో ఎ, ఒ, ఏ, ఓ లకు భేదమవసరములేదు. ప్రాకృతశాసనము లన్నియు నట్లే యున్నవి. ప్రాచీనాంధ్ర శాసనములు నట్లే యున్నవి. రాజరాజు కోరుమిల్లిశాసనమునను (క్రీ. వె. 1050), జాయన చేబ్రోలి శాసనమునను (క్రీ. శ. 1213 - 1214), శ్రీనాథుని పెదకోమటివేముని శాసనమునను (క్రీ. శ. 1410) గూడ నక్షరముమీది ఒత్వమునకును, ఓత్వమునకును భేదమే లేదు. సందర్భమునుబట్టి యెఱుంగవలసినదేగాని వేఱు లేదు. అట్లే ఎత్వమునకును ఏత్వమునకును భేదములేదు. క్రిష్ణవెణ్ణ, వేమభూపాల, రెంటియందును ఒకేవిధమున నక్షరము లున్నవి. ఒ ఓ లకును, ఎ ఏ లకును గల నేఁటి రచనాభేదమును మిక్కిలి యర్వాచీనము.

(7) నేటి చ, జ లకును చ̄, జ̄ లకును గల భేదము శాసనములలో గనుపట్టదు.

## 3. లేఖనచిహ్నములకును తెనుఁగుధ్వనులకును గల సంబంధము

అక్షరమాలలోఁ గల లేఖనచిహ్నములు మనము నేఁటి తెనుఁగున మచ్చరించు ధ్వనులతో నెంతవఱ కెట్లు సంబంధించియున్నవో యిందు విమర్శింపఁబడును. తెనుఁగునకు ముప్పదియాఱువర్ణములు గలవని బాలవ్యాకరణము సూత్రించినది.[1] ఇంతియగాక మఱి పందొమ్మిది వర్ణములు సంస్కృతసమంబులను గూడి వ్యవహరింపఁబడును. పయిని నిరూపింపఁబడిన లేఖనచిహ్నములును, వానికి సూచ్యములయిన ధ్వనులును దెనుఁగున నేఁడు గలవని మనము సామాన్యముగా నంగీకరింపవచ్చును.

భాషలోని ధ్వనులకు లేఖనచిహ్నముల నేర్పఱుచుకొనునప్పుడు ఒక ధ్వని కొక్క గుర్తు, ఒక గుర్తు కొక్కటియే ధ్వని సూచ్య సూచకభావసంబంధమును గలిగియుండవలయుననుట యుక్తము. తెనుఁగున నిట్టిసంబంధము గలదనుట నిర్వివాదము. ఈ పద్ధతినే తెనుఁగుమాత్రమేగాక యితర ద్రావిడభాషలును, ఉత్తరహిందూస్థాన భాషలును దమ వర్ణమాల నేర్పఱుచుకొని యున్నవనుట నిర్వివాదము. ఇట్లు లేకుండ నుండునా యని సంశయము భారతదేశభాషేతరభాషల నెఱుంగనివారికిఁ గలుగవచ్చును. ఆంగ్లమునందలి యీ క్రింది యుదాహరణములను బరికించునది. Put, Cut ఈ రెండుపదములయందును 'U' అను చిహ్నమే ఉకారమునకును అకారమునకును సూచక మగుచున్నది. ఇట్లే Autumn (ఆటమ్) అను పదములోని తుది నకారమును, Debt (డెట్) అను పదములోని బకారమును ఉచ్చారణమును సంబంధింపవు. ఒక గుర్తున కనేకధ్వనులు సూచ్యము లయి యుండుట, ఒక ధ్వని కనేకములయిన గుర్తులు సూచకములుగ నుండుట, ఉచ్చారణమున లేని ధ్వనులకుఁ జిహ్నములు శబ్దములలో నుండుట మొదలగునవి భాషలయొక్క వర్ణమాలలోని లోట్లు. పయి మూఁడువిధములయిన లోట్లలో మొదటిదానికి, మూఁడవదానికిని నుదాహరణము లాంగ్లమునుండి యీయఁబడినవి. రెండవదానికి యుదాహరణమును దిలకించునది. Pin (పిన్), Houses (హౌసిస్) ఇందలి ఇకారమునకును రెండు గుర్తులు వాడఁబడియుండుట స్పష్టము.

లిపిలోని యిట్టి దోషములు పఠనసౌలభ్యమునకుఁ బ్రతిబంధకములు. నేర్చుకొనువారి కడ్డంకులు. పండితులుగూడ నాంగ్లభాషయొక్క వర్ణక్రమరచనయందు తబ్బిబ్బుపడుటయు సంభవించుచున్నది.

[1] బా. వ్యా. సంజ్ఞ—3 సూ. తెనుఁగుకు వర్ణములు ముప్పదియాఱు.

అ ఆ ఇ ఈ ఉ ఊ ఎ ఏ ఐ ఒ ఓ ఔ అం అః. క గ చ చ జ జ ట డ ణ త ద న ప బ మ య ర ల వ స హ ళ-ఆంధ్రశబ్దచింతామణి – ద్వివిధాదిదుదేదోౕచౌ, వక్రతమావనుస్వారౌ, క గ చ జ యుగ ట డ ణ త ద న ప బ మ యర ల వ స హ ళం తు హల్వర్గః, అన్యేచ ప్రవిశంతి శబ్దయోగవశాత్, ఋ ౠ ఌ ౡ విసర్గ ఖ ఛ ఠ థ ఫ ఘ ఝ ఢ ధ భ ఙ ఞ శ ష లు.

లోకములో నర్థవంతములయిన శబ్దములలోని ధ్వనివిశేషము లన్నిటిని (ఎల్ల భాషలలోనివియు) గ్రహించి విభజించినచో ననేకములయిన స్వరములును, వ్యంజనములును గనుపట్టగలవు. ఇంతియగాక ఉచ్చరించునట్టి ముఖయంత్రము నందలి యవయవముల యొక్క భిన్నభిన్న స్థితులవలన భిన్నభిన్న స్వరములను ఏభాషలోను లేనివానినిగూడఁ గల్పింపవచ్చును. వానికన్నిటికిని ఏ ఒక్క భాష యందును బ్రయోగము కనుపట్టదు. అట్లే వానిని వ్రాయుటకు లేఖనచిహ్నములు గూడఁ గనుపట్టవు. అట్లు లేకుండుట యొక దోషము గాదు. భాషలో లేని ధ్వనులకు గుర్తులు గల్పించుట యుక్తమును గాదు. ఏభాషలో వాడుకలో నున్న ధ్వనుల కా భాషలో నియతములయిన గుర్తు లుండవలెను. ఇట్లు లేకుండుటకు హేతువు లేమయి యుండునో సామాన్యముగా నూహింపనగును.

ఒక భాషలో నున్న ధ్వనులకుఁ గుర్తు లుండగా విశాలమయిన మరియొక భాషతో సంపర్కము గలిగి యందుండి క్రొత్తపదములు ప్రవేశించినప్పు డా ధ్వనులకు గుర్తు లీ భాషలో నుండవు. కాలక్రమమున నట్టివాని నేర్పఱుచుకొన వచ్చును. తెనుఁగున లేని సంస్కృతపు ధ్వనులకు లేఖనచిహ్నములు నేఁటి తెనుఁగున సంగ్రహింపఁబడి యున్నవి. ఇట్లే ప్రాచీనమయిన యరవపు లిపియందు ఒత్తు అక్షరములకును, వర్గస్థసరళములకును గుర్తు లుండలేదు. కాలక్రమమున గ్రంథలిపి యొకటి బయలుదేరి యందు సంస్కృతధ్వనులనుగూడ వ్రాయుట యరవ దేశమున నేర్పడినది.

కాలక్రమమున నూతనస్వరములు భాషలో నేర్పడవచ్చును. వాని కన్యభాషాసాహచర్య మక్కఱలేదు. అట్టివానికి బ్రాచీనవర్ణమాలలో గుర్తు లుండవు. అది వర్ణమాలలోని యొక లోటుగా నేర్పడుచుండును. నేఁటి తెలుఁగులో నట్టిధ్వనులు కొన్ని గలవు. ప్రాచీనములయిన కొన్ని ధ్వనులు కాలక్రమమున నశించిపోయినను గూడ నయ్యవి వ్రాతలో నిలిచియుండును. అట్టివానికి ఉచ్చారణమున మూలము కనుపట్టదు. ఇట్టివియు తెనుఁగున గలవు.

ఈ క్రింది విషయములు పరిశీలనార్హములు :

(1) తాటి+ఆకు=తాటాకు అని గాక ఆకార ఏకారములకు నడిమి యుచ్చారణముతో వాడుకలో నున్నది. ఇట్లే వచ్చాను, పోయాను, చేసాడు మొదలగు పదములయందును ఈ స్వరము గలదు. కాని దీనికి లేఖనచిహ్నము లేదు. ఈ స్వరము ఆంగ్లమున బహుళముగా గలదు. అందును ఈ తబ్బిబ్బులు తప్పవు. వివిధములయిన స్వరము లన్నిటికిని ఒక్క 'a' అను గుర్తే వాడఁబడుచుండును. ఈ స్వరము నింకను తెలుఁగున పండితులందఱు నంగీకరించినట్లు కనుపట్టదు. అంగీకరించినను గూడ '—' అను గుర్తే దీని సందర్భమునుబట్టి తెలుపఁగలిగిన ట్లూహించుట యొక మార్గము గాకపోలేదు. కాని ముఖ్యముగా ధ్వన్యనుసారమయిన తెనుఁగు లిపి కిది యొక లోటనవచ్చును.

(2) పరుగు, బరువు మొదలగు ఉకారాంతశబ్దముల తుది నున్న 'ఉ' కారము ఒకమాత్ర గలిగినట్లు ఉచ్చరింపఁబడలేదు. ఇది హ్రస్వతరమయిన ఉకారము. ఈ ఉకారమును మనవైయాకరణులు గుర్తింపనేలేదు. అరవవైయాకరణులు ఒక విధమయిన హ్రస్వతర ఉకారమును గుర్తించిరి. దానికి "కుట్రియల్ ఉగరమ్" అని పేరు. దానికిని దీనికిని ఉచ్చారణమున స్వల్పభేదము గలదు.

(3) పదాదినున్న అచ్చు 'య' కారాదిగా ఉచ్చారణమున వినఁబడుచున్నను, మనము దానిని కేవలము స్వరాదిగానే పరిగణించుచున్నాముగాని యాదిగా వ్రాయుటలేదు.

(4) పదాదిని ఉచ్చారణమున వు, వూ, వొ, వో లు వినబడుచున్నవి. అవి నింద్యములని చాలకాలమునుండి వైయాకరణులు పరిహరించిరి. కాని కొందఱు నేఁటికి నీ యభ్యాసమును విడువకున్నారు.

(5) 'క్ష' వర్ణము కకార షకారముల కూడిక. ఈ రెండిటి కూడికకుఁ గల యుచ్చారణము అక్షరము, భిక్షు మొదలగు శబ్దములలో మనకు వినఁబడదు. ఈ క్షకారము భిన్నముగా నుచ్చరింపఁబడుచున్నది.

(6) జ్ఞ - ఈ యక్షరము వ్రాతలో నున్నట్లుచ్చరించుట లేదు. దీనిని 'గ్న' అనునట్లు పండితులు ఉచ్చరింతురు. ఆ ఉచ్చారణయొక్క అపభ్రష్టములయిన 'గ్న', 'గ్నె' మొదలయిన భిన్నరూపములు వినబడుచున్నవి.

(7) ఋ, ౠ వర్ణముల యుచ్చారణము తెనుఁగుదేశమున చాలవఱకు భ్రష్టమయినది. కృష్ణుఁడు అని వ్రాయుటకు బదులు క్రుష్ణుడు అని వ్రాయువారు చాలమంది గలరు. దీనికిఁ గారణ మా ధ్వనులు తెనుఁగునకు విజాతీయములును, రు, రి వర్ణములకు మిక్కిలి సమీపములును నగుటయే.

(8) కాఫీ, కఫము, ప్రూఫు మొదలగు పదములలోని ఫవర్ణము ఆంగ్లము నందలి *f* వర్ణమువలె నుచ్చరింపఁబడుచున్నది. దీనికిఁ దెనుఁగున గుర్తు లేదు.

(9) పదముల తుది మకారమును 'ము' వర్ణముతో వ్రాయుచున్నాము. ఇది హ్రస్వతర 'మ' కారము. ఇది 'మ్', 'ము' అను వానివలన బోధింపఁబడదు. ఇట్టిదానిని అరవవ్యాకరణములందు గుర్తించిరి. దానికి మాత్రలో నాల్గవభాగ ముచ్చారణకాల మనిరి. 'మ్' అర్ధమాత్రాకము, 'ఉ' కారము ఏకమాత్రాకము.

(10) శకటరేఫము, అర్ధానుస్వారము అను వీని రెండిటియొక్కయు నుచ్చారణము వాడుకలో పూర్తిగ నశించినది. ఈ గుర్తులు వ్రాతలోమాత్ర మున్నవి.

ఇవిగాక వాడుకలో నజ్ఞులు చేయు పొరపాట్లకును, సోమరులును, అపండితులు వ్రాయు తప్పులకును లెక్కలేదు. శ, స, ష లకు భేదమెఱుంగకుండుట, ఒత్తులు తొలఁగించుట మొదలగువానిని లెక్కింపఁ బనిలేదు.

మొత్తముమీద తెనుఁగు లిపిలో గల దోషములు అత్యల్పములు.

# తెనుఁగున గల స్వరములు, వానికిఁ బ్రాచీన ద్రావిడభాషతోఁ గల సంబంధము

ప్రాచీనద్రావిడభాషయే కాలక్రమమున నేఁటి మాండలికములయిన యరవ, కర్ణాటాది భాషలుగా మాఱిన దగుటను, నట్టి మాండలికములలోఁ దెలుఁగొకటి యగుటను, నేఁటి తెనుఁగునకును బ్రాచీనమయిన ద్రావిడభాషకును స్వరాదికములయిన ధ్వనులయందు గల భేద మేమియో పరిశీలింపఁబడును. ప్రాచీనద్రావిడమున నుండిన ధ్వనులలోఁ గొన్ని నశించుటయు, నందు లేనివి క్రొత్తగా నిందు బయల్వెడలుటయుఁ, గొన్ని మాఱురూపముల నందుటయు సంభవించియుండక తప్పదు. అ ట్లేవి మాఱినవో తెలిసికొనుటయే యీ ప్రకరణమునందు గల విచారణమువలని ఫలితము. ప్రాచీనద్రావిడము ఊహామాత్ర సిద్ధమనియు, నేఁటి ద్రావిడభాషల స్వరూప స్వభావములఁ బరిశీలించుటవలన నాఱిప్త మైనదనియు, నందలి పదములుగాని, వాక్యములుగాని యేలిఖితములోను లభింపలేదనియు ముందే చెప్పితిని. కాఁబట్టి ప్రాచీనద్రావిడభాషాస్వరూపముగూడ నిప్పుడు పరిశీలనము వలనఁ దేల్పవలసినదే.

## నేఁటి తెనుఁగునందలి స్వరములు

'అ ఆ ఇ ఈ ఉ ఊ ఎ ఏ ఐ ఒ ఓ ఔ అం అః'. ఈ స్వరములు తెనుఁగున నున్నవని యాంధ్రశబ్దచింతామణి యంగీకరించినది. వీనినే బాలవ్యాకరణ కర్తయు నంగీకరించెను. పయి యక్షరము లన్నియును నేఁటి అరవ, కర్ణాట, మలయాళ భాషావ్యాకరణము లన్నియు నంగీకరించినవియే. వీనినిగూర్చి వరుసగా నీ క్రింద వ్రాయఁబడుచున్నది.[1]

[1] ద్వివిధాదిదుదేతోఽచో, వక్రతమా వనుస్వారౌ - సంజ్ఞా - 13 సూ. ఆం. శ. ఔకార మిరువాయ్ ప్పన్ని రెழுత్తుమ్, ఉయిర్ ఎనమొழிప తొల్ ఎ. 8. ఈ యక్షరములనుగూర్చి వ్యవహరించునప్పుడు తెలుఁగు వైయాకరణులు అచ్చులు, హల్లులు, హ్రస్వము, దీర్ఘము, ప్లుతము మొదలగు సంస్కృతసంజ్ఞలనే వాడిరి. అట్లే కర్ణాటవైయాకరణుడగు కేశిరాజును దన శబ్దమణిదర్పణమున నిట్టి సంజ్ఞలనే వాడెను. స్వరంగళ్, హ్రస్వం, దీర్ఘ, వ్యజనం మొదలగునవి. అట్లే మలయాళ వ్యాకరణములయందును స్వరమ్, వ్యజనమ్, హ్రస్వం, దీర్ఘం మొదలగు పదములనే వాడిరి. తొల్కాప్పియనారుమాత్రము ఉయిర్, మెయ్, కుఱిల్, నెడిల్, అళపెడై అను ద్రావిడపదములనే వాడెను.

## 1. అ, ఆ ల చరిత్రము

అ-ఆ. ఈ రెండచ్చులును ద్రావిడపదములలో నేఁటి ద్రావిడమాండలికము లన్నిటియందును ధాతుగతములుగా నున్నవి. ఇవి ప్రాచీనద్రావిడభాషలో నుండిన వనుట నిస్సంశయము. అ, ఈ, ఏ యను త్రికము అన్ని ద్రావిడభాషల యందును బ్రాచీనమునుండియు నున్నట్లు స్పష్టము. 'ఆ' యనునది 'అ' యను దాని దీర్ఘరూపము. ప్రాచీనమున నుండిన 'అ' కారము 'ఎ' కారముగాను, 'ఆ' కారము 'ఏ' కారముగాను మఱియొకయెడ 'ఓ' కారముగాను మాఱినట్లు నిరూపింపఁబడినది.[2] సంస్కృతమునందు 'అ' కార యుక్తములయిన 'జపమ్', 'బలమ్', 'యమః' అనునవి అరవమునందు 'శెబమ్', 'బెలమ్', 'ఎమన్' అను రీతిని 'ఎ' కారయుక్తములుగా మాఱినవి. అట్లే తెనుఁగునను, శయ్య—సెజ్జ, శల్యుఁడు సెల్లుఁడు, చర్ప — చెర్ప (వాడుక), దర్శనము—దరిసెనము, త్యాగము—తేగము, విద్య—విద్దె అను రీతిని మాఱినవి.

అకారము ఎకారముగా మాఱినట్లు కనుపట్టుచున్నది. ఈ క్రింది మార్పులనుగూడఁ దిలకించునది.

అన్, నాన్ (తమి), అమ్, నామ్ (కన్న) ఏను, నేను, ఏము, నేము (తె)

ఆఱు (తె) ఏరు

ఆరు (తె) ఏరు

(అరవ) విల్లాన్ - విల్లోన్ = వింటివాఁడు

విణ్ణవర్ - విణ్ణోర్ = దేవతలు

నల్లవన్ - నల్లోన్ = మంచివాఁడు

ఇట్లే తెనుఁగునను వాఁడుతోఁ గూడిన స్థలములయందు 'ఓ' వాడుకలో వినఁబడుచున్నది. మంచివాఁడు—మంచోడు, తిన్నవాఁడు—తిన్నోడు. ఇట్లరవమున 'అ' కారము 'ఎ' కారముగ మాఱుట సంస్కృతశబ్దములు 'గ జ డ ద బ' లతో గూడినప్పుడే కనుపట్టుచున్నది. అరవ లా యక్షరముల నుచ్చరించు పద్ధతిని సంబంధించినదిగాని యెల్లయెడలను అకార మట్లు మాఱదనియును నిరూపింపఁబడినది.

ఉదా.
గంగాతీరము—కెంకాతీరము
గతాయుస్—కెతాయు
జపమ్—సెబమ్ } అరవము
బహువ్రీహి—వెకువిరియన్[3]

ఇట్లే తద్భవప్రకరణము గ్రహించినచో కర్ణాటమునను సాంస్కృతికమైన అకారము ఎకారముగా మాఱినట్లు ఉదాహరణములు గలవు.

[2] C. G. D. పు. 133. [3] P. S. S. పు 55.

జటా - జెడె ; శయ్యా—సెజ్జె ; వ్యంజనమ్—బెంజనమ్ ;
వ్యతిరేకమ్—బెతిరేకం, వెతిరేకం ; వ్యథా—బెతె, వెతె.[4]

పై విచారణవలన తేలిన ఫలిత మేమనగా 'అ, ఆ' లు మాఱుట గలదు. ఇవి సాంస్కృతికము లయినప్పుడు మాఱుట యధికము. ద్రావిడము లయినప్పుడు మాఱుట చాలనల్పము. అట్లు ప్రాచీనద్రావిడగతమయిన 'అ, ఆ' లు 'ఎ, ఏ' లుగా మాఱిన యెల్లయెడలను ఊనిక మాఱుటయో, ఇతర సామ్య మందుటయో హేతువని విమర్శించి నిరూపింపనగును. పై యుదాహరణములలో 'ఆ' కారము 'ఓ' కారముగా మాఱుట యక్కడి వకారలోపమున నని యూహింపనగును. మొత్తముమీద నీ 'అ, ఆ' లు ప్రాచీనద్రావిడమున నుండి యట్లే తెనుఁగులోనికి వచ్చిన వనుట సిద్ధాంతము.

## 2. ఇ, ఈ ల చరిత్రము

(2) ఇ-ఈ. ఈ రెండును ద్రావిడ భాష లన్నిటియందును సుప్రసిద్ధముగా నున్నవియే. ఇవి పదములలో నావయవికముగాను, ధాతువులయందును ననేక స్థలములలో గనుపట్టుచున్నవి. ఇవియును త్రికములోనివే. వీని కుదాహరణములు అనేకములు గలవు.

| | | | |
|---|---|---|---|
| ఇల్ (అరవము) | ఇల్లు (తెలుఁగు) | ఇల్ (కన్న) | ఇల్ (మల) |
| ఈచల్ | ఈగలు | ఈఛల్ | ఈయల్ |

పదాదినున్న 'ఇ'కారము అనేక స్థలములలో 'ఎ' వర్ణముగా మాఱినది. ఈ మార్పున కుదాహరణములు 'ఎ' వర్ణ విచారణ సందర్భమున నీయంబడును.

ఈ రెండునుగాక అరవవైయాకరణులు "కుట్రియల్ ఇగరమ్" అనగా కుఱుచ ఇకారము అను నొకదాని నంగీకరించిరి.[5] ఈ కుఱుచ ఇకారము 'మ య'లకు నడుమ 'మియా' యను ప్రత్యయములో సంబోధనమున వచ్చును. ఉ. కేణ్మియా, సేన్మియా. సంధియందు మొదటిపదము తుదనికూడ నిది రావచ్చును. ఉదా. నాకు+యాదు=నాకి యాదు (నాలుక యేది) ఈ కుఱుచ 'ఇ' కారము సాధారణ 'ఇ' వర్ణమువలె ఏకమాత్రాకముగాక అర్ధమాత్రాకమనియే నిశ్చయింపఁబడినది. ఈ కుఱుచ 'ఇ' కారమును ఇతర ద్రావిడభాషావైయాకరణులు పేర్కొనలేదు. ఇది ప్రాచీనద్రావిడభాషలో నుండినను నేఁటి తెనుఁగున నశించిన దనవచ్చును.

[4] శ. ర. పు. 417.

[5] తొల్కా. ఎళుత్తు. 34-35. కుట్రియల్ ఇగర నిట్రల్ వేణ్డుమ్ యావెన్సినై మిసై ఉరై యసైక్కిళవి క్కావయిన్ వరూమ్ మగరమూర్న్దే.

## 3. ఉ, ఊ ల చరిత్రము

(3) ఉ, ఊ. ఈ రెండును ద్రావిడభాష లన్నిటియందును దేశ్యపదములలోను అవయవికముగాను, ధాతుగతముగాను కనుపట్టుచునే యున్నవి. ఇవి ప్రాచీనద్రావిడమునుండి తెనుఁగునకు వచ్చిన వనుట నిర్వివాదము. ఊనికతో నుండి పదాదినున్న ఉకారము అట్లే ప్రాచీనద్రావిడపదములనుండి మార్పులేకయే తెనుఁగునకు వచ్చి చేరినది. ఊనిక మాఱినప్పుడు ఈ ఉకారము మాఱిపోయి 'ఒ' లేక 'ఓ' అను రూపమును బొందినది. ఊకారము ప్రాచీనద్రావిడమునుండి మార్పులేక యట్లే వచ్చినదని చెప్పవచ్చును.

| | | | | |
|---|---|---|---|---|
| ఉ. తెనుఁగు. | ఉగ్గము | (కన్న) ఉగ్గ | (తమి) ఉక్క | (తుళు) ఉగ్గి |
| | ఉడుఁగు | ఉడుగు | ఉడుంగు | |
| | ఊరు | ఊర్ | ఊర్ | |

పదాంతమునం దున్న ఉకారముమాత్రము తెనుఁగున నవీనముగానే యేర్పడినదనుట సత్యము. నేఁడు తెనుఁగున 'ఉ' కారాంతముగా నున్న శబ్దములు ప్రాచీనద్రావిడమున హలంతములుగానే యుండినవనియు, నేఁటికిని అవి తమిళ, కన్నడములయందు హలంతములుగానే యున్నవనియు స్పష్టము. తెనుఁగునందలి ఉకారసంధి నిత్యత్వమును విచారించునప్పు డీవిషయము మఱల వ్రాయఁబడును.

అరవవైయాకరణులు (తొల్కాప్పియనారు) కుట్రియల్ ఉగరమ్ అను దాని నొకటిని (కుఱుచ ఉకారమును) అంగీకరించిరి. ఇది యర్ధమాత్రాకము. కుఱుచ 'ఇ' కారము వంటిదే యియ్యదియును. ఇది యరవమున తొల్కాప్పియనారు కాలమున మిక్కిలి ప్రాధాన్యముఁ బొందియున్నది. దీనిని తెనుఁగు మొదలగు నితరభాషల వైయాకరణులు పేర్కొనలేదు. ఇదియును అర్ధమాత్రాకముగానే యుండినది. ఇప్పుడు నిరూపించిన కుఱుచ 'ఉ' కారమును, ముందు తెల్పిన కుఱుచ 'ఇ' కారమును గూడ సామాన్యములయిన 'ఉ' కార 'ఇ' కారముల కంటె ఉచ్చారణకాలమునందుమాత్రమేగాక స్వభావమునందును భిన్నములని తొల్కాప్పియనారు వ్రాసెను. ఇవి రెండును దత్పూర్వమున నున్న హల్లు నుచ్చరించు స్థానముతోనే యుచ్చరింపఁబడును.[6]

## 4. ఎ, ఒ ల చరిత్రము

ఎ, ఒ. ఈ రెండును ప్రాచీనద్రావిడమునుండియే తెనుఁగునకును ఇతర ద్రావిడభాషలకును వచ్చినవి. ఈ యక్షరములు హ్రస్వ దీర్ఘము లనియెడి

[6] తొల్కా. ఎழுత్తు 101.

భేదము సంస్కృతమున లేదు. ఇది ద్రావిడభాషాస్వభావమునఁ బాతుకొని యుండినదని శాస్త్రజ్ఞుల యూహ. వీని దీర్ఘస్వరూపము లయినవిమాత్రమే సంస్కృతమున నున్నవి. పాణిన్యాచార్యులు 'ఎ ఒ' లను నిరూపింపలేదు. పతంజలి తన మహాభాష్యమున వీని స్వరూపమును దెలిపి "సామవేదశాఖీయు లయిన సాత్యముగ్రిరాణాయణీయులు అర్ధ ఏకారమున అర్ధ ఓకారమును పఠింతురు. లోకమునగాని, ఇతర వేదమునందుగాని యీ అర్ధ ఏకారమును, అర్ధ ఓకారమును లేవు" అని వ్రాసెను.[7] కాల్డ్వెల్లుగారుకూడ యీ రెండును సంస్కృతమున లేవనియును, ద్రావిడములే యనియును వ్రాసిరి.

"కొందఱ మతంబున హ్రస్వవక్రంబులును బ్రాకృతంబునందు గలవు. కొందఱ మతంబున వక్రతమంబులుం గలవు. ఎ ఏ ఒ ఓ లు వక్రములని, ఐ ఔ లు వక్రతమములని ప్రాచీనులు వ్యవహరింతురు" అని చిన్నయసూరి వ్రాసెను.

ప్రాకృతమున నివి యున్నవా, లేవా? యను విషయమున భిన్నాభిప్రాయములు గలవనుట పైదానినిబట్టి స్పష్టము. కాని[8] ఆంధ్రభాషాచరిత్రకారులు 'ఎ ఒ' లు ప్రాకృతమునఁ గలయట్లు నిరూపించుచు ననేకోదాహరణముల నొసంగుచున్నారు. ఈ యుదాహరణము లన్నియును కొందఱు ప్రాకృతవ్యాకర్తలచే నీయంబడినవియే. దేశీయ ప్రాకృతవ్యాకర్తల ననుసరించి సవిమర్శంబుగ వ్రాయంబడిన పాశ్చాత్య పండితకృత ప్రాకృతవ్యాకరణములందును ఈ విషయము పేర్కొనంబడినది. అయినను గొన్నియెడల 'తెల్ల' మొదలయిన క్రింద నుదాహృతములైన శబ్దములు దీర్ఘములుగానే పేర్కొనంబడినవి. ప్రాకృతహ్రస్వములు లేవనువారి మతమున నివి యన్నియును దీర్ఘములే. పైగా హ్రస్వ దీర్ఘములు రెంటికిని ఒక్కటే వ్రాతగుర్తని చెప్పవలసివచ్చినప్పుడు ఎచ్చట 'ఎ' వర్ణమో, ఎచ్చట 'ఏ' వర్ణమో తెలియ వీలులేదు.

పై విచారణమునుబట్టి స్పష్టపడిన విషయములు.

1. హ్రస్వములయిన 'ఎ ఒ' లు వేదశాఖలో నొక్కచోటనే గలవు.

2. ప్రాకృతమునందును వీని యునికినిగూర్చి యభిప్రాయభేదము గలదు.

[7] ఛాందోగానామ్ సాత్యముగ్రిరాణాయణీయాః అర్ధమేకారమ్ అర్ధమోకారం చాధీయతే, నైవహిలోకే నాన్యస్మిన్ వేదే అర్ధఏకారో అర్ధఓకారో వాఽస్తి (పాతంజల మహాభాష్యం 1, 22, పంక్తి. 21, 23, 24.) P. S. S. పు 28, సీతారామపండితీయము, విషయము. 210.

[8] తెల్ల = తైల; చెత్త=చైత్ర; మెత్తీ=మైత్రీ; వెజ్జ=వైద్య; సెణ్ణ=సైన్య; పెచ్ఛఇ=ప్రేక్షతే; పెచ్ఛణిజ్జ=ప్రేక్షణీయ; అవెక్ఖి=అపేక్షిన్; దుబ్భెజ్జ=దుర్భేద్య; మెచ్ఛ=మ్లేచ్ఛ; ఖెత్త=క్షేత్ర; ఏశెఖ్ఖ=ఏషఖలు; కొత్థుల=కౌస్తుభ; జొవ్వణ=యౌవన; దొచ్చ=దౌత్య; దొబ్బల్ల=దౌర్బల్య, పవొత్త=ప్రపౌత్ర; మొత్తిఅ, మౌత్తియ=మౌక్తిక; ఒట్ఠ=ఓష్ఠ; అణ్ణోణ్ణ=అన్యోన్య; పఉట్ఠ=ప్రకోష్ఠ—ఆ. భా. చ. పుట 193.

3. ద్రావిడభాష లన్నిటిలోను అనాదిగాను, శబ్దములలో అవయవికముగాను, ధాతుగతముగాను 'ఎ ఒ' లు కనుపట్టుచున్నవి. ఈ మూఁడువిషయములఁబట్టియుఁ దేలు నభిప్రాయ మేమనగా 'ఎ ఒ' లు ద్రావిడభాషలలోనికి సంస్కృత ప్రాకృతముల నుండి రాలేదనుటయే. ఒకప్పుడు ద్రావిడభాషాగతమైన యీ యుచ్చారణయే సంస్కృతప్రాకృతములోని 'ఎ ఒ' లకు హేతువయి యుండనగును. లేదా ప్రాకృతములయందు స్వతంత్రముగా గలిగియుండవచ్చును. ఇట్లూహించుటకు ఈ క్రింది విషయమును సాధకముగా గనుపట్టుచున్నది.

తెల్ల, చెత్త మొదలయిన శబ్దములలో కొందఱమతంబున దీర్ఘమయిన ఏకారమే యని ముందే చెప్పితిని. ఇది హ్రస్వ మనువారి కేమి ప్రమాణము? ఉచ్చారణయేకదా. ఇట్టి యుచ్చారణము కాలక్రమమున నేర్పడుట కొక హేతువు గలదు. సంయుక్తాక్షరమునకు ముందున్న దీర్ఘము హ్రస్వమగునని ప్రాకృత వ్యాకరణము లన్నియును జెప్పుచున్నవి. ఆ కారాదికము అట్లు హ్రస్వము లగుచుండగా ఏకార మెట్లు హ్రస్వము గావలెను? హ్రస్వమయిన ఎకారము లేదుగదా యను ప్రశ్నము రాక తప్పదు. అట్టి స్థలములయందు ఏ, ఓ వర్ణములకు బదులుగా ఇ, ఉ వర్ణములు గనుపట్టుచున్నట్లు గొన్ని యుదాహరణములవలనఁ దేలుచున్నది. కొన్ని చోట్ల స్వరూపముచేతనే హ్రస్వ మున్నట్లు తెలుపఁబడినది. ఇట్టి హ్రస్వము ఉచ్చారణలో సంయుక్తాక్షరములకు ముందు ఏర్పడి స్థిరపడి యుండనగును.[9] అది నవీనము గావుననే కొందఱు వైయాకరణులచే నంగీకరింపఁబడలేదు.

ఇట్టి సందర్భములో ప్రాకృతాదికమునందలి హ్రస్వములయిన 'ఎ ఒ' లకు ద్రావిడములయిన వక్రములు హేతువు లయి యుండవచ్చునుగాని దానికి విపరీతము మాత్రము గాదనుట స్పష్టముగాదా!

హ్రస్వములయిన ఎకార ఒకారములు తొల్కాప్పియమునందును, శబ్దమణిదర్పణమునను, ఆంధ్రశబ్దచింతామణియందును బేర్కొనంబడినవి. తెనుఁగున ఎ ఏ లకు గల భేదము సుప్రసిద్ధమగుటచే ఉదాహరణము లీయలేదు. శబ్దమణి

[9] చండ ప్రాకృతవ్యాకరణము 2-వ భాగము, 6 సూత్రము. "హ్రస్వత్వం సంయోగే" స్వరాణాం హ్రస్వత్వం భవతి సంయోగేఽక్షరే పరే—ఉదా—కవ్వం(కావ్యం), కజ్జం(కార్యం), సిగ్ఘో (శీఘ్రః) సుజ్జో (సూర్యః). త్రివిక్రముని ప్రాకృతశబ్దానుశాసనము- సూత్రము 40, పుట 30-31. ఆర్ష ప్రెస్సు, విశాఖపురి. సంయోగే-40-సంయోగే పరే పూర్వస్య స్వరస్య హ్రస్వో భవతి. ఆ. ఆమ్రం=అమ్బం, తామ్రమ్=తమ్బం, విరహాగ్నిః=విరహగ్గీ, అమాత్యః=అమచ్చో, ఈ. తీర్థమ్=తిత్థం, చూర్ణమ్=చుణ్ణం, నరేంద్రః=ణరిందో, మ్లేచ్ఛః=మిలిచ్ఛో, ఓ. అధరోష్ఠః=అహరుట్ఠో, నీలోత్పలమ్=ణీలుప్పలమ్. ఏదోతోః క్వచిత్స్వరూపేణైవ హ్రస్వః, ఏకః=ఎక్కో, సేవా=సెవ్వా, నీడమ్=నెడ్డమ్, గ్రాహ్యమ్=గెజ్ఝం, స్తోకమ్=థొక్కం, తుణ్డమ్=తొండం.

దర్పణకారుఁడు ఎ ఏ ఒ ఓ అనునవి కన్నడమునందు స్వాభావికముగానే యున్నవి. అని వ్రాసెను.[10]

## 5. ఏ, ఓ ల చరిత్రము

ఈ రెండును తెనుఁగు మొదలయిన ద్రావిడభాష లన్నిటియందును గలవు. ఇవి ప్రాచీనద్రావిడమునుండియే తెనుఁగునకు వచ్చినవి. సంస్కృతమునుండిగాని ప్రాకృతమునుండిగాని ద్రావిడభాషలలోనికి వచ్చినవి గావు. ప్రాచీనమయిన తొల్కాప్పియమునందును 'ఏ ఓ' లు పేర్కొనఁబడినవి. ఇఁక సంస్కృతము నందలి ఏకార ఓకారములకును, ద్రావిడమునందలి ఏకార ఓకారములకును భేదము కలదా యను ప్రశ్నమునకు సమాధాన మీయవలయును. ఉచ్చారణమునగాని స్వభావమునగాని వీనికి భేదములేదని కాల్డ్వెల్లుగారి యభిప్రాయము. అరవవైయాకరణులలోఁ గొందఱును నట్లే యభిప్రాయపడియున్నారు. కన్నడ వైయాకరణుఁ డగు కేశిరాజును నట్లే 'ఏ ఓ ఐ ఔ' లను సంస్కృతముతో నభిన్నముగానే యూహించి నట్లు చెప్పవచ్చును. కాని సంస్కృతమునందలి 'ఏ ఓ' లకును, ద్రావిడమునందలి 'ఏ ఓ' లకును ఉత్పత్తిలో భేదము కలదనియు, నట్టి భేదము ఈ రెండుభాషలకును గల భేదమును సాధించుననియు సుబ్రహ్మణ్యశాస్త్రిగారు వ్రాయుచున్నారు.[11] వారి మత మీ క్రింద నుదాహరింపఁబడుచున్నది.[12]

"సంస్కృతమునందలి 'ఏ ఓ' లు సంయుక్తస్వరములు. వీనిని సంస్కృత వైయాకరణులు సంధ్యక్షరములని యొక్కరీతినే చెప్పిరి. సంస్కృతభాషకుఁ బూర్వ రూప మయిన ప్రాచీనపు ఇండోజెర్మానిక్ భాషలో నేఁటి సంస్కృతమునందలి 'ఏ ఓ' లు గల పదములకుఁ బూర్వరూపములయిన పదములలో నవి ఏ=(అఇ, ఎఇ, ఒఇ) ఓ=(అఉ, ఎఉ, ఒఉ) అను ధ్వనులకు సమానము లనందగిన ధ్వనులతో గన్పట్టు చున్నవి. ఏ ఓ ఐ ఔ లు సంధ్యక్షరములని పాణిన్యాదుల మతము. సంస్కృత వ్యాకరణము ననుసరించియు 'అ ఇ' లకు సంధి గలిగినపుడు 'ఏ' యును, 'అ ఉ' లకు సంధి గలిగినపుడు 'ఓ' యును నాదేశము లగుచున్నవి. కొన్ని స్థలములలో ఏకార ఓకారములకు అకారము పరమయినప్పుడు అకారము లోపించుచున్నది. హరే+అత్ర = హరేऽత్ర; గురో+అత్ర=గురోऽత్ర. ఈ సంధినిబట్టిమాత్ర మివి సంధ్యక్షరములు గా ననవచ్చును. కాని 'ఏ ఓ' లకు అచ్చు పరమయినపుడు

---

[10] సవనిసిద ఎ ఏ ఒ ఓ ఎంబివు కన్నడదోళ్ స్వభావదిం దొళవు— శ. ద. 8 సూత్రము. తొల్కాప్పియము ఎళుత్తు సూ. 16. ఎ ఏ లకును ఒ ఓ లకును వ్రాతలో భేద మున్నట్లు నిరూపింపఁబడినది.

[11] ప్రయోగవివేకము - 6 సూత్రవ్యాఖ్యానము 'అగరవిగర వేకారమాగుమ్' వానిని సంధి యక్కరమని పేర్కొనిరి. శివజ్ఞాన మునివరుకూడ నట్లే చెప్పిరి. (తొల్కాప్పియరు ముదల్ సూత్తిర విరుత్తి 24)

[12] P. S. S. పుట - 29.

సాధారణముగా 'అయ్, అవ్' అనునవి యాదేశము లగుననుటయే సత్యము. ఇది వాని సంధ్యక్షరస్వభావమునే నిరూపించుచున్నది. ప్రాచీనపు ఇండో జెర్మానిక్ భాషలలో నుండిన 'అయ్' అనుదాని స్థానమున వచ్చిన ఏకారముమాత్రము సంధ్యక్షరము గాదు. కేవల దీర్ఘముగానే యుండిన దనవచ్చును. మొత్తముమీద సంస్కృతము నందలి 'ఏ ఓ' లు చాలవఱకును సంధ్యక్షరము లనుట నిస్సంశయము. అత్యల్ప స్థలములలో మాత్రము అవి దీర్ఘాచ్చులు. అరవమునందుమాత్రము ఏ ఓ లు ఎన్నడును సంధ్యక్షరములు గావు. అవి అసంకీర్ణములయిన దీర్ఘాక్షరము లనుట నిస్సంశయము. అ+ఇ అని సంధి గలిసినప్పుడు అ+వ్+ఇ=అవి ; ఆ+ఇ=ఆ+య్+ఇ=ఆయి అను రూపములు సిద్ధించునుగాని ఏ ఓ లు రావు.

అ + ఇడమ్ = అవ్ + వ్ + ఇడమ్ = అవ్విడమ్ (ఆయెడ) తెలుఁగు. ఆ + ఇరుదిణై = ఆ + య్ + ఇరుదిణై = ఆయిరుదిణై (ఆ రెండు విధములు). పల+ఉండు=పల+వ్+ఉండు=పల వుండు (అనేకములు ఉన్నవి). ఇట్లే ఏ ఓ ల యొక్క స్వభావము సంస్కృత తమిళములయొక్క పార్థక్యమును స్పష్టముగా నిరూపించుచున్నది."

పయిని తమిళమునుగూర్చి చెప్పఁబడినదంతయు నితర ద్రావిడభాషలకెల్లను జెల్లును. తెనుఁగునందలి ఏ ఓ లును నట్టివే యనుట నిస్సంశయము. మన+ఇల్లు=మనయిల్లు, తన + ఉప్పు = తనయుప్పు అగునుగాని మనేల్లు, తనోప్పు అను రూపములు రావు. ఇప్పుడు తేలిన సిద్ధాంతములు.

(1) ద్రావిడములయిన ఏ ఓ లును, సాంస్కృతికములయిన ఏ ఓ లును ఉచ్చారణలో నేఁడు సదృశములే యైనను ఉత్పత్తియందును, స్వభావమునందును భిన్నములును, స్వతంత్రములును నై యున్నవి.

(2) ద్రావిడములు దీర్ఘాక్షరమాత్రములు. అసంకీర్ణములు. సాంస్కృతికములు సంధ్యక్షరములు.

(3) అ+ఇ ; అ+ఉ, అను వానివలన సంధిలో ఏ ఓ లు సంస్కృతమున నేర్పడును. తెనుఁగున నేర్పడవు.

## 6. ఐ, ఔ ల చరిత్రము

ఐ, ఔ. ఈ యక్షరములు రెండును తెనుఁగున గలవని బాలవ్యాకరణమున నంగీకరింపఁబడినది. అరవమున నున్నట్లు తొల్కాప్పియమునందు నున్నది. కన్నడ, మలయాళ వైయాకరణులునుగూడ నా యా భాషలలో నివి యున్నట్లు అంగీకరించియే యున్నారు. ఈ రెండక్షరములును ద్రావిడములా, సాంస్కృతికములా యను విషయమున నభిప్రాయభేదము గలదు. ప్రాకృతమునుండి యివి ద్రావిడభాషలలోనికి వచ్చినవా యను ప్రశ్నమును విచారణీయమే.

తుదివిషయమునకు సమాధాన మేమనఁగా నీ 'ఐ ఔ'లు ప్రాకృతమునుండి యాంధ్రమునకు (ద్రావిడములకు) రాలేదనుటయే. ఈ రెండును ప్రాకృతమునం గలవా యనునదియే సంశయాస్పదము. పయి చిన్నయసూరిగారి వాక్యమునుబట్టి ప్రాకృతమున వీని యునికి విప్రతిపన్నమని తెలునుగదా! ప్రాకృతవ్యాకరణము లన్నిటియందును ఐకారము ఏగాను, ఔకారము ఓగాను మాఱు ననుట యంగీకరింపఁబడినది. కొన్ని యెడల ప్రాకృతములో ఐవర్ణము అ ఇ గాను, ఔవర్ణము అ ఉ గాను కూడ మాఱునని యంగీకరింపఁబడినది.[13]

ఉదా: వైరం-వేరం-వఇరం; ఐశ్వర్యం-ఆఇసరియం; సౌవర్చలం-సోవచ్చలం; కౌరవా=కఉరవా; పౌరుషం=పఉరిసం.

పైవానినిబట్టి యీ మార్పులు నిత్యమేకాని హేమచంద్రుని ప్రాకృతచంద్రికయందు ఐ ఔ లు ప్రాకృతమునను నున్నట్లు వ్రాయంబడినది.[14] ప్రాకృత వ్యాకరణములను, సారస్వతమును చక్కఁగా విమర్శించి గొప్ప వ్యాకరణమును వ్రాసిన పిషెల్ అను జర్మనుపండితుఁడు ఈ విషయము అప్రామాణికమని నిశ్చయించెను.[15] చండుని ప్రాకృతవ్యాకరణముననుగూడ 'ఐ ఔ' లు ప్రాకృతమున నున్నట్లు వ్రాయఁబడినది. ఇట్లు సందిగ్ధమైన యీ వర్ణములు ప్రాకృతములనుండి తెనుగు మొదలగు భాషలలోనికి వచ్చెననుట అసందర్భము.

ఇఁక సంస్కృతమునుండి వచ్చెననుటను విమర్శింపవలెను. అరవమునందున్న యీఅక్కరములకును, సంస్కృతముననున్న వీనికిని చాల భేదము కలదు. సంస్కృతమున నుండిన యీ రెండును అ ఇ, అ ఉ, అను నక్షరములవలన నేర్పడిన సంధ్యక్షరము లనియు, నందు మొదటి యర్ధమాత్ర అకారమును మిగిలిన $1\frac{1}{2}$ మాత్రయును వరుసగా ఇకార ఉకారములు ననుటయు ప్రాతిశాఖ్యాదుల మతము. ఔ=$\frac{1}{2}$ అ+$1\frac{1}{2}$ఉ; ఐ=$\frac{1}{2}$అ+$1\frac{1}{2}$ఇ.[16] ఇఁక అరవమునం దట్లనుటకు వీలులేదు. తొల్కాప్పియనారు ఐకారము అ+ఇ అనునట్లు సమముగా నగుననియు, అయ్ అని వానికి బదులుగా వచ్చుననియు వ్రాసెను. అట్లే

[13] చండ ప్రాకృతవ్యాకరణము. స్వర విధానము. సూ. 9-12. ఏదైతః; అ ఇ చ; ఓర్ ఔతః. అ ఉ చ. ప్రాకృత ప్రకాశము: భామహాకృతము-ప్రథమ పరిచ్ఛేదము 35, 36, 41, 42 సూ. ఐత=ఏత్; శైలః=సేలో; దైత్యాదిష్వఇ; దైత్యః=దఇచ్చో, ఔతఓత్; కౌముదీ=కోముఈ; పౌరాదిష్వఉ; పౌరః=పఉరో.

[14] హేమచంద్రుని ప్రాకృతచంద్రిక i-i కైతవ=కైఅవ; సౌదర్య=సౌఅరియ; కౌరవ=కౌలవ, కఉరవ, [15] జర్మన్ ప్రాకృతవ్యాకరణము. పిషెల్. విషయసంఖ్య 60—61 a. ఐదౌతౌచ కేషాంచి న్మతే భవత ఏవ—కైతవం=కైఅవం. చండప్రా. వ్యా. స్వర. 19 సూ.

[16] P. S. S. పు. 31, 32. అకారార్ధమ్ ఐకారౌకారయోరాదిః, ఇకారో అధ్యర్ధః పూర్వశేషః తైత్తి. ప్రా. ii —26, 28. ఐచోశ్చ ఉత్తరభూయస్త్వాత్ (పా. మహాభాష్యము. i—22, 18) సీతారామపండితీయము, విషయము 207.

ఔకారమును అ+ఉ అనువాని సమసంఘటననుబట్టి యేర్పడినదనియును, 'అవ్' అను నది దానికి బదులుగా వచ్చుననియు తొల్కాప్పియనారు చెప్పెను.[17]

సంస్కృతమునందు సంధిలో ఐ ఔలకు బదులుగా ఆయ్ ఆవ్ అనునవి (ఆకార ముతో వచ్చును) నై+అకః=నాయకః; పౌ+అకః=పావకః. ఇట్లుకాక తమిళమున ఐ ఔ ల స్థానమున హ్రస్వఅకారముతోడి యకార వకారములు వచ్చునని ముందు చెప్పితినిగదా! సౌఖ్యము = సవుక్కియము; ఔవై=అవ్వై; వౌవాల్ = వవ్వాల్ (గబ్బిలము).

ఇంకొక భేద మేమనఁగా సంస్కృతమునందలి 'అ ఆ' లు ఏతో గూడినప్పుడు సంధ్యక్షరముగా ఐకారము వచ్చును. తవ+ఏవ = తవైవ. అట్లే ఔకారము 'అ, ఓ' ల సంధివలన వచ్చుచున్నది. మమ + ఓతుః = మమౌతుః. అరవమునఁగాని, తెనుఁగునఁగాని యిట్టి స్వభావము ఐ ఔ లకు లేదు. పయి యచ్చులు కలిసినప్పుడు ఇట్టి సంధి యేర్పడదు. (అరవసంధి) అ+ఏ=అవే; ఆ+ఏ=ఆయే, ఆవే.

సంస్కృతమున నీ సంధ్యక్షరముల ప్రాచీనరూపములు 'ఆయ్, ఆవ్' అని యును, ద్రావిడభాషలలో 'అయ్, అవ్' అనియును అయియుండునని తోచుచున్నది.

కాని కాల్డ్వెల్లుగారు ఈ 'ఐ' అను వర్ణముయొక్క ప్రాచీనరూపము అరవ మున 'ఎయ్' అనియును, ఇది సంస్కృతోచ్చారణముతో కాలక్రమమున సమాన మయ్యెననియుఁ జెప్పుచున్నారు. ఈపక్షముననుగూడ ఇది సంస్కృతమునందలి ఐవర్ణముకంటె భిన్నమే యనక తప్పదు. ఇట్టి మార్పు ఒకప్పుడు వచ్చియుండి నచో తొల్కాప్పియనారుకాలమునకు అనగా క్రీస్తుశకము కొన్ని శతాబ్దములకు ముందే వచ్చియుండవలెను. వారి యూహకు యుక్తి యీ క్రింద నీయంబడినది.

| అరవము | మలయాళము | కన్నడము | తెలుఁగు |
|---|---|---|---|
| కడై | కడ | కడె | కడ |
| తలై | తల | తలె | తల |
| మునై | మొన | మొనె | మొన |
| కళై | కళ | కళె | కళ |

ఈ పయిపదములలో తుదినున్న యరవప్రత్యయము 'ఐ' అనునది. తమిళ ములో అకారాంతపదములు చాల స్వల్పము. తెనుఁగు, మలయాళముల తుది నున్న అకారాంతతయే ప్రాచీనద్రావిడమున నుండెననియు, నట్టి అకారము ఎకారమయి, ఎకారము ఎయ్ అను నుచ్చారణమున నుండెననియు నూహించుట యుక్తమును, వీనికి సమన్వయము కుదుర్చుచున్నదనియును వీరి యుద్దేశము.[18]

---

[17] అకర ఇకర మైకార మాకుమ్ (తొల్. ఎழு. 54) అకర త్తింబర్ యకరప్పుళ్ళియుమ్ ఐయెనెడుమ్ చినై మెయ్ పెరత్తోన్ఱుమ్. ఎழு. 56. సూ. P. S. S. పుట 30.

[18] C. G. D. పుట 136.

ఈ కల్పనకు ప్రతిబంధక మొక్కటియే కలదు. అరవము ద్రావిడభాష లన్నిటిలోను ప్రాచీనతమములయిన రూపములను గలిగియున్నదని కాల్డ్వెల్లుగారి యుద్దేశమే. అట్లయినచో ప్రాచీనోచ్చారణము అరవమునందలిదిగాని యితర మనుటకు వీలులేదుగదా! అంతియగాక తొల్కాప్పియనారు కాలమునం దీ యుచ్చారణ యుండియుండిన నాతఁడు వ్రాసియుండకపోఁడు. కాఁబట్టి 'నడై' అను రీతిని శబ్దముల తుదినున్న ఐకారము 'అయ్' అను రూపముతో నుండి (నడయ్) తుదినున్న యవర్ణము పోయి (నడ) అకారాంతరూపము రావచ్చును. తరువాత నది (నడె) ఎకారాంతరూపమును పొందియుండవచ్చును.[19] ఈ కల్పన యుక్తముగానే కన్పట్టు చున్నది. ఇంతకంటె స్వల్పముగా నీ కల్పనను మార్చి యిట్లు చెప్పుట యుక్తతరమని తోచుచున్నది. 'నడై' యను ప్రాచీనోచ్చారణము 'నడయ్' యని మాఱి, ఆ తరువాత కర్ణాటదేశమున 'నడెయ్' యని రూపాంతరము నంది, కాలక్రమమున రెండుస్థలములను యకారము లోపించి రూపములు స్థిరపడెనని యుఁ జెప్పవచ్చును. ఇంకొకవిధమయిన కల్పనయుఁ గలదు. తొల్కాప్పియనారు ఏకమాత్రాకమయిన ఐకారము కలదని స్పష్టముగా చెప్పియున్నాడు.[20] పదాంతమునందున్న ఐకారము కాలక్రమమున హ్రస్వమయి ఆ హ్రస్వ మొక మాండలికమయిన కర్ణాటమున 'ఎ'గాను తక్కిన తెనుఁగు, మలయాళములలో అకారముగాను మాఱిన దనవచ్చునని తోచు చున్నది. ఈ కుఱుచ ఐకారము కల పదములు.

ఐప్పసి మడై యాన్ కువళై

కుఱుచ ఐకార ముండినట్లే, కుఱుచ ఔకారముగూడ నున్నట్లు తొల్కాప్పియము వ్యాఖ్యాతలు వ్రాసిరి. తొల్కాప్పియమున ఈ విషయము స్పష్టముగాఁ జెప్పఁబడలేదు.

శబ్దరత్నాకరమునందు ఐ ఔ లు చాలవఱకును అయి, అవు అనువాని యొక్క రెండవరూపము లనియే వ్రాసియున్నారు. కన్నడమున నిఘంటువు వ్రాసిన కిట్టెలు గారుకూడ నీ యభిప్రాయమునే సూచించుచున్నారు. నేఁటి తెనుఁగు కన్నడముల యందు ఐ ఔ లకు బదులు అయ్, అయి, అవు అనునవి యాదేశముగా వచ్చుచున్నవి. కొన్నిస్థలములయందు అయి, అవు అనునవియే పూర్వరూపము లయినట్లును, ఐ ఔ లు తరువాతివిగా నున్నట్లును గనుపట్టుచున్నవి. ఉ. అగుము=అవుము. ఔము.[21] ఇట్లే కన్నడమునను, నేఁటి తమిళమునను కొన్నియెడల అయ్, అవ్‌లు ఐ ఔ లుగా మాఱినవనుట స్పష్టము.

పై విచారమునుండి తేలిన దేమనఁగా ప్రాచీనద్రావిడమున అనఁగా తొల్కాప్పియమునకు ముందే ద్రావిడభాషలలో

---

[19] P. S. S. పుట. 23 - 24. [20] ఓరళపెడుమ్ ఇడనుమ్ ఆరుండే, తేరుంగాలై మొழிవయినాన. తొ. ఎ. 57. [21] బా, వ్యా. క్రియా పరి. సూ. 97.

1. ఐ ఔ లు స్వతంత్రముగానే అనఁగా సంస్కృతసంబంధులు గాకుండగనే యుండినవి.

2. అవియును సంస్కృతమునందువలెనే సంధ్యక్షరములు లేక సంయుక్త స్వరములే యయినను దద్గతావయవముల యుచ్చారణకాలమునను, స్వభావమునను భేదము గలదు.

3. ఏకమాత్రాకములయిన ఐ ఔలు ద్రావిడమున నుండినవి.

4. నేఁటి తెనుఁగునఁ జాలవఱకు ఐ ఔలు తగ్గిపోయి వానిస్థానమున అయి, అవు లే వాడుకలో నున్నవి. ప్రాచీనములయిన ఐ ఔ లతో గూడిన తెనుఁగుపదము లత్యల్పములు. ఇంతకంటె వీనియొక్క ప్రభావము అరవమున నధికము. అరవమునఁ బహువచనాంతమున ఐవర్ణము ప్రథమాంతముగా బహుళముగాఁ గనుపట్టుచున్నది. ద్వితీయావిభక్తిప్రత్యయమును ఐవర్ణమే.

అం, అఁ. ఇవి యర్ధానుస్వార, పూర్ణానుస్వారములు. వీని చరిత్రము వేఱుచోట వివరింపఁబడును. పూర్ణానుస్వారము అరవమునతప్ప మిగిలిన ద్రావిడ భాషలయందు గలదు. అర్ధానుస్వారము తెనుఁగున విశేషము.

పైవిచారణవలన తేలిన సారాంశము: అ, ఇ, ఉ, ఎ, ఒ అను అయిదు హ్రస్వములును, వాని దీర్ఘరూపములును ప్రాచీనద్రావిడమునుండియే తెనుఁగునకు వచ్చినవి. ఐ, ఔ లు ప్రాచీనద్రావిడమున నెక్కువగాఁ బ్రచారములో నుండినవి. వాని ప్రచారము నేఁటి తెనుఁగునఁ జాలవఱకు నశించినది. హ్రస్వములయిన ఐ, ఔ లును (ఏకమాత్రాకములును), అర్ధమాత్రాకము లయిన ఇ, ఉ లును ప్రాచీనద్రావిడమున నుండినవి. నేఁటి తెనుఁగున నశించినవి. అర్ధానుస్వారము సంస్కృత ప్రాచీనద్రావిడ ములలో లేనిది తెనుఁగునఁ గొంతకాలమునకు మున్ను బయల్వెడలి కాలక్రమమున నుచ్చారణమున నద్దానికి స్థానము లేకపోఁగా నేఁటి తెనుఁగున నశించినది.

సంస్కృతముకంటె ప్రాచీనద్రావిడమున హ్రస్వములయిన ఐ, ఔ లును, అర్ధ మాత్రాకము లయిన ఇ, ఉ లును అధికములు. రెండుభాషలలోని ద్విమాత్రాకము లయిన ఐ, ఔ లును భిన్నములును స్వతంత్రములును. సంస్కృతముననున్న ఋ ౠ వర్ణములును, ఋవర్ణదీర్ఘమును ప్రాచీనద్రావిడమున లేవు. తెనుఁగునందు సంస్కృత శబ్దసంయోగమునఁ బ్రవేశించినవి. ఆ, ఏ లకు నడిమియుచ్చారణము గల య చ్చొకటి నేఁటి తెనుఁగున స్వతంత్రముగా నుత్పన్నమైనది. 'వచ్చాను' మొదలగు శబ్దములయం దది యున్నది.

# ముఖయంత్ర స్వభావము, ధ్వనుల యుచ్చారణ క్రమము

## 1. వాగుత్పత్తి విధానము

1. Nasal Orifice నాసికాద్వారము
2. Nasal Cavity నాసికాంతర్భాగము
3. Wind pipe శ్వాసనాళిక
4. Larynx కృకాగ్రము
5. Epiglottis ఉపజిహ్వ
6. Pharynx గళాగ్రభాగము
7. Uvula లంబిక
8. Tongue Back జిహ్వామూలము
9. ,, Front జిహ్వామధ్యము
10. ,, Blade with Tip జిహ్వాగ్రము
11. The Soft Palate మృదుతాలువు
12. The hard Palate కఠినతాలువు
13. Teeth Ridge దంతమూలము
14. Teeth Front దంతాగ్రము
15. Lips ఓష్ఠములు
16. Food pipe ఆహారనాళిక



ముఖయంత్రము

అర్థవంతములయి మనుజులు మాటాడు శబ్దములు కొన్ని ధ్వనులకూడిక వలన నేర్పడినవి. ఈ ధ్వను లేర్పడుటకు ముఖము అనఁగా నోరును, అందుండి బయల్వెడలు గాలియును (శ్వాసమును) ముఖ్యహేతువులు. అట్టి శ్వాసము లేనిచో మాటయే రాదు. నోరును, నోటియందలి భిన్నభాగములును పనిచేయనపుడు శబ్దమే కలుగదని వేఱ చెప్పనక్కఱలేదు. అట్లు నోరు మూసికొన్ననుగూడ నొకవిధమయిన యోంక్రింపు, గూంక్రింపు మొదలగునవి కలుగునుగాని యవి భాషాంగములు గాకుండుట వాని కిట ప్రసక్తిలేదు.

నాసికారంధ్రములనుండి పీల్చిన వాయువు సాధారణముగా ఆరోగ్యవంతునియందు నిశ్శబ్దముగానే చరించును. అనఁగా ఉచ్ఛ్వాస నిశ్వాసములలో ధ్వని యుప్పతిల్లదు. జలుబుచేసినప్పుడుగాని, నిద్రలో గుఱక బయలుదేరునపుడు గాని వాయుప్రసారమున కవరోధము కలుగుటచే నట్టిధ్వని యుప్పతిల్లుచుండును. నిద్రలో శరీరమునందలి యవయవములన్నియు సడలియుండుటవలన మృదుతాలువు గూడ సడలియే యుండును. అట్టియెడ లోపలికి గాలి పీల్చునపుడెల్లను దానివలన గలిగిన యవరోధముచేతనే గుఱక ఉప్పతిల్లుచుండును. గాలి విడుచునప్పుడు శమించుచుండును. కాఁబట్టి గుఱకలు వ్యవహితముగా వచ్చుచుండును. నోటిలో నుండి యాహారమును మ్రింగునపుడు ఉపజిహ్వ యనునది శ్వాసనాళికాభాగము పయిఁ బడి పూర్తిగా దానిని మూసివేయును. అప్పుడు ఆహారనాళిక తెఱచుకొని దానిలోని కాహారముగాని, జలముగాని పోవుచుండును. ఏదైన మ్రింగునపుడు ఈ ఉపజిహ్వ సరిగా మూసికొనకపోయినచో మనము ఉక్కిరిబిక్కిరి యగుదుము. దీనినే పలమారుట యందుము. శ్వాసనాళికలోనికి ద్రవ ఘనపదార్థములు పోరాదు. మనము ఊరకే గుటకవేసి, మ్రింగక మూఁతపడిన యుపజిహ్వక నట్లే యుంచినచో నూపిరాడదని తెలిసికొనవచ్చును. ఇట్లగుటకు హేతువు శ్వాసనాళిక మూతపడుటయే యని యెఱుఁగవచ్చును. నాసికాద్వారములోనికి మనము పీల్చు వాయువు అట్లే గళాగ్రభాగమునఁ బడి శ్వాసనాళికగుండా ఊపిరితిత్తులలోనికి బోవును. ఇది ఊపిరి పీల్చు విధానము. ఊపిరి విడుచు విధానము దీనికి వ్యతిరిక్తమయినది. కృకాగ్రమునుండి పయిభాగమునను్న యవయవముల రూపమును గొంత మాఱుపఱచి శ్వాసమును విడిచినచో శబ్దావయవమయిన ధ్వనిని గలిగింపవచ్చును. ఉచ్చారణాంగములయిన పయి యవయవములయొక్క వాయుసంఘర్షణము (ఒరపిడి) వలన నిరోధము, లేక తాత్కాలిక స్తంభనము గలిగి యీ ధ్వనులు జనియించుచుండును.

కృకాగ్రమునందు నాదతంత్రులు (Vocal chords) అను పేరుగల చర్మముల జంట గలదు. వీనిని మూయుటగాని, బిగించి నిలుపుటగాని, సడలించుటగాని స్వేచ్ఛాప్రయత్నమున జరుగగలదు. వానిని బిగించినచో శ్వాసనాళికనుండి బయలువెడలు ఉచ్ఛ్వాసము వానిని చలింపఁజేయును. మనము బూరాపీకలో నుండి యూదునప్పుడు శబ్ద మెట్లు బయలువెడలునో యట్లే యీ నాదతంత్రుల చలనమున 'నాదము' అననగు ధ్వనివిశేషము ఉప్పతిల్లును. అనఁగా శబ్దాంగమయిన యీ ధ్వని మొట్టమొదట నీ నాదతంత్రులలో గలుగు నన్నమాట. అట్లు బయలువెడలిన నాదయుక్తమయిన లేక నాదరహితమైన వాయువు నోటినుండిగాని ముక్కునుండిగాని లేక రెంటినుండిగాని వెడలును. అప్పుడు నోటియందలి భిన్న భాగములయొక్క ప్రయత్నములవలన భిన్నములయిన యక్షరసంజ్ఞలు గల ధ్వనులుత్పన్నమగును.

## 2. స్వర వ్యంజన భేదము

ఈ ధ్వనులు స్వరములు, వ్యంజనములు అనురీతిని రెండువిధములుగా విభజింపఁబడినవి. వీనినే అచ్చులు లేక హల్లులు అనికూడ వ్యవహరించుచున్నాము. ఈ రెండుజాతుల ధ్వనులకును గల భేద మేమి యని ప్రశ్నింపవలసినది. అచ్చులు, హల్లులు అను భేదము పాణినిచేఁ జేయఁబడిన ప్రత్యాహారసంజ్ఞలవలన నేర్పడినదని ముందు పేర్కొంటిని. "స్వయముగా ప్రకాశించునది అనగా నితరాపేక్ష లేక యుచ్చరింపఁదగి యుండునది స్వర మనఁబడును. లేదా యుదాత్తాది స్వరములతో ధ్వనించునదిగాన స్వర మనఁబడును. అచ్చుల సాహాయ్యమున వ్యక్తములగు ననఁగా నుచ్చరింపఁబడును గాన హల్లులు వ్యంజనములు అను సార్థకనామమును బడయుచున్నవి."[1] ఈ వాక్యములనుబట్టి స్వతంత్రోచ్చార్యత్వమే స్వరముల విశేషమనియు, నది లేకుండుటయే వ్యంజనముల వ్యంజనత్వమనియు స్పష్టపడుచున్నది.

ఇఁక నేఁటి ఆంగ్లేయపద్ధతి నున్న (Vowel) వొవెల్, (Consonant) కాన్సొనెంట్ అను పదములకు సమానమైన పదములనుగా స్వర వ్యంజనము లను అచ్చు హల్లులను వాడుచున్నారు. ఆంగ్లశబ్దశాస్త్రము ననుసరించి అచ్చులక్షణ మేమనగా "నాదాత్మకమయి నోటియందుగాని, ముక్కునోళ్లనుగాని నిరోధములేకయే వెడలు నుచ్ఛ్వాసము గలిగినట్టియు, వినదగిన యొఱపిడి లేనట్టియు ధ్వని"[2] మిగిలినవన్నియును వ్యంజనములు (Consonants). "పూర్తిగాగాని కొంతవఱకుగాని కృకాగ్రము నుండి మీదిభాగమున నెచ్చటనైనను వినదగిన యొరపిడిగాని, సశబ్దస్ఫోటనము (ప్రేలుట) గాని గలిగి నాదాత్మకముగాగాని నాదవిరహితముగాగాని యుండునట్టి ధ్వనులు హల్లులు" అని నిర్వచింపఁబడినవి.[3] అనగా కృకాగ్రమునుండి బయలు వెడలిన వాయువు నోటిలో నొకచోట నిరోధింపఁబడి తటాలున విడివడుట వలనగాని, మెల్లని యొరపిడి గలుగునట్లు విడివడుటవలనగాని హల్లు లేర్పడును. పవర్ణోచ్చారణమును బరీక్షించినచో పెదవులు మూయుటచే పూరింపఁబడిన వాయువు ఒక్కసారిగా వెలువడి స్ఫోటనము గలుగుచున్నట్లు స్పష్టమగును. పవర్గమంతయును ఇట్లు ఓష్ఠప్రయత్నమునఁ గలుగుటచేతనే యోష్ఠజ మనఁబడుచున్నది. ఈ వ్యంజనోచ్చారణమున మూఁడుభాగములు గలవు. 1. నిరోధము,

---

[1] ఉపరిస్థాయినా తేన వ్యంగ్యం వ్యంజన ముచ్యతే." తైత్తి. 1. అధ్యా. 5-6. సూ. వ్యా. మణివద్ వ్యంజనం విద్యాత్ సూత్రవచ్చ స్వరం విదుః. శిక్షాసంగ్రహము 436 పుట. స్వయం రాజన్తే స్వరా, అన్వగ్భవతి వ్యంజనమితి, పాణిని. పుట 156. సి. పం. స్వయం రాజన్తే నాన్యేన వ్యజ్యంత ఇతి స్వరాః-పరేణ వ్యజ్యత ఇతి వ్యంజనమ్-యస్స్వయం రాజతే తం తు స్వర మాహ పతంజలిః.

[2] "A voiced sound accompanied by a free passage of air through the mouth and not producing audible friction" Daniel Jones: *English Phonetics*. page 11. [3] *General Phonetics*: Noel Armfield. Page 8.

2. స్తంభనము, 3. స్ఫోటనము. 'శ ష స 'ల నుచ్చరించునపుడు ఇట్లొక్కసారిగా వాయువు స్ఫోటనమును బొందక ఒరపిడివలన నెమ్మదిగా బయటికి వెడలుచున్నట్లు కనిపెట్టనగును.

హల్లులలో నైదువర్గములు గలవు. కవర్గమంతయుఁ గంఠ్యమనియు, చవర్గము తాలవ్యమనియు, టవర్గము మూర్ధన్యమనియు, తవర్గము దంత్యమనియు, పవర్గము ఓష్ఠజమనియు శబ్దవిదులు కనిపెట్టిరి. కవర్గము నుచ్చరించునపుడు వాయువు మృదుతాలువు వెనుక కంఠమున స్తంభింపఁబడును. అట్లే చవర్గమునకు తాలువువలనను, టవర్గమునకు మూర్ధమునను, తవర్గమునకు దంతమూలమునను, పవర్గమునకు ఓష్ఠములయెడను వాయునిరోధము గలిగి యా ధ్వను లుత్పత్తిల్లుచుండును. కావుననే వీనికి వరుసగాఁ బయిపేళ్లు ఉపయుక్తము లయియున్నవి. కచటతప లైదును పరుషము లనఁబడుచున్నవి. వీనియందు నాదము లేదు. అనగా వీని యుచ్చారణమున కృకాగ్రమునుండి వెలువడిన వాయువు దానియందలి తంత్రులను జలింపఁజేయదని భావము. అట్లు వీనిని నాదవంతములుగాఁ జేసినచో వరుసగా 'గజడదబ' లు గలుగును. ఈ రెండువిధములయిన వానిని ఒత్తి ఉచ్చరించినచో 'ఖ ఛ ఠ థ ఫ', 'ఘ ఝ ఢ ధ భ' యను రెండుజాతుల యక్కరములు గలుగును. వీనినే మహాప్రాణము లని పూర్వులు వ్యవహరించిరి. తుదినున్న 'ఙ ఞ ణ న మ' లు అనునాసికము లని చెప్పఁబడును. వీని యుచ్చారణమున వాయువు నాసికనుండిగూడ వెలువడును. ముఖనాసికావచనములు గావుననే యివి యనునాసికములు. కాఁబట్టి ప్రతివర్గమునందును మొదటి రెండక్కరములును శ్వాసాత్మకములు, తక్కినవి మూఁడును నాదాత్మకములు. అట్లే రెండవదియు, నాల్గవదియు మహాప్రాణములు. తుదివి యైదును అనునాసికములు.

శ ష స లు ఊష్మము లందురు (Sibilants). వీనిని ఉచ్చరించునపుడు వాయువు ఒరపిడివలన మెలమెల్లగ వెలువడును. ఇందు 'శ' వర్ణము తాలవ్యము. 'ష' వర్ణము మూర్ధన్యము. 'స' వర్ణము దంత్యము. అనఁగా నా యా స్థానములందు వాయువు నిరోధింపఁబడి మెలమెల్లన వెడలింపఁబడును. 'య ర ల వ' లు అంతస్థము లని వ్యవహరింపఁబడినవి. "ఇవి స్పర్శములకును (వర్గాక్షరములు) శ ష సాదులగు ఊష్మములకును నడుమను బఠింపఁబడును గావున వీని కంఠస్థము లను పేరు వచ్చినది."[4] వీనిని పాశ్చాత్యులు "Semi vowels" అని వ్యవహరించుచున్నారు. అనఁగా అచ్చులకును, హల్లులకును నడిమిధర్మములు గలవని భావము. దీని కింకొకవిధమైన వ్యుత్పత్తియు గూడఁ జెప్పఁబడుచున్నది. జిహ్వాయొక్క యంతభాగము, ఆ యా

[4] స్పర్శోష్మణామంతః మధ్యేతిష్టంతీతి అంతస్థాః. ఋ. ప్రాతి. పార్ష. వ్యా. 24 పుట, సీతారామపండితీయము పుట 154.

స్థానములను అనగా తాలు, మూర్ధ, దంతమూల, ఓష్ఠములను స్పృశించుచున్నది గనుక అంతస్థము లనఁబడుచున్నవి.[5]

## 3. స్థాన కరణ నిరూపణము

పయిరీతిని నిరూపించిన ధ్వనులన్నిటి యుచ్చారణమునను వాయువు ముఖము నుండి వెడలునపుడు రెండు అవయవముల కూడిక గలుగవలసివచ్చుచునే యున్నది. ఆ రెండు అవయవములలో నొకదానికి స్థానమనియు, రెండవదానికి కరణమనియు వ్యవహారము. ''ఏయవయవమునం దవయవాంతరము యొక్క స్పర్శనము కలుగునో యా యవయవము హల్లులకు స్థానము. ఏయవయవము అవయవాంతర మును స్పృశించునట్లు చేయఁబడునో యా యవయవము హల్లులకుఁ గరణము. చవర్గోచ్చారణమునఁ దాలువు మధ్యమున జిహ్వామధ్యము యొక్క స్పర్శము సంభవించును. కావున చవర్గమునకు స్థానము తాలువు. జిహ్వామధ్యము కరణము.''[6] ఇట్లే హల్లు లన్నిటికిని నిరూపింపనగును. కవర్గమునకు జిహ్వామూలము కరణము, మృదుతాలువు స్థానము.

కవర్గము నుచ్చరించునపుడు జిహ్వామూలమునకు అంగిటియొక్క (మృదు తాలువుయొక్క) తుదిభాగమున స్పర్శకలుగుచున్నది. అట్లు కలుగుటవలన ఊపిరి నిరుద్ధమయి స్తంభనము, స్ఫోటనము క్రమమున జరిగి యీ ధ్వను లుప్పతిల్లు చున్నవి. ఈ కవర్గమును పాశ్చాత్యులు (Velars) అనఁగా తాలవ్యము లనియే వ్యవహరింతురు. (Velum) అనగా మృదుతాలువు. చవర్గమునుగూడ తాలవ్యము లనవలసినచో 'క' వర్గమునకును 'చ' వర్గమునకును గల భేదమేమి యని యడుగ వచ్చును. చవర్గము జిహ్వామధ్యమునకును కఠినతాలువునకును గలుగు స్పర్శము వలన నుప్పతిల్లును. కవర్గము మృదుతాలువునకును జిహ్వామూలమునకును జరుగు స్పర్శవలనఁ బుట్టును. ఇదియే భేదము. 'క' వర్గము కంఠ్యమని సిద్ధాంత కౌముది.[7] కవర్గమునకు హనుమూలములు స్థానములనియు, జిహ్వామూలము కరణమనియు

---

[5] ఏవం యకారాదీనాం చతుర్ణాం కరణాంత వ్యాపార నిష్పాద్యత్వాత్ అంతస్థా ఇత్యాఖ్యాయంతే '' తై. త్తి. ప్రాతి. 2 అధ్యా. 43 సూ. సీ. వం. పుట 155.

[6] య దుపసంహరతి త త్కరణమ్. (తై. త్తి. ప్రా. 2. అధ్యా. 32. సూ.) య దంగ మంగాంతరే వక్త్రే ఉపసంహ్రియతే తత్ స్వరాణాం కరణమ్—యథా ఓష్ఠావ వర్ణస్య. యేన స్పర్శయతి త త్కరణమ్. (తై. త్తి. ప్రా. 2. అధ్యా. 34. సూ.) వ్యంజనానాం తత్కరణమ్ యేన అంగేన స్థానం స్పర్శయతి యథా కవర్గాదీనాం చతుర్ణాం వర్ణానాం యరలవానాంచ. అధరోష్ఠం పవర్గ వకారయోః."

[7] అకుహ విసర్జనీయానాం కంఠః. సి. కౌముది.

ప్రాతిశాఖ్యము.[8] హనుమూలమనగా హనువులయొక్క మూలమని భావము. హనువు అనగా దౌడ. ఈ భాగమునే ఆంగ్లమర్యాదను (Soft Palate) మృదు తాలువు అని వ్యవహరింతురు. ఇది దవడలయొక్క లోపలిది అనఁగా కంఠములోని భాగము. కంఠ్య మనుటచే కంఠభవము అను భావము స్ఫురించుచున్నది. కంఠ శబ్దముచే నిచ్చట నీ భాగమే యుద్దేశింపఁబడినదని యూహింపనగును. ఈ క్రింది వాక్యములు ప్రాచీనుల మతమున నున్న యవయవవిభజనమును నిరూపించు చున్నవి. "జిహ్వామూలము మొదలుగ నోష్ఠమువఱకు నున్న వక్త్రముల కిరు పార్శ్వముల నావరించియున్న దౌడల భాగమునకు హనువులని పేరు. జిహ్వాకు మీదుగా నుండెడు భాగమెల్లఁ దాలు వనఁబడును. అందలి గోళాకారమగు తాలు భాగము మూర్ధ మనఁబడును. మూర్ధమునకు దిగువను దంతమూలమునకు మీదు గను నుండెడి ప్రదేశము వర్త్స్యమనఁబడును. దానికి మీదుగను మూర్ధమునకు దిగువగను నుండెడి చోటు బర్స్వమనఁబడును."[9] అనఁగా నోటి పైభాగము వరుసగా 1. దన్తమూలము. 2. వర్త్స్యము (దన్తమూలము తరువాత నున్న యెత్తయిన ప్రదేశము). 3. తాలువు 4. బర్స్వము. 5. మూర్ధము. 6. హను మూలము, అనునట్లుగా విభజింపఁబడినదని యర్థము.

టవర్గము నుచ్చరించునపుడు జిహ్వాగ్రము వెనుకకుఁబోయి నాలుక మడత పడి అట్టి యగ్రము నోటి పయిభాగమగు మూర్ధమును దాకి ఆ పయిని వాయు స్ఫోటనమును గలిగించుట జరుగుచున్నది. కావుననే వీనిని మూర్ధన్యము లనిరి. జిహ్వాగ్రము కరణము, మూర్ధము స్థానము.

తవర్గము జిహ్వాగ్రమును దన్తమూలమును కరణస్థానములుగా నేర్పడుచున్నది. జిహ్వాగ్రముయొక్క నిరోధమువలన (దన్తమూలమున) వాయువు స్తంభించు చున్నది.

పవర్గము. ఇది ఓష్ఠజము. రెండు పెదవులను మూసికొని విప్పుటచే నిందు వాయువునకు స్ఫోటన మేర్పడుచున్నది. మీది పెదవి స్థానము, క్రింది పెదవి కర ణము. ఈ వర్గాక్షరము లన్నిటికిని స్పర్శముఁలని పేరు. స్థాన కరణ స్పర్శమువలనఁ గలుగునవి.

'య వ ర ల' లు అంతస్థము లనియు, 'శ ష స హ' లు ఊష్మము లనియు వ్యవహృతము లగుచున్నవి. అంతస్థముల స్వరూపమును ముందు వివరించితిని. 'ఊష్మము' అనఁగా వాయువు. ఇది మెల్లగా కొంచెమయిన యొరపిడితో శ ష స ల యుచ్చారణమున వెలువడును. 'య శ' లు తాలవ్యములు. 'ర ష లు

[8] హనుమూలే జిహ్వామూలేన కవర్గే స్పర్శయతి. తైత్తి. ప్రా. 2. అ. సూ. 35.

[9] "వర్త్స్య శబ్దేన దన్తమూలా దుపరిష్టా దుచ్ఛూనః ప్రదేశ ఉచ్యతే" ఋ. ప్రా. 1. బర్స్వానామ రేఫ టకారస్థానయో ర్మధ్యప్రదేశః. సీతా. పం. పు. 147.

మూర్ధన్యములు, ల స ' లు దంత్యములు. 'వ' కారము దంతోష్ఠజము. క్రింది పెదవి మీదిదంతాగ్రములను తాకుటవలన నిది కలుగును. హాకారము నుచ్చరించు నపుడు వాయు వేయడ్డంకియు లేక యొక్కసారిగా నోటినుండి వెలువడును.

పయివిషయము లన్నియును ప్రాతిశాఖ్యలయందును, శిక్షలయందును ప్రపంచింపఁబడినవి. చాలమందికి సులభమును, బఠనీయము నగు సిద్ధాంత కౌముది యందలి విషయ మీక్రింద వ్రాయఁబడుచున్నది.

[ అకుహ విసర్జనీయానాం కంఠః। ఇచుయశానాం తాలు। ఋటురషాణాం మూర్ధా। ఌతులసానాం దన్తాః। ఉపూపధ్మానీయానా మోష్ఠౌ। ఞమఙణనానాం నాసికా చ। ఏదైతోః కంఠతాలు। ఓదౌతోః కంఠోష్ఠమ్। వకారస్య దన్తోష్ఠమ్। జిహ్వామూలీయస్య జిహ్వామూలమ్। నాసికా అనుస్వారస్య। ఇతి స్థానాని.[10] ] పయి వాక్యముల కర్థము ముందు వివరింపబడుటను, స్పష్టమగుటను వ్రాయబడ లేదు. 'కుచుటుతుపు ' అను నక్షరము లా యా వర్గాక్షరముల కన్నిటికిని సంజ్ఞలు. విసర్జనీయము సంస్కృతమునందలి విసర్గము ః గుర్తుగా గలది. జిహ్వామూలీయము క, ఖ లకు ముందుండు విసర్గము. ఉపధ్మానీయము ప ఫ లకు ముందుండు విసర్గము.

## 4. ఆభ్యంతర ప్రయతనము

పయి ధ్వనుల నుచ్చరించునపుడు జరుగు ప్రయత్నము రెండువిధములు. 1 ఆభ్యంతరము. 2 బాహ్యము. ఆభ్యంతరము నాలుగు విధములు. 1 స్పృష్టము. 2 ఈషత్స్పృష్టము. 3 వివృతము. 4 సంవృతము. బాహ్యము 11 తెఱఁగులు. 1 వివారము. 2 సంవారము. 3 శ్వాసము. 4 నాదము. 5 ఘోషము. 6 అఘోషము. 7 అల్పప్రాణము. 8 మహాప్రాణము. 9 ఉదాత్తము. 10 అనుదాత్తము. 11 స్వరితము. ఈ బాహ్యప్రయత్నములకును, ఆభ్యంతర ప్రయత్నములకును భేద మిట్లు చెప్పఁబడినది : "వక్త్రమునకు బహిర్భాగమున జరుపఁబడు ప్రయత్నములు బాహ్యప్రయత్నములు. వక్త్రాభ్యంతరమున అనగా వక్త్రమధ్యమున జరుపఁబడు ప్రయత్న మాభ్యంతరప్రయత్న మనంబడును. అయ్యది అస్థిత స్థాన కరణ స్పర్శనాది రూప మయియుండును"[11]. ఇచ్చట వక్త్రమనఁగా ఓష్ఠప్రభృతిక జిహ్వామూలావధిక ప్రదేశమని భావము. అస్థిత మనఁగా స్థిరముకాదని భావము.

ఆభ్యంతరప్రయత్నములయందు స్థాన కరణములకు సన్నికర్ష జరుగును. ఈ సన్నికర్షము యొక్క స్వభావమే నాలుగువిధములుగాఁ జెప్పఁబడినది. 1 స్పృష్టము. స్పృశ్ ధాతువుకంటె తప్రత్యయము. ఇందు స్థాన కరణములకు సంపూర్ణమయిన స్పర్శ కలిగి వాయువు నిరోధింపఁబడి వెడలును. ఇది స్పర్శలు అను అన్వర్థసంజ్ఞ

[10] సి. కౌముది. పరిభాషాప్రకరణము. [11] సీతా. వం. పుట 148.

గల 25 వర్గాక్షరములకుఁ జెల్లును. ఇందు వాయుస్ఫోటనము కొన్నిటికి జరుగును. అట్టివానిని పాశ్చాత్యులు "Plosives" అనిరి. (తత్ర స్పృష్టం ప్రయతనం స్పర్శానామ్).

2. ఈషత్స్పృష్టము. ఈషత్తు అనఁగా కొంచెము అని యర్థము. దీనినే దుఃస్పృష్టమనియు వ్యవహరించుచున్నారు. (దుఃస్పృష్ట మీషత్స్పృష్ట మి త్యర్థః) అంతస్థము లనఁబడు 'య ర ల వ' ల కీ ప్రయత్నము గలదు. వీని నుచ్చరించునపుడు స్థాన కరణములకుఁ గల స్పర్శము కాదులలోవలె గాక యల్పముగా నున్నది. ఇవి ఈషద్వివృతము లనికూడ చెప్పఁబడినది.

3. వివృతము. వివృత మూష్మణాం స్వరాణాం చ. శ ష స హ లకును, అచ్చులకును వివృతమని యర్థము. వివృతము అనఁగా తెఱచుకొనియుండుట. "అచ్చుల యుచ్చారణమునందు జిహ్వాదిభాగములు తాల్వాదిస్థానముల నించుకేనియు స్పృశింపక సన్నిహితములై మాత్ర ముండుటచేత నప్పుడు వక్త్రము వివృతమై (తెఱవబడి) యుండును గాన నట్టి స్వరోచ్చారణప్రయత్నమునకు వివృతసంజ్ఞ కలిగినది."[13] ఇక్కడ వివృతత్వము స్థాన కరణముల సంయోగమున కని యర్థము. అనఁగా 'ఇ' అను స్వరము తాలవ్యమగుట తాలు జిహ్వామధ్యభాగముల కూడికవలనఁ గలుగుచున్నదనుట స్పష్టము. ఈ రెండును గూడునప్పుడు తాలవ్యమగు చవర్గోచ్చారణమునందువలె వాయువు పూర్తిగ బంధింపఁబడునట్లు మూసికొనియుండదు. కావుననే పాశ్చాత్యులు అచ్చునకు లక్షణము చెప్పునపుడు నాదాత్మకమైనదియు, నిరోధము లేక వెడలునట్టిదియు నని చెప్పిరి. ఈ స్థాన కరణముల నడుమనుండి వాయువు ప్రసరించుచునే యుండును. 'శ ష స హ' ల ప్రయత్నమును వివృతమే. అయినను ఇందు వాయువునకు ఆ యా స్థాన కరణములతో ఒరపిడి (Friction) గలదు. వాయువు వెడలుచున్నట్లు తెలియగలదు. కావుననే వీనికి ఊష్మము లని పేరు. (ఊష్మము = వాయువు). ఏకస్థానజములును, భిన్నప్రయత్నభవములును నయిన 'ఇ చ శ య' లను ఉచ్చరించునపుడు గలుగు ప్రయత్నమును వరుసగా పరీక్షచేసికొనినచో నీ ప్రయత్న భేదము బోధపడును.

4. సంవృతము—ఇది వివృతముకంటె భిన్నమయినదనుట స్పష్టము. పయి నుదాహరింపఁబడిన ప్రమాణము ననుసరించి స్థాన కరణములకు దూరావస్థితి వివృతమనియు, సమీపావస్థితి సంవృతమనియు నిర్ణీతమయినది. స్వరస్వభావము ననుసరించి వానికి వివృతమే ప్రయత్నము. "అవర్ణస్య ప్రయోగే సంవృతమ్ ; ప్రక్రియాదశాయాంతు వివృతమేవ" అను కౌముదీవచనము ననుసరించి హ్రస్వమయిన అకారము

---

[13] సి. పం. పుట 153. లఘుశబ్దేందుశేఖరము. సంజ్ఞాప్రకరణము. పుట 37. కాశీముద్రణము. స్పృష్టాదీనామ్ ఆభ్యంతరత్వంతు ఓష్ఠప్రభృతి కాకలక పర్యంతరూప ఆస్యాంతర్గత తత్తత్ స్థానేషు జిహ్వాదీనాం స్పర్శః. ఈషత్స్పర్శ దూరావస్థాన సమీపావస్థాన రూప అభ్యంతరకార్య కారిత్వాత్ వర్ణోత్పత్త్యవ్యవహిత ప్రాగ్భావిత్వాచ్చ బోధ్యమ్.

నుచ్చరించునపుడు స్థాన కరణములకు సమీపావస్థితి. వివృతమైన అకారముకూడ అంగీకరింపఁబడినది. పయిని జెప్పఁబడినట్లు శాస్త్రప్రక్రియామాత్రమునకుగాక వివృత మయిన అకారమునుగూడ పలుకవచ్చునని మనము అనుభవమువలనఁ గనుగొననగును.

'య ర ల వ' లు ఈషత్స్పృష్టములు, ఈషద్వివృతములు నగుటవలన Semi vowels అనఁబడినవి. అచ్చులు వివృతప్రయతనము గలవి. ఏ ఓ లు వివృత తరము లనియు, ఐ ఔ లు వివృతతమము లనియు వ్యవహరింపఁబడినవి. ఊష్మముల యందు అంతస్థములకంటె అధికవివృతత్వ మున్నను అధికతరస్పర్శముగూడ నుండుట వలన నవి వ్యంజనములే యయినవిగాని Semi vowels అనఁబడలేదు.

## 5. బాహ్య ప్రయతనము

బాహ్యప్రయత్న విషయమున గొంత సందిగ్ధత కలదు. అయినను వీలయి నంతవఱకు వీనిని పాశ్చాత్యపద్ధతితో సమన్వయించి వివరించుచున్నాను.

1, 2. వివార సంవారములు. ఈ రెండు పదములును ఆభ్యంతర ప్రయత్న ములయందలి వివృత, సంవృత శబ్దములవలెనే 'వివృ', 'సంవృ' అను ధాతురూపముల నుండి యేర్పడినవే. ప్రత్యయములుమాత్రమే భిన్నములు. అర్థమును ఒక్కటే. వివృత సంవృతత్వములు స్థాన కరణ సంయోగస్వభావమును నిరూపించుచున్న దనవచ్చునని వ్రాసితిని. ఇందలి వివార సంవారములు కంఠమునందు అనఁగా కృకాగ్రమునందలి నాడీతంత్రులలోని ద్వారమున కని యర్థము. ఆ తంత్రులకు (Vocal Chords) సడలుట యేర్పడినప్పుడు (వివారము) అవి చలింపవు. వాయువు అల్లే వచ్చును. నాదము (Voice) కలుగదు. శ్వాసముమాత్రమే వచ్చును. సంవారము అనఁగా మూసివేయుట లేక బిగించుట. ఇది జరిగినప్పుడు నాదము (Voice) కలుగును.

3, 4. శ్వాస నాదములు. ఈ రెండును బయి నాడీతంత్రులను వివృత సంవృత ములుగా జేయునప్పుడు కలుగు కార్యములు.[14] అట్లయినచో వీనిని ప్రయతనములనుగా నేల చెప్పవలయును ? కేవలము ధ్వనిధర్మములుగా నేల చెప్పరా దని సంశయము కలుగక తప్పదు. కాని పై భేదమును జెప్పుటవలన క్రిందియవస్థ యూహింపఁదగినది.

[14]వాయుః ప్రాణః కోష్ఠ్యమనుప్రదానం కంఠస్య ఖే వివృతే సంవృతేవా। ఆపద్యతే శ్వాసతాం నాదతాంవా వక్త్రీహాయామ్. ఋ. ప్రా. ప. 13 సూ. వ్యాఖ్య. 'కంఠస్య గ్రీవా యాః ఖే గలస్య బిలే ఛిద్రే। వివృతే విపులే విశాలే మహతి। సంవృతే సంకుచితే సంశ్లిష్టే అల్పేవా సతి ఆపద్యతే శ్వాసతాం శ్వాసత్వం। నాదతాం నాదత్వం వా। వక్త్రీహాయాం। ఈహా చేష్టా। వక్తు రీహా వక్త్రీహా। తస్యాం వక్త్రీహాయాం స వాయుః కంఠబిలే వివృతే శ్వాసత్వ మాపద్యతే। సంవృతే నాదత్వమ్॥

వివార సంవారములు కంఠబిలముయొక్క వివరణ సంవరణమాత్రములు. తరువాత నందుండి వాయువును బంపు ప్రయత్నమునకు శ్వాస నాదము అని పేరు. శ్వాసము అనఁగా బయటికి గాలి నడ్డములేక విడిచిపెట్టు పద్ధతి. నాదము అనఁగా అట్లుగాక అడ్డు కల్పించి ఊపిరిని విడుచుట. కంఠబిలముయొక్క ఈ రెండు భిన్నావస్థలలోను భిన్నప్రయత్నము గావలయునని పూర్వుల యభిప్రాయమని తోచుచున్నది.

5, 6. అఘోషము, ఘోషము. ఇవియును బయి రెండు జంటలకును సంబంధించినవియే. నాడీతంత్రులలో గలుగు సంచలనమునకును, తదభావమునకును ఈ సంజ్ఞలు ఉంచబడినవయి యుండవచ్చును. వివార శ్వాసాఘోషము లొక్క చోటను, సంవార నాదఘోషము లొక్కయెడను గలుగును. కావుననే సిద్ధాంత కౌముదియందు 'ఖ ఫ ఛ ఠ థ చ ట త క ప' లను, 'శ ష స' లను శ్వాస ప్రయత్నము గలవియును, ఘోషము లేనివియు, కంఠబిలమును వివరించునవియు నని చెప్పియున్నాడు. ఆఙ్గ్లమర్యాద ననుసరించి యివి యెల్లను 'Unvoiced' అనగా నాదాత్మకత లేనివి. పయి మూఁడువిధములయిన భేదములను పాశ్చాత్యులు అంగీకరింపలేదు. అట్లే 'సంవార నాద ఘోషములు' మూఁడును ఒక 'Voice' అను పదముచేతనే గతార్థము లగుచున్నవి. పయిని చెప్పఁబడిన 'ఖ ఫ' మొదలయిన వానికంటె నితరములయినవి ఘోషములు, సంవృతములు, నాదవంతములు అని కౌముదీకారుని వచనము.[15]

7, 8. అల్పప్రాణము, మహాప్రాణము. ప్రాణ మనఁగా వాయువు. అల్పమగు ఊపిరి విడుచుట, అధికముగా నూపిరి విడుచుట యని భావము. 'క ఖ' లను ఉచ్చరించి చూచుకొనినచో నీ భేదము తెలియగలదు. ఒత్తులేని అక్షరముల నుచ్చరించు నపుడు గలుగు ప్రయత్నము అల్పప్రాణము. ఒత్తుగల వానిని బలుకునపుడు మహాప్రాణము.[16] వర్గములలోని 1, 3, 5 అక్షరములును (క, గ, ఙ), య ర ల వ లును అల్పప్రాణములు. మిగిలిన యక్షరములు మహాప్రాణములు.

9, 10, 11. ఉదాత్తానుదాత్త స్వరితములు.

ఈ మూఁడిటి స్వభావమునుగుఱించియు ఊనిక స్వరము అను ప్రకరణమున గొంచెము స్పృశించితిని. ఇవి సంగీతమునందలి స్వరములయిన 'షడ్జ ఋషభ గాంధార మధ్యమ పంచమ ధైవత నిషాదములను సంబంధించినవని యొక మతము. ఇందు మొదటి రెండును అనుదాత్తజము లనియు, తరువాతివి రెండును ఉదాత్తజము

[15] ఖయాం యమః ఖయః ×క ×ప విసర్గః శరఏవచ ఏతే శ్వాసానుప్రదానాః। అఘోషాశ్చ వివృణ్వతే కంఠమ్, అన్యే తు ఘోషాః స్యుః సంవృతా నాదభాగినః॥

[16] వర్గాణాం ప్రథమ తృతీయ పంచమాః ప్రథమ తృతీయయమౌ యరలవాశ్చ అల్పప్రాణాః। అన్యే మహాప్రాణా ఇత్యర్థః॥

లనియు, ఆ నరువాతివి మూఁడును స్వరితజము లనియుఁ జెప్పఁబడినవి. ఇది కొన్ని శిక్షలయందలి మతము

పాతంజల మతమున నివి ఊనికకుఁగూడ సంబంధించినవని తోఁచును. 'ఉచ్చైరుదాత్తః, నీచైరనుదాత్తః, సమాహారస్స్వరిత' అని పాణినీయలక్షణము. స్వరోచ్చారణస్థానములయిన ఆ యా తాల్వాది స్థానములయందు మిక్కిలి ఊర్ధ్వ భాగమున ఉచ్చరించినచో ఉదాత్తము, అధరభాగమున ఉచ్చరించినచో అనుదాత్తము.[17] అనుదాత్తోచ్చారణమున దక్షిణహస్తమును హృదయముదగ్గఱను, ఉదాత్తసందర్భమున తలదగ్గఱను, స్వరితమును బలుకునపుడు చెవికడను నిలుపవలయునని యొకమతము.[18] ఇట్లు నిరూపింపఁబడిన యుదాత్తాది భేదము తెనుఁగునందలి స్వరములకు నిరూపింపఁబడలేదు.

పయి విచారణ ననుసరించి నేఁటి తెనుఁగున వాడఁబడు నచ్చుల స్వభావము నూహించుట సులభము.

1. అకారము. కంఠ్యమని పయికారికలలోఁ జెప్పఁబడినది. కంఠ్యమనఁగా కంఠమునఁ గలిగినదని భావము. అన్ని యక్షరములును కంఠమందే గలిగినవయ్యును కవర్గమునకు జిహ్వామూలము యొక్కయు మృదుతాలువు యొక్కయు సంబంధము గలదనియు, నట్టి మృదుతాలుప్రదేశమునే కంఠముగా వ్యవహరించియుండవచ్చు ననియుఁ దోఁచుచున్నదని ముందే వ్రాసితిని. ఇట్లే జిహ్వామూలమునకుఁ బయి మృదుతాలు భాగము సమీపించినపుడును, ఓష్ఠములు చాల దగ్గఱగా నుండునపుడును 'అ'కార మేర్పడుచున్నది. "ఈ అ వర్ణమునకు హనువులు స్థాన మనియు, ఓష్ఠములు కరణ మనియును తైత్తిరీయ ప్రాతిశాఖ్యమునఁ జెప్పఁబడినది. అనఁగా హనువులును ఓష్ఠములును గేవల మెడపడకయును, గలిసికొనకయు నుండునని తాత్పర్యము."[19] హకారము కంఠ్యముమాత్రమేగాక కొందఱు ఉరస్యమనిగూడ వ్యవహరించిరి. దీనిని ఆంగ్లేయులు "Breathed Sound" అనఁగా కేవల నిశ్వస్తమని వివరించిరి.

ఇకారము - ఇది తాలవ్యము. జిహ్వామధ్యమునకును గఠినతాలువునకును సామీప్యము గలుగుటవలన నీ ధ్వని యుత్పత్తిల్లును. తాలువు స్థానము. జిహ్వామధ్యము కరణము.

---

[17] ఏకస్మిన్ తాల్వాదికే స్థానే ఊర్ధ్వాధర భాగయుక్తే ఊర్ధ్వభాగేన ఉచ్చార్యమాణ ఉదాత్తః, అధరభాగనిష్పన్నో అనుదాత్తః. (P. O. I. G పుట. 162-163.)

[18] ఏవం హస్త స్వరవిన్యాసమ్ ఉదాత్తాదీనామ్. ఉదాత్తాది స్వరాణామ్ ఉత్పత్తౌ కారణా న్యాహ. హృద్యనుదాత్తః, హృదయ సమీపే దక్షిణహస్తేన అనుదాత్తప్రదర్శనమ్ భవతీతి భావః,

[19] సీ. వం. పుట. 157

(The Nature of accent. *Phonetic observations of Indian Grammarians*. S. Varma, Page 162-163)

ఉకారము - ఇది ఓష్ఠ్యము. అనగా రెండుపెదవులను గుండ్రముగా ముందునకు చాచుటచే నియ్యది యేర్పడును. మీదిపెదవి స్థానము. కదలగల క్రిందిపెదవి కరణము.

ఋ వర్ణము - ఇది మూర్ధన్యమని పైని సిద్ధాంతకౌముదీవచనము గలదు. ష ట వర్ణములు ఈ వర్ణముతో నేకస్థానీయములని చెప్పఁబడినను ష ట వర్ణముల నుచ్చరించునప్పుడు నాలుక మడతపడినంత స్పష్టముగా దీని యుచ్చారణమునఁ గనుపట్టదు. ఈ ఋకారోచ్చారణమును నేఁడు పలువురు పలువిధములుగాఁ జేయుదురు. తెనుఁగుదేశమున దీనిని 'రు' అనుదానితో సమానముగానే పలుకుచున్నారు. కొందరు 'రి' వర్ణమువలె నుచ్చరింతురు. ప్రాచీనకాలమునందలి తెనుఁగు శాసనములలో 'మిడ్రాయ', 'మ్రిగాంక' అనునట్లు రివర్ణముగానే వ్రాయఁబడు చుండిన ట్లుదాహరించితిని. 'రు, రి' వర్ణములకు నడిమిగా కొందఱుచ్చరించు చున్నారు. కొందఱు జిహ్వాగ్రమును బర్త్స్యమునకు సమీపమున నుంచి యుచ్చరింతురు.[20] నాలుకను మడతవేసి మూర్ధస్థానమునకుఁ దెచ్చి యుచ్చరించినను ఋ వర్ణము వినఁబడుచుండును. నేఁటివలెనే ప్రాచీనకాలమునను దీని యుచ్చారణము దేశకాల భేదమునుబట్టి మాఱుచుండెనేమో యని తోఁచుచున్నది. బర్త్స్యము లేక మూర్ధము స్థానమనియు, ఈషత్ప్రతివేష్టిత జిహ్వాగ్రము కరణమనియుఁ జెప్పవచ్చును. అట్లుచ్చరించి చూచుకొనునది.

ౡ వర్ణము - ఇది జిహ్వాగ్రము వర్త్స్యమును సమీపించుటవలనఁ గలుగుచున్నది.

ఏ, ఐ లు కంఠ్యతాలవ్యములని కౌముదీవచనమువలనఁ దెలియనగును. "ఏ వర్ణమునకు హనువులును దాలువులును స్థానములు. ఓష్ఠమును జిహ్వామధ్యమును గరణములు. అకారమునకువలెనే దీనికిని బక్షాంతరమున హనువులకు బదులుగాఁ గంఠమును స్థానముగా గ్రహింపవలయును." ఐ అనునది అ, ఇ ల సన్నిహితోచ్చారణమున గలిగినట్లు స్పష్టముగా నూహింపనగును. ఈ రెండును సంధ్యక్షరములే.

ఓ, ఔ లు - ఇవియును సంధ్యక్షరములే. "ఓకారమునకు హనువులును ఉత్తరోష్ఠములును స్థానములు. అధరోష్ఠము కరణము. పక్షాంతరమున స్థానములలో హనువులకు బదులుగా గంఠమును గ్రహింపవలెను." ఔకారము అ, ఉ ల యుచ్చారణమునఁ గలిగినది. ఇదియును సంధ్యక్షరమే. పయి నాలుగును సంధ్యక్షరము లనునది సంస్కృతమతము. ఏ ఓ లు ద్రావిడమున సంధ్యక్షరములు గావనియు, అసంకీర్ణములనియు ముందు వివరించితిని.

---

[20] సి. పం. పుట. 185-186

# ఊనిక, స్వరము-వానివలన నచ్చులలోని మార్పులు

## 1. ఊనికయొక్కయు స్వరముయొక్కయు స్వభావము

మనుష్యుఁడు ఉచ్చరించునట్టి శబ్దరూపమయిన భాషకును ఒక యంత్రము నుండి బయలువెడలునట్టి శబ్దమునకును భేదము కలదు. యంత్రమునుండి బయలు వెడలునట్టి ధ్వని యెక్కువ తక్కువలు లేక ఒక్కటేరీతిని వినఁబడవచ్చును. మనుష్యులు మాటాడునట్టి భాషలో ధ్వని యొక్కరీతిగానే యుండదు. అనఁగా కీచు, బొంగు, గట్టిగ, మెల్లిగ అనునట్టి వివిధములయిన భేదములను మనము నిత్య వ్యవహారములో వినుచునేయున్నాము. సంగీతమునందలి స రి గ మ ప ధ ని స యను స్వరముల నుచ్చరించునప్పుడు గలుగు నధిరోహణావరోహణములను మనము వినుచునే యున్నాము. ఇట్టి భేదము లన్నియును మానవజాతి స్వభావములోనే నెలకొని యున్నవి. పయిరీతిని భాషలో స్వాభావికమైన ఊనికయొక్కగాని, స్వరము యొక్కగాని భేదమువలన నర్థభేదము కలుగుచుండును. మనము మాటాడునప్పుడు "నీవు ఎప్పుడు వచ్చావు" అను ప్రశ్నను క్రమముగా నొక్కొక్క శబ్దముపై ఊనికతో ప్రశ్నించినపుడు ఒక్కొక యర్థము స్ఫురించుననుట యనుభవవిరుద్ధము గాదు. నీవు అను శబ్దమును ఒత్తినపుడు సందర్భమునుబట్టి ఇతరులు కూడ వచ్చియుండిన జ్ఞానముగాని 'నీవు' యొక్క రారానితనముగాని, మరియేదోగాని స్ఫురించును. ఎప్పుడుపై నూనికగల యప్పుడు ఇంతసేపటినుండియు చూచుచునే యున్నాను; కనుగొనలేదే! అనిగాని, రెండు మూఁడు రోజులు పోయినఁగాని రాగూడదే, యింతవేగ మేల వచ్చితివి? అనిగాని, యితరములైనవిగాని సందర్భమును బట్టి యర్థాంతరములు స్ఫురించుచుండును. ఇట్లు "వచ్చావు" అనుదానిపయి ఊనిక గలిగినప్పుడు ఇతరములయిన యర్థములు పయిరీతినే స్ఫురించుచునే యుండును. ఆఁ, ఊఁ, మొదలయిన అవ్యయములను ఉచ్చరించునప్పుడును స్వర వైశేష్యమును బట్టియు, ఊనికనుబట్టియు అర్థభేదములు స్ఫురించుచునేయుండును. ఇట్టి భేదము వాక్యమునందలి భిన్నములయిన పదములపయిని ఉండవచ్చును. అనఁగా కేవలము వాక్యమునకు సంబంధించినదియే కావచ్చును లేక పదమాత్రమునందు ఉండవచ్చును. అనఁగా పదమునందలి భిన్నాక్షరములకు సంబంధించినదిగా ఉండవచ్చును. ఇట్టి ఊనికవలన పదమాత్రమునందు అర్థభేదము కలుగవచ్చును, కలుగక పోవచ్చును.[1]

[1] "Its origin has to be sought in the natural desire of man to gratify the ear by modulated sound and probably no language exists in which it does not play a more or less important part. Only a machine could

పయియూనిక, స్వరము అనువానిని గూర్చిన భేదము మనము మాటాడు మాటలలో (అత్యంతపరిచిత మగుటవలన) మనకు స్పష్టముగ గనుపట్టదు. మన భాషను ఇతరులు మాటాడునప్పుడు మనకు స్పష్టముగా పయి యూనికభేదము గోచరించుచుండును.

తెనుఁగును కొండజనులు మాటలాడునప్పుడు సంగీతమువలెనే వినఁబడును. వేదమును వైదికులు పఠించునపుడు ఉదాత్తానుదాత్తాది భేదమువలనఁగూడ నిట్టి భేదము తెలియుచునే యుండును. సంస్కృతమునందలి యుదాత్తానుదాత్తాది భేదములు సంగీతములోని స్వరభేదమునకు సజాతీయము లనుటకుఁ శిక్షాదికము నుండియు, సంగీత గ్రంథములనుండియు ననేక ప్రమాణముల నొసంగవచ్చును. సంగీతమున "షడ్జము, ఋషభము, గాంధారము, మధ్యమము, పంచమము, ధైవతము, నిషాదము" అను నేడు స్వరములు గలవు.[2] పయి యేడుస్వరములలోను, గాంధార మధ్యమములు ఉదాత్తజాతములనియు, షడ్జ ఋషభములు అనుదాత్తజములనియు, పంచమము ధైవత నిషాదములు స్వరితజములనియు పారిశిక్షావచనము గలదు.[3] ఇట్లు వేదోచ్చారణమున మనకు వినఁబడుచున్న స్వరభేదము సంగీత స్వరముల ననుసరించినదే యనుట స్పష్టము. కొండలలోని యనాగరకులు మాటాడు భాష సాధారణముగ ప్రాథమికావస్థయం దుండును. అట్టి భాషలన్నియును సంగీతము వలెనే స్ఫుటమయిన స్వరభేదముతోనే యుండుననుట యనుభవసిద్ధము. కాఁబట్టి యీ కొండజనులు తెనుఁగు మాటాడునప్పుడు తమకు సహజమయిన స్వరభేదముతోఁ గూడునట్లు మాటాడుదురు. ఇట్టి స్వరవైశిష్ట్యమునే ఆంగ్లమున (Pitch accent) అనిగాని, (Tonic accent) అనిగాని వ్యవహరింతురు.

(Stress accent) అని ఆంగ్లమున వ్యవహరింపఁబడు నింకొక విధమైన యుచ్చారణభేదము కలదు. ఈ విధమయిన యుచ్చారణభేదములో ఒక యక్షరము

produce a continuous series of sounds in undistinguished monotonus repetitions like 'tum tum tum of a drum'. A rational being using words for a rational purpose to manifest his thoughts and feelings, necessarily accents both words and sentences in some way or other. That the accentuation of one language is more distinct, various and effective than that of others is beyond question, but there are none so far as we know in which its power is not felt."

—Blackies.

[2] నారదశిక్ష: షడ్జం వదతి మయూరో, గావో రమ్భన్తి చర్షభమ్। అజా విక్రేతు గాంధారమ్, క్రౌంచో వదతి మధ్యమమ్। పుష్పసాధారణే కాలే కోకిలా వక్తి పంచమమ్। అశ్వస్తు ధైవతం వక్తి నిషాదం వక్తి కుంజరః, P. O. I. G. 155–169. [3] గాంధారకో మధ్యమ ఉచ్చజాతః। షడ్జర్షభౌ ద్వౌ నిహతోద్భవౌ స్తః। సపంచమో ధైవతకో నిషాదః। త్రయః స్వరాశ్చ స్వరితాత్తు జాతాః॥

ఇరుగు పొరుగుల దానికంటె నధికముగాఁగాని అల్పముగాఁగాని స్ఫురించునట్టి ఒత్తిడితో వినఁబడుచుండును. ముఖమునుండి వెడలు నిశ్వాసముయొక్క వేగమునను, ఆధిక్యమువలనను ఈ యొత్తిడి యేర్పడును. ఈ విధమయిన ఊనిక లేక ఒత్తిడి ఆంగ్లభాషలో చాల గలదు. మనదేశములోని మిషనరీలు తెనుఁగు మాటాడునప్పుడు స్పష్టముగా నిది గోచరించును. 'బండి', 'జవాబు', 'మన మందఅమును బిడ్డలను' ఇట్టి మాటలను ఉచ్చరించునపుడు క్రిగీటు గల యక్షరములు ఒత్తి యుచ్చరింపఁబడుట తెలియనగును.

ఇట్లు రెండువిధములయిన యుచ్చారణ భేదములను స్వరము, ఊనిక అను పేళ్ళతో మన మిందు వ్యవహరించుచున్నాము. అన్నిభాషలయందును కొంచెమో గొప్పయో పయి రెండుభేదములునుగూడ నుండును. కొన్నిటియందు 'ఊనికకు'ను కొన్నిటియందు 'స్వరము'నకును ప్రాధాన్యము కనుపట్టుచుండును. ప్రాచీనములయిన గ్రీకు, సంస్కృతభాషలయందు స్వరమునకే ప్రాధాన్యము. నేఁటి ఆంగ్లము మొదలయిన భాషలయందు ఊనికకే ప్రాధాన్యము. కావుననే ప్రాచీనవైయాకరణులు వైదికభాషలయందలి స్వరమునుగూర్చి యనేకవిధముల పరిశోధన సల్పిరి. స్వరవిహీనమయిన మంత్రము మిథ్యాప్రయుక్తమై వక్తయొక్క యర్థముఁ జెప్పదని శాస్త్రము.[4] ఇట్లు చెప్పుటవలన ప్రాచీనులు ఊనికయొక్క అంశమును గుర్తింపలేదనిగాని, యది వారి స్వరములయందు లేదనిగాని భావింపరాదు. దానిని గూడ ప్రాచీనులు గుర్తించిరి.[5]

## 2. వీనివలని మార్పులు

ఇట్లు ఊనిక, స్వరము భాషలలో నుండుటవలనఁ గలుగు కార్యము లేవి యని యడుగవచ్చును. (నేఁటి ఆంగ్లాదిభాషలలో చాలవఱకును ప్రాచీన స్వరభేదము నశించి తత్స్థానమున ఊనికయే నిలిచినది. ప్రాచీనమయిన ఇండోజెర్మానికు భాషలలోను, సంస్కృతముననను ఉదాత్తస్వరము గలిగిన యక్షరములపయి నేఁటి యాంగ్లమున ఊనికయే గలదు.) స్వరము బాగుగా గల యక్షరముల (Syllables) యందు నాదాత్మకములయిన ధ్వనులే సాధారణముగ నిలుచుచుండును.[6] నాదాత్మకమయిన ధ్వనులను ముందు వివరించితిని.

ఊనిక యధికముగాఁ గల యక్షరములు మాఱుపాటులేక యుచ్చారణమున నిలుచును. అట్టి యూనిక లేని యక్షరములు కాలక్రమమున నశించిపోవును. శబ్దము

[4] మంత్రోహీనః స్వరతో వర్ణతో వా మిథ్యాప్రయుక్తో న తమర్థమాహ, స వాగ్వజ్రో యజమానం హినస్తి యథేంద్రశత్రుః స్వరతోపరాధాత్. శిక్షా.

[5] P. O. I. G. Page 165.

[6] Giles *Short Manual of Comparative Philology*. Page 93.

అల్పతరములయిన యక్షరములతో నేర్పడును. ఇట్టి మార్పు అన్నిభాషలయందును గనుపట్టుచుండును. అందును ఊనికకే ప్రాధాన్యముగల భాషలలో నిట్టిమార్పు శరవేగమునఁ గలుగుచుండును. పదములు రూపాంతరితము లగుచుండును. ఇది ఆంగ్ల భాషాభిజ్ఞులకుఁ దెల్లమయిన విషయమే. అయినను మనభాషలో నిట్టి యూనిక చాల ప్రచురము గాదుగావునను, ఆంగ్లమునం దున్నట్లు స్ఫుటము గాకుంటను స్పష్టతకై యీ క్రింది యుదాహరణముల నొసంగుచున్నాను.

మన యూళ్ళపేళ్లను బరిశీలించునది. తెల్లదొర లుచ్చరించునపుడు చాల మార్పులు గలుగుచు, పదములు రూపాంతరితములయి, వారివలన గలిగిన రూపాంతరములే మనకు మఱలఁ బ్రమాణములయి మన భాషలో వాడంబడుచున్నవి. అనంతపురము అను పదమును గ్రహించునది. ఇది ఆంగ్లమున Anantapur అని హలంతముగా వ్రాయఁబడుచున్నది. తెనుఁగునందలి తవర్ణము వర్ణరచనాక్రమమున టవర్ణముగా మాఱిపోయినది. నవర్ణముపయిని, పవర్ణముపయిని మాత్రమే ఊనిక గలిగి తక్కిన యక్షరములపయిని ఊనిక లేనట్లు ఈ శబ్ద ముచ్చరింపఁబడుచున్నది. ఇట్లు ఊనికలేని అకారమును, తుదిరేఫమును క్రమమున భ్రష్టములయి 'నెంటపు' అను రూపముతో మనకు వినఁబడుచుండును. అట్లే ఆదోని (Adoni) అనునది 'దౌని' యనియును, గుంటూరు (Guntur) 'గంటౌ' అనియు వినఁబడును. ఇవి మనకు పరిచితములయిన పేళ్లు గావున నెప్పటి కప్పుడు దిద్దుకొనుచున్నాము. మఱికొన్ని గ్రామనామములు విచిత్రముగా మాఱిపోయినవి. తిరువనంతపురము 'త్రివెండ్రము' గాను, రాజమహేంద్రవరము 'రాజమండ్రి' గాను, విశాఖపట్టణము 'వైజాగు' గాను, చామర్లకోట 'సామల్కోట్' గాను మాఱిపోయినవి. ఇట్టి మార్పులకుఁ గారణము ఊనికయే. పయిమార్పులు మనకు సుపరిచితములయి, శ్రుతము లగుచుండుటవలన చక్కగా బోధపడునని మొదట పేర్కొనఁబడినవి. ప్రాచీనభాషలోని పదముల మార్పులు పండితులకేగాని తెలియవు. పయిగా నా భాషలు పరిచితములు గాకుండుట మఱికొంత ప్రతిబంధకము. అయినను ఈ ఊనిక వలన జరుగుచుండిన భాషాపరిణామము సమస్తభాషలయందును, సర్వకాలములలోను నుండినదని భాషాశాస్త్రజ్ఞులు నిర్ణయించిన విషయము. ఇట్లు నిరంతరము ఎల్ల భాషలయందును బ్రవర్తించుచు మార్పును గలిగించుచున్న యీ ఊనిక ద్రావిడ భాషయగు తెనుఁగున ఉన్నదా, ఉన్నచో నయ్యదెట్లున్నది అను విషయము సమాధేయము. వ్యావహారికముగా నున్న నేటి తెనుఁగుభాషలో ననేకములగు మార్పులు గలుగుచునే యున్నవి. 'తిని వేసు తాడు' అను రూపమును గ్రహించునది. ఇందు న్యాయ్యముగా మూఁడు భాగములు (పదములు)గలవని యంగీకరింపక తప్పదు. 'వేయు' ధాతువు అనుప్రయుక్తముగా నున్నది. స్వతంత్రముగా నున్నప్పుడు పదాదినున్న 'వ'కారము ఊనిక గలిగి భ్రష్టముకాక వేయు, వేసి అనియే యిప్పుడును ఉచ్చరింపఁబడుచున్నది. అసమస్తపదములు తెనుఁగున సాధారణముగా ఒక యచ్చు,

రెండచ్చులు, మూఁడచ్చులుమాత్రమే కలిగియుండును. అంతకంటె నధికాక్షరములు గల పదములన్నియు కొన్ని ప్రాథమికపదములయొక్క కూడికయే. ఇట్లు గొలుసు కొక్కెములవలె నొకదాని కొక్కటిగా చేర్చి కూర్చిన యిట్టి పదములన్నిటిలో నాద్యక్షరమున నుండిన యూనిక తొలఁగిపోయి యట్టి యక్షరములు ఉచ్చారణత్వరలో భ్రష్టములయి ఎంత పెద్దపదమయినను మూఁడు అక్షరములు గల రూపముతో సిద్ధమగుచున్నది. ఆఱక్షరముల పదమగు 'తినివేసుతాఁడు' (అను రూపము) = తినేస్తాడు = తినే_స్తడు = తినే_త్తడు, = తిన_త్తడు = తీంతడు అని మాఱిపోయినది. ఈ యుచ్చారణము విశాఖమండలములో వినఁబడుచుండును. వెడలుతాడు = వెళ్లుతాడు = ఎళుతాడు = ఎల్తాడు = ఎ_ల్తడు. ప్రభువువారు = పెబువ్వారు = పెబువోరు. తినవలయును = తినవలెను = తినాలెను = తినాలె = తినాలి. ఇట్టి యుదాహరణములు నేటి భాషలోనుండి వందల కొలది యీయవచ్చును.

అయినను వైదికసంస్కృతమువంటి స్వరవైశిష్ట్యమును, ఆంగ్లమువంటి యూనికయు నంత స్ఫుటముగ తెనుఁగునగాని, యితర ద్రావిడభాషలయందుగాని లేవు. (అయినను కొన్ని కొన్ని మండలములలో నియ్యది గాఢముగా వ్యవహారములలో వినఁబడుచుండును.) సాధారణముగా నాగరికులు మాటాడు తెనుఁగులో ఊనికకుఁ బ్రాధాన్యము లేదు. ద్రావిడభాషలు సంయోగాత్మకములయిన భాషలు. అనఁగా అల్పాచ్కములయిన చిన్న చిన్న పదములు గొలుసు కొక్కెములవలె చేరి యచ్చుల మార్పులు లేకుండునట్లు పదము లేర్పడుచుండును. రెండక్షరములు గల మూలరూపములే యధికము. వీనియందు తొలియక్షరముపయినే యూనిక యుండును.[7] అట్టిపదములు రెండు కలసినప్పుడు రెండవపదము తొలినున్న యూనిక మాఱక తప్పదు. అట్లు మాఱుటలో శబ్దమంతయు నొక్క ముద్దగా నేర్పడి రూపాంతర ముత్పన్న మగుచుండును. (ఆ+వలను = ఆవల = ఆల (?); సగము+పాలు = సాఁబాలు) "ఆచ్ఛిక సమాసంబులందు వర్ణలోప వర్ణాగ మాదేశ వికారంబులు నిత్యవైకల్పికములుగాఁ బెక్కులు గానఁబడియెడి"[8] అను వాక్యము దీనివలననే కలిగెను. పయి యభిప్రాయము సూచించుచు డాక్టరు కాల్డ్వెలుగారును వ్రాసిరి.

చాలపదములతో సమాసము లేర్పడునప్పుడు ప్రత్యేకపదములపయి నున్న యూనిక పోయి రెండు మూఁడు స్థలములయందుమాత్రమే నిలువవలసివచ్చునని చెప్పియున్నాను. అనేకమయిన సమస్తపదమునందలి ఊనికలో మొదటి పదముమీఁదిది సాధారణముగాఁ బ్రధానమును, రెండవదానిమీఁదిది యప్రధానముగాను ఉండును. ఇట్టి యప్రధానమయినది క్రమముగా భ్రష్టమగును. అర్థభేదమును రూపింపవలసినప్పుడుమాత్రము అట్టి యూనిక భ్రష్టముకాక నిలిచిపోవును. 'వచ్చినవాఁడు' అను క్రియాజన్యవిశేషణరూపము వాక్యములలో వాడఁబడుచుండెను. అది క్రియగా మాఱి వకారముమీఁది యూనికను బోఁగొట్టుకొని

[7] C. G. D. Page. 189. [8] ప్రౌఢవ్యాకరణము. సమాసము.

'వచ్చినాఁడు' అని ప్రామాణికభాషలో మాఱినది. విశేషణమాత్రముగానే యున్నప్పుడు 'వచ్చినవాఁడు' అను రూపమే వాడఁబడుచున్నది. ఇట్టి భేదము వర్తమానార్థకరూపములగు 'చేయుచున్నాఁడు', 'చేయుచున్న వాఁడు' అనువానిలో గూడ గలదు. అరవమునను, కన్నడమునను గూడ ఈ ఊనికవలననే 'వరుకిరేన్' అను పదము 'వరే' యనియును, 'బరుత్తేనె' అను రూపము 'బర్తే' యనియును మాఱినవి.

తెనుఁగునందలి కొన్ని పదములు ఇతర ద్రావిడభాషలలోని యా యా పదములతో నభిన్నములయి యుండియును రూపాంతరితము లయినట్లు కనుపట్టుచున్నవి. అరవమునఁ 'అవన్' అను శబ్దము తెనుఁగున 'వా' అను రూపమును పొందినది. 'అదు' అను శబ్దము 'దా' అని యయినది. ఈ క్రింది పట్టికను జూచునది.

| | తెలుఁగు | అరవము | కన్నడము |
|---|---|---|---|
| 1. | వా (ని) | అవన్ | అవను |
| 2. | వీ (ని) | ఇవన్ | ఇవను |
| 3. | దీ(ని) ఇది | ఇదు | ఇదు |
| 4. | దే(ని) | ఎదు | ఎదు (యాదు) |
| 5. | రోలు | ఉరల్ | ఒరళు |
| 6. | లోను | ఉళ(న్) | ఒళ(ం) |
| 7. | లేత | ఇళ(మై) | ఎళ |
| 8. | లే(దు) | ఇల్ (లై) | ఇల్ల |
| 9. | గోరు | ఉగుర్ | ఉగురు |
| 10. | కాదు (అగు) | అకాదు | అగు |
| 11. | రెక్క | ఇరక్కై | ఎరంక |
| 12. | ప్రా | పఴ | పళ |
| 13. | వ్రా | వరె | బరె |

పయిని నిరూపించిన పట్టిక మార్గసూచిక మాత్రముగానే యున్నది. ఇట్టి పదము లింక ననేకములు గలవు. వాని నన్నింటి నిట గ్రహించుట యుద్దిష్టమును గాదు, లాభకరమును గాదు. ఇట్లితరభాషలలో ముఖ్యముగా అరవమున అజాదిగా నున్న పదము తెలుఁగున మాఱురూపము పొందుట కేమికారణమో యూహింపవలసి యున్నది. ప్రాచీనరూప మరవపదముతో సమానమయినదనుటలో విప్రతిపత్తి లేదు. దక్షిణ మాండలికమయిన యరవపదమునందలి పదాది నున్న యూనిక అట్లే నిలిచి పోయినది. అరవము తెనుఁగుకంటె 12 శతాబ్దములకుఁ బూర్వమే గ్రంథస్థమయి వ్యాకృతమయినది. ఈ పండ్రెండు శతాబ్దములును కేవల దైనిక వ్యవహార మాత్రోపయోగి యయిన యీ భాష నిరంతరము మాఱుచునే యుండినది. పదాది

నుండిన ఊనిక రెండవయక్షరముపయికి మాఱి తెనుఁగున నితరభాషలకంటె వైషమ్య మేర్పడినది. "అకాదు" అను రూపములో 'అ' అను అక్షరముపయి నూనికయుండిన కాలములో ఆ రూప మట్లే యుండినది. 'కా' యను నక్షరము పయి కీ యూనిక మాఱిపోయినతోడనే మొదటి 'అ' వర్ణముపయి యూనిక పోయి క్రమమున భ్రష్టమయినది. అది భ్రష్టమగుటవలన శబ్దములో నొకమాత్రకాల ముచ్చారణమున తగ్గిపోయినది. దానిని బూరించుటకుఁ బ్రక్కయచ్చునకు దీర్ఘము వచ్చినది. 'ద' కారముపయి నుండిన 'ఇ-ఉ' అను నేదో యచ్చు అస్పష్టముగా నుండి ప్రక్కనుండిన అకారరూపముతో మొదట సామ్యమును బొంది దీర్ఘమును గాంచిన దనుటయే సిద్ధాంతము. ఇట్లే 'వరు' అను ప్రాచీన ధాతువునుండి గలిగిన 'వరాదు' అను రూపము తొలియక్కరమునుండి యూనిక పోగా తెనుఁగున రాదు అను రూప మయినది. ఈ ధాతువు 'చు' వర్ణముతోఁ జేరి 'వర్చు=వచ్చు' అను రూపముతోడనే తెనుఁగున నిలిచినది. వరామై=రామి.

పైఁజెప్పిన మార్పు మొదటి యక్షరము లఘువైన చోటులలోనే గనుపించు చున్నది గాని, గురువుగా నున్న చోటులఁ గనుపట్టుట లేదు. గురువు ఆదియందు గల పదములు అరవము మొదలయిన భాషలలో నున్నట్లే తెనుఁగునను నిలిచిపోయినవి.

| | తెలుఁగు | తమిళము |
|---|---|---|
| 1. | ఊయల | |
| 2. | ఊరుగాయ | ఊరుగాయి |
| 3. | ఊటాడు | ఊటాడు |
| 4. | ఊడిగము | ఊழியమ్ |
| 5. | ఉంబలి | ఉమ్బలి |
| 6. | ఏతము | ఏత్రమ్ |

పయిపదము లన్నిటిలోను మొదటి యక్షరము గురువే. గురూచ్చారణ మున నధికతరమైన యొత్తిడి శ్వాసమునం దుండితీరవలెను. కావున నచ్చటి యూనిక పోలేదు. కాఁబట్టి యది యట్లే నిలిచినది. ఇట్లనేకములయిన పదములను ఊనిక మార్పుచే మాఱినవని చెప్పవలసియుండఁగాఁ గొందఱు వీనిని కేవలము వర్ణవ్యత్యయమని భ్రాంతిపడిరి. 'క్రొత్తపాలికాపు' అను పదము నుచ్చరింపవలసి నప్పుడు త్వరవలన నక్షరములు తడఁబడి, 'కొత్తకాలికాపు' అని యుచ్చరించుట వంటిది వర్ణవ్యత్యయము. ఇది కేవలము త్వరచే వచ్చునటువంటి తడబాటు. ఆ యా పదమును మాత్రము సంబంధించి యుండును. జోనడ=జోడన, నవ్వులాట= నవ్వుటాల; మొదలయిన మార్పులవంటిదే వర్ణవ్యత్యయ మనఁబడును. పయిమార్పులు అట్లుగాక ఇతర ద్రావిడభాషలతో సంబంధించి యనేకముగా నుండి యేకసూత్ర గ్రథనయోగ్యమయి యున్నవి.

పయి విధములయిన మార్పులను కాల్డ్వెల్లుగారు తమ గ్రంథములో విమర్శించి యొక యనుగమముఁ గల్పింప యత్నించిరి. ఇట్టి పదములయందు రెండవ యచ్చు లోపించుననియు, మొదటిది దీర్ఘమగుననియు, నిట్టి మార్పు శ్రావ్యతకొఱకు (Euphonic Displacement) ఏర్పడినదనియు వ్రాసిరి.[9] వారు చెప్పిన సూత్రము సరిపడదు. 'ఇళమై' యను పదమున 'అ' వర్ణము లోపించి 'ఇ' కారము నకు దీర్ఘముమాత్రము గలిగినచో 'ఈమై' ఈమి యనియే రూపము రావలెను గదా! ఇట్లే పయి పదములన్నిటియందును మొదటిపద మూనిక తప్పిపోగా లోపించి తరువాతి యచ్చున కా యా పదమునుబట్టి యనుకూలములయిన మార్పు లేర్పడినవి. 'అనంతపురము' లోని పదాది అకారము పోగా 'న' కారము 'నె' గా మాఱి 'నెంటపు' అయినది. ఇట్లే అచ్చు పోయినందున మిగిలినదానిని ఉచ్చారణలో సరిపుచ్చుకొనుటకు వలసిన మార్పు లెన్నెని జరుగును.

పయిని నిరూపింపఁబడినవి కాల్డ్వెల్లుగారి తరువాత జరిగిన పరిశోధనలవలనఁ దేలిన సిద్ధాంతములు.

పయి విచారణవలని ఫలితములు :

1. (ద్రావిడభాషలయందు) తెనుఁగునఁ బదాదినే యూనిక గలదు.

2. ఆ యూనిక కొన్ని కారణములవలన ప్రాచీనకాలమునఁ గొన్ని శబ్దములలో భ్రష్టమయి రెండవయక్కరములపయికిఁ బోయినది.

3. అట్లగుటవలన శబ్దరూపములలో మార్పులు వచ్చి తెనుఁగుశబ్దములు ఇతర ద్రావిడపదములకంటె భిన్నముగా గనుపట్టును.

[9] "In each of the instances mentioned, the change seems to have been produced by the rejection of the second vowel, and the substitution for it of a lengthened form of the first." C. G. D. 186–187. Journal of the Mythic Society—Papers on Accent in the Drn. Languages by L. V. Ramaswamy Aiyer, M. A., B. L.

# ధ్వనుల మార్పు

## 1. మార్పు స్వభావము

1. భాషకుఁ బ్రాథమికజీవనము వాగ్వ్యవహారమే యనియు, నట్టిదే సార్వజనీన మనియు ముందు నిరూపించితిని. లేఖనవ్యాపారమును, వాఙ్మయోపయోగమును పరిమితజనులకొఱకు నేర్పడి వాగ్వ్యవహారముకంటె నల్పతరప్రచారము గలదనుట స్పష్టము. అట్టి ముఖ్యవ్యవహారమయిన సంభాషణలో భాష మారుచునే యుండును. ఈ విషయము ముం దనేక సందర్భములలో నుదాహరింపఁబడినది. తెనుఁగుభాష నన్నయకుఁ బూర్వ మెట్లుండినది యను విషయమునఁ గొన్ని యుదాహరణముల నొసంగితిని. ద్రావిడభాషలోని మాండలికమైన యక్షరభేదములు అను విషయమునఁ గొన్ని మార్పులను నిరూపించితిని. పయి రెండు సందర్భములలో నొసంగినవి రెండు భిన్నములయిన యవస్థలను నిరూపించునవి. ఒకటి నన్నయకుఁ బూర్వపు స్వరూపము. రెండవది యంతకంటెను బూర్వమయిన స్వరూపము నుద్దేశించినది. ఈ ప్రకరణమున సామాన్యముగా నచ్చు లెట్లుమాఱు నను సర్వసామాన్య సూత్రములను వివరించి నేఁటి భాషలలోనుండి యుదాహరణముల నొసంగి ప్రాచీనోదాహరణములతోఁ గలిపి సమన్వయింతును. ఇదియే యిందలి ప్రణాళిక.

భాషలోని ధ్వనులు మారుటకుఁ గారణములు రెండు విధములు. ఒకటి ఆంతరంగికములు. రెండు బహిరంగములు. ఆంతరంగిక కారణములు వ్యక్తులయొక్క యుచ్చారణాంగములయిన తాల్వాద్యవయవములనుబట్టియు, వారి యిచ్ఛనుబట్టియు నేర్పడును. ఒక స్థాన కరణములచే నుచ్చరింపవలసినదానిని అప్రయత్నముగా నింకొక స్థాన కరణములచేత నుచ్చరించుట. కొందఱి యవయవములు దుష్టములుగా నుండును. అనఁగా అసమర్థము లనుట. కొందఱు నత్తి, ముక్కుమాటలు గలవారుగా నుందురు. వారికీ బదములు చక్కఁగాఁ బలుకవు. ఇంతియగాక మాటలను పయివారు మాటాడగా వినుటవలనగదా యితరులు నేర్చుకొందురు. అట్టి మాటలను జక్కఁగా వినకపోవుట యొక దోషము. వినినదానిని సరిగా నుచ్చరింపఁజాలకపోవుట యింకొకటి. ఇట్లగుటకు సోమరితనమును, సుఖాభిలాషయును హేతువులు. సంయుక్తాక్షరములు (భిన్నములు) గా నున్నవానిని గలిపి యుచ్చరింపలేకపోవుటచే, భక్తి = బత్తిగా మాఱినది. ఇవి యన్నియును అప్రయత్నముగా వ్యక్తులయందుఁ గలిగి పరంపరాయాతముగా కాలప్రవాహమునం బడి దొఱలిపోవుచుండును.

బహిరంగకారణములు : సామ్యము, తప్పుగా వినుచుట మొదలయినవి. తెలుఁగు నేర్చుకొనువాఁ డొకఁడు మువర్ణము అమహత్ప్రిత్యయముగదా యని తెలిసికొని

'వానము, పలకము' అని శబ్దములను సృజించెను. ఇట్లే తప్పుగా నేర్పడిన శబ్దములు వాడుకలోనికెక్కి స్థిరపడినచోఁ బ్రామాణికము లగును. 'రామైః' అను తృతీయా బహువచనము 'తైః' అను సర్వనామ సామ్యమున 'రామేభిః' నుండి యేర్పడినదని శబ్దతత్వజ్ఞుల యభిప్రాయము. నకారాది పదములను అజాదులుగా భావించి ముందటి నకారమును సంధిలోని ద్రుతముగా విఱిచి తప్పయిన అజాదిశబ్దమును బుట్టించుట, ద్రుతముతోఁగూడిన యచ్చుగల యజాదిపదమును దప్పుగా విఱిచి నకారాదిపదమును సృజించుట మొదలగునవి తప్పుగా విరుచుటలోనివి. 'దాననెగసి' యనుదానిని దానన్+ఎగసి యనిగాని, దాన+నెగసి యనిగాని రెండువిధములుగా విరువవచ్చును. 'దాననెగులుపుట్ట' అనుదానిలోని దానన్+ఎగులు అని యజాదిగా విఱిచి తప్పుగా అజాదిపదమును సృజించుట. ఇట్టివన్నియును బహిరంగకారణములలోనివి.

(1) దీర్ఘమునకును హ్రస్వమునకును భేదము లేకయే నన్నయకు ముందటి శాసనములలోఁ బదము లుండినవని తెల్పితిని. అట్లే ఒక ద్రావిడమాండలికములో దీర్ఘముండిన రెండవదానిలో హ్రస్వము ఉండనగునని ముందు నిరూపించితిని. ఈ సూత్రము ననుసరించియే నేఁటి తెలుఁగున నొక శబ్దమే హ్రస్వదీర్ఘములు గలుగు రూపములతో నున్నది. మోసల, మోసాల, వేసరు, వేసారు, పెండ్లము, పెండ్లాము, గరిడి, గరిడీ, దుప్పటి, దుప్పటీ కుందెలు, కుందేలు, కప్పురము, కప్పూరము, మొటిక, మోటిక.

అట్టి భిన్నరూపములు ఏర్పడుటకుఁ గారణము చాలవఱకు మాటాడువారి యనవధానతయే. సరిగా నుచ్చరింపవలెనని పట్టుదల లేకుండుటయే. కొన్ని యెడల పద్యనిర్మాణమున గణనిర్బంధముకొఱకు హ్రస్వములును దీర్ఘములు నయిన పదము లుండవచ్చును.[10]

(2) అరవమునందలి ఇకారమునకు సమమైన పదములలోఁ దెనుఁగున ఎకారము కనుపట్టుచుండినట్లు వ్రాసితిని (ఇడఱు-ఎడఱు). ఇట్లే నన్నయకుముందు తెనుఁగుశాసనములలో 'దీనిని' అను రూపమునకు బదులు 'దేనిని' అని కనుపట్టు చుండెననియు తెల్పితిని. నేఁటి తెనుఁగునను 'నిగ్గు-నెగ్గు', 'గోని-గోనె', 'వీరిడి-వేరిడి' మొదలగు రూపము లేకకాలముననే గనుపట్టుచున్నవి. ఇవియును ఉచ్చారణము నందు పట్టుదల లేకయే యేర్పడినవి. ఇవర్ణోచ్చారణమునకును, ఎవర్ణోచ్చారణ మునకును జాల సంబంధము గలదు. రెండింటికిని దాలవ్యత కలదు. ఉచ్చారణమున నీషద్భేదము గలుగుటచే వచ్చిన దీ మార్పు.

(3) అరవమున ఉకారము తెనుఁగున ఒకారముగా మారినట్లు నిరూపించితిని (పుగై-పొగ). ఇట్లే ప్రాచీనశాసనములయందును గొణము, పులొంబు (పొలము) మొదలగు రూపములను జూపితిని.

[10] అపి మాషం మషం కుర్యాత్ ఛందోభంగం న కారయేత్.

ఇప్పుడును పుసుగు-పొసుగు, ముకము - మొకము, అనుకొను - అనుకుసు మొదలగు రూపములు వాడుకలో నున్నవి. దీనికిని పయిరీతిని మనుష్యుల యనవధానతయే హేతువని యూహింపక తప్పదు.

పయిని, మాదిరిగా నిరూపించిన మార్పులవలనఁ దేలఁగల విషయ మేమనఁగా భాష యెల్లప్పుడును నొక్కరీతినే మార్పునొందుచు వచ్చుచున్నదనుటయేగాని వేఱుగాదు. కారణములు నయ్యవియే.

పయిని చూపినవిమాత్రమేకాక యనేకవిధములయిన మఱికొన్ని మార్పులును గలుగుచుండును. ఈ క్రింది యుదాహరణములఁ దిలకించునది.

"టంగణా-టింగణా, హండ-హండి, బరమ-బురుమ, తొరగు-తొరుగు, గడ-గెడ, సంపగ-సంపెగ, దీవన-దీవెన, గుబాలు-గుబేలు, ఇసుక-ఉసుక, కానిక-కానుక, బొంగరము-బొంగ్రము, పిడియము-పీడ్యము, పూనికి-పూన్కి, పూడుచు-పూడ్చు, కముఁజు-కౌఁజు"

అకారము ఇకారముగాను, ఇ-ఉ గాను, అ-ఎ గాను, అ-ఉ గాను మాఱిన యుదాహరణము లెన్నేని భాషలోఁ గలవు. కొన్నిపదములలోని ఉకారమును, ఇకారమును (నడిమిహల్లులు) లోపించినట్లుగూడఁ బయి యుదాహరణములఁబట్టి స్పష్టము. చంపక శబ్దమునకు సంపగి, సంపంగి, సంపెగ, సంపెంగ, సంపగ అను నైదురూపములు వాడుకలోఁ గలవు. ఆనుకూల్యమునుబట్టి వివిధ మండలములలో వివిధములయిన యుచ్చారణము గలుగును. 'సంపెంగి' అను రూపము లేదు. దీనికిఁ గారణ మా పదము నుచ్చారణము శ్రమకరమగుటయేగాని వేఱు గాదు. శ్రమకరము కానట్టియు, సులభముగా ఒక స్థాన కరణములనుండి వేఱొక స్థాన కరణములకు (ఏదో యొకటి) మాఱినఁ గల్గునట్టియు ధ్వనులు క్రొత్తగా నేర్పడుచుండును.

పదమధ్యమునందలి యచ్చుయొక్క లోపము ఊనికభంగమువలననే యని ముందే నిరూపించితిని.[11]

ఇంకొక విధమయిన మార్పు ద్రావిడభాషలలో ముఖ్యముగాఁ దెనుఁగునఁ గలదు. ఒక యచ్చు ఒక రూపముతో నుండగా ప్రక్క యచ్చువలన మొదటి దాని రూపము మాఱును. వాని+కు, దీని+ను, శ్రీ+ను అనునవి వానికి దీనిని, శ్రీని అను రూపములుగా నేర్పడుచున్నవి. ఇట్లే కత్తి+లు=కత్తులుగా మాఱుచున్నది. ఇట్లు మాఱిన ఉవర్ణము ప్రక్కను[12] అవర్ణము వచ్చినను అట్లే ముందటి ఉవర్ణము నిలుచుచున్నది. కత్తులకు, కలుగు+ఇ+తిని=కలిగితిని. ఈ విధమయిన మార్పు తెనుఁగున బహుళము. దీని నాంగ్లమున "Vowel Harmony"

[11] నలడాదేరంతరుత్వస్య అన్యేషాంచ ప్రయోగమహితానామ్॥ ఆంధ్ర చింతామణి.

[12] కునువు క్రియా విభక్తుల యుత్వంబున కిత్వంబగు. బా. వ్యా.

అని కాల్డ్వెల్లుగారు నామకరణము చేసిరి.[13] అచ్చుల పరస్పరాకర్షణమని యొక రనిరి. "సమీకరణము" అని మఱొకరు పేరిడిరి. ఇట్టి పద్ధతివలన రెండేసి రూపము లేర్పడిన వనేకములు గలవు. 'నడచు', 'నడుచు' అను రెండురూపములలో ప్రక్క నున్న ఉకారమువలన 'అ' కారము 'ఉ' కారముగా మాఱినది. 'నడ, నడ తెంచు' అను వానిలో అకారము కలదు. చలవ-చలువ, పఱచు-పఱుచు, కానిక-కానికి, మొదలగు వికల్పరూపము లన్నియు నిట్లేర్పడినవే. కొన్ని యెడల ప్రాచీనరూపములు మాసిపోయి నవ్యరూపములే నిలిచినవి. 'పడవ' అను పదము నకు, అరవమున 'పడగు' అని రూపము. తుది గువర్ణము ప్రక్కనున్న అకార సాహ చర్యమున 'గ' కారమయి వకారముగా మాఱినది. ఇట్లే పలుగురు అను శబ్దములోని 'పలు' అనుదాని ప్రాచీనరూపము 'పల' యనియే చెప్పవలయును. అరవమునను, కన్నడమునను 'పల' యనియే రూపములు.

పయిరీతిని వచ్చు మార్పులు అచ్చులలోమాత్రమేగాక హల్లులయందును గలుగుచునే యుండును. కాని యీ మార్పు లన్నిటిలో సాధారణముగా నొక విధమయిన పద్ధతి కలదు. ఆ పద్ధతినిబట్టి కొన్ని స్థలములలో కొన్ని ధ్వను లొకేవిధ ముగ మాఱునుగాని దానికి వ్యతిరిక్తముగ మాఱవు. లోకములో ఆవు తినిన గడ్డి పాలుగా మాఱి, పాలు పెరుగయి, అందుండి వెన్నవచ్చి, దానివలన నేయి యేర్పడును. ఇది సాధారణముగా లోకసిద్ధమయిన పద్ధతి. అంతియగాని లోకపద్ధతి ననుసరింపక నేతినుండి గడ్డి గలిగినదని చెప్పుట సందర్భింపదు. అట్లే ప్రాచీనపు ఇండోజెర్మానిక్ భాషలో నున్న 'ఘూంస్' అను పదము వైదికసంస్కృతమున 'హగ్ంస' అని యైనది. లౌకికసంస్కృతమున 'హంస' యయినది. తెనుగున దానినుండి 'అంచ' యను రూప మేర్పడినది. కాని 'అంచ' నుండి 'ఘూంస్' ఏర్పడెననుట యసందర్భము. సాధారణముగా నిటువంటి మార్పులు అనేకభాషలలో పరిశీలించి యట్టివానిని జాతులుగా విభజించి భాషాభిజ్ఞులు వర్గీకరించియున్నారు. వానిని క్రింద నిరూపించుచున్నాను.

## 2. మార్పుల వింగడింపు

(1) వర్ణసమీకరణము (**Assimilation**) : అనఁగా రెండు భిన్నవర్ణముల యొక్కకూడిక ఏకవర్ణముగా మాఱుట. మిక్కిలి విజాతీయములైన రెండు వర్ణములు గాని, స్వల్పభేదముగలిగిన రెండు వర్ణములుగాని సంయుక్తము లయినయెడల నేక రూపమును బొందును. దీనికిఁ గారణ మేమనఁగా ఈ రెండుజాతుల కూడికయును ఉచ్చారణమునకుఁ గ్లేశకారియే. వాని భేదమును నిలుపుట కష్టము. సంస్కృతము నందలి 'అక్షరము' అను పదమునందలి క కారము స్పర్శము, కంఠ్యము. ష కారము

[13]C. G. D. Page 180.

మూర్ధన్యము, ఊష్మము. వాని యుచ్చారణమునందలి ప్రయత్నములు చాల విజాతీయములు. కావుననే అక్షరము=అక్ఖరము=అక్కరము అను రీతిని మారినది. ఇట్లే తత్+చరితము=తచ్చరితము. దంత్యతకారము తాలవ్యచకార మయినది. ధనుస్+శింజినీ=ధనుశ్శింజినీ. 'స, శ' లు రెండును ఊష్మములే. సజాతీయము లయినవి. ఒకటి దంత్యము, రెండవది తాలవ్యము. ఈ భేదము నిలుపరానిది. కావున సమీకరణ మేర్పడినది. మొత్తముమీఁద సంస్కృతమునందలి సంధికార్యమును, తెనుఁగునందలి యనేక తద్భవములలోని యక్షరపరిణామమును బయిమార్గముననే యేర్పడినవనుట స్పష్టము. సంస్కృతము ప్రాకృతమగుటయందును బయిసూత్రమే వర్తించినది.

| | సంస్కృతము | ప్రాకృతము | సంస్కృతము | తెనుఁగు |
|---|---|---|---|---|
| 1. | కల్పసూత్ర (ము) | కప్పసుత్త (ము) | భక్తి | బత్తి |
| 2. | ప్రవృత్తి | పవుత్త | కుర్కురము | కుక్క |
| 3. | పచ్యమాన | పచ్చమాన | కూర్పాసము | కుప్పసము |
| 4. | చత్వర | చత్తర | కృష్ణ | కన్న |

పయియుదాహరణములనుబట్టి మార్పుపద్ధతి స్పష్టపడక తప్పదు. ఇట్టి మార్పు ననుసరించియే ప్రాచీన ద్రావిడపదములును మాఱి తెనుఁగయినవి. క్రింది యుదాహరణములు పరికించునది.

నెఱ+మది=నెమ్మది, కలదు=కద్దు, ఎదిు=ఎడ్ద, ఎడ్డ,(కఱుప్పు) కఱు+పు=కర్పు=కప్పు, చురుట్టు=చుర్టు=చుట్టు, వరు+చు=వర్చు=వచ్చు.

పై సూత్రమునుబట్టి రెండు రూపములలో పూర్వాపరము లేవియో తెలిసికొననగును. పర్వము=పర్బము=పబ్బము. ఈ మూఁడు రూపములలో మూఁడవది మొదటిదానికి వికృతి యని చెప్పఁగలము. అంతియగాని మూడవదానినుండి మొదటిది వచ్చినదని యూహింపరాదు. అట్లే నిరుప్పు=నిర్పు=నిప్పు కావలెనుగాని నిప్పు అను రూపము ప్రాచీనమని వాదించుట వలనుపడదు. ఈ మార్పును చక్కగా బరిశీలించి వికృతిమార్గము నెఱుంగనగును.

(2) వర్ణవిభేదనము : (Dissimilation) ఒక్కటే ధ్వని యొకశబ్దమున మిక్కిలి సమీపముగా ద్విరుక్తమయినప్పుడు మాఱుచుండును. ఇదియును ఉచ్చారణ యందలి సౌకర్యముకొఱకు ఏర్పడిన మార్పనియే చెప్పవలెను. రెండుసారు లా ధ్వని నుచ్చరించునపుడు తడఁబాటుగలిగి మఱియొకధ్వని ఒకదాని స్థానమున నేర్పడును. లాటిన్‌భాషలో పెరిగ్రినమ్ (=తిరుగుట) అను పదము ఆంగ్లములోనికి వచ్చునపుడు ఒకరేఫము లకారముగా మారి 'పిల్‌గ్రిమ్' (యాత్రికుఁడు) అను రూప మేర్పడినది. సంస్కృతమునందలి లిట్టురూపములలోను (అనద్యతనభూతము), జుహోత్యాదుల

యందును అభ్యాసమునందు వర్ణవిభేదన మేర్పడుచుండును.[14] "కృ + కృ = చకృ; హు + హు = జుహు; ధా + ధా = దాధా" అనునట్లు మాఱి చకార, జుహోతి, దధౌ అను రూపములు సిద్ధము లగుచుండును. ఇట్లే తెనుఁగున, బాలు + లు = బాలురు అను రూపమున లకారము రేఫమగును.[15] ఈ మార్పు దీర్ఘపూర్వలోపధంబగు అదంతము పయినే గలుగుచున్నది. క్రియలయందును ఈ మార్పు చాలఁగలదు. పచ్ + ఇంచు + ము = పచింపుము. ఇచట చవర్ణము పవర్ణమైనది. ఇట్లే అవులించు + ఇంచు = అవులింపించు, చూచు + ఇంచు = చూపించు అను రూపములు సిద్ధము లయినవి.

(3) తాలవ్యీకరణము : (Palatalisation) సాధారణముగా ప్రాచీనములయిన కవర్గాక్షరములు చవర్గాక్షరములుగా మాఱుచుండును. ఈ మార్పు అనేకభాషల యందుఁ గలదు. 'చరుః' అనఁగా సంస్కృతమున హోమముచేయుటకు ఉడికించిన అన్నము. దీనికి సోదరరూపమగు 'కెరు' అనునది యిట్టియర్థమునసే లాటిన్ భాషలలోఁ గలదు. ఇట్లే సంస్కృతమున 'వాచ్' అను శబ్దము 'వాక్' అను రూపమును బొందుచుండును. కొన్ని యెడల చకారమును, మఱికొన్ని యెడల కకారమునుగా పరస్పరము మాఱుచుండును. ఇట్లే ప్రాచీనద్రావిడమునందలి కకారము తెలుఁగున చవర్ణమయినది. 'కిళి' అరవము, తెలుఁగు 'చిలుక'. ద్రావిడ మాండలికములయందలి యక్షరభేదములు అను శీర్షికక్రిందఁ బయి తాలవ్యీకరణమున కనేకోదాహరణము లీయఁబడినవి. ఇట్లే తెనుఁగునందలి 'కయి, చెయి', 'కెందొవ, చెందొవ' మొదలగు రూపద్వైవిధ్యము పయివిషయమును స్థిరపఱచుచున్నది.

(4) అనునాసిక్యము : (Nasalisation) వర్గాక్షరములలోని మొదటి నాల్గిటికిని, తుదిదానికిని గల భేదమును ముందు వివరించితిని. ముక్కులోనుండి గాలిని వదలునట్లు ధ్వని నుచ్చరించినచో ననునాసికము లేర్పడుననియు, లేనిపట్ల వర్గేతరాక్షరములు శ్రుతము లగుననియుఁ దెల్పితిని. శైత్యభారమున ముక్కుమాటలు వచ్చుటయు, శ్రావ్యముగ నుండునను భావముననో, పెద్దలగువా రట్లుచ్చరించుటనో ముక్కుతోఁ జదువుటయును మొదలగు నభ్యాసములను మనము ప్రతి దినమును వినుచునేయున్నాము. ఇట్లు వర్ణము లానునాసిక్యమును బొందుట తెనుఁగునను, ఇతర ద్రావిడభాషలయందును మిక్కిలిగాఁ గలదు. అట్లు జరిగిన యక్షరముల మార్పుల కన్నిటికిని హేతువులను బ్రత్యేకముగ వెదుక నక్కరలేదు. 'ఒక్కభాషలోని యనుస్వార మింకొకభాషలో నుండదు' అను సూత్రముక్రింద ద్రావిడ మాండలికముల స్వభావమును విమర్శించునపుడు అనేకోదాహరణముల నిచ్చితిని. ఇది బహువిధముగా నున్నది. ఎంద్రి = యెంద్రి = ఇండు (తమిళ) పాటోళి = మాటోళి. కడుదురు = కణుదురు. బెడకు = బెణకు. బుట్టటకొమ్ము = ముట్టటకొమ్ము. బుస్సు = ముస్సు. వనబు = వనము.

---

[14] పూర్వోఽభ్యాసః 6-1-4 అత్ర యే ద్వే విహితే తయోః పూర్వో అభ్యాససంజ్ఞః స్యాత్. [15] బా. వ్యా. తత్సమ. 48 సూత్రము.

వర్గాక్షరములకు ముందు నిష్నిమిత్తముగా వర్గపంచమాక్షరము చేరుచుండుటయు, పూర్వ ముండినది భ్రష్టమగుటయు సంభవించుచుండును. తెనుఁగునందలి హ్రాస్వపూర్వములయి సిద్ధములయిన యర్ధానుస్వారముగల పదము లన్నియును రెండురూపములతో వాడుచున్నారు. వానిలోఁ గొన్నిటియందు ప్రాచీనమయిన యానునాసిక్యము భ్రష్టమైనది. కొన్నిట క్రొత్తగాఁ గలిగినది.

అంట=అఁట ; ఇంక=ఇఁక ; చుండు=చుఁడు ; దీర్ఘములయినవానిపయిని వచ్చు పూర్ణబిందువులు పోయి ఖండబిందువు లయినవి.

ఈ విషయము అనుస్వారము చరిత్రమున విమర్శింపఁబడును.

(5) శ్వాసత, నాదత (Unvoicing, Voicing): శ్వాసములు, నాదములు పరస్పరము మాఱుచుండుట. శ్వాస నాద భేదముల నీవఱకు నిరూపించితిని. కచటతపలు గజడదబలుగా మాఱుట. ముందు నాదాత్మకమయిన నకారము వచ్చిన యెడల ననఁగా ద్రుతప్రకృతికముల వెనుకను, ప్రథమాంతములగు కళలపైని గూడ, కటతలు గడదలుగా మాఱును. సమాసమధ్యమందును ఈ మార్పు బహుళముగా జరుగుచుండును. ప్రథమమీది 'చ ప' లు 'స వ' లుగా మాఱుట బహుళము. ఈ మార్పులన్నియును ఆంధ్రవ్యాకరణములయందుఁ జక్కగా నిరూపింపఁబడినవి.[3]

శ్వాసము నాదమగుటకు వలసిన ప్రయత్న మత్యల్పము. మొదటిదాని యుచ్చారణమున నాదతంత్రులు శ్లథములయి యుండును. రెండవదాని యుచ్చారణమున నవి బిగిసియుండును. ఈ శ్వాసముల నుచ్చరించుటకుముందు నాదాత్మకమయిన వర్ణముల నుచ్చరింపవలసినచో వాని సాహచర్యమున నా ప్రయత్నము వీనియందును సోకును. ఇట్టి మార్పునకుఁగూడ హేతువు వాచకుని సోమరితనమే.

పదాదిని, పదమధ్యమున, పదాంతమునను ఈ మార్పు నిమిత్త మక్కఱ లేకయే వచ్చుచుండును. ఒకప్పుడు సంధియందుఁ గలిగిన మార్పును, సమాసము నందు వచ్చిన రూపాంతరమును మనస్సున నుంచుకొని తప్పుగా విఱుచుటచేతను ఇయ్యవి యేర్పడుచుండును.

కడచు=గడచు ; చీరాడు=జీరాడు; చెముడు=జెముడు ; టీకొను=డీకొను ; టిల్ల=డిల్ల ; బ్రతుకు=బ్రదుకు ; తటాకము=తడాకము ; సెక=సెగ ; గ్రంధి=కంతి ; కోదరికము=కోటరికము ; ఘాసము=కసవు ; గుచ్ఛము=కుచ్చు ; తూరు=దూరు ; ద్విభాషీ=తుపాసి ; బాలిశుఁడు=పాలసుఁడు ; భీరుక=పిటికి ; బిడాలము=పిల్లి.

(చ, ప లు స, వ లగుటకు అనేకోదాహరణములు వ్యాకరణములయందుఁ గలవు).

(6) లోపదీర్ఘత (Compensatory lengthening): ఉచ్చారణమున నొక యక్షరము లోపించి యట్లు లోపించుటవలనఁ గలిగిన హ్రాస్వత పోవునట్లు ప్రక్కయచ్చు దీర్ఘమగుచుండును.

---

[3] బా. వ్యా. సంధి. 13-15-16,

మొగము = మోము ; చివుకు = చీకు, దనుక = దాక ; పొగవు = పోపు ; సగము = సాము ; నివులు = నీరు.

(7) స్వరభక్తి ( Anaptyxis ) : ఈ మార్పు వేదకాలములోనే యుండినట్లు వైయాకరణులు కనిపెట్టిరి. ఇంద్ర (శబ్దము) = ఇందర యనునట్లు నడుమ నొక యచ్చు చేర్చి యుచ్చరించుచుండినట్లు తెలియనగును. సంయుక్తాక్షరము నడుమ నొక యచ్చు చేరి యుచ్చారణమును సులభపఱచుటయే దీని లక్షణము. దీనినే వికర్షము, విప్రకర్షమనియు వ్యవహరింతురు.

శబ్దము = సబుదము ; చంద్రుఁడు = చందురుఁడు ; ద్వారము = దువారము ; హర్షము=అరుసము ; దర్శనము=దరిసెనము.

(8) Protheosis : కొన్ని హల్లులకు ముందు ఉచ్చారణమునందు అ చ్చొకటి చేర్పఁబడుచుండును. ఇట్టి యభ్యాసము సంస్కృతములోని సకార రేఫములు ఆదియందుగల పదములు అరవములోనికి వచ్చునపుడు గనుపట్టును. ఆంగ్లభవము లయిన ఇస్కూలు, ఇస్టాండు, ఇస్టేషను మొదలగు పదములయందుఁ గలదు.

రాజు = అరసు ; రక్తము=ఇరకతము ; రథము=అరదము.

(9) వర్ణనాశము (Synecope) : రెండు హల్లుల నడుమ నున్న యచ్చు ఉచ్చారణత్వరలో నశించి యా రెండు హల్లులును గలసి మఱికొంతకాలమునకు సమీకరణము గలుగుచుండును. ఈ వర్ణనాశము స్వరభక్తికి విపరీతమయినది.

వలదు = వల్దు = వద్దు ; కొలది = కొల్ది = కొద్ది ; పితరులు = పితాళ్లు.

(నలడాదేరంతరుతశ్చ ; అన్యేషాంచ ప్రయోగ మహితానామ్, అను చింతామణి సూత్రములు దీనికి ఉదాహరణము లగును.)

(10) Haplology : సాధారణముగా నొక శబ్దముతుదిని వచ్చిన హల్లు మఱి యొక శబ్దము మొదట వచ్చి యా రెండును గలసినప్పు డొక వర్ణము లోపించును.

శష్ప+పింజరః = శష్పింజరః ; శేవ + వృధః = శేవృధః ; పెద్ద + తనము= పెత్తనము ; కుత్తిగ + గంటు = కుత్తిగంటు ; బొంత+దళము = బొందళము ; ఎనుప + పసరము = ఎనుపసరము ; ఎనుప + పెంటి = ఎనుపెంటి.

(11) వర్ణవ్యత్యయము (Metathesis) : ఉచ్చారణమునందలి తడఁబాటువలన ముందక్షరము వెనుకకును, వెనుకక్షరము ముందునకును బడును.

నవ్వులాట = నవ్వుటాల ; జోనడ = జోడన ; వారువము = వావురము ; పారువము = పావురము.

(12) వర్ణాగమము (Addition of a Syllable) : సామ్యమువలనను తప్పుగా క్రొత్తయక్షరములు శబ్దములలోఁ జేరుచుండును.

నడిరేయి = నడికిరేయి ; వేగుజుక్క = వేగురుఁజుక్క ; పితలాటకము, కోలాటకము, దొంగాటకము మొదలగు శబ్దములలోని 'క' వర్ణమును పయిరీతిని వచ్చినదియే.

నడవడి = నడవడిక ; సాలు = సాలువు, బొట్టవ్రేలు = బొటనవ్రేలు, విట తాటము = విటతాటనము.

(13) అనుచితవిభాగము (Wrong Splitting) : అనుచితవిభాగము తెనుఁగు నందలి 'లు' ప్రత్యయము ఏర్పడుటకు మూలము. ద్రావిడమైన కళ్ ప్రత్యయము (కిళికళ్ = చిలుకలు అని మాఱి చిలుక+లు) లు వర్ణముగా నేర్పడినది. ఈ విషయము లుప్రత్యయచరిత్రమున నిరూపింపఁబడును.

ద్రుతము తరువాత నున్న యచ్చు కలిసినపుడు సంధిరూపమును తప్పుగా విఱిచి నకారాది పదములను గల్పించుటయు నిట్టిదే యగును.

తిన్నగాన్ + ఎగసెను = తిన్నగా + నెగసెను. మిగులంగన్ + ఆలి = మిగులంగ + నాలి, ఆలి; నాలి = పరిహాసము. సభన్ + ఏని = సభనేని = సభ +నేని.

(14) సామ్యము = Analogy : ఒక సంధికార్యముగాని, శబ్దరూపమునుగాని, ప్రత్యయమునుగాని చూచి యింకొకచోటను నట్లే కల్పించుట. భాషలో నేర్పడిన భేదములను, సామాన్య సూత్రముల నపేక్షించి యేర్పడిన యపవాదములను దొలగించి భాషనంతటిని ఒక్కటే పద్ధతిగా నేకరూపమును బొందించుటయే యీ సామ్యముపలనఁ గలుగు కార్యము. ఇది చాల విశాలమైన విషయము. ఎల్ల భాషలయందును, ఎల్లస్థితులయందును వింతయైన మార్పులను గల్పించునట్టి దీ పద్ధతి. పయిని నిరూపింపఁబడిన కొన్నిపద్ధతు లీ విషయమున నంతర్భూతములగును. దీనివలనఁ గలుగు మార్పులను లెక్కింప నలవిగాదు.

సంస్కృతమునందలి అకారాంతములయిన శబ్దములయొక్క 'రామేణ, రామైః' అను రూపములు సర్వనామములయొక్క 'తేన, తైః' అనువాని సామ్యమునఁ గలిగినవి.

చన్నులు = చండ్లు = చళ్లు ; కన్నులు = కండ్లు = కళ్లు అను రూపముల సామ్యమున, పళ్లు = పండ్లు = పన్నులు 'పన్ను' అను నొక యేకవచన రూపమును గల్పించిరి. 'పల్లు' అనునదియె సరియగు నేకవచనము. ఔపవిభక్తిక శబ్దముల సామ్యమున ననేకవిధములయిన అనౌపవిభక్తికములు ఔపవిభక్తికము లయినవి. అట్లే ఔపవిభక్తికములు అనౌపవిభక్తికము లగుచున్నవి. అనునాసిక్యము కలుగుటయు, తొలగుటయు సామ్యమువలననే కలుగుచున్నది. సామ్యముననే కృత్ప్రత్యయములను దద్ధితములుగా వాఁడుచున్నారు. 'గౌరవము' అను పదముపయి కృత్ప్రత్యయమయిన 'అనీయ' ను చేర్చి గౌరవనీయుఁడు అను పదము కల్పింపఁ బడినది. ఇట్లే ప్రావీణ్యత, రామణీయకత్వము, మొదలగు నవరూపములు సామ్యముననే యేర్పడినవి. ప్రావీణ్యము, రామణీయకము అనునవి భావార్థములనుట మఱచి తక్కిన పదముల సామ్యమున వీనిపయినిగూడ నీ ప్రత్యయములు చేర్పఁ బడినవి.

అచ్చట యనునది సప్తమ్యంత మను మాట మఱచి మఱల దానిపై నితర శబ్దసామ్యమున 'కు' ప్రత్యయము చేర్చి, అచ్చటకు అను రూపమును గల్పించి యున్నారు.

ఇట్లే యనేకములయిన యుదాహరణము లా యా సందర్భములలో వచ్చుచునే యుండును.

15. సంప్రసారణము : యణాదేశసంధిలో సంస్కృతపదములలో ఇ, ఉ, ఋ, ఌ అను వాని కచ్చు పరమయినచో క్రమమున, య, వ, ర, ల లు ఏర్పడును. య, వ, ర, ల అను వర్ణముల స్థానమున ఇ, ఉ, ఋ, ఌ వచ్చుటను సంప్రసారణమని సంస్కృతవైయాకరణులు వ్యవహరించిరి. ఇట్టి సంప్రసారణము తెనుఁగునఁ జాలతక్కువ. 'వ' కారము పదాదినిగాని, పదమధ్యమునఁగాని 'ఒ' వర్ణముగా మారుట గలదు. ఇట్టి మార్పునే ఒకరు సంప్రసారణ మనిరి. 'వ' కారమును 'ఒ' కారమును పరస్పరము మాఱుచునే యుండును. ఒద్ద = వద్ద; ఒక్కటి = వక్కటి ; వద్దు = ఒద్దు ; ఒయ్యారము = వయ్యారము ; ఓమము = వామము ; వడ్డి = ఒడ్డి.

16. వ్యంజనాయామము (Doubling) : హల్లులు జడ్డలగుట. అచ్చుల ఉచ్చారణకాలము పొడిగించినచో హ్రస్వము దీర్ఘమగును. అట్లే ఒకహల్లు నుచ్చరించుకాలమును (అనగా స్పర్శములో వాయుస్తంభనకాలమును) పొడిగించినచో ఆ హల్లునకు ద్విత్వము గలుగును. కాఁబట్టి అచ్చు లెట్లు హ్రస్వదీర్ఘములుగా మాఱుచుండునో యట్లే యుచ్చారణమున హల్లులును ద్విత్వమును పొందుచుఁ దొలఁగుచుండును. ఇట్లే హల్లు హ్రస్వమగుటయు సంభవించును.

ఉయ్యేల = ఊయేల, అక్కట = అకట, ప్రెగడ = ప్రెగ్గడ, ఆ చోటు = అచ్చోటు, చిటుకు = చిటుక్కు, చిట్టి = చిటి. ఇట్టివి భాషయం దెన్నో గలవు.[18]

17. సంయుక్తాక్షరములలోని కొన్నివర్ణములు తొలఁగును : క్రొత్త = కొత్త, తోడ్పాటు = తోపాటు ; స్థానము = తానము ; కరండి = గంటె ; అరంటి = అంటి ; వ్రాయు = రాయు.

పయిరీతి ననేకవిధములుగా నున్న మార్పులను, బద్ధతులను గ్రహించి యేది ప్రాచీనరూపమో, యేది నవీనరూపమో కనిపెట్టవలయును. నిర్ణాయకహేతువులు లేనప్పుడు అట్లే యనిర్ణీతముగా విడువవలయునుగాని తొందరపడి యప్రామాణికమయిన సిద్ధాంతమునకు రారాదు.

పయిని నిరూపించిన పద్ధతుల నెల్లను గ్రహించి వైయాకరణులు సంధికార్యములు మొదలయినవిగా నిరూపించి సూత్రరూపమున సంగ్రహించిరి. అట్లు సంగ్రహించుటలో చారిత్రకముగాఁ గాక రూపసాధనప్రక్రియయే యుద్దేశముగా ననేకాగమాదేశములఁ గల్పించి ప్రక్రియను సరిపెట్టుకొనిరి.

[18] బా. వ్యా. ప్రకీ. సూత్ర. 6-7-8.

# సంధి

## 1. లక్షణము

సంధి యను పదము సంస్కృతమునుండియే యితర శాస్త్రీయపదములవలెనే తెనుఁగునకు వచ్చినది. సమ్‌పూర్వకమయిన 'ధా' ధాతువునకు 'కూడు' లేక 'చేరు' అని యర్థము. సంధి యనఁగా కూడిక లేక చేరిక యని భావము. ఇట్టి సంధి సంహిత[1] కలిగినచో[8] నేర్పడును అని సంస్కృతవైయాకరణులు చెప్పిరి. సంహిత యనఁగా అతిశయితమయిన సన్నికర్ష యని భావము. రెండక్షరముల నుచ్చరించునపుడు అర్ధమాత్రాకమయిన కాలముకంటె నధికవ్యవధానము లేకుండుట సంహిత యని నిర్ణయించిరి. ఇట్టి సంహిత కలిగినప్పుడు సంస్కృతములోని అచ్చులకును హల్లులకును నాలుగు విధములయిన మార్పులలో నేదైనఁ గలుగవచ్చు నని వైయాకరణులందఱు నంగీకరించిరి. అవి ఆగమ, లోప, వికార, ప్రకృతిభావంబులు. ఈ యభిప్రాయము లను గుర్తించిన తొల్కాప్పియనారు తన వ్యాకరణమున వీనికి అరవపదములనే వాడెను.[2] పుణర్చి = సంధి. మెయ్‌పిఱిదాదల్ = వర్ణవికారః. మిగుదల్ = ఆగమః, కున్‌ఱల్ = లోపః, ఇయల్బు = ప్రకృతిభావము. "అచ్చునకు అచ్చు పరమయినను, హల్లున కచ్చు పరమయినను, హల్లునకు హల్లు పరమయినను, అచ్చునకు హల్లు పరమయినను సంధికార్యములు గలుగు"[3] నని తొల్కాప్పియనారు గుర్తించెను. (కన్నడ వ్యాకరణమున) శబ్దమణిదర్పణమున[4] కేశిరాజు "రెండుగాని అధికముగాగాని వర్ణములు పరస్పరము కూడునది సంధి" యని లక్షణమును నిర్వచించెను. పయి రెండు లక్షణములను బోలునట్లే ప్రాచీనాంధ్ర వైయాకరణులగు కేతన[5] పెద్దన[6]లును సంధిని నిర్వచించిరి. కాని ఆ లక్షణము కాలక్రమమున మాఱినది. అధర్వణుఁడును[7] అతని ననుసరించి చిన్నయసూరియును[8] వేఱుగా నిర్వచించిరి. కేతన పెద్దనల లక్షణమున పూర్వాంత్యవర్ణము అని మాత్రమే కలదు. ఇందు అచ్చులు మాత్రమనిగాని పరరూపత్వముగాని చేర్పఁబడలేదు. అధర్వణుఁడు "స్వర"

---

[1]పరః సన్నికర్షః సంహితా.

[2]అవై తామ్ మెయిపిఱిదాదల్ మిగుదల్ కున్ఱల్ ఎన్ఱు। ఇవ్వెన మొழிపతెరియునూరే. తొల్, ఎழுత్తు 110. [3]తొల్. ఎழுత్తు 108. [4]శబ్దమణి దర్పణము, సూత్రము 4౫. ఎరడుం పలవుం వర్ణం పరస్పరం కూడు వంద మదు సంధివలం. [5]మొదలి పదము తుదివర్ణము, వదలక పై పదము మొదలివర్ణముతోడన్, గదియగ సంధులు నాఁదగు. [6]ఆదిశబ్దాంతవర్ణంబు నంత్యశబ్దపూర్వ వర్ణంబుతోఁగూడఁ బొత్తుచేఁత, సంధి యగును. [7]ఆద్యంతవర్ణయోరైక్యం సన్ధిరి త్యుచ్యతే బుధైః। పూర్వస్య పరరూపత్వమత్రైవ నియతంభవేత్ ॥ అధర్వణుఁడు, సంధి—1. [8]పూర్వపరస్వరంబులకుం బరస్వరం బేకాదేశంబగుట సంధి యనంబడును.

శబ్దమును వాడక వర్ణశబ్దమును వాడెనుగాని పరరూపమును నియతముగా విధించెను. చిన్నయసూరి 'వర్ణములకు' బదులు 'స్వరములు' అని నిర్వచించి పరరూపత్వమును జేర్చి సంధిలక్షణము ఇంకను కొంచెపఱచెను. తెనుఁగువైయాకరణులు సంధి లక్షణమున నా పదము నర్థమును ఇట్లు కొంచెపఱచినను, హల్సంధిని సంధిపరిచ్ఛేద ములోనే నిరూపించిరి. మొత్తముమీద ద్రావిడభాషలలో సంధి యనఁగా తొల్కాప్పి యమునఁ జెప్పినట్లు నాల్గు విధములుగా గ్రహించుటయే యుక్తమని యంగీకరింపక తప్పదు. కాని చిన్నయసూరిమాత్రము "సంధి" యగును అని వ్రాసినప్పుడు తన లక్షణమునకు సరిపోవునట్లే సూత్రించెను. అట్లు 'పరాచ్చు' మాత్రమే నిలువనిచోటుల 'సంధి' కలుగునని వ్రాయలేదు. ఆయన మతమున సంధి యను పదమున కర్థము సంకుచితము. అట్లయినచో ఇతరములయినవాని నన్నిటిని చెప్పిన ప్రకరణమును సంధిపరిచ్ఛేద మననేల యని యడుగవచ్చును. కాని సందర్భ మునుబట్టి సమాసమున కర్థము చెప్పి సంధిపరిచ్ఛేదము అను పదమును సార్థక పఱచుట దుర్ఘటముగాదు. సంధియు సంధితుల్యము లయినవియును జెప్పినది సంధిపరిచ్ఛేదమని చెప్పుట కభ్యంతరము లేదుగదా! ప్రౌఢవ్యాకరణకారుఁడును సంధిశబ్దమును జిన్నయసూరి యర్థముననే వాడెననుట స్పష్టము. అనఁగా సంధి శబ్దము ఒకానొక సంధికార్యవిశేషమున రూఢమయినదని యభిప్రాయము. ఈ గ్రంథమునమాత్రము సాధారణముగా సంధిశబ్దము విశాలార్థముననే వాడఁబడును. అర్థవిశేష మున్నయెడల ప్రకరణమునుబట్టి స్పష్టమగును.

## 2. సంధికి హేతువులు

సంధికార్యములు జరుగుటకు సాధారణముగా వైయాకరణవిధులే కార ణము లనియు, నిట్లు వైయాకరణులు ఈ సంధివిధానమును గల్పించి భాషను మఱింత కఠినము చేసి భాష కపకారము చేసి రనియు నేఁటి పెద్దలు కొందఱు సభావేదికల నుండి పలుకుచుండగ నేను వినియున్నాను. సంధివిధానమున నిర్వచింపఁబడిన సంధి కార్యములు భాషలో స్వతస్సిద్ధముగా నేర్పడినవేగాని యవి కృత్రకముగా నొకరిచేతఁ గల్పింపఁబడినవి కావు. మనకుఁ బరమప్రామాణికమైన యాంగ్లభాషలో వలసిన యంత సంధి కలదు. కాని యుచ్చారణకును లేఖనక్రమమునకును సంబంధ మంతగా నుండవలయునని పట్టుదల వారికి లేదుగావున వా రా సంధిని వ్రాతలో నిరూపింపక పదములను ప్రకృతిభావముతోనే వ్రాయుదురు. ఈ విషయమును ఆంగ్లభాషా శాస్త్రజ్ఞులందఱును అంగీకరించినదే.[9] "What have you done with that book." అని పదములను ప్రకృతిభావముతో వ్రాయుదురు. ఉచ్చరించునపుడు సంధిలేక యుచ్చరించుట పొసగదు. 'వ్వాటా వ్యూడ న్విద్దట్బుక్' అనుదానితో సరిపోవునట్లు

[9] *General Phonetics* by Noel Armfield, Page 56-58.

పలుకుదురు. ఇట్లా పదములను గలుపక అనఁగా సంధిలేక మాటాడుట సహజము గాదు. 'వాఁడు ఎక్కడ' అని ప్రకృతిభావముతో నుచ్చారణ తెనుఁగువారిలో సామాన్యముకాదు. 'వాఁడెక్కడ' యనియే పలుకుదురు అట్లే వ్రాయుదురు. ఇట్లు అనంతముగా నాంగ్లమున వ్రాతకును, మాటకును సరిపడని వర్ణక్రమమును (Spelling), సంధ్యభావవిరచనమును మనకు దుష్టములు గావుగాని మన భాషాపద్ధతులను, మన వ్యాకరణపద్ధతులను, లిపిలోని యల్పదోషములను మనము నిందించుచునే యుందుము.

ఇట్లు భాషలో ఉచ్చారణమున నేర్పడిన సంధినే పరిశీలించి వైయాకరణులు సంస్కృతమునను ఆంధ్రమునను తా మంగీకరించిన ప్రమాణ ప్రయోగముల ననుసరించి లక్షణములను నిర్వచించిరి. సంధికార్యము లేర్పడుటకు హేతువులు: ఒకటి ప్రకృతిభావ నివారణము, రెండు సమీకరణము.[10] ప్రకృతిభావ మనఁగా అచ్చులను హల్లులను పదవిభజనముక నెట్లేర్పడిపవానిని అట్లే వ్రాయుట. ఇది యొకవిధముగా స్వాభావికము గాదనియే చెప్పవచ్చును. ఏలయనఁగా భాష చాల వఱకు పుట్టుకలో అఖండవాక్యముగా నుండినదిగాని భిన్న భిన్న శబ్దమాత్రములుగా బయలుదేరి యొక్కనాడు కలుపఁబడలేదు. అట్లు కలిపి మాటాడుటయే స్వభావము గావున పదములను విడిచి వ్రాయుట యస్వాభావికమన్నను దోషము లేదు. కాని యీ నియమము సందర్భమునుబట్టియు, ఆచారమునుబట్టియు అనుసరింపఁదగినది. పూర్వులుమాత్రము వాక్యము నఖండముగానే భావించి సంధి నంగీకరించి వ్రాసిరి. ఆ ఇల్లు అను పదముల నట్లే యడాగమము లేక యుచ్చరింపరనియు, ఆ యిల్లు అని పలుకుటయే స్వభావమనియు యడాగమమును వైయాకరణులు అంగీకరించిరి. ప్రకృతిభావనివారణము ద్రావిడభాషలన్నిటిలోను జనుల కిష్టము, ప్రామాణికులచే నంగీకృతము, వ్యాకరణసూత్రనిబద్ధము.[11] ఇట్టి ప్రకృతిభావనివారణము ద్రావిడ భాషలు వాడువారి కేల యింతటి ప్రీతికరమని యడుగవచ్చును. మొదటిది, రెండచ్చులను కూర్పక వేఱుగా నుచ్చరించుటయందలి క్లేశము. రెండవది (ద్రావిడభాషలలో) తెనుఁగులోని అసంకీర్ణపదములలో రెండు మూఁడు అచ్చుల కంటె నెక్కువయుండవని ముందుఁ జెప్పితిని. అట్టివి గొలుసు కొక్కెములవలె చేర్పఁబడును. వానిలో నొకయచ్చు భ్రష్టమగుట పదమునకు హాని. అర్థావగతికి

---

[10]Avoidance of hiatus and assimilation are the leading principles on which the rules of Sandhi are based. (MacDonnell, *Vedic Grammar* 20)

[11]Ordinarily however for the sake of ease of pronunciation, and in order to the retention of the agglutinative structure which is natural to these languages, all vowels are preserved pure and pronounced separately but as hiatus is dreaded with peculiar intensity the awkwardness of concurrent vowels is avoided by the interposition of y or v between the final vowel of one word and the initial vowel of the succeeding one. C. G. D. 174,

సంధిగ్గత. అభ్యాసమునకు విరుద్ధము. కాఁబట్టి వా రట్టి యచ్చులను నష్టముకాకుండ నిలుపుటకు ప్రయత్నించుట స్వభావసిద్ధము.

రెండవహేతువయిన సమీకరణముయొక్క స్వభావమును ముందే తెలిపితిని. ఉచ్చారణసౌకర్యమే దీనికి ఫలము. ఇట్టి రెండుహేతువులవలనను తెనుఁగునందలి సంధి యేర్పడినది. ఇఁక కాలక్రమము చొప్పున తెనుఁగు సంధిచరిత్రమును విశదపఱుప యత్నింతును.

## 3. య, వ ల ఆగమము

అరవము, కన్నడము, తెలుఁగు అను నీభాషలయందును, మిక్కిలి ప్రాచీన కాలమున ప్రకృతిభావరూపముననే వ్రాత యుండెననుట ప్రమాణసిద్ధము. ఈ మూఁడుభాషలలో ప్రాచీనవ్యాకరణము గలది అరవము. అందలి తొల్కాప్పియములో ఇట్లు నిర్వచింపఁబడినది. పూర్వపదాంత్యమునందున్న యచ్చునకును పర పదాదినున్న యచ్చునకును నడుమ అనుకూలమయిన హల్లును ( ఉడంబడుమెయ్ ) వ్రాయుట నిషిద్ధము కాదు.[12] పయి సూత్రమునకు వ్యాఖ్యానము వ్రాయుచు ఇళం పూరణర్ ఇట్లు వ్రాసియున్నారు : 'ఉడంబడుమెయ్' యనఁగా యకార వకారములు వచ్చుట నిషిద్ధము కాదు, అనుటవలన యకార వకారములు లేకుండఁగూడ నుండును. "కిళి+అరుదు = కిళిఅరుదు ; మూఙ్గా+ఇల్లై=మూఙ్గా ఇల్లై" అనఁగా నీ య వ ల యాదేశము వ్రాతలో వికల్పమని యర్థము. [అరవమున పూర్వాచ్చు 'ఇ, ఈ, ఐ' లలో నొకటయినప్పుడు సంధిలో యడాగమమును, 'ఏ' అయినప్పుడు 'య, వ' లలో నొకటియును, తక్కిన యేయచ్చు అయినను వకారమును, పరపదాద్యచ్చునకుఁ బూర్వము వచ్చునను పద్ధతి గలదు. తొల్కాప్పియనారు తన గ్రంథమున ఉడంబడుమెయ్ అనిమాత్రము తెల్పి యూరకుండెనుగాని యవి యేవో తెలుపలేదు. తరువాతి గ్రంథములలో నీ విషయము స్పష్టపఱచిరి.][13]

తొల్కాప్పియనారు తెల్పినట్లు కొన్ని ప్రాచీన తమిళశాసనములలో ప్రకృతిభావముతోడనే, య వ లు చేర్పకయే వ్రాత కలదు.[14] ఇట్లే ప్రాచీన కర్ణాట

[12]ఎల్లా మొழிక్కుమ్ ఉయిర్ వరువழியే । యుడంబడు మెయ్యిన్ ఉరువుకొళల్ వరైయార్. తొల్. ఎ. 141. [13]నన్నూల్ 162. ఇ, ఈ, ఐ, వழிయవ్వుమ్, ఏనై ఉయిర్ వழி వవ్వుమ్, ఏమున్ ఇవ్విరుమైయుమ్, ఉయిర్ వరిన్ ఉడంబడు మెయ్ ఎన్ఱు ఆగుమ్. మణి + అழగు= మణియழగు; తీ + అనల్ = తీయనల్ ; పనై + ఓలై = పనై యోలై ; చే + అగమ్=చేయగమ్; చే + ఏఱి=చేవెఱి; విళ + అழకిదు=విళవழకిదు; పలా + అరిదు=పలావరిదు; కడు + అழగు= కడువழగు; కో + అழగు=కోవழగు; కౌ + అழగు=కౌవழగు.

[14]మలర్ మంగై ఒడు ; పూవిరిఉమ్ ; కావిరిఇన్ ; మణిఇమైక్కుమ్ ; మా ఇరుమ్ పెరుమ్ బుణర్ కావిరి. ఇ అ. వా. 22-పుట 70. ఎ. ఇ. వా. 17 భాగ. 7. P. S. S. 73.

శాసనములయందును య వ ల యాగమము లేకయే వ్రాత కలదు.[15] కన్నడవ్యాకరణమునందుఁగూడ యకార వకారములు ఆగమము లగుట కలదు. అ, ఇ, ఈ లకును, అవధారణార్థకమయిన ఏకారమునకును పరముగా యకారము వచ్చును.[16] ఋ, ౠ, ఓ, ఔ ల తరువాత వకార మాగమ మగును. కన్నడపదములలోని ఉ, ఊ, ఋ, ౠ, ఓ, ఔ, ఇ, ఈ అనువాని తరువాత య, వ లు బహుళముగా వచ్చును.

ఇట్లు తమిళ కర్ణాట భాషలయందు అచ్చునకచ్చు పరమగునపుడు ప్రకృతిభావనివారణకయి నడుమ 'య' కారముగాని 'వ' కారముగాని వచ్చుట బహుళము. దీనికిఁ గొన్ని యపవాదము లున్నవిగాని యవి యల్పసంఖ్యాకములు. ఇతర ద్రావిడ భాషలయందును ఈ పద్ధతియే గలదు.

తెనుఁగున సంధి లేనిచోట స్వరంబుకంటెం బరంబయిన స్వరంబునకు యడాగమంబగును.[17] అని సూరి సూత్రించెను. (సంధి యనఁగా నాతని లక్షణంబున పూర్వపుస్వరంబులకుఁ బరస్వరం బేకాదేశంబగుట) అనఁగా అచ్చునకచ్చు పరంబయినచో ప్రకృతిభావనివారణకొఱకు నడుమ యడాగమంబును విధించె ననుట. అరవము, కన్నడము, తుళు అను భాషలలోనున్నట్లు యకార వకారంబులు రెండిటిని అంగీకరించి ఒకదానిని కొన్నియెడలను, మఱియొక దానిని కొన్నియెడలను నిధింపలేదు. వకార విధానమును పూర్తిగా నిరాకరించెను. అనఁగా ప్రామాణికభాషలో నన్నయనుండి నేటివఱకును 'వ' కారాగమము లేదని యర్థము. అట్లనుటవలన తెనుఁగున 'వ' కారాగమమునకుఁ బ్రవేశము లేదని భావింపవలదు. వాడుకలో వకారము వినఁబడుచునే యుండును. అచ్చునకు ఉ, ఊ, ఒ, ఓ లు పరమగునపుడు 'వ'కారాగమముగూడ వినఁబడుచునేయున్నది. 'నా వుంగరము, ఈ వున్న, మా వూపిరి, అది వొక్కటె, ఇది వోపిక.' కాలక్రమమున ఇట్టి ఆగమరూపమయిన 'వ' కారము పదగతమయినదని భావించుటకుఁగూడ హేతు వేర్పడినది. అనుచిత విభాగమువలనఁ బదములు వకారాదిగా విభజింపఁబడెను. కావుననే అప్పకవి తెనుఁగున 'వు, వూ, వొ, వో' లు ఆదియందుఁ గల పదములు లేవని సూత్రింపవలసివచ్చెను.[18] చిన్నయసూరియును 'యకారంబును, వు, వూ, వొ, వో లును తెనుఁగుమాటలకు మొదట లేవు' అని వ్రాసెను.[19] పదాదిని 'య' కారముగూడ

---

[15] ఇ. ఆ. వా. 10 పుట 60 కాలము 578 క్రీ. వె. కల్మనెగె ఇత్తొదు, మాలకారగ్గె అర్థవీసధి, వసన్తకుమార ఇదకె సాక్షి. 692 సం. క్రీ. వె. ఎ. కర్ణా VIII. 571.

[16] ఆ + ఇర్ద = ఆయిర్ద ; కవి + ఆర్ = కవియార్ ; శ్రీ + అం = శ్రీయం ; జో + ఎందు = జోయెందు ; దై + ఎందం = దైయెందం ; పసె + ఇర్దం = పసెయిర్దం ; ఏ + ఎందం = ఏయెందం; ౠ + ఎందం = ౠయెందం ; గో + అం = గోవం ; నౌ + అం = నౌవ నేఱదం ; ఈ + ఇదు = ఈవిదు. శబ్దమణిదర్పణం—సూ 52–60. [17] బా. వ్యా. సంధి. సూ. 3. [18] అప్పకవీయము 2 ఆశ్వాసము. [19] బా. వ్యా. సంజ్ఞ - 17. సూ.

శ్రుతమగుటనుబట్టియు పయిసూత్రము వ్రాయవలసివచ్చినది. దీనినిబట్టి పయి 'య, వ' లు ఆగమమాత్రంబులేగాని యావయవికంబులు గావని భాషాభ్యాసకుల యందు హత్తునట్లు చేయవలయు నను ప్రయత్నము లాక్షణికులందఱియందును గలదనుట స్పష్టమేకదా! చింతామణియందు పదాదియకారము అంగీకృతమయి నట్లును, సంధియందు అజ్వద్భావము విధింపఁబడినట్లును ముందు నిరూపించితిని.[20]

ఇక నన్నయకు ముందటి శాసనభాషనుబట్టి యోజించినచో యడాగమ విరహితమైన వ్రాత బహుళమనియు, పదాది యకారము వ్రాతలోఁ గనుపట్టుచున్న దనియు దనకాలములోని భాషాపరిస్థితులను బరిశీలించి యడాగమమును స్థిరపఱచి తాను వ్రాసిన ప్రామాణికభాషను వాడుకలోనికిఁ దెచ్చెననియు నన్నయ భాషలోని ధ్వనులు అను విషయమునఁ దెల్పితిని.[21] తరువాతి వైయాకరణులు పదాది యకారము నిరాకరించుచు, పదాది వకారమును గణింపకయే సూత్రములను వ్రాసిరి.

పై విచారణనుబట్టి తేలిన దేమనఁగా (అరవము, కన్నడము, తెనుఁగు) ఒక్క రీతినే వ్యాకరణరచనకుఁ బూర్వము య, వల యాగమము లేకయే అచ్చులు వ్రాయు చుండెడివారు. య, వ లు ప్రకృతిభావ నివారణముకయి వచ్చుచుండినవి. అట్టివానిని గుర్తించి వైయాకరణులు వానిని విధించుటవలనను, ఆ వ్యాకరణములు ప్రమాణము లగుటవలనను అట్టి వ్రాతకుఁ బ్రామాణ్యము గలిగి ప్రాచుర్య మేర్పడినది. తెనుఁగున యడాగమముమాత్రమే యంగీకరింపఁబడెను. క్వాచిత్కముగా 'వ' కారాగమము ఉన్ననుగూడ అది సార్వత్రికముగాదనియో, అట్టి యుచ్చారణము శ్రేష్ఠము గాదనియో నిరాకరింపఁబడినది. అట్లు నిరాకరించుటవలన 'వ' కారాగమము చాలవఱకు నశించి పోయినది. సంధిలో వచ్చిన యా, వ లు పదగతవర్ణములే యని ప్రజలు భ్రమింప కుండుటకును, ఇవి యుచ్చారణసౌకర్యముకొఱకుమాత్రమే వచ్చెనని తెలుపుటకును, అనుచితవిభాగమును బరిహరించుటకును, బదాదిని యకారమును, వు, వూ, వొ, వో లును లేవని వైయాకరణులు సూత్రింపవలసివచ్చినది. వకారాదియయిన వు, వూ, వొ, వో లను మాత్రమే నిషేధించుటనుబట్టి యీ 'వ' కారము, ఉ, ఊ, ఒ, ఓ లకు ముందు మాత్రమే బహుళముగా వినవచ్చుచున్నది యని యభిప్రాయము. అన్నము = వణ్ణము, అనునట్లు వకార మితరస్థలములయందును జాల నరుదుగా వినఁబడుచునే యుండును.

ఈ యకార వకారములు ఉచ్చారణసౌకర్యమును గల్పించును అను వాక్యము నభిప్రాయమును క్రింద విశదీకరించుచున్నాను. యకారము తాలవ్యము,

---

[20] సర్వత్రాజ్వత్కార్యం జ్ఞేయం । యస్య ద్రుతప్రకృతికేభ్యః. ఆ. చి. యశ్రుతిమా ర్యాలఘుయం । ప్రవదంతి ప్రాణతః పరం ప్రాణమ్. ఆ. చి. [21] ద. హి. శా. వా. IV. 1014. (1038 A. D.) దానికి యాచన్ద్రి; పాలినికి యిచ్చిన; ధ్వజములు యాచన్ద్రార్కకమ్ము; వారు యీాబోలు.

వకారము ఓష్ఠ్యము. ఇవి అంతస్థములు. అచ్చులలో, ఇ, ఈ, ఎ, ఏ, ఐ అనునవి తాలవ్యములు. ఉ, ఊ, ఒ, ఓ, ఔ అనునవి ఓష్ఠ్యములు. అ+ఇల్లు అని యుచ్చరింపవలసినపుడు కంఠ్యమైన ఆకారము నుచ్చరించి తిరిగి తాలవ్యాచ్చు అగు ఇకారము నుచ్చరించుటకు వచ్చు నాలుక కొక మజిలీ కావలెను. అనఁగా మొదటి స్థానమునుండి రెండవస్థానమునకు వచ్చినప్పు డేర్పడు నడిమిస్థానమునకు సంబంధించిన స్థానమే యీ మజిలీ. ఆస్థానమున అనఁగా, బయి రెండచ్చులకును నడుమ నొకధ్వని వినఁబడుచునే యుండును. అదియే యకారము. ఓష్ఠ్యములయిన యచ్చులకు ముందు వకారము కలుగుచుండును. కావుననే, ఆ వూరు, ఈ వుత్తరము, మీ వోర్పు మొదలయిన యుచ్చారణము వినఁబడుచుండును. య, వ లు సాధారణముగా నెట్టిధ్వనులతోనైనను గలసి యుచ్చరించుటకుఁ గష్టములేనివి. కావుననే యకారము తాలవ్యము తరువాతను, వకారము ఓష్ఠ్యముల తరువాతను అరవ, కన్నడ సంధుల యందు వైయాకరణులచే నిరూపింపఁబడినవి. ఇట్టి ధ్వనులను (Glides) అని వ్యవహరింతురు.[22] ఇవి ఒక యక్షరమునుండి యింకొక యక్షరమునకు జారునవి యను నన్వర్థసంజ్ఞ కలవియై యున్నవి. ఈ యక్షరములు చేరుటకు ప్రకృతిభావ నివారణమును,[23] ఈ య, వ ల మార్దవస్వభావమును హేతువు లయియున్నవనుట స్పష్టము.

అరవమున పదాంతముననుండిన 'ఐ' అను వర్ణము పరపదము నచ్చుతోఁజేరి సంధియందు 'అయ్' గా మారి అనుచితవిభాగమువలన 'యా' దిపదము లేర్పడెనేమో యని యొక యభిప్రాయము కలదు. తలై +అక్కడ = తలయ్ + అక్కడ = తల యక్కడ. ఇట్లేర్పడిన యకారమును[24] కాలక్రమమున సంధిలో వచ్చిన యాగమమాత్రముగా గ్రహించియుండవచ్చును. ఈ యకారము కాలక్రమమునఁ దక్కిన యెడలకును ప్రాకియుండవచ్చును. ఈ మార్పు రెండు మూఁడచ్చులు గల శబ్దములలో గలుగవచ్చును. ఏకాచ్చు గల శబ్దములలో యడాగమము సంధి నాపుటకు వచ్చిన దనక తప్పదు. కై +ఐ=కైయై అగునుగాని 'కయై' కాదు. మొత్తముమీద నీ 'ఐ' స్వరూపమును, ప్రాచీనములయిన అరవపదముల తుది నున్న 'ఐ'కారమును, అనుచితవిభాగమునుగూడ యడాగమప్రాప్తికి సహకారిహేతువులైనవి అని యూహింపనగును.

ఇఁక 'వ'కారాగమమునుగూర్చి విచారించుచు అ - ఇ అను నిర్దేశసర్వ నామాంగములరూపములు ప్రాచీనకాలమున అవ్ - ఇవ్ అని యుండెనేమో

[22] *Dravidic Glides* by Prof. L. V. Ramaswamy Iyer, M. A., B. L. పు. 337 వ్యాస సంగ్రహము. గిడుగు రామమూర్తి పంతులుగారి జన్మదినోత్సవ ప్రచురణము.

[23] *General Phonetics* by Noel Armfield, page 59-60.

[24] సంధి పుట 48, కోరాడ రామకృష్ణయ్యగారు.

యని సందేహముగలుగఁదమానదు. అట్లే యయినచో నీ రూపములలోని వకారము ఆగమముగాక పూర్వశబ్దగతమైనదే యగును.[25]" అని సంధికారులు వ్రాసిరి. ఈ విషయ మింకను జింత్యము. అట్లే పై త్రికము యొక్క ఆదిమరూపము వకారాంత మని నిరూపింపఁబడిగినచో నందును గొంత యనుచితవిభాగము గలిగిన దనవచ్చును. అట్టి యనుచితవిభాగము మరికొంత యకార, వకారాగమవిధానమును స్థిరపఱచెను అని చెప్పవచ్చునేగాని 'య, వ' కారములు ప్రకృతిభావనివారణకై వచ్చిన యాగమ ములు అను సిద్ధాంతమున కెంతమాత్రమును బ్రతిబంధకము గాదు. స్వభావమును బట్టి య, వ లు ఆగమములు లనుట స్పష్టము.

## 4. ద్రుతప్రకృతికముల స్వభావము

తెనుఁగున 'య'కారాగమము సంధ్యభావస్థలములలోఁ గళలపైని వచ్చును. కళలు గానివి ద్రుతప్రకృతికములు. అనఁగా భాషలో నున్న శబ్దములన్నియు రెండు తెగలుగా విభజింపఁబడినవని భావము. చింతామణికర్త కళలను నిరూపించి, మిగిలినవి అనువర్తించియున్ననకారములుగలవి ద్రుతప్రకృతికములు అని లక్షణము చెప్పెను.[26] నకారంబు ద్రుతంబనియు, ద్రుతాంతములయిన పదములు ద్రుత ప్రకృతికములనియు సూత్రించి, ద్రుతప్రకృతికము లన్నిటిని బరిగణించి, ద్రుత ప్రకృతులుగాని శబ్దంబులు కళ లనంబడును అని సూరి స్థిరపఱచెను.[27] కళలకును ద్రుతప్రకృతికములకును స్వతస్సిద్ధముగా భాషలో గల భేదమేమి? అను ప్రశ్నకు రెండువిధములయిన సమాధానములు గలవు. సంధ్యభావస్థలములయందు పూర్వ పర శబ్దముల సన్నికృష్టాచ్చులకు నడుమ యడాగమము వచ్చినచో నా పూర్వ శబ్దములు కళలు. మిగిలినవి ద్రుతప్రకృతులు అను సమాధాన మొకటి. ద్రుతము అంతమందుగల శబ్దములు ద్రుతప్రకృతులు ; మిగిలినవి కళలు అని చెప్పుట రెండ వది. కళలపయిని వచ్చు 'య'కారము ఆగమ యకారమేగాని శబ్దగతమయినది గాదని వైయాకరణు లందఱును నంగీకరించినదే. దీని స్వభావము ముందు విపులముగాఁ జర్చించితిని.

ద్రుతాంతముల నుండు ద్రుత మనఁగా నేమి? ద్రుతస్వరూప విషయమున ననేక భిన్నాభిప్రాయములు గలవు. 'ద్రుతాఖ్యో నః'—అని చింతామణి. 'నకా రంబు ద్రుతంబు.' అని చిన్నయసూరి. 'నకారంబసాధారణంబు ద్రుతంబు. ప్రత్యయాగమావ్యయాత్మకమై యుత్వవిశిష్టమయిన నకారంబు ద్రుతసంజ్ఞకం బని

---

[25] సంధి పుట 54. కోరాడ రామకృష్ణయ్యగారు.

[26] అన్యే ద్రుతప్రకృతయః యే స్యుః హ్యానుజీవితద్రుతా నిత్యమ్. ఆ. శ. చిం. సంజ్ఞ 39 సూ.

[27] బా. వ్యా. సంజ్ఞ 11-12-13 సూత్రములు.

యర్థము. ద్రుత మనఁగా నొల్లని యెడ మఱగిపోవునది' యని ప్రౌఢవ్యాకరణము[28] చిన్నయసూరి ద్రుతంబునకు స్వత్వంబు అనఁగా ప్రకృతిభావము 'ను' స్వరూపము అని బా. వా. 17-20 సూత్రసందర్భమున స్పష్టపఱచెను. దీనినిబట్టి ద్రుత మనఁగా పొల్లు నకారమా, లేక నువర్ణమా ? యను సందిగ్ధత యేర్పడుచున్నది. చేసితిని మొదలయిన క్రియారూపములతుది నున్న 'ని' వర్ణము 'ను' వర్ణము యొక్క రూపాంతరమని 'ఇకారంబు మీది కు ను వు క్రియావిభక్తుల యుత్వంబున కిత్వంబగును'[29] అను సూత్రంబున సిద్ధించుచున్నది. అనఁగా న్, ను, ని అనునవి యన్నియును ద్రుతరూపములే. ఇం దేది ద్రుతస్వరూపము అను విషయమున నభిప్రాయభేదములు గలవనునట్లు ముందఱి సూత్రములనుబట్టి తెలియుచునే యున్నది. నేఁటి వ్యాకరణకార్యములనుబట్టియు, రచనాప్రణాళికనుబట్టియు మూఁడును ద్రుత స్వరూపములే యనక తప్పదు. కాని యిం దేది ప్రాచీనము, దాని ప్రాథమికస్వరూప మేది యనువిషయమే విచార్యము. శాస్త్రమయిన వ్యాకరణము ననుసరించి యేది ద్రుతము యొక్క స్వత్వరూపము అను విషయమున ఆ యా వ్యాకర్తల యభిప్రాయములను నిర్ణయించుట వ్యాకరణవిషయము. చారిత్రకముగా నేది ప్రాథమికరూపము అను విషయమే యిచ్చట ముఖ్యముగా విచార్యము. నన్నయ మతమున అనఁగా ఆంధ్రశబ్దచింతామణి ననుసరించి ద్రుతము పొల్లునకారమే యనియు, 'ను' స్వరూపముగాదనియు వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రిగారు విపులమైన విచారణ చేసి నిర్ణయించిరి.[30] ఆంధ్రభాషాచరిత్రకారులు పై విషయమును గొంచెము తడవి 'ద్రుతస్వరూపము నకారపొల్లే[31] యను విషయమున వారితో నేకీభవింతుము' అని వ్రాసియు, 'ను' స్వరూపమునుగూర్చి కొంత చర్చ జరిపిరి.

ద్రుతము అను శబ్దము నేఁడు రూఢము. అంతియగాక పారిభాషికము. ద్రుత శబ్దమునకుఁ గల యౌగికార్థము అద్దాని స్వరూపమునకు పూర్తిగా సరిపడునా, లేదా యను విచారణ ధర్మము గాదు. రూఢపదములును, యోగరూఢపదములును పూర్తిగ యౌగికార్థముతో సరిపడుననిగాని, సరిపడక తప్పదనిగాని యెవ్వరును నిర్ణయింపఁజాలరు. రెండవది వ్యాకరణప్రక్రియకొఱకు 'న్, ను, ని' అనువానిలో నెద్దానినిగాని ద్రుతమని నిర్ణయించుకొని ప్రణాళిక స్వవచోవ్యాఘాతము లేనట్లు నడుపుటయే వైయాకరణుని పద్ధతి. ఆ విషయమే యందు విచార్యము. గ్రంథములనుబట్టి చూడఁగా నేఁడు భిన్నమతములచొప్పున 'న్, ను, ని' అను మూఁడు విధములుగా ద్రుతము కనుపట్టుచున్నది.

1. శబ్దగతముగా నుండి, అవయవికమయిన నకారము. కను, విను, మను మొదలగు ధాతువులలోనిదియును, తాను, నేను పదంబులయందలిదియును, ప్రత్య

[28] ప్రౌ. వ్యా. సంజ్ఞ 8 సూత్రము. [29] బా. వ్యా. తత్సమము సూ. 26. [30] చింతామణి విషయపరిశోధనము విషయము 125-137. [31] ఆ. భా. చ. వా. I, పుట 206

యును అనఁబడి ఉన్నాను, చేసితిని మొదలయిన పదముల తుది నున్నదియు నగు వర్ణములు.[32]

2. హల్సంధిలోను, అచ్సంధిలోను ఆగమముగా వచ్చి వ్యాకరణమున విధింపఁబడిన నుగాగమములును. బాలవ్యాకరణము. సంధి 25-27-37-38 సూత్రములు.

3. సముచ్చయాద్యర్థక మయిన 'ను' వర్ణము.

పయి మూఁడువిధములయిన నువర్ణములును ద్రుతకార్యములను గల్పించుచో ద్రుతసంజ్ఞకుఁ దగియున్నవి.

ద్రుత మనఁబడు నీ 'న'కారము "ప్రకృతినిష్ఠమైనను ప్రత్యయాదినిష్ఠమైనను స్వరవిశిష్టమగు నకారమునందలి స్వరము ద్రుతి ననఁగా లోపమును బొందినచో నట్టి స్వరద్రుతి నందిన పరిశిష్ట నకారము ద్రుత మను నన్వర్థసంజ్ఞను బొందుచున్నదని తాత్పర్యము"[33] అని సీతారామస్వామిశాస్త్రులుగారు వ్రాసిరి. పయినిఁ జెప్పఁబడిన ప్రౌఢవ్యాకరణకర్త మతమున 'న' కారము తానే మఱగి పోవునది గావున ద్రుత మనఁబడుచున్నది. ఇంతియగాక శబ్దగతమయిన నకారము ద్రుతము గాదని యప్పకవి చెప్పెను.[34] ఇట్లు ద్రుతము స్వరూపమునుగూర్చి లాక్షణికులలో గొంత విప్రతిపత్తియు, భేదముల కవకాశమును నేర్పడుటకు దాని చరిత్రయే హేతువని నిరూపింపఁబడును.

ప్రాచీనకాలమున తెనుఁగుశబ్దములు చాలవఱకు హలంతములుగా నుండెనని యితర ద్రావిడభాషలగు అరవ, మలయాళములలోని పదములనుబట్టియు, నన్నయకు ముందుండిన శాసనభాషనుబట్టియును నిశ్చయింపనగును.

అట్టి హలంతభాష కాలక్రమమున అజంతమయి ఉకారమును, ఇకారమును పదముల తుదిని జేరినవని యూహింప నగును. ఇందు నకారాంతపదములు చాల నధికములు. పురుషవాచకము లన్నియుఁ జాలవఱకు నకారాంతములుగానే యుండెను. అవన్, రామన్. మీన్ + అక్కడ; తాన్ + ఉండెను; నేన్ + అర్చితిని ఇత్యాది స్థలములయందు నకారము పరాచ్చుతోఁ గలసి 'మీనక్కడ', 'నేనార్చితిని' మొదలయినరూపములు గలుగక తప్పదు. మిన్+అంత; కన్+ఇది మొదలయిన చోటులందు మొదటిపదముపయి ఊనిక నిల్చుటచేతను, రెండవ యచ్చు

[32] భారతమునందలి యీ క్రింది ప్రయోగములను జూచునది. తన్వినుచున్నవారల-ఆది III, 9. అన్నిష్టసఖ౯. ఆది. III, 140. శృంగియన్వాఁడు. ఆది II, 180. ఉత్తముల్ పొగడగ మన్ మహామతులు. ఆది II, 149. విప్రసతికి నూఱు వేడఁజ౯ వరములు. సభా II, 263. [33] చింతామణి విషయపరిశోధనము (సానుబంధము) విషయము 125. [34] గూను నెమ్మేను మెడనాను మీను పేను మ్రాను పఱిచెను బులిబోను మఱియు నిట్లు భువి నకారంబుతోగూడఁ బుట్టు శబ్దములు ద్రుతప్రకృతులు గావు మునిశరణ్య. (అప్పకవీయము. 5, ఆ. 26. ప)

నశింపకుండునట్లు అర్థాపగతికొఱకు కనిపెట్టవలసిన యవసరము వచ్చుటచేతను, నకారము పొడిగింపఁబడి మిన్నంత, కన్నిది మొదలయిన రూపములు వచ్చినవి. అనఁగా మఱియొక నకార మాగమముఁగా వచ్చిన దన్నమాట.

ఇంతియగాక తెనుఁగున అరసున్న యున్న పదములు కొన్ని వందలు గలవు. అరసున్నకు పూర్వరూపము నిండుసున్న ఇట్టి నిండుసున్న (కొన్నియెడల 'న' కారము) దీర్ఘముఁమీద పూర్తిగా భ్రష్టమయినది. హ్రస్వముపయిని రెండువిధము లయిన రూపములును గలవు. ఇట్టి పదములలో కొన్ని నిండుసున్న లేనివే పూర్వములు. తక్కినవి సున్న యున్నవి పూర్వములు. (ఈ విషయము అరసున్న చరిత్రము వివరించునపుడు చర్చింపఁబడును.) ముందుప్రకరణమున ఆనునాసిక్యము నిమిత్త మక్కఱలేకయే ద్రావిడభాషలయందుఁ గలుగుననియు, తొలఁగుననియును తెలిపితిని. ఇంతియగాక రెండవజాతి యయిన వ్యాకరణ విహిత నుమాగమాదులు స్పష్టముగాఁ జాలవఱకు ఆగమమాత్రము లనుట నిస్సంశయముగదా !

ప్రభువు+ఆజ్ఞ, విధాతృ+ఆనతి మొదలయిన స్థలములలో అచ్చులను నశింపకుండ నిలుపుటకు నడుమ ఆగమము రావలయును.

ఇచ్చట యడాగమము కలుగుట సుగమముకాదు. ఉకారము ఓష్ఠ్యము. వకారాగమమును ఉచ్చారణలో సౌకర్యమును గలిగింపదు. ముం దొక వకారము కలదుకదా ! కావున నకారాగమము కలిగినది. నిర్హేతుకముగా నకారాగమము కలుగుచుండుటయు, ఉన్నది పోవుచుండుటయు భాషలో పరిచితమగుటచే నద్దాని సామ్యమున నియ్యది కలిగినది. ఇట్లే యనేకస్థలములయందు నకారము ప్రకృతి భావనివారణముకొఱకు వచ్చినట్లు నిరూపింపవచ్చును.

తిన్నగా+ఉన్నది=తిన్నగా (న్) ఉన్నది. ఇచ్చట వాడుకలో నకారమునకు బదులుగా యకారముతోఁగూడ నుచ్చారణము వినఁబడును. 'తిన్నగా యున్నది' ఈ యుచ్చారణము ప్రామాణికముకాదు. కాని 'న' స్థానములో 'య' వచ్చునని చెప్పుటకుఁ జాలును. సంఖ్యావాచకములలో పదియేను, పదిహేను, పదునేను అను మూఁడురూపములలోను 'య, హ, న' అనునవి ప్రకృతిభావనివారణకు ఏర్పడిన వనుట స్పష్టము. అరవమునఁ బ్రామాణికభాషలో కాట్టి+న్+అ (కాట్టిన), కాట్టి+య్+అ (కాట్టియ) అను రెండు రూపములును వాడుకలో నున్నవి. ఇక్కడి నకారము ప్రకృతిభావనివారణకొఱ కేర్పడినదే యనుట నిస్సంశయము. ఇట్లే అరవమునందలి అమహద్బహువచనమునఁ ఇరుక్కిన్ఱన (ఉన్నవి), ఇరుక్కిన్ఱ+(న్)+అ-అని నకారము సంధి నాపుటకు వచ్చినది. న్యాయముగా అవ, అవై అను శబ్దములలో నున్న 'వ్' కారము సంధి నాపుటకు వచ్చియుండవలెను.[35]

సముచ్చయార్థక 'ను' వర్ణముయొక్క ప్రాచీనరూపమున ఉం, ఉమ్ అనునది యని అరవ కన్నడములను బరిశీలించినచో స్పష్టమగును. ప్రాచీనపు

[35] C. G. D. 177.

తెనుఁగు శాసనములలోఁ గొన్నియెడల నియ్యది 'యును' అనియే యున్నది. 'ఎవ్వరయ్యును' = ఎవ్వరయ్యును. జయసింహవల్లభుని శాసనము. 641 క్రీ. శ. మల్లంపల్లి సోమశేఖరశర్మ.

ఈ 'ఉమ్' అనునది తెనుగున 'ఉన్, ఉను' అను రూపములను బొంది యడాగమము రాగా 'యును' అను రూపముతో గనుపట్టుచున్నది. "కావుననే కళలగు నను దంతశబ్దములమీఁద నయ్యది 'యు' వర్ణపూర్వకముగ విభాష నగును" అని ప్రౌఢవ్యాకరణమున సూత్రము గలిగినది. "చేయకయును, అందుటయును, అదియును"[36] మొదలగునవి యుదాహరణములు. 'రాముఁడు' మొదలయిన ఉకారాంత రూపములు తెనుఁగున బహుళముగా నుండుటవలనను, తుది 'ఉ' వర్ణముతో "ఉన్" యొక్క ఉకారమునకు సంధి కలుగుటవలనను ముందరి ఉకారము అనుచిత విభాగమున నశించి 'ను' శబ్దము సూత్రమే సముచ్చయార్థకమని సిద్ధాంతము బయలుదేరినది. ఇట్టి 'ను' శబ్దము అర్థవిశేషంబులయందుఁగూడ జేర్పఁబడుట సంభవించుచున్నది. కావుననే "నామ సర్వనామంబులకును, గళలగు నవ్యయంబులకును గడపల సముచ్చయార్థ విశేషపాదపూరణములయందు 'ను' శబ్దంబు తఱచుగ నగు"[36] అని సూత్రము పుట్టినది. ఇట్టి యర్థవిశేషము గల నుశబ్ద మేర్పడినతరువాత కళలపయినిగూడఁ జేర్పఁబడుటచేతను, తుది నున్న ఉకారము లోపించుటచేతను నకారము మాత్రము నిలిచి కొన్నిశబ్దములు ద్రుతములా, కళలా యను సందేహము గలిగింపఁజొచ్చి వైయాకరణులను కలతపెట్టసాగెను. ఎంత సనఘుఁడు = ఎంతయున్+అనఘుఁడు, ఎంతనెంతయు=ఎంతయున్+ఎంతయు ఇత్యాదులయిన యనేక ప్రామాణికప్రయోగములు గలుగుటకు హేతు వేర్పడినది.[37]

పయిని నిరూపించిన మూఁడువిధములయిన శబ్దముల తుది నున్న నకారమును గలిసి యొక్కటిగా నేర్పడి వైయాకరణులచే ద్రుతము కల్పింపఁబడినది.[38]

పయివిధానము చారిత్రకునకును, కొంతవఱకు వైయాకరణునకును విదితమును సమ్మతమును గావచ్చునుగాని సామాన్యముగా భాషను వాడువాని దృష్టియం దెట్లీ ద్రుతము భాసించును అనునది స్పష్టపఱుతును. తెనుఁగున ప్రకృతిభావనివారణమును, దానికొఱకు ఒక యాగమమును అనుభవసిద్ధమును, ఇష్టమును అని ముందుఁ జెప్పితిని. ఇది మాటాడువాని యభ్యాసములోనికెక్కి అప్రయత్నముగా నేర్పడునట్టి విషయము.

చేయుచున్+ఉన్నది=(సంధిలేనిరూపము) చేయుచునున్నది; (సంధిగలరూపము) చేయుచున్నది. ఈ రెంటియందునుగల భేదము నకారస్థితియేగదా! ఇట్టి నకారము పోయినచో అర్థావగతికి అడ్డంకి యనిగాని, పదస్వరూపము చెడిపోవుననిగాని, లేక ఊనిక నష్టమగుననిగాని తోచినప్పుడుతప్ప తక్కిన స్థలములయం దెల్లయెడలను ఇది సామాన్యునకు ఆగమమాత్రముగానే స్ఫురించును. యకార మెట్టిదియో

---

[36] ప్రౌ. శ. వ. 116. సూ. [37] ఎందేనినుండి. అది. వ. iii. 181, ఎయ్యెనియు నొక్కస్త్రీయందు. అది. వ. iv. 127. [38] సంధి-కోరాడ రామకృష్ణయ్యగారు. పుట. 199.

నకారముగూడ నట్టిదియే యగును. కావున సామాన్యుల భాషాసృష్టిలో మాత్రము నకారమగు ద్రుతము ప్రకృతిభావనివారణకొఱకు వచ్చిన యాగమ మాత్రముగానే స్ఫురించుచుండుట కళలకును, ద్రుతప్రకృతికములకును తబ్బిబ్బుపడుట యేర్పడుచుండును. ఇట్లే 'య న' లు మాత్రమేగాక యిత రాక్షరములును విసంధి నాపుటకు ఆగమములుగా వచ్చుచునే యుండునట్టి యభ్యాసము సామ్యమువలనఁ దెనుఁగున నేర్పడినదని యంగీకరింపక తప్పదు.

ద్రుతప్రకృతికములలో ఆవయవిక నకారము గల పదములు కొన్ని కను పట్టుటచేతను, 'ను' శబ్దముగూడ వేఱుగా నుండుటవలనను ద్రుతము నాగమమాత్ర ముగా సంగీకరించుటకు వైయాకరణులకు వీలుపడినదిగాదు. దానిని ప్రకృతిస్థము గానే సిద్ధాంతపఱచిరి. అయినను అనేకస్థలములలో ఆగమముగాఁ జెప్పుకొనక తప్పినదిగాదు. ద్రుతలక్షణము నిర్మించుటలో వైయాకరణులకు గల భేదము ఈ ద్రుతమునంతటిని ఏకలక్షణమున సంగ్రహించు నిచ్ఛవలననే గలిగినది. కాల్డ్వెల్లు గారి మతమున నకారము సంధి నాపుటకు ఆగమముగా వచ్చినదియే. కాని పయివిచారణ తరువాతి విమర్శనవలన తేలిన ఫలితము. అన్నిటిని సమన్వయించి పయిని నిరూపించితిని.

## 5. ప్రకృతిభావనివారణకయి వచ్చు నితరాగమములు

ప్రకృతిభావనివారణమునఁ బయి య, న లు మాత్రమేగాక యింకను ఇత రములయిన యాగమములు తెనుఁగున వచ్చుచునే యున్నవి. ఇట్టివన్నియు ఆగమ ములును, అచ్చులనడుమ సంధి నాపుటకు వచ్చినవియును అనుట నిస్సంశయము. కాని వానిలోఁ గొన్నిమాత్రము మొదట పయి ద్రుత నకారమువలెనే ప్రకృతి స్థములయి యనుచితవిభాగమున నేర్పడి సామ్యమువలన నితరస్థలములలోనికిఁ బ్రాకి యాగమమాత్రము లయినవనుటగూడ నంగీకరింపక తప్పదు.

కలకు+అమ్మ = కలకు (ట్) అమ్మ = కలకుటమ్మ

పేరు + ఉరము = పేరు (ట్) ఉరము = పేరుటురము ; పేరురము

పొదరు + ఇల్లు = పొదరు (ట్) ఇల్లు = పొదరుటిల్లు

పయినున్న శబ్దములలోని 'ట'కారము ఔపవిభక్తిక 'ట'వర్ణముల సామ్య మునఁ గలిగినది. కలకు+అమ్మ అను పదములోని యచ్చులయొక్క ప్రకృతిభావ మును వారించుట యిచ్ఛ. పయి టుగాగమము కర్మధారయంబులలో ఉత్తున కచ్చుపరంబగునపుడుమాత్రమేగాక మిద్దెటిల్లు, వేల్పుటావు, దుక్కిటెద్దు మొద లయినవానిలోఁగూడ వచ్చుచుండుటయును సామ్యమువలననే యేర్పడినది. ఔప విభక్తిక టకారమును జూచి యిందు టుగాగమమును గల్పించుట బచ్ఛికము. పేరురము మొదలయిన శబ్దములయెడ రెండురూపములు వచ్చుటకు గారణ మేమన,

పేర్, చిగుర్, పొదర్ అనునవి హలంతశబ్దము లగుటవలన రేఫము పయియచ్చుతోఁ గలసి యొకరూపమును, తుదిఉకారము ప్రకృతిస్థముగా భావించుటవలన టుగాగమరూపమును ఏర్పడినవి. నన్నయభారతమున 'పేరుటురము' మొదలగు రూపములు లేమియును, బయి యభిప్రాయమును దృఢపఱచుచున్నది.[39] 'పొద' యను శబ్దమును, 'పొదరు' అను శబ్దమును గలవు. పొదశబ్దముపయిని రుగాగమము, పొదరుశబ్దముపయిని ఆగమవిరహితరూపమును, టుగాగమసహితరూపమునుగూడఁ గలిగినవి. ఆ. భా. చ. కారుని మతమున, ఈ టువర్ణము డువర్ణముయొక్క మూలరూపము. కఱకుటెఱుకు, ఏపుటడవి, ఉప్పుటుంబల్లి. డువర్ణకము కృత్ప్రత్యయము. తద్ధితములపయి వచ్చుననుట విచార్యము. ఉప్పుటుశబ్దమున నీ వ్యుత్పత్తి సరిపడునని యంగీకరింపక తప్పదు. ఈ విషయ మింకను పరిశోధింపవలయును. ఆ. భా. చ. పుట 1334.

పేద + ర్ + ఆలు = పేదరాలు ; ముద్దరాలు ; జవరాలు. ఇత్యాది శబ్దముల యందు రుగాగమము. కొమరాలు, అనునప్పుడు కొమర్ + ఆలు, అనియే పద విభాగము. కొమరు అనగా సొగసు. ఇందు అనుచితవిభాగమువలన 'ర్' ఆగమ మయినది. అట్లే పేదర్ (పేదయర్ యొక్కవికృతి=పేదవారు) పేదర్ + ఆలు= పేదరాలు. ఇందును అనుచితవిభాగము.[40]

ఇట్లేర్పడిన రుగాగమము ఇతరస్థలములయందును సామ్యమువలనఁ గలిగినది. ధీరురాలు, గుణవంతురాలు మొదలయిన శబ్దములలోని రుగాగమము సామ్యము వలననే గలిగినది. పయిపదములలోని 'రు తు' వర్ణములలోని ఉత్వము, రాముఁడు, రాముని మొదలయిన అకారాంతశబ్దముల మకారముపయి నేర్పడిన ఉకారసామ్యముఁ గలిగినది. ఈ ఉకారము తత్సమశబ్దములపయిని వచ్చునది. 'విధవరాలు' అను శబ్దము వాడుకలో గనుపట్టుచున్నది. ఇది స్త్రీమాత్ర విషయ మగుటంజేసి 'విధవుఁడు' అను రూప ముండుట కవకాశము లేదు కావున 'విధవరాలు' అనియే పదమును వాడుకలో సృజియించిరి.

## 6. ద్విరుక్త టకారము

కుట్టుసురు, చిట్టెలుక మొదలయిన పదములయందు కుట్రుసుర్, చిట్రెలై, మొదలయిన రూపములు తమిళమునఁ గనుపట్టుచుండుటచేతను, 'కుఱు, చిఱు' శబ్దముల తొలిరూపములు. కుఱ్, చిఱ్ అనునవియే యగుటవలనను, కుఱ్+ఉసుర్ = కుఱ్ఱుసుర్ = కుట్రుసుర్ = కుట్టుసురు అని రూప మేర్పడినదని యూహింపక తప్పదు. పయిపరిణామము ముయ్యాలికుట్రు మొదలయిన పదములలో ముందు నిరూపించితిని. తక్కిన ద్విరుక్తటకారములు సామ్యమున నేర్పడియుండవచ్చును.[41]

---

[39] బా. వ్యా. సంధి -2౹౹ [40] సంధి కో. రామ. పుట 181. [41] బా. వ్యా. సంధి 12.
[42] బా. వ్యా. సంధి - 40 - సూత్రము.

భృశార్థంబున కట్టకడ, చిట్టచివర మొదలయిన పదములు ద్విరుక్తముల స్థానమున నేర్పడునని చిన్నయసూరి.[42] ఈ శబ్దము లన్నియును సామ్యమువలననే యేర్పడినవని నిశ్చయింపనగును. సామ్యము ప్రవర్తించుటకు ఒకటి రెండు శబ్దము లేర్పడినం జాలును. నింద్యార్థమున 'కోముఁడు-గీముఁడు' అను నొక్క జంట యేర్పడినఁ జాలును. వానినిబట్టియే 'ఊరు-గీరు; నోము-గీము' మొదలయిన జంటలు వాడుకలోఁ గల్పించుచున్నట్లు మనము గ్రహించుట సులభము. అట్లే యివియును నేర్పడినవి. ముందు వివరింపఁబడిన 12-వ సూత్రము లోని కడు, నడు, నిడు శబ్దంబులనుగూడ నీ సూత్రముతోఁ గలిపి విమర్శింపవలయును.

ఈ మూఁడు శబ్దములకును ప్రాచీనరూపములు 'కట్', 'నట్', 'నిట్' అని యూహించుట సమంజసము. ప్రాచీన ద్రావిడభాషలో డకారమునకు బదులు టకారమును పొల్లును గూడిన శబ్దములే మూలరూపములుగా నుండె ననఁదగును. కాఁబట్టి అట్టి శబ్దములపయిని అజాదిపదములు చేర్చినప్పుడు, 'కటుసురు' అని కాకుండ 'కట్టుసురు' అనునట్లుగా టకారము పొడిగింపబడినదనుట చాలయు క్తము. హలంతములయిన ఇల్, ముల్ వంటి పదములన్నియును కల్లు, ముల్లు, మన్ను, మిన్ను అనురూపములను బొందినవి. ఇట్టి ద్విత్వము ఊనికకొఱకును, కట్టుసురు అను దానిలో కట్ అను పదములోని టకారముయొక్క ప్రత్యేకతను, పూర్వపదాంగత్వ మును నిలుపుటకు వచ్చినది. ఇట్టివి యేకాచ్కములమీఁదఁ జాలవఱకు వచ్చును. ఆ తరువాత కట్టు, నిట్టు, నట్టు అను శబ్దములు మఱల విడఁదీయుటవలన మాటాడు వారి బుద్ధిలో నేర్పడియుండవచ్చును. కట్టు=తీక్షణము, అధికము. (కన్న; అర) నట్టు, నిట్టు శబ్దములును, నడుము, నిడుపు అనువానిని సంబంధించిన యర్థవిశేషము లలో అరవ కన్నడములలో వాడుకలో నున్నవి. ఇట్లే శబ్దములు వేఱుచేయఁబడిన తరువాత హలాది పదములపయినిగూడఁ జేర్పఁబడియుండును. ఈ శబ్దములోని ఉకారము ముందటి యచ్చుయొక్క ఆకర్షణవలన అకారమయి, 'కట్ట' అను రూపము సిద్ధించినది. నట్టనడుము, కట్టకడ, నిట్టనిలువు మొదలయిన శబ్దములు ఈరీతిని భృశార్థమున నేర్పడియుండును. భృశార్థమునను, వీప్సను సంస్కృతమునందును తెనుఁగునందును గలుగునట్టి ద్విరుక్తిని జూచి యీ శబ్దముల నిట్లు ద్విరుక్తములుగా విడదీసియుందురు. ఆ తరువాత సామ్యమున తొట్టతొలి మొదలయిన వన్నియు నేర్పడియుండెననుట నిర్బాధము.[43] ఆంధ్రభాషాచరిత్రకారుని మతంబున ద్విరుక్తి యని చెప్పఁబడిన పయిరూపములలోని పూర్వపదము లన్నియును స్వతంత్రములే యనియును, అన్యద్రావిడభాషలలోఁ గలవనియు సిద్ధాంతము. ఇందుఁ జెప్పబడిన వన్నియును స్వతంత్రములేనా యను విషయము పరిశోధింపఁదగినది.[44]

కట్టకడ, కొట్టకొన, చిట్టచీకటి, తుట్టతుది, తెట్టతేట, నట్టనడుము, నిట్టనిలువు, పట్టపగలు, పిట్టపిడుగు, బట్టబయలు, మొట్టమొదలు, మిట్టమీదు మొదలగు పదము లన్నిటి

[43] సంధి—కో. రామ. పుట 184. [44] ఆ. భా. చ. పుట 362.

యందలి తొలియవయవము స్వతంత్రపదమనియే వారి యూహ. కొన్ని యిందు వా రూహించినట్లే స్వతంత్రపదములని నిరూపింపనగును. కాని యన్నిటిని స్వతంత్ర పదములని నిరూపించుట దుర్ఘటము. చాలవఱ కియ్యవి సామ్యమున నేర్పడినవనుట యుక్తము.

ఇక ఉకార నిత్యసంధిని గూర్చియు, అకార బహుళసంధిని గూర్చియు, ఇకార సంధ్యభావాదికమును గుఱించియుఁ గొంతవిమర్శింపవలసియున్నది. చిన్నయసూరి మతమున సంధిశబ్దము నర్థము చాల సంకుచితము. పూర్వపరస్వరంబులకుఁ బరస్వర మేకాదేశంబగుటయే సంధి. రెండు స్వరంబులకు ఒకస్వరం బాదేశంబగుట ద్రావిడ భాషాస్వభావమునకు విరుద్ధమనియు, స్వరము లట్లే నిలుచుట సాధారణ మనియుఁ జిన్నయసూరి గ్రహింపఁగలిగెను. అట్టి లోపము తెనుఁగులోని క్రొత్తవిశేష మనియుఁ, అయినను అది చాలవఱకు వ్యాపించుటచేత నద్దానినిమాత్రము సంధిగా నిరూపించి తక్కినవానిని వేఱుగా నుద్దేశించెననియుఁ దోచుచున్నది.

## 7. ఉకార నిత్యసంధి

తెనుఁగులోని ప్రథమావిభక్తి ప్రత్యయములగు 'డు, ము, వు, లు' అన్నియును ఉకారాంతములే. ఇట్టివి యంతమందు గలశబ్దము లనేకములు. తత్సమంబు లన్నియును జాలవఱకిట్టివే. దేశ్యములయందును గొన్ని డువర్ణాంతములుఁ గలవు. 'ము', 'వు' వర్ణాంతములు మఱికొన్ని గలవు. పయి ప్రత్యయము లన్నియును మొదట హల్మాత్రములే యనియును, కాలక్రమమున అజంతము లయినవనియును పైవానిచరిత్రమును నిరూపించునపుడు సిద్ధాంతము స్పష్టపరుపఁబడును.[45] ఇట్టి యాగమమయిన (అవయవికముకాని) ఉకారము నష్టమగుటయే యీ భాషలో స్వభావము. ప్రకృతిభావనివారణమునకయి పదములనడుమ వచ్చి తరువాత పదాదిని గూడ ప్రవేశించి, పదావయవమే యనునట్లు భ్రమింపఁజేసిన 'య, వ'లు పదాదిని వినఁబడుచున్నను, సంధిలో మఱగిపోవుచున్నవిగదా! అట్లే పదాంతమునమాత్రమే నిలుచుటకు యోగ్యత గలిగి 'రాముఁడు, అది', మొదలయిన పదముల తుదిని వచ్చిన యీ, ఉ, ఇ అనునవి సంధిలో మరగిపోవుట స్వభావసిద్ధమగుట నిస్సంశయము. కావుననే ఉకారసంధి నిత్యముగా నేర్పడినది. పదాంతమున అరవమునను్న ఉకారము కుఱ్ఱియలు ఉకారమనియు, ముఱ్ఱియలు ఉకారమనియు రెండు తెఱంగులు. సంధిలో కుఱ్ఱియలు ఉకారము మఱగి పరాచ్చు నిలుచును. ఇంతియగాక ముఱ్ఱియలు ఉకారముకూడ కొన్నిస్థలములలో మఱగిపోవును. ఇట్లు తుది నున్న కుఱ్ఱియలు ఉకారమే తెనుఁగున పదాంతమున ఉకారమయినది. ఆ భేదము తెనుఁగున నశించుటచే అన్ని ఉకారములకును సంధి యేర్పడినది.[46]

---

[45] సంధి. కోరాడ రామకృష్ణయ్య. పుట. 104

[46] Journal of the Mythic Society. L. V. R. page 94. Vol. 26,

ద్వితీయాది విభక్తులయందున్న ఉకారమును శత్రర్థక 'చు' వర్ణమునందున్న ఉకారమును అవయవిగాను లేక ప్రథమావిభక్తివలెనే ఆగమముగా యను విషయము మాటాడువారిని సందిగ్ధావస్థయందు బడవేసి యుండవలెను. కొందఱు సంధి లేకయును, కొందఱు సంధిచేసియును వ్యవహరించియుండవచ్చును. కాఁబట్టి రెండు రూపములును వాడుకలోనికి వచ్చియుండవలయును. సంధ్యభావస్థలమున నకారాగమము. సంధిగల స్థలమున ఉకారలోపము ననుట స్పష్టము. నాకొఱకు+అది = నాకొఱకునది ; నాకొఱ కది.[47]

ఉదంత నామంబున కనుకరణం బేర్పడునప్పుడు సంధి రాదు. చిన్నయసూరి వుగాగమంబును సూత్రించెను.[48] ఇయం ధేనుః+అనె=ఇయం ధేను వనె. ఇచ్చటి 'ఉ' వర్ణము శబ్దగతమయిన యవయవము. ప్రత్యయమును గాదు. ఇచ్చట సంధి వచ్చినచో నది ఇయంధేననె, అను రూపము రావలెను. అది యనిష్టము. కాఁబట్టి ఉకార రూపమును నిలువఁబెట్టుటకు వకారాగమము కలిగినది. హలంతపదములు అనుకరణమున వచ్చునపుడు 'కింతత్+అనియె=కింతత్తనియె' అని యేర్పడెనుగాని 'తత్' అను పదము 'తత్తు' అను రూపమును ఉకారముతో ప్రథమావిభక్తియందు పొందునట్లు పొందక పోయినది అనఁగా తత్తుయనియె అను రూపము లేదని భావము. ఆ తుది ఉకారము ఉచ్చారణమాత్రముగా వచ్చినది గావున నిందు కనఁబడలేదు. 'సుముహూర్తోఽస్తు+అంచు=సుముహూర్తో స్తంచు అను ప్రయోగము వంటివి ఆధునికములును, సామ్యమువలన నేర్పడినవియును, గ్వాచిత్కములును అనుట స్పష్టము.

కొన్ని యెడల నుత్వముపై సంధి చేయకయుఁ గొందఱు కవులు ప్రయోగించియున్నారు అని సూత్రించి, 'నవ్వరు ఎవ్వరైన నిఁక నన్ను గనుంగొని' (సానందోపాఖ్యానములోనిదిగా) యను ప్రయోగము నాంధ్రభాషాచరిత్రకారులు ఉదాహరించిరి.[49] ఇది కవ్యభిప్రేతమని సిద్ధాంతము చేయవలె. అట్లైనను ఇది గణ నిర్బంధమునకుఁగాను వ్రాయఁబడి యుండవచ్చును. అంతియకాని ఆంధ్రభాషా పద్ధతికి మాత్రము సరిపడునది కాదు. లేదా స్వతంత్రులమని భావించు కవులు తమ యిష్టమువచ్చినట్లు నేఁడు ప్రయోగించుటలేదా! అట్లే యదియు నయియుండవచ్చును.

## 8. ఇత్వసంధి

ఇకారమున కచ్చుపరమైనచోట్ల ఉకారమునందువలె సంధి నిత్యముగా లేదు. కొన్ని యెడల నిత్యముగా సంధి రాకుండుటయు, మఱికొన్ని యెడల వికల్పముగా వచ్చుటయు మొదలగు కార్యము లేర్పడినవి. దానికి గారణము: తెనుఁగు శబ్దములలో ఉకారాంతత ఇకారాంతతకంటె ప్రచురము. కొన్ని స్థలములలోని

[47]బా. వ్యా. సంధి-2-సూత్రము. [48]బా. వ్యా. సంధి - 54 - సూత్రము.
[49]ఆ. భా. చ. పుట 339.

ఇకారము అర్థవంతము. కేవలము ఉచ్చారణకొరకు కేర్పడినది తక్కువ. చేసి, చూచి మొదలయిన క్త్వార్థకేకారముల విషయమును బరిశీలించినచో నియ్యది స్పష్టముకాక తప్పదు. 'క్త్వార్థంబైన యికారంబునకు సంధి లేద'ని సూరియును, "క్త్వార్థేతో నభవే త్సదా" యని యధర్వణుఁడును సంధిని నిషేధించిరి. ఇక్కడ నున్న ఇకారమునకు సంధి చేసినచో నద్దానివలనఁ గలుగవలసిన యర్థావగతికి విలంబము సంభవించును. చూచి + ఉండెను 'చూచుండెను' అని సంధి చేసినచో 'వినుచుండెను' వంటి 'చుండెను' అంతమందు గల వర్తమానార్థక చువర్ణంబులను స్మృతికి దెచ్చి కొంత క్లేశమును వినువారికిఁ గూర్పక తప్పదు. ఇంతియగాక తెనుఁగునందలి ధాతువు లన్నియును సాధారణముగా ఏకాచ్కములుగాగాని, ద్వ్యచ్కములు గాని యుండును. అట్టివానికి ఇకారము చేర్పఁగానే రెండచ్చులు గల రూపము సిద్ధము కాగా నద్దానిని ప్రక్కయచ్చుతో చేర్చి సమాసమును గల్పించి పదాదిని గల యూనికను దొలగించుట ఆనాఁడు తెనుఁగుభాషను వాడినవారిలో ననేకుల కిష్టము గాదని యూహించుట స్పష్టము. కావుననే సంధి చేయక యడాగమమును దెచ్చి భాషాస్వభావము నక్లే నిలువంబెట్టిరి. కాని పై ఇకారముతో సంధి చేయుట క్వాచిత్కముగా నాధునికులయందు బయలుదేరినది. కావ్యముల లోనికిని ఎక్కిన వట్టి ప్రయోగములు. వీనియందు ఇకారము పరముగా నుండు నప్పుడు చేసిన ప్రయోగములే యధికము. ఉదా : కోసిచ్చెను; ఎటిగించిపుడు; మొదలయినవి. 'అనవలసంటి గాక' మొదలయిన యితరాచ్చులు గల చోట్లను సంధి గనుపట్టుచున్నదిగాని యిట్టివి మిక్కిలియు విరళములు. ఈ సందర్భమున సంధికారుని సమాధానము అనుసంధింపఁదగినది. "క్త్వార్థకేకారమున కికారము పరమైనపుడు సంధి జరిగినను, ఏదోయొక యికాగమే యక్కడ కనఁబడుచుండును. గావున నా యికారముపై నూఁతపడినచో నర్థము స్ఫురించుట కవకాశము గలుగు చుండును."[50]

ప్రయోగములు గ్రంథమున కెక్కకమున్ను అవి వాడుకలో నక్కడక్కడ గాని కొంత ప్రదేశమునందుగాని వినఁబడుచుండును. వాడుకలో ఊనిక లేక ఊత, ముఖ్యముగా శ్రుత మగుచుండుటవలన నిట్టి యర్థభేదము స్పష్టపడుచు ఇకారమునకు సంధి గలిగిన చోటులు నిర్బాధముగా నుండును. అంతమాత్రముననే సామాన్య సూత్రమునకు భంగము వాటిల్లదు. భాషలోని గ్రంథము లన్నిటిని వెదకి చాలవఱకు నప్రశస్తంబులనుగూడ గూర్చి క్త్వార్థకేకారసంధికి నుదాహరణము లని యెంచ నగును. కాని సంధిని వారించిన లక్షలకొలది ప్రయోగములును, లాక్షణికుల సూత్ర ములును భాషాపద్ధతిని సూచించుననుట నిర్వివాదముగదా !

క్రియారూపములలోని చేసితిని, చేసితిమి, చేసితివి, చేసితిరి, చేసిరి వంటి వాని తుది ఇకారము పదాంతమున వచ్చి చేరినదనుట నిర్బాధము. వీనికి సమాసము

[50] సంధి - కో. రామ. ఇకారసంధి - పుట 84.

లైన రూపములు ఇతర ద్రావిడభాషలయందు హలంతములుగానే యున్నవి.[51] ఇట్టి ఇకారమునకు లోపము కల్గుటయే నిత్యము. అనఁగా సంధి కల్గుటయే ధర్మము. ఇట్లు మూఁడుపురుషములయందు సంధి కలిగిన రూపములే ప్రాచీనములు. తరువాతఁ గాలక్రమమునఁ దక్కిన విషయములవలెనే యిందలి ఇకారమునకు అవయవిక మను భ్రాంతి గలుగుటచేతఁ గాఁబోలును సంధ్యభావరూపములు బయలు దేరినవి. కొంతకాలము లాక్షణికులు ఉత్తమపురుషమునందు మాత్రమే సంధి వికల్ప మనిరి.[52] మరికొంతకాలమునకు ప్రథమపురుషమునను ఉత్తమపురుషమునను వికల్పమనియు, మధ్యమపురుషమున నిత్యమనియు సూత్రించిరి.[53] ఇది యీ మార్పెవైపు జరుగుచున్నదో సూచించుచునే యున్నది. అయినను "ఇదె శమరాజ్ఞ ద్రోచితిరి యెచ్చటనుండిట వచ్చినారలు" అను ప్రయోగమును సర్వలక్షణసారసంగ్రహమునం దుదాహరింపఁబడినట్లు చూపి యిట్టి ప్రయోగంబులు నిరాకరంబులు అని వ్రాసిరి.[54] ఇదియును పైసిద్ధాంతమునే బలపఱచుచున్నదిగదా!

ఏమ్యాదులయందలి సంధియును బయిదానివంటిదే, కాని వీనిచరిత్రము మాత్రము కొంచెము విలక్షణ మనక తప్పదు. "ఏమి-మఱి. కిమష్టి—అది-అవి-ఇది-ఇవి-ఏది-ఏవి—ఇది యాకృతిగణంబు" పై వానిలో 'కిన్' అనునది 'కున్' అను విభక్తిప్రత్యయముయొక్క రూపాంతరమును, ద్రుతప్రకృతికమును గావున నిద్దాని విషయము 'కు' ప్రత్యయసంధి చరిత్రవంటిదే యనుట నిర్బాధము. పయిగణము చివఱి యాఱుపదములలోను తుదినున్న 'ఇ' వర్ణము చారిత్రకముగా ప్రకృతిస్థము కాకపోయినను ప్రకృతిస్థమువంటిదే యని యంగీకరింపక తప్పదు. ఈ పదములకు విభక్తిప్రత్యయములు చేర్చిన రూపములలోఁ బదాదినున్న ఊనిక రెండవ యక్షరముపయికి మారి దా-దీ-దే, వా-వీ-వే యను రూపము లేర్పడినట్లు ముందు స్పష్టపఱచితిని. ఇఁక ద్వ్యచ్కములయిన పయిప్రథమావిభక్తిరూపములు ఊనిక గలిగి మాఱుపాటులేక యట్లే నిలిచియున్నవి. కావుననే నన్నయగ్రంథమున వీనికి సంధి కనుపట్టదయ్యెను.[55] సంధి యత్యల్పసంఖ్యాకంబులయిన చోట్ల కనుపట్టుచున్నది గాని యవి నన్నయాభిప్రేతంబులు గావు అని నిరూపించిది. పాఠాంతరములు గలవు. వీని యూనికను గ్రహించుటచేతను, దనకాలమున సంధి వినఁబడకుండుటచేతనుగాఁబోలు వీనికి నన్నయ సంధి చేయఁడయ్యె. కాలక్రమమునఁ దక్కిన ఇకారాంతములవలెనే వీనికిని సంధిరూపము లేర్పడినట్లు ఊహించుట సులభము. ఇట్లే 'ఏమి', 'మఱి' యను శబ్దంబులకును నన్నయ సంధి చేయలేదు. వీనిలో 'మఱి' అను శబ్దమువంటిదే 'మఱు' అను రూపము. అర్థభేదమున వాడుకలో

[51] సంధి - కో. రామ. పుట 91. [52] నిత్యమనుత్తమపురుషక్రియాస్వితః. ఆ. చిం.
[53] ప్రథమే చోత్తమే చైవ క్రియేతో వా భవేచ్చ్యుతిః. నిత్యమన్యస్య వికృతౌ క్త్వార్థేతో న భవే త్సదా. అథర్వణకారిక. [54] బాలవ్యాకరణ గుప్తార్థప్రకాశిక, పుట 33.
[55] ఆ. భా. చ. పుట 1342.

నుండుటచేత నీ రెండింటి యచ్చుల ప్రత్యేకతను నిలుపుటకుగాను సంధిని నన్నయ యంగీకరింపలేదని తోచుచున్నది. కాని కాలక్రమమున సంధి గల రూపములును వాడుకలోనికి వచ్చినవని యంగీకరింపక తప్పదు.[56] ఏమి శబ్దమునకును నన్నయ సంధి చేయలేదు. ఇది ప్రశ్నార్థకమయి తుది ఇకారముపయిని ఊనిక ఉండుటచేత నర్థానికి భ్రంశము కలిగించుట కిచ్చలేక నన్నయ యంగీకరింపలేదని తోచుచున్నది. ఆ కాలమున నీ సంధి యింకను ఏర్పడియుండకుండెనని యూహించుటయు యుక్తమే.

తరువాత ఇకారసంధి ప్రయోగము లన్నియుఁ గాలక్రమమున నేర్పడినవి. సూరి దీని నాకృతిగణంబని వ్యవహరించుటలోని యభిప్రాయము ఇకార సంధి తెనుఁగుభాషాపద్ధతికి ఇష్టముగాదు. అది సార్వత్రికముగాఁ జేయరాదు. పూర్వకవిప్రయుక్తంబులను మాత్రము గ్రహించి ఏమ్యాదిగణంబునం జేర్చి ప్రయోగించునది యనుటయే. ఇది యీ సంధియొక్క వైరళ్యమునే సూచించును.

## 9. అత్వసంధి

'అకారమున కచ్చు పరమయినపుడు సంధి బహుళము' అని చిన్నయసూరి. బహుళమనఁగా ప్రవృత్తి, అప్రవృత్తి, విభాష, అన్యము అని నాలుగువిధంబులుగ నున్నది. ఇందును బైని నిరూపింపఁబడిన పద్ధతులే ప్రవర్తించును. దేశ్యపదముల తుది నున్న అకారమును, సంస్కృతపదముల తుది నున్న అకారమును, ప్రకృతిస్థమగుటయును అది మఱిగిపోవుట అర్థబోధకు అపకారమగుటవలనను అకారమునకు సంధి లేకపోవుటయే తెనుఁగునకు స్వాభావిక మనవలెను. కాని వాడుకలో ఊనికవలన అర్థభేదము స్ఫురించుపట్లను, తప్పుగా విఱుటచేతను, సామ్యమువలనను పరిమిత ప్రయోజనమును, తాత్కాలిక ప్రయోగమును, ప్రాదేశిక వ్యవహారమును గలిగిన ప్రయోగములను గవులు గణనిర్బంధమువలన గ్రంథములలోని కెక్కింపగాఁ గాలక్రమమున అకార సంధిగల రూపము లెక్కువయ్యెను.

(1) చింతామణి గ్రహింపనట్టి సంస్కృతశబ్దముల అకారసంధిని అథర్వణుఁడు గ్రహించి క్వాచిత్కముగా నగునని వ్రాసెను.[57] కొన్ని అకారాంత శబ్దంబులకు సంధి రాదని సూత్రించి పయివాక్యమును క్వాచిత్కముగా నుదాహరించెను. స్త్రీవాచక తత్సమ సంబోధనాంతములకు సంధి రాదని చిన్నయ సూత్రించెను. దీనికి విరుద్ధములయిన ప్రయోగములు కావ్యములందుఁ గలవని పరిశీలనవలనఁ

---

[56] సంధి. కో. రామ. పుట 95.

[57] భవన్తి కేచిచ్ఛబ్దాస్తు సాంగత్యేనైవ సాధవః। కుత్రచిత్సంస్కృతీయోపి ప్రాణోప్యత్ర చ్యుతో భవేత్॥ అథర్వణుఁడు.

దేలినది. అవి యల్పసంఖ్యాకములు మాత్రమేగాక భాషాపద్ధతికి విరుద్ధమనుట స్పష్టము. అవి యాధునికంబులు. 'భర్త+అంచు, గంగ+అను' భర్తంచు, గంగను మొదలగునవి. 'గంగను, భర్తంచు' అను సంధి రూపములలోని అర్థబోధ క్లేశము నెఱుఁగుట సులభము. 'గంగను' అని ద్వితీయా విభక్త్యంతమా లేక 'గంగ+అను' అను సంధిగత రూపమా యను సందేహమును వారించుకొనుట విలంబహేతువగును. ఇట్లే 'భర్తంచు' అనునది యెట్లు విరుచుటయో ఆలోచించినగాని స్ఫురింపదు. కాఁబట్టి వీనిని అప్రశస్తరూపములని కొంద అందురు.

(2) వెలయాలు మొదలగు శబ్దములలో సంధి లేదని సూరి వ్రాసెను. వెలాలు అనురూపము ప్రశస్తముగాదని భావము. 'ఆ' మీద నున్న ఊనిక పోకుండుటయు, 'ఆలు' వేరుశబ్దమని భావించుటయు వీనికి హేతువులు. కాని తలయారిశబ్దము అట్లు కాకుండుటచే తలారి అయినది.

ఆకు, అంత, అమ్మ, అయ్య, అన్న అనునట్టి పదంబులు పరములగునపుడు సంధి నిత్యమని యనేకులు వ్రాసిరి. 'చింతాకు' మొదలగు పదములయందు సంధి యగుట చాల యుక్తమే యనక తప్పదు. పయిపదములన్నియును అకారాదులు, గురుమత్తులు, కాఁబట్టి వానిపయి నూనిక తప్పదు. ముందటి పదాంతమున నున్న అకారము అనఁగా చింత మొదలగు పదములలోని తుది అకారము, ఊనిక లేక వెనుక నూనికయున్న గురువుతో ద్రుతోచ్చారణమునఁ గలసిపోయినది. అట్టి యూనిక యుండుటవలననే యర్థబోధకు ప్రతిబంధక మింతయు నుండదు. ఇట్లు సంధిగల రూపములే నిరంతరము శ్రుతమగుచున్నను గవులుమాత్రము సంధివిరహితరూపము లను బ్రాచీనములనియో, తమ కనుకూలమనియో యాదరించిరి.

మేనల్లుఁడు మొదలయిన వానియందు మేన అనునది తప్పుగా విఱిచినది, అనుచితవిభాగమువలనఁ గలిగినది. మే-మెయి-మేన్, అను రూపములకు శరీరము అర్థము. పూర్వము రక్తసంబంధము గలిగిన అత్తకును, అట్లు లేక పిల్లనిచ్చిన యత్తకును గల భేదమును నిరూపించుటకుఁ జేర్చిన పద మియ్యది. కన్నడమున సోదరశబ్దము చేర్చి సోదరత్త, సోదరళియ యను రూపములను గల్పించిరి. మే+అత్త అను రెండుపదముల నడుమను సంధి నాపుటకు యకారముగాని, నకారముగాని రావచ్చును. కాని యిక్కడ నకారమే వచ్చినది. మేనత్త యను రూప మేర్పడినది. ఇదియే ప్రాచీనమును, ప్రచురము నయిన రూపము. ఇతరములయిన చింతాకు మొదలయిన శబ్దముల సామ్యమున 'మేన' యని యనుచితవిభాగము చేయుటచే మేనమామ, మేనయత్త మొదలగు రూపములు వరుసగా కాలక్రమమున నేర్పడిన వనుట స్పష్టము.

షష్టీప్రత్యయార్థబోధకమయినట్టియు, విశేషణాంత్యమయినట్టియు అకారము సంధిలో లోపించుటయు గలదు. రాజుల+ఒద్ద = రాజులొద్ద, తల్లిదండ్రుల+ఒద్ద= తలిదండ్రులొద్ద, తామరసనేత్రల+ఇండ్ల= తామరసనేత్రలిండ్ల, చందమామ+అల్లుడు=

చందమామల్లుఁడు. ఒద్ద యను శబ్దము కాలక్రమమునఁ దన స్వాతంత్ర్యమును గోల్పోయి ప్రత్యయత్వంబును బొందిన 'అందు' శబ్దమువంటిది అనవచ్చును. సమాసమునఁ అకారముపయిని ఊనిక నిలిచినంతకాలము అకారము నిలిచి యడాగమము వచ్చినది. కొన్ని శబ్దములలో దీని స్వాతంత్ర్యము పోయి అకారము ఎప్పుడు సంధినిపొందినదో అప్పుడే తక్కినవానిలోగూడ దీనికి నష్టము ఏర్పడ నారంభించినది. రాములయందు=రాములందు అను రూపమువలెనే ఒద్దతో రూపములు గలిగినవి. వాని సామ్యమున నేత్రలింద్ల మొదలయినవిగూడ సేర్పడినవి. ఈ స్థలములందు రెండు పదములును గలిసి యొక్కపదముగనే అనఁగా సమాసముగ గ్రహింపఁ బడుటచేతనే సంధి జరిగినదని తలంపవచ్చును. సమాసము కానియప్పుడు రెండవ పదముపై నూఁత పడును.[58] అనఁగా 'ఊఁత' లేక, 'ఊనిక' లేనప్పుడు సంధి జరుగునని భావము.

పుట్టినిల్లు మొదలయిన క్రియావిశేషణముల సంధి 'పుట్టిన' మొదలయిన విశేషణముల యుత్పత్తిని విచారించునపుడు తెలుపఁబడును.

ఈ సందర్భమున ఆంధ్రభాషాచరిత్రకారుల క్రిందివచనములు పరిశీలింపఁ దగినవి.[59] "వైకల్పిక సంధిరూపములలోఁ గొన్నిట సంధిగల రూపముల కొక యర్థమును, సంధిలేనిరూపముల కర్థభేదమును గలిగినది. దొడ్డమ్మ, యనఁగా తల్లి యక్క. దొడ్డయమ్మ యనఁగా నుదారబుద్ధిగల స్త్రీ. పెద్దమ్మ యనఁగా జ్యేష్ఠాదేవి యను నర్థమును గలదు. పెద్దయమ్మ=పెత్తనమువహించిన స్త్రీ. చిన్నల్లుఁ డనఁగా నల్లుండ్రలో చిన్నవాఁడు. చిన్నయల్లుఁ డనగాఁ జిన్నవయస్సుగల యల్లుఁడు. వయస్సెక్కువయైనను కనిష్ఠయైన కూతురు మగఁడు చిన్నల్లుఁడే యగును. మోటెద్దనఁగా మోట లాగెడి యెద్దు. మోటయెద్దనఁగా పనికి లొంగనియెద్దు. ఇట్లే యర్థభేదములను బ్రయోగములనుబట్టియు వ్యవహారములనుబట్టియు తెలిసికొనవలెను." ఇట్టి యర్థభేదము ఊనికయు, సందర్భమును స్పష్టముగాఁ దెలియుటవలనను వక్త ప్రత్యక్షముగా నుండుటవలనను వాగ్వ్యవహారమునఁ జక్కగాఁ దెలియును. తెలియకున్నను ఎదుటనున్న వక్త నడిగి తెలిసికొననగును. గ్రంథవ్యవహారములోని కెక్కి ప్రామాణికములయి కోశాదులలోఁ బడినఁగాని యెల్లరకును బరోక్షమునఁగూడఁ దెలియుట కవకాశములు దక్కవ.

పుంపులయొక్కయు ప్రాతాదులయొక్కయు సంధిచరిత్రము స్థలాంతరమున వివరింపఁబడును.

## 10. గసడదవాదేశము

'క చ ట త ప' లకు 'గ జ డ ద బ' లును, 'గ స డ ద వ' లును ఆదేశము లగుటనుగూర్చి విచారింపవలసియున్నది.

---

[58] సంధి. కో. రామ. పుట 82. [59] ఆ. భా. చ. పుట 359.

ప్రకరణాదిని చెప్పిన ప్రస్కృతిభాషనివారణముసు, వర్ణసమీకరణమును అను రెండు పద్ధతులలో ముఖ్యముగా మొదటిదాని ననుసరించి యేర్పడిన సంధిని మీద నిరూపించితిని. ఈ రెండవ భాగమున వర్ణసమీకరణము ప్రధానమని గ్రహింపనగును. 'క చ ట త ప' లకు ముందు (నకారము) ద్రుతము వచ్చు నప్పుడెల్లను నకారము నాదాత్మక మగుటచేత ప్రక్కనున్న యక్షరము సంయుక్త మయి క్రమముగ నాదాత్మక మగును. సంస్కృతమునను, అరవమునను బిందువు గాని, నకారముగాని పూర్వమున నున్నపుడు 'క చ ట త ప' లట్లే నిలుచుట చాలవఱకుఁ గలదు. అట్టివి పదములలో తెనుఁగునను లేకపోలేదు. ఉ. 'చంక, పొంకము, అంత'. సంధియందుమాత్రము ద్రుతమునకుఁ బరముగా నున్న 'క చ ట త ప' లు 'గ జ డ ద బ' లగుట నిత్యమే. ఆ ద్రుతము 'ను' స్వరూపముతో నున్నను, 'ని'యను రూపమును దాల్చినను, సున్నగాఁ బరిణమించినను బయిపరిణామము మాత్రము తప్పదు. ఇది వర్ణసమీకరణమనుట ముందు ప్రకరణమునఁ దెలుపఁబడినది.

ఇఁక ప్రథమాంతములగు కళలపయిని, సమాసముల నడుమను 'క చ ట త ప' లు 'గ స డ ద వ' లగుచున్నవి. ఇదియును సంధికార్యమే. ఇందును వర్ణ సమీకరణమే ముఖ్యమనక తప్పదు. అరవమునఁ బదమధ్యమున నున్నచో 'క ట త' లు 'గ డ ద'లుగా నుచ్చరింపఁబడుట సర్వసామాన్యము. అచ్చుల నడుమ నుండుటచే వానియొక్క నాదస్వభావము వీనిమీదికిఁ బ్రాకుటవలనఁ గలిగి కాల క్రమమున నొకపద్ధతిగా నేర్పడి సార్వత్రిక మయినది. అట్టి పద్ధతియే తెనుఁగున 'కూర గాయలు', 'తల్లిదండ్రులు' మొదలగు సమాసములలో స్థిరపడినది కావుననే "ద్వంద్వంబు పయి పరుషములకు 'గ స డ ద వ'లగును" అని సూరి సూత్రించెను. పయిని నిరూపించిన పద్ధతిచే 'గడద' లనుగుఱించి స్పష్టమగునుగాని 'సవల' నుగూర్చి వివరింపఁబడలేదు. చకారమును, సకారమును ప్రాచీనతమిళమునను నేఁడును సాధారణముగా పరస్పరము మారుచుండును. ప్రాచీనభాషలో శవర్ణ సకారములే లేవు. కావుననే తమిళమున చకారమే యొకప్పుడు పరుషముగాను, సామాన్యముగాఁ దత్స్థానమగు నూష్మముగను గూడ బలుకఁబడుచుండును. క్రమమక్కరలేకయే వ్రాతలోని చకార ముచ్చారణమున శకార మగుచుండును.[60] చవర్ణము తాలవ్యస్పర్శము. శవర్ణము తాలవ్యమగు నూష్మము. శ స లు ఊష్మములగుటఁ బరస్పరము మాఱు ననుట అనుభవసిద్ధము. చవర్ణము శవర్ణముగా మాఱి 'శ, స' లకుఁ గల భేదమును నిరూపించున ట్లుచ్చరింపకపోవుటచేతను, సకారము మాత్రమే తెనుఁగున నున్నట్లు లాక్షణికు లంగీకరించుటచేతను 'చ, స' లే మాఱుపడినట్లు ప్రామాణిక మయినది. వాగ్వ్యవహారములో 'శ'వర్ణము వినఁబడును. పయి మార్పు అనవధానతచే స్థాన కరణముల మాఱుపాటువలన గలిగినదనుట స్పష్టము. ఇట్లు పదాదినిగూడఁ గలిగిన మార్పు సమాసమధ్యమున నిలిచి వైయాకరణులచే నంగీకరింపబడి సూత్ర

---

[60] సంధి. కో. రామ. పుట ౭౹౩.

గ్రథిత మయినది. అయినను బయియాదేశము 'అప్పాచెల్లెంగ్రడు', 'అందచందములు', 'కండతుండెములు', 'రాకపోకలు' మొదలయిన స్థలములలో రాకపోవుటయుఁ గలదు. ఇట్లే తెనుఁగులమీది సాంస్కృతికపరుషంబులకు 'గ స డ ద వ'లు రావని సూత్రింపఁబడినను కొన్ని ప్రామాణికప్రయోగంబులలో గసడదవాదేశము కనఁ బడుచునే యున్నది.

అనునాసిక్యము గలుగుటయు, తొలగుటయు నెట్లు ద్రావిడభాషలలో మిక్కిలి ప్రచురమో యట్లే యీ గసడదవాదేశమును ప్రచురమును, ఐచ్ఛికమును నై యున్నది. ఇట్లు భాషలో పాతుకొనియున్న యభ్యాసమువలన నేర్పడిన గ్రాంథిక ప్రయోగములనుమాత్రము గ్రహించి వర్గీకరించి మార్పును స్థిరపఱచి సూత్రింప నమకట్టుటచే ననేకములుగా వ్యభిచారమేర్పడినట్లు తోఁచకతప్పదు. ఈ గసడద వాదేశము చాలకాలమునుండియును వికల్పమనుటయును, భారతమునకు ముందే యేర్పడినదనుటయును యుక్తము. ఇక బదమధ్యమున నున్న పకారము బకారముగా మాఱి యవి వకారమయి యుండవచ్చును. ఇట్లు పకారము వకార మగుట మిక్కిలి ప్రాచీనకాలముననే జరిగియుండుటచేత నద్దాని క్రమము నిరూపించు టకు ప్రామాణికభాషలో నుదాహరణములు లభింపవు.

గసడదవాదేశము బహుళమనుటయే యుక్తము.

సుదీర్ఘమయిన పయివిచారణలో నేర్పడిన సిద్ధాంతములు.

(1) తెనుఁగున అచ్చున కచ్చు పరంబయినపుడు సంధి లేకపోవుట సామాన్యము.

(2) ప్రకృతిభావనివారణమును, సమీకరణమును మిక్కిలిగా ననుసరింపఁ బడును.

(3) ప్రకృతిభావనివారణకయి "య, న, వ" లు మొదలైన యాగమములు అచ్చులనడుమ గలుగుచుండును.

(4) అర్థస్ఫురణమునకు భంగమువాటిల్లు సంధి జరుగుట యరుదు.

(5) అర్థవిహీనములును, ఆగమమాత్రములును, ప్రకృతిస్థములుగానివియు నగు అచ్చులు సంధియగుటవలన మఱిగిపోవుట స్వభావము.

(6) ఊనికలేమియు, ఉనికియు సంధి జరుగుటకుఁగాని, జరగకుండుటకుఁగాని ప్రబలమయిన హేతువుగా నేర్పడుచుండును.

(7) అల్పాక్షరములయిన పదములలో సంధి జరుగుట యరుదు.

(8) తప్పుగా విఱుచుట (అనుచితవిభాగము) సంధ్యభావమునకును, సంధి జరుగుటకును హేతువు గావచ్చును.

(9) సమాసాది కార్యములయందు గన్పట్టు ఆగమవిశేషములు అర్థహీన ములును, గేవల బహిర్గతములును మాత్రమేగాక పదముల యవయవములుగా నుండి

కాలక్రమమున ఆగమమాత్రములయి యుపయోగింపఁబడుచుండెననుట. (ఈ విషయము సమాసములలోను, విభక్తిప్రత్యయ ప్రకరణమునను ప్రపంచింపఁబడును.)

(10) కావ్యకర్తలును అంతకంటె ముఖ్యముగా లాక్షణికులును భాషా పరిణతికిని, దాని మార్గనిర్మాణమునకును కారకు లగుదురు.

## 11. సంస్కృతాంధ్రముల సంధిస్వభావము

ఇట్లు తెనుఁగునందలి సంధిమార్గములను సంగ్రహించి వానికిని, సంస్కృత ప్రాకృతములయందలి వానికిని సంబంధ మేమయినను గలదేమో దిఙ్మాత్రముగా విమర్శించి యీ ప్రకరణము ముగింపఁబడును.

(1) సంస్కృతమునఁగల అచ్సంధికిని, దెనుఁగునగాని, అరవమునగాని, ఇతర ద్రావిడభాషలయందుఁగాని గల యచ్సంధికిని సంబంధము లేదు. సంస్కృతము నందలి యణాదేశసంధి, గుణసంధి, వృద్ధిసంధి మొదలగునవి ద్రావిడభాషల స్వభావమున లేనివి.

(2) ప్రకృతి ప్రత్యయముల నడుమ ఆగమవిశేషములు గలుగుటయు, ఈ రెంటి సంధియును దక్కిన పదసంధికంటె భిన్నముగా నుండుటయు అరవమునఁ గలదు. ఇట్టి విభాగము సంస్కృతమున లేదు. ఈ విషయము ప్రత్యయప్రకరణమున విమర్శింపఁబడును.

(3) తెనుఁగు సంయోగాత్మకమైన భాష (Agglutinative). సంస్కృతము ప్రత్యయాత్మకము. ఇదియే యిందలి సంధిస్వభావములోని భేదమును గల్గించుచున్నది.

పై భేదములనుబట్టి తెనుఁగునకును, సంస్కృతమునకును జన్య జనక భావము లేదనుట స్పష్టము.

## 12. ప్రాకృతమున సంధి

(1) ప్రాకృతమున సంధి రాకుండ అచ్చు లట్లే నిలుచును. తెనుఁగున నట్లు నిలువవు. అత్యంతప్రాచీనకాలమున నచ్చులట్లే తెనుఁగు శాసనములలోఁ గనుపట్టుటకు హేతువులు వానిని వ్రాసినవారు ప్రాకృతభాషాపండితులే యగుటయును, దెనుఁగునకుఁ బండితసంస్కారము లేకుండుటయును.

(2) సంస్కృతసంధులు గల సిద్ధరూపము లట్లే మాఱి ప్రాకృతమునకు వచ్చిన వగుటచే సంస్కృతసంధి ప్రాకృతమునఁ గనుపట్టుచుండును. తెనుఁగునఁ గనుపట్టదు. ఇది తెనుఁగు ప్రాకృతమునుండి గలుగలేదనుటకుఁ బ్రబల ప్రమాణము.

(3) ప్రాకృతమునందలి ఉద్వృత్తాచ్చులకు (నడిమిహల్లులు లోపింపగా మిగిలిన యచ్చులు) సంధి గలుగదని ప్రాకృతవ్యాకరణములు చెప్పుచున్నవి.[61]

[61] ప్రా. వ్యా. 'స్వరస్యోద్వృత్తే.' హేమచంద్రుఁడు.

అవి తెనుఁగునకు వచ్చునప్పుడు నడుమ 'య, వ' లాగమములుగా వచ్చి వాని రూపము మాఱుచున్నది. ఇట్టి యభ్యాసము క్వాచిత్కముగా ద్రావిడభాషల నుండియే ఉత్తరహిందూస్థానభాషలలోనికిఁ బ్రాకినది.

దీపికా = దీ ఇ అ = దీవియ = దివ్వె.

తెనుఁగుసంధికిని, సంస్కృతసంధికిని ఎట్లు జన్య జనక భావ సంబంధము లేదో అట్లే ఆంధ్ర ప్రాకృతముల సంధికిని లేదు. సంస్కృతమునకు కేవలము విరుద్ధము లయిన యభ్యాసములు ప్రాకృతములోనికి క్వాచిత్కముగాఁ బోయినచో నవి ద్రావిడభాషలయందుండి గ్రహింపఁబడినవనుట పై యితరసాక్ష్యముతో సరిపడును.

## 13. ద్రావిడభాషలలోని సంధిపద్ధతులు, తుల్యములు

తెనుఁగునందలి సంధికిని, అరవ కన్నడ మలయాళాదులగు నితర ద్రావిడ భాషల సంధికిని నియతమయిన సంబంధమును, సామీప్యమును గలదు.

(1) తమిళ కన్నడములలో అంత్యహల్లుల ద్విత్వము గలదు. తెనుఁగు అజంతభాషగా మాఱుటవలన నట్టిచాని కవకాశము లేదుగాని యనేకస్థలములలో ప్రాచీనముగా నిలిచియున్నది. కణ్+అழగు=కణ్ణழగు (కంటిసొగసు) అరవము. పెణ్ + అంతె=పెణ్ణంతె (స్త్రీవలె) కన్నడము. అన్ + ఇష్టసఖి=అన్నిష్టసఖి, తటిత్ + ఉ=తటిత్తు.

(2) ప్రకృతిభావనివారణము అన్నిభాషలలోను గలదు. కాని తెనుఁగున నయ్యది పరిపూర్ణము.

(3) 'య వ న'లు అన్నిభాషలలోను ఆగమములుగా వచ్చి చేరునుగాని తెనుఁగున 'య, న' లే నిలిచినవి. వకారము నశించినది. అత్యల్పస్థలములలో గన్పట్టును.

(4) ఈ భాషలలో పదాంతమందలి 'అ, ఇ, ఉ, ఎ'లు లోపించి పరరూప సంధి జరుగుట క్వాచిత్కముగా గలదు. ఈ పద్ధతి తెనుఁగుననే పరిపూర్ణమై మిక్కిలి వ్యాప్తినొందినది.

మాతు + అమ్ = మాతమ్ (మాటను), మాతిన + ఒళ్ = మాతినొళ్ (మాటలో), క్రమదె + ఆయ్తు=క్రమదాయ్తు (కన్నడము) క్రమముగా నయినది.

అమ్బు + అదు=అమ్బదు (అది అమ్ము), అదు + ఎన్న=అదెన్న (అదేమి), వాழగ + ఎన = వాழగెన (బ్రతుకుగావుత యనఁగ) తమిళము.[62]

ఇట్లు అనేక ముఖ్యవిధముల ద్రావిడభాషల సంధి యొక్కటేరీతిని జరుగు చున్నది. ఇవి యన్నియును ఒక్కటే కుటుంబ మనుట స్పష్టము.

[62] *Dravidic Sandhi* by Prof. L. V. Ramaswamy Aiyar. Journal of the Mythic Society. Vol. III. page 26.

# తెనుఁగునందలి హల్లులు: ప్రాచీన ద్రావిడముతోడి సంబంధము

## 1. తెనుఁగున భ్రష్టమయిన హల్లులు

బాలవ్యాకరణమున చిన్నయసూరి సంజ్ఞాపరిచ్ఛేదమునందలి మూఁడవ సూత్రమున తెనుఁగునకు వర్ణములు ముప్పదియాఱు అని సూత్రించి యీ క్రింది వానిని పేర్కొనెను.

"అ - ఆ - ఇ - ఈ - ఉ - ఊ - ఎ - ఏ - ఐ - ఒ - ఓ - ఔ - అం - అః"

"క గ చ చ జ జ ట డ ణ త ద న ప బ మ య ర ల వ స హ ళ"[1]

ఋ-ౠ-ఌ-ౡ-విసర్గ ఖ ఛ ఠ థ ఫ ఘ ఝ ఢ ధ భ ఙ ఞ శ ష లు సంస్కృతసమంబులను గూడి వ్యవహరింపఁబడును.

పయి సూత్రమునుబట్టి క్రింది యక్షరములు తెనుఁగున లేవనియు, సంస్కృత సమంబులం గూడిగాని (యితర శబ్దసంయోగమునంగాని) ప్రవర్తించుననియు నభిప్రాయము స్పష్టము. ద్రావిడభాషలోనికెల్ల ప్రాచీనమయిన వ్యాకరణమగు తొల్‌కాప్పియమునఁ బేర్కొనంబడిన యక్షరములను వివరింతును.

అచ్చులు — అ - ఇ - ఉ - ఎ - ఒ; ఆ - ఈ - ఊ - ఏ - ఓ-ఐ- ఔ.[2]

హ్రస్వ ఇ-ఉ వర్ణములు. ఃః ఆయ్దమ్.

హల్లులు — క-చ-ట-త-ప, ఙ-ఞ-ణ-న-మ (మఱియొక నకారము)

య-ర-ల-వ, (ఴ=ழ)-ళ-ఱ; హ్రస్వ మకారము.[3]

ప్రాచీన ద్రావిడభాషయొక్క స్వభావము చాలవఱకు అరవమునకు దగ్గఱగ నుండునని ముందే తెలిపితిని. కావుననే అరవములో నుండిన హల్లులన్నియును ప్రాచీన ద్రావిడమున నుండినవని యంగీకరింపవచ్చును. పయి రెండుభాషలకు గల హల్లుల భేదము.

తెనుఁగున లేనివి—ఙ- ఞ - ఴ - (నకారాంతరము), ఃః ఆయ్దమ్. హ్రస్వతరము లయిన ఇ-ఉ-మ లు.

తెనుఁగున నధికముగనున్నవి — గ-జ-డ-ద-బ-చ-జ-స. నేఁటి తెనుఁగున లేని మూఁడక్షరములలోను ఴకారము ప్రాచీనభాషయం దుండెననియుఁ, గాలక్రమ

---

[1] ఆ. శ. చిం. ద్వివిధాదిదుదేదోతో౽చోవక్రతమావనుస్వారౌ క గ చ జ యుగ ట డ ణ త ద న ప బ మ య ర ల వ స హ ళం తు హల్వర్గః. బా. స. పుట 153 వావిళ్ళ.

[2] ఔకారవిఱువాయ్ప్పనీరెழுత్తుమ్ ఉయిర్ ఎనమొழிప. తొల్. ఎழு. సూ. 8.

[3] నకారవిఱువాయ్ పదినెణ్ణెழுత్తుమెయ్యెన మొழிప. తొల్. ఎழு. సూ. 9.

మున వర్ణాంతరములగు ( డ ల ర ళ య ) అనువాని రూపముఁ దాల్చెననియు, నయ్యది నన్నయ తరువాతికాలమునఁగూడ శాసనములయందుఁ గనుపట్టుచుండె నని నన్నయకుఁ బూర్వమున నుండిన తెనుఁగు అను విషయమున విపులముగ నుదాహరించితిని. ఇఁక నీ ఙ ఞ ల చరిత్రమును గొంతవఱకట్టిదే యనవచ్చును. ఙ ఞ లకు నేఁటి తెనుఁగున వ్యస్తప్రయోగము లేదు అని సూర్యరాయాంధ్రనిఘంటువు. శాసనస్థభాషయందును ఙ ఞ లకు పదాదినిగాని, పదమధ్యమునగాని ఎక్కటి ప్రయోగము కనుపట్టలేదు. నేఁటి బిందుస్థలమున వర్గపంచమాక్షరములు వ్రాయఁబడుచుండినట్లు ప్రాచీనభాషనుగూర్చి యీ ప్రకరణమునఁ జెప్పితిని. అందునుగూడ ఙ ఞ లకు చాల విరళమయిన ప్రచారము కనుపట్టినది.[4] చాలచోట్ల బిందువే కలదు. ఇట్లు ప్రాచీనకాలమున సంయుక్తాక్షరము రూపమున మాత్రముండిన యీ ఙ ఞ లు అనుస్వారము వాడుకలోనికి రాఁగానే భ్రష్టమయిపోయినవి. పదాదిని గాని పదమధ్యమునఁగాని వీనికి నేఁడు ప్రయోగము లేదు. పదాదిని ఞ కారముతో నున్న అరవపదములు నేఁటి తెనుఁగున నకారాదిగాఁగాని ఎకారాదిగాఁగాని మాఱిపోయినవి.[5]

నేఁటికిని ఞ కారము మలయాళమున మిక్కిలి ప్రచురముగా వాడుకలో నున్నది, ఴ=టికారము నేఁటి తమిళమునను, మలయాళమునను, హళకన్నడమునను వాడుకలో నున్నది. (ఆయ్దముతోఁగూడ) పయి నాలుగక్షరములును ప్రాచీన ద్రావిడమున నుండినవి తెనుఁగున భ్రష్టమయినవనుట నిస్సంశయము.

## 2. గ జ డ ద బ లు

గ జ డ ద బ లు: ఈ నైదక్షరములును, సవర్ణమును దంత్య చ, జ లును అరవమున లేవు కాని దంత్య చ జ లు తప్ప తక్కినవన్నియును కన్నడమునను, మలయాళమునను గలవు. ఈ గ జ డ ద బ స లు ప్రాచీనద్రావిడమున నుండ లేదనుటయు, నవి కాలక్రమమున ద్రావిడభాషలలో నేర్పడినవనుటయు యుక్తము. విశాలమయిన సంస్కృతప్రభావము బాగుగా ప్రసరించిన తెనుఁగు, కన్నడ, మలయాళములయందుఁ బయివానికిఁ బ్రవేశము గ్రమముగాఁ గలిగినదనుట స్పష్టము.

---

[4] అంగలూరు ఎ. ఇం. వా. V, పుట 122. (850 క్రీ. వె.) పోదునూఙ్క ఎ. ఇం IX, పుట 317. (630. క్రీ. వె.) వఙ్గిపట్టు-క్రఙ్కటవ్వా. 940. అఙ్కొణ్డ ఎ. ఇం. XVIII, పుట 228. (950 క్రీ.వె.) కన్పరిగుణ్డు. వా. VII. 177. అణ్మణఙ్గూరు, పఞ్చిన-అహాదనకరము. ఎ.ఇం. XIII. కారఞ్చేడు గట్టిఞ్చి; గావిఞ్చి, రక్షిఞ్చిన-పండరంగని అద్దంకిశాసనము.

[5]
అ ఞెణ్డు = తె ఎండ్రి; అ ఞమలి = తె నెమలి; అ ఞయమ్ = తె నయము; అ ఞెరి = తె నెరియ;
అ ఞాడు = తె నాఁడు; అ ఞాయరు = తె నాయరు; అ ఞెమరు = తె నిమురు; అ ఞాల్ నాలు.
(నాయుఁడు).

తెనుఁగున నున్న క చ ట త ప లు నకారమునకుఁ బరముగా నున్నప్పుడును, అను స్వారమునకుఁ బరముగా నున్నయెడలను, బదమధ్యముననను గ జ డ ద బ లు గాను, గ స డ ద వ లు గాను మారియున్నట్లు ముందు చాలపర్యాయములు నిరూపించి యున్నాను. అట్లే నేఁటి యరవముననును ఈ యక్షరముల యుచ్చారణము లేక పోలేదు. కొన్ని జిల్లాలలో నివి యుచ్చరింపఁబడుచున్నవి. కొన్ని జిల్లాలలోని యరవమున గ జ డ ద బ లకు బదులుగా నేఁడును క చ ట త ప లే వినఁబడుచుండును. ఇదియే ప్రాచీనమును, ప్రామాణికమును, అనుట నిస్సంశయము.[6]

కాని నేఁటి యరవమున నీ గ జ డ ద బ లను గుఱించి యొకపద్ధతి బయలు దేఱినది. పదాదిని వచ్చు వర్ణము పరుషమును, బదమధ్యమున సరళమును, ద్విత్వ ముతో నున్నప్పుడు పరుషమునుగా నుచ్చరింపఁబడుచున్నది. "భాగ్యము" అను సంస్కృతపదము "పాక్కియము" అని యుచ్చరింపఁబడుచున్నది. పదాదిని సరళోచ్చారణ లేకపోవుటవలన పవర్ణమే యుండవలసివచ్చినది. "గ్య" యను సంయుక్తవర్ణము అరవమున లేదు. "క్కియ" అను రూపము దానికి బదులుగా నేర్పడినది. ఇట్లే "దత్తమ్" అను సంస్కృతపదము "తన్దమ్" అని యుచ్చ రింపఁబడును.[7] వ్రాయుటయందు నేఁటికిని క చ ట త ప లకును, గ జ డ ద బ లకును గుర్తు ఒక్కటియే గలదు. ఆకారణమునను, క చ ట త ప లు నాదాత్మకములగు టకు పదమధ్యమున నెక్కువ యవకాశ ముండుటవలనను, పదాదిని పరుషముగాను, బదమధ్యంబున సరళముగాను ఉచ్చరింపఁబడుట యేర్పడినది. ప్రాచీనకాలమున లేని ధ్వనులు నేఁ డేర్పడినవి. ఇట్లేర్పడినవానికి గుర్తులు బయలుదేర లేదు. కావు ననే తమ యుచ్చారణమునకును లిపికిని ఒకానొక విధమయిన సంబంధమును, అనుగమమును వాడుకలో గల్పించుకొని జనులు వ్యవహరించుకొనుచున్నారు. నేఁటి వ్యావహారిక తమిళమున నేర్పడిన యీ యుచ్చారణక్రమము ప్రాచీనకాలము నుండియు నుండినట్లును, అరవముయొక్క స్వభావములో నిమిడియున్నట్లును కాల్డ్వెల్లుగారు భ్రాంతిచెందియుండిరి. తొల్కాప్పియనారు కాలమునఁ బయి యభ్యాసము ఉండినచో ఆయన దీనిని తన వ్యాకరణములో వ్రాసియుండకపోఁడు. అంతియగాక యరవమున వీనికి వేఱు గుర్తు లుండియుండకపోవు. బిందువునకుఁ బరముగ తెనుఁగు మొదలగు నితర ద్రావిడభాషలయం దెల్లను పరుషములు కను పట్టుచుండుటచేతను బయి యాచారము నవీనమే యనక తప్పదు.

[6] "In the dialect spoken in Tinnevelley it is said by the residents there that the sounds, s and j are not generally found, in the dialect spoken in Madras the Aspirate 'h' is not generally found, and in the dialect spoken at Jaffna it is said that most of the sounds g, j, ḍ, d, b, s and h are not found." P. S. S. 97. [7] C. G. D. Page 138. జకారము నేఁడును తమిళమున లేదని కాల్డ్వెల్లుగారు వ్రాసిరి. కాని 'మంజళ్', 'కంజి', మొదలగు అరవపదములలో నేఁడు వినఁబడును.

కాఁబట్టి ప్రాచీనద్రావిడమున గ జ డ ద బ లు లేవు. కాలక్రమమున ద్రావిడభాషలలో గలిగినవి.

అరవమున చకార మొక్కటియే కలదు. శ, స లు లేవు. ప్రాచీనద్రావిడమున లేని యీ శ, స లు కాలక్రమమున అరవమున గలిగియుండుటచేతను, వానినన్నిటిని ఒక్కగుర్తుచేతనే వ్రాయవలసివచ్చుచుండుటచేతను, ఈ మూఁడింటికిని కొన్ని స్థలములలో పరస్పరము మార్పు సంభవించినది. తక్కిన ద్రావిడభాషలు ఆధునికమయిన వికాసమును గాంచుటచేత ఈ యక్షరములు (అనఁగా స వర్ణము) అంగీకరింపఁబడి వైయాకరణులచే నిరూపింపఁబడినది. పయిన నిరూపింపఁబడిన గ జ డ ద బ స యను వర్ణములు ద్రావిడభాషలలో (తెనుఁగున) కాలక్రమమున నేర్పడినవయ్యును సంస్కృతభాషాసామ్యమువలననే స్థిరపడినవి.

## 3. చ జ ల చరిత్రము

చ జ లు: ఈ రెండువర్ణములును తెనుఁగున దంత్యోచ్చారణము గలిగియున్నవి. తొల్కాప్పియనారు చవర్ణమును తాలవ్యమనెను.[8] అట్లే సంస్కృతమునందును దానిని తాలవ్యమే యనిరి. కాని తెనుఁగున వైయాకరణు లెల్లరును దంత్య చ జ ల నంగీకరించిరి. చింతామణియందు 'క గ చ జ యుగ' అని సూ॥ దంత్య చ జ లను నన్నయ యుద్దేశించెను. చిన్నయసూరియు దీనిని గ్రహించెను.[9] తెనుఁగున నున్న యిట్టి యుచ్చారణభేదము ఇతర ద్రావిడభాషలలో లేదు. కన్నడ వైయాకరణులుగాని, అరవ వైయాకరణులుగాని యీ దంత్య చ జ లను ఉదాహరించియుండలేదు. కావున చ జ లకు ప్రాచీనమయిన యుచ్చారణలో తాలవ్యతయే యుండెనుగాని కాలక్రమమున దంత్యోచ్చారణము తెనుఁగున నేర్పడెననుట యుక్తము. కావుననే తాలవ్యాచ్చులగు ఇ ఈ ఎ ఏ లను గూడిన చ జ లు పయియచ్చుల నిర్బంధమునఁ బ్రాచీనోచ్చారణము నట్లే నిలుపుకొనినవి.

ఈ దంత్య చ జ లును దంత్యమాత్రములు గావు. వీనియందు తాలవ్యధర్మమునుగూడ నున్నది.[10] చ జ లు తాలవ్యములే. దంత్యము లనఁబడువానియందు పూర్వమయిన తాలవ్యధర్మముమాత్రమేగాక దంత్యతకూడ కలదని భావము. వీనిని దంత్యతాలవ్యము లనుటయే యుక్తము.

నేఁడీ దంత్య చ జ లు పయిని '—' గుర్తుతో వ్రాయఁబడుచున్నవి. కాని శాసనములయందీ యభ్యాసము కానరాదు. వ్రాతప్రతులలో వీని స్వభావమును

[8] తాలౌజిహ్వామధ్యేన చవర్గే (తై. ప్రాతి. II. 36) చకార ఇకార మిడై నావణ్ణమ్ (తొల్. ఎ. 20) [9] ఇ ఈ ఎ ఏ లం గూడిన చ జ లు తాలవ్యంబులు. అ ఆ ఉ ఊ ఒ ఓ ఔ లం గూడిన చ జ లు దంత్యంబులు. [10] సీ. పం. విమ. 198.

గురైతెలింగి కొందఱు 'త్స' యను రూపముతో వ్రాయుచుండిరి. చింతామణిలో నీ చ జ భేదము పయినున్న యచ్చుల భేదమునుబట్టి నిర్ణయింపవచ్చునని సూత్రింపబడినది[11] చింతామణిలో "దంత్యచజౌ గురుర లౌచబిందుయుతౌ" అని దంత్య చ జ లు బిందుయుతముగా వ్రాయఁబడుచుండె నను పాఠము కలదు. కాని యాచారము మాత్రము కనుపట్టదు.

కేవల దేశ్యశబ్దములలోనే యుండవలసిన యీ దంత్యత కాలక్రమమున సంస్కృత సమములయొక్క బహువచనములయందును బయలుదేరుటవలన చిన్నయ వాని నంగీకరించి సూత్రించెను.[12] ఇట్లు సిద్ధమైన జకారము ద్వ్యర్థికావ్యములలో వాడుటం జేసి "జకారం బుభయంబు నగును" అని ప్రౌఢవ్యాకరణమున సూత్రింపఁబడెను.

ఇఁక నా చ జ ల దంత్యత తెనుఁగుననే యుద్భవించెనని సిద్ధాంతమయినను ప్రాకృతములనుండి తెనుఁగునకు వచ్చెనేమో యను పూర్వపక్ష మొకటి కలదు. ప్రాకృతవ్యాకరణములలో నెక్కడను చ జ లకు దంత్యోచ్చారణము చెప్పఁబడలేదు. అట్లుండినచో ప్రాకృతవ్యాకరణములు పేర్కొనియే యుండుననుట స్పష్టము.

ఈ దంత్యోచ్చారణము చ జ లకు మరాటీభాషయందుఁ గలదని తెలియు చున్నది. తెనుఁగునుండి మరాటీభాషకుఁ బ్రాకినదో యని[13] సంశయము కలుగుటకు ప్రబలమైన హేతు వేమనఁగా చింతామణియందే యీ యుచ్చారణము పేర్కొనబడియుండుట. మరాటీభాషకు మూలమయిన ప్రాకృతమున నీ దంత్యోచ్చారణ ప్రసక్తియే లేదు.

## 4. య వ ల చరిత్రము

యవలు : య వ లు ద్రావిడభాషలన్నింటియందును ఆదినుండి యును గలవు. ఇవి రెండు విధములు. పదగతమయినవి, సంధియందు ఆగమముగా వచ్చినవి. ఈ రెండును అభిన్నములే యయ్యును, ఉచ్చారణమున భేదము గలదనియు, అట్టి భేదమునే లఘువు, అలఘువు అనియు రెండు విధములుగా తెనుఁగు వైయాకరణులు పేర్కొనిరి.[14] య ర ల వ లు లఘువులని, యలఘువులని ద్వివిధంబులు. "హరి యతఁడు; ఇత్యాదులయం దాగమయకారము

---

[11] అర్ధంత్యస్తాలవ్య శ్చుర్వక్రస్యాన్మిథస్సవర్ణశ్చ. బా. స. పు. 157, [12] సంస్కృతసమంబులం దికారాంతము లయిన శబ్దముల యుపధా చ జ లు బహువచనము పరంబగునపుడు దంత్యము లగును. వీచి=వీచులు; రాజి=రాజులు; రాజు శబ్దం బొక్కటి దంత్యయుక్తంబు గానంబడియెడి-బా. వ్యా. సం. సూ. 10. [13] C. G. D. Page 141.

[14] బా. వ్యా. సంజ్ఞ. సూ. 18.

లఘువు, తక్కిన యకార మలఘువు. అట్లే వలికె నిత్యాదులయందున్న పాదేశవకారము లఘువు, తక్కిన వకార మలఘువు.'' మొదట లఘువు, అలఘువు అను సంజ్ఞలకుఁ గల యర్థభేదము ఏమియో స్పష్టపఱచి యాపయినిఁ బయి విభజన మెంతవఱకు సమంజసమో వివరింపనగును.

"దేని యుచ్చారణమున జిహ్వాయొక్క అగ్రము, ఉపాగ్రము, మధ్యము, మూలము అనువాని శైథిల్యము గలదో యది లఘూచ్చారణము గలది." జిహ్వా యొక్క యీ నాలుగు భాగములతో ఏయొక్కధ్వనిని ఉచ్చరించుట జరుగదు గనుక నం దేదియో యొక్కటియే యని భావము.[15] లఘూచ్చారణమునందు స్థాన కరణ శైథిల్యము కలుగుచున్నది.[16] పయిరీతినే ఆధునికులుగూడ వ్రాసియున్నారు. "సంధిలో బయలువెడలు నీ యక్కరములు సామాన్యముగా హల్లుల యుచ్చారణ మున బయలుదేరునట్టి పూర్తి యొరపిడితో నుచ్చరింపవలసిన యవసరము లేదు. అట్టి యొరపిడి కలియునట్టి యచ్చులను బట్టియు, సంధియొక్క గాఢతనుబట్టియు, నడిమి వ్యవధానమును బట్టియు మాఱుచుండును.''[17]

హల్లులధ్వని పుట్టుటకు స్థాన కరణముల సంయోగమును, వాయు స్తంభనయు (స్పర్శములకు) హేతువులని వ్రాసియున్నాను. ఈ యంతస్థముల నుచ్చరించు నప్పుడు ఈషద్వివృతము ప్రయత్నమనియు, చిన్న యొరపిడితో ఊపిరి స్థాన కరణముల నడిమినుండి వెడలుటవలన నివి యేర్పడుననియు వ్రాసితిని. అట్టి యొరపిడి శిథిలముగా నున్నచో ధ్వని లఘువు, లేక పూర్తిగా నున్నచో అలఘువు అని భావము. భో + అచ్యుత = భోయచ్యుత ; అసౌ + ఆదిత్యః = అసావాదిత్యః ; మొదలయిన సంధిస్థలములయం దాగమముగా వచ్చిన య, వ లు లఘువులని సంస్కృత వైయాకరణులు చెప్పిరి.[18]

పయిపద్ధతి ననుసరించి తెనుఁగునందలి య, వ లు లఘువులనియు, అలఘువు లనియు రెండువిధములుగ విభజింపఁబడినవి. ఇతర ద్రావిడభాషలలో అచ్చుల ప్రకృతిభావనివారణకయి వకారాగమము అంగీకరింపఁబడినది. తెనుఁగున లేదు. కావున 'ఊరు పల్లెలు' ఇత్యాదికములోని 'ప' స్థానిక వకారము లఘువుగా

---

[15] "యస్యోచ్చారణే జిహ్వాగ్రోపాగ్రమధ్యమూలానాం శైథిల్యం స లఘూచ్చారణః" -సిద్ధాంతకౌముదీ.

[16] "లఘూచ్చారణే స్థానకరణ శైథిల్యం జాయతే" -కాశికావృత్తి.

[17] "These link sounds are not and need not be evaluated always with full consonantal friction. As they are of glide origin, the degree of friction varies with different circumstances, such as the character of the meeting vowels, the intimacy of combination, or the extent of pause involved etc. Gidugu Rama Murty Pantulu Memorial Volume. *Dravidic Glides*: L. V. R. Page 37.

[18] వ్యోర్లఘుప్రయత్నతరః శాకటాయనస్య.

నంగీకరింపఁబడినను దోషములేదు అననచ్చును. ఈ యకార వకారములు లఘువులా, అలఘువులా యని యంత్రపరీక్ష చేసినఁగాని నిర్ణయింప వీలులేదు. ఉచ్చరించువా రెంతకాలము, ఎంతటి యూపిరిశక్తితో నుచ్చరించుచున్నారని ధ్వనిపరీక్షకయంత్రమున (Kymograph) పరీక్షించి కనుగొనవలసినది.

అంతవఱకును సంధిగతములయిన పయి రెండు య వలును లఘువులని చెప్పు వైయాకరణుల వాక్కులే ప్రమాణము. సంస్కృతమునందలి సంధిగత వకారము అచ్చుస్థానమున వచ్చినది. తెనుఁగు సంధిలోని వకారము పవర్ణస్థానమున వచ్చినది. ఇదియొక భేదకారణమే యని నా యూహ. పకార మలఘువు, దాని స్థానమున వచ్చిన వకారముమాత్ర మేల లఘువు కావలెనో తెలియదు. అచ్చుల నడిమిని వచ్చిన యకారము లఘువు కావచ్చును. అది కేవలము పూర్ణోచ్చారణము గలిగిన రెండచ్చుల నడిమిని ప్రకృతిభావనివారణకొఱకు వచ్చిన యప్రధానవర్ణము. 'ప' స్థానిక వకార మట్టిది కాదుకదా! ఇతర ద్రావిడభాషలలో నంగీకరించిన సంధిగత వకారము తెనుఁగున నంగీకరింపఁబడలేదు. పదాది నుచ్చారణములో నున్న 'వూరు' మొదలయిన వర్ణములలోని వకారమును చింతామణ్యాదులు పేర్కొనలేదు. తరువాతి యప్పకవి మొదలయినవారు లేదని నిషేధించిరి. చింతామణిలో 'అచ్చు కంటె పరంబయిన యచ్చును లఘుయకారము గల దానినిగా ఆర్యులు పలుకుదురు' అని సూత్రింపబడినది.[19] వకార మెయ్యది లఘువో అందు చెప్పఁబడలేదు. కాని "ప్రథమాంతముమీఁది పకారమున కాదేశముగా వచ్చిన వకారము లఘువకారము" అని బాలసరస్వతి వ్యాఖ్య వ్రాసెను. దీని ననుసరించియే సూరిగారును లఘువకారమును నిరూపించిరి. ఈ వకారము లఘు వనుటకుఁ బ్రమాణము లేదు. ఈ మాటను బట్టియే యాకాలమున నా వర్ణమునకు లఘూచ్చారణ ముండినదేమో యని యూహించుకొనవలయును. అట్లు లఘూచ్చారణము ఆ వకారమున కుండుట యుక్తమని తోఁపదు. సంధియందు శ్వాసవర్ణమగు 'ప' స్థానమున నాదవర్ణమగు వకారము వచ్చినది. పయిగా నది రెండవ పదాది యగుటను ఊనికకు తావు. ఇట్టిది లఘువకారముగా నుండుట యయుక్తమని తోఁచును. సంస్కృత లఘువకారము సంధిలో గలుగుటను గ్రహించి యట్లే సంధిలో వచ్చిన వకార మిదియగుట నద్దాని సామ్యముననే లఘువుగా నిది నిరూపింపఁబడినదని తోఁచుచున్నది.

ఇంకొకవిశేష మేమనఁగా సంధియందు య వ ల నాదేశములుగా విధించిన అరవ, కన్నడ వైయాకరణులు వీనియొక్క యుచ్చారణలాఘవమునుగూర్చి వివరింపలేదు. హ్రస్వమయిన ఉ, ఇ, మ వర్ణములనుగూడ నిరూపించిన తొల్కాప్పియనారు ఈ విషయము నేల వివరింపమానెనో తెలియదు. అతని మతమునఁ బదాదినున్న 'యానై' మొదలగు శబ్దముల యకారము లఘువని చెప్పుటకు వీలులేదు.

---

[19] యశ్రుతి మార్యా లఘు యం ప్రవదన్తి ప్రాణతః పరం ప్రాణమ్. ఆ. చిం. 18.

## 5. ర ఱ ల ళ అనువాని స్వభావము

తొల్‌కాప్పియమునందే యీ నాలుగును వేఱుగా గుర్తింపఁబడి వేఱుచిహ్నములతో నొప్పుచున్నవి. వీనినిగూర్చి చింతామణిలోఁ గొంతఁ జెప్పఁబడినది. అంతస్థములు (య ర ల వ లు) రెండువిధంబు లనియు (లఘువులు - అలఘువులు), అందు య వ ల లఘ్వలఘుత ఇతర వ్యాకరణములయందు స్పష్టమనియు, ఆంధ్ర వ్యాకరణమున రేఫ రెండు విధములనియు తెలుపఁబడినది.[20] ఇఁక విచారణీయ విషయము (1) ర, ల లు లఘువులు; ఱ, ళ లు అలఘువులు అని చెప్పఁబడినదిగదా! లఘుత్వాలఘుత్వ భేదము ననుసరించి యివి నిజముగా లఘువులును, అలఘువులును అనఁదగునా? (2) అలఘు ళకారమనునది, 'ళ' వర్ణసామాన్యమా, ఇం దేదియైన భేదముగలదా? యనుటయే.

ఱ ళ ల యలఘుత్వమునుగూర్చి సంస్కృతవ్యాకరణములలో నేమియును వ్రాయలేదు. అన్ని ద్రావిడభాషలయందును ఈ ఱ, ళ లును ర, ల లును వేఱు వేఱు వ్రాతగుర్తులతో వ్రాయఁబడుచుండినవి. య, వ లట్లు గాదు. ర, ల లు రెండును సంస్కృత ద్రావిడ భాషాసామాన్యమయిన ధ్వనులు. ఈ ర, ల లయొక్క యుత్పత్తినిగూర్చి తైత్తిరీయ ప్రాతిశాఖ్యమునందు "రేఫోచ్చారణము జిహ్వాగ్రమధ్యభాగమును, దంతమూలముల యుపరిభాగమును ఇంచుక స్పృశించుటవలన సంభవించు" నని చెప్పఁబడెను.[21]

నాలుకకొన దన్తమూలమును దాకించి నాలుక రెండుప్రక్కల నేర్పడిన వివరములనుండి గాలిని వెడలించుటవలన లకారము వినఁబడును. ఆ దన్తమూలమునకుఁ బయిభాగమయిన వర్త్సమనఁబడు నెత్తయిన ప్రదేశమును నాలుకకొనను దాకించి గాలిని వెడలించుటవలన రేఫ మేర్పడును.

ఇట్టి రేఫమును ఉచ్చరించుటయందు అతిస్పర్శత యను దోష మొకటి కలుగుచున్నదనియు, నది సౌకుమార్యమునకు బ్రతిబంధక మనియు ఋగ్వేద ప్రాతి

[20] లఘవోఽలఘవశ్చేతి ద్వేధాంతస్థాన్ విదంతి శాస్త్రారః; అన్యే అన్యవ్యాకరణ స్పష్టా రస్త్వత్ర గృహ్యాతే ద్వివిధః. య ర ల వ లు ద్వివిధములు. అందు య వ ల కు హలిసర్వేషాం అను పాణినీయ సూత్రమున రెండువిధములును సూచితము లయ్యెను. లకారము "లోళః" అను ప్రాకృతవ్యాకరణసూత్రమందు రెండువిధములయ్యెనని సూచితమయ్యె. -బాలసరస్వతి.

[21] సీతారామపండితీయము. పుట. 167. దన్తమూలీయస్తు తకారవర్గః (ఋ. ప్రా. 11-1 పటలము-౩౬ సూ.) సకార రేఫ లకారశ్చ-రేఫసంవర్త్యమేకే. 37 సూ. పార్షదవ్యాఖ్య. వర్త్సే భవోవర్త్స్యః వర్త్స శబ్దేన దన్తమూలాదుపరిష్ఠాదుచ్ఛూనః ప్రదేశ ఉచ్యతే, రేఫే జిహ్వాగ్ర మధ్యేన ప్రత్యగ్దంతమూలేభ్యః. (తై. ప్రా. 2-అ. 40-సూ). దన్తమూలానా ముపరి స్పర్శయతి. రోదన్తమూలే-వ్యా. రేఫో దన్తమూలస్థానః ప్రత్యేతవ్యః. రశ్చ (శుక్ల. ప్రా. 1-అధ్యా. 77-సూ.) వ్యా. రేఫశ్చజిహ్వాగ్రేణ క్రియతే. (శుక్ల. ప్రా. 1-అధ్యా. ౭౦ సూ.)

శాఖ్యమునఁ జెప్పఁబడినది.[22] ఇంతియేకాని చింతామణిలో చెప్పినట్లు పయి విషయము రేఫయొక్క యలఘుత్వమని నిరూపింపఁబడలేదు. ఇట్టి యుచ్చారణ మును గొందఱు చేయుచున్నారు. అది దుష్టము గావునఁ బరిహార్యమనియే యందలి యభిప్రాయము.

ఋగ్వేదకాలమున దుఃస్పృష్ట డకార మొకటి గలదనియు, అచ్చుల నడుమ నది ళకారమువలె నగుననియు వైదికవ్యాకరణములలోఁ జెప్పఁబడినది. "అగ్నిమీళే; ఏకనీళమ్; దేవహేళనమ్" అను వైదికవాక్కులలోని ళకారము (దుఃస్పృష్ట డకారము) అనఁగా డకారము ఈషత్స్పృష్ట మగుటవలనఁ గల్గినది యని భావము. డకారమును స్పృష్టముగా నుచ్చరింపక ఈషత్స్పృష్టముగా నుచ్చరించుటవలనఁ బయి ధ్వని కలుగుచున్నది యనుట. ఇదియే ళకారముగా నేఁ డుచ్చరింపఁబడుచుండి ననుగూడ వైదికకాలమున నిది యలఘులకార మను వ్యవహారముతో లేదనుట స్పష్టము. ఇంతియగాక యీ ధ్వని వైదికవాఙ్మయమునఁ గాలక్రమమునఁ గల్గిన దనుటయుఁ బయిదానివలన స్పష్టము.

ర, ల లకు బ్రతిగా ఱ, ళ లను అక్షరములు అన్ని ద్రావిడభాషలయందును గలవు. వీని యుచ్చారణమునుగూర్చి యా వ్యాకరణములలో తొల్‌కాప్పియనారు మొదలయిన వా రేమిచెప్పిరో తెలిసికొనవలయును.

"నాలుకకొన పయికెత్తి మెల్లగా తాలువును ఒత్తుటవలన ఱకారమును, (ఞ) నకారమును (ఇది తెనుఁగున లేదు) గలుగును."[23]

"నాలుకకొన పయికెత్తి తాలువును దడవ రకారమును ழ కారమును బుట్టును."[24]

పయి రెండుసూత్రములనుబట్టి రేఫ ఱకారములు రెండును ఏకస్థానులే యనియుఁ, బ్రయత్నమాత్రమే (ముయర్చి) భేద మనుటయు స్పష్టము. కాఁబట్టి వీనిలో లఘుత్వాలఘుత్వభేదము సార్థకమే యనక తప్పదు. ఈ విషయమును గూర్చి కన్నడవైయాకరణులును 'ల, ర, డ' లే 'ళ, ఱ, ౞' లుగా బ్రయత్న భేదమువలన నేర్పడుచున్నవి యని వ్రాసిరి.[25] వారి మతమున, ల, ర లకును, ళ, ఱ లకును జన్మస్థానములు అభిన్నములే. ఒకటి యతిపీడనమువలనను, మఱియొకటి లఘు

---

[22]అతిస్పర్శో బర్బరతాచ రేఫే (ఋ. ప్రా. 14-పటల. ౭౬-సూత్రము. పార్షదవ్యాఖ్య— దుఃస్పృష్టో రేఫః- సోఽతిస్పృశ్యతే. బర్బరతాచోచ్యతే-తౌ దోషౌ రేఫస్య వర్జయేత్, బర్బర తాప్యసౌకుమార్య మేవ. సీ. ప. పుట, 171.

[23]அணரி நுனிநாவண்ணம் ஒற்றுதல் றகார னகார மாயிரண்டும் பிறக்கும், [24]நுனிநாவ ணரியண்ணம் வருடரகார ழகார மாயிரண்டும். பிறக்கும் தொ. எ. 94. தொ. எ. 95.

[25]లరడా ఏవ, ళఱ౞ః ప్రయత్నాశ్రయాత్-క. భా. భూ. సంజ్ఞ. 10, రేఫె పుట్టువతాణమం బెట్టిత్తా గుచ్చరిసె ఱకారం పుట్టుగుమ్, లకారం పుట్టువతాణమం బెట్టిత్తా గుచ్చెరిసె ళకారం పుట్టుగుమ్. శ. దర్పణము. పు. 33.

పీడనమునను గలుగుననుటమాత్రమే భేదము. ల ళ లను గూర్చియుఁ బయి యభిప్రాయమే తొల్‌కాప్పియమునఁ జెప్పఁబడినది. "నాలుక యొక్క కొన చాచి మీఁది దన్తమూలమును తాకుటవలన లకారమును, ఒరయుటవలన ళకారమును పుట్టును."[26]

అనఁగా అరవమున (క్రీ. పూ. నుండియు), కర్ణాటమున లక్షణగ్రంథములందు ఱ, ళ లు ర, ల లయొక్క యలఘురూపములని చెప్పుటకుఁ బ్రబలమయిన యాధారము లున్నవనుట స్పష్టము. ఆ వైయాకరణులు చెప్పిన వాక్యములనుబట్టి వీనియందు లఘుత్వాది భేదము సార్థకమేగాని నిరర్థకము గాదు.

ప్రాచీనచరిత్ర మెట్లున్నను నేఁటి ళకారోచ్చారణముమాత్రము అన్ని ద్రావిడభాషలయందును ఒక్కరీతిగా మూర్ధన్యముగానే యున్నది. నాలుక చివరను మడచి మూర్ధమును దాకించి వాయువును నాలుకకు రెండుప్రక్కలనుండియు వెడలించుటవలన ళకారము గలుగుచున్నది.

నేఁటి యవస్థతోఁ బ్రాచీనుల పయివాక్యములను సమన్వయపరచవలయు నన్నచో రెండుమార్గములు గలవు. ప్రాచీనులు సరిగాఁ జెప్పలేదనుటయో, లేక ళకారోచ్చారణము మాఱినదనుటయో. వీనిలో రెండవదే యుక్తమనవచ్చును. మొదటి పక్షము నాశ్రయించినచో ఱ, ళ లు రెండును ర, ల లకంటె భిన్నవర్ణములే యనియు, వానికి లఘ్వలఘుభేదమును జెప్పుట కవకాశము లేదనియు నిర్ణీతమగును.

ఇఁక తెనుఁగువైయాకరణులు చెప్పిన మార్గమును బరిశీలించినను బయి విషయమే సిద్ధించుచున్నది. చింతామణి ల, ళ లకు లఘ్వలఘుభేదమును జెప్పి నట్లు ముం దుదాహరించితిని. అం దేది లఘువో యేది యలఘువో నిరూపింపలేదు. వ్యాఖ్యలో బాలసరస్వతి ల, ళ లు ప్రసిద్ధములే యని వ్రాసి "నీళ్లు పాలును గలిసిన ట్లెల్లప్రొద్దు" అని నీళ్లు శబ్దమును అలఘులకారము కలదిగా నుదాహరించెను. ఇట్లే అహోబలపతియు "ళెళుకుంజూపులు, తళుకుం జెక్కులు, పొలతి, చెలువ ఇత్యాదౌ లస్య ద్వైవిధ్యమ్" అని వ్రాసెను.[27] అప్పకవియు.[28] పయిరీతినే వ్రాసి,

సీ. ఏకనీళము, దేవహేళనంబు నటంచు యాజుషామ్నాయంబునందు లేదొ కాళ, నీళ, వ్యాళ, గోళ, హింతాళంబు లనుచు సంస్కృతభాషయందు లేదొ। గయ్యాళి, త్రుళ్లు నగళ్లు, వజ్రపుఁదళుక్కుఁ, దాళికి నంచు నాంధ్రమున లేదొ। పాళం బెఱుంగని కూళ విరాళి పిసాళించు ననియు దేశ్యమున లేదొ॥ అని యుదాహరించెను.

---

[26] నావిళింపు వీంగి యణ్పల్ ముదలుఱ వావయి నణ్ణమొట్రవుమ్, వరుడవుమ్, లకార ళకారమా యిరణ్డుమ్ పిఱక్కుమ్. తొల్. ఎ. 96 సూ.

[27] అహోబల పండితీయము. పుట. 132. మంజువాణీ ప్రెస్సు. [28] అప్పకవీయము II ఆశ్వాసము. 50 పద్యము

పైవారి మతమునం దెల్లను ల, ళ ల సామాన్యమే లఘువు, అలఘువు నని వ్యవహరింపఁబడుచున్నదన్న మాట.

పయి పద్ధతి యిట్లుండ చిన్నయసూరిగారు ఒక వింతమార్గమును ద్రొక్కి యున్నారు. " ఏళులు, పాళులు, త్రాళులు, అని బహుత్వమందు ర ల డ ల కాదేశ మయిన ళకార మలఘువు. తల, నెల యిత్యాదులయందలి లకారము లఘువు. వర్ణసమామ్నాయమందలి ళకారము, వర్ణాంతరముగాని యలఘులకారము కాదని యెఱుంగునది. " బా. వ్యా. సంజ్ఞ. సూ. 18.

అనఁగా వీరి మతమున ల, ళ లు మూఁడు విధములు. పలక, తలపు మొదలయినవానిలోని దంత్యలకారము లఘువు. ఆదేశముగా వచ్చిన ళకారము అలఘువు. ఈ ళకారమునకును బయి లకారమునకును స్థాన కరణము లొక్కటనుటకుఁ బ్రమాణమేమి? ప్రాచీనులవాక్యము అయినను లేదా శ్రవణగోచరతయేని ప్రమాణము గావలెనుగదా!

అప్పకవి, అహోబలపతి మొదలయినవా రందఱును ళకారసామాన్యమే యలఘులకార మనిరి. బాలసరస్వతి 'నీళ్లు' అను పదమును అలఘులకార యుక్తముగా నుదాహరించెను. అందలి ళవర్ణము 'రోళః' యను సూత్ర ముచే వచ్చిన ళకారమే యైనను 'నీళులు' అను శబ్దమందలి ళకారము అలఘు వని యాతండు చెప్పి వర్ణసమామ్నాయసిద్ధ ళకారమును పృథక్కరింపలేదు. ఇంతియ గాక లకారము 'లోళః' అను ప్రాకృతవ్యాకరణసూత్రమందు రెండువిధము లయ్యెనని సూచితమయ్యెను అని వ్రాసెనేగాని సంధియందాదేశముగా వచ్చిన ళకారము అలఘువని వ్రాయలేదు. ప్రాచీనుల వాక్యములు ప్రమాణము లను టకు చింతామణి సూత్రములలో యకారముకంటె నితరమైనదాని లఘ్వలఘు భేదము పూర్తిగ వివరింపనేలేదు.

చిన్నయసూరి యీ మార్గమును ద్రొక్కుటకు హేతువేమగునని యోచింప వలయును. నేటి ళకారము స్పష్టముగ మూర్ధన్యముగఁ గనుపట్టుచున్నది. పయిగా శబ్దమున నావయవికముగఁ గనుపట్టుచున్నది. య, వల లఘుతాలఘుతలలో ఆగమాదేశాది సంధివిషయకమయిన విశేషము గనుపట్టుచున్నది. దాని సామ్యమునఁ గాఁబోలు ర ల డ ల కాదేశమయిన ళకారమే యలఘువని సూత్రించెను. అట్లు కానిచో నీలులు, కాలులు మొదలగురీతిని విజాతీయమైన యలఘులకార మొకటి యాయనకు శ్రుతిచరమగుచుండి యుండవలయును. ఱ, ళ లను అలఘు ర ల లని వ్యవహరించుట నేఁడు కేవలము రూఢమేకాని సార్థక మెంతమాత్రమును గాదని తోఁచుచున్నది.

పయివిషయమున సుదీర్ఘమును, ప్రామాణికమును నయిన పరిశ్రమము చేసిన బ్రహ్మశ్రీ వఝ్ఝల సీతారామస్వామి శాస్త్రిలవారు సీతారామ పండితీయమున నిట్లు వ్రాయుచున్నారు.

"ఉచ్చారణమున లఘు య వ లకువలెనే లఘు ర ల లకును స్థానకరణ స్పర్శ శైథిల్యము తుల్యమయి యుండుటచేతను, య వ లతోపాటు ర ల లును నంతస్థము లగుటచేతను నేకవిధమున వీనికి లఘుత్వము ప్రతిపాదింపఁబడినదేగాని వీని కీ విషయమున సాజాత్యము లేదు. స్వరసంహితలో నుచ్చారణసౌకర్యార్థముగ నిలుచుటచే నప్రధానములయి లఘుతరముగఁ బలుకఁబడునవి లఘు య వ లు. అలఘు ర ల ల యుచ్చారణమునకన్నఁ దేలికయగు నుచ్చారణము గలిగిన కారణమున లఘువు లనఁబడుచున్నవి లఘు ర ల లు." పుట 376.

"పయిరీతినున్న ప్రయోగములచొప్పున యతిప్రాసమైత్రి యున్నంత మాత్రమున 'ప్రెళ్లు' మున్నగు శబ్దములలోని వర్ణసమామ్నాయగత ద్రావిడ మూర్ధన్య ళకారము సయితము అలఘులకారముగా నప్పకవ్యాదులవలెఁ జెప్పుట నన్నయాభిప్రేతము గాదనియు, "గోళగరళా"ది సంస్కృత శబ్దములలోని ళకార మును మాత్రమే యలఘులకారమనియు నీవఱకు విశదీకరించియున్నాను." (వి 187-190-193)

చింతామణిలోనివని చెప్పి వ్యాఖ్యానము చేయఁబడిన ఆంధ్ర లిపి వర్ణన శ్లోకములలో 'గురురలౌచబిందుయుతౌ' అని గురు ర ల లకు వేఱు ఆకారము చెప్పఁబడినట్లును ఉదాహరించిరి. పు. 242

ఇంకొకవిషయ మేమనఁగా "ద్వివిధా సహళంతు హల్వర్గః" అను చింతా మణి సూత్రములో లఘ్వలఘుతామాత్రభేదముగల య, ర, వ లను వేఱు వర్ణములుగా పరిగణింపక ళవర్ణమునుమాత్రము వేఱుగా లెక్కించి తెనుఁగునకు ముప్పదియాఱు వర్ణము లున్నవని "షట్త్రింశదత్రతే" అని చెప్పఁబడెను. పయి రెండు మూఁడు విషయముల నాధారముగాఁ జేసికొని అలఘులకారము వేఱుగా నుండవలెననియు, నది యిప్పటి ళకారము గాదనియు శ్రీ శాస్త్రిలవారును, సూరిగారి మార్గమువంటి మార్గమునే త్రొక్కిరి. దానిని ప్రౌఢముగా స్థాపించిరి. అయిన నీ మార్గమును నిర్బాధము గాదు.

1. చింతామణిలోని వనెడి యీ యలఘు ర, ల ల పయి నుండవలసిన బొట్లు నెవ్వరయిన వాడిరా ? లేదు. నన్నయ వ్రాయించిన శాసనములోఁగాని, మఱి యితరశాసనములలోఁగాని యెన్నడును లేదుగదా ! దానికి సమాధానము అతఁడు కనిపెట్టిన సవరణయగు నిది వాడుకలోనికి రాలేదు అనుటయే.

2. అట్లు అంగీకరించినను ఈ బొట్టుతోఁ గూడి వ్రాయవలసిన యలఘు లకారము, అప్పకవ్యాదులచేతను వలె నంగీకరింపఁబడిన నేటి ళకారసామాన్యము గాదు. గోళగరళ శబ్దములలోనిదియు, పళులు మొదలయిన శబ్దములలోనిదియు మాత్రమే యనుట కేమి ప్రమాణము ? నన్నయ చెప్పలేదు. అప్పటినుండి అవిచ్ఛిన్న మయిన సంప్రదాయమైనను లేదుగదా ? అహోబలపత్యాదులు ళకారసామాన్యము నే అలఘులకార మనిరి.

3. వర్ణసమామ్నాయమున ళకారమును బృథగ్వర్ణముగాఁ బరిగణించుట దానికిఁ బ్రమాణమందుమా ? అదియు నిర్బాధము గాదు. అప్పకవి యంగీకరించిన పాఠముననే "సప్తత్రింశదిహో న్యే...రయుగ లయుగ వస హోళ్చ హాలః" అను ముప్పది యేడు అక్షరములు అను పాఠము కలదుకదా !

4. గోళగరళ శబ్దములు నేఁడు వర్ణాంతర ళకారముతోనే వ్రాయఁబడుచు నుచ్చరింపఁబడుచున్నవి. అట్లే "రట్టగుళ్లు" (రట్టగుడి, రట్టగుళ్లు) మొదలయిన శబ్దములు ఏడవశతాబ్దమునుండియు నవిచ్ఛిన్నముగా ళవర్ణముతోనే వ్రాయఁబడుచున్నవి.

మొత్తముమీఁద నంతస్థముల మార్గమంతయు విప్రతిపన్నమయి యున్నది.

పయి విచారణమువలని ఫలితములు :

1. అనాదిగా ల, ర ల యుచ్చారణ గౌరవ లాఘవములను వైయాకరణులు గల్పించుకొనుట కవకాశమయిన సామాగ్రిని అరవ, కన్నడులు తమ వ్యాకరణములలో వ్రాసిరి.

2. ప్రాచీనకాలమునుండియు ద్రావిడభాషలలో ల, ర లకును, ళ, ఱ లకును లేఖనచిహ్నములు వేఱుగా నున్నవి. వానికి ప్రాసాది మైత్రినికూడ నంగీకరింపలేదు.

3. తెనుఁగున వీనికి లఘుత్వాలఘుత్వ వ్యవహారము రూఢము. అన్ని యెడలను సార్థక మన వీలులేదు.

4. వకారమును తెనుఁగున లఘువని చెప్పుట యుక్తముగాఁ గనుపట్టదు.

5. తెనుఁగునఁ గల్పింపఁబడిన యీ లఘ్వలఘుతాభేదము సంస్కృతము ననుసరించినదిగాని అరవ, కన్నడముల నీ వ్యవహారము య, ర, ల, వ ల యన్నిటి విషయమున లేదు.

6. ద్రావిడభాషలో ననాదిగా ళకారముగా నుచ్చరింపఁబడుచుండిన ధ్వనియు, సంస్కృతమునందలి "గోలగరల" శబ్దములు మాఱుగా నేర్పడిన ళకారమును, ద్రావిడభాషలో 'ழ' అను గుర్తుతో వ్యవహరింపఁబడిన ధ్వనియును, వేదమునందు దుఃస్పృష్టముగా నుండి మాఱిన ళకారమును గలిసి యొక్కరీతిగానే యుచ్చరింపఁబడి యొక్క చిహ్నముగా నిరూపింపఁబడుటవలన దానినే తెనుఁగు వైయాకరణులందఱును అలఘులకారమని వ్రాసిరి.

ఇఁక ర, ఱ లకుఁ గల భేదము ద్రావిడభాషలన్నిటియందును బ్రసిద్ధమగుటయు, సంస్కృతమున లేకుండుటయు ద్రావిడభాషలు సంస్కృతముకన్న భిన్నమనుటలో నుపకరించుచున్నవి. ఇట్టి ర, ఱ లు మాత్రము పరస్పరము భేదించుటవలన శబ్దముల కర్థభేదము గలుగుటయు, పయిభాషలన్నిటియందును ప్రసిద్ధమయినది. పయి గురుత్వ లఘుత్వములకు ముఖ్యప్రమాణ ముచ్చారణమేగాని వేఱు గాదుకదా ! అట్టి

యుచ్చారణమునందు తబ్బిబ్బులు గలుగుట సహజము. ప్రామాణిక గ్రంథములు, వ్యాకరణములు, సారస్వతము మొదలయినవి యున్నప్పుడు పయిశొప్పులు తగ్గుచుండును. అట్లు ప్రాచీనకాలములోనే సారస్వతము వెలసిన యరవమునందు వానికి గల భేదము దృఢమై భాషలో నిలువఁబడినది. అరవము తరువాతఁ బది, పండ్రెండు శతాబ్దములకు సారస్వతస్థితిని గాంచిన తెనుఁగునందు నన్నయనాఁటికే పయి రేఫ, శకటరేఫ జ్ఞానము సామాన్యులలో కలుషితమయియుండె ననక తప్పదు. ప్రాచీనశాసనములయందే యీ శకటరేఫ విషయమునఁ బొరపాట్లు పడుట ప్రారంభమయినది. నన్నయభట్టుకన్న కేవలము ప్రాచీనమగు యుద్ధమల్లుని మధ్యాక్కరల బెజవాడ శాసనమున "పాపంబుగొ్ణ్డ్ఱు"అనుచో క్రియాప్రత్యయము శకటముగా వ్రాయఁబడియున్నది. అట్లే చేబ్రోలు అనుచోట రావడి యొకచోట శకటముగాను, మరియొకచోట రావడిగాను బై శాసనమునందే యున్నది."[29]

ప్రాచీన భాషాప్రకరణమున నేను నిరూపించిన యుదాహరణములను బరిశీలించునది. ఇట్లు నానాముఖములుగా నుండిన భాషకు నొక్క యనుగమమును గల్పించువాఁడయి నన్నయ అరవ, కన్నడ భాషలలో నుండు సంప్రదాయము ననుసరించి రేఫ, శకటరేఫములకు యతి ప్రాసాదులలో సాంకర్యము లేనట్లు తన భారతమును రచించెను. కాని వ్యవహారమున నశించుచు కేవలము గ్రంథముల నుండి మాత్రమే తెలిసికొనఁదగిన యీ భేదమును జక్కగా నిలుపుట కెవ్వరికిని శక్యము గాదయ్యెను.

తరువాతి లాక్షణికుండైన యథర్వణుఁడు తన కారికలయందు రేఫ, శకటరేఫములు గల శబ్దములను గుర్తులో నుంచుకొనుటకుఁ గొన్ని సూత్రముల వ్రాసెను. ఈ సూత్రముల యావశ్యకతయే పయి భేదజ్ఞానము సడలుచుండె ననుటకు సాక్ష్యము. పయిగా నార, అల భేదము ఉచ్చారణభేదమువలన గలుగుచుండుననియు, నది కల్ప్యమనియు, నద్దానికి సత్ప్రయోగములు ప్రమాణములనియు నుదాహరించెను. తరువాతి లాక్షణికు లందఱును అప్పకవి, కూచిమంచి తిమ్మకవి మొదలగువారు రేఫ, అకార భేదములను నిరూపించుటకు శబ్దముల పట్టికల నొసంగిరి. వానికి నాధారములుగాఁ గవిప్రయోగముల నిచ్చుచుండిరి. తాళ్ళపాకము తిరుమలయ్యంగారు, రేఫ, అకార నిర్ణయమును రచించిరి. ఓగిరాల రంగనాథముకవి ద్విరేఫ దర్పణమును రచించెను. ఇట్లే లాక్షణికు లెల్లరును బయి రేఫ, అకార భేదమును నిరూపించుచునే యుండిరి.

కాలక్రమమునఁ బయిభేదమును యతిప్రాసలలో నిలుపుకొనలేక పండితులు గూడ రేఫ, అకార సాంకర్యమును జేయుచువచ్చిరి.

మొదటినుండియు రేఫ, అకారములకు యతి ప్రాసములలో సాంగత్యము లేదనియు, నయ్యది దుష్టమనియు కవులు చెప్పుకొనుచునే యుండిరి. ఒకడు వానికి

---

[29] సి. పం. పుట. ౪౦౦.

యతియందే సాంగత్య మనెను. నుఱియొకఁడు ప్రాసమందు ననెను. కావ్యమందు వీని నెవ్వఁడు సాంకర్యముచేయునో యాతఁడు దుష్కవి యని అథర్వణుఁడు చెప్పెను. "అల్లసాని పెద్దనకవి, పింగళి సూరన, రామభద్రకవివర్యుఁడు, పిల్లలమఱ్ఱి వీరభద్రుఁడు గలిపిరిగద ఱాలఁ గడు రేఫములన్" అని కూచిమంచి తిమ్మకవి వ్రాసెను. ఇట్లు యతి ప్రాస సాంకర్య మేర్పడినతరువాతఁ గొన్ని శబ్దములకు ద్వైరూప్య మంగీకరించుచు వచ్చిరి. ఒక శబ్దమునకే రెండురూపములు నంగీకరించినతరువాత పై నియమము నశించినదనుట స్పష్టమే. బహుజనపల్లి సీతారామాచార్యులుగారు వ్రాసిన యలఘుకౌముదియందు అర్థభేదము లేకయే ర, ఱ లతో నుండు ద్విరూప శబ్దములను సుమారు ఇరువదియైదింటిని నిరూపించిరి. అర్థభేదము నాశ్రయించిన రేఫభేదము గల శబ్దములు అనేకము లున్నవి. తద్భవములలో శకటములు లేవని సూరిగారు, కలవని సీతారామాచార్యులుగారు. సంయుక్తములలో శకటములు లేవని యెల్లరంగీకరించినదేగాని ప్రాచీనశాసనములలో నెల్లను బయిని గ్రిందను గూడ శకటములు గనుపట్టుచునేయున్నవి. ఇట్లు విప్రతిపన్నమయిన దీ విషయము.

ఇఁక నేఁడు ర, ఱ ల భేదము కేవల గ్రంథసాహాయ్యంబున జ్ఞప్తియం దుంచుకొనవలసినదేగాని మార్గాంతరము లేదు. నేఁటి యుచ్చారణములో గొఱ్ఱె మొదలయిన ద్విత్వస్థలములయందుఁ దప్ప నితరస్థలములలో శకటధ్వని లేకుండుటం జేసి రేఫమునుమాత్రమే యెల్లెడల వాడుటవలన భాషకు నష్టములేదు. అట్లు వ్రాయుచున్నవారును గలరు.

పైవిచారణమునుబట్టి య, ర, ఱ, ల, వ, ళ యను వర్ణములు ప్రాచీన ద్రావిడములోనే యుండి తెనుఁగున కితర ద్రావిడభాషలవలెనే వచ్చినవనుట సిద్ధాంతము.

## 6. టవర్గము- ట-డ-ణ లు

పై మూఁడువర్ణములయందును ట, ణ లు మాత్రమే ప్రాచీనద్రావిడభాషయం దుండినట్లు ఊహింపనగును. అరవమునఁ బయి రెండుమాత్రమే కలవు. తక్కిన ద్రావిడభాషలయందు డకారముకూడ కలదు. ఠ ఢ లు తరువాత ప్రవేశించినవి.

సంస్కృతమునందలి యీ టవర్గము మూర్ధన్యమనియు, మడవబడిన జిహ్వామూర్ధమునుదాకి వాయువును బంధించి విడువగాఁ గల్గుచున్నదనియు ప్రాతిశాఖ్యలోఁ జెప్పఁబడినది.[30] ఈ ట, ణ లను గుఱించి తొల్‌కాప్పియమున భిన్నముగఁ జెప్పఁబడినది.

---

[30] మూర్ధా శిరః తత్ర ప్రతివేష్టితేన జిహ్వాగ్రేణ స్పర్శయతి. తై. ప్రా. అ. 2 సూ. 44.

"టకార ణకారములు నాలుకకొనయును అంగిటికొనయుఁ జేరుటవలనఁ గలుగును."[31]

అనఁగా నేఁటి సాంస్కృతిక టవర్గ ముచ్చరింపఁబడుచున్నట్లును, ద్రావిడ భాషలలోని టవర్గ ముచ్చరింపబడుచున్నట్లును, తొల్కాప్పియనారు కాలమున ట, ణ లుచ్చరింపఁబడలేదనుట స్పష్టము. తరువాత వాని యుచ్చారణము కాలక్రమమున నాఁటి సాంస్కృతికవర్ణములతో సమమయినదని యంగీకరింపవచ్చును.

కాల్డ్వెల్లుగారును ఇతరులును ఈ యక్షరముల యుత్పత్తినిగుఱించి దీర్ఘమయిన విచారణ సల్పిరి. ఈ టవర్గము ద్రావిడభాషలలోనుండి సంస్కృతమునకు గ్రహింపఁబడెనని వారి యభిప్రాయము. ఈ విషయమున వీరు క్రింది కారణములను దెల్పియున్నారు.[32]

ఈ ట ణ లు ప్రాచీనద్రావిడధాతువులలో ననేకముగా నావయవికముగా నుండి శబ్దముయొక్క పుట్టువుతోనే సంబంధించినవి. సంస్కృతమునందివి చాలవఱకును సంధికార్యమువలన (ముఖ్యముగా ణకారము) నేర్పడినవి. ఆర్యావర్తప్రదేశమును బ్రవేశించుటకు ముందు సంస్కృతమునకు సోదరభాషలయిన పర్షియను, జెందు భాషలయందుగాని, అంతకుముందు సంబంధించియుండిన గ్రీకు, లాటినుభాషలయందుగాని యీ టవర్గాక్షరములు లేవు.

ముఖ్యములయిన పయి రెండు కారణములవలనను సంస్కృతమునఁ గాలక్రమమున నేర్పడిన యీ టవర్గాక్షరములు ప్రాచీనద్రావిడమునుండి గ్రహింపఁబడెనని యూహింపనగునని వారి యభిప్రాయము.

పయి రెండు యుక్తులవలనను టవర్గము ప్రాచీనద్రావిడమున నున్నదనుట నిర్వివాదమగును. అది దానికి స్వాభావికములే. సంస్కృతమున టవర్గము క్రొత్తగా నేర్పడినదని యంగీకరించినను అట్టిది ప్రాచీన ద్రావిడభాషాసాహచర్యమున నేర్పడినదనుట యెట్లు?

[31] "These two sounds t and n are alveolar according to Tolkappiyanar, but at present they are pronounced by rounding the tongue and allowing it to touch the uppermost part of the hard palate exactly the same way as t and n are pronounced in Sanskrit. The original pronunciation of Tamil t and n is preserved even now in Malayalam. P. S. S. Page 13

Tol. Translation.

టకార ణకార నునినావణ్ణమ్. తొల్. ఎ ழு. 91. టకారముమ్ ణకారముమ్ నావదునునియమ్ అణ్ణత్తదు నునియుమ్ ఉఱప్పిఱక్కుమ్.

[32] I have long been persuaded that they were borrowed from the dravidian languages, after the arrival of the Sanskrit-speaking race in India. C. G. D. 147-149.

లాటినుభాషలో లకార తకారములు కూడియున్న శబ్దములలో లకారము జారిపోయి యా తకారము టకారముగా సంస్కృతమున మాఱినదని పార్టునేటవో గారు సూత్రించిరి.[33] ఉలెన్ బెక్కు మొదలయినవారు దాని నంగీకరించిరి. ఇంతియ గాక సంధియందు రేఫ షకారములకుఁ బ్రక్కనున్న నకారము ణకారముగా మాఱునట్లు స్పష్టముగాఁ దెలియనగును. (లాటిన్. కల్టర్ —సం. కుఠార) ఇట్లే సంస్కృతమునందున్న తవర్ణము ప్రాకృతమున డవర్ణ మగుచున్నది. (ప్రతిసరః—పడిసరో) కాఁబట్టి సంస్కృతమున మూర్ధన్యములు ఋగ్వేదకాలమునకు ముందే యేర్పడియుండవచ్చును. ఆర్యు లార్యావర్తదేశమును బ్రవేశించిన తొలుతటికాలముననే యివి యేర్పడినవని యంగీకరింపకున్నచో ఋగ్వేదమునందలి వీని యునికికి హేతువు లేకపోవలసివచ్చును.

ఇఁక ద్రావిడమునందలి ట ణ లు దంతమూలీయములని పై తొల్కాప్పియము వచనమునుండి తెలియుచున్నది. ఇవి ద్రావిడమున సంస్కృతసంబంధము లేకయే యుండి కాలక్రమమున మూర్ధన్యములుగా మాఱిన ట్లూహింపవచ్చును. డకారము గ జ డ ద బ లన్నియు నేర్పడినట్లే యేర్పడినది. సంస్కృతమున ట-ఠ—డ—ఢ—ణ వర్ణము లన్నియు నుండుటయు, ట—ణ లు మాత్రమే మొదట ద్రావిడమున దంతమూలీయములుగా నుండి మూర్ధన్యములయి తరువాత డకారము కలిగి యనంతరము ఠ ఢ లు సంస్కృతమునుండి వచ్చిచేరినవని యూహించుట కనువుపడుటయుఁ, బరిశీలించినచోఁ బయి రెండుభాషలలోని వర్ణములకు సంబంధము పుట్టువులో లేదనుట యుక్తము అని తోచుచున్నది.[34]

## 7. ఒత్తక్షరములు

ఒత్తక్షరములు లేక మహాప్రాణము లనఁబడు నీ వర్ణములు సంస్కృతమునను ప్రాకృతమునను గలవుగాని ద్రావిడభాషలలో లేవని యంగీకరింపక తప్పదు. నేఁ డాంగ్లము తెనుఁగున ప్రవేశించునట్లే సంస్కృతము ద్రావిడభాషలలోఁ బ్రవేశించునప్పు డా శబ్దములతో నీ మహాప్రాణములును బ్రవేశించినవి. కావుననే "అన్యేచ ప్రవిశన్తి శబ్దయోగవశాత్" అని చింతామణిలోఁ జెప్పఁబడినది. అట్టి యొత్తక్షరములను తెనుఁగు, కన్నడ, మలయాళ భాషలలో నట్లే గ్రహించిరిగాని అరవలుమాత్రము వానిని తమ వర్ణములలోని కిముడునట్లు మార్చుకొని తద్భవములుగానే గ్రహించిరి.

ఒత్తక్షరములు ద్రావిడభాషలలో లేవనుటవలనఁ గ్వాచిత్కముగానైన నుండవనిగాని, యా భాషలో వాని నుచ్చరించుట సాధ్యము గాదనిగాని యభిప్రాయము గాదు. 'ఫో' అను శబ్దమును ఒత్తి ఉచ్చరింపవలసినప్పుడు ఆగ్రహ

[33] Fortunatavo's law. Ulhenbeck's *Sanskrit Phonetics* p. 53.

[34] P. S. S. 58-60 ఆం. భా. చ. పుట 229-233.

సూచకముగా 'ఘో' అని మనము ఒత్తి పలుకునపుడు 'ఘ'వర్ణమును తెనుఁగుననే వినుచున్నాము. అగ్లై పెద్ధ, నలభై మొదలగు శబ్దములలోను, ధగధగ మొదలగు ధ్వన్యనుకరణశబ్దములలోను దమంత దాము గలుగుచునే యున్నవి. ఇట్టివి కొన్ని యును, అన్యదేశ్యములు కొన్నియును కోశకారులచేత గ్రహింపఁబడినవి. శబ్ద రత్నాకరములో సుమారు ఇర్వదియైదుశబ్దములు మహాప్రాణములు గలవి యుదాహరింపఁబడినవి. కన్నడమునను గొన్ని శబ్దములలో నియ్యవి కనుపట్టు చున్నవి. ఇర్భాసిరమ్, వఖాణం, ఫెళి, ఛట్టు, ఖంగారం మొదలగునవి. తెనుఁగున ఠీవి, ఠవర, జరభి, అవఘళించు మొదలగునవి.[35] "ఒప్పయిన కన్నడభాషయందు స్వభావముచేతనే కొన్ని మహాప్రాణములు గలవు."

ఇట్లేర్పడిన మహాప్రాణములుగాక యనేకములు సంస్కృతభాషవలనఁ బ్రవేశించి యిందు స్థిరపడినవి.

## 8. హకారము

ఇది అరవమున ప్రాచీనభాషలో లేదు. నేఁటిభాషలో నుచ్చారణమున వినఁబడును. క, గ, హ లకు నొక్కటే వర్ణము అరవమున వ్రాయఁబడుచుండును. ఈ హకారము తెనుఁగు మొదలయిన యితర ద్రావిడభాషలయం దంగీకరింపఁబడి నది. 'పెసరపప్పు' అనుటకు 'పెహరపప్పు', 'పొడుముపిసరు' అనుటకు 'పొడుపిహరు' అనియు నుచ్చరించుట నేఁడు వినుచునేయున్నాము. ఏ యక్షరము నుచ్చరించుట కయినను బ్రయత్నించి నడుమ జిహ్వాదికముతోఁ జేయవలసిన ప్రయత్నమును మాని కేవల మూపిరిని గొంతుకలోనుండి విడిచినచో హకారము కలుగును. హళగన్నడమున పకారాదిగా నుండిన పదములు చాలవఱకు హొసగన్నడమున హకారాదికము లయ్యెను. [పాలు = హాలు, పావు = హావు, పులి = హులి, పుళి = హుళి మొదలయినవి. ఇదియును ద్రావిడభాషలయందు క్రొత్తగా కలిగి నదే యనక తప్పదు.] తొల్‌కాప్పియనారు (అరవమున) 'ఆయ్‌దమ్' అనుపేర వ్యవహరింపఁబడుచు 'ஃ' రూపమున వ్రాయఁబడిన యక్కర మొక్కటి గలదని యుదాహరించెను. అది సంస్కృతమునందలి విసర్గముయొక్క వైరూప్యముననే గలిగినదని యూహింపఁబడినది.[36]

---

[35] వీనినే కేశిరాజు అంగీకరించియున్నాఁడు. ఒళవు మహాప్రాణంగళ్ । విళసత్కర్ణాట భాషెయొళ్ కెలవు నిజోజ్జ్వళమాగి. శబ్దమణిదర్పణము. పుట. 28.

[36] "Pandit M. Raghava Iyengar writes in his article on 'Tolkappia-rum pulli eluttum' in page 153, Vol. XXV of *Centamil* published by the Tamil Sangam at Madura that in ancient times 'aytam' was represented by visarga. Hence it seems to me that the 'visarga' which is used before a guttural and a labial as a jihvamuliya and upadhmaniya was borrowed from Sanskrit and extended in its use before all the voiceless consonants in tamil though Dr. Caldwell says that it is a peculiar tamil letter. P.S.S. 69.

అరవమున అన్నగరము అను పేరున (ண) ఒక నకారము కలదు. అది శకటరేఫను సంబంధించినది. దానికి తక్కిన ద్రావిడభాషలలోఁ బ్రవేశము లేదు. దాని చరిత్రము తెలియదు. తొల్కాప్పియనారు పాదమాత్రాకమయిన హ్రస్వమకార మొకదానిని పదాంతమున నంగీకరించెను. నేఁటి వాడుక తెనుఁగున మువర్ణమునకు బదులుగా నట్టిది వినఁబడుచుండును. లాక్షణికులు దానిని గుర్తింపలేదు.

పయివిచారము నంతటినిబట్టి యేర్పడిన సిద్ధాంతములు :

క చ ట త ప, ఙ ఞ ణ న మ, య ర ల వ, ళ ఱ ఴ అనునవి ప్రాచీన ద్రావిడభాష నుండినవి. మొదటి పదునాలుగు వర్ణములును సంస్కృతవర్ణములతోడి సమానమైన యుచ్చారణ గలవే. ఙ ఞ ఴ వర్ణములు నేఁటి తెనుఁగున భ్రష్టమయినవి. ట, ణ, ళ అనువాని యుచ్చారణము కాలక్రమమున మాఱి సంస్కృతవర్ణములతో సమానమయినది.

చ ౙ స హ వర్ణములు కాలక్రమమున తెనుఁగున స్వతంత్రము గాఁగలిగినవి. కొన్ని మహాప్రాణములు స్వతంత్రముగా తెనుఁగున గలిగినవిగాని చాలవఱకు సంస్కృతమునుండియే వచ్చినవి.

పయిరీతిని అత్యల్పమయి స్వతంత్రమయిన యక్షరప్రణాళిక గలిగిన ప్రాచీన ద్రావిడభాషనుగాని, తజ్జాతములయి మాండలికములయిన తెనుఁగు మొదలగు వానినిగాని సంస్కృత ప్రాకృత జన్యము లనఁదగదు.

అక్షర ప్రకరణమున సంస్కృతవ్యాకరణ సంజ్ఞలకు బదులు తొల్కాప్పియ నారు వాడిన కొన్ని తమిళపు (ద్రావిడ) పదములు.

| | తెనుఁగు | అరవము |
|---|---|---|
| 1. | సరళము | మెల్లినమ్ |
| 2. | పరుషము | వల్లినమ్ |
| 3. | అంతస్థము | ఇడై యినమ్ |
| 4. | ప్రయత్నము | ముయర్చి |
| 5. | జిహ్వా | నా |
| 6. | అగ్రము | నుని |
| 7. | మూలము | ముదల్ |
| 8. | మధ్య | ఇడై |
| | తాలువు | అణ్ణమ్ |

# అర్ధానుస్వారము

## 1. తెనుఁగునందలి యనుస్వారము

అర్ధానుస్వారము ద్రావిడభాషలలో నెల్ల నాంధ్రభాషయందుమాత్రమే ప్రసిద్ధమైయున్నది. అరవ, కన్నడ, మలయాళభాషలలో నీ యర్ధానుస్వారము లేదు. అరవమునఁ బూర్ణానుస్వారముకూడ లేదు. కాఁబట్టి పూర్ణార్ధానుస్వారములు రెండు నున్నది తెనుఁగుభాష యొక్కటియే. ఈ యర్ధానుస్వారమును గూర్చియుఁ, బూర్ణానుస్వారమునుగూర్చియుఁ జింతామణిలోఁ గొంత విచారణ గలదు.[1] అనఁగాఁ జింతామణినాఁటికిఁ బూర్ణార్ధానుస్వారములు రెండును దెనుఁగున గలవని యంగీకరింపవలసినది. "అనుస్వారౌ" అనఁగా పూర్ణార్ధానుస్వారములని భావము. తరువాతిదైన యథర్వణుని గ్రంథమందును[2] ఖండబిందువు ప్రశంస గలదు. కేతన వ్రాసిన యాంధ్రభాషాభూషణమునను (1250 క్రీ. వె.) అర్ధబిందువును గూర్చిన విచారము విశేషముగా గలదు.[3] ఆ తరువాతి లాక్షణికు లెల్లరును బూర్ణార్ధబిందు విచారణము పూర్తిగఁ జేయుచునేయుండిరి. ఇట్లు చింతామణి నుండియు నాంధ్రమున (బూర్ణార్ధబిందువిచారణము) నర్ధానుస్వారము అవిచ్ఛిన్న సంప్రదాయముగాఁ బండిత విచారణమున నుండినట్లు నిర్వివాదము. కాని ఏలకో యీ యర్ధానుస్వారముమాత్రము ప్రాతవ్రాతలయందుఁ గనుపట్టదు.

మనకు లభించిన తాటాకుపుస్తకములే ప్రాచీనములయిన వ్రాతలు. వాని కంటె ముందటివి శిలా తామ్ర శాసనములు. శిలా తామ్ర శాసనములయం దెచ్చటను బయి యర్ధానుస్వారము లేనేలేదు. తాటాకుప్రతులు సుమారు మూఁడునందల యేండ్లకు ముందటివి లభింపవు. వానియందును జాలవఱకుఁ బూర్ణానుస్వారమేగాని యర్ధానుస్వారము గనుపట్టదు.

[1] ఆ. చి. 6-7 వక్రతమావనుస్వారౌ. సిద్ధస్సాధ్యశ్చానుస్వారః పూర్ణార్ధభేదతో ద్వివిధః. హ్రస్వాత్పూర్ణోపిభవేత్. దీర్ఘాచ్చేత్ ఖండఏవ సజ్ఞేయః. బిందురనుస్వారః. 22-27. । నన్నయ లిపి వర్ణన శ్లోకపాఠముల నుదాహరించుచు నద్దానికి నథర్వణుఁడు చేసిన నవరణలలో "పూర్ణేందు సదృశః పూర్ణ స్త్వర్ధ స్త్వర్ధేందు సన్నిభః" అని చూపింపఁబడినది, సీ. పం. పుట. 261.

[2] నఖండః ప్రథమార్ధస్స్వా న్నస్య లోపశ్చ నేష్యతే. అ. 9 సంజ్ఞ. శ్లేషే నఖండ నిర్బింద్వో శ్మేలనం కుత్రచి న్మతమ్. అ. కా.

[3] నిడుపులమీఁది బిందు (లర) బిందులగున్. 56 ప. కుఱుచలపై యరబిందులు నెఱయఁగ నూదినను జెల్లు. 57 ప.

ప్రాచీన శాసనములయందు నేటి యనుస్వారములు గల శబ్దము లెట్లు వ్రాయఁబడుచుండెడివి యను విషయమును విమర్శించుటవలనం దెలియనగు విశేషములు :

(1) నన్నయకంటె ప్రాచీనములయిన శాసనములలో బిందువుగాని, వర్గ పంచమాక్షరముగాని వాడుకలో నుండినవి. ఒక్క శాసనముననే యీ రెణ్డు పద్ధతులును గూడఁ గనుపట్టుచుండును.

ఉ. 641 క్రీ. వె. జయసింహవల్లభుని శాసనము. మ. సో. శర్మగారు చదివినది. సింఘవల్లభ, సంవత్సరంబుల్, నాణ్టి, అరహా_త్తభటార, రక్షిమ్బను.

641 క్రీ. వె. జయసింహవల్లభుని శాసనము S-1-1 వాల్యూం VI, పుట 208 ఎణుంబొాది ; నాణ్డుం ; నా కుబణి, గాణంబు.

739 క్రీ. వె. S-1 1 వాల్యూం VI, నెం. 250. యేణ్డాది కొాణ్డయ పసుందల కొామ్మిరడ్డి.

850 క్రీ. వె. విజయాదిత్యుని ధర్మవరపు శాసనము - గుణగణాభరనుణ్డు ; పణ్డరంగులు ; ఆత్మాన్మతంబునం బన్చిన.

900 క్రీ. వె. పండరంగని అద్దంకి శాసనము - భూపాలకుణ్డు; పట్టంబు గట్టిఞ్చి, పణ్డరంగుంబఞ్చి

900 క్రీ. వె. బెజవాడ యుద్ధమల్లుని శాసనము-వల్లభుణ్డు పరగగ; వెలయంగ; యన్దు ; విడిసినబ్రోల ; చేబ్రోలు.

(2) నన్నయ తరువాతి శాసనములలో బిందువు వాడుక యధికమై వర్గ పంచమాక్షరముల యొక్క వాడుక తగ్గినది.

ఉ. క్రీ.వె. 1065 ద.హి.శా. వాల్యూం IV, నెం. 1007 కూంతుసరియపోల్వంగాంతలెందు

1066 , ,, నెం. 1008 మానెణ్డు, బోయణ్టు, ఆ చంద్రాక్కఁణముంబో

1068 , ,, నెం. 1012 ఆ చంద్రకక్కఁణముంనెయి సరియింప్పంగ్గలవారు

1087 ,, నెం. 1016 దినికింజతుస్సీమములునుం; తోణ్ట

1080 , ,, నెం. 1006 దేవరకుంబెట్టిన, సరింపంగలవారు, బోయంగ్గల వణ్డు

(3) అర్వాచీన శాసనములలో పూర్ణబిందువు ప్రక్కను ద్విత్వాక్షరము వ్రాయు నాచారము బయలుదేరి కాలక్రమమున నది ప్రబలమయ్యెను. నేటి యర్ధానుస్వారము ఉండవలసిన చోట్లను, తేల్చిపల్కవలసిన చోట్లను పూర్ణానుస్వారము

మాత్రమే యుండి ప్రక్కయక్షరమునకు ద్విత్వము లేకుండుట గలదు. ఇది సాధారణము గాని సార్వత్రికము గాదు.

ఉ. దీనికి నుదాహరణములు కొన్ని పయివానిలోను గనుపట్టును.

క్రీ. వె. 1097. S-1-1 వా. నెం. V, నెం. 68, సన్ధి విగ్రహి దణ్డనాయక
రెణ్డు ; రెంటికి ; పోయంగ్గల వాండు

క్రీ. వె. 1187. S-1-1 వా. నెం. V, నెం. 1046=అనంతవమ్మర ; సంక్రాం త్తియు ;
తమ్ముండు ; మండ్డలికుణ్డు ; అఖండ్డవ త్తిర ; క్రిన్దను ; గుంట్టల : నడ
పంగ్గలారు ; వసుంద్ధరా.

,, ,, 1215. వా. V, నెం. 23. గంగగొండ్డ చోడవలనాంటి ;
మంగ్గలమున ; అఖండవ త్తిర.

క్రీ. వె. 1243. వా. V, నెం. 218. నేంట్టి ; సంక్రాం త్తి ; నాండు ; పంద్రెండూ.

క్రీ. వె. 1230. S-1-1. వా. V, నెం. 1290. పూంటకు ; బోం త్తలకోటి ;

క్రీ. వె. 1416. నెం. 113. కలింగ్గమణ్డల.
పుణ్యకాలమంద్దు ; చింత్తామణి ; పంట్టకుల మండపం ;
గంగ్గా ; తాండవదేవర ; ముందటను.

(4) నేటి యర్ధానుస్వార మెక్కడను ప్రాతవ్రాతలో గనుపట్టదు.

(5) ద్రుతప్రకృతికములకుఁ బ్రక్కను బూర్ణానుస్వారముగాని, యది లేకుండుట గాని కలదు.

ఉ. క్రీ. వె. 1938. S-1-1. వా. V, నెం. 1014. వసమున పెట్టిన ; నెం. 1011. కాలము 1073. దేవరకు బెట్టిన. నాకుబణి - జయసింహవల్లభుని శాసనము. విడిసిన బ్రోల, పరగగ.

క్రీ. వె. 700. కార్తికేయుణ్డుబోలె-840. నెం. 1922-సం. ఎపి. డిపా.

క్రీ. వె. 1054. రాజరాజు నందమపూండి శాసనము. ఎ. ఇ. వా. IV, పుట 301

ఇయ్యారియు బిల్లెమ పెద్దపూణ్డి ( కాని చాలచోట్ల నిట్టియెడ నందు బిందువు కలదు. )

ఈ క్రింది పద్యమును చూచినచో నప్పటి వ్రాతయుఁ, బయిపద్ధతులును దెలియగలవు.

S-1-1. వా. IV, నెం. 672. నాదెండ్ల. గుంటూరు జిల్లా. 1139. క్రీ. వె.

ఉ. హారతుషారశంఖ విమలాభ్ర మహోజ్వల కీర్త్తిరం జాలం బొ
లార్పిన బుద్ధమండలికు నగ్రసుతుండగు మన్మమండండా
చారపరుండు నాదెండ్లం జారుతరంబగు వెండికొండనా
గౌరిశశాంక్క మౌళికి విగుర్వ్వరసతో గుడి నిల్పె భక్తునను.

కీర్తి, జాల, అను పదముల తరువాత నేఁడు అరసున్నలు వ్రాయఁబడును. మండందు, ఇక్కడ నరసున్న.

పయిని నిరూపించినవి సామాన్యములయిన లక్షణములు. ఇవి కొంచెమించు మించుగా నాంధ్రదేశమందలి యెల్లభాగములను నొక్కరీతి నియమశూన్యముగానే యున్నవి. నియమశూన్య మనునంతటిమాత్రమున వానిలోఁ గ్రమపరిణామము లేకపోలేదు. ఆ క్రమపరిణామము సామాన్యముగాఁ బయి నిరూపించిన లక్షణముల నుండియే గ్రహింపనగును.

కర్ణాటకభాషయందు (1250) లాక్షణికుండైన కేశిరాజు కొన్నిశబ్దములు నిత్యబిందువు లనియు, కొన్ని వికల్పబిందువు లనియుఁ జెప్పెను. అనఁగా నిత్యబిందువు లయిన శబ్దములు నిత్యబిందువులుగానే వాడంబడుచుండును. కుసుంబె; తోంటం; బేంటె మొదలయినవి. వికల్పబిందువు లయినవి కదంపు, కదపు; జినుంగు, జినుగు; అనురీతిని రెండురూపంబులతోడను నుండును.[4] ఇంతియేగాని యరసున్న యొక్క ప్రయోగమేలేదు. ప్రాచీన కర్ణాటశాసనములను బరీక్షించినచో వర్గ పంచమాక్షరములుచేర్చి వ్రాయుట గలదు. పూర్ణానుస్వారము వాడుటయు గలదు.

అరవభాషలో అనుస్వారమే లేదు. ఎల్లెడలను వర్గ పంచమాక్షరములే వ్రాయుట గలదు. అదియే వైయాకరణ సమ్మతము.

## 2. అనుస్వారము స్వభావము

పయిని నిరూపించినదంతయును ద్రావిడభాషలలోని యభ్యాసముయొక్క యథాస్థితమైన వర్ణన. ఈరీతిని భిన్నమయినవ్రాత లేల వచ్చినవి? ఏవ్రాత కేయర్థము అను విషయమును విమర్శింపవలసియున్నది. అట్లు విచారించుటకుముందు అనుస్వార మన నేమి? దాని స్వభావ మేమి? యను విషయమును బాగుగాఁ దెలిసి

---

[4]కర్ణాటక భాషాభూషణము, పు. 6, సూ. 14 "నిస్తుళోదాత్తముక్తా ఫలానుకారీ బిందుః అనుస్వారసంజ్ఞో భవతి. కేవలస్య అస్య బిందోః ప్రయోగాభావాత్ అకారః సన్నిధీయతే. అం ఇతి. ఇదాదమేలె-అర్ధచంద్రోపమో బిందుచ్ఛేదోఽనుస్వార ఇష్యతే" ఎందు, ఒందు ప్రతియల్లి మాత్ర ఇదె. పయిరీతిని పాఠాంతరముగా నున్నదానిని కర్ణాట వైయాకరణు లెవ్వరును గణింప లేదు. ఈ నాగవర్మ 11-వ శతాబ్దమున నుండెడివాఁడు. ప్రాయశః నన్నయతో సమకాలికుఁడు. ఇంతియగాక 13-వ శతాబ్దినుండిన కేశిరాజు తన శబ్దమణిదర్పణమున "కెలవు నిజబిందుగళ్ కెలవు వికల్పార్ధబిందుగళ్" అని సంజ్ఞాప్రకరణమున 26 వ సూత్రమున వ్రాసెను. టీకయందు బయిపదమునకు "వికల్పదిం సబిందుక మబిందుక మాగిర్పవు" అని యర్థము వ్రాయఁబడినది. ఉదాహరణములు నల్లే యీయంబడినవి. "వికల్పార్ధబిందుగళ్" అనగా వికల్పమయిన యర్ధబిందువుగలవి యని యర్థము చెప్పుట పయి యర్థము చెప్పుటకంటె సులభము. అర్ధబిందువు కన్నడమున వాడుకలో నున్నట్లు ఎవ్వరును నంగీకరింపలేదు. కన్నడమునఁ బ్రాచీనకాలమున నొకప్పుడు అర్ధబిందు వుండి జారిపోయెనో యనుట చింత్యము.

కొనినంగాని పై వ్రాతల యర్థము చక్కఁగా స్ఫురింపదు. కావున అనుస్వారము స్వభావమును, దాని యుచ్చారణమును గ్రింద వివరింపఁబడును.

అనుస్వార మనునది యొక యుచ్చారణవిశేషమునకు (ధ్వనికి) గుర్తు అని మన మంగీకరింపవలయునుగదా! అనఁగా నది స్వరమా, వ్యంజనమా యను ప్రశ్న బయలుదేరుచున్నది. ఇది యుచ్చారణమునుబట్టి నిర్ణయింపఁదగును. ఈ విచారణము ప్రాతిశాఖ్యలలోను, శిక్షలలోను విపులముగాఁ జేయఁబడినది. స్వరవ్యంజనముల యొక్క భేదము ధ్వనులనుగూర్చి వ్రాయఁబడిన ప్రకరణమున వివరింపఁబడినది.

"అనుస్వారము వ్యంజనమా? స్వరమా?" అది కొన్ని స్వరధర్మములను, గొన్ని వ్యంజనధర్మములను గలిగెయున్నది. కాఁబట్టి దానిని స్వరవ్యంజనముల కంటె నితరమయిన దానినిగా గ్రహించుటయే యుక్తము.[5] పాణినిమతము ననుసరించి మవర్ణము వ్యంజనమునకు ముందు అనుస్వార మగును.[6] ఈ యనుస్వారము ఇతరవర్ణము నాశ్రయించియే నిజస్వరూపమును నిరూపించునని చారాయణీయ శిక్షయందుఁ జెప్పఁబడినది.[7] అథర్వవేద ప్రాతిశాఖ్యమున అనుస్వారమును, అనునాసిక వర్ణములగు వర్గపంచమములును, నాసిక్యములనియే పేర్కొనఁబడినవి. సిద్ధాంతకౌముదియందు అనుస్వారోచ్చారణస్థానము నాసిక యనియే చెప్పఁబడినది.[8] పయి యభిప్రాయమునుబట్టి కేవలానునాసిక్యమాత్రమే యనుస్వార మనుట. వర్గాక్షరముల నుచ్చరించునపుడు ముక్కులోనుండిగూడ గాలి వెళ్లునట్లు ఊపిరిని విడుచుటవలన వర్గానునాసికములు గలుగుచున్నవి. కాఁబట్టి వానికి తాల్వాద్యవయవములును, నాసికయును స్థానములు. ఈ యానునాసిక్యము హల్లు పయినిగాని, య ర ల వ హ ళ పయినిగాని ప్రసరించుటవలన నివియు ననునాసికము లగును. ఈ యనుస్వారమునకు రంగము అను పేరుగూడ వాడఁబడినది.[9] రంజ ధాతువునకు రంగువేయుట యని యర్థము. నాసికతోఁ బలుకుట యను రాగము కలుగుటచే అనుస్వారమునకు రంగమనియు, అనునాసికవర్ణమునకు రక్తమనియుఁ బేళ్లు. ఒక హల్లునుగాని యచ్చునుగాని యుచ్చరించునపుడు ఈ రంగ మద్దానికిఁ గలిగి యది రక్తమగుచున్నది.

[5] అనుస్వారో వ్యంజనం వా స్వరోవా. (ఋగ్వే. ప్రా. I. ౨౨ పుట.) స కాంశ్చిత్ స్వరధర్మాన్ గృహ్ణాతి. కాంశ్చిత్ వ్యంజనధర్మాన్. తద్యథా: హ్రస్వత్వం, దీర్ఘత్వం, ప్లుతత్వమ్, ఉదాత్తత్వ మనుదాత్తత్వమ్, స్వరితత్వ మితి. తథార్ధమాత్ర కాలతా స్వరవశేన ఉదాత్తానుదాత్త స్వరితత్వం, సంయోగశ్చేతి వ్యంజన ధర్మాః. తత్ర ఉభయధర్మయోగా దుభయస్వభావం. స్వరవ్యంజనయో రన్యద్వర్ణాంతరం ప్రకాశయతి. స్వరవ్యంజనాతిరిక్త మన్యద్వర్ణాంతర మేతదితి. వ్యాఖ్యా. సీ. పం. పు. 1౬౪. [6] మోనుస్వారః VIII ౩-2-3-పాణిని. [7] అనుస్వారో విసర్గశ్చ అన్యమ్ వర్ణం సమాశ్రిత్య దర్శయంతి నిజం వపుః.

[8] నాసికానుస్వారస్య- సి. కౌముది. అనుస్వార యమానాం చ నాసికా స్థాన ముచ్యతే. -శిక్షా

[9] రక్తసంజ్ఞోనునాసికః.

పయి విచారణమునుబట్టి యనుస్వారధర్మములు మూఁడు. (1) పరాశ్రయత్వము (2) వ్యంజనస్వభావము (అనఁగా ఊపిరిని విడుచునప్పుడు ఒఱపిడి జరుగునట్లుండుట.) (3) స్వరస్వభావము (అడ్డులేకుండుట, వాయువు నాదాత్మకమయి వెడలుట.)

పయిస్వభావములలోఁ గొన్ని భాషలలో నొక స్వభావమును, మఱికొన్నిటిలో నితర స్వభావమును నెలకొనినవి. వేదకాలమునందలి జనుల యుచ్చారణమునుఁ గనిపెట్టి ప్రాతిశాఖ్యములలోను, శిక్షలలోను అనుస్వారస్వభావము చక్కగా వివరింపఁబడినది.[10] ఇట్లు అనుస్వారమునకు స్వరభావప్రాధాన్యము గల మాండలికము నుండి గల్గిన నేఁటిభాషలలో నొక రూపమును, వ్యంజనరూపప్రాధాన్యము గల్గిన మాండలికభాషవలనఁ బుట్టిన భాషలో నొక రూపమును పదములు పొందినట్లు స్పష్టమగుచున్నది. దంత శబ్దము హిందీలో దాఁత్ అను రూపమును, పంజాబీయందు దన్ద్ అనురూపమును బొందినది. అట్లే హంస శబ్దము హిందీలో హఁస్ అనియు, పంజాబీలో హన్స్ అనియు మాఱినది. భంగ శబ్దము భాఁగ్ హిందీ, భఙ్గ్ పంజాబీ.[11] హిందీకిఁ బూర్వమయిన యార్య మాండలికభాషలోఁ బ్రాచీనముగ ననుస్వారమునకు స్వరభావమును, పంజాబీభాషకుఁ బూర్వరూపమయినదాని యందు వ్యంజనరూపప్రాధాన్యమును నుండెనని దీనినిబట్టి తెలియనగును.

## 3. అర్ధానుస్వారము : ఉత్పత్తి స్వభావములు

పయి విచారణమునుబట్టి యనుస్వార స్వభావమును, దాని పరిణామమును స్పష్టము. వైయాకరణులు తమకాలమునందలి మాండలికభేదమునుబట్టి యుచ్చారణమునకును, వ్రాతకును సరియయిన సంబంధము నిరూపించుచుందురని మనము ఊహించుట లెస్స. వారు భ్రాంతిపడుటయుఁ గలుగవచ్చును.

అరవవైయాకరణుల మతమున అనుస్వారధ్వనికి స్వతంత్రస్థితి లేదు. అనఁగా ననునాసిక వర్ణములగు వర్గపంచమములలోనే యియ్యది యిమిడి యుండును.

[10] రంగే ముఖే వ్యాఘ్రగురుతోపమం స్యాత్ మాత్రాద్వయం హ్రుజ్జనితం త్వనాస్యమ్. నాసిక్య రంధ్రద్వయనిసృతోఽంత్యే స్యాదేకమాత్రః స తు ఘంకలీ స్యాత్. సౌరాష్ట్రిక గోవధూః సుకంఠస్వరేణ తక్రాఁ ఇతి భాషతే యథా తథా నముచార్యవదేత్ స్వకాలాద్రంగశ్చ కంపః ఖలు వర్ధతే సః. పా. శి. టీకా. యథేంద్రనీలప్రభయాభిభూతః ముక్తామణి ర్యాతి హి నీలభావమ్ తథైవ నాసిక్యగుణేన యుక్తః స్వరోపి రంగత్వ ముపైతి కృత్స్నః. అనుస్వారో ప్యుత్తమవత్ వ్యంజనమేవాస్మచ్ఛాఖాయామ్. అర్ధగకారరూపత్వాత్. తై. ప్రా. II. 39. అనుస్వర్యతే పశ్చార్ధే స్వరవ దుచ్చార్యత ఇ త్యనుస్వారః. యజుభూషణమ్.

[11] P. O. I. G.—153.

ఆ మతమున నిది హల్లే యనక తప్పదు. వారు సంస్కృత విచారమునందలి యేకదేశమాత్రమును గ్రహించి రనవచ్చును. లేదా ప్రాచీన ద్రావిడభాషలో నట్టి యుచ్చారణమే యుండుటంబట్టి స్వతంత్రముగాఁ దమపద్ధతినే తాము కనిపెట్టి సూత్రించి రనుటయు యుక్తమే.

ఆంధ్ర కర్ణాటులు సంస్కృతపద్ధతిని గ్రహించిరి. కర్ణాటుల మతమున అనుస్వారము (రంగము) పరాశ్రయమనుట స్పష్టము. ఈ యనుస్వారము సర్వవర్గాక్షర సంయుక్తమయి యా యక్షరములముం దట్లు విననగును. పదాంతమందు వీరి మతమున అనుస్వారము నిల్చును. ఈ సందర్భమునను నిది 'మ్, న్' ల వికారమయి హల్మాత్రముగా పూర్వాచ్చున కంటియుండును. 'అం=నాన్' ( తెనుఁగు-నేను ).

తెనుఁగునఁ బయి యరవసంప్రదాయము మాత్రమేగాక సంస్కృతసంప్రదాయముకూడ గ్రహింపఁబడినది. కావుననే మొట్టమొదట అరవమువలెనే బహుళముగా వర్గపంచమాక్షరములే వ్రాయఁబడుచుండెడివి. ఆ తరువాత వాని స్థానమున అనుస్వారము వ్రాయుటగూడ బయలుదేరెను. ఈ యనుస్వార మనఁగా రంగము, ఏకస్థానికము గాదనియుఁ, గాలక్రమమున మాఱుచుండుననియును ముందే తెల్పితిని. ఇది పూర్వాచ్చుపయి ప్రసరించి దాని కానునాసిక్యమును గల్గించి 'కోఁతి' యనుదానివంటి రూపమునుగూడఁ బొందినదన్నమాట. ఈ రీతి యుచ్చారణ ప్రబలముగా వినఁబడియుండుటచేతఁ దెనుఁగు వైయాకరణులు దానిని నిరూపించుటకు అర్ధానుస్వారమును వాడిరని యూహింపవచ్చును. పూర్ణబిందువు సంస్కృతమున నక్షరము తలపయిని వ్రాయఁబడుచుండెడిది. అది కాలక్రమమున దిగి తెలుఁగున నక్కరము ప్రక్కను వ్రాయఁబడుచువచ్చెను. ప్రాచీనలిపిలో తెనుఁగునను అక్షరముల తలపయినే యయ్యది యుండెడిది. సంస్కృతమున నచ్చుయొక్క యానునాసిక్యమును జూపుటకు నెత్తిపయి నర్ధానుస్వారచిహ్నము ఁ వ్రాయఁబడుచుండెడిది.

అదియును బూర్ణబిందువువలెనే ప్రక్కను వ్రాయఁబడుట యుక్తమని వైయాకరణుల యభిప్రాయమైయుండుటవలన దానిని అవిచ్ఛిన్నసంప్రదాయముగఁ దెనుఁగువైయాకరణు లెల్లరును బేర్కొనసాగిరి. కాని వాడుకలో దానికి ప్రచారము లేకపోయెను.[12] ఇదియే యర్ధానుస్వారముయొక్క యుత్పత్తికి మార్గము. ఇట్లు అర్ధానుస్వారము ఉచ్చరితమయిన ధ్వనివిశేషము నిరూపించుటకుఁగాక కేవలము నష్టమయిన యనునాసికవర్ణమునుమాత్రము నిరూపించుటకు స్మారక చిహ్నముగా నుండినదనియుఁ జెప్పవచ్చును. నేఁడుమాత్రము దీనిస్థితి యిట్టిదే. తెనుఁగునఁ గల యర్ధానుస్వారమునకు నేఁడు ఉచ్చారణము లేదు. ఇట్లే యెల్ల కాలము నుండెనని యూహించుట యుక్తముకాదు. ప్రాచీనావస్థయందైన దానికి సరియైన ధ్వని యొకటి యుండెననుటయే యుక్తము. పైని చెప్పఁబడిన యనుస్వార

12 సీ. వం. పుట. 248.

స్వభావము ఈ విషయమును రూఢిపఱచుచున్నది. ఇంతియకాక కొన్ని ప్రదేశము లలో నేఁటికిని బూర్ణాచ్చున కానునాసిక్యము వినఁబడుచున్నది.

ఇంకఁ బూర్ణానుస్వారమును దానిప్రక్క నొక హల్లును వ్రాయుట చాలక మఱల నేల ద్విత్వము ప్రక్క యక్షరమునకు వ్రాయవలసివచ్చెను? అను ప్రశ్నము నడుగక తప్పదు. వర్గాక్షరమును నాసిక్యమునుగూడి వర్గపంచమాక్షరమునకు సమానము లనవచ్చునుగదా. అనఁగా 'వజ్క' అను పదములో 'జ' అను ధ్వనికి కకారతుల్యతయేగాక నాసికప్రయత్నముకూడ కలదు. నాసికప్రయత్నమే రంగము లేక అనుస్వారము. కాఁబట్టి యనుస్వారము పోగా మిగిలిన హల్లు ద్విర్భావము నందుచున్నదని చెప్పనగును. పయిరీతిని హల్ద్విత్వముతోఁ గూడిన వ్రాత యభి ప్రాయ మియ్యదియే యయి యుండవచ్చును. ఈరీతిని బయలుదేరిన యనుస్వార పూర్వకత్వ లేఖనపద్ధతిలోని యుపపత్తిని సూక్ష్మముగ గ్రహింపఁజాలక శాసన లేఖకులు ఒకచోట నింకొకటి వ్రాయుచుండిరి. ముం దుదాహరించిన శాసన పద్యములలో 'గండడు' అని లఘువుగా ఉండవలసినచోట పూర్ణానుస్వారమును వ్రాసెను. 'నాదెడులఁ' అని యుండవలసినచోట 'నాదెండ్లం' అని వ్రాసెను. మఱికొన్ని స్థలములలోఁ బూర్ణానుస్వారమును వ్రాసినను ఉచ్చరింపవలసిన యావ శ్యకములేదు. అదియే నేఁటి యర్ధానుస్వార ముండిన చోటు. పయిరీతిని వ్రాయస గాండ్రు సరిగాఁ దెలిసికొనలేక శాసనములయందు తబ్బిబ్బుగా వ్రాయుట సంభ వించుచుండినది.

తలపయి వ్రాయఁబడుచుండిన యీ పూర్ణబిందువు అక్షరము ప్రక్కకు దిగుట నన్నయకాలముననే యారంభింపఁబడినది. రాజనరేంద్రుని కోరుమిల్లి శాసనములో (క్రీ. వె. 1022) పంకరుహ యనుపదమున బిందువు కకారమునకు ముందుగనే వ్రాయఁబడినది. రెండవ కులోత్తుంగచోటదేవుని పాందువగ్రామ శాసనమున బిందువు (క్రీ. వె. 1134) అక్షరమునకుఁ బ్రక్కనే వ్రాయఁబడినది.[18] ఇట్లే క్రమక్రమమున నీవ్రాత పదుమూఁడవశతాబ్దమునకు చాల ప్రచారములోనికి వచ్చినది.

## 4. ఖండాఖండప్రాసము గలుగుటకు హేతువులు

ప్రాచీనశాసనములలోఁ గొన్నిటియందు నేఁటి యర్ధానుస్వార ముండవలసిన చోట్ల ననుస్వారచిహ్నము లేకయే వ్రాయఁబడుచుండినట్లు ఉదాహరించితిని. కర్ణాట లేఖనసంప్రదాయమును నిట్టిదియే యని ముందు స్పష్టపఱచితిని. నిండు సున్నకు వెనుక ద్విత్వము వ్రాయుటయు నన్నయభట్టుకాలమునకు ముందు లేదనుటనుగూడ సూచించితిని.

[18] సీ. వం. పుట 254.

'ఖండాఖండప్రాసము' అను పదమును అప్పకవి వాడి దానికి లక్ష్యముల నొసంగెను. ఇచ్చట ఖండ మనఁగా సఖండమనియు, అఖండ మనఁగా ఖండబిందు హీన మనియు నభిప్రాయము. కొందఱు ఈ యభిప్రాయము నెఱుఁగక అఖండ మనఁగా పూర్ణ బిందువనియు, పూర్ణ బిందు యుక్తమయిన శబ్ద మభిప్రేతమనియు భ్రాంతి గొనిరి. అఖండ మనఁగ 'న ఖండమ్ యస్య' అను నఞ్ బహువ్రీహి. అప్పకవియొక్క పయి యభిప్రాయము లక్ష్యములనుబట్టి యెఱుఁగవచ్చును. అరసున్న గల పదమునకును, నిండుసున్న గల పదమునకును గల ప్రాసమును 'ఖండపూర్ణప్రాసము' అని వ్యవహరించితిని, పయి ఖండాఖండప్రాసమునుండి భిన్నమని స్పష్టపఱచుటకొఱకు.

అరసున్న గల శబ్దములను, లేనివానిని ప్రాసములలోఁ గలిపి కవులు ప్రయోగించుటచే లాక్షణికులు ఖండాఖండప్రాసమును అంగీకరించి నిరూపించిరి. నన్నయ తిక్కనాదు లెల్లరును బయిరీతిని ప్రయోగించిరనియే లాక్షణికుల మతము. కాని పయిప్రయోగములను బరిశీలించి నన్నయ యట్టి ఖండాఖండప్రాసమును బ్రయోగింపలేదని సీతారామపండితీయమున నిశ్చయింపఁబడినది.[14] నేఁడు దీర్ఘములమీది అరసున్నమాత్రము గల మూఁడు, పోఁడి అను శబ్దములను పూర్ణబిందుయుతము లయిన 'భాండము' మొదలయినవానితో ప్రాసమునఁ గలిపిన ప్రయోగములు గలవు. కాని యట్టి ఖండపూర్ణప్రాసమును లాక్షణికు లెవ్వరును నంగీకరింపలేదు. ఇట్లు ఖండాఖండప్రాసము గలుగుటకును, ఖండపూర్ణప్రాస ముండె ననుకొనుటకును హేతువులు ఈ క్రిందిరీతి నూహించుట సులభము.

(1) అరసున్న యుచ్చారణము (పూర్వాచ్చుపయి రంగము) నన్నయకాలముననే కొన్ని మండలములలో నశించియుండును. కొన్ని మండలములలో నెన్నఁడును లేకపోయి యుండవచ్చును. అనఁగా కన్నడములోవలె నిర్బిందుకశ్రవణమును, వ్రాతయుఁగూడ నేర్పడియుండవచ్చును. కాఁబట్టి యరసున్న యెచ్చట నున్నదో తెలిసికొనుట కొంత శ్రమకరమే.

(2) అరసున్న యుండవలసినచోటను బూర్ణానుస్వారమునే సామాన్యముగ వ్రాయుచు, నట్టివ్రాతకు నియతిలేక యొకచోటఁ బూర్ణానుస్వారముగా నుచ్చరించుచు, నింకొకచోటఁ ద్యజించుటవలన నీ తబ్బిబ్బు వచ్చుట కవకాశము గలిగినది.[15] కొందఱు కవులు తమ నాఁటఁ బూర్ణానుస్వారములుగా నుండిన "పోండి, మూండు" అను శబ్దములను బ్రాసములో వాడిరి. మఱికొన్నియెడల భిన్నదేశ

---

14 సీ. పం. పుట 305.

15 పోండిగనగజతపశ్శిఖి। మూండుజగమ్ములను తీవ్రముగఁ బర్విన। బ్రహ్మాండము కాఁచిన కాంచన। భాండముక్రియఁదాల్చెఁ దత్ప్రభాభాసితమై. వే. ప్ర. శా. బసవపురాణపీఠిక పుట 91. (నన్నెచోడుని కుమారసంభవము)

కాలములలో నీపదములే యర్ధానుస్వారసహితముగా వాడఁబడియుండుటంజేసి ఖండపూర్ణప్రాస ముండెననుట కవకాశము లభించెను.

(3) ప్రాసక్లేశముగూడఁ గొందఱిలో నీ యభ్యాసమును దృఢపఱచె ననుటలో సంశయము లేదు. మహాకవులలోఁ గాకున్నను సామాన్యులలోనైనను బయి నిర్బంధము క్లేశకారి యయ్యె ననుటలో విప్రతిపత్తి యుండుట కవకాశము లేదు. కాఁబట్టి యట్టివారలు పయి ఖండాఖండప్రాసమును విశేషముగా వాడుక లోనికిఁ దెచ్చియుండిరి.

## 5. సిద్ధసాధ్యములు

తెనుఁగున ననుస్వారమును సిద్ధము సాధ్యము నని రెండువిధముల వైయాకరణులు విభజించి రనుట ముందు తెలుపఁబడినది. ఇట్లు సాధ్యమైన యనుస్వారము వైయాకరణులచేఁ జెప్పఁబడిన నుమాగమాదులు పున్నలుగా మాఱినవగుట నేర్పడినది. సిద్ధము లట్టివిగాక శబ్దస్వరూపముననే యుండినవి. అట్టివి రెండువిధములు. దీర్ఘములపయి నున్నవి. ఒకేశబ్దమునకు దీర్ఘాక్షరముపయినున్న యనుస్వారమునకు పూర్ణార్ధరూపములు రెండును వికల్పముగా నుండవు. హ్రస్వముపయిని రెండురూపములును నొకశబ్దముననే యుండును.[16] ఇట్టి పరిస్థితి యేల యేర్పడినదని ప్రశ్నబైలుదేరక తప్పదు. కొంచె మించుమించుగా నీపద్ధతియే కన్నడమునఁగూడ నున్నదని చెప్పవచ్చును. శబ్దమణిదర్పణమున నీయంబడిన యుదాహరణము లన్నియును వికల్పార్ధబిందువులు హ్రస్వములపైనే యున్నవి. దీర్ఘముకంటె పరమైన యనుస్వారము హ్రస్వమనియు, హ్రస్వముకంటె పరమయిన యనుస్వారము దీర్ఘమనియు (అనఁగా ఉచ్చారణకాల మధికమనుట) శిక్షలోఁ జెప్పఁబడినది.[17] దీర్ఘమునకుఁ బరమయిన యనుస్వారము హ్రస్వమగుటను, పదాదివర్ణముపయినే యూనిక యుండి యది గురువగుటవలనను, ప్రక్కనున్న యనుస్వారముపయిని ఊనిక పూర్తిగా భ్రష్టమగుటను, దీర్ఘముపయినుండిన యనుస్వారము సార్వత్రికముగా భ్రష్టమయినది.

---

[16] బా. వ్యా. సంజ్ఞ 14-15 సూత్రములు. క్రిందివి దీర్ఘముమీది పూర్ణానుస్వారశబ్దములు తెనుఁగున నిలిచినవి.

పూంచు, కాంచు, వాంచు, వేంచేయు, వేంప్ర, తీంప్ర, తాంప్ర, ఈంప్ర, ఓంప్ర, దేంప్ర, జేంప్ర, జీంప్రు, జీంప్రుక, జీంప్రము, కాంప్రు, గాంప్రు, గీంప్రు, ఈంప్రించు, ఓంప్రించు, కాంప్రించు, గూంప్ర, గూంప్రించు, గోంప్రించు, మేంప్రించు, గాండ్ల, గాండ్లవాడు, బాండ్లి, కాంతాళము, కాంబోది, తాంబాళము, నాంచారు, సాంబ్రాణి, బాండువ (వై), మాందాళి, చాంగు, చింబోతు (చిఁబోతు), కాందారి, మాందారిప్రొద్దు (కాఁదారి మాఁదారిప్రొద్దు), చాందినీ (హిందీ), లాంతరు, టాంగనా.

[17] హ్రస్వాత్పూర్వో భవేత్-దీర్ఘోహంస ఇతి నిదర్శనమ్ దీర్ఘాత్ పరో భవేద్ధ్రస్వో మాంసేభ్య ఇతి దర్శనమ్ (లఘుమాంధ్యందినీ శిక్ష) P. O. I. G. 187.

అట్లు భ్రష్టమగుటకుఁ బూర్వము పూర్వమునందున్న దీర్ఘముపయిని నియతరంగము గలుగునట్లు ఉచ్చారణముగూడ వినఁబడుటవలన దీర్ఘములన్నియును సిద్ధార్ధానుస్వారము గలవియే యయినవి. హ్రస్వములపయి సున్నలు దీర్ఘములగుటచేతను చాల శబ్దములలో ఊనికతోనుండి వ్యంజనోచ్చారణమున నుండుటచే నా యుచ్చారణము నిలిచిపోయినది. కొన్నియెడల నొకపదములో ననుస్వారోచ్చారణము భ్రష్టమయినను పూర్ణానుస్వారరూప మా పదముననే మఱికొన్ని ప్రదేశములలో నుండుటవలన అంగీకరింపక తప్పకపోయెను. కాఁబట్టి వికల్పరూపములు సిద్ధించి హ్రస్వముమీది పూర్ణములు వికల్పముగా నర్ధానుస్వారము లయ్యెను.

వైయాకరణులు ఖండబిందువునకుఁ బూర్ణబిందువు వైకల్పికముగ నగును[18] అని సూత్రించుట చరిత్రమునకు సంబంధించినది కాదు. ఖండబిందువు మొదటి రూపము గాదనియు, పూర్ణబిందువే ప్రాచీనమనియు బయివిచారణమునుబట్టి స్పష్టము.

అఁట, ఇఁక, చుఁడు అను మూఁడుశబ్దములయందుదప్ప నితరములగు పదాది హ్రస్వములమీఁద ఖండబిందువు లేదు.[19] ఈ మూఁడుశబ్దములయందును మొదట నకార ముండి, యది పూర్ణబిందువయి కాలక్రమమున నశించినది. అనుట=అన్ట=అంట=అఁట. ఇనిక=ఇన్క=ఇంక=ఇఁక. చూన్డు=చూండు=చుండు=చుఁడు.

పయిరీతిని రూపములు కలిగియుండుననుట నూహింపవచ్చును. అనుట శబ్దము సుప్రసిద్ధము, ఇంక శబ్దమునకు మూలరూపము ఇని, ఇన్ను అను రూపములతో అరవ, కన్నడ, మలయాళములయందు వాడుకలో నున్నది. 'ఇన్నికి' అని అరవమునను, 'ఇనెగె' అని కన్నడమునను విభక్త్యంతరూపము లున్నవి. వానివలెనే ఇయ్యదియు 'ఇని' శబ్దమునుండి వచ్చినదనుట స్పష్టము. చూడుశబ్దమున 'చూ' యనునది మూలక్రియారూపము. దానికే చూవె, చూరె, చూము అను రూపము లేర్పడినవి. చూము మధ్యమపురుష ప్రార్థనార్థకైకవచనము. బహువచనము చూఁడు. చూండు దీనికి ప్రాచీనరూపము. చూము అనునది చుమ్మీ, చుమ, సుమీ, సుమా మొదలగు రూపములను బొందినది. అట్లే చూండునకు చుఁడు, సుండీ, సుఁడీ మొదలగు రూపములు గల్గినవి.

తెనుఁగుపదములు సాధారణముగా రెండక్షరముల రూపమున నున్నప్పుడు సంక్షిప్తరూపములను బొందవు. అందు మొదటియక్షరము దీర్ఘమయినచో నూనికయు, దీర్ఘతయు గూడ దానియం దుండుటవలన రెండవయక్షరమునకు ఊనిక తగ్గి అది భ్రష్టము గావచ్చును. అంతియేగాని ప్రథమాక్షరము హ్రస్వమయినప్పుడు రెండవయక్షరముపై నూనిక సాధారణముగా తగ్గదు. కాఁబట్టి హ్రస్వముపయి యనుస్వారము నశింపలేదు. మూఁడుమాత్రల పదములగు అంత, ఇంత మొద

[18] బా. వ్యా. సం. 14

[19] బా. వ్యా. సంధి 23 సూ. నఖండః ప్రథమాద్ధ్రస్వాఽన్నస్య లోపశ్చ నేష్యతే.

లయినవి యంతకంటె తగ్గుట స్వభావముగాదు. మూఁడుమాత్రలు కలిగియుండుట తెనుఁగునందలి సాధారణరూపమని పరిశీలించినఁ దెలియఁగలదు. అపుడు, చిలుక మొదలయినవి అప్డు, చిల్క మొదలయిన రూపములను బొందినను, ఉచ్చారణకాలము తగ్గలేదు. కాఁబట్టి పదాదినున్న హ్రస్వముమీది నిండుసున్నకు లోపము రాదు. అఁట మొదలయిన పై మూఁడుమాత్రము అరుదుగా వచ్చిన శబ్దములు.

## 6. పరుషసరళములకు ముందే బిందువుండుటకు హేతువులు

"సంస్కృత సమేతరంబులయిన తెనుఁగుశబ్దములయందుఁ బరుష సరళములకు ముందే బిందువు కానంబడుచున్నది."[20] ఈ విషయము తెనుఁగు ద్రావిడభాషల లోనిదని నిరూపించుచున్నది. అరవములోని యక్షరములు సంయుక్తములగు పద్ధతిని బరిశీలించినచో నిది స్పష్టముగా తెలియగలదు. అందు పొల్లులగు వర్గ పంచమములు వర్గాక్షరములతోఁ గలసి సంయుక్తములగును. ఆ పంచమాక్షరముల స్థానముననే బిందువు వచ్చినది. ప్రాచీనద్రావిడమున పరుషములగు క చ ట త ప లు మాత్రమే యుండెననియు, నవి కాలక్రమమున గ జ డ ద బ లుగాఁ గూడ మారిన వనియును ముందు నిర్ణయించియుండుటచే నివి యభిన్నము లనుట గతార్థమైనది.

అరవమునఁ బదాంతమున నిలువఁగలిగిన అనునాసికవర్ణములు ఞ, ణ, న, మ లు మాత్రమే. అందు ఞ కారము తెనుఁగునుండి జారిపోయినది. ణ, న, మ లు అంతమందుఁగల శబ్దము లన్నియును, (కణ్=కణ్ణు=కన్ను, మిన్=మిన్ను=మిను; నామ్=మేమ్=మేము) అనురీతిని మాఱి అజంతము లయినవి. కాఁబట్టి వీని కేవర్ణముతోడను సంధి కలుగుట కవకాశమే లేదు. భిన్నపదముల సంధిలో స్థిరవర్ణము లకు ముందు అనునాసికము లుండుటకు వీలులేదు. పదమధ్యసంధియందు వచ్చిన యాగమములు సాధారణముగా న, మ లే. అవి యనుస్వారము లయినవి. ప్రాచీన కాలమున నుండిన యనునాసికవర్ణమే కాలక్రమమున అనుస్వార మయినట్లు ముందటి చరిత్రమునుబట్టి స్పష్టము.

కావున తెనుఁగున అనుస్వారము పరుష సరళములకు ముందే కానంబడు ననుట సిద్ధించినది. వర్గయుక్సరళంబులు పరంబులగునపు డొకానొకచోఁ బూర్ణ బిందువునుం గానంబడియెడి.[21] ఇది క్వాచిత్కమును, నవీనము నగుటంబట్టి సామ్య మున నేర్పడిన దనుట స్పష్టము.

ముందు ప్రకరణములోని ధ్వనుల మార్పులనుగుఱించి ప్రసంగించినపుడు ద్రావిడభాషలలో అనునాసిక్యము నిమిత్తము లేకయే యేర్పడవచ్చుననియు, ప్రాచీనమయిన యనునాసికోచ్చారణము పోవచ్చుననియుఁ జెప్పితిని.

[20] బా. వ్యా. సంజ్ఞ. సూ. 16. తృతీయే ప్రథమే వర్ణే పరపవహి దృశ్యతే, బిందుర్వై కృతమధ్యే చ నాన్యవర్ణేపరేచసః. అ. కా.

[21] బా. వ్యా. సంధి. సూ. 1६

అరవము, కన్నడము, మలయాళము మొదలగు భాషలలో నను స్వారముగాని, యనునాసికవర్ణముగాని యున్న పదములలో దాని స్థానమున తెనుఁగున అరసున్నయైన నుండుట సహజము. అరసున్న యనఁగా నేఁటి భాషలో పోయిన యానునాసిక్యమునకు గుర్తు. నేఁడు అరసున్న కుచ్చారణమే లేదనుట స్పష్టము. అట్లా యర్ధానుస్వారముగూడ లేకుండఁ బోయిన పదములును దెనుఁగునఁ గలవు.[22] అట్లే తెనుఁగున నర్ధానుస్వారములు గల పదములకు సమానము లయిన పదములలో నితర ద్రావిడభాషలలో నానునాసిక్యము లేదు.[23] ఇట్లే సంస్కృతమునుండి వచ్చిన తద్భవములయందును మూలములోలేని యానునాసిక్యము తెనుఁగున గలుగుటయు, పోవుటయుఁ గలదు.[24] ఈ క్రింది యుదాహరణము లన్నియును ద్రావిడభాషలలో నిర్నిమిత్తముగా నానునాసిక్యము గలుగుచుఁ, బోవుచుండు ననుటను సిద్ధాంతపఱచుచున్నవి.

తెనుఁగున నేఁటి యర్ధానుస్వారమునకు ఉచ్చారణమును, ప్రయోజనమును గనుపట్టదు. కాఁబట్టి కర్ణాటులు వదలినట్లే యీ సిద్ధార్ధానుస్వారమును మనమును వదలివేసినచోఁ గలుగు నష్టము లేదు.

అనేకు లిద్దానిని శకటరేఫమువలెనే విడుచుచునే యున్నారు. అరసున్న లన్నింటిని జ్ఞప్తియం దుంచుకొనుటకుఁ బ్రయత్నించి ఆ పనికొఱకయి మనస్సును శ్రమింపఁజేయుట తగని పని. అనేకశాస్త్రములను జదివి విజ్ఞానమును సంపాదింపవలసిన యీ దినములలో భాషాక్లేశము దగ్గించుకొనుటయే పాఠకోపకారక మనుట నిస్సంశయము.

---

[22]
| తెనుఁగు | అరవము | కన్నడము |
|---|---|---|
| ఊయల | ఊఞ్చల్ | ఊయల్ |
| అసిమి | అసమ్బై | హాసుంబె |
| అలకువ | అలఙ్కు | అలగు |
| అనుకు | అనుఙ్కు | అనుంకు |
| కొాదమ | కుటిన్దై | కొాణసు |
| గులిమి | కుఱుమ్పి | |

[23]
| తెనుఁగు | అరవము | కన్నడము |
|---|---|---|
| పాఁడి | పాడి | పాడి |
| తాఁకు | తాక్కు | తాగు |
| తోఁపు | తోప్పు | తోపు |
| పొరఁటు | పురట్టు | పొరట్టు |
| అనుఁగు | అణుగు | అణుగు |
| గూఁడు | కూడు | గూడు |

[24]
| సంస్కృతము | తెనుఁగు |
|---|---|
| ఆమంత్రణ | ఆమెత |
| కూష్మాండము | గుమ్మడి |

# ఆంధ్రభాషావికాసము

## (ద్వితీయభాగము)

## పదపదాంగవిభాగము

## పదవర్గీకరణము

### 1. భాషాజాతి విభజనము

పదములయొక్క కూడికయే యభిప్రాయావేదనమునకు సాధనమయి భాష యగుచున్నది. అట్టి పదములు వాక్యమున కంగములు. వాక్య మనునది సంపూర్ణ మగు భావమును వెలిపఱచు పదసముదాయము. సముదాయ మనుటవలన నేకపద మాత్రమును సందర్భమునుబట్టి వాక్యము కాకపోదు. చెట్టును జూచి 'చెట్టు' అనినచో నెదురఁ గనుపట్టునట్టిది చెట్టు అను భావము సందర్భమునుబట్టి శ్రోతకుఁ దెలియు చున్నది. ఇదియును వాక్యమే. అయినను సాధారణముగా వాక్యమున నొక్కటికంటె నెక్కువ పదము లుండియే తీరును గావునఁ బయిలక్షణము యుక్త మనక తప్పదు. భాష యిట్టి పరిపూర్ణభావస్ఫోరకమగు వాక్యసముదాయము వలననే గలిగి యా వాక్యమును విడగొట్టుటవలన వేలు వేలు పదములు బయలు పడి వ్యవహారమునఁ బ్రవేశించుచుండును. పదములు గలుగుట కిది యొక్క పద్ధతి. స్వతంత్రముగాఁ బదములును అర్థము నుద్దేశించి ప్రత్యేక సంజ్ఞలుగా నేర్పడుచుండును. ఇట్లే భిన్నమార్గములవలన నేర్పడిన పదజాలమంతయును భాష యగుచుండును. మనుష్యసంఘము విశాలమగుచుండినకొలఁది, నగరములు పెరుగుచున్న కొలఁదియు, వివిధ వ్యాపారములనుబట్టియు, వృత్తులనుబట్టియు జాతులు, సంఘములు నేర్పడుచు, భిన్నపద్ధతులపయి వర్గీకరణము జరుగుచున్నట్లు, భాషయందును పదముల యర్థమునుబట్టియు, నవి వాక్యమునందుఁ బొందిన స్థానాదికమునుబట్టియు వర్గీకరణము చేయఁబడుచుండును. ఇది వైయాకరణులయు, భాషావేత్తలయుఁ బని. అట్లు పదములను వర్గీకరించిన తఱువాత నా పదములయొక్క యవయవ ములను (ప్రకృతి ప్రత్యయాదికమును) వైయాకరణులు విభజింతురు. ఈ విభాగము భాషాస్వభావమునుబట్టి యేర్పడుచుండు ననుట న్యాయము. ఇట్టి విభాగము భాషస్వభావమునుబట్టియే యేర్పడక, కొన్ని కారణములచేత నితరభాషల సామ్య మునఁగాని, విభాజకుల యసమర్థతచేతఁగాని భిన్నరూపమున నేర్పడవచ్చును. కాఁబట్టి భాషల స్వభావమునుగూర్చియు, వాని యభివృద్ధిలోని యవస్థలనుగూర్చియుఁ గొంత సంగ్రహరూపమున దెలియపఱుపవలసియున్నది.

భాష యనునది సాంగమయిన జీవపదార్థమువంటిది. ఒక మనుష్యుఁడు బాల్య యౌవన కౌమారాద్యవస్థలను బొంది భిన్నకాలముల భిన్నలక్షణముల నెట్లు పొందుచుండునో యట్లే భాషయును గాలాంతరమున నవస్థాంతరమును బొందు చుండును. అట్టి యవస్థలు సామాన్యముగా భాషల స్వభావమునుబట్టి మూఁడుగా విభజింపనగును. 1. విశ్లేషాత్మకములు. (Isolating Languages), 2. సంయోగాత్మక ములు (Agglutinative), 3. ప్రత్యయాత్మకములు (Inflectional).

పయిజాతుల విభాగము సామాన్యమయినదేగాని సంపూర్ణముగఁ బరస్పర విభేదకము గాదు.* ఒక భాషయందే రెండు మూఁడు లక్షణములు నుండును. మొదటిదగు విశ్లేషాత్మకావస్థయందు పదములు స్వతంత్రములయి మాఱుపడక యితరములను గలియక కూర్పఁబడుచుండును. 'మామిడి పండు నీవు చూడు' ఈ వాక్యమునందు నాలుగు పదములు గలవు. వీనినే మార్చి 'పండు మామిడి చూడు నీవు', 'మామిడిపండు' అనుటవలన నొక యర్థమును, 'పండు మామిడి' యనుటవలన వేఱొక యర్థమును గలుగుచున్నవి. వాక్యములో స్థానమునుబట్టి యొక్కపదమే భిన్నభిన్న వర్గమును జేరుచున్నది. ఇందు అన్నియు లింగ విభక్తి వచన శూన్యములే. అనఁగా నవ్యయములవంటివే యనుట. భాషయం యుఁ గొంచె మించుమించుగా నిట్లుండుట విశ్లేషాత్మకావస్థ. భాష పెరిగి యర్థబోధయందు సందిగ్ధత యేర్పడి నప్పుడు కొన్నినిపాతములు సంస్కృతమునందలి "చ, తు, అపి" మొదలయిన వాని వంటివి చేర్పఁబడుచుండును. ఇట్టివి చైనా, బర్మా దేశములలోని భాషలు.

రెండవది సంయోగాత్మకావస్థ. ఇందు పదములు ఒకటి రెండు మూఁడు మాత్రమే యక్షరములు గలిగియుండి గొలుసు కొక్కెములవలె నొకదాని కొకటి చేర్పఁబడి వాక్యములును, సమాసములును పర్పడుచుండును. ఇట్టిది తెనుఁగు.

మూఁడవది సంస్కృతమునందు గలదు. ఇది ప్రత్యయాత్మకభాష. స్వతంత్ర ప్రయోగానర్హములయి పదములకుఁ జేర్పఁబడినప్పుడే యర్థవంతములయినవి కొన్ని ప్రత్యయము లనఁబడునవి గలవి. అవి ప్రకృతులకుఁ జేర్పఁబడుచుండుటచే పద ములు, వాక్యాదికమును నేర్పడుచుండును. పదములయందలి యచ్చులును మాఱి యర్థభేదము గలిగిన రూపములు సిద్ధము లగుచుండును. ప్రత్యయాత్మకావస్థలోనే యుండియును నేఁటి యాంగ్లము నామ విభక్తులను దొఱఁగి వానికి బదులుగా గొన్ని విభక్త్యర్థాభిదాయకములయిన యవ్యయములను in, out, of మొదలయినవానిని పదమునకు ముందు వాడుచున్నది. ఇదియు భాషాపరిణతిలో నొక విశేషమే యనక తప్పదు. ప్రాచీనాంగ్లభాషయందు సంస్కృతమువలెనే విభక్త్యంతపదము లుండినవి.

* Max Muller Complete Works. Vol. III, page 45, Vol. II, page 392, 393.
A. C. Woolner. "Language in History and Politics" page 40-43.
Whitney "Language and the Study of Language." page 356-360.
Jesperson "Language" page 74-77.

ఈ యుదాహరణములను బరిశీలించునది: 'చెట్టు పండు' ఇది ప్రాథమికావస్థ. 'చెట్టునున్న పండు' ఇది ద్వితీయము. 'వృక్షస్య ఫలమ్' ఇది తృతీయము. Fruit of the tree ఇది నాల్గవది. పయి యుదాహరణములనుబట్టి యవస్థల విభజనమును అవగాహనము చేసికొనునది.

ఒక భాషయందే ఒకటిగాని, యన్నియుఁగాని యీ యవస్థ లొకప్పుడే క్వాచిత్కముగాఁ గనుపట్టుచుండును. 'తినవలయును = తిన + వలయు + ఉను' ఇది సంయోగాత్మకావస్థలోని రూపము. కాలక్రమమున 'తినాలెను—తినాలి' అను రూప మేర్పడి 'తిను + ఆలి' అను విభజనమును బొంది 'తినాలి, కొట్టాలి, చూడాలి' యను రూపములు తయారయినవి. 'ఆలి' ప్రత్యయమగును. ఇట్లే అవస్థలును మాఱుచుండు ననుట స్పష్టము.

ఒక భాషలోని పదములను విభజించి వర్గీకరించునపుడు ఆ భాష యొక్క యవస్థయు, నందలి రచనాప్రణాళికయుఁ బరిశీలించి పదజాతుల నేర్పఱచుకొన వలయును. సంయోగాత్మకావస్థయందున్న తెనుఁగు భాషయందు ఆంగ్లము నందలి Prepositions గాని, Conjunctions ను గాని కనిపెట్టఁ బ్రయత్నించుట నిష్ఫలము. తెనుఁగునఁ బ్రత్యయములకొఱకుఁ బ్రయత్నించుటయుఁ బయిదాని వంటిది కాకపోయిననుఁ గొంత సరిపడని కార్యమే యనుట నిస్సంశయము.

## 2. సంస్కృత ద్రావి డాంగ్ల వైయాకరణు లొనర్చిన పదవర్గీకరణము

ఇఁకఁ దెనుఁగును, ఇతర ద్రావిడభాషలను వైయాకరణు లెట్లు విభజించిరి యని విమర్శింపవలసియున్నది. అంతకుముందు సంస్కృతమునందలి విభజనమును బరిశీలించి తరువాత నితరభాషలయందలి సమాచారమును సంభావింపవచ్చును. యాస్కుఁడు నిరుక్తమునందు పదములు నాలుగు విధము లని చెప్పెను. నామము, ఆఖ్యాతము (క్రియ), ఉపసర్గములు, నిపాతలు.[1] కర్మప్రవచనీయములు అయిదవ జాతి యని కొందఱచే నంగీకరింపఁబడినది.[2] గోవు, అశ్వము, పురుషుఁడు మొదలయినవి నామములు. పచతి, కరోతి మొదలయినవి ఆఖ్యాతములు. ప్ర, పరా, అప మొదలయినవి ఉపసర్గములు. అస్తమ్, ఓమ్, నమః మొదలయినవి నిపాతములు. అతి, అను, ఉప, అభి మొదలయినవి కర్మప్రవచనీయములు.

పయి విభాగములో రెండు ముఖ్యములయిన తెగలు గలవు. ఒకటి (సుప్, తిఙ్) ప్రకృతి ప్రత్యయ విభాగయోగ్యములయిన నామాఖ్యాతములు. అట్టి విభాగ మక్కఱలేకయే అవ్యయములుగా నెంచబడినవి తక్కినవి మూఁడు తెగలు నని గ్రహింపవచ్చును. ఇట్టి విభజనమునకు వీ లేల కలిగినదనఁగా సంస్కృతము మిక్కిలిగాఁ బ్రత్యయాత్మకమయిన భాష యగుటయే.

---

[1] చత్వారి పదజాతాని నామాఖ్యాతే చోపసర్గ నిపాతాశ్చ. నిరుక్త - 1-1.

[2] ద్విధా కైశ్చి త్పదం భిన్నం చతుర్ధా పంచధాఽపివా. వాక్యపదీయము - కారిక 3.

నామాఖ్యాతములయందు (నామములు, క్రియలు) ప్రకృతి ప్రత్యయ విభాగము స్పష్టముగాఁ గనుపట్టును. నామముల ప్రకృతులు ప్రాతిపదికములు. రామః అను శబ్దమున 'రామ' యనునది ప్రకృతి, సు (ః) విభక్తి. కరోతి యను క్రియారూపమునఁ బ్రకృతి 'కృ' యను ధాతువు, 'తి' ప్రత్యయము. ఇట్టి ప్రకృతి ప్రత్యయ విభాగమును, నామ ధాతు రూపవిభజనమును గొంతవఱకుఁ దెనుఁగునను నిరూపింపనగును.

ఉపసర్గము లనునవి[3] క్రియలకు ముందుఁ జేర్పఁబడి యా క్రియలయందు అర్థవిశేషమును గూర్చునవి. వీనివలన ధాతువు నర్థము మాఱుచుండును.[4] 'హృ' ధాతువునకు హరించుట యర్థము. హారము అనునది 'హృ' ధాతువునుండి యేర్పడఁదగిన కృదంతరూపము. ఈ ధాతువునకు ఉపసర్గలు చేర్పగా నేర్పడఁదగిన రూపములు : ప్రహారము=దెబ్బ ; విహారము=విహరించుట ; పరిహారము=పోఁగొట్టుట. ఇట్టి యుపసర్గములు తెనుఁగున లేవనియు, నిట్టి జాతినిఁ దెనుఁగునఁ గల్పింప నక్కఱలేదనియు స్పష్టమేగదా! ఈ యుపసర్గములకు స్వతంత్రార్థము గలదా (వాచకత్వము) లేక యివి కేవలద్యోతకములా యను విచారణము సంస్కృతమునఁ గలదు.[5] ఇవి క్రియావిశేషణమాత్రము లని పతంజలి.[6]

నిపాతములను 'చాదులని' పాణిని నిరూపించెను.[7] చ, వా, సాక్షాత్, నమః మొదలగునవి. 'కూడా, లేక' అనువానివంటి యర్థమున వాడంబడును. ఈ నిపాతములకు స్వతంత్రమయిన యర్థము గలదనియు, నివి వాచకములనియు నైయాయికుల యభిప్రాయము. ఉపసర్గ నిపాతముల కీ భేదము లేదని మఱియొక మతము. ఇట్టి వానినిఁ గొన్నిఁటిని తెనుఁగున నిరూపింపనగును. ఆ విషయము ముందు వివరింపఁబడును.

కర్మప్రవచనీయములు అతి, అను, అభి, ఉప, పరి, ప్రతి మొదలయినవి. ఇవి రూపమున నుపసర్గములేకాని స్వభావమున భిన్నములు. ఉపసర్గములు ధాతువులతోఁ జేరి భిన్నార్థమును గల్గించునని ముందు చెప్పఁబడినది. ఇవి యట్లుగాక కేవల నామములతోనే సంబంధించియుండును. 'జపమను ప్రావర్షత్—

---

[3] ప్ర, పరా, అప, సమ్, అను, అవ, నిస్, నిర్, దుస్, దుర్, వి, ఆ, ని, అధి, అపి, అతి, సు, ఉద్, అభి, ప్రతి, పరి, ఉప, ఏతే ప్రాదయః.

[4] ధాత్వర్థం బాధతే కశ్చిత్, కశ్చి త్త మనువర్తతే, తమేవ విశినష్ట్యన్య ఉపసర్గగతి స్త్రిధా. ఉపసర్గేణ ధాత్వర్థో బలా దన్యత్ర నీయతే, ప్రహా రాహార సంహార విహార పరిహారవత్.

[5] *Philosophy of Sanskrit Grammar* by **Chakravarthi. Page. 151**

[6] క్రియావిశేషక ఉపసర్గః — పచతీతి క్రియా గమ్యతే. తాం ప్రో విశినష్టి.
(పా 1-3-1. సూత్ర, మహాభాష్యము.)

[7] చాదయోఽసత్త్వే. 1-1-4-57. అద్రవ్యార్థాశ్చాదయో నిపాతసంజ్ఞాః స్యుః. చ, వా, ఏవ, ఏవమ్, నూనమ్, శశ్వత్ మొదలగునవి.

జపము ననుసరించి వర్షించెను. ఇందు 'అను' అనెడి కర్మప్రవచనీయమునకు అనుసరించి యని యర్థము. 'జపమ్' (జపమును) అను ద్వితీయాంతమైన నామమును సంబంధించినది. దీనికిని ఉపసర్గమునకును భేదము లేదు అని కొందఱును, కలదని కొందఱును భిన్నాభిప్రాయములను నిరూపించుచున్నారు. ఉపసర్గములు ప్రత్యక్షముగాఁ గ్రియను సంబంధించినవై యుండఁగాఁ గ్రియవలన నేర్పడిన సంబంధవిశేషమును విశేషించునవి కర్మప్రవచనీయములు.[8] ఇదియే యీ రెంటికిని గల భేదము.

ఇట్లు పయిరీతి నేర్పడిన సంస్కృతభాషాగతములయిన శబ్దములయొక్క విచారణమే ద్రావిడభాషలలోని వైయాకరణుల కాధారమగుట నా స్వభావము స్పష్టముగాఁ దెలిసినఁగాని క్రిందివిచారణమున కవకాశము లేదని ముందిది తెలుపఁబడినది.

తొల్కాప్పియనారు తన వ్యాకరణమున యాస్కుని నిరుక్తమునుఁ, బ్రాతిశాఖ్యలను ననుసరించి అరవపదములను నాలుగు జాతులుగా విభజించెను.[9] పెయర్ (పేరు = నామము), వినై (క్రియ = ఆఖ్యాతము), ఇడై చ్చొల్, ఉరిచ్చొల్ అను నాలుగు విధములను అరవమున నంగీకరించెను. 'చొల్' అనగా శబ్దము, లేక పదము అని యర్థము. 'పెయర్, వినై' అనువాని స్వరూపమును వివరింపనక్కఱ లేదు. 'ఇడై చ్చొల్' అనుదానికి స్వతంత్రప్రయోగము లేదు. ఇవి నామములతోను, గ్రియలతోను ముందుగాని వెనుకఁగాని ప్రయోగింపఁబడుచుండును.[10] నామవిభక్తులు, క్రియావిభక్తులు, ఆగమములు (సారియై), ఉపమార్థకములయిన 'పోల' మొదలయిన శబ్దములు, ఏ, ఓ, ఉమ్ (తెనుఁగు సముచ్చయ 'ను' వర్ణక పూర్వరూపము) అనునవియు, ధ్వన్యనుకరణశబ్దములు (చలచల, టపటప) ఓ, వో అను నాశ్చర్యాద్యర్థకములు మొదలయినవి యిందు చేర్పఁబడినవి. సంస్కృతమునఁ జెప్పఁబడిన ప్రత్యయములును, అందలి నిపాతములవంటివియు నిందు సంగ్రహింపఁబడినవి. ఇడై చ్చొల్ = నడిమి పదము అని భావము.

ఉరిచ్చొల్—అను పదముల స్వభావమునుగూర్చి కొంత భిన్నాభిప్రాయము గలదు. "సంస్కృతమునందలి ధాతుశబ్దములతో సమానార్థకమని తొల్ కాప్పియనారు నభిప్రాయముగా నిరూపింపఁబడినది.[11] అసంవిజ్ఞాతమూలములయి వ్యుత్పత్తి

[8] క్రియాయా ద్యోతకో నాయం సంబంధస్య వాచకః । నాపి క్రియాపదాక్షేపీ సంబంధస్య తు భేదకః. వాక్యపదీయము. 2,206. *Philosophy of Sanskrit Grammar*—by **Chakravarti. p. 168.** [9] తొల్, చొల్ 158, 159—**P. S. S. p. 105.**

[10] **P. S. S. p. 194-198.**

[11] **P. S. S. p. 194. It is identical with 'Dhatu' in Sanskrit. The list of 'Urichol' given by Tolkappiyanar may be divided into that which deals with verbal roots and that which deals with nominal roots.**

తెలియని మూలరూపములు నిందు కాని యివి నేఁటి నామవిశేషణ ములతోడను, క్రియావిశేషణములతోడను సమానార్థకములని మఱికొందఱు వైయాకరణుల యభిప్రాయము [12]

ఇట్లు అరవమున నిరూపింపఁబడిన పద్ధతి నెఱింగినతరువాతఁ గర్ణాటవైయాకరణు లెట్లు పదజాతమును విభజించిరని సంగ్రహముగా నిరూపింపఁ బ్రయత్నింతును

అరవవారు పదజాతములను విభజించినరీతిని ప్రాచీన కర్ణాటకవైయాకరణులు పదములను విభజించినట్లు కనుపట్టదు. నాగవర్మకృతమయిన కర్ణాటభాషాభూషణమునందు నిరూపింపఁబడిన విధానముల (ప్రకరణములు) ను బట్టి నిరూపించినచో నామము, సర్వనామము, ఆఖ్యాతము, అవ్యయము, నిపాతము అనునవి యుద్దేశింపఁబడినట్లు తోఁచుచున్నది. అందు విభక్తివిధానము అను ప్రకరణమున నామవిభక్తులు నిరూపింపఁబడినవి. అవ్యయవిధానమున "హుం, ఛీః, భోంకల్, మేణ్" మొదలయిన యవ్యయములు నిరూపింపఁబడినవి. నిపాతవిధానమున "ఎ, ఎలే, అయ్యో, ఓహో, అరె" మొదలయినవి నిరూపింపఁబడినవి. ఈ నిపాతములకును బయి యవ్యయములకును గల భేదము స్పష్టపడలేదు ఇవియును అవ్యయములేగాని వేఱుగావు. శబ్దమణిదర్పణమున నామము, ఆఖ్యాతము, అవ్యయము అనునవి ప్రధానముగా గల మూఁడు ప్రకరణములు గలవు. భాషాభూషణమునఁ బేర్కొనఁబడిన నిపాతములన్నియు నవ్యయప్రకరణముననే శబ్దమణిదర్పణమున నిరూపింపఁబడినవి.

ఇఁక దెనుఁగువ్యాకరణముల పద్ధతిని బరిశీలింపనగును. ఆంధ్రశబ్దచింతామణి యందును బయి విభాగము చేయఁబడలేదు. కాని సంజ్ఞాపరిచ్ఛేదములో ప్రాతిపదికము=నామము ; క్రియ=ధాతువు, ప్రత్యయము=వర్ణకము అని తెలుపఁబడినది.[13] అజంత, హలంత పరిచ్ఛేదములయందు సుబంతము లన్నియును నిరూపింపఁబడినవి. క్రియాపరిచ్ఛేదమున క్రియలరూపములు నిరూపింపఁబడినవి. అంతియగాని భాషాగతశబ్దములను విభజించు నభిప్రాయమే కనుపట్టదు. అట్లే బాలవ్యాకరణమునందుగూడఁ బయి యభిప్రాయము లేదు. ప్రౌఢవ్యాకరణకర్తమాత్రము "పదము లవి నామములు క్రియ లవ్యయంబులని త్రివిధంబులు" అని సూత్రించి పదములను మూఁడువిధములుగా విభజించెను.

[12] నన్నూల్ — ఉరియియల్.

[13] ఆ. శ. చింతామణి. "ప్రాతిపదికం హి నామ ప్రత్యయ ఇహ వర్ణకః క్రియాధాతుః. సంజ్ఞ. 22-25. "లుః ప్రదృశ్యతే నామ్నామ్. నామ్నామ్=శబ్దములయొక్క, అజంత పరిచ్ఛేదము. సూ. 78. ఔపవిభక్తిక నామ్నామ్..." ఔపవిభక్తిక నామ్నామ్=ఔపవిభక్తిక నామములకు. అజన్త. సూ. 80. "పదంతతాచ నామ్నా మన్యతరస్యా మియాన్తానామ్. నామ్నామియాంతానామ్=ఇయ యనునది తుదియందుగల ప్రాతిపదికములకు, అజన్త. సూ. 82. ఇట్లే నామశబ్దము ప్రాతిపదిక మను భావముననే వాడఁబడినది.

ఇట్లు తెనుఁగువైయాకరణులును, గర్ణాటులును బదజాతులను విభజింపక యే వ్రాయుటకును, తొల్కాప్పియమున నట్టి విభజన ముండుటకును హేతు వేమని యడుగవచ్చును. తొల్కాప్పియనారు యాస్కుని నిరుక్తమును, ప్రాతిశాఖ్యములను దనకు మార్గదర్శకములుగా నుంచుకొనుటచేత. వానియందున్న ప్రణాళిక నడచినది. పాణినీయము, సిద్ధాన్తకౌముది, ప్రాకృతవ్యాకరణములు నవ్యులయిన యాంధ్ర కర్ణాటుల కనుసరణీయంబు లగుట వారి కా ప్రణాళిక నడచినది. పాణినీయసూత్రము లందు శబ్దము లెన్నివిధము లనెడి విచారణము కనుపట్టదు. సిద్ధాంతకౌముది కేవల ప్రక్రియావిషయమును బ్రధానముగా నుంచుకొనుటవలనను, ఆర్థికవిచారణము వేఱుగ్రంథములలో నుండుటవలనను, అట్టి గ్రంథములు దుర్లభము లగుటను, వాని లోని విచారణము తెనుఁగువ్యాకరణములలోని కెక్కలేదు. పయివిధమయిన విచారణను వాక్యలక్షణములో సీతారామాచార్యులుగారుమాత్రమే చేసియున్నారు.

ఇక నీ తి నవ్యాంధ్రవ్యాకరణములలో నాంగ్లవ్యాకరణ విభజన మర్యాద వలన ననేకములయిన పదవిభజనములు బయలుదేరినట్లు ముందు నిరూపించితిని. అవి యెంతవఱకు యుక్తములు అనువిషయమునుగూడఁ జర్చించితిని. ఇట్లే నేఁటి కన్నడవ్యాకరణములయందును ఆంగ్లవ్యాకరణప్రభావమున నూత్నవిభజనము గలిగినది. ఈ క్రిందఁ జేయఁబడు విమర్శనమున నాంగ్లవ్యాకరణసంప్రదాయముగూడ ననుసరింపఁబడుచుండును.

తెనుఁగుపదములు నామములు, క్రియలు, అవ్యయంబులు అను మూఁడు విధములుగా విభజించుటయం దొక పద్ధతి కనుపట్టుచున్నది. నామములును, గ్రియ లును ప్రత్యయాంతము లగుటను (సుప్తిఙన్తములు), అవ్యయము లట్లు కాకపోవుటను బయి విభజనము కేవల ప్రత్యయాంతత్వమును ఆశ్రయించియే యున్నది. కాని యిదియు సరికాదు. తెనుఁగునందలి 'అప్పుడు' శబ్దమును అవ్యయ మనిరి. ఇది కాలవాచి. ఇదియును నామ మేల కాఁగూడదు? దీనికిని విభక్త్యంతరూపములు గలవుగదా? "నామములు వస్తువాచక శబ్దములు" అని లక్షణము వ్రాయఁబడినది. "సత్త్వప్రధానాని నామాని" యని యాస్కుని లక్షణము. దానినే పోలిన దియ్యది. చేసి, చూచి మొదలగునవియు గ్రియావాచి శబ్దములే యగునప్పుడు వానినిమాత్ర మేల క్రియలని చెప్పరాదు? కాఁబట్టి ప్రత్యయాంతములు, ప్రత్యయరహితములు అని శబ్దములు రెండువిధములని నిరూపించినచోఁ బయి పూర్వపక్షమున కవకాశము రాదు.

# నామములు

## 1. నామపద స్వభావము

నామశబ్దము చింతామణియందు కేవల ప్రాతిపదికము అను నర్థమున వాడఁబడినది. ఆంగ్లమున Noun[14] అను పదము గలదు. ఆ యర్థముగూడ నేఁ డీ శబ్దమునకుఁ గలిగియుండుట సందర్భమునుబట్టి దాని నిం దనుసంధించునది. దీనికి నామవాచకములు అను పేరుగూడ వాడుచున్నారు. ఇవియే పేళ్లు. సంస్కృతమునందలి నామములకును, తెనుఁగు నామములకును ఈ క్రిందిభేదములు గలవు. సంస్కృతమునందలి నామములు చాలవఱకును వ్యుత్పన్నము లయినవి. అనఁగా ప్రకృతి ప్రత్యయ విభాగమువలన వైయాకరణులచే స్పష్టపరుపఁబడిన వ్యుత్పత్తి గలవి. అందును ఉణాదులను నొక జాతి పదములను అవ్యుత్పన్నము లనియే పతంజలి చెప్పెను.[15] తెనుఁగునందు కొంచె మించు మించుగ నన్నియును అవ్యుత్పన్నములే. అనఁగా ప్రాతిపదికములకుఁ బ్రకృతి ప్రత్యయ విభాగము తెలియదని భావము. 'చెమ్మ' అను శబ్దము గలదు. ఇం దేది ధాతువో, ఏప్రత్యయ మేయర్థమున వచ్చి యీ శబ్ద మేర్పడినదో తెలియదనుట. 'దేవః' అనుపదమునకు 'దీవ్యన్తీతి దేవాః' క్రీడించువారు గావున దేవతలు అను వ్యుత్పత్తి తెలిసినది. అనఁగా క్రీడార్థకమయిన 'దివ్' ధాతువునుండి పయి ప్రాతిపదిక మేర్పడిన దనుట. పెక్కు దేశ్యశబ్దముల కట్టి యుత్పత్తి యెఱుఁగరాదు.

2. ఎట్టి ప్రకృతికయినను ప్రత్యయము చేర్పకయే ప్రయోగింపరాదు. అనఁగా ప్రథమావిభక్తిప్రత్యయమును చేర్చి (రామ+సు) రామః, అను రూపమును గల్పించియే దానిని ప్రయోగింపవలయును. ఒకప్పుడు ప్రాతిపదికమును, ప్రథమావిభక్త్యేకవచన రూపమును అభిన్నమయినచోఁ బ్రథమాప్రత్యయము వచ్చి లోపించును. ఇది సంస్కృతవ్యాకరణ మర్యాద. కేవల ప్రకృతికిఁగాని, ప్రత్యయమునకుఁగాని ప్రయోగము లేదు.[16] అనేక శబ్దములకు ప్రథమావిభక్త్యేకవచనప్రత్యయ మక్కఱలేకయే తెనుఁగున ప్రాతిపదికతుల్యములనే వాడుదురు. అమ్మ, తాత, అన్న, నాన్న, రాయి, చెట్టు మొదలయిన శబ్దములన్నియు నట్టివే. కావుననే చిన్నయసూరి "అచ్ఛిక

---

[14] A noun is the name of a person, place or thing. వస్తువు, ప్రదేశము, మనుష్యుడు, అనువానిపేళ్లు నామములు. [15] ఉణాదయోఽవ్యుత్పన్నాని ప్రాతిపదికాని. (మహాభాష్య. పతంజలి) వా III. పు 241.

[16] న కేవలా ప్రకృతిః ప్రయోక్తవ్యా, నాపి ప్రత్యయః. నిత్యసంబంధా వేతావర్థౌ ప్రకృతిః ప్రత్యయ ఇతి. ( మ. భా. 1-2-45 సూత్ర. పాణి ).

శబ్దంబులెల్లం దఱుచుగ స్త్రీసమంబులుం, క్లీబసమంబులు నయి యుండును" అని సూత్రించెను. స్త్రీసమంబులు అనఁగా ప్రథమైకవచనప్రత్యయము లోపించిన వనుట.

3. తెనుఁగునందలి ప్రత్యయములకును, సంస్కృతమునందలి ప్రత్యయములకును గొంత భేదము గలదు. సంస్కృతమునందలి ప్రత్యయములకు ప్రత్యేక ప్రయోగ యోగ్యత లేదు. వాని చరిత్రము తెలియుటకు వీలుపడదు. తెనుఁగున నట్టిప్రత్యయము లల్పసంఖ్యాకములు. తెనుఁగున స్వతంత్రముగా భాషలో వాడుచున్నపదమే ప్రత్యయముగాఁ బ్రయోగింపఁబడుచుండును.

4. సంస్కృతమున నామములకు (సుబంత ప్రకృతులకును), ధాతువులకు భేదము కలదు. 'కృ' (చేయు) ధాతువు. దీనినుండి 'కార్యము, కారకము, కర్త, కర్మ, కృతి, క్రియ' మొదలగు నామములును, 'కరోతి' మొదలగు ననేక తిఙన్త రూపములును సంస్కృతమునఁ గలుగుచుండును. అనఁగా సంస్కృతమునందలి యత్యధికసంఖ్యాకశబ్దములు క్రియలకు మూలమయిన ధాతువులనుండి పుట్టినవని యంగీకరింపనగును.[17] (సంస్కృతమునందలి నామములన్నియు ధాతువులనుండి కలిగినవనియే శాకటాయనుని మతము. ఉణాది సూత్రము లీయన వ్రాసినవనియే తెలియుచున్నది). తెనుఁగున నిట్టి పద్ధతి నంగీకరింప వీలులేదు. నామములకును, క్రియలకును నొక్కటే మూలరూపమనియు, నదియే భిన్నముగాఁ బ్రయోగింపఁబడుచున్నదనియు నిరూపింపవచ్చును. 'పండు' ఇది నామము. ప్రథమావిభక్త్యంతము. 'పండుకాయ' ఇందు 'పండు' విశేషణము. 'పండుచున్నది' ఇది పండు+చు+ఉన్నది. కేవల సమాసమని ముందు నిరూపింపఁబడును. ఇట్టి శబ్దములు అనేకములు గలవు.

పయిలక్షణములను పరిశీలించినచో తెనుఁగునామములు (సుప్ప్రకృతులు) సంస్కృతమునందలి వానికంటె మిక్కిలి భిన్నములు అనుట స్పష్టము. ఇవి అల్పాచ్కములు. ఒకదానికొకటి చేర్పఁబడుచు నర్థవిశేషమును గల్గించుచుండును.

## 2. నామవిభక్తులు

ప్రకృతులస్వభావమును నిరూపించినతరువాతఁ బ్రత్యయములస్వభావమును, స్వరూపమును, జరిత్రమును నిరూపింతును.

(1) డు, ము, వు, లు (2) ని, ను, ఁ, కూర్చి, గుఱించి (3) చేత, చే, తోడ, తో (4) కై, కొఱకు (5) వలన, కంటె, పట్టి (6) కి, కు, యొక్క, లోపల (7) అందు, న.

పయివానిలోఁ గొన్నింటిని ప్రత్యయములుగాఁ గొంద ఱంగీకరింపలేదు. ఇవిగాక నుంచి, నుండి మొదలయినవి పంచమీవిభక్తిప్రత్యయములుగాఁ గొందఱు పేర్కొనిరి.

---

[17] *Philosophy of Sanskrit Grammar* by Chakravarti, p. 174.

పయిపట్టికలో కూర్చి, గుఱించి, చేత, తోడ, కొఱకు, వలన, కంటె, పట్టి, లోపల, నుంచి, నుండి అనువాని చరిత్రము నూహించుట సులభము.

కూర్చి—కర్మప్రవచనీయకే కూర్చిః అని చింతామణి. 'కూర్చు' అను ధాతువు 'కూడు' ధాతువుయొక్క ప్రేరణార్థకరూపము. దానిపయిని క్త్వార్థకమగు ఇప్రత్యయము—రచించు, కల్పించు, అదుకు, ఏకముచేయు, పొందించు మొదలయిన యర్థము లీ ధాతువునకుఁ గలవు. 'సీతఁగూర్చి పిచ్చెను', 'జపముంగూర్చె వర్షము' అనునవి ప్రయోగములు. "శబ్దశాస్త్రమందుఁ జెప్పఁబడిన కర్మప్రవచనీయసంజ్ఞ కల ద్వితీయాస్థలము లందు మహదమహత్తులమీదను, ద్వితీయైకవచనమునకుఁ గూర్చి యను వర్ణకము వచ్చును"అని బాలసరస్వతీయము. సంస్కృతమునఁ గర్మప్రవచనీయములనునవి కొన్ని గలవని ముందు నిరూపించితిని. ఇచ్చటఁ గర్మప్రవచనీయము అను సంజ్ఞ దేనియందో తెలియదు. 'ప్రతి, పరి, అప, అను' అనునవి యచ్చటఁ గర్మప్రవచనీయ ములు. వానియోగమున నామమునకు ద్వితీయావిభక్తియగునని సంస్కృతసూత్రమున కర్థము. కర్మప్రవచనీయములు చేరుటవలన సంస్కృతమున నే యే స్థలములలో ద్వితీయ విధింపఁబడినదో అట్టియర్థములు గల చోట్లనెల్ల తెనుఁగున కూర్చి యను విభక్తి కలుగునని చెప్పవలెను. 'అను హరిం సురాః' అను ప్రయోగమును కర్మప్రవచనీయమున వచ్చిన దానిని తెనిఁగింపవలెనన్నచో 'హరినిఁగూర్చి సురలు' అనవచ్చునా? "హరేః హీనా ఇత్యర్థః", "హరికంటె హీనులు" అను భావము రావలెను. ఇట్లే అతి దేవాన్ కృష్ణః = కృష్ణుడు దేవతలకంటె నెక్కువ, సర్వమ్ మామ్ అనుతే = నీదంతయును నాతరువాతనే, అనుపితరం గచ్ఛతి సుతః = తండ్రిని కొడుకు అనుక రించుచున్నాడు. "ఉపకూరం న తే వృత్తమ్" = నీ చరిత్రము కూరునివలెనే లేదు. ఈ పయిస్థలములం దెల్లను కర్మప్రవచనీయములు గలవు. వీని కన్నిఁటికిని కూర్చి రాదుగదా! ఇది కేవల సంస్కృతానుకరణముగుటచే తెనుఁగుయొక్క భావ స్ఫూర్తిని నిరూపింపలేదు.

పయిరచనలో 'కూర్చి, గుఱిచి, గుఱించి' యను మూఁడును 'జపమును' అనుదానివంటి ద్వితీయాంతముపయి వచ్చిన క్త్వార్థకము లనుట స్పష్టము. ఇవి ప్రత్యయము లనుటకు వీలులేదు. 'విభక్త్యర్థాభిదాయకములయిన కొన్ని వైకృత శబ్దములు గలవు' అను నథర్వణునిసూక్తి ననుసంధించునది.[18]

పయిసూత్రము కేవల సంస్కృతసూత్రమును అనుసరించి వ్రాయుటవలన నీ యస్పష్టత యేర్పడె ననుట స్పష్టమగుచునే యున్నది. గుఱిచి, గుఱించి అనునవి రెండును అభిన్నరూపములు. అనునాసిక్యముమాత్రమే భేద మనుట స్పష్టము. ఈ ధాతువునకు తక్కినరూపములు నశించినవి. అనఁగా గుఱించెను, గుఱించుచున్నాడు అను రూపము లుండవనుట. కన్నడమున 'కుఱి' ధాతువుగా నీ యర్థముననే (ఉద్దేశించు) వాడంబడినది. 'కుఱితు'(అను క్త్వార్థకరూపమే గుఱించితో సమా

[18] కేచిత్తు వైకృతాశ్శబ్దా విభక్త్యర్థాభిదాయకాః.

నము.) 'కుఱితుకొళ్' మొదలయినవి యందు చాల ప్రచారమున నున్నవి. ఈ గుఱిచి, వ్యవహితముగగూడఁ బ్రయోగింపఁబడుచున్నది. అజ్ఞాసనుఁడు తన్ను నర్థితోగుఱిచి'' హరి. పూ. I.

(2) చేతన్, తోడన్, చేన్, తోన్. చేతన్ అనునది చేయి శబ్దముయొక్క తృతీయాసప్తమ్యంతరూపము. ''దానవుచేతనొచ్చి, నీచేతఁబడి, నాచేతఁబగిలెను, నాచేతిలోఁ బగిలెను.'' ఈ పయివాడుకలయం దెల్లను చేత స్వతంత్రశబ్దముగానే వాడఁబడెననుట స్పష్టము. 'చే' అనునదియు స్వతంత్రశబ్దముగానే ప్రయోగములు గలవు. 'తోడన్' అనునదియు 'తోడు' శబ్దముయొక్క విభక్త్యంతరూపమే. తోడు అనఁగా సహాయుఁడు మొదలయినవారు. తోన్ అనునదియు నట్టిశబ్దమే. ''విద్వజ్జనులును దోఁజనుదేరగ—భా. సభా. II 158.'' తోడ అనునది వ్యవహితముగాఁ గూడ నున్నది.[19] తోడకు స్వతంత్రప్రయోగమును గలదు. ''తోడ మాటాడకునికి''. తోడుత అని రూపముగూడ గలదు. 'తోడుతో' అను రూపము తోడుత యయిన దనుట యుక్తము. చేసుకో=చేసుక, అచ్చోట=అచ్చట. ఈ రెండు మార్పులును సుప్రసిద్ధములేగదా. వీనివలెనే యిందును తో, తవర్ణమయినది అని యూహింపనగును.

(3) మెయి = ప్రక్క, వెంబడి యను నర్థములయందు దీనికి స్వతంత్ర ప్రయోగములు గలవు.

(4) చేసి యనునది చేయుధాతువుయొక్క క్త్వార్థకరూపము.

(5) కొఱకు—కొఱ యనగా కార్యము, ప్రయోజనము. ఈ శబ్దముయొక్క షష్ఠ్యంతరూప మిది. చేయుకొఱకు, ఏమికొఱకై అని ప్రయోగములు గలవు.

(6) కై—కయియొక్క రూపాంతరము. కు+అయి అనువాని కూడిక వలన గలిగిన దీ శబ్దము. 'అనఘ మా మామ శకుని నాకై కడంగి' యనుచో నన్నయ దీనికి అకారముతో యతివేసె ననుట పరిశీలింపనగును. ఇది యిట్లే యేర్పడినదనుట కీ క్రింది ప్రయోగములు పరిశీలింపనగును. ''నీకునయి'', ''తమ్మునికిఁ గాగ భీష్ముఁడు'', ''మాకుంగా దీనిని విడువవలయు'' ఈ మూఁడిటియందును అగు ధాతువుయొక్క రూపములగు, 'అయి, కాగ, కా అనునవి కు, కి, వర్ణకముల పయిం బ్రయోగింపఁబడినవి. అర్థ మన్నిటను సమానమే.

(7) పొంటెన్—ఇది కొఱకు అను నర్థమున వచ్చినది. పొంటు + ఏన్ అని యేర్పడియుండవచ్చును. అరవమున పొరుట్టు అనునది చతుర్థీవిభక్తిప్రత్యయముగా నీ యర్థమున వాడఁబడుచున్నది. (అ) మరుందు=మందు. (అ) పొరుందు=పొందు. (అ) చురుట్టు=చుట్టు. (అ) పరుప్పు=పప్పు. ఈ పయిశబ్దములవలెనే యిందు రువర్ణము లోపించి నాసిక్యము గలిగి 'ఏన్' అను శబ్దము చేర్పఁబడుటవలన నియ్యది గలిగియుండును.

---

[19] ప్రౌ. వ్యా. కారక—6, 7, 8 సూ.

(8) పట్టి—పట్టుధాతువుయొక్క క్త్వార్థకరూప మియ్యది. పంచమీవిభక్తి. 'నాటంబట్టి', 'చేయుటంబట్టి', 'కాఁబట్టి' ఈ మూఁడు రూపములయందును, ముందున్న భావార్థకాదులను, నువర్ణకమును బరిశీలింపఁగా నీ 'పట్టు'నకు ముందటిది కర్మగా నుపయోగపడుట స్పష్టము. పట్టి యనగా గ్రహించి యని యర్థము.

(9) వలనన్—ఇది 'వలను' శబ్దముయొక్క తృతీయాసప్తమ్యంతరూపముతో సమానము. 'వలన' కు ప్రక్క, దిక్కు మొదలయిన యర్థములు గలవు. హిమగిరివలన నుండి గంగ వొడమె, వలనన్ + ఉండి = ప్రక్కనుఉండి యని యవయవార్థము.

(10) ఉండి—ఉండుధాతువుయొక్క క్త్వార్థకరూపము. పంచమ్యర్థమున వాడఁబడునది. 'దాననుండి', 'దానినుండి' యను ద్వితీయా సప్తములయం దెద్దేనియు నగు.[20] నన్నయప్రయోగంబులలో సప్తమియే యగును. ప్రాచీనముగా 'ఉండి', 'అందుండి' అను నర్థమున సప్తమితోనే ప్రయోగింపఁబడుచుండెననుట యుక్తము. 'ఉండి' కి బదులు 'ఉంచి' వాడుకలోఁ గలదు. ఇది 'ఉంచు' = (ఉనుచు) యొక్క రూపము. 'నుండి', 'నుంచి' యనువానిని విభక్తులుగా భావించుట యనుచితవిభాగమువలననే యనుట స్పష్టము.

(11) కంటెన్—కు + అంటి + ఏన్. ఇది ఉభయయతులలో నప్పకవిచేఁ బేర్కొనఁబడినది.[21] 'నాకంటె గొప్పవాఁడు', 'నాకు, అంటి, ఏని' అని యర్థవిభాగము. ఇట్లేర్పడిన కంటె శబ్దము ప్రత్యయమాత్రముగాఁ గాక యవ్యయముగా 'నాయందుకంటె' అనునట్లు తరప్ప్రత్యయార్థకముగా నేఁడు వ్యవహారమున వాడఁబడుచున్నది.

(12) కోలెన్—కోలు + ఏన్. కొనుధాతువుయొక్క భావార్థకరూపము 'కోలు' (తెచ్చికోలు, పుచ్చికోలు మొదలగునవి). నిన్నఁగోలెన్, నాటఁగోలెన్.

(13) వల్ల—ఇది వలనకు రూపాంతరము. వలన=వల్న=వల్ల. వీ। ణామౌనిం బచరించి తుంబురుని వ। ల్నం గన్న. చంద్ర. భా. V. 206. ఇందు నకారము యతి.

(14) లోను—ఇదియును స్వతంత్రశబ్దమే. మహేంద్రుండు లోనగువారు. ఉత్తర లోనుగాఁగల పయోజముఖులు. భార॥ వి. II, 265.

(15) అందు—స్థలవాచకము. దీనిని అవ్యయమని వైయాకరణులు పేర్కొనిరి. 'అందును, అందుచేత, అందుకొఱకు, అందువలన, అందుకు, అందున,' ఈ రూపములన్నియును వాడుకలో నున్నవి. వీని నన్నిఁటిని విభక్తి ప్రతిరూపకావ్యయములని కొంద ఱనిరి. సంస్కృతమునందలి 'చిరం, చిరేణ, చిరాయ, చిరాత్, చిరస్య' అనువానిని సంస్కృతవైయాకరణు లవ్యయములుగాఁ బరిగణించిరి. దాని ననుసరించియే యిట్లు వ్రాసిరి. మనము తెనుఁగునకుఁ గ్రొత్తగా వ్యాకరణము వ్రాసి

---

[20] బా. వ్యా. కారక పరిచ్ఛేదము. 11 సూ. [21] అప్పకవీయము. III ఆ. 237. ప.

కొనునప్పుడు వీలయినంతవఱకు చరిత్రనే యేల యనుసరింపరాదు? ఈ విషయ మవ్యయప్రకరణమున మరల విమర్శింపఁబడును. పయి శబ్దములన్నిటిని నన్నయ వాడిన ద్వితీయాది విభక్తిప్రత్యయములు అను శీర్షిక క్రింద ప్రయోగములతో నిరూపించితిని. ఇవియన్నియును విభక్తు లేల యయ్యె నని ప్రశ్న గలుగును. ఇవి ప్రత్యయమాత్రములు గావు. నిజమయిన ప్రత్యయములకు స్వతంత్రప్రయోగ యోగ్యత లేదు. సంస్కృతమున వాడుచున్న యేడు విభక్తులు గల విభజన ప్రణాళిక మనస్సులో నున్న వైయాకరణులు చేసిన పని యిది. ఆయా విభక్త్యర్థములుగా సంస్కృతమునఁ జెప్పఁబడిన యర్థములయం దేపదములు తెనుఁగున వాడఁబడు చున్నవో వానినెల్ల నా విభక్తులుగాఁ బరిగణించుట సులభమును, స్వాభావికము నయిన పని. గావున వా రట్లేచేసిరి.

సంస్కృతమునందలి పై విభక్తివిధానము తెనుఁగునఁ బనికిరాదనుటకు నన్నయ ప్రయోగములయం దొసంగిన విభజనముఁ బరిశీలించినచో స్పష్టమగును. నన్నయ కాలమున భాష యేర్పడుచుండినది. దాని నిట్లు విభజించుటచేతనే యీ పద్ధతిని దరువాతివా రెల్లరు నవలంబించిరి.

పయిని విచారింపగా మిగిలిన ప్రత్యయములు డు, ము, వు, లు ; ని, ను, ల ; కి, కు ; న. పయి పదింటినే ప్రత్యయములని చెప్పవచ్చును. వీనికిఁ బ్రత్యేక ప్రయోగయోగ్యత లేదు. వీని చరిత్రమును గ్రమముగా నూహింతును. డు, ము, వు, లు, అనువాని చరిత్రము తుట్టతుదికి విడిచి, ని, ను, ల ; కి, కు ; న అను వానినిఁ బరిశీలింతము. ల యనునది లుప్రత్యయవికారము. ని, ను, న్ అను మూఁడును నొక్క నకారముయొక్క భిన్నరూపములని ముందు ద్రుతసందర్భమునఁ దెల్పితిని. నన్నయభాషయందు ఈ నువర్ణకము 2, 3, 5, 7 విభక్తుల యర్థములయందు వాడఁబడినట్లు నిరూపించితిని. అట్లే కి, కు యనునవి యభిన్నములనుట స్పష్టముగదా.[22] ఈ కువర్ణకము ఏడు విభక్తుల యర్థములయందును నుపయోగింపఁబడినట్లు నన్నయప్రయోగముల నుదాహరించితిని. కాఁబట్టి నన్నయకాలమునకు విభక్తు లనందగినవి యీ కు, ను వర్ణకములు మాత్రమే. పయి యేడు విభక్త్యర్థములలోను కువర్ణకము వాడిరి, యనఁగా కువర్ణకము ఎల్ల సంబంధములను బోధించునని యర్థము స్పష్టమగుచున్నది. తెనుఁగున కు, ను, న అను మూఁడిటిని ప్రత్యయములుగా గ్రహించి యీ ప్రత్యయములను సంబంధ సామాన్యబోధకములుగా నిరూపించి యూరకుండుట యొకపద్ధతి.

సంస్కృతవ్యాకరణమునందు విభక్తివిన్యాసమును, వాక్యపద్ధతియును విచారించుచుఁ గ్రమమున ప్రకృతి ప్రత్యయముల సంబంధమును, శబ్దార్థముల యను బంధమును వైయాకరణులు విచారింప దొరకొనిరి. కర్తృ, కర్మ, క్రియలయొక్కయు విచారణ జరిగినది. ఇదియంతయును బదవిభజనమును, భాషాస్వభావమును

[22] బా. వ్యా. ఇకారంబుమీది కు, ను, వు, క్రియావిభక్తులమీది యుత్వంబున కిత్వం బగును.

మాత్రము నిరూపించుటతో నంతమంద లేదు. పయిఁవానిని గుఱించిన తర్కము, వేదాంతము, స్ఫోట మొదలయిన విషయములలోనికి దిగి తుదికి దిక్కాలాద్యన వచ్ఛిన్నంబయిన పరబ్రహ్మవిచారమునందే లీనమయిపోయినది.

తెనుఁగువ్యాకరణమున కట్టి విచారణగాని, యందలి యా విచారణకుఁ బునాదులయిన ప్రకృతి ప్రత్యయ పద్ధతిగాని, విభక్తిరూపకమయిన సంబంధవిశేషము గాని అవసరములేదు గావున కేవల భాషాలక్షణమును అసంకీర్ణమార్గమున నిరూపించి యుండవచ్చును.

## 3. డుప్రత్యయ చరిత్రము

డు, ము, వు, లు అనునవి ప్రథమావిభక్తి ప్రత్యయములని యాంధ్ర వ్యాకరణములన్నియు నంగీకరించినవి. ఇవి ముఖ్యముగాఁ దత్సమప్రకరణమునఁ బనికివచ్చునవి. సాధారణముగా నాచ్ఛికపదములు స్త్రీసమంబులును, క్లీబ సమంబులును నగు నను చిన్నయసూరిపల్కును ముం దుదాహరించితిని. అనఁగా ఆచ్ఛికములయిన మహత్తులతుదిని డుప్రత్యయము రాకుండుటయే ఫలము. ఈ విషయము ముందు ప్రాతిపదికస్వరూపమును నిరూపించునపుడు తెలుపఁబడినది. 'మనుమఁడు, కృష్ణుఁడు, శంభుండు, మగండు' అను శబ్దములతుది నున్న 'అండు, అఁడు, ఉండు, ఉఁడు' అను భాగములలోని సమానాంశమే యీ 'డుఙ్' వర్ణకము. ఇది వైయాకరణులచేఁ బయి శబ్దములనుండి యాహరింపఁబడినది. నన్నయకు ముందుండిన తెలుఁగు అను ప్రకరణములో శాసనములనుండి గ్రహింపఁబడిన రూపములను బరిశీలించినచో నేఁటి డుప్రత్యయమునకుఁ బూర్వరూపము 'న్టు' అనునది యని తేలును. 'వాన్టు', 'మగన్టు', 'మదవున్టు' మొదలయిన యాచ్ఛిక పదములను, 'నాయకున్టు', 'గోత్రున్టు' మొదలయిన తత్సమపదములయందును ఒక రూపమే గనుపట్టుచున్నది. ఈ 'న్టు' వర్ణమే కాలక్రమమున 'ణ్డు'గా మాఱినది. రేఫ టకారములకు జన్మస్థాన మొక్కటియే యని ముందు నిరూపించితిని. ఈ నకారమునకును, రేఫమునకును సంయోగము గలుగుటచే డకారము జనించి నది. రేఫము నుచ్చరించునపుడు దంతమూలములతో నొరపిడి గలిగి యా యొరపిడి యొక్క ప్రథమభాగమునకు అనునాసికమగు నకారముతో సంయోగము గలుగుటవలన నా ప్రథమభాగమునందలి టకార సదృశోచ్చారణమునకు నాదత గలిగి డకార మేర్పడినది. అప్పుడు వాన్టు = వాండ్రుగా మారుచున్నది. డకార రేఫములు సమీకరణము నొంది నకారము ణకారము కాఁగా వాణ్డు అనురూపము గలుగుచున్నది. డకారము మూర్ధన్యమగుటఁ బూర్వ నకారము ణకార మగుటలో వింతలేదు. వైయాకరణులచే ప్రత్యయాంతరముగా నంగీకరింపఁ బడకపోయినను తెనుఁగున మహద్బహువచనప్రత్యయముగా రువర్ణ మున్నట్లు స్పష్టము కాకపోదు. మీరు, వారు, తమరు, నెయ్యురు మొదలయిన శబ్దము

లనేకములు గలవు. వీనియం దెల్లెడలను రువర్ణమే ప్రత్యయము. ఇంతియగాక అరవమునను, గన్నడమునను అవర్, ఇవర్ (తమి); అవరు, ఇవరు, (కన్న) అను రూపములవలెనే రేఫాంతములే మహద్బహువచనములు. ఈ రువర్ణమే 'వాణ్ణు' మొదలయిన శబ్దముల తుదనున్న రువర్ణము అని యూహించుట సులభము. అట్లయినచో ఏకవచనముపయి బహువచనప్రత్యయ మేలవచ్చె నని యడుగవచ్చును. బహువచనప్రత్యయము గౌరవార్థకముగ పూజ్యతయందు గలుగుచుండును. కాలక్రమమున దాని యర్థము మఱుగుపడి యేకవచనము అను భ్రాంతిని మఱియొక బహుమానార్థక ప్రత్యయము చేరుచుండును. ఇది యనాదిగా నుండిన సంప్రదాయము. ఈ క్రింది యుదాహరణమును జూచునది.

రామశబ్దము : 'రామ', 'రాము' మొదలయినవి సామాన్యనామములు. రాజశబ్దభవమయిన రావు పూజ్యతకొఱకుఁ జేర్పఁబడును. రామారావు అయినది. కొంతకాలమున కది యేకవచనమాత్రమయి మఱల నొక గౌరవసూచకప్రత్యయము చేర్పఁబడును. రామారావుపంత్. తరువాత 'లు', ఆ తరువాత 'గాడు', దానికి మఱల బహువచనమగు 'గారు' (ప్రాచీనకాలములో 'గాడే' గౌరవ సూచకము). ఆ తరువాత 'అండీ'. ఇప్పుడు 'రామారావుపంతులుగారండీ' యని సిద్ధమయినది. పయి యుదాహరణమువలన నొక్కటి నిశ్చయముగదా! పూజ్యార్థక బహువచన మేకవచన మగుననుట. ఇట్లే 'వాణ్ణు', 'వీణ్ణు' మొదలయినవి యేకవచనములయి 'వాఁడు', 'వీఁడు' అని రూపాంతరితము లయినవని యూహించుట సులభము. నన్నయ వ్రాసిన భారతమున వాఁడు మొదలయిన డువర్ణాంత రూపములు పూజ్యార్థకములుగానే కొన్నియెడల నుపయోగింపఁబడినవనుట క్రింది యుదాహరణములనుబట్టి తెల్లమగుచున్నది.[23]

పయి రువర్ణము శాసనములయందు శకటరేఫముగా నున్నదిగదా, యిది యెట్లు బహువచన ప్రత్యయ మయినదని శంకింపఁ జనదు. 'వేటకాఱు', 'చెయ్వుఱు', 'ఐందఱు', 'చూపఱు' మొదలయిన శబ్దములయందు ఱువర్ణము గలదు. బా. వ్యా ఆచ్ఛి. సూ. 7, 10. ప్రాచీనకాలములో శకటరేఫము యొక్క వాడుకయు, రేఫములు తబ్బిబ్బుపడుటయు ముందు విపులముగా నిరూపించితిని. ఇట్లు బహువచనమయిన వాణ్ణు శబ్దము వాండ్రు అను కేవల బహువచన రూపముగాఁగూడ మాఱి వాడుకలో నున్నదనుట స్పష్టము. వాండ్రు అను బహువచనరూపమునుండి బహువచన రుప్రత్యయమును మఱల విడఁదీసి వాండు అను ఏకవచనరూపమునుగూడఁ బుట్టించి యుండవచ్చును. పయి పరి

---

[23] భాషాభేషజము- గిడుగు రామమూర్తి పంతులుగారు. పుట 110. వీరుఁడు, వీఁడు పాండవుఁడు వృష్ణికులోత్తములైన సీరి దైత్యారు లెరుంగకుండ ఆది 8. 199. దానవుల వీఁడ భేద్యుఁడై వధియించున్. అని అర్జుననిఁగూర్చి యింద్రుడు. అర. 1. 374 అయ్యరు, అయ్యంగారు, అవర్గళ్. పంతులు, రాయణింగారు, నాయినింవారు మొదలయినవి నేఁ డేకవచనములయి యితర గౌరవార్థక బహువచనప్రత్యయముల నెనయుచున్నవి.

ణామమంతయును భిన్నమండలములలో నేకకాలమునను భిన్నకాలములను నన్నయకు ముందే జరిగియుండవలె ననుట స్పష్టము.

ఇట్లు ఉ, రు వర్ణములు బహువచనార్థముగఁ జేర్పఁబడి కాలక్రమమున నా శబ్ద మేకవచనమయి యొకరూపమును, బహువచనమున మఱియొక రూపమును గలిగిన వేఱొకశబ్దము నుదాహరించుచున్నాను. 'కూంతు' శబ్దము. దీనినిఁగూర్చి ప్రథమైకవచనమున రువర్ణకంబగునని చిన్నయ సూత్రించెను.[24] ద్వితీయాద్యంగమున 'కూఁతు' అని యుండుటయే చిన్నయ యనుమతంబు, నన్నయ కభిమతంబు ననుట నిర్వివాదము. ఇందును ప్రాచీనశాసనములలో శకటరేఫమే బహుళముగా వ్రాయఁబడినది.[25] నన్నయభారతములో కూఁతున్, కూఁతును, కూఁతులు అను రూపములే వాడఁబడుచున్నవి. 'కూంతు' శబ్ద మేకవచనముగాఁగూడ ప్రథమా విభక్తియందు వాడఁబడినది. కాఁబట్టి ప్రథమైకవచనరూపము కూంతు అనుట యుక్తమే. దానినిబట్టి కూఁతురు, కూంతులు, కూతుళ్లు మొదలయిన రూపములు తరువాత గలిగినవి. కూఁతురు శబ్దమందలి రువర్ణము పూజ్యవాచకమయిన బహువచన మేకవచనమగుటఁ గలిగినదని సిద్ధాంతము. తెనుఁగున ద్వితీయాది విభక్త్యంగమును, ప్రథమైకవచనమును సమానము లనుటయును దీనిని బలపఱచుచున్నది. ఇట్లు రెండేసి రూపములు గలుగుట మఱల రుప్రత్యయ చరిత్రమున నుదాహరింపఁబడును. నేఁటి విశాఖమండలమున 'అప్పచెల్లెలు' అనుపదము సోదరి యను నర్థమున వాడఁబడుచున్నది. అప్పలును చెల్లెండ్రును అనుదానికి ద్వంద్వము చేసి మీ రెంతమంది అప్పచెల్లెండ్రు అని యడుగుదురు. అప్పచెల్లెండ్రు=తోఁబుట్టువు స్త్రీలు. దీని కేకవచనముచేసి అప్పచెల్లెలు=సోదరి యను నర్థమునఁ గ్రొత్తపదము కల్పింపఁబడినది. ఇట్లే 'అన్నదమ్ముఁడు' కూడ గలిగినది.

పయి విచారణవలన 'వాన్డు', 'మగన్డు' మొదలయిన శబ్దములలోని రేఫము బహువచనప్రత్యయము అని యంగీకరించినచో ప్రాచీనైకవచనరూప మెట్లుండెనని యడుగవచ్చును. ఆ ఉువర్ణకము పోఁగా మిగిలిన మగన్, వాన్, సత్యాదిత్యన్, మొదలయిన శబ్దములే ప్రథమైకవచనము లయియుండక తప్పదు. ఇట్లుండె

---

[24] కూఁతు శబ్దము ప్రథమైకవచనమున రువర్ణంబగు. కూఁతురు, కూఁతులు, కూఁతురులు, కూఁతుళ్లు, కూఁతురిని ఇత్యాదిరూపంబులు గ్రామ్యంబులని యెఱుంగునది,

[25] నన్నయ్యకుఁ బూర్వశాసనము. నెం. 401-(1940 సం.) సిల్లాకున్తు, కున్తుఉ, కున్తులు అను మూఁడు రూపములును ఒక్కదానియందే గలవు. కాలము సుమారు (క్రీ. 850), IV వాల్యూం (ద, హి. శా.) దీనియం దనేక శాసనములలో నన్నయనాఁటివానిలోఁ గ్రింది రూపములు గలవు. శా. సంఖ్య 1010, కుంతుఉ కుపమ (1015), కూంతుఉ జయమ, కూంతుసరియ పోల్పం గాంత లెందు అని సోమలదేవిశాసనము, నెం. 1007 (కాలము క్రీ. 1065) ఇది సమానరూప మనవచ్చును. మ్రిగావతి కూతుకోక [వెం] మ. వా, V ద. హిం. దే. శా. 1022. కాలము (క్రీ. 1129)

ననుటకుఁ బయి యూహమాత్రమే ప్రమాణమూ లేక యింక నేమయినఁ బ్రమాణములు గలవా యని యడుగవచ్చును.

శ్రీ మహేన్ద్రిన్, చామియన్, శ్రీ త్రిభువనాదిత్యన్ మొదలయిన రూపములు నన్నయ్యకుఁ బూర్వపు శాసనములలో నుండినట్లు ఉదాహరించితిని. ఇంత మాత్రమేగాక తుదిని ఉవర్ణము చేర్పఁగా నేర్పడిన మల్యభణ్డను అను రూపము గూడ నుండినట్లు పయిచోటిలో ఉదాహరించితిని. అరవమునను, గన్నడమునను నేఁటికిని బ్రథమైకవచనమున మహద్వాచకము రామన్, రామను అనునట్లు నకారాన్తముగానే యున్నది. మఱియును మహద్వాచకముయొక్క ద్వితీయాద్యంగము నకారముతోనే రాముని, కృష్ణుని, వాని మొదలయిన రూపములతోనే కనుపట్టుచున్నది. రామన్, కృష్ణన్, రామను, కృష్ణను మొదలయిన రూపముల మీద ఇవర్ణము చేర్చుటచే ద్వితీయాది విభక్త్యంగ మేర్పడిన దనుట నిస్సంశయము. ద్వితీయాది విభక్త్యంగముననే ప్రాచీనరూపము గనుపట్టుట సాధారణమని ముం దొకసారి చెప్పితిని. ఇది సత్యమనుటకు నేఁటి శబ్దపరిణామమును జూచునది. వానిని మొదలయిన ప్రాచీన సాధురూపములు సాగరప్రాంతపు వాడుకలో భ్రష్టము లయినవి. నేఁడు వాఁడు అను ప్రథమైకవచనమును ప్రాతిపదికముగా భావించి ఇప్రత్యయమును జేర్చి వాడిని = వాడ్ని = వాణ్ణి, వీడిచేత,[26] వీడినుండి = వీణ్ణుండి, వాడిదగ్గఱ, దేముడిదగ్గఱ, వాండ్లు = వాళ్లు మొదలగు రూపములేర్పడుచున్నవనుట యెల్లరకును దెల్లమేగదా ! నేఁటి ద్వితీయాది విభక్త్యంగము డువర్ణమునుండి యెట్లేర్పడినదో యట్లే నాఁడును నకారాన్తములయిన రామన్, రాముని మొదలగు రూపముల నుండి ఇవర్ణము చేర్చుటచే రామని, రాముని మొదలయిన రూపము లేర్పడియుండెనని యూహించుట మిక్కిలి సులభము పయి విచారణమునుబట్టి ప్రాచీనమయిన మహద్వాచక ప్రథమైకవచనాంతము నకారమనుట సిద్ధాంతము.

డుప్రత్యయ మెట్లేర్పడినదో పయిని నిరూపింపఁబడినదిగాని యిట్టి డుప్రత్యయము సంస్కృతప్రకృతులపై నధికముగా వచ్చుటకును దెనుఁగుశబ్దముల పయిని రాకుండుటకును హేతువు నూహింపవలయును. అట్టి డుప్రత్యయము చేరునప్పుడు ప్రకృతిలో గల మార్పులనుగూడ నిరూపింపవలయును. దేశ్యశబ్దముల యందు లింగబోధకప్రత్యయములు చేరుట చాల నరుదని ముందే నిరూపింపఁబడినది. సంస్కృతపదములు నన్నయచే గ్రహింపఁబడి కావ్యరూపమున నంగీకరింపఁబడుటకు ముందు సుమా రొక వేయి సంవత్సరముల కాలము ఆ పదములు జనుల నోళ్ళలోఁ బడి నలుగుచుండి రూపాంతరము లగుచుండె ననియుఁ, బయి చరిత్రమంతయు నీ వేయి సంవత్సరములయందలి పరిణామ మనియును పాఠకులు తప్పక జ్ఞప్తియందుంచుకొనవలయును. సంస్కృతపదములయందు లింగవిభజనము బాగుగా

[26] ఇట్టి రూపములు క్రీ. వె. 1133 నాఁటికే యుండెను, దణ్డనాయకుడి కొడుకు ద. హి. శా. IV. 1109.

నెలకొనియుండుట పుంలింగపదములను వేఱుగా నిరూపించి గ్రహింపవలసిన యవసరము తెలుఁగువారి కేర్పడినది. అన్ని ద్రావిడభాషలందును నామముల తుదిని, సర్వనామముల చివఱను, క్రియావిభక్తి ప్రత్యయములకొనను అన్, అను, అం అనెడి భిన్నరూపములుగల శబ్దము చేర్పఁబడుచునే యుండినదనుట నిర్వివాదము.[27] ఇట్టి మహద్బోధకమయిన అన్ ప్రత్యయము చేర్చుటచేతనే సంస్కృత పుంలింగ శబ్దములయందలి మహత్త్వమును నిరూపించుట తెనుఁగువారి మార్గము. తెనుఁగు నామములపయి దీనిని చేర్పవలసిన యవసరము తక్కువ. కాఁబట్టి తత్సమముల పయిని డుప్రత్యయ మధికముగాను, తెనుఁగుపదములపయిని డుప్రత్యయ మల్పము గాను జేర్పఁబడుచు వచ్చినది. మగాదులు, బల్లిదాదులు, కయిరాదులు అను గణములుమాత్రమే చిన్నయసూరి నిరూపించెను.

నన్నయకు ముందుండిన ప్రాచీనశాసనములలోని (క్రీ. శ. 600-1000) పురుషనామములను ముందు జేర్కొంటిని. "బోటిమ, కడెయ, కొండ, (ఆచార్య) త్యాక్కియ, విద్దమయ్య, బొద్దియ, అయ్యపోటి, కాటి(శర్మ), మునియ, గుణ్డమయ్య, గొబ్బడి" మొదలయిన పేర్లు పురుషులవి. నన్నయకాలమునను, తరువాతను వాడుకలోనుండిన తెనుఁగు పురుషనామములు. "గొడవుకామె, దాడెపోజు, కోటనాగ, పల్లెదామ, గోకనసూర, గడియనబూమ, వేమక ఎఱియ, కొమ్మ ఎఱియ, పాదఱబొల్ల, తంత్రపాలవైదన, కామకుప్ప, గసడకొమ్మ, కాపనకుంట, మునియన చెఱువు, సంక్యవెగ్గడ, మావెన, మాదెన, అంగరేకకాపె, తెలుకుల కొమ్మన గడియనలు, కూంతాండి, నూంకాండి, యాచకమారబోయు కొడుకుగండె, దేవ (భట్లు), అన్యె (భట్లు), ఎఱ్ఱె (భట్లు), పోతె (భట్లు), అప్పన (భట్లు)" వీనియందు భట్లు పూజ్యార్థకము అనుట స్పష్టము. ఇట్లు తెనుఁగున మహద్వాచకము లన్నియును డుప్రత్యయము లేకయే వాడఁబడుచుండినవి. కావుననే డుప్రత్యయము తెనుఁగున నేర్పడుటయు, మిక్కిలిగా వాడఁబడుటయు సంస్కృతముయొక్క ప్రభావ మనుటలో వింతలేదుగదా !

నేఁటి సంస్కృత డుమంతములగు శబ్దములు, కేవలము డుమంతములు గానే వచ్చెనా ? మఱియొక రూపములేదా ? ఇంతమంది ప్రజలు ఇంత విశాల మయిన తెనుఁగుదేశమున నొక్కరీతిగానే యీ పదములను గ్రహించుట యెట్లు సంభవించెనని యడుగక తప్పదు. దీనికిని సమాధానము శాసనస్థభాషను, గ్రాంథిక పదములను బరిశీలించినచో స్పష్టపడక తప్పదు. నన్నయకుఁ బూర్వశాసనములలోని యీ క్రింది రూపములను బరిశీలించునది.

---

[27] అరవము. అవన్=వాఁడు, రామన్=రాముఁడు, వందవన్=వచ్చినవాఁడు, వందాన్=వచ్చినాఁడు. కన్నడము. అవం=అవను, రామం=రామను, బందవం=బందవను, బందా=బందానె.

పాతకు (నెం. 364-1920), పోర్ముఖరామ (నెం. 384-1904)
కామినీ బొజ్జగమార్తణ్ణ (నెం. 342-1920)
గొణకె నల్లాత (చాళుక్యభీముని ధర్మవరపు శాసనము)
పణ్డరంగు (అద్దంకిశాసనము)
రామణ్డు (నెం. 342-1922) (నెం. 839-1922)
అపిమనగఙ్గు (అభిమానగంగః) (నెం. 811-1917)
నన్నయ తఱువాతికాలపు శాసనములలోని రూపములను బరిశీలించునది.

దేవడు (క్రీ. వె. 1277) గోపాలదేవని కూంతుఱు (క్రీ. వె. 1272) హరిహర నాథనికి (క్రీ. వె. 1430) మార్బలభీమ (క్రీ. వె. 1202) (తెలింగానాశాసనములు) భీమనాథని పెట్టిన (క్రీ. వె. 1132) రాయపనాయండు (క్రీ. వె. 1175) నాగదేవండు (క్రీ. వె. 1131) భీమండు (క్రీ. వె. 1168) సోమని (క్రీ. వె. 1133) దత్తామాత్య సోమండు (క్రీ. వె. 1146).

ఈ రూపములు ద. హిం. శా. IV, V సంపుటములలోనుండి గ్రహింపఁబడినవి. ఇవి సామాన్యములుగాన శాసనసంఖ్య నిరూపింపఁబడలేదు.

వ్యాకరణముచేత నంగీకరింపఁబడి ప్రమాణగ్రంథములలోని కెక్కిన యీ క్రింది శబ్దములుగూడఁ బరిశీలింపఁదగును.[28]

'వృద్ధు, నీచు, మూర్ఖు, గృహస్థు, చార్వాకు, అసుర, దూత, యోధ, శుంఠ.' పయిపదము లన్నియును సంస్కృతమున అకారాన్త రూపములే. వీని కెన్నివిధములయిన రూపము లుండుటకు వీలో యన్నిరూపములును భిన్నకాలములలో నుండినవనుట స్పష్టము. ఉదాహరణమున కొక్క రామశబ్దమును గ్రహింపవలెను. దానికిఁ గలుగఁదగిన రూపములు — రామ, రాము, రామన్, రామున్, రామన్టు, రామున్టు, రామండు, రాముండు, రామఁడు, రాముఁడు. ఇవి పది విధములయిన రూపములు. నన్నయ భాషాసంస్కారము చేసి తన భారతమును రచించుటకుముందు భిన్నభిన్న మండలములలోఁ, గొన్ని యేకకాలమునను, గొన్ని భిన్నకాలములను బయిరూపములవంటి రూపములన్నియు వాడఁబడుచుండెననుట నిస్సంశయము. అందు ప్రాయికముగా అకారాన్తములకు రాముడు వంటి ప్రథమావిభక్త్యేకవచనరూపము నంగీకరించుటవలనను, వైయాకరణులు దానిని గ్రహించుటను, నదియే వ్యవహారమున బహుళమగుటను నిలిచినది. తక్కినవి నశించినవి. ఇంకొకవిషయ మేమనఁగా నిత్యవ్యవహారమున సంస్కృతమునందలి అకారాన్త మహద్వాచకము లేకొంచెమో వాడంబడుచుండునుగాని నన్నయ తన గ్రంథమున వాడిన సంస్కృతమునందలి అకారాన్త ప్రకృతు లన్నియును వాడుకలోనికి వచ్చియుండెనని యెవ్వరు ననలేరుగదా! కొన్నిరూప

[28] వృద్ధాదుల డుఙ్లునకు లోపంబు విభాషనగు. బా. వా, త. 56, 60, 61. సూ.

ములనుండి పద్ధతిని గ్రహించి దానిచొప్పునఁ దక్కినశబ్దముల నన్నిటిని దన కనువు పడినవానిని వాడెనని గ్రహించుట యుక్తిసహము.

ఇఁక రామశబ్దమునుండి రాముఁడు ఎట్లు వచ్చెననుట స్పష్టము. రామ = రామన్ = రామన్టు = రామున్టు = రాముండు = రాముఁడు. నడిమి అకారము ఉకారముగా మాఱుట ఉకారముయొక్క యాకర్షణమువలన జరిగినది.

ఇట్లు డుప్రత్యయము తత్సమములమీదమాత్రమే యేర్పడలేదు. దేశ్య శబ్దములగు మగఁడు, మనుమఁడు, తమ్ముఁడు మొదలయిన కొన్నిశబ్దములమీద నీ డువర్ణముగాని, దానికిఁ బూర్వమయిన అన్ ప్రత్యయముగాని చేరినతరువాతనే వాని ననుసరించి సంస్కృతములపయికిం బ్రాకినది యని యంగీకరింపక తప్పదు. తెనుఁగులోని యభ్యాసముల చొప్పుననే సంస్కృతపదములు ఆంధ్రములోనికి ఆ ప్రత్యయములతోనే వచ్చినవని యంగీకరించుట తప్పదు. ఇట్లు డుప్రత్యయము స్థిరపడినతరువాత బల్లిదుఁడు మొదలయిన మఱికొన్ని దేశ్యశబ్దములు పయివాని సామ్యమున నేర్పడియుండవచ్చును.

## 4. ముప్రత్యయ చరిత్రము

అచ్చ తెనుఁగు శబ్దములు తఱుచుగ స్త్రీసమంబులును, క్లీబసమంబులును ననుట చేత వీనియందుఁ గొన్నిశబ్దములు ముపర్ణాంతములు సాధారణముగా నున్న వియే యనుట నిస్సంశయము. వేము, పాము, కనుము మొదలయినవి. ఈ ము వర్ణకమునకు నేఁడు వాడుకలోనున్న రూపములు ము, ంబు, మ్ము అనునవి. ఈ మూఁడు రూపములును వనము, వనంబు, వనమ్ము అనునట్లు సంస్కృతప్రకృతుల పయిని వచ్చును. తెనుఁగుశబ్దములపయి నిట్లిన్ని వికల్పరూపములు లేవు. పాము, వేము, రూపములే గలవు. పాంబు, పామ్ము, కనుంబు, కనుమ్ము అను రూపములకు వాడుక లేదు. ఇట్టిభేద మెందుకు గలిగినది యని ప్రశ్నింపకతప్పదు. సమాధానము ముందు తెలుపఁబడును. పాము, వేము శబ్దములకు అరవమున పామ్బు, వేమ్బు అనునవియే సమానరూపములు. ఇవియే ప్రాచీనములనుట స్పష్టము మాత్రమే గాక క్రింద నిరూపింపఁబడు ప్రణాళికకును, చరిత్రకును అదుకుచున్నది.

నన్నయకు ముందుండిన భాషలోని తత్సమామహద్రూపములను నిరూపించితిని. "పట్టనబు, వక్రబు, వక్రంబు, రాజ్యమ్బు, కల్పట్టనబు, సాసనవు, దమ్మ్మఁకు, కయ్యామ్బు, సురలోకం (నెం. 342-1922). శ్రీ బ్రహ్మేశ్వరమ్ (నెం. 268-1922) బృన్దబు, క్రమబు, కలశబు, పాపబు, పట్టబు (యుద్ధమల్లుని బెజవాడ శాసనము) ఉద్యోగమ్ము."

ఈ పయిరూపము లన్నియును 6-వ శతాబ్దినుండి 9-వ శతాబ్దివఱకు నుండి నవి యనుట స్పష్టము. వీని తుదినున్న బు, మ్బు, మ్, ం, మ్వు అనునవి యన్ని

యును నేఁటి ముపర్ణక పూర్వరూపములే యనుట నిర్వివాదము. డు ప్రత్యయ మెట్లు తెనుఁగున స్వాభావికమయి యేర్పడి, తత్సమములపయి బహుళముగాఁ జేర్పఁబడి వాడుకలోనికెక్కినదో యట్లే ము ప్రత్యయమును ననుట యుక్తము. తెనుఁగునఁ గొన్ని మూలరూపములు నామములకును, క్రియలకును నాధారము లయినవి యుండెననుట నిర్వివాదము. అవియే తెనుఁగు ధాతువులు. అట్టి తెనుఁగు ధాతువులపయిఁ గొన్ని ప్రత్యయములు చేరుటవలన కృద్రూపము లేర్పడినట్లు కృదంతప్రకరణమునుండి తెల్లము కాఁగలదు. "పువర్ణకంబు మాయ్యాదులకగు"[29] మాపు, మేపు, ఉడుపు, కానుపు మొదలయినవి. ఈ ధాతువుల స్వభావము క్రియాప్రకరణమున విశదపఱుపఁబడును. ఈ పువర్ణకము ఒక్క తెనుఁగునకే గాక యితర ద్రావిడభాషల కన్నిటికిని సమానము. ప్పు, మ్పు, బు, మ్బు, పు, వు అను రూపములతో నియ్యది యందు గనుపట్టుచుండును.[30] ఇట్లు ప్రాచీనమయిన పువర్ణమే తెనుఁగు మూలధాతురూపములపయి జేర్పఁబడుచుండినదియే సంస్కృతపద ముల తుదినిగూడఁ జేర్పఁబడుచు వచ్చినది. ఇందలి పకారము బకారమగుటయు, ముందు నాసిక్యమేర్పడుటయు వింతలేదనియు, మిక్కిలి సామాన్యమనియు ముందు నిరూపింపఁబడియే యున్నది. కాఁబట్టి క్రమబు, క్రమంబు, రాజ్యమ్బు మొద లయిన ప్రాచీనరూపము లుండుట సంభవించినది. పువర్ణకమే ప్రాచీన మనుటకు హేతువు లనేకములు గలవు. ప్రాచీనద్రావిడమున బవర్ణము లేకుండుటయు, తెనుఁగున కృత్ప్రత్యయముగా పువర్ణమే నిలుచుటయు, పదాంతమందున్న పువర్ణము బు, వు వర్ణములుగా మాఱుట సహజమగుటయు, తెనుఁగు సమాసము లలో పుంపులు గల విశేషణరూపము లుండుటయు ననునవియే యా హేతువులు. పామ్బు అను అరవరూపముతో సమానమయినదియే తెనుఁగున పాము అయినది. కన్నడమున పాబు=పావు=హావు అని వువర్ణము ఏర్పడినది. క్రమబు, పట్టనబు మొదలయిన రూపములతరువాతనే క్రమంబు మొదలయిన రూపములు గలిగినవనుట యుక్తము. తుదినున్న బిందుపూర్వక బువర్ణము ఉచ్చారణమునఁ గాల క్రమమున మ్ము గా మాఱినదనుటకు శాబ్దికమగు నభ్యంతరము లేదు. ఇంకొక విషయ మేమనఁగా ప్రాచీనగ్రంథములలో ము విభక్తిక యతి మాత్రమే యుండినది. అనగా పు, ఫు, బు, భు వర్ణములకు విభక్తి మువర్ణముతోనే యతి. విభక్తి మువర్ణము 'పు, బు' వర్ణములతో నభిన్నముగావున నియ్యది యుక్తమే. కాల క్రమమున మువర్ణ సామాన్యమునకు యతి యేర్పడి ముకార యతి సిద్ధమయినది.

[29] బా. వ్యా. కృత్తు. సూ. 11.

[30] అరవము— మరబు—(వాడుక), సివప్పు (ఎఱుపు), ఎలుపు (ఎమ్ము), వుళిపు (పులుపు).

కన్నడము— { మునిపు (కోపము), కెంపు (ఎఱుపు), బల్పు (బలుపు)
తెరవు ఇరవు కరుబు (చెఱకు) }

దీని భావ మేమనఁగా ప్రాచీనకాలమున పు, బు వర్ణములుగా నుండిన ప్రత్యయమే నేఁటి మువర్ణముగా నేర్పడుటవలన నట్టి యతిని మాత్రమే ప్రాచీను లంగీకరించిరనుట.

ఇది యిట్లుండ తత్సమములయిన జ్ఞానమ్ మొదలగు అకారాన్తామహ ద్రూపములు తెనుఁగునకు రావలసివచ్చినది. హలంతశబ్దములు తుదిహల్లు ద్విరుక్త మగుటవలనను, ఉకారము చేర్పబడుటవలనను తెనుఁగునం జొచ్చుచున్నవనుట నిస్సంశయము. తటిత్తు, బుక్కు, వాకు, వాక్కు మొదలయినవి. ప్రాచీనకాలమున బ్రహ్మేశ్వరమ్, ఉద్యోగమ్ము అను రెండు రూపములు శాసనములలో నుండుట ట్లుదాహరించితిని. కాఁబట్టి జ్ఞానమ్, జ్ఞానమ్ము అనునట్టి రూపములు రావచ్చుననుటకు సంశయము లేదుగదా! ఇవి యన్నియును గలిసి కాలక్రమమున నేఁటి మువర్ణక మేర్పడి తత్సమ, దేశ్య సమానముగా నున్న ప్రత్యయ మయినది.

ఇఁక తెనుఁగుశబ్దములలో మాత్రము, ంబు, మ్ములు లేవా యని యడుగ వచ్చును. అంబు, అమ్మ, వమ్ము, చెంబు మొదలయినవి యనేకము లున్నవి. కాని యవి యన్నియు దేశ్యములు. అవ్యుత్పన్నములు. అవి ప్రకృతిస్థములే గావున ప్రత్యయములని భావింపక తీరదను నక్కఱ లేదు. వానిని విభజించి యేర్పరించు వారును లేరు. అవసరమును లేదు. ఏ యే పద మే యే రూపములతో నిలిచిపోయి నదో ఆ యా రూపములే యాచ్ఛికపదములకు ప్రకృతు లయినవి. పాము, వేము అనువాని కితరరూపములయిన పాంబు, వేంబు అనునవి భ్రష్టమయినవి. ఆ రూప ములు ప్రాచీనావస్థలు. సంస్కృతపదము లెప్పటి కప్పుడు ప్రకృతులనుండి యేర్పడ వలసినవి, ఉన్నతకావ్యాది ప్రయోజనము గలవి. ప్రకృతి ప్రత్యయ విభాగము కలుగుటచే వ్యుత్పన్నములు. కాఁబట్టి ప్రత్యయములయిన బు, ంబు, మ్ము లన్నియును గవులు రూపములను జేసికొనుటలో గణ యతి ప్రాసా ద్యానుకూల్యములకొఱకు వాడుచునే యుండిరి. కావున నీ మూఁడురూపములు గ్రంథములలో వాడఁబడుచున్నవి. ఆ కారణముననే తత్సమరూపములు మూఁడువిధములుగా నున్నవి.

## 5. వుప్రత్యయ చరిత్రము

ఈ వుప్రత్యయము, ఉకారాన్తములయిన సంస్కృతశబ్దములపైని గనుపట్టు చున్నది. తరువు, ధేనువు, మధువు, గోవు, గురువు (గురుడు).[31] అచ్ఛిక శబ్దంబుల తుదినిగూడ నియ్యది కనుపట్టుచునే యుండును. గాని వైయాకరణు లద్దానిని బయిరీతిని ప్రత్యయమాత్రముగా నిరూపింపలేదు. అనేకస్థలముల నయ్యది ప్రకృతిస్థమనియే భావింపఁబడుచున్నది. చావు, నోవు, అవు, మనువు, కొలువు మొదలయిన శబ్దములమీది వువర్ణకము కృత్ప్రత్యయంబని చిన్నయసూరి నిరూ పించెను. చిన్నయసూరి నిరూపించిన ధాతువులు చాల నల్పసంఖ్యాకములు. ఆతఁడు[32]

---

[31] బా. వ్యా. తత్సమ. 68, 69, 50. [32] బా. వ్యా. కృత్తు. సూ. 17.

నిరూపించిన ధాతువుల ప్రాచీనరూపములు నేఁటి రూపములకంటె భిన్నములు. ఈ విషయము ధాతుప్రకరణమున నిరూపింపఁబడును. ఈ వువర్ణమును కృత్ప్రత్యయ మనుటచేత నయ్యాది ప్రకృతిస్థ మనుటయే యుక్తము. కావుననే యితర ప్రత్యయముల ముందఱ దీనికి లోపము లేదు. ఆవు, పూవు, నూవు అను మూఁడు శబ్దములకును బహువచనప్రత్యయమగు లువర్ణకము పరమగునపుడు వువర్ణకము లోపించుచున్నది. వువర్ణ విరహితమయిన యేకాక్షరములే యా శబ్దముల ప్రాచీన రూపములని చెప్పుట యుక్తము.[33] కృత్ప్రత్యయ వువర్ణచరిత్రమునకును, ప్రథమా విభక్తి వువర్ణకచరిత్రమునకును గొంత భేద మున్నట్లు పయి నిరూపణమువలన స్పష్టము. కొంత సంబంధమును, తద్బిబ్బును గూడ నుండక తప్పదనుట నిస్సంశయము.

తెనుగు కృత్ప్రత్యయములగు పు, బు, ము లతో నర్థమునను ఆదిని ఇయ్యాది యభిన్నము. ముప్రత్యయచరిత్రమును నిరూపించినపు డిచ్చిన ప్రయోగ ములలో సాసనవు అను ప్రాచీనప్రయోగము నొకటి చూపించితిని. అదియే నేఁడు శాసనము, శాసనమ్ము, శాసనంబు అను మూఁడు రూపములలో నున్నది. వీనితుది ప్రత్యయములు బువర్ణముతో నభిన్నమని చెప్ప నక్కఱలేదుగదా! ఈ బువర్ణమును వుపర్ణముగా మాఱియుండె ననుట నిశ్చయము.

ఇఁక తత్సమముల తుదినున్న వుప్రత్యయము కేవలము ఉకారాన్త శబ్దములమీదమాత్రము వచ్చును. హాసగన్నడమున నీ వుప్రత్యయము ఉకారాన్తములపయినేగాక అకారాన్త తత్సమములపయినిగూడ వచ్చును. వచనవు, పుస్తకవు మొదలయినవి. ప్రాచీన కర్ణాటకభాషలో ప్రథమావిభక్తియందు ప్రత్యయము లేకయే గురు, వధు అను రూపములు వాడుచుండిరి. కాని వానికి సంధియందు నడుమ వకార మాగమముగా వచ్చుచుండినది. గురు+ఇన=గురువిన, వధు+ఇం=వధువిం. ఇట్లు సంధి నాపుటకు వచ్చిన వకారమే పయి వుప్రత్యయమునకు మూలము. భాష యజంతమగునపుడు అనుచితవిభాగమున గురువు+ఇన అను రీతిని విభజనమేర్పడి గురువు మొదలయిన రూపములు గల్గినవి. ఇట్టి రూపములే తెనుఁగునఁ గూడ వ్యవహరింపబడినవనుట స్పష్టము. ఇట్లనుటవలనఁ గన్నడమునుండియే యీ రూపములు వచ్చినవనుట గాదు. దాని సామ్యమును నుండవచ్చును. తెనుఁగున గురు+ఎక్కడ ఇత్యాది స్థలములయందును గురు+ఉ (ఎల్ల తెనుఁగు పదముల పయిఁ జేరిన ఉకారము) అను చోటనుగూడ నీ వకారము వచ్చియుండును. అట్టి రూపములు ఆచ్ఛికమై పదాంత్యమయిన వువర్ణకముయొక్క శ్రుతివలనఁగూడ స్థిరపడి యుండవచ్చును.

ఇఁక గురువు, గురుఁడు అను రెండు విధములయిన రూపములలో డువర్ణాంత రూపము నవీనమనియు, రాముఁడు మొదలయిన అకారాంతశబ్దముల సామ్య

[33] ఆ. భా. చ. పుట 915.

మున గలిగినదనియు నూహించుట సులభము. ఉకారాన్తశబ్దములకన్నింటికిని వువర్ణాంతత గలదు. డువర్ణాంతత కొన్నిటికి లేదు. కొన్ని శబ్దములకు మను, వటు మొదలయినవానికిఁ బ్రాచీనులు డువర్ణాంతత లేదనిరి. అట్లు చెప్పినవానిలోఁ గొన్నింటికి వటుఁడు అనురీతిని అర్వాచీనప్రయోగములు కనుపట్టుచున్నవి. అంతియేగాని మనుఁడు అని రూపము లేదు. మనువు అను రూపమే గలదు.[34] కాఁబట్టి వువర్ణమే ప్రాచీనమని చెప్పవలయును.

రాహు, బాహు[35] శబ్దములవయి వువర్ణకము లేకయే ప్రయోగింపఁబడుటనుబట్టి చూడగాఁ గొన్ని ఉకారాంతశబ్దములు కేవలము ప్రత్యయవిహీనముగా వాడఁబడుచుండెననుట స్పష్టము. శంభూ, జరత్కారూ మొదలయిన సంబుద్ధియందలి రూపములు పయియంశమును దృఢపఱచుచున్నవి. తరులు, ధేనులు, గురులు మొదలగు వికల్పరూపములలో వువర్ణకము లేకుండుట వువర్ణవిరహితైకవచనాంతములు వాడుకలో నుండినట్లు నిరూపించుచున్న దనవచ్చును. ఇంతియగాక వర్గము, వర్గువు, వర్గు, ధర్మము, ధర్మువు[36] మొదలయిన రూపములును అకారాన్తములయిన అమహద్రూపములపయికిఁగూడ నీ యభ్యాసము ప్రాకినట్లు నిరూపించుచున్నది. ధర్మువు అనునట్టి ప్రాచీనశాసనస్థ ప్రయోగమును ముందు ప్రకరణమున నిరూపించితిని. దీనినిబట్టి యా శబ్దము ప్రత్యయవిహీనముగా వాడఁబడుచున్ననుగూడ కవుల ప్రయోగమునకును, వైయాకరణుల లెక్కకును ఎక్కలేదనుట స్పష్టము. ఇట్లే మఱికొన్నియు నుండెనని యూహించుట నిర్బాధము.

ఈ విచారణమునుబట్టి తేలిన ఫలిత మిది. మొదట ప్రత్యయవిహీనముగా ఉకారాన్తపదములు ప్రథమావిభక్తిని వాడఁబడుచుండినవి. తరువాత అనుచిత విభాగమునను, కన్నడ సంపర్కమునను వువర్ణాంతము లయినవి. తరువాత ఉకారాన్త మహద్వాచకములు డువర్ణాంతములుగాగూడ అకారాన్తశబ్ద సామ్యమున నయ్యెను. ఆ తరువాతఁ గొన్ని అకారాన్తములయిన అమహత్తులును వువర్ణాంతము లయినవి. ఏకకాలమున నీ భిన్నజాతుల రూపము లన్నియు భిన్నశబ్దములలో వాడంబడుచుండెనని యూహించుట స్పష్టము.

## 6. లుప్రత్యయ చరిత్రము

లువర్ణంబు బహువచనంబు" అను చిన్నయసూరి వచనంబున నేఁటి తెనుఁగున బహువచనార్థమున వాడఁబడు ప్రత్యయము లు అనునది. నన్నయ

---

[34] మను వట్వాది శబ్దానాం నడుక్నిశ్చ ప్రయుజ్యతే. అథర్వణకారిక. వటువును, మనువును, బటువు డులకు బాసి పరగుచుండు. ఆం. భా. భూషణము.

[35] ప్రౌ. వ్యా. శబ్ద. సూ. 26.

[36] ప్రౌ. వ్యాకరణము. 25. సూ.

భారతమునుబట్టి చూచినను, చింతామణినిబట్టి పరిశీలించినను లువర్ణమే బహు వచన ప్రత్యయమనుట నిస్సంశయము. అనఁగా నన్నయకాలమునసనే బహు వచనప్రత్యయము లువర్ణముగా స్థిరపడినదనుట.

7, 8, 9 శతాబ్దములయందలి శాసనములు

మహారాజులాకు ; సంవత్సరంబుళ్ ; రట్టగుళ్ళు, పుట్ళు, ఆజ్ఞపట్టు, రాజుల ముట్ళు. కలిముడిరాజుల్ ; (జయసింహవల్లభుని శాసనములు 641 సం.) కాపుళు, గోళకోటి,[37] శివాప్పరాజుల్ ; భటారళకు ; సోముళు, గొరవళ్ ; చెరువుళు ; గవి లాళు, కన్న్యళను,[38] సకల శాస్త్రార్థపారగులు ; పండరంగులు, సమానులు, దమ్ముపులు (III విజయాదిత్యుని ధర్మవరపు శాసనము, అద్దంకి పండరంగని శాసనము) కొట్టంబుల్ ;

పనికొళు ; కొన్డుకళ్ ; పెద్దళ్, కొన్డుకలు ; పఞ్చకొళ్ ; పొనికన్డిఅముకొళు ; ముద్దకఞ్చికొళ్ (అహదనకర శాసనము)

బోళు ; రజులముడ్లు ; గవిలాళు ; వేడ్లుము ; (మంగి దొగరాజు లక్ష్మిపుర శాసనము.)

పయి ప్రయోగములు చాలవఱకు ఏడు మొదలు తొమ్మిది శతాబ్దముల లోనివి. అనఁగా నన్నయకు సుమారు 250 సంవత్సరములనాఁటివి.

పయివానిలో లు, ల్, ళు, ళ్ అను నాల్గును ప్రత్యయములుగా గన్పట్టు చున్నవి. ఇంతియగాక కళ్, కలు, కొళు, కొళ్ అంతమందు గల రూపములును గనుపట్టుచున్నవి.

నన్నయకుఁ బూర్వపుభాష యంతయు భిన్నరూపమున కేవల మాండలికా వస్థయం దుండెనని ముందు నిరూపించితిని. ఏకకాలమందు ఏకశాసనముననే భిన్న రూపములు వాడుటఁబట్టి యక్కాలమున నన్నియును నచ్చట నవ్యవస్థితముగా వాడంబడుచుండెననుట స్పష్టము. పయిరూపములనుబట్టియు, నన్నయకుఁ బూర్వ భాషనుగూర్చి యా ప్రకరణమున వివరించిన లక్షణములనుబట్టియు లు, ల్ అను నేఁటి బహువచనప్రత్యయములకు ళు, ళ్ అనునవి పూర్వము లనుట స్పష్టము.

పయి ళ్ ప్రత్యయ మెట్లు తెనుఁగునకు వచ్చె నను విషయమును విమర్శింప వలసియున్నది. అరవమునను, కన్నడమునను, మలయాళమునను చాలకాలము నుండి కళ్ అను నొక బహువచనప్రత్యయము కనుపట్టుచున్నది. ఇది నేఁటికిని మిక్కిలి ప్రచారములోనే యున్నది.

[37] సె. జి. శా. వాల్యూం. II. నెం. 67. కందుకూరు.

[38] డిటో. వా. III. నెం. 2. పొదిలి.

కురుక్కళ్ (అరవము), గురుగళు (కన్నడము), గురుక్కళ్ (మలయాళము), గురువులు (తెనుఁగు). ఈ కళ్ ప్రత్యయము అమహద్బహువచనప్రత్యయముగా తొల్‌కాప్పియనార్ చే అరవమున నిరూపింపఁబడినది. కాని దీనిని అమహద్వాచకముల తరువాత వాడియే తీరవలయు నను నిర్బంధము లేదు. మాడు వందన (పశువులు వచ్చినవి), మాడుగళ్ వందన (పశువులు వచ్చినవి).[39] అనఁగా కళ్ ప్రత్యయము క్రీస్తునకుఁ బూర్వమే ద్రావిడభాషలో బహువచనప్రత్యయముగా నుండెననుట నిస్సంశయము. అది మొట్టమొదట అమహద్బహువచనము మాత్రమయ్యుఁ గాలక్రమమున మహత్తులపయినిఁగూడఁ జేర్పఁబడుచుండెను. మహద్బహువచనము అర్ అనునది. (దేవర్, నరకర్) ఆ అర్ అంతమందుగల పదములపయినిగూడ (ఆచార్యర్‌కళ్) ఈ కళ్ చేర్పఁబడుచు వచ్చెను. ఇట్లే కన్నడమునను ప్రయోగములు గలవు. నృపతుంగడు. (క్రీ. శ. 850) కన్నడ కబ్బంగళ్ (కన్నడకావ్యములు), చిరంతనాచార్యర్‌కళ్ (చిరంతనాచార్యులు) అని ప్రయోగించెను. ఇట్లే ప్రాచీనశాసనములందెల్లను గన్నడమునను, అరవమునను ఈ కళ్ ప్రత్యయము కనుపట్టుచునేయున్నది. ఈ కళ్ ప్రత్యయము ద్రావిడభాష లన్నిటిలో బహువచనప్రత్యయముగా నుండినట్లూహించుట సులభము. కాఁబట్టి యీ కళ్ ప్రత్యయమే ప్రాచీనశాసనములందున్న పదములలోని ళ్, ళు ప్రత్యయమునకు పూర్వరూపమని యూహింపనగును.

అట్లయినచో నడిమి కకార మేమయినది యని యడుగవచ్చును. తెనుఁగున ఊనిక యొక్క స్థానము మాఱుటచేత ననేకస్థలములలో నక్షరములు పోయినట్లు నిరూపించితిని. (మొగము = మోము. సగము=సాము. స్వర్ణకారి=సొన్నారి. కన్యక=కన్నె). పయియుదాహరణము లన్నిటియందును క, గ లు పదమున లోపించినవి. అట్లే యీ కళ్ లోని కకారము లోపించియుండెననుట కభ్యంతరము లేదు. అట్టి కకారము లోపించెననుటకు నేఁటి వ్యావహారికతమిళమందు నిస్సంశయమయిన యుదాహరణము గలదు. పండితర్‌కళ్=పండితాళ్ (పండితులు), బ్రాహ్మణర్‌గళ్=పిరామణాళ్ (బ్రాహ్మణులు). కేవలము క, గ విరహితమయిన ళ్ మాత్రమే నేఁడు బహువచనప్రత్యయముగా నెల్లెడలను దమిళమున పయి పదములలో వినఁబడుచుండును. ఇట్టి లోపము తెలుఁగున సుమారు 1500 సంవత్సరములకు ముందే వచ్చిన ట్లూహింపనగును. ఆ ళువర్ణమే లు, ల్, ళు, ళ్ మొదలయిన రూపములతో ప్రాచీనమయిన తెనుఁగుశాసనములలో గనుపట్టుచుండును. ఈ సిద్ధాంతమునకుఁ బయిని నిరూపించినదిమాత్రమేకాక యింక ననేకములయిన యాధారములు గలవు.

(1) అహదనకర శాసనమున కళ్, కళు, కలు, కల్ మొదలయిన ప్రత్యయములు అంతమందుగల బహువచనరూపములు నిరూపింపఁబడినవి.

---

[39] P. S. S. Page. 117.

(2) ఇట్టి లువర్ణ మేర్పడినతరువాత కకారము లోపింపని యనేకస్థలము లందు పద మనుచితవిభాగమునకు గుఱియై పూర్వ కకారముగాని, దాని వికృతి గాని, ప్రకృతిలోని భాగముగా భావింపఁబడినట్లు అనేక శబ్దములనుబట్టి నిరూపింప వచ్చును. ఈ శబ్దముల ప్రకృతులు అరవ, కన్నడములలో క, గ లు లేకుండు నట్లు స్పష్టముగా గనుపట్టును.[40] ఇట్లు అనుచితవిభాగమువలనఁ గలిగిన శబ్దము లనేకములను జూపింపవచ్చును. ఏనిక, గొడుగు, నక్క, ముక్క, ఎలిక, పీనుఁగు మొదలయిన రూపము లిట్లే యేర్పడినవి.

(3) పయిరీతి ననుచితవిభాగమువలన మార్పడిన కొన్ని నకారాంతశబ్ద ములును గలవు. కలన్వాదులును, రేను, గోను శబ్దములును, కలఁకులు, కొలఁకులు, మ్రాఁకులు, రేఁగులు మొదలయిన బహువచనాంతరూపములను బొందు చున్నవి.[41] పయిశబ్దములకు రేను-రేఁగు, కొలను-కొలఁకు అనునట్లు రెండేసి యేక వచనరూపములును, ఒక్కటే బహువచనరూపమును సిద్ధము లయినవి. ఇట్లేర్పడు టకు హేతువు ప్రాచీనరూపము కొళమ్ అని యుండుటయే. ఇది తమిళ మలయా ళాది రూపములతో నభిన్నము. తమిళము కుళ్ తమిళములోని కువర్ణము తెనుఁగున కొ యగును. తుదినున్న మకారమునకు కకారము పరమయి కొళఁకళ్ అను రూప మేర్పడినది. తరువాతి పరిణామము కొలంకుళు=కొలంకులు కొలంకు+లు=కొలఁకులు. ఏకవచనరూపమున తుదినున్న మకారము నువర్ణ ముగా మాఱి కొలను అని యేర్పడినది. కాఁబట్టి ఏకవచనమున కొలను, కొలఁకు అని రెండురూపము లేర్పడుట సంభవించినది. బహువచనమున నొక్కరూపమే కొలఁకులు అనియే కలదు. కొలనులు అని లేకుండుట కిదియే హేతువు. ఇట్లే రేను, గోను శబ్దములు మొదలయినవానికిని ఊహించుకొనునది.

ఇట్లు కళ్ ప్రత్యయము లువర్ణముగా మాఱెనని యూహించుటకుఁ బయిని హేతువులను నిరూపించితిని.

కాని గోండీ, కుఈ, బ్రాహూఈ భాషలలో అమహద్బహువచనముగా క అనురూపమే యున్నదనియు, ఆ కవర్ణకము ళ్ వర్ణకముతోఁ గలిసి కళ్ అను పునరుక్తబహువచన మేర్పడియుండవచ్చుననియు జూల్స్ బ్లాకుగా రూహించిరి.

[40] C. G. D. Page 245. సంధి, కో, రామకృష్ణయ్యగారు, పుట, 19,

| అర. కన్న. ఏకవచనము | అర. కన్న. బహువచనము | తెనుఁగు | తెనుఁగు ఏకవచనము |
|---|---|---|---|
| ఈ | ఈకళ్ | ఈగలు | ఈఁగ + లు |
| ఎలి | ఎలికళ్ | ఎలికలు | ఎలిక + లు |
| నరి | నరిక్కళ్ | నక్కలు | నక్క + లు |
| ఆనై, (ఆనె) | ఆనైకళ్, ఆనెగళు | ఏనికలు | ఏనిక + లు |

[41] బా. వ్యా. ఆచ్ఛిక. సూ. 18, 19.

చరిత్రకును ప్రయోగములకును విరుద్ధమగుటవలన ఈ యూహ సరిగాదు. కళ్ ప్రత్యయమునకు ముందరికాలమున క గాని ళ్ గాని ప్రయుక్తమయి యుండినచో తొల్కాప్పియనారు మొదలయినవారు పేర్కొని యుందురు. కాఁబట్టి కళ్ నుండి లువర్ణ మెట్లేర్పడినదో, అట్లే తుది ళకారము జారిపోవుటవలన క యను బహువచనప్రత్యయ మేర్పడియుండెననుట యుక్తము.

క్రీస్తుపూర్వము ఒక్క కళ్ ప్రత్యయమే అమహద్బహువచనము. దాని రూపములు తెలుఁగులో 7-8 శతాబ్దముల వఱకును నుండినవి. అరవ కన్నడ మలయాళములలో నేఁడును నున్నవి. నేఁటి గోండీభాషలోని క ప్రత్యయప్రాచీనత తెలియవీలులేనిది. దీనికిని తొల్కాప్పియమునకును రెండువేల సంవత్సరముల యెడ మున్నది. బ్లాకుగారి కల్పన యంగీకరింపజాలను. గోండీభాషలోని క ప్రత్యయము కళ్ యొక్క పరిశిష్టమని నా యూహ. శాసనస్థప్రయోగములు, వ్యాకరణములు, వాని కాలక్రమమును పరిశీలించినచో కళ్ అనునది కళు, కుళు, గళు, గుళు, గొళు అనియు, అనుచితవిభాగమున, వర్ణపరిణామమున ళ్, ళు, లు, క, క్, గ్ అను రూపములనుబొంది భిన్న భాషలలో స్థిరపడినదనుట యుక్తము.

కళ్ ప్రత్యయముయొక్క పరిణామ మనదగు లుప్రత్యయము శాసనములలోఁగూడ గనుపట్టుచున్నట్లును నిరూపించితిని. ఇట్లేర్పడిన లు, ళు వర్ణములు ఇతర హలంతములుగా నుండి యజంతములయిన కొన్ని శబ్దముల యంతములతో జేరి యనేకములయిన మార్పులను బొందినవనుట స్పష్టము. ఆ క్రమమును గ్రింద నిరూపించుచున్నాను.

1. డి, డు, రు, లి, లు అంతమందుగల శబ్దముల తుదిని లువర్ణము చేర్చునప్పుడు పూర్వస్వరమునకు లోపము గలిగి రెండుహల్లులును సంయుక్తములయి సమీకరణమున ళ్లు, ళు, డ్లు అంతమందుగల రూపము లేర్పడినవి. ఈ ళ్లు వర్ణము మఱల వేఱుపడి యజ్భక్తి కలుగుటనో, లేక పూర్వాక్షరములగు రు, డు లు మారుటవలననో మఱల లువర్ణాంతరూపములును నేర్పడినట్లు నిరూపింపనగును. ఈ క్రింది యుదాహరణములను గ్రమముగాఁ బరిశీలించునది.[42]

లేడి = లేడులు, (లేడ్లు) = లేళ్లు.

గుడి = గుడులు, (గుడ్లు) = గుళ్లు.

త్రాడు = త్రాడులు, త్రాడ్లు = త్రాళ్లు = త్రాళులు.

పఁడు = పఁడులు = పండ్లు = పళ్లు=పళులు.

పిడికిలి = పిడికిలులు = పిడికిళ్లు = పిడికిళులు.

ఊరు = ఊరులు = ఊడ్లు = ఊళ్లు = ఊళులు.

---

[42] బా. వ్యా. అచ్ఛిక పరిచ్ఛేదము. సూ. 12-17. ఆ. భా. చ. పు. 902-915.

పయిరూపము లేర్పడుటలోని కాలక్రమమును బయివరుస స్పష్టపఱుచుచున్నది. గుళ్లు మొదలయిన రూపములకంటె గుడ్లు మొదలయిన రూపములు ప్రాచీనము లనుట శబ్దశాస్త్రము ననుసరించినదనుట నిస్సంశయము. శాసనములను బట్టి పరిశీలించినచో నీ యంశము స్పష్టపడును. పదునొకండవ శతాబ్దమునందలి శాసనములలోఁగూడ డ్ల వర్ణాంతరూపములు గన్పట్టుచున్నవి. నన్నయ వ్రాసిన నందంపూడి శాసనము. (క్రీ. శ. 1053) 'పొలగరుసున తాడ్లరేవ', 'పెక్కుగుడ్లు నిల్పి;' (పె. IV. నెం. 749. క్రీ. శ. 1146), వా. IV. నెం. 1015 క్రీ. శ. 1084. 'నంజుడ్లు', 'యెంగిడ్లెత్తి నీడ్లు తెచ్చి'. (వా. IV. నెం. 664; 1138. క్రీ. శ.) 'మంగడ్ల కొమ్మయ్య.' వా. IV. నెం. 675, క్రీ. శ. 1140.) 'కాహడ్లు.'

పయిరూపములు నన్నయకాలమునందలివియును, నాతనికిఁ దరువాతివియు నయినవి. నన్నయకుఁ బూర్వపు శాసనములలోని రూపములు.

మంగి దొగరాజు లక్ష్మీపురశాసనము. (క్రీ. శ. 675) కడువండ్లు; అడ్లు, వేడ్లుము; (వేయిగుడ్లును అని యర్థము.) జయసింహవల్లభుని శాసనము. (క్రీ. శ. 633.) 'అడ్లపట్టుసేను.' అమ్మరాజ విజయాదిత్యుని శాసనము. (950 సం.) మేరువు మడ్లు గోరగమడ్లు.[43] తూఱువ్వు నూడ్ల బాదెయ్య రట్టొడ్లుగుడ్లు ఎత్తిఇచ్చిరి. (నెం. 408-1904 ఏడవ శతాబ్దము.)

పయిరూపములనుబట్టి నన్నయకు ముందును వెనుకనుగూడ (గుడి=గుడ్లు; మడి = మడ్లు, నీరు = నీడ్లు; మంగలి = మంగడ్లు; ఎంగిలి = ఎంగిడ్లు; కాహలి = కాహడ్లు; తాఁడి = తాఁడ్లు; నంజుడు = నంజుడ్లు) డ్లువర్ణాంతరూపములు బహువచనములలో నున్నవనుట స్పష్టము. అవి యెప్పుడు ళ్లువర్ణాంతములుగాను, ళు, లు వర్ణాంతములుగాను మారినవి యని చెప్పుట కష్టము.

సుమారు ఏడవ శతాబ్దినుండియును ళ్లువర్ణాంత బహువచన రూపములును శాసనములందుఁ గనుపట్టుచునే యున్నవి. (నెం. 400 సం. 1904 క్రీ. శ.) 650 రట్టగుళ్లు; రట్టగుళ్ళు; (నెం. 306-1920.) చెఱువుళు, గుళ్లు (సుమారు 8-వ శతాబ్ది); (నెం. 267-1922) వక్కళ్ళ (9-వ శతాబ్ది.) (క్రీ. శ. 641) జయసింహవల్లభుని శాసనములు. రట్టగుళ్లు; (నె. జి. శా. వా. III. పు. 1152). వెయుగుళ్లువు; వెయుచెఱువుళు; వెయుగవిలాళు.

(ఈ ప్రయోగములు క్వాచిత్కములు. డ్లు అంతమందుగల రూపములు ళ్లువర్ణాంతరూపములకంటె చాల సాధారణములని చాల శాసనములను బరిశీలింపఁగా దోచిన యభిప్రాయము).

నేఁటి నన్నయభారతము ముద్రితప్రతియందు ళ్లవర్ణయుక్త ప్రయోగములు గలవు. ఒకళ్లొకళ్లకు (అర. II. 344), నీళ్లు (ఆది. IV. 86, 130), కాళ్లు (ఆది. V. 18, 220).[44] ఆ తరువాతి కవులప్రయోగము లనేకము లున్నవి.

[43] ఆం. భా. చ. పుట. 1325. [44] ఆం. భా. చ. పుట. 1378.

పయివిచారణవలనం దేలిన విషయ మేమనగా డ్లువర్ణాంతరూపములు నన్నయ కాలముననుం, అంతకుం బూర్వమునను బహుళముగా నుండినవి. ళ్లువర్ణాంతములు కొన్నిస్థలములలో నన్నయకుం బూర్వమునను, మఱికొంచె మధికముగా నన్నయ కాలముననుం, మిక్కిలి యధికముగా నన్నయతరువాతను వాడుచుండిన వనుటయే. నేఁడు ళ్లువర్ణాంతములే ప్రచారములో నున్నవి.

ఇఁక డ్లువర్ణాంతరూపములను దనకాలమున నుండినవానినే నన్నయ సాధించెను. ళ్లువర్ణాంతరూపములను దనకాలమున నుండినను నన్నయ యంగీకరింప లేదు. నేఁటి భారతపు ముద్రితప్రతులలోనివి నన్నయ యంగీకరించినట్లు నిరూపింపఁ జాలము. కావుననే చింతామణిలో "డలటాముదితాం తస్య చవాలుక్" అను సూత్రమున త్రాడులు, త్రాడ్లు అనురూపములనే నన్నయ సాధించెను; అను రీతిని సిద్ధాంతము చింతామణి విషయపరిశోధనమునఁ జేయఁబడినది.[45]

పయి యభిప్రాయమును గాదనుటకు బలమయిన ప్రమాణములు లేవు. అట్టి ప్రమాణములు లభించువఱకును దీని నంగీకరింపవచ్చును. పయిని చేసిన విచారణము వలని ఫలితమునకును, బయి యభిప్రాయమునకును వైరుధ్యము కనుపట్టదు.

(2) చిన్నయసూరి ఆచ్ఛికపరిచ్ఛేదమున "అద్విరుక్తంబులయినవానికే పయి ళ్లువర్ణము వచ్చున"ని సూత్రించెను. గ్రుడ్డు=గ్రుడ్డులు=గ్రుడ్లు, ఇట్లే తెడ్డు, దుడ్డు మొదలయిన శబ్దములకు బహువచనమందు తెడ్లు, దుడ్లు అను రూపములే యున్నవి గాని తెళ్లు, దుళ్లు మొదలయినవి లేవు. దీనికిఁ గారణ మూహించుట సులభము. గుడ్డు మొదలయిన శబ్దములయందున్న డ్డువర్ణము ద్విత్వము. అనగా దీర్ఘ మయిన హల్లు. ఇది లువర్ణము నెనయుటచేత డవర్ణము లఘుమాత్ర మయినది. ఇది మార్పులోని మొదటి యవస్థ. రెండవ యవస్థ డ, ల వర్ణముల సమీకరణము. మొదటియవస్థ మాత్రమే కలిగినది. రెండవ యవస్థ వచ్చుటకు మఱికొంతకాలము పట్టును. గుడి మొదలయినవాని బహువచనములకును, వీనికిని గల భేదము నిరూపించుటకునుగూడ మార్పులోని రెండయవస్థ రాకుండ నిలిచిపోయి యుండవచ్చును. రెండవ యక్షరమగు డ్డు పయిని గల యూనిక యీ మార్పును రాకుండ నిలిపినది. ప్రాసము అవసరమయినచోట నేఁటికిని ప్రాచీనరూపమే వాడఁ బడుచున్నది. "ఎళ్లాయికి ఎడ్లులేవు, మళ్లాయికి మడ్లులేవు" సామెత. మడి+లు= మడ్లు=మళ్లు. ఇదియే నేఁటి వాడుకరూపము.

(3) ఎద్దు శబ్దమునకు బహువచనము ఎడ్లు అని కలదు. ఇది యెట్లు వచ్చినదో నిస్సంశయముగాఁ జెప్పుటకు వీలులేదు.

ఎద్దు శబ్దమున కితర ద్రావిడభాషలలో 'ఎరుతు (అర; మల), ఎత్తి, ఎత్తు (కన్నడ), ఎరు (తుళు) అనియెడు రూపములు గలవు. ఎరుతు, ఎత్తు, ఎద్దు శబ్ద

[45] చింతామణి విషయపరిశోధనము. విష. 33, 34.

ములలో ఎరుతు ప్రాచీనరూపము. మిగిలినవి ఉలోపమునను, సమీకరణమునను ఏర్పడినవనుట స్పష్టము. తుది తువర్ణకము మూలధాతురూపమునకుఁ జేరిన ప్రత్యయమని తోచుచున్నది. ఎరు (ఎఱు) అను తుళు రూపమే ప్రాచీనతమము కావచ్చును. అప్పుడు ఎర్లు, ఎడ్లు అని యేర్పడుట చాల యుక్తముగా నుండును. నీరు=నీడ్లు, ఊరు=ఊడ్లు, వరి=వడ్లు మొదలయిన రూపములను జూచునది. ప్రౌఢ వ్యాకరణకర్త ఎడ్లు, దేవళ్లు, అను రూపములను సాధించుచు, ఎడ్డులు అను రూపము నుదాహరించెను. అట్లు ఎడ్డులు అను రూపమునుండికూడ ఎడ్లు అను రూపము గలిగియుండవచ్చును. ఎళ్లు అను బహువచనరూపముగూడ శ. ర. న. నంగీకరింపఁబడినది.

ప్రాచీనశాసనములలో ఇనుపయెడ్లు అను పదము చాల స్థలములలో గనుపట్టుచున్నది. ఈ పదమునకు అర్థము స్పష్టము కాలేదు.[46] ప్రాచీనకాలమున గొఱ్ఱెలు, మేకలు దేవాలయముదగ్గఱ నుండిన బోయలకు (బోలకు) ఇచ్చుచుండెడివారు. వారీ గొఱ్ఱెలను గ్రహించి దేవుని యఖండదీపమునకు నేయి పోయుచుండెడివారు. ఈ క్రింద నీయంబడిన శాసనభాగమునుబట్టి పయియర్థము స్పష్టము.[47] ఇనుపయెడ్లు అనగా గొఱ్ఱెలు. ఏడి శబ్దమునకు సంస్కృతమున గొఱ్ఱె యర్థము. (అరవము) ఆడు. ఏడి=ఏడ్లు=ఎడ్లు అయియుండవచ్చును. ఇనుప, అనునది ఈనుప అనఁగా ఈనునట్టి అని యర్థము తోచుచున్నది. అనఁగా ఆడుగొఱ్ఱెలు అను భావముగా నుండవచ్చునేమో అని యూహ. పయి వ్యుత్పత్తియే సూర్యరాయాంధ్రనిఘంటువు నందును (పుట 526) ఈయంబడినది. ఇనుప అనుదానికి ఈనుప అను రూపాంతరము కూడ నందే యీయంబడినది.

(4) ఔపవిభక్తికంబులగు లి, ల్లు వర్ణములు అంతమందుగల శబ్దములకు బహువచనంబు పరంబగునపుడు పూర్ణబిందు పూర్వక డువర్ణంబు బహుళముగా నగు—ఇల్లు=ఇండులు=ఇండ్లు=ఇళ్లు. " మద్య నిమ్నార్థకంబు లయిన కల్లు, పల్లు శబ్దంబులును, తెల్లు ప్రభృతి శబ్దంబులు ననౌపవిభక్తికంబులగుటఁజేసి వానికీ కార్యము లేదు" అని సూరి సూత్రించెను. ఔపవిభక్తికంబులయిన లువర్ణాంతముల కగు నీ కార్యము ఔపవిభక్తికంబులయిన, న్నువర్ణాంత శబ్దములకుఁగూడ ప్రాకినది. కల్లు (రాయి) శబ్దమునకు బహువచనమగు కండ్లు శబ్దమునకును, కన్ను శబ్దమునకును ముడికట్టిరి. శిలార్థకమయిన కల్లుశబ్దము దైనికవ్యవహారమున తిరుగలి, సన్నెకల్లు, ఓరుగల్లు మొదలగు సమస్తపదములలోనేగాని వ్యస్తపదముగా భ్రష్ట

---

[46] ఆ. భా. చ. పు 904,

[47] ద. హి. శా. వా. V, నెం. 63. కాలము క్రీ. శ. 1097, "పెట్టిన రెండు దివ్వెలకు విడిచిన యెడ్లు ౧౦౦. వీనిం జేకొనిపోయంగ్గలవాండు । రస్తుపుడ్డికాటియ బోఇనికొడ్కుమాదని వసమున విడిచిన గొఱ్ఱులు ౫౦. గుణ్డబోఇని అరంగని వసమున విడిచిన గొఱ్ఱులు ౫౦. లెక్కను రెణ్డు దివ్వలకు విడిచిన ఇన్పుఎడ్లు ౧౦౦.

మైనది. దాని స్థానమున రాయి శబ్దమే వాడుకలోని కెక్కినది. మద్యార్థక కల్లు శబ్దము సామాన్య ప్రచారము నందుటయుఁ బయి శిలార్థక కల్లు శబ్దముయొక్క భ్రష్టతకు హేతు వయినది. ఈ కల్లు ద్రవ్యవాచి యగుటచే బహువచనయోగ్యత యత్యల్పముగాఁ గలదు. కాఁబట్టి కన్ను, కండ్లు శబ్దములకు సంబంధము కుదిరినది. ఇట్లు కన్ను, కను శబ్దములకు కండ్లు, కళ్లు శబ్దములు బహువచనముగా నేర్పడినతరువాత నవయవవాచి యగు చన్ను, చను (ఔపవిభక్తికములు) శబ్దములకును చండ్లు, చళ్లు అను బహువచనరూపములు సామ్యమున నేర్పడినవి. ఇట్లే అవయవవాచియయిన పల్లు శబ్దమునకు సామాన్యమయిన బహువచనమగు పండ్లు, పళ్లు అను బహువచనరూపములనుండి పయి చన్ను, చను అనెడి యేక వచనరూపముల సామ్యమున పన్ను అను రూపముగూడ నేఁడు వాడుకలో వినఁబడు చున్నది. పల్లుశబ్దము భ్రష్టమగుచున్నది

(5) బా. వ్యా. తత్సమ పరిచ్ఛేదంబు 59 సూత్రము ననుసరించి స్వర్గివాచి దేవసుర శబ్దంబు లేకత్వ బహుత్వంబులం బ్రయోగింపఁబడును. దేవశబ్దమునకు ఏకవచనము దేవుఁడు, బహువచనము దేవులు అని యుండవలయును. కాని దేవీ శబ్దమునకును బహువచనరూపము దేవులే యగును. అప్పుడు స్త్రీవాచకంబున కును, బురుషవాచకంబునకును తబ్బిబ్బు పడుటవలన నర్థస్ఫురణమున సందిగ్ధత యేర్పడును. కాఁబట్టి దేవులు అను శబ్దమును మహద్బహువచనముగా నాంధ్రులు వాడరైరి. దేవుఁడు అను రూపమునకే దేవుళ్లు = దేముళ్లు అను వ్యావహారిక బహు వచనరూపములను వాడుచుందురు. దేవరు అను బహువచనరూపముపయిని మఱియొక లువర్ణము చేర్చి, దేవరలు = దేవళ్లు అను రూపమును గలిగింపగా నయ్యది కవిప్రయుక్త మయ్యెను.

ఇట్లు సురా శబ్దముయొక్క తత్సమరూపమగు సురకును, సురలు శబ్దముయొక్క యేకవచన రూపమునకును తబ్బిబ్బు పడకుండుటకయి సుర శబ్దము బహువచనమునందే ప్రయోగింపఁబడుచున్నది. అసురశబ్దమున కీ తబ్బిబ్బు లేదు గావున నేకవచనంబున వాడంబడినది. ఇట్లే దాసీ శబ్దమునకు బహువచన రూపము దాసులు అని రావలసియుండగా మహదర్థకమను భ్రాంతి నివారించుట కయి దాసీలు అనునట్టి వ్యాకరణవిరుద్ధరూపము లోకమున వ్యవహారములో నున్నది. ఇట్లే దాసుఁడు అను రూపము హరిదాసుఁడు మొదలయిన రూపము లతోఁగూడి యుండుటచే దానికి బదులుగా దాసీవాఁడు అను రూపము బయలు దేరుచున్నది.

(6) వికృతియం దికారాన్తములయొక్క ఉపోత్త మేత్వమునకు మాత్రమే ఉత్వము వచ్చుచున్నది. కలికి+లు = కలుకులు. ములికి+లు = ములుకులు. ఇది యుకారముయొక్క యాకర్షణశక్తి (Vowel Harmony) వలన గలిగిన మార్పని యూహించుట స్పష్టము. జిగులు, నిసులు ఇత్యాదులయందు పయిమార్పు రాదు.

పదాదినున్న జి, ని, మొదలగువానిలోని యూనిక పయియాకర్షణముకంటె నధికబలము గల దగుటవలన నీ మార్పు రాలేదు.

(7) రలడోపధ నవార్థాదుల యుపోత్త మేత్వంబున కుత్వంబు గలుగదు. పందిరి = పందిరులు, రాపిడి = రాపిడులు, తొమ్మిది = తొమ్మిదులు, ఇలి, ఇడి, ఇరి శబ్దములు ప్రాచీనధాతువులపయిఁ జేరిన ప్రత్యయము లగుటవలన సాధారణముగా నట్టి ప్రత్యయాదినున్న ఇవర్ణము భ్రష్టము కాకుండుటకయి యీ మార్పు వచ్చియుండుఁనని యూహింపవచ్చును. అట్టి ఇకారముపయిని ఊనిక యుండియుండవచ్చును.

ఇంక పందిరి, తొమ్మిది శబ్దములలోని రెండవ ఇకారము ప్రాచీనమయినదిగాదు. పందర్, పందల్ అనునవి ప్రాచీనరూపములని అరవ, కర్ణాట పదములనుబట్టి తెలియనగును. పదాంతమునఁ గ్రొత్తగా వచ్చిన ఇకారము యొక్క యాకర్షణమున నడిమిగా నొక ఇకారము వచ్చినది. అట్లే తొల్ + పది అను శబ్దముల కూడికవలన నేర్పడిన తొమ్మిది శబ్దమున నడిమి ఇకారము గూడ నాకర్షణమువలన నేర్పడిన దనుట స్పష్టము. ఇట్లు ఆకర్షణమున నవీనముగా నేర్పడిన యచ్చు తిరిగి వేగముగా మాఱదు. ఇంకొక యుదాహరణమును జూచునది. కత్తి+లు = కత్తులు. నడిమి ఉకార మాకర్షణమువలన నేర్పడుట స్పష్టము. దానికి కువర్ణకము చేర్చినపుడు ప్రథమనిమిత్తమయిన ఉకారము పోయిననుగూడ రెండవ ఉకారము నిలిచియే ఉండుటవలన కత్తులకు అను రూపము గలదుగాని కత్తిలకు అని యుండదుగదా!

సిబ్బితులు, జక్కినులు మొదలగు శబ్దములయందు ఉపోత్త మేత్వమునకు ఉత్వము రాలేదనియు, ఉరుడులు (ఉరిడి), గరుడులు (గరిడి) మొదలయిన శబ్దములలో ఉత్వము వచ్చినదనియు నిరూపింపఁబడినది.[48] వీనికిఁ బ్రయోగములేవి? లేక యుచ్చారణమే ప్రమాణమా? యను విషయము తేల్చుకొనవలయును. మిక్కిలి నవ్యరూపములలోఁ బయి లక్షణము లేర్పడుటలో వింతలేదు. ఇంతియగాక ఉపోత్త మేత్వమునకు ముందున్న ఇకారమునకుఁగూడ ఉత్వము గలుగుచున్నదని (అలుకుడులు, ఎనుముదులు) మొదలయిన శబ్దములుగూడ నుదాహరింపఁబడినవి.

పయి మార్పులు వచ్చుటకుఁగాని రాకుండుటకుఁగాని హేతువులు ఉచ్చారణ సౌకర్యము, సామ్యము మొదలయినవని యనేకపర్యాయములు నిరూపింపఁబడినది. ఒక మార్పు కొన్ని పదములలో బయలుదేరి యది యెల్లయెడలను దత్సదృశపదములకు వ్యాపించుటకు జాలకాలము పట్టును. అట్లగుటవలనఁ గొన్నిఁటిలో నీ మార్పు జరిగి కొన్నిటియందు నిలిచిపోవును. ఇందు వ్యక్తియొక్క యిష్టమును, ఆయా ప్రదేశమునందలి స్వభావమునుగూడ హేతువులు గావున పై సూత్రమయినను

[48] ఆ. భా. చ, పుట 399.

ఎల్లయెడల వర్తించుననుటకుగాని వర్తింపదనుటకుగాని వీలులేదు. కాఁబట్టి యిట్టి యపవాదము లెప్పుడును ఉండుననుటలో వింతలేదు. ఏదయినను కార్యము గలిగినప్పుడు హేతువు నూహించుట యుక్తము. తదభావమునకెల్లను హేతువు నూహించుట సాధ్యముగాదు, ఉద్దిష్టమును గాదు.

(8) అనేకస్థలములలో బహువచనప్రత్యయముపయి మఱల బహువచనప్రత్యయమగు లువర్ణము చేరుటయు గలదు. పూజ్యార్థమున నట్లు జరుగుచుండునని ముందు నిరూపించితిని. ఇట్లు బహువచనముపయి మఱియొక బహువచనప్రత్యయము స్వార్థముననే చేరుట సంస్కృతమునందును గలదు. దేవాస్ అను బహువచనాంతమునకు మఱల అస్ అను బహువచనప్రత్యయము చేర్చి దేవాసః అను రూపము వేదకాలమున నేర్పడినట్లు ప్రయోగములనుబట్టి శాస్త్రజ్ఞులు నిర్ణయించిరి. నీళ్లులు, పండ్లులు,[49] ముళ్లులు, విళ్లులు మొదలయిన రూపములు బాలసరస్వతి యుదాహరించెను. అవి యిట్టివే యనవచ్చును.

(9) కొన్ని లువర్ణాంతపదములు బహువచనములని భ్రమించి యనుచితవిభాగమున క్రొత్త యేకవచనరూపములు కల్పింపఁబడినవి. ఈ పదములయొక్క ప్రాచీనరూపములు అరవమునుండియుఁ గన్నడమునుండియుఁ దీసికొని పరిశీలించి నిరూపింపనగును. ఇట్టి పదములను నిరూపించుటలో జాగరూకత వహింపవలెను. తెమ్మెరల్ అనఁగ దక్షిణపువాయువు అని యర్థము. తెమ్బు = దక్షిణము. ఎరల్ = వాయువు, తెమ్బెరల్ = తెమ్మెరల్ = తెమ్మెరలు = తెమ్మెర+లు. ఇట్లే పదాంతమందు లకారపొల్లు గలిగి, తెనుఁగున లువర్ణాంతమయిన కొన్ని పదములు బహువచనములుగా నెంచఁబడి తుది లువర్ణము వేరుచేయఁబడినది. మిగిలినపదమే యేకవచనము. ఇట్లే కన్నడమున గుడిసలు, గుడుసలు, గుడుసిలు అను భిన్నరూపములతో వ్యవహరింపఁబడు నొకపదము గలదు. అది తెనుఁగు గుడిసెతో సమానార్థకము. ఇదియు అనుచితవిభాగమునఁ గలిగినదని చెప్పనగును (గుడిసె+లు). ఆంగ్లమునుండి వచ్చిన (Constable) కానిస్టేబుల్ అను పదము కనిస్టేపులు అని తద్భవ మయి కనిష్టేపు అను ఏకవచనరూపమును బొందినది. ఇదియును అనుచితవిభాగమే.

(10) లువర్ణము పరమయినపుడు ముందటి మువర్ణమునకు లోపము గలిగి దానికి ముందున్న స్వరమునకు దీర్ఘ మేర్పడును. వజ్రము+లు = వజ్రాలు. ఈ పద్ధతి నేర్పడిన రూపములు నన్నయ భారతభాగమున లేవు. కాని యా కాలమునందలి శాసనములలో గనుపట్టుచున్నవి.[50] ఇట్టివాడుక ప్రారంభించి కాలక్రమ

---

[49] బాలసరస్వతీయము. పుట 214. "అపి సంయుక్త సమాప్తౌ భూయోఽంతే లుః ప్రదృశ్యతే నామ్నామ్" బా. వ్యా. ఆ. సూ. 17

[50] ఆ. భా. చ. పుట—390. మిరియాలు (ద. హి. శా. V. 65, 66), కుంచాలు (IV. 1064, V. 68), గుండానకు (V. 1114) పదునొకండవ శతాబ్ద శాసనములు,

మున నభివృద్ధినొంది భాషలోని కెక్కినది. ఇది లవర్ణమును, నవర్ణమును బరమగునపుడుగూడ జరుగుచుండును.

(11) ఇట్లు పయిరీతి నేర్పడిన దీర్ఘము హ్రస్వమగుటయును, గొన్ని యెడల ఏకారముగా మారుటయుఁ గలదు. ముత్తేలు (యయా. పుట 7), కడేలు (యయా. పుట 16), బిడేన (యయా. పుట 17), కళ్ళేలు (రంగరా. III. 204), బల్లేలు (రంగరా. III. 200). ఇట్టివి వాడుకలో ననేకములు గలవు. వడియములు = వడియాలు = వడేలు. ఇట్లే కడియములు = కడేలు. ఇట్లేర్పడిన ఏత్వమునకుఁ బూర్వరూపమగు 'ఇయ' హేతువు. నామాంతరముననుగూడ 'ఇయ' ఎకార మగుచున్నది.

ఇట్లే చుట్టములు = చుట్టాలు = చుట్టలు. కుంచములు = కుంచాలు = కుంచలు. మీసములు = మీసాలు = మీసలు.[51]

(12) నెల యను శబ్దమువంటి లవర్ణాంతముల బహువచనములు (వాడుక) నెలలు = నెల్లు, కలలు = కల్లు, వలలు = వల్లు, తిలలు = తిల్లు. ఇట్టి వనేకములు ద్రుతోచ్చారణమున వాడుకలోఁ గలవు. కవిప్రయుక్తమైన నెల్లు శబ్దముమాత్రము గలదు. కాని దానిని లాక్షణికు లంగీకరింపలేదు. వారు దాని నంగీకరించి సూత్రించినచోఁ బయి రూపములన్నియుఁ బ్రామాణికములయి యౌవయవికమయిన 'అ' వర్ణము నష్టమగునని వారి యూహ యనుట స్పష్టము.[52]

ప్రాచీనద్రావిడమయిన కళ్ ప్రత్యయము అమహద్బహువచనమాత్ర బోధకమయ్యుఁ గాలక్రమమున నెట్లు మహద్బహువచనముగా మాఱి, లువర్ణమయి, నేఁటి కెట్లు రూపాంతరమయినదో సంగ్రహముగా నిరూపించితిని. అనేక స్థలములలో నది పదముయొక్క యంత్యభాగముతో గలిసి వర్ణాంతరముగా మాఱినది.

## 7. రువర్ణక చరిత్రము

ఈ రువర్ణమును దెనుఁగువైయాకరణు లెవ్వరును ప్రత్యయ పరిగణనమున నిరూపింపలేదు. బాలవ్యాకరణమున రుప్రత్యయాంతమయిన పదములను సాధించుటకయి లకారస్థానమున రేఫము విధింపఁబడినది.[53] ఈ రువర్ణము స్వతంత్ర ప్రత్యయమా లేక యాగమమాత్రమా? దీనిని ప్రత్యయమే యనుట యుక్తమయినచో నేల చిన్నయ యీ క్రమము ననుసరించెను? ఈ ప్రశ్నములకు సమాధానము లొసంగవలయును.

---

[51] ఆ. భా. చ. పుట 390.

[52] ఆ.భా. చ. పుట 397. 'ఆర్నెల్లకేగుదివికి' కాశీఖండము V. 262. 'రెణ్ణెల్లకు' కా. మాహా. II. 9. 'ఆర్నెల్లకొకపరి'. పిడుపర్తి బస పు. III. 106.

[53] బా. వ్యా. తత్సమ. సూ.

"అదంతమయి, దీర్ఘపూర్వలోపధమయిన మహద్బహువచనము యొక్క లకారమునకు రేఫం బగును" అను సూత్రమున బాలుతలు అని యుండఁగా లవర్ణస్థానమున రేఫము గలిగినది. ఇట్లే దయాళురు శబ్దమునను రువర్ణము వచ్చును. రెండు లకారములు వరుసగా నుచ్చరింపలేక యొకదానికొకటి తబ్బిబ్బుపడి ల స్థానమున రేఫము గలుగుట వర్ణవిభేదమువలన నయినచో ఈ రువర్ణ మాగమమే గాని ప్రత్యయము గాదు. చిన్నయసూరిచే రువర్ణము తత్సమములమీద నిందే నిరూపింపఁబడినది. మల్లురు అను శబ్దము నుదాహరించి ద్విత్వయుక్త లాంత శబ్దంబులపయి నీ యాగమము గలదని సూత్రింపబడెను.[54] ఇట్లు రేఫయుక్తమగు మల్లురు అను రూపమును గొందఱు ప్రయోగించిరి. తిక్కన ప్రాసస్థానమున లకారయుక్తరూపమునే ప్రయోగించెను.[55] మల్లురు మొదలయిన పదములు అర్వాచీనము లనియు, అల్లురు మొదలగువాని సామ్యమునం గలిగినవనియు, ఆ. భా. చరిత్రకారుల యభిప్రాయము. ఇదియే సత్యమని తోచుచున్నది. తత్సమములపై రుప్రత్యయ మట్టి శబ్దములపయినే కన్పట్టుచున్నది గాని మఱియొకచోట గనుపట్ట లేదు. సొవిదల్లులు, ఖిల్లులు అనియే వాడుకలో గన్పట్టుచున్నది.

ఆచ్ఛికశబ్దములపయి నీ రువర్ణ ముభయరేఫముగా గనుపట్టుచున్నది. పగతురు, అల్లురు, నెయ్యురు, మూర్తురు అను[56] పగతాదులయందును, గండండ్రు, మిండండ్రు, విలుకాండ్రు మొదలగు శబ్దములయందును సర్వనామములగు పలుగురు, వారు, వీరు, మీరు, ఒకరు, వేగురు మొదలగు శబ్దములపయిని రేఫగా గనుపట్టుచున్నది. ఆండ్రు, కోడండ్రు, మరదండ్రు మొదలగు స్త్రీవాచకముల తుదిని రువర్ణము వినఁబడుచున్నది. అందఱు, ఇందఱు, కొందఱు, విలుకాఱు, వేటకాఱు, చెయువుఱు మొదలగు శబ్దములపయిని శకటరేఫము గలదు. చెయువుఱు శబ్దము అమహద్వాచకము.

పయి యొక్కొక్కశబ్దము చరిత్ర భిన్నముగా నుండవచ్చు ననుకొన్నను తుదినున్న రు, ఱు వర్ణములు బహువచనద్యోతకంబు లనుటలో విప్రతిపత్తి లేదు. రేఫల యభేదమునకుఁ గల యవకాశమును కూఁతురు శబ్దసందర్భమున నొకసారి ముచ్చటించితిని. పదాంతములందలి యీ రువర్ణము మొదటిరూపము ర్ మాత్రమని యితర ద్రావిడభాషలను బరిశీలించినచోఁ దెల్లమగును. హళగన్నడమున నిది హల్మాత్రమే. హొసగన్నడమున నిది యజంతమయినది (అవర్ - అవరు). ఈ రువర్ణము సర్వద్రావిడభాషాసామాన్యమైన మహద్బహువచన ప్రత్యయ మనుట నిర్వివాదము. ర్, మార్ అనునవి స్త్రీ పుంస సామాన్య బహు

[54] ప్రౌ. వ్యా. శ. 23.

[55] ఆ. భా. చ. పుట 882. జెట్టిమ, ల్లుల విఱుతుఁ.

[56] బా. వ్యా. ఆచ్ఛిక. సూ. 6

వచనప్రత్యయము అని తొల్కాప్పియనారు తెలిపెను [57] నాగవర్మయు నిట్లే రేఫాంతమునే ప్రత్యయముగా నిరూపించెను.[58]

పయి విచారణమునుబట్టి రువర్ణమును తెనుఁగున నాచ్ఛిక మహద్బహు వచనప్రత్యయముగా నిరూపించుట చరిత్రము ననుసరించిన విషయ మనుట స్పష్టము. ఇది యాగమమాత్రము గాదు. లు, రు వర్ణములలో రువర్ణమే చాల ప్రాచీనమయినదనియు, అమహత్ప్రత్యయమయిన కళ్ వర్ణమే కాలక్రమమున లువర్ణముగా మాఱి మహద్వాచకములపయినిగూడ వ్యాపించినదనియు ముందొకసారి దెల్పితిని. ముందిచ్చిన యుదాహరణములనుబట్టి ఈ రువర్ణము కేవల మాచ్ఛికశబ్దములపయినే బహుళముగాని తత్సమశబ్దములపయి నరుదుగా నుండునని స్పష్టపడుచున్నది. తత్సమములు కవి పండిత ప్రయుక్తములు. అన్యభాషా సిద్ధములు. ప్రకృతి ప్రత్యయ విభాగము తెలిసినవి. దేశ్యశబ్దము లట్లుగావు. చిన్నయ తన వ్యాకరణమున సర్వనామప్రకరణమున రువర్ణాంతరూపముల నట్లే సిద్ధములుగా నిచ్చెనుగాని ప్రకృతి ప్రత్యయ విభాగము స్పష్టముచేసి వివరింపలేదు.

లువర్ణము తత్సమములం దెల్లెడలను దేశ్యామహత్తులపయిని గనుపట్టుచుండగా మిక్కిలి బహుళమయిన యీ లువర్ణమునుమాత్రమే గ్రహించి, రువర్ణము నాదేశముగా విధించుట ప్రక్రియకు సులభము. పూర్వవైయాకరణులు అనుసరించిన మార్గము కాఁబట్టి సూరి యా దారి త్రొక్కెను.

## 8. ద్వితీయాది విభక్త్యంగము

తత్సమశబ్దములయొక్కయు దేశ్యశబ్దములయొక్కయు ద్వితీయాది విభక్త్యంగము యొక్క రూపమునందు గొంత భిన్నత గలదు. దేశ్యశబ్దములు ఔపవిభక్తికములనియు, ననౌపవిభక్తికములనియు రెండు విధములు. ఈ భేదము ద్వితీయాది విభక్త్యంగస్వరూపమునుబట్టి యేర్పడినది. మొట్టమొదట తత్సమ శబ్దములనుగూర్చి విచారణచేసి తరువాత దేశ్యశబ్దములను గ్రహింపనగును.

ప్రథమావిభక్తియందుఁ గొన్ని తత్సమములపయిని డు, ము, వు, లు, అను ప్రత్యయములు చేరును. ఏకవచనమున డు, ము, వు అను ప్రత్యయములు చేరని రూపము లట్లే ద్వితీయాది విభక్త్యంగములుగా వాడఁబడుచుండును. సీత, హరి, పయస్సు, నీవృత్తు, ఇంద్రజిత్తు మొదలయినవి. వీనికి ప్రత్యయము లట్లే చేర్పఁబడు చుండును. నడుమ నాగమములు రా నక్కరలేదు. 'అందు' అనునది యజాది గావున

[57] తొల్. చొల్. సూ. 7

[58] స్త్రీపురుషవాచకేష్వరర్ దిర్ విర్ క్వచిత్. భా. భూ. విభక్తివిధానము. సూ. 42.

విసంధి నాపుటకు నడుమ యడాగమముగాని, నగాగమముగాని వచ్చునసుట స్పష్టము. హరియందు, పయస్సు+న్+అందు = పయస్సునందు.

డుప్రత్యయాంతములయందుమాత్రము పయిసూత్రము వర్తింపదు. రాముని, రామునిని; రామునిచేత, రాముచేత; రామునియందు, రామునందు అనునట్లు రెండు విధములయిన రూపము లుండును.[59] ప్రథమావిభక్తిప్రత్యయ మగు డువర్ణము లోపించినది యని వైయాకరణుల విభజనము. ఇట్టి విభజనము చరిత్రకు విరుద్ధము. డుప్రత్యయము కాలక్రమమున నేర్పడినదనియు, ప్రాచీన ప్రథమావిభక్తిరూపము రాము, రామన్, (రామున్), అనునట్లే యుండెననియు నిరూపించితిని. ఈ పయి రూపములమీదనే విభక్తిప్రత్యయములు చేర్పఁబడుచు వచ్చినవి. కాఁబట్టి రాము చేత, రామునకొఱకు మొదలగునవి సిద్ధమయ్యె ననుట స్పష్టము. ఇఁక రామున్ అను రూపముపయినే ఇవర్ణము చేర్చుటవలన రాముని అని యేర్పడినది. అదియే రెండవజాతి రూపములలోని ద్వితీయాది విభక్త్యంగమనుట నిర్వివాదము. ప్రాచీనరూపములు దేవని, నాథని, నాయని అని అకారయుక్తములుగానే యుండె నని ముందు నిరూపించితిని. కాలక్రమమున నడిమి అకారమునకు ఉకారము వచ్చినది. ఇది రాముఁడు మొదలగు శబ్దములయందలి తుది ఉకారముయొక్క యాకర్షణమున నని ముందే చెప్పితిని. రామునందు అనుచో నడిమి నకారము రాము+అందు అనుచోట సంధి నాపుటకు వచ్చిన యాగమ మనుట నిర్వివాదము. ఇట్లే ఉకారాంతశబ్దములకుఁగూడ వర్తిల్లుచున్నది. నిగాగమము పాణికము. ఈ నివర్ణమున ఇకారము సంబంధబోధకముగా నెల్లయెడల తెనుఁగున వచ్చు నాగమవిశేషము. ముందఱి నకారము మహద్వాచకముల తుదినుండిన ప్రత్యయ నకారము. ఈ రెండును గలిసి యేర్పడిన దీ నివర్ణము. నేఁటి వాడుకలో రాముడికొఱకు, శంభుఁడితో మొదలగు రూపములను సాధువులు చేయవలసి వచ్చినచో ప్రథమావిభక్తిరూపముపయిని ఇకారము వచ్చినదనిగాని లేక డి వర్ణము ఆగమమనిగాని వ్యాకర్త వ్రాయవలెను. ఇందు మొదటిదియే యుక్తమనియు రెండవది కృతకమనియు స్పష్టమేగదా!

ఇఁక మువర్ణాంతములపయిని వనము కొఱకు అనునట్లు ప్రథమావిభక్తి ప్రత్యయాంతమే ద్వితీయాద్యంగముగా వాడఁబడుచుండును. ఇది యెంతయును తెనుఁగుపద్ధతికి సరిపడియే యున్నది. వనమునందు, వనమందు, వనమునయందు అను రీతిని మూఁడువిధములయిన రూపములు గనుపట్టుచున్నవి. మొదటి రూపమున నగాగమంబు విసంధి నాపుటకు వచ్చినదనుట స్పష్టము. రెండవదానియందు ఉకారసంధి గలిగినది. మూఁడవ రూపమునందలి నకారము 'ఎలజవ్వనంబున విలసనము', 'తేమంబున తెలుగు' మొదలగు భారతప్రయోగములయందలి నవర్ణమువంటిదే

---

[59] బా. వ్యా. త. డుమంతంబునకు ద్వితీయాద్యేకవచనంబు పరంబగునపుడు నిగాగ మంబు సర్వత్ర విభాషనగు. సూ. 23.

యనుట స్పష్టము.[60] అందు అను శబ్దము స్థలవాచకము. ఇది సమాసమనుటయే యుక్తముగదా ! ఈ నవర్ణముస్వభావము ముందు చర్చింపఁబడును.

దేశ్యములయిన డుప్రత్యయాంతములయందు మగాదులును, బల్లిదాదులు నను రెండు గణములు గలవు. మగాదులయందుఁ దుదిని అకారము గలదు. వీని ద్వితీయాద్యంగము మగని, మనువని యని నివర్ణాంతముగానే యుండును. మగచేత అను నివర్ణ విరహితరూపము లేదు. దీనికిఁ గారణము తెనుఁగున మగన్ అను నవర్ణాంతరూపముపయినే యా ద్వితీయాంగ మేర్పడినదిగాని తద్విరహితమయిన మగ యను రూపముపై నేర్పడలేదని తేలుచున్నది. ఈ మగ శబ్దము కన్నడమున నకారాంతత లేకయే ప్రథమాంతముగా వాడఁ బడుచున్నది. తెనుఁగునఁగూడ నట్లును ప్రాచీనముగ నుండెనేమో తెలియదు. ఉండినచో నష్టమయియుండును. బల్లిదాదులు సంస్కృత డువర్ణాంతశబ్దముల సామ్యమును బొందినవి గావున వానియందు 'ని'లోప మేర్పడి బల్లిదుచేత, బల్లిదునిచేత అను రీతిని రెండు రూపములు నేర్పడినవి.

బహువచనము పరంబగునపుడు రేయి ప్రభృతులయొక్కయు, అవు ప్రభృతుల[61]యొక్కయు తుదివర్ణంబునకు లోపంబగునని చిన్నయ సూత్రించెను. ఈ పదముల ప్రాచీనరూపములు ఆ, రే అనునవియే యని తోచుచున్నది. తుది నున్న యివర్ణము తరువాతఁ జేరియుండవచ్చును. లేదా కొన్నిటియందు 'య్' వర్ణమంతమందుండి లోపించినను లోపించియుండవచ్చును. ఆ గణములందలి ప్రత్యేకపదముల చరిత్రమును ఒకొక్కటిగా నన్వేషింపవలయును.

లుప్రత్యయము బహువచనమునఁ జేరుచున్నది. అట్టి లుప్రత్యయము నకు అకారము సంబంధబోధకముగాఁ జేర్చి సమాసములయందును ద్వితీయాది విభక్త్యంగమునను రూపములు సిద్ధము లగుచున్నవి. రాములను, రాములచేత, అన్నలకొఱకు, మొదలగునవి. వైయాకరణులు ఇట్లు చేరిన అకారమును బహు వచనార్థకమగు లువర్ణముతో గలిపి లడాగమంబని వ్యవహరించిరి. ఈ 'అ' అనునది అనేక శబ్దములపయిఁ జేర్పఁబడుచున్నది. వనమునయందు మొదలయిన విభక్తిరూపములయందును, ఎలజవ్వనంబున విలసనంబు అనునట్టి సమాసంబులను జేరినది యీ 'అ' వర్ణమే యనుట నిస్సంశయము. ఇట్లు నడుమవచ్చిన 'అ' వర్ణమునకు ముందు నకారము సంధినాపుట కాగమముగా వచ్చి యనుచిత విభాగమున నవర్ణకమయి ని, ల, వంటిదిగానే వైయాకరణులచే భావింపఁ బడినది. సప్తమీవిభక్తిప్రత్యయ మనంబడిన నవర్ణకముగూడ నిట్లు ఏర్పడి పయి దానితో నభిన్నమయినదనుట యూహింపనగును.

[60] ప్రౌ. వ్యా. షష్ఠీ తత్పురుషంబులందు నగాగమంబు విభాషనగు. సమా. సూ. 1

[61] బా. వ్యా. అచ్ఛికము. సూ. 21, 22.

మహద్బహువచనమగు రుప్రత్యయముపయిని సంబంధార్థమునఁ 'ఇ' వర్ణము చేర్పఁబడి వారిచేత, వీరివలన అను రూపము లేర్పడుచున్నవి. మల్లుర వలన, అల్లురకొంఅకు మొదలయిన శబ్దములలో 'అ' వర్ణమే చేరుచున్నది.

పయివిచారణవలనఁ దేలిన ఫలితము. తెనుఁగునందలి ప్రథమావిభక్తి రూపమే ద్వితీయాద్యంగమగుట సాధారణము. అది ప్రత్యయ విహీనము. కాని కాలక్రమమునఁ బ్రత్యయము లేర్పడి ప్రథమాంతముల తుదిని డు, ము, వు మొదలయిన వర్ణకములుగాని, యితర వర్ణములుగాని చేరినప్పు డవి లోపించి ద్వితీయాద్యంగము లేర్పడుచున్నవి. ఇ వర్ణము సాధారణముగా నేకవచనములపయిని, అ వర్ణము బహువచనములపయిని చేరునట్టి యాగమము. ఇవి చేరుటచేత ద్వితీయాద్యంగము పేర్పడుచున్నది. సమాసము లేర్పడునపుడును నడుమ నియ్యవియే యాగమములుగా వచ్చుచుండును. తెనుఁగు విభక్త్యంత పదములును సమాసముల వంటివే గావున నందును నియ్యవియే యాగమములుగా వచ్చినవి.

## 9. ఔపవిభక్తికములు

ఇ, టి, తి, వర్ణంబులు విభక్తినిమిత్తంబులయి యాదేశాగమాత్మకంబు లయినవి యౌపవిభక్తికములనంబడును అని చిన్నయసూరి. వీనినే అథర్వణుఁడు, ఉపవిభక్తులని వ్యవహరించెను.[1] ఇట్టి ఉపవిభక్తులు చేరునట్టి ప్రకృతులకును ఔపవిభక్తికంబులని వ్యవహారము గలదు. టి, ంటి, మొదలయిన వర్ణములు ఔపవిభక్తికసంజ్ఞ కలవిగా నాంధ్రభాషయం దగుచున్నవి యని చింతామణి సూత్రించెను.[2] దీనికి వ్యాఖ్యానము వ్రాయుచు నహోబలపండితుఁడు అంపకాఁడు, పాపరేఁడు, వేపచెట్టు మొదలయిన సమాసములయందలి 'పఙ్, ప' వర్ణంబులు గూడ నౌపవిభక్తికములనియే యూహించెను. ఇది యుక్తముగాదు. 'విభక్తుల యందును సమాసమునను' అని సూత్రమున నుండుటచేతను, ఔపవిభక్తిక మను శబ్దము విభక్తినిమిత్తకంబను నభిప్రాయము మూలముగా గలదగుటచేతను, 'పఙ్, ప' వర్ణంబులు ఔపవిభక్తికంబులు గావనుట స్పష్టము. టింట్యాదులు విభక్తులకు ముందుమాత్రమేగాక సమాసాంతములను సమాసమధ్యమునను గూడ నగు చున్నవి. కాఁబట్టి ఇ, టి, తి వర్ణంబు లౌపవిభక్తికంబులను సూరిమతమే సూరి నుతంబనందగును. నన్నయసూత్రమున నున్న 'ంటి' వర్ణమును, టివర్ణమునకు ముందు పూర్ణబిందువు బహుళముగా నగును, అని సూత్రించి చిన్నయ సంగ్రహించెను.[3]

[1] ఆ. వ్యా. ఆచ్ఛిక. సూ. 28. విభాషయా భవంత్యత్ర భవంత్యుపవిభక్తయః. భవంతి కుత్రచి న్నైవ నిదానం తత్ర సద్వచః. అ. కా. పు. 43. వావిళ్ల.

[2] ఔపవిభక్తిక సంజ్ఞావర్ణా ష్టింట్యాదయో భవన్తీహ, రుల్వాదేర్నామ్నాంస్యు స్తేహి విభక్తౌ సమాసేచ. ఆం. శ. చి. సంధి.

[3] ఆ. వ్యా. ఆచ్ఛిక. సూ. 32

పయిరీతిని ఔపవిభక్తికములగు శబ్దములకును ఇతరములకును గల భేద మేమియో నిర్వచింపవలయును. 1. ద్వితీయాది విభక్తులకు ముందు ఇ, టి, తి వర్ణంబు లాగమంబులగుట ; 2. తృతీయా సప్తముల కత్వం బాదేశంబు బహుళంబుగా నగుట.[4] పయి లక్షణంబులనుబట్టి యుదాహరణము లీ క్రిందిరీతి నేర్పడుచున్నవి.

| (ఔపవిభక్తికములు) | | (అనౌపవిభక్తికములు) | |
|---|---|---|---|
| ప్రకృతి | ప్రత్యయాంతము | ప్రకృ | ప్రత్యయాంతము |
| ముల్లు | ముంటికొఱకు | కల్లు | కల్లుకొఱకు |
| రెండు | రెంటికి, రెండిటికి | పిండు | పిండుకు |
| త్రాడు | త్రాటిని | పోడు | పోడును |
| మిన్ను | మింటను | వెన్ను | వెన్నున |
| ఊరు | ఊరను, ఊరిలో | ఊరు | ఊరున |
| వాయి | వాతిని, వాతికొఱకు | వైపు | వైపులో |
| ఏరు | ఏటిలో } | వ్రాయి | వ్రాయిని, వ్రాయికొఱకు |
| పోరు | పోరిలో } | తీరు | తీరులో |
| కొడవలి | కొడవంటికి | వండలి | వండలికి |
| పగలు | పగటికి | సిసలు | సిసలునకు |
| ఱోలు | ఱోటను | తోలు | తోలున |

సాధారణముగా లు, ల్లు, డు, డి, రు, యి, అంతమందుగల శబ్దములు ఔపవిభక్తికములుగా నున్నవి. అట్టి శబ్దములలోని యనౌపవిభక్తికములనుగూడ నుదాహరణములుగా మీద పట్టికలో నిరూపించితిని.

ద్వితీయాదివిభక్త్యంగమునుగూర్చి వ్రాయునప్పుడు ఇ, అ, అను నాగ మములు విభక్తిముందు చేరుననియును, సమాసములలోను నయ్యవియే కలుగు ననియునుఁ జెప్పితిని. అట్టి యాగమములు లేకయే ప్రకృతిప్రక్కను ప్రత్య యమును, పదముప్రక్క మఱియొకపదమును జేర్చుటవలనను విభక్త్యంత రూపములును, సమాసములును తెనుఁగున నేర్పడుచుండును అని తెలిపితిని. విభ క్త్యంతరూపము లన్నియు సమాసతుల్యములే యను విషయమును సూచించితిని. ఇట్టి భేదము నాశ్రయించియే యీ యౌపవిభక్తికభేద మేర్పడి కళా ద్రుతప్రకృతిక భేదమువలెనే భాషయందు స్థిరపడినది. ఔపవిభక్తికములందుఁ జేరునట్టి వర్ణ ములు ఇ, టి, తి అనునవి. ఈ మూఁడింటియందును ఇ వర్ణము సామాన్యమే. ఇఁక తృతీయా సప్తములయందు అ వర్ణము వచ్చునని వైయాకరణులు నిరూపించిరి. పేరు శబ్దమునకు ఔపవిభక్తికమయినపుడు 'పేరను' అనియు, అనౌపవిభక్తికమయినపుడు 'పేరున' అనియు రూపము లేర్పడును. 'న' యను

---

[4] బా వ్యా సూ 38

విభక్తిప్రత్యయముగూడ పయిని జూపింపఁబడిన అకారవికారమే యని ముందుజెప్పితిని. 'పేర్' అను శబ్దముపయిని 'అ' చేరి 'పేర' అనియు, ఉవర్ణాంత మయిన 'పేరు' శబ్దముపయిని 'న' ప్రత్యయము చేరి (న్ + అ) 'పేరున' అని యేర్పడు టయు మాత్రమే భేదము. నడిమి నకారము సంధినాపుటకు వచ్చినదని చెప్పితిని.

పయిఫక్కికప్రకారము టి, తి వర్ణములలోని ట్, త్, అనువాని స్వభావమును నిరూపింపవలయును. ఈ టి, తి వర్ణంబులు ని, ల, వర్ణములవలెనే యాహరింపఁబడినవని యూహించుట సులభము. ఆగమంబులని భావింపఁబడిన ని, ల, వర్ణముల చరిత్రమును ముందే నిరూపించితిని. ఇట్లే ట్, త్, అనునవి ప్రకృతియొక్క అంత్యవర్ణములని యూహించుట సులభము. నేఁటి వైయాకరణుల విభాగము స్థిరపడకమునుపు భాషలోని విభక్త్యంతరూపములు జనుల నోళ్లలోఁబడి చాలవఱకును నలిగియుండక తప్పదు. ఇట్టి రూపముల చరిత్రము తోడిభాషయగు అరవములోని విభక్త్యంతరూపములనుబట్టియు నిరూపింప నగును. విభక్త్యంతరూపములు సిద్ధములుగానే వాడుకలో నుండి క్రొత్తవిభక్తులు మరల కాలక్రమమున నాహరింపబడునుగాని పూర్వావస్థలో భాషను మాటాడువారి ప్రత్యయములను ఒకసారిగా విడిచి అనంతరావస్థలోని భాష వాడువారు క్రొత్త ప్రత్యయముల నేర్పఱచుకొనరు.

ప్రాకృతములోని యీ క్రింది యుదాహరణములను జూచునది.

| సం. | ప్రాకృతము. | సం. | ప్రాకృతము. |
|---|---|---|---|
| పుత్రః | పుత్తో | పుత్రాణామ్ = | పుత్తాణ |
| పుత్రస్య | పుత్తస్స | పుత్రేణ = | పుత్తేణం |
| పుత్రాత్ = | పుత్తాదో | పుత్రాన్ = | పుత్తే |

ఈ పయిరూపము లన్నిటియందును సంస్కృతమునందు సిద్ధమయిన విభక్త్యంత రూపములే మాఱి ప్రత్యయములుకూడ వేఱుగ నేర్పడినట్లు స్పష్టము. అంతేగాని ప్రాకృతమునఁ గ్రొత్తవిభక్తులు తమంతఁ దాము పుట్టలేదు. ఆ భాషను వాడువారు క్రొత్తగ కల్పింపనులేదు.

పయి సామ్యమునుబట్టి యౌపవిభక్తికరూపములుగల శబ్దముల పూర్వ రూపములు (ఇతర ద్రావిడభాషలనుండి) ఎట్లుండెనో యూహించినచో ఔపవిభక్తికముల చరిత్రము స్పష్టపడు ననుట నిస్సంశయము. అరవమున 'ఆఱ్' అను శబ్దము గలదు. దీనికిఁ దెనుఁగున సమానరూపము 'ఏఱు' అనునది. (నది అర్థము) ఒకానొకకాలమున అనగా అరవమును తెనుఁగును వేఱుకానికాలమున 'ఆఱ్' అనురూపము రెండుభాషలకును సమానముగానే యుండవలయును. ఆఱ్ + ఇల్ అను సప్తమ్యంతరూప మేర్పడవలసివచ్చినప్పుడు అరవమున 'ఆట్రిల్' అని యేర్పడును. ద్విత్వయుక్తమయిన శకటరేఫము గలచోట 'ట్ర' అను నుచ్చారణ

మరవమున గలదనియు, అదియే తెనుఁగున నుండెననియు ముందుఁ జెప్పి యున్నాను. 'అట్రిల్' అను శబ్దము కాలక్రమమున 'ట్ర' ల సమీకరణమునంది 'ట్టి' అని యేర్పడినది. అట్టిల్ అనియు, అట్టిలో = పట్టిలో = పటిలో అనియు కాల క్రమమున రూపము లేర్పడియుండు ననుట స్పష్టము.

1. కాఁబట్టి రేఫాంతపదముల తుదినున్న రేఫము ద్విత్వమునొంది 'ట్ర' వర్ణముగా మాఱి సమీకరణమునొంది తరువాత పటి, నూటి మొదలగు ద్వితీయాది విభక్త్యంగములు తెనుఁగున నేర్పడియుండవచ్చును.

2. ప్రాచీనద్రావిడభాషయందు క, చ, ట, త, ప లేగాని గ, జ, డ, ద, బ లు లేవని ముందే చెప్పితిని. నేఁటి తెనుఁగున డు, డి, వర్ణము లంతమందుగల శబ్దములు ప్రాచీనకాలమున టకారాంతములయియే యుండవలయును. అట్లయినచో కాట్ (కాఁడు), రాట్ (రాఁడు), అను టకారాంతముల పయి ఇ వర్ణము చేరినచో కాటి, రాటి మొదలయిన ద్వితీయాద్యంగము లేర్పడియె నని యూహించుట సులభము. పదాంతమునందలి టకారము కాలక్రమమునఁ బ్రథమావిభక్తిని డు, డి, వర్ణకములుగా మాఱుట వింతలేదు. అట్లు మాఱిన ప్రథమావిభక్త్యంతరూపములను మూలములుగా గ్రహించియే వైయాకరణులు టింట్యాదుల నాదేశములుగా విధించిరి. కావుననే ఇవి ఆదేశములు గావచ్చునని నిరూపింప నవకాశము గలిగినది. ఒకడు=ఒకటికి, నేఁడు=నేఁటికి, నాఁడు=నాఁటికి, మొదలయినవన్నియు నిట్లేర్పడినవే యనుట స్పష్టము.

3. అరవమున కణ్, మణ్, విణ్, మొదలగు ణకారాంతశబ్దములు నేఁడు తెనుఁగున కన్ను, మన్ను, మిన్ను మొదలగు రూపములతో నున్నవి. అనఁగా ప్రాచీన ణకారము నేఁడు నకార మయినదనుట స్పష్టము. పయిశబ్దము లరవమున సంధియందు పరుషాక్షరములు పరములగునప్పుడు టకారాదేశములు గలవి యగుచున్నవి. మణ్ + కుడమ్=మట్కుడమ్ (మట్టికుండ). ఈ మార్పు విభక్త్యర్థ మును నిరూపించు సంధిలో వచ్చుచున్నది. ఇట్లే కల్ + తీతు=కట్టీతు[4a] (రాయి చెడ్డది). కల్ + కుఱిదు=కఱ్కుఱిదు (రాయిపొట్టి). ముళ్ + కుఱై=ముట్కుఱై (ముంటిముక్క). ఇట్లే పదాంత ల ళ కారములు ఱగాను, టవర్ణముగాను క్రమమున మాఱుటగలదు. ఆ సంప్రదాయమే తెనుఁగున నుండితీరవలయును. పయి సంధివిధానము క్రీస్తునకుఁ బూర్వకాలమున (తొల్కాప్పియనారు చెప్పినది) నుండినది. నేఁటికిని గ్రాంథికభాషలోఁ గలదు. అప్పటినుండి వేయిసంవత్సరముల వఱకు ద్రవరూపముననుండి మాఱుపడి నన్నయకాలమున వాడుకలోనుండిన రూపము లకు లక్షణములు వ్యాకరణములలోనివి.

పయిరీతిని ఆదిమావస్థలో పదాంతమున నుండిన ల, ణ లు టకారముగా మాఱియుండగా నట్టి శబ్దములపయిని ఇకారము చేరుటవలన ద్వితీయాద్యంగము

4a. P. S. S. page 87.

లేర్పడి మంటికుండ, కంటిమంట, (పల్) పంటినొప్పి మొదలగు రూపము లేర్పడి యుండెననుట స్పష్టము. ఆ 'ంటి' వర్ణాంతములే ద్వితీయాది విభక్త్యంగములైనవి. వానినుండియే ఔపవిభక్తికప్రత్యయములు తెనుఁగున నేర్పడినవి.

4. అరవమున ద్వితీయాది విభక్త్యంగములకుఁ గొన్ని శబ్దములపయిని, అట్టు (అట్రు), వట్టు (వట్రు) అను నాగమవిశేషము లేర్పడునని తొల్కాప్పియ నారు నిరూపించెను.[5]

అవ్ + వట్టు + ఐ = అవట్రై—(తెనుఁగు) వాటిని.

ఇవ్ + వట్టు + ఐ = ఇవట్రై—( ,, ) వీటిని.

ఇట్లే అరవమున అట్రు ఆగమముగా వచ్చిన విభక్త్యంతరూపశబ్దము లన్నిటియందును తెనుఁగున టివర్ణ మేర్పడి యౌపవిభక్తికము లేర్పడినవి. ఉదా: వాటికి, వీటి, వేటి, మొదలయినవి.

5. అరవమున అత్తు అను నొక యాగమవిశేషము తొల్కాప్పియమునఁ జెప్పఁబడినది. మకారాంతశబ్దములగు మరమ్, కుళమ్ మొదలగువానికి అచ్చు పరమయినప్పుడు ఈ యాగమము వచ్చును. మరమ్ + ఇల్ = మరత్తిల్, ఇడమ్ + అత్తు + ఇల్ = ఇడత్తిల్, కుళమ్ + అత్తు + ఇల్ = కుళత్తిల్.

ఇట్లు ఆగమముగా వచ్చు అత్తు అనునట్టిదియే తెనుఁగుశబ్దముల ప్రాచీన రూపములలోనుండి నేటి తివర్ణమునకు మూలరూపముగా నుండెననుట నిస్సంశయము. (సునిశితపరిశోధనమునగాని యే యే శబ్దము లెట్లెట్లు మాఱెనో చెప్ప వీలులేదు.)

నేఁటి తెనుఁగున కుట్టు=కుర్తి, పట్టు=పర్తి, మొదలగు ద్వితీయాద్యంగములు పయిరీతి నేర్పడి కాలక్రమమున ననుచితవిభాగముచే నవియే ప్రథమాంతములుగా గ్రామనామము లయినవి గొట్టు=(గొర్తి) వారు; గంగలగుట్టు (గంగలగుర్తి) అగ్రహారము; వెదులుపట్టు = (వెదులుపర్తి) వారు. నేఁటి ప్రథమాంతములు వెదులుపర్తి మొదలగు తివర్ణాంతరూపములే యనుటకు వ్యవహారమే ప్రమాణము.

నేఁటి తివర్ణమునకు అరవముసందలి అత్తు అను ఆగమమే మూలమని చెప్పుటకంటె నధికముగా విమర్శించుటకు వీలులేదు.

పయిరీతిని భిన్నమార్గముల నేర్పడిన ఇ, టి, తి, ంటి, అను వర్ణములు అంతమందుగల రూపములన్నియును ఔపవిభక్తికముల యొక్క ద్వితీయాది విభక్త్యంగములుగా నేర్పడి ఇ, టి, తి వర్ణంబులు ప్రత్యేకముగా వైయాకరణులచే నాహరింపఁబడినవనుట స్పష్టము.

ఔపవిభక్తికవర్ణము లేర్పడినతరువాతఁ గొన్ని యనౌపవిభక్తికములు ఔపవిభక్తికములుగను, ఔపవిభక్తికములు అనౌపవిభక్తికములుగను మాఱుటయు

[5] P. S. S. page73.

సామ్యమున జరిగినవనుట నిస్సంశయము. ఇంతియగాక మొదలిటి, మొదటి; రెంటిని, రెండిటిని; నూటిని, నూఱిటిని; పగటిని, పగంటిని, పగలింటిని అనునట్లు వికల్పరూపములు వివిధములుగా బయలుదేరినవి. వీని కన్నిటికిని గవిప్రయోగములును, జనులవాడుకయును మాత్రమే శరణము. ప్రాచీనపువాడుక ననుసరించి వైయాకరణు లెవ్వరును పరిగణనము చేసియుంచలేదు. ఈ విషయమునే అథర్వణుఁడు ఆంధ్రభాషయం దౌపవిభక్తికములు చాల గలవనియు, నట్టి యౌపవిభక్తికత్వము బహుళమనియు దెలిపెను.[6] ఆంధ్రభాషాచరిత్రకారులు ఔపవిభక్తికశబ్దములను జాలవఱకును బరిగణనము చేసియున్నారు. ఔపవిభక్తికమయిన ప్రకృతిరూపము ద్వితీయాది విభక్త్యంగమునకుఁ జేరినది గావున నిచ్చట వివరింపఁబడినది.

## 10. వ చ న ము

సంస్కృతవ్యాకరణము ననుసరించి పేర్కొనిన లింగ విభక్తి వచనములు అను భేదములలో విభక్తినిగూర్చి నిరూపించితిని. వచనమునుగూర్చి కొంచెము సంగ్రహముగా నిరూపింపవలయును. వైదికకాలమునుండియు సంస్కృతమున మూఁడు వచనములు ఉండెను. అవి యేకవచనము ద్వివచనము బహువచము అనునవి. అనఁగా సంఖ్యాపరిజ్ఞానము ఆ భాషను వాడు జాతియందు మూఁడువిధములుగా బయలు దేరినది యని భావము. మనుష్యులు సృష్టియందు జంటలుగానున్న హస్తములను పాదములను నేత్రములను ఇంక ననేకములయిన యితరములను జూచి వానిని ఆత్మస్వరూపమున నేకముగానున్న వ్యక్తికంటె భిన్నమయినవానిగా గ్రహించియుండిరనుట స్పష్టము. అశ్వినులు, అగ్నీషోములు, ఇంద్రాగ్నులు, సూర్యాచంద్రమసులు, మిత్రావరుణులు మొదలగు జంటదేవతలును, దంపతులు, ద్యావాపృథివి మొదలగు నితరములయిన జంటలును, అవయవాదికములో నున్న జంటలనుగూడి ఆ జాతియందు ద్వివచనము అను భావమును, గాని కొక వచనప్రణాళికయును ఏర్పడినవి. అనఁగా ఏక, ద్వి, బహు వచనము లనంబడునవి యేర్పడి భాషలోఁ బాతుకొనిపోయినవి. కాని కాలక్రమమున సంస్కృతము పరిభ్రష్టమయి ప్రాకృతము లేర్పడునాఁటికి సామాన్యులలో ద్వివచన మంతరించి ఏక బహు వచనములుమాత్రమే నిలిచిపోయినవి. అట్లే ప్రాకృతములనుండి యేర్పడిన నేఁటి యార్యభాషలగు నుత్తరహిందూస్థానభాషల యందును రెండే వచనములు నిలిచినవి.

ద్రావిడభాషలలో నెల్లఁ బ్రాచీనములయిన సారస్వతమును, వ్యాకరణమును గలది యఱవము. అందలి వచనవిభజనమును బరిశీలించినచో ద్రావిడభాషల వచన

---

[6] బహవో౽త్రాంధ్రభాషాయాం వర్ణాఔపవిభక్తికాః, ప్రవృత్తిశ్చాప్రవృత్తిశ్చ వికల్పశ్చ క్వచి ద్భవేత్, తద్వివేకః ప్రయోగై కశరణస్స్యాద్ధి శబ్దతః. అ. శా. పుట 42.

[7] ఆ. భా. చ. 1009-1052.

ద్రావిడభాషలకును సంస్కృతమునకును బయి విషయముననుగూడ జన్యజనక భావసంబంధము పరాస్తమగుచున్నది.

తెనుఁగున బహువచనార్థక ప్రత్యయములగు రు, లు వర్ణముల చరిత్రమును, వానితోఁ గలిసి యేర్పడు రూపాంతరములను ముందే నిరూపించితిని. ప్రాచీన కాలమున ద్రావిడభాషయందుండిన యీ కళ్ ప్రత్యయమే కళు, గుళు, గొళు, ఒంగ్ మొదలగు రూపములను బొంది యితర ద్రావిడభాషలలో వాడుకయందున్నది. ప్రాచీన ద్రావిడమున అమహద్బహువచనముగా 'అ' యను ప్రత్యయముండినట్లును, అది తెనుగున భ్రష్టమయినట్లును క్యాల్డెల్లుగారు రూహించుచున్నారు. ఇఱుక్కిన్ఱన (ఉన్నవి), వందన (వచ్చినవి) మొదలయిన యమహత్క్రియారూపములలో తుదిని అకారము అరవమునఁ గలదు. ఇట్లే పల (అనేకము), చిల (కొన్ని) మొదలయిన విశేషణములయందును బహువచనముగా నిది గన్పట్టుచున్నది. మలయాళమున అవ (అవి), ఇవ (ఇవి) మొదలయిన శబ్దములయందును ఇయ్యది కనుపట్టుచున్నది. ఇట్లుండిన అప్రత్యయము తెనుగున నశించినది.[3] క్రియావిభక్తులలో ఈ అప్రత్యయము తొలుకాప్పియమునఁగూడఁ జేర్కొనఁబడినది.

## 11. లింగము

సంస్కృతమునందు లింగము మూఁడువిధములు. స్త్రీలింగము, పుంలింగము, నపుంసకలింగము. ఈ మూఁడును సంస్కృతమునందుఁ జాలవఱకు శబ్దధర్మములే గాని యర్థధర్మమాత్రములు గావు. స్త్రీవాచకశబ్దము స్త్రీలింగమనియుఁ, బురుషవాచకము పుంలింగమనియు, ఇతరములయిన జడవాచకములు నపుంసకలింగములనియు నియమము లేదు. కళత్రము, దార, భార్య అను మూఁడు శబ్దములును ఏకార్థములే. అయినను మొదటిది నపుంసకము. రెండవది పుంలింగము, మూఁడవది స్త్రీలింగము. ఇట్లే శిలా, జటా, వేణీ, నదీ, చమూ, మొదలయిన జడవాచకములు స్త్రీలింగములు. వీనియందు లౌకికమయిన స్త్రీత్వమే లేదు. అట్లే యితరలింగములయిన శబ్దములయందును అర్థమునుమాత్రమే లింగమూశ్రయింపదు. సాధారణముగా ఆ, ఈ, ఊ అంతమందు గల శబ్దములు స్త్రీలింగములు. అకారాన్తములు పుం నపుంసకములు. కాఁబట్టి లింగము శబ్దముయొక్క అంతమునుగూర్చియు, దానికిఁ జేరు విభక్తిప్రత్యయములనుబట్టియు నిర్ణయింపనగును. ఇట్లనుటవలన పురుషవాచకములయిన శబ్దములకు సమానములయిన స్త్రీవాచకశబ్దములు స్త్రీలింగములు కాకపోలేదు. గోపః=పుంలింగము, గోపీ=స్త్రీలింగము. ఇట్లే ప్రణాళిక యెల్లశబ్దములయందును నడుచుచునే యుండును. కాని యీపద్ధతికిఁ గుదురని వనేకశబ్దములు గలవని యభిప్రాయము. లింగము సంస్కృతమున శబ్దగతమేగాని యర్థగతముగాదని ముందు చెప్పిన భావ మియ్యదియే.

[3] C. G. D. పుట 247.

వచనవిచారమునఁ గొంత లింగమునుగూర్చియు ద్రావిడసంప్రదాయము తెలుపఁబడియున్నది. (1) ఉయర్ తిణై — (ఉన్నతజాతి) మనుష్యులు, దేవతలు, నరకవాసులు, అనువారికి వాచకములయిన శబ్దములే ఉయర్ తిణై. (2) అఃఱిణై (అల్ + తిణై) అవి కాని జాతి. జీవమున్నను లేకున్నను తక్కిన వన్నియు నీ జాతికిఁ జేరినవే.[1] ఉయర్ తిణైలోనే ఆణ్ పాల్ (పుంలిగము) పెణ్ పాల్ (స్త్రీలింగము) అను భేదము గలదు. ఇదియును ఏకవచనముననే. బహువచనమున నిట్టి వివక్ష లేదు. కావుననే పలర్ పాల్ అని యొక్క భాగముగానే తొల్కాప్పియమునఁ జెప్పఁబడినది. అఃఱిణైయందు లింగభేదమును పరిగణించుట లేదు. ఒన్ఱన్ పాల్, పలవిఱ్పాల్ (ఏకవచన బహువచనములు) అను రెండు భాగములే గలవు. ఎరుదు (ఎద్దు), పశు (ఆవు) అను అరవపదములు రెండును ఒన్ఱన్ పాల్ అనియే నిరూపింపఁబడును. కాని లింగనిరూపణ కవసరములేదు. పయి పద్ధతి తమిళవ్యాకరణమునుబట్టి స్పష్టము.

లింగవిభాగము లౌకికముగా నర్థము నాశ్రయించిన ధర్మము. ఈ విభాగము ననుసరించి భాషయందలి తత్తద్వాచకశబ్దములలో నేదే నొక్క భేదక ప్రణాళిక యుండినంగాని పయివిభజనమునకు వ్యాకరణమున తావులేదు. సంస్కృతమున నట్టి ప్రణాళిక యుండుటచేతనే మూఁడు లింగములుగా శబ్దములు విభజింపఁబడినవి. స్త్రీ పురుష జడవాచక భేదము ననుసరింపక వ్యక్తిమాత్రములుగ సంజ్ఞల నుపయోగించు భాషయందుఁ బయిరూపముయిన విభజనము కేవల విడంబనము అనక తప్పదు. ఒకానొక భాషలో వయోవిశేషమునుబట్టియే ప్రత్యయాదిక భేదము గలుగునట్టి ప్రణాళిక నడచుచున్నచో ఆ భాషావ్యాకరణమున లింగమును బాల్య యౌవనాదికము ననుసరించి యేర్పఱచుకొనవలయును. కాఁబట్టి యరవమునను, ఇతరములయిన ద్రావిడభాషలయందును దమకుఁ దగినట్లే లింగవిభజన ప్రణాళిక నడచినది. అరవమున ఆణ్, పెణ్ (పురుష, స్త్రీ) భేదము ఏకవచనమున ఉయర్ తిణైయందు మాత్రమే భాషాప్రణాళికలోని కెక్కినదనుట నిస్సంశయము. ఆణ్ పాల్ శబ్దముల తుదిని న్ వర్ణమును, పెణ్ పాల్ శబ్దముల తుదిని ళ్ అను వర్ణమును, పలర్ పాల్ తుదిని ర్ వర్ణమును జేరుటయే పయి విభాగమునకు ఫలము. ఇంతియగాక నామములతుదిని బయి లింగ వచన బోధకములగు న్, ళ్, ర్ అను ప్రత్యయములు చేర్పక తప్పదను నియమము లేదనియు, క్రియలతుదినిమాత్రము చేర్చితీరవలయుననియు తొల్కాప్పియనారు సూత్రించెను.[2] పయి విధినిబట్టి లింగ వచన బోధకప్రత్యయములు వికల్పము లనుట సిద్ధాన్తము. పయి తొల్కాప్పియము వాక్యమునుబట్టి మిక్కిలి ప్రాచీనకాలమున లింగ

[1] మక్కళ్ దేవర్ నరకర్ ఉయర్ తిణై, మఱ్ఱుయిరుళ్ళవుమ్, ఇల్లవుమ్ అఃఱిణై. నన్నూల్. 261.

[2] P. S. S. 124. తొల్. చొల్. సూ. 10

బోధక ప్రత్యయములు లేకయే ప్రాచీనద్రావిడభాష యుండెననియుఁ, గాలక్రమమున నా యా ప్రత్యయము లా యా ద్రావిడమాండలికములయందుఁ గలిగె ననుటయు దృఢమగుచున్నది. అనాగరిక ద్రావిడమాండలికములయిన తుద, కోట భాషలయందు నేఁటికిని లింగభేదము లేకయే అదమ్ (అది, వాడు, ఆమె) ఇదమ్ (ఇది, వీడు, ఈమె) అను పదములు వాడఁబడుచున్నట్లు తెలియుచున్నది.[3] ఈ విషయమును బరిశీలించినచోఁ బయియూహా సిద్ధాన్తమగుచున్నది.

కన్నడమునందు లింగము అర్థము నాశ్రయించినదేగాని శబ్దము నాశ్రయించినది గాదని కేశిరాజు చెప్పుచున్నాఁడు. "కన్నడమునందు పురుషవాచక శబ్దములే పుంలింగములు. స్త్రీవాచకములే స్త్రీలింగములు. మిగిలినవి నపుంసకములు."[4]

నామముల తుది నెట్లున్నను క్రియావిభక్తిరూపముల తుదిని అరవమునను, కన్నడమునను, మలయాళమునను మహతీవాచకములను నిరూపించుటకు ళ్ అను ప్రత్యయము వాడఁబడుచునే యున్నది.

తెనుఁగుపద్ధతి పయివానినే పోలియున్నను గొంతభేదమునుగూడ గలిగియున్నది. శబ్దము లన్నియును మహద్వాచకములు, అమహద్వాచకములు అని రెండువిధములు. స్త్రీ పశు జడ వాచకములు అమహత్తులు. మిగిలినవి మహత్తులు.[5] మహదమహత్తులని రెండే భేదములు నన్నయచే నంగీకరింపఁబడినవి. మహత్తులలో అరవమువలె ఆణ్‌పాల్, పెణ్‌పాల్ అను రెండుభాగములు లేవు. అనఁగా ఏకవచనమునఁగూడ స్త్రీ పశు జడ వాచకములలోఁ బరస్పర భేదకసంజ్ఞతో గూడిన భాషాప్రణాళిక తెనుఁగున లేదన్నమాట. సీత మంచిది, గుఱ్ఱము మంచిది, చెట్టు మంచిది అనియే వాడుక. సీతె నల్లళ్, కుదిరె నల్లదు, మరం నల్లదు అను వాడుకవంటిది అరవ, కన్నడ, మలయాళములయందు గలదు. అహోబలపతి, చిన్నయసూరి మొదలగువారు సంస్కృతసంపర్కమున స్త్రీవాచకశబ్దములను వివరింపవలసివచ్చినప్పుడు మహతీవాచకంబులని యొక భేదమును గల్పించుకొనిరి.

ఇట్లు వైయాకరణులచే నంగీకరింపఁబడినదియు, భాషాస్వభావమున బాతికొనినదియు నగు స్త్రీ పుం నపుంసక భేదబోధకమగు ప్రణాళిక తెనుఁగున లేనిచో నట్టి భేదము తెలుపవలసినచోట్ల నడచుపద్ధతి తెనుఁగున నెట్లున్నదని యడుగక తప్పదు. లింగబోధక ప్రత్యయములు లేకయే అన్న, అక్క, అమ్మ, అయ్య, రాయి, రెడ్డి, చెట్టి, ఆవు, పాలు, నెయ్యి, తల్లి, తాత, పెనిమిటి, పెండ్లము, కూర మొదలగు

---

[3] C. G. D. page. 222.

[4] "పురుషరె పుంలింగం, స్త్రీయరె తాం స్త్రీలింగ మితిదువెల్లం నపాన్గిరె సల్గుం కన్నడదోళ్" శ. దర్పణము. సూ. 91.

[5] స్త్రీ పశు జడా న్వినాఽన్యే మహదాఖ్యా స్తద్విశేషణాశ్చ. ఆ. చి.

పదములన్నియు వాడఁబడుచుండుట సామాన్యమే యయినను కొన్నిపదములు శబ్దములకు ముందును వెనుకను చేర్చుటచేత స్త్రీ పురుష భేదము నిరూపింపఁబడుచున్నది. కొన్ని ప్రత్యయము లనఁదగినవికూడ గలవు. సాధారణముగా నవి స్త్రీసామాన్యము అర్థముగా గల పదములే. కాలక్రమమునఁ గొంత వైరూప్యమునంది నేఁడు ప్రత్యయ మాత్రములయిన వనక తప్పదు.

(1) ఆడు, మగ అను శబ్దములను ముందు చేర్చుటవలన లింగభేదము నిరూపింపఁబడుటకు ఆడుమనిషి, మగమనిషి ; ఆడుకుక్క, మగకుక్క ; ఆడుపువ్వు, మగపువ్వు మొదలయినవి.

(2) పెట్ట, పుంజు, అన్న, అక్క, అయ్య, అమ్మ అను శబ్దములను తుదిని జేర్చుటచేతను లింగము బోధింపఁబడుచున్నది.

కోడిపెట్ట, కోడిపుంజు, రామన్న, రామక్క, సోమయ్య, సోమమ్మ మొదలగునవి వాడుకలోని పద్ధతి. అప్ప యనునది ఉభయవిధముగాగూడ నున్నది. రామప్ప యనునది ఉభయబోధకము.

(3) పయి అన్న, అప్ప శబ్దములు వాడుకలో అన, అప అను రూపములను గూడఁ బొందియున్నవి. రామప, భీమన, సోమప మొదలగునవి.

(4) కాఁడు, గాఁడు, ఈఁడు, అఁడు, వాఁడు అనునవి నేఁడు పురుషవాచకములుగా తద్ధితప్రత్యయములుగా వాడఁబడుచున్నవి. ఉ : అందఁగాడు, ఆటకాఁడు, కొండీఁడు, వగలాఁడు, మాయలవాఁడు.

ఈ పయి యుదాహరణములన్నిటిలో పుంస్త్వబోధకము డుప్రత్యయమే యనుట స్పష్టము. పయి డుప్రత్యయచరిత్రమును సంపూర్ణముగా ముందు వివరించితిని. ఇంతియగాక ప్రాచీనకాలమున డుప్రత్యయ విరహితములుగానే పురుష వాచకములు వాడఁబడుచున్నట్లును అనేకోదాహరణముల నిచ్చితిని. ఈ డుప్రత్యయము సాధారణముగా పురుషవాచి యయినను అమహత్తులపయినిగూడ వాడఁబడుచునే యున్నది. పులియఁడు, బూచిగాఁడు మొదలగు కుక్కలపేళ్ళును ; గిజిగాఁడు, తోంచిగాఁడు మొదలగు పిట్టలపేళ్లను; పొర్లుగాఁడు మొదలగు చెట్ల పేళ్లను వ్యవహారములో నున్నవి. లింగబోధకప్రత్యయ మక్కరలేకుండు ప్రాచీనభాష యొక్క లక్షణమే దీనియందు ప్రతిబింబించుచున్నదనుట స్పష్టము. అనఁగా నా యభ్యాసమున మహత్ప్రత్యయ మమహత్తులపయి వచ్చెననుట. సుబ్బడు, రాముఁడు (స్త్రీలు) కృష్ణమ్మ (పురుషుడు) అను నేటి వాడుకనుగూడ గ్రహించునది.

(5) కత్తె, కత్తియ, త, ఆడి, ది, అది, అలు, ఆలు అనునవి స్త్రీవాచకములు. ఆటకత్తె, పనికత్తియ, కొఱవత, బోయత, కులుకులాడి, ఆటది, బోగముది, కాపుది, మాటలయది, మఱదలు, చెలియలు, ధీరురాలు, గుణవంతురాలు మొదలగునవి.

పయి ప్రత్యయములలో కత్తె, కత్తియలు అభిన్నములు. కా యను మతుబర్థకము పయి అత్తి, అత్తె, అత్తియ అను స్త్రీవాచకపదము చేర్చుటచే నేర్పడిన వీ ప్రత్యయములు. అత్త యను రూపముగూడ దీనికిఁ గలదు. కొఱవత మొదలగు వానియందలి తప్రత్యయమును బయిదాని పరిశిష్టమే. అత్తి యను పద పరిశిష్టమే తిప్రత్యయముగా నేర్పడినది. అది, ది, యను రెండును అభిన్నము లనుట స్పష్టము. కులుకులది, కులుకులయది. ఆలు, అలు అను రెండును అభిన్నములు. ఆలుశబ్దము స్త్రీసామాన్యవాచిగాను, కళత్రవాచిగాను నేఁడు వినఁబడుచునే యున్నది. వగలాఁడు, వగలాఁడి మొదలగు జంటలలో ఇవర్ణమే స్త్రీత్వద్యోతకము. తాయిశబ్దపరిశిష్టమగు ఆయి యనునది సీతాయి, గంగాయి మొదలగు శబ్దములలోఁ గన్పట్టుచున్నది. తాయి=అమ్మ.

(6) అ, ఇ, ఉ, స్త్రీవిషయాః[6] "అ, ఇ, ఉ, అనునవి స్త్రీవాచకములగు శబ్దములతుదిని వచ్చు ప్రత్యయములని నన్నయసూత్రము. ఉ. లచ్చ, లచ్చి, లచ్చు; రామ, రామి, రాము; గౌర, గౌరి, గౌరు; మల్ల, మల్లి, మల్లు; పోల, పోలి, పోలు; యెల్ల, యెల్లి, యెల్లు. ఇవే తెనుఁగు స్త్రీలింగములమీద వచ్చెడి వనవచ్చును." బాలసరస్వతీయమునఁ బయిరీతిని వ్రాయంబడియున్నది. పయి విధానము సంస్కృతభాషయందలి స్త్రీప్రత్యయ సంస్కారము ననుసరించి (ఆ, ఈ, ఊ అను ప్రత్యయములు) కల్పనచేయఁబడినది యనుట స్పష్టము. 'అన వచ్చును' అని వ్రాయు బాలసరస్వతిమనస్సున వీనినిగుఱించి సందేహము లేక పోలేదు. పై పేళ్లు నియతముగా స్త్రీమాత్రబోధకము లనుటకు వీలులేదు. పురుష బోధకముగాఁగూడ వాడబడుఁచునే యున్నవి. ఇందలి ఇ వర్ణముమాత్రము కొన్ని దేశ్య స్త్రీనామముల తుదిని ప్రచురముగా గనుపట్టుటచేతను, తత్సమముల తుదినున్న ఈకారముయొక్క హ్రస్వరూపము సాధారణముగా శ్రుతమగు చుండుటను, ఇ వర్ణముమాత్రము స్త్రీత్వబోధకప్రత్యయ మయిన దనవచ్చునని తోచుచున్నది. కావుననే వగలాఁడు అను పుంలింగమునకు సమానమయిన స్త్రీరూపము వగలాడి యయినది. ఇట్లే రంకులాడి, ఎమ్మెలాడి మొదలయినవి.

(7) తద్ధితప్రత్యయములలో ననేకములు ఉభయలింగబోధకములుగానే వాడుకలో నున్నవి. ఈ క్రింది యుదాహరణములను జూచునది.[7] జాలరి, ఒఱపరి, మొదలగు శబ్దములలో అరి వర్ణకము ఉభయలింగంబులయందు గలదని వ్యాకరణంబుల నిరూపింపఁబడినది.

ఇట్లే ఓయారాదులయందలి ఇ వర్ణకమును ఉభయలింగములయందును గలదు. ఓయారి, మిటారి. ఇడి యను అభావద్యోతకవర్ణకంబును ఉభయలింగముల పయి నగును.

ముక్కిఁడి=ముక్కులేనివాఁడు; స్త్రీ. మారి, పోతు మొదలయిన ప్రత్యయములు

---

[6](బాలసరస్వతీయము) ఆ. శ. చి. హలంత. 23 సూ.

[7]బా. వ్యా. తద్ధిత. 17; 18; 24; 28 సూ.

గూడ లింగభేదము నాశ్రయింపకయే స్త్రీ పురుష వాచకములయందుఁ బ్రయోగింపఁబడుచున్నవి. వగలమారి, తిండిపోతు మొదలగునవి.

పయి శబ్దములలోఁ గొన్నిటిపయి మఱలఁ గొన్నియెడల జాలరిదాన యనునట్లు ప్రత్యయాంతరప్రయోగములుగూడ నున్నవి. ఇట్లు ఒక్కటే మతు బాద్యర్థకప్రత్యయము స్త్రీ పురుషులకు వాడంబడుటయు ప్రాచీనకాలమున లింగ భేదబోధకప్రత్యయములు లేవనుటను స్థిరపఱచుచున్నది.

(8) పయిని నిరూపించిన స్త్రీలింగబోధకప్రత్యయములు చాలవఱకు నితర ద్రావిడభాషలయందును గన్పట్టుచు నవ్వానికి మూలమయిన శబ్దములు ద్రావిడ ములే యని నిరూపించుచున్నవి. కన్నడమున బళెగార=గాజులవాఁడు, బళెగార్తి; బాణసిగ = బానసీఁడు, బాణసిగితి; ఇనియన్ = ప్రియుండు, ఇనియళ్=ప్రియురాలు. పయిరూపములయందున్న తిప్రత్యయము తెనుఁగునందలి కత్తె, త, మొదలయిన ప్రత్యయములతో నభిన్నము. అళ్ ప్రత్యయము తెనుఁగుననున్న ఆలు, అలు, అనువానితో నభిన్నము. ఇట్లే అరవమునందును బయిప్రత్యయములతో నభిన్నములయినవి గలవు. నల్లన్=ప్రియుడు, నల్లళ్=ప్రియురాలు; మగన్= కొడుకు, మగళ్=కూతురు; ఒరువన్=ఒకడు, ఒరుత్తి=ఒకర్తి; వణ్ణాన్= చాకలివాడు, వణ్ణాత్తి=చాకలిది. పయిరూపములయందు అత్తి, అళ్ అనునవి అరవమునందును ప్రత్యయములుగా నున్నవి. ఇవిగాక అరవమున అచ్చి, కై, యను శబ్దములుఁగూడ స్త్రీలింగబోధకప్రత్యయములుగా వాడుకలో నున్నవి. మలైయన్=కొండవాఁడు, మలైచ్చి=కొండది, తంబి=తమ్ముడు, తంగై= చెల్లెలు. అచ్చి శబ్దమునకు తల్లి యను నర్థము కన్నడమునను, మలయాళమునను గలదు. కై యను శబ్దమునకు అరవమున చెలియలు అను నర్థము నిఘంటూ దాహృతము. ఇప్రత్యయముగూడ గలదు. పాట్టన్=తాత, పాట్టి= నాయనమ్మ.

పయి యుదాహరణములనుబట్టి అత్తి, కై, అళ్, అచ్చి, అమ్మ, అది, అనునవి ద్రావిడభాషలలో స్త్రీవాచకములనియు, నయ్యవి యెల్లద్రావిడభాషల యందును పదములతుదిని జేర్పఁబడి స్త్రీవాచకప్రత్యయములుగా భిన్నరూపములతో నేఁడు గనుపట్టుచున్నవనుటయు సిద్ధాంతము. ఇందలి అత్తి, అచ్చి, అమ్మ, యను శబ్దములు ద్రావిడములా, తద్భవములా, తత్సమములా, యను విచారణము గలదు. ఆ విచారణము నటుంచి యవి యీ భాషలలో నున్నవే యనుటయు, స్త్రీవాచకము లనుటయు నిర్వివాదముగదా ! కనుక పయివాదము నిర్బాధము.

అత్తి, అత్తికా, అత్తా, అక్కా, శబ్దములు సంస్కృతనిఘంటువులలో నీయంబడినవి. అమ్మ—అంబాశబ్దభవమని చెప్పుచున్నారు. కాని యివి ద్రావి డము లనియే నా తలంపు. అరవమునను, ఇతర ద్రావిడభాషలలోను కొన్నిశబ్దములకు

సార్వనామికమూలరూపములగు నా, తన్, మా, ఎన్, నన్ మొదలగునవి చేర్పఁబడి స్వార్థమునను, అన్యార్థమునను ప్రయోగింపఁబడుచుండును.[8] అన్న, నా+అన్న (తండ్రి), తై=తల్లి. ఇది తాయ్ శబ్ద సంక్షేపరూపము. తందై, ఎందై, నుందై = తండ్రి (అర), అల్లే తంబి, ఎంబి, నంబి=తమ్ముఁడు; సమానార్థకములు. అల్లే ఎంగై, నంగై, తంగై అను పదములు కై యనుదానికి ఎన్, నన్, తన్ అనునవి చేర్పుటవలన గలిఁగి స్త్రీవాచకము లగుచున్నవి. ఇల్లే అ+కై=అక్కై, అ+మై= అమ్మై, అ+తాయ్=అత్తై యనియు ద్రావిడమున నే రూపము లేర్పడి పయియర్థమున నున్నవని తోచుచున్నది. వానినుండియే సంస్కృతముననుండిన అక్కా, అత్తా శబ్దము లేర్పడిన వనుట సమంజసము. ఈ పయిశబ్దములు ద్రావిడములనియే ద్రావిడభాషాస్వభావమునుబట్టి స్పష్టము. ఒకప్పుడు తద్భవములే యని నిరూపించి నను, ముందు చేసిన సిద్ధాంతమునకు ప్రతిబంధకము లేదు.

పయివిచారణమువలనఁ దేలిన సారాంశము: ప్రాచీనద్రావిడమున లింగ బోధకప్రణాళిక లేదు. కాలక్రమమున స్త్రీ పురుష సామాన్యవాచకములయిన శబ్ద ములు పదములకు ముందును వెనుకను జేరి లింగబోధకము లయినవి. ఆ పదములు చాలవఱకు ద్రావిడములుమాత్రమేగాక యా యా మాండలికముల (తెలుఁగు, అరవము మొ.) లోనివే యనుట నిస్సంశయము. అవియే కాలక్రమమున ప్రత్య యము లయినవి. ఇట్టి ప్రత్యయములలోఁ గొన్నిటికి ద్రావిడభాష లన్నిటియందును మూలప్రకృతులు సమానముగానే యున్నవి. కాఁబట్టి తెనుఁగునందలియు, ఇతర ద్రావిడభాషలయందలియు లింగబోధనప్రణాళిక యందే స్వతంత్రముగాఁ గలిగినది.

ఇఁక సంస్కృతమునందలి లింగభేదము కేవలము శబ్దగతమగుట వ్యవహారమున వ్యత్యస్తమయినది. ప్రాకృతరూపములు ఆ శబ్దములనుండి యేర్పడియుండుటచేత మాఱుపడి లింగవ్యత్యయముగూడ ననేకస్థలములయందు గలిగినది. కాని సంస్కృ తమునందువలెనే ప్రాకృతమునందును మూఁడులింగములను నెఱుంగవలెనని ప్రాకృత వైయాకరణులు సూత్రించిరి. ఇట్టి సంస్కృత ప్రాకృతములలోని లింగమునకును ద్రావిడభాషలలోని లింగమునకును భేదము సుప్రసిద్ధము.

పయిని నిరూపించిన ద్రావిడములయిన లింగ విభక్తి వచనములకును, సంస్కృత ప్రాకృతముల యందలి లింగ విభక్తి వచనములకును కొంచెమయినను సంబంధము లేదను టయు, ఆ యా భాషలకు జన్య జనక భావసంబంధము లేదనుటయు సిద్ధాంతము. ద్రావిడ భాషలలో స్వతంత్రముగాఁ బయి లింగ విభక్తి వచన ప్రణాళిక యేర్పడినది. సంస్కృ తమునందలి లింగ విభక్తి వచన ప్రణాళిక ప్రాకృతమున వ్యత్యస్తమయ్యును ఆ రెండిటియొక్కయు జన్య జనక భావసంబంధమును నిరూపించుచునే యున్నది. ద్రావిడభాషల నట్లనుట కేమాత్రమును వీలులేదుగదా!

---

[8] C. G. D. పుట 398-400. 1937-వ సంవత్సరం ఓరియంటల్ కాన్ఫరెన్సులో నా చదివిన వ్యాసము. ముద్రితసంపుటము పుట 1288.

# విశేషణములు

## 1. విశేషణముల స్వభావము

విశేషణము అను శబ్దము సంస్కృతమునుండి తెనుఁగువ్యాకరణములోనికి వచ్చినది. విశేషించునది యని యర్థము. విశేషించుట యనగా ఒక శబ్దమువలనఁ దెలియఁగలిగిన యర్థము నంతకంటె సంకుచితపఱచి అనఁగా స్పష్టపఱచి తెలియఁ జేయు శబ్దాంతరము విశేషణము. ఇట్లు స్పష్టపఱుపఁబడునది విశేష్యము. తెల్ల యావు, High wall, ఉత్తమః పురుషః. ఈ మూఁడు ఉదాహరణములును మూఁడు భాషలనుండి గ్రహింపఁబడినవి. ఇందు రెండవపదమునకుగల విశాలార్థమును మొదటిపదము సంకుచితపఱచుచున్నది. ఆవు శబ్దమువలన నెట్టి గోవయినను గ్రహింపఁబడఁదగియుండఁగా తెల్లశబ్దమును ముందుఁ జేర్చుటవలన నితరవర్ణములు గల యావులు తొలగింపఁబడుచున్నవి. అట్లే తక్కిన High, ఉత్తమః అను పదములును ప్రయోగింపఁబడుచున్నవి.[1] ఇచ్చట విశేషణములు మూఁడును భేదకధర్మము లను బోధించుచున్నవి. ఇట్టి ధర్మములు గుణ క్రియాదు లేమయినఁ గావచ్చును. వ్రాయువాఁడు - ఇందు వ్రాయు అనునదియు విశేషణమే కాని క్రియావాచి.

ఈ విశేషణములు మూఁడువిధములుగా (వానికి భావమునందుగల స్థానమును బట్టి) విభజింపఁబడినవి. 1. వ్యావర్తకము : అనఁగా ఇతరవస్తువులనుండి భేదించుట మాత్రమే లక్షణముగా గలవి. తెల్ల, నడుచు మొదలయిన పదములు. 2. విధేయము : విషయము; ఉద్దేశ్యము, విధేయము అను రెండువిధములయిన విభాగము గలది. ఉద్దేశించి చెప్పఁదగినది ఉద్దేశ్యము. మీదఁ దెలియఁదగినది విధేయము. ఉద్దేశ్యము వక్తృశ్రోతల కిరువురకును దెలియఁదగినది. విధేయము వక్తకు మాత్రము తెలియునది. "రాముఁడు పురుషశ్రేష్ఠుఁడు" ఇందు రెండవది విధేయ విశేషణము. "జూదరి యవమానము చెందును" ఈ జూదరిశబ్దమునందు గల జూదము అనునది హేతుగర్భవిశేషణము. అనఁగా అవమానమును చెందుటలో నియ్యది హేతువు. పయిరీతినిగాక ప్రౌఢవ్యాకరణకర్త జాతి క్రియా గుణ ద్రవ్య సంఖ్యా సంజ్ఞా ప్రయుక్తంబులని యారువిధములుగా విశేషణములను విభజించెను. పయి

---

[1] విశిష్యతే అనేన ఇతి విశేషణమ్. భేదకధర్మే గుణక్రియాదౌ. నీలం ఉత్పలమ్. చలో గౌరిత్యాదౌ గుణక్రియాదిః భేదకధర్మః. విశేషణంచ త్రివిధం : వ్యావర్తకం విధేయం హేతు గర్భం చేతి తత్రాద్యం : నీలోఘటః ఇత్యాదౌ నీలః, ద్వితీయం : పర్వతో వహ్నిమాన్, అత్ర వహ్నిర్విధేయ విశేషణమ్. "న్యక్కారోహ్యయ మేవ మే యదరయః" ఇత్యాదౌ న్యక్కారో విధేయః. తృతీయం : యథా సురాపః పతతీ త్యాదౌ సురాపానం హేతుగర్భం విశేషణమ్ విశిష్యతే భేద్యతే గుణాదిభి రసౌ కర్మణిల్యుట్. - వాచస్పత్యము.

విశేషణవిభాగము సంస్కృతమునందలి వైయాకరణుల పద్ధతినిబట్టి చేయఁబడినది. విశేషణ మను పదమునకు సాధారణమయిన యాంగ్లీకరణము Adjective అనునది. ఆంగ్లమున గుణ పరిమాణ సంఖ్యా నిర్దేశ ప్రశ్నార్థకము లని యైదువిధములుగా Adjective విభజింపఁబడినది. ఇట్టి విభజనము అర్థమాత్రమునుబట్టియే కాక శబ్ద స్వరూపమునుబట్టియు, ఆ యా భాషలయందలి వాక్యములలోని పదయోజనాపద్ధతిని బట్టియు నేర్పడుచుండును.

"శబ్దములు విశేష్యములు, విశేషణంబు లని ద్వివిధములు" అని ప్రౌఢ వ్యాకరణకర్త నామప్రకరణమున నిరూపించెను. పదము లవి నామములు క్రియ లవ్యయంబు లని త్రివిధంబులుగా నాతని విభజనమగుటం జేసి విశేషణం బనునది భాషా భాగములలో నొక్కటిగా నాతఁ డంగీకరింపలేదని యర్థము. నవ్యాంధ్రవ్యాకరణ ములలో విశేషణమును పృథగ్భాగముగాఁ బేర్కొనుట యాంగ్లభాషాసాహ చర్యమున ననుట స్పష్టము. విశేష్య విశేషణభావము కల్పితము. విశేషణము లనం బడినవి స్థానమునుబట్టియు, ప్రయోగమునుబట్టియు దాత్కాలిక విశేషణత్వమును బొందునేగాని వేఱుగాదు.[2] ఈ యభిప్రాయము యథార్థమే యయినను రూపాదికమునను, ప్రయోగాదికమునను భేదముగల యుదాహరణములు ముందు నిరూపింపఁబడును.

## 2. తెనుఁగువిశేషణముల స్వరూపము

భాషలయొక్క యవస్థాపరిణామమును నిరూపించునపుడు విశ్లేషాత్మక భాషలలో (Isolating Languages) పదము లన్నియు నొక్కరీతినే యుండుననియును, నయ్యవి వాక్యమునందలి స్థానమాత్రముచేతనే భిన్నవర్గమునకుఁ జేరి భిన్నములయిన భాషాభాగముల పనిని జేయుననియును జెప్పితిని. ఇట్టి పదములు కాలక్రమమున మాఱి భాష తదితరావస్థలను బొందునప్పటికి ప్రత్యయాంతతను బొందుటయు, రూపాంతరితము లగుటయును జరుగునని చెప్పితిని. తెనుఁగు సంయోగాత్మకావస్థ యందు (Agglutinative) ఉండుటచే నీ యవస్థకుఁ బూర్వమయిన యవస్థలోని లక్షణములు బహుళముగా శబ్దముల రూపములయందు గనుపట్టుచునే యుండును. అట్టి దీ విశేష్య విశేషణ భాగమునందలి పదములలోఁ గనుపట్టు ననుట ఈ క్రింది యుదాహరణములనుబట్టి స్పష్టము.

అంతవాఁడు ; ఇచ్చినయంత ; ఎఱ్ఱకన్నులు ; కన్నెఱ్ఱ ; సొగసుపలుకు ; పలుకుసొగసు ; వాడిములికి ; ములికివాడి ; తళుకుచూపు ; చూపుతళుకు ; మంచిమాట;

[2]Substantives and adjectives are interchangeable in all languages and from a grammatical point of view there is no clear cut boundary between them. They may both be grouped together in a single category of the noun. *Language Vendryes*. Page 117.

మాటమంచి ; వెలసొమ్ము ; సొమ్ము వెల ; గట్టిమాట ; మాటగట్టి ; పెద్దతల్లి ; ఇంటిపెద్ద, ఇట్టి యుదాహరణములు అనేకములు నిరూపింపనగును. వీనియం దెల్లను ఒక్కఁటే పదము, ముందునిల్చుటవలన విశేషణమును, తరువాత వచ్చుటవలన విశేష్యమునుగాఁ బనిచేయుచుండుట స్పష్టము. అనఁగా ఒక్కఁటేపదము రూపమున మార్పులేకయే, ప్రత్యయవిశేషమును జేర్పకయే, విశేషణముగాఁగాని, విశేష్యముగాఁగాని యుపయోగపడుచుండును. ఇది తెనుఁగునందలి సామాన్యపద్ధతి. ఇట్టి పద్ధతియే సామాన్యమయ్యు మఱికొన్ని పద్ధతులును గాలక్రమమున నేర్పడినవి లేకపోలేదు.

ద్వితీయాది విభక్త్యంగరూప మేర్పడినప్పుడు నామముతుదిని ఇ, అ, అనునవి చేర్చుట యభ్యాసమని ముందు చెప్పితిని. అట్టి రూపమే విశేషణరూపముతో సభిన్నమగుచున్నది. కాటిబుగ్గి, ఏటిమన్ను, నూతినీరు, మొదలగు సమాసములయం దెల్లను మొదటిపదము ఇవర్ణమును చేర్చుటచేతనే విశేషణమయి రెండవ శబ్దముయొక్క యర్థమును కొంచెపఱచుచున్నది. పయిరూపముల చరిత్రము నౌపవిభక్తికములలోఁ దెల్పితిని.

మువర్ణాంత శబ్దములతుది నున్న మువర్ణమునకు బదులు పు, ంపు, అను వర్ణములలో నొకటి యాదేశమగుటవలన నయ్యది విశేషణ మగుచున్నది. వేదము + గని = వేదపుగని, బలితంపురక్కసి. ఈ మార్పునుగుఱించిగూడ నేను ముందు కొంత విచారించితిని. ఈ మువర్ణముయొక్క ప్రాచీనరూపము పు, ంపు, అనియే సిద్ధాన్తము. కావున వేదపు, బలితంపు, మొదలగు రూపములే ప్రాచీన కాలమునఁ బ్రథమాంతములగు విశేష్యములుగా నుండినవి. వానిని ఇంకొక పదమునకుముందు చేర్చుటమాత్రముననే విశేషణము లగుచుండెను. కాని యీ రూపములే ప్రథమాంతమున మాఱి మువర్ణాంతములగుటను, సమాసముల నడిమిని అట్లే ప్రాచీనరూపములు నిలిచిపోవుటను, గాలక్రమమున విశేష్య విశేషణముల రూపములకిట్టి స్వల్పమయిన అంతభేదము భేదకముగా నేర్పడుటవలనను, పు, ంపు, లు విశేషణరూపముల యంతములుగా స్థిరము లయిపోయినవి. ప్రథమాంతములగు మువర్ణములనుండియే విశేషణరూపములను సాధించుటచేత వైయాకరణులు 'ము' స్థానమున పు, ంపు, ల నాదేశములుగా నిరూపించిరి. ఈ పుంపులయొక్క యుపయోగము నన్నయభారతమునఁ జాల విరళము. తిక్కనగ్రంథమున నధికము. అట్లే కాలక్రమమున మిక్కిలి ప్రచారమును బొందినది. భారతముననే పుంపులు రాక బువర్ణమును మాత్రమే వాడినస్థలము లనేకములు గలవు. కర్మధారయంబు నర్థమునఁ బ్రయోగములు : బలితంపు రక్కసు - ఆది. IV 221. విరుద్ధంపు వరము - ఆది VII. 260 ; వీనిపుట్టిన పాపంపువేళ - అర. 149. పరుసంపురాలపై. అర. III. 300. పై యుదాహరణములలో 'బలితంపు రక్కసు' అనుటకు 'బలియుండౌ రక్కసు' అనియును, 'పాపంపువేళ' అనుటకు 'పాపంబువేళ' అనియును గౌతమీ గ్రంథాలయస్థ తాళపత్రప్రతులలో పాఠములు కాన్పించు

చున్నవి. తిక్కన రెంటికిని 'విరుద్ధంబు వరము', 'పరుసంబురాలపై' అని పుంపులు రాని పాఠములు కాన్పించినచో కర్మధారయమందేకాక ఏసమాసమందును మువర్ణమునకు పుంపులు రావని చెప్పవలసివచ్చును.''[3]

షష్ఠీ సమాసము లనందగు తపంబు గౌరవంబు-ఆర. 1. 34. తపముబలము-ఆర. II. 209. ఆశ్రమంబుదెస - ఆర. III. 273. అను నీ స్థలములయందు పుంపుల ప్రసక్తియే లేదు. నన్నయభారతమున నిట్టుండుటకును, దరువాతివారి గ్రంథములయందు పుంపులు విశాలముగ వాడంబడుటకును హేతువు నూహించుట సులభము. నన్నయకాలమున పు, ంపు లు బువర్ణాదికముతో సభిన్నము.లని యును, దనకాలమున నవ్యరూపములగు బు, ము లు అంతమందుగల పదములను జేర్చుట మాత్రముచేతనే విశేషణరూపము లేర్పడుట తెలుఁగుభాష స్వభావ మనియు నాతం డెఱింగియుండుట నట్లు ప్రయోగించెను. కాలక్రమమున భాష పరిణతిఁజెంది సంస్కృతభాషాసాహచర్యమున విశేష్య విశేషణ రూపములకు భేదక మయిన యాకారము స్థిరపడుటచేత తిక్కనాదుల గ్రంథములలో పు, ంపు ల వాడుక మిక్కిలి ప్రచారములోనికి వచ్చినది.

పదము.లతుదిని అకారము చేర్చుటచే విశేషణములును ఏర్పడుచుండినవి. నల్ల, తెల్ల, మొదలయిన నేటి విశేషణరూపము లట్లేర్పడినవే. ప్రాచీనకాలమున నీ శబ్దములన్నియును ఏకాచ్కములుగానేయుండి నల్, వెళ్ మొదలయిన రూప ములతో నుండినట్లు అరవ కర్ణాట భాషలనుండి స్పష్టమగును. ఆఱేడు శతాబ్దుల యందలి కన్నడశాసనములందలి యీక్రింది రూపములను బరిశీలించునది.[4]

నల్ + గిరి = నల్గిరి ; వెళ్ + మాడ(మ్) = వెళ్మాడమ్.

పెర్ + గొౌరవమ్ = పెర్గొౌరవమ్.

ఇట్లే అరవమునను వెళ్ + యానై = వెళ్యానై (తెల్లయేనుగు)

వెళ్ + చామరమ్ = వెణ్చామరము (వింజామరము)

నల్ + అవన్ = నల్లవన్ (మంచివాఁడు)

ఇట్లే వెళ్ (వెల్ల), తణ్ (చల్లని), నేర్ (తిన్నని), పల్ (అనేకము, అధికము), నుణ్ (నున్నని), మేల్ (మీది) అను శబ్దములు అరవమునను, వానికి సమమయినవి కన్నడమున బెళ్, తణ్, నేర్, బల్, నుణ్, మేల్, అను రూపములతోను ప్రాచీనభాషలో వాడుకలో నున్నవి.[5]

---

[3] ఆ. భా. చ. పుట 1352.

[4] *Grammar of the Oldest Kanarese Inscriptions* Page 164-165.

[5] *Lectures on the History of Kanarese Language*. Page, 77

ఇట్టి హలంతశబ్దములు విశేష్యములుగాఁగూడ వాడఁబడుచుండి అకారము చేర్పఁబడుటచేతను, తుదిహల్లు ద్విత్వమును బొందుటచేతను తెనుఁగునఁ గాల క్రమమున విశేషణములుగా నేర్పడినవి. కావుననే వెల్ల, నున్న, పెద్ద మొదలగు రూపములు గనుపట్టుచున్నవి. ఇట్టి అకారాంతరూపములు కాల క్రమమునఁ దమ విశేషణత్వరూపమును బోగొట్టుకొని విశేష్యములుగా వాడఁ బడుచు వచ్చినవి.

"అమ్మహాశ్వంబు ధవళదేహంబునందు నల్ల లేదయ్యెనేని" నన్నయ. ఇందు 'నల్ల' విశేష్యమునుగూడ నయినది. మఱల 'నల్ల' యను విశేషణము పయిని న ప్రత్యయము వచ్చి 'నల్లన'యను విశేష్యరూపము. దానిపయిని ఇ ప్రత్యయము వచ్చి 'నల్లని' యని విశేషణరూపము. దానిపయిని మఱల 'తనంబు' అను ప్రత్యయంబు వచ్చి 'నల్లందనంబు' అని యేర్పడినది. దాని పయిని 'పు, ంపు' లు వచ్చి నల్లందనంపు, గడుసుందనంపు మొదలగు రూపములు వాడుకలోనికి వచ్చినవి. ఇట్లు విశేష్య విశేషణములు తబ్బిబ్బు పడుటయు మఱల ప్రత్యయాంతరమును జేర్చి క్రొత్తరూపంబును గల్పించుటయును భాషకు స్వాభావిక మయినది.

అగు, అయిన, అను శబ్దములను జేర్చుటచే విశేష్యములెల్లను దెనుఁ గున విశేషణము లగుచున్నవి. అందమయినవాఁడు, సొగసయిన పలుకు, శుభ మగు చెయిది. ఇందలి అగుధాతువు అభేదమును బోధించుచున్నది. క్రియల యందును ఇట్టి అగుధాతువు అనుప్రయుక్తము కాఁజొచ్చెనని ప్రాచీనభాషా లక్షణమున నిరూపించితిని. ఇంతియగాక అగుధాతువునకు కలదియగు, కలిగియుండు అను నర్థములు గలవు. ఈ క్రింది ప్రయోగములను జూచునది. "సతి నివ్వెఱగయి నిల్చెను", "సైన్యముదెస మొగ మయ్యెను", "సురధాణి నిండుకొలువై యుండి", "ఆలుమగలును నొక కుత్తుకై నఁగాని". పయియర్థమున అగుధాతుప్రయోగము విశేషణముల చరిత్రమును స్పష్టపఱచుచున్నది. సంఖ్యా వాచకములును అగుధాతువును జేర్చుటచేతను విశేషణము లగుచున్నవి. నాలు గగు పర్వము = నాలుగవు = నాలుగవ = నాలుగో. నేఁటి కా అగుశబ్దము ఓగా మారినది.

నిర్దేశ సర్వనామాంగములగు ఆ, ఈ, ఏ, అనునవియును, నీ, నా, తన మొదలయిన సర్వనామాంగములును, తద్ధర్మార్థక్రియావిశేషణము లనంబడెడి ధాతురూపములును ముందుఁ జేర్చుటవలన విశేషణము లగుచున్నవి. ఆ యిల్లు, ఈ మాట, నా పని, నీచేత, వచ్చువాఁడు, తిను మనుష్యుఁడు మొదలయినవి.

పయిపద్ధతిని బరిశీలించినచో తెనుఁగునందలి విశేషణరూపనిర్మాణము చాల నసంకీర్ణ మనుట స్పష్టము. 1. పదమునకుముందు ప్రయోగించుటవలననే విశేష్యము విశేషణ మగుట. 2. ఇగాని, అగాని పదాంతమునఁ జేర్చుట.

3. అగు, అయిన, అనువానిని దుదిని జేర్చుట. ఈ మూఁడుపద్ధతులనుబట్టియే విశేషణము లేర్పడును. ఇతరములయిన యలంతిమార్పులు అనఁగా శబ్దముల యంత్యభాగమున గలుగునవి కాలక్రమమున గలిగిన పరిణామముతప్ప వేఱుగాదనుట పయివిచారణమునుబట్టి స్పష్టము. అట్టివగు నల్ల, తెల్ల, మొదలయినరూపములు నేఁటి భాషలో విశేషణరూపములుగానే యున్నవి. అనఁగా గొన్నిశబ్దములు కాలక్రమమున విశేషణమాత్రములుగ స్థిరపడిపోయినవి.

## 3. సంస్కృత విశేషణముల స్వరూపము

సంస్కృతమునందు విశేష్యములు విశేషణములుగా మాఱుట కనేకపద్ధతులు గలవు. ఇట్టి విశేషణత్వము అనేకార్థభేదములయందు రూఢమయి యొక్కొక్క యర్థభేదమున కొక్కొక్క ప్రత్యయవిశేష ముపయోగింపఁబడుచుండును. ఇవి తద్ధితములు, కృత్తులు అను రెండువిధములు గలవు. ఇందలి ప్రత్యయము లనేకములు అనేకార్థములలో వాడఁబడుట నవియెల్ల నిచ్చట నీయందగినవికావు. మాదిరి మాత్రము సూచింపఁబడును. అపత్యార్థకములు, మత్వర్థీయములు మొదలగు ప్రత్యయములన్నియును విశేష్యరూపములు విశేషణము లగుటకుఁ బనికివచ్చును.

I. భగినికొడుకు = భాగినేయుఁడు. గంగకొడుకు = గాంగేయుఁడు.
ఏయ ప్రత్యయము.
వ్యాసునికొడుకు=వైయాసకి. దక్షునికొడుకు=దాక్షి. ఇప్రత్యయము.
గర్గునివంశజుడు=గార్గ్యాయణుఁడు. గార్గ్యాయణి. "ఆయన, ఆయని"
రేవతికొడుకు=రైవతికుడు—ఇక ప్రత్యయము
ఉపగు (వు) కొడుకు=ఔపగవుడు—అప్రత్యయము

II. తారకలు గలది=తారకితము—ఇత ప్రత్యయము
దయగలవాఁడు=దయాళువు—ఆళు ,,
ఫలముగలది=ఫలినము—ఇన ,,
తుందముగలది=తుందిలము—ఇల ,,
బుద్ధిగలవాఁడు=బుద్ధిమంతుడు—మతుప్ ,,

ఇట్లే మిన్ (వాగ్మిన్), ఇన్ (గుణిన్), ఉర (దంతుర) మొదలయిన ప్రత్యయము లెన్నియో గలవు.

III. ఇఁక భిన్నార్థములలో వచ్చు ప్రత్యయము లనేకములు.
కాకముల సమూహము=కాకము అప్రత్యయము
హేమంతమునఁ దగినది=హైమంతము
దేవునికి సంబంధించినది=దైవము ,,

ఇట్లే అక (ఔష్ట్రికము), ఆమహ (పితామహ), ఇన్ (శ్రాద్ధీ), ఇయ (క్షత్రియ) మొదలయిన వెన్నియో గలవు. పయివన్నియును తద్ధితప్రత్యయములు మాత్రమే. కృత్ప్రత్యయములును మిక్కిలిగా గలవు. అనేకము లయిన యర్థభేదములలో ననేకములయిన ప్రత్యయము లిట్లు వాడుటవలన విశేషణరూపము లేర్పడు భాష యొక్క పరిణతికిని,అవస్థకును, బయి తెనుఁగునందలి పద్ధతికిని సంబంధముగాని, సామ్యము గాని లేదు. ఒకటి యనేకశాఖావిలసితము. రెండవది ప్రాథమికము, మిక్కిలి యసంకీర్ణము. పయి తెనుఁగుపద్ధతియే యితర ద్రావిడభాషలయందును వాడుకలో నుండి యీ భాషలయొక్క సాజాత్యమును, సంస్కృతభిన్నతను స్పష్టపఱచుచున్నది.

సంస్కృతము ప్రత్యయాత్మకభాషయును, మిక్కిలి వృద్ధావస్థయం దున్నదియు నగుటవలన నందలి విశేష్య విశేషణములకు లింగ విభక్తి వచనములయందు ఏకరూపత గలుగవలయు నను నియమము పెటిగి వైయాకరణాంగీకృతమయినది. ఈ క్రింది యుదాహరణములను జూచునది.

రూపవాన్ పురుషః, రూపవతీ స్త్రీ, మహత్ సంకటమ్,

ఏతే మయూరాః, తాని పుస్తకాని, గచ్ఛన్తీ నారీ.

పయి యుదాహరణములయం దెల్లను విశేషణ విశేష్యములు లింగ విభక్తి వచనములయం దభిన్నములుగా నున్నవి. ఒక్క విశేష్యమున కనేక విశేషణము లున్నపు డన్నియు నొక్క తీరుననే యుండవలయును. కాదంబరిలోని యీ క్రింది వాక్యమును జూచునది. "విదిత సకల శాస్త్రార్థః, రాజనీతి ప్రయోగ కుశలః, కళానిపుణః, గీతశ్రుతీనాం వేదితా, కర్మణి ప్రవీణః, ద్యూతవ్యాపారే ప్రగల్భః........ వైశంపాయనోనామ శుకః." ఇందలి శుకః అను పుంలింగ ప్రథమైకవచనమునకు అనేకములయిన విశేషణములు గలవు. అవియన్నియు ప్రథమావిభక్తిలోనే యున్నవి. తుదిని విశేష్యమున్నది.

పయిరీతినున్న సంస్కృతభాషలోని యభ్యాసమునే తెనుఁగుపండితులు తెలిసికొని యద్దానినే తెనుఁగున నుపయోగించుచు వచ్చిరి. తెనుఁగునఁ బ్రవేశించిన తత్సమములతో గూడిన వాక్యరచన కొంతవఱ కట్లే జరిగినదిగాని యట్టిపద్ధతి తెనుఁగు యొక్క స్వభావమును మార్చలేకపోయినది.

"విశేష్యంబునకుంబోలె విశేషణంబునకు లింగ విభక్తి వచనంబు లగు"[6] అను చిన్నయసూరిగారి సూత్రము (తత్సమభాషాసామాన్యమునకు) సంస్కృతభాషాను సారి యనుట నిస్సంశయము. పయిసూత్రంబునకుఁగల యపవాదవిధానము చాల నధికమయినది. ఈ సందర్భమున బాల, ప్రౌఢ వ్యాకరణములయందలి సూత్రము లను బరిశీలించునది. ఆ యా సూత్రంబులకు సంబంధించిన ప్రయోగంబులు మాత్రము క్రింద నిరూపింపఁబడుచున్నవి.

[6] బా. వ్యా. కారకము. సూ. 19.

మాటలు పెక్కు ఏల. ఇష్టమగు పదార్థములు. అన్ని గుఱ్ఱములకు, గుఱ్ఱములు అన్నింటికి, రెండు గుఱ్ఱములకు, గుఱ్ఱములు రెండింటికి, లక్ష గుఱ్ఱములకు, గుఱ్ఱములు లక్షకు, రవుతులు లక్ష, సుగుణాభిరాముఁడు రాముసకు జోహారు వొనర్చెద.

విద్యాశాలియగు పురుషుని సర్వజనులు సన్మానింతురు
పార్థివప్రాగ్రసరుండు ధర్మసుతు పన్విది నీకు నలంఘ్యము
అహీనబాహుబలసారఘనుల్ మధుకైటభాది దైత్యపతులనెల్ల
ఎవ్వనిం బురోహితుండుగాఁ జేకొనువారము.[7]

పయి యుదాహరణములనుబట్టి పరిశీలించినచో విశేష్య విశేషణంబులకుఁ గావలసిన సమాన లింగ విభక్తికత్త్వాదికనియమం బెట్లు వ్యభిచరించినదియో స్పష్టము కాక తప్పదు. దీనికి హేతువు తెనుఁగున నట్టి నియమము భాషాస్వభావములో లేకుండుటయే యనుట స్పష్టము. కాని తత్సమ విశేషణాదికమున మాత్రము సంస్కృతమునందలి యభ్యాసమే చాలవఱకు నిలిచినది. పెరుగుచుండిన భాష యొక్క లక్షణమును, నాఁటి యవసరములును బయి మార్గమునకు హేతువులనుట నిర్వివాదము. అట్లు సర్దుకొనుటలోఁ గల్గిన తబ్బిబ్బులను మఱికొన్నిటిని గ్రింద నిరూపింతును.

అమహత్తులగు స్త్రీలింగ విశేషణంబులకు రెండువిధములగు రూపంబులు నుండును. పద్మలత మనోహారిణి, మనోహారి. లతాశబ్దము స్త్రీలింగము[8] కాని అమహత్తు. అమహద్విశేషణము అనగా నపుంసకంబు అను రూపము కలుగుటయే తెనుఁగు ధర్మము. మనోహారిణి యను స్త్రీలింగరూపము సంస్కృతభాషానుసారి. "మిన్నేరు శివజటావాసిని" మొదలయిన ప్రయోగంబులు కేవల సంస్కృత తుల్యంబులు. ఇట్లే ఉరగులు, భుజగులు, సముద్రుఁడు, మేఘుఁడు మొదలగు రూపములు సంస్కృతమునందలి దేవాద్యంశారోపణమువలననే గలిగినవిగాని తెనుఁగు సంప్రదాయము వీని నమహత్తులుగా నెంచుటయే. కావుననే 'ఉరగములు, భుజగములు, సముద్రము, మేఘము మొదలగు రూపములును గలవు. మిత్రాదులు (మిత్ర శరణ ప్రధాన పాత్రాదులు) రెండు విధములగు రూపములతో నుండుటయుఁ బయి తెనుఁగుపద్ధతివలననేఁ గలిగినదనుట స్పష్టము. "రాముఁడు ప్రధాన మఖిల గీర్వాణులందు", "నప్రధానంబు లందఱు నరసిచూడ", "జానకి కాంతారత్నము, దైవరత్నము రాముఁడు", "రాముఁడు రాజసింహము."

పయి ప్రయోగములయం దెల్లయెడలను ద్వైరూప్యమేర్పడుటకు తెలుగు విశేషణముల మహ దమహ ద్భేదవిధానమువలనఁ గలిగిన తబ్బిబ్బు హేతువనుట నిస్సంశయము.

---

[7] బా. వ్యా. కార. సూ. 20, 26, 27, 28; ప్రౌ. వ్యా. కార. సూ. 21, 22, 24, 25;
[8] అం. శ. చిం. ఉభయవిధ మమహతీనామ్.

తెనుఁగునందలియు, నితర ద్రావిడభాషలయందలియు విశేషణనిర్మాణప్రక్రియకును సంస్కృతమునందలి దానికిని సంబంధమేలేదు. ఒకటి భాషా శైశవావస్థ, రెండవది ప్రౌఢావస్థ. వీనికి జన్యజనకభావముగాని, సోదరభావముగాని లేదు. తెనుఁగు సంస్కృతానుకారి యయినదనుటలో విప్రతిపత్తిలేదు. కాని తజ్జన్యము కాని, సమానోదరముగాని కాదు.

## 4. తర తమ భావనిరూపణ పద్ధతి

విశేషణములలో ఆంగ్లమున Positive, Comparative, Superlative అను మూఁడువిధములయిన తర తమ రూపప్రణాళిక గలదు. ఆంగ్లమున High అను పదము విశేషణము. 'ఎత్తయిన' అని యర్థము. రెండు అంశములను పరిపోల్చి చూడవలసి వచ్చినప్పుడు Higher అను రూపము వాడుదురు. This is higher than that (ఇది దానికంటె ఎత్తైనది). This is the highest (ఇది అన్నిటిలోఁ ఎత్తైనది). తక్కిన వాని నన్నిటినుండియు దీని నిర్ధారించునప్పుడు పైరూపము వాడుదురు. ఈ మూఁడు విధములయిన తర తమ భావ నిరూపణము గల ప్రణాళిక యాంగ్లమున విశేషణములకు వర్తించును. ఇది భాషలోని విశేషణముల నిర్మాణమును, వాని తర తమ భావ నిరూపణవిధానమును జాల పరిణతముగా నున్నట్లు నిరూపించుచున్నది. ఇది యొక ప్రణాళిక. ఇట్టిపద్ధతియే సంస్కృతమునను గలదు. బుద్ధిమాన్ అనఁగా బుద్ధిమంతుడు. బుద్ధిమత్తరః అనఁగా ఇరువురిలో బుద్ధిమంతుఁడు అని భావము. బుద్ధిమత్తమః అనఁగా ననేకులలో బుద్ధిమంతుఁడని భావము. పయి యభిప్రాయమును దెల్పుటకు తర, తమ, యను ప్రత్యయములు వాడఁబడును. ఇంతియగాక ఈయస్, ఇష్ఠన్, అను ప్రత్యయములును వాడఁబడును. బలీ, బలీయాన్, బలిష్ఠః; దీర్ఘః, ద్రాఘీయాన్, ద్రాఘిష్ఠః. పయిరీతి ప్రణాళిక తెనుఁగున లేదు.

కాని పైయభిప్రాయములను దెలుపుటకుఁ దెలుఁగున స్వతంత్రమయిన మఱియొక ప్రణాళిక బయలుదేరినది. 'జానపదులకంటె నాగరులు వివేకులు', 'గోవులలోఁ గపిల బహుక్షీర'. మొదటిది తరప్రత్యయముయొక్కయు, రెండవది తమప్రత్యయముయొక్కయు నర్థమును నిరూపించును. సంస్కృతమునను, ఆంగ్లమునను విశేషణమునకుఁదుదిని ప్రత్యయములు చేరుటచే నీ యభిప్రాయము తెలియనగును. ఆంధ్రమున నట్లుగాదు. విశేషణము రూపమున మార్పులేదు. న్యూనగుణవాచి యయిన శబ్దమునకు తరప్ ప్రత్యయార్థమున కంటెవర్ణక మగును. అట్లే తమప్ ప్రత్యయార్థమున సముదాయవాచి శబ్దమునకు లో, లోపల యను శబ్దములలో నొక్కటి చేర్పనగును. ఈ యర్థమున 'అందు' అనునదియుఁగూడ వాడనగును. పయిప్రణాళిక తెనుఁగున స్వతస్సిద్ధముగా గలిగినది. దీనిని నిర్వచించుటకు సూరిగారు 'నిర్ధారణపంచమియు, నిర్ధారణషష్టియు' నను పదములను

సంస్కృతవ్యాకరణములయందలి కారకవిధానము ననుసరించి కల్పించవలసివచ్చినది. కంటె మొదలగువాని చరిత్రమును ముందు నిరూపించితిని.

ఈ పద్ధతి ద్రావిడభాషలయందెల్ల నిట్లే యున్నదనుట స్పష్టము. అరవమున అదై పార్కిలుమ్ ఇదు నల్లదు= దానిని జూచినను, ఇది మంచిది. అదైవిడ ఇదు నల్లదు=దానిని విడుచునట్లు ఇది మంచిది. అవట్రిల్ ఇదు నల్లదు=వాటిలో నిది మంచిది. మొదటి రెండు ఉదాహరణములను తరప్ప్రత్యయార్థమునకును, తరువాతిది తమప్ ప్రత్యయార్థమునకును ప్రయోగములుగా నున్నవి. ఇదఱ్కు అదు పెరిసు= దీనికి అది పెద్దది. పయిపద్ధతి తెనుఁగుతో నభిన్నమగుట నిస్సంశయము. ఇట్లే కన్నడమున ఇన్తా, ఇన్త, ఇన్తలు అనునవి తరభావమును దెలుపుటకు వాడఁబడును. సక్కరగిన్త సవి ఇల్ల=చక్కెరకంటె రుచిలేదు. అదక్కిన్తలూ దేవమాన హన్నెరడుఅష్టు హెచ్చు=దానికంటె దేవమానము పండ్రెండురెట్లు పెద్దది. అరవమునను, కన్నడమును, తెనుఁగుననుగూడ కుప్రత్యయ మీయర్థమున వాడఁబడుచున్నట్లు స్పష్టపడుచున్నది. ఇదర్+కు (అర), సక్కరెగె + ఇన్త (కన్నడ), చక్కెరకు + అంటె( తెలుగు ). తమ భావార్థమున కన్నడమునందు సప్తమీవిభక్తి వాడఁబడును.[9] పురుషరోళ్ క్షత్రియం శూరం= పురుషులలో క్షత్రియుడు శూరుడు. పురుషర్ల్లి క్షత్రియను శూరను (హొసగన్నడము). ఒళ్, ల్లి అనునవి రెండును తెలుఁగునందలి లో, అందు విభక్తులయొక్క సమాన రూపములు. దీనినిబట్టి ద్రావిడభాషలన్నియు నొక్కరీతినే స్వతంత్రముగా పెరిగినవనియును, సంస్కృతాజన్యములనియు స్పష్టము.

9. నిర్ధారణేచ. క. భా. భూ. సూ. 87. జాతిక్రియాగుణద్రవ్యైరేకదేశ పృథక్కరణం నిర్ధారణమ్, తస్మిన్ వివక్షితే చ సప్తమీ విభక్తిర్భవతి.

# క్రియా విశేషణములు

ముందటి విచారణమున నిరూపింపఁబడినవన్నియు నామవిశేషణము లనుట స్పష్టము. ఇవికాక క్రియావిశేషణములు గలవు. నామము నెట్లు గుణక్రియాదికము చేత నీశబ్దముల ప్రయోగము ఇతరములనుండి పృథక్కరించుచున్నదో యట్లే క్రియల యర్థమును విశేషించునవి క్రియావిశేషణము లనంబడును. ఆంగ్లమున వీనిని Adverbs అని వ్యవహరింతురు. ఆంగ్లమునందలి ఆడ్వెర్బులకును, తెనుఁగునందలి క్రియా విశేషణములకును గల భేదము ఇందే స్పష్టపరుపఁబడును. విశేషణ విశేష్యములకు గల రూపభేద మల్పమని ముందు నిరూపించియుంటిని. అట్టి సందర్భమున విశేషణములలో నొక తెగయగు క్రియావిశేషణములకును, నామవిశేషణములకును గల రూపభేద మల్ప మనుటలో సందేహము లేదు. ఆంగ్లమున (ఆడ్జెక్టివులు) నామ విశేషణములకును, (ఆడ్వెర్బులు) క్రియావిశేషణములకును రూపమునను,స్వభావమునను ఒక భేద మేర్పడి యవ్వాని రూపనిష్పాదనప్రక్రియలోఁ గొంత వైలక్షణ్యము సిద్ధించినదనుట వాని రెంటిని వేరుజాతులుగాఁ బరిగణింపవలసివచ్చినది. "ద్రావిడ భాషలలో క్రియావిశేషణము లనంబడు నొకజాతి పదములు లేవు. అట్టి క్రియా విశేషణములుగా వాడఁబడుచున్న పదములన్నియును సవిభక్తికములో, లేక అవిభక్తికములో అయిన నామములుగాని, ధాతురూపములుగాని, తుమున్నాద్యర్థ రూపములుగాని అయియున్నవి" అని కాల్డ్వెల్లుగారు వ్రాసియున్నారు.[1] ఈ యభిప్రాయము సత్యమనుట క్రింది యుదాహరణములనుబట్టి తెనుఁగున స్పష్టపడును.

1. దేశ కాల వాచకములయిన నామములు : మీ రెందు బోయితిరి; ఎక్కడ నున్నది; అక్కడి కేగితిని; ఊరికిఁ బోతిని; వాఁడు నిన్న వచ్చె; నిన్నటికి వచ్చె. పయి యుదాహరణములలో ఎందు, ఎక్కడ అనునామములు పోవు, ఉండు అను క్రియారూపములకు విశేషణములు. అట్లే వాని విభక్త్యంతరూపములగు ఊరికి, నిన్నటికి, మొదలయినవియు బయి యర్థమునే సూచించును.

2. గుణవాచకములయిన నామములు : మెల్లన నొచ్చెను; చక్క వచ్చెను; పెద్ద విచారించి.

ఇందు మెల్లన, చక్క, పెద్ద యను నామములే క్రియావిశేషణములు.

3. అయి, కాన్, అనునట్టి అగుధాతువుయొక్క రూపములను చేర్చుటవలన నీ క్రియావిశేషణములు కలుగుచున్నవి.

---

[1] Every word that is used as an adverb in the Dravidian languages is either a noun, declinable or indeclinable, or a verbal theme or the infinitive or gerund of a verb. C. G. D. pp. 553-54.

దుర్మార్గుడుగా నున్నాఁడు; పెల్లుగా దొరగు రక్తము; మంచిదై యున్నది. ఈ అగుధాతువు అభేదమును నిరూపించుచు ముందటిశబ్దముయొక్క నామత్వమును గాని, నామవిశేషణత్వమునుగాని స్థాపించుచున్నది.

4. అన్నంతక్రియలగు చాల, కూడ, అయిన, మొదలయినవన్నియును క్రియావిశేషణములుగా నుపయోగపడుచున్నవి.

చాల (లా) నిచ్చితివి. కూడ (డా) పనిచేయవలెను.

5. క్త్వార్థకములు, వ్యతిరేకక్త్వార్థకములు, శత్రర్థకములు, చేదాద్యర్థకములు నగు క్రియారూపము లన్నియును క్రియావిశేషణములుగా వాడుచున్నారు. చేసి వచ్చితిని (చేసిన తరువాత యని యర్థము); మాటాడక ఉంటిని (ఎట్లు ఉండెనో మాదిరి తెల్పఁబడుచున్నది); పరుగెత్తుచు పడెను (పరుగెత్తునప్పుడు అని భావము); చూడక వెళ్లెను (వెళ్లుటయొక్క మాదిరి తెలుపును); వింటే చెప్పుదును (వింటే అనునది నియమమును జెప్పుచున్నది). పయిరీతిని వాడగలిగిన పదములు తెలుఁగున వేలకొలంది గలవు. ఆంగ్లమున అడ్వెర్బులు స్థలము, కాలము, మాదిరి, పరిమాణము, హేతువు, ఫలము, నియమము లేక షరతు, ఉద్దేశము మొదలయిన భావములను దెలుపుచు క్రియలయొక్కగాని, నామవిశేషణములయొక్కగాని, క్రియావిశేషణములయొక్కగాని యర్థమును విశేషించునవి. ఆ పదజాతమునకుఁ గల ప్రత్యేకలక్షణములనుబట్టి యాంగ్లమున నవి విభజింపఁబడినవి. సాధారణముగా నామవిశేషణములకు (Adjectives) ly అనుదానిని చేర్చినచో నీ రూపము లాంగ్లమున సిద్ధపడును. ఇంకొక విషయమేమనఁగా ఆంగ్లమున క్రియాప్రాధాన్యము గలిగిన వాక్య మేర్పడినది. అట్టి క్రియాప్రాధాన్య ముండుటవలననే కర్తయుఁ గర్మయు నద్దానితో నన్వయించుచున్నవి. ఆ కర్త్రాదులకు నామవిశేషణము లుపయోగించు పద్ధతి గలిగినది. అట్లే క్రియకును విశేషణములు నిరూపించిరి. ఇది యా వాక్యమునందలి ప్రణాళిక. అట్టి పద్ధతి తెనుఁగున లేదు. తెనుఁగునఁ గ్రియాప్రధానవాక్యము నేటికిని నేర్పడినదా, లేదా యనుట సందిగ్ధమే యనక తప్పదు. (ఈ విషయము క్రియాప్రకరణమున వివరింపఁబడును.) ఇట్టి భాషలో క్రియావిశేషణములను వెదకుట నిష్ఫలము, పయిగా దాని నొక భాషాభాగముగాఁ జేర్చుట మిక్కిలియు నవసరములేని పని. మఱియు నాంధ్రవ్యాకరణమున రూపనిష్పాదన ప్రక్రియయే మొదటినుండియు నుద్దిష్టము. అర్థికవిచారణము, పదవిభజన అనునవి నవీనములు. ఆంగ్ల, సంస్కృతములలోని యనుకరణములు.

## అవ్యయములు

అవ్యయము లనఁబడువానిలో ననేకములయిన క్రియావిశేషణములు గతార్థము లయినవి. కాని యతినవ్యవ్యాకరణములలో ముఖ్యముగా అవ్యయములు" అను ప్రకరణ మొక్కటి బయలుదేరినది. ఇట్టి ప్రకరణము చింతామణియందు

గాని, బాల ప్రౌఢ వ్యాకరణములందుగాని లేదు. అట్లనుటవలన వారి భావమును గ్రహింపలేదని యూహింపవలదు. చిన్నయ కొన్నిటి నవ్యయములని పేర్కొనెను. "ఎల్ల శబ్దము ద్రుతాంత మయిన యవ్యయంబు." ప్రౌఢవ్యాకరణకర్త త్రివిధమయిన పదజాతమును విభజించుచు నవ్యయములను నొకవిధముగా నిరూపించెను. "అవ్యయము లనఁగా విభక్తి వచన శూన్యములు. అవి ప్రతిపదోక్తములు, లాక్షణికములు నని ద్వివిధములు. ప్రకృతిసిద్ధములు ప్రతిపదోక్తములు. లక్షణసిద్ధములు లాక్షణికములు." ఇట్లు వ్రాయుటకు సిద్ధాన్తకౌముదిలోని యవ్యయప్రకరణమే మూల మనుట నిస్సంశయము. అందు స్వరాదులును, నిపాతములును అవ్యయము లని నిరూపింపఁబడి, కొన్ని ప్రత్యయములు అంతమందు గలవియు నవ్యయములని నిరూపింపబడినవి.[2] వాని నాధారముగాఁ జేసుకొనియే అవ్యయములను ప్రతిపదోక్తములు, లాక్షణికములు నని రెండువిధములుగా విభజించుట యేర్పడినది. కొన్ని ప్రత్యయము లంతమందు గల యవ్యయములు లాక్షణికములుగా నిరూపింపఁబడినవి.[3] ఆ పద్ధతి ననుసరించియే తెనుఁగునందలి కొన్ని శబ్దములను మొదట నవ్యయములుగాఁ బరిగణించి, యా తరువాత లాక్షణికములను నిరూపించుట జరిగినది. "ధాతువునుండి పుట్టిన యవ్యయములు క్త్వార్థకములు, వ్యతిరేకక్త్వార్థకములు, శత్రర్థకములు, తుమున్నర్థకములు, చేదాద్యర్థకములు, ఆనన్తర్యార్థకములు అని యాఱువిధములు." "లాక్షణికావ్యయము లారువిధములు." ఇట్లు అవ్యయప్రకరణ మను పేరఁ దెనుఁగువ్యాకరములయందు నిరూపింపఁబడిన

---

[2] పాణినీయము 1-1-37-41 ; 2-4-82 సూత్రములు — స్వరాదినిపాతమవ్యయమ్। తద్ధితశ్చాసర్వవిభక్తిః॥ కృన్మేజన్తః। క్త్వాతోఽసున్‌కసునః। అవ్యయీభావశ్చ। అవ్యయాదాప్సుపః। సదృశం త్రిషు లింగేషు సర్వాసుచ విభక్తిషు। వచనేషుచ సర్వేషు యన్నవ్యేతి తదవ్యయమ్। ఇతి శ్రుతిః లింగకారక సంఖ్యాభావపరా॥

పయిసందర్భమున బాలమనోరమలోని కొన్ని విశేషములు

"తత్ర సర్వావిభక్తయః యస్మాన్నభవంతీతి బహువచనాంతవిగ్రహో నసంభవతి। అవ్యయేభ్యః సప్తానాం విభక్తీనాం ఉత్పత్త్యభ్యుపగమాత్......ఏవంచ సర్వా వచనత్రయాత్మికా విభక్తిః యస్మాన్నోత్పద్యతే, కింతు ఏకవచనాన్యేవ ఉత్పద్యంతే, స తద్ధితాంతః అవ్యయ సంజ్ఞః స్యాదితి ఫలతీత్యర్థః॥ అయంచ లింగకారక సంఖ్యాభావ నియమః నిపాతానామేవ. స్వరాదీనాంతు కతిపయానాం లింగకారక సంఖ్యాన్వయోఽస్త్యేవ. 'స్వరాదినిపాతమవ్యయం' ఇతి సూత్రే భాష్యే చాదీనామసత్త్వవచనానామేవసంజ్ఞా। స్వరాదీనాంతు సత్త్వవచనా నామ సత్త్వ చనానాంచ ఇత్యుక్తత్వాత్॥ స్వస్తి వాచయతి, స్వస్తివాచ్యః। తీ ణేపుర్ణ్యే స్వః పతతి. ప్రాతర్యజతే. ఇత్యాదౌ కర్మకారక యోగదర్శనాచ్చ.

[3] పాణినీయము 1-1-38. 35,40. సూత్రములు. క్త్వా, తోసున్, కసున్ ప్రత్యయాంతములు. మకారాంతముగాని, ఏజన్తముగాని యగు కృత్ప్రత్యయ మంతమున గలవి. పాశప్ ప్రత్యయమునకు ముందున్న తసిలాదులు. తసిల్, పాశప్, శస్, అమ్, ఆమ్, కృత్వసుచ్, వతి, వినా, నానా మొదలగు ప్రత్యయములు విధింపఁబడిన శబ్దములు. కౌముదీశరదాగమము-పుట 450.

క్రమమున కేమి ఫలితము. సంస్కృతమునందు "అవ్యయా దాప్ సుపః" అను సూత్రముచే అవ్యయసంజ్ఞగలదానికంటె విధింపఁబడిన సుప్ ప్రత్యయమునకును, ఆ యను ప్రత్యయమునకును లోపము గలుగుట ఫలము. సంస్కృతమునందలి యెల్లశబ్దములపయిని విభక్తిప్రత్యయము గలుగుటయు, నిట్లవ్యయసంజ్ఞ గలవానికి వచ్చిన సుబ్విభక్తికి లోపముగలుగుటయు యుక్తము. తెనుఁగునఁగల శబ్దములలో ననేకములు స్త్రీసమంబు లగుట ప్రథమావిభక్తిప్రత్యయము విహితమగుటయే లేదు. అట్టి సందర్భమున దెనుఁగునందలి యవ్యయసంజ్ఞకు ప్రయోజనము నిరూపింపవలసిన యవసరము తెనుఁగువైయాకరణులపయిని గలదు.

కొన్ని శబ్దము లవ్యయము లగునా, కాదా యను విషయమున వైయాకరణులలో భేదములు గలిగినవి. ఈ సందర్భమున నీ వాక్యములు విమర్శింపఁదగును. "బాలవ్యాకరణము, శబ్దరత్నాకరముగూడ అప్పు డిప్పు డెప్పు డను శబ్దములు విశేష్యములని చెప్పుచున్నవిగాని యది సరికాదు. ఇవి వాక్యములందు కర్మలుగాని, కర్తలుగాని కాకపోవుటచే విశేష్యములు కావనుట స్పష్టము. ఇంక నివి సర్వనామవిశేషణములు కావనుట విదితమేకదా! కావున వీని యవ్యయత్వమునుగూర్చి విశేషచర్చ యుం దనావశ్యకము." పయిరీతిని జేసిన నిర్ణయమునందు విశేష్యము లన్నియు వాక్యములందు కర్తలుగాని, కర్మలుగాని కావలయు ననుటలో ప్రమాణము లేదు. విశేష్య విశేషణములు రెండును నామము లనెడి జాతియంతర్భాగములు. నామములకు లక్షణమును నిర్వచించుచు 'సత్త్వ ప్రధానాని నామాని' అని యాస్కుఁడు నిర్ణయించెనేగాని వాక్యమునందలి కర్తృత్వ, కర్మత్వములకు యోగ్యతగలుగుట యని నిర్ణయింపలేదు. విశేష్య మనఁగా విశేషణముచే విశేషింపఁబడు యోగ్యత గలది యనిగదా యర్థము. అప్పుడు అవ్యయములుమాత్ర మేల విశేష్యములు గాగూడదు. ఈ క్రింది ప్రయోగమును జూచునది. 'చెప్పినదెల్ల వింటిని.' వింటిని అను క్రియకుఁ గర్మ యేది? ఎల్ల యనునదియా, చెప్పినదియా? ఈ రెంటిలో దేనికి ప్రాధాన్యము? ఎల్లకే ప్రాధాన్య మనుట స్పష్టము. చెప్పినది అను విశేషణము లేకయే 'ఎల్లను వింటిని' అని వాడుట గలదు. వినుటయందు ముఖ్యాన్వయము 'ఎల్ల' కే. చెప్పినది యనునది యప్రధానమే యైనది. ఇక్కడ ఎల్ల శబ్దమే కర్మ యనక తప్పదు. పయిగా విశేష్యముగాక తప్పదు. దానికి సాకల్యముగా అని యర్థము చెప్పుదుమందుమేని చెప్పవచ్చునుగాని యంతమాత్రమున ఎల్లయొక్క ప్రాధాన్యము పోలేదుగదా! అప్పుడు ఎల్లయే విశేష్య మనుట తప్పదు. సంస్కృతమునను అవ్యయమునకు కర్తృత్వ, కర్మత్వములు పరిహరింపఁబడలేదు. 'స్వస్తి' అవ్యయము. "స్వస్తివాచయతి" యను ప్రయోగము గలదు, అను బాలమనోరమా విచారణమును ముం దుదాహరించితిని. ఇట్లు అవ్యయములయొక్క లక్షణము వాక్యములయందలి ప్రయోజనమాత్రమునుబట్టిగాని, రూపమాత్రమునుబట్టిగాని

యతివ్యాప్త్యవ్యాప్తులు లేనట్లు నిర్ణయింప వీలులేదు గావుననే పాణినీయమున నివి యొక పట్టికగా నిరూపింపఁబడినవి.

కొన్ని వేలసంవత్సరముల క్రిందటనే ప్రత్యయాత్మకత్వమును ముఖ్యలక్షణ ముగాఁ బడసిన సంస్కృతముననే యిట్లుండ తెనుఁగునందలి యవ్యయముల స్వరూపమునుగాని, లక్షణమునుగాని నిరూపించుట చాల కష్టమని చెప్పనక్కఱలేదు.

చరిత్ర తెలియని శబ్దములు ఏకవచనమాత్రమున నున్న కొన్ని సుబంత రూపములు, (చిరం, చిరేణ, చిరాయ), విభక్త్యర్థమునఁ బ్రయోగింపఁబడుచున్న కొన్ని సమాసములు, ఎల్లవిభక్తులు చేరని కొన్ని తద్ధితాంతములు, కొన్ని కృదంత ములు అవ్యయములుగా పాణినిచేఁ బేర్కొనఁబడినవి.

పయిపద్ధతినే తెనుఁగునను కొన్నిశబ్దముల నవ్యయములుగా వేర్పఱుప నగును. అంశమాత్రమున లాభముగాని నష్టముగాని లేదు. కాని భాష ప్రత్య యాంత మనియు, సుప్తిఙంతములయిన పదములతుదిని ప్రత్యయములు చేరుచున్న వనియు నంగీకరించి యా రీతిని విభజించునపుడు అవ్యయప్రకరణము తెనుఁగు వ్యాకరణమున నుండక తప్పదు. కొన్నిశబ్దములను అవ్యయములుగా నిరూపింప వలెనా, లేదా యను వివాదమునకుమాత్రము అవకాశమును తప్పదు.

కాని ఒక్కవిషయముమాత్ర మీ సందర్భమున నిరూపింపవలయును. ఆంగ్ల మున నున్న ఆడ్వెర్బులను మనసులో నుంచుకొని క్రియావిశేషణములను అవ్యయ ములుగా నిరూపించు నాచారము నేటి భాషావిదులయం దేర్పడినది. ఆంగ్ల వ్యాకరణమర్యాద ననుసరించి ఆడ్వెర్బులు వాక్యమున కర్తలుగాగాని, కర్మలుగా గాని యుండజాలవు. అట్లుండుట నామములు, నామతుల్యములు నగువానికే తగును అని యాంగ్లమున సిద్ధాంతము. అట్టి సంస్కారముననే లక్షణములును, విచారణయు తెనుఁగున బయలుదేరుచున్నవి. ఈ క్రింది వాక్యమును జూచునది.

"మునర్ణాంత తత్సమశబ్దములపయి తరువాతికాలమున కన్, కాన్, అనునవి చేరి అవ్యయత్వమును బోధించుచోట్ల నన్నయభారతములో వాని సప్త మ్యేకవచనరూపములే తఱచుగ అవ్యయములుగ నుపయోగింపఁబడినవి." "నిర్భయమునన్, అగ్నిసాక్షికంబునన్, ఆకరమునన్..." నిర్భయముగా యని నేటి వాడుక నిర్భయముకాగా అని యర్థము. భయము పోయిన యవస్థ కలిగినతరువాత యని భావము. ఇట్లే అయినన్, కాన్, మొదలయిన అగు ధాతురూపములు వాడుటవలన నామాదికము క్రియావిశేషణము లగుచున్నవని ముందు నిరూపించితిని. ఇందు అవ్యయపదము క్రియావిశేషణార్థమున వాడఁబడినది.

పయి విచారణమువలనఁ గలిగిన సిద్ధాంత మేమనఁగా భాషయొక్క ప్రత్య యాంతత్వస్వభావము మిక్కిలి ప్రాథమికమై స్థిరపడలేదు. సంస్కృతముయొక్కయు, ఆంగ్లముయొక్కయు లక్షణములనుబట్టియు, వివరణమునుబట్టియు తెనుఁగుస్వరూప మును నిరూపించి వర్గీకరించుటకు పండితులు ప్రయత్నించుచున్నారు.

# సంఖ్యావాచకములు

## 1. విశేష్య విశేషణ రూపభేదము

ఒక భాషయొక్క స్వరూపస్వభావములను దెలిసికొనవలయునన్న నందలి వ్యాకరణవిధానమును, ప్రాచీనధాతుస్వరూపములను ముఖ్యాధారములుగా గ్రహింపవలయునని ముందు దెలిపియుంటిని. ఇతరపదములలో ముఖ్యమయినవి సంఖ్యావాచకములును, సర్వనామములు నయి యున్నవి. మానవుని విజ్ఞానాభివృద్ధిలో మొదట నెఱుంగనయినవి యివి రెండు ననుట స్పష్టము. అట్లుగా మిక్కిలి ప్రాథమిక స్థితిలో నున్న భాషలలోఁగూడ సంఖ్యాభేదమును, నీవు, నేను, వాఁడు అను భావముల భేదమును తెలియఁబడుచునే యుండును. అట్టి పదముల రూపములను దెలిసికొనుట వలన నా భాష కితరములయిన యేభాషలతో సంబంధము గలదు, అది యెట్టిది, అనుట నిశ్చయింపనగును. కావున తెనుఁగుసంఖ్యావాచకములయొక్క స్వరూపమును, చరిత్రమును దెలిసికొనుటకు ముందు ఇతరములయిన ద్రావిడభాషలలోని యా యా శబ్దముల స్వరూపము నెఱుంగవలయునని యొకపట్టికగా నందలి రూపముల నీ క్రింద నొసంగుచున్నాను.

| తెలుఁగు | తమిళము | కన్నడము | మలయాళము | తుళు | సంస్కృత | హిందీ |
|---|---|---|---|---|---|---|
| ఒకటి, ఒండు; | ఒన్ఱు | ఒన్దు | ఒన్ను | ఒంజి | ఏక | ఏక్ |
| ఒక, ఒక్క | ఒరు, ఓర్ | ఒర్ | ఒరు, ఓర్ | ఒర్ | | |
| రెండు | ఇరండు | ఎరడు | రండు | రడ్డు | ద్వి | దో |
| ఇరు | ఇరు, ఈర్ | ఇర్ | ఇరు, ఈర్ | ఇర్ | | |
| మూఁడు | మూన్ఱు | మూరు | మూన్ను | మూజి | త్రి | తీన్ |
| మూ, ము | మూ, ము | మూ, ము | మూ, ము | మూ, ము | | |
| నాలుగు | నాలు, నాంగు; | నాలు, నాల్కు; | నాల్, నాక్కు; | నాలు | చతుర్ | చార్ |
| నాలు, నలు | నాల్ | నాల్ | నాల్ | నాల్ | | |
| ఏను, ఐదు | ఐన్దు, అంజు | ఐదు | అంజు | ఐను | పంచ | పాంచ్ |
| ఏ, ఏన్ | ఐ | ఐ | ఐ | ఐ | | |
| ఆఱు | ఆఱు | ఆరు | ఆఱు | ఆజి | షష్ | ఛః |
| అఱు | అఱు | అర | అఱు | అజి, ఆజ్ | | |
| ఏడు | ఏழு | ఏళు | ఏழு | ఏళు | సప్త | సాత్ |
| డె | ఎழு | ఏ | ఎழு | ఏళ్ | | |
| ఎనిమిది | ఎట్టు | ఎంటు | ఎట్టు | ఎణ్మ | అష్ట | ఆఠ్ |
| ఎనమ | ఎణ్ | ఎణ్ | ఎణ్ | ఎణ్ | | |

| తెలుఁగు | తమిళము | కన్నడము | మలయాళము | తుళు | సంస్కృత | హిందీ |
|---|---|---|---|---|---|---|
| తొమ్మిది | ఒన్బదు, ఒన్బాన్ | ఒమ్భత్తు | ఒంబదు | ఒర్ | నవ | నౌ |
| తొమ్మండు | తొండు, ఒన్బత్తు | ఒమ్భయి | | ఒరుమ్బ | | |
| తొమ్మ | తొళ్ | తొమ్ | తొళ్ | సొణ్ | | |
| పది | పత్తు, పాన్, పదు; | పత్తు, హత్తు; | పత్తు, | పత్తు, పాద్ | దశ | దస్ |
| పద, పన్ | పదిన్, పన్ | పదిన్, పది,పన్; | పదిన్, పన్ద్ | పదు, పదున్ | | |
| | | | | పత్, పవ | | |
| నూఱు, వంద | నూఱు | నూరు | నూఱు | నూదు | శత | సౌ |

పయి పట్టికనుఁ జక్కఁగాఁ బరిశీలించినచో సంస్కృత, ప్రాకృత, హిందీభాషలలోని సంఖ్యావాచకముల కొకప్రక్కను, తెలుఁగు మొదలయిన ద్రావిడభాషల కొక ప్రక్కను గల సంబంధము స్పష్టముకాక తప్పదు. తెనుఁగు మొదలుకొని తుళు వఱకును గల యయిదుభాషలలోను పయిరూపము లొక్కరీతిగానే యున్నవి. కాలక్రమమున భాషలో నేర్పడు సమీకరణము, ఆకర్షణము మొదలగు మార్పులవలన గలిగిన భిన్నరూపములలో నొకశబ్దమే యన్నిభాషలలో నున్నట్లు స్పష్టపడుచున్నది. అట్లే సంస్కృత, ప్రాకృత, హిందీ భాషలలోను గనుపట్టుచున్నదనుట చెప్పనక్కఱలేదు. మొదటి యయిదుభాషలును నొక్కజాతి యనియు, సంస్కృత, ప్రాకృత, హిందీ భాషలు మఱొక్కజాతి యనుటయు నిస్సంశయముగఁ దేలినదియే.

పయి సంఖ్యావాచక స్వరూపములలో రెండువరుసల రూపములు నిరూపింపఁబడినవి. మొదటివి విశేష్యములు, రెండవవి విశేషణమాత్రములు. అనఁగా రెండవరూపములు విశేషణములుగానే సమాసములయందును, పదాదిని వాడఁబడుచున్నవేగాని వానికి స్వతంత్రప్రయోగము లేదన్నమాట. ''నాదగ్గర నున్నవి మూఁడు'' అని చెప్పుదుము. కాని ''నాకు మూ ఇచ్చితివి'' అనుదానివంటి ప్రయోగము ఉండదని భావము. ఇట్లే ఇతర ద్రావిడభాషలయందును నెఱుఁగునది. పయి పట్టికయందలి వేర్వేఱు ద్రావిడభాషలలోని విశేష్యరూపములకంటె విశేషణరూపములయందు అధికమయిన సామ్య మున్నట్లు స్పష్టముగా గోచరించును. దీనికి హేతు వేమైయుండునని యూహింపక తప్పదు. విశేషణప్రకరణమున నొక పద్ధతిని నిరూపించితిని. సాధారణముగా విశేషణరూపము ప్రాచీనమును, విశేష్యరూప మర్వాచీనమును నగుచున్నదనుటయే యది. మొదటి విశేషణరూపమే రెండువిధములుగా వాడఁబడుచుండును. అట్టి పదములయొక్క తుదిని ప్రత్యయములు చేరుటవలనను, సంధిలో మార్పులు వచ్చుటను క్రొత్తవిశేష్యరూప మొక్కటి బయలుదేరును. అప్పుడు ప్రాచీనరూపము విశేషణమాత్రముగానే యుండును. తరువాత కాలక్రమమున మఱల క్రొత్తవిశేష్యరూపము విశేషణముగా వాడఁబడుచుండును. దానినుండి మఱల నొక్క విశేష్యరూపము గలుగును.

ఇట్లే పయి విశేష్య విశేషణచక్రము భాషాయంత్రమున నిరంతరము పరిభ్రమించుచునే యుండును అని విశేషణప్రకరణమున స్పష్టముగా నిరూపించితిని.

ఇక నేటి సంఖ్యావాచకములలో మొదటివరుసలో నున్న విశేష్యరూపము లన్నియును అన్ని ద్రావిడభాషలలోను నుభయవిధములుగా వాడఁబడుచున్న వనుట నీ క్రింది ప్రయోగములనుబట్టి స్పష్టము. అరవమునందు తొల్కాప్పియు నారు ఒన్ఱు, ఇరండు మొదలయిన పదములు పెయర్ అని నిరూపించెను. ఒక్క ఒన్ఱు శబ్దముతప్ప సంఖ్యావాచకముల విశేష్యరూపములు విశేషణములుగా వాడఁబడుచునే యున్నవి. ఇరండు మనిదర్కళ్ (ఇద్దరు మనుష్యులు). వీనికి విశేష్యముయొక్క లింగ విభక్తి వచనములు రావు. ఇరణ్డుమనిదరై (రెణ్డు మనుష్యులను), మూన్ఱుమక్కళాల్ (మూడుబిడ్డలచేత).[1] పయిని నిరూపింపఁబడినవి మహద్రూపములు. అమహద్రూపములు మిక్కిలి బహుళము. ఇరణ్డు చెవి, నూఱుపేర్ (నూరుమనుష్యులు), నాంగు మాడుగళ్ (నాలుగు పశువులు). ఇట్లే కన్నడము నందును ఎరడు మాతు (రెండు మాట), ఒన్దు హబ్బ (ఒకటి పండుగ), ఎంటు జనరు (ఎనిమిది జనులు), ఆరు కాయి (ఆరు కాయలు) మొదలగు ప్రయోగములు గలవు. తెనుఁగున అమహత్తులలో రెండు కాయలు, మూఁడు మాటలు మొదలయిన ప్రయోగములు నిర్బాధములు. మహత్తులలో రెండు మనుష్యులు, మూఁడు పురుషులు మొదలయిన ప్రయోగములు కనుపట్టలేదు.[2] అనఁగా ప్రాచీనములగు వ్యాకరణాదికముగల అరవ కన్నడములయందు మహదమహద్భేదము లేకయే విశేష్యరూపములను వాడుటయుఁ గలదు. తెనుఁగున నమహత్తులలోమాత్ర మట్టివాడుక గలదుగాని మహత్తులలో లేదు. అనగా నలువురు, ఏవురు, అయిదుమంది, మొదలయిన రూపములే కలవుగాని 'రెండు మనుష్యులు' మొదలగు నవి లేవనుట. ఇదియే తెనుఁగునకును, అరవ కన్నడములకును గల భేదము.

సంస్కృతమునందు, ఏక, ద్వి, [ ] చతుర్, అను నాలుగుశబ్దములును విశేషణము లయినప్పుడు విశేష్యమునకువలెనే లింగ వచన విభక్తు లగును. అనఁగా మూఁడులింగములలోను అన్నివిభక్తులకును, వచనములకును (గొంచె మించుమించుగ) భిన్నరూపము లుండునని యర్థము.

| | | | | |
|---|---|---|---|---|
| పుంలింగము. | ఏకః | ద్వౌ | త్రయః | చత్వారః |
| స్త్రీలింగము. | ఏకా | ద్వే | తిస్రః | చతస్రః |
| నపుంసకము. | ఏకమ్ | ద్వే | | చత్వారి |

[1]P. S. S. Page 141 ఇనై త్తెనక్కిళక్కుమ్ ఎణ్ణుక్కుఱిప్పెయరుం. తొల్. చొల్. 168, కన్నడ; ఒన్దు తింగళ్ (ఒక నెల), మూఱు దేగులమ్ (మూడు దేవాలయము). [2]ప్రౌ. వ్యా. శ. 104.-అసురు లరువదివేలు, అబ్జనాభులు నూఱునైదు పదులు. పదిలోపలి సంఖ్య కిట్టిది లేదు.

పంచన్ (అయిదు) మొదలు నవదశన్ (పందొమ్మిది) వఱకును మూఁడు లింగములయందును సమానరూపములే విశేషణములుగా వాడఁబడునుగాని విశేష్యమునకుఁబలె విభక్తులు గలుగును. ఉ : అష్టానాం (పురుషాణామ్, స్త్రియామ్, పాత్రాణామ్). ఆపైపైన వింశతి మొదలయిన శబ్దములు విశేష్యమాత్రములు గానే 'వింశతిః బ్రాహ్మణాః' అనునట్లు విశేషణరూపమునఁగూడ వాఁడుచున్నారు. పయి పద్ధతినిబట్టి యొకవిశేషము తెనుఁగుభాషలోఁ గనుపట్టుచున్నది. అరవ కన్నడముల వలె అమహద్రూపములను మహద్విశేషణములుగాగూడ వాడక సంస్కృతమునందలి మొదటి నాలుగు సంఖ్యావాచకములవలెనే విశేషణములవలె వాడుచుండుట.

ఈ క్రిందిని ప్రత్యేకముగ నొక్కొక్కశబ్దము యొక్క చరిత్రము దిఙ్మాత్రముగ నిరూపింపఁబడుచున్నది.

## 2. ఒకటి మొదలగు పదముల చరిత్రము

ఒకటి, ఒక్క, ఒక, అనునవి విశేషణమాత్రములు. ఒకటి యనునది అమహత్తులలో విశేష్యముగాను, విశేషణముగాగూడ వాడనగును. ఒక్కనూటిని, ఒక కేలఁబట్టి. ఒకటి, ఒక్కంటి, ఒక్కటి, అనునవి యమహద్విశేషణములు. ఆ వొక్కటి, ఒకటి రెండు పూటలు, ఒకటఁ, ఒకటిచేతన్, మొదలగు రూపములును గలవు. ఒకొంటికి (భార. కర్ణ. 1 ఆ. 70), ఒకఁడు, ఒకానొకఁడు, ఒక్కరుఁడు, ఒక్కొరుఁడు మొదలగు రూపములును గలవు. అట్లే ఒక్కర్తి, ఒక్కతె, ఒక్కొర్తి మొదలయిన స్త్రీవాచకరూపములును గలవు. ఒక్కఁడు అనునది మహద్రూపము గాను, అమహద్రూపముగాగూడ నున్నది. మాసములు పదునొకండు (వరాహ, IV, 54), తావక బాహువొకఁడె (అము. I, 45). మహద్వాచకమయిన ఒకడు శబ్దమునకు ఒకనిఁ, ఒకనిచేత మొదలగు ద్వితీయాది విభక్తిరూపములు గలవు. అమహద్వాచకమైనచో ఒకటికి, ఒకటికొఱకు అనురూపము లుండును.

పయి రూపజాతమంతయు ఒక్క (ఒక) అను విశేషణమువలనఁ గలిగినట్లు తోఁచుచున్నది.

ఒండు, ఒరుడు, ఒర్తి, అను రూపములును గనుపట్టుచున్నవి. వీనికి ఒక్క శబ్దము మూలము గానట్లు స్పష్టము. మూన్రు = మూండు, వాన్రు = వాండు, అయినట్లు ఒండు శబ్దమునకు ఒన్రు మొదటిరూపమనుట నిర్బాధము. ఒరుడు, ఒర్తి, ఒరులు, అనువానికి ఒరు అను విశేషణము మూలాధారమనుటయు నిర్వివాదము. ఒండు శబ్దమునకు ఒంటి యను ఔపవిభక్తికద్వితీయాద్యంగము గలిగి తరువాత నయ్యదియే యనుచితవిభాగమున విశేష్యముగానో, విశేషణముగానో స్వతంత్రముగా వాడఁబడుచువచ్చినది. ఒంటిసనుటయేడ (భా. విరా. 5. 234), ఒంటిగాఁడు, ఒంటరి, ఒంటిపాటు, ఒంటికన్ను మొదలగునవి.

ఒండు పదమునకు మూలరూపమగు ఒన్టు అరవమునఁ గలదు. ఒన్ఱి అను రూపము ఒంటి యను నర్థమునఁ గన్నడమునఁ గలదు. ఒన్టుశబ్దమున ఇ చేర్చుట వలన ఒన్ఱి అనురూపమేర్పడి ఒంటిగా మారినదనుట స్పష్టముగా గనుపట్టుచున్నది. ఒక్క, ఒరు అను రెండు విశేషణరూపము లుండినట్లు పయి విచారణమువలన గనుపట్టును. కాని ఒక్క శబ్దముగూడ ఒరుశబ్దముయొక్క వికారమే యని విచారణమువలన స్పష్టపడును. ఒర్క, ఒక్క, యని సమీకరణమువలనఁ గావచ్చునుగదా! ఒరుక్కై=(ఎక్కటి), ఒరుక్కమ్=(ఏకత్వము), ఒరుక్క=(ఒక్కటిగా), ఒరుకై=(ఏకసమూహము), ఒరుఙ్గు=(మొత్తమగు, క్రియ.) (మొత్తముగా). ఈ రూపము లన్నియు నరవమున నున్నవి. వీని కన్నిఁటికిని మూలరూపము ఒరు అనునదియే. ఒరుక్క = ఒర్క = ఒక్క=ఒక అనురీతిని ప్రాచీనభాషలో మారి తెనుఁగునందలి ఒక్క శబ్దము గలిగినదని నిర్వివాదముగాఁ దేలుచున్నది. ఇట్టి ఒక్క, ఒక లకు మహద్వాచక డుప్రత్యయము చేరి, ఒక్కఁడు అని యేర్పడినది. మహద్వాచకమగు ఒకని మొదలగు ద్వితీయాద్యంగము వాని, వీని, మొదలగు వానివలెనే నకారయుక్తముగాఁ గనుపట్టుచున్నది. తెనుఁగునందలి ఏకత్వవాచకశబ్దముల రూపములకు ఒర్ అను మూలద్రావిడరూపమే ప్రథమస్వరూపమనుట స్పష్టము. ఒరు శబ్దమునుండియే ఒన్టు శబ్దము నకారాగమము వలన గలిగినదని కాల్డ్వెల్లుగారు. మూఱు, మూన్టు; కిఱు, కిన్టు; కఱు, కన్టు మొదలగు శబ్దముల సామ్యము నుదాహరించి చెప్పియున్నారు.[3] ఈ ఒర్ అను విశేషణరూప మెల్ల ద్రావిడభాషలయందును నున్నదనుట పయిపట్టికవలన స్పష్టము. విశేష్య విశేషణరూపములు భిన్నముగా నున్నపుడు సాధారణముగా విశేషణరూపము ప్రాచీనమయినట్లు నిరూపించితిని. ఒన్టు శబ్దము క్రియగాగూడ నరవమున వాడఁబడుచున్నది. కూడు, చేరు, ఏకమగు అని యర్థము. ఒన్టు, ఒరు శబ్దములలో నేది ప్రాచీనమా యని వివదింపవచ్చునుగాని యవి యభిన్నములును, మూలములు ననుట నిర్వివాదము.

పయిశబ్దములకు బహువచన లుప్రత్యయము చేరి ఒఁడ్లు, ఒకండ్లు, ఒకళ్లు, ఒకళులు, ఒకరులు మొదలయినవియు గలిగినవి. ఒకడ్లు అనిగూడ శాసనములఁ గలదు. ఒండులు, ఒండ్లు అనియు రూపములు గలవు.

పయిరీతి నేర్పడిన ఒండు, ఒక్క, అను శబ్దములకు యౌగికములును లక్ష్యములు నయిన యర్థము లనేకములు ఇతరపదములు చేరియు చేరకయుఁ దెనుఁగున గాలక్రమమున నేర్పడినవి. ఒండె యనునది ద్రుతాంతమయిన యవ్యయముగా పక్షాంతరమును దెలుపునట్లు వాడఁబడినది. 'నాలవభాగ మొండె, మూడవభాగ మొండె.' ఒండు + ఏని = ఒండేన్ = ఒండె, అని మారినది. ఒక్క యను శబ్దమునకును, ఒకఁడు, ఒరుడు, మొదలగు శబ్దములకుఁ గలిగిన యర్థవిశేషములు :

[3] C. G. D. 324-5

సామాన్యము, అన్యము, అనిర్దేశము, అనిర్వాచ్యము, గణనీయము, కొంత, మొదలగు నర్థములను సూర్యరాయాంధ్రనిఘంటువునఁ జూచుకొనునది.

ఏకశబ్దభవ మనునట్టి ఎక్కటి శబ్దముగూడ తెనుఁగున గలదు. సం. ఏకః, ప్రా. ఎక్కమ్, తుది టివర్ణము ఔపవిభక్తికములగు దేశ్య సంఖ్యావాచకముల మూలమున గలిగినది. దీనికిని అనేక లక్ష్యార్థముల ప్రయోగము గలదు. కాని పయి ఒరు కుటుంబములోని యేపదమయినను ఎక్కటివలనఁ గలిగినదని యూహించుట యుక్తికి దూరము. వానికన్నిటికిని మూలము ఒరు అని స్పష్టముగా గనిపించుచున్నది.

ఈ క్రిందిపదములను జూచునది. అరవము: ఒరుత్తన్ = ఒకఁడు, ఒరుత్తి = ఒకతె, ఒరుత్తు = ఏకాగ్రత, ఒరుతన్మై = ఒంటితనము. కన్నడము: ఒరె = ఐక్యము, సామ్యము, ఒరునుడి = ఒకమాట. ఒర్ లోని రేఫము కకారాది పదములలోఁ జేరి కకారమునకు ద్విత్వము వచ్చినది. ఒర్ + కట్టు = ఒక్కట్టు = మొత్తము. ఒర్ + కణ్ణ = ఒక్కణ్ణ, ఒంటికంటి. ఒర్ + కెయ్ = ఒక్కెయ్ = ఒక్కచేతివాఁడు.

రెండు: దీనికి విశేషణరూప మెల్లద్రావిడభాషలయందును ఇర్, ఈర్, అను రూపములతోనే యున్నది. ఇరుదెఱంగు, ఇరుపక్కియలన్.[4] ఇర్ అనునది మూలరూపము. ఇది యెల్లద్రావిడభాషలయందును ఈ రెండురూపములతోనే యున్నది. ఇర్ + నూఱు = ఇన్నూఱు (సమీకరణము). ఇరు + పడి = ఇబ్బడి. పయి రేఫము ముఖ్యముగా మకారమునకుముందు నువర్ణముగా మారినది. ఇర్మడి = ఇమ్మడి = ఇనుమడి. ఇనుమడి, ఇనుమాటు, ఇనుమిక్కిలి, అను ప్రయోగములు గలవు. ఇట్లే రేఫము నకారమగుట మఱికొన్నియెడలను గలదు. ఇరుంబు (అర), ఇనుము (తె), పెనిమిటి = పెరిమిటి (పెరుమాడి) కన్నడము. ఇరుమిది = ఎనిమిది. విశేషణరూప మెల్లద్రావిడభాషలయందును ఇరు అనియే కలదు. ఇరుచెవి (అర), ఇరుమాతు = రెండుమాటలు (కన్నడము). అరవమునందలి ఇరండు అనునది ప్రాచీనము. కన్నడమున ఎరడు. తెనుఁగున ఊనికమార్పుచే రెండు అయినది. ఆ విషయము చూచునది. ఇరట్టు, ఇరట్టి, అను క్రియారూపములు అరవమునఁ గలవు. దానికి సమానముగా దెనుఁగున రెట్టించు రూపము గలదు.

మూఁడు: అరవమున మూన్ఱు, కన్నడమున మూరు. తెనుగునందలి మూఁడు శబ్దమునకుఁ బూర్వరూపము మూన్ఱు అనుట నిర్వివాదము. వాన్ఱు మొదలయినవి చూచునది. మూరు, మూన్ఱు, శబ్దము లభిన్నములు. నడిమి నకారము ఒన్ఱులో వలెనే వచ్చినది. మూ, ము, అనునవి అన్ని ద్రావిడభాషలయందును విశేషణరూపములే. ముమ్మూరు, మూన్నాళ్లు, మూనాళ్లు, మూగురు, ముగ్గురు, ముప్పురు.

[4] బా. వ్యా. ద్విగువుప్రాయికంబుగా నేకవచనంబగు, సమా. 18

అరవము : మూ+కాల్=ముక్కాల్, మూ+కణ్ణన్=ముక్కణ్ణన్.
కన్నడము : ముక్కాలు, ముక్కణ్ణ, మూగేణె=మూఁడు జేన.

నాలుగు : నాలువు అనియు రూపము. నాలుగు ప్రాచీనరూపము. భారతమున నట్లే యున్నది.[5] ఇతర ద్రావిడభాషలలోని నాలు, నాల్కు, నాంగు, నాల్, అను రూపములన్నియు నభిన్నములనుట స్పష్టము. తెనుఁగున విశేషణరూపములు నలు, నాలు, అనునవి. నలువురు, నలుదెస, నలుగడ, నలుగురు, నన్నూరు=నల్నూరు (సమీకరణము). అరవము : నాల్+ముగన్ = నాన్ముగన్ = బ్రహ్మ. నాల్+పదు = నార్పదు = నలువది. నాల్+ఆయిరమ్ = నాలాయిరమ్ = నాలుగు వేలు. కన్నడము : నాల్ + మొగ = నాల్మొగ = బ్రహ్మ. నాల్ + తోళ్ = నాల్దోళ్=విష్ణువు. నల్వత్తు=40.

అయిదు, ఏను : అను రెండు రూపములు తెనుఁగునఁ గలవు. ఐన్దు, అంజు, ఐను, అను నితరద్రావిడభాషారూపములతో నియ్యది యభిన్నము. నన్నయ అయిదు, ఐదు లను వాడలేదు. తిక్కనప్రయోగములవలన ఐదులో బిందు వున్నదో లేదో నిర్ణయింప వీలులేదు.[6] ఏను, అను రూపము నన్నయ వాడుటను బట్టి తెనుఁగున నది మొట్టమొదట గ్రాంథికమయినదని యంగీకరింపవచ్చును. ఇతర ద్రావిడభాషలలోని రూపములనుబట్టి చూచినచో అయిదురూప ముండి యుండవచ్చును. కాని అదే గ్రాంథికము కాలేదేమో యని తోచుచున్నది. ఏఁబది, ఏఁబండ్రు, ఏదుము మొదలగు శబ్దములవలన ఏన్, అనునదియే విశేష్య విశేషణ సమానరూపముగా మొదట నుండెనని తెలియును. ఏనాళ్లు, ఏనూరు మొదలగు వానిలో నకారలోపము గలిగినదనుట స్పష్టము. అయిదు శబ్దమే కాలక్రమమున విశేషణముగాను, విశేష్యముగాను వాడుకలోనికిఁ బ్రచురముగా వచ్చినది. ఏను, ఏన్ అనునది కొన్నిసమాసములలోమాత్రము నేఁడు నిలిచినది.

ఐన్దు, ఐదు, ఐను, అంజు అను నితరద్రావిడభాషారూపములు అయిదుతో నభిన్నములు. 'న్దు' 'ంజు' గా మారినదనుట స్పష్టము. ఐ=అయ్, అనునదియే విశేషణరూపముగా నితరద్రావిడభాషలయందు గలదు. కన్నడము : అయ్+కణె=అయ్గణె=పంచబాణుడు, అయ్+మొగ = అయ్మొగ=అంపదమోముల వేలుపు. అరవము : ఐన్+తరు=ఐన్దరు=కల్పవృక్షము, ఐన్+తలై=ఐన్దలై=అయిదు తలలు గల, ఐఞ్ + చంది = అయిదుసంధి. తెనుఁగునందలి ఏన్, ఏను అను రూపములు ప్రాచీనమయిన అయ్ రూపమునుండి ఊనిక మొదలయిన హేతువులచే నేర్పడినవనుట స్పష్టము.

ఆఱు : ఇది అన్ని ద్రావిడభాషలయందును సమానమయిన రూపముతోనే యున్నది. అజి యను రూపము (తుళు). తెలుఁగున ఆఱుశబ్దమే విశేషణముగాను

[5] ఆ. భా. చ. పుట 1211. [6] ఆ. భా. చ. పుట 1212

విశేష్యముగానుకూడ ప్రాచుర్యము నందియున్నది. అఱువదిలో అఱు అను విశేషణరూపము గలదు. ఇతర ద్రావిడభాషలయందు అఱు అను విశేషణరూపము మిక్కిలి వాడుకలో నున్నది. అరవము : (అఱుచువై) ఆఱురుచులు. (అఱుముగన్) షణ్ముఖుఁడు. కన్నడము : (ఆఱుతింగళ్) ఆఱునెలలు, (అఱుమొగ) షణ్ముఖుఁడు, (అఱువెరల్) ఆఱువ్రేళ్లవాఁడు.

ఏడు : ఎఴు, ఏళు అను రూపములలోని ఴ కారము ప్రాచీనమనియు, ళ, డ, లు దాని రూపాంతరములనియు స్పష్టమేగదా. ఇది యన్ని ద్రావిడభాషలయందును ఏకరూపముననే యున్నది. తెనుఁగున ఏడుశబ్దమే విశేష్యముగాను విశేషణముగాను నున్నది. ఏడుదినంబులు, రెండేడులు. తెనుఁగున డెబ్బది యను రూపమునఁ బదాదిస్వరము నశించి డె యను రూపమేర్పడుట విశేషమనియు, ఊనిక మారుటవలన గలిగినదనియు నూహించుట సులభము. అరవము : ఎఴు కడల్=ఏడుసముద్రములు, ఎఴునగరమ్=ఏడునగరములు. కన్నడము : (ఎళ్+పత్తు) ఎప్పత్తు=70. ఏళ్‌జలధి=ఏడుసముద్రములు. ఏళ్, ఎళ్, అను రెండు రూపములును విశేషణములుగా వాడుకలో నున్నవి.

ఎనిమిది : ఈ పదముయొక్క స్వరూపమును విభజించుటయందు కొంత శ్రమ కలదు. తెనుఁగున తొమ్మిది యని యింకొకశబ్ద మున్నది. ఈ రెంటి తుదిని మిది యను నవయవము కనుపట్టుచున్నది. ఈ రెండును నభిన్నములే యని పరిశీలనవలనఁ దేలగలదు. ఈ పదమునకు శాసనములయందు గల రూపములు "విజయరాజ్య సంవత్సరంబుళ్ ఎణ్బది అన్నేణ్టి", "విజయరాజ్య సంవత్సరంబుళ్ ఎణుఁబొది అన్నేణ్టి" 641 సం. క్రీ. వె. జయసింహవల్లభు శాసనము.[7] "ఎనుబొది అడ్లపట్టునేల" పండరంగని అద్దంకిశాసనము. 750 క్రీ. వె. నన్నయ భారతమున "ఎనుబదియెనిమిది వేవురు" అనునట్లు ఎనిమిది రూపమే కనుపట్టుచున్నది.

పయి యాధారములనుబట్టి తుదినున్న మిది శబ్దమునకుఁ బూర్వరూపము బొది=పొది యనుట స్పష్టము. ఇది పదియొక్క వికార మనుటకు శబ్దస్వరూపమైన ప్రతిబంధములేదు. ఇరు శబ్దము తెనుఁగున ఇను అను రూపమును బొందినదని యింతకుమున్నే నిరూపించితిని. కాఁబట్టి ఇరు=ఇను=ఎను అను రూపములను బొందియుండవచ్చును. ప్రాచీనకాలమున న, ణ లు తార్మారగుచుండెనని నిరూపించితిని. అప్పుడు రెండు తక్కువ పది యనిగాని పదికి వెనుక రెండవది యనిగాని యర్థము చెప్పవచ్చును. తొమ్మిది శబ్దముగూడ నట్లు ఏర్పడినదనియు, తొల్+మిది (పది) పదికి తొంటిది యనఁగా బూర్వమయిన దనియు వ్యుత్పత్తి ముందు చెప్పఁబడును.[8] తుళుభాషలోని ఎణ్మ యను రూపమునఁ దుదనిగల మవర్ణము పదిలోని పకారమే యానునాసిక్యమును బొంది యేర్పడినదనుటయు యుక్త మనక

[7] ద. హి. శా. వా VI. పుట 208. నెం. 584. [8] C. G. D. 345.

తప్పదు. తెనుఁగుననున్న పది శబ్దము వై, పై, బై యను రూపములను బొందె ననుట నీ సందర్భమున గణింపనగును (ఇరువై, ముప్పై, నలభై). పయివిచారణమువలనను, శాసనములలోని ప్రయోగములవలనను, ఎనిమిదిలోని మిది యను నది పదిశబ్దభవ మనుట సిద్ధాంతమగుచున్నది. ముందటి ఎను అనునది ఇరుశబ్దభవమని యొకమార్గము సూచింపబడినది. తెనుఁగుననున్న ప్రాచీనరూపము ఎణుంబోది యనునది. ఇందు ఇరు లేదు. ఎన=జోడు (తెనుఁగు), ఎణె=జంట (కన్నడము), ఇణై=జంట (అరవము). కావున ఎణుంబోదిలోని ఎణు శబ్దము ఎణ యను శబ్దమై యుండవచ్చుననుట యుక్తతరముగా నున్నది.

ఇతర ద్రావిడభాషలయందెల్లను ఎణ్టు, ఎట్టు, ఎణ్మ, మొదలయిన రూపములలో ఎణ్ అనునదియే ప్రాచీనమనునట్లు గనుపట్టుచున్నది. విశేషణరూపముగూడ నెల్లభాషలయందును ఎణ్=ఇణ్ అనునదియేగదా! అరవమున తొణ్టు (తొమ్మిది) అను శబ్ద మొకటి గలదు. ఇది తొల్ (పూర్వము, మొదటి) అనునట్టి మూలధాతురూపమునుండి యేర్పడినదని యూహ. తెనుఁగునందలి తొమ్మిదిలోని తొల్ శబ్దముతోగూడ నియ్యది సరిపోవుచున్నది. తొళ్ నుండి తొణ్టు అను రూపము (తొంటిది) ఎట్లేర్పడినదో అట్లే ఎణ్ నుండి ఎణ్టు=ఎట్టు అని రూపము లేర్పడియుండవచ్చును అనుట చాల చక్కగ నున్నది. అప్పు డన్నివిధములయిన రూపములతో సమన్వయము చక్కగాఁ గుదురుచున్న దనుట స్పష్టము. అప్పుడు ఎణ్ అనుదాని కేమి యర్థము? మీద చెప్పఁబడిన ఎణ్ అనునదేనా మూలము? లేక మఱియొకటియా? ఎణె యనుటకు ప్రాచీన మనదగు తమిళరూపము ఇణై యని యున్నదనవచ్చును. కాని ఇవర్ణము ఎవర్ణముగా మారుట సామాన్యమే. ఇట్లనుటకంటె ప్రాచీనతరమై, యావయవికమైన ఎవర్ణము గల ధాతురూపమునుండి యేర్పడిన దనగూడదా యని యడుగవచ్చును. ఎణ్ (అరవము), ఎణ్ణు (కన్నడము), ఎన్ను (తెనుఁగు). ఈ యర్థముగల ప్రాచీనమైన ఎణ్ ధాతువే వీనికి ముందుఁ జేర్పఁబడెఁ ననియుఁ జెప్పవచ్చును.

పయివిచారణమువలని సిద్ధాంతము: తెనుఁగునందలి ఎనిమిదిలోని మిది పదియొక్క వికారము. ముందటి ఎని అనునది రెండు అను నర్థముగల ఇరుయొక్కగాని, ఎణ్ యొక్కగాని రూపాంతరము. ఎణ్ పూర్వరూప మనుట యుక్తతరము. ఆ ఎణ్=గణించు అను ధాతువుగూడ గావచ్చును. తెనుఁగునందలి దీని విశేషణరూపము ఎను, ఎనమ అని యున్నది. ఎనుబది, ఎనమండ్రు, ఎనమన్నూరు మొదలగు ప్రయోగములఁ జూచునది.

తొమ్మిది: తెనుఁగున తొమ్మిది శబ్దము విశేష్యముగను, విశేషణముగను వాడఁబడుచున్నది. 'తొమ్మిది శరములు', 'రెండు తొమ్మిదులు.' ఈ శబ్దము యొక్క వ్యుత్పత్తినిగూర్చి ముందు ఎనిమిది శబ్దసందర్భమున గొంత ప్రసంగించితిని.

తొల్ + పది యని విభాగము. అరవమున తొండు అను శబ్దము ఎన్టుతో సమానమగునది, తొల్ శబ్దముతో గూడిన దొకటి కలదు. అరవమున తొన్నూఱు (90), తొల్లాయిరమ్ (900) అను రెండు పదములు గలవు. ఈ రెంటియందును గూడ తొల్ శబ్దమును వాడి, నూటికి ముందటి పది లేక నూఱు అను నర్థము తెలుపనగుచున్నది. కన్నడమునను తొమ్బత్తు (90) అను పదమున నూటికి ముందటి పది యను నర్థమున తొల్ వాడఁబడియున్నది. తెలుఁగునందలి తొంభై యను పదమునకును అట్లే యర్థముచెప్పి నూటికి తొలిపది యని వ్యాఖ్యానించుట తొమ్మిది పదు లనుటకంటె యుక్తమని తోచుచున్నది. కొడగుభాష యందును తొన్నూరు అనఁగా తొంబదియని యర్థము. పయి పదము లన్నియును తొల్ అను పదముతో గూడిన ప్రణాళిక గలవి.

ఇవిగాక అరవమున ఒన్బదు, మలయాళమున ఒమ్బదు, కన్నడమున ఒమ్భత్తు, కొడగులో ఒయిమ్బదు, తుళుభాషలో ఒర్మ్బ, తుదభాషలో ఒన్బతు, కోతభాషలో ఒర్మ్బతు, అను పదములు తొమ్మిదికి వాచకములుగా గలవు.[9] అరవమున ఒన్బాన్ (9) అను రూపము మరియొకటి కలదు. ఈ పదము లన్నిటిలో ప్రథమభాగము ఒన్ అను శబ్దము. తుదిభాగము పది యనునది. ఒన్బాఱ లోని పాఱ అనునది పదికి వికృతియనుట స్పష్టము. ముందరి ఒఱ అను శబ్దమునకు అర్థమేమి? ఒకటికి మూలరూపముగా నున్న ఒర్ శబ్దముయొక్క వికృతియే యిది యనియు, ఇది ఒకటితక్కువ యను నర్థమునఁ జేర్పఁబడినదనియును సమన్వయము. ఒర్ శబ్దములోని రేఫమునకు నకారము (ఇరు = ఇను) అరవము ఒన్టు, కన్నడము ఒన్దు, కొడగు ఒన్దు, మళయాళము ఒన్న్, తుళు ఒఞ్జి, అనువానియందు ఏకార్థకశబ్దమున నకారముతో గూడినది ప్రథమావయవముగా నున్నది. తొల్ శబ్దములోని తొలి తకారమునకు లోపము గలుగుటవలన ఒన్ మొదలుగాగల రూపము లేర్పడియుండవచ్చుననియు మఱియొకవిధమయిన సమన్వయము.

ద్రావిడభాషలలో ఒమ్భయ్, తొమ్మ అను రెండువిధములయిన విశేషణ రూపములు పర్పడుట కవకాశము గలిగినది. ఈ రెండువిధములయిన ప్రణాళికల లోను భావ మొక్కటియే యనుట స్పష్టము. కొన్నిభాషలలోఁ గొన్ని యెడల నొకపద్ధతియు, మరికొన్నిటిలో మఱొకటియును రూఢమయినది. తొమ్మన్నూరు, తొమ్మండుగురు, మొదలగు శబ్దములనుబట్టి తొమ్మ యనునది తెనుఁగువిశేషణ రూపమనుట సిద్ధము.

పది : ఈ శబ్దము విశేషణముగాను, విశేష్యముగానుగూడ వాడఁబడినది. పదినాళ్లు, పదివేలు, పదియింటిని (భార. అశ్వ. II. 153). అరవమున పత్తు అనియు,

[9] C. G. D. 346.

పళగన్నడమున పత్తు, హొసగన్నడమున హత్తు, తుళుభాషలో పత్తు అనియును రూపములు గలవు. ఈ పదిశబ్దము సంఖ్యావాచకములలో ముందును, వెనుకను జేరునపుడు కొన్ని మార్పులను బొందినవి.

తెనుఁగునందలి యీ క్రిందిశబ్దములను జూచునది. పదుగురు, పదుండ్రు, పదునొకరు, పదుమూగురు, పదునలుగురు, పదునైదుగురు, పదునాఱుగురు, పదునేడుగురు, పదునెనమండ్రు అను శబ్దములలో పదు అనురూపము గలదు. నడిమి నకారము సంధి నాపుటకు వచ్చినది.

పన్నిద్దరు, పందొమ్మండ్రు, అనురూపములలో పన్ అనురూప మేర్పడినది. పన్ + రెండు=పంద్రెండు=పన్నెండు. నడిమి దకారము వాస్తులో వలెనే వచ్చినది. పధ్నాలుగు, పదహైదు, పదహారు, పదిహేడు, పద్దెనిమిది, పంధొమ్మిది అను శబ్దములలోని హకారము నడిమి ఉకారలోపమును బూరించుటకుఁ గలిగినది.

ఇరువది, ముప్పది, నలువది, ఏఁబది, అరువది, డెబ్బది, ఎనుబది, తొంబది శబ్దములలో నట్లే యున్నది. ఇది నన్నయభారతము సమాచారము. కాలక్రమమున పది=పఱి=పయి=పై=భై=వై యను రీతిని భిన్నరూపములతోఁ బరిణామమును గాంచినది. ఇరువయివుట్లు సం. 1292 ద. హిం. శా. వా. IV నెం. 661.

ఇరువయేను సం. 1094 ద. హిం. శా. వా. IV 1187.

నూటపంభ్యాయి సం. 1180 ,, ,, ,, ,, IV 1201.

పయి రూపములు 1094 సం. నకే అనగా నన్నయకాలమునకే వాడుకలో నుండియుండవలయును. కాని నన్నయ గ్రహింపలేదు. ఆ తరువాత నివి కాలక్రమమున గ్రంథములలోని కెక్కినవి. కవులచే వాడఁబడినవి. కాని లాక్షణికులు వీనిని గ్రామ్యములుగానే పరిగణించిరి. నేఁడుమాత్రము ఇరవై, ముప్ఫై, నలభై, యాభై, మొదలగురూపములే వాడుకలో వినఁబడునుగాని ఇరువది, నలువది మొదలగునవి వినఁబడవు. పది యను శబ్దములోని తుదియచ్చునకు లోపము కలుగుటను,అట్టి లోటును వారించుకొనుటకు ఒత్తు కలిగి యూపిరి యెక్కువగా విడువఁబడుటవలన భై, ఫై యను నంతములు గలిగినవి.

నూఱు : తెనుఁగుననున్న యీ నూఱుశబ్దము అన్ని ద్రావిడభాషలలోను ఇట్లే యున్నది. ఇదియు విశేషణముగాను, విశేష్యముగాను వాడఁబడుచున్నది.

వంద : ఇది ప్రాచీనముగాదు. నన్నయ వాడలేదు. మిక్కిలి నవీనము.

వేయి : ఇది వే అనురూపముతో నన్నయభారతమున నున్నది. 'అశ్వమేధంబులు వేయును నొక్కసత్యమును' ఆది. IV, 95. 'సుదువులు వేయు నింకేల' ఆది. IV, 103. ఇందు వే+యును అని విభాగము. బహువచనము వేలు. 'మొగములు వేగల శేషుండు.' కవిజన. I, 9. వేయి యనునది వేయును అనునట్టి రూపములలో వచ్చిన యకారసామ్యమున నేర్పడియుండును.

## 3. విశేషణ రూపములు

ఒరు, ఒక, ఇరు, మూ, నలు, ఏ, ఐ, అఱు, ఏట్, ఎణ్, తొమ్ అను విశేషణ రూపములు. ప్రాచీనములు. వానినుండి విశేష్యరూపములు గలిగి మఱల నవి విశేషణములుగా వాడఁబడుచుండెను.

ఒరు — నడుమ పొల్లునకారము వచ్చి (న్) ఒన్టు, ఒండు, మొదలయిన రూపము లేర్పడినవి.

ఒక్క — ఒక్కఁడు. డు ప్రత్యయము వచ్చి, ఔపవిభక్తికముగావున ఒక్కటి యని యేర్పడి, యనుచితవిభాగమున ఒక్కటి గలిగినది.

రెండు — ఇరు ప్రాచీనరూపము. ఇరణ్డు, డుప్రత్యయము. రెండు ఊనిక మార్పువలనఁ గలిగినది.

మూన్టు — మూ శబ్దముపయిని న్ + ఱు అనునవి ప్రత్యయములు.

నాలుగు — నలు శబ్దమున ఆదికి దీర్ఘమును, గు ప్రత్యయమును.

ఐన్దు — ఐం ప్రాచీనరూపము, దు ప్రత్యయము.

అఱు — ఆఱు, ఆదికి దీర్ఘము.

ఏడు — ఏట్ అనుదానిపైని ఉకారము. టకారమునకు డకారము.

ఎణ్ — ఎణ్టు, ఎనిమిది అను రూపములు గలిగినవి. ఎనమ అనునది తెనుఁగున ఎనిమిదినుండి గలిగిన విశేషణరూపము.

తొల్ — తొణ్డు. డుప్రత్యయము. తొమ్మిదినుండి తెనుఁగున తొమ్మ యను విశేషణరూపము పుట్టినది.

ఇక్కడఁ జూపఁబడిన విశేషణరూపము లతిప్రాచీనములై ప్రాచీన ద్రావిడ భాషయందు విశేష్యములుగాను, విశేషణములుగాను కూడ వాడఁబడుచుండినవి యని యూహించుట లెస్స.

నేఁటి తెనుఁగునందలి మహద్విశేషణములు 'గురు' అని చేర్చుటవలనగాని, 'మంది' యని చేర్చుటవలనఁగాని యేర్పడుచున్నవి. ఇరు + గురు = ఇరుగురు-ఇద్దరు. మూ + గురు = ముగ్గురు, నలు + గురు, ఏగురు, అఱుగురు, ఏడుగురు, ఎనమండుగురు, తొమ్మండుగురు. సూరి సాధించిన రూపములు ముందీయఁబడినవి. ఇందు గురు ప్రత్యయము, ఇది ప్రాచీనవిశేషణరూపముపయినే చేర్పఁబడినది. నన్నయ భారతమున ఇరువురు, మూవురు మొదలయినవి వకారయుక్తములే కనుపట్టు చున్నవి.[10] ఇట్లు వకారయుక్తరూపముల తరువాతనే గురు అనునది యంత

[10] ఇరువుర (ఆది. V, 146), ఇద్దరకున్ (ఆది III, 80), మువ్వురు (ఆది. III, 63, 71), నలువురన్ (సభా. II,

మందుగల రూపములు పుట్టినవి. కన్నడమునను ఒర్వఞ్, ఓర్వన్, సాసిర్వర్ (వేవురు), ఏళ్నూర్వర్ (ఏడునూరుగురు), అనునట్లు ఆ రేడు శతాబ్దములలోని కన్నడశాసనములందు గలదు. శబ్దమణిదర్పణమున వర్, బర్, ంబర్, అనునవియే సంఖ్యావాచకములతుదిని వచ్చునని సూత్రింపఁబడినది. మూవర్, ఈర్వర్ (ఇరుగురు), నూర్వర్.[11] కాఁబట్టి ప్రాచీనగ్రాంథికరూపము 'వురు' గానే తెనుఁగున నంగీకరింపఁబడినది. 'గురు' అనునది వాడుకలోనుండి గ్రంథములలో నెక్కినది. సంఖ్యావాచకములకుఁ దరువాత 'అగు' అను ధాతురూపమును జేర్చి విశేష్యములను గూర్చుటవలనఁ బూరణార్థకములు గలుగుచున్నవి. నన్నయభారతమున రెండగు పర్వము, ఎనిమిదియగు పర్వం బిది, ఏడగుపర్వము మేలనఁగా, పదునొకం డగు పర్వమునా వెలయు; ఇట్లనేకస్థలములయందు అగు అను రూప మున్నది. అందే అవు అను రూపముగూడ నున్నది. కొన్నియెడల ముద్రితప్రతులలో రెండవ పర్వము, ఏనవ పర్వము, అనియు పాఠములు గలవు. ఎచ్చటను ప్రాసవిశ్రమముల యందలి మార్పురాని ప్రయోగములు నన్నయభారతభాగములో నాకు దొరక లేదు. శాసనములయందుఁ గొన్ని ప్రయోగములు గలవు. ఏనగు (1150 క్రీ. సం. ద. హి. శా. IV, 996). మూండవునడుపు (1220 క్రీ. సం. నెం. 1025). మూన్డవునడుపు (1163 క్రీ. సం. నెం. 1039). రెండోమేళం (1513 క్రీ. సం. నెం. 702). రెండోయేంటు, మూడోయేండు (1554 క్రీ॥ సం॥ నెం. 810.), ఆయంబునందు నాలవభాగ మొండె మూడవభాగ మొండె అను పాఠము సభాపర్వము I, 46-వ పద్యముగా సూర్య రాయాంధ్రనిఘంటువున నుదాహరింపఁబడినది. మూడోజాముయ్యే (నిరం. II. 102.)

పయి రీతినున్న ప్రయోగములను నొకవిధమైన సమన్వయమును శబ్దశాస్త్ర మునుబట్టి కుదర్చవలయునేగాని కేవల గ్రంథప్రమాణమునుండి పౌర్వాపర్యము తెలియరాదు. వ్రాతప్రతులును, ముద్రితప్రతులును, బహువిధముల నున్నవి. ప్రాచీన ధాతురూపమయిన అగు అనునది మొదటిరూపము. తరువాతిది అవు. గ వ ల కభేదము. ఆ తరువాత ఆకర్షణమువలన అవ, ఆ తరువాత ఓ యను రూపము. క్రమమిది. అగు=అవు=అవ=ఓ. నేఁటి ఓ యనునది అగుధాతువుయొక్క పరిణామ మనుట నిర్వివాదము. తెలుఁగున నేఁటికిని మొదలగునవి అనుదానిలో అగుధాతువే వాడఁబడుచున్నది. ఆమ్, ఆవదు, అనునవి అగుధాతురూపములే అరవమునను వాడఁబడుచున్నవి. నాంగామ్ (నాలుగవ), మూణావదు (మూడవది). కన్నడమున అనెయ అను ప్రత్యయ మీ యర్థమున వాడఁబడుచున్నది. నాల్కనెయ (నాల్గు అనె) అని భావము.

అగుధాతువును జేర్చి పూరణార్థమును తెలుపుట తెనుఁగునను, అరవమునను గలదు. ఇది ద్రావిడభాషలయందు స్వతంత్రము. సంస్కృత ప్రాకృతములనుండి కలుగలేదు.

---

[11] శబ్దమణిదర్పణము: నామ ప్రకరణము. 99 సూత్రము.

## 4. సంస్కృతాంధ్ర సంఖ్యావాచకములకు గల సంబంధము

పయిని నిరూపించిన తెనుఁగుసంఖ్యావాచకముల కన్నింటికిని ఇతర ద్రావిడ భాషలలోని సంఖ్యావాచకములతో సమానరూపతయు, సోదరభావమును స్పష్టముగా గనుపట్టుచునే యున్నది. ఈ రూపము లన్నియును అభిన్నములయిన మూలరూపముల నుండి యుత్పన్నము లయినట్లు నిర్వివాదము. ఆ మూలము లన్నియు ప్రాచీన ద్రావిడభాషలో నుండినవి. సంస్కృతమునకు సంబంధింపనివి.

అయినను సంస్కృతమునుండియు గొన్ని సంఖ్యావాచకరూపములు తెనుఁగునఁ బ్రవేశించినవి. అవి యెట్టివి, యెట్లు ప్రవేశించినవి, యను విషయ మీ క్రింద వివరింపఁబడును. సంస్కృతమునందలి ఏక, ద్వి, త్రి, చతుర్, పంచన్, షష్, సప్తన్, అష్టన్, నవన్, దశన్ అను రూపములు హిందీలో ఏక్, దో, తీన్, చార్, పాంచ్, ఛః, సాత్, ఆఠ్, నౌ, దస్ మొదలయిన రూపములతో నున్నవి.[12] వీనికి వరుసగా ప్రాకృతమునందలి రూపములు[13] ఏక్క, దోణ్ణి, దుణ్ణి, తిణ్ణి, చఉరో, చత్తారో, చత్తారి, పంచ, ఛ, సత్త, అఠ, నవ, దహ. మూలము లనందగిన సంస్కృత శబ్దములును, ద్వితీయావస్థ లనందగిన ప్రాకృతరూపములును, తృతీయము లనందగిన హిందీరూపములును, అభిన్నము లనుట చూచినవెంటనే స్పష్టమగుచున్నది.

దేశ్యములయిన సంఖ్యావాచకరూపములు తెనుఁగు మొదలయిన ద్రావిడ భాషలలో నిత్య దైనికవ్యవహారమున ఆబాలగోపాలమునుగూడ నుండినవియే. నేఁటి యాంగ్లభాషలోని సంఖ్యావాచకముల రూపములు గొన్ని తెనుఁగున వాడుకలో తత్సమములుగాను, తద్భవములుగాను ప్రవేశించినవి. ఉన్నతులయిన విద్యావంతుల యిండ్లలోఁ బనిచేయువారికి జీతములు నెల మొదటిదినమునఁ జేరును. లెక్కయు నప్పుడే జరుగును. చదువురాని పనివాండ్రందరు పున్నమ, అమాస లెక్కపెట్టుదురు. ఆ లెక్క నేఁడు లేదు. మొదటితేదీకి పట్టు, 'పస్టు, పష్టు, మొదలయిన రూపములు First అను ఆంగ్లపదభవములుగా వాడుకలోనికి వచ్చినవి. పట్టుతారీకు అను పదము ఎల్లెడల వినఁబడును. Thirty-fourth (థర్టీఫోర్తు, 34-వ) వంటి తత్సమము మాత్రము వినఁబడుట చాల నరుదు. కారణము దానికి ప్రయోగము లేదుగనుక.

ఇట్లే తెనుఁగునకుఁ గొన్ని యాటలవలన సంస్కృతసంఖ్యావాచకములు వచ్చినవి. ఆడువారు ఆడునట్టి గవ్వలయాటకు 'పచ్చీస్‌పాళీ' యని పేరు. అందుఁ బడునట్టి గవ్వలపందెములకుఁ బేర్లు: చెక్కా = 7, దస్ = 10, బారా = 12, పచ్చీస్ = 25, త్రీస్ = 30, చెమ్మా = 4, అష్టా = 8. పయి పదములు ఆ యాటలు ఆడువారికే పరిచితములు. ఇంగ్లీషుభాషాప్రాధాన్యము పోగానే పట్టు

[12] హిందీవ్యాకరణము: కామతాప్రసాదగురు. పుట. 125.

[13] షడ్భాషాచంద్రిక: త్రివేదిసంపాదితము. పుట 120. అనుబంధము.

తారీకు పేరు నశింపవచ్చును. తెనుఁగుపదముమాత్రము నిలువక తప్పదు. ఇట్లే (సొగటాలాట) అక్షక్రీడయందు పంచెముల పేళ్ళు తెలుఁగువారికి అలవాటయి సారస్వతమునఁ జొచ్చినవి.[14] నేఁడా యాటయు, ఆ పేళ్లును, వచ్చినట్లే చచ్చినవి. ఈ క్రిందిపదములను జూచునది. దుగ = 2, తీ (వంచ) తిగ = 3, చౌక = 4, చౌవంచ = 5, ఇత్తిగ (ఇరు+తిగ) = 6, సత్తా = 7, దచ్చౌక (దంట+చౌక, ద్విచతుష్కమ్) = 8, ఈరైదు = 10, బద్ర, బారా = 12, వంచ = 1. ఇందలి శబ్దములలోఁ గొన్ని మిశ్రసమాసములు. దుగ = ద్వికమ్, తిగ = త్రికమ్, చౌ = చతుః, సత్తా = సప్త, బారా (బారహ) = ద్వాదశ. ఇట్లే యింకను ఏక = ఎక్కటి, ద్వయీ = దోయి, చతుర్థి = చవుతి, తృతీయ = తదియ, ప్రతిపద్ = పాడ్యమి, మొదలయిన రూపములు తెనుఁగులోనికి వచ్చినవి. అవి పరిమితము లయి సందర్భమునుబట్టియు, ప్రయోజనమునుబట్టియు ప్రవేశించినవగుట నియమితమయిన యల్పప్రచారము గలిగి తమ తెనుఁగుగామికి ఉదాహరణములుగా నున్నవి.

అయినను తెనుఁగునందలివియును, ఇతర ద్రావిడభాషలయందలివియును గొన్ని సంఖ్యావాచకములు సంస్కృతభవములా యను సందేహము గలుగకపోదు. అట్టివానిని విచారించుచున్నాను. ఎక్కటి, ఏకశబ్దభవము. ఒక్క, ఒక అనునవి ద్రావిడములని క్రింది విచారణమువలన స్పష్టము. దొండు, ద్వంద్వశబ్దభవము. రెండు ద్రావిడము. ఎట్టు, ఎంటు, అనునవి అష్టన్‌శబ్దభవములా యని సందేహము గలుగక మానదు. కాని దీనికి మూలము ఎణ్ అను విశేషణరూపమనియు, ఇది ద్రావిడమే యనియును, ఎనిమిది శబ్దము సందర్భమున నిరూపించితిని. ఒంబత్తు శబ్దము ఊనపంక్తి శబ్దభవమనియును, పదిశబ్దము పంక్తిశబ్దభవమని యును ఒక్కవాదము గలదు. పంక్తిశబ్దము పది యనునర్థమున లాక్షణికమే యనుట యా శబ్దచరిత్రమునుబట్టి తెలియగలదు దశ శబ్దమే ఉత్తరహిందూస్థానభాషలయం దెల్లను మాటి వాడుకలో నున్నది. అట్టి సందర్భమున పంక్తిశబ్దభవము పది యని చెప్పుట యుక్తముకాదు. తెనుఁగునమాత్రమున్న వంద శబ్దము బృందశబ్దభవమగు ప్రాకృత వంద శబ్దభవ మనిరి. కావచ్చును. ప్రయోగాదికమును, యుక్తిని జూపి ప్రమాణీకరింపవలయును. అరవమునందలి ఆయిరమ్, కన్నడమునందలి సావిర, అను నవి సహస్రశబ్దభవము లనిరి. ఇది యెల్ల రంగీకరించినది. లక్ష, కోటి, శబ్దములు సంస్కృత ములు. తెనుఁగునను, ఇతర ద్రావిడభాషలందును, 1-10 సంఖ్యలును, నూఱువఱకును

[14] ఆంధ్రప్రబంధములలో స్త్రీలును పురుషులును అక్షక్రీడ చేయుచుండినట్లు వర్ణించుట సామాన్యము. అప్పుడు పందెము లేకరువు పెట్టుట తప్పదు,

మ. చారుద్యూతగేహంబు క్రొ। త్తగ నీవొక్కటిఁజూపఁ దోడ్కొని చనం దచ్చౌక
చౌవంచ యిత్తిగ బారా దుగ యంచుఁ జిక్కరొద లుద్దీపింప దౌదవ్వులన్. కళా. III. 131.

క. అత్తీవంచ తిగ దుగయు, సత్తా దచ్చౌక వంచ చౌవంచీరై
దిత్తిక యిద్దుగ బద్రలు, చిత్తంబున దలచునట్లు చేతికిఁ దెచ్చున్. ఉ. హరి. III. 121.

గలవు. సహస్రము మొదలయిన పెద్ద సంఖ్యలు సాంస్కృతికము లనుటలో విప్రతిపత్తిలేదు. తెనుఁగు 'వే' శబ్దము వ్యుత్పత్తి తెలియదు. ప్రాకృతభవ మనిరి. ఇది విచార్యము.

తెనుఁగు మొదలయిన ద్రావిడ భాషలలో సంఖ్యావాచకములు స్వతంత్రములును, సంస్కృతాజన్యములు ననుటకు యుక్తులు.

(1) ఇందలి మూలరూపము లన్నియును స్వతంత్రములు అనుట పరీక్షవలన స్పష్టము.

(2) సంస్కృతమునందలి సంఖ్యావాచకములలో విశేషణములును విశేష్యములును భిన్నములు. వాని ప్రణాళిక వేరు. తెనుఁగున విశేషణ విశేష్యము లభిన్నములు. ఇవి నామములే యను తొల్కాప్పియము మతము సత్యము.

(3) ఇరువది మొదలగు సంఖ్యలలో ఈ రూపములు గలుగు ప్రణాళిక భిన్నము, స్వతంత్రము. తెనుఁగున ముప్పదిరెండు. సంస్కృతము ద్వాత్రింశత్. తెనుఁగున వరుస పదులు నొకట్లు. సంస్కృతమున ఒకట్లు పదులు. ఇది సమాస రచన.

(4) పూరణార్థ ప్రత్యయములు తెనుఁగునను, ఇతర ద్రావిడభాషలలోను స్వతంత్రముగా నొక్కతీరుననే గలిగినవి. సంస్కృతమునందలివి వానికంటె భిన్నములు.

(5) తెనుఁగుసంఖ్యావాచకము లన్నియు నౌపవిభక్తికములగుట వాని ప్రాచీనతకును, ఆంధ్రత్వమునకును ప్రబలప్రమాణము.

తెనుఁగుగాని, ఇతర ద్రావిడభాషలుగాని సంస్కృత, ప్రాకృత జన్యములు గావనుట సిద్ధాంతము.

# సమాసములు

## 1. సమాస నిర్వచనము

ఇతరములయిన పదములును, భావములును తెనుఁగువ్యాకరణములయందుఁ బ్రవేశించినయట్లే యీ సమాసశబ్దమును, అభిప్రాయమును దెనుఁగువ్యాకరణములోనికి సంస్కృతవ్యాకరణమునుండియే వచ్చినది. సమ్ అను నుపసర్గము పూర్వమందుగల అస్ ధాతువునకు భావార్థమున ఘఞ్ ప్రత్యయమును చేర్చిన సమాసః అను రూప మేర్పడును. సమసనం = సమాసః. కనుక ననేకపదముల కేకీభావరూపమగు సంశ్లేష మను నర్థము సమాసపదమునకు సంభవించును."[1] సామర్థ్యముతో గూడిన పదవిధియే సమాసము.[2] ఈ శాస్త్రమున సామర్థ్యము వ్యపేక్ష యనియు, ఏకార్థీభావ మనియును రెండువిధములుగ నున్నది. విశిష్టా అపేక్షా = వ్యపేక్షా, అను వ్యుత్పత్తివలన స్వార్థసమన్వితములగు పదములకు ఆకాంక్షాదుల వలన నన్యోన్యము సంభవించు నన్వయము వ్యపేక్ష యనంబడును. అట్టిది "రాజ్ఞః పురుషః" (రాజుయొక్క పురుషుఁడు) మొదలగు వాక్యములందే సంభవించును. అనగా విభక్తిప్రత్యయములు తెలుపఁబడి, కారకాదిసంబంధము స్పష్టముగా తెలియందగిన విగ్రహవాక్యములవంటివి యని భావము. రాజుయొక్క + పురుషుఁడు అని యుదాహరణము. "ప్రత్యేకముగ నర్థవత్తులుగ గ్రహింపఁబడు పదములకు 'రాజపురుషః' అను సమాసమున 'రాజసంబంధవిశిష్టః పురుషః' ఇత్యాది రీతి నొకేయర్థమును బోధింపఁజేయునది యేకార్థీభావసామర్థ్యము. ఈ పక్షమున 'రాజపురుషః' అనుచోట సముదాయమే యర్థము గలదిగాని ప్రత్యేకపదముల కర్థము లేదు." పాతంజలమహాభాష్యమునందు సిద్ధమయిన పయియర్థమునే మనమున నుంచుకొని, "సమర్థంబులగు పదంబు లేకపదంబగుట సమాసంబు" అని సూరి సూత్రించెను. చింతామణియందు సమాసశబ్దనిర్వచనము చేయలేదు. ఆంధ్రభాషాభూషణమున "మొదలిపదంబు విభక్తులఁబుచ్చి మీదిపదంబులతోడ సమ్యక్సంసక్తంబు లగుటంజేసి సమాసంబులయ్యె"[3] నని వివరణము చేయఁబడినది. పాణినీయమున సమాసాంతర్గతములుగా విగ్రహవాక్యములలోఁ గనుపట్టఁదగిన విభక్తిప్రత్యయములకు లోపము విధింపఁబడినది.[4] పయిసూత్రము నుద్దేశించియే చిన్నయ "సమాసవిభక్తికి లోపంబగు" అని సూత్రించెనుగాని తెనుఁగుసమాసములకును, సంస్కృతసమాసములకును గల భేదము నెఱింగినవాడుగావుననే యందే "లట్టునకుం గాదు" అని తెనుఁగుపదముల స్వభావమును నిరూపించుచు విధించెను.

---

[1] కౌముదీశరదాగమము, వాల్యూం. II, పుట 114.

[2] సమర్థః పదవిధిః. [3] ఆంధ్రభాషాభూషణము. వ. 109.

[4] బా. వ్యా. సమా. 25. సుపోధాతుప్రాతిపదికయోః. 2-4-71.

పైవిచారణవలనఁ దేలిన విషయములు రెండు. (1) విభక్తిలోపము. (2) వేఱువేఱుగ నర్థములను బోధించుపదములు చేరి యొక్కయర్థమునే బోధించుట. ఈ రెండును సమాసముయొక్క ముఖ్యలక్షణములు. ఈ రెండింటియందును రెండవది స్వభావసిద్ధము. సర్వజనసంవేద్యము. అందఱును అనుసరించు మార్గము. మొదటిది కొంతవఱకు కృతకము పండితజనవేద్యము. ము. ఈ యుదాహరణమును పరికించునది. 'లతకూన' ఇది తెనుఁగున ప్రసిద్ధమయిన సమాసము. 'లత' ప్రత్యేకపదము. 'కూన' వేఱొకపదము. ఈ రెంటినిగూర్చి యేకార్థమునందే ప్రయోగము కలదు. లేఁతతీగ, తీగ, ఆడుది అను నర్థములలో వాడఁబడియున్నది. ఈ రెండుపదములను జేర్చుటయే మాటనాడువారిపాటు. తీగ వంటి స్త్రీ. లతయొక్క కూన, కూన (చిన్నది) యగు లత, (లేఁదీగ). లత యెప్పుడును చెట్టుదృష్టిని దుర్బలముగా (చిన్నది) నుండును. కావున లతాసామాన్యము నర్థమే. ఈ పయిరీతిని వివరణములు చేసి, యట్టి సమాసములభావము నేర్పఱచి, యందలి విభక్త్యాదికముల వింగడింపును, సమాసముల జాతి వేర్పాటును వైయాకరణులు చేయుదురు. ఆ యేర్పాటు వారి సంస్కారమునుబట్టియు, భాషాస్వభావమునుబట్టియు జరుగుచుండును. ఇందు వారి సంస్కారమునే ముఖ్యముగా నాధారము చేసికొని విభజనముచేసిన భాషలు నుండవచ్చును. అట్టివానిలో తెనుఁగొకటి యని క్రిందివిచారణమున స్పష్టపడును.

సమాసము లేర్పడుట యెల్లభాషలయందును కొంచెమో గొప్పయో యుండితీరును. కొన్నిటియందు సమాసములకు ప్రయోగ మత్యల్పము. కొన్నిటి యందు ముఖ్యముగా నీ స్వభావము భాషలోనికిఁ బ్రవేశించి వివిధములయిన విభజనమునకు వీలుపడుచుండును. మనకు మిక్కిలి పరిచితములును, సమీపములును నయిన సంస్కృతాంధ్రములను విడిచి నేఁడు సుపరిచితమయ్యును సుదూరమయిన యాంగ్లమును మొదట గ్రహింతము. అందును సమాసములు గలవు. Black-bird — నల్ల పక్షి యని యవయవార్థము. పక్షి విశేషమున రూఢము. నీగ్రో కూలివాడు అర్థాంతరము. ఇట్లే White ant, White wash మొదలయినవి రూఢములయిన సమాసములు కొన్నివేలు గలవు. Swollen-headed — తలపొగరు గలవాఁడు, మొదలయిన యితరజాతిసమాసములును గలవు. ఇన్ని యున్నను ఆ వ్యాకరణములందు సంస్కృతాంధ్రములవలె సమాసవిచారణమును, విభజనమును లేదు. సంస్కృతమున నీ విచారణనుగూర్చి పాణిని యనేకసూత్రములను రచించెను. అయిదువృత్తులలో సమాసవృత్తి యొకటి. సమాసమును, పేరును, విభాగమును, నక్కఱలేకయే కొన్ని గొప్పభాషలకు వ్యాకరణములు వ్రాయవచ్చును. వానిలో సమాసములుగా నిరూపింపనగు పదములును వేనవేలుండవచ్చుననుట యాంగ్లము నుండి తెలియనగును.

అట్లయినచోఁ దెనుఁగునకు సమాసమను విచారణయు, వివిధసమాసజాతులును నెట్లు వచ్చినవి యని యడుగవచ్చును. సంస్కృతమునుండి గ్రహింపఁబడినవి యని సమాధానము. ఆ సంస్కృతప్రణాళిక ఒక్క తెనుఁగునకేగాక యితర ద్రావిడ భాషలలోనికిని ప్రవేశించినది. ఇతరద్రావిడభాషలలోని కెట్లు ప్రవేశించినది, అది తెనుఁగున కెంతవఱకు సరిపడును, తెనుఁగుసమాసములకును సంస్కృత సమాసములకును గల భేదమేమి, యనువిషయమే యీక్రింద నిరూపింపఁబడును.

అరవమున సమాసములు గలవని తొల్కాప్పియముననే అంగీకరింపఁబడినది. అందు సమాసము అను పదమునకు తొగై యనునది సమానార్థకముగా వాడఁబడినది. ఇది తొగు అను ద్రావిడధాతువునుండి యేర్పడినది. దీనికి కూడు, చేరు అనియును, తొలఁగు, లోపించు అనియును రెండర్థములు గలవు. సమాసమునందుగలవని సంస్కృతవైయాకరణులచే నంగీకరింపఁబడిన రెండుగుణములును పయిపదమున నంతర్భూతమయినవి. (1) విభక్తిప్రత్యయములు తొలఁగించుట వలనఁ గలుగుట. (2) పదములకూడికచేత గలుగుట అను రెండభిప్రాయములును దీనియందు గలవు.[5] సమాసములను తొల్కాప్పియనారు ఆఱువిధములుగా విభజించెను. వేట్రుమైత్తొగై (విభక్తిసమాసము) = (తత్పురుషసమాసము), ఉవమైత్తొగై = ఉపమితసమాసము. వినైత్తొగై = (ఇందు మొదటిది క్రియాజన్యవిశేషణము, రెండవది నామము. చంపు నేనుఁగు), పణ్బుత్తొగై (గుణము = పణ్బు) విశేషణ పూర్వపదకర్మధారయము, ఉమ్మైత్తొగై = ద్వంద్వసమాసము. (ఉమ్ = ను—సముచ్చయము), అన్మొళిత్తొగై (బహువ్రీహిసమాసము), అన్యపదసమాసము. పయిరీతిని సంస్కృతసమాసములును, వానిస్వభావమును గుర్తించిన తొల్కాప్పియనారు అందలి భావమును మనసునం దుంచుకొని పదములను అరవముననే కల్పించి అరవభాషాసంప్రదాయమునకుఁ దగినట్లు విభజించి వేర్పఱచెను. ఇందలి వినైత్తొగై అనునది అరవసంప్రదాయము ననుసరించి కల్పించినది యనుట స్పష్టము. వచ్చునతఁడు, చేయుబాలుఁడు, మొదలయిన ద్రావిడరచనగల పదములన్నియు నిట్టివే. ఇవి యన్నిద్రావిడభాషలయందును గలవు. ఇట్టిస్వభావము తెనుఁగున నున్నను తెనుఁగువారు దీని నొకజాతిగా గ్రహింపలేదు. ఈ విషయము తిరిగి విమర్శింపఁబడును. తరువాతి యరవవైయాకరణులు గొందఱు సంస్కృతమునందలి పేళ్లనే యెత్తి తత్పురుషము, ద్వంద్వము మొదలయిన రూపములతోనే విభజించిరి.[6] అందు బహువ్రీహి యను శబ్దము పలనెల్ అని అరవమున చేయఁబడినది. తొల్కాప్పియనారువలెనే తరువాతి యరవవైయాకరణు లందరును సంస్కృతమునందువలెనే సమాసముల యర్థములనుగూర్చియు, స్వభావమును గూర్చియు విచారణను సల్పుచునేయుండిరి.

---

[5] తొల్. చొల్. సూ. 418-20 ; సూ. 412. చొల్.

[6] వీరచోళియము : పిరయోగవివేకము.

కన్నడభాషయందు వైయాకరణులు సంస్కృతమునందున్న ప్రణాళిక నట్లే యా పేళ్లతోడనే గ్రహించిరి.[7] కర్ణాటకభాషాభూషణమందలి ప్రణాళికయే కేశిరాజు శబ్దమణిదర్పణమునను గలదు. క్రియాసమాసమనియు, గమకసమాసమనియు రెండు క్రొత్తపేళ్లనుమాత్ర మతడు కల్పించెను.

తెనుఁగువారి ప్రణాళికయు సంస్కృతమునుండియే గ్రహింపఁబడినది. మొదటిదయిన చింతామణియందు సమాసశబ్దనిర్వచనము లేదు. "ద్విగు కర్మధారయౌ తత్పురుష ద్వంద్వౌ బహువ్రీహిః, అన్యేచ కేచి దుపమానోత్తరపదలోప రూపకాఖ్యాద్యాః పరిదృశ్యాః" అని సూక్ష్మముగా సంస్కృతమునందలి సమాసముల పేళ్లనుమాత్రము వివరించెను. "కేవల వికృతిపదై ర్య స్సమాసకం తం బ్రువంతి వాక్యజ్ఞాః॥ అను సూత్రమున అచ్చాంధ్రపదములు కూడగా నేర్పడిన వానికి సమాసకమని పేరుపెట్టెను. మఱికొన్ని యల్పసంఖ్యాకములయిన సూత్రములతోఁ గొన్ని విషయములను నిరూపించెను. తుదిని 'స్వస్వవిభక్తివికారములతో అనేక శబ్దములు యథేచ్ఛముగా సమసించును' అని సూత్రించి యూరకుండెను. అంతియే గాని తెనుఁగున సమాసము లెట్లేర్పడుచున్నవి, వానియందుగల సమాసలక్షణము లేవి, వాని నెట్లు విభజింపనగును అని విమర్శింపలేదు.

కేతన "సమాసమున విభక్తులు లోపించి మీదిపదంబులతో మొదలిపదంబులు సమ్యక్సంసక్తంబు లగునని లక్షణము చెప్పి, యవి పూర్వపదప్రధానంబును, నుత్తర పదార్థప్రధానంబును, నన్యపదార్థప్రధానంబును, నుభయ పదార్థప్రధానంబును నన జతుర్విధంబులయి వర్తిలును" అని వివరించెను. పదార్థ ప్రాధాన్యమునుమాత్ర మనుసరించి సమాసములను నాలుఁగువిధములుగా విభజించుటయు సంస్కృతవ్యాకరణ సంప్రదాయమే. దానినిమాత్రమే గ్రహించి తత్పురుష, బహువ్రీహి మొదలయిన సంజ్ఞల నేలవిడిచెనో యూహింపవలయును. పయివిధమయిన విభజనము సులభము. కేవలముగా నర్థమునుమాత్రమే యాశ్రయించి యున్నది. బహువ్రీహి మొదలైన సంజ్ఞ లన్వర్థములుగావు. విభజన మతివ్యాప్తి మొదలయిన దోషములకుదూరముగాదు. శాస్త్రవిచారణ యధికము. కావున నద్దానిని బరిహరించి పయి చతుర్థావిభజనమునుమాత్రమే గ్రహించెను అని యూహించుట సులభము. సూరిగారు సమాసపరిచ్ఛేదమున పాణినీయమందలి సూత్రచ్ఛాయగానే సమాసంబునకు లక్షణము విరచించినట్లు ముందే యుదాహరించితిని. అందు పదంబుల యేకార్థీభావసామర్థ్యముమాత్రమే యుద్దేశింపఁబడినది. దీనిని సవరించి సమాసంబునఁ గలుగు విభక్తిలోపాదికమునుగూడ లక్షణముననే సంగ్రహించు నుద్దేశమ్మున "సంయోగదశయందు గలిగెడు విభక్తి

---

[7] నామ్నాం సమాసః సంగతార్థః॥ తస్యాంతర్వర్తిన్యో విభక్తయోలోప్యాః॥ ఉత్తర పదార్థ వృత్తిస్తత్పురుషః॥ సపవైకాశ్రయః కర్మధారయః॥ సంఖ్యాదిశ్చేత్ ద్విగుః॥ పూర్వ పదార్థప్రధానోఽవ్యయీభావః॥ సర్వపదార్థ ప్రధానో ద్వంద్వః॥ అన్యపదార్థ ప్రధానో బహువ్రీహిః॥ కర్ణాటభాషాభూషణము. (సూ. 124-131.)

లోపాత్మక పదస్వరూప సంగ్రహము'' అని ప్రౌఢవ్యాకరణకర్త సూత్రించెను. సూరిగారు తత్పురుషాదులనెల్లఁ దెనుఁగున గ్రహించి వానికి ''లక్షణంబు ప్రాయికంబుగ సంస్కృతోక్తంబ యగు'' అని సూత్రించి వాని లక్షణనిరూపణమునందలి క్లేశమును బరిహరించుకొనెను. కాని యట్లు చేయుటవలన నీ తెనుఁగువ్యాకరణము సంస్కృతవ్యాకరణశేషమే కావలసివచ్చుననుట యసత్యముగాదు.

## 2. తెనుఁగుసమాసముల లక్షణము

పయిరీతిని ద్రావిడవైయాకరణులు సంస్కృతవ్యాకరణము నెట్లనుసరించిరి యను విషయమును సంగ్రహముగా నిరూపించినతరువాత తెనుఁగుసమాసముల స్వభావమును నిరూపింతును. తెనుఁగు సంయోగాత్మకభాష (Agglutinative Language) యనియు, ప్రత్యయాంతములన్నియు సమాసములే యనియు, యథార్థముగా విభక్తిప్రత్యయము లనఁదగినవి తెనుఁగున లేవనియు వెనుక నిరూపించితిని. ఔపవిభక్తికముల స్వభావమును, విశేషణముల స్వభావమును విమర్శించునపుడు గొన్నివిషయములను నిరూపించితిని. వాని నిక్కడ ననుసంధించునది.

(1) సమాసములయందు సాధారణముగా నొకపదము విశేషణమును, ఇంకొకటి విశేష్యముగా నుండుననుట స్పష్టము. అట్టి సందర్భములో విశేషణపదముయొక్క యాకారమునఁ గలుగు వికారములు మొదలగునవి యిందును గనుపట్టుచునే యుండును. తెనుఁగువిశేషణము లేర్పడునపుడు గలుగు అ, ఇ, అను నాగమములు, పువర్ణము మువర్ణమున కాదేశమగుట, ఔపవిభక్తిక కార్యములు సాధారణముగా గలుగుచుండును. వీని చరిత్రము ముందా యా సందర్భములలో వివరించితిని. ఉ. వారియిల్లు, వారలపని, ముంటివాడి, నీరివేడి, సరసపుమాట.

(2) సాధారణముగాఁ దెనుఁగుసమాసములు రెండు మూఁడు మాటలకంటె నెక్కువకూడి యేర్పడవు. సంస్కృతమున నట్లుకాదు. ఎన్నేని మాటలను జేర్చి చేంతాటివంటి సమాసములను గూర్పవచ్చును. ఈ క్రిందిపద్యమును జూచునది.[*] చలివెలుఁగు, పోటుమానిసి, మానిసిదిండి, జుంటిమోవి, తల్లియావు, పాడిమొదవు, సరసపుటలుక, నీటిపోటు, మొదలగు సమాసములు తెనుఁగు స్వభావమునకు సూచికలు. ఇట్లే యుండుటకు హేతువులు రెండు. మొదటిది సంయోగాత్మకావస్థలో నుండిన తెనుఁగుభాషలో నన్నియును సమాసములవంటివియే యగుటచేత నర్థమునందు సందిగ్ధత యేర్పడకుండుటకై ప్రయత్నము స్వాభావికముగా నుండును.

[*] డింభద్రోహివధోత్కటోత్క్రమణదుష్టిక్లిష్టతారోమకూ
పాంభోజప్రభవాండభాండదళనోద్యద్ధ్వానధిక్కృత్సభా
స్తంభాంతస్ఫుటనస్ఫురత్ఫెళఫెళధ్వన్యస్తనిశ్చేష్టని
ర్దంభోద్యోగదిశావకాశపనృహరిబ్రహ్మాన్ స్తుమస్త్వామనున్ ॥

దీర్ఘసమాసములకు అర్థసందిగ్ధత తప్పదు. రెండవది పండితులు తెనుఁగు నభివృద్ధి పఱుపలేదు. పఱుచుటకు ప్రయత్నము నత్యల్పము. వారి సాముగరిడీలకు సంస్కృతమే విహారరంగ మగుటవలన అందే దీర్ఘసమాసములు బయలువెడలినవి. అయినను తిమ్మకవి, తెలగన్న, మొదలగు నచ్చతెనుగుకవులు గొందఱు తెనుఁగు మఱుగులుగా సంస్కృతసమాసచ్ఛాయను, దీర్ఘములయిన సమాసములను దెనుఁగుస్వభావమునకు విరుద్ధముగా గల్పించిరి. ఉ. గట్టురాచూలిమగడు ; కడలి మొలనూలిచేడియగనిన పడుచు = సీత ; అరపది మోములవేలుపు ; ఇద్దఱు తల్లుల ముద్దుబిడ్డడు. ఇట్టివి నేఁడు నశించినవి. సంస్కృతమునకుఁ గల పఠన పాఠనములు గాని, ప్రజల భావములో గౌరవముగాని, వీనియెడల లేవు. ఇవి తెనుఁగున స్వభావమునకు విరుద్ధములు. కేవల సంస్కృతచ్ఛాయలు.

(3) తెనుఁగున విభక్తిప్రత్యయములు లేమింజేసి (తఱుచుగ స్త్రీసమంబు లగుట) సమాసములయందు విభక్తిలోపమయినట్లు కనుపడుటలేదు. అనఁగా రాజా, రామః అను సంస్కృత ప్రథమాంతముల ప్రాతిపదికములు రాజ, రామ యను భిన్నరూపములలో నుండుటవలన సమాసమునందలి పూర్వపదము రూపమునకును, వ్యస్తమగు నద్దాని రూపమునకును భేదము స్పష్టముగా గనుపట్టును. తెనుఁగున నట్లుగాదు. కావున తెనుఁగుసమాసములు పదములను చేర్చుటచే మాత్రమే యేర్పడుచుండునన్నట్లు కనుపట్టుచునే యుండును.

(4) సంస్కృతసమాసములయందుఁ బూర్వపదమునకు లింగ విభక్తి వచనములు మూఁడును లోపించినట్లు భాసించుచుండును. మానవకల్పితము, ఈ సమాసమున మానవ శబ్దమునకు స్త్రీలుగాని, పురుషులుగాని, ఉభయులుగాని యర్థమే. గోహితము అను సమాసమునందు గోశబ్దము రెండువిధములయిన లింగవచనముల యందును వర్తించును. తెనుఁగున ఆవు, ఎద్దు, ఆవుల, ఎద్దుల అని యేక బహు వచనాదికమును నిరూపింపవలసినది. ఇందలి బహువచనసూచకమగు లట్టునకు లోపము లేదు. షష్ఠీస్థానమున నుండవలసిన అ, ఇ లే నిజమయిన తెలుఁగుసమాసమున ఘటకములు. వానికి లోపము లేదు. రాజులిండ్ల మొదలగు అకారలోప ప్రయోగములు తెలుఁగున నపవాదములనుట నిర్వివాదము. సంస్కృతమున సమాసగతమయిన పుంవద్భావము తెనుఁగున లేదుగదా! చూ. పాణినీయము. సూ. 6-3-34. "స్త్రియాః పుంవత్ భాషిత పుంస్కా దనూజ్ సమానాధికరణే స్త్రియా మపూరణీ ప్రియాదిషు."

(5) సంస్కృతమునందలి సమాసాంతకార్యములు, సమాసమధ్యవికారములు తెనుఁగున సాధారణముగా నుండవు. సంస్కృతమున వానిని నిరూపించుటకు పాణిని గొన్ని ప్రకరణములను వ్రాయవలసివచ్చెను. ఆ యా సమాసప్రకరణములలోఁ గలుగు మార్పులన్నిటిని అచ్చటనే నిరూపించుట చాలక తుదిని

సమాసాశ్రయవిధులను దిరిగి పాణిని పేర్కొనెను. ఇంత వైవిధ్యము గలుగుటకు సంస్కృతభాష యొక్క ప్రాచీనతయును, వైశాల్యమును గారణములు. భాష యనేకకాలము నుండి వాడుకలో నుండియుండుటచేత, జనులచేఁ గల్పింపఁబడిన పొరపాటులు, వ్యత్యాసములు, తప్పులు, మొదలగునవి యన్నియును గ్రంథముల కెక్కి, శిష్టుల కిష్టమయి, ప్రామాణికులచే నంగీకరింపఁబడి వ్యాకరణములోని కెక్కినవి. సాంతశబ్దములు గొన్ని సమాసాంతమున అకారాంతములగుట, నకారాంతములు నశ్లే యగుట మొదలగునవి యన్నియు నుదాహరణములు.[9] విశాలమయిన భాష కాకుండుటచేతను, ప్రాథమికావస్థ నుండుటచేతను, తెనుఁగుసమాసములలో సంస్కృతసమాసములలో నున్నన్ని వికారములు గనుపట్టవు.

(6) తెనుఁగునందలి కర్మధారయంబు 'త్రిక స్త్రీసమ ముగంత ధాతుజ విశేషణపూర్వపదంబయి యుండు' అని చిన్నయ సూత్రించి, యీ నియమముచే బల్లిదుఁడు, మల్లుఁడు, కావలుఁడు, రావణుఁడు, ఇత్యాదుల సమాసంబు లేదు అని నిరూపించెను. బల్లిదమల్లుడు అను రూప ముండదనుట దీని యభిప్రాయము. దీనికి హేతువూహించుట సులభము. తెనుఁగున విభక్తిప్రత్యయ మేర్పడుట క్రొత్త. అట్టి డువర్ణము ఇఁకను ప్రత్యయత్వమాత్రమును బొంది సంస్కృతపు 'సు' వంటిది కాలేదు. అది పదమునందలి భాగమే. కావుననే దానికి లోపములేదు. కావుననే షష్ఠీసమాసాదులయందు రాముడి మాట, బల్లిదుడిబాట అనునట్లు వాడుకలో డువర్ణము నిలిచిపోయినది.

(7) స్త్రీసమఘటితంబగు బహువ్రీహి యొకానొకండు చూపట్టెడు. ముక్కంటి, వేగంటి, చలివెలుఁగు, వేవెలుఁగు, మోటబరి, ఇత్యాదులు వ్యవహార సిద్ధంబులు గ్రాహ్యంబులు. పయివాక్యముచొప్పున బహువ్రీహిసమాసములు తెనుఁగునఁ గ్వాచిత్కములు. పయిగా స్త్రీసమఘటితమాత్రములు. తెనుఁగున బహువ్రీహిసమాసము బహుళముగాదు. స్వాభావికముగాదా యని యడుగ వచ్చును. కాదని చెప్ప వీలులేదు. చలివెలుఁగు అనునది చల్లనివెలుఁగు అని కర్మధారయముగాని, చల్లని వెలుఁగు గలవాఁడు అని బహువ్రీహికాని కావచ్చును. దీనికి నిర్ణాయకము ప్రయోగము. ఇట్లు ప్రయోగముల బహుళ తకు భాష పెరుగుదలయే మందల. దానికి విజ్ఞానమును, బండితవ్యవహారమును మూలములు. వానికి సంస్కృతమే యాలవాలము. కావునఁ దెనుఁగు బహు వ్రీహికి వాడుక విశేషముగ రాలేదు. సంస్కృతమున నిష్టమువచ్చినయన్ని బహు వ్రీహుల నేర్పఱుపవచ్చును. నేఁ డింగ్లీషునఁగూడ బహువ్రీహులు కావచ్చును.

---

[9] రాజాహస్సఖిభ్యష్టచ్. ఋక్పూరబ్ధూః పథామానక్షే. ధనుషశ్చ. అచతుర విచతుర... గోష్ఠశ్వాః.

(8) పయిరీతినే స్త్రీసమంబే ప్రాయికంబుగ ద్వంద్వంబగును. పల్లగళ్లెములు, బల్లిదకావలులు, మొదలగు సమాసము లుండవు. సంస్కృతమున నెన్ని ద్వంద్వముల నయిన నిరాఘాటముగ నిర్మింపనగును.

(9) పలుకునట్టి రాముఁడు, ఎండునట్టి గింజలు, మొదలగు సమాసములయం దెల్ల యెడలను 'అట్టి' చేరుచుండుట తెనుఁగున గలదు. అనేక స్థలములయం దిది విభాషగా చేరును. అర్థసందిగ్ధత లేకుండుట కిది యేర్పడియుండవచ్చును ఉ. ఎండు గింజలు, ఎండునట్టి గింజలు. కాలక్రమమున విభాషగా నేర్పడినది.

(10) నీదునేరిమి, తనదుపలుకు, మొదలగు స్థలములయందు నీ, నా, తన, యనువానిపయిని దువర్ణ మాగమముగా వచ్చినది. ఇది యేల యేర్పడినదని యడుగనగును. నీది కరుణ=నీదు కరుణ, ఈ రెంటికిని నేఁడు అర్థభేదము గలదు. ఒకటి వ్యస్తము. రెండవది సమస్తము. నీది యనుదానికి స్వతంత్రప్రయోగము గలదు. నీదు అనుదానికి లేదు. కాని యీ రెండును అభిన్నములు. నీదు ప్రాచీనరూపము. నీది యనుదానియందలి దివర్ణకము అదిశబ్దముపరిశిష్ట మనుట నిర్వివాదము. అది యనుదానికి ప్రాచీనరూపము అదు. అరవమునను, గన్నడమునను నేటికిని అదు అనియే రూపము. అరవమున షష్ఠీవిభక్తిగా అదు అనునది గలదు. ఎనదుకై = నాదు చేయి, నా చేయి, (నాది చేయి). ఇట్లు దువర్ణాంత రూపములు యుష్మదస్మదాత్మార్థకంబులయందుమాత్రము నిలిచియుండుటచే వానిని ఆగమమాత్రములుగాఁ జేర్కొనిరి. ప్రాచీనకాలమున నీదు అను స్వతంత్రపదమునే చేర్పగా నేర్పడినరూపమే యిందు సమాసముగా నేఁడు నిరూపింపఁ బడినదనుట సమాసచరిత్రమును స్పష్టపఱచుచున్నది.

(11) సమాసమునందలి పఙ్, ప, వర్ణంబుల చరిత్ర మింతకుముందు గొంత సూచించితిని. కనుపు, జనుపు, పాంపు మొదలగు రూపములే ప్రాచీనములనియుఁ, దుది పువర్ణము నేఁటి మువర్ణమునకు మాతృకయనియును నిరూపించితిని. అట్టి పువర్ణకముపయిని సంబంధార్థకమయిన అ ప్రత్యయము రాగా పఙ్, ప, వర్ణము లేర్పడినవి. ఒకటి బిందుపూర్వకము. రెండవది బిందురహితము.

(12) అలరుఁబోఁడి, పూబోఁడి, ననఁబోడి, విరిఁబోడి. పయిపదములయందు మేను శబ్దమునకు బోఁడి యగునని సూరి సూత్రించెను. ఇది కేవలము చరిత్రను లెక్కింపని వైయాకరణపద్ధతి. పూ+పోఁడి యను రెండుశబ్దములు కనుపట్టుచున్నవి. పోఁడి=పోండి అనగా ఒప్పు, సొగసు, అను నర్థములు గలవు. పూవుసొగసువంటి సొగసుది యని యర్థముచెప్పి, పూ+పోడి యను రెంటిని నర్థవంతములయి, స్వతంత్రము లయిన శబ్దములుగా గ్రహించుట యుక్తము.

(13) సమాసములయందలి రుగాగమ, టుగాగమములఁ గూర్చియు, భృశార్థమునందు వచ్చు కట్టకడ మొదలగువానియందలిది యగు టవర్ణము చరిత్రమును సంధిలో వివరించితిని. దాని నిచ్చట ననుసంధించునది.

(14) "ప్రాఁతాదులయందు తొలియచ్చుమీఁది వర్ణంబులకెల్ల లోపంబగు" నని సూరి సూత్రించెను. ఇందు ప్రాఁత, లేఁత, క్రొత్త యను మూఁడుశబ్దములు ముఖ్యముగా గనుపట్టుచున్నవి. తుది తకారము విశేష్య మేర్పడుటకు వచ్చిన ప్రత్యయము. ప్రా, లే, క్రొ, యను విశేషణములనుండి యేర్పడినవి. తరువాత నయ్యవి విశేషణములుగాగూడ వాడుచువచ్చిరి. (విశేషణములయం దీ స్వభావమును గూర్చి విపులముగఁ జర్చించితిని) కావుననే ప్రాతయిల్లు మొదలగు రూపము లేర్పడినవి. లేగొమ్మ, ప్రాగెంపు మొదలయినవి ప్రాచీనవిశేషణములనుండి యేర్పడినవి. ప్రా, లే, క్రొ, అను ప్రాచీన విశేషణరూపములు పఴ, ఇళ, కుఴ, అను ప్రాచీనద్రావిడ మూలరూపములనుండి ఊనికయందలి మార్పులవలన నేర్పడిన యనంతరరూపములు. ఈ రూపములు మూఁడును నేఁడును అరవమున సారస్వతమున గనుపట్టుచునేయున్నవి. కన్నడమున వీని రూపములును, రూపాంతరములును గలవు. పఴ=ప్రాఁత, ఇళ=లేఁత, అనియే యర్థములు. కుఴ యనగా వయసునఁ జిన్న, లేత, మొదలయిన యర్థములు గలవు. ఆ యర్థమునుండి విపరిణామమువలన రూపాంతరమయిన క్రొ శబ్దమునకు నవ్యము, నవీనము, అను నర్థము లేర్పడినవి.

పయిచరిత్రక్రమము మఱుగుపడియుండుటచేతను, లేత, క్రొత్త, ప్రాత, శబ్దములనే మూలములుగా గ్రహించుటచేతను చిన్నయ యట్లు సూత్రించెను.

క్రిందు, మీఁదు, కెంపు, శబ్దములయందును దుదినున్న దు, పు, వర్ణములు మూలరూపములును విశేషణములును నగు క్రిం, మీం, కెం అనువానిపయి విశేష్యతాపరిణతికయి వచ్చిన ప్రత్యయవిశేషములని యూహించుట సులభము. క్రీ యనురూపమునకు కీఴ్ అను ద్రావిడరూపము మూలము. ఇదియే కీడు అను రూపమునొంది తెనుఁగున వాడుకలోనున్నది. కీఴ్ అనగా త్రవ్వు, (క్రిందికిబోవు) అను నర్థమునఁ గ్రియగా ప్రయోగమున్నది. దానికి 'కీఴ్న్దు' అను క్త్వార్థకరూపమును గలదు. క్త్వార్థకరూపములన్నియును ప్రాచీనకాలమున భావనామములే యనెడు విషయమును క్రియాప్రకరణమున సిద్ధాంతము చేయుదును. కీఴ్న్దు అను పదమే భావనామముగానుండి విశేష్యముగాఁ దెనుఁగున క్రిందు అను రూపమును బొంది, తరువాత విశేషణమయినదనుట నిస్సంశయము. ఇట్లు పరిణతిఁబొందిన 'కీఴ్' అను మూలరూపమే క్రీ, క్రిం, మొదలయిన రూపములుగాఁ దెనుఁగున వాడుకలోనికి వచ్చినది. ఇట్లే కెంపు, చెన్ను, శబ్దములలో కెమ్, చెమ్, అనునవియే మూలరూపములనియును, అభిన్నములనియును ఊహించుట మిక్కిలి సులభము.

ఇట్లే నిక్కలు, వంజెఱగు, సంగోరు, మొదలయిన సమాసములును వాడుకలో నేర్పడిన రూపములని యూహింపవచ్చును.

"అచ్చికసమాసములం దఱచుగ వర్ణలోపాగమాదేశవికారంబులు పెక్కులు కానంబడియెడి" అని ప్రౌఢవ్యాకరణకర్త సూత్రించెను. ఆ పదములయొక్క

చరిత్రము ప్రత్యేకముగ నూహింపవలసినది. కావున నిచ్చట స్థలము చాలదు. అందలి వికారములన్నియు నర్థములేని సంధిగతవికారములుమాత్రమే యని భావింపరాదు.

## 3. తత్పురుషాది సంజ్ఞల నిర్వచనము

పయిని తెనుఁగుసమాసములయొక్క చరిత్రమును, స్వభావమును దిఙ్మాత్రముగా నిరూపించితిని. సంస్కృతమునందలి తత్పురుషాది నామము లెట్లువచ్చినవి? యవి తెనుఁగునఁ గలవా? ఆ పేళ్లును, విభజనమును తెనుఁగునకు సరిపడునా యను విషయమును గొంచెము విమర్శింపవలయును.

ద్విగు, తత్పురుష, కర్మధారయ, బహువ్రీహి, ద్వంద్వము లనెడి సంజ్ఞలు తెనుఁగున గ్రహింపఁబడినవి. ఇవి సంస్కృతముననే ప్రాచీనసంజ్ఞలు. వీని స్వభావమును గూర్చియు, లక్షణమునుగూర్చియు వివాదము గలదు. లక్షణము కుదరక భట్టోజీ దీక్షితులు సమాసముల నారువిధములుగా విభజించెను.[10] అవ్యయీభావ, బహువ్రీహి, తత్పురుష, ద్వంద్వములు అనెడి నాలుగుజాతులలో నిముడని సమాసము లుండుటచేత నితరసమాసములనుగూడ నంగీకరింపవలసివచ్చినది. ఇవి వరుసగా పూర్వ, అన్య, ఉత్తర, ఉభయ పదార్థములు ప్రధానముగా గలవి యనెడి వాదమును సరిపడదని క్రిందిమాటలవలన స్పష్టము. పయి నాలుగు తెగల విభజనమును పూర్తిగ సరిపడకపోయినను ప్రాచీనపద్ధతి ననుసరించి పాణిని యంగీకరించెను. ఈ పేళ్లు కొన్ని సార్థకములు, కొన్ని కేవల సంజ్ఞామాత్రములు. అయినను వాని చరిత్ర మి ట్లూహింపఁబడినది. బహువ్రీహి యను పదమునకు అధికమయిన ధాన్యము గలవాఁడని యర్థము. ఈ పద మన్యపదార్థప్రధానము. ఇదియును బహువ్రీహి సమాసమే. సంస్కృతభాష మాటాడుచుండినపుడు ఈ పదము మిక్కిలిగా వాడుకలో నుండియుండవలెను. నేఁటి డబ్బున్నర, ఏగాఁడి, గోనెపీచుగాఁడు, వగ

[10]సమాసశ్చతుర్విధ ఇతిప్రాయోవాదః।అవ్యయీభావ తత్పురుష బహువ్రీహి ద్వంద్వాధికార బహిర్భూతానామపి సహసుపేతి సమాసవిధానాత్॥ పూర్వపదార్థప్రధానోఽవ్యయీభావః, ఉత్తరపదార్థ ప్రధానస్తత్పురుషః, అన్యపదార్థప్రధానో బహువ్రీహిః, ఉభయపదార్థ ప్రధానో ద్వంద్వః । ఇత్యపి ప్రాచాంప్రవాదః, ప్రాయోఽభిప్రాయః । సూపప్రతి ఉన్మత్తగంగ మిత్యాద్యవ్యయీభావే, అతిమాలాదౌ తత్పురుషే, ద్విత్రా ఇత్యాది బహువ్రీహౌ, దన్తోష్ఠమిత్యాది ద్వంద్వే చ భావాత్ । తత్పురుషవిశేషః కర్మధారయః । తద్విశేషోద్విగుః । అనేకపదత్వం ద్వంద్వబహువ్రీహ్యోరేవ । తత్పురుషస్య క్వచిదేవేత్యుక్తమ్ కించ । సుపాం సుపాతిఙాం నామ్నా ధాతునాఽథతిఙాంతిఙా । సుబన్తేనేతి విజ్ఞేయస్సమాసః షడ్విధోబుధైః । సుపాంసుపా రాజపురుషః. తిఙాపర్యభూషయత్, నామ్నా కుమ్భకారః । ధాతునాకటప్రూః అజస్రమ్ । తిఙాంతిఙా పిబత ఖాదతా । ఖాదతమోదతా । తిఙాంసుపా । కృంతవిచక్షణేతి యస్యాం క్రియాయాం సా కృంతవిచక్షణా । ఏహీడాదయో అన్యపదార్థే ఇతి మయూరవ్యంసకాదౌ పాఠాత్సమాసః॥

లాడు, మొదలగు పదములు తెనుఁగులో సుప్రసిద్ధములయినట్లు నాఁడును పయిశబ్దము నిరంతరము వాడుకలోనుండి సుపరిచితమయినది. దానివంటి సమాసము లన్నిటికిని ఆ పేరే వచ్చినది. ఇట్టి పద్ధతికంటె కొంచెము భిన్నమయ్యును దత్సదృశమయిన పద్ధతియే గణపాఠములయందును, ధాతుపాఠములయందును పాణినిచే ననుసరింపఁ బడెను. భ్వాదులు, శకంధ్వాదులు. భూ మొదలగునవి భ్వాదులు. శకంధువు మొదలగునవి శకంధ్వాదులు. అట్లే తత్పురుషము, ద్విగువు అనునవి రెండును ప్రాచీనసమాసములయి ప్రసిద్ధములుగా నుండుటవలన జాతిసంజ్ఞలుగా నేర్పడినవి. తస్య+పురుషః=తత్పురుషః—వానిబంటు మొదలయినది భావము. ద్విగువు=రెండావులు. అవులే ధనముగానుండిన వైదికకాలమున రెండావులు, నేటి ఏగాడి, డబ్బున్నర వంటి పదమనుట నిస్సంశయము. ద్విగువు ద్విగుసమాసమే. తత్పురుషము తత్పురుష సమాసమే యగును. అవ్యయీభావము అన్వర్థము. అవ్యయము కానిది యవ్యయమగుట యనిభావము. ఈ సమాసము అవ్యయముగానే భావింపఁబడుచున్నది. ద్వంద్వము జంట. ఇందు సాధారణముగా మొదట జంటపదముల వాడియుండుట వలనగాని, రెండుపదార్థములును ప్రధానము లగుటవలనగాని యీ పేరు వచ్చి యుండును. ఇట్లు సంస్కృతమున నొక కొంతవింతయైన చరిత్రము గలిగిన పైపదములనే (క్త్వార్థకము మొదలయిన పదములవలెనే) వైయాకరణులు తెనుఁగున వాడిరి.

ఈ పేళ్లుగాని, యీ విభజనముగాని తెనుఁగున కెంతమాత్రమును సరిపడ దనుట నిస్సంశయము. ఒకచోటఁగల వస్తుజాతమును మఱల నచ్చటికి దిగుమతి చేసినచో మన మద్దానిని 'కంచరవీధిని సూదులమ్మచూచె' యందుము. ఇది తెనుఁగు దేశమునఁ బెరిగినది. కంచరవీధిని సూదులుచేయుట సుప్రసిద్ధము. ఎల్లరకును దెలియఁగలదు. ఇట్టి యభిప్రాయమును దెలుపుటకు ఆంగ్లమున నొక నానుడి గలదు. "Carrying coals to Newcastle" అనగా రాతిసిబొగ్గు న్యూకాసిలుకు తీసికొని పోయినట్లు అని భావము. న్యూకాసిలుపట్టణములో రాతిసిబొగ్గుగనులు గలవు. ఈ నానుడిని చెప్పునప్పుడు ఆంగ్లభాషావిదులగు భారతీయు లందఱును భావమును సులువుగా గ్రహింతురు. విశిష్టసమాజములయం దవ్యాజమైన భాషాభిమానముతోఁ బ్రయోగింతురు. కాని దాని మూలముగాని, తెనిగింపుగాని, తెనుఁగున కెంత యింపో ఎఱుకగలవారి కెరుకపడక తప్పదు. బహువ్రీహి సమాసమును పలనెల్‌సమాస మని యొకానొక వైయాకరణుఁడు అరవమున భాషాంతరీకరించెనని ముందే చెప్పితిని. అది (Carrying coals to Newcastle) అనుదానిని తెనిఁగించి వాడుటవంటిదే గావున నశించినది. వాడుకలో నిలువలేదు.

తెనుఁగుసమాసములను నిరూపించుటలో చింతామణి సమాసముల పేళ్లను (ద్విగు కర్మధారయాదులను) మాత్రము వివరించి యూరకుండెను. అవి తెనుఁగు నకు సరిపడవనుటగదా పయిని తేల్చిన సిద్ధాంతము. కేతన యనుసరించిన నాలుగు

విధములయిన విభజనము కేవల మర్థప్రాధాన్యము ననుసరించినదిమాత్రమే గనుక తెనుఁగునకు సరిపోయిన దనవచ్చును. తెనుఁగునకేగాక యేభాషయందలి సమాస ములనయిన నట్లు గ్రహింపవచ్చును. ఆ విభజనమునే యంగీకరించి తెనుఁగు సమాసములకు లక్షణనిర్వచనము చేయవచ్చును. కాని యున్నతవ్యవహారమునకు బనికివచ్చిన తెనుఁగున సంస్కృతపదము లత్యధికము గావునను, వానివలననే కావ్య వ్యవహారము జరుగుచుండుటవలనను, సంస్కృతలక్షణమునే గ్రహించి తెలుఁగునందును ప్రవేశింపఁజేయుట వైయాకరణులకు విధియైనది. తెనుఁగునకు స్వతంత్రమయిన పెరుగుదల యిక నక్కఱలేదు. సంస్కృతలక్షణముతో సంస్కృతపదజాలమునం బ్రవేశించి యిష్టమువచ్చిన భావధనములను గ్రహింపవచ్చు ననుట యానాఁడు సంప్రదాయ మేర్పడినది.

చిన్నయసూరి సమాసములను మూఁడువిధములుగానే విభజించెను. కాని యవ్యయీభావమును గ్రహింపలేదు. తెనుఁగున పూర్వపదప్రధానంబులుగా విభ జింపఁబడిన క్రేగన్ను, పెడతల, నడురేయి, యను సమాసంబులు కేతనచే నంగీ కరింపఁబడెను. కాని యవి యవ్యయీభావములు గావు. అవ్యయీభావమునకు ముఖ్యలక్షణ మవ్యయమగుటయే. అట్టివి తెనుఁగున లేవను నభిప్రాయమున చిన్నయ యవ్యయీభావమును గ్రహింపలేదు. అరవమునను ప్రాచీనవైయాకరణులచే అవ్యయీ భావము పేర్కొనఁబడలేదు. దీనికి ఉదాహరణములు చాల నరుదు. నవ్యులు కొందరు కేవల సంస్కృతానుసారముగా దీనినిగూడఁ జేర్కొనిరి.[11]

చిగురుఁగేలు, జుంటిమోవి మొదలయిన యుపమానపూర్వపదకర్మధార యంబులు తెనుఁగున విశేషము. సంస్కృతమున లేనివి. ఇట్టివి అరవమునను గలవు. (పొఱ్‌మేని=బంగారువంటి మేను). కన్నడమునందలి క్రియాసమాసమునకును, అరవము నందలి వినైత్తొగై యనుదానికిని, తెనుఁగున సమానమయిన దేమికలదని పరిశీలింప వలయును. క్రియాజన్యవిశేషణముతో కర్త్రాదికమునకు కలుగు సమాసములు వినైత్తొగై యని తొల్కాప్పియము మతము. చిన్నయసూరి దానిని కర్మధార యంబునఁ జేర్చెను. ధాతుజవిశేషణపూర్వపదంబగు కర్మధారయమునకుఁ 'మడి సెడు దడములు' అని కర్తృపదమునకుమాత్ర ముదాహరణ మొసంగెను.[12] ఎడి, ఎడు, ఉన్న, కల, న, ని, ప్రత్యయము లంతమందు గలవియు, ఎడి, ఎడు లు లోపించిన క్రియామాత్రమును గలిపి యేడింటిని గ్రియావిశేషణంబులని సూరి పేర్కొనెను. ఇంతియకాక "కర్మాదులకుఁ బ్రాధాన్యవివక్షయందు ధాతుజవిశేష ణంబులు కర్తతోడంబోలె వానితోడ సమసించు" అనియు సూత్రించెను. వీనినే

[11]( వీరచోళియము ) P. S. S. Page 209.

[12]బా. వ్యా. సమా. సూ. 5 "కర్మధారయంబు స్త్రీసమ ముగంత ధాతుజవిశే షణ పూర్వపదంబయి యుండు."

వినై త్తొగై యని వేరుజాతిగా తొల్కాప్పియనారు పేర్కొనుటకు హేతువేమన నయ్యవి ద్రావిడభాషలయందు స్వతంత్రములును, విశేషములు నగుటయే.

కన్నడమునందలి క్రియాసమాసమునకు లక్షణము పూర్వపదము కారకమును, ఉత్తరపదము క్రియాపదముగా నుండునది. 'మొగంనోడిదం, మొగనోడిదం.' 'మొగము చూచెను, మొగచూచెను' అనునట్లు రెండు రూపములును గన్నడమున సమాసములే. 'కడగొండనొ, బడ్డిగొండనొ' 'ఋణముగొనెనో, వడ్డిగొనెనో' ఇవియును గన్నడమున సమాసములుగానే పరిగణింపఁబడినవి. పయివిషయము తెనుఁగువ్యాకరణమునఁ జిన్నయసూరి క్రియాప్రకరణమున సూచించెను. "ధాత్వాదులకు ధాతువు లనుప్రయుక్తంబులయి విలక్షణార్థాభిధాయకంబులగు నీయవి శబ్దపల్లవంబులు నాఁబడు" అని సూత్రించి ధాతుపల్లవము లను నొకజాతిని గ్రహించెను. నిలుచుండు, మేలుకను, తలపోయు, కయివ్రాలు, మొదలగునవి. ఇవి యనేకములు. ఇవియును సమాసములేకదా!

పయిని నిరూపింపఁబడి ద్రావిడభాషలలో మిక్కిలి బహుళములయిన యీ క్రియాసమాస ధాతుపల్లవాదికములు సంస్కృతమునకు విజాతీయములు. సంస్కృతమునందలి బహువ్రీహ్యాది విభజనమునకును, తెనుఁగునకును వీనిలో సంబంధము నియతముగా గనుపట్టదు. బాదరాయణసంబంధము కల్పింపవచ్చును. ఇట్లు భాషకు ముఖ్యమయిన యీ పద్ధతి సంస్కృతవిభజనమున కతుకఁట సుకరము గాకపోవుటవలననే వీని కిట్లు వేర్వేరుదారులు గనిపెట్టవలసివచ్చినది.

# సర్వనామములు

## 1. సంజ్ఞావివరణము

సర్వనామములు అనంబడిన యీ తత్సమపదము సంస్కృతమునుండియే తెనుఁగునకు వచ్చినది. సర్వనామములు నామములలోని యొక యంతర్భాగము. పాణినీయమున నీ శబ్దమునకు వాచ్యములయినవానిని 'సర్వాదీని సర్వనామాని'[1] యను సూత్రమున (సర్వాదులు సర్వనామములు) కనుబంధముగాఁ బరిగణనము చేసిరి.[2] సర్వ మొదలయిన ముప్పదియైదు శబ్దములును సర్వనామములని దీని భావము. ఇట్లు నామములలో సర్వనామము లనెడి యంతర్భాగమును గల్పించుటకు నిమిత్తమేమి యని యడుగక తప్పదు. నామవిభక్తులు చేరునపుడు ఇతరము లయిన నామములకును, సర్వనామములకును గొంతభేదము గలదు. అట్టి భేదము కొన్ని విభక్తులలో మాత్రము గలుగుచున్నది. ఈ క్రింది యుదాహరణములను జూచునది.[3] ఇందు సర్వశబ్దమున కొకరీతిగను, రామశబ్దమున కింకొకరీతిగను ప్రత్యయములు చేరుచున్నట్లు స్పష్టము. సంస్కృతమునందలి సర్వనామ మనెడి సంజ్ఞ, అందు పరిగణింపఁబడిన సర్వ మొదలయిన గణములోనివానికే రూఢ మనుట నిశ్చితమగుచున్నది. కాఁబట్టి యాంగ్లమునందలి 'హి, షి, ఇట్' మొద లయిన ప్రొనౌన్సునుగాని, తెనుఁగునందలి 'అన్ని' మొదలయినవానినిగాని సర్వ నామము లనుట యుక్తము గాదనవచ్చును. ఏలయన ఆంగ్లముననును, అచ్చతెనుఁగు నను సర్వశబ్దము లేదుగావుననే. కాని సర్వనామశబ్దము అన్వర్థమనియును, ఆ యా శబ్దములకు విషయములయిన సర్వార్థములను ప్రధానముగా బోధించుట వలన నిది గలిగినదనియునుగూడ పాతంజలమహాభాష్యమునఁ జెప్పఁబడినది. అనగా 'నేను' అను సర్వనామము నేను అని వ్యవహరించుటకు శక్తిగలిగిన

---

[1] "సర్వాదీని సర్వనామాని" 1-1-27.

[2] సర్వాదయశ్చ పంచత్రింశత్. సర్వ, విశ్వ, ఉభ, ఉభయ, డతర, డతమ, అన్య, అన్యతర, ఇతర, త్వత్, త్వ, నేమ, సమ, సిమ, పూర్వపరావర, దక్షిణోత్తరాపరాధరాణి వ్యవస్థాయామ సంజ్ఞాయామ్॥ స్వమజ్ఞాతిధనాఖ్యాయామ్. అన్తరం బహిర్యోగోపసంవ్యానయోః. త్యద్, తద్, యద్, ఏతద్, ఇదమ్, అదస్, ఏక, ద్వి, యుష్మద్, అస్మద్, భవత్, కిమ్, ఇతి.

| [3] అకారాన్త పుంలింగ శబ్దము నామము | | అకారాన్త పుంలింగ శబ్దము | | సర్వనామము |
|---|---|---|---|---|
| రామాః | (అస్) | సర్వే | (ఈ) | ప్రథమాబహువచనము |
| రామాయ | (ఏ) | సర్వస్మై | (స్మై) | చతుర్థ్యేకవచనము |
| రామాత్ | (అత్) | సర్వస్మాత్ | (స్మాత్) | పంచమ్యేకవచనము |
| రామాణామ్ | (ఆమ్) | సర్వేషామ్ | (సామ్) | షష్ఠీబహువచనము. |
| రామే | (ఇ) | సర్వస్మిన్ | (స్మిన్) | సప్తమ్యేకవచనము |

యెల్ల యర్థములను, సర్వ పురుష స్త్రీ వ్యక్తులను బోధించుచున్నదని భావము.[4] సర్వనామసంజ్ఞ సంస్కృతవ్యాకరణమందు అన్వర్థసంజ్ఞగాఁగూడ గ్రహించుట కవకాశము కలదు గావున నట్టి యన్వర్థాంశముమాత్రమే గ్రహించి తెనుఁగువైయాకరణులు సర్వనామములను పరిగణనము చేసిరని సమాధానము చెప్పుకొనవచ్చును. కాఁబట్టి యీ సర్వనామశబ్దమును గ్రహించిన ఆంధ్ర, కన్నడ వైయాకరణు లందరును దీనిని సార్థకముగానే గ్రహించుచు సంస్కృతవ్యాకరణమునందువలెనే సర్వనామములు అనువానిని పేర్కొనిరి. ఇది సంస్కృతవ్యాకరణానుసారి[5] మాత్రమే యయ్యును గొంత యర్థవంతమని యంగీకరింపక తప్పదు. అరవ వైయాకరణులు పయి సర్వనామములను వేరుభాగముగా నంగీకరింపలేదు. నన్నూలులో పొదుపెయర్ (సామాన్యనామము) అను నొక నామవిభాగము పేర్కొనంబడినది.[6] రెండు లింగములకును, రెండు వచనములకును సమానమయిన పేరని దీని భావము. ఇందే తాన్, యాన్, మొదలయిన సర్వనామము లన్నియును బేర్కొనంబడినవి. ఇందును సంస్కృతవ్యాకరణచ్ఛాయ లేకపోలేదు. కాని సర్వనామమనెడి తత్సమసంజ్ఞ తక్కిన సంస్కృతసంజ్ఞలవలెనే అరవమునందు పరిహరింపఁబడినది.

ఇఁకఁ దెనుఁగునందలి సర్వనామసంజ్ఞయొక్క పొందికనుగూర్చి కొంచెము విచారింపఁబడును. చిన్తామణియందు దేశ్యములయిన అస్మత్, యుష్మత్, ఆత్మన్, శబ్దములని కొన్ని పరిగణింపఁబడినవేగాని సంస్కృతవ్యాకరణమునందు వలెనే సర్వనామసంజ్ఞను వాడి తెనుఁగునందలి సర్వనామములను పృథక్కరింపఁ బ్రయత్నము జరుగలేదు.[7] ఆంధ్రభాషాభూషణంబునను బైరీతినే సర్వనామము లనెడి విశాలసంజ్ఞయుఁ, బరిగణనమును జరుగలేదు.[8] సూరి యట్లుగాక సర్వనామ ప్రకరణ మనుదాని నొకటి తన వ్యాకరణమున నేర్పఱచి "అన్ని ప్రభృతులు సర్వనామములు" అని సూత్రించి వానిని సంస్కృతవ్యాకరణమునంబలె పరిగ

---

[4] ఏకశేషనిర్దేశోఽయమ్। సర్వాదీనిచ సర్వాదీనిచ సర్వాదీని। సర్వానామానిచ సర్వనామానిచ సర్వనామాని। సర్వాదీని సర్వనామసంజ్ఞాని భవన్తి। సర్వేషాం యానిచ నామాని తాని సర్వాదీని। సంజ్ఞోపసర్జనేచ విశేషేఽవతిష్ఠేతే॥ పాతంజల మహాభాష్యము. (1-1-6 సర్వాది సూత్రము.)

[5] కర్ణాటకభాషాభూషణమున ఈ సంజ్ఞ యట్లే గ్రహింపఁబడెనుగాని సర్వనామములేవి యని పరిగణింపఁబడలేదు. శబ్దమణిదర్పణమున పరిగణనము చేయఁబడినది. "అదు ఇదు వుదు వావుదు వెల్లదు పెఱతేన్నెఱదె నిప్పశబ్దంగళ్ తప్పదె సర్వనామ మక్కుమ్, విదర్ధరి వనఱిదు నిఱికె లింగస్థితియోళ్." శ. ద. సూ. 78.

[6] నన్నూల్. సూత్రములు 281-2

దేశ్యాదస్మద్యుష్మచ్ఛబ్దాత్సుజసోర్నుమూవురూచ స్తః. ఇత్యాది సూత్రములను బరిశీలించునది.

[8] యుష్మదస్మత్పదంబు లెఱింగించెద. ఆ. ఎలమి నీవు మీరు నే నేము ప్రథమలు నిన్ను మిమ్మనంగ— యుష్మదస్మత్పదంబులు నూత్నదండిసెప్పె. ఆ. భా. భూ. 105.

ణించెను.[9] పయిరీతిని సంస్కృతమున నేర్పఱచిన సర్వనామసంజ్ఞకు ఆ వ్యాకరణమున ప్రయోజనము ఆ యా శబ్దములలోని విశేష విభక్తిరూపములను సాధించుట గదా! అట్టి ప్రయోజనము తెనుఁగువ్యాకరణమునఁ గలదా, అన్వర్థసంజ్ఞాకరణ మాత్రమే దీనికి ఫలమా? యని యడుగవచ్చును. అంతమాత్రమేగాక తాను సర్వనామములుగాఁ బరిగణించిన శబ్దముల కన్నిటికిని తెనుఁగునఁగల సమానలక్షణములనుగూడ సూరి నిరూపింపఁగలిగెను. పయి సర్వనామసంజ్ఞను సంస్కృతవ్యాకరణమునందువలెనే యిందును వాడఁగలిగెను.[10] ఇందలి సర్వనామములు తెనుఁగుశబ్దములే యగుటచే వానియందు గల రెండు ముఖ్యలక్షణములు క్రింది సూత్రములలో నిరూపింపఁబడినవి. మొదటిది విశేషణ విశేష్యముల విభక్తి వచన వైషమ్యము. రెండవది మహన్మహతీవాచకముల బహువచనరూపములు అభిన్నము లగుట. ఇది యొక విశేషమేగదా! సీత మొదలయిన స్త్రీలను ఏకవచనమున అది యందుము. ఇంతియగాక సూరి పరిగణించిన సర్వనామశబ్దములు ప్రాయికముగా నౌపవిభక్తికంబులు. ఇది దేశ్యశబ్దధర్మము. సంస్కృతమునందలి సర్వ, విశ్వాది శబ్దముల యర్థమును వాక్రుచ్చు తెనుఁగుమాటలను తెనుఁగున సర్వనామములుగ గ్రుడ్డిపరిగణనము చేయక సమానలక్షణముగలవానినే సూరి తన పరిగణనమునం గూర్చెను. సంస్కృతమున ఆత్మన్ శబ్దము సర్వనామశబ్దము గాదు. త్రి ప్రభృతి సంఖ్యావాచకంబులును సర్వనామములు గావు. తెనుఁగున తా శబ్దమును, సంఖ్యావాచకంబులును సర్వనామములే యని సూరి గ్రహించెను. సంస్కృతమునందువలె తెనుంగు దిగ్వాచకములకు తెనుఁగు సర్వనామలక్షణములు లేవుగనుక నయ్యవియు నిందుఁ జేర్పఁబడలేదు. ఇది ప్రశంసార్హము. సంస్కృతమునందలి సర్వశబ్దమునకు సమానార్థకమయిన అన్ని శబ్దమును దొలుత గ్రహించి సంస్కృతమునందువలెనే అన్ని ప్రభృతులు సర్వనామములని సంస్కృతమునందలి సంజ్ఞను ఉపయోగపఱచెను. పయిరీతిని సూరిగారి విభజనమును గ్రహించి శేష గ్రంథ మనందగిన ప్రౌఢవ్యాకరణమునఁ దత్కర్త కొంచెము వైలక్షణ్యమును జూపెను. సూరి "వీనికిఁ బ్రథమాంతరూపంబు లుదాహరించెద" అని సర్వనామ శబ్దములకు ప్రథమాదిరూపంబు లుదాహరించి యూరకుండెనుగాని వానిని వేర్వేఱుగా సాధింపలేదు. ప్రౌఢవ్యాకరణకర్త సూత్రబద్ధమైన రూపనిష్పత్తిని చేసెను. ఇంతియగాక కొన్ని యెడల మూలరూపంబు లేవి యను విషయమున భిన్నాభిప్రాయమును నిరూపించెను. ఆ విషయ మా యా సందర్భములయందు తెలుపఁబడును.

[9] అన్ని-ఇన్ని-ఎన్ని-కొన్ని-పెక్కు-పలు-ఆ-ఈ-ఏ-నీ-నా-మన-తా: సంఖ్యావాచకంబులు. బా. వ్యా. అచ్ఛికము. సూ. 24.

[10] సర్వనామ క్రియాపదంబుల బహువచనంబు మహత్తునకుంబోలె మహతికగు. బా. వ్యా. అచ్ఛి. 28 సర్వనామ సంఖ్యాభిధాన తద్విశేష్యంబులయం దెయ్యది ముందు ప్రయోగింపంబడు దాని ద్వితీయాదులకుం బ్రథమ బహుళముగా నగు. బా. వ్యా. కార. 26.

ఈ ప్రకరణమున సూరి చేసిన యితరసంజ్ఞాకరణమును బరిశీలింపఁదగినది. అన్ని, ఇన్ని, ఎన్ని, కొన్ని, అను రెండక్షరముల తెనుఁగుపదములు తెనుఁగు వారి కందరకును తెలియఁదగినవి గలవు. వీనిని సర్వతావదర్థకము, ఇయదర్థకము, కియద్యావదర్థకము, కతిపయార్థకము, బహ్వర్థకము మొదలగు పదములతో వ్యవహరించెను. ఈ రీతినే ప్రౌఢవ్యాకరణకర్తయు, తదేతద్యత్కిమర్థంబులు, అస్మదర్థాభిధాయి. షష్ఠ్యంత తదేతద్యుష్మదస్మదాత్మ శబ్దపూర్వకంబు మొదలగు రీతిని సంజ్ఞలను వాడెను. మఱి యితరమయిన యతినవ్య వ్యాకరణములయం దీ యభ్యాసము పెరిగినది. "షష్ఠ్యంత తదేతద్యుష్మదస్మదాత్మ శబ్దపూర్వకంబంతట శబ్దంబు పృథగర్థకంబగు."[11] దాని, దీని, వాని, నా, నీ, తన, అను రూపములను గుర్తించుటకు, అంతటి దీర్ఘసమాసమును వాడక యీ పదములనే దెల్పుట యర్థబోధకుపకారకమగునుగదా! ఇట్టి సంజ్ఞలు వ్యాకరణక్లేశమును, సంస్కృతానుసారిత్వమును నిరూపించును. అది యను శబ్దమును దెలుపుటకు తెనుఁగున వ్యాకరణమును వ్రాయుచు, ఆంగ్లప్రణాళిక నుద్దేశించి నేఁటి విశిష్టుల తత్సమభాష ననుసరించి 'దట్ మీనింగు గలది' అని సమాసమును గల్పించి వ్యవహరించినచో నెంత యందముగా నుండునో యూహించుకొనినఁ బయిఁ యభ్యాసము యొక్క మంచి బోధపడగలదు.

ఇఁకఁ దెనుగునందలి సర్వనామము లన్నిటిని నేఁటి సంస్కృతాంగ్లాది ప్రణాళిక ననుసరించి విభజించినచో నేడు జాతులుగాఁ దెలుపనగును. (1) యుష్మదస్మదర్థకములు : నేను, మేము, నీవు, మీరు. (2) ఆత్మార్థకములు : తన, తమ యనువాని సంబంధించినవి. (3) నిర్దేశసర్వనామములు : అ, ఈ, ఏ అనువానివలనఁ గలిగినవి. (4) సంబంధార్థకములు : ఏ, ఆ అనువానితో నేర్పడిన జంటశబ్దములు. (5) ప్రశ్నార్థకములు : ఏ శబ్దరూపములు. (6) సంఖ్యావాచకములు : ఒకటి, రెండు మొదలగునవి. (7) అనిర్దిష్టార్థకములు : పలు, కొన్ని.

ఈ జాతులలోని యొకొక్కదాని చరిత్రను గ్రింద సంగ్రహముగా నిరూపింతును.

## 2. అస్మదర్థకము

నేను, మేము, నీవు, మీరు, అనునవి ఉత్తమ మధ్యమ పురుషములలో నేఁటి వ్యావహారిక గ్రాంథిక రూపములు. ఏను, ఏము, ఈవు, ఈరు, అనునవి ప్రాచీన రూపములును, గ్రాంథికములును. నేము అను బహువచనమును గలదు. చిన్నయ నా, నీ, యనువానినే ప్రాతిపదికములుగా గ్రహించెను. పయిశబ్దముల రూపములు ప్రథమావిభక్తియందు గలవు. ద్వితీయాది విభక్త్యంగములు నా, మా, నీ, మీ, యనునవిగా గనుపట్టుచున్నవి. భారతకవులు ఏను అనియే వాడిరి. నేను ను

[11] ప్రౌ. వ్యా. శ. సూ. 110.

వాడలేదు.[12] పయివాక్యములనుబట్టి ఏను ప్రాచీనమును, నేను నవీనమును అనుట స్పష్టము. అరవమున ప్రాచీనభాషలో యాన్ (నేను), యామ్, నామ్ (మేము) అను రూపములు (తొల్‌కాప్పియమున) ప్రామాణికములు.[13] అర్వాచీన తమిళ భాషలో నాన్ అను నేకవచనపు ప్రథమారూపముగూడ ప్రామాణికముగా వాడఁబడుచున్నది. ద్వితీయాది విభక్త్యంగము ప్రాచీనభాషయందును, అర్వాచీనభాషయందును గూడ ఎన్ అనునదియే.[14] ఇట్లే కన్నడమున ప్రాచీనభాషలో ప్రథమా విభక్తియందు ఆన్ (ఏక), ఆమ్ (బహు) వాడుకలో నున్నవి. అర్వాచీనభాషయందు నాను (ఏక), ఆవు, నావు (బహు) వాడుకలో నున్నవి. ద్వితీయాది విభక్త్యంగము ఎన్, నన్, అను రూపములతో నున్నది.[15] బహువచనమున ఎమ్, నమ్ అనునవి ద్వితీయాది విభక్త్యంగములు. ఇట్లే మలయాళమునను ఞాన్ ఏకవచనము, ఞఙ్ఙళ్, నమ్మళ్ బహువచనము, ప్రథమ. ద్వితీయా విభక్త్యంగములు ఎన్, నమ్ అనునవి.[16]

ఇచ్చట నుదాహరింపఁబడిన అస్మదర్థకమయిన నేనుశబ్దమునకు రెండు విధములయిన రూపము లెల్లద్రావిడభాషలయందు నుండినట్లు స్పష్టము. ఒకటి ఎవర్ణముతో గూడినది. రెండవది ఆ వర్ణముతో గూడినది. తెనుఁగు ప్రథమా విభక్తియందు ఏకారము గలదు. ద్వితీయాది విభక్తులయందు నా, మా, అనునట్లు 'ఆ'కారయుక్తరూపములే కనుపట్టుచున్నవి. ఇతర ద్రావిడభాషలయందుఁ జాలవఱకు ద్వితీయాది విభక్త్యంగము ఎకారముతో నున్నది. ప్రథమావిభక్తియందు 'ఆ'కారము స్పష్టమగుచున్నది. ఈ రెంటిలో ప్రాచీనస్వరూప మేది యని నిర్ణయించుట కష్టము. రెండును ప్రాచీనములే. కాని దేనివలన నేది కలిగినది యనునదియే సందిగ్ధము. తెనుఁగున వచ్చినాను, వచ్చినాము మొదలయిన క్రియారూపముల

[12] ఆ. భా. చ. పు. 1174.

[13] P. S. S. 125.

[14] ఎన్నై, ఎన్నాన్, ఎనక్కు, ఎన్నిన్, ఎనదు (ఎనక్కు), ఎన్‌కణ్ - ఏకవచన 2-7. విభక్తులు (అరవము). ఎమ్మై, ఎమ్మాన్, ఎమక్కు, ఎమ్మిన్, ఎమదు (ఎమక్కు), ఎజ్‌కణ్, బహువచనము.

[15] నవీనకన్నడము.

నన్నన్ను, నన్నింద, ననగె, నన్నదెసెయింద, నన్న, నన్నల్లి - ఏకవ. 2-7 విభక్తులు
నమ్మన్ను, నమ్మింద, నమగె, నమ్మదెసెయింద, నమ్మ, నమ్మల్లి-బహువ. ,, ,,

ప్రాచీనకన్నడము.

ఎన్నం, ఎన్నిం, ఎనగె, ఎన్నత్తణిం, ఎన్న, ఎన్నొళ్ - ఏకవ. 2-7 విభక్తులు
ఎమ్మం, ఎమ్మిం, ఎమగె, ఎమ్మత్తణిం, ఎమ్మ, ఎమ్మొళ్ - బహువ. ,, ,,

[16] ఎన్నె, ఎనిక్కు, ఎన్నిల్ నిన్ను, ఎండె, ఎన్నిల్-ఏకవ. 2-4-7. విభక్తులు.
నమ్మె, నముక్కు, నమ్మిల్ నిన్ను, నమ్ముడె, నమ్మిల్ - బహువ. ,, ,,

తుదిని 'ఆ'కార యుక్తరూప ముండుటవలనను, ప్రాచీనమయిన 'ఆ'కారము సాధారణముగా ఏకారముగా మారుచుండుటవలనను, తెనుఁగున నేఁటికిని నాను, మామ, అను రూపములే విద్యావిహీనుల నోటిని ప్రథమావిభక్తిలోఁగూడ వినఁబడుచుండుట వలనను 'ఆ'కారయుక్తరూపమే ప్రాచీనమని తోఁచుచున్నది.[17] అట్లయినచో 'ఆ' అనునదియే ప్రాచీనద్రావిడరూపము. తుదినున్న నకారము కేవల వచనబోధకము. ఆన్ = యాన్ = ఞాన్ = నాన్ = నాను = నేను అనునట్లు మారియుండవచ్చునని యూహింపఁబడినది. కావున పదాదినున్న నకార, మకారములు రెండును అంత ప్రాచీనములు గావనియు, అజాదులగు ఆన్, ఏన్ అనునవియే ప్రాచీనతరములనుట యభిప్రేతము.

ఇఁక తెనుఁగు ప్రాచీనరూపము ఏను అనునది యనియు నిరూపింపఁబడినది. ఏను, నేను లకు బహువచనములు ఏము, నేము అనునవి. నేము అనుదాని నుండియే మేము అనురూపము గలిగినదని యూహింపఁబడినది. తుది మకార సాన్నిధ్యమువలన మొదటి నకారము మకార మయ్యెననుట సిద్ధము. నేను తుదినున్న నువర్ణ మేకవచనబోధకమును, మేము, మనము, తాము అను శబ్దముల తుదినున్న మువర్ణము బహువచనబోధకమనియును ఊహించుట సులభము. అరవ, మలయాళములలోని నీమ్‌గళ్ (మీరు) అను శబ్దములోని నీమ్ అనుదాని తుది మకారముగూడ నయియభిప్రాయమునే రూఢపఱచుచున్నది. కన్నడమున నీవు (మీరు) అనుశబ్దములోని తుది వువర్ణము మువర్ణముతో నభిన్నమని యూహింపఁబడినది. ఇట్లు బహువచనప్రత్యయ మనందగిన మవర్ణమునకు అరవము నందలి సముచ్చయవాచకమయిన ఉమ్ అనుదాని తుదియవయవము మూలమని కాల్డ్వెల్లుగారి యూహ.

ఈ ఉమ్‌లోని ఉవర్ణము సూర్యాచంద్రమసౌ, మిత్రావరుణౌ మొదలయిన సంస్కృతద్వివచనములలోని ఔ అనుదానివలనఁ గలిగియుండ వచ్చునని యొక ఊహ. హిందీ, ఒరియా భాషలలోని బహువచనప్రత్యయము లనందగు అఉ, ఆఉ అనువాని తుదినున్న ఉ అనునదియే అనునాసికత్వమును బొంది ఉం, ఉమ్ లుగా మాఱియుండవచ్చుననియు, ఆ ఉమ్ ద్రావిడభాషల యందు సముచ్చయచిహ్న మయినదనియు, ఈ సముచ్చయచిహ్నమునుండియే బహువచనప్రత్యయమగు మకారము పుట్టియుండుననియు స్వామినాథయ్యరుగా రభిప్రాయపడినారు. ఈ యూహకు ఒకటి రెండు ముఖ్యములయిన ప్రతిబంధకములు గలవు. క్రీ. వె. సుమారు 8-10 శతాబ్దములలో రూపెత్తిన ఉత్తరహిందూ స్థానభాషలనుండి క్రీస్తుపూర్వము ఉత్తమవ్యాకరణబద్ధమయిన అరవభాషలోని ఉమ్ శబ్దము కలిగినదనుట చరిత్రకు విరుద్ధము. తుదినుండిన మకారము

[17] C. G. D. 359-383.

పై ఉత్తరహిందూస్థానభాషలలో నేమయినదో చెప్పలేకుండుట రెండవది. ఊహా కందనివియు, చరిత్రక్రమము ననుసరింపనివియు నగు నిట్టి కల్పనలనుగూర్చి విచారించి ఫలములేదు.

పయివిచారణమువలనఁ దేలిన సారాంశములు : (1) ద్రావిడభాషలన్నిటి యందును ఉత్తమపురుష సర్వనామముల ప్రకృతి ప్రత్యయము లభిన్నములు. ఇవి ద్రావిడభాషల యైక్యమును నిరూపించుచున్నవి. (2) ద్రావిడభాషా సర్వనామముల రూపములకు, ఒరియా మొదలయిన యుత్తరహిందూస్థానభాషలలోని రూపములకును జన్య జనక భావమును గల్పించుట చరిత్రక్రమమునకు విరుద్ధము. (3) సంస్కృతమున నుండిన అస్మద్ శబ్దములోని అకారమునకును, ఆ శబ్దము యొక్క విభక్తిరూపములయిన నః, నౌ,[18] అనువానికిని అన్, నాన్, అను శబ్దములతో అభేదమునుగాని, జన్య జనక భావమునుగాని కల్పించుట యూహామాత్రమేగాని ప్రమాణసిద్ధముగాదు.[19] అన్ అనునదియు, ఏన్ అనునదియు కాలక్రమమున యాన్, ఞాన్, నేను, అను రూపములను బొందెననుట శబ్దశాస్త్ర సమ్మతముగాను, ఇతరోదాహరణములకును ద్రావిడభాషల కన్నింటికిని సరిపడునది గాను నున్నది. (4) ప్రాచీన ద్రావిడభాషలయందలి 'అ' శబ్దము భిన్నరూపముల నంది నేఁటి ద్రావిడభాషలలో వెలయుచున్న దనుటయు, సంస్కృతభాషాజన్యము కాదనియు సిద్ధాంతము.

## 3. యుష్మదర్థకము

తెనుఁగున నీవు, మీరు, అను రూపములు నవీనములు. ఈవు, ఈరు అనునవియే ప్రాచీనములు. ఇవి నేఁటివాడుకలో నశించినవి. మీరలు అనునట్టి రెండవ బహువచనరూపముగూడ గ్రాంథికముగా గనుపట్టుచున్నది. తక్కిన ద్రావిడభాషలయందును పయి రెండురూపములతోను అభిన్నములయిన రూపములే కనుపట్టుచున్నవి. తమిళము : నీ (ఏక); నీర్, నీయిర్, నీవిర్, నీంగళ్ (బహు) — కన్నడము : నీను (ఏక), నీవు (బహు); ద్వితీయాది విభక్త్యంగము : నిన్న (ఏక), నిమ్మ (బహు). మలయాళము : నీ (ఏక), నిజ్ఞళ్ (బహు). తుళు : ఈ (ఏక), ఈర్ (బహు).

అన్ని ద్రావిడభాషలయందును మూలరూపములు నీ, ఈ, అనునవి. వీనిలో ఈ అనునది ప్రాచీనతరమని యూహ. నీ, ఈ అనురూపము లభిన్నములు. వీనికి గొన్నియెడల ను, వు, ప్రత్యయములు వచ్చుటచే, నీను (కన్నడము)=నీవు (తెనుఁగు) ఏకవచనరూపములు గలిగినవి. ఉత్తమపురుషమువలెనే బహువచనప్రత్యయము మవర్ణముగనే యున్నది. దానివలన నీమ్, నీంగళ్, నిమ్మ (ద్వితీయాద్యంగము) మొదలగు రూపములు గలిగినవి. 'ర్' వర్ణమును బహువచనప్రత్యయ మగుటవలన

[18] ఆ. భా. చ. పుట. 1138, [19] ఆ. భా. చ. పుట. 1140,

నీర్, నీయిర్, నీపిర్ అను రూపములు భిన్నభాషలలోఁ గలిగినవి. తెనుఁగున ఏకవచనమగు నీవు అను రూపమే కన్నడమున బహువచనముగా నున్నది. దీనిని బట్టి వచనభేదము కాలక్రమమునఁ గలిగినదనియు, నొక్కరూపమే రెండువచనముల యందును వాడుకలో నుండెననియు నూహించుట కవకాశము గలదు. నీమ్ అను బహువచనరూపములోని తుది మకారము వువర్ణమయి కన్నడమున బహువచనరూపమగు నీవు కలిగిన దనియు ననవచ్చును, ఆ రూపమునకే యర్థభేదనుగలిగి తెనుఁగున నయ్యది యేకవచనమయినదని యొక యూహ. ప్రాచీనమయిన నీమ్ అను రూపముయొక్క తొలి నవర్ణము తుది మవర్ణ సాహచర్యమున మీగా మారి రుప్రత్యయము చేరుటవలన మీరు అను రూప మేర్పడినది. మువర్ణము బహువచనప్రత్యయముగా గలిగిన మీము అను రూప మొకటి ప్రథమావిభక్తియందుండి కాలక్రమమున నశించినట్లు మిము, మిమ్ము, అను ద్వితీయారూపములవలన స్పష్టమగుచున్నది కాఁబట్టి యీ శబ్దముల యుత్పత్తి క్రమ మిట్లుండెనని యూహించుట సులభము.

$$\text{ఈ} = \text{నీ} \begin{cases} = \text{నీం} \begin{cases} = \text{నీ౯} & = \text{నీను} \\ = \text{నీమ్} & \begin{cases} = \text{నీవు} \\ = \text{మీమ్} \end{cases} \end{cases} \\ = \text{నీర్} \qquad\qquad\qquad\qquad = \text{మీర్} \end{cases}$$

ఈ నీ శబ్దమునకు అరవమున ఉ౯ అను నింకొకరూపము గలదు. ఉనక్కు (నీకు). ఈ ఉ౯ శబ్దము అర్వాచీనభాషలో చాల ప్రచురము. ప్రాచీన భాషలో లేదు. దీనియొక్క వ్యుత్పత్తి యీ క్రిందిరీతిని ఊహింపఁబడినది. ప్రాచీన రూపమైన నీ౯ అనునది ను౯ అను రూపమును బొంది ముందటి నకారము లోపించుటవలన ఉ౯ అనురూపము సిద్ధించినది. అరవకావ్యములలో ప్రయోగింపఁబడిన రూపములనుబట్టి యిది నిర్ణయింపనగును.[20] ఈ ఉ౯ అను శబ్దము తెనుఁగున లేదు. పయి విచారణమునుబట్టి తెలియఁదగిన సారాంశములు: (1) ద్రావిడ భాషయందలి మధ్యమపురుష సర్వనామరూపములు అభిన్నములయి యా భాషల యైక్యమును నిరూపించుచున్నవి. (2) ఈ యను ప్రాచీనద్రావిడరూపమునుండియే నేఁటి భిన్నద్రావిడభాషలలోని రూపము లన్నియును గలిగినవి. (3) ఒక్క రూపమే ఒక మాండలికభాషలో ప్రథమావిభక్తిగాను, మఱియొకదానిలో ద్వితీయా విభక్తిలోను, ఒకదానిలో ఏకవచనమునందును, మఱియొకదానియందు బహువచనము నను గనుపట్టుచున్నది. ఇది యా భాషలయొక్క మాండలికత్వమును, అభిన్నతను నిరూపించుచున్నది. (4) ఈ, నీ, శబ్దములతో నభిన్నమని యూహించుట కవకాశములేని యుష్మత్ శబ్దమును, దాని యితరరూపములును సంస్కృత ద్రావిడ భాషలకు జన్య జనక భావముగాని, సోదరభావముగాని లేదని సిద్ధాంతపరచుచున్నవి.

---

[20] P. S. S. 132. ఉ౯ శబ్ద విచారము తొల్కాప్పియమున లేదు.

ఉభయార్థవాచి యయిన అస్మదర్థక బహువచనము.

మనము అనునట్టి ఉభయార్థవాచి యగు తెనుఁగుశబ్దముతో సమానార్థక మయిన వాడుక యితరద్రావిడభాషలయందును గలదు. మేము అనఁగా నెదిరిని గలుపక పలుకునదియు, మనము అనఁగా నెదిరినిగూడఁ జేర్చుకొనినదియు నని భావము. తమిళ, మలయాళములయందును, తుళు మొదలయిన యితర ద్రావిడ భాషలయందును ఇట్టి యర్థభేదము గలిగిన వాడుక కలదు. కన్నడమున నియ్యది గనుపట్టదు అని కొందఱు పలుకుచున్నారు. కాని ప్రాచీనభాషలోఁ గన్నడమునను ఇట్టి వాడుక కలదు.[21] నేఁటి భాషలోఁగూడ నున్నదనుట కుదాహరణములు గలవు. ఇట్టి ఉభయార్థవాచియైన అస్మదర్థక బహువచనముయొక్క వాడుకను సంస్కృత వైయాకరణు లెవ్వరును గుర్తింపలేదు. తెనుఁగున వైయాకరణులు స్పష్టముగా నిరూపించిరి.[22] ద్రావిడభాషలోని యీ యభ్యాసము ఆ భాషల సాజాత్యమును, సంస్కృతాజన్యత్వమును నిరూపించుచున్నదని భాషావిదుల యభిప్రాయము.

సంస్కృతమున అస్మద్ శబ్దమునకు ఆవామ్, నౌ, అను రెండు రూపములు గలవనియు, అందు నౌ అనునది ఋగ్వేదమునందలి 'సహనావవతు' మొదలగు స్థలములలో ఉభయార్థవాచి యనియు, నట్టి యభ్యాసము సంస్కృతమునుండియే ద్రావిడభాషలకు వచ్చినదనియును ఊహింపఁబడినది. ఋగ్వేదమున నౌ అను ద్వివచన మారుసార్లు కనఁబడుచున్నది. అది యన్నిచోట్ల నుభయార్థబోధకము గనే యున్నది. పయియుదాహరణము లన్నిటిని సందర్భానుసారముగ అర్థము పరిశీలనము చేసినఁగాని నిర్ణయింప వీలులేదు.

ఉభయార్థవాచి యయిన అస్మదర్థకబహువచనము ద్రావిడభాషయం దొక విశేషమనుట సిద్ధాంతము.

## 4. ఆ త్మా ర్థ క ము

తెనుఁగున దీని కేకవచనరూపము తాను అనియు, బహువచనరూపములు తాము, తారు, తమరు, ననియు సూరి యుదాహరించెను. దీని తుదినున్న

---

[21] It is believed that Kannada too does not possess this feature. I think that Kannada does possess two forms of the plural of the personal pronoun of the first person just like its sister languages of Southern India, and this not only in the old language but also in the modern inclusive—ಆಂ (old Kannada) ನಾವು (modern Kannada). Exclusive—ನಾಂ (old Kannada), ನಾವುಗಳು (mod. Kan.) In the instance ಇನಿಬರು ಮೋಂದಾಗಿ ಕಾದುವಂ ಫಲ್ಗುನನೊಳ್ given under sutra 229 of the *Subdamani Darpana*, the subject ಆಂ which is understood, is clearly inclusive. It is very rarely that ನಾಂ is used in old Kannada. *History of Kanarese Language* by R. Narasimhachari, P. 84.

[22] భూయ ఉభయార్థవాచీ యః కశ్చిద్భవతి నిత్యబహువచనః. ఆ. శ. చిం. హల. 59 శ్లో.

నువర్ణము సంధిలో లోపించి తా వచ్చె ఇత్యాదిరూపములు సిద్ధములగును. తాన్, తామ్, అనునవి యేకవచన, బహువచనము లందలి ప్రథమావిభక్తిరూపము లనియు, వాని ద్వితీయాది విభక్త్యంగములలో తన్, తమ్ అను రూపములు గలుగు ననియు తొల్కాప్పియనారు వచించెను. తెనుఁగునను ద్వితీయాది విభక్త్యంగము అకారయుక్తముగా తన, తమ, అనున ట్లున్నది. తెనుఁగునందలి తారు, తాము అను రూపములు రు, ము, అను బహువచనప్రత్యయములు వేర్వేరుగాఁ జేరుట వలనఁ గలిగిననుట స్పష్టము. తా శబ్దమును, దానియొక్క రూపములును, తెనుఁగున నేను, అతఁడు, అనునట్టి యర్థములలోఁ బ్రయోగింపఁబడినవి.[23] తమరు, అనునది పూజ్యార్థక మధ్యమపురుష బహువచనముగా వాడఁబడుచున్నది. అరవమున ఈ తా శబ్దమును మూఁడు పురుషములయందును, మూఁడు లింగముల యందును నామముతో నభిన్నముగా వాడవచ్చును. ఏవార్థమునఁగూడ దీని నా భాషయందు వాడుట గలదు. కన్నడవైయాకరణులు తాన్ ప్రథమపురుష ముగాఁ జేర్కొనిరి. మూఁడులింగములయందును ఈ శబ్దమును కన్నడమునను వాడుదురు. సంస్కృతమునందలి స్వయమ్ అను నర్థమున దీని నెల్లద్రావిడభాష లందును వాడుట గలదు.

ఈ శబ్ద మన్నిద్రావిడభాషలయందును గొంచె మించుమించుగ నేకరూపము ననే ఒక్కరీతినే వాడబఁడుచున్నదనుట నిస్సంశయము. దీని ప్రాథమికస్వరూప మునుగుఱించి కొంత సంధిగ్ధత గలదు. ద్వితీయాది విభక్త్యంగమగు తన్, తమ్, అను హ్రస్వాచ్చుగలరూపమా, లేక తా యను దీర్ఘాచ్చుగలరూపమా ప్రాథ మికము అను ప్రశ్నమునకు సమాధానము రానలయును. అన్ని ద్రావిడభాషల యందును ద్వితీయాది విభక్త్యంగము ఏకరీతిగా హ్రస్వరూపమున నుండుటచేత నయ్యదియే ప్రాచీనమని తోఁచుచున్నది. తా అను రూపముగూడ ద్వితీయాది విభక్త్యంగముగా నుండినచో నప్పుడు సందేహ మేర్పడవచ్చును. సాధారణముగా ద్వితీయాది విభక్త్యంగమే ప్రాచీనరూపమును నిరూపించుచుండును. కన్నడమునను, తెనుఁగునను ఆతం, ఈతం, ఏతం, అతఁడు, ఈతఁడు, ఏతఁడు అను రూపములు గలవు. వీనిలోని త్రికములను దొలఁగించి పరీక్షించినచో తం = తన్ = తను = తఁడు, అనునదియే మూలమనుట స్పష్టము. తుదినున్న న్ వర్ణము మకారముతో నభిన్నమగుచుండుననుట ముందు నిరూపించితిని. కాఁబట్టి యొకానొకకాలమున నొకేరూపము రెండువచనములయందును వాడఁబడుచుఁ గాలక్రమమున తన్, తమ్, అను భిన్నరూపములను భిన్నార్థములయందు గాంచి వాడుకకెక్కినదనుట సులభముగా నూహింపనగును. ఇది ద్రావిడభాషలలో సామాన్యమయిన వచన స్వభావమును నిరూపించుచున్నదనుటయు ముందు గతార్థమే. ఇంతియగాక యుష్మ

[23] ఆత్మార్థం బొకానొకచో నామాస్మదర్థాభిధాయియు నగు—తన కిష్టుడున్=నా కిష్టు డున్, తనకు మఱి తానె చుట్టంబు=స్త్రీక.

దస్మచ్ఛబ్దముల ప్రణాళికకును సరిపోయియున్నది. ఈ శబ్దము తమిళమున మొదట ప్రథమపురుష సర్వనామమాత్రము (వాఁడు, అది, ఆమె) గా వాడఁబడు చుండె ననియుఁ, గాలక్రమమున నితరపురుషములకును బ్రాకి యాత్మార్థక మయ్యె ననియు నొక యభిప్రాయము.[24] అట్లుకాదనియు, మొదటినుండియు నియ్యది యాత్మార్థకమే యనియు మఱియొక యభిప్రాయము.[25] అ, ఈ, ఏ, శబ్దములతోఁ జేర్చి దీనిని తెనుఁగు, కన్నడములయందు వాడుచుండుటవలన మొట్టమొదట నియ్యది తం అనురూపమున వ్యక్తిమాత్రవాచియై ఉభయవచనసామాన్యమై యుండి, తరువాత తా అను రూపమును బొంది రెండువచనములను గాంచి స్వయమర్థ వాచియై, యాత్మార్థకమయ్యె ననుట యుక్తముగా గనుపట్టుచున్నది. కాలక్రమము ననే అనఁగా నీ, నా, శబ్దములతోఁ గలసి మిక్కిలి ప్రాచీనావస్థయందే సర్వనామత నంది పురుషత్రయబోధక మయ్యెనని తోఁచుచున్నది.

ఋగ్వేదమునందు తను, త్మన్ అను శబ్దములు ఆత్మార్థకములుగా వాడఁబడుచుండెననియు, నియ్యది దానితో సభిన్నమనియు, ఇది తజ్జన్యమనియు స్వామినాథయ్యరుగారి యభిప్రాయము.[26] ఆంధ్రభాషాచరిత్రకారులు నట్లే యూహించిరి.

అయినను కావచ్చును. కాని యన్నివిషయములలో స్వతంత్రములని నిరూపించిన ద్రావిడభాషలలోని కిది యందుండి వచ్చెనని చెప్పుటకు ఊహామాత్రము కంటె యుక్తియు, ప్రమాణమును గావలెను అట్టిది వచ్చువఱకును బై యభిప్రాయము నంగీకరింపఁజాలము. చారిత్రకప్రమాణముగాని, బలమయిన యుక్తిగాని లేనప్పుడు యాదృచ్ఛికశబ్దసామ్యమాత్రము భిన్నభాషాకుటుంబములలో సమానజనకతను నిరూపింపఁజాలదని యింతకుమున్నే యనేకస్థలములలో నిరూపించితిని.

పయి యాత్మార్థకమయిన తన్ శబ్దము ద్రావిడమే యనియు, సర్వద్రావిడ భాషాసామాన్యమనియు సిద్ధాంతము.

## 5. నిర్దేశ సర్వనామములు

చిన్నయసూరి సర్వనామములలో అన్ని, ఇన్ని, ఎన్ని; అ, ఈ, ఏ, అనువాని నుదాహరించెను. ఇందలి "అ, ఈ, ఏ, యను సర్వనామములు త్రికంబునాఁబడు" అని వేఱొకచోట సూత్రించెను.[27] పయిపద్ధతి ననుసరించి మొదటి మూఁడగు అన్ని, ఇన్ని, ఎన్ని, అనునవి అ, ఈ, ఏ, అనువానికంటె

[24] Aryan Affinities of the Dravidian Pronoun. III Oriental Conference, Madras. Paper By R. Swaminatha Iyer. page 45.

[25] P. S. S. 135.

[26] Foot-note No. 24. Ibid page 47.

[27] బా. వ్యా. సమా. సూ 4.

భిన్నములయిన శబ్దములనుగాఁ బరిగణించి ప్రక్రియ నడిపినట్లు స్పష్టము. అన్ని, ఇన్ని, ఎన్ని, కొన్ని, అను రూపములనుండియే అందరు, ఇందరు, ఎందరు, కొందరు, అను రూపములను గల్పించెను. వాఁడు, వీఁడు, అది, ఏఁడు, ఏవి, మొదలగు శబ్దముల రూపములనుమాత్రమే పేర్కొనెనుగాని, వాని యుత్పత్తిక్రమము నూహింపలేదు.[28]

ప్రౌఢవ్యాకరణమునకుఁ బయిప్రణాళికకుఁ గొంత భిన్నమయిన మార్గ మనుసరింపఁబడినది. ఇంత, ఎంత, కొంత, శబ్దములు ఈ + అంత ; ఏ + అంత ; ఒక + అంత ; అనువాని కూటమివలన గలిగినవని యూహింపబడెను.[29] ఆ తరువాత అన్ని, ఎన్ని, కొన్ని, శబ్దములను అంత, ఇంత, కొంత, శబ్దములనుండి కల్పించెను. అట్లే ఆ, ఈ, ఏ, శబ్దములనుండియే వాఁడు, వీఁడు, వేఁడు, దాని, దీని, మొదలగు రూపములన్నిటిని గల్పించెను. ప్రణాళికయందు పయిరెండువ్యాకరణములకును భేదము గలదు. అందు మొదటిదానికంటె రెండవది యెక్కువచారిత్రకమని ముందు జరుగఁబోవు విచారణవలన స్పష్టపడగలదు.

తెనుఁగునందలి ఆ, ఈ, ఏ, శబ్దములలో ఏ శబ్దము ప్రశ్నార్థకమును, మొదటి రెండును నిర్దేశార్థకములు నయ్యెను, ఆ యా రూపములన్నియు నొక్కరీతినే యుండుటచేత తజ్జన్యరూపముల చరిత్రమంతయు నిందే యుదాహరించుచున్నాను.

నేఁటి తెనుఁగునను, ప్రాచీనభాషయందును గూడ ఆ, ఈ, ఏ, లు విశేషణములుగా నున్నవి. ఉ. ఆయిల్లు, ఈపురుషుఁడు, ఏపని, మొదలయినవి. అంత, ఇంత, ఎంత, అన్ని, ఇన్ని, ఎన్ని, అప్పుడు, మొదలయిన శబ్దములన్నియును నేఁటి ఆయిల్లు మొదలైన శబ్దములవలెనే ప్రాచీనకాలమున సమాసములుగానే యుండి కాలక్రమమున పూర్వోత్తరపదవిభాగము విస్మృతముఁకాఁగా నేర్పడిన యవిభక్త రూపములు. నేఁటి కివి యేకపదమాత్రములుగాఁ బరిగణింపఁబడి వాడుకలో నున్నవి. ఇంతియగాక కొన్నిశబ్దములు, ప్రత్యయమాత్రములు ఆ, ఈ, ఏ, లకు చేర్పఁ బడుటచేత నేర్పడి, యర్థవిశేషమున రూఢములయియున్నవి. ఇట్లు రూఢములయిన తెనుఁగురూపములు ఇతర ద్రావిడభాషలలో నత్యల్పభేదముతోఁగాని, ఆ రూపములతో గాని అర్థభేదములేకను, అల్పార్థభేదముతోను వాడఁబడుచున్నవి. ద్రావిడభాషలన్నిఁటియందును మిక్కిలి సమానమయినతీరున ఆ, ఈ, ఏ, శబ్దములు వాడఁబడుచు భాషల యభిన్నతను నిరూపించుచున్నవి. ఈ క్రింది యుదాహరణములను బరికించునది.

1. స్థలవాచకములు :

| తెలుఁగు | అరవము | కన్నడము |
|---|---|---|
| ఆడ, ఈడ, ఏడ. | అఙ్గు, ఇఙ్గు, ఎఙ్గు. | అల్లి, ఇల్లి, ఎల్లి. |
| అట, ఇట, ఎట. | అణ్డు, ఈణ్డు, యాణ్డు. | అత్త, ఇత్త, ఎత్త. |
| అన్దు, ఇన్దు, ఎన్దు. | | |

[28]బా. వ్యా. సర్వనామ ప్రకరణము,

[29]ప్రౌ. వ్యా. సర్వ. సూ. 51, 52, 53.

2. కాలవాచకములు :

| తెలుఁగు | అరవము | కన్నడము |
|---|---|---|
| అప్పుడు, ఇప్పుడు, ఎప్పుడు. | అప్పోదు, ఇప్పోదు, ఎప్పోదు. | ఆగ, ఈగ, యావాగ. |
| | అన్రు, ఇన్రు, ఎన్రు. | అన్దు, ఇన్దు, ఎన్దు. |

3. మాదిరి నిరూపించునవి : పరిమాణ ప్రకారాద్యర్థకములు

| తెలుఁగు | అరవము | కన్నడము |
|---|---|---|
| అంత, ఇంత, ఎంత. | అత్తనై, ఇత్తనై, ఎత్తనై | అనితు, ఇనితు, ఎనితు. |
| అట్లు, ఇట్లు, ఎట్లు. | అనైత్తు, ఇనైత్తు. | అష్టు, ఇష్టు, ఎష్టు. |
| అట్టి, ఇట్టి, ఎట్టి. | అప్పడి, ఇప్పడి, ఎప్పడి. | అన్తు, ఇన్తు, ఎన్తు. |
| | | అన్త, ఇన్త, ఎన్త. |

4. పురుషవస్తువాచకములు

| తెలుఁగు | అరవము | కన్నడము |
|---|---|---|
| వాఁడు, వీఁడు, వేఁడు. | అవన్, ఇవన్, యావన్. | అవను, ఇవను, యావను. |
| ఆమె, ఈమె, ఏమె. | అవళ్, ఇవళ్, యావళ్. | అవళు, ఇవళు, యావళు. |
| అది, ఇది, ఏది. | అదు, ఇదు, ఎదు. | అదు, ఇదు, ఎదు. |
| అవి, ఇవి, ఏవి. | అవై, ఇవై, యావై. | అవు, ఇవు, యావు. |

పై పట్టికనుబట్టి స్పష్టపడువిషయము మఱియొకటి గలదు దు, న్దు, న్రు, ఙ్గు, న్ను, తు, మొదలయిన వివిధప్రత్యయములు చేరుటవలన, ఆ, ఈ, ఏ లు భిన్న భాషలలో సమానార్థకములుగాను, భిన్నార్థకములుగాను నున్నవనుట.

అరవమునందలి అవన్, ఇవన్, ఎవన్ అను శబ్దములవలెనే ప్రాచీనకాలమున తెనుఁగున నుండిన రూపములు నేఁటికి వాఁడు, వీఁడు, వేఁడు, అనునట్లు మారిపోవుటకు హేతువు ఊనికయొక్కస్థానము మొదటియక్షరమునుండి రెండవయక్షరముపైకి మారుట యని ఊనికనుగూర్చి వివరించునపుడు తెలిపితిని. ఇట్లే అది, ఇది, ఎది, అను శబ్దముల ద్వితీయాది విభక్త్యంగములు దా, దీ, దే, యను రూపముల నందినవి. అవి, ఇవి, ఎవి, అనువాని ద్వితీయాది విభక్త్యంగములును వాని, వీని, వేని, (వాటి, వీటి, వేటి) అనురూపములుగా మారినవి. ఈ ఊనికమార్పు అరవమునను గలదు. కాని యది తెనుఁగుకంటె నల్పతరము. ఉదా : ఎనక్కు=నేక్కు (నాకు), ఉనక్కు= నోక్కు (నీకు).

పయిపట్టికయందున్న కన్నడములోని అల్లి, ఇల్లి, ఎల్లి, యను స్థలవాచకముల యొక్క అలి, ఇలి, ఎలి అను రూపములలో అలి యనునది నేఁటి అందలి, ఇందలి, ఎందలి శబ్దములయందు ఆగమమాత్రముగా నున్నది. తెనుఁగున స్థలవాచకములయిన అందు, ఇందు, ఎందు అనునవి కన్నడమున కాలవాచకము లయినవి. కన్నడమున అనితు మొదలయినరూపములలోని నడిమి ఇకారము పోయి అంత మొదలయిన రూపములు తెనుఁగున నేర్పడినవి. అరవమున అప్పొழுదు మొదలయినరూపములలో తుదినున్న దుప్రత్యయములేకయే ఉండిన అప్పొழு మొదలయినరూపములు తెనుఁగున అప్పుడు, ఇప్పుడు అను రూపములుగా మారెనవి. అప్పొழுదు అను రూపము నేఁటి యరవమున అప్పోదు అని మారిమానది. పొழுదు అను శబ్దము తెనుఁగున ప్రొద్దు అను రూపము నందియున్నది. దీనికి ప్రాచీన రూపములు పొழு = పుழு అనునవి. ఆ పుழு మాత్రము చేరుటవలన అప్పుడు మొదలయినరూపము లేర్పడినవి. కాని నేఁటి అప్పుడు శబ్దము ఇట్లు ఏర్పడినదని మనకుఁ దెలియక యది యఖండమయినశబ్దముగానే భావింతుము. అప్పుడు శబ్దవిభాగమును వైయాకరణులుగూడ సూచింపలేదు. కాని అచ్చట, ఇచ్చట, ఎచ్చట, అను మూఁడుశబ్దములును అచోటు, ఇచోటు, ఎచోటు అను శబ్దములనుండి యేర్పడినవని తెనుఁగువైయాకరణులే నిరూపించిరి.[30] ఈ పదము వ్యుత్పత్తిని మఱచి నేఁటివారు వాడుకలో అచ్చట యను సప్తమ్యంతమును ప్రాతిపదికముగా గల్పించుకొని దానిపయి అచ్చటకు మొదలయిన రూపములనుగూడ నేర్పఱచుకొనుచున్నారు.

పయి నీయంబడిన అ, ఈ, ఏ, శబ్దములవలనం గలిగిన రూపములు స్వరూపమును, సాజాత్యమును, ద్రావిడభాషలన్నియు నొకేభాషయొక్క మాండలికములయి కాలక్రమమున నేర్పడిన భిన్నరూపములతో వేర్పఱుపఁబడినవనువిషయమును నిస్సంశయముగాను, స్పష్టముగాను నిరూపించుచున్నవి.

ఆ, ఈ, అనునవి దూరమును, దగ్గరను, బోధించు శబ్దములు. ఇవి రెండును గాక మాధ్యస్థ్యమును బోధించు ఉ శబ్ద మొక్కటి అరవమునను, గన్నడమునను గలదు. దానివలన, ఉవన్, ఉవళ్, ఉవర్, ఉదు మొదలయినరూపము లాభాషలయందు గలవు. అట్టి ఉ, ఊ శబ్దములతో నేర్పడిన శబ్దములు తెనుఁగునందు సంపూర్ణముగా భ్రష్టములయినవి. అట్టివి ఒకానొకకాలమున నుండినట్లు నిదర్శనముగా ఉల్ల అనురూప మొకటి భారతమునఁ గనుపట్టుచున్నది. అల్ల, ఇల్ల, ఎల్ల, ఉల్ల, అను రూపములు ఆ, ఈ, ఏ, ఊ, అను శబ్దములనుండి యేర్పడినవి. అల్ల యనునది నన్నయచే ప్రయోగింపఁబడెను. ఇల్ల యనుదానికి బసవపురాణమున ప్రయోగము గలదు. ఎల్ల శబ్దము విచారణ మున్ముందు చేయఁ

[30] బా. వ్యా. సమా. పరి. 15-16 సూత్రములు.

బడును. ఉల్ల శబ్దము గ్రంథములయందుమాత్రము గలదు. వాడుకలో నేఁడు నశించినది.[31] అల్లక్కడ, ఇల్లివి మొదలయినవి నేఁటి వాడుకలోఁ గలవు.

ఆ, ఈ, ఊ, ఏ అనువానికి ప్రాచీనపరూపములు అ, ఇ, ఉ, ఎ అనెడి హ్రస్వములనియే కాల్డ్వెల్లుగారి యభిప్రాయము. అది, ఇది, ఉదు, ఎది అను శబ్దములలో నియ్యది హ్రస్వరూపముగా నున్నదనియు, దీర్ఘములే ప్రాచీనతరము లయినచో ఆది, ఈది అను రూపములు నుండవలయుననియు, నాతని యభిప్రాయము.[32] ఆ, ఈ, ఊ అనువానికి అవ్, ఇవ్, ఉవ్ అనునవి మూలరూపము లనియు, అవ్ + యానై = అవ్యానై (ఆ యేనుగు) అను రూపము కలుగుననియు, తొల్కాప్పియము మతమును, నన్నూలుమతము నియ్యదియే యనియు తెలుపఁ బడినది.[33] తుదినున్న వకారము సంధియందాగమముగా వచ్చుచుండుటఁబట్టియు, కొన్నియెడల నయ్యది అవయవిక మనునట్లు విభజించుటకు వీలుండుటచేతను వా రట్లు సూచించియుండిరేకాని వేఱుకాదని తోఁచుచున్నది. కాల్డ్వెల్లుగారి మతము ననుసరించి హ్రస్వరూపములగు అ, ఇ, ఉ ప్రాచీనతరములయి దార్ఢ్య బోధనార్థము దీర్ఘరూపములనంది ఆ, ఈ, ఊ అను రూపములను బొందెననియు నూహింప నవకాశము గలదు. విశేషణరూపము లన్నియును ఆ, ఈ, ఊ అను దీర్ఘరూపములతో నుండుటవలన నవియే ప్రాచీనతరములేమో యనియు ననుమానము కలుగక మానదు.

## 6. ప్రశ్నార్థకములు

తెనుఁగునఁ బ్రశ్నార్థకసర్వనామము యొక్క రూపములు ఎ, ఏ అను వానివలననే యేర్పడినవి. ఏది, ఎవడు, ఎక్కడ, ఏయిల్లు మొదలయినవాని యందు ఎ, ఏ అనునవియే మూలరూపములు. ఎవడు అనుదానికి బదులుగ వేడు,[34] ఏవాని అనుదానికి బదులుగా వేని, ఏదాని యనుటకు బదులు దేని

[31] బసవపురాణపీఠిక—వేటూరి ప్రభాకరశాస్త్రిగారు. పుట 100
ఇల్లకప్పడి సంగమేశ్వరంబందు — బ. పు. ద్విపద పు. 24.
ఇల్లికప్పడి సంగమేశ్వరము — ,, ,, పద్యకావ్యము.
ఉల్లతెల్లని తురగోత్తమువాలంబు — భార. ఆది.
ఉల్లకాంచన రథముపై నున్నవాడు — భార. అరణ్యప.
అల్లచోట — భార. ఆదిప. ఆ. 1, ప. 211.
ఉల్లపద్మాకరము పొంతనుండి — భార. అరణ్యప. ఆ. 6 ప. 154.
ఉల్లపెట్టియ నిండియున్నయవియ—కాశీఖండము. ఆ. 7 ప. 244.

[32] C. G. D. పుట 421

[33] *Dravidic Studies*. Part I Page 3. Madras University.

[34] ప్రౌ. వ్యా. శ. ఫ.

అనియు రూపములు కనుపట్టుచున్నవి. కాని యివియన్నియు ఎ, ఏ లు ఆదిగాగల రూపములయందే మొదటియక్షరముపైనున్న యూనిక తొలఁగిపోగా రెండవ యక్షరముపై నూనిక స్థిరపడి పుట్టిన రూపములని ముందు నిరూపించితిని. ఏఁడీ (ఎక్కడ నున్నాడు) అను పదము వాడుకలో నుండుటఁబట్టి ఏఁడు అను రూపము గూడ ఏవాఁడు అను నర్థమున ప్రయోగింపఁబడుచుండినట్లు నిస్సంశయముగా నిరూపింపనగును. కాని యీ ఏఁడు అను రూపమునకు వేరురీతిని ప్రయోగములు కనుపింపవు. దీనికిఁ గారణమేమి యని యూహింపవలయును. సంవత్సరము అను నర్థమున ఏఁడు శబ్దము ప్రయోగింపఁబడుచుండుటఁబట్టి (అర్థానితో దీనికి తబ్బిబ్బు పడుటవలన) యేర్పడు సందిగ్ధతను వారింపవలసిన యవసరము కలుగుటచే వత్స రార్థకమయిన ఏఁడు నిలిచి, యీ ఏఁడు శబ్దము పోయినది. దీని సమానార్థకం బయిన ఏవాఁడు, ఎవడు మొదలయినవియే వాడుకలో నిలిచినవి.

పామరజనవ్యవహారమున ఓరు అను పదము ఎవరు అను నర్థమున వాడఁ బడుచున్నది. ఇది ఎవరు శబ్దముయొక్క యపభ్రష్టరూపమని యొక యూహ గాని యది సరికాదు. భాగవతమునందలి 'ఓరేద్వకుడు' అను ప్రయోగ మొకటి గలదు.[35] ఓరు=ఒకడును అని యర్థము. ఒకరు అను రూపమే ఓరు అని యైనదని యూహించుట లెస్స. ఒకనాడు=ఓనాడు, ఒకమాట=ఓమాట అను వానియందు ఒక యనునది ఓగా మారినది. పయిప్రయోగమునందున్నశబ్దము పయిరీతిని మారినదనుట యుక్తతరమని తోఁచుచున్నది.

ఇంతియగాక ఓ అను శబ్దము సంబోధనమునను, ప్రశ్నార్థకమునను గూడ వాడఁబడుచున్నది. ద్రావిడభాషలయం దన్నిటియందును ఆ, ఓ అనునవి పదాంతమునను, వాక్యాంతమునను గూడ ప్రయోగింపఁబడి ప్రశ్నార్థకము లగుచున్నవి. 'వాడా'! 'వీడు రాడో!' మొదలయినరీతిని ఆ, ఓ లకు అన్ని ద్రావిడభాషలలోను ప్రశ్నార్థకములుగా ప్రయోగములు గలవు. ప్రశ్నార్థకమయిన ఓ శబ్దమునకు రువర్ణము చేరి ఓరు అను రూప మేర్పడి, ఓరీ అను సంబుద్ధియుఁ గలిగియుండ వచ్చును. ఓ అను శబ్దము సంబుద్ధియందును, ప్రశ్నమునను గూడ నెల్ల ద్రావిడ భాషలయందును ప్రయోగింపఁబడుచునే యున్నది. పామరజనవ్యవహారమునందలి ఓరు ఇ ట్లేర్పడి యుండవచ్చును.

తెనుఁగున ఏని, ఏమి, ఏటి, ఏమిటి అను రూపములును ప్రశ్నార్థకములుగా నున్నవి. ఏమిటి యనునది ఏమినుండి గలిగిన యౌపవిభక్తికరూపమనుట స్పష్టము. ఏటి యనునదియు నట్టిదియే. ఇది సమస్తరూపములనుండియు, విభక్త్యంత రూపములనుండియు (ఏమిటికి, ఏటిమాట, ఎట్టిపలుకు) అనుచితవిభాగమువలన నేర్పడిన ప్రథమాంతము. ఏని, ఏమి అనునవి రెండును అభిన్నములు. తుది నకార,

[35] ఆ. భా. VI. 523

మకారములు పరస్పరము మాఱునవి. ఏ (న్), ఏ (మ్), అనునవి ప్రాచీనరూపములు. తుది ఇకారము పదాంతమున ఉచ్చారణసౌకర్యముకొఱకు వచ్చియుండవచ్చును. లేదా టివర్ణమువలెనే అదియును అనుచితవిభాగమువలననే ఔపవిభక్తికమయిన ఇవర్ణమును బొందియుండవచ్చును. లేక రెండు హేతువులవలనను ఏర్పడవచ్చును. తుది నకార, మకారములు అభిన్నములనుటయు, అమ్, అన్ ల సామ్యమును, అస్మదర్థకము సందర్భమునను, అనుస్వారచరిత్రమునను నిరూపించితిని. ఈ ఏని యనునది చేరుటవలననే తెనుఁగునందలి చేదర్థకక్రియారూపమగు వచ్చెనేని, వచ్చితే యనునవి యేర్పడినవి యను విషయ మా సందర్భమున నిరూపింపఁబడును. సముచ్చయార్థక నుశబ్దముతోఁ జేరిన ఎవ్వఁడును, ఏదియు మొదలయినవి సర్వార్థకములుగా నెలకొనియుండుట వాడుకనుఁబట్టియు, శాసనస్థభాషనుబట్టియు స్పష్టము. అట్లే ఎల్ల యనునది సముచ్చయ నువర్ణకము చేరి సర్వార్థకమయిన యవ్యయముగా స్థిరపడినది. ఎల్లఁ, ఎల్లయును, ఎల్లామ్ (తమిళము) మొదలయినవి పైయర్థమున నిలచినవి. ఎల్లవారు, ఎల్లరు మొదలగునవి ఎల్ల నుండి కలిగిన సమస్తరూపములు. ఇది సీమార్థకమయిన ఎల్ల శబ్దమునుండి కలిగినదని కాల్డ్వెల్లుగారి యూహ. అల్ల, ఇల్ల అనునవి కలిగినట్లే ఎల్లయు గలిగి సర్వార్థకమయి, తరువాత సీమార్థక మయ్యెననుట యుక్తతరము.

ఏది, ఏయది, ఏమె, ఏకె, ఎద్ది మొదలయినవన్నియును ఏ శబ్దమునుండి యేర్పడినవియే యనుట సిద్ధాంతము. ఇది తెనుఁగునందలి చరిత్రము.

అరవమునందు తొల్కాప్పియనారుచే ఉదాహరింపఁబడిన ప్రశ్నార్థక సర్వనామ సందర్భమున యావన్ (ఎవ్వఁడు), యావళ్ (ఎవతె), యావర్, యాఅర్, యార్ (ఎవరు), యావదు (ఏయది), యా (ఏ), యావై (ఏవి) అను రూపములును, ఎవన్, అను రూపమును గలవు.[36] ఎవన్ అను శబ్దము నపుంసకరూపముల ఏక బహువచనములు రెంటికిని విశేషణముగా వాడవచ్చుననియుఁ జెప్పియున్నాఁడు. పయి దానినిబట్టి తొల్కాప్పియము కాలమున ప్రశ్నార్థకము యా అను శబ్దమే. ఎ శబ్దముకూడ నుండినట్లు ఎవన్ అనునది సాక్ష్యము. కాని కాలక్రమమున యా శబ్దము వెనుకఁబడి, ఎ, ఏ లతో గూడిన ఎవన్, ఎవళ్, ఎవర్, ఎదు, ఎవై మొదలయిన రూపములు నేఁడు స్థిరపడినవి. తొల్కాప్పియనారు కాలముననే ఏ, యా అను రెండుశబ్దములు నుండినట్లు పయివిచారణమునుబట్టి స్పష్టము.

కన్నడమున ప్రాచీనభాషలో ఆవం, ఆవళ్, ఆవుదు, ఆర్, ఆవువు (ఏవి), ఆవ (ఏ) అను రూపములు వాడుకలో నుండినవి. నవీనకన్నడమున యావం, యావళ్, యావుదు, యార్, యావువు అను యకారాదిరూపములు స్థిరపడినవి.[37] ఏడెనిమిది శతాబ్దముల శాసనస్థభాషలో ఆర్ అను 'ఆ'కారయుక్తరూపములే

[36] P. S. S. 137.

[37] *Lectures on the History of Kanarese Language,* **Page 86.**

కన్పట్టుచున్నవి.[38] శబ్దమణిదర్పణమున 112 వ సూత్రమున ఏన్ ప్రశ్నార్థకమనియు, దానికి ద్వితీయాదిరూపములును గలవనియు చెప్పఁబడినది.[39] కావున కన్నడమునను ఏ యను శబ్దము ప్రశ్నార్థకముగా గలదు.

పైవిచారణవలనఁ దేలిన ఫలిత మేమనఁగా ఏ, ఆ, యా, ఓ, అనునవి ద్రావిడభాషలయందు ప్రశ్నార్థకములు. ఇవి పదాదిని, పదాంతమునను జేర్పఁబడు చుండును. కొన్ని, కొన్నియర్థములలో కొన్ని మాండలికములలో నిలిచినవి. తక్కినయెడ నశించినవి. ఇవియన్నియును ఒక్క ఏ శబ్దమునుండిగాని, ఆ శబ్దమునుండి గాని కలిగినవని నిరూపింపఁ బ్రయత్నించుట యవసరము లేనిపని. వీని ప్రయోగ బాహుళ్యమును, ఏవిధముననో ఒకవిధమున నివి యన్ని ద్రావిడభాషలలో వాడఁ బడుచున్నవి యనుటయు, వీని ప్రాచీనతను, సార్వత్రికత్వమును నిరూపించుచున్నవి. ప్రాచీన ద్రావిడభాష బహువిధములుగానుండి మిక్కిలి వ్యావహారికావస్థయం దుండి నపు డివి యన్నియును అనియతముగా ఏకార్థమునను, భిన్నార్థమునను వాడఁబడు చుండెనని యూహించుట సులభము. కాలక్రమముననే వీని యర్థవైశిష్ట్యము ప్రయో గముమూలముననే స్థిరపడినది. ఆ, యా, అనునవి యభిన్నములు. 'ఆ' శబ్దము తదర్థ కముగూడ నగుటవలన కాలక్రమమునఁ గన్నడమున ఆర్ మొదలగు రూపములు పోయి, యార్ మొదలగు రూపములే స్థిరపడినవి. అరవమున ఏ అను రూపము తెనుఁగుతో గలిసి స్థిరపడినది. ఇదియును ప్రాచీనకాలమున నరవమున నుండినట్లు నిరూపించితిని. యా శబ్దము ప్రాచీనభాషయందే వ్యతువిశేషము, వెడలువు మొద లయిన యర్థములలో రూఢమయి యుండినది. ఇంతియగాక యా అను ధాతువు కట్టు, మూయు, కూర్చు, చెప్పు మొదలయిన యర్థములలో వాడఁబడుచునే యుండినది. యా శబ్దము ప్రశ్నార్థకముగా తొలఁగుటకుఁ గారణము పయిదాని తోడి సందిగ్ధతను తొలఁగించుటకు గావచ్చును. ఇంతియగాక ఊనికగూడ బయి మార్పునకు సహకారికారణము గావచ్చును. ఓ శబ్దము సంబుద్ధియందు రూఢమగుట వలన ప్రశ్నార్థకముగాఁ బదాదిని తొలఁగిపోయినది. అనఁగాఁ గాలక్రమమునఁ బ్రశ్న కును, సంబోధనమునకును గల భేదమును నిరూపించుటకొఱకే యేర్పడియుండవచ్చు ననుట. ప్రశ్నార్థకముగా ఓ శబ్దము పదాంతమునమాత్రము నిలిచిపోయినది.

పయిక్రమము ద్రావిడభాషలయొక్క యైక్యమును, ప్రాథమిక స్వరూపమును, స్వాతంత్ర్యమును నిరూపించుచున్నదనుట నిస్సంశయము.

## 7. సంబంధబోధకములు

సంబంధబోధకము లయిన సర్వనామములును, సార్వనామికవిశేషణములును ద్రావిడభాషలయందు గాలక్రమమున నేర్పడినవి. అవి వాడుట ద్రావిడభాషల

[38] *A Grammar of the oldest Kanarese Inscirptions*, Page 179.

[39] ఏన్, ఏతర్, ఏతర్కె, ఏకె, ఏతఱిం, ఏతఱత్తణిం, ఏతఱ, ఏతఱోళ్.

స్వభావము గాదు. వానిస్థానమున క్రియాజన్యవిశేషణములనే వారు వాడుచుండిరి. ఇది యెంతయు లాఘవముమాత్రమేగాక నేఁటికిని వాడుకభాషలోని క్రమమే యనక తప్పదు. సంబంధబోధక సర్వనామములనుగూర్చియు, నవి తెనుఁగున నెట్లు సంస్కృత ప్రభావమునఁ బ్రవేశించినవి యను విషయమునుగూర్చియు "నన్నయభాషలో స్థిరపడిన విశేషములు" అను శీర్షికలో విపులముగా వ్రాసితిని.

సంబంధబోధకమయిన యత్ శబ్దమునుగూర్చిగాని, దానికిఁజేరిన తత్ శబ్దమునుగూర్చి కాని తొల్కాప్పియనారు తనగ్రంథమున వ్రాయలేదు.[40] అరవమునందు ప్రాచీనభాషలో క్రియాజన్యవిశేషణములుమాత్రమే వాడుచుండిరి. ఉండి కొడుత్తోర్, ఉయిర్ కొడుత్తోర్ (తిండిపెట్టినవారు, జీవనమిచ్చినవారే) పురనానూరు 18-19, చేర్వానైక్కండాల్ (కూడువానిని చూచినచో) తేవారమ్-25-2. పయిక్రమమునకు విలక్షణమయిన సంబంధబోధక సర్వనామముల ప్రయోగ మరవమున మణిమేకలై యందును, తరువాతి గ్రంథములయందును సంస్కృతాను సారిగా బయలుదేరినది. 'యాదొన్ఱు యాదొన్ఱు మూర్తమ్ అదు అనిత్తమ్' (ఏది యేది మూర్తమో అది యనిత్యము) అను వాక్యములవంటివి తరువాతి గ్రంథములలో గలవు. 'యద్యద్ మూర్తం తత్త దనిత్యమ్' అను సంస్కృతవాక్యమున కిది తెనుఁగు.

కన్నడమునందును బయిపద్ధతియే యనుసరింపఁబడుచున్నది. ప్రాచీన శాసనములయందు సంబంధబోధకసర్వనామాదికముయొక్క ప్రయోగము లేదు. దానికిబదులు క్రియాజన్యవిశేషణములే ప్రయోగింపఁబడుచున్నవి.[42]

'అళివోన్ పంచమహాపాతకన్ అకుమ్' (చెఱుపినవాడు పంచమహాపాతకుఁడగును). కాలము క్రీ. వె. 578. ఇ. ఆ. వా. X, పుట 60. 'ఇదన్ కాదుసల్వోన్ పరమకల్యాణ భాగిగళ్ అప్పోర్' (దీనిని కాచి జరుపువారు పరమకల్యాణభాగులు అగుదురు.) కాలము. 685 A. D. E. C. VII, Sk. 154.

కాని పదియవ శతాబ్ది శాసనములనుండియు సంబంధబోధకసర్వనామ ప్రయోగము కనుపట్టుచున్నది.[42]

పయి రెండు భాషలయందును గల చరిత్రము ననుసరించియే తెనుఁగుభాష యందును సంబంధబోధకసర్వనామముల చరిత్రము వెలయుచున్నది. ప్రాచీన శాసనములయందు ఈ క్రిందిరీతి ప్రయోగము లున్నట్లు "నన్నయకు ముందు భాష" యను ప్రకరణమున నుదహరించితిని.

దీని సల్పినవానికి ఊఱ్లు నిల్పినమ్ పుణ్యమ్బు-8 వ శతాబ్దము. తేనిటచ్చిన వాన్డు పఞ్చమహాపాతకున్డకున్.

[40]P. S. S. 128. [41]*A Grammar of the oldest Kan. Ins.* Page 179.

[42]Do-ఇదనారొర్బకాదర్ అవర్గె పిరుదు పుణ్యమ్. క్రీ. వె. 910 ఎపి. కర్ణా. I, 74.

పయిరీతిని ప్రాచీనప్రయోగము లన్నిటియందును క్రియాజన్యవిశేషణములే వాడఁబడుచుండినవి. క్రీ. వె. 1006 సంవత్సరమునకుఁ జెందిన యొక శాసనములో మాత్రము ఎవ్వరు, వారు, అను సంబంధబోధక సర్వనామముల ప్రయోగము కనుపట్టినట్లు ముం దుదాహరించితిని. తరువాత నా యభ్యాసమే నన్నయ గ్రంథమునఁ బెరిగినట్లును నిరూపించితిని. కాని శాసనములయందు సంబంధబోధక సర్వనామములు లేని వాడుకయే చాలవఱకు నడుచుచు వచ్చినది.[43]

'ఎవ్వఁడుచేయునో వాఁడు పాపము అనుభవించును' అను రీతిగల వాక్యమేర్పడినప్పుడే ఎవ్వఁడు, వాఁడు, అనునవి యత్తద్వాచకము లగును. సంస్కృతచ్ఛాయను ఎవ్వఁడు అను శబ్దము సంబంధబోధకసర్వనామ మగుననియు నూహింపఁదగును. అట్టి యభ్యాసము గుదురుకొనుటకుఁబదులు ఎవ్వరును, ఎవ్వరేని, అనునట్లు ను, ఏని, శబ్దములనుగూడ చేర్చి వాక్యరచనమును జేయుచుండిరి.[44] ఇది పయిసంస్కృతవాక్యరచనను తెనుఁగునఁ జేర్చుకొనుటలోని యవస్థాభేదమే యనుట స్పష్టము.

ప్రశ్నార్థకమయిన 'ఏ' శబ్ద మెట్లు దానికి సమాధానమయిన వాఁడు, అది, మొదలగు శబ్దములుగల వాక్యములతో నవ్యవహితముగా గలిసి సంబంధబోధకసర్వనామరచనాపద్ధతి యేర్పడినదో ముందు నిరూపించితిని.

పయివిచారణవలని ఫలితములు :

(1) సంబంధబోధకసర్వనామరచన ద్రావిడభాషలందెల్లను అస్వాభావికమే. ప్రాచీనమును గాదు.

(2) సుమారు పదియవశతాబ్దమునకు ముందే సంస్కృతానుసారిగా గల్గినది.

(3) సంస్కృతానుసారి గ్రంథరచనాపద్ధతి కది యనుకూలము.

(4) ద్రావిడభాషలలో సహజమైన క్రియాజన్యవిశేషణముల వాడుక నేఁటికిని బహుళముగా నిలిచియున్నది.

పయివిషయము ద్రావిడభాషల స్వాతంత్ర్యమును, సంస్కృతభాషనుండిగాని, ప్రాకృతములనుండిగాని కలుగలేదనుటను, నిర్వివాదముగా నిరూపించుచున్నది.

---

[43] S. I. I. V. (161) ఈ ధర్మ్మువునకు విఘ్నముసేసినవారు గంగ్గకఱుంగ్గవిలలం బొడిసినవారు-క్రీ. వె. 1200. (162) దీని నెవ్వరేని విలంబ్బముసేసినవారు గోబ్రాహ్మణ వధ సేసినవారు-క్రీ. వె. 1168.

[44] భా. ఆది. అ III. ప. 86 - ఎందేనిఁ బుట్టి రట్టి కౌరవాన్వయంబు

భా. సభా. అ. I. ప. 9 - ఎందేనిఁ గ్రతువులు...చేసిరి అట్టి బిందుసరము.

భా. ఆది. అ. II ప. 238 - ఎవ్వఁడేని సభ్యుఁడై పలుకువాఁ డనృతదోషంబు.

ద్రావిడమయిన యావన్ (ఎవడు) శబ్దము సంస్కృతమునందలి యావాన్ శబ్దమునుండి కలిగినదని స్వామినాథయ్యరుగా రూహించిరి. కాని యావాన్ శబ్దము సంస్కృతమున ఏనాడును ప్రశ్నార్థకము గాదు. సంబంధబోధకమాత్రము. అరవ కన్నడములందలి యావన్ శబ్దము మొదట ప్రశ్నార్థకమే. కాలక్రమమున సంబంధ బోధకత నందినది. పయియూహ చరిత్రకును, ఆ పదముల యర్థపరిణామక్రమము నకును విరుద్ధము.

## 8. అనిర్దిష్టార్థకములు

కొన్ని, పెక్కు, పలు, అను శబ్దముల చరిత్రముమాత్ర మిక దిఙ్మాత్రముగా ప్రదర్శింపవలయును. ఈ మూఁడును సర్వనామములుగా సూరి పేర్కొనినవియే. అతని మతమున తెనుఁగుసర్వనామములకుగల లక్షణములు వీనియందును బట్టు ననుట నిస్సంశయము.

ఒక + అంత, అను శబ్దములు గలసి వర్ణవ్యత్యయ మేర్పడినదనియును, (ఒకొంత) = కొంత యను రూపము గలిగినదనియును ప్రౌఢవ్యాకరణకర్తమతము. కొంత శబ్దమునుండి కొన్ని శబ్దము నాతడు సాధించెను.[44a] కొన్ని శబ్దమును, దాని రూపములును, కొంచె శబ్దమునకు సంబంధించినవనియును, కొంచె శబ్దము కించి చ్ఛబ్దభవమనియును నొక యభిప్రాయము గలదు. ఇంచు అనగా తక్కువయగు అను నర్థమున నొకశబ్దము తెనుఁగునఁ గలదు. ఒక + ఇంచు = కొంచు అను రూపమునుండి కొంచెము గలిగెననియు నొక యూహగలదు. కుఱు, కొంచు, కొఱుచ, కొఱత, మొదలయిన రూపములకు మూలమయిన యొక ద్రావిడ ధాతువు గలదనియు, నద్దానిరూపములే కొంత, కొన్ని, కొంచెము, మొదలగునవి యనియు నూహించుట లెస్స. కొన్ అనునది పయి ధాతురూపముతో నభిన్నమని యొక యభిప్రాయము గలదు. ఇదియే సమంజసమని తోచుచున్నది.

ఈ కొన్ని యనురూప మౌపవిభక్తికాంతము. కొన్నిటి, కొన్నిట, అను రూపములు గలవు. కొంత, కొందఱు, అనునవి దీని యితరరూపములు.

పెక్కు : ఇది పెఱు అను ద్రావిడధాతువునుండి కలిగిన రూపము. పెఱుకు = పెఱ్కు = పెక్కు అను క్రమమున నేర్పడియుండును. పెఱుగు (పెర్గ) పెద్ద, పెంచు, పెరుచు, పేరురము మొదలయిన శబ్దము లన్నిటియందును 'పెర్' అను మూలద్రావిడరూపము స్పష్టముగా గనుపట్టుచున్నది. పెక్కిటను, పెక్కింటను, అనురీతియు నౌపవిభక్తికాంతముగా నున్నది. పెక్కండ్రు, పెక్కురు, అనురీతిని మహద్రూపము లుదాహరింపఁబడినవి. పెక్కు, పెక్కులు, అను నమహద్రూప ములు నుదాహరింపఁబడినవి.

[44a] ప్రౌ. వ్యా. శ. ప. 51-52.

పలు : ఇదియును ద్రావిడపదమే. అరవమున పల అను రూపము బహు వచనాంతముగా గలదు. పల్ దీని మూలరూపము. పలుగురు, పలుగుంద్రు, పలుమాటలు, మొదలగు రూపములు గలవు. "అమహత్త్వంబున దీనికి వ్యస్త ప్రయోగంబు లేదు, అరవమునం గలదు." పిణిపల = (రోగములు పలు). కన్నడ మున పల అను విశేషణరూపము అకారాన్తముగానే గనుపట్టుచున్నది. పల మాతు (పలుమాటలు). వ్యస్తమైన అమహద్రూపము పలవు. పలదెవస=పలవు దెవస (పలుదివసములు). తెనుఁగున ఉకారాన్తమయిన విశేషణరూపము వాడుకలో గలదు.

పయిరీతిని చిన్నయసూరిచే అనిర్దిష్టార్థకములు పేర్కొనఁబడి సంఖ్యా వాచకంబులుగూడ సర్వనామములుగా గ్రహింపఁబడినవి. అన్ని, ఇన్ని, ఎన్ని, కొన్ని, పెక్కు, పలు లుగూడ నొకవిధముగ సంఖ్యావాచకములే. పలు సర్వ నామమయినప్పుడు పెల్లు, ఎల్ల లుగూడ కావలసియుండును.[45]

సంఖ్యావాచకములని చిన్నయసూరి యుద్దేశించినవి ఒకటి, రెండు మొద లగు నిర్దిష్టార్థకములు. 'అన్ని' ప్రభృతులు అనిర్దిష్టార్థకములగుటచే వానిని వేరుగఁ జేర్కొనవలసివచ్చెను. పెల్లు, ఎల్ల లుగూడ పయి 'అన్ని' వంటివేగదా! వాని నేల పేర్కొనలేదనుటకు హేతు వూహింపవలయును. పెల్లు - దీనికి బహు వచనరూపము లేదు. దీనిని విశేషణముగ విశేష్యమునకుఁబూర్వము ప్రయో గింపరు. పెల్లుగురిసె, పెల్లువుట్టుదురు, పెల్లేసినన్, స్త్రీలుపెల్లు, మొదలయిన రూపములనుబట్టి యిది యవ్యయమని చిన్నయసూరియూహగా గనుపట్టెడిని. ఎల్ల శబ్దము నల్లే ద్రుతాంతంబయిన యవ్యయంబని తెల్పెను.

చిన్నయసూరిమతమున సర్వనామములకు లక్షణములు రెండు.

(1) "సర్వనామ బహువచనంబు మహత్తునకుంబోలె మహతికగు" ఈ లక్ష ణము పెల్లునకుఁ బట్టదు.

(2) "సర్వనామ విశేష్యంబులయం దెయ్యది ముందు ప్రయోగింపఁబడు దాని ద్వితీయాదులకు బ్రథమ బహుళంబుగా నగును." ఈ లక్షణము పెల్లునకు వర్తింపదు. ఎల్ల శబ్దమునకును ఆతని మతమున బట్టదు. ఎల్లజనులనుండి, జను లెల్లరనుండి, అనురీతిని ప్రయోగము లుండును. ఎల్లరు జనులనుండి అనురీతి ప్రయోగము మృగ్యము అని సూరియభిప్రాయము కానోపును. అసమాసంబున ఎల్ల శబ్దమునకు విశేష్యమునకుముందు ప్రయోగము ఉండదను సూరివాక్యము నను సంధించునది. కావున నియ్యదియు సూరిమతంబున సర్వనామము గాదు.

చారిత్రకముగాఁ జూచినను ఎల్ల శబ్దము అ, ఈ, ఏ లలోని ఏ వలనఁ గలిగినఁదని ముందు నిరూపించితిని. కావున దానిని వేఱుగ గ్రహింపనవసరములేదు.

[45] ఆ. భా. చ. పుట. 55.

## 9. సార్వనామిక మూలరూపముల విశేషప్రయోగము

పయిని నిరూపింపఁబడిన సర్వనామములలో ఆత్మార్థకమయిన తన్, తమ్ అను రూపములు కొన్నిశబ్దములకుముందు చేర్చి సమాసములను (విశేషార్థములలో) గౌరవార్థకములుగాను, మర్యాదను నిరూపించునవిగాను, అరవమునను, మలయాళమునను వాడుదురని కాల్డ్వెల్లుగారు కనిపెట్టియున్నారు.[46] అప్పన్=తండ్రి, తమ్+అప్పన్ (తండ్రి). అయ్యన్ = తండ్రి, పెద్దవాడు=తమ్ + అయ్యన్ (తమయ్యన్). ఇట్లే అర్థభేదము లేకయే తన్, తమ్, శబ్దములు ఇతరశబ్దములకుఁ జేర్చి సమాసములను గల్పించి వాడుదురని చెప్పుచుఁ బ్రాసంగికముగా ఇతరములయిన సార్వనామికమూలరూపములను నట్లే వాడుదురనియు కాల్డ్వెల్లుగారు సూచించియున్నారు. కాని నిపుణతరముగాఁ బరిశీలించినచో నీ యభ్యాసము ఒక్క తన్, తమ్, శబ్దములనుమాత్రమేగాక, ఇతర సర్వనామమూలరూపములను వాడుటను, తమిళములోమాత్రమేగాక ఇతర ద్రావిడభాషలయందును గలదని స్పష్టపడును. తెనుఁగునందలి అన్న, నాన్న, తాత మొదలయిన శబ్దములన్నియుఁ బయిప్రణాళికలోఁ జేరి సార్వనామికమూలరూపములను గూడి స్వార్థమునను, అర్థాంతరమునను వాడఁబడుచున్నవనియు, ఇతరప్రమాణములచేత నిశ్చయముగా ద్రావిడజాతులలో నుండినవని నిర్ణయింపఁదగిన కుటుంబపద్ధతులు, జీవనవిధానము, వివాహపద్ధతి మొదలగువానివలన నర్థపరిణామము గూడ నందినవనియు గనిపెట్టి యొకవ్యాసమును అఖిలభారతప్రాచ్యమహాసభలో 1937-వ సంవత్సరమునఁ జదివియున్నాను.[47] తన్, ఎన్, నున్, నన్, నా, తమ్, ఎమ్, నుమ్, నమ్, మా, ఆ, ఉన్, ఉమ్ — అనునవి సార్వనామికమూలరూపములు. వీని ప్రయోగము నీ క్రింది యుదాహరణములనుబట్టి యూహించునది.

అరవము: పిరాన్=ప్రభువు. (ఎమ్+పిరాన్) ఎంబిరాన్.
(తమ్+పిరాన్) తంబిరాన్, (ఉమ్+పిరాన్) ఉమ్బిరాన్.
అప్పన్ = తండ్రి (తమ్ + అప్పన్) తమప్పన్.
తై =(తండ్రి), తాయ్=(తల్లి). తాయ్, తై లు అభిన్నములని తోచుచున్నది.
(తమ్ + తై) తందై = తండ్రి, (ఎన్ + తై) ఎందై, (నుమ్ + తై) నుందై.
(మున్ + తై) ముందై (మొదటితండ్రి=పితృరూపుడు). (ఆ+తై)అత్తై=అత్త.
(తన్ + తై) తన్నై = అక్క.
(ఆ + మై) అమ్మై = అమ్మ.
అయ్యర్ = ఆర్యుడు. (తమ్+అయ్యన్) తమయ్యన్.
(ఆ + కై) అక్కై = అక్క. (తమ్ + అక్కై) తమక్కై.
(తమ్ + పి) తంబి = తమ్ముడు. (ఎమ్ + పి)=ఎంబి, (నమ్ + పి) నంబి.

[46] C. G. D. 397-400.

[47] ఆ. భా. ప్రా. మహాసభావ్యాససంపుటము, 1937 సం. పుట 1288.

(ఉన్ + పి) ఉంబి, (నున్ + పి) నుంబి.
కై = చెల్లెలు, (ఎమ్ + కై) ఎంగై, (తన్ + కై) తంగై,
(నన్ + కై) నంగై = స్త్రీ, (మన్ + కై) మంగై = తరుణి.

పయియుదాహరణములు తమిళ, మలయాళ సామాన్యములు. అరవము నందలి పయిశబ్దములే తెనుఁగు, కన్నడములయందును కొంచెము మారుపడి క్రింది రూపములతో నున్నవి. (కన్న) తంగై = చెల్లెలు, తందె = తండ్రి, తమ్మ = తమ్ముఁడు, అమ్మ, అప్ప, అక్క, అను శబ్దములు తెనుగు కన్నడములకు రెండిటికిని సమానములు సార్వనామికమూలరూపములు చేర్చుటవలనఁ గలిగిన పయియుదాహరణములలో గొన్నిశబ్దములలో అర్థభేదములేకయు, గొన్నిట కేవల గౌరవసూచకముగను, గొన్నిట స్వల్పమయిన యర్థభేదముతోఁడను ఒకేపదము ఉపయోగింపఁబడుచుండెనని స్పష్టముగాఁ దెలియగలదు. ఆ శబ్దములే కాలక్రమమునను, దేశభేదమునను మారురూపములనంది తెనుఁగు కన్నడములలో వాడఁబడుచున్నవనియు స్పష్టమగును. తెనుఁగుశబ్దములలోను పయిలక్షణము స్పష్టముగా గలదు. అన్న = జ్యేష్ఠసోదరుడు, నా + అన్న = నాన్న (తండ్రి). అమ్మ = తల్లి. (మా + అమ్మ) = మామ్మ = నాయనమ్మ.

శబ్దములకు ముందు సార్వనామికరూపములు చేర్చినప్పుడు మొదట (నా సోదరుడు) ఎంబి యనునట్టి యర్థముతోనే యుండి, కాలక్రమమున మఱల ప్రాచీనార్థమునను, సమీపార్థమునను, వాడఁబడుచుండియుండనగును. ఇట్లు కొన్ని యెడల తబ్బిబ్బుపడుటకు ప్రాచీనకాలమున ఆ యా జాతులలో నుండినవని నిరూపింపఁదగిన యభ్యాసములు, నిత్యజీవనవిధానముగూడ గొంతవఱకు హేతువులయి యుండవచ్చును. పయివిచారణవలనఁ దేలిన సారాంశము :

అన్ని ద్రావిడభాషలయందును సార్వనామికమూలరూపములు పదములకుఁ జేర్చుటవలన నేర్పడిన సమాసములు స్వార్థమునను, అర్థభేదమునను వాడఁబడుచున్నవి.

పయియభ్యాసము ద్రావిడభాషలు సమానజాతీయములనియు, సంస్కృత ప్రాకృతాజన్యములనియు నిరూపించుటలో బలమయిన ప్రమాణము. అమ్మ, నాన్న, మొదలగు నిత్యవ్యవహారోపయోగిపదములు ఎట్టి స్వాభావికమయిన స్వతంత్ర పరిణామమునంది ప్రాచీనతను నిరూపించుచున్నవో స్పష్టముగదా!

భాషయొక్క ప్రాచీనమూలధనములో సర్వనామము లొకజాతి. అట్టి వానిలో భాషల సాజాత్యముగాని, జన్య జనక భావముగాని కలుగునని నిరూపింపనగును. తెనుఁగుసర్వనామముల చరిత్రమును ఇతర ద్రావిడభాషల సర్వనామముల చరిత్రతో గలిపి పరిశీలింపగా ద్రావిడభాషలన్నియు నొక్కకుటుంబముగా మిక్కిలి సంబంధించినవిగా నున్నవనియు, సంస్కృత ప్రాకృతములతో జన్య జనక భావము లేనివనియు నిశ్చితమయిన సిద్ధాంత మేర్పడుచున్నది.

# క్రియలు

## 1. శబ్ద నిర్వచనము

ఇతరములయిన శాస్త్రపదములవలెనే క్రియ యను పదమును, భావమును, తెనుఁగువ్యాకరణమునకు సంస్కృతమునుండియే వచ్చినవి. ఆంధ్రశబ్దచింతామణి యందు (తెనుఁగునకు వచ్చిన సంస్కృతక్రియలు) మూఁడువిధము లని సూత్రింపఁ బడినది.[1] సంజ్ఞాప్రకరణమున ధాతువు అయినది యీ వ్యాకరణమున క్రియఁ యనఁబడును అని సంజ్ఞ యేర్పఱుపఁబడినది.[2] ఇట్లు సూత్రించినను ధాతువులయొక్క తిజంతరూపములయిన 'పోయెను' మొదలయినవికూడ క్రియలనియే వ్యవహరింపఁ బడుచు వచ్చినవి.[3] ఇట్టి పద్ధతినే కేతన తనగ్రంథమున నంగీకరించి వ్యవహరించెను.[4] అర్వాచీనులును క్రియ యను పదమును తిజన్తబోధకముగా వాడిరి.[5] కావున క్రియాశబ్దము ధాతువునకు, తిజన్తరూపమయిన 'వచ్చెను' మొదలయిన శబ్దముల కునుగూడఁ దెనుఁగువ్యాకరణమున బోధకమయినది. ఆంధ్రశబ్దచింతామణి మొదలగు వ్యాకరణములయందు క్రియాపరిచ్ఛేదము అను పేరే తిజన్తరూపములను సాధించు ప్రకరణమునకుఁ బేరైనది.

క్రియ యను పదము నర్థమును వాక్యపదీయమున, దత్కర్త వివరించెను.[6] "అప్రధానములయిన యవయవములచే నుపలక్షితమయిన సమూహము, క్రమ జాతములయినవానినిగూర్చిన బుద్ధిస్థమయిన యభేదము గలదియే క్రియ యనఁ బడును." కావున క్రమముగా గల్గిన మార్పు లేక పరిణతిని గూర్చిన యభేదభావము గలదియే క్రియ యనుట సిద్ధము. 'నడచుచున్నాఁడు' అనఁగా భావమేమి? ఒక

---

[1] ఉపకృతి పరిణతి సంవృతి భేదాత్ త్రివిధా క్రియాజ్ఞేయా- క్రి. పరి. సూ. 1.

[2] ప్రత్యయ ఇహావర్ణకః క్రియాధాతుః - సం. సూ. 6.

[3] అద్యః క్రియాసు భూతార్థద్యోతినమాద్యగం వినాసర్వః. - సం. సూ. 17

[4] అనంతరంబ క్రియాపదంబు లెఱింగించెద. క. ఇల నొరుఁడు నీవు నేనును। నలిఁ జేసిన పనులు క్రియలు నానావచనం। బులు కాలత్రితయంబున। నలవడి యా క్రియలు చెల్లు నఖినవదండీ. ఆ. భా. భూ. 137-138 పద్య.

[5] మధ్యమపురుష క్రియలయం దిత్తునకు సంధియగును-బా. వ్యా. సంధి. 7
తద్ధర్మభూతక్రియ లార్యాద్యర్థపరకంబులయి ప్రశ్నార్థకంబులగు. ప్రౌ. వ్యా. క్రి. 7.
వ్యతిరేకక్రియ యర్థత్రయబోధకం బగు. ప్రౌ. వ్యా. క్రి. 7.

[6] యావత్ సిద్ధమసిద్ధం వా సాధ్యత్వేనాభిధీయతే। ఆశ్రితక్రమరూపత్వాత్ సా క్రియే త్యభిధీయతే॥ గుణభూతైరవయవైః సమూహః క్రమజన్మనామ్। బుద్ధ్యా ప్రకల్పితా భేదః క్రియేతి వ్యపదిశ్యతే॥

కాలు తీసి ముందునకు వేసి మఱల రెండవకాలును వేసి యిట్లే కొంతదూరము పోవుచుండుట. ఇందు ఒకొక్క క్షణమున నొకొక్క యవస్థను తన కంగభూతము లయిన యవయవముల కదలికచే వ్యక్తి పొందుచున్నాఁడు. ఇట్లు ధారావాహిక మయిన యవస్థాభేదముయొక్క దర్శనానుభవమునే 'నడచుచున్నాఁడు' అని యందుము. ఇది నేఁటి సినీమాయంత్రములలోని ఫిల్ముర్రూపములను జూచినచోఁ దెలియనగును. ఇట్లు నియతమయిన యర్థముగల 'క్రియ' యను శబ్దము లాక్షణిక ముగా తద్వాచకశబ్దరూపముల కెల్లను బోధకమయి క్రమక్రమముగా వాడఁ బడుచు వచ్చినది. ధాతువు, క్రియ, కృతి, వ్యాపారము, ఆఖ్యాతము అను పద ములు సంస్కృతమున భిన్నములయిన నియతార్థములకు వాచకములుగా వాడఁ బడినవి. నిరుక్తమునందు 'నామాఖ్యాతోపసర్గ నిపాతము' లని నాల్గువిధములుగా శబ్దములు విభజింపఁబడినవి. ఆఖ్యాత మనఁగా క్రియావాచకము. 'భావప్రధాన మాఖ్యాతమ్.' భావ మనఁగా 'నామపదవాచ్యార్థాశ్రయక్రియావ్యంగ్యో భావః, పాకరాగత్యాగాఖ్యః' అని వివరణము. ధాతువులనఁగా పాణినీయవ్యాకరణమున 'భూ' మొదలయినవిగాఁ బేర్కొనఁబడిన క్రియార్థక శబ్దములని యర్థము.[7] ఇవి సాధారణముగా ఏకాచ్క ద్వ్యచ్కములయి యున్నవి. ప్రాచీన సంస్కృతవ్యాకరణ ములలో సాధారణముగా ఆఖ్యాతము[8] అను పదము శబ్దపరముగా వాడఁబడు చుండగా, తెనుఁగువ్యాకరణములందు క్రియాశబ్దమే పై వాని కన్నిటికిని బోధక ముగా వాడఁబడె ననుటవలన పదములవాడుక యెట్లు మాఱుననుటయు నెఱుంగనగును.

కన్నడవ్యాకరణములును సంస్కృతవ్యాకరణానుకరణము లగుట నందును సంస్కృతసంజ్ఞలే వాడఁబడినవి. తెనుఁగున క్రియాపరిచ్ఛేద మనునది కన్నడ వ్యాకరణమున ఆఖ్యాతవిధానమనియు, ఆఖ్యాతప్రకరణమనియుఁ బేర్కొనఁ బడినది.[9] ఇట్లు వాడుట సంస్కృతవ్యాకరణమును తెనుఁగుకంటె నెక్కువ యనుసరించుటయే యనుట స్పష్టము. బాలవ్యాకరణాదికములయందు పాణినీయము నందువలె ధాతులక్షణముగాని, ధాతుపరిగణనముగాని చేయలేదు. ఈ రెండును శబ్దమణిదర్పణమున చేయఁబడినవి.

అరవమున క్రియ యనికాని, యాఖ్యాతమని కాని సంస్కృతపదమును గ్రహిం పక 'వినై' యను తమిళపదమునే గ్రహించిరి. ఇందు ఈ పదమువలన 'క్రియ'

---

[7] భూవాదయో ధాతవః॥ క్రియావాచినో భ్వాదయః ధాతుసంజ్ఞాః స్యుః॥ సి. కౌముది.

[8] ధాత్వర్థేన విశిష్టస్య విధేయత్వేన బోధనే। సమర్థ స్వార్థయత్నస్య శబ్దో వాఖ్యాత ముచ్యతే॥

[9] ఆఖ్యాతవిధానమ్॥ క. భా. భూ. ఆఖ్యాత ప్రకరణము, శబ్దమణిదర్పణము.
క్రియె యర్థదమూలం ప్రత్యయరహితం ధాతు. - శ. మ. ద. సూ. 215.
క్రియార్థో ధాతుః॥ క. భా. భూ.

యను సామాన్యవ్యాపారార్థమునే గ్రహించిరి. కాని దానికి లక్షణము నిర్దేశింప లేదు.[10] 'ఉరిచ్చొల్' అను పదము ధాతువు అను నర్థమున తొల్కాప్పియనారు వాడిన ట్లూహింపఁబడినది. అరవమున తొల్కాప్పియనారు కాలాదికమునకును, క్రియారూపములకును అరవపదములనే సంజ్ఞలుగా వాడెనుగాని సంస్కృతపదము లను వాడలేదు. ఈ విషయమును ముందు సంజ్ఞలపట్టికగా నొసంగుదును.

## 2. ధాతువుల స్వభావము

సిద్ధములై వ్యవహారంబున వినంబడుచున్న రూపములకే వ్యాకర్తలు లక్షణ మును వ్రాయుదురు. అనఁగా చేయుచున్నాఁడు, చేసెను, చేయుట, చేయుము, చేయమి మొదలయిన రూపముల నన్నిటిని గ్రహించి యందలి ప్రత్యయములను బరిహరించి సమానాంశమయిన 'చేయు' అనుదానిని అహరించి దానినే ధాతువుగాఁ బేర్కొందురు. ధాతువు అనఁగా మూలము లేక ప్రాథమికమైనదని యర్థము. అనఁగా ప్రత్యయసహితములయిన రూపములన్నియు దీనినుండి కలుగుననుట. ఇట్టి ధాతువులనుండియే భాషయంతయుఁ గలిగినదని శబ్దచరిత్రవలన శాస్త్రజ్ఞు లూహించిరి. కావున ధాతుజన్యమయినది భాష యనుట సిద్ధాంతము. ఇట్టి యేకాచ్క ద్వ్యచ్కములయిన మూలరూపములనే మొట్టమొదట వ్యవహరించుచుండెడివా రనియు, నట్టిరూపములకే యర్థవంతములును, సందేహనిర్ణాయకములును, భావస్ఫోరకములు నయిన పదాంతరములను జేర్చుటచే నవి కలిసి గొలుసులవలె రూపము లేర్పడి, మాఱుపడి గుర్తింపరానట్లు కలిసిపోయి తిరిగి విభజింపఁబడి భాష నూతనావస్థలను బొందుచుండుననియు, నట్లు పొందిన యవస్థలనుబట్టి భాష లను మూఁడువిధములుగా విభజింపవచ్చుననియు ముందు తెలిపితిని.

ధాతువనుపదము క్రియావాచి యనుటచేతను, భాషయంతయు ధాతు జన్యమే యనుటవలనను, భాష క్రియాపదజన్య మను సిద్ధాంత మేర్పడుచున్నది. ఈ మతమున నామములన్నియుఁ గ్రియాజన్యములే యని యంగీకరింపకతప్పదు. భాషకు బ్రథమాధారమయిన శబ్దరాశిలో నుండినవన్నియు క్రియావాచకములేనా లేక నామాదికములుగూడ నుండునా ? యను ప్రశ్నయు బయలుదేరవచ్చును. కావున రెండుమతములు బయలుదేరినవి. చేయుచున్నాఁడు, చేయుట, చేయమి, చేయి, మొదలయినవన్నియు క్రియార్థకమైన 'చేయు' ధాతువునుండి కలిగినవనుట రెండు పక్షములవారికిని అంగీకృతమే. కాని నక్క, ఇల్లు, ప్రొద్దు, చెప్పు, వక్క మొదలయిన శబ్దము లన్నియును క్రియాజన్యములని నిరూపింపనగునా ? లేక కేవల నామమాత్రమే (కియాజన్యముగాక) మూలరూపముగా నుండఁగూడదా ? ఇట్లుండవచ్చుననుట రెండవమతము.

[10] P. S. S. page 141. do page 198.

పయి విషయమయి ప్రాచీన సంస్కృతవైయాకరణులయందు విచారణ జరిగినది. నామములన్నియు క్రియాజన్యములే యని శాకటాయనుఁడును, నైరుక్తులును అభిప్రాయపడిరి.[11] అన్నియుఁ గావని గార్గ్యుఁడు, పతంజలి మొదలయినవారు.[12] సంస్కృతమునందలి 'ఉణ్' మొదలయినవి ప్రత్యయములచే నిష్పన్నములుగా నిరూపింపఁబడిన పదము లిం దుద్దేశింపఁబడినవి. అవి యన్నియును ధాతువులనుండియే కల్పింపనగునని నిరుక్తమతము. కాదని పాతంజలాది మతము. అరవవ్యాకర్తయగు తొల్‌కాప్పియనారు నిరుక్తము ననేకవిధములలో ననుసరించినవాఁ డయ్యును, ఈ విషయమున నా మత మనుసరింపలేదు.[13] నామములన్నిటిని అతఁడు ధాతువులనుండి కల్పింపఁ బ్రయత్నింపలేదు. తెలుఁగువైయాకరణులును బయిపద్ధతినే యంగీకరించిరి. ధాతుజములుగాని పదము లనేకములు గలవని వారి యభిప్రాయము.[14]

## 3. తెనుఁగుధాతువుల చరిత్రము

పయివిచారణవలన దేలిన సారాంశములు: 1. శబ్దజాలములో ననేకములను క్రియార్థకములయిన ధాతువులనుండి కల్పింపవచ్చును. 2. కొన్నిటిని అట్లు కల్పించుటకు వీలులేదు. అయినను చాలవఱకు శబ్దములకు ధాతురూపములను కనిపెట్టవచ్చునుగాని యవి క్రియార్థములే యని చెప్ప వీలులేదు. భాషయందలి ప్రాచీన మూలరూపములను ధాతువులని వ్యవహరింపవచ్చును. అవి కేవలము క్రియార్థములుగా నుండ నక్కఱలేదు. అవి నామములు, విశేషణములుగూడ గావచ్చును. వెలుగు, వెల్ల, వెలయు మొదలయిన రూపములలో 'వెల్' అనునది సమానాంశముగాఁ గనుపట్టుచున్నది. ఇట్లే అరవమున విళ్ (వెలయు), విళంగు (ప్రకాశించు) అను రూపములు గలవు. కన్నడమున బెళ్ (తెల్లని), బెళకు (దీపము), బెళ్ళు (తెలుపు). అరవ, కన్నడములయందును (బెళ్=వెల్) అనునవియే సమానాంశముగఁ గనుపట్టుచున్నవి. ఇట్లే తెనుఁగున తెలియు, తెలివి అను రూపములలో

---

[11] 'నిరుక్తఉపోద్ఘాతము' అ. 1 ఖండ. 'తత్ర నామా న్యాఖ్యాతజానీతి శాకటాయనో నైరుక్తసమయశ్చ' [12] 'న సర్వాణీతి గార్గ్యోవైయాకరణానాం చైకే' 2-3

'ఉణాదయో బహులమ్' అను సూత్రముయొక్క పాతంజలభాష్యము, "నామ చ ధాతుజ మాహ నిరుక్తే వ్యాకరణే శకటస్య చ తోకమ్, ఉణాదయో అవ్యుత్పన్నాని ప్రాతిపదికాని"

[13] P. S. S. 200-201.

[14] అజన్యజన్యభేదేన శబ్దా స్స్యుర్ద్వివిధాః తామతాః। జన్యాంతర్గత వర్ణానాం భూయసీ స్యాద్విచిత్రతా॥ అజన్యా అధాతుప్రకృతికాః॥ గోడ, మేడ, మోరు, బారు, మోవి, బావి, దీవి, ఇత్యాద్యాః. జన్యధాతుప్రకృతికాః॥ ఓకిరింత, వెక్కిరింత......ఇత్యాదయో బహవః శబ్దాః ప్రయోగతోఽవగంతవ్యాః॥ అహోబల. పుట. 346.

'తెల్' అనునది సమానాంశము. అరవమున తెళి = తెలియు; తెళివు = తెలివి, కన్నడమున తిళి = తెలియు. ఇట్లీ భాష లన్నిటియందును సమానాంశముగా (తిల్ = తెల్) అనుదాని నుద్ధరింపవచ్చునుగదా. ఇదియే యెల్లద్రావిడభాషలకును మూలమయిన ప్రాచీనద్రావిడభాష యనంబడెడిదానియందు ధాతువయి యుండవచ్చును.

పయివిధమున ద్రావిడభాషాధాతుగతరూపములను బరిశీలించినచో విన్ = విను; కన్ = కను; చెల్ = చెల్లు; మిన్ = మినుకులాడు, ప్రకాశించు; విళ్ = వెలయు; విఱ = భయము; వీ = వీగు; విడు = విడు; నడ్ = నడచు; పడ్ = పడు; తిరి = తిరుగు; తిఱ = తెఱచు; చుడు = కాలు; మొదలయిన ధాతురూపములవంటి వెన్నియేని కనుపట్టును. ఇట్టివన్నియును ప్రాచీన ద్రావిడభాషయందలి మూల ధాతురూపములు. ఇవి చాలవఱకు క్రియార్థములు గావచ్చును. కాని యన్నియును క్రియార్థములుగా నుండనక్కఱలేదు. ఇట్టి ప్రాచీన మూలధాతురూపముల నుండియే ద్రావిడభాషలలోని రూపములన్నియు నేర్పడినవనుట నిర్వివాదము.

1. ఇట్టి ధాతువులు క్రియలుగాను, విశేషణములుగాను, విశేష్యములుగాను[15] మార్పులేకయే ఏకభాషయందుగాని, భిన్నభాషలయందుగాని ఉపయోగపడుచుండును. కను = చూచు (క్రియ); కను = నేత్రము (నామము); కనుజీకటి, కనుకాపు, కనువాఁడు మొదలగువానిలో విశేషణము. ఈ కన్ అను రూపము ఇతర ద్రావిడభాషలయందు నిట్లే వాడఁబడుచున్నది. పండు = ఫలించు (క్రియ); పండు = ఫలము (నామము); పండుచెట్టు (విశేషణము). ఎండు (క్రియ); (విశేషణము) ఎండిన; ఎండు = ఎండ, ఎండు (వు) లు విశేష్యములు. తీరు = తగు, యుక్తమగు (క్రియ); తీరు = చక్కని (విశేషణము); తీరు = చక్కదనము (విశేష్యము). మ్రొక్కు = నమస్కరించు (క్రియ); మ్రొక్కు = నమస్కారము (విశేష్యము); మ్రొక్కువాఁడు (విశేషణము). తూఁగు, పొంగు, మఱుగు, హెచ్చు, మెచ్చు, దాఁటు, నాటు, పుట్టు, కట్టు, తిట్టు, గుద్దు, పోరు, మొదలయిన ధాతువులెన్నియేని క్రియలుగాగాని, విశేష్య విశేషణములుగాగాని, తెనుఁగుననే వాడవచ్చును. ఈ పద్ధతియే యితర ద్రావిడభాషలయందును గలదు. కొన్నియెడల ఒక ధాతువునకు పయిమూఁడువిధముల ప్రయోగములలో నేవిధమయిన ప్రయోగము గాని ఒకభాషలో లేనిచో నయ్యది తక్కినభాషలలో సాధారణముగా గనుపట్టుచుండును.

| అరవము | కన్నడము | తెలుఁగు |
|---|---|---|
| అగళ్ = త్రవ్వు | అగళ్ = త్రవ్వు | అగడ్త |
| అగై = చిగుర్చు | అగె = చిగుర్చు | ఆకు |
| అప్పు = కూర్చు | అప్పు = కూర్చు | అప్పగించు |

[15] C. G. D. Pages. 444 - 455; 190-217.

పయిరీతిని నిరూపింపఁబడిన ద్రావిడ ధాతువుల లక్షణమునుబట్టి యూహింప వలసిన దేమనఁగా నా భాషలలోని మూలధాతురూపములు క్రియా, విశేషణ, విశేష్యములుగా వాడఁబడునప్పుడు పరస్పరవిభేదకమగునంతటి రూపపరిణామము నింకను పొందలేదని యర్థము. భాష పెరుగుచుండునపుడు కాలక్రమమునఁ బ్రత్యయవిశేషము లేర్పడి యర్థవిశేషములయందు రూఢము లగుచుండును. వాని వలననే కృత్తద్ధితాదిక రూపభేదములును గలుగుచుండును.

2. ప్రాచీనమూలద్రావిడధాతువు లనందగిన రూపములకు గు, ంగు, కు, క్కు, చు, ంచు, సు, దు, ద్దు, బు, ంబు, అను ప్రత్యయవిశేషములు చేరి మఱల క్రొత్తధాతువు లేర్పడుచుండును. ఈ పద్ధతి యన్ని ద్రావిడభాషలయందును గలదు.

| ప్రాచీనద్రావిడ మూలధాతురూపము | తెలుఁగు | అరవము | కన్నడము |
|---|---|---|---|
| పెర్ | పెరుగు | పెరు | పెర్చు |
| అడ్ | అడంగు, అడంచు | అడంగు, అడు | అడకు, అంటు |
| అణ్ | అనగు | అణుగు | అణె |
| అత్ | అత్తు | అత్తు | (హత్తు + ఇసు) |
| అమ్ | అమరు | అమై | అమర్ |
| అర | అఱుగు | అరక్కు | అరె |
| అల | అలయు | అల | అల, అలె |
| అళ్ | అడలు, పడుచు | అழு | అఴు |
| అఱ | అఱచు | అఱై | అఱచు, అఱుచు |
| ఆర్ | ఆర్చు | ఆర్ | ఆర్ |
| ఇళ్ | ఈడ్చు, ఈడు | ఇழு | ఈళ్ |
| ఈ | ఇచ్చు | ఈ | ఈ |
| నీర్ (ఈర్) | ఈఁదు | నీందు | ఈసు, ఈజు |
| ఉర్ | ఉబ్బు | ఉప్పు | ఉబ్బు |
| | ఒలుచు | ఉరి | ఉరిచు |
| ఉల్ | ఉలియు | ఉలై | ఉలి |
| ఉళ్ | ఊలు | ఉழల్ | ఉటిల్ |

3. తెనుఁగునందలి నేఁటి క్రియార్థకధాతువులతోఁ గలిపి పరిశీలించిన-నరవ కన్నడములయందు సమానార్థకము లయినవియు, నభిన్నరూపములఁ నున్నవియును అనేకధాతువులు కనుపట్టును. ప్రక్కపుటలోని యుదాహరణములను బరిశీలించునది.

| తెనుఁగు | అరవము | కన్నడము |
|---|---|---|
| అగలు | అగల్ | అగల్ |
| అదరు | అదర్ | అదిర్ |
| అడంగు | అడంకు | అడకు |
| అడరు | అడర్ | అడర్ |
| అడలు | అడలై | అడలు |
| అంటు | అంటు | అంటు |
| అరుగు | అరుగు | అరుగు |
| అల్లు | అల్లు | అల్లు |
| అలుకు | అళుక్కు | అళుకు |
| అఱు | అఱు | అఱు |
| ఆడు | ఆడు | ఆడు |
| ఆరు | ఆర్ | ఆర్ |
| ఇడు | ఇడు | ఇడు |
| ఈను | ఈన్ | ఈన్ |
| ఊఱు | ఊఱు | ఊఱు |
| ఎక్కు | ఎక్కు | ఎక్కు |
| ఎదురు | ఎదిర్ | ఎదిర్ |
| ఒట్టు | ఒట్టు | ఒట్టు |
| కదలు | కదలు | కదలు |
| కప్పు | కప్పు | కప్పు |
| కమ్ము | కమ్ము | కప్పు |
| కట్టు | కట్టు | కట్టు |
| తిట్టు | తిట్టు | తిట్టు |
| కిట్టు | కిట్టు | కిట్టు |
| మెచ్చు | మెచ్చు | మెచ్చు |
| కూడు | కూడు | కూడు |
| ఒప్పు | ఒప్పు | ఒప్పు |
| తప్పు | తప్పు | తప్పు |
| ఆఱు | ఆఱు | ఆఱు |
| నచ్చు | నచ్చు | నచ్చు |
| మీఱు | మీఱు | మీఱు |
| అంజు | అంజు | అంజు |
| తగు | తగు | తగు |

| తెనుఁగు | అరవము | కన్నడము |
|---|---|---|
| తట్టు | తట్టు | తట్టు |
| తుమ్ము | తుమ్ము | తుమ్ము |
| నగు | నగు | నగు |
| పొంగు | పొంగు | పొంగు |
| పడు | పడు | పడు |

ఇట్టివనేకము లింకను గలవు.

4. ప్రాయికముగా అరవమునందలి ధాతురూపమునకు కు, చు, యు, ఇంచు మొదలయిన యాగమంబులను అంతమందు చేర్చుటవలన తెనుఁగునందును, కన్నడమునందును ధాతురూపము లేర్పడును. ప్రాచీనద్రావిడరూపముతో నరవమునందలి రూపము అభిన్నముగా నుండుటయే దీనికి హేతువని యూహించుట స్పష్టము.

| తెనుఁగు | కన్నడము | అరవము |
|---|---|---|
| అడుచు | అడచు | అడి |
| అనఁగు | అణె | అణుగు |
| అలయు | అల | అల |
| అవియు | అవి | అవి |
| ఎఱుగు | అఱి | అఱి |
| అఱచు | అఱచు | అఱై |
| ఇడియు | ఇడి | ఇడి |
| ఈడుచు | ఈళ్ | ఇழு |
| ఒరయు | ఒరె | ఉరై |
| ఉఱియు | ఒఱవు | ఉఱై |
| ఎరియు | ఉరి | ఎరి |
| ఎక్కిరించు | ఎక్కిరిసు | ఎట్కు |
| ఎక్కు (ఎర్కు=ఎఱుకు) | ఏఱు | ఏఱు |
| కదియు | కదె | కది |
| కరఁగు | కరగు | కరై |
| కలయు | కలె | కల |
| కలుపు (నామము) | కళె (కలుపుటీయు) | కళ్ (కలుపుటీయు) |
| కల్ల ( ,, ) | కళ్ | కళ్ |
| కట్టగు (కట్టు+అగు) | కఱంగు | కఱు |
| కాచు | కా | కా |

| తెనుఁగు | కన్నడము | అరవము |
|---|---|---|
| కాయు | కాయ్ | కా |
| కాగు | కాయ్ | కాయ్ |
| క్రక్కు | కాఱ్ | కాఱు |
| కెడయు | కెడె | కిడ |
| చిఱుగు | కీఱ్ | |
| కెలకు | కెళర్ | కిళఱు |
| గునియు | కుణి | కుని |
| కునుకు | కుని | కని |
| గుఱి (నామము) | కుఱి | కుఱి |
| కొఱ | కొఱె | కుఱై |
| కూర్చు | కూర్ | కూర్ |
| వీఁగు | బీ | వీ |
| వేగు | బే | వే |
| ఆర్చు | ఆర్ | ఆర్ |
| అఱచు | అఱచు | అఴు౧౧ |
| లేచు | ఏళ్ | ఎఴు |
| ఇచ్చు | ఈ | ఈ |
| ఈడుచు | ఎళి | ఇఴు |
| ఒలుచు | ఉరిచు | ఉరి |
| పొడుచు | పొడె | పుడై |
| ఎంచు | ఎణిసు | ఎణ్ |
| కడచు | కడె | కడ |
| కడచు | కడి | కఴి |
| కుడుచు | కుడి | కుడి |
| క్రొచ్చు | కుటి | కుఴి |
| గెలుచు | గెల్ | కెలి |
| చచ్చు | సా | చా |
| చొచ్చు | చూరి | సురి |
| తెచ్చు | తర్ | తరు |
| తాలుచు | తాళ్ | తాఴ్ |
| వగచు | బగె | వగై |
| తెఱచు | తెఱె | తిఱై |

| తెనుఁగు | కన్నడము | అరవము |
|---|---|---|
| నొచ్చు | నో | నో |
| పుచ్చు | పుగు | పుగు |
| మొలచు | మొళె | ముళై |
| విడుచు | బిడు | విడు |
| విలుచు | బిల్ | విల్ |
| వైచు | బయ్ | వై |
| నడచు | నడె | నడ |
| పగులు | పంచు | పగు |
| పిగులు | బిగి | పికి |
| కదలు | కదె | కది |
| అడలు | అటు | అழு |
| కనలు | కనల్ | కని |
| బిగియు | బిగి | పికి |
| కదియు | కదె | కది |
| ఒడయు | ఒడె | ఒడి |
| ఒలయు | ఒలె | ఉలై |
| వ్రాయు | బరె | వరె |

పయిరీతినున్న ధాతురూపములలోఁ గనుపట్టు సామాన్యలక్షణమును బరిశీలించినచో తెనుఁగురూపము అర్వాచీనమనియు, సాధారణముగా కన్నడమును అంతకంటె అరవమును ప్రాచీనము లనుటయును తేలుచున్నది. సానుబంధరూపముకంటె నిరనుబంధరూపమే ప్రాచీనమని నిర్ణయించుట సులభము. ఇట్టి సిద్ధాంతమునకు దెనుఁగుననే ప్రబలమయిన యాధారములు గలవు.

I. "ఇటం గృత్కృగతపవేములు పరంబులగునపుడు క గ చ య వ లకు లోపం బగు. కృత్సంబంధంబులగు కాదులు పరంబులగునపుడు ధాతువు నంతంబులగు క గ చ య వ లకు లోపం బగు."[16]

పయిసూత్రమునుబట్టి ధాతుగతమయిన క గ చ య వ లకు లోపంబు సామాన్యమనుట నిర్వివాదము. ఈ క్రింది మాదిరియుదాహరణములను దిలకించునది.

కలుగు+ఇమి=కలిమి
ఓరుచు+ఇమి=ఓరిమి
బ్రదుకు+ఇమి=బ్రదిమి
బడియు+ఇమి=బడిమి

చేయు+త=చేత
అలయు+త=అలఁత
ఏయు+టు=ఏటు
వ్రేయు+టు=వ్రేటు

[16] బాల వ్యాకరణము. కృ. ప. సూ. 2.

| | |
|---|---|
| పొలయు+పము=పొలపము | మాయు+పు=మాపు |
| అడుచు+పు=అడుపు | ఏఁచు+పు=ఏపు |
| మెచ్చు + పు = మెప్పు | వలచు + పు = వలపు |
| కాచు + పురము = కాపురము | దాఁచు + పురము=దాఁపురము |
| ఉలియు + వు = ఉలివు | కాచు + వలి = కావలి |

పయినిచ్చిన యుదాహరణములు మాదిరిగామాత్ర ముద్దేశింపఁబడినవి. తత్సదృశోదాహరణంబు లనేకంబులు బాలవ్యాకరణాదులనుండి గ్రహింపనగును. కృద్రూపము లేర్పడునపుడు ధాతువుల యంతమునందలి కు, చు, యు మొదలయినవి లోపించుననుటలో భావమేమి యని యూహింపవలెను. ధాతువుల తుదినున్న పయి వర్ణములు కాలక్రమమున వాడుకలో లోపించియయిన నుండవలయును. లేదా, ఇమి, పు, మొదలయినవి ప్రత్యయములయిన గావనవలయును. విధింపఁబడిన లోపము కేవలకృతకమనియైనం జెప్పవలయును. మొదటి రెండును నసంభవములు. కలుగు + ఇమి అనునవి చేరునప్పుడు కలుగిమి అని యేర్పడి, వాడుకలో గకారము లోపించి, కలుమి = కలిమి అను రూప మేర్పడినదనవలయును. ఇట్లు చెప్పుటకుఁ బ్రమాణము లేదు. కలుగిమి, ఓరిచిమి, బడియుమి మొదలయిన రూపముల వంటివి ప్రాచీనాంధ్రమునగాని, యితరద్రావిడభాషలయందుగాని కనుపట్ట వలెనుకదా! అట్టివి లేవు. కాఁబట్టి యా క్రమము చారిత్రకము కాదు. నిష్ప్ర మాణము. శబ్దశాస్త్రమునకును విరుద్ధము. అట్లు నడిమియక్షరము లోపించినయెడ గలుగవలసిన మార్పులును లేవు. కాఁబట్టి యిది యసంభవము. రెండవది: ఇమి మొదలయినవి ప్రత్యయములు గావనుట. అదియును సాధ్యముకాదు. ప్రత్య యాంతరములచే పయిరూపముల నన్నిటిని సిద్ధపఱుపవలెను. అట్టిది చేయుటకు వీలు లేదనుట స్పష్టము. కాఁబట్టి రెండవపక్షమును నిరాకృతము. ఇక సిద్ధాంతము పయిలోపము కృతక మనుటయే. అట్లయినచో నీ లోపమున కేమి యవసరము కలిగినదనుట ప్రశ్న. సమాధానము చారిత్రకము. కు, గు, చు, యు మొద లయినవి యంతమందు లేనివే ప్రాచీనధాతురూపము లనుట అరవ కన్నడ రూపములనుండి స్పష్టీకరింపఁబడినదిగదా! అట్టి ప్రాచీనధాతురూపములనుండియే ఇమి మొదలయిన ప్రత్యయములు చేరుటవలన కృద్రూపము లేర్పడినవి. తరువాత నా ప్రాచీన ధాతురూపములకే కు, చు, యు, గు వర్ణకంబులు చేరుటచే మఱల క్రొత్తధాతురూపము లేర్పడినవి. అవి కాలాంతరమున (అనగా రెండవతరమున తెలుఁగులో) నేఁటి తిజంతరూపములకు మూలమయిన క్రియార్థకప్రకృతు లయినవి (అనఁగా ధాతువులు). ఇట్లేర్పడిన రెండవతరపు ధాతువులను మూల ముగా గ్రహించి ప్రాచీన కృద్రూపములను నవీన తిజన్తరూపములను ఏకముఖ మునఁ గల్పించుటవలన సూరిగారి కీ 'క గ యు' వాదికలోపము కృతకముగా నంగీక రింపక తప్పినదికాదు. దీనివలన వ్యాకరణప్రయోజనములగు అనుగమము, లాఘవము

మొదలగునవి సంపాదింపఁబడి భాష లక్షణవంతమయినది. ఇది చారిత్రకపద్ధతికి విరుద్ధము కావచ్చును. అంతమాత్రమున వ్యాకరణమునకు హాని వాటిల్లదుగదా!

పయి కు, గు, చు, యు, వు, మొదలయిన వర్ణము లేల చేరినవి? వాని యర్థమేమి? అను ప్రశ్న యుదయింపక తప్పదు. ఇవియును మా మతమున 'త' మొదలయిన కృత్ప్రత్యయములవంటివే. అనఁగా వానికిని భావాద్యర్థము లుండినవి. కాని కాలక్రమమున నట్టి రూపములను తిరిగి తిజంతరూపములకు ప్రకృతులుగా నంగీకరించి క్రొత్తధాతువుల నేర్పఱచియుందురనుట సమంజసము. ఈ విషయము మఱల తిజంతరూపములను బరిశీలించునపుడు స్పష్టీకరింపఁబడును.

II. అనేకములయిన ధాతువులయొక్క వివిధరూపముల నేర్పఱుచునప్పుడు వానికి ఆదేశాగమాదివికారములు సూరిచే విధింపఁబడుచు వచ్చెను. ఈ యాదేశాగమాదులనుబట్టి నవీనధాతురూపములు ప్రాచీనధాతురూపములకంటె భిన్నములయినట్లును, గాలక్రమమున నేర్పడినట్లును తెలియఁగలదు [17]

| ధాతువు | ఆదేశము | ఆదేశాగమాదియుక్తరూపము |
|---|---|---|
| చొచ్చు | చొరు | చొరకుము, చొరుము, చొరదు |
| చూచు | చూ | చూడు, చుండు=చుఁడీ=సుడీ, చూడుడు, చూపు, చూవె, చూరె, చుమీ=సుమీ. |
| ఇచ్చు | ఈ | ఈడు, ఇమ్ము, ఈని |
| తెచ్చు | తేరు | తేరఁడు, తేరుము, తెమ్ము |
| చచ్చు | చావు (చా) | చాక, చాకుము, చా (వేఁడు) |
| నొచ్చు | నోవు (నో) | నోక, నోవక, నోకుము |
| నేరుచు | నేరు, నేచు | నేరఁడు, నేరక, నేచును |
| పోవు | పో | పోడు, పొమ్ము |
| అగు | ఆ | ఆయెను, ఆయెడును |
| పిలుచు | పిలు | పిలఁడు, పిలుము |
| లేచు | లే | లెమ్ము, లెండు |
| నిలుచు | నిలు | నిలుము, నిలక |
| తలఁగు | తల | తలఁడు |
| కొలుచు | కొలు | కొలుము |
| గెలుచు | గెలు | గెలుము |
| విడుచు | విడు | విడుము, విడక |
| వెఱచు | వెఱ | వెఱకు |
| తిగుచు | తిగు (తివు) | తివ, తివ్వ |

[17] బా. వ్యా. క్రి. ప. 91-118 సూ.

| ధాతువు | ఆదేశము | ఆదేశాగమాదియుక్తరూపము |
|---|---|---|
| కలుగు | కల | కలదు, కలరు |
| వలచు | ఒల్ల | ఒల్లదు, ఒల్లక (వ=ఒ) |
| అరుగు | అరు | అరుదెంచు |
| ఏగు | ఏ | ఏతెంచు |
| వలయు | వల | వలదు, వలెను. |

పయియుదాహరణములలో చువర్ణాంతధాతువులు బహుళముగా నున్నవి. గు, యు, వు, వర్ణాంతధాతువులును గలవు. పై ధాతువులకు వరుసగా ప్రాచీన రూపములు చొరు, చూ, ఈ, తేరు, చా, నో, నేర్, పో, పిలు, నిల్, తల్, కొల్, గెల్, విడు, వెఱ, తిగు, కల, ఒల్, అరు, ఏ, వల, అనురీతి నుండినట్లు ఇతర ద్రావిడ భాషలయందలి సమానార్థక ధాతురూపములనుబట్టి స్పష్టముకాకతప్పదు. పయివానితో నభిన్నములయిన రూపములే తమిళ కర్ణాటములయందు ధాతురూపములుగా నున్నవి. కాఁబట్టి గు, చు, యు, వు, మొదలయినవి ప్రాచీనధాతురూపముల పయి వచ్చిన యాగమములనియు, వానితోఁ గూడిన రూపములే తెనుఁగున రెండవ తరములయిన ధాతువులయినవనుటయు నిర్వివాదమయిన సిద్ధాంతము.

III. కొన్ని ప్రాచీనములయిన హలంతధాతువులును అజంతములుగా తెనుఁగున (రెండవతరపు ధాతువులు) ధాతువులయినవి. అన్, విన్, కన్ మొదలయిన నకారాంతధాతువులు అను, విను, కను మొదలయిన రూపములతో నున్నవి. అన్, విన్, కన్ అనునవి తెనుఁగుననే క్రియాజన్యవిశేషణములుగ నున్నవి. వానిని సాధించుపట్ల ఉకారలోపమును వైయాకరణులు విధించిరి. హలంతములే ప్రాచీనములనియు, ఉకార మాగమమనియు అట్టి ఉకారయుక్తరూపమే తెనుఁగున రెండవ తరపు ధాతురూపముగా నేర్పడెననియు, నూహించుటకు నితర ద్రావిడభాషాగత ధాతురూపము లాధారములు.

IV. ప్రాచీనములైన ధాతురూపములయందలి యనుస్వారము పోయి తెనుఁగున ధాతువు లేర్పడినవి. ఇట్లు ప్రాచీనమయిన యనుస్వారము కాలక్రమమున నశించి యర్ధానుస్వారము శేషించి యదియు నశించెనని యర్ధానుస్వార చరిత్రమున నిరూపించితిని. అనుస్వారసహితరూపములు ప్రాచీనములనియ నచ్చట నిరూపించితిని.

| తెనుఁగు | కన్నడము | అరవము |
|---|---|---|
| నూకు | నూంకు | |
| తఱుము | తఱుంబు | |
| తొడగు | తొడంగు | తుడంగు |
| సొక్కు | సుర్కు | సురుంగు |
| పర్వు | పర్బు | పరంబు |

ఇట్టి రూపము లనేకములున్నవి. గ్రంథవిస్తరభయమున నుదాహరింపలేదు. ఈయిరీతిని మాదిరిగా నిరూపించిన ధాతువుల పట్టికలనుబట్టి పయిభాషలయొక్క మాండలికత్వమును, సోదరభావమును స్పష్టమగుచున్నది.

అరవధాతువుల రూపములు క్రీస్తుపూర్వముండిన రూపములు. కన్నడధాతువులు మఱి యేడెనిమిది శతాబ్దములు పోయినతరువాత పరిణతములైన రూపములు. తెనుఁగునందలి ధాతువులాతరువాత మఱి మూఁడునాలుగు శతాబ్దములు పరిణతములయిన రూపములు. అనఁగా అరవధాతువులకును, తెనుఁగుధాతువులకును గల యంతరము పదకొండుశతాబ్దములు. క్రీస్తుశకమునకు పూర్వము అరవధాతువులతో సమానముగా నుండెడివని తలంపదగిన తెలుఁగుధాతురూపములు పదునొకండుశతాబ్దములు రూపాంతరితములగుచు నన్నయనాఁటిధాతువులై యుండిన వనుట స్పష్టము. కాఁబట్టి అరవధాతువులతోను,గన్నడధాతువులతోను గలిపి పరీక్షించినచో తెనుఁగుధాతువులయం దనేకములయిన మార్పులు గనుపట్టును. అట్టి మార్పులన్నియును ముందు 'ధ్వనుల మార్పు', 'ఊనిక' అను ప్రకరణములలోఁ జెప్పిన సామాన్యసిద్ధాంతముల ననుసరించియే యున్నవి. తక్కిన శబ్దములయెడ వర్తించు సిద్ధాంతములే యీ ధాతువులయెడను వర్తించును. ఈ క్రింది రూపములను, సమన్వయమును బరిశీలించునది. ఆ ప్రకరణముల యందలి లక్షణములను స్మృతికిఁ దెచ్చుకొనునది.

I. వర్ణసమీకరణము—భిన్నవర్ణములు సమీకరణమునంది సమానవర్ణములగుట

| తెనుఁగు | కన్నడము | అరవము |
|---|---|---|
| సొక్కు | సుర్కు | సురుంగు |
| దిద్దు | తిర్దు | తిరుత్తు |
| ఉరుము | — | ఉరుంబు |
| ఉక్కు | ఉర్కు | ఉరుక్కు |
| పెచ్చు ( హెచ్చు ) | పెర్చు | పెరుక్కు |

వీనియందు క్రమముగా రవర్ణము క, ద, చ వర్ణములతో గలిసి సమీకృతమయినది. అట్లే మకారమును, బవర్ణమును సమీకృతములయినవి.

II. తాలవ్యీకరణము — ఈ క్రిందివానిలో ప్రాచీన కవర్ణము చవర్ణముగా దెనుఁగున మాఱినదనుట స్పష్టము. అట్లగుటవలనఁ గ్రొత్తధాతువు లేర్పడినవి.

| తెనుఁగు | కన్నడము | అరవము |
|---|---|---|
| చెడు | కెడె | కెడ |
| చేఁదు (విశేషణము) | కై | కై |
| చిఱుగు | కీఱ్ | |
| చీలు | కీఱ్ | కీల్ |

| తెనుఁగు | కన్నడము | అరవము |
|---|---|---|
| చీఱు | కీఱు | కీఱు |
| చెఱుగు | కేఱు | |
| చేయు | కెయ్ | |

III. ఊనిక తొలఁగుటచేత మొదటియక్షరము నష్టమగుటయు, ఉ = ఒ, ఇ = ఎ, మొదలయిన మార్పులు గల్గుటయు గనుపట్టుచున్నవి.

| తెనుఁగు | కన్నడము | అరవము |
|---|---|---|
| వ్రాయు (రాయు) | బరె | వరై |
| లేచు | ఎఱు | ఎழு |
| ఈడు | ఎళె | ఇழு |
| పొగడు | పొగళ్ | పుగழ் |
| అను | ఎన్ | ఎన్ |
| ఒరయు | ఒరె | ఉరై |
| ఒదవు | ఒదె | ఉదై |
| ఏలు | ఆళ్ | ఆళ్ |
| పొరలు | పొరళ్ | పురళ్ |
| తొడఁగు | తొడగు | తుడంగు |
| మొలచు | మొళె | ముళై |

ప్రాచీన ళకారము లకారమగుట, రేఫములు తాల్వ్యారగుట మొదలయిన మార్పు లన్నియును తెనుఁగుధాతువులలోఁ గనుపట్టును ఈ మార్పులు ద్రావిడ మాండలికము లను ప్రకరణమున నిరూపింపఁబడినవి.

IV. సహాయక్రియలను జేర్చుటచేత క్రొత్తధాతువు లేర్పడుచుండును. ఇవి రెండువిధములు: 1. ధాతువుపయి ధాతువుచేరి విలక్షణార్థాభిధాయి యయిన ధాతువుప్పతిల్లుట. 2. క్రియార్థకమయిన ధాతువు తప్ప (అనఁగా తిఙంతరూపము లేర్పడకుండ మూలరూపములుగాని, అసమాపకక్రియారూపములుగాని, కృత్తద్ధి తాంతములుగాని) ఇతరములయినవానిపయి చేరి క్రొత్తధాతువు లుప్పతిల్లుట.

వీని నన్నిటిని శబ్దపల్లవములని చిన్నయసూరి వ్యవహరించెను.

కూరుచు+ఉండు=కూరుచుండు.

నిలుచు+ఉండు=నిలుచుండు.

తనరు+ఆరు=తనరారు.

అలరు+ఆరు=అలరారు.

అందు+కొను=అందుకొను.

అరుగు+తెంచు=అరుగుతెంచు, అరుదెంచు.

పయి యుదాహరణములందు అనుబంధములుగా వాడు ధాతువు లన్నియును

స్వతంత్రప్రయోగార్హము లనుటయు, నర్థవంతములనుటయు నిర్వివాదము. తెంచు అనునది స్వతంత్రధాతువుగా తెగఁజేయు అను నర్థమున వాడఁబడుచున్నది. కాని ఈ యర్థముగల ధాతు విదికాదు. దీని ప్రాచీనరూపము తేర్చు అని యూహింప వచ్చును. ఇది సర్వ ద్రావిడభాషాసామాన్యమయిన తర్ (తెర్+చు=తెచ్చు) అను ధాతువునుండి కలిగిన ప్రేరణార్థకరూపము. తెర్ + న్ + చు = త్రెంచు = తెంచు అని మారినది. అనునాసిక్య మాగమమాత్రము. ఇట్లేర్పడిన శబ్దపల్లవ ధాతువుల యితరరూపములు చనుతేన్, చనుతేరన్, తోతేన్, తోతేరక, తోతేక, యని యుండుటనుబట్టి పయియూహ నిశ్చితమగుచున్నది. తర్ ధాతువే తెనుఁగున తెచ్చు అయినది. 'కల్లుతేరు నెపంబున' మొదలయిన ప్రయోగంబు లనుబట్టి తరు=తేరు అయినదనుట స్పష్టము.

ఇట్లేర్పడిన తెంచు ప్రేరణార్థకమయిన యనుబంధముగా వాడఁబడి తరువాత మొత్తమురూపము స్వార్థమున వాడఁబడియుండును. తరువాత సామ్యము వలన తెంచు అనుబంధముగా నితరములకుఁగూడ స్వార్థముననే చేరుటయు విశేషార్థములును గాలక్రమమున నేర్పడియుండును. పోవు, నడఁచు అను నర్థము గల చను, అరుగు అను ధాతువులపయి తెంచు ప్రేరణార్థమున అను ప్రయుక్తమై యవి కాలక్రమమున ఆగమనార్థము లయినవని యూహించుట సులభము. పయిరీతినే కొను ధాతువును గ్రహించు అను నర్థమున అనుప్రయుక్తమయి అర్థాంతర మునఁ గాలక్రమమునఁ బరిణతమయి అనుబంధమాత్ర మైనదనుటయు స్పష్టము.

అన్నంతక్రియలపయిని, క్త్వార్థకములపయిని, కృత్తద్ధితములయిన రూపములపయిని, విభక్త్యంతములపయిని, అవ్యయములపయిని, ధాతువులు అనుప్రయుక్తములయి విలక్షణార్థములయందు రూఢము లగుచున్నవి. అట్టి ధాతువు లనేకములు గలవు. అందు వాని యవయవస్వరూపము నేఁటికిని స్పష్టముగా గనుపట్టు చుండును. అనఁగా భాష వర్థమానమగుచున్నదిగాని వృద్ధము గాలేదని యర్థము. ఇట్లు వర్థమానములయిన ధాతువులు భాషాస్వభావము ననుసరించి యర్థాంతరముల సంక్రమించి యీ జాతివారియొక్క నాగరకతను, విజ్ఞానమును జెప్పుట కుపయోగపడినచో తెనుఁగు గొప్పభాషయు నగును. స్వస్వభావమును విశదీకరించు కొని ప్రఫుల్లమగును. అట్లుగాక యితరములయిన సంస్కృతాంగ్లాది పదములచే నా భావాంతరములను జెప్పుచు వచ్చుచున్నచో ఈ పెరుగుదల తలతలనే నశించి వెలయకపోవలసివచ్చును. గొప్పదియైన యన్యభాషాప్రాముఖ్య మిట్టి పట్టులనే భాషను తనదారిని బెరుగనీయక యితరమయినదారి నీడ్చుచుండును.

ఇట్టి యనుప్రయుక్తధాతువులు సుమారు 175 ఆంధ్రభాషాచరిత్రకారులు పేర్కొనిరి.[18] అవి యన్నియును పరిశీలనార్హములు. చరిత్ర కనుగొనవలసినవి. మాదిరికిమాత్ర ముదాహరించుచున్నాను.

[18] ఆ. భా. చ. పుట, 156-180.

అంటు, అడఁగు, అడఁచు, అను, అఱు, ఆడు, ఆరు, ఆరుచు, ఉఱుకు, ఊరు, ఎత్తు, ఒత్తు, కట్టు, కను, కొట్టు, కొను, చేయు, పడు, పాఱు, పుచ్చు, పెట్టు, పోవు అనునవి ముఖ్యములయినవి. వెన్ను + అంటు = వెన్నంటు, వెను + పడు = వెంబడు (వెంబడించు, వెంబడి), పొడవడగు, ఊకొను, జోకొట్టు, తలపడు, రూపడచు, సల సలమను, పెంపఱు, నీరాడు, పొంగాఱు, పొలుపారు, ఓదారుచు, క్రేళ్ళుఱుకు, ఊటలూరు, రూపెత్తు, మాఱొత్తు, నడిగట్టు, పొడకను, మాఱుకొను, కైచేయు, క్రిందుచేయు, కొంచెపడు, పనిపడు, చూపెట్టు, ఓటుపోవు. ఇట్టి వనేకములు ప్రయోగములనుండి తెలిసికొనవచ్చును. వీని యర్థవిశేషములు స్పష్టము.

ఈ రూపముల యొక్క స్వభావమును బరిశీలించినచోఁ దెనుఁగు యొక్క వికాసము, నూత్నభావబోధకత, వెలుగుదల, భాషాలక్షణము తప్పక బోధపడ గలదు. ఈ స్వభావమే సంస్కృత ప్రాకృతములకంటె భిన్నతను, తదజన్యత్వ మును, ప్రాథమికావస్థను నిరూపించును. ఇట్టి లక్షణమే అరవ కన్నడముల యందు మిక్కిలిగా గలదు. దానివలన నీ భాషల యేకకుటుంబతయు, సన్నిహిత స్వభావమును తెలియగలదు.

V. పయిని పేర్కొనఁబడిన శబ్దపల్లవములు కాలక్రమమున రూపాంత రములయి కొన్నియెడల మార్పడినట్లుకూడ స్పష్టము. కూర్చు+కొను=కూర్చొను, ఏగు + తేరుచు = ఏగుదెంచు, పన్ + ఉండు = పన్నుండు (పానుపు), వెన్ + పడు = వెంబడు (వెంబడి+ఇంచు), పుచ్చు+తెంచు=పుత్తెంచు.

పయి యుదాహరణములనుబట్టియు, విచారణనుబట్టియు, తెనుఁగుధాతు వులు అరవ కన్నడములవానితో నభిన్నములనియు, బయిభాష లన్నియును నొక్క ప్రాచీనభాషనుండియే యేర్పడినవనియును స్పష్టమగుచున్నది. ధాతురూప ములలో గనుపట్టు భేదము లన్నియుఁ గాలక్రమపరిణామమువలన నేర్పడినవను టయు స్పష్టము.

## 4. తెనుఁగు క్రియారూపముల స్వభావము

తెనుఁగు క్రియలనన్నిటిని రెండువిధములుగా విభజింపవచ్చును. సమాపక క్రియ లనంబడెడి చేయుచున్నాఁడు, చేసెను, చేయగలఁడు, చేయును, చేయుము, చేసితిని, చేసెడిని, చేయుదును, చేయను మొదలగువానివంటి రూపము లొకవిధ మయినవి. అసమాపకక్రియ లనంబడెడి చేయ, చేయుట, చేయక, చేసి, చేయుచు, చేయుడు, చేయని, చేసెడి, చేసెడు, చేసిన, చేయఁగల, చేసినన్, చేయుచున్న అనువానివంటివి రెండవవిధము. ఈ రెండువిధములయిన క్రియలకును గల భేదము స్పష్టము. ఒకటి వాక్యమునందు ఆకాంక్షాసమాపకము. రెండవది యనా కాంక్షాసమాపకము. అనఁగా మొదటిదానితో వాక్యార్థము పూర్తియయి

యాకాంక్ష (అర్థపూర్తికయి వలసిన పదాంతరాపేక్ష) యుడుగును. రెండవదానికి అట్టి శక్తి లేదు. అనఁగా నద్దాని ప్రయోగమున నట్టి యాకాంక్ష నశింపదని యర్థము. వాక్యముయొక్క అర్థసమాప్తికి దాని ప్రయోగమాత్రము సమర్థము గాదు.[19] క్రియారూపముల నన్నిటిని బయిరీతిని రెండువిధములుఁగా విభజింప వచ్చుననుట నిర్వివాదము. ఈ రెండువిధములయిన రూపములకును చరిత్ర యందును, స్వభావముననను భేదము గలదు. దానిని గుర్తించినచో తెనుఁగుక్రియల స్వభావము బోధపడును.

మొదట సమాపకక్రియ లనంబడెడువానిలోఁ గొన్నిటి స్వరూపమును, చరిత్రమును విమర్శింతము. చేయుచున్నాఁడు = చేయుచున్నవాఁడు = చేయుచున్ + ఉన్న + వాఁడు. ఈ క్రమముననే రూపము లేర్పడినవనుట నిర్వివాదమును, స్పష్టమును అగుచున్నది. అట్లే చేసాడు=చేసినాఁడు=చేసినవాఁడు అను రూపము నేర్పడినదనుటయు స్పష్టమే. ఇట్లే చేయగలఁడు, చూడఁబోవుచున్నాఁడు, రాఁ జూచునది, రానున్నాఁడు, వండవలసినది మొదలయిన రూపములన్నియు నేర్పడెననుటయు స్పష్టమే.

పయి రూపములన్నియును మొట్టమొదట భావపరిపూర్తిగల వాక్యములే. చేయుచున్నవాఁడు అనుదానియందు ధాత్వర్థములయిన ఫలవ్యాపారములు, కర్త, వచనము, కాలము మొదలయినవన్నియును ఉక్తములే యయిపోయినవి. అది కాలక్రమమున విశేషణమయినది. 'చేయుచున్నవాఁడు రాముఁడు' అను ప్రయోగమును దిలకించునది. తరువాత నియ్యదియే వైయాకరణులచేత నంగీకరింపఁబడిన వాక్యమునందలి సమాపకక్రియారూప మయినది. ఇదియే దీని చరిత్ర. సమాపకక్రియారూపముల చరిత్రమంతయును ఇట్లే యుండుననుట నిర్వివాదము. మొదటిది వాక్యావస్థ. రెండవది విశేషణావస్థ. మూఁడవది సమాపకక్రియా రూపము. ఈ పరిణామక్రమమున కొన్ని క్రియారూపములు స్ఫుటముగా, నిర్వివాదముగా గన్పట్టును. కొన్ని సందేహాస్పదములుగా నుండును. కొన్నియెడల నీ యవస్థలను నిరూపించుట కష్టము. అవి భాషాపరిణతిలో ప్రాచీనములయి క్రొత్త రూపములనెడి పొరలక్రిందఁ బడి బయటికిఁ దీయరాక మునిగిపోయినవి. పయి క్రమమున కంతటికిని సమాసతుల్యతయే రచనలోని యాధారము. అనఁగా సమాసముల నెట్లేర్పఱచుకొనుచున్నామో అట్లే క్రియారూపములు నేర్పడినవనుట. ఒక్క క్రియారూపములేకాదు, విభక్త్యంతములయిన నామరూపములును నిట్లే సమస్తరూపములని యా ప్రకరణమున నిరూపించితిని. తెనుఁగుభాషయంతయు సంయోగాత్మకావస్థ యందు (Agglutinative) ఉన్నదనియు, భాషారూపనిర్మాణప్రణాళిక యంతయును సమాసరచనావిధానముపయినే యాధారపడియున్నదనియు, భాషాస్వరూపమును జెప్పు సందర్భమునఁ జెప్పితిని. కాఁబట్టి తెనుఁగు సమాపకక్రియ సమాసమువంటిది

---

[19] ఆకాంక్షా = ప్రతీతి పర్యవసానవిరహః. సా. దర్ప. 2.

యనుట సిద్ధాంతము. చేయుచున్నాఁడు అను క్రియారూపములో చేయుచు+ఉన్న+వాఁడు అను మూఁడుపదములు గలవు. తుది 'వాఁడు' ప్రథమపురుషైక వచనబోధకము. 'ఉన్న' అనునది 'కల' యను నర్థముగలది. ఇందలి అకారము విశేషణార్థకమైన సంబంధవాచకము. ఇ, అ, అనునవి యిట్టివని ముందు తెల్పితిని. ఉన్ అనునది ప్రాచీనధాతురూపము. కలుగు, సంబంధించు, వసించు, అప్రధానముగా నాశ్రయించు, అను నర్థములు గలది. చేయుచు అనునది చేయుట యను భావార్థకముతో సమానమయిన యర్థము గలది. ఇఁక నీ రూపమును సమాసమనుట స్పష్టముగదా! చేయుట కలవాఁడు అని యర్థము. ఇట్లే చేసినవాఁడు అనుదానిని చేసి+న్+అ+వాఁడు అని విభజించుట సులభము. 'చేసి' భావార్థకము. 'న్' విసంధినాపుట కాగమము. 'అ' సంబంధబోధకము. 'వాఁడు' కర్తృబోధకము. చేయఁగలఁడు = చేయన్+కల+వాఁడు, చేయగలాఁడు, చేయగలఁడు, చేయఁగలవాఁడు, అనునవి యభిన్నములనుట స్పష్టమేకదా! పయి సమాసములలోని చేయ, చేసి, చేయుచు, మొదలయినవి యన్నియు భావార్థకములే. అన్నియును భావార్థకములనుట యెట్లు పొసఁగును. ఒకటి భూతార్థకము, రెండవది భవిష్యదర్థకము, మూఁడవది వర్తమానార్థకము, భేదము కన్పించుచునే యున్నది అందువేని సత్యమే. అది నేఁటి యవస్థ. ఇట్టి యర్థభేదము కాలక్రమమునఁ గలిగి రూఢమయినది. మొదట నన్నియును భావార్థకములే. 'చేయుట' యనుచోట కాలవ్యవస్థ యొక్క యర్థస్ఫూర్తి లేదుకదా! తద్ధర్మార్థక క్రియాజన్యవిశేషణము లని చెప్పు వండు, తిను, చేయు, మొదలయిన ధాతురూపమాత్రములకు త్రికాలమునకుఁ జెందిన యర్థమును నీవెట్లు చెప్పుకొనుచున్నావో అట్లే యిచ్చటను ఉండియుండెనని యూహించుట కేమి ప్రతిబంధకము. భావమనఁగా క్రియామాత్రము. కాల కర్త్రాది విశేష్యదూరమయి అప్రధానమాత్రముగా స్ఫురించు నర్థమనుట.[20] క్రియాపదము చరిత్ర మీ రీతిని వివరింపనగును. ప్రాచీనధాతువులుండినవి. అవి భాషాప్రాథమికావస్థయందలివి. అవి నామార్థకములును క్రియార్థకములును గూడ నయియుండినవి. జనులు వానిని వాడుచువచ్చిరి. వానికి దుదిని కొన్ని ప్రత్యయములు చేరి (కు, చు, తు, యు, రు, టు, మొదలయినవి) క్రియలు, నామములు అను భేదమును సూచించుట కొక ప్రణాళిక యేర్పడినది. వానిని భావార్థకమాత్రములుగా వాడి సమాసములను గూర్చిరి. కాలక్రమమున వాని చరిత్రను మఱచి సమాసములయిన క్రియారూపములను విభజించి ప్రాచీనభావార్థకములను ప్రత్యయసహితములయినవానిని ధాతుమాత్రములనుగా భావించిరి. వానిపయి మఱల క్రొత్త భావార్థకప్రత్యయములను చేర్చి క్రొత్తరూపములను సిద్ధపఱచిరి. ఈ క్రింది యుదాహరణమును జూచునది. 'చా' అనునది ప్రాచీన మూలద్రావిడ ధాతువు.

[20] భావప్రధానమాఖ్యాతమ్, నామపదవాచ్యార్థాశ్రయక్రియావ్యంగ్యో భావః. భాష్యరాగ వ్యాఖ్యాః - నిరుక్తము.

ఇది నామక్రియాసామాన్యము. దానినుండి చాచు=చచ్చు అను భావార్థకము బయలుదేరినది. వాడుకలో నేఁటికిని 'చచ్చు' నకు చచ్చినది, సారవిహీనమయినది (వాఁడు) అను నర్థములు గలవు. మరల నది ధాతుమాత్రముగ గ్రహించుటచే 'చచ్చు' 'చున్నాడు' అనురూపము బయలుదేరినది. ఇట్లే 'పెర్' మూలధాతువు, పెరుగు భావార్థకము. (పెరిగినది=అభివృద్ధము=దధి). దానిని ధాతువుగా గ్రహించి పెరుగుచున్నది, పెరుగుట యను రూపము లేర్పడినవి. ఇట్లే 'బిగ్' అనునది ప్రాచీనతమ రూపము. 'బిగి' యనంతరము, 'బిగియు' తరువాతిది. బిగియుట, బిగియుచున్నది మొదలయినవి నేఁటివి.

ఇట్లు ప్రత్యయముపై ప్రత్యయమును జేర్చుటయు, విశేష్యమునుండి విశేషణమును, మఱల దానినుండి విశేష్యమును గల్పించుచుపోవుచుండుటయు, భాషా లక్షణము అను విషయము విభక్తి ప్రత్యయ చరిత్రమునను, విశేషణస్వభావ వివరణ సందర్భమునను, సోదాహరణముగ సిద్ధాంతపఱచితిని. విశేష్య విశేషణ భావస్వరూపమే భాషానిర్మాణమునకును, భావవివరణమునకును బునాది యనుట నిర్వివాదము.

పయివిచారణమున స్పష్టములయిన విషయములు : 1. నేఁటి సమాపక క్రియారూపము సమాసమువంటిది. 2. అసమాపకక్రియారూపములయిన చేసి, చేయుచు మొదలయినవి భావార్థకములు. చేయుటతో సమానార్థకములుగాఁ బ్రాచీనావస్థయం దుండినవనుట. మొదటిది యంగీకరించినచో రెండవదియు అక్షిప్తమై సిద్ధమగుచునే యున్నది. రెండవసిద్ధాంతమున కింతియే ప్రమాణమా లేక ఏవైన క్రొత్తయుపపత్తులు భాషయందు పాతుకొనియున్న ? నిరూపింపవచ్చునా ? యని యడుగవచ్చును. ఉన్నవి యని సమాధానము. ఈ క్రింది వాడుకలను బరిశీలించునది.

I. 'రాహుకంఠము తెగి దేహము ధరణిఁబడియె - తెగుటన్ అనియర్థము.
[న్, హేత్వర్థకము.]

మోముదాకి తిరిగె గరుడి - తాకుటను ,,

నీవు చేసియున్న పని - చేయుటగలిగిన పని యని భావము (ఉండు=కలుగు)

కనియున్నది కనినట్లు చెప్పుము - కనుట కలిగినయది ,,

కని, తిని, వచ్చినాఁడు = కనుట, తినుట, వచ్చుట గలవాఁడని భావము.
వచ్చి+న్+అ+వాఁడు అని సమాసము.

జరిగిపోయినది=జరుగుట పోయినది అని భావము.

ఇల్లుకట్టి అయినది (వాడుక)-కట్టుట అయినది ,,

వానితో చెప్పి లాభము లేదు=వానితోచెప్పుట లాభము లేదు

వానిని కొట్టి ప్రయోజనము లేదు=కొట్టుట ప్రయోజనము లేనిది

గుగ్గిలము వెట్టికొఱకై - (ద. హి. శ. V 1153 నెం.) పెట్టుటకొఱకై
ఆశీర్వాదంబు సేసికొఱకై (ద. హి. శ. V 1062) చేయుటకొఱకై
వ్రాయు+ఇ=వ్రాయి, త్రిమ్మరు+ఇ=త్రిమరి; చేయు+ఇ=చేయి.
పై ధాతువులపయిని కృత్ప్రియముగాగూడ అనఁగా నామతుల్యమయిన రూపమగుటకు ఈ ఇప్రత్యయము వచ్చుననుట నిర్వివాదము.

II చూచినయది - చూచి+న్+అ=చూచుట (గల) యది (కర్మ లేక కర్త)

III చేయుచు+ఉన్న+వాఁడు - చేయుటకలవాఁడు

నీవు వినుచున్నది - వినుచు+ఉన్న+అది. నీ వినుట గలయది యని భావము

కనుచు వచ్చుచున్నాఁడు - కనుట వచ్చుట గలవాఁడు (ఉన్న=కల)

వర్తమానార్థకత్వము కాలక్రమమున నేర్పడినది.

IV చేయఁగలవాఁడు - చేయుట కలవాడు

వండవచ్చును - వండుట వచ్చును (తగును లేక జరుగును) అని యర్థము

రాఁబోవును - రాక+పోవును (జరుగనున్నది) ,,

పోనగును - పోవుట అగును (పోవీలు) ,,

పయి యుదాహరణములయం దెల్లెడలను చూచి వంటి క్త్వార్థకములకును, చేయుచు వంటి శత్రర్థకములకును రా, పో, వండ మొదలయిన నుజ్యంతములకును, వచ్చు, పోవు, అగు, ఉండు, పడు మొదలైన ధాత్వంతరములయిన సహాయ క్రియలతో నన్వయముచేయునపుడు భావార్థకత్వమునే పయిరీతిని చెప్పుకొనకున్న అన్వయమే సరిపడదు. పయిస్థలములయం దెల్లను భావార్థమే పొసగుననుటనుబట్టి ప్రాచీనకాలమున నీయర్థమే యుండెననియు, నయ్యది యితరస్థలములలోఁగూడ కాలమునుబట్టి మాఱుపాటుపొంది నేఁటి యన్వయక్రమము సంస్కృతక్రియావాక్య విధానమునుబట్టి మన మనస్సుల హత్తుకొనెననియు నిర్ణయించుట యుక్తము.

కొఱకు, కంటె, పొంటె, చూపు, పాలించు మొదలయిన రెండవతరపు ధాతువులపయిని భావార్థకప్రత్యయము లేకయే వాఁడబడుచుండుట యీ క్రింది యుదాహరణములనుబట్టి స్పష్టము.

| | |
|---|---|
| దానిఁ జూపుకొఱకుగాదె | చూపుటకొఱకు |
| పాలించుకొఱకు | పాలించుటకొఱకు |
| పతికలుగుకంటె | కలుగుటకంటె |
| చెడుకంటెఁ | చెడుట కంటె |
| ప్రకటించుకంటె | ప్రకటించుటకంటె |

పయి యుదాహరణములయందు టవర్ణమును లోపముచేయుట కృత్రకమైన వైయాకరణమతము. టవర్ణము రాలేదు. ఉచ్చారణత్వరవలనఁగాని మఱి యే హేతువువలనగాని లోపింపనులేదు. చూపు, పాలించు, కలుగు, చెడు అనునవి భావార్థకములే. కు, గు, చు, యు మొదలయిన యాగమములుగా చేరిన రెండవతరపు ధాతువులు మొదట భావార్థకములే యని ముందే వివరించితిని. అట్టి ప్రాచీనభావార్థకముపయిని కొలకు మొదలయినవి చేరినవిగావుననే టవర్ణము రాలేదు. కొలుచు, చచ్చు, పుచ్చు మొదలగు చువర్ణాంతములును, తరుగు, విరుగు, మఱుగు మొదలగు గువర్ణాంతములును, ఇఱుకు, కులుకు, సాకు మొదలయిన కువర్ణాంతములును, పుట్టు, కట్టు మొదలగు టువర్ణాంతములును భావార్థములుగానే నామతుల్యములుగానే నేఁడును వాడఁబడుచున్నట్లు స్పష్టమే. వచ్చినావు, వచ్చినాడు, చేయుచున్నాఁడు మొదలయినవి సమాసతుల్యములే యనుట కింకొక యుదాహరణమును గలదు. నేను చిన్నవాఁడను, నీవు చిన్నదానవు, మీరు విద్యార్థికులరు, ఇత్యాదిపదములు వాక్యమునందు విధేయవిశేషణములుగా నున్నవి. అనఁగా చిన్నవాఁడు మొదలగు సమాసముల తుదిని సార్వనామికపరిశిష్టములయిన ను, వు, రు అనునవి చేర్చుటవలన నయ్యవి విధేయవిశేషణము లయినవి. ఇఁక చిన్నవాఁడు = చిన్నాఁడు అనుదానికిని, చేయుచున్నవాఁడు = చేయుచున్నాఁడు. అనుదానికిని గల భేదమేమి ? రెండును సమాసరూపమయిన విధేయవిశేషణములే. రెండును సార్వనామికపరిశిష్టములు తుదిని గలవియే. ఒక సమాసములోని పూర్వపదమయిన చిన్న యనునది గుణవాచకము. రెండవదానిలోని పూర్వపదము క్రియాజన్యవిశేషణము. ఆకారణంబుననే రెండవది కాలక్రమమున క్రియాపదమనంబడిన యాఖ్యాత మయినది. కాని స్వభావములో రెండును విశేషణములయిన సమాసములే యనుట నిర్వివాదము. పయివిధమయిన వాడుక అరవమునను, గన్నడమునను గూడ గలదు.

పయివిమర్శవలనఁ దేలిన సారాంశములు :

1. తెనుఁగుధాతువులు ప్రాచీనకాలమున నామక్రియాసామాన్యములు.

2. కు, గు, యు, చు మొదలయిన భావార్థకప్రత్యయములు చేరి మరల ధాతువులుగా వాడఁబడి రెండవతరపు తెనుఁగుధాతువు లయినవి.

3. తెనుఁగునందలి సమాపకక్రియాపద స్వరూపము సమాస మనుట స్పష్టము.

4. అసమాపకక్రియలు భావార్థకములయి కాలక్రమమున వైయాకరణ విభజనమున నేటిపద్ధతిని సంస్కరింపఁబడినవి. కాలక్రమముననే కాలబోధకతయు నేర్పడినది.

5. తెనుఁగు, కన్నడ, తమిళ ధాతువు లభిన్నములు.

## 5. అచ్చతెనుఁగు ధాతువులకు సంస్కృత ప్రాకృత జన్యత లేదు

తెనుఁగు సంస్కృత ప్రాకృతముల ననుసరించినది గావునను, అందలి పదములను, ధాతువులనుఁగూడ దెచ్చుకొనినది గావునను, కొన్ని ధాతువులు తద్భవములుగా తెనుఁగున నున్నవనుటలో విప్రతిపత్తి లేదు. అచ్చతెనుఁగు ధాతువులలో నూటి కెనుబదివంతులు సంస్కృతమూలములు గలవి యను సిద్ధాంతము మాత్రము విమర్శనీయము. ఇట్లచ్చతెనుఁగు ధాతువులలో నూటి కెనుబదివంతులు సంస్కృత జన్యము లని సిద్ధాంతము చేయఁగలిగినచోఁ దెనుఁగు సంస్కృత ప్రాకృత జన్యమనుట సిద్ధమే యగును. కాని పయిసిద్ధాంతమునకుఁ గల సాధక బాధకములగు యుక్తులను విమర్శింతును.

సంస్కృత ప్రాకృతములు వృద్ధభాషలుగా నుండిన కాలమున తెనుఁగు ప్రాథమికావస్థయందు తెనుఁగునాట వ్యవహారములో నుండెననుట కనేక ప్రమాణములను శాసనములనుండి యెత్తిచూపితిని. అట్టి సంస్కృత ప్రాకృతములలో నుండి తెనుఁగునకుఁ గ్రియారూపము లెట్లు రావలెను? సంస్కృతము చదివినవారు వాడుచుండగా నవి భాషలో ప్రవేశింపవలెను. అనఁగా పండితులు ప్రవేశపెట్టవలె నన్నమాట. అట్లు వారు ప్రవేశపెట్టిన వన్నియు 'ఇంచు' అను నాగమమును జేర్చి లంఘించు, అనుభవించు, నుతించు అనురీతిని ప్రవేశపెట్టిరి. అనఁగా నిట్టివాడుక బలముగా నేర్పడినతరువాత వానిని తెనుఁగువా రుచ్చరింపలేకపోగా రక్షించు = రచ్చించు, సంతోషించు = సంతసించు మొదలయిన రూపము లేర్పడియుండవలెనని యూహింపక తప్పదు. ఇట్లు 'ఇంచు' చేర్చుటకు మూలమేమి యను ప్రశ్నకు సమాధానము చెప్పవలెను. తెనుఁగునందలి ప్రేరణార్థకములపయిని, నామముల పయిని 'ఇంచు' చేరి తెనుఁగుధాతువు లేర్పడుచున్నవి. వందు+ఇంచు = వండించు, ఇనుమడి + ఇంచు = ఇనుమడించు, పొడుగు + ఇంచు=పొడిగించు. ఇట్లు భాషలో సిద్ధమయిన పద్ధతినే సంస్కృతధాతువులకు జేర్చి తెనుఁగువాడుకలోనికిఁ బండితులు దెచ్చికొనిరి. అనఁగా సంస్కృతధాతువు తెనుఁగుగా మాఱుటకుఁ దెనుఁగు ముద్రయగు 'ఇంచు' వేయవలెను. ఇట్టిధాతువు లనేకములు భారతమును దెనిఁగించుపట్టున నన్నయ యప్పటి వాడుకనుబట్టి వాడెను. ఆ మార్గము నితరు లనుసరించిరి. కాలక్రమమునఁ బండితవ్యవహారమున తెనుఁగునాట సంస్కృతధాతువుల వాడుక ప్రబలినది. అట్టివానిని పండితులు వ్యవహరించుచుండగా సామాన్యులు విని యుచ్చరించుటవలన లోపవికారాదులతో తద్భవములగు రచ్చించు (రక్షించు), సంతసించు (సంతోషించు) మొదలయిన రూపములు గలిగినవనుట స్పష్టము. మొదటినుండియు సంస్కృతముననుండి తెనుఁగులోనికి వచ్చినవానిని తెలుఁగుపండితులు వేఱుగనే పరిగణించుచుండిరి. తెనుఁగుప్రత్యయములనుగాని, పదములనుగాని చేర్చుకొనియే తెచ్చుకొనుచుండిరి, ఈ పద్ధతియే తెనుఁగున నెల్లకాలమును జరుగుచుండినది.

ఇట్లే హిందీభాషనుండి క్రియలను జేర్చుకొనునపుడును ప్రాచీనమయిన 'ఇంచు' నే యాగమముగాఁ జేర్చికొని హిందీనామములను, క్రియలను 'బనాయించు, బుకాయించు, దబాయించు' మొదలయిన రూపములతోఁ దెనుఁగున వాడుచు వచ్చిరి. నేఁటి ఇంగ్లీషుపదములను క్రియలుగాఁ దెచ్చుకొనునప్పుడును తెనుఁగు ధాతువగు 'చేయు'ను అనుప్రయుక్తముగాఁ వాడి ధాతువులను, కృత్తద్ధితములను గూడ నుపయోగించుచున్నారు. 'ప్రపోజు' చేయు, 'ప్రపోజలు' చేయు, ఇందు మొదటిది క్రియ. రెండవది భావనామము. రెండును ఒక్కవిధినే 'చేయు' ను జేర్చి ఒకేయర్థమున వాడుచున్నాము.

పయి పరిశీలనమునఁ దేలిన సిద్ధాంత మేమనఁగాఁ దెనుఁగు క్రియలయిన ఇంచు, చేయు, అనువానిని చేర్చియే యితరభాషలనుండి నామములనుగాని, క్రియలనుగాని గ్రహించి తెలుఁగువారు వాడుకొనుచున్నారనుటయే. అన్యభాషా పదము క్రియయైనను, నామమైనను క్రియగా దెచ్చుకొనునప్పుడు దాని కొకరీతిగానే తెనుఁగుక్రియను జేర్చి తెచ్చుకొనుటయే యభ్యాసమనుట స్పష్టము.

పయిరీతిని దెచ్చికొనిన సంస్కృతధాతువులుగాక తెనుఁగునందలి దేశ్య ధాతువులు మఱియొకవిధమున సంస్కృత ప్రాకృతములనుండి యేర్పడినవనియుఁ, దెనుఁగు సంస్కృతభాషాజన్యమనియు నొకసిద్ధాంతము బయలుదేరినది.[21] ఈ మతముచొప్పున అచ్చతెనుఁగు ధాతువులలో నూటి కెనుబదినంతులు సంస్కృత మూలములు గలవియే. తెనుఁగునందు 'కు, ంకు, క్కు, గు, ంగు' అను నతురములు అంతమందుగల ధాతువులు, ఒక సంస్కృతధాతువుతో 'కృ' అను ధాతువు చేరి యేర్పడునవి. "కృ ధాతువునకు 'ను' వికరణసంజ్ఞచేరి కృణు అయి, కొనుగా తద్భవమయి, సహాయధాతువుగా నేర్పడి, యర్ధానుస్వారయుక్తమగు కువర్ణకముగా మాఱినది. తాఁకొను, తాఁకు, తలఁకొను, తలఁకు, మునుకొను, మునుకు మున్నగునవి యిట్టివే."

ఉదాహరణములు—కృంత్+కృ=గీఁకు ; ఖింద్+కృ=పీఁకు.

పయిమతమున ననేకములయిన బాధకములు గలవు.

1. ఖింద్+కృ=పీఁకు, కృంత్+కృ=గీఁకు అనువానియొక్క పరిణామావస్థలు చరిత్రాత్మకముగా శబ్దశాస్త్రము ననుసరించి నిరూపింపవలెను. అట్లు నిరూపించు వఱకు దీనిని ప్రామాణికమని యంగీకరింపవీలులేదు. అట్లు నిరూపించుటకు వీలు లేదనుట స్పష్టమే.

2. సంస్కృతధాతువులను తెనుఁగునకుఁ దెచ్చుకొనునప్పుడు తెనుఁగుక్రియనే యనుబంధముగఁ జేర్చికొను నభ్యాసమును నిరూపించితిని. పైయభ్యాసమున కీ సిద్ధాంత మెంతమాత్రము సరిపడదు. భాషయందలి ప్రకృతులు పయినుండి వచ్చినను ప్రత్యయములుమాత్రము తెనుఁగువే కదా !

---

[21] ఆ. భా. చ. పు. 103-120.

3. సంస్కృతమునుండి ప్రాకృతములోనికి వచ్చిన పదప్రకృతుల నేర్పఱచి నప్పుడుగూడ విభక్త్యంతసిద్ధరూపములే యట్లే మాఱినట్లును, ధాతువులు ధాతు రూపములుగానే మాఱలేనట్లును తెలిపితిని. భవతి అను తిఙన్తరూపము హావది = హావయి = హై అని మాఱినదిగాని, భూధాతువు ధాతుమాత్రముగా మాఱుపాటు నందలేదు. ఈక్రింది సంస్కృత ప్రాకృత పరిణామప్రకారమును జూచునది.

| సంస్కృతము | ప్రాకృతము | సంస్కృతము | ప్రాకృతము |
|---|---|---|---|
| ధునోతి | ధుణఇ | రామస్య | రామస్స |
| స్మరతి | సరఇ / ఝురఇ | సపుత్రకస్య | సపుతకస |
| నిస్సరతి | ణిసరఇ | కృత్వా | కాతూనమ్ |
| నిద్రాతి | ణిద్దాఇ | కరిష్యతి | కరిస్సఇ |
| ఆక్రందతే | అక్కందఇ | సురధ్వజః | సురద్దఓ |
| అస్తి | అత్థి | జేతవ్యః | జేఏవ్వఇ |
| ఆసీత్ | అహేసి | | |

పయిరీతిని శబ్దరూపములు పరిణతములగునేకాని ధాతుమాత్రములను గ్రహించి జనులు వాడరు. పయి సంస్కృతధాతువులు తెనుఁగునకు రెండువిధములుగా వచ్చి యుండవలెను.

(*a*) జనులెల్లరును సంస్కృత ప్రాకృతములనే మాటాడుచు నవియే యప భ్రష్టములయి నేఁటి తెనుఁగయ్యె ననుచో పరిణామప్రకారము సిద్ధరూపముల ననుసరించునుగాని ధాతుమాత్రముల ననుసరించుటగాదు.

(*b*) పండితులు వానిని సంస్కృతమునుండి గ్రహించియుండవలెను. అట్టి ప్రక్రియ తెనుఁగున నెట్లు జరిగినదో తత్సమధాతువులనుగూర్చి వివరించితిని. తద్భవములు వానినుండి యేర్పడినరీతిని చెప్పితిని. ధాతుమాత్రములే మాఱి వచ్చినవనుట పయి పద్ధతికి మిక్కిలి విరుద్ధము. కావున నట్లు వచ్చిన వనుటకు వీలు లేదు.

4. సంస్కృత ప్రాకృత భాషలు ధాతుమాత్రములుగానే యుండినపుడు అనఁగా వ్యవహృతము లగుచుండినపుడు ఆ ధాతువులు మాఱి తెనుఁగుగా నేర్పడిన వనవచ్చును. కాని తెనుఁగు తలచూపునప్పటికే సంస్కృతము వేలకొలఁది సంవత్సర ములు పరిణతినొంది అపభ్రంశభాషలుకూడ నెలకొనియుండుటచే నిది యెంతయును జరిత్రకు విరుద్ధము. కాలము సరిపడదు.

5. తెనుఁగుధాతువుల కన్నిటికిని మూలప్రకృతులు సోదరభాషలయిన యరవ కన్నడములనుండి నిరూపింపఁబడినవి. కు, గు, మొదలయిన ప్రత్యయము లెట్లేర్పడినవో నిరూపించితిని. తెనుఁగుధాతువులు సంస్కృతజన్యము లనుట వానికి నితరద్రావిడభాషలలోని ధాతువులతోఁ గల సన్నిహితసంబంధమునకు విరుద్ధము.

కావున తెనుఁగున అచ్చికధాతువులన్నియు సంస్కృతధాతుజన్యము లనుట పొసఁగదు. అవి ద్రావిడములే యనుటయు, నరవ కన్నడములతో నభిన్నము లనుటయు స్పష్టమయిన విషయము. తెనుఁగును, ఇతరద్రావిడభాషలును సంస్కృత ప్రాకృత జన్యములు గావు.

## 6. తెనుఁగు క్రియావిభక్తులు

తెనుఁగునందలి సమాపకక్రియల చరిత్రమును, స్వభావమును మీఁద వివరించితిని. నేఁడు మనము క్రియావిభక్తులు అని భావించునవి వైయాకరణులుచేసిన విభాగము వలన సిద్ధమయినవి. చిన్నయసూరిమతంబున 'డుజ్, రు; వు, రు; ను, ము' అనునవి వరుసగా ప్రథమ మధ్యమోత్తమపురుషంబులయందు ఏక బహువచన రూపంబుల లోని ప్రత్యయంబులు. తెనుఁగుభాష యనేకశతాబ్దములు పరిణతినొంది లోకములో వాడుకయం దుండగాఁ దమకాలమున నున్న యా రూపములను గుర్తించి సంస్కృత వ్యాకరణమును బఠించుటవలనఁ గలిగిన సంస్కారమున లాఘవము, అనేక రూపాను గమము మొదలయిన యభిప్రాయములను మనసున నుంచుకొని పండితులు పదములను కత్తిరించి వేర్పఱచినవి యీ ప్రత్యయములు. చరిత్రమును, వాని రూపపరిణామక్రమ మును గొంత వింతగానే యుండును.

### మహత్తులు

| | వర్తమానము | భవిష్యత్తు | భూతము | వ్యతిరేకము | ప్రత్యయము |
|---|---|---|---|---|---|
| I | వచ్చుచున్నాఁడు | చేయఁగలఁడు | చేసినాఁడు | పోవఁడు | డు=డుజ్ |
| | తినుచున్నారు | తినఁగలరు | చేసినారు | తినరు | రు |
| II | తినుచున్నావు | తినఁగలవు | చేసినావు | తినవు | వు |
| | తినుచున్నారు | తినఁగలరు | చేసినారు(రరు) | తినరు | రు |
| III | వచ్చుచున్నాను | తినఁగలను | తిన్నాను | తినను | ను |
| | వచ్చుచున్నాము | తినఁగలము | తిన్నాము[22] | తినము | ము |

పయినీయఁబడిన మూఁడు విధములయిన రూపములయందును తుదినున్న 'డు, రు; వు, రు; ను, ము;' అనునవి ప్రత్యయములుగా నిరూపింపఁబడినవి.

### అమహత్తులు

| | వర్తమానము | భవిష్యత్తు | భూతము | వ్యతిరేకము | ప్రత్యయము |
|---|---|---|---|---|---|
| IV | వచ్చుచున్నది | చేయఁగలదు | చేసినది | చేయదు | దు |
| | వచ్చుచున్నవి | చేయఁగలవు | చేసినవి | చేయవు | వు |

[22] చిన్నయమతంబున 'చేసినాఁడు' మొదలయిన భూతరూపములు పయిరీతిని సాధింపఁబడలేదు. భూతతద్ధర్మములను మఱియొకవిధమున భిన్నరూపములతో సాధించెను.

ప్రత్యయము

V భూతము

వచ్చెను (ఆవు) ఎను

వచ్చెను (ఆవులు)

VI తద్ధర్మము

పలుకును (చిలుక) ను

పలుకును (చిలుకలు) ,,

సంగ్రహముగా నీయంబడిన రూపములను, ప్రత్యయములను బరిశీలించినచో నీ క్రిందిరీతిని వాని చరిత్రము తప్పక బోధపడును. I, II, III, IV, తెగలుగా నీయఁబడిన రూపముల యంతములు 'ఆడు, ఆవు, ఆరు, అది, అవి' అనునవి యనుట నిర్వివాదము. ఇవి 'వాడు, వారు, నీవు, మీరు, నేను, మేము, అది, అవి' అను సర్వనామములతో నభిన్నములనుట చూచినవెంటనే బోధపడగలదు. ఇంతియ గాక యివి అరవ కన్నడములయందలి సర్వనామరూపములతోను, అందలి క్రియా విభక్తులతోనుగూడ నభిన్నములుమాత్రమేగాక ఏకరూపజాతములనుట ముమ్మందు సులభముగా బోధపడును. ఈ ప్రత్యయము లి ట్లేర్పడుటకు హేతువు తెనుఁగు వాక్యరచనాపద్ధతియే. అది స్వతంత్రము, సకల ద్రావిడభాషాసామాన్యము నయి యున్నది. తెనుఁగువాక్యమున రెండుభాగములు గలవు. ఒకటి విశేష్యము, రెండవది విశేషణము. వీనినే యుద్దేశ్యము, విధేయము నని యుఁ జెప్పుదురు. ఇందు సంస్కృతవ్యాకరణసిద్ధమయిన తిఙన్తరూపము లేక ఆఖ్యాతము వంటిది సంస్కృత పద్ధతి నేర్పడలేదు. ఈ విషయము 'నన్నయకు ముందు తెనుఁగు', 'తెనుఁగువ్యాకరణముపయి సంస్కృతవ్యాకరణప్రభావము' అను ప్రకరణములలోఁ జర్చించితిని. స్పష్టతకొఱకు ఇచ్చటను మఱల సంగ్రహముగాఁ దెలుపుచున్నాను. తెనుఁగునందలి ప్రాచీనదానశాసనములలో "విక్రమాదిత్య బెమ్మ్వణాధిరాజ ప్రథమ ప్రియపుత్త్రున్డు ఇచ్చిన క్షేత్రంబు, దేనికి సక్షి పులవుణ్డు"[23] ఇందు 'ఇచ్చిన క్షేత్రము' అని విధేయము చెప్పఁబడినదేగాని విశేష్యమయిన క్షేత్రముయొక్క రూపముగాని, హద్దులుగాని, చెప్పఁబడలేదు. ఈ శిలాశాసన మేక్షేత్రములో వేయింపఁబడినదో ఆ క్షేత్రము 'ఇది' అని భావము. అనఁగా విశేషణమునుమాత్రమే చెప్పి, విశేష్యమును అర్థరూపముగానే విడిచివేయుట. ఇది మిక్కిలి ప్రాథమికావస్థ. ఇప్పటికిని ఈ పద్ధతి వాడుకలో గలదు. 'ఇంత అన్నము' అని చెప్పి చేయిచూపుటవంటిదని తెలియవలెను. "వక్రబువచ్చువాన్డు వేకవిలశాను టిచ్చువన్డు"[24] "అడ్డమువచ్చువాఁడు వేయి కపిల

---

[23] నెం. 403. సం. 1904.

[24] పై శాసనము.

గోవులను చంపువాఁడు" అని భావము. ఇందు విధేయమయిన విశేషణమే కాలక్రమమున నేటి క్రియారూప మయినది. ఇట్టి క్రియాజన్యవిశేషణము సమాసమే గదా! ఇందు తొలిభాగము క్రియ, నడిమిని సంబంధబోధకప్రత్యయము, తుదిని వ్యక్తిబోధకమయిన సర్వనామము. కాఁబట్టి క్రియారూపము లన్నిటను (మీఁది I, II, III, IV, తెగలలో నిరూపించినవాని తుదిని) సర్వనామరూపములే తొలుత చేరి కాలక్రమమునఁ బరిణతములయి నేఁటి వైయాకరణోక్తములగు 'డుఙ్రుమ్వులు ముఙ్ఞులు' అయినవి. V, VI, రూపములలోఁ జెప్పఁబడిన భూతార్థద్యోతకములు ప్రాచీనతరములును, ఇతర ద్రావిడభాషారూపములతో నభిన్నములును, గొంత చరిత్ర మఱుఁగుపడినవియు నయియున్నవి. వాని చరిత్రము వేఱుగా నూహింపఁబడును.

తెనుఁగుసర్వనామములయంతములే క్రియావిభక్తులుగా నాహరింపఁబడిన వనుట సిద్ధాంతము. ఈ క్రమమే యితర ద్రావిడభాషలయందును గలదనియు, నిందలి క్రియావిభక్తులు వానిలోని క్రియావిభక్తులతో నభిన్నములనియు క్రిందిపట్టికవలన స్పష్టపడును. తెనుఁగుసర్వనామములు ఇతర ద్రావిడభాషల సర్వనామములతో నభిన్నములని సర్వనామప్రకరణమున స్పష్టపఱుపఁబడినది.

| | తెనుఁగు | | అరవము | | కన్నడము | |
|---|---|---|---|---|---|---|
| | సర్వనామము | క్రియావిభక్తి | సర్వనామము | క్రియావిభక్తి | సర్వనామము | క్రియావిభక్తి |
| ప్రథమ ఏకవ. | వాఁడు | డు | అవన్ | అన్, ఆన్ | అవను | అన్, అను |
| ,, బహు. | వారు | రు | అవర్ | అర్, ఆర్ | అవర్ | ఆర్, అరు |
| అమహత్తుఏక. | అది | ది, దు | అదు | అదు తు | అదు, ఉదు | ఉదు, త్తు, తు |
| ,, బహు. | అవి | వి, వు | అవై | అవ, అ | అవు, ఉ, వు | ఉవు |
| మధ్యమఏక. | నీవు | వి, వు | నీ | ఆయ్, ఐ, ఇ | నీన్ | అయ్, ఐ |
| ,, బహు. | మీరు, ఈరు | రి, రు | నీర్, నీయిర్ | ఇర్, ఈర్ | నీవు, నీమ్ | ఇర్, ఇరి |
| ఉత్తమఏక. | నేను, ఏను | ని, ను | ఆన్, నాన్ | ఎన్, ఏన్ | ఆం, ఆను | ఎన్, ఎను |
| ,, బహు. | ఏము నేము | మి, ము | ఆమ్, నామ్ | ఎమ్, ఏమ్ | ఆమ్, నామ్ | ఎమ్ |

పయిపట్టికను, ద్రావిడభాషలలోని క్రియావిభక్తు లన్నియును ఒక్కరీతినే స్వతంత్రముగ సార్వనామికపరిశిష్టములుగా నేర్పడినవనుట నిర్వివాదముగా నిరూపింపఁబడినది. న్, డు, అనునవి యభిన్నములని నామవిభక్తుల చరిత్రమును నిరూపించునపుడు నిరూపించితిని. ఇట్లు ద్రావిడ క్రియావిభక్తులు దేశ్యపదముల నుండి దేశ్యవిధానమున స్వతంత్రముగా నేర్పడినవని నిరూపించినతరువాత వీనికి సంస్కృత ప్రాకృతములయందలివియును, హిందీభాషయందలివియును నగు విభక్తులతో నేమయిన పోలికగలదా యని విమర్శింతును.

| | | సంస్కృతక్రియావిభక్తులు. | | | ప్రాకృతక్రియావిభక్తులు. | |
|---|---|---|---|---|---|---|
| | | ఏక | ద్వివ | బహ | ఏక | బహ |
| లట్ (వర్తమానము) | i. | మి | వః | మః | మి, మ్ ; | మో, మ, ము |
| | ii. | సి | థః | థ | సి, సే ; | ఇత్థా, హ |
| | iii. | | | అంతి | ఇ, ఏ ; | న్తి, న్తే, ఇరే |
| ఌట్ (భవిష్యత్) | i. | స్యామి | స్యావః | స్యామః | హోమి, స్సామి, హోమో, స్సామో<br>హిమి, హిస్సమ్, హిమో, మ, ము | |
| | ii. | స్యసి | స్యథః | స్యథ | హిసి, హిసే, హిస్సా, హిత్థా, హిహ | |
| | iii. | స్యతి | స్యతః | స్యంతి | హిఇ, హిఏ, హిన్తి, హిన్తే, హిరే | |

పయి ప్రత్యయముల మార్పునుబట్టి చూచినచో క్రమపరిణామమును, సంబంధమును స్పష్టముగా గోచరించుచున్నవి. పయి పరిణామము ధాతువులయందును గనుపట్టుచునేయుండును. భూ = హో, హువ, హవ, హు, అను రూపములను బొందినది. భవతి = హువఇ, హోఇ; భవామి = హోమి, హువమి, మొదలయిన రూపములను బొందినది ఏధతే = ఏహఏ, అత్తి = అదఇ, అదఏ; అస్తి = అత్థి, బ్రవీతి = బవఇ, బవఏ, బోఇ; దధాతి = ధాఅఇ.

పయి ప్రణాళికను జూచినచో సంస్కృతమునందలి సిద్ధములైన తిఙన్త రూపములు ఉచ్చారణమున రూపాంతరితములు కాఁగా నట్లపభ్రష్టమయిన రూపములను మఱల సంస్కరించి ప్రత్యయములను ప్రాకృతవైయాకరణులు ఏర్పఱచినట్లు స్పష్టము. సంస్కృత ప్రకృతి ప్రత్యయములకును, ప్రాకృతమునందలి ప్రకృతి ప్రత్యయములకును నియతమయిన సంబంధము స్పష్టముగాఁ గనుపట్టుచున్నది.

నేఁటి యుత్తరహిందూస్థానభాషలలో ముఖ్యమైన హిందీభాషయందలి రూపములను బరిశీలించినచో నందలి ధాతువులును, క్రియావిభక్తులును ఎట్లు సంస్కృత ప్రాకృతములతో సంబంధించినవియో స్పష్టపడక తప్పదు.

చల ధాతువునకు కదలు అర్థము.

| | | | | |
|---|---|---|---|---|
| వర్తమానము | ఉ | 1 | చల్‌తా హూఁ | చల్‌తే హైఁ |
| | మ | 2 | ,, హై | ,, హో |
| | ప్ర | 3 | ,, ,, | ,, హైఁ |
| భూతము | ఉ | 1 | చలాథా | చలేథే |
| | మ | 2 | ,, | ,, |
| | ప్ర | 3 | ,, | ,, |

పయి క్రియారూపములయందు హై, హూ, థా, థే, మొదలయినవి భూ, స్థా, ధాతువుల తిఙన్తరూపములు. ప్రాకృతరూపములుగా మాఱినవి. మఱియు

నపభ్రష్టములయి సహాయక్రియలుగాఁ జేరినవి. అట్లే గమ్ ధాతువుయొక్కయు, అస్ ధాతువుయొక్కయు రూపములును అనుబంధములుగాఁ జేరుచున్నవి. సంస్కృతమునందలి ధాతువులయిన క్రియాప్రకృతులును నత్యల్పమయిన భేదముతో హిందీభాషలో గనుపట్టుచుండును.

| సం. | హిందీ | సం. | హిందీ | సం. | హిందీ |
|---|---|---|---|---|---|
| అంగీకృ | అపర్ | ధావ్ | ధో (శుద్ధిచేయు) | నఖ్ | నఖ్ |
| ఆకృష్ | అకరఖ్ | పా | పీ | నద్ | నద్ |
| ఆకుల్ | ఆకులా | కథ్ | కహో | నమ్ | నమ్ |
| చల్ | చల్ | దృశ్ | డిఖ్ | నహ్ | నహ్ |
| పఠ్ | పఢ్ | బంధ్ | బఁధ్ | నింద్ | నీద్ |
| శ్రుణు | సున్ | ఛిద్ | ఛేద్ | | |
| సమర్థ్ | సమర్ఘ్ | కృ | కర్ | | |
| ఖాద్ | ఖా | దహ్ | దహ్ | | |
| దా | దే | దండ్ | దాడ్ | | |
| ధావ్ | ధా(పరుగెత్తు) | నంద్ | నంద్ | | |

పయి యుదాహరణముల నన్నిటిని పరిశీలించినచో ప్రకృతి ప్రత్యయములందు సంస్కృత ప్రాకృతములకును, హిందీ మొదలయిన యార్యభాషలకును, జన్య జనక భావసంబంధము గలదుగాని, తెలుఁగు మొదలయిన ద్రావిడభాషల కట్టి సంబంధము లేదనియు, నయ్యవి భిన్నకుటుంబమునకుఁ జేరినవనియు స్పష్టమగుచున్నది. క్రియా విభక్తులలో సంస్కృత ప్రాకృతములకును, తెనుఁగు మొదలగు ద్రావిడభాషలకును సంబంధము లేదని సిద్ధాంతము.

## 7. కాలవిభజనము - సంజ్ఞలు

పయి సిద్ధమయిన యాంధ్రభాషకు వ్యాకరణము వ్రాసిన చిన్నయ సూరి కాలాదిసంజ్ఞలకును ప్రక్రియకును పాణినీయపక్కినే వాడెను. అరవవైయా కరణు లట్లు వాడలేదు.

| తెనుఁగుసంజ్ఞ | | కన్నడము | అరవము |
|---|---|---|---|
| వర్తమానము | (లట్) | వర్తమానమ్ | నిగళ్ళ్కాలమ్ |
| భూతము | (లిట్) | భూతమ్ | ఇఱన్దకాలమ్ |
| భవిష్యత్తు | (లృట్) | భవిష్యత్ | ఎదిర్ కాలమ్ |
| | (లూట్) | విధ్యాది (ఆశీర్వాద) | వియంగోళ్ |
| వ్యతిరేకము | (లజి) | ప్రతిషేధక్రియె | ఎదిర్ మఱై |

| తెనుఁగుసంజ్ఞ | కన్నడము | అరవము |
|---|---|---|
| ప్రథమపురుషము | ప్రథమపురుష | పడర్ క్కై |
| మధ్యమ ,, | మధ్యమ ,, | మున్నిలై |
| ఉత్తమ ,, | ఉత్తమ ,, | తన్మై |
| విధి | విధి | ఏవల్ |
| భావము | భావమ్ | తొழிర్పెర్ |
| చేదర్థకము | పక్షార్థమ్ | వినై యెచ్చమ్ |
| క్త్వార్థకము | భూతకృదంతావ్యయ | ,, |
| శత్రర్థకము | వర్తమానకృదంతావ్యయ | ,, |
| సకర్మకము | సకర్మకమ్ | పిఱవినై |
| అకర్మకము | అకర్మకమ్ | తన్ వినై |
| కర్త | కర్త | ఎழువాయ్ |
| కర్మ | కర్మ | పయనిలై ముడిపు |
| క్రియ | అఖ్యాతమ్ | వినై, పయనిలై |
| ప్రేరణము | ప్రయోజకమ్, హేతువు | పిఱవినై |
| ధాతువు | ధాతువు | పగుది |
| ప్రత్యయము | ప్రత్యయమ్ | విగుది |
| ఏకవచనము | ఏకవచనమ్ | ఒరుమై |
| బహువచనము | బహువచనమ్ | పన్మై |

పయిపట్టికనుబట్టి కన్నడులును, తెనుఁగువారును సంస్కృ సంస్కృతభావములనే వాడినట్లు స్పష్టము. అరవవైయాకరణులు తమ ద్రావిడత్వమును, భాషాస్వాతంత్ర్యమును నిలువఁబెట్టికొనిరి. సూరిగారు పయి పదములనుమాత్రమేకాక పాణినీయమునందలి 'లట్', 'లిట్' మొదలయిన యాగమములను, ప్రత్యాహారమునుగూడ తమ వ్యాకరణమునఁ బ్రవేశపెట్టిరి.

## 8. వర్తమాన క్రియారూపములు

నేఁడు వర్తమానక్రియారూపములు తెనుఁగున రెండువిధములుగా నున్నవి. వండుచున్నాఁడు, వండుచున్నది, అనునట్టి రూపములు బాలవ్యాకరణమున సాధింపఁ బడినవి. వండుతున్నాఁడు, చేస్తున్నాఁడు, అనునవి వాడుకలోని రూపములు. వండుచున్, పోతూ, వస్తూ, తింటూ, మొదలయినవి శత్రర్థకరూపములు. వండు చున్నాఁడు అను రూపము వండుచున్నవాఁడు అను ప్రాచీనరూపమునుండి వకార లోపమువలనఁ గలిగినట్లు స్పష్టము. వండుచున్నవారు = వండుచున్నారు ; వండు

చున్నయది = వండుచున్నది.[25] నన్నయభారతమున పయిరూపములేకాని చేయుచున్నాడు వంటి రూపములు లేవు. చేయుచున్నవాఁడు అనునది విశేషణమాత్రమని నన్నయ భావించుటచేతనే చేయుచున్నవాఁడను, వారము, మొదలయిన రూపములను అను, అము లను చేర్చి వాడుచుండుట సంభవించినది. వండుచున్నాఁడు, వండుచున్నారు, వంటి రూపములు తరువాతికాలమున అనఁగా తిక్కనకాలమున పుస్తకములోని కెక్కినవి.[26] తొలుత ప్రథమపురుషరూపములలోని వకారలోపము గలిగి పయిరూపము లేర్పడఁగాఁ దరువాతికాలమున వాని సామ్యమున వండుచున్నావు. వండుచున్నాను వంటి మధ్యమోత్తమముల యేకవచనముల రూపము లేర్పడెననుట ఆ ప్రయోగముల క్రమమునుబట్టి నిర్ణయింపవచ్చును.

పయిరూపములలో చు వర్తమానార్థకమని వైయాకరణుల మతము. చేయుచు వంటి రూపములు వర్తమానార్థకములయిన అసమాపకక్రియలుగా నన్నయకాలమున నుండియు నున్నవియే.[27] వర్తమానార్థకము గ్రాంథికభాషయందు చువర్ణమనుట నిర్వివాదము. నేఁ డిది వాడుకలోఁ దొలఁగినదని చెప్పవచ్చును. సుమారు ముప్పదిసంవత్సరముల క్రింద ఉత్తరసర్కారులలో పెద్దవారందఱును వించూ, తించూ, అవుకుంచూ, అనియే వాడుచుండుటను నే నెఱుంగుదును. వాడుకలో నేఁడు వర్తమానార్థకము తువర్ణకమనుట నిస్సంశయము. చేస్తూ, పోతూ, ఎత్తుతూ, తింటూ మొదలయిన రూపములు అసమాపకములుగాను, వస్తున్నాను, ఎత్తుతున్నాను, తింటున్నాను వంటి రూపములు సమాపకరూపములుగాను వినఁబడుచున్నవి. తెచ్చుతారు, కొంటూ, అను పదములు కేతన గ్రామ్యములని యుదాహరించెను. దీనినిబట్టి తకారయుక్తరూపములు తిక్కనకాలముననే వాడుకలో నుండెనుగాని శిష్టు లంగీకరింపలేదన్నమాట. ఇందలి చు, తు వర్ణములు నేఁ డభిన్నార్థబోధకము లగుటఁజేసియు, చువర్ణము ప్రాచీనకాలముననే గ్రాంథికమగుటఁబట్టియు, చువర్ణము తువర్ణమయినదని యూహింపవచ్చును. (తింత్రిణీ = చింత) కాని యిది సత్యమనితోఁపదు. ఒకప్పుడు రెండును మాతాపుత్రికలయినచో తవర్ణమే ప్రాచీన మనవలెను. కన్నడమున నగుతుం (నగుచు = నవ్వుతూ), నూసుతుం (చూచుచు = చూస్తూ) అను రూపములు కలవు. ఇవి తెనుఁగులోని వ్యావహారికరూపములతో నభిన్నములు. అనఁగా తెనుఁగులోని వ్యావహారికరూపములును, కన్నడ గ్రాంథికరూపములును ఒక్క యాగమము

[25] "వార్తయందు జగము వర్తిల్లుచున్నది." సభా ప. 1 ఆ. 51 పద్యం. "పాంచాలపతికిఁ గృష్ణయనఁగఁ బంకజాక్షి యుద్భవిల్లె పెరుగుచున్నది తత్స్వయం, వరము చేయుచున్నవాఁడు వాఁడు" ఆది. ప. VII ఆ. పద్యం.

[26] 'ఉత్సహించుచున్నాఁడు' భా. ఉ. III, 389. 'ఏతెంచుచున్నాఁడు' అర. V, 'ఒనర్చుచున్నారు' భా. కర్ణ. I, 273. 'వచ్చుచున్నారు' భా. అశ్వ. IV, 47.

[27] 'అని యడుచుచున్నదానికి' ఆది. VII, ప. 47.

చేతనే యేర్పడినవనుట. గ్రాంథిక శత్రర్థక చువర్ణకము ప్రాచీన కు, గు వర్ణము లతో నభిన్నమని తోఁచుచున్నది. తాలవ్యీకరణమునుగుఱించి ముందు చెప్పితిని. అరవమున శత్రర్థక చువర్ణముతో సమానమయిన యోగమము లేదు.[28] అనఁగా సెయ్‌గు, సెయ్‌చు అనునట్టి రూపము నేఁడు లేదన్నమాట. సెయ్‌గిఱు, సెయ్‌గిన్ఱు అను రూపములు ఏన్ అను సార్వనామికరూపముతోఁ గలిపి వర్తమానసమాపక ములుగా వాడఁబడుచున్నవి. పయివానిని సెయ్‌గు + ఇఱు అని విభజింపవచ్చు ననియు, సెయ్‌గు = చేయుచు అనుదానితో సమానార్థకముగా నుండియుండవచ్చు ననియు ముందు తెల్పితిని. మూఁడుభాషలలోని వర్తమానరూపములును ఈ విధముగా విభజింపనగును.

తమిళము : చెయ్‌గిన్ఱేన్—చెయ్‌గు + ఇన్ఱ + ఏన్

కన్నడము : చెయ్‌దపేన్—చెయ్‌దు + అప్ప + ఏన్

తెనుఁగు : చేయుచున్నాను—చేయుచు + ఉన్న + ఆను.

పయి మూఁడుభాషలలోను ఇన్ఱ, అప్ప, ఉన్న, అనునవి సహాయక్రియ లయిన ఇఱు = ఇన్ఱు, అగు, ఉండు, అనువానియొక్క రూపములనుట స్పష్టము. పయి విభజనము ననుసరించి గు, చు, తు, అనునవి సమానార్థకములు. ఇవి మూఁడును భావార్థకప్రత్యయములే. కన్నడమునందలి ఉతు, ఉతె, అను భావార్థకములలోని తవర్ణమును, చెద్దపెం అను వర్తమానక్రియారూపము లోని దువర్ణమును, తెనుఁగునందలి వ్యావహారిక వర్తమాన తువర్ణకమును అభిన్నములు. ఇవి అదు = అది అనువానిలోని దు, ది వర్ణములతో నభిన్న ములు. తమిళమునందలి కిఱు, కిన్ఱు లలోని కువర్ణకమును, చేయుచు లోని చువర్ణకమును అభిన్నములు.

పయి మూఁడుభాషలును మూండలికముగా నున్నప్పుడు పయిరూపములు గలిసి వాడుకలోనుండి కాలక్రమమున భిన్నముగా భిన్నమండలములలో స్థిరపడినవని

---

[28]Tamil and Malayalam have, properly speaking, no present verbal participle, but only a partciple denoting present time, which is suffixed to the theme of the verb, and to which in Tamil the pronominal signs are there suffixed for the purpose of forming the present tense. The combination, however, of the root and the participle of present time forms virtually a present participle. I think it may therefore be assumed that the Tamil and Malayalam had a verbal participle of the present tense at a former period which has now become obsolete, except in combination with the personal teriminations when it constitutes the present tense of the verb.

C. G. D. page 489.

సెయ్ + కిఱు + ఏన్ = సెయ్‌కిఱేన్ ; సెయ్ + కిన్ఱు + ఏన్ = సెయ్‌కిన్ఱేన్.

నడ + వ్ + ఆ + నిన్ఱేన్ = నడవానిన్ఱేన్ (తమిళము)

యూహించుట సులభము. ద్రావిడక్రియలు సమస్తరూపములనియు, మొదటిభాగము భావార్థకమనియు ముందు చెప్పి

కు, టు, తు, రు, అనునవి ఏకవచనమునను, కుమ్, టుమ్, తుమ్, రుమ్, అనునవి బహువచనమునను ప్రాచీనకాలమునుండియుఁ దమిళమున సమాపకక్రియా రూపముల తుదిని ప్రథమోత్తమ పురుషములలో ప్రత్యయములుగా వాడంబడుచున్నవి.[29] ఇట్లే కన్నడమునను కుం, గుం, అనునవి యంతమందుఁగల రూపములు (మాడుగుం = చేయును; మాట్కుం = చేయును) లింగత్రయమునను, వచనద్వయమునను, కాలత్రయమునను వాడఁబడుచుండినట్లు నిర్వివాదముగాఁ దెలియుచున్నది.[30] ఇది మాడువుదు = చేయునది అనుదానివంటి భావార్థకరూపమని పయి ప్రయోగములనుబట్టి స్పష్టము.

## 9. భూతార్థకములు

తెనుఁగున రెండువిధములయిన రూపము లున్నట్లు ముందు నిరూపించితిని. చేయుచున్నవాఁడు అను (క్రియాజన్యవిశేషణ) రూపమునుండి వర్తమానరూపము గలిగినట్లే, చేసినవాఁడు అను భూతార్థక క్రియాజన్యవిశేషణమునుండి కలిగిన చేసినాఁడు చేసాడు అను రూపములవంటివి మొదటిజాతివి. ఇవి నవ్యములు. తెనుఁగుననే కలిగినవి. ప్రాచీనద్రావిడముననే పైరూపములు భూతార్థకమాత్రములుగా నుండినవి గావు. ఈ రూపములు ప్రాచీనపు తెనుఁగుశాసనములలోఁ గనుపట్టుచున్నవి. కాని యవి విశేషణమాత్రములు. అనఁగా కాలభేదమును నిరూపించునట్టివి కావని భావము. (స్థితి చెట్టిఇచ్చినవాణ్డు భారణసిప్రచినవాణ్డు) స్థితిచెటిచినవాఁడు వారణాసియందు వధచేసినవాఁడు. ఇందు చెటిచినవాఁడు అనునది భవిష్యదర్థకముగాని భూతార్థకము కాదు. భారతమునందు (నన్నయ వ్రాసిన భాగమున) చేసినవాఁడు వంటి రూపములు భూతార్థకములుగా వాడఁబడియున్నవి.[31] ఆ రూపములలోని వకారము లోపించి తిక్కన యెఱ్ఱనల భాగములలో చేసినాఁడు, తలఁచినాఁడు వంటి రూపములు క్రియలుగా వాడఁబడినవి.[32] ఇట్టి చేసినాఁడు వంటి రూపములు కాలక్రమమున చేసిండు అనునట్లు వాడుకలో

[29] P. S. S. page 159, 160.

[30] శబ్దమణిదర్పణము. సూత్రము 227.

[31] చేయుచున్నచోటనున్నవాఁడు మీ సుతుఁడు దర్పోన్నతుండు—భా. ఆ. VI. 214. నేలఁ గండ్లు లొత్త నిద్రవోయినయది. భా. ఆ. VI-179; వీరలు...సుతకున్... ఉద్భవించినవారు. భా. ఆ. IV. 236.

[32] పెచ్చువెఱిగినాఁడు. భా. ఉ. III, 234; పాశనిబద్ధుఁ జేసినాఁడ వి విప్రున్. భా. శాం. III. 519. మదిఁ దలఁచినాడుఁమీన్నృపుఁడు. భా. ఆ. V, ఇచటనైనది యేటిది యింత యేటికిన్ — భా. ఉ. III, 228.

మాఱుపడినని. ఇట్లే నచ్చినయది యను రూపము తిక్కనకాలమునకు వచ్చినది వంటి రూపము దాల్చి నేఁడు వ్యావహారికావస్థయందు వచ్చింది అను రూపముతో నిలిచినది.

పెట్టినవాఁడు, చేసినవాఁడు అను రూపములను చేసి+న్+అ+వాఁడు అని విభజింపవచ్చుననియు, నకార మాగమమాత్రమనియును ముందుఁ జెప్పితిని. సంధి నాపుటకు నకారమేకాక యకారముకూడ నాగమముగా రావచ్చును. కాఁబట్టి చేసియవాఁడు, కొట్టియవాఁడు వంటి రూపములు పూర్వకాలమున వాడుకలో నుండియుండవచ్చును. అట్టివానినుండి యేర్పడిన కొట్యాడు, చేస్యాఁడు, పెట్యాడు మొదలయిన వ్యావహారికరూపములు నిజాము రాష్ట్రమున వినవచ్చునని ఆంధ్రభాషా చరిత్రకారులు వ్రాసిరి.[33]

ఇఁక రెండవజాతిని చెప్పిన చేసితిని, చేసితిమి, చేసితి, చేసెను, చేసిరి అను రూపములవంటివి ప్రాచీనములు. అనఁగా చేసినవాఁడు వంటి రూపముల కంటె పూర్వములు. వీనియందు ఇవర్ణము భూతార్థమనియు, తివర్ణ మాగమ మనియు సూరిమతము.[34] ఇవి ప్రాచీనద్రావిడమునుండి తెనుఁగు వేఱుపడక ముందుండిన అరవ కన్నడములయందలి రూపములతో సమానమయినవి. ఈ రూపములు నన్నయభాగమునను, ప్రాచీన శాసనములయందును బహుళముగా నున్నవి. కన్నడమున దవర్ణమును, ఇవర్ణమును గూడ భూతార్థకములుగా వచ్చునని శబ్దమణిదర్పణమున నున్నది.[35] (పడెదం = పడసెను, గెల్దం = గెలిచెను, ఇడిదం=పట్టెను, కేళ్దం=అడిగెను). ఇకారము ఉకారాంతధాతువులపయి నిత్యముగా వచ్చును. తెనుఁగునందువలెనే కన్నడమునను ఎత్తి, నోడి, ఆడి, మొదలయిన క్త్వార్థకరూపముల తుదిని ఇకారమే కలుగుచున్నది. ఇంతియకాక క్త్వార్థకముగ దువర్ణముగూడఁ గొన్ని ధాతువులతుదిని వచ్చుచున్నది. (కుసిదునడెదం=వంగి నడచెను; నెనెదుపేటిం=ఆలోచించి చెప్పెను; నచ్చిబందం=నమ్మివచ్చెను; ఎత్తి నడెదం=ఎత్తినడచెను).[36] ఇట్లే అరవమునందును సెయ్‌దేన్=చేసితిని (సెయ్‌ద్+ఏన్), వందాన్=వచ్చినాఁడు (వందు+ఆన్). దువర్ణము భూతార్థముగా నున్నది. పాడినేన్=పాడి+న్+ఏన్ (అర). పాడి=పాడి (తెలుఁగు). (అర) పాడిన లేక పాడియ (తెలుఁగు పాడిన). పయిరూపములయందు దు, ఇ వర్ణములు రెండును భూతార్థకములే. అరవ కన్నడములయందువలెనే తెనుఁగునను చేసి, చూచి మొదలయిన క్త్వార్థకములయందును, చూచితిని ఇత్యాదిసమాపకములయందును

[33] ఆ. భా. చ. పు. 1277.
[34] బా. వ్యా. క్రి. సూ. 17, 18.
[35] శ. మ. ద. సూ. 220.
శ. మ. ద. సూ. 235.

ఇవర్ణము భూతార్థమే. ఇతి అనుదానిలోని తివర్ణము కన్నడమునను అరవమునను గల దువర్ణముతో నభిన్నము. ప్రాచీనకాలమున త, ద లు ఏక చిహ్నముననే వ్రాయుచుండెడివారనియును, అవి యభిన్నములనియును ముందు కన్నడమున ఉకారాంతధాతువుల తుదిని భూతార్థకముగా ఇవర్ణము వచ్చునను శబ్దమణిదర్పణమును ముం దుదాహరించితిని. తెనుఁగున ధాతువు లన్నియును ఉకారాంతములే కావున అన్నిటికిని తుదిని ఇకారమే భూతార్థకముగా వచ్చినదనుట సరిపడుచున్నది.

పై మూఁడుభాషలయొక్క ప్రణాళికనుబట్టి చూచినను ఇ, దు వర్ణకములు రెండును భావార్థకములే యనుట స్పష్టము. అదు, ఇదు, ఉదు అను నిర్దేశ సర్వనామాంతములతో భూతార్థక తి, దు వర్ణము లభిన్నములు. మాడితు (మాడిత్తు), సెయ్‌దు, అను రూపములు వరుసగా కన్నడమునను అరవమునను భూతార్థక సమాపకములుగను, భావార్థకములుగాను కూడ వాడఁబడుచునే యున్నవి.

ఇఁక ఇవర్ణముయొక్క చరిత్రముమాత్రము ఊహింపవలయును. 1. దువర్ణమే ప్రాచీనమయిన భూతార్థకప్రత్యయముగా నుండినచో నడుమ నజ్భక్తిగా నీ ఇకారము అర్వాచీనముగా వచ్చి స్వతంత్రముగా భూతార్థకమయినది. బాటిందు = బాళిదం (కన్నడము) పేళ్దం = పేళిదను = హేళిదను = చెప్పెను. 2. ఇది స్వతంత్రముగానే యేర్పడినదనుట. పయి రెండుపద్ధతులలోను పదిసత్య మనవచ్చును. రెండును సరియయినవే యని సమాధానము. ప్రాచీనకాలమున ధాతుమాత్రములే సమాపకక్రియలుగాను, భావార్థకములుగాను వాడఁబడుచుండినవి. ఉకారాంత ధాతువుల తుదినున్న ఉకారము ఇ, ఉ లకు నడిమి యుచ్చారణతో నుండి భూతార్థకముగా ఇకారరూపముగా స్థిరపడినదనుట స్పష్టము. దువర్ణమునకుఁ బూర్వము కొన్ని క్రియారూపములలో ఇవర్ణము ఆగమమాత్రముగాఁగూడ నేర్పడియుండె ననుటలో విప్రతిపత్తిలేదు.[37]

తెనుఁగు భూతార్థకములు కర్ణాట తమిళాది ద్రావిడరూపములతో నభిన్నములు అనుట సిద్ధాంతము. "చేసినాఁడు, వచ్చినాఁడు, మొదలయిన రూపములు అద్యతనభూతంబులును, చేసితిని మొదలయినవి భూతసామాన్యంబులుగాని, అనద్యతనంబులుగాని" యని కొన్ని నవ్యవ్యాకరణములలో గలదు. ఇది కేవలము సంస్కృతానుకరణము. అద్యతనము, అనద్యతనము అను భూతక్రియారూపంబుల యందలి యర్థభేదమును బాటించుట వైదికకాలమున నుండినదిగాని తరువాతికాలమున సంస్కృతముననే నశించినది యనుట యీ భాష నెఱింగినవారికెల్లను తెలమే. తెనుఁగున నట్టి భేద మేనాఁడును లేనిది. గ్రాంథికప్రయోగంబుల నిట్టి భేదము లేదు. వాడుకలో వినఁబడదు. కొన్ని యెడల నుండినట్లు గనిపించుట యాదృచ్ఛికము.

[37] ద్రావిడాగమో బహుళం, క. భా. చూ. 220.

రూపవిహీనులు వారు రూపుగలిగి తొలుమేనఁగొనటులఁ బలికినారు - అను V 93
తొంటిభవమునఁ గలిగినారు ,, ,, 97
మున్న యన్న కాననమున కరిగినాఁడు మౌ I 69
ఏ యే దేశములన్ వసించితిరి, మీ రే యే గిరుల్ సూచినారు — మనుచరిత్రము.

పయియుదాహరణములలో సూచినారు మొదలయినవి అనద్యతనార్థ మునను, ఇతర భూతార్థకరూపములతో సమానముగను, నుపయోగింపఁబడుచున్నట్లు స్పష్టమేగదా.

## 10. భవిష్యదర్థకములు

చిన్నయ ల్ట్టు పరంబగునపుడు కలజ్యనుబంధ మగునని సూత్రించి, చేయఁగలఁడు మొదలగు రూపములను భవిష్యదర్థంబులుగా వివరించెను. ఆంధ్ర శబ్దచింతామణియును భవిష్యదర్థమున 'కల' యనుబంధముగా విధించెను.[38] ప్రాచీనగ్రంథములయందును భవిష్యదర్థమున 'కల' యనుబంధముగాఁ బ్రయోగింపఁబడుచుండెను.[39] శాసనములందును గలదు.[40] 'కల' యనుబంధముగాఁ గల ప్రయోగములను భవిష్యదర్థములుగా గ్రహించు సంప్రదాయము నన్నయనుండి చిన్నయవఱకును గలదు. కలఁడు, కలను, కలవు మొదలయిన రూపములు కలుగు ధాతువునుండి కలిగినవి. ఇవి స్వతంత్రక్రియలు. కాలక్రమమున అనుబంధము లయినవి. కలవాఁడు, కలాఁడు, కలఁడు, కలాను, కలను మొదలగురూపములు ప్రయోగింపఁబడుచుండుటనుబట్టి యీరూపముల పరిణామక్రమ మును స్పష్టము. భూత వర్తమానార్థకములవలెనే యిందును క్రియాజన్యవిశేషణమే సమాపకక్రియగాఁ బరిణతమయినది యనుట నిర్వివాదము. 'కల' యనుబంధము విధ్యర్థకముగాను, సమర్థత, ఉద్దేశము, అర్హత మొదలయిన యర్థముల లోను ప్రయోగింపఁబడుచున్నది. ఈ యర్థములును, 'కలావు' మొదలగు ప్రయోగ ములును సూర్యరాయాంధ్రనిఘంటువునందు సప్రమాణముగా నిరూపింపఁబడినవి. చేయను, వినను మొదలగు అన్నంతక్రియలపై కలఁడు మొదలగు రూపములు

---

[38] అస్తి రనుబంధక స్స్యాద్యత్ర ల్ప్రడర్థో వివక్షితో ధాతోః.

[39] దేవకీదేవి కయ్యెడు నెనిమిదవచూలు నీకు మృత్యువు గాఁగలయది నిశ్చయంబు- హరి. పూ. V. 84 ; చెడిపోవం గలవారు. - రం. - రా. అర. 183. పు. 13. భస్మముగాఁగలారు - భా. రా. బాల. 412; ఉండగలాఁడ - భార. ఆశ్వ. IV 192; వర్ణసంకరము సేయఁగలరు, కలియుగమున. విడువఁగలరు; కాఁగలరు. - అర. IV 288-89; పోఁడిగా నీకు నీగలవాడనేను- భార. సభా. II. 174; నృత్యగురుప ననఁగలవాఁడన్ - భార. విరా. I. 90

[40] బోయంగలవణ్డు, సరియింప్పంగలవారు- ద. హి. శా. V. నెం. 1006. సం. 1080 క్రీ.
త్రిభువనాంకుశమున బోయంగలనే. 1010. సం. 1055 ,,
సత్రమున గుడ్డంగల బ్రాహ్మలకు, నడవంగలవారు. 1015. సం. 1084 ,,

అనుబంధములుగాఁ బ్రయోగింపఁబడుచున్నవి. అగును, కలఁడు మొదలగు అనుబంధ క్రియలు నన్నయచేఁ బ్రధానధాతురూపమునకు వ్యవహితములుగాఁ బ్రయోగింపఁబడుచు వచ్చెను. వ్యవహితములుగా నుండుటనుబట్టి వానిని నన్నయ అనుబంధ మాత్రములుగా గ్రహింపలేదనుట స్పష్టము.[41] అనఁగా నన్నయకాలమునఁ గ్రింది సహాయక్రియలు అర్థవిశేషములయందు రూఢము లగుచుండినవి. అట్లే నన్నయ భారతమున కరుణగలవు = కలవాఁడవు, ఎఱుకగలరె = కలవారె అను నర్థమునఁ జాలవఱకు స్వతంత్రక్రియలైన కలవు, కలరు, మొదలయినవి మొదట అన్నంత క్రియలపైని వ్యవహితములుగాఁ బ్రయోగింపఁబడుచుఁ దరువాత నవ్యవహితములు గానే ప్రయోగింపఁబడుచు వచ్చెను. ఈ 'కల' యనుబంధము నన్నయకాలము నందలి శాసనములయందుఁ గలదని నిరూపించితి.

ఈ భవిష్యదర్థకము తెనుఁగున స్వతంత్రముగాఁ గలిగినదనుట నిర్వివాదము.

## 11. తద్ధర్మార్థకములు

ఇతర వైయాకరణులు అనఁగా అరవ కన్నడములలోనివారు వాడని తద్ధర్మార్థకము లను నొకవిభాగమును తెనుఁగువైయాకరణులు కల్పించిరి.[42] భూత భవిష్యద్వర్తమానము లనునట్టి కాలత్రయవిభాగమునుమాత్ర మనుసరించి యూరకుండక యీ రీతి నొక క్రొత్తవిభాగమును గల్పింపవలసిన యవసరమేమి యనియు, ఇట్టి సంజ్ఞ యెందుండి వచ్చినదనియు, ఈ తద్ధర్మార్థకసంజ్ఞను వైయాకరణు లెట్లు విభజించి లక్ష్య లక్షణ సమన్వయము చేసిరనియును క్రింద వివరింపఁబడును. ఆ తరువాత దీని ప్రాచీనచరిత్రయు, ఇతర ద్రావిడభాషలతోఁగల సంబంధమును వివరింపఁబడును.

---

[41] అగునె ధర్మక్రియాలోపంబు సహింప- — భార. ఆది. II. 159
క్రోధిగాఁ దపస్వికిఁ జన్నె- — ,, ,, ,, 174
వెలువడఁ గోమలిం దిగిచె- — ,, ,, III. 144
ఉత్తమావమానము తగునయ్య చేయనని- — ,, ,, ,, 217
చనుఁ బనిఁ బంపఁగ నిన్ను- — ,, ,, IV. 242
వలుకక యుండను వలయు- — ,, ,, ,, 150
(తిక్కన) ధర్మజుండు గలఁడు తగవు నడవ- — ,, ఉ. I. 264
ఒరులు గలరె కర్ణు నోర్వ- — ,, ఆది. III. 203

[42] తద్ధర్మవర్తమానాతీతా గామ్యర్థకాః క్రియాః జ్ఞేయాః ఆ. శ. చిం. క్రి. ప్ర. 9 సూ. "తద్ధర్మమనఁగా భూతభవిష్యద్వర్తమానములకంటె విలక్షణమైన యొకానొక ధర్మము, అధాతువుయొక్క ధర్మమేయది యగుటచేతఁ దద్ధర్మసంజ్ఞ యన్వర్థము" బాలసర. "భూతాద్యర్థత్రయ విలక్షణః కశ్చిదర్థ స్తద్ధర్మాఖ్య ఇత్యాచార్యైః వ్యవహ్రియతే ; తత్రాచార్యైః కాల మవివక్షిత్వైవ ధాత్వర్థమాత్రే వివక్షా క్రియతే, అతఏవ తద్ధర్మ ఇత్యన్వర్థసంజ్ఞా, తస్యధాతోర్ధర్మః వాచ్యార్థమాత్ర మితి" అహోబలపండితీయము.

తద్ధర్మము, వర్తమానము, అతీతము, ఆగామి యను నర్థములు గలవిగా క్రియలు నాలుగువిధములని చింతామణి విభజనను. నన్నయనుండి చిన్నయవఱకును గల వైయాకరణసంప్రదాయముచొప్పున భూతభవిష్యద్వర్తమానంబు లనంబడిన క్రియారూపముల చరిత్రమును ముందే నిరూపించితిని.

మిగిలిన రూపము లీ క్రిందిరీతి నున్నవి.

| | |
|---|---|
| వండును, వండుదురు | వండెడున్, వండెదరు |
| వండును, వండును | వండెడిన్, వండెడిన్ |
| వండుదువు, వండుదురు | వండెడున్ |
| వండుదును, వండుదుము | వండెదవు, వండెదరు |
| | వండెదను, వండెదము. |

పయి రెండుపట్టికలలోని రూపములయందును ను, వు, రు, ము అనునవియే యితరములయిన రూపములందువలెనే ప్రత్యయములు. మధ్యమోత్తమపురుషల లోను, ప్రథమా బహువచనమునను, ఒకచో దు ఆగమము. రెండవదానిలో ఎద ఆగమము. ప్రథమైకవచనమునమాత్రము ఒక్కెడ వండును అను రూపమును రెండవయెడ ఎడు, ఎడి అనునవి అంతమునఁ గలవియు రూపములు.

పయిరూపములు భారతాదిగ్రంథములలో అనేకములయిన యర్థములలో వాడఁబడినవి. ఆ యర్థములను సూరి తద్ధర్మాదులు అని పేర్కొని "తచ్ఛీల సంభావనా సంప్రశ్న సాతత్య వర్తమాన భావ్యాశీరాదులాది పదగ్రాహ్యంబులు" అని నిరూపించెను. సూరిగారి వివరణము తుట్టతుదివివరణము. ఈ పదమును గల్పించినవాఁడు చింతామణికర్త. అతని మతంబునను, కారికాకారుని మతము నను బయిపదమునకు వాచ్యములయిన క్రియారూపముల విషయమున భేదము కలదని అహోబలపతి వ్రాసెను. ఈ తద్ధర్మపదము సంస్కృతమునందలిది. కృదంతముల యందలి కొన్నిప్రత్యయములు తచ్ఛీల తద్ధర్మ తత్సాధుకారులు (కర్తలు) అను నర్థ మును బోధించునను సందర్భమున పాణినీయమున నిరూపింపఁబడెను.[48]

కటాన్ కర్తా, అలంకరిష్ణుః, ప్రమాదీ, పఠితా, మొదలయిన పదములలో తుదినున్న ప్రత్యయములు తద్ధర్మాదిబోధకము లయినవి. చాపలు అల్లువాఁడు, ప్రమాదశీలుఁడు, పఠనము బాగుగా చేయువాఁడు, బాగుగా అలంకరించుకొను శీలము కలవాఁడు, అని పయిపదములకు అర్థము. పయివానిలోని తద్ధర్మము అను నర్థమువంటి యర్థము వండును మొదలగు క్రియలచేత చెప్పఁబడుననియు, ఇతర రూపములవలె కాలవివక్ష వీనియందు ప్రధానముగాదనియు, అవి తద్ధర్మ తచ్ఛీలాద్యర్థ ములయందు ప్రయోగింపఁబడుచుండినవిగావున వానిని వేఱుజాతిగా వివరింపవలె ననియును, చింతామణికర్త యభిప్రాయ మయియుండును. కావుననే తద్ధర్మ మను

[48] ఆక్వేస్తచ్ఛీల తద్ధర్మ తత్సాధుకారిషు, 3-1-134.

విభాగము నంగీకరించెనని తోఁచుచున్నది. కాని పయి క్రియల యర్థమును నిరూపించుటలోను, తద్వాచకమయిన తద్ధర్మశబ్దనిర్వచనమునను వైయాకరణులలో ననేకవిధములు తబ్బిబ్బు లేర్పడినవి. "తద్ధర్మ మనఁగా భూతభవిష్యద్వర్తమాన ములకంటె విలక్షణమయిన యొకానొక ధర్మము. ఆ ధాతువుయొక్క యర్థమే యది యగుటచేతఁ దద్ధర్మసంజ్ఞ యన్వర్థకము" అని బాలసరస్వతి వివరణము. పుట 255.

ఈ పద్ధతినే అహోబలపతియు నంగీకరించి వివరించెను.[44] 'తస్యధాతోర్ధర్మః' అని తద్ధర్మశబ్దనిర్వచన మతని మతము. ధాతువుయొక్క ధర్మము, అనఁగా కాల వివక్షలేని ధాత్వర్థమని యూహ. సంస్కృత కృదంతప్రకరణములోని సంజ్ఞ కర్థము వేరు. "సః ధర్మః యస్య సః; తద్ధర్మా కర్తా" యని వివరణము. సః అనఁగా ధాత్వర్థము. వండుట మొదలయిన కార్యము ఎవ్వనికి ధర్మమో వాఁడు అర్థము కలది, సంస్కృతకృత్ప్రత్యయము. అనఁగా పక్తా, పాచకః, అను పదముల యందలి ప్రత్యయములు వండుట ధర్మముగాఁగల కర్తలను జెప్పుచున్నవి. తెనుఁగు నను వండును, వండుదురు మొదలయిన క్రియారూపములు కర్తను తద్ధర్మవిశి ష్టునిగానే చెప్పుచున్నవి. కావున సంస్కృతమునందువలె సః యను పదమునకు ధాత్వర్థము అని యర్థముచెప్పినను బాధలేదు అనవచ్చును. కాని ఈ మతమున కర్తకుఁ బ్రాధాన్యముగావునను, క్రియారూపములయిన వండును మొదలయిన వానికి వండుట ధర్మముగాఁ గలవాఁడు అను ప్రథమాంతవిశేషణరూపమగు నర్థమును ఆశ్రయించుట యీ పక్షమున[45] తప్పదని యూహించుటవలనను గాబోలు తెనుఁగువైయాకరణులు 'తస్యధాతోర్ధర్మః తద్ధర్మః' యని వివరించిరి. సంస్కృ తమునందలి సంజ్ఞనుమాత్రమే గ్రహించిరిగాని అర్థవివరణమునుమాత్రము భిన్నముగాఁ జేసికొనిరి. సంస్కృతవ్యాకరణవివరణమున తచ్ఛబ్దము ధాత్వర్థము నుద్దేశించినది.[46] తెనుఁగునందు తచ్ఛబ్దము ధాతువునే నిరూపించుచున్నది. సంస్కృతమున నియ్యది బహువ్రీహి. తెనుఁగున నియ్యది షష్ఠీతత్పురుషము.

---

[44]అహోబలపతి పు. 429.

[45]ప్రథమాంత ముఖ్యవిశేష్యశాబ్దబోధ తార్కికమతము, దేవదత్తః పచతి అనఁగా దేవదత్తుఁడు పాకానుకూలవ్యాపారము గలవాఁడు అని యర్థము. ఈ మతమున వాక్య విశ్రాంతి కర్తయందే. వైయాకరణమతమున ధాత్వర్థముఖ్యశాబ్దబోధ యంగీకృతము. అనఁగా ధాత్వర్థమయిన వ్యాపారమే ముఖ్యవిశేష్యము. దానికే వాక్యమున విశ్రాంతి. దేవదత్తకర్తృకమగు పాకానుకూలమయిన వ్యాపారము వాక్యార్థము. కావున పయిరీతి నర్థముచేయుట వైయాకరణమతమునకు విరుద్ధమనిభావము.

[46]తద్ధర్మా - స్వధర్మోయమితి ప్రవర్తతే, తత్క్రియాచారకర్తా। అత్రైతత్ క్రియా చరణమ్ మమ ధర్మ ఇతి జ్ఞానమ్ ప్రయోజనమ్॥ తచ్ఛబ్దో ధాత్వర్థస్య పరామర్శకః॥ లఘు. శ. శేఖరము.

పయిభేదమును గుర్తించుటచేతనేగాబోలు ప్రాచీనమయిన అహోబలపతి, బాల సరస్వతుల వివరణము నాదరింపక బాలవ్యాకరణగుప్తార్థప్రకాశికాకారుఁడు ఆ పదము నిట్లు వివరించెను. 'సః ధర్మః యస్య సః తద్ధర్మః' అది (ఒకానొకటి) ధర్మం బేవస్తువునకో యట్టి వస్తువు మొదలయినవానియందలి క్రియను దెలియఁ జేయునట్టి ధాతువునకు లాట్ప్రత్యయంబగు.[47] ఈ వివరణమున సః అనఁగా ధాత్వర్థమే యుద్దిష్టము గావలెను. తిఙంతరూపమయిన వండెదను అను తద్ధర్మార్థకము, ధాత్వర్థము అర్థముగాఁగలది యను ప్రాచీనవివరణముచేత వండుట యను భావార్థకతుల్యమే కావలసివచ్చునుగదా! ఇది ప్రయోగవిరుద్ధము అని యాక్షేపించుట యుక్తముగాదు. కాలవివక్షలేని ధాత్వర్థము ప్రధానముగాఁగలది యని భావముగాని, ధాత్వర్థమాత్రము అని భావము కాదు. ప్రపంచమున గుణాది ప్రాధాన్యమున సంజ్ఞ లేర్పడుచున్నవి. అంతమాత్రమున నితరగుణములను తత్తదర్థములందు వారించుటకు వీలులేదు. ధనవంతుఁడు అనువానియందు ధనము ప్రధానముగా నుండునని యర్థముగాని, వానియం దితరగుణయుక్తత ధనవన్మాత్ర వ్యవహారముచే వారింపఁబడదు. అట్లే యిచ్చటను తద్ధర్మార్థకమందు ధాత్వర్థ ప్రాధాన్యమాత్రము సూచితమగును. ధాత్వర్థమాత్రత్వముగాదని యెఱుంగునది.

ప్రాచీనుల సంజ్ఞావివరణమున కింకొక సౌలభ్యమును గలదు. తద్ధర్మార్థకము అనుచోట బహువ్రీహి గర్భ బహువ్రీహిని జెప్పి సమన్వయింపఁ దలఁచుకొంటిమి గాని వర్తమానార్థము అనుచోట వర్తమానము అను పదమునకుమాత్రము బహువ్రీహి చెప్ప వీలులేదుగదా! వర్తమానమయిన క్రియ అర్థముగాఁగల రూపము వర్తమానార్థకము. అట్లే తద్ధర్మము అనఁగా ధాత్వర్థమాత్రము (ప్రధానమయిన) అర్థముగాగల క్రియ తద్ధర్మము. వర్తమానత్వ, ధాత్వర్థత్వమాత్ర బోధకములు రెండును గావు. రెంటియందును కర్త్రాదిబోధకతయు గలదు. ఇట్లే భూతార్థక, భవిష్యదర్థక శబ్దములును ఒక్కరీతినే సమన్వయపడునుగాన ప్రాచీనుల సంజ్ఞావివరణము యుక్తమును, ఇతర సదృశసంజ్ఞల వివరణముతో సమమును నయినదనుట సిద్ధము.

తద్ధర్మార్థకరూపము లేవి యను విషయమున వైయాకరణులలోఁ గొన్ని భేదము లేర్పడినవి. "చింతామణికర్త మతమునను, కారికాకారుని మతమునను తద్ధర్మము భూతభవిష్యద్వర్తమాన రూపములకంటె భిన్నమైన యర్థముగలదియే యనుట స్పష్టము. అయినను వారి రెండు మతములకును భేదము గలదు. ప్రథమోత్తమైకవచనములయిన నాంతపదములకే తద్ధర్మసంజ్ఞ యని ద్వితీయాచార్యుని మతమున నంగీకరింపఁబడినది. చేసెదన్, ఘటించెదన్ మొదలయినవానియందు ఆతని మతమున తద్ధర్మసంజ్ఞ లేదు. భావిక్రియావ్యవహారమే. ఘటింతురు మొదలయినవానియందును నాంతత్వము లేకపోవుటచేత తద్ధర్మసంజ్ఞ రెండవ యాచా

[47] బాలవ్యాకరణ గు. ప్ర. పుట 309.

ర్యనిమతమున లేదు. వాగనుశాసన మతమునందు వీనికి తద్ధర్మార్థకత్వమే.''[48] ఇట్టి యభిప్రాయమును అహోబలపండితుఁడు వ్యక్తీకరించెను.

కేతనయుఁ[49] బెద్దనయుఁ[50] దమగ్రంథములలోఁ దద్ధర్మార్థకములను బేర్కొనలేదు. అడిగెడున్, అడిగెదరు మొదలయిన రూపములు వర్తమానార్థకములనియు, పలుకును, పలుకుదురు మొదలయిన రూపములు భవిష్యదర్థకములనియుఁ దెల్పిరి. డు, డి వర్ణము లంతమందు[51] గలవి తద్ధర్మప్రథమపురుషైకవచనంబులని కారికలు చెప్పుచున్నవి. బాలవ్యాకరణమునందు పయి రెండువిధములయిన క్రియలును తద్ధర్మాద్యర్థకములనియును, తచ్ఛీల సంభావనా సంప్రశ్న సాతత్య వర్తమాన భావ్యాశీరాదులాది పదగ్రాహ్యంబులు అనియును సూరి వివరించెను.[52] నవ్యులలో నొకరు దును, దురు మొదలయినవి యంతమందుగల రూపములు తద్ధర్మాద్యర్థకములనియు, ఎదను, ఎదవు, ఎడిన్, ఎడున్ అనునవి అంతమందుగలవి తద్ధర్మార్థకములనియు వివరించిరి. ఆద్యర్థకము లనుటవలన సూరిగారి వివరణమే యుచటను శరణము. ఇట్లు తద్ధర్మార్థకములనియుఁ, దద్ధర్మాద్యర్థకములనియు రెండు విధములుగా విభజించుటకుఁ బ్రమాణమేమియో తెలియదు. వృద్ధసమ్మతి కాదు. ప్రయోగానుసరణమని నిరూపింపలేదు. సూరిగారు తద్ధర్మాద్యర్థకములను బరిగణించుచు వర్తమాన భావ్యర్థకత్వములు రెండిటినే గ్రహించిరిగాని అహోబలపత్యాదులవలె భూతార్థకత్వమును గ్రహింపలేదు. కాని వచ్యర్థంబుల కొక్కానొకచో భూతంబున లాట్టు గానంబడియెడి అనిచెప్పి - అను, పలుకు, వాక్రుచ్చు, చెప్పు మొదలయినవానికి భూతార్థకత్వంబునఁగూడఁ బ్రయోగములనుబట్టి లాట్టును విధించిరి.

'భవిష్యత్తద్ధర్మకాలములు' అను శీర్షికక్రింద ఆ. భా. చరిత్రకారులు రీతిని వ్రాసిరి.[53] "భవిష్యత్తద్ధర్మకాలములకు వేర్వేఱుగా నియతములయిన

---

[48] అహో : "ద్వితీయాచార్యేణాపి తద్ధర్మార్థస్య భూతాద్యవిషయత్వమేవోక్తం-మతద్వయం భేదః, ప్రథమోత్తమైకవచనాంతయోర్నాంతయోః పదయోరేవ తద్ధర్మసంజ్ఞికత్వముక్తమ్, తేన తత్ర ఉపచారార్థగతా సంజ్ఞా శబ్దగతత్వేన కృతేత్యవగంతవ్యమ్, చేసెదన్, ఘటించెదన్ ఇత్యాదౌ తన్మతేన తద్ధర్మసంజ్ఞా, కింతు భావిక్రియావ్యవహార ఏవ, ఘటింతురిత్యాదావపి నాంతత్వాభావాన్న తద్ధర్మసంజ్ఞా, వాగనుశాసనమతేత్వేషాం తద్ధర్మార్థకత్వమేవేతి, (పు. 429)

క్రియాత్రయాగోచరార్థ స్తద్ధర్మ ఇతి కథ్యతే । ధాతోర్ధర్మ ఇతిప్రోక్తో వికృతౌ పూర్వసూరిభిః॥ ఇది బాలసరస్వతీయములో గలదని చర్ల నారాయణశాస్త్రిగారిచే నుదాహరింపఁబడినది. నన్నయాథర్వణకారికావళి (పుట. 23)

ఇట్లు అహోబలపతి చెప్పుటకు మూలము "భూతాద్యవిషయా తత్రచైకత్వార్థాభిధాయకౌ ఉదంతౌ చ సదా నాంతౌ న సంధి స్తత్ర కల్ప్యతే" అనియెడి కారికలని తోఁచుచున్నది. వీనిని అట్లుగాక వేఱువిధమున సమన్వయింపనగునా యను విచారణ మిట ప్రస్తుతముగాదు.

ప్రత్యయము లున్నట్లగపడదు. చేసెదను, చేసెదము, చేయుదును, చేయుదుము, చేయంగలను, చేయంగలము, చేసెదవు, చేసెదరు, చేయుదువు, చేయుదురు, చేయంగలవు, చేయును, చేయంగలరు మొదలయిన వివిధరూపములలో నొక్కొక్కటి ప్రత్యేకముగా భవిష్యత్కాలమునకుఁగాని, ప్రత్యేకముగా తద్ధర్మ కాలమునకుఁగాని చెందినవిగావు. అవి యీ రెండిటిలో నేకాలమునయిన బోధించును.''

ప్రాచీన ప్రయోగములను జూడఁగా, "చేరుదును మొదలయిన దుగాగమ క్రియలు భూతార్థమందు మిక్కిలి తక్కువగాను, వర్తమాన భవిష్యదర్థములందుఁ దఱచుగాను గనవచ్చును. చేరెదను మొదలయిన ఎదగాగమ క్రియలు వర్తమాన భవిష్యదర్థములందు తక్కువగాను, వర్తమానసామీప్యములందు ఎక్కువగాను కనంబడును'' అని మఱియొకరు నవ్యులు వ్రాసిరి.

ఈ తద్ధర్మాద్యర్థక వివరణవిషయమున నేల యిన్ని భిన్నమార్గములు కలిగినవి యను ప్రశ్నమునకు సమాధానము చెప్పవలయును. అట్లు చెప్పుటకుముందు సూరిగారు ఆద్యర్థకములుగా నిచ్చిన యుదాహరణములు ఎంతవఱకు సరిపడునో విచారింతము. తద్ధర్మ తచ్ఛీలములు – ఇవి రెండును త్రైకాలికములు. స్వభావ మాత్రబోధకములు. సాతత్యమును త్రైకాలికమే. వర్తమానమును, భావియుఁ, గొన్నియెడల నుదాహరింపఁబడిన భూతార్థకతయుఁగూడఁ త్రైకాలికాంతర్భూతమే. ఇఁక సంప్రశ్నము. ఇందు తుదినున్న 'ఆ' యనునది (ఉందునా, పోదునా) ప్రశ్నార్థకముగాని, ఉందును అను క్రియారూపముగాదు. ఉండెనా, పోయెనా యని ప్రశ్నించినను సంప్రశ్నమేకదా! కాఁబట్టి తద్ధర్మాద్యర్థములలో సంప్రశ్నమును

---

49 వర్తమానార్థములఁ

క. అడిగెదు నడిగెదరనఁగా నడిగె దడిగెదవు ధనంబు నడిగెదరనఁగా
నడిగెద నడిగెదమనఁ బొల్పడరంగా వరుసతో నుదాహరణంబుల్. 143

భవిష్యదర్థ సంసూచకముల్

క. పలుకును బలుకుదురనఁగాఁ బలుకుదువు పలుకుదురనంగ బలుకుదు నర్థిన్
బలుకుదుమనఁగా నిన్నియు నలఘుమతీ వరుసతో నుదాహరణంబుల్. 144

50 అరిగెడి నరిగెదరనఁగా – నరిగెద నరిగెదరనంగ నధిపతిపురికై
యరిగెద నరిగెదమనగాఁ – బరువడి నిది వర్తమాన ఫణితార్థమగున్.

చేయుం జేయుదురనఁగా – జేయుదు చేయుదురు మీరు చిత్తంబలరం
జేయుదుఁ జేయుదుమనఁగా – నాయతముగ నివి భవిష్యదర్థముఁ జెప్పుఁ.
9 ఉల్లాసము 151, 155 ప.

51 తద్ధర్మప్రథమేస్యాతాం దుడివర్ణేచ నాంతకౌ. అ. కా. క్రి. 9 సూ.

52 బా. వ్యా. క్రి. సూ. 5, 22–25.

53 ఆ. భా. చ. పుట 1490.

జేర్చుటలోని యుద్దేశము దురవగాహము. మూఁడుకాలముల యర్థమును బోధించుటకు తద్ధర్మార్థకము లుపయోగించుననుటవలన సర్వమును గతార్థమగు చున్నది. ఇక ధాత్వర్థముమాత్రమే తద్ధర్మార్థమనియు, తద్ధర్మ తచ్ఛీలార్థము లన్నియు ఆ రూపములకుఁ గలవనియుఁ జేసిన విభజనము సంస్కృతవ్యాకరణజ్ఞానము యొక్క ప్రభావమువలనఁ గలిగినది కాని వేఱుకాదు.

ఇఁక నీ తద్ధర్మాదుల చరిత్ర మేమి యని వివరింపవలెను. పైవిచారణమును బట్టి నిశ్చితమయిన దేమనఁగా తెనుఁగునఁ గొన్ని క్రియారూపము లుండినవి. అవి మూఁడుకాలములను బోధించుటకును వాడుచునేయుండిరి. ఉద్దేశింపఁబడిన కాలమును సందర్భమునుబట్టియే తెలిసికొనవలసినది. వేర్వేఱు కాలములను సూచించు నట్టి యాగమవిశేషములుగాని, కాలవిభజనముగాని యేర్పడలేదని యర్థము. ఆ రూపములనే కవులప్రయోగముల ననుసరించి సంస్కృతమునఁ బరిచితమయిన మూఁడుకాలము లనియెడు పద్ధతిని గలిగిన విభజనముచొప్పున వైయాకరణులు విభజించుటకుఁ బ్రయత్నించిరి. అట్టి విభజనమునకుఁ గుదురనివికావుననే ఒక్కొక్క రొక్కొక్కవిధముగాఁ జెప్పుకొనిరి. ఒకరు వర్తమానార్థకములనియు, మఱి యొకరు భావ్యర్థకములనియు, నింకొకరు తద్ధర్మార్థకములనియు, వేఱొక్కరు తద్ధర్మాద్యర్థకములనియు నా రూపములనే వ్యవహరించుట కలిగినది.

తెనుఁగునఁ బ్రాచీనావస్థయం దొక్కవిధమయిన క్రియారూపములే యన్ని కాలములయందును, అన్నియర్థములను వాడఁబడుచుండినవి. ఇట్టి పద్ధతియే యరవ కన్నడములయందును నుండినట్లు ఆ భాషావేత్త లూహించుచున్నారు. తమిళము నందలి ప్రాచీన కాలబోధకవిధానమునుగూర్చి క్రిందిరీతిని వ్రాయబడినది. "తొల్ కాప్పియనారు మూఁడుకాలములను నిరూపించెనుకాని యట్టి కాలబోధకములైన యాగమములనుగాని, వాని స్వభావమునుగాని చెప్పలేదు. ఒక కాలము నర్థమున వేఱొక కాలమును బ్రయోగింపవచ్చుననియు దెల్పెను. కాలభేదకరూపము లేర్పడనిచో నిట్లు ఒక కాలమును మఱియొక్క కాలమున వాడుట యెట్లో యూహించుట శక్యముకాదు. సరియైన కాలబోధకప్రత్యయములుగాని, ప్రణాళికగాని యాయన కాలమున నేర్పడియుండినచో నా విషయమును నిరూపించియేయుండును."[54]

క్రీ. వె. ఆరేడు శతాబ్దములలో నుండిన కర్ణాటభాషాలక్షణమును బరిశీలించి నను ప్రాచీనకాలమున కాలభేదము లేకయే ఒక్క రూపమే ముక్కాలములయందును వాడఁబడుచుండినట్లును, సందర్భమునుబట్టి దాని యర్థము స్పష్టపడుచుండినట్లును

---

[54]If distinctive tense formations were definitely current in Tolkappiyanar's time it would be difficult to account for his omission to deal with the distinctive signs for such formations. (P. S. S. page 167)

ఊహించుట కవకాశము గలదు.[55] కర్ణాటభాషాస్వభావము పయిరీతిని నిరూపింపఁ బడినది. తెనుఁగుభాష యొక్క స్వభావమువంటిదే యితర ద్రావిడభాషలయందును గన్పట్టుచున్నదనుట నిర్వివాదము.

పయివిచారణమునుబట్టి తెనుఁగులోని సమాపకక్రియారూపముల చరిత్రము ఈ క్రిందిరీతిని స్పష్టపడుచున్నది.

I. అత్యంత ప్రాచీనకాలమున మూఁడుకాలములను బోధించుటకు నొక్కటే రూపము వాడఁబడుచుండినది. ఇట్టి రూపములనే తెనుఁగువైయాకరణులు తద్ధర్మార్థకములనిరి.

II. ప్రాచీనశాసనములలో భూతార్థకరూపములును, తద్ధర్మార్థకరూపములును గనుపట్టుచున్నవి. ఏళ్తె, ఇచ్చిరి, చేసిరి మొదలయిన భూతార్థకములు ఇకారమాగమముగాఁ గలవియే యందలి రూపములు. ఈ రూపములు తద్ధర్మార్థకరూపముల యపేక్షచేత నర్వాచీనము లన్నమాట. ఈ విషయము వాని స్వరూపము వలనను, స్వభావమువలనను గోచరమగుచున్నది. ఈ క్రింది రూపములను బరిశీలించునది.

| భూతము | తద్ధర్మము | భూతము | తద్ధర్మము |
|---|---|---|---|
| ఇచ్చితిరి | ఇత్తురు | వచ్చితిని | వత్తుము |
| చూచితిని | చూతును | చొచ్చితిని | చొత్తుము |
| పోయితిమి | పోదుము | త్రోసితిమి | త్రోతుము |
| వింటివి (వినితివి) | విందువు | విడిచితిని | విడుతును |
| కంటిని (కనితిని) | కందుము | కఱచితిని | కఱతును |
| నడచితిని | నడతుము | ఉంటిని | ఉందును |

పయిపట్టికలో నొక చిన్నవిశేషము కలదు. భూతరూపములయందు 'ఇ' అను ఆగమము నిత్యము. అంతియగాక అర్వాచీనరూపములయిన సానుబంధధాతువులగు రెండవతరపు ధాతురూపములపయినే యివి యేర్పడినవి. నిరనుబంధమయిన ప్రాచీనధాతురూపములపయినే తద్ధర్మార్థక రూపము లేర్పడినవి. ఇవియే వీని ప్రాచీనతావిషయకభేదమును నిరూపించును. చు, ంచు, చ్చు, యు అగమములుగా గలిగిన ధాతురూపములగు ఇచ్చు, చూచు, పోవు మొదలయిన రూప

[55] It is also possible that originally verbs were formed without any tense suffix and the same form was used for all tenses, the meaning being determined by the context, cf. akkum used for all tenses; neg verbal forms were used for all tenses, all genders and all numbers in Kanarese and Tamil. The tense is fixed by the finite verb. Later, the subtle distinctions of these may have arisen. In some grammars it is said that there were only two tenses in Kanarese, the past and the future. The present tense was a later development. Page 212 (*Grammar of the oldest Kanarese Inscriptions* by Dr. A. N. Narasimhaiah, Mysore).

ములపయిని ఇవర్ణము చేరి ఇచ్చితిని, చూచితిమి, మొదలయిన రూపము లేర్పడినవనుట స్పష్టము. తద్ధర్మమునం దట్లుగాక చూ, చొర్, త్రో, కఱ అను నట్టి ఆగమవిరహితధాతువులనుండి రూపము లేర్పడినవి. అట్లే విను, కను మొదలయిన నువర్ణాంత ధాతురూపములపయినే ఇకారము వచ్చి వినితిని-వింటిని మొదలయిన రూపము లేర్పడినవి. తద్ధర్మార్థములందు విన్, కన్ మొదలయిన హలంతరూపములపయినే 'దు' ఆగమముగా జేరి విందును, కందుము మొదలయిన రూపము లేర్పడినట్లు స్పష్టము. కాఁబట్టి భూతార్థకములే యర్వాచీనములు.

III. భూతార్థకరూపములందు ఇకారము ఆగమముగా వచ్చి యేర్పడిన వనుట స్పష్టముగదా! హలంతములు ప్రాచీనరూపములును, అజంతములు నవీనములు ననుట సామాన్యవిషయముగా ననేకస్థలములను నిరూపించితిని. అనఁగా కొన్నిధాతువులయొక్క ఉకారాంతత యర్వాచీనమనుట. తెనుఁగున ఉకారాంతములుగా నున్న కొన్నిధాతువులు అరవ కన్నడములయందు కేవల హలంతములుగా నుండినవనియును నిరూపించితిని. అరవ కన్నడములలో ఉకారాంతధాతువుల పయినే భూతార్థకమయిన యాగమముగా ఇకారము వచ్చుననియు, నట్లు ఉకారాంతములుగాని యరవ కన్నడ ధాతువులపయిని ఇకారాగమము లేకయే భూతరూపము లేర్పడుననియును ముందు తెల్పితిని. తెనుఁగునందలి ధాతువు లన్నియును ఉకారాంతములే యగుట భూతరూపములన్నియును ధాతువులు ఉకారాంతము లయినతరువాతనే యేర్పడినవనుట స్పష్టము. కాఁబట్టి ఇగాగమము గల్గిన భూతరూపములన్నియును నట్టి యాగమములేక కేవల హలంతరూపముల పయి నేర్పడిన తద్ధర్మరూపములకంటె నర్వాచీనములనుట యుక్తము.

IV. పయి సిద్ధాంతములనుబట్టి పరిశీలించినచో వత్తును, వచ్చెదను, తిందును, తినియెదను అనునట్టి రెండువిధములయిన తద్ధర్మార్థకములలోను దుగాగమయుక్త రూపములు ప్రాచీనములు, ఎదగాగమయుక్తరూపము లర్వాచీనములు అనుటయు స్పష్టపడును. అనఁగా దుగాగమయుక్తరూపములు కేవల సరనుబంధములయిన ప్రాచీన మూలధాతురూపములపయి నేర్పడినవి. చు, యు మొదలయిన యనుబంధములతోఁ గూడిన రెండవతరపు ధాతువులనుండి ఎదగాగమరూపము లేర్పడిన వనుటయును సామాన్యవిషయమే. కావున ఎదగాగమయుక్తరూపము లర్వాచీనములు.

V. తద్ధర్మార్థకములయిన దు, ఎద అను ఆగమములుగూడ ద్రావిడ భాషాసామాన్యమయిన అమహదర్థక భావార్థక ప్రత్యయములనుట స్పష్టము. ఇదు, అదు మొదలయినవాని వెనుకనున్న దుప్రత్యయ వికారములే యివి. ఈ దుప్రత్యయమే యనేక స్థలముల ననేకవిధములఁ జేర్పఁబడి భిన్నరూపములుగాఁ బరిణతినంది భిన్నార్థముల నేఁడు స్థిరపడినది.

**VI.** చేసిరి మొదలయిన ఇకారయుక్త ప్రాచీన భూతరూపము లేర్పడిన తరువాత తద్ధర్మార్థకములను భూతార్థకములుగా ప్రయోగించు నభ్యాసము తగ్గిపోయినదనుట స్పష్టము. కావుననే తద్ధర్మార్థకరూపములలో వచ్యర్థంబులు మాత్రమే భూతార్థమున వాడంబడునని సూరి ప్రయోగానుసారముగ సూత్రించెను. కేతన పెద్దనలు తద్ధర్మార్థకరూపములను గొన్నిటిని వర్తమానార్థకమాత్రములుగాను, గొన్నిటిని భవిష్యదర్థమాత్రములుగాను నిరూపించుట ప్రయోగముల సరణికి విరుద్ధమును, జరిత్రకు సరిపడనిదియు ననుట స్పష్టము.

**VII.** రెండవతరపు భూతార్థకములయిన వచ్చినాఁడు మొదలయిన వెట్లు ప్రాచీన భూతరూపములయిన వచ్చెను, వచ్చిరి మొదలయినవానిని వెనుకకు నెట్టివేయుచున్నవో యట్లే నవ్యములయిన వర్తమాన భవిష్యదర్థక రూపములు తద్ధర్మార్థకములను నెట్టివేయుచున్నవి. అనఁగా నారూపముల ప్రచారమును, ప్రయోగమును విరళమగుచున్నది అని భావము.

**VIII.** తద్ధర్మార్థకరూపములయొక్క తాచ్ఛీల్య తద్ధర్మ సాతత్యార్థకత మాత్రమే కాలక్రమమున నిలిచి వాని వర్తమాన భావ్యర్థబోధకత పూర్తిగా నశింపవచ్చును.

పయిరీతి చరిత్రగలిగిన తద్ధర్మార్థకరూపము లనఁదగినవి ఇతర ద్రావిడ భాష లన్నింటియందును గలవనుటయు, వానియొక్కయు వీనియొక్కయు రూప నిర్మాణప్రణాళికయు అర్థబోధకతయు తుల్యమనుటయును, నీ ద్రావిడభాషల పరస్పరసోదరభావమును సంస్కృతాజన్యత్వమును దృఢపఱచుచునే యున్నదనుట స్పష్టము.

## 12. క్రియాజన్యవిశేషణములు మొదలయిన యసమాపకక్రియారూపములు

చేసి, చేయుచున్, చేయుడున్, చేయన్, చేయక, చేయఁగన్ అను క్రియా రూపములవంటివాని చరిత్ర మూహింపవలెను. చేసి (క్త్వార్థకము), చేయుచు (శత్రర్థకము), చేయన్ (తుమున్నాద్యర్థకము), చేయుడు (అనంతర్యార్థకము), చేసినన్ (చేదర్థకము). పయిరూపములకు సంజ్ఞలన్నియును సంస్కృతమందు వాని యర్థములలో వాడుచుండిన ప్రత్యయములనుబట్టి యేర్పఱుపఁబడినవి యనుట స్పష్టము.

చేసి, చూచి మొదలయిన ఇప్రత్యయాంతావ్యయము చేయుట వంటి భావార్థకమే యనియు, కాలక్రమమున నేఁటి యర్థ మేర్పడినదనియు ముందు నిరూపించితిని. తెనుఁగున ధాతువులన్నియు ఉకారాంతములు. ధాతుమాత్రమే భావార్థకముగా వాడంబడుచు కాలక్రమమున తుది ఉకారము ఇకారముగా మాఱి భూతార్థకముగా నేర్పడినదనుట స్పష్టము. ఇట్టి ఇకార మేర్పడుట ప్రాచీన ద్రావిడముననే అనఁగా తెనుఁగు వేఱుభాషగా నేర్పడక మున్నే కలిగియుండ

వలెను. అట్లు కానిచో అరవ కన్నడములయందలి ఉకారాంతములకుమాత్రము ఇకారము భూతార్థకప్రత్యయముగా చేర్పబడుటకు హేతువు లేదు.

చేయుచున్ కూడ ప్రాచీనకాలమున భావార్థకమనియే ముం దుదాహరించితిని. చున్ అనునది నేడు వర్తమానార్థకముగదా! ఇట్లే యియ్యది స్వతంత్రముగా వర్తమానార్థము మొదటినుండియు నయియుండినచో దీనికి మూఁడుకాలములయందలి ప్రధానక్రియలతో స్వతంత్రముగా న్వయించు యోగ్యత కలుగుటకు వీలులేదు. వర్తమానము—"సింహకిశోరవృత్తి గర్జింపుచు నున్నవాఁడు" జై. భా. 2-46; భూతము—"నీపున ధరియించుచుపచ్చెఁ బకితతులం నుతింపన్." భార. క. 2-80; భవిష్యత్తు—"దీని నెఱిఁగించుచు ద్వాదశసంవత్సరవ్రతముఁ జరియింతున్" మార్క. 1-140. పయి మూఁడుప్రయోగములయందును గర్జించుటతో, ధరియించుటతో, నెఱిఁగించుటతో అని యక్కడక్కడ ప్రధానక్రియలతో నన్వయము సరిపడుననుట స్పష్టము. సువర్ణము తృతీయాప్రత్యయార్థ మనుట నిర్వివాదము.

ఇట్లే డువర్ణకము కర్తృ కర్మ కరణ అధికరణ భావార్థకముల వచ్చునని నిరూపింపఁబడినది.[56] పెంపుడుచిల్క, చోపుడుకోల, దిగుడుబావి, "హీనుంగాఁ జేయుడు నాకుఁ జతుర్వర్గము వడయుట" ఇది నామతుల్యమయి భావార్థకమాత్రమగుటచేతనే యిన్ని యర్థముల నుపయోగింపఁబడినది. ఈ రూపముపయి నువర్ణకము చేరి కాలక్రమమున అనంతర్యార్థక మయినదనుట నిర్వివాదము.

చేయన్, చేయఁగన్—ఈ రెండును అభిన్నములే. చేయన్ అనుదానిపయి కాన్=కాఁగా యనునది చేర్చఁబడినది. చేయుట కాఁగా అని భావము. ఈ చేయన్ అనునదియు భావార్థకమే యనుట స్పష్టము. చేయఁగలము, చేయనున్నాము మొదలయిన సహాయక్రియారూపములతో దీని కీ యర్థమునసే యన్వయము. చేయఁగలము=చేయుట గలవారము అని వివరణము. ఈ రూపము ఉద్దేశార్థమునను, భావార్థమునను, అనంతర్యార్థమునను, హేత్వర్థమునను, శాపార్థమునను వాడనగును. ఇతరార్థములన్నియు భావార్థమునుండి కాలక్రమమున నేర్పడినవియే యని యూహించుట సులభము. "తాల్చియుండఁజన దెల్లప్రొద్దు" తాల్చియుండుట యని యర్థము. "నీ నెలవు గూల." శాపార్థకము. ఈ యర్థమున చేయునది యను భావార్థకము విధ్యర్థముగా వాడునట్లే యియ్యదియును వాడఁబడినది. ఇందలి అన్ ప్రత్యయముతో సమానమయినది అరవమునందలి అల్ ప్రత్యయము. సేరల్=చేరుట; సెయ్యల్=చేయుట. ఈ అల్ ప్రత్యయమే అన్‌గా మాఱి తెనుఁగున నంత్య నకారము ద్రుతముగా భావింపఁబడి తొలఁగుటచేత పయి అప్రత్యయ మేర్పడినదనుట స్పష్టము. సెయ్యల్ + పడుమ్ = సెయ్యప్పడుమ్ (చేయఁబడును).

---

[56] సూ. ఆం. నిఘం. పుట 556.

చేయక—ఇదియును బయివానివలెనే భావనామ మనుట దీని రూపమువలనను, వాడుకవలనను స్పష్టపడుచున్నది. "కవర్ణకంబు అలుగ్వాదుల కగును" అను సూత్రము ననుసరించి అలుక, కాఁక మొదలయిన ప్రత్యయములయందు కవర్ణకంబు కృత్ప్రత్యయముగానే యున్నది. అలుగుట, కాగుట యనియే పయిరూపముల యర్థము. రాక, పోక వంటి రూపములు వ్యతిరేకార్థకములుగాను, స్వార్థంబునను ఉపయోగపడుచుండుటయు స్పష్టమే. "క జీ వర్ణకము పురార్థయోగంబున విభాషను భావంబునం దగు" వండకమునుపు=వండుటకు మునుపు. రెండుపదముల చేర్పుటమాత్ర మునసే సమాస మేర్పడినది.

పయిపదము లన్నియును మొదట కేవల భావార్థకములుగాఁ గలిగి కాలక్రమమున నేఁటి యర్థబోధకతను, అన్వయాదికమును బొందిన వనుటయే వీని చరిత్రము. ఇది యంతయు (ద్రావిడభాషల) తెనుఁగుయొక్క సంయోగాత్మకావస్థను స్పష్టపఱుచుచునే యున్నది.

## క్రియాజన్యవిశేషణములు

ఇవియును ఇతరములయిన విశేషణములవంటివేగాని భిన్నములు కావు. అనఁగా విశేష్యములే యితరవిశేష్యములముందుఁ గూర్పఁబడి సంబంధబోధకములయిన ఇ, అ వర్ణంబులను గూర్చుకొనియు, లేకయు, విశేషణములుగాఁ గాలక్రమమున నేర్పడుచున్నవని ముందే విశేషణముల చరిత్రము నేర్పఱచునపుడు వివరించితిని. అట్లే నామతుల్యములయిన భావార్థకములు ఇతరవిశేష్యములకుముందుఁ జేర్పఁబడి ఇ, అ లు చేర్పఁబడియు, లేకయు, విశేషణము లగుచున్నవి.

| | | |
|---|---|---|
| చేయువాఁడు | తద్ధర్మార్థక విశేష | — చేయు+వాఁడు |
| చేసినవాఁడు | భూతార్థక విశేష | — చేసి+న్+అ+వాఁడు |
| ఉన్నవాఁడు | తద్ధర్మార్థక విశేష | — ఉన్+న్+అ+వాఁడు |
| కలయది | ,, | — కల+అది |
| చేయనిమనుష్యుఁడు | వ్యతిరేకార్థక విశేష | — చేయన్+ఇ+మనుష్యుఁడు |
| చేయఁబడినయది | కర్మార్థక విశేష | — చేయన్+పడి+న్+అ+అది |
| చేసెడివాఁడు | తద్ధర్మార్థక విశేష | — చేసెడు+ఇ+వాఁడు |
| చేసెడువాఁడు | | — చేసెడు+వాఁడు |

పయివిభజనమునం దెల్లను పూర్వరూపములు భావార్థకములయి నామతుల్యములయినవని ముందు నిరూపించితిని. నడుమ సంబంధబోధకములయిన ఇ, అ అనునవి చేరియు, చేరకయును సమాసము లేర్పడినవి. క్రియాజన్యవిశేషణములును విశేషణసామాన్యమునుగూర్చి చెప్పిన లక్షణములతో సరిపడుచునే యున్నవనుట నిర్వివాదము.

## 13. చేదర్థకము

నేఁడు మిక్కిలిగా వ్యవహారమున వినంబడుచున్న చేదర్థకక్రియారూపము చేస్తే, వింటే, పోతే అనువానివంటిది. ఇది నవీనమనుట నిర్వివాదము. ప్రాచీన కాలమున నెట్లుండినదో పరిశీలింతము.[57]

క్రింద నీయంబడిన ప్రయోగములనుబట్టి చేసినన్, చూచినన్ అనునట్టివి ప్రాచీనశాసనములలో నన్నయకుముం దుండినవి. దీని నుద్దేశించియే సూరిగారు చేదర్థంబున నవర్ణంబు ద్రుతాంతంబగునని సూత్రించిరి.[58] ఇట్టివి నన్నయభారతము నను గలవు. ఏని అనునది సమాపకక్రియారూపముఃపయిని చేర్చుటచేత నన్నయ భారతమున మిక్కిలిగా చేదర్థక మేర్పడుచున్నది. క్రింది ఉదాహరణములనుబట్టి చేదర్థమును జెప్పుటకుఁ దెనుఁగున నీ క్రిందిమార్గము లేర్పడినవి యనుట స్పష్టము.

1. ద్రుతాంతమయిన నకారము చేర్చుట: చేసినన్.

2. నాఁడు, అప్పుడు అనుశబ్దములను క్రియాజన్యవిశేషణములపైని చేర్చుట: చేసినాఁడు, వచ్చినయప్పుడు.

3 చోన్, ఎడలన్ అను అవ్యయములను క్రియాజన్యవిశేషణములపయిఁ జేర్చుట: వచ్చినచో, రానియెడల.

4. 'ఆ' అనుదానిని సమాపకక్రియారూపముపైని చేర్చుట: వచ్చెనా జరుగును.

5. తే, టే అనువానిని క్త్వార్థకరూపములపయిని, ధాతువులపయిని జేర్చుట: చేసితే, పలికితే, వింటే.

[57]పయివారల వెల్వటించినన్ అశ్వమేధంబు ఫలంబు అగు. ఉపేక్షించినా లింగంబట్టిసినపాపంబు } సు 900 క్రీ. వె. యుద్ధమల్లుని బెజవాడ శాసనము

| | | | | |
|---|---|---|---|---|
| పగఱఁగని సైతురేనియు | భా. | ఆది. | V | 55 |
| నల్లలేదయ్యేనేని | ,, | ,, | II | 32 |
| నల్లసేసితిరేని | ,, | ,, | | 34 |
| పాచికొనంగఁ జిత్తము గలదేని | ,, | ,, | | 55 |
| మమ్ము విడిచితేని యిప్పుడ ప్రాణంబులు విడుతుము | ,, | ,, | V | 61 |
| రెండవ యింద్రుఁడయిన విపరీతమగున్ | ,, | ,, | V | |
| మీ రట్లు సేయనినాఁడు దానికి మఱి యేను దాసినగుదు | ,, | ,, | V | |
| నా యిష్టంబు మీరు గావింపనినాఁడు ప్రాణంబులు విడుతును | ,, | ,, | II | |
| కాంతామోదము కలుగనియెడలన్ మదాళి కలియునె | దశా | | III | 13 |
| చేసాచినచో నవ్వకయుండవలయు | కాశీ | | I | 109 |
| ధర్మాంశంబె హెచ్చెనా | ఆము క్త | | IV | |
| వాఁడు రానప్పుడు నే నేమిచేయుదును | వాడుక | | | |
| వీఁడు వచ్చెనా అది సాధ్యమగును | వాడుక | | | |

[58]బా. వ్యా. క్రి. 41.

కొంచె మించుమించుగా పయినుదాహరించిన వరుస ఆ యా రూపములను వాడుచుండిన కాలక్రమము ననుసరించి యేర్పాటు చినది.

ఈ మార్గములన్నియు స్వతంత్రముగాఁ దెనుఁగున నేర్పడినవియే. ఇట్టి రీతినే యితర ద్రావిడభాషలయందును చేదర్థకము స్వతంత్రముగా నేర్పడినది. నాఁడు, అప్పుడు అనునవి కాలవాచకములు. చోన్, ఎడలన్ అనునవి స్థల వాచకములు. దేశ కాల వాచకములను క్రియాజన్యవిశేషణములపయి చేర్చుటచేత నియ్యవి యేర్పడుట యీ భాషల స్వభావము.[59] ఏని, ఆ, అనునవి అవ్యయము లనియు, ననేకార్థముల వాడంబడుననియు ప్రయోగములనుండి స్పష్టము. 'ఆ' యను నది ప్రశ్నార్థకము. ఆ ప్రశ్నార్థకమే సందర్భమునుబట్టి చేదర్థకమగుననుట స్పష్టము. ప్రశ్నార్థకమునుండి చేదర్థకమేర్పడుట సహజమనుట నిస్సంశయము. ప్రశ్నకు సమాధానము రెండుపక్షములలో నేదో యొక్కటి రావచ్చును. అట్లే చేదర్థము నకు పక్షమేకదా యర్థము. ప్రశ్నార్థకమయిన 'ఏ' శబ్దము పదముముందు చేర్పఁ బడి కాలక్రమమున నన్నయభారతమున సంబంధబోధకముగా మాఱియుండు నను టను ముందు నిరూపించితిని. ఇట్లే పదాంతమున నుండిన 'ఏ' శబ్దము-ను, ని, న్ అనువాని నంతమందు గూర్చుకొని విశేషార్థమున నిట్లేర్పడినదని యూహించుట సులభము. ఏ, ఏని శబ్దములు రెండు నభిన్నములని కోశకారులు, వైయాకరణులు నంగీకరించిరి.[60]

ప్రశంస, ఆశ్చర్యము, సందేహము, ప్రశ్న మొదలైన యర్థవిశేషములు కాల క్రమమున వీని కేర్పడె ననుట యుక్తము. ఏని శబ్దము అయినన్ అనుదాని వికృతి యని యొక యూహ చేయఁబడినది.[61]

పయివివరణము చొప్పున అభిన్నములయిన ఏ, ఏని శబ్దములలోని ఏ యనునది మధ్యమపురుషైకవచనమునకుఁ జేర్పఁగాఁ వచ్చిన రూపమే కరుడుగట్టి కాలక్రమమున నేఁటి వ్యావహారిక చేదర్థకముగా నేర్పడెననుట నిర్వివాదము. తక్కిన మార్గములన్నియు గ్రాంథికమాత్రములగుట వానికిఁ బ్రచారము తగ్గి యీ ప్రణాళిక యొక్కటియే నిలిచినది. సాధారణముగా సంభాషణయందే వ్యావహారిక భాషకుఁ బ్రయోగముకదా! అప్పుడు ఎదుటివ్యక్తితోఁ జెప్పు రూపమునకే యెక్కువవాడుక. అందును ఏకవచనమునకే యధికమయిన వాడుక యనుటయు స్పష్టము. చేసితి+ఏ, వింటి+ఏ మొదలుగాఁగలవానినిబట్టి చేస్తే, వింటే, చూస్తే మొదలగు రూపములు ఏర్పడి నేఁటి యీ ప్రణాళిక స్థిరపడినదనుట యుక్తము.

[59] C. G. D. Page. 529

[60] అదిగో దేఁ దెగి బంటవై యుఱుము. భా. ఉ. III 97, కాదే=కానిపక్షమున,

[61] C. G. D. Page 527.

ఇఁక వినినన్ మొదలయిన రూపముల చరిత్రము మాత్ర మూహింపవలసి యున్నది. ద్రుతాంతమయిన నవర్ణకము క్త్వార్థకమయిన చూచి, చేసి మొదలయిన రూపములపయిని చేర్చుటవలనఁ గలిగినవని పయిరూపములను విభజింపనగును. సూరియు నవర్ణకంబు ద్రుతాంతమగునని సూత్రించి నన్ అను దానినే ప్రత్యయముగా నేర్పఱచెను. చూచి, చేసి మొదలయిన ఇప్రత్యయాంతము ప్రాచీనకాలమున భావనామమే యని ముందు స్థాపించితిని. మతమున నప్రత్యయము సప్తమీ నవర్ణకముతో నభిన్నమని యూహింప వచ్చును. చేయుచో అనుదానితో చేసినన్ అనునది సమానార్థకమగుట స్పష్టమగుచున్నది. కాని నవర్ణకము ఉకారాంత జడలముపయినేకాని యితరములపయిని వచ్చుటలేదే యని యాక్షేపింపవచ్చును. ఇది సత్యమే కావచ్చును. కాని ప్రాచీనకాలమున ఇ, ఉ లు అభిన్నములనియు, ధాత్వంతమయిన ఉకారమే ఇకారముగా స్థిరపడి భూతార్థక మయినదనియు ముందుచేసిన నిర్ణయమున కీ పద్ధతి సరిపడుచునే యున్నది. ఇంతేకాక దానన్, వీనన్, వేనన్ మొదలయిన రూపములయందు నవర్ణకము అ, ఈ, ఏ లకు, ఉకార వ్యతిరిక్తములకుఁగూడఁ బరమయినదనుట పరిశీలింపఁదగినది. ఇది + నన్ = దీనన్; అవి+నన్ = వీనన్; ఎవి + నన్ = వేనన్.

పయి చేదర్థక చరిత్ర మంతయు నితర ద్రావిడభాషలయందలి చేదర్థక చరిత్రతో నదుకుచున్నది. తెనుఁగుయొక్క సంస్కృతాజన్యతను నిరూపించుచున్నది.

అరవమున చెయిన్, చెయిదాల్, ఉళర్ + ఏల్ = ఉళరేల్ అనునవి చేదర్థకములు. పయివానిలో ఇన్, ఆల్, ఏల్ అనునవి ప్రత్యయములు. ఇన్ అనునది ప్రాచీన ప్రత్యయము. (చెయ్ + ఇన్) చేసినన్ అనుదానిలోని ఇనన్‌తో సమానమయినది. అరవమునందలి ఆల్, ఏల్ అనునవి తెనుఁగునందలి ఏని=ఏన్ అనుదానితో నభిన్నముగా నుండియుండవచ్చునని సులభముగా నూహింపనగును.

## 14. ప్రార్థనాద్యర్థకము

తెనుఁగునందలి ప్రార్థనాద్యర్థకరూపముల చరిత్రమును దెలిసికొనుటకుముందు ప్రార్థనాద్యర్థకము స్వభావమును గొంచెము గుఱుతింపవలెను. సంస్కృతమున ప్రార్థనాద్యర్థకమయిన లిఙ్ అర్థములు: విధి = ఆజ్ఞ, నిమంత్రణము = పిలుపు (విందు మొదలయినవానికి), ఆమంత్రణము=ఆదరపూర్వకమయిన అనుజ్ఞ, అధీష్టము=ధర్మనిర్వహణమునుగూర్చిన ప్రార్థన లేక చోదన, సంప్రశ్న=ఆదరపూర్వక ప్రశ్న, ప్రార్థన=గౌరవపూర్వకమయిన కోరిక.[62] సంస్కృతము మాటాడుచుండిన సంఘము యొక్క అవకాశములను అవసరములనుబట్టి యీ అర్థములు ఏర్పడి కాలక్రమమున

[62] విధినిమంత్రణామంత్రణాధీష్టసంప్రశ్నప్రార్థనేషు లిఙ్. పాణిని, III. 3-161

లిఙ్, లోట్ రూపములకు సంబంధించినట్లు విభజింపఁబడినవి. తెనుఁగున చిన్నయ తద్ధర్మాదులందు లాట్టగునని సూత్రించి లాడర్థములయందు సంప్రశ్న భావ్యాశీరాదులను గ్రహించెను. లూట్ అను ఆగమంబు విధించి ఆశీశ్శాపసంప్రార్థన విధులు దాని కర్థములుగా నిరూపించెను. ఈ రూపము లన్నిటియందును ఒక ముఖ్యలక్షణము అర్థగతముగా నున్నట్లు మనము పరిశీలనవలనఁ గనుగొనవచ్చును. వీనియం దుద్దిష్టమయిన క్రియార్థము 'భావి' యనుటయే యయ్యేది. కాఁబట్టి భావ్యర్థక్రియాసామాన్యమునకును, బయిరూపములకును ప్రాచీనకాలమున సంబంధ ముండియుండ వచ్చుననుట నిర్వివాదము. భావిక్రియారూపము పయియర్థములయందు వాడుట స్వాభావికము. అదియే కాలక్రమమున పూర్తిగ భిన్నరూపమున విధ్యాద్యర్థకముగా నిలిచిపోవచ్చును.

ప్రార్థనాద్యర్థకములో నున్న రెండవ విశేష మేమనఁగా: సామాన్యముగా దీనికి మధ్యమపురుషముననే వాడుక. ప్రార్థనాదులు ఎదుటివ్యక్తితోనే జరుగుట యర్థనిష్ఠమయిన స్వభావము. ఆశీరాదులు కొన్ని యితరవ్యక్తులందుఁగూడ వర్తించును. ఇతర పురుషములయందు వీనికి రూపము లుండినప్పటికిని మధ్యమపురుషరూపములకే మిక్కిలి ప్రచారమనుట నిర్వివాదము. కాఁబట్టి మధ్యమపురుషరూపముల చరిత్రమును ముందుఁ బరిశీలింపవలయును.

అగుము, అగుఁడు, కమ్ము, కండు అను రెండువిధములయిన రూపములును మధ్యమపురుషైక బహువచనములయందు వాడుకలో నున్నవి. మువర్ణకమేకవచనమునను, డుఙ్ వర్ణకము బహుత్వమునను వాడుకలో నున్నవి. ప్రార్థనాద్యర్థక ముపర్ణకము హలవసానంబులు పరంబులగునపుడు లోపించుటయుఁ గలదని వైయాకరణ మతము. నిలు, నిలు, పోకు, పోకు అను రూపములతుదిని ముపర్ణకము వికల్పముగా లోపించును. అచ్చు పరమయినపుడుగూడ గ్రాంథికముగను గొన్నియెడల ముపర్ణకము లేదని వైయాకరణులు నిరూపించిరి.[63] ఇది వైయాకరణ మతము.

చరిత్రమునుబట్టి చూచినచో అనుబంధములేని ధాతుమాత్రమే మధ్యమపురుషైకవచనముగ వాడఁబడుచుండెనని నిర్ణయింపనగును. తరువాత ముపర్ణయుక్తరూపములు వాడుకలోనికి వచ్చినవనియు నూహింపనగును. విను, చెయ్, చెప్పు, చాచు, పొందు, ఆడు మొదలయిన వన్నియును నిరనుబంధముగా మధ్యమపురుషైకవచనము లగుచున్నవి. ప్రాచీనమయిన నిరనుబంధములును, అనంతరమయి సానుబంధములును నగు ధాతువులును ఈ యర్థమునఁ బ్రయోగింపఁబడుచుండినట్లును, ఒక్కెడ రెండురూపములునుగూడ నుండినట్లును స్పష్టముగా నిరూపింపవచ్చును. ప్రాచీన హలంతధాతువులు ఉకారాంతములయిన రూపములతో గ్రంథములం దున్నవి.

[63] ఆడిదె నీదు పందెము-కళా. ఆ 6. భవచ్చిత్తేప్సితం బెద్ది చెప్పునిదన్. మార్క. ఆ. 1

వాడుకలో హలంతములుగాఁగూడ నున్నవి. మఱికొన్ని రూపములలో గాలక్రమము లయిన రూపాంతరితత్వమును గనుపట్టుచుండును.

I ప్రాచీనధాతురూపమున నుండినవి :

చెయ్, తియ్, విను, ఈ, పో, ఆడు, నిలు, చూ, చా.

పయివానిలో చెయ్, తియ్, పొయ్ మొదలయిన యకారాంతములు సమాపకక్రియారూపములయందును నిరనుబంధములుగానే యున్నవి. విను, కను, చను మొదలయిన నువర్ణాంతకములును నట్లేయున్నవి. ఆడు, కూడు, ఓడు మొదలయినవియు నట్టివే. చెయ్, చేయుము; విను, వినుము; ఈ, ఇమ్ము; పో, పొమ్ము; ఆడు, ఆడుము ; మొదలయినవి రెండేసిరూపములు గలవు.

II ఉభయరూపమున నుండినవి—నిలు అను ప్రాచీనధాతురూపమునకు నిలుచు నవీనరూపము. నిలు అనియు, నిలువు అనియు రెండు విధ్యర్థకరూపము లున్నవి. అట్లే చూ, చా, పో అను దీర్ఘాంతధాతువులపయిని ఆగమములు వచ్చియు, రాకయు రెండు వికల్పరూపములు కలిగినవి. చూ,[64] (చుమ్ము, చూవె, చూరె అనునవి దీని ప్రాచీనరూపమును దెలియఁజేయును.) చూఁడు అను రెండురూపములు నేఁడు గలవు. నిలు, నిలువు ; పిలు, పిలువు ; ఒలు, ఒలువు ; కొలు, కొలువు అను రెండురూపములును వాడుకయందు వినంబడుచుండును. ఈ ధాతువులన్నియును రెండవతరమున పిలుచు, ఒలుచు, కొలుచు అని చువర్ణాంతము లయినవి. చువర్ణాంతధాతువులపయిని మువర్ణము వచ్చునప్పుడు నడుమ వువర్ణ మంతాగమముగా వచ్చును అని వైయాకరణమతము. కావుననే పిలువుము, నిలువుము, కొలువుము అను రూపము లేర్పడినవి. పయిరూపములలో చు, వు లు రెండును ఆగమములే. సమానార్థకములే. ఒకేయర్థమున నొక్కకాలముననే భిన్నములయిన యాగమములు వచ్చుచుండినట్లు నిరూపించితిని.[65] చు, వు, పు లు మూఁడు నాగమములుగా వచ్చియుండిన భావనామములలో చువర్ణాంతము సమాపకక్రియలలోను, వువర్ణాంతము విధ్యర్థకమునను, పువర్ణాంతము ప్రేరణార్థమునను, కృదంతమునను స్థిరపడిన ట్లూహించుట సులభము.

దీర్ఘాంతధాతువులయిన చా, పో అనువానిపయిని చావుము, పోవుము; చా, పో;[66] చావు, పోవు అనురూపము లేర్పడియుండినవి. పోవు అను వ్యతిరేకార్థక సమాపకక్రియారూప ముండుటచేత పోవు అను విధ్యర్థకరూపము సందిగ్ధత

[64] నినుఁగూల్చెదఁ, జూ యెవ్వతనైతినేమి నూచెదు నన్నున్. భార. భీష్మ. 3-325

[65] తూరువ్వు, తుఱుగు, తూప్పు అను రూపము లేకకాలముననే యుండునట్లు నిరూపించితిని. గ్రాంథికభాషలో తెఱప, తెఱపి, తెఱపు, తెఱవ అను పదములు ఇంచుమించుగా సమానార్థకములుగా నేఁడు గలవు.

[66] "చాకుక్కలార" పాల్కురికి సోమన, ఆ, భా, చ, పుట 1231.

తొలగుటకయి భ్రష్టమయినది. అట్లే విడు, విడువు, విడువుము అను మూఁడు రూపములు గలవు.

III ఊనిక మొదలయిన హేతువులవలన రూపము పూర్తిగా మాఱినవి :

వచ్చు—రా, రమ్ము.
లేచు—లే, లెమ్ము (లేవు)-లెయ్.
తెచ్చు—తే, తేరు, తెమ్ము.
అగు—కా, కమ్ము.
చొచ్చు—చొరు, చొరుము.
ఇచ్చు—ఈ, ఇయ్, ఇయ్యి, ఇమ్ము.
(కొళ్) కొను—కొను, కొనుము, కొమ్ము.

పయివిధమున ధాతుమాత్రమే మధ్యమపురుషైకవచనమున విధ్యర్థకముగ వాడఁబడుచున్నట్లు స్పష్టము. అంతియకాక ఆ యా ప్రాచీనధాతురూపములు మాఱి నవ్యధాతురూపము లేర్పడ నానిపయిఁగూడఁ గ్రొత్త విధ్యర్థకరూపములు బయలుదేరినట్లును స్పష్టపడుచున్నది. ఈ పురుషమునఁగల ము, డుజ్జు లనెడి ప్రత్యయముల చరిత్రము నూహింపవలయును. ఇతర సమాపకక్రియారూపముల యందు సార్వనామికపరిశిష్టములయినవే ప్రత్యయములనియు, నవి సమాసములే యనియు ముందు నిరూపించితిని. ఇవి యట్లేర్పడినట్లు తోఁచదు. మువర్ణమునకు ప్రాచీనరూపము 'మ్' అను హల్మాత్ర ముండెననుట నిర్బాధమేగాక ద్రావిడభాషా స్వభావముగదా! ఆ తుదినున్న మవర్ణము నవర్ణముతో నభిన్నమనియుఁ, గన్నడమున నీ రెండును అనుస్వారముగా మాఱి పరస్పరమును మాఱుచుండుట సార్వత్రికమనియుఁ జెప్పితిని. తెనుఁగుననే రామన్, రామమ్, రాముడు మొదలయిన రూపము లుండినట్లు నిరూపించితిని. లతాంతములకున్ + మొనసి—కుమ్మొనసి యను ప్రయోగము గలదు. చేయున్=చేయుమ్=చేయుము అనురీతి నీ రూపక్రమము కల్గిన ట్లూహించుట మిక్కిలి యుక్తముగా నున్నది. ఆ పద్ధతిని ప్రాచీనమయిన చేయున్ అను ఏకవచనరూపముపయిని బహువచన రుప్రత్యయము చేరి, చేయున్ఱు = చేయుండు = చేయుఁడు అనురూపము లేర్పడినవనుట చాల తిన్ననయిన మార్గము. రామున్ఱు = రాముండు; మూన్ఱు = మూండు మొదలయిన వానిని ప్రథమావిభక్తి మహదర్థకమయిన డుజ్ప్రత్యయచరిత్రలో నిరూపించితిని. కాఁబట్టి యీ చరిత్ర మెంతయు నుపపన్నమనక తప్పదు.

ఇంతియగాక భావ్యర్థకమయిన చేయును అనునదియు, విధ్యర్థకమయిన చేయుము అనుదాని ప్రాచీనరూపమయిన చేయున్ అనునదియు నభిన్నము లనుటయు పొసఁగును. విధ్యర్థకము భావ్యర్థకమునుండి యేర్పడుట యుక్తమని ముందు నిరూపించితిని. కాని దీని కొక యడ్డంకి కలదు. చేయున్ (ను) అనునది ప్రథమపురుషైకవచనము. చేయుము అనునది మధ్యమపురుషైకవచనముగదా యనుటయే యియ్యది. ప్రాచీనకాలములో పురుషభేద మేర్పడుచుండినపు డిట్టి తారుమారు గలిగి కాలక్రమమున భేదము స్థిరపడినదనుట భాషాస్వభావమునకు మిక్కిలి

నడిపడియున్నది. పయిగా, నేటికిని మలయాళమున సమాపకక్రియయందు పురుష బోధకప్రత్యయములే లేవు. (నీ వరున్ను, నా వరున్ను, అవన్ వరున్ను) వరున్ను = వచ్చెను, అను రూపమును మూఁడుపురుషములయందును వాడుచున్నారు. కన్నడమున కుం, గుం అంతమందుగల రూపములు కాల పురుష భేదములులేకయే వాడుచుండినట్లు సప్రమాణముగా నిరూపించితిని.[67] ఇంతియగాక కు, టు, తు, రు అను ప్రత్యయము లంతమందుఁగల సమానక్రియారూపములు ప్రాచీనకాలమున ప్రథమోత్తమపురుషములలో అరవమున వాడుచుండినట్లు తొల్కాప్పియమునఁ జెప్పఁబడినది.[68] కాఁబట్టి పురుషభేదము ప్రాచీనకాలమున తార్మారగుట యస్వాభావికముగాదు.

ఇంతియగాక చెయ్యుమ్ అను రూపము ప్రాచీనతమిళమున వర్తమాన క్రియారూపముగా ప్రథమపురుషమున నుండినట్లు తెలియుచున్నది. చెయ్యుమ్ అను రూపమే నేఁడు మధ్యమపురుషప్రార్థనార్థకముగా నున్నది. నేఁటి తెనుఁగునందలి తద్ధర్మార్థక ప్రార్థనార్థకరూపములగు చేయును, చేయుము అతో నారెండును అభిన్నములనుట యుక్తతరముగా నున్నది. ప్రార్థనార్థక ము, డుజ్జుల చరిత్రము సంపూర్ణము.

నేఁడు వ్యవహారమున పంతులుగారు చెప్పమన్నారు, వినమన్నారు, తినమని చెప్పినారు మొదలగురీతిని ప్రయోగములు వినఁబడుచున్నవి. వీనిని చెప్పము, తినము, వినము అని విభజించి యవి వ్యతిరేకార్థకములనియు, ప్రార్థనార్థకములుగా వాఁడబడుచున్నవనియును కల్పింపఁబడినది. చెప్పుము + అన్నారు; వినుము + అన్నారు; తినుము + అని; ఈ రీతినే యీ పదములకు సంధివిభజనము. మొత్తము రూపములో నచ్చుల సమీకరణము (Vowel harmony) వలన ఉత్వమునకు అత్వము ఉచ్చారణమునఁ గలిగినది. కాఁబట్టి అట్టి రూపములు దైనికవ్యవహారమున, అనుధాతువు పరమయినప్పుడే వినఁబడుచున్నవి. వానిని వ్యతిరేకార్థకము లనుటకంటెు ఇట్లు చెప్పుట భాషాచరిత్రము ననుసరించుచున్నది. వినవే, తినవే, చెప్పవే, ఉంచవే మొదలయిన రూపములు ప్రార్థనార్థకములుగా నున్నవి. ఇవి వినవా, తినవా, చెప్పవా, ఉంచవా, అను రూపములవంటివే. తుదినున్న 'ఆ' ప్రశ్నార్థకము. అదియే సందర్భమునుబట్టి ప్రార్థనార్థకమైనది. ప్రార్థనమునకు రెండుపక్షములు. ఒక్కటి అంగీకారము, రెండవది తిరస్కారము. అనఁగా వ్యతిరేకార్థకము. దానినే ప్రశ్నమునఁ జేర్చి పలుకుటవలన రెండవది యాక్షేపలభ్యము. ఇట్లు చెప్పుట ప్రార్థనయైనది. ఆంగ్లమునను ఇట్టిపద్ధతి గలదు. (Will you not do this = please do this) అట్లే 'ఏ'కారమును 'ఆ'కారమువలెనే ప్రశ్నార్థకముగదా! కాఁబట్టి చేరియుండ

---

[67] శ. మ. ద. సూ. 226. క్రి. పరి.

[68] తొల్. చొల్. సూ. 203-217.

వచ్చును.[69] ఇట్లే చెప్పవన్న, చెప్పవయ్యా మొదలయినవియును ప్రార్థనార్థకము లయినవి.

నేఁటి వ్యవహారమున అండి, అండీ, యను నొక గౌరవవాచకమైన ప్రార్థనా ద్యర్థకప్రత్యయ మేర్పడినది. ఇది క్రియలతుదిని, నామములతుదిని, ప్రశ్నార్థకముల తుదినిగూడ వాడఁబడుచున్నది. ఏమండి, పంతులుగారండీ మొదలయినవాని యందు కనుగొననగును. ఇది ప్రాచీనమయినవానామమని యొక రూహించిరి.[70] ప్రాకృతమునందలి 'హండా' శబ్దభవమని యొక రనిరి.[71] ఇది చాల నవీనమయిన ఆగమము. దీనికి ప్రాచీనప్రయోగమే లేదు. ఇది యనుచితవిభాగమువలన నేర్పడినదని యూహించుట సులభము. కనుఁడీ, అలుగకుఁడీ, చేయుఁడీ మొదలయిన ప్రయోగములు భారతాదిగ్రంథములలోఁ గలవు. రండు+ఈ=రండీ, వినుఁడీ, పొండి మొదలయిన ప్రయోగములనుండి ఈ యాగమము అనుచిత విభాగమునఁ గలిగినది. వినుండీ, తినుఁడీ, చూడుండీ మొదలయిన స్థలములలో అచ్చుల యాకర్షణమువలన (Vowel harmony) తినఁడీ, వినఁడీ అను రూపము లేర్పడి తరువాత నీ 'అండీ' అనునది యూహారింపఁబడి స్వతంత్రముగాఁ బ్రయోగింపఁబడుచున్నది. ఆ తరువాత మఱల ఓయ్ చేర్చి ఏమండోయ్, రండోయి అనికూడ వినఁబడుచున్నది. చేయుమీ, వినుమీ, కనుమీ మొదలయినవానినుండి 'మీ' యనుదానిని వేరుచేసి రండిమీ, పోండిమీ అనియు రూపములు సృజింపఁబడుచున్నవి.

ఇట్లే ర, రా అనునవియుఁ గ్రియలపయిని, నామములపయిని, సంబోధనమునను, ప్రార్థనమునను వాఁడబడుచుండినవి. ఇది రుప్రత్యయమునకు ఈ, ఆ, అను సంబోధనప్రత్యయములు చేర్చుటవలనను, తరువాత అనుచితవిభాగమునను ఏర్పడి కాలక్రమమున ఏకవచనమునఁ జేర్పఁబడుచు వచ్చెనని యూహించుట సులభము. మొదట అనిర్దిష్టార్థమున బహువచనముననే ఏర్పడియుండినది. కాల క్రమమున నీ రూపము పొందినది. ఏరా = ఏరు + ఆ; ఓరీ = ఓరు + ఈ; వలదుర; సుమ్మురా; వినురా = వినరా; వస్తానురా; మొదలయిన రూపము లేర్పడినవనుట స్పష్టము.

పయివిచారణనుబట్టి తేలిన సిద్ధాంత మేమనఁగా తెనుఁగున ప్రార్థనాద్యర్థకము స్వతంత్రముగా బయలుదేరినది. ఇది యితర ద్రావిడభాషలలోని ప్రణాళికతో నభిన్నమనుట నిర్ణయించితి. సంస్కృతమున నిట్లుగాదు. అందు భవ, కురు, చోరయ, ఏధి, విద్ధి మొదలయిన ప్రార్థనాద్యర్థకరూపము లా యా వికరణ

[69] "కరుణింపవె" భార. అర. VI 282, కావరె భార. అర. VI 343.

[70] C. G. D. page 531.

[71] హండే, హంజే, హలాహ్వానే నీచాం చేటీం సఖీంప్రతి. (అమరకోశ)

ప్రత్యయములవలన నేర్పడినవనుట స్పష్టము. వానికిని తెనుఁగునకును జన్య జనక భావముగాని, సోదరభావముగాని లేదు.

ఇఁక ప్రథమోత్తమపురుషముల రూపములను విభజించి పరిశీలింపవలెను.

లాడర్థంబులకును, లూడర్థంబులకును సామ్యమును, సంబంధమును మాత్రమే కాక యేకార్థకతయుఁగూడ గలదనుట నిర్వివాదము. సంప్రశ్నము, ఆశీస్సు లాడర్థములలోనివి. "ఆశీ శ్శాప సంప్రార్థన విధులందు లూట్టగు" లూడర్థంబుఁగు ప్రథమ పురుషరూపములు—మీకు మేలు కలిగెడును, మీకు మేలు కలుగుతను. లాడర్థంబగు తద్ధర్మార్థకముననే వండెడును, వండెడిని అను రూపంబులు బహుళంబుగా నగునని సూరి సూత్రించియున్నాఁడు.[72] పయిరూపంబు లభిన్నంబులని చెప్పనక్కర లేదు. ఎడు, ఎడి అంతమందుఁగల రూపములనే ఒకరు వర్తమానార్థకము లనిరి. సూరి తద్ధర్మములనెను. అందలి ఎడు వర్ణాంతకమయినరూపమునే మఱల ఆశీరాద్యర్థక మనియెను. చేయును, కలుగును మొదలయిన రూపములు అనేకములుగా ఆశీరాద్యర్థములందు వాడుకలో నున్నవి. తుదినున్న ఇ, ఉ లు అభిన్నము లగుటచేఁ బయిరూపములు రెండును అభిన్నములే యనుట నిర్వివాదము. ఈ ఎడు ప్రత్యయమును ఆనంతర్యార్థకమగు డుప్రత్యయమువలెనే భావార్థకమని తోఁచుచున్నది. వండును, వండెను, వండుదుము, వండెదము అను రూపములలో నొక దానిలో ఉవర్ణమును, మఱియొకదానిలో ఎవర్ణమును వచ్చినట్లే ఇందును అనఁగా చేయుడు, చేసెడు అను రూపము లేర్పడెననుట స్పష్టము.

విధియందు 'నాపని చేయునది' అను రీతిని 'అది' శబ్దము పరమయినరూపము ఉపయోగపడుటయు, పయిరూపములయొక్క భావార్థకతను దెలియఁజేయుచునే యున్నది. ఎడు అను ప్రత్యయమునకు ఎడ అను రూపము ప్రాచీనగ్రంథములలో నున్నదనియు, చేసెడమని రూపములు గలవనియు గిడుగు రామమూర్తిపంతులు గారు నిరూపించిరి. అప్పుడును చేయడము, కొట్టడము ఇత్యాదికమయిన అడము అంతమందుఁగల భావార్థకరూపతుల్యత ఉత్పత్తియందు దీనికిఁ గలదు. అకారమునకు ఎకారము వచ్చుటను నిరూపించితిని.

కావుత, చేయుత, కలుగుత అనునట్టి రూపములుగూడ భావార్థకములే యనుట స్పష్టము. తవర్ణము కృత్ప్రత్యయములయందు చేఁత, కలఁత మొదలగు రూపములలోఁ గలదు. ఒకటి బిందుపూర్వకము, ఇంకొకటి కాదు. అంతియ భేదము. ఇట్టి భేదము కాలక్రమమున నేర్పడి పయి యర్థభేదమునకు సూచకమయిన దనుటయు యుక్తమే.

పయివిచారణవలనఁ దేలిన దేమనఁగా ప్రార్థనాద్యర్థకములయిన లూట్ప్రత్యయములు భావార్థకప్రత్యయములుగానే భాషాప్రాథమికావస్థయం దుండెననుటయే. అట్టి ప్రత్యయములు లేనిచోట ధాతుమాత్రమే వాడఁబడుచుండెను.

---

[72] బా. వ్యా. క్రి. సూ. 23-27.

## 15. ప్రేరణార్థము

తెనుఁగున ప్రేరణార్థకరూపములు ఈక్రిందివిధమున నేర్పడుచున్నవి. (1) చేయుధాతువు అన్నంతక్రియపయిని చేర్చుట. (2) ధాతువుతుదిని ఇంచు అనునది చేర్చుట. (3) చువర్ణమును జేర్చుట. (4) పువర్ణమును జేర్చుట.

ఈ పద్ధతులన్నియు నేఁటి తెనుఁగునను గలవు. వీనిలో నర్వాచీనముగా బయలుదేరినపద్ధతి చేయుధాతువు ననుప్రయుక్తముగా నుంచుటయే. తక్కినవి ప్రాచీనములని నిర్ణయింపవచ్చును. పయి నీయంబడిన యాగమములు ధాతువుతోఁ జేరి యం దొకభాగముగఁ గనుపట్టుచుండుటయు, వానితో నభిన్నము లనందగిన యాగమములే ఇతరద్రావిడభాషలగు అరవ కన్నడములఁ గనంబడుచుండుటయుఁ బయి నిర్ణయమునకు హేతువులు.

I చేయుధాతువు ప్రేరణార్థకముగా అన్నంతక్రియలపయిని అనుప్రయుక్తమగుట నన్నయనాఁటికే స్థిరపడినది యనుట ప్రయోగములనుబట్టి తెలియుచున్నది.[73] ఇట్లు చేయుధాతువుతో సమానార్థకములయిన అరవధాతువులను అనుబంధములుగాఁ జేర్చి ప్రేరణార్థములను గల్పించుట నేఁటి వ్యావహారిక తమిళ భాషను గలదు. "పాడచ్చెయ్‌దేన్ కట్టప్పణ్ణినేన్" ఇందు చెయ్, పణ్ అను ధాతువులు అనుబంధములు. తెనుఁగునందలి చేయు, పన్ను అనువానితో సమానార్థకములు.

II ధాతువుతుదిని 'ఇంచు' అను ఆగమమును జేర్చుట. సంస్కృత ధాతువులపయిని, తెనుఁగునామములపయిని, తెనుఁగుధాతువులపయిని ఈ యనుబంధము చేర్పఁబడుచున్నది. తెనుఁగుధాతువులపయి నిది ప్రేరణార్థము. ఈ యభ్యాసము నన్నయకుముందే చాల విశాలముగా స్థిరపడె ననుట ప్రాచీనశాసనములనుండి తెలియనగును.[74]

III ధాతువుతుదిని చువర్ణమును జేర్చుటయు, పువర్ణమును జేర్చుటయుఁగూడ ప్రాచీనభాషలోనే నన్నయకుముందే స్థిరపడినవి. నన్నయభారతభాగమున చు, పు వర్ణాంతరూపములే బహుళముగాఁ గనుపట్టుచుండును.

పయి మూఁడువిధములయిన పద్ధతులలోను ప్రాచీనమయినది చు, పు వర్ణంబులు ఆగమంబులగుట. ఈ చు, పు వర్ణములు ప్రాచీనధాతువులపయి నాగమములుగా వచ్చి స్వార్థముననే ప్రయోగింపఁబడుచు రెండవతరపుధాతువులయినవనియు, ఈ రెండును భావార్థకప్రత్యయములనియు ముందు నిరూపించితిని.

---

[73] శక్రుసభనుండఁజేయుము వారిన్. భా. స. ప. I, 92.
వాయంగఁజేసితి, కదియఁజేసి. భా. అర. I, 188.

[74] ఎత్తిఞ్చి, కట్టిఞ్చి, వెల్వరించినన్—యుద్ధమల్లుని బెజవాడశాసనము. 9-వ శతాబ్ది. కట్టిఞ్చి - పండరంగని అద్దంకిశాసనము. ఎత్తించిరి, వెట్టించె 408 of 1904.

ఇవియే కొన్నియెడల ప్రేరణార్థకము లయినవి. ఈ రెండును వేర్వేరుగాఁ జేరి భిన్నరూపము లేర్పడినవియును గలవు.

రేఁగు - (స్వార్థము) రేఁచు, రేపు, రేగించు, రేగఁజేయు. (ప్రేరణ)

అరవమునను కన్నడమునను పి, వి అనునవి ప్రేరణార్థకమయిన ఆగమములుగాఁ జేర్చుట ప్రాచీనకాలమునఁ గలదు.[75] తెనుఁగునందలి పుగాగమము అందలి ప, వ లతో నభిన్నము. చు, పు లు భావార్థకములును, కృత్ప్రత్యయములు నని ముందే నిరూపించితిని. ఇట్లు చాపు, కలపు, తెలుపు, మాపు, చింపు, పంపు మొదలయిన పువర్ణాంత భావార్థకములను ధాతువులుగా గ్రహించి ఎను, ఇరి మొదలయిన క్రియాప్రత్యయములను జేర్చి చాపెను, కలపిరి, తెలిపిరి, మాపుదును, చింపఁగలను, పంపుచున్నాను మున్నగు వివిధరూపములు బయలుదేరినవనుట స్పష్టము. ఇట్లే చువర్ణాంతములపయినిగూడ (అడచు, చాచు, తూఁచు, మించు, ముడుచు) ప్రేరణార్థకరూపము లుప్పతిల్లినవి.

పయి చువర్ణాంత పువర్ణాంత రూపములు కాలక్రమమున మఱల స్వార్థములుగానే ప్రయోగింపఁబడుచురాఁగా మఱల 'ఇంచు' చేర్పఁబడి కొలిపించు, వినిపించు మొదలయిన రూపములు గలిగినవి. ఇవి కలుగుట రెండువిధములు: (1) పువర్ణాంతములపయి 'ఇంచు' చేర్చుట. తెలుపు+ఇంచు = తెలిపించు. (2) చువర్ణాంతములపయిని 'ఇంచు' చేర్చుటవలన వర్ణవిభేదనము కలిగి మొదటి చకారమునకు పకారము పువర్ణయుక్తరూపముల సామ్యమునఁ గలుగుట.

ఇట్లు భిన్నావస్థలయందు భిన్నరూపము లేర్పడి భిన్నమండలములలోను, ఒక్కమండలమునను వాడుకలో నుండినవి.

పైరీతి నేర్పడిన వైవిధ్యమునకుఁ దోడుగా ఊనికమాఱుట మొదలగువాని వలన నేర్పడిన యితరరూపములును గలిసినవి. మొత్తముమీఁద వీని కన్నిటికి ఒక్కరీతిగా అనుగమము కల్పింపలేక సూరి "ఇంచుకుప్పుగాగమంబులు పరంబులగునపుడు ఆగమాదేశలోపంబులు పెక్కుతెఱఁగులఁ గానంబడియెడి" అని సూత్రించెను.

పయివానిలో 'ఇంచు' అను ఆగమముయొక్క చరిత్రమును విమర్శింపవలయును. ప్రాచీనశాసనములయందు ఇది 'ఇచ్చు' అనురూపముతోఁగూడ నున్నది.[76] కన్నడమున 'ఇసు' అను ఆగమము ప్రాచీనభాషలో బహుళముగా ప్రేరణార్థముగా వాడఁబడుచుండెను.[77]

---

[75] ప్రాచీన కన్నడభాష. ముడిప్పిదార్ = ముడియించిరి.

[76] సరియిచ్చువారు. ద. హి. శా. V. నెం. 1011. కాలము క్రీ. శ. 1063.
సరియించువారు. ,, ,, 1009. 1082.

[77] బిడిసిదర్ = (బిడు + ఇసు + ఇదర్) విడిపించిరి. నిరిసిదోమ్ = నిలిపినది. (నిరు + ఇసు) ఆఱేడు శతాబ్దముల కన్నడశాసనములు, ఎ. ఎన్. నరసింహయ్య, మైసూరు.

ఈ యాగమములలోని ముఖ్యభాగము ( ఈ = ఇచ్చు, ఇంచు = ఇసు ) 'ఈ' యను ధాతురూపమే. చేయనీ, చేయనిచ్చు, చేయించు అను రూపములు మూఁడును కొంచెము మించుమించుగ నొకేయర్థమునఁ బ్రయోగింపఁబడుచుండి నట్లును, గాలక్రమమున నేఁటి యర్థభేదము ఏర్పడినట్లును ఊహించుట సులభము. మూలద్రావిడధాతువయిన 'ఈ' యనునది ప్రేరణార్థకముగా ననుబంధమయి వాడఁబడుచుండెననుట నిర్వివాదము. పయి నాలుగును దాని రూపభేదములే. అరవమునను మిక్కిలి ప్రాచీనభాషలో పురనానూరు మొదలయిన గ్రంథములలో ముటీ ఇ=విటిపించి అను రూపములవంటి రూపములలో ఈధాతువే వాడఁబడు చుండినట్లు ఊహింపనగును.[78] 'ఈ' యను ప్రాచీనధాతువుయొక్క రెండవతరపు ధాతురూపములే ఇచ్చు, ఇంచు, ఇసు అనునవి యనుట స్పష్టమే.

పయివిచారణవలన తెనుఁగు తక్కినద్రావిడభాషలతో ప్రేరణార్థ నిర్మాణ పద్ధతియందు మిక్కిలి యభిన్నమయిన మార్గమున నున్నదనుట స్పష్టము.

తెనుఁగునందలి ప్రేరణరూపనిర్మాణప్రక్రియలో చు, పు వర్ణములు చేర్చుట మిక్కిలి ప్రాచీనము. ఇంచు చేర్చుట తరువాతిది. చేయు అనుబంధముగాఁ జేర్చుట అర్వాచీనము.

## 16. కర్మార్థకము

కర్మార్థక ప్రయోగములు ప్రాచీనభాషలలో విరళములనియు, కర్మార్థ ప్రక్రియ నన్నయచే నంగీకరింపఁబడి తెనుఁగున స్థిరపడినదనియు ముందు వ్రాసితిని. (ఆంధ్రవ్యాకరణమునకు సంస్కృతవ్యాకరణముతోఁగల సంబంధము అను శీర్షికలో నన్నయభాషలో స్థిరపడిన విశేషములు అను విషయమును జూచునది) నేఁడు తెనుఁగున కర్మార్థకప్రయోగము పడుధాతువును అన్నంతక్రియపయిని అనుబంధముగాఁ జేర్చుటవలన సిద్ధమగుచున్నది. ఈ ప్రణాళిక ఆంధ్రశబ్దచింతామణి యందు సూచింపఁబడినది.[1] నన్నయభారతమున ననేక కర్మార్థకప్రయోగములు గలవు. వీని నేర్చి పరిశీలింపగా సుమా రఱువది ప్రయోగములు కనుపించుచున్నవి. వానిలో దేశ్యధాతువులు 45. మిగిలినవి తత్సమధాతువులు, సమాపకక్రియలు, ధాతుజన్యవిశేషణములు, వ్యతిరేకార్థకములు మొదలయిన వన్నియును గనుపట్టు చున్నవి. నన్నయకు ముందుడిన శాసనములయందు రెండు మూఁడు ప్రయోగములు లభించినట్లు నిరూపించితిని.

తెనుఁగున పడుధాతువు ననుబంధముగాఁ జేర్పకయే కర్మార్థకమును దెలుపుట స్వభావమనియు, వాడుకలో కర్మార్థము వినఁబడుట నేఁటికిని అరుదనియుఁ

---

[78] P. S. S. Page. 150

[1] కర్మణ్యనుబంధస్స్యాత్ పతిధాతుః కర్తృవచ్చ తద్విధయః. నన్నయ, చింతామణి క్రి. ప్ర.

దెల్పితిని. పడుధాతు వక్క-అలేకయే కర్మార్థమును దెలుపు నుదాహరణములను ముందు నిరూపించితిని. అట్టిరీతినే నేఁడును దైనికవ్యవహారము జరుగుచుండుట యనుభవసిద్ధమే. ఇట్టి పద్ధతియే యితర ద్రావిడభాషలయందును నున్నది.

1. ప్రాచీనభాషయందు కర్మార్థకప్రయోగములు చాల విరళముగా నుండుట. 2. దైనికవ్యవహారములో దీనికి ప్రవేశము లేకపోవుట. 3. గ్రాంథికముగాను, అరవమునను, కన్నడమునను తెనుఁగునందువలెనే పడుధాతువే యనుప్రయుక్తమగుచుండుట. 4. పడుధాతు వక్క-అలేకయే కర్మార్థకభావమును జెప్పవలసివచ్చినప్పుడు అవలంబించు విధానము అన్ని ద్రావిడభాషలయందును దుల్యముగనే యుండుట. ఈ విషయములు క్రింద ప్రపంచింపఁబడుచున్నవి.

తొలుకాప్పియమున కర్మార్థకమునుగూర్చి విచారణముగాని వివరణముగాని చేయఁబడలేదు. కాని తృతీయావిభక్తి కర్తను జెప్పునని తత్కర్త చెప్పెను. తనకాలములో కర్మార్థకము వాడుకలోనున్ననే యట్టిది సంభవమగును. ఇంతేకాక 'ఎనప్పడుప' (అనఁబడును) అనికూడ ప్రయోగించెను. ప్రాచీనకాలమునందలి సారస్వతములో కర్మార్థకరూపములు అరుదుగా నున్నవి. నడిమికాలపు సారస్వతమునను, శాసనములలోను ఈ ప్రయోగములు విరివిగా నున్నవి.[2] పడుధాతువే యం దనుప్రయుక్తమగుచున్నను తగు, పెరు అనుధాతువు లీ యర్థమున ననుప్రయుక్తములయిన రూపములుగూడ గలవు. తగుధాతువు నీ యర్థమున ననుప్రయుక్తముగా నుదాహరించిన వైయాకరణులును గలరు.

ప్రాచీన కర్ణాటభాషాశాసనములలో (6-7 శతా)[3] కర్మార్థకప్రయోగములు రెండే లభించినవి. ఎయిదప్పడువార్ =(పొందఁబడువారు), ఎరివెప్పడువోర్ = (బాధింపఁబడువారు). పదుమూఁడవశతాబ్దియందున్న కేశిరాజు శబ్దమణిదర్పణమున అల్ వర్ణకమునకుఁ బరముగా పడుధాతువు అన్నిధాతువులకును అనుప్రయుక్తమగును[4] అని వ్రాసెను. అది సకర్మకధాతువయినచో కర్మార్థకప్రయోగ మగును. అకర్మకమయినచో నర్థభేదము రాదు. ఉదా : ఆం బేడల్పట్టెం= నేను వేడఁబడితిని. తానిరల్ పట్టం= తాను ఉండఁబడెను. కర్ణాటభాషయం దీ పడుధాతువు అకర్మకములపయినికూడ ననుప్రయుక్తమగును. తెనుఁగునను ఈ పడు అనునది అకర్మకంబులపయి ననుప్రయుక్తంబగును.[5]

పయివిచారణమునుబట్టి యీ క్రిందివిషయములు స్పష్టములు :

1. అన్ని ద్రావిడభాషలయందును కర్మార్థకప్రయోగము కాలక్రమమున గలిగి సంస్కృతభాషాసాహచర్యమున స్థిరపడినది.

---

[2] P. S. S. page 176

[3] *A grammar of the oldest Kanarese.* A. N. Narasimhaiah. Page 215.

[4] శ. మ. ద. సూ. ౨౫౭.

[5] తమ మతమ యనుష్ఠించుఁగాక మఱలంబడునే. భా. ఉ. 317; ఉండఁబడిన.

2. ద్రావిడభాషలలో పడుధాతు వనుప్రయుక్తము చేయవలసిన ప్రణాళిక యక్కఱలేకయే అనేకవిధములుగా కర్మార్థకభావమును జెప్పవచ్చును. వానిని విడిచి యీ పడుధాత్వనుప్రయోగమే గ్రంథవ్యవహారమున నీ భాషలలో స్థిరపడినది.

ద్రావిడభాషలలో తెనుఁగున కర్మార్థకమును జెప్పుపద్ధతులు :

I కర్మను ముందుదెలిపి కర్తను ఊహించుకొనుటకు విడిచివేయుట.

ఇల్లు కట్టిరి, బండి తోలిరి, వ్యవసాయము చేసిరి.

వీట్టై కట్టివిట్టార్. పుస్తకమ్ ఎళుదినార్ (పుస్తకము వ్రాసిరి.) అరవము.

మనె కట్టిబిట్టరు. పుస్తక బరెదుబిట్టరు. ( ,, ) కన్నడము

పై ప్రయోగములయందు కర్త ఉక్తమయినను ఎవ్వరో తెలుపనక్కఱలేదు.

II క్రియయొక్క భావార్థకమునుగాని, అమహద్రూపమునుగాని ఉపయోగించుట.

పని అయినది. ఇల్లు కట్టడము ముగిసినది. విత్తనములు నేలలో పడినవి. ఇతర ద్రావిడభాషలయందును వీనికి సరియయిన ప్రయోగములే వాడుకలో నున్నవి.

III కర్త్రర్థకరూపము నేవాడి సందర్భమునుబట్టి యర్థావగతి చేసికొనుట.

నీవు చేసినపని=నీచే చేయఁబడినపని.

అది చెప్పలేదు=అది చెప్పఁబడలేదు.

మనుజుఁడు అనువాఁడు=మనుజుఁడు అనఁబడువాఁడు.

వంకాయ లమ్ముచున్నవి=వంకాయ లమ్మఁబడుచున్నవి.

IV కృదంతరూపములతో, అనుభవించుతో, సమానార్థకములగు క్రియలను బ్రయోగించుట.

తిట్లు తింటిని, మాటలు పడితిని, శిక్ష అనుభవించితిని.

V అన్నంతక్రియలపయిని పడుధాతువును అనుబంధముగాఁ జేర్చుట.

చంపఁబడెను. చేయఁబడినది.

పయి యనుబంధము కొన్నియెడల అకర్మకక్రియలపయినిగూడ వినవచ్చుచున్నది యని నిరూపించితిని. ఉండఁబడినది, మఱలంబడునే.

కొన్నియెడల పడుధాతువు కర్త్రర్థమునఁగూడఁ వాఁడబడుచున్నది. వినఁబడితిని=వింటిని ; కూలఁబడితిని=కూలిపోతిని ; నిలువఁబడితిని=నిలిచితిని ; కూర్చుండఁబడితిని=కూర్చుంటిని.

పయి యుదాహరణములనుబట్టి కర్మార్థమును దెలియఁజేయు ప్రణాళికలలో పడుధాతువును అనుబంధముగాఁ జేర్చుట యొకవిధానము. తక్కినవన్నియు వెనుకపడి యిదిమాత్రమే స్థిరపడినది. పడు అను ధాతువు అకర్మకధాతువులపయిని అనుబంధముగాఁ జేరి, శబ్దపల్లవము లేర్పడి కర్త్రర్థమునే నిరూపించుచున్నవనుట

వలన ఈ పడుధాత్వనుప్రయోగమునకును, కర్మార్థకప్రణాళికకును గల సంబంధము ప్రాచీనకాలమున నియతముగాదనుట స్పష్టము.

అరవ కన్నడములయందును ఈ ధాతువు అల్ అంతమందుగల భావ నామములపయినే చేర్పఁబడుచున్నది.

చెయల్ + పడుమ్ = చెయప్పడుమ్ = చేయఁబడును.

మారల్ + పడు త్తదె (కన్నడము) అమ్మబడును. పయి అల్ప్రత్యయస్థ లకారమే తెనుఁగున నకారమయినది యని గ్రహించుట సులభము.

చెయల్ + పడుమ్ = చేయఁబడును.

పయిరీతిని ద్రావిడభాషలలో నేర్పడిన కర్మార్థకము చరిత్రమును బరిశీలించినచో ద్రావిడభాషలకును సంస్కృత ప్రాకృతములకును జన్య జనక భావము లేదనుట స్పష్టమగును.

## 17. వ్యతిరేకార్థకములు

చేయఁడు, చేయరు, చేయను, చేయక, చేయమి, చేయని అను రూపములు చేయుధాతువునకు వ్యతిరేకార్థకములగు రూపములు. పయిరూపము లన్నిటి యందును ధాతువు తుదిని 'అ' యను ఆగమము వచ్చుచున్నది. ఈ అకారమే వ్యతిరేకార్థకమని చూచినవెంటనే గోచరించుచున్నది. ఈ యభిప్రాయముతోడనే చిన్నయసూరి లజీ, కజీ, మిజీ, నిజీ యను ప్రత్యయములను విధించి జీత్తులకు, జీవర్ణ మిత్తుగాఁగల యాగమములకు ముందున్న ధాతువుయొక్క ఉకారమునకు అకారము వచ్చును అని విధించెను. కావున సూరి మతంబునను అకారమే వ్యతిరేకార్థకము. వ్యతిరేకార్థకమున 'అ' యాగమమని చింతామణి చెప్పుచున్నది.[1] కాఁబట్టి తెనుఁగున అకారమే వ్యతిరేకార్థకమనుట నిర్వివాదము.

ఇట్లు ధాతువుతుదిని అకారమును చేర్చుటచేమాత్రమే కాక లేదు, కాదు, రాదు, కూడదు మొదలయిన వ్యతిరేకార్థకరూపములను అన్నంతక్రియలపయిఁ జేర్చి వాడుచున్నాము. ఉ: చేయలేదు, ఆసపడంగాదు, ఈరాదు, వినఁగూడదు.

పయి రెండువిధములయిన పద్ధతులుమాత్రమేగాక మఱి యేదయిన మార్గాంతరము తెనుఁగున నుండెననుటకు ఆధారములు గలవా యని యోచింప వలయును.

ఈని, ఈడు, పోక, పోదు, రాక, రామి మొదలయిన రూపములలో అకారములేకయే వ్యతిరేకార్థకరూపములు సిద్ధములగుచున్నవి. ఇంతియగాక ఈయని, ఇవ్వని, ఈయడు, ఇవ్వడు, పోవక, పోవదు అనునట్టి వికల్పరూపములు

[1] వ్యతిరేకాదో భావిని చ అత్ స్యాత్. ఆ. శ. చి. క్రి. సూ. 14.

గూడ పయిధాతువులకుఁ గలవు. ఇందలి రెండవతరపు రూపములు ఇచ్చు, పోవు మొదలగు రెండవతరపు ధాతువులపయిని అకారాగమము వచ్చుటచేతనే యేర్పడినవనుట స్పష్టము. దీనినిబట్టి యొకవిషయము దెలియుచున్నది. ప్రాచీనధాతురూపములపయి అకారాగమములేకయే వ్యతిరేకార్థకము లేర్పడు ప్రణాళిక యుండినదనుటయే యది. పాక, రామి, కాని మొదలయిన రూపములలో అకారము వచ్చినదో లేదో చెప్పుటకు వీలులేదు. అకారము వచ్చినను పూర్వమునను న్న ధాతుగతమయిన ఆకారములో అకారము కలిసిపోయియుండవచ్చును. పోని, పోక మొదలయిన స్థలములలో అకారము రాలేదనుట నిర్వివాదము.

తెనుఁగునందలి వ్యతిరేకార్థకరూపములు కాలత్రయబోధకంబులనుట వ్యాకరణప్రసిద్ధము.[2] ఇట్లే వ్యతిరేకార్థకసమాపకక్రియారూపములు అరవమునను, గన్నడమునను కాలత్రయబోధకము లనుట సుప్రసిద్ధము. ఆఱేడు శతాబ్దములలోని కన్నడశాసనములయందును అకారము వ్యతిరేకార్థకములయందు వ్యతిరేకార్థకముగా వాడఁబడుచుండినది.[3] కాని యందును ప్రాచీనభాషారూపములలో వ్యతిరేకసమాపకరూపములయందు ధాతువునకు సార్వనామికప్రత్యయమాత్రములను జేర్చుటచేతనే వ్యతిరేకార్థకము లేర్పడుచుండినవి. అకారాగమ మక్కఱలేదు.[4]

అరవమునందలి ప్రాచీనసారస్వతమును పరిశీలించినచో వ్యతిరేకార్థకరూపము లీ క్రిందిరీతిని ఏర్పడుచుండినట్లు స్పష్టము.[5]

(1) అల్, ఇల్ అను వ్యతిరేకార్థకములయిన ఆగమములను ధాతువు తరువాతగాని, కాలబోధకమయిన ఆగమమునకును తిఙ్ప్రత్యయమునకు నడుమగాని చేర్చుటవలన.

చెల్ + ల్ + అల్ + అమ్ = చెల్లలమ్ (వెళ్ళను.)
అఱి + అల్ + అన్ = అఱియలన్ (ఎఱుగఁడు.)
ఉరై + త్ + త్ + ఇల్ + అన్ = ఉరైత్తిలన్ (వాడు చెప్పలేదు)
కణ్ + డ్ + ఇల్ + ఏన్ = కణ్డిలేన్ (నేను చూడలేదు.)

(2) 'అల్' అను ధాతువుయొక్క సమాపకరూపములను ఇతరసమాపకక్రియలకుఁ జేర్చుటవలన,

---

[2] వ్యతిరేకక్రియ యర్థత్రయబోధకంబగు. అర్థత్రయము=భూతభవిష్యద్వర్తమానార్థములు. ప్రౌ. వ్యా. క్రి. సూ. 8. కాలత్రయపరిణామిగళెనిసి నెగల్దమూఱుం క్రియెయోళ్ నిరుతం ప్రతిషేధక్రియె-మాడం=చేయుఁడు. మూఁడుకాలములును అర్థమే. శ. మ. ద. సూ. 221.

[3] నిల్లదె=నిల్ + అ + దె (నిలువకయే); తప్పాదె (తప్పు + అ + దె)= తప్పకయే *Grammar of the oldest Kanarese Language*: page 208.

[4] మెచ్చెను=మెచ్చను. *Grammar of the oldest Kanarese Language*: page 214.

[5] S. S. page 172,

చెల్వేమ్ అల్లేమ్ = మేము పోము.
ఒల్లాన్ అల్లన్ = ఒల్లఁడు.

(3) 'అ' యను ఆగమము చేర్చుటవలన,
ఆగాదు = కాదు; ముదలాదు = మొదలిడదు.

(4) ధాతువుతుదిని ప్రత్యయమాత్రములను జేర్చుటచేతను,
కాణ్+పన్ = చూడను; ఒల్+ల్+అయ్ = ఒల్లాయ్ (ఒల్లవు);
ఒల్+ల్+అన్=ఒల్లఁడు.

1. పయిని నిరూపించిన పద్ధతులలో మూఁడుభాషలయందును సామాన్యమయినపద్ధతి ధాతువుతుదిని అకారముచేర్చుట. ఈ పద్ధతి ప్రాచీనతమిళమున అల్పము. కన్నడమున అంతటికంటె అధికమయిన ప్రచారము గలది.

2. లేదు, కాదు మొదలయిన వ్యతిరేకార్థకసమాపకక్రియారూపములను తెనుఁగునఁ జేర్చుటవలెనే అరవమునందును జేర్చుట గలదు.

3. తెనుఁగునందలి పోను, పోదు, లేను, ఈక, ఈని మొదలయిన ఆగమవిరహితరూపములవంటి రూపములు ప్రాచీనకన్నడమునఁ గొన్ని గలవు. అరవమున నధికసంఖ్యాకములు.

పయిరీతిని సరిచూచుటవలన నేర్పడిన సిద్ధాంతములు :

I. తెనుఁగునందువలె అకారము వ్యతిరేకార్థకముగ ప్రాచీనద్రావిడ భాషలో నుండినదియే. తెనుఁగుననే ఈ పద్ధతికి పరిపూర్ణత కలిగినది.

II. లేదు, కాదు మొదలయిన సహాయక్రియారూపములను జేర్చుటవలన అన్ని ద్రావిడభాషలయందును వ్యతిరేకరూపము లేర్పడుట నాఁటినుండి నేఁటి వఱకును కొంచె మించుమించుగా నొక్కరీతినే యున్నది.

III. స్వార్థ వ్యతిరేకార్థములయందు రెంటను ఒకటేరీతిని రూపములు ఏర్పడుచుండుట కాలక్రమమున నశించినది. తెనుఁగున అల్పముగా కొన్నిరూపములు మాత్రము నిలిచినవి. ప్రాచీనకాలమున అభిన్నరూపములే స్వార్థ వ్యతిరేకార్థముల రెంటియందును వాడుచు సందర్భమునుబట్టి యర్థమును దెలిసికొనుచుండిరి.[6] ఈ యర్థభేదము ఊనికవలనఁ దెలియనయ్యెడిది కాబోలును.

IV. మూఁడుభాషలయందును చేర్పఁబడు వ్యతిరేకార్థకమయిన యాగమము 'అల్' అను ధాతువుయొక్క పరిశిష్టమని యూహింపఁబడినది.[7]

V. వ్యతిరేకక్రియ అన్నిభాషలయందును కాలత్రయబోధకము.

పయిపద్ధతియు, దానిచరిత్రమును ద్రావిడభాషలు అభిన్నములనియు, ప్రాచీనద్రావిడమాండలికములనియు విశదపఱచుచున్నవి. నశబ్దము నకరోతి, అకృతమ్

[6] P. S. S. 174.

[7] C. G. D. page 475.

మొదలయినరీతిని వాడఁబడు సంస్కృతమునకును ద్రావిడ వ్యతిరేకార్థమునకును సంబంధము లేదనుటయు స్పష్టము.

పయిరీతిని తెనుఁగుయొక్క క్రియారూపములను ద్రావిడభాషలయొక్క క్రియారూపములతోను, సంస్కృత ప్రాకృతములయందలి క్రియారూపములతోను గలిపి పరిశీలించితిని. ధాతువుల ప్రాచీనస్వరూపమునఁగాని, తిఙ్ప్రత్యయముల యందుఁగాని, సమాసతుల్యములయిన సమాపకక్రియారూపముల నేర్పఱుచుట యందుఁగాని, కర్మార్థకప్రక్రియనుగాని, వ్యతిరేకార్థకవిధానమునఁగాని, కాల విభజనమునఁగాని, తద్ధర్మార్థకనిర్మాణమునంగాని, ప్రేరణార్థకరూపపరిణతియందు గాని ద్రావిడభాష లభిన్నములు, సోదర స్వభావముగలవి యను సిద్ధాంతమే యేర్పడి నదిగాని వేఱుగాదు. దీనికి సంస్కృత ప్రాకృతములతో జన్య జనక భావసంబంధము గాని, సోదరభావముగాని లేనట్లును నిర్ణీతమయినది.

# కృత్తద్ధితాంతపదములు

## 1. కృత్తద్ధితస్వభావము

సంస్కృతవ్యాకరణము ననుసరించి తెనుఁగువ్యాకరణమున విధింపబడిన సుప్ప్రత్యయములును, తిఙ్ప్రత్యయములును ముందు నిరూపింపఁబడినవి. వానికంటె భిన్నములైయునవి కృత్తులనియు, తద్ధితములనియు రెండువిధములైయున ప్రత్యయములు గలవు. కృత్ప్రత్యయములు ధాతువులకయి విధింపఁబడును.[1] తద్ధితములు నామములపయి విధింపబడుచున్నవి. వీనిని ఆఙ్గ్లవైయాకరణమర్యాద ననుసరించి Primary Suffixes, Secondary Suffixes అనియు వ్యవహరించుచున్నారు. పయి సంస్కృతమర్యాద ననుసరించియే చిన్నయసూరి కృదంతపరిచ్ఛేదమనియు, తద్ధిత పరిచ్ఛేదమనియు రెండువిధముల విభజించి తన వ్యాకరణమున నిరూపించెను. "విభక్త్యంతములయిన శబ్దములమీఁది భావార్థ మతుబర్థాదులయందుఁ బ్రయోగించు ప్రత్యయంబులు తద్ధితంబు లనంబడును."[2] కృదంతపరిచ్ఛేదమున "ధాతువునకు విహితంబగు డుఙ్భిన్న ప్రత్యయంబు కృత్తనంబడు. కృత్తులకు వక్ష్యమాణంబులకు భావ కర్తృ కర్మాద్యర్థంబులు మహాజనవ్యవహారానుసారిగా నెఱుంగునది" అని సూరి సూత్రించెను. పయి సూరిగారి ప్రణాళిక పాణినీయానుసారిగా నున్నదనుట నిర్వివాదము.

[1]కృదతిఙ్ 3-1-93 సన్నిహితే ధాత్వధికారే తిఙ్భిన్నః ప్రత్యయః కృత్సంజ్ఞః స్యాత్॥ "సమీపముననున్న ధాతోః అను నధికారమున ధాతువుకంటె విహితమై తిఙ్భిన్నమైన ప్రత్యయము కృత్సంజ్ఞ కలదగును." కౌముదీశరదాగమము. తద్ధితాః 4-1-76. ఆపఞ్చమ సమాప్తేరధికారోఽయమ్॥ "ఇచటనుండి ఐదవ యధ్యాయము తుదివఱకు తద్ధితాః అనునది యధికృతమగును. తేభ్యః=ప్రయోగేభ్యః (ప్రయోగముల కొఱకు) హితాః (హితములయినవి) తద్ధితాః అను అన్వర్థలాభముకొఱకు మహాసంజ్ఞాకరణము. దీనివలన నీ తద్ధిత ప్రత్యయములు ప్రయోగము ననుసరించియే వచ్చునను అర్థము లభించును.

తద్ధితా ఇతి సూత్రేణాధికృత్య యాన స్త్రీః ఇత్యాదినా పంచమాధ్యాయ సమాప్తిం యావ ద్యేప్రత్యయా విహితా స్తే తద్ధితసంజ్ఞకాః॥ విభక్త్యాది క్రికా దన్యః ప్రత్యయ స్తద్ధితం మతమ్॥ నామప్రకృతికో నైవమతివ్యాప్త్యాదిదోషతః॥ విభక్తి ధాత్వంశకృద్భ్యోఽన్యః ప్రత్యయ స్తద్ధితః॥ తద్ధితప్రత్యయముల యర్థములు కొన్ని. తస్యాపత్యం తద్విశేష స్తద్రూఢేణయుతేందుమాన్। కాల స్తథా తేన ర క్తం తస్యవ్యూహోఽథవే త్తిశత్। అధీతేవాదేవతాఽస్యసై వమాదీన్ యథాయథమ్। బోధయద్వివిధానర్థాన్ తద్ధితం స్యా దనేకథా॥ "

[2]బా. వ్యా. గు. పు. 287.

క్రియాపదములయందుఁ గనుపట్టు ధాతువులును వానికంటె నితరములయిన నామాదికమును భిన్నములని గ్రహించుటయే యిందు ముఖ్యమయిన విశేషము. అట్లు భిన్నములయినవానిపయి వచ్చు ప్రత్యయములను జాతియందు భిన్నములనుట స్పష్టము. ఇట్టి భేదముల నేలకో ప్రాచీనులు స్పష్టపఱిచినట్లు కనఁబడదు. అత్యల్ప ప్రణాళిక గలిగిన యాంధ్రశబ్దచింతామణియందీ విచారము లేదు. ఆంధ్రభాషా భూషణమున తద్ధితప్రత్యయములు కొన్నియును, కృత్ప్రత్యయంబులు గొన్నియును కలిపి నిరూపింపఁబడినవి. విభాగముగాని, సంజ్ఞకాని చేయంబడలేదు. ఇందు కృత్ప్రత్యయంబు లత్యల్పసంఖ్యాకంబులు.[3] కేతన తన వ్యాకరణమున తద్ధితములను కొంచెముగా నిరూపించెనుగాని కృత్తుల నెత్తుకొనలేదు.[4]

తొల్కాప్పియమునందును కృత్తులు, తద్ధితములు అను పేళ్ళుగాని, యట్టి భేదముగాని నిరూపింపఁబడిన ట్లూహించుట కవకాశము లేదు. వీరచోళియమ్ (11-వ శతాబ్దము) అను అరవవ్యాకరణమున కృత్తద్ధిత ప్రత్యయ విభాగమును, సంస్కృతసంజ్ఞలును గ్రహింపఁబడినవి.[5]

కన్నడవ్యాకరణమగు శబ్దమణిదర్పణమున తద్ధితప్రకరణ మను నొక ప్రకరణము వ్రాయఁబడెను. అందు ధాతువుకంటె విహితములయిన ప్రత్యయములు గూడ పేర్కొనఁబడినవి. కృత్తులనియు, తద్ధితములనియు రెండు విభాగములను గాని, వానికిఁగల భేదమునుగాని పయిరీతిని పేర్కొనలేదు. మాడిద = చేసిన, నోడిద = చూచిన మొదలయిన క్రియాజన్యవిశేషణములు కృత్తులని నిరూపింపబడినవి.[6]

పయి విచారణమువలనఁ దేలిన దేమనఁగా కృత్తద్ధిత ప్రత్యయములకుఁగల భేదము పాణినీయమున నిరూపింపఁబడినట్లు ప్రాచీనద్రావిడభాషావ్యాకరణములలో స్పష్టముగా గుర్తింపఁబడకయుండెననుటయేకదా! దీనికి హేతువు స్పష్టము. సంస్కృతమున ధాతువులకును, నామప్రకృతులకును గల భేదము సుప్రసిద్ధము, అవయవికము, బాగుగా విస్ఫారి గుర్తింపఁబడినది. సంస్కృతము అధికసంఖ్యాకము లయిన ప్రత్యయములు గలది. అనఁగా ననేకకాల మభివృద్ధమయిన ప్రత్యయాత్మ

---

[3] అమిలేమికి నిమికల్మికి నమరంగాఁ దనము ధర్మమగుటకుఁదగుఁగా
నమివినమితాల్మి కూరిమి తమమంచితనము లోభితన మనఁజనుటౌ. ప. 165

[4] అరయిడి కాఁడాఁడఅయన-ధరలో నొక కొన్నిచెల్లుఁ దద్ధితపదముల్
పలువడి వానిసెఱుంగుట-పరమపరిజ్ఞాన మంధ్రభాషాకవితన్. ప. 142
......చిందఅందఱ యనఁగఁబరగు పలుకులు తద్ధితపదములయ్యె. ప. 143

[5] P. S. S. page 204.

[6] కృత్తింగె – మాడిద, బేడిద, నోడిద, కూడిద ఎందిరిసి కృత్తు నరివుదు; తరువాయిం-
మాడిదం, మాడిదనం, మాడిదనోళ్ ఎందీపరి విభక్తిమాలె యక్కుం॥
శ. మ. ద. సూ. 72

కావస్థయందుండినది. గొప్ప పరిశోధనకు, విభజనకుఁ బాల్పడినది. తెనుఁగు మొదలగు ద్రావిడభాషలయందు క్రియాప్రకృతులయిన ధాతువులకును, నామప్రకృతులయిన తద్ధిత కృదంతములకును భేద మేర్పడ లేదు. అట్టిసందర్భములో తద్ధితాంత కృదంత ములకుఁ గల భేదమును వివరించుట దూరాపాస్తము. తెనుఁగునందలి శబ్దముల మూల ప్రకృతులు ప్రాచీనకాలమున నేభాషాభాగముగా నుండినను గొంచె మించుమించుగ నొక్కతీరుననే యుండి నేఁటి రూపాంతరమును గాలక్రమమున బొందినట్లును, అట్టి భేదము చాలవఱకు సంస్కృతభాషానుకరణమున తద్వ్యాకరణానుసరణమునను వ్యవహర్తలయు, వ్యాకర్తలయు బుద్ధిస్థమైనదని ముం దనేకస్థలములఁ జెప్పియుంటిని.

సాధారణముగా ప్రాచీనరూపములయందు ధాతు కృదంత తద్ధితాంతములు రూపమున నత్యల్పభేదముతోనే యుండును. నేఁడు కొంతవఱకుఁ బయిభేదమును బాగుగా నిరూపింపనగును. అట్టి భేదము నుద్దేశించియే చిన్నయసూరి రెండు ప్రకరణ ములుగా విభజించి వేర్వేరుగా వీనిని నిరూపించెను.

ఈ క్రిందను నిరూపింపబడు కృత్తద్ధితప్రత్యయముల స్వరూపమును, జరిత్ర మును దిఙ్మాత్రముగా నుండును. ఇవి యన్నియు ద్రావిడములనియును, అభిన్నము లనియుఁ జూపుటయే ముఖ్యోద్దేశము. పయిగా భాషయందలి పదము లేరీతిని కాలక్రమమున నేర్పడుననుటయు నిరూపింపనగును. ప్రత్యయముల స్వరూపమును మాఱుచుండును. దీని కుదాహరణము ముందఱ నొకసారి వ్యవహారమునుండి యిచ్చితిని. 'తినవలెను' అను ప్రాచీనరూపము నేఁడు 'తినాలి' అయినది. నేఁటి రూపమున 'ఆలి' ప్రత్యయము. నువర్ణకమునకుఁ బ్రాచీనరూపములు, 'న్, ం, మ్' అనునవి యనుటయు ముందు సిద్ధమయినదియే. కాఁబట్టి యొకభాషలోనున్న ప్రత్యయమును దానికంటె విజాతీయమయిన కుటుంబములోనున్న భాషలోని ప్రత్యయముతోఁ గలిపి పరీక్షించునపుడు చాల జాగరూకత వహింపవలెను. రూప మాత్రమునఁగల సాదృశ్యము అభేదమునుగాని, సాజాత్యమునుగాని నిరూపింపఁ జాలదు. ఆ యా ప్రత్యయముల చరిత్రమును దెలిసికొనియే నిరూపింపవలయును. సంస్కృతమునందలి ప్రత్యయములు చాల ప్రాచీనములగుట వాని స్వరూప స్వభావ ములు సులభముగా నెఱుకపడవు. పయిగా వైయాకరణులచే ననేకవిధములుగా నాహరింపఁబడినవియు నగుటయు వాని చారిత్రస్వరూపమునే వారు నిరూపించిరనుటకు వీలులేదు. ద్రావిడభాషలయందలి ప్రత్యయము లభిన్నములయి మూండలికావస్థ యందుండి నేఁ డేరీతిని ఆ యా భాషలయందు విభజింపఁబడినవనియు సులభముగాఁ బరిశీలనవలన నిర్ణయింప నగును.

## 2. కృత్ప్రత్యయములు

ధాతువులపయిని కృత్ప్రత్యయములు చేరునప్పుడు వాని యంతమందుఁగల గ, క, చ, య, వ అనువానికి లోపము గలుగు నను సూరిగారి సూత్రము గల్గుటకు

హేతువును ధాతుప్రకరణమున నిరూపించితిని. అందలి క, గ, చ, య, వ లు ప్రాచీనకాలమున భావాద్యర్థములలో వచ్చినవనియు, తరువాత నవి తిరిగి తిజన్తరూపములకుఁ బ్రకృతు లయినవనియును నిరూపించితిని.

I. కవర్ణకము :

ఈ ప్రత్యయమునకు సమానమయిన కన్నడప్రత్యయములు కె, గె అనునవి. అరవమున కై, క్కై అనునవి.

| అరవము | తెనుఁగు | కన్నడము | తెనుఁగు |
|---|---|---|---|
| వరుకై | రాక | కాణ్కె | కానిక |
| నడక్కై | నడక | పూణ్కె | పూనిక |
| అంజిక్కై | అంజిక | మొళకె | మొలక |
| పోగై | పోక | పొగడ్కె | పొగడిక |
| చేర్కై | చేరిక | పోల్కె | పోలిక |
| వఴక్కం | వాడుక | ఆరయ్కె | ఆరయిక |
| పడుక్కై | పడక | అంజికె | అంజిక |
| కాంగై | కాఁక | ఒందికె | ఒందిక |
| పండిగై | పండుగ | నంబుగె | నమ్మిక |
| ఆకై | ఆక | | |
| అటిక్కై | ఎఱుక | | |

మీఁద నీయఁబడిన కృదంతరూపముల తుదినున్న ప్రత్యయములు క, ఇక, ఇకి; కె, గె, ఇకె; కై, గై, క్కై, ంగై; ఇవి వరుసగాఁ దెనుఁగు, కన్నడము, అరవము అను మూఁడుభాషలయందలివి. వీనియందెల్లను అవయవికమయిన భాగము కకారముమాత్రమే. తుదినున్న అ, ఇ, ఎ, ఐ అను నచ్చులు ఉచ్చారణభేదమున మాండలికములుగా నేర్పడినవనుట స్పష్టము. అనఁగా నీ మూఁడుభాషలును ప్రాచీనద్రావిడభాష యొక్క మాండలికమాత్రమయిన యవస్థయందున్నప్పుడు ద్రవరూపమయిన యవస్థలో వివిధములైన యుచ్చారణలతోనుండి యా యా మండలముల నట్లు స్థిరపడినవని భావము. ఇట్టి తుదియచ్చునందలి యుచ్చారణభేదము నేఁటి తెనుంగునను వినఁబడుచునే యుండును. కోరికి, కోర్కి, కోర్కె, కోరిక అను నాల్గురూపములును గ్రాంథికములే. అట్లే తెలుప, తెలుపి, తెలుపు, తెలుప అను రూపములు ఒక్క 'తెలు' యను మూలధాతురూపమునుండి యేర్పడినవి నేఁడు గ్రంథస్థములయి యున్నవి. పయిప్రత్యయములలో క, గ లకు నేఁడు గల భేదము ప్రాచీనద్రావిడమున నుండలేదనుటయు, నవియన్నియు కవర్ణయుక్తములే యనియు ముందు తెలిపితిని. ముందటి యానునాసిక్యము ప్రాచీనరూపములలో పూర్ణబిందువుగను, నవీనరూపములలో అర్ధబిందువుగను ఉన్నదనుటయు స్పష్టమే.

కకారమునకు ముందు వచ్చిన ఇవర్ణము కొన్ని యెడల ప్రాచీనరూపములయిన సంయుక్తాక్షరముల నడుమ అజ్భక్తిగా వచ్చినదనుటయు సులభమే. ఇట్లేర్పడిన ఇవర్ణకము, సామ్యమున నితరస్థలములలోనికిఁ బ్రాకియుండవచ్చు ననుట స్వాభావికమే.

II. మవర్ణకము

| అరవము | తెలుఁగు | తెలుఁగు | కన్నడము |
|---|---|---|---|
| ఓర్మై | ఓరిమి | కూరిమి | కూర్మె |
| నేర్మై | నేరిమి | బలిమి | బల్మె |

మి, ఇమి, మె, ఇమె, మై యను రూపమున భిన్నభాషలలో నేఁడు గనుపట్టు ప్రత్యయములు అన్నియును అభిన్నములనియు, ద్రావిడభాషామాండలికావస్థను నిరూపించునవియు ననుట స్పష్టమేగదా !

III. తవర్ణము :

ఇత, త, ంత; త, తె; తై అను రూపములతో నొకేప్రత్యయము ద్రావిడమాండలికములలో నున్నట్లు క్రింది యుదాహరణములనుబట్టి స్పష్టము.

| అరవము | తెలుఁగు | తెలుఁగు | కన్నడము |
|---|---|---|---|
| నడత్తై | నడత | పొగడిత | పొగటె |
| | | నడత | నడతె |
| | | అగడిత | అగత్తె |
| | | చేత | కెయ్త |

IV. ది, దు, ందు, త్తు వర్ణకములు :

ఈ వర్ణకములు ప్రాచీనధాతురూపములపయిఁ జేరి యేర్పడిన రూపము లన్ని భాషలలోఁ గలవు. వాని మూలధాతువులు కొన్నియెడల నేఁడు క్రియారూపములయందు లేకపోవచ్చును.

| తెనుఁగు | అరవము | కన్నడము | ధాతువు | ప్రత్యయము |
|---|---|---|---|---|
| చెయిది | చెయ్ది | కెయ్ది | చెయ్ | ది |
| మందు | మరుందు | మద్దు | మరు | దు |
| పొందు | పొరుందు | పొర్దు | పొరు | దు |
| చెలియ | చెలది | కెళది | కెళై | ది |

V. పు, ము, బు, మ్మ, వు :

తెనుఁగు - మాఁపు, పఁపు, ఇంపు, సొంపు, పెంపు, కంపు, పర్పు

కన్నడము - పర్పు, తోర్పు, ఇంపు, సొంపు, పెంపు, కంపు.

అరవము - చార్పు, పడిప్పు, ఉడైప్పు.

VI. టువర్ణకంబును, ఆద్యక్షరదీర్ఘంబును :

తెనుఁగు - పాటు, చేటు, పోటు, వాటు, ఏటు, ఓటు.

కన్నడము-పాటు, కేడు, ఏటు, ఓటు,

తమిళము - పాడు, కేడు, పోడు, వీడు, నాడు.

తమిళమునందలి డవర్ణము టవర్ణముతో సమానమనుట స్పష్టమే.

పయి యుదాహరణములలో నీయఁబడిన ప్రత్యయము లల్పసంఖ్యాకములును, ద్రావిడభాషల నైక్యమును నిరూపించునవియు నై యున్నవనుట నిర్వివాదము. పయి వానిలోని సమానలక్షణములు.

1. ఆ యా భాషలయందలి కృత్ప్రత్యయములన్నియు నత్యల్పసంఖ్యాకములు. సంస్కృతమునందలి ప్రత్యయము లనేకములును, భిన్నార్థకములు ననుట యీ భాషల కద్దానితో సంబంధము లేదనువిషయమును నిరూపించుచున్నది.

2. పయిప్రత్యయములు సంస్కృతమునందువలె కేవల కృత్ప్రత్యయములు గావు. అనఁగాఁ గ్రియార్థకములయిన మూలప్రకృతులపయినేగాక నామవిశేషణార్థకములయిన ప్రకృతులపయినిగూడ వచ్చుచుండుననుట నిర్వివాదము.

3. ఆ యా ప్రత్యయము లన్నియు నీషద్వైషమ్యముతోడనో, అభిన్నముగనో యుండుటవలన నీ భాషలయొక్క ప్రాచీనమాండలికత్వమాత్రతయు, నేకభాషాకుటుంబతయు స్థిరపడుచున్నది.

4. ఈ ప్రత్యయములన్నియు పయిభాషలనుండి యెరవుతెచ్చుకొన నక్కఱ లేకయే ఇందే స్వాభావికములైన హేతువులవలన నేర్పడి మాండలికావస్థయందు రూఢములై, తమయందు సిద్ధమయిన భావవివరణశక్తివలన నున్మీలితములయి ద్రావిడుల నిత్యవ్యవహారమునకుఁ బనికివచ్చుచుండినట్లు పరీక్షవలన సులభముగా గోచరించును. మాండలికావస్థలో హ్రస్వముగను దీర్ఘముగను ఒక యచ్చే అనియతముగ నుచ్చరింపఁబడుచుండినట్లు తెనుఁగుశాసనములనుబట్టియే నిరూపించితిని. ఆ రూపములే నియతములయి కాలక్రమమున భావకర్మాదులయిన కృదంతములుగాఁ బరిణమించినవనుట స్పష్టము. అట్లే నాదత, శ్వాసత యనునదియు, ద్విత్వమును, తద్రాహిత్యమును హల్లులపట్ల ననువర్తించును. అనునాసిక్యము కలుగుటయు నట్టిదే.

ప్రాచీనకాలమున ధాతురూపములుగా నుండినవాని యంతములే కొన్ని మారుపడి కాలక్రమమున ప్రత్యయములుగా నాహరింపఁబడి యిట్లు వ్యాకరింపఁబడినవనుటయుఁ గొన్నియెడల స్పష్టము.

పయి కృద్రూపములగు పోక, పోత మొదలగువానికిని, పోవుట, పోయుట, చేయమి మొదలయిన భావార్థకములకును నేటిభాషలోఁ గొంత భేద మున్నది. గాలిపోక, గాలిపోవుట మొదలగుసమాసములు రూపమున నభిన్నములే. కాని మొదటిదానియందు 'గాలి' షష్ఠ్యంతముగాను, రెండవదానియందు 'గాలి' ప్రథమాంతముగాను తోఁచుచున్నది. నీ రాక, నీవు వచ్చుట అను సర్వనామవిషయమున నియ్యది స్పష్టము. కాని ప్రాచీనకాలమున షష్ఠీప్రథమలు రెండును గ్రాంథికములు గానే వాడఁబడుచున్నట్లు స్పష్టము. "మనపుట్టి బుద్ధియెఱుఁగుట మొదలు", "పరీక్షిజ్జనపాలుచనుట."[1] ఇంతియగాక మంచిగా నడచుట, మంచినడక అను రెండువాడుకలకును భేదము గలదు. మొదటిదానిలోని 'మంచిగా' క్రియావిశేషణము (Adverb). రెండవదానిలోని 'మంచి' నామవిశేషణము (Adjective). కాని ప్రాచీనభాషయం దీభేదము లేదు. క్రియావిశేషణంబులమీఁది అన్నంతక్రియయగు 'కాన్' అనుదానికి లోపము విధింపఁబడినది.[2] అనఁగా 'కాన్' అనునది రానక్కఱలేదని యర్థము. "పెలుదొరఁగునెత్తురు తఱచుగలరు.

పయిని నిరూపించినభేదము సంస్కృతాంగ్లభాషామర్యాదల ననుసరించుటచేత భాషావిభజనవిషయమునఁ బ్రజలలోఁ గలిగి స్థిరపడుచున్నది. నడచుట యను దానియందుఁ గ్రియాధర్మము నడక యను పదముకంటె నెక్కువ వ్యక్తమగుచున్నదని మనకుఁ దోఁచును. కర్తృక్రియాసంబంధమును, క్రియాతద్విశేషణ సంబంధమును ఆర్యభాషలయిన సంస్కృతాంగ్లములయందు భావపరిపూర్తికలిగి రచనయందు వికసితమయినది. సమాసతుల్యమయిన రచన గలిగిన తెనుఁగున (సంయోగాత్మకావస్థయందున్న) నట్టి వివరణకుఁ బ్రాధాన్యము లేదు. సంబంధసామాన్యమే వాచ్యమయి సంబంధవిశేషము ఆక్షిప్తమగుచున్నది.

## 3. తద్ధితములు

ప్రాచీనమయిన ద్రావిడభాషామర్యాద ననుసరించి కృత్తద్ధితప్రత్యయములకుఁ గలుగు భేద మల్పమని నిరూపించితిని. ఏకప్రత్యయమే కృత్తుగను, తద్ధితముగను అనఁగాఁ గ్రియలపయిని, నామములపయిని వాడఁబడుచుండెననుట. కాని కాలక్రమమున భాషాపరిణతిలో నేటి తెనుఁగున కొన్ని తద్ధితములు గలవు. అవియును నత్యల్పసంఖ్యాకములు. అనేకములును, విశాలప్రణాళికగలవియు, బహ్వర్థబోధకములు నయిన సంస్కృత తద్ధితములకును, తెనుఁగు తద్ధితములకును జన్యజనక సంబంధము లేదు. దిఙ్మాత్రముగా వాని స్వభావము నిరూపింపఁబడుచున్నది.

I తనము—గొప్పతనము, రామునితనము. అరవమున 'తనమ్' అని దీని రూపము. కన్నడమున 'తనం' అని రూపము. తన=తనయొక్కస్వరూపము అని

[1] ప్రౌ. వ్యా. కా. 15.

[2] ప్రౌ. వ్యా. క్రి. 22.

దీని యవయవార్థము. ఆకొన్నతనము, ఓర్వలేనితనము మొదలగు ప్రయోగము లనుబట్టియు 'తనము' నందలి పూర్వభాగము (తన) = తాను శబ్దముతో నభిన్నమని నిశ్చయింపనగును. దీనిని సంస్కృత ప్రాకృతములయందలి త్వ, తనమ్ అను వానితో నభిన్నములుగాఁ గొంద ఱెంచుచున్నారు. కాని దీనిని ద్రావిడము గానే తలంచుట యుక్తము. అరవమున తన్మై=(తనము) స్వభావము అను పదము గలదు. ఇవి యభిన్నములని చెప్పవచ్చును.

II. ఇమి వర్ణకము పేర్వాదుల కగును. పేరిమి, మేలిమి.

దీనికి సమానమయినది అరవమున మై, కన్నడమున మె.[3]

పేరిమి—పెరుమై (అరవ) — పెర్మె (కన్నడ)

మేలిమి—మేన్మై — మేల్మె

పసిమి—పసుమై — పసుమె

ఈ ఇమిప్రత్యయము కృదంతప్రత్యయములలోఁగూడ నీయఁబడినది. కలుగు ధాతువుపయి చేరిన ఇమి కృత్తు 'కలిమి'. పేరు అను విశేషణరూపముపయిఁ జేరిన ఇమి తద్ధితము. ఇట్టి భేదము కేవలము కల్పితమనియు, నవీనమనియు నూహించుట స్పష్టము. 'కలు, పేరు' అను రెండంశములును ప్రాచీనకాలమున నొక్కరీతిగానే మూలధాతురూపములుగా నుండినవి. ప్రత్యయములును తుల్యములే. కలుగు అనునది క్రియారూపములలో ధాతువుగా నుండుటచేత కలిమిని కృదంతముగా విభజించిరి. పేరు అనునది విశేషణముగా నాహరించుటకు వీలగుటచే దానిపయిని ఇమిప్రత్యయమును విధించి సూరి తద్ధిత మనెను. కాని 'పెరుగు' ధాతువునుండి దీని నేలకల్పింపరాదు అని యడుగనగును. అప్పుడు 'పే' యందలి దీర్ఘమునకు ప్రక్రియాంతరము కావలయును. పెరిమె యను రూప మొకటి పెద్దఱిక మను నర్థమున గలదు. దానిని 'పెరుగు' ధాతువునుండి కల్పించి కృదంత మనవచ్చునేమో! అట్లయినచో ఇమెప్రత్యయ మనవలెను.

కాని చారిత్రకముగాఁ బరిశీలించినచో పేరిమి, పెరిమె యను రెండు రూపములును ఏకశబ్దముయొక్క మాండలికములనుట సులభముగా దెలియనగును.

III. పువర్ణకము. ఇది కృత్ప్రత్యయముగా సూరిగారిచే నిరూపింపబడినది.

ఇంచు - ఇంపు; చూచు - చూపు; మోయు - మోపు మొదలయినవి.

| తెలుఁగు | కన్నడము | అరవము |
|---|---|---|
| కెంపు | కెంపు | శివప్పు |
| తెలుపు | బెళ్పు | వెళుప్పు. |

3 శ. మ. ద, తద్ధిత. సూ. 210.

ఈ పయిపదములలో మూఁడుభాషలయందును పుఁవర్ణకము గలదుగదా. అది విశేషణములమీఁదనే వచ్చెననుట స్పష్టము. అట్లే మునుపు, పెనుపు, ననుపు, బలుపు మొదలయిన పదములందలి పూర్వావయవములయిన మును, పెను, నను. బలు అనునవి నేఁటి భాషలోఁగూడ విశేషణములే యనుట స్పష్టము.[4]

పయివిచారణమువలనఁ దెనుఁగులోని కృత్తద్ధితప్రత్యయములయొక్కయుఁ, దెనుఁగులోని మూలధాతువులయొక్కయు స్వభావము స్పష్టపడును.

అయినను కొన్ని ప్రత్యయములు తద్ధితములని చెప్పవలసినవి తెనుఁగునఁ గలవు. అవి చాలవఱకుఁ దెనుఁగున నేర్పడినవి. తెనుఁగునమాత్ర మున్నవి. ఇతర ద్రావిడ భాషలయందు లేనివి.

ఱికము - కన్నెఱికము, చిన్నఱికము.

కాఁడు, కత్తె - అందగాఁడు, అందగత్తె.

ఈఁడు - అటమటీఁడు, మన్నీఁడు.

అరి - జూలరి, పూజారి, పూజరి.

బంటి, కొలఁది, మారి, పోతు వర్ణకములును తెనుఁగుననే కలిగినవి. ముక్కిఁడి, వాలిఁడి మొదలయిన శబ్దములపయినున్న ఇడివర్ణకముతో సమానమయిన ఇలి యనునది యంతమందుగల వాలిలి, పల్లిలి మొదలయిన శబ్దములు కన్నడమునఁ గలవు. వాలిలి = వాలములేనివాడు.

వగలాడి, కులుకులాడి మొదలయిన శబ్దముల తుదినున్న ఆడివర్ణకముతో సమానమయినది ఆళి యను ప్రత్యయము కన్నడమున కలదు. అది యేకవచనము పయినే వచ్చును. సిగ్గాళి, జూదాళి మొదలయినవి.

పయివిచారణమువలనఁ దేలిన సారాంశములు :

1. కొన్ని ప్రాచీనప్రత్యయములు ప్రాచీనధాతువులపయిని కర్తృ భావాద్యనేకార్థములలో మూఁడుభాషలలోను వచ్చును. ఇవి కొన్నియెడల కృత్తులు. కొన్నియెడల తద్ధితములు. అనేకస్థలముల నివి యుభయములు నయి యున్నవి.

2. తద్ధితము లర్వాచీనములగుటను, ఆ యా భాషలలోఁ గాలక్రమమునఁ గలిగినవగుటను సాధారణముగా భిన్నములుగా నుండును. ఇవి కొన్ని స్వతంత్ర శబ్దములయి తమ యర్వాచీనతను నిరూపించుచుండును. ఉ: కొలది, పోతు.

కృత్తద్ధితప్రణాళికనుబట్టి చూచినచో ద్రావిడభాష లేకభాషామాండలికము లనియు, సంస్కృతజన్యములు గావనియు సిద్ధాంతమగును.

---

[4] బా. వ్యా. త. సూ. 3. మగటిమ్యాదులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు. తెలుపు, ఎఱుపు, పసుపు, నలుపు.

# తెనుఁగునందలి పదజాలము

## 1. విభాగము

తెనుఁగుపదములను తత్సమములు, తద్భవములు, దేశ్యములు అనురీతిని మూఁడువిధములుగా చిన్నయసూరి విభజించెను. 'సంస్కృత ప్రాకృత తుల్యంబగు భాష తత్సమంబు, సంస్కృత ప్రాకృత భవంబగు భాష తద్భవంబు, త్రిలింగదేశ వ్యవహారసిద్ధంబగుభాష దేశ్యంబు' అనునది యాతడు నిరూపించిన లక్షణము. పయి విధములయిన విభజనమంతయును లక్షణానుసారియయిన ప్రామాణికభాష నుద్దేశించి చేయఁబడినది. మిగిలినదంతయును అనఁగా లక్షణవిరుద్ధంబగుభాష గ్రామ్యంబు. పయిలక్షణము తెనుఁగుభాష నంతటి నుద్దేశించిన దనక తప్పదు. అట్లయినచో ప్రామాణికమయినను, గాకున్నను పండిత పామరాది సర్వజన వ్యవహారసిద్ధమైనది (దైనికము, వైజ్ఞానికము, గ్రాంథికము) యెల్లను లక్షణఘటిత మయినదనక తప్పదు. అతనిమతమున సంస్కృత ప్రాకృతములనుండియే తత్సమ తద్భవములు గ్రహింపఁ బడుట యంగీకరింపఁబడినది. ఆ రెండే వైజ్ఞానికనిధు లనుట సూరిమతం బగుటచేతను, దనకుఁ బూర్వులయినవారు వానినే గ్రహించుటచేతను వానినిమాత్రమే యాతఁడు గ్రహించెను. ప్రౌఢవ్యాకరణకర్తయు నాతనిమతమునే యనుసరించె ననుట యా గ్రంథమునుబట్టి స్పష్టము.

చింతామణియందును "తజ్జా, సమా, దేశ్యా, గ్రామ్యా" యనునట్లు నాల్గు విధములుగా తెనుఁగు నిరూపింపఁబడినది.[1] కేతన తత్సమము, తద్భవము, అచ్చ తెనుఁగు, దేశ్యము, గ్రామ్యము అని యైదువిధములుగా తెనుఁగును విభజించెను.[2] "సంస్కృతపదములపయిఁ దెనుఁగువిభక్తులు ఘటించి తేటపడఁగఁ జెప్పిన నది తత్సమ మనఁజనును."[3] పెద్దనయుఁ గావ్యాలంకారచూడామణియందుఁ బయి రీతినే తెనుఁగు నయిదువిధములుగా విభజించెను. "తత్సమము, తద్భవము, సహజాంధ్రదేశోద్భవము, దేశోద్భవము, గ్రామ్యము నా బంచవిధములై తెలుఁగుఁ బలుకుజాతము వెలయును."[4] సహజాంధ్రదేశభవము అనునదియే యచ్చతెనుఁగని మరల నందే నిరూపింపఁబడినది.[5] దేశ్య మనఁగా పెద్దనమతమున బహుదేశానేయము లైనవి. అనఁగా అన్యదేశ్యములనుట. అప్పకవియు చింతా

[1] తజ్జా సమాచ దేశ్యా గ్రామ్యా చేయం చతుర్విధాభవతి, ప్రకృతిద్వయజా తజ్జా, తుల్యాతు సమా, ప్రవాహినీ దేశ్యా. సంజ్ఞ. సూ. 40. [2] ఆ॥ తత్సమంబునాఁగఁ దద్భవంబన నచ్చ తెనుఁగునాఁగ మఱియు దేశ్యమనఁగ గ్రామ్యభాషనాఁగఁ గల వైదుతెలుఁగులు వేఱ వేఱ వాని విస్తరింతు. ఆ. భా. భూ. ప. 18. [3] ఆ. భా. భూ. ప. 19. [4] కావ్యా. చూ. ఆ. 9. ప. 11. [5] కావ్యా. చూ. ఆ. , ప. 16-18,

మణిని వ్యాఖ్యానించుచు శుద్ధాంధ్రదేశ్యంబులు, అన్యదేశజాంధ్రంబులు అని దేశ్యములను రెండువిధములుగా విభజించెను.[6] పయి రెండువిధములయిన దేశ్యములుగాక తత్సమములు, తద్భవములు, గ్రామ్యములు అను మూఁడువిధములయిన శబ్దములను అప్పకవి పేర్కొనెను.

పయిరీతినున్న విభజనములోని యా యా జాతిని జెప్పు పేళ్లకుగల యర్థములను వివరించుటకుముందు పయివిభజనము తెనుఁగున కెట్లు వచ్చినదనియు, నితర ద్రావిడవైయాకరణులును, ప్రాకృతవైయాకరణులును చేసిన విభాగ మేమనియును వివరింపవలెను. తొల్‌కాప్పియమున శబ్దములు నాలుగువిధములుగా బేర్కొనంబడినవి.[7]

ఇయఱ్‌చొల్ = తమిళమునకు స్వాభావికములయిన పదములు.

తిరిచొల్ = ప్రకృతియందుగాని ప్రత్యయమందుగాని కావ్యములలో గణబంధముకొఱకు మాఱుపడిన పదములు. అనఁగా ప్రసిద్ధమయిన అరవపదముల రూపాంతరము లనుట.

తిచైచ్చొల్ = చెందమిళ్ వాడునట్టి దేశమునకు సమీపమున నుండు దేశములలో నుండి వచ్చి చేరిన పదములు. అన్యదేశ్యములు.

వడచొల్ = తత్సమ తద్భవములని భావము. 'వడ' యనఁగా ఉత్తరము. అరవమున సంస్కృతమునందలి ధ్వను లన్నియు లేకుండుటఁజేసి తద్భవము లని చెప్పక తప్పదు. 'కుంకుమమ్' అను నుదాహరణమున సంస్కృతమునకును అరవమునకును సమానమయిన యక్షరములు గలవు.

దీనిని తత్సమ మనియు మన మనవచ్చును. ప్రాకృతసమభవములను గూడ గొంద ఱిందుఁ జేర్చి వ్యాఖ్యానము చేసిరి.

ఈరీతి విభజనము తెనుఁగుకంటె విలక్షణముగా నున్నట్లు స్పష్టమే. ఇయఱ్‌చొల్, తిరిచొల్ అను రెండును దేశ్యములలోనే లెక్క. తిచైచ్చొల్ అనునది అన్యదేశ్యములకు సమానము. వడచొల్ అనుదానియందు సంస్కృత ప్రాకృత సమములనుగూడఁ జేర్పఁబడినవి. అరవవారిమతమున తమయొక్కయు, తమ పొరుగువారియొక్కయు దేశమునకు స్వాభావికములుగాని పదములు, ఉత్తరము నుండి వచ్చినవి అన్నియు నొక్కటే. వారి మతమున సంస్కృతమునకు స్వాభావికము లయిన ఒత్తక్షరములు మొదలగునవి, అనఁగా అరవమున లేనివి అరవమునఁ బ్రవేశింప వీలులేదు.[8] తెనుఁగున నట్లుగాదు. ఇందు లేని

[6] అప్పక. ఆ. 1. ప. 207

[7] ఇయఱ్‌చొల్, తిరిచొల్, తిచైచ్చొల్, వడచొల్లెన్ఱు అనైత్తేచెయ్యుళీట్టచ్చొల్లే. తొల్. చొల్. సూ. 397.

[8] తొల్. చొల్. సూ. 401, 402.

యక్షరములుగూడ "అన్యేచ ప్రవిశంతి శబ్దయోగవశాత్" అను సూత్రముచొప్పున పయినుండి ప్రవేశింపవచ్చును. ఇది యొక గొప్పభేదము. ఇంకొక విషయ మేమనఁగా, ఇయల్ చొల్ = స్వాభావికపదములు, తిరిచొల్ = మాఱుపడినపదములు అనురీతి విభజనము తెనుఁగున లేదు. తెనుఁగున సంస్కృత ప్రాకృత సమములనియు, సంస్కృత ప్రాకృత భవములనియు రెండుభేదముల నంగీకరించిరి. ఇట్లు అంగీకరించుటకు హేతువు అన్యభాషాగతములయిన క్రొత్తయక్షరములను జేర్చుకొనుటయే. తెనుఁగు విభజనమార్గమునకు అరవపద్ధతి మూలమనుటకు వీలులేదని పయివిచారణమునుబట్టి స్పష్టము.

కర్ణాటభాషయందు శబ్దములను ఈ క్రిందిరీతిని విభజించిరి. (1) తత్సమము (సమసంస్కృతము), (2) తద్భవము (సంస్కృతభవము), (3) దేశీయము = దేశ్యము=అచ్చగన్నడము[9]. పయి తత్సమ, తద్భవ శబ్దములయందు తచ్ఛబ్దమువలన సంస్కృతమాత్రమే యుద్దేశింపఁబడినట్లు కర్ణాటవైయాకరణులు వివరించిరి. అనఁగా ప్రాకృతభవములను, ప్రాకృతసమములను బరిగణింపలేదని యభిప్రాయము.[10]

ప్రాకృతవ్యాకరణములును, వానిలోని శబ్దముల విభజనమును గొంతవఱకు తెనుఁగువైయాకరణుల విభజనమునకు మూల మయియుండవచ్చునా యని యూహింపవలసియున్నది. సాధారణముగాఁ బ్రాకృతవ్యాకరణములన్నియును శబ్దములను తత్సమ, తద్భవ, దేశ్యములనుగా విభజించినవి. అందు పయియర్థములుగల భిన్నపదములను[11] వేర్వేఱు వైయాకరణులు వాడిరి. వానిలో నధికసంఖ్యాకులు తత్సమ, తద్భవ, దేశ్యపదములనే వాడినట్లు క్రిందిపట్టికవలన స్పష్టము.

పయివివరణమునుబట్టి తెలుఁగువైయాకరణులు ముఖ్యముగా ప్రాకృత వ్యాకరణములను బయివిభజనమున ననుసరించినట్లు ఊహించుట సులభము. వీ రంగీకరించిన అన్యదేశ్యము అనునది అరవవ్యాకరణసంప్రదాయమగు ఇయల్ చొల్, తిశైచ్చొల్ అను పదములనుబట్టి యేర్పడినదనియు నూహింపవచ్చును.

---

[9] శ. మ. ద. సూ. 80; 253.

[10] *History of Kannada Language:* R. Narasimhachariar, page 116.

[11] పిషెల్ - ప్రాకృత వ్యాకరణము. విషయము 8. I సంస్కృతసమ—చండుఁడు I. i. తత్సమము—త్రివిక్రముఁడు, మార్కండేయుఁడు, దండి, ధనికుఁడు వాడిరి. తత్తుల్య—వాగ్భటుఁడు. వాగ్భటాలంకారము, 2-2, సమానశబ్దము—భరతుని నాట్యశాస్త్రము, II సంస్కృతభవము-సింహరాజు; తద్భవము—త్రివిక్రముఁడు, మార్కండేయుఁడు, దండి, ధనికుఁడు. సంస్కృతయోని—హేమచంద్రుఁడు, చండుఁడు. తజ్జ—వాగ్భటుఁడు. విభ్రష్టము—భారతీయనాట్యశాస్త్రము. III దేశ్యము—హేమచంద్రుఁడు, త్రివిక్రముఁడు, సింహరాజు, మార్కండేయుఁడు, వాగ్భటుఁడు. దేశీ—హేమచంద్రుఁడు (దేశీనామమాల), దండి, ధనికుఁడు, దేశీప్రసిద్ధము—చండుఁడు. దేశీమత—భారతీయనాట్యశాస్త్రము.

అరవ కర్ణాట వైయాకరణులకంటె నధికముగా ప్రాకృతభవ ప్రాకృతసమము లను జాతులనుగూడ గుర్తించిరి యనుట స్పష్టము.[12]

అప్పకవి తెనుఁగు మఱుంగులు అను నొకవిశేషమును నిరూపించెను. దాని కుదాహరణముగా 'కడలిమొలనూలిచేడియ గనిన పడుచు' (సీత) అను దాని నొసంగెను.[13] ఈ యుదాహరణమునందలి సమాసమువంటి సమాసములయిన పదములు సంస్కృతసిద్ధసమాసముల ననుసరించి తెలుఁగుకవు లనేకములు కల్పించిరి. ఆంధ్రనామసంగ్రహమున నట్టి వనేకములు గలవు. చక్రధరః = చుట్టుకైదువుజోదు, దైత్యారిః = సోకుమూకలగొంగ, పీతాంబరః = పచ్చవలువదారి, త్రిశూలీ=ముమ్మొనవాలుదాల్పు. ఇట్టి పదములు తెనుఁగున దైనికవ్యవహారమున సామాన్యులలో గలిగినవి గావు. కారణ మూహించుట సులభము. పురాణములలోని గాథల ననుసరించి కల్పించిన వీ పదములు. ఆ పురాణగాథలు సంస్కృతమునఁ గాలక్రమమున నా భాష మాటాడువారి విజ్ఞానమువలన నేర్పడినవి. ఆ గాథలతో నా పేర్లును దమంత నేర్పడియుండక తప్పదు. కొన్ని కవులచే నందే కల్పింపఁబడియుండును. అట్టి పదములను, అనఁగా చాలకాలమునకు ముందు సిద్ధములయినవానిని తత్సమములుగా కవులు గ్రహించి తెనుఁగునఁ బ్రయోగించిరి. వానికి తెనుఁగున పదాంతరములను గల్పించుట వలనఁ గలిగిన వీ తెనుఁగు మఱుఁగులు. 'సప్తమెద్వర్డు, గుండ్రబల్లసమావేశము' మొదలగు నేఁటి పదములవంటివి వివి. వీని యర్థము సరిగా తెలియవలెనన్నచో పౌరాణికగాథలు కొంతవఱకయినను తెలియవలెను. లేకున్న వానికి ప్రచారమును, బ్రయోగమును గలుగదు. కావుననే యిట్టి పదములు నేఁటికి చాలవఱకు ప్రచారములో లేవనవచ్చును. వీనికి తెనుఁగు మఱుఁగులు అని పే రేల వచ్చినదనియు, ఎందుండి వచ్చినదనియు విచారింపఁదగినది. మఱుఁగు అనఁగా చాటు అని యర్థము. తెనుఁగునఁ గల్పింపఁబడి సులభముగా భావ మెఱుంగఁబడని పదమని యర్థము కావచ్చును. స్వతంత్రముగా నీ సంజ్ఞ తెనుఁగుననే కల్పింపఁబడి యుండవచ్చును. అరవవ్యాకరణమున వాడుకను మూఁడువిధములుగా నిరూపించుచు 'మరూఉ' అను నొకజాతిని నిరూపించిరి.[14] దీర్ఘములయిన సమాసములు మొదలయినవి వాడుకలో హ్రస్వములయి మార్పు రాగా నేర్పడిన పదములు. అరుమరుందన్న పిళ్లై = అదుమంద పిళ్లై; మలైయమానాడు= మలాడు. పయిరీతి నేర్పడిన పదములు 'మరూఉ' అనఁబడును. పయి సంజ్ఞనుజూచి

[12] బాలసరస్వతీయము. పుట 151, వావిళ్ల.

[13] క. తెలుఁగు మఱుంగులు ప్రాఁదెనుఁగులు తద్భవదేశ్యములునుగూర్చి మృదుపదంబులుగాఁగ నచ్చతెనుఁగులు, మెలకువతోఁ జెప్పఁదగు శమీప్రాంతగృహా.

తే. అబ్ధిమేఖల కుదయించినట్టి సీతఁ జేకొనియె రాఘవుం డని చెప్పుచోటఁ
గడలిమొలనూలిచేడియ గనిన పడుచుఁ దెచ్చుకొనె రాముఁ డనఁగను
దెనుఁగుమఱుఁగు,

అప్పకవీయము, ప్రథ, వ, 213-214.

[14] నన్నూలు, పెయరియల్. సూ. 267,

తెనుఁగున తెనుఁగు మఱుంగు అను పదమును గల్పించిరో యని యూహింపవచ్చును. ఒకదానిలో శకటరేఫము, రెండవదానిలో లఘురేఫము. తమిళములో మఱువు = కూడిక అను పదమునుండి యేర్పడిన దీ శబ్దము. మొత్తముమీద గొంత సామ్యము గలదుగాని నిశ్చితముగా తమిళమునుండి యీ సంజ్ఞ తెనుఁగునకు వచ్చినదని చెప్పఁ జాలము.

## 2. తత్సమ తద్భవముల స్వభావము

తెనుఁగులోనికి సంస్కృతసమములును సంస్కృతభవములును ప్రాకృత సమములును ప్రాకృతభవములును వచ్చినవనుట వైయాకరణు లంగీకరించిన విషయము.[15] చిన్తామణియందును బయి యభిప్రాయము స్పష్టముచేయఁబడినది. ప్రకృతిద్వయము అనఁగా సంస్కృత ప్రాకృతములు రెండును ప్రకృతులని యంగీక రింపబడినవి. 'ప్రకృతిద్వయజా తజ్జా తుల్యా తు సమా' యని లక్షణము. సంస్కృత ప్రాకృత సమములకును, సంస్కృత ప్రాకృత భవములకును గల భేద మేమి యని విచారింపవలయును. 'పరీక్ష్' అనునది సంస్కృతమునందలి ధాతువు. పరీక్షించు అనునది సంస్కృతసమము, పరికించు అనునది తద్భవము. అశ్లేశ శల్యుఁడు తత్సమము, సెల్లుఁడు తద్భవము. సంస్కృతప్రకృతులకుగాని ప్రాకృతప్రకృతు లకుగాని పదాంతమున రూపసిద్ధిమాత్రము జరుగుటకయి వచ్చిన మార్పులు, అనఁగా తెలుఁగుప్రత్యయములగు డు, ము, వు, లు చేరుట, తుదినున్న దీర్ఘము హ్రస్వమగుట మొదలగునవిమాత్రము గలవి తత్సమములు. ఇట్టి లక్షణమే యాంధ్రభాషాభూషణమున నీయఁబడినట్లు ముందే తెల్పితిని. ఇఁక ప్రకృతి యందలి మార్పులుగూడ గలిగినవి తద్భవములు. పయి సెల్లుఁడు అను పదము నందు శ = సె గా మాఱినది. విభక్తిప్రత్యయాదులు చేరుట తత్సమ తత్భవముల రెంటను సమానము. పయిపద్ధతి సంస్కృతసమ, సంస్కృతభవములపట్ల స్పష్ట ముగా నిరూపింపనగును. ప్రాకృతసమ, ప్రాకృతభవములను నిరూపించుటలోఁ గొంత యభిప్రాయభేదము రాక తప్పదు. ప్రాకృతవ్యాకరణము లన్నియును ప్రాకృతమునందలి పదముల నన్నిటిని సంస్కృతమునుండియే గ్రహించినవి. అనఁగా సూత్రబద్ధముగా సంస్కృతవికారములనియే నిరూపించినవి. కాఁబట్టి ఒక పదము సంస్కృతభవమా, ప్రాకృతసమమా, ప్రాకృతభవమా యను విచార ణమునకుఁ జాల నవకాశము కలుగుచుండును.

తెనుఁగువైయాకరణులు ప్రాకృతసమభవములు తెనుగునఁ గలవని యంగీకరించినవా రయ్యును ప్రకృతులను జూపునప్పుడు సంస్కృతప్రకృతులనే నిరూపించిరి.[16] ఇట్లు వారు చేయుటకు హేతువు లూహించుట సులభము.

---

[15] బా. వ్యా. సంజ్ఞా-సూ. 19-20.

[16] కవిసంశయవిచ్ఛేదము, కవిజనాంజనము, సీతారామపండితీయము, పుట. 69 పురుషోత్తమ కవీయము.

1. తెనుఁగుసారస్వతము తలయెత్తునాఁటికి ప్రాకృతభాష దేశమున నశించిన దనవచ్చును. సంస్కృతము నిత్యవ్యవహారభ్రష్టమయ్యును వైజ్ఞానికవ్యవహారమున శిరోభూషణమయి పఠన పాఠనములలో నుండెను. కాఁబట్టి ప్రాకృతభాషా పండితులు లేరు ; ఆ సంప్రదాయమును నశించెను.

2. ఎవ్వరైనను ప్రాకృతభాషాభిమాను లుండినను వారికిని మూలము సంస్కృతమే యగుట ప్రాకృతమునకు స్వాతంత్ర్యము లేకపోయినది.

3. తెనుఁగునందు సంస్కృతసమము లెన్నిటినైనను గల్పించుకొని పండితులు ప్రయోగించుకొను నభ్యాస మేర్పడుటవలన తెనుఁగు సంస్కృతసమబహుళమయిపోయినది. సంస్కృతమునందలి సిద్ధసమాసములన్నియు తెనుఁగుప్రత్యయములను గూర్చుకొని తెనుఁగున బ్రయుక్తములు గావచ్చును. ప్రాకృతసమములట్లుగావు. 'దూరసంస్థితః' అను పదము దూరసంస్థితుఁడు అనురీతిని తెనుఁగున జేరును. 'దూరసంఠితుఁడు' అనురీతిని ప్రాకృతసమములు ప్రవేశించుటకు వీలులేదు. దీనికిఁ గారణము ప్రాకృతపు ప్రవాహరూపము నశించి యా భాష పల్వలమాత్రమగుటయు, పండితుల కా భాష రాకుండుటయు ముఖ్యహేతువులు. ప్రాకృతము నశించుటకు హేతువులను ముందు నిరూపించితిని.

4. తద్భవములను సంస్కృతమునుండి ప్రాకృతమునకు గల్పించుకొని వానినుండి తిరుగ తెనుఁగునకు తద్భవములను గల్పించుకొనుట డొంకతిరుగుడు పనియనుటయు నొకహేతువు గావచ్చును.

5. పయి హేతువులచేత ప్రాకృతసమభవములను వైయాకరణులును, కోశకారులును పూర్ణముగా నిరూపింపఁ బ్రయత్నింపకున్నను గొన్నిశబ్దములను సంస్కృతభవము లనుటకంటె ప్రాకృతసమభవము లనుటయే యుక్తము.

| సంస్కృతము | ప్రాకృతము | తెనుఁగు |
|---|---|---|
| శ్రీః | సిరీ | సిరి |
| కూర్పాసః | కుప్పాసో | కుప్పసము |
| శిథిలః | సఢిలో | సడలు |
| స్థూలః | థోరో | తోరము |
| యజ్ఞః | జణ్ణో | జన్నము |
| తీక్ష్ణమ్ | | తిక్క |
| వైద్యః | వేజ్జో | వెజ్జు |
| రాజ్ఞీ | రాణీ | రాణి |
| అశ్రద్ధా | అసడ్ఢా | అసడ్డ |
| శయ్యా | సెజ్జా | సెజ్జ |
| సింహః | సింఘో | సింగము |
| అగ్నిః | అగ్గీ | అగ్గి |

పయివిధానము బాలవ్యాకరణమున స్పష్టపఱుపఁబడినది. అహోబలపతి మొదలుగాఁగల పండితులందఱును పయిరీతిని సూచించి యూరకుండిరేగాని ప్రాకృత సమభవముల నన్నిటిని నిరూపించుటకు శ్రమపడలేదు. దీనికిని గారణము పయిని నిరూపింపఁబడినది.[17]

పయి తత్సమ తద్భవములు తెనుఁగున నెట్లు ప్రవేశించినవి యను విషయ మునుగూర్చి ముందఱి ప్రకరణములలో ననేకస్థలములయందు నిరూపింప యత్నించి తిని. తత్సమములు అనఁగా సంస్కృతసమములు కొన్ని వ్యవహారమునం బ్రవే శింపఁగా వాని స్వరూపమును గ్రహించి యారీతినే యనేక శబ్దములను గల్పించు కొని నన్నయ మొదలయిన పండితులు తెనుఁగున వాడిరి. ప్రాకృతసమములు ప్రాకృతము వ్యవహారములోనున్న కాలమున వాడుకలోనికివచ్చి తెనుఁగునఁ గలిసిపోయినవి. అవిమాత్రమే తెనుఁగున నిలిచినవి. క్రొత్తగ కల్పింపఁబడినవి లేవనవచ్చును. ప్రాకృతభవములును వ్యవహారములో నుండినవే గ్రంథముల లోనికెక్కి కొన్ని నిలిచినవి. పయి తద్భవముల రూపములను గ్రహించి మఱి కొన్నిటి నల్పముగా అచ్చతెనుఁగు కావ్యముల వ్రాయువారు కల్పించుకొనియు నుండవచ్చుననుట కవకాశము గలదు. లక్ష్మి, లచ్చి, లక్కిమి అను మూఁడు పదములవంటివి కోశములలోఁ గలవు. పయిరీతిని తద్భవములను గల్పించుకొనుటలో ప్రాకృతగ్రంథకర్తలే తెనుఁగువారి కనుకరణీయులైరి. ప్రాకృతవ్యాకరణ సూత్రముల ననుసరించి దీర్ఘసంస్కృతసమాసములకును ఛాయలను గల్పించి ప్రాకృత ములుగా సంస్కృతప్రాకృతకవులు గ్రంథములలో వాడిరి.[18] ఇట్టి దీర్ఘసమాసములు కృతకములును, గవికల్పితములునుగాక స్వాభావికములుగా దైనికవ్యవహారమున నుండెనని యెవ్వ రనగలరు? పయిమార్గము ననుసరించియే తెనుఁగుకవులును కొన్ని కృతక తద్భవములను, తెనుఁగు మఱుంగులను గల్పించుకొని యుండవచ్చును.

తత్సమ తద్భవము లెప్పు డెట్లు తెనుఁగునఁ బ్రవేశించినవి యను విషయమున సీతారామపండితీయమున నిట్లు సిద్ధాంతము చేయఁబడినది.[19] "సంస్కృత ప్రాకృత పండితులు—ముఖ్యముగా సంస్కృతపండితులు తెలుఁగు దేశమునకువచ్చి, తెల్గు రాజులను దమ విజ్ఞానాతిశయమున వశపర్చుకొని దేశమునఁ బ్రాముఖ్యమునంది తెలుఁగుభాష కలవాటుపడి తెల్గుభాష యలంతియగుటచేతను, దమ సంస్కృత ప్రాకృత ముల యలవాటుచేతను సంస్కృతశబ్దములకును, నరుదుగా బ్రాకృతశబ్దములకును

---

17 అప్పకవీయము. 1. ఆ. 174–204. పద్య. అహోబలపండితీయము. 106–118. బాలసరస్వతీయము. పుట. 151–152.

18 మాలతీమాధవము, భవభూతి. 8వ అంకము—"ణిమ్మల ణిరంతర వ్వుత్తతర వారి ధారాపడి ఫలిత చందకిరణు జ్జలంతపింజరి అ భీసణ దంసణం" ఛాయ-నిర్మల నిరంతరో ద్వృత్తతరవారిధారాప్రతిఫలితచంద్రకిరణోజ్జ్వలత్పింజరితభీషణదర్శనమ్.

19 సీతారామపండితీయము, పుట. 74.

దెలుఁగువిభక్తులను జేర్చి తెలుఁగుగా మాటలాడుచుండఁగా నట్టివాని నాంధ్రులు వాడుటలో నపభ్రష్టములయి యీ తద్భవము లేర్పడినవి. ”

## 3. ప్రాకృతసమభవములే ప్రాకృతమునుండి వచ్చినవి

ప్రాకృతభవములును, ప్రాకృతసమములును అయిన శబ్దములు ఏప్రాకృతమును సంబంధించినవి యను విషయము విమర్శనీయము. ప్రాకృతములు దేశభేదమునుబట్టి యేర్పడినవనుట స్పష్టముగదా! కాఁబట్టి తెనుఁగుదేశమునఁ బ్రాచీనకాలమున వాడుకలోనుండిన ప్రాకృతమునుండియే పదములు తెనుఁగునకు వచ్చినవా, లేక యితరములయిన ప్రాకృతములనుండియు వచ్చినవా? అట్లు ఇతరములయిన ప్రాకృతములనుండి వచ్చినచో తెనుఁగుదేశమునకు దూరముగా నుండిన దేశములలో వాడుకలోనుండినవనందగిన ప్రాకృతములనుండి పదములు తెనుఁగునకు వచ్చుట యెట్లు సంభవించెననియును అడుగక తప్పదు. మొదటి ప్రశ్నమునుగూర్చి లాక్షణికు లేమిచెప్పిరో పరిశీలింపనగును.

బాలసరస్వతి “ఇటులనే ప్రాకృతభేదములైన శూరసేన్యాది భాషలకుఁ బ్రత్యేకముగాఁ దద్భవ తత్సమము లగును. జూదము శూరసేనీతద్భవము. జక్కులు మాగధీతద్భవము, గొనము పైశాచీతద్భవము. రాచకొలము చూళికాతద్భవము. మూఁగ యపభ్రంశతద్భవము.” అని చెప్పెను. ఈ పద్ధతినే కొంచె మించుమించుగ అప్పకవియు, అహోబలపతియు నంగీకరించిరి. తెనుఁగువైయాకరణుల మతమున ప్రాకృతములన్నియును దెనుఁగునకుఁ దత్సమములు, తద్భవములు గావచ్చుననుట నిర్వివాదము.

రెండవప్రశ్నకు సమాధానము యోజించుట సులభము. భిన్నప్రాకృతములు కాళిదాసుకాలముననే గ్రంథస్థములయినవనుట నిర్వివాదము. ఆకాలమునకు అనఁగా క్రీస్తుపూర్వమని యంగీకరింతము. ఆనాఁటికి తెనుఁగుదేశమునఁ బ్రాకృతభాష ఆంధ్రరాజులకు ముఖ్యభాషగా నుండినట్లు నిరూపించితిని. అప్పటి తెలుఁగుస్వరూపము కేవల మనుమానసిద్ధమనియుఁ, బ్రాథమికమనియు నిరూపించితిని. ఆనాఁటినుండియుఁ బండితులు సంస్కృతకావ్యములలోని ప్రాకృతభాగములనైనను జదువుచునే యుండిరని యంగీకరింపక తప్పదుగదా! పదునేడవ శతాబ్ది తరువాతివారయిన బాలసరస్వత్యాదుల దృష్టిని బయిప్రాకృతము లన్నియును మృతభాషలే యనుట నిర్వివాదము. కావుననే వానినన్నిటిని సమముగానే యాంధ్రభాషతో సంబంధించినట్లు నిరూపించిరి. ఇది యెంతయును యుక్తమే. పదునైదు శతాబ్దములు అంశికముగానైనను బఠన పాఠనములలో నుండిన ప్రాకృతము లన్నియును తెనుఁగునకుఁ గొన్ని శబ్దములను గూర్చినవనుట యుక్తమే. కాఁబట్టి ప్రాకృతభేదము లన్నిటినుండియుఁ బండితులమూలమున తెనుఁగులోనికి తత్సమ, తత్భవములు ప్రవేశించినవనుట సిద్ధాంతపఱుపనగును.

## 4. తద్భవములలోని యక్షరపరిణామము

సంస్కృత మూలరూపములనుండియే ప్రాకృతవైయాకరణులు ప్రాకృత శబ్దములను సాధించినట్లు తెనుఁగుపండితులు తెనుఁగుతద్భవము లన్నిటిని సంస్కృత ప్రకృతులనుండియే సాధించిరని ముందే చెప్పియుంటిని. ఇట్లేర్పడుటలోఁ గల సామాన్యలక్షణములు, భాషలన్నియు మాఱునప్పుడు ఏపద్ధతుల ననుసరించి మాఱునో వానినే పోలియున్నవి. అవియన్నియు సూక్ష్మముగా వికృతివివేకమునఁ దెలుపఁబడినవి.[20] ధ్వనుల మార్పు అను ప్రకరణమునఁ జెప్పఁబడిన విధానమంతయు సంస్కృతమునుండి తెనుఁగును బ్రవేశించిన తద్భవముల పట్టునఁ దప్పక వర్తించును. ఈ పద్ధతులే ప్రాచీనద్రావిడము తెనుఁగుగా మాఱుటలోను గలవనియు ముందే నిరూపించితిని.

| | సంస్కృతము | తెనుఁగు |
|---|---|---|
| అకారము ఒకారముగా మాఱుట : | అర్పణము | ఒప్పనము |
| 1. ఇ ,, ఎ ,, | శిఖ | సెగ |
| 2. ఉ ,, ఒ ,, | గుణము | గొనము |
| | కుమారుఁడు | కొమారుఁడు |

3. ఋవర్ణము అ, ఇ, ఉ, ఎ, రి, రు అను రూపములను బొందుట : తదియ ; శృంగారము = సింగారము ; పృథివి = పుడమి. గృహస్థుఁడు గేస్తుఁడు, ఋక్షము = రిక్క, ఋషి రుసి.
4. ఐవర్ణము ఏయగును—వైరము = వేరము.
ఐవర్ణము అయి యగును—దైవము = దయ్యము. కైవర్తుడు = కయివర్తుడు.
5. ఔవర్ణము ఓ అగును—ద్రౌపది = ద్రోవది. ప్రౌఢ = ప్రోడ.
6. దీర్ఘము హ్రస్వమగుట—ఆశ్చర్యము = అచ్చెరువు. ఆర్య = అయ్య.
7. బిందువు తొలఁగుట—ఆమంత్రణ = ఆమెత, కూష్మాండము = గుమ్మడి.
సమీకరణము—కాష్ఠము = కట్టె ; శబ్దము = సద్దు.
అజ్విభక్తి—సంభ్రమము = సంబరము.
వ్యంజనాయామము— నీవారము = నివ్వరి.

[20]వికృతి వివేకము-వర్ణలోపాగమాస్సైకే సర్వస్మింస్తద్భవే పదే। భిన్నత్వం యుక్త వర్ణస్య, లోపాదేశాగమాస్తథా తద్భవే సంస్కృతీయే స్స్యురాదేశాద్యాస్తథాన్యతః। స్యాద్వర్ణస్య వ్యత్యయశ్చ కుత్రచిత్కవిసమ్మతః। కుత్రచిచ్ఛబ్దభేదే తు భవేత్పర్యస్తలింగతా। తద్భవస్యాపి శబ్దస్య దీర్ఘాంతత్వం క్వచిత్ భవేత్ । క్వచిదాద్యస్య శబ్దస్య వికారేప్యస్య వాచ్యతా॥

పదాదిని సంయుక్తములోని తొలివర్ణము తొలఁగుట :
క్రౌంచము = కొంచ. ప్రసాదము = పసదనము.

పయిని నిరూపించిన ప్రక్రియ మిక్కిలి సంగ్రహముగా నున్నది.

ప్రాకృతములలోని వర్ణములు తెనుఁగున లేకుండుటచేతను, మఱికొన్ని హేతువుల వలనను ప్రాకృతశబ్దములకును తెనుఁగు తద్భవములకును గొన్ని భేదములు గలవు.

1. ప్రాకృతమునందలి యొత్తక్షరములు తెనుఁగు తద్భవములలో లేవు.

సంస్కృతము, ప్రాకృతము. తెలుఁగు.

భిక్షుః = భిక్ఖో = బిచ్చగాఁడు. ( బిచ్చము. )

కుబ్జః గుజ్జు.

2. ప్రాకృతమునందలి హకారము తెనుఁగున రాదు.

ప్రశ్న = పణ్హా = పన్నము.

కృష్ణ కణ్హా కన్న.

3. ప్రాకృతమున హల్లులు లోపించుటవలన అచ్చులు అవ్యవహితముగా నుండవచ్చును. తెనుఁగున నట్లులేవు. క, గ, చ, జ, త, ద లకు లోపమువచ్చి మిగిలిన య చ్ఛ్రుతులే నిలిచిపోవును. ఇట్టి పద్ధతి తెనుఁగున లేదు. లోక = లోఅ; నగర = ణ అర ; హృదయ = హి అఅ. రూప = రూఅ.[21]

పయిరీతిని గలభేదములు ఒక్క విషయమును దృఢపఱచుచున్నవనుట నిస్సంశయము. తెనుఁగులో తెనుఁగువర్ణముల ననుసరించి యేర్పడుచుండిన మార్పులనే సంగ్రహించి తెనుఁగుపండితులు తద్భవములను గల్పించికొనిరిగాని ప్రాకృతచ్ఛాయగా నా రూపములను గ్రహింపలేదనుట. అనాంధ్రవర్ణములు గలిగిన ప్రాకృతసమములను గూడఁ బరిహరించిరి యని పైమాటలవలన స్పష్టమగుచున్నది. ఈ పద్ధతియే అరవమునఁ గూడ నుండినట్లు ముందు తెలిపితిని.

## 5. తత్సమ తద్భవముల భేదము

తత్సమములను సంస్కృతమునుండి గల్పించుకొనుటలోఁ గలమార్పులు ప్రత్యయ చరిత్రమును నిరూపించునపుడును, నామప్రకరణముునను వివరించితిని. కొన్నిశబ్దములు తత్సమములా, తద్భవములా యను విషయమున వైయాకరణులలో గొంత వైమత్యము గలదు.

[21] సీతారామపండితీయము-వి. 42-75. *Introduction to Prakrit* by Woolner Page 11.

వృద్ధు, మూర్ఖు, వయసు, మొదలగునవి యన్నియు తద్భవములని[22] సూరకవి చెప్పెను. వీనిని బాల ప్రౌఢ వ్యాకరణకర్తలు తత్సమములుగానే చెప్పిరి. రూపు, మీను, వాదు, మొదలయిన శబ్దములు పదాంతమున ఉత్వమాత్రవైశిష్ట్యము గలిగియున్నను తద్భవములే యనిరిగాని తత్సమములుగాఁ బరిగణింపలేదు. వర్గశబ్దమునుండి యేర్పడిన వర్గువు, వర్గు, శబ్దములను దత్సమములుగానే ప్రౌఢవ్యాకరణకర్త పరిగణించెను. ఇట్లు గ్రహించుటకు హేతువేమని యడుగవచ్చును. రూపశబ్దమునుండి రూపు అని ఉకారాంతరూపము గలిగినది. వర్గశబ్దమునుండి వర్గు గల్గినది. రెండును సమమేగదా యని యడుగనగును. ప్రత్యయము చేరినపుడు అంతమందుగల యచ్చులోని మార్పు లక్షే యుండఁగా ప్రత్యయము లోపించిన వికల్పరూపములను తత్సమము లనిరి. వాదువు, రూపువు మొదలయిన రూపములు లేవు. కేవలము పదాంతమున అచ్చే మాఱినది. ఇదియే భేదమని తోఁచును. కాని అట్లైనచో వనిత, లక్ష్మి, కద్రువ, భువి, నావ మొదలయిన శబ్దముల నేల తత్సమములుగా గ్రహించిరి. అచ్చట మాత్రము తుదిని మార్పుగలదు. ప్రత్యయమే లేదుగదా! అని యడుగవచ్చును. దీనికి సమాధానము, పయి తత్సమత్వవ్యవహారము కొన్ని సందిగ్ధవిషయములలో వైయాకరణసంప్రదాయసిద్ధమును రూఢమునుగా గ్రహించుటయే యుక్తమనక తప్పదు.

కొన్ని శబ్దములు సంస్కృతమున నొకయర్థమును (అనఁగా తత్సమము), తద్భవముగ వేఱొకయర్థమును గలిగియున్నవని శబ్దరత్నాకరమున నుదాహరింపఁబడెను. వీనినే ఉభయములుగా నందు గనుగొననగును. కొన్ని యర్థము లందు దేశ్యమును, కొన్ని యర్థముల వైకృతమును నైన పదములు యుగళములుగా నందు నిరూపింపఁబడినవి.

ఈ జాతులకుఁ జేరిన పదములలోఁ గొన్ని యిం దుదాహరింపఁబడును.

ఉభయములు :

| సంస్కృతము | తెనుఁగు | దేశ్యము | వైకృతము |
|---|---|---|---|
| అంకము | యుద్ధము | ఆక్షేపము | |
| అంగద | దక్షిణదిక్కునందలి ఆడేనుఁగు | ఆఁకలి, కోపము | |
| అంగి | అవయవము గలది | చొక్కాయ | |
| అప్పు | నీళ్లు | ఋణము | |
| అమ | అమావాస్య | అమ్మ | |
| కంటకము | ముల్లు | విరోధోక్తి | |
| కందము | గడ్డ | | పశుజాతి మూపు |

[22] కవిసంశయవిచ్ఛేదము.

యుగళములు :

| | దేశ్యము | వైకృతము |
|---|---|---|
| అంచు | పనుచు | ఓర, తుద |
| అచ్చు | అప్పుపడు | ముద్ర, శుద్ధము |
| అమ్ము | విక్రయించు | బాణము |
| అసము | చనువు, దర్పము | యశము |
| కంటె | విభక్తిప్రత్యయము ( పంచమీ ) | ఆభరణవిశేషము. |

పయి పదములనుబోలిన పదములను గొన్నిటిని శబ్దరత్నాకరకారుఁడు నిరూపించెను. వీనిలోఁ గొన్ని పదములు సంస్కృతమునందలి యర్థము మాఱుపడి దానికి సంబంధించిన యర్థమునఁ బ్రయుక్తమగుచుండును. ఇది యర్థవిపరిణామమునుగూర్చి వివరించునపుడు పూర్తిగ వివరింపఁబడును. అట్లర్థము మాఱినంత మాత్రమున దానిని దేశ్యముగఁ బరిగణింపవచ్చునా, రాదా యను ప్రశ్న ముదయించుచుండును. దానిని దేశ్యముగఁగాని, వైకృతముగఁగాని బరిగణింపనగును గాని సంస్కృతసమమనిమాత్రము చెప్ప వీలులేదనక తప్పదు. ఇట్టి తత్సమాది విభజనమున కేమిప్రయోజనమో ముందుఁ దెలిసికొనవలెను. తెనుఁగువారు సమాసములను గల్పించునపుడును, విభక్తిప్రత్యయములను జేర్చునప్పుడును, తత్సమములను ఇతరములకంటె భిన్నమర్యాదతోఁ జూచుచున్నారు. తత్సమముతో అరిసమాసమును జేయరాదు. సిద్ధసమాసమును జేసినచో నొకరీతి. సాధ్యసమాసమగుచో వేఱొకరీతి. కాఁబట్టి ఒకపద మేయర్థమున దత్సమమో, ఏయర్థమున వైకృతమో యెఱుంగకున్న ప్రయోక్తలకు ఇబ్బంది గలుగును. కందజాతము అనఁగా (స్కంధము) పశువు మూపునుండి పుట్టినది యని యర్థము చెప్ప వీలులేదు. అప్పు అను దేశ్యశబ్దమును గ్రహించి తత్సమార్థమున అప్పుతీర్ణుడు = ఋణము తీరినవాఁడు అని చెప్పరాదుగదా !

మఱికొన్ని ఉభయములలో గలిగిన శబ్దాభేదము కేవల ఘుణాక్షరన్యాయమున నేర్పడినది. అమ=అమావాస్య, అమ్మ. ఈ పద మట్టిదనక తప్పదు. వీని స్వరూపమును గుర్తింపక తప్పదనుట నిర్వివాదము. తెనుఁగుగ్రంథములను, తెనుఁగుకోశములను మాత్రము చదువుకొని పాండిత్యము సంపాదించుకొను తెనుఁగురచయితల కిది తప్పక యలవడవలసిన జ్ఞానము. అందఱును సంస్కృతమును జదివి యందు పాండిత్యము సంపాదించి తరువాత తెనుఁగుముక్కలు నేర్చుకొనువారు ఉండరుగదా ! వారికి సంస్కృతభాషాజ్ఞానము సిద్ధమేయగును గావున సంస్కృతమున లేనిదానిని దేశ్యమనిగాని, తద్భవమనిగాని తెలిసికొందురు.

యుగళములను దెలిసికొనుటవలన దేశ్యశబ్దముల ప్రకృతి ప్రత్యయ విభాగము చేసికొనుట సులభముగానుండును. అచ్చు—ఇది అచ్ఛశబ్దభవమయినచో శుద్ధము అని యర్థము. అచ్చు—అను క్రియతో అప్పు అను ఋణార్థక శబ్దము

సంబంధించినదని తెలిసికొనుటకు వీలగును. పదముల యవయవవిభాగము నెఱుంగుట ఉపకారక మగునుకదా! పయి యభిప్రాయముతోడనే సుప్రసిద్ధములయి పూర్వులచేత నంగీకరింపబడిన తత్సమ, తద్భవ, దేశ్య సంజ్ఞలను మాత్రమేగాక, యీరెండు విధములైన సంజ్ఞలను శ. ర. కారుడు కల్పించెను. ద్వయము అను సంజ్ఞనుగూడ గల్పించెను. ద్వయము అనఁగా వైకృతమును దేశ్యమును మిశ్రమైన పదము.

## 6. అచ్చతెనుఁగు

"తత్సమంబుదక్క తక్కిన నాలుగు నచ్చతెలుఁగు లందు రఖిలజనులు" అని కేతనయుఁ, దరువాతివారును అచ్చతెనుఁగనఁగా సంస్కృతసమేతరంబయిన భాష యని లక్షణమును జెప్పిరి. దీనికిఁ గారణము సంస్కృతసమములన్నియును నొక్కరీతిని భాషలో సమాసాదికంబుల నుపయోగపడుచుండుటయు, నితరంబులెల్ల వేఱొక్క విధముగ వాడఁబడుచుండుననుటయే. అచ్చతెనుఁగు కావ్యములయందును తత్సమేతరమయిన భాషనే వాడిరి. వైకృతముల నన్నిటిని అచ్చతెనుఁగుగాఁ బరిగణించుటయే యుక్తము. ప్రకృతి ప్రత్యయముల రెండిటియందును గొంచె మించుమించుగా మార్పు నొందినవి వైకృతములు. అట్లు మాఱుటలో తెనుఁగునకు స్వాభావికమయిన మార్పులే గలవు గావున వానిని అచ్చతెనుఁగుగా గ్రహించుటయే యుక్తమనక తప్పదు

శబ్దరత్నాకరమునఁ గల 35,055 పదములలోను 14,814 పదములు సంస్కృత శబ్దములు. అనఁగా నూటికి 42 వంతున సంస్కృతశబ్దములు తెనుఁగు విభక్తి ప్రత్యయములు మాత్రము చేరినవి యా నిఘంటువున కెక్కినవి.[23] అందు 3,891 పదములకు వై. అనఁగా వైకృతములను సంజ్ఞ నాతఁ డుంచినాఁడు. 24,000 పదములు సంస్కృతమునకును, ప్రాకృతమునకును, అన్యదేశ్యములకును సంబంధించినవి. అన్యదేశ్యములు 1,800. పయిలెక్కనుబట్టి చూచినచో సుమారు పదివేల పదములుమాత్రము దేశ్యము లనంబడినవి, తెనుఁగునకు సహజములయినవి గలవు. ఇంతటి విశాలమయిన తెనుఁగుభాష కిన్ని తత్సమపదము లేల యుండవలయు నని ప్రశ్నింపవచ్చును. దీనికి హేతువు ముందు చాలసార్లు చెప్పియే యుంటిని. తెనుఁగుదేశమున వైజ్ఞానికవ్యవహారమంతయు సంస్కృతముననే జరుగుచుండెను. దైనికవ్యవహారమునకుఁ గావలసిన పదము లల్పసంఖ్యాకములు. ఉన్నతభావస్ఫోరకములయిన పదములన్నియు విజ్ఞాననిధియగు సంస్కృతమునుండియే రావలయును. ఇట్టి పరిస్థితి కన్నడమునకును, మలయాళమునకు తెనుఁగుతో తుల్యమే యనక తప్పదు. తమిళమునమాత్రము ఇంతకంటె కొంచెము భిన్నము. ఇతర ద్రావిడభాషలకంటె సంస్కృతపదములు అందు తక్కువ. తద్భవపదములు

[23] ఆం భా. చ. పు. 448.

అంతకంటె నధికము. దేశ్యపదములు, ప్రాచీనధాతురూపములు తెనుఁగు కన్నడముల కంటె నధికముగా తమిళమున వ్యవహరింపఁబడుచుండును. దీనికిఁ గారణము మొదటినుండియు తమిళభాష దేశీయులైన రాజులచే గౌరవింపఁబడుచుండుటయే యనియు తెల్పితిని.

ప్రాచీనములయిన ప్రాకృతములయందు తత్సమ తద్భవములు పోఁగా మిగిలినవి దేశ్యములని వైయాకరణులు నిరూపించిరి. హేమచంద్రుఁడు తన "దేశీనామమాల" యను ప్రాకృతనిఘంటువునందు 3,978 పదములను నిరూపించెను. అనఁగా ఈతని మతమున ఈ పదములన్నియును సంస్కృతేతరపదజన్యములని భావము. వీనినిగుఱించి నేఁటి పండితులు పరిశ్రమచేసి పరిశోధించి యీ రీతిని విభజించిరి.

| | |
|---|---|
| ' తత్సమములు | 100 |
| గుర్తింపరానట్లు మాఱిన తద్భవములు | 1,850 |
| సందిగ్ధములైన తద్భవములు | 528 |
| దేశీశబ్దములు | 1,500 |
| మొత్తము | 3,978 |

పయి 1,500 దేశీశబ్దములయందును 800 నవీనములయిన ఉత్తరహిందూ[24] స్థానమునందలి యార్యభాషలలోఁ గలవు. ఇవి అనార్యభాషాజాతములు గావు. మిగిలిన 700 శబ్దములకును అనార్యభాషలనుండి మూలములను గల్పించినచో వానిని అనార్యములని యంగీకరింపవచ్చును."

ఉత్తరహిందూస్థానభాషలన్నియు ఆర్యభాషలగు సంస్కృత ప్రాకృతములనుండి పుట్టినవనుట యెల్లరంగీకరించినదగుట పయివిభజన మెంతయు యుక్తమే యనక తప్పదు. తెలుఁగు దేశ్యపదములు కన్నడ, తమిళ, మలయాళ భాషలలోని వానితో నభిన్నములు. ఏకరూపమున నున్నవి. ఏకధాతుజన్యమయినట్లు నిరూపింపనగును. అవిచ్ఛిన్నసంప్రదాయరూపమున వాని నన్నిటిని దేశ్యములనియే తెలుఁగు, కన్నడ, తమిళ భాషావిదులు నిరూపించిరి. అట్టి యా పదములను బట్టియే తెనుఁగు మొదలయిన భాషలన్నియును ద్రావిడములనియు, నేకభాషా కుటుంబమునకుఁ జేరినవనియును నిరూపించుటకు వీలయినది.

## 7. తద్భవ దేశ్యములను వేఱుపఱచుట యెట్లు

ఏశబ్దము దేశ్యము, ఏశబ్దము తద్భవము, అను విషయమునఁ గొంత వివాదము కలుగక తప్పదు. ఆంధ్రదేశమునఁ తొలుతటినుండియుఁ దెనుఁగునందలి వైయాకరణులును, విమర్శకులును సంస్కృతపండితులగుట తెనుఁగుపదములను

[24] హేమచంద్రుని దేశీనామమాల. కలకత్తా విశ్వవిద్యాలయ ప్రచురణము. ఉపో. పుట XXXIII మురళీధర బెనర్జి, M. A.

పీలయినంతవఱకును దద్భవములనుగానే నిరూపించుచు వచ్చిరి. తెనుఁగును వికృతి యని పేర్కొనుటవలనను, సంస్కృతప్రభావము పూర్తిగా నుండుటవలనను సంస్కృతముతోడి సంబంధమును నిరూపించుకొనుటకే ప్రయత్నములు జరుపుచుండిరి. ఇట్టి దృష్టి కీ క్రిందివి హేతువులని నిరూపింపవచ్చును.

I. సంస్కృతము పఠన పాఠనైకసాధ్యమగుటను, వైజ్ఞానికనిధి యగుటను దానియందే ప్రయత్నమును, ఆదరమును గలుగుట స్వాభావికము.

II. తెనుఁగు దైనికవ్యవహారమాత్రమునకు మూలమగుటను, మాతృభాషయయి సులభసాధ్యమగుటవలనను 'అతి పరిచయా దవజ్ఞా' అను న్యాయమునఁ దక్కువ యాదరణముతోడనే యుండినది. ఆ కారణముననే విన్నకోట పెద్దన "తెనుఁగంచున్ జెవిఁబెట్టలేమియుడుపం దేఁగల్గునే మందిలన్" అని తన కాలమునఁ దెనుఁగుపయిని బండితులకుఁగల్గు నిరాదరణమును గంఠోక్తిగాఁ జెప్పుకొనియెను.

III. తెనుఁగుపదము లున్నప్పుడు సంస్కృతపదమును వాడక, తెనుఁగునే ఉపయోగించుట ధర్మము. కాని యట్టి స్వాభావికధర్మము నశించి సంస్కృతమునకే ప్రచారము దైనికవ్యవహారమునందు సంభవించినది. కావుననే వరి, వడ్లు మొదలయిన దేశ్యపదములు మూలఁబడి ధాన్యము, బియ్యము వంటి తత్సమ, తద్భవములు ప్రచారములోనికి వచ్చినవి. ఇట్టిది సాధ్యమగునా యని ప్రశ్నింపరాదు. మనవారిలో నేటి విద్యావంతులు "మా ఫాదరు మెద్రాసునించి నిన్న రిటర్నయినాడు" అని వాడుట 'తండ్రి, చెన్నపట్నము, వచ్చు' అను సామాన్యపదములు తెనుఁగున లేకపోవుటచేతఁగాదుగదా! దృష్టి యేప్రక్కనుండునో యావైపే యాదరణము. ఆదరణమునుండియే స్మరణమును, ప్రచారమును గలుగుచుండును. 'యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనః' యను గీతవాక్యము గలదుగదా!

IV. అరవ, కన్నడములయందలి పరిచయము తెనుఁగుదేశమునఁ దక్కువయయిపోవుటను, వానికిని దెనుఁగునకును గల పోలికలను బండితులు చూడకుండిరి. ప్రాకృతములలోఁ బరస్పరమును గల సాజాత్య వైజాత్యములను, మాండలికత్వములను గనిపెట్టిన సూక్ష్మబుద్ధిశాలురకు దెనుఁగు మొదలయిన ద్రావిడభాషల సంబంధము బోధపడకపోయియుండదు. వారికి దానియందు దృష్టియే లేదు.

పయి హేతువులవలన తెనుఁగునకు సంస్కృతభాషాసంబంధమునే గల్పింపనిచ్చగల్గినను, తెనుఁగువైయాకరణు లెవ్వరును దానికి సంస్కృతజన్యత్వమును జెప్పలేదు. చింతామణిని, అహోబలపండితీయమునను, తెనుఁగునకు వికృతియను పేరు, తెనుఁగు సంస్కృత ప్రాకృతముల ననుసరించుటచేతనే యని నిరూపించిరి. నేటిపరిశ్రమవలన అనఁగా కాల్డ్వెల్లుగారు మొదలయినవారు పరిశోధనము సాగించుట కారంభించినతరువాతనే తెనుఁగుదృష్టి అరవ, కన్నడములపయికి భాషామూలధాతు పరిశోధనవిషయమునఁ బ్రాకినది. మదరాసు విశ్వవిద్యాలయమునఁ బ్రచురింపఁబడిన

"ద్రావిడభాషాసమానపదములు" అను కోశమున (Dravidian Cognates) సుమారు రెండువేలపదములు (క్రియలు, నామములు మొదలయినవి) ద్రావిడభాషలలో సమానములుగా నున్నట్లు నిరూపింపఁబడినవి. ఇవియన్నియును సమానధాతుజాతములు. ఏకమూలపదముయొక్క భిన్నరూపములు. సంస్కృతమును సంబంధింపనివి. తత్సమ, తద్భవ వ్యపదేశమునకుఁ దగనివి. కేవలము దేశ్యములే యనవలసినవి. అనేకధాతువులు ద్రావిడభాషలలో సమానములనునట్లు క్రియాప్రకరణముననను, తెనుఁగునకు ఇతరద్రావిడభాషలతో గల సంబంధము అనుప్రకరణముననను, నిరూపించితిని. అవియన్నియును దేశ్యపదములే. సర్వనామములు, సంఖ్యావాచకములు, ప్రత్యయములు మొదలగునవియన్నియును తెనుఁగు, అరవము, కన్నడము అను భాషలలో సమానములని ఆ యా ప్రకరణములను నిరూపించుచునే యుంటిని. గ్రంథమునందంతటను అల్లుకొనియున్న ప్రణాళిక యే యియ్యది.

అయినను తద్భవములను వెలుపఱుచుపట్ల పండితు లవలంబించిన మార్గములను, ఏశబ్దము ద్రావిడము అనుదాని నెఱుఁగుట యెట్లో యనువిషయమును నిరూపింపవలసియున్నది. "పురుషోత్తమకవీయము" అను గ్రంథమున ప్రకృతిరూపప్రణాళిక యను భాగమున సుమారు మూడువేల తెలుఁగుపదములకు సంస్కృతప్రకృతులు చూపఁబడినవి. ఈ క్రిందివి దిఙ్మాత్రము విమర్శింపఁబడును.

వెల్ల—ఈశబ్దము వలక్షశబ్దభవమని నిరూపింపఁబడినది. వెళ్, బెళ్ అను రూపములు బెళంగు, వెలుంగు, వెలుఁగు, వెలుతురు, వెలయు, వెలవెల, బెళ్దింగళ్ మొదలగు ననేక ద్రావిడశబ్దములలో ధాతురూపమునఁ గనుపట్టుచున్నవి. ఇది ద్రావిడమేగాని తద్భవముగాదు.

ఇంచు—ఇక్షుశబ్దభవమని నిరూపణము. ఇంచు, ఇంపు, ఇనియళ్, ఇనిమై మొదలయినశబ్దములలో ఇని లేక ఇన్ అను రూపమునుండి తీపు, ప్రియము అను నర్థముగల పదము లుత్పన్నములయి యుండఁగా దానిని దేశ్యముగా ఇనిశబ్దముతో గలుపవలెనుగాని తద్భవ మనరాదు.

ఈఁదు—ఈఁతచెట్టు. హింతాళశబ్దభవమని యూహ. ఈందు, ఈఁత, ఈచల్, ఈచ్చు, ఈంజు మొదలయినరూపములతోఁ బయిశబ్దము భిన్నద్రావిడభాషలలో గలదు. ఇది హింతాళశబ్దభవమనుట యసంగతము.

ఉసుఱు—అసవః. (ఏకవచనము అసుః) దీనిని అసుశబ్దమునుండి గల్గినట్లు నిర్ణయించిరి. ఉయిర్, ఉసిర్, ఉసుర్ మొదలగురూపములతో దీని కన్నిద్రావిడభాషలయందును ప్రయోగము గలదు. గాలి, ఊపిరి, ప్రాణము, మాట, స్వరము మొదలగు నర్థములలో నెల్లెడలను గలదు. ప్రాచీనరూపము ఉయిర్. ఇన్నివిధముల ముఖ్యార్థమును, లక్ష్యార్థములును గలిగిన దీనిని తద్భవ మనరాదు.

ఎనుము—హేరంబమునుండి కలిగినదని కోశకారుఁడు. దీనికి ఎరుమై, ఎర్మై, ఎమ్మై అనునవి రూపములు. ఇందు ప్రాచీనరూపము ఎరుమై యనునది. ఇందు మై ప్రత్యయము. ఎరు అనునది మూలరూపము. ఎరుదు = ఎద్దు అను రూపమున వృషభవాచి యయినది. ప్రత్యయాంతరమున ఎనుము అర్థము ద్రావిడపదమే.

ఒల్లు—అలసః అనునది మూలము. ఒల్ అను ధాతువు. ఒల్, ఒల్లు, ఒలి, వలచు, వల్ మొదలయిన రూపములతో సంతసించు, ప్రేమించు మొదలయిన యర్థములలో నన్నిద్రావిడభాషలయందును గలదు. దీనిని ఆ ధాతువునుండి పుట్టినదిగాఁ జెప్పుట సమంజసము.

కలను-ఖలః = యుద్ధము ప్రకృతి అనిరి. ఇది కళం, కళ = యుద్ధభూమి యను నర్థమున నెల్లద్రావిడభాషలలోఁ గలదు. కళ్ అను ద్రావిడధాతువునకు మోసము, అసత్యము మొదలయిన యర్థములు గలవు. దీనిని ఆ యర్థముగల ధాతువునుండి కలిగినదానినిగా నూహించి ద్రావిడమనుట యొప్పునుగాని ఖలశబ్దభవ మనుట పొసగదు.

చిచ్చు - శుచిశబ్దభవ మనుట అయుక్తము. కిచ్చు, కిర్చు, కిత్తు అను రూపము లన్నిద్రావిడభాషలయందును గలవు. తాలవ్యీకరణమున కకార యుక్తరూపము ప్రాచీన మనుట యుక్తము.

చిన్న; చిరుగు - ఛిన్నశబ్దభవ మనియు, ఛిద్రశబ్దభవ మనియుఁ జెప్పుట యుక్తముగాదు. చిఱు అను ధాతువు అనేకరూపములతో నెల్లద్రావిడభాషల యందును గలదు. మూలరూపమునుండి దీనిని గల్పింపనగును.

తప్పు - దంభశబ్దభవ మనరాదు. ఇది యెల్లద్రావిడభాషలయందును క్రియ గాను, నామముగాను నున్నది. తల్, తర్, తళ్ అను మూలధాతువులలో నేదే నొక్కదానితో గలుపుట సులభము. తలఁగు - తొలఁగు అను నర్థమున గలదు.

తెలుపు - ధవళశబ్దభవ మనరాదు. తిళ్, తెళ్ మొదలయిన మూల రూపములను సంబంధించిన యనేకపదములు తెలియు అనునది మొదలయిన లక్ష్యార్థక ధాత్వాది రూపములతోఁగూడ నన్నిద్రావిడభాషలయందును గలవు.

పయిని నిరూపించినవి దిఙ్మాత్రము తెనుఁగుకోశములలోని తద్భవముల నెల్లను నివారించుట కిది యదనుగాదు. చరిత్రను నిరూపించుట యుద్దేశము. పయివిచారణమును జేసిన తరువాత ఒకశబ్దము సంస్కృతభవమా లేక ద్రావిడమా యని నిర్ణయించుట యెట్లు అను ప్రశ్నకు సమాధానము నొసంగఁ బ్రయత్నింతుము.

1. ఒకశబ్దము ఇతర ద్రావిడభాషలయందుఁ బ్రయోగింపఁబడక, తెనుఁగున మాత్రము ప్రయోగింపఁబడుచు, సంస్కృతప్రకృతి ప్రసిద్ధమయి, అక్షరములయందు

మార్పు శబ్దశాస్త్రము ననుసరించి యున్నపుడు, దానిని నిస్సంశయముగా తద్భవమని నిరూపింపనగును. ఆయుధారము = యాయావారము ; కరిసెనము=కర్షణము.

2. అనాంధ్రవర్ణములు గలిగి మూలము సంస్కృత ప్రాకృతములలో నున్నపుడు దానిని నిస్సంశయముగాఁ దద్భవ మననగును. దీపగంభము; ఛాందినీ; హరుసము.

3. ఉన్నతములయిన భావములు నిరూపించు శబ్దములు, శాస్త్రీయపదములు మొదలయినవి సాధారణముగా తద్భవములు గావచ్చును. కబ్బము=కావ్యము; తపస్వి = తబిసి, భక్తి = బత్తి, దరుమము = ధర్మము, జన్మ = జలమము.

4. పౌరాణికపురుషులు, వైదికగాథలు మొదలయినవి మూలముగా గల పదములు సాధారణముగా తద్భవము లగును. వెన్నుఁడు = విష్ణువు. అగత్తియర్ (తమి) = అగస్త్యుఁడు, బ్రహ్మ = బమ్మ, బ్రాహ్మణః = బామ్మఁడు, తీర్థము=తీరతము, వినాయకః = వెనకయ్య.

5. సంస్కృత ప్రాకృత శబ్దములలో సుస్పష్టములయిన మూలములు గలిగి, నేఁటి ఉత్తరహిందూస్థానభాషలలోగూడ తజ్జాతమయిన పదము గన్పట్టుచు, ద్రావిడ మూలము లేక యెల్లద్రావిడభాషలలో నున్నప్పుడుగూడ దానిని తద్భవమని నిరూపింప నవకాశము గలదు. కజ్జము = ఖాద్యము, (ఖాజా - మరాఠీ) దీవియ= దీపికా, అగ్గి = అగ్ని (ఆగ్-హిందీ). పిల్లి = బిడాలీ (బిల్లీ-హిందీ).

ద్రావిడశబ్దములను గుర్తించి దేశ్యములను నిరూపించుటయందును గొన్ని సామాన్యలక్షణములను నిరూపింపనగును,

1. ద్రావిడపదములు సాధారణముగా ద్వ్యచ్కములును, ఏకాచ్కములును నయియుండును. మూలధాతువుతుదిని కు, చు, దు, పు, అల్, దల్, అర్ మొదలయిన ప్రత్యయముల చేరికవలన నుత్పన్నము లయియుండును. వీని మూలధాతువులు అధమము రెండుభాషలయందయినను మాఱుపాటు కొంచెముగా నుండునట్లయినను గనుపట్టుచుండును. ఇట్టివానిని బలమయిన ప్రమాణాంతర ముండినఁగాని తద్భవములుగా నిరూపింపరాదు. పాఱుఁడు = పాఱ్ (పార్) అను ద్రావిడ ధాతువునుండి కలిగినది. చూచువాడు. పార్ప్పాన్ అరవము. 'సందు' చఱ్=సఱ్ అను ద్రావిడధాతువునుండి కలిగినది. చఱ్+దు=సందు. సంధి యను శబ్దమునుండి కలిగిన దనరాదు. నెయ్ ధాతువునకు నేయు, నెయ్యము, నెయ్యి, నెయ్యల్ మొదలయిన రూపములతో నన్నిద్రావిడభాషలయందును ప్రచారముఁ గలదు. దీనిని స్నిహ్ శబ్దభవముగా నిరూపింపరాదు. కడ—దీనిని కాష్ఠా శబ్దభవ మనరాదు. ఇది ద్రావిడమే. కడై, కడ, కడచు, కడప మొదలయిన యనేక రూపములతో నియ్యది ద్రావిడభాషలయందుఁ గలదు. ఏనిక—ఆనెకళు అను శబ్దమునుండి అనుచితవిభాగమువలనం గలిగినది. దీనిని అనేకపశబ్దభవ మనుట అయుక్తము.

2. సుప్రసిద్ధ సంస్కృతములను విడిచి కేవల గౌణములును, మాఱుమూల శబ్దములును గ్రహించి వానిని సామాన్య ద్రావిడశబ్దములకు మూలము లనుట కేవల మయుక్తము. చిచ్చు - ఇది శుచిశబ్దభవ మనరాదు. ఆగ్ అనునది సుప్రసిద్ధముగా అగ్నిభవముగా నుత్తరహిందూస్థానభాషలలోఁ గలదు. అట్లే పది శబ్దమును గౌణవృత్తియయిన పంక్తి శబ్దమునుండి కల్పింపరాదు. ఉత్తరహిందూస్థానమునన్నెల్లను సుప్రసిద్ధముగా దశశబ్దభవమే గలదు. దస్సు అని తెనుఁగునను గలదు. ప్రొద్దు = పొటిుదు. పొటిుధాతువు (పొడుచు, ఉదయించు) అనునర్థమున నుండగా దీనిని బ్రధ్నశబ్దభవమనుట యుక్తముగాదు.

3. దైనికవ్యవహారస్థములయిన పదములను అవయవవాచి యయిన వానిని, సాధారణముగా ద్రావిడభాషలయందెల్లను వ్యాపించియున్న వానిని దూరస్థ సంస్కృతప్రకృతులతో జతపఱుపరాదు. చెయి, సెయ్, కయి, చే, యనువానిని శయముయొక్క తద్భవములనుట యుక్తముగాదు. కివి, చెవి, కివుడు, చెవుడు మొదలయిన రూపములతో గనుపట్టు చెవిశబ్దము మూలము శ్రవశబ్ద మనరాదు. పసుపు, పచ్, పచ్చని, పసిమి మొదలయిన రూపములలో ద్రావిడమునయున్న దానిని పచంపచా శబ్దభవమని నిరూపింపరాదు. పగు, పంగు, పంచు, పగులు, పాక్కమ్ మొదలయిన రూపములతో నున్నదానిని భాగశబ్దభవమని నిరూపింపఁజనదు.

4. ఒకశబ్దమును సంస్కృతమునుండి ప్రకృతిగా నిరూపించునపుడు ఆ శబ్దమునందలి వర్ణము లెట్లు మాఱియుండునో శబ్దశాస్త్రము ననుసరించి యనుగమముగా నిరూపించి ప్రకృతిగా నంగీకరింపవలెనేగాని యాదృచ్ఛికసామ్యమునను, కతిపయాక్షరసామ్యమునను, ధాతురూపమును గుర్తింపకయు, ప్రకృతిత్వమును నిరూపింప వలనుపడదు. పాటిల్లు, పాటు అను శబ్దములను ప్రాప్త, పతన్ శబ్దములనుండి పుట్టించుట సాధ్యముగాదు. సుప్రసిద్ధ ద్రావిడధాతువు 'పడు' గలదు. అట్లే వస్త్రశబ్దభవముగా పాఁతశబ్దమును నిరూపింపరాదు. ఇది పాంత, లేక ప్రాతయనుశబ్దమునుండి యుత్పన్నమయినదని చెప్పుటయే సమంజసము.

పయిరీతిని తెనుఁగుశబ్దములను బరిశీలించినచో సత్యపక్షపాతులకు తెనుఁగుననసేక దేశ్యపదములును, వానికి ఇతరద్రావిడభాషలతోడి యభేదమును, అభిన్నమయిన ద్రావిడమూలరూపములనుండి గలిగిన వ్యుత్పత్తులును గనుపట్టకపోవు. ఒక దేశ్యపదముయొక్క మూలమును బరిశీలించునప్పుడు కేవల సంస్కృత ప్రాకృత మూలము లనందగినవానినిమాత్రమేగాక ద్రావిడమూలము లనదగినవానినిగూడఁ గలిపి పరిశీలించినఁగాని సత్యము తేటపడదు.

ఇట్లు పరిశీలించినచోఁ గనుపట్టు స్వతంత్రములయిన ద్రావిడపదములు తెనుఁగున ననేకములు గలవనుటచేత తెనుఁగునకు సంస్కృతాజన్యత్వమును, ఇతర ద్రావిడభాషాసోదరభావమును సులభముగా సిద్ధాంతపఱుపవచ్చును.

## 8. సంస్కృత మూలద్రావిడభాషల సంబంధము

పయిరీతి ననేకములయిన పదములు మూలద్రావిడభాషయందుండియే అరవ, తెనుఁగు, మలయాళములలోనికి వచ్చెనని నిరూపింపనగునుగదా! అట్టి మూలద్రావిడభాషనుండిగాని, తెనుఁగు మొదలయిన తజ్జన్యభాషలనుండిగాని, సంస్కృతమున కేమయిన పదములు పోయినవా లేవా యని యడుగవచ్చును. అట్లు చేరనవనియే విమర్శకుల యభిప్రాయము. ఈ విషయము మనచరిత్రమునకు ముఖ్యసంబంధము కలిగినది గాకున్నను ఇతరులు దీనినిగుఱించి ఏమి చెప్పిరో కొంచెము నిరూపించుచున్నాను.

"అక్కా, అత్తా, అటవి, అణి, అమ్బా, ఏల, కటుక, కలా, కావేరి, కుటి, కుణి, కూల, కోట్ట, ఖట్వా, నానా, నీర, పట్టనమ్, పల్లి, భాగ, మీన, వలక్ష, వల, వలయ, వల్గు, వల్గుగ, శవ, శుక్తి, సాయ" అను పదములు ద్రావిడములనియు, అవి సంస్కృతములోనికిఁ జొచ్చినవనియు కాల్డ్వెల్లుగారి యూహ.[25] గుండెర్టుగారు ద్రావిడములని నిరూపించిన సంస్కృతశబ్దములు: ఉరుణ్డ, ఏడ, కరవాల, కర్ణాటక, కుండ, కుర్కుర, కేయూర, కోకిల, ఘోట, చంపక, నారంగ, పిట, పుత్ర, పున్నాగ, పేట, ఫల, మరుత్త, మర్కట, ముక్తా, భిల్ల, రాత్రి, విరల, హేరమ్బ, శృంగవేర." ఇంక ననేక శబ్దములను ద్రావిడములుగా వారు నిరూపించిరిగాని యవి యన్నియుఁ దమ కంగీకారము గావనియుఁ, బయి పదములయినను సందిగ్ధములే యనియు కాల్డ్వెల్లుగారు వ్రాసిరి. కిట్టెలుగారు కర్ణాటకశబ్దకోశము నుపోద్ఘాతమున 420 పదములను సంస్కృతము ద్రావిడము నుండి గ్రహించినవానిని సూచించిరి.

పయిశబ్దములన్నియు నొకొక్కటిగాఁ బరీక్షించి వాని చరిత్రము నిరూపింపవలెను. ఆపని యిచట ప్రసక్తముగాదు. నేఁటి యాంగ్లములోనికి హిందీ, తెనుఁగు, తమిళము మొదలయిన భాషలనుండి కొన్ని యల్పసంఖ్యాకము లయిన పదములు పోయినట్లు సంస్కృతములోనికిని గొన్ని ద్రావిడభాషాపదములు పోయి యుండవచ్చును. ఆంగ్లమునుండి నేఁటి వ్యావహారిక భారతీయభాషలలోనికి వచ్చుచున్న పదము లనేకములుగదా! అట్లే సంస్కృతమును ద్రావిడభాషలును ఏకకాలమున వ్యవహారస్థములయి యుండినచో గొప్ప విజ్ఞానముగల సంస్కృతము నుండి యనేకపదములు ద్రావిడభాషలలోనికి రాఁగా, ద్రావిడభాషలనుండి యల్ప సంఖ్యాకములు సంస్కృతములోనికిని బోయియుండవచ్చుననుటకు నేఁటి యాంగ్ల భారతీయదేశస్థ వ్యావహారికభాషలే సాక్ష్యమని చెప్పవచ్చును.

[25] C. G. D. పుట 565-575, 577-78.

నేఁటి అరవ, కన్నడ భాషలకును, తెనుఁగునకును సామాన్యములయి దేశ్యము లనందగిన పదములలో గొన్నిటిని క్రింద నిరూపించుచున్నాను.

| తెనుఁగు | కన్నడము | అరవము |
| --- | --- | --- |
| చెఱు | సెఱె | సిఱై |
| ఏనిక | ఆనె | యానై |
| సోన | సోనె | సోనై |
| పాము | పావు | పాంబు |
| అట్ట | అట్టె | అట్టై |
| ఎన | ఎణె | ఇణై |
| తెర | తెరె | తిరై |
| నీడ | నెటల్ | నిழல் |
| రోలు | ఒరల్ | ఉరల్ |
| పొగ | పొగె | పుగై |
| మొదలు | మొదల్ | ముదల్ |
| మొలక | మొళె | ముళై |
| చిలుక | గిళి | కిళి |
| వాడుక | వాడికె | వాడిక్కై |
| తాయి | అత్తె | అత్తై |
| వాకిలి | బాగిల్ | వాయిల్ |
| కైదువు | కైదు | కైయదు |
| పిల్ల | పిళ్ళె | పిళ్ళై |
| గూడ | గూడె | కూడై |
| మడఁతి | మడది | మడందై |
| వెదురు | బిదిర్ | వెదిర్ |
| వల | బలె | వలై |
| తమ్ముఁడు | తమ్మం | తంబి |
| పాట | హాడు | పాట్టు |
| ఒడలు | ఒడల్ | ఉడల్ |
| పొద్దు | పొత్తు | పొழுదు |
| పేరు | పెసర్ | పెయర్ |
| ముక్కు | మూగు | మూక్కు |
| చేయి | కెయ్ | కై |
| నోము | నోంపి | నోన్బు |

| తెనుఁగు | కన్నడము | అరవము |
|---|---|---|
| ఎద్దు | ఎఱు | ఎరుదు |
| గాలి | గాళి | కాల్ |
| వెండి | బెళ్ళి | వెళ్లి |
| మందు | మర్దు | మరుందు |
| ఎంగిలి | ఎంజల్ | ఎచ్చల్ |

పై శబ్దములన్నియుఁ గొంచె మించుమించుగ నేకాకారముననే యున్నవి[26] గాని కాలక్రమమున నేర్పడిన యా యా భాషల వికారములుమాత్ర మందందు గననగును. ఈ శబ్దములును వానిస్వభావమును ద్రావిడమాండలికము లను ప్రకరణమున గొంత విచారించితిని.

పై విచారణవలనఁ దేలినదేమనఁగా ద్రావిడభాషలలోని దేశ్యభాగము సంస్కృతాజన్యమయి మూలద్రావిడమునుండి వికృతిగా నన్నిభాషలలో నున్నది. ఈ భాగమును ప్రాచీనులయిన తమిళ కర్ణాటాంధ్ర లాక్షణికు లెవ్వరును సంస్కృత జన్యమని తెలుపలేదు. ఇది స్వతంత్రమనియే యంగీకరించిరి.

ఇక తెనుఁగు సంస్కృత ప్రాకృత జన్యమని నిరూపింపఁదలచిన మతమున తెనుఁగునందలి ఆచ్ఛికశబ్దజాలమంతయును రెండువిధములు.

(1) అర్వాచీనతద్భవములు (2) ప్రాచీనతద్భవములు. ప్రకృతులు సుప్రసిద్ధములుగా నుండి వానినుండి యేర్పడినవని యంద ఱంగీకరించినవి అర్వాచీన తద్భవములు. ఇతరములు ప్రాచీనతద్భవములు. తెనుఁగుధాతువులన్నియును ఈ మతమున సంస్కృతధాతువులనుండి యేర్పడఁగా నా ధాతుజ ధాతువులనుండి యేర్పడిన పదములన్నియు తద్భవములే. సంస్కృతజన్యము లనందగిన ప్రాకృతములన్నిటియందును దేశ్యశబ్దములు నీ రీతిగా విభజించి యనేకములను ప్రాచీనతద్భవములుగా (Disguised Tadbhavas) నవీనపరిశోధకులు కనిపెట్టిరి.* ఈ పద్ధతినే తెనుఁగునుగూడ విభజించి తెనుఁగు సంస్కృతజన్యమని నిరూపింపనచ్చును. కాని యీ మార్గమును సిద్ధాంతపఱచుటకుముందు రెండుపనులు చేయవలెను.

1. అరవ, కన్నడ, మలయాళములును తెనుఁగును ఒక్కభాష మాండలికములని నిరూపింపఁబడినది కావున అందలి ధాతురూపములనుగూడ కలిపి సంస్కృత ప్రాకృతములనుండి ప్రకృతులను నిరూపింపవలయును.

2. అట్లు నిరూపించునపుడు ఒకొక్క మార్పును క్రమముగా నిరూపించి సామాన్య సూత్రబద్ధముచేసి శబ్దశాస్త్రమార్గముల నతిక్రమింపకయే చారిత్రకముగా

---

[26] R. Narasimhachariar, *Lectures on the History of the Kanarese Language,* Page 109 - 114.

* చూడు. ఫుట్‌నోటు 24.

నిరూపింపవలయును. పదరూపములయొక్కయు ధ్వనులయొక్కయు క్రమ పరిణామమును నిరూపించినంగాని యీ మార్గ మంగీకృతముగాదు.

అట్టి పరిపూర్ణ విభజనము బయలు వెడలినంగాని పయి సిద్ధాంతమును అంగీకరింప వీలుగాదు. దీనినిగుఱించి ధాతుప్రకరణమునఁ గొంత వివరించితిని.

## 9. అన్యదేశభాషాపదములు

అన్యదేశభాషాపదములు అరవములోనికి వచ్చుచుండినట్లు తొల్కాప్పియ నార్ 'తిచై చ్చొల్' అను విభాగముచే నంగీకరించినట్లు ముందు నిరూపించితిని. అట్లే తెనుఁగువైయాకరణులును నిరూపించిరి. అరవమునకు చుట్టుప్రక్కలనున్న[27] నాడులు పండ్రెండనియు, వానినుండి వచ్చిన శబ్దములు 'తిచై చ్చొల్' అనియు తొల్కాప్పియ వ్యాఖ్యాతయగు తెయ్‌వచ్చిలయారు తెలిపి యీ నాడులను పేర్కొనెను. అప్పకవి చెప్పిన యన్యదేశజాంధ్రములు అను సంజ్ఞవంటిదైన దీని యర్థము నాతఁడు వివరించియున్నాఁడు. అప్పకవి మతము ననుసరించి ఆంధ్రులు తెనుఁగుమాటలను ఇతరదేశములయందు వాడుటచే నాదేశపదముల సామ్యమున నేర్పడినవని తేలుచున్నది. అనఁగా హిందూస్థానీ మొదలయిన యితరదేశభాషా జాతపదముల నుద్దేశించినట్లు తోఁపదు.[28] ఆతఁ డిచ్చిన యుదాహరణములనుబట్టి చూచినను బయియభిప్రాయమే స్పష్టపడుచున్నది. ఇవి నేఁటి మాండలికభేదము లనవచ్చునేమో! అంతియగాని అన్యదేశభాషాపదము లనుటకు వీలుగలదో లేదో పరిశీలింపవలెను.

తెనుఁగును బ్రవేశించిన యితర దేశభాషాపదములలో ముఖ్యములు అరవ కన్నడములు, పారశీ, అరబ్బీ, హిందీ, ఉర్దూ, ఆంగ్లము, ఫ్రెంచి, పోర్చుగీసు, డచ్చి భాషలలోనుండిన పదములు. ఈ భాషలలోనుండి పదము లెట్లు తెనుఁగునఁ బ్రవేశించెనని సంగ్రహముగాఁ విమర్శింపఁబడును.

తెనుఁగునకు చుట్టుప్రక్కల మాటాడు భాషలు అరవము, కన్నడము, హిందీ, ఓఢ్రము అను భాషలని ముందే చెప్పితిని. ఇందు ఆ యా దేశములనుండి జనులు రాకపోకలను సల్పుటవలనను, సరిహద్దు మండలములలోనివారు రెండు మూఁడు భాషలయందును వ్యవహారము జరుపుచుండుటవలనను ఆ పదములు వచ్చి చేరుచుండును.

---

[27] తొల్. చొల్. 400 సూ. వ్యాఖ్య. పఴందీవమ్, కొల్లమ్, కూపకమ్, సింగళమ్, కన్నాడమ్, వడుగమ్, కళింగమ్, తెలింగమ్, కొంకణమ్, తుళువమ్, కుడకమ్, కున్దకమ్.

[28] అప్పక. I—ప. 210-211. క. కేశవ యాంధ్రులు నానాదేశంబులయందు నిలిచి తెలుఁగులె తత్తద్దేశోక్తు లంటఁబలికిన నాదేశ్యము లన్యదేశ్యజాంధ్రములయ్యె. ఆలంబు చివ్వ కయ్యము పోరు బవరంబు...పొల్ల చెచ్చెర మక్కువ తెల్లమి యనఁ దనరు నిటు లన్యదేశజాంధ్రములు పెక్కు.

అరవ కన్నడములయందలి పదములును మూలమున తెనుఁగుపదములతో నభిన్నము లనియు, రూపమున నీషద్వైషమ్యముగలవి యనియు ముందే నిర్ణీతమయినది. కాఁబట్టి సాధారణముగా వానిని వేఱుపఱుపరాదు. అయినను ఆ యా భాషలు భిన్నములుగా స్థిరపడినతరువాత, సారస్వత మేర్పడినతరువాత నం దొకభాషనుండి యింకొకభాషకుఁ దేఁబడిన పదములను నేఁటికి వ్యవహారమున స్థిరపడిన పదములను గ్రహింపనగును.

## 10. అరవపదములు

తెనుఁగున భారతము వ్రాయించిన రాజరాజు చోళదేశము రాజుకూతును బెండ్లియాడెను. ఆయన కొమరుఁడును అరవదేశముననే పెరిగెను. వారితో వచ్చునప్పుడెల్లను పండితులయిన బ్రాహ్మణులును, యుద్ధవీరులయిన క్షత్త్రియులును, కర్మశూరులయిన వైశ్య శూద్రులును, కళావిదగ్ధులును వచ్చుచుండిరనుట నిర్వివాదము.

క్రీ. శ. 1102-వ సంవత్సరమున నీయంబడిన వీరచోడుని పిఠాపురపు తామ్రశాసన[29] మందు 528 పేళ్లలో 116 పేళ్ళు బ్రాహ్మణులవి నిస్సంశయముగా అరవపేళ్లు. పండిత బ్రాహ్మణులే యింతమంది రాఁగా ఇతరు లెంతమంది వచ్చిరో యూహించుకొనవచ్చును. అట్లే భిన్నకాలములయందు, ఆరామద్రావిడులు, కోనసీమ ద్రావిడులు, దిమిల ద్రావిడులు, పుదూరు ద్రావిడులు గుంపులు గుంపులుగా వచ్చి తెనుఁగునాట నిలిచిపోయిరి. రామానుజమతమునకు మూలములయిన అరవగ్రంథములనుండి యెన్నెని అరవపదములు తెనుఁగు శాసనములలోను బ్రవేశించినవి. శైవసంప్రదాయమును నిరూపించు దక్షిణకథావళులయందును అరవపదములు తెనుఁగున వచ్చినవి. నేఁటి జరవవారు తెనుఁగుదేశమున ఫలాహారపు టంగళ్లు మొదలయినవి పెట్టి ఆ పేళ్లను తెనుఁగునఁ బ్రవేశపెట్టిరి. శ్రీవేంకటేశ్వరులయు, కాళహస్తీశ్వరులయు క్షేత్రములనుగూర్చిన కథలయందును, ప్రసంగములయందును అరవము రాకతప్పదు. ఈ క్రిందిపదములు కొన్ని మాదిరిగా గ్రహింపనగును.

తిరువారాధనము, తిరుచూర్ణము, తళిగ, మళిగ, నంబి, తంబి, పొరుళింగాయి, తిరువామొళి, వెరువామొళి, రాజనారాయణవిణ్ణగరాళ్వారు, ఆళ్వారు, నైనారు, గొడగూచి, మణ్ణాస, పెణ్ణాస, పొణ్ణాస, చిరుతొండ, తైరు, సాదము, సాంబారు, వడ, జియ్యరు, సాపాటు, నాంచారి, అలమేలుమంగ, అయ్యరు, అడియడు, కైంకర్యము, నంగి, నంజ, పుంజ, తిరుమణి, పితలాటము, అళాకు, పడి, మరకాలు, అముదుపడి, మొదలియారి, మోరు, తిరునాళ్లు, అళఘుసింగరి, భట్టరు, తాయి, వడఘునంబి, పిళ్ల, తొండరడిప్పొడియాళువారు, సంబళము.

పయిపదములలో గొన్ని సంస్కృతమునుండి యరవమున నేర్పడిన వికృతులు.

---

[29] ఎ, ఇ. వాల్యూం. V. నెం. 10. పుట, 70.

## 11. కన్నడపదములు

కన్నడమునకును బయిరీతినే యనేకవిధములయిన సంపర్కము తెనుఁగుతో గలదనుట నిర్వివాదము. పూర్వ పశ్చిమ చాళుక్యులు ఏకకుటుంబమువారై తెనుఁగు కన్నడదేశములకు రాజులయి యా భాషలను బోషించిరి. కన్నడదేశమున సుప్రసిద్ధ కవులమని చెప్పుకొనిన రన్న, పొన్న యను కవులు తాము వేంగిదేశవాసుల మని చెప్పుకొనిరి. తెనుఁగునఁ గావ్యబంధము వెడలుటకు గొంత కర్ణాటసారస్వత పరిచయమే నన్నయ నారాయణులకు ఉపకారమయ్యెనని ముందు నిరూపించితిని. వీరశైవసంప్రదాయములు కన్నడదేశమునుండి తెనుఁగుదేశమునకుఁ బ్రాకినవి. శ్రీశైలము రెండుభాషలకును సంగమస్థలము. తెనుఁగు కన్నడదేశములకు సరిహద్దు స్థలము ఎప్పుడును గలదు. శ్రీనాథుడు కర్ణాటదేశమునం దిరిగి శైవ సంప్రదాయములను నిరూపించు గ్రంథములను వ్రాసెను. కర్ణాటసామ్రాజ్యమున కనకాభిషేకము నందెను. ఇతరులు తన్ను కర్ణాటకుడని యధిక్షేపించుటఁ గాబోలు "ఎవ్వ రేమన్న నేమి సహజము నాకవిత్వమ్ము కర్ణాటభాష" యని శ్లేషించి పలికెను. బసవపురాణమున కన్నడసంప్రదాయములకు స్థలము గలదు. శ్రీకృష్ణదేవరాయల యాస్థానము తెనుఁగు కన్నడములకు ముఖ్యమయిన కలయికగా నుండెను. అనేకములయిన కన్నడపదములు తెనుఁగునఁ గలవు.

అరసు, కెలసము, గండపెండియరము, నంగనాచి, హెగ్గడి, హొన్ను, దేవర, బేడలు, ఇల్లు, సాకు, పల్లె, రాయరు, బిడారు మొదలయినవి.

## 12. అరబీ, పెర్షియను, ఉర్దూ, హిందీ భాషలతోడి సంబంధము

అరబీ, ప్షెర్షియను, ఉర్దూ, హిందీ భాషలలోని పదములు అనేకములు తెనుఁగు లోనికి వచ్చినవి. అట్టి పదములు తెనుఁగుసారస్వతములోనికి జాలవఱ కెక్కినవి. కాని కాలక్రమమున నవి వాడుకలోనుండి తొలఁగిపోవుచున్నవి. ఈ స్థితికి కారణము చారిత్రకమనుట స్పష్టము. భారతదేశమును అరేబియాదేశస్థులు పశ్చిమతీరమునఁ బ్రవేశించి గొప్ప ప్రతిష్ఠతో ఎనిమిదవ శతాబ్దమునుండియు నుండినట్లు తెలియు చున్నది. వారి వంశీయులనే నేఁడు మలబారు దేశమున మాప్పిలాలని వ్యవహరింతురు.[30] వీరి వంశీయులనే మఱికొందఱిని అరవదేశమున లబ్బెసాయబులని వ్యవహరింతురు. తెనుఁగుదేశమునందలి దూదేకులవారు పెనుగొండయందలి బాబా ఫకర్ ఉద్దీనుచే ముస్లిములుగాఁ జేయఁబడిరని తెలియుచున్నది. (11-వ శతాబ్దము.)[31] తూర్పుతీరమునకును ముస్లిమువర్తకులు 11, 12 శతాబ్దములలోనే

[30] *Influence of Islam on Indian Culture* by Tarachand. pages 29–49.

[31] Do Page 40.

వచ్చుచుండినట్లు తెలియుచున్నది. ఉత్తరహిందూస్థానమున రాజ్యము నేర్పఱచుకొనిన ముస్లిములు దక్కనువయికి దండెత్తి యా రాజ్యమును వశపఱచుకొనిరి. 1296-వ సంవత్సరమున దేవగిరిపయి తురకలు దండెత్తిరి. అది మొదలుకొని వారు తిరిగి తిరిగి యీ దేశముపయికి దండెత్తి యిచ్చటివారిని జంపి తమ రాజ్యమును స్థాపించుకొనిరి. ఓరుగంటి ప్రతాపరుద్రునిపై దండెత్తి యాతనిని జంపిరి. 1330-వ సంవత్సరమునకు తెలుఁగుదేశము వారికి వశమయ్యెను. 1350-వ సంవత్సరము నుండియు బహమనీసుల్తానులు దక్కనులో తమ రాజ్యమును స్థాపించిరి. 1336 నుండి 1565-వ సంవత్సరమువఱకు మహోన్నతదశయందుండిన విజయనగర సామ్రాజ్యముతో సమకాలికులయి రాపిడికలు, రాయబారములును నడుపుచునే యుండిరి. రామరాజు మరణించి విజయనగరసామ్రాజ్యము నాశనమయినతరువాత వీరికి ప్రబలవైరి నశించెను. 1518 నుండి 1672 వఱకును గోల్కొండలో కుతుబుషా వంశస్థులు రాజ్యము చేయుచుండిరి. నేటి నిజాము రాజవంశజులు (హైదరాబాదు) 1713-వ సంవత్సరమునుండి ఇటీవలవఱకును దెనుఁగుదేశమును బాలించుచునే యున్నారు. ఇట్లు ఎడతెగని సంపర్కము తెనుఁగుదేశమునకు మునల్మానులతోఁ గలిగియుండినది.

వారు రాజ్యముచేసిన స్థలములయందు వారి ముఖ్యభాషలగు అరబీ, పారసీ భాషలను ప్రచారములోనికిఁ దెచ్చుచుండిరి. అధికారము వారిది. విదేశములనుండి వారు తెచ్చిన వస్తువులు, వారి జీవనవిధానమునందలి క్రొత్తపద్ధతులు, మతమునందలి మర్యాదలు, వారికడ సేవించి గౌరవకీర్తులను బొందుచుండిన హైందవులు కొంచెమో గొప్పగనో యనుసరించుచునే యుండిరి. రాజ్యమునందలి అధికారివాచకపదములు, రాజమర్యాదను దెలుపుశబ్దములు, నాగరకతను నిరూపించు మాటలు, తెనుఁగు నెక్కువగాఁ బ్రవేశించినవి. వారు మక్తబులు (ప్రాథమిక పాఠశాలలను), మదర్సాలు (కళాశాలలను) స్థాపించి దేశమున విద్యావ్యాప్తిఁ జేయుచునే యుండిరి.[32] మొదటి దినములలో అరబ్బీభాషయును, దరువాత పర్షియనుభాషయును దేశమున ప్రాముఖ్యము నందినవి. ఆ తరువాత ఉర్దూభాష బయలుదేరి వ్యవహారములోనికి వచ్చినది. ఉర్దు అనఁగా మకాము లేక బస. మార్గమున రాజులు చేసిన విడిది కిది పేరు. దీనినిబట్టి యందు బయలుదేరిన భాషకు ఉర్దూ అని పేరు వచ్చినది. ఇట్టి భాషలనుండి తెనుఁగులోనికి పదములు వందలకొలదిగా వచ్చి చేరియుండును.[33]

రాజ్యవ్యవహారమున వచ్చిన పదములు—సిస్తు, దస్తు, సిరస్తాదారు, ఇరసాలు నామా, కచేరి, దస్తావేజు, వకీలు, గుమాస్తా, ఖైదు, ఫసలీ, కిస్తీ, కొత్వాలు, వజీరు, దివాను, నాయిబ్, జమీన్‌దార్, మాలుక్‌దార్, చోపుదారు, జమేదారు, అమలు, అర్జీ, ఖైదీ మొదలయిన వనేకములు గలవు.

[32] *Education in India* by Khey Longmans, Page 118.

[33] ఆ. భా. పుట. 578—604.

నిత్యవ్యవహారములోని పదములు- -మేజా, పాయఖానా, తపేలా, తనాబీ, కూజా, చాకు, బిచానా మొదలగునవి.

పయిరీతి పదములు తెనుఁగులోనికిమాత్రమేగాక కన్నడమునను, అరవమునను గూడ సమానముగానే ప్రవేశించినవి.[34] నేఁ డాంగ్లభాష యెట్లు భారతదేశమునఁ దాండవించుచున్నదో తత్తుల్యముగనే యధికారమునను, రాజావలంబనమునను ఉర్దూ భాషయును, దానిద్వారా పెర్షియను, అరబికు పదములును తెనుఁగుదేశమున నిత్య వ్యవహారమున నుండినవి. ఆంగ్లవిద్యావిధానము మనదేశమున నెలకొల్పుటకు ముందు పెర్షియను, ఉర్దూభాషలు రాజకీయముగ పత్యమానములుగ నుండినవి. సుమారు నూటికి అరువదిమంది తెనుఁగువారు గల హైదరాబాదు రాజ్యమున ఉర్దూభాషకును, పెర్షియను, అరబీ భాషలకును నేఁడు గల ప్రాధాన్యమునుబట్టి ప్రాచీన కాలమున తెనుఁగునాట తుఱకమాటకుఁ గలిగిన బలము నూహింపవచ్చును. ఆ సంప్రదాయమున ననేకపదములు తెనుఁగునఁ బ్రవేశించి కవులచే కావ్యములయందుఁ బ్రయోగింపఁబడుచుండినవి. పశబ్దములు దేశభాషలోనికి, సామాన్యవ్యవహారము లోనికెక్కి స్థాయిపడినవో యవితప్ప తక్కినవన్నియు క్రమక్రమమున నేఁడు తొలఁగి పోవుచున్నవి. కారణములు రెండు — ఒకటి : దేశభాషలపయిని జనులకు స్వాభావిక ముగాఁ గల యాదరము. రెండు : నేటి యద్వితీయమైన యాంగ్లభాషావిజృంభణము. ఈ రెండు కారణములనుండియును ఉర్దూ తత్సమ తద్భవములు తెనుఁగులో నేఁడు చేరుటలేదు. చేరినవి మూలఁబడుచున్నవి.

## 13. పాశ్చాత్యభాషాపదములు

ఆంగ్లేయులు, ఫ్రెంచి, పోర్చుగీసు, డచ్చివారును భారతదేశమున ప్రాముఖ్య మును బొందుటకు మొదటఁ బ్రయత్నించిరి. వారందరును దమలోఁదాము కల హించుకొని తుదికి ఆంగ్లేయప్రభుత్వమే భారతదేశముపయిని స్థిరమయిపోయినది. పోర్చుగీసువారే మొట్టమొదట భారతదేశమునందలి పడమటితీరమునఁ గాలూనిన వారయ్యును, వారి నాగరకతాప్రభావముగాని, భాషావిశేషముగాని నిలువలేదు. తెలుఁగు, అరవము, కన్నడము అను మూఁడుభాషలయందును అల్పసంఖ్యాకము లయిన పదములే నిలిచినవి.

అలమారు, జన్నల్, పాదిరి, కక్కుసు, అమార్, బొత్తాము, కమీజు, బాల్చి మొదలగునవి పోర్చుగీసుభాషనుండి వచ్చినవని యూహించిరి.

పరాసు, పిరంగి, కుసిని, కమాను మొదలయినవి ఫ్రెంచిభాషనుండి వచ్చినవని యూహింపఁబడినవి.

[34] *Lectures on the History of Kanarese Language*. **Page 120.**

ప్రాకృతభవములయిన శబ్దములు తెనుఁగున నున్నవి యేప్రాకృతమునుండి వచ్చినవో, యెట్లు పరిశోధనవలన నిర్ణయింపవలయునో యట్లే పాశ్చాత్య నాగరకతవలన వచ్చిన పదములు ఆంగ్లమునుండి యేవివచ్చినవో, ఫ్రెంచి, పోర్చుగీసు భాషలనుండి యేవి వచ్చినవో యనునది పరిశోధనవలనఁగాని తేలదు. ప్రాకృతసమ ప్రాకృతభవము లన్నియు నేఁడు సంస్కృతభవములుగానే యెట్లు నిరూపింపఁ బడుచున్నవో అట్లే సాధారణముగా నివి యాంగ్లభాషాభవము లనియే సామాన్యుల యూహ.

నేఁటి యాంగ్లభాషాప్రవాహమునుగూర్చియు నా భాషలోని పదము లెట్లు తెనుఁగునఁ బ్రవేశించినవనియును, ఆంగ్లవ్యాకరణమునకు తెనుఁగు వ్యాకరణముతో గల సంబంధమునుగూర్చియు ముందు వివరించితిని. నేఁడు తెనుఁగున కాంగ్లమునుండి వచ్చిన పదములను వివరించుట సాధ్యముకాదు. ఏవి తద్భవములు, ఏవి తత్సమములు అను విషయము నిర్ణయింపవలయును. సంస్కృతసమము లెట్లు ప్రవేశించుచున్నవియో అట్లే తెనుఁగున నేఁటి విశిష్టులవ్యవహారమున ననంతములయిన యింగ్లీషుపదములు ప్రవేశించుచున్నవి. కాని వానిని ఇంకను కవులు మొదలయినవారును, పండితులును అంగీకరించి ప్రామాణికములుగా స్వీకరింపలేదు. స్వీకరించినచో అనేకములయిన పదములు నిత్యవ్యవహారమునుండి గ్రంథములలోని కెక్కక తప్పదు. ఈ విషయము తుదిప్రకరణమున మఱికొంత ప్రపంచింపఁబడును.

నేఁడు ఆంగ్లభవములని చెప్పఁదగిన పదములు.

లాంతరు, రోడ్డు, ఆఫీసు, పోస్టు, స్కూలు, మేస్టరు, ఇనస్పెట్టరు, పోలీసు, కనిష్టేపు, హెడ్డు, డూటీ, పొటిగ్రాపు, కోటు, టాంపు, టిన్ను, సర్వీ, రికాడ్డు, షాపు, హోటలు, డాక్టరు, నరుసు, రిజిస్టరు, కలకటేరు, రివిన్యూ, బస్సు, కారు, పెట్రోలు, కిరసనూనె, టేసను, నంబరు, అరస్టు, లాంపు, లా, కోరటు మొదలయినపదము లనేకములు గలవు. తద్భవములనుమాత్రమే గ్రహించి వాడునట్టి తెనుఁగువారు అధికసంఖ్యాకులు. తత్సమములను వాడువారు విశిష్టులు, విద్యావంతులు.

నేఁటి తెనుఁగును అనఁగా తత్సమేతరమైన భాషలోని ద్రావిడపదములను, ప్రకృతి ప్రత్యయములను నిరూపించి విభజింపవలయును. ఇతర భాషాపదములు తద్భవములుగా వచ్చినవానిని ఏర్పఱచి నిరూపింపవలయును. ఇది యంతయును గోశకారుని పని. అట్టి యాంధ్రపదకోశమును గొంతకాలములో వ్రాయుటకుఁ బ్రయత్నపడవలయును. ఇప్పటికి క్రమక్రమముగా నాధారములు చేకుఱుచున్నవి. వానినన్నిటిని గూర్చికొని చేయవలసిన దీ కార్యము. కేవల చరిత్రమును, పరిణతి మార్గమును జూపించు నీ గ్రంథమునఁ బయి విషయికమయిన పట్టికలను నిరూపింపలేదు.

# అర్థవిపరిణామము

## 1. విపరిణామహేతువులు

భాషయందు పదస్వరూప మెట్లు మాఱుచుండునో యట్లే పదము, నర్థమును మాఱుచుండును. అనఁగా పదము ఒక్కటేయర్థమును బోధించుచు, ఉచ్చారణ త్వరాదులవలన అక్షరములయందు మార్పును బొందుట మొదటివిధము. దానిని గూర్చియే యింతకుముందు విపులముగాఁ జర్చించితిని. రెండవవిధమైన మార్పేమనఁగా పదరూప మట్లేయుండునుగాని అది యేయర్థమును నిర్దేశించుటకుఁ బ్రాచీన కాలమున రూఢమయియుండినదో యట్టియర్థముకంటె భిన్నమయిన యర్థమును నిరూపించుచుండును. ఇది రెండవరకపు మార్పు. మొదటిమార్పు వచ్చుటకు హేతువులు ఉచ్చారణయందలి త్వర, వ్యక్తులయందలి యనవధానత, అసామర్థ్యము, ఊనికమార్పు, ఉచ్చారణయందలి సౌకర్యము, సామ్యము, అనుచితవిభాగము మొదలయినవి హేతువులు. ఇవియన్నియును జాలవఱకును భ్రాంతిమూలకములే యయ్యును మారిన రూపములు గాలక్రమమున రూఢము లగుచుండును. రెండవ మార్పునం దేవి హేతువులు? అర్థములు మాఱుపద్ధతులయందలి ముఖ్యమార్గము లేవి? యను విషయము ఇందు విమర్శనీయము. పద పదార్థములకు గల సంబంధము రూఢి నాశ్రయించినది. ఈ రెంటిలో నొకటి స్థిరమయి రెండవది కొంచెము దూరము కావచ్చును. అనఁగా ఈ మార్పులో పదము స్థిరమయి పదార్థము మాఱును. మొదటివిధమయిన మార్పున పదములోని యక్షరముల కెట్లు సదృశోచ్చారణము గల యక్షరములు వచ్చి చేరుచుండునో యట్లే యిందును అర్థమునకు సమీపములును, సంబద్ధములును అయిన యితరార్థములు స్ఫురించుచు రూఢము లగుచుండును. అట్లు స్ఫురించుటకు హేతువు వ్యక్తియొక్క మానసికవృత్తియేగాని వేఱుగాదు. దాని నీరీతిగా వర్గీకరింపవచ్చును.

1. అస్పష్టమయిన గ్రహణము : భోజనము అను పదము గలదు. అది ప్రయోగింపఁబడుచుండగా దాని ప్రకృతి ప్రత్యయ విభాగము నెఱుంగనివారు ప్రాదేశిక ముగా వాడుదురు. కొందరికి వరియన్నము భోజనము. మఱికొందఱి కంబలి. కొందఱికి కందమూలనులు. అట్లా యా పదార్థవిశేషములయందు ఆ భోజన పదముతో వారికి సంబంధము రూఢమయి యర్థవిపరిణామ మేర్పడుచుండును.

2. మానవుని కవితాశక్తి, ప్రతిభ : సదృశములయిన పదార్థములందు వాని యుపమానములయొక్క యతిశయితమయిన గుణవిశేషమును నిరూపించు

నిచ్ఛచేత అభేదము కల్పింపఁబడుచునేయుండును. చిలుకవంటి కులుకులాడిని చిలుక యని వ్యవహరించుట వినుచున్నాము. పూఁబోఁడి, ముగుద, జవరాలు మొదలయినవి స్త్రీసామాన్యవాచకము లయినవి.

3. మానవునకు అర్థగోపనమునందలి యిచ్ఛ, ఏదే నొక్కవిజ్ఞానవిభాగమాత్రమునందలి నేర్పు, అర్థవిపరిణామమునకు హేతువులు కావచ్చును. ఇట్టివి వ్యక్తినిబట్టి వ్యంగ్యమర్యాదననుసరించి యొకొక్కవిధమయిన సంఘమున నా యా భావములకు సూచకము లగుచుండును. చీకటితప్పు, పైయాట, ఈ రెండు పదములును అభిసరణమునకు వాచకము లయినవి. భావమును గుప్తముగా దెలుపుట యందలి యిచ్ఛయే యిట్టివానికి హేతువయినది. వైయాకరణునియింట వ్యాకరణపదములు, కళావిదగ్ధునియింట ఆ కళకు సంబంధించినపదములు కొన్ని కొన్ని భావములకు వాచకములుగా వాడఁబడును. 'ధాత్వర్థవిచారము' అనగా మిథున కర్మ అర్థమయినది. జీవగఱ్ఱ, మూలస్తంభము మొదలయినపదములు సంగీత శిల్పాది కర్మలను జేయువారిచే అర్థాంతరములందు ప్రయోగింపఁబడి వ్యాప్తిలోనికి వచ్చును.

పయిరీతులను, వివిధమయిన యర్థవిపరిణామవిధానము విమర్శనీయము. భాష మాఱునప్పుడు పయిరీతిని శబ్దార్థరూపముల రెంటియందు నేకకాలమున మార్పు ఒక్కటే శబ్దమునఁ గలుగవచ్చును.

ప్రాచీనమయిన తెనుఁగునుండియు సంస్కృతమునుండియు ఉదాహరణము లీయఁబడుచుండును.

## 2. విపరిణామ విభాగము

### I. అర్థవ్యాకోచము ( Extension. )

చెంబు - ఎఱుపు అర్థము. రాగిపాత్రమునకే వాచకమయిన యీ శబ్దము కాలక్రమమున పాత్రసామాన్యమునకు వాచక మయినదని యందలి ధాతురూపమును బట్టి యూహింపనగును. ఉ. ఇత్తడిచెంబు, వెండిచెంబు. 'నెయి, నే' ఈ పదములు పూర్వకాలమున తైలసామాన్యవాచిగా నుండినవి. నేఁడవి ఘృత శబ్దపర్యాయమాత్రములుగా వాడఁబడుచున్నవి. నూనె=నూ+నెయి; (అరవము)ఎళ్+నెయ్ (ఎణ్ణె); (కన్నడము) బెళ్ + నెయ్ (బెణ్ణె). తెనుగు: వెల్ + నెయ్ (వెన్న). కేవల తిలశబ్దజాతమయిన స్నేహపదార్థమునకు వాచకమయిన నూనె శబ్దము విప్పనూనె, కాగునూనె, కిరసనూనె మొదలయిన పదములలో సామాన్య వాచిగా వాడఁబడుచున్నది. కమ్మ - ఇది తాటికమ్మ-అనఁగా ఆకువలనఁ గలిగిన

యాభరణము. వజ్రపు కమ్మలు, ముత్యాల కమ్మలు, మొదలయిన శబ్దములలో సామాన్యవాచి యయినది. వ్యక్తివాచి యయిన భీముఁడు శబ్దము బలవంతుడు అను సామాన్యవాచి యయినది. రాక్షసుఁడు అను జాతివాచకము క్రూరకర్ముఁడు అను నర్థమున రూఢమయినది. ధర్మరాజు, నారదుడు మొదలయిన శబ్దము లిట్లే యర్థాంతరముల వాడఁబడుచున్నవి.

అన్యోన్యము, అయోమయము అను పదములు ప్రేమార్థమునను, దుష్ప్రవేశ్యము అను భావమునను రూఢములయినవి.

II. అర్థసంకోచము - విశాలార్థమును బోధించు పదము కుంచితార్థమును బోధించును. సామాన్యవాచి విశేషవాచి యగుట. స్నేహసామాన్యవాచి యయిన నెయ్ శబ్దము ఘృతమాత్రవాచి యగుట. అవధ్యులు = వధింపఁదగనివారు అను పదము కేవలము అంగవికలులయందు మాత్రమే రూఢమయినది. పూర్వము చీర శబ్దము వస్త్రసామాన్యవాచి. ఇప్పుడు స్త్రీల వస్త్రవిశేషమునకు వాచకము. ధాన్యము అను సామాన్యవాచి సర్కారులలో వడ్లు అను నర్థమున రూఢము. బళ్ళారి జిల్లాలోఁ గొన్ని యెడల జొన్న అను నర్థమున రూఢము.

అనుమానము, వ్యభిచారము అను శాస్త్రీయపదములు ప్రమాణవిశేషము, నియతి నతిక్రమించుట యను నర్థముల రూఢము లయియున్నవి. ఇవి వాడుకలో సందేహము, పారదారికము అను నర్థముల విపరిణతము లయినవి. సంభావన = గౌరవించుట, సంతర్పణ = తృప్తిపఱచుట, ప్రారబ్ధము = పూర్వజన్మమున నార్జింపఁబడిన శుభాశుభకర్మ, ఉచితము = తగినది, పథ్యము = హితమయినది, దక్షత = సామర్థ్యము, తద్దినము = ఆ దినము. ఈ పదములు విశేషవాచకములయి దక్షిణ, భోజనము, అశుభకర్మ, ఊరక యిచ్చినది, రోగికిఁ బెట్టు తిండి, సహాయవిశేషము, శ్రాద్ధదివసము అను నర్థముల స్థిరములయినవి. వ్యవహారము = కోర్టువ్యాజ్యము, వ్యవసాయము = పొలముదున్నుట. ఇందలి మార్పు నిట్టిదే.

III. అర్థసౌమ్యత - ప్రాచీనకాలమున నింద్యార్థమున వాడఁబడు పదములు నేఁడు గౌరవాపాదకములును, సామర్థ్యబోధకములునుగాఁ బరిణమించుచున్నవి. సభికులు = జూదగాండ్రు అను పదము నేఁడు సభ్యులు అను నర్థమునమాత్రము వాడఁబడును. రాక్షసుఁడు, దుర్మార్గుడు మొదలయిన పదములు నేర్పుగలవాడు, సమర్థుడు అను నర్థములలో వాడఁబడుచున్నవి. మర్యాద = అనఁగా హద్దు. దీనికి గౌరవము అను నర్థము రూఢము.

IV. అర్థగ్రామ్యత - పూర్వము సౌమ్యములయిన కొన్నిపదములు కాలక్రమమున అతిపరిచయముచేత ఏవేని కొన్నిగుణములుమాత్రము స్ఫుటముగా

నుండుటచేతను, గ్రామ్యోక్తులుగా బరిగణింపఁబడుచు వాడఁబడుచుండును. వ్యంగ్యము అనఁగా అభిధేయలక్ష్యార్థములకంటె భిన్నమయిన యర్థవిశేషమున అలంకారశాస్త్రమున రూఢము. ఇది తెనుఁగున గొన్నియెడల అసభ్యమయిన యభిప్రాయము అను నర్థమున రూఢమయి యున్నది. కంపు అను పదము వాసనను జెప్పును. కమ్ అను ధాతువు కమ్మని యను శబ్దమునఁ గలదు. కమ్మునది అనఁగా వ్యాపించునది. నేఁడది దుర్గంధమునకు వాచకము. దేవశబ్దభవమయిన దయ్యము పిశాచవాచిగా రూఢము. కార్యసామాన్యవాచి యయిన కర్మ పదము మృతదినములయందలి పితృకర్మకు వాచకము. సేవ యను నర్థమున నుండిన కైంకర్యపదమునకు నేఁడు మోసము, దొంగతనము అని యర్థములు. ఛాందసుఁడు అనగా వేదవేత్త.[1] తద్భవమయిన చాదస్తుడు, మందుఁడు అను నర్థమున వినఁబడును. పండితుఁడు=పండా అస్య సంజాతా ఇతి పండితః, అను వ్యుత్పత్తి ననుసరించి విజ్ఞానము గలవాఁడు అను పదము నేఁడు అల్పవేతనము నందుచు, నేఁటి దేశభాషాదికమును బోధించు నొక యల్పోద్యోగికి వాచకము. పూర్వము అది, ఇది, వీడు, వాడు అను గౌరవవాచకములు నేఁడు నీచతాబోధకములు. పుష్పవాచి శబ్దము ఆడుగుఱియందు రూఢమయి అసభ్యమయినది. కుడుచు అనునది పూర్వకాలమున తిను అను నర్థమున నుండినది నేఁడు అసభ్యార్థము.

V సభ్యోక్తి — నాగరకులలో అసభ్యములుగా నెంచఁబడు పదములకును, వచింపరాని యర్థములకును గ్రొత్తపదములు కల్పింపఁబడును. వెఱ్ఱి పకారకొమ్ము—అనగా బుద్ధిహీనుడు, అశుద్ధము—మలము; దొడ్డి—పాయిఖానా లేక మఱుగుదొడ్డి, పెద్దమనిషి—మోసగాడు.

VI. మృదూక్తి - కఠినములయిన భావములను, దుఃఖస్ఫోరకములయిన యభిప్రాయములను, మృదువయిన యర్థమును బోధించురీతిని దెలుపుట. పోయినాడు = మరణించెను, దీర్ఘనిద్ర = చావు, పూర్వసువాసిని = విధవ, పెద్దకోలము = మాలకోలము, స్వస్తి = తుది, ప్రాజ్యము; పూర్ణము = సున్న, లేనిది. స్వస్తి యను నాది గలిగిన శ్లోకములు పురాణపఠనాంతమునఁ జెప్పుదురు. శూన్యము బౌద్ధమతమున సర్వమున కాది. పూర్ణము బ్రహ్మము, నిర్గుణము, లేనిదనియే భావము. బ్రాహ్మణబ్రువుడు, బ్రహ్మబంధువు, మహాబ్రాహ్మణుడు, నిందుకొన్నది అనునవి అధమబ్రాహ్మణుడు, లేదు అను నర్థములలో నున్నవి.

VII. కేవల సంకేతార్థములు - ఇట్టివి సాధారణముగా వ్యక్తులయందును, గొన్నిసంఘములయందును ఉత్పత్తిల్లి కాలక్రమమున స్థిరపడును. లేదా తాత్కా-

[1] చూడు: అర్థవిపరిణామము. దువ్వూరి వేంకటరమణశాస్త్రి—గిడుగు వ్యాస సంగ్రహము.

లికమయిన ప్రయోగము గలిగి నశించుచునే యుండును. వైదికులు తమ వేదము నందలి మంత్రములలోని పదములను గొన్ని యర్థవిశేషములలో వాడుదురు. ఈ దినమున 'వయందేవస్య' యెక్కడ = భోజన మెక్కడ యని భావము. 'వయందేవస్య భోజనమ్' అని వచనము. 'పద్భ్యాముదరేణ' అనఁగా శిశ్నమని యర్థము. 'పద్భ్యాముదరేణ శిశ్నా' అని వచనము. ఉచ్చరింపఁబడిన పదమున కుత్తరవర్తియయిన పద మిం దుద్దిష్టము.

VIII. లక్ష్యార్థములు—ఇంతియగాక బహుభంగుల భాషయందలి పదములు లక్ష్యార్థములయందు రూఢము లగుచున్నవి. ఈ లక్ష్యార్థములకు అనేకవిధములయిన **మూలములు** గలవు. ఆధారము, ఆధేయము, కార్యము, కారణము; ఉపమానము, ఉపమేయము; ఏకదేశము, అన్యదేశము; అంగము, అంగి; కావ్యము, కర్త; మొదలగు జంటలలో నొకటి యింకొకదానికి వాచకమయి కాలక్రమమున రూఢ మగుచుండును.

ముష్టి = పిడికిలి ఆధారము. పిడికెడు బియ్యమగు ఆధేయమునకు వాచ్యము. సోల, తవ్వ మొదలయిన పరిమాణవాచకములు, పరిమేయవాచకము లగువానిని బోధించునట్లు వాడుచునే యున్నాము.

దాహము = దహించుట లేక తపింపఁజేయుట. కార్యమయిన దప్పికి వాచక మయినది. స్వయంపాకము = తాను స్వయముగా వండుకొనుట. క్రియకు కారణ మయిన పదార్థమున కిది వాచకము. మాఘుడు, అమరుడు, వరుసగా కావ్య నిఘంటుకర్తలు. మాఘ మనఁగా మాఘుఁడు వ్రాసిన శిశుపాలవధ యను కావ్య మును, అమర మనగా అమరసింహకృత నిఘంటువును బోధించుచున్నవి.

ఉపమానోపమేయములు తారుమారగుటకు కావ్యప్రపంచమున ననేకోదా హరణములు గలవు. కత్తులతో పొడుచుట అనఁగా తీక్ష్ణమయిన చూపులతో చూచుట యని వ్యవహారమున నర్థము. వెలఁది యనఁగా ధావళ్యము, సొబగు అర్థములు. అంగవాచిగా నున్నది. అంగియగు (స్త్రీయను) నర్థమునకు వాచకము. పొడ యనఁగా రూపు అర్థము. పొడవుతో నభిన్నము. దానితో నభిన్నమనం దగిన పొడుగుశబ్దము తద్ధర్మవిశేషమయిన దైర్ఘ్యమునకు వాచకమయినది. పొనుఁగు అనఁగా తృణవిశేషము. తృణధర్మమయిన నిస్తేజస్కత కిది వాచక మయినది. పూఁత యనఁగా మీది యంగరాగము. అట్టి కార్యము ఏకదేశముగా గల మోసమున కిది వాచకము. వెలిచవి=పయి రుచి యని యర్థము. ఇట్టి యభిరుచి తత్కార్యమయిన జారకర్మకు వాచకము. వెఱ్ఱినీళ్లు = మద్యము. వెఱ్ఱి కలిగించు ద్రవము. కల్లు అని భావము.

పయిరీతి ననేకవిధములయిన యర్థవిపరిణామము, శబ్దపరిణామమువలెనే ద్రావిడభాషలయందుఁ బరస్పరము గలుగుచు, నా యా భాషలయొక్క నియత రూపమయిన సంబంధమును నిరూపించుచుండును. ధాతువుల యనేకార్థతయు నిట్లు గలిగినదని యూహించుట మిక్కిలి సులభము. వెళ్, తెళ్ అను ధాతువుల నుండి ప్రకాశము, బుద్ధి, దీపము, ధావళ్యము, తేట, వైశాల్యము, సంకోచ రాహిత్యము, బయలు, పరిశుద్ధము, ప్రకటనము, రజతము మొదలయిన యర్థములు గల వెలయు, తెలివి, వెలుగు, బెళకు, వెలి, వెల్ల, వెలయించు, వెండి మొదలయిన పదములు పుట్టుట కవకాశము గలిగినది. ఇట్టి మూలద్రావిడధాతువు లనందగిన రూపములనుండియే ద్రావిడభాషలలోని ప్రాచీనపదములన్నియు వ్యవహర్తల బుద్ధివిశేషమువలనఁ బయిని నిరూపించిన సంబంధము, సాదృశ్యము మొదలయిన నిమిత్తముల నాధారముగాఁ జేసికొని కల్పింపఁబడినవనుట నిర్వివాదము. ఇట్టిపద్ధతి చాల అసంకీర్ణముగా, స్పష్టముగా, స్వాభావికముగా గనుపట్టుచుండుటచే ద్రావిడ భాషలు స్వతంత్రములనియు, సంస్కృత ప్రాకృత జన్యములు గావనియు స్పష్టమగుచునే యున్నది.

# ఉపసంహారము

## 1. సింహావలోకనము (1947)

తెనుఁగు యొక్క స్వరూపస్వభావములు నిరూపింపఁబడినవి. సుమారు రెండు వేల సంవత్సరములకు ముందు అరవ కన్నడములతో నభిన్నమయి యల్పభేదముతో నుండిన రూపమున మహేంద్రగిరినుండి మదరాసువఱకు నున్న భూభాగమున దైనిక వ్యవహారమున నుండినది. అల్పసంఖ్యాకములయిన పదములు గలిగి జనసామాన్యమునకుమాత్ర ముపయోగపడుచుండినది. వైజ్ఞానిక, మత, రాజకీయా ద్యున్నతోపయోగములకు విశిష్టులు వాడుచుండిన సంస్కృత ప్రాకృత మహావృక్షముల ఛాయను బడి యనాలోకయోగము లేకుఁడినది. కాలగతిని ప్రాకృతము నిరాకృతముకాగా, సంస్కృతము గ్రంథసత్కృతికిమాత్రమే పాత్రమైనప్పుడు చాళుక్యరాజదృష్టి పడి ప్రకాశింపఁ దొడంగినది. కాని సంస్కృతకాంతియే దీనికి మూలము. అప్పటినుండియుఁ గొంచెముగాఁ బెరిగి దేశీయులయు, జనసామాన్యము యొక్కయు నాదరణమునను, అవలంబనమునను నేఁటిరూపము నందినది. కాని యీభాష కెప్పుడును ప్రబలమయిన యన్యభాషాప్రాధాన్యమే యభివృద్ధి కాటంకమయిన దను నభిప్రాయములో గొంత సత్యము లేకపోలేదు. మొదట ప్రాకృతమునకే ప్రాధాన్యము. తరువాత సంస్కృతమునకు సత్కృతి. ఆ తరువాత తురుష్కుల రాజ్యకాలమున అరబీ, పారసీక భాషల యౌన్నత్యమును, వ్యాప్తియు దేశమున నుండినవి. రాజావలంబనము దానికే. పఠన పాఠనములును, ముఖ్యవ్యవహారమును ఉర్దూ, పెరిషియను భాషలకే తురుష్కప్రభువులవలన జరుగుచుండినవి. తరువాత బ్రిటిషు పరిపాలనము. 1835-వ సంవత్సరమున అంగ్లమే దేశమున నధికారభాషయు, విద్యావ్యాపక సాధనము నయినప్పటినుండియును గృషియు, గౌరవమును నాంగ్లమునకే. నేఁటికిని అదే పరిస్థితి.

రాజావలంబనమును, ముఖ్యవ్యవహారమును, నాగరకజనుల వైజ్ఞానిక వ్యవహారమును ఆంధ్రదేశమున నాఁటినుండి నేఁటివఱకును అన్యభాషలే యాశ్రయించుట వలన తెనుఁ గెప్పుడును అప్రధానముగానే యుండినది. అట్లనుటవలన తెనుఁగు పయిని దేశమున నభిమానము లేకపోలేదు. సామాన్యజనుల కది తల్లి. దేశీయులయిన చిన్నచిన్న ప్రభువులును, రసికపండితులయిన రాజులును దాని నాదరించుచునే యుండిరి. కావుననే ఆ యా భాషలను జీర్ణించుకొని నేఁటి కీస్వరూపమున నున్నది. ప్రాచీనకాలమున సంస్కృతపండితులకును, అంతకుముందు ప్రాకృతాభిమానులకును, నేఁ డాంగ్లవిద్యానవద్యులును పాశ్చాత్యవిజ్ఞానరసామోదులు నయిన పండిత ప్రభువులకును ఈ భాష యుపసర్జనమాత్రమే యనుట గుండెపై చేతినిడి పరిశీలించుకొను

తెనుఁగువారి కెల్లరకును దెల్లము కాకుండదు. ఇది ప్రాచీనచరిత్రము. నేఁటి కా స్థితి మాఱినది. ప్రజాభిప్రాయము స్థిరపడుటవలన, ప్రజాస్వామ్యము గమ్యమయిన ప్రభుత్వవిధానము దేశమున నెలకొనుటవలన (దేశభాష) తెనుఁగు మొదటిభాష యగుచున్నది. వైజ్ఞానికవ్యవహారమునకుఁ గ్రమక్రమముగ వచ్చుచున్నది. తెలుఁగు బాలురందరును తెలుఁగులోనే విద్య నేర్చుచున్నారు. భావికాలమున నభివృద్ధి కలుగఁ గలదని తోఁచుచున్నది.

## 2. 1947వ సంవత్సరమునాఁటి భాషాస్థితి

ప్రస్తుతము పరిశీలింపవలసిన విషయములు రెండు. మొదటిది పాశ్చాత్య విజ్ఞానమునఁ గలిగిన యనేక శాస్త్రవాఙ్మయము నెట్లు తెనుఁగునకుఁదెచ్చుట. తెనుఁగు నకు తీసికొనిరాక తప్పదను ప్రజాశాసనమును పాలకులును, పండితులును ఇష్ట మున్నను, లేకున్నను అంగీకరింపక తప్పదు. అట్లు చేయుటలో ఆంగ్లపదములను అట్లే గ్రహింపవలయునా లేక తెనిఁగింపవలయునా, సంస్కృతీకరించి సంస్కృత సమములుగా దెచ్చుకొనవలయునా యనుటయే సమస్య. ఆంగ్లసమముల నట్లే తెచ్చుకొన్నచో ఆంగ్లభాషాజ్ఞానము ఆంధ్రునకు అనివార్యమయిన యవసరము గలది యగును. సంస్కృతమునంతటిని తెనుఁగు తనలో జీర్ణించుకొనుటవలన తెనుఁగు పండితు డనఁగా సంస్కృతపండితుఁడు తెనుఁగుచే సంస్కృతుఁడగుటయే యనుట. అట్లు గానివానికి, తెలుఁగుమాత్రము వచ్చినవానికి సంస్కృతపదములలోని చిక్కులు, సంస్కృతశాస్త్రములలోని భావజాలము మిక్కిలి దూరమయి శ్రమ తప్పుటలేదని మనము చూచుచునేయున్నాము. అట్లే ఆంగ్లపదములు వేనవేలు తెనుఁగునకుఁ దెచ్చుకొనినచో ప్రకృతి ప్రత్యయ విభాగము తెలియక కేవల సంజ్ఞామాత్రములుఁగ నట్టి పదములను వాడుకొనవలసివచ్చుచుండును. అట్లు తీసికొని రాకున్నచో తెలుఁగుపదములుగాని సంస్కృతపదములుగాని కల్పించినచో నవి కృతకములయి శక్తివెంటనే యేర్పడక అంతర్జాతీయవిజ్ఞానప్రవాహమునకు ఈ పదములు మార్గదర్శకములుగాక దేశీయులు తబ్బిబ్బు పడవచ్చును. "తెనుఁగు సంస్కృత మయమయినది. అదియే దాని కఠినతకు హేతువు" అనునట్టి కొందఱనుడి "తెనుఁగు ఆంగ్లమయముగూడ నయినది. మఱింత కఠినతకు హేతువు" అను నుడిగా మాఱిపోవలసినకాలము రానున్నది. ఈ సమస్యను పూరించుట విజ్ఞుల పని. పయికి గనుపట్టునంతటి కష్టమైనది గా దిది. వ్యవహారవశమునఁ గాలక్రమమున మార్గము సులభమయిన పదములు పరిచితము లగును. పరిశ్రమవలన పాఠకులకు పరిపాటి యగును. అభ్యాసమే యవకాశములను గల్పించును.

ఏది యెట్లయినను దేశభాషలోనే ముఖ్యవ్యవహారము జరుగుట ప్రజల హక్కు. అది స్థాపన కాక తప్పదు. దానిలోనే యోచన జరుగును. రచన పెరుగును. అన్యభాషయు, అన్యనాగరకతయు మార్గదర్శకములుగా నున్నంతకాలము

పరపరిపాలనమునందువలెనే, జనుల వైజ్ఞానికతనువులు వగల నొగలక తప్పదు. కారణ మూహించుట సులభము. పరభాషకును, ఆ నాగరకతకును గేంద్రస్థానములును, ప్రబోధకనాడీచలనమును మనకు దూరస్థములై యుండును. వ్యవహారమును, ప్రచారమును ఇక్కడ జరుగును. దృష్టి యావైపుననే యుండుటచేత భావస్వాతంత్ర్యము లేదు. అన్యభాషాపరిచయమునకును, అందలి వాక్యసౌష్ఠవసంపాదనమునకును, అందలి భావచమత్కృతిని బొందుటకును ఆవేశముతో ప్రయత్నము జరుగును. విషయగౌరవము తగ్గును. దేశీయులు ఏవైన క్రొత్తవిషయములు గనిపెట్టినచో నవి యందే యుండును. నిరంతరముగ స్వ పర భావము దుర్భర మగుచుండును. దేశభాషలో స్వతంత్రయోజన సులభము. శృంఖలితము కాదు. భారతదేశమునకు ఖ్యాతిదెచ్చినదని మనము గౌరవించు గీతాంజలి దేశభాషలోనే యా మహానుభావునిచే వ్రాయంబడి వన్నె కెక్కినది. తెనుఁగు గావుననే వేమన యమృతము వంటి గ్రంథమును వ్రాయఁగల్గెను. అట్టి ఆంగ్లకావ్యములనుగాని, సంస్కృతవిమర్శలనుగాని దేశీయులు వ్రాయజాలరని భావముగాదు. ఎవ్వరేని సమర్థులు వ్రాయవచ్చునేమోగాని శ్రమ యధికమని మాత్రము చెప్పక తప్పదు. ఇది మహాప్రతిభావంతుల పద్ధతి. కొంచెము తక్కువవారిమాట విమర్శింప నవసరములేదు. వారు దేశభాషలోనే గొప్పపని చేయగలుగుదురు. ఈ సందర్భమున భాష యనఁగా పదములుమాత్రమే గావనియు, వాక్యరచనావిధానమును, వ్యాకరణమును, ప్రత్యయప్రయోగము మొదలయినవియు నని గుర్తెఱుంగవలెను. తత్సమపద భూయిష్ఠమైనను తెలుఁగు తెలుఁగే. సంస్కృతము అసలే అర్థముకాదు. ఆంగ్ల పదభూయిష్ఠమయిన తెలుఁగు ఆంగ్లభాషకంటె సులభమనుట నిర్వివాదము. కొంత కాలమునకు ఆ పదములు తెనుఁగున ప్రాతపడి పరిపాటి యగును. మాది యను భావ మేర్పడును. ఆ భావముతోనే చుట్టుకొనియున్నది యీ జగత్తునందలి సర్వ ప్రయత్నము. కావున సర్వథా అదియే వాంఛనీయము. ఆంగ్లభాషలో నలవాటు పడిన పండితులు ఆ భాషను విడిచినచో నెట్లు? అని దిక్కుతోచక దేశభాషా ప్రాముఖ్యమునకు వైముఖ్యమును జూపుచున్నారు. సమర్థుడగు తండ్రి యున్నంత కాలము, నా తరువాత నా కొడు కేమగునో యని తలంచును; కాని తండ్రులు పోకతప్పదు. తెలుఁగుభాషకు ప్రాధాన్యము రాకతప్పదు. ఆంగ్లభాషాప్రచారము వెనుకఁబడక తప్పదు.

ఈ భాషయొక్క గొప్పతనము భావిని ఈ భాషమాటాడువారి ప్రతిభకును, ప్రభావమునకును, నాగరకతకును ఫలితము కాగలదు. అవి యున్నతమయినచో నిదియును గొప్పది కాగలదు. మానవుని జీవితము అను గృహమునకు అతని జాతి యొక్క ప్రతిభ, ప్రభావమును మూలస్థంభములు. వానియొక్క కాంతి, సొబగు, ఆకారము, సౌష్ఠవము అనువానివంటిది భాషోన్నతి. కాఁబట్టి వానినిబట్టియే యిది యేర్పడును గావున భావిని తెనుఁ గెట్లుండునో యెవ్వరును జెప్పఁజాలరు.

## 3. కర్తవ్యము

నేఁడు తెనుఁగులోనున్న యింకొక విశేషమును వివరింపవలయును. గ్రాంథిక, వ్యావహారిక భాషావిషయ మిది. 25 లేక 30 సంవత్సరములకు ముందు దేశమున గ్రాంథికభాషకుఁ గల ప్రాముఖ్యము నేఁడు లేదు. వార్తాపత్రికలు గ్రాంథిక భాషలోనే ప్రచురణ నందుచుండినవి. జనులు చాలమంది యందే వ్రాయుచుండిరి. నేఁ డట్టి పద్ధతి పోయినది. వ్యవహారస్థమయిన పదములు మాండలికరూపములతో ననేకు లనేకవిధములుగా వాడుచున్నారు. వార్తాపత్రికలు, రేడియో ప్రచారము మొదలయిన వన్నియు నందే జరుగుచున్నవి. శ్రీ గిడుగు రామమూర్తిపంతులుగారు తమసిద్ధాంతమును బ్రచారము సేయకముందు పండితులు అపర్యాప్తలక్షణము ననుసరించి కవిప్రయోగములను దిద్దుచుండిరి. సామాన్యుల కెవ్వరికయినను ఇది తప్పా, ఒప్పా అను ప్రశ్న ఒకొక్క పదప్రయోగముననను వ్రాత వ్రాయుటకుముందు ఉండినది. అది నేఁడు చాలమంచిలో నశించినది. స్వేచ్ఛగా వ్రాయుట, నిరాఘాటముగా ప్రచురించుట అనునవి మంచి విషయములు. కాని తలకొక విధమున వ్రాసి భాషకు మఱల మాండలికత్వావస్థను గల్పించుట సరికాదు. అసఁగా ప్రామాణికభాష అఖిలాంధ్రదేశమునకు నొక్కటియే యుండవలయును. అట్టిదానిలోనే యొక్క రీతినే యత్యల్పభేదములతో శిష్టులు వాగ్వ్యవహారమును, రచనావ్యవహారమును జరిగించుచుండవలయును. ఉత్తరసర్కారులవారు తమ మాండలికభాషను రచించుచు, దత్తమండలవాసులు తమ భాషలో తాము వ్రాయుచు నున్నచో నీ రెండు దేశవిభాగములకు గల యైక్యము చెడును. ఒకపత్రిక తెలుఁ గొకరీతిని, మఱియొకపత్రిక తెలుఁగు మఱియొక రీతిని, రేడియోలో ఒక్కొక్క వ్యక్తి యొకొక్క విధముననను మాటాడుచు, వ్రాయుచుండినచో భాషకు వైవిధ్యము తప్పదు. భేదమునుండి అభేదమును, వైషమ్యమును దొలగించి సామ్యమును గల్పించి యేకరూపమున భాషకు ప్రామాణికవ్యవహారము నంగీకరింపవలయును. ఇట్లంగీకరింప వీలులేదు, ఎవరి యిష్టము వారిది అను సిద్ధాంతము నామోదించి యూరకుండినచో భాష వివిధరూపములతో వివిధజనులు వ్రాయుచుందురు. ఇది ఐక్యములేని ప్రాచీనావస్థతో సమానము. భాష నేఁడు మాఱిపోయి క్రొత్త రూపమును దాల్పవలసిన యవస్థ స్పష్టముగా గనుపట్టుచున్నది. ప్రామాణిక మైన నవీనభాషారూపమును అంగీకరించి జనులెల్ల రద్దానిని వాడవలెను. ఇట్టి పద్ధతి శీఘ్రముగా రాకుండుటకు హేతువు అన్యభాషాప్రధాన్యమును, దేశభాష యొక్క అప్రాధాన్యమును అనకతప్పదు. ఆంధ్రులకు ఆంధ్రరాష్ట్రము సిద్ధించి, ఆంధ్రము ముఖ్యవ్యవహారమును బొందినప్పుడు, ప్రభుత్వము ఈ విషయమున నాదరణము వహించినపుడు, దేశమునందలి వేనవేలు పట్టభద్రులు, అసంఖ్యాకు లయిన న్యాయవాదులు, చక్కని భాషను ఒకేరూపమున మాటాడుచు, వ్రాయుచు నున్నచో భాషకు ఉన్నతస్థితి గలుగును. అట్టిస్థితి భావిని గలుగకతప్పదు. తెలుఁగు

నకు వైజ్ఞానికవ్యవహారమునఁ బ్రాముఖ్యము గలుగుచున్నది. ఈ విషయమున శ్రేష్ఠులే మార్గదర్శకులు గావలయు. సంస్కృత ప్రాకృతములు మూలఁబడి తెలుఁగు నన్నయకాలమున నెట్లు వెలసినదో యట్లే మఱల ఆంగ్లము మూలఁబడి తెలుఁగు వెలుగనున్న రోజులు వచ్చుచున్నవి. ఏరూపమున భాషయుండవలయును- చేయుచు అని వ్రాయవలెనా, చేస్తూ అనియా యనునది యల్పవిషయము. ఏరూపమును వ్రాసినను అభ్యంతరము కలుగదు. భాషకు ఏకవిధమయిన ప్రామాణికత్వము వెలయవలయును. ఆ ప్రామాణికభాషకే ఒక్కతీరుననే వ్రాతయు, మాటయు శ్రేష్ఠులలోనైన నుండవలయును. అప్పుడు వారినే సామాన్యు లనుకరించుటచే భాషకు ఉన్నతి కలుగును. మార్పువిషయమున భాషాచక్రము వెనుక తిరుగదనియు, ముందునకే పోవుననియును భాషావిదుల యనుభవము. నేఁటికిని ముందటికిని తెలుఁ గెట్లుండవలయుననుటలో ప్రయోక్తల యిచ్ఛయే ప్రమాణము గావున జనులకు నాయకులయినవారును, ప్రభుత్వ సమ్మతిని బడసిన పండితులును, పరిషత్తులును దానిని నిర్ణయింపవలయును. ఇది భావికార్యము. ఇట్టి భావి యవశ్యప్రాప్యమనుట నిస్సంశయము. ఏదేనొక్కవిధమైన ప్రామాణికభాష-వైవిధ్య మంతగాలేనిది-నాగరకతయొక్క ముఖ్యలక్షణము. ఒకానొకరు చెప్పిన యీ క్రింది వాక్యములతో నీ గ్రంథమును ముగించుచున్నాను.

"I cannot do better than quote a writer in the New York 'Round Table' in this connection .He says, "The corruptor of a language stabs straight at the heart of his country. He commits a crime against every individual of the nation, for he throws poison into a stream from which all must drink. He wrongs himself first and afterwards every man and woman whose native speech he mars. It is the duty of every educated man to guard zealously the purity of his native tongue. He who hunts down and pillories a slang phrase, a vulgarism, a corruption of any kind, is a public benefactor. In the fulfilment of the sacred trust which rests on him as an educated man, he adds a stone to the bulwark of his nation's safety and greatness."[1]

భాషాప్రాశస్త్యమును సంరక్షించుట విద్యార్థికుల కర్తవ్యము అనునది పయివాక్యముల యభిప్రాయము. తెనుఁగు ప్రథమభాషయయి, కోర్టులలో, రాజకీయరంగమున, బడులలో, ఉపన్యాసవేదికలపయి, ఒక్కతీరున ఏకరూపమున దేశమంతటను వ్రాయుట, మాటాడుట అనునట్టి స్థితియే యియ్యది. దీనికి జనుల యాదరణమే హేతువు. అది తెనుఁగునకు లేకపోలేదు.

## 1968-వ సంవత్సరమునాఁటి భాషాస్థితి

పయిరీతిని కర్తవ్యమును 1947 లో నూహించి వ్రాసితిని. 1968 లో— 21 సంవత్సరముల వెనుక నెట్లున్నది మన భాషాస్థితి, యను విషయము కొంచెము

[1] *Lectures on the history of Kanerese Language* by R. N. page 154.

విమర్శింపవలయును. ఈ విషయమునసే, ఈ గ్రంథమున రెండవ శీర్షికలో నేటి యాంధ్రభాషాస్వరూపము అను విషయమున స్పృశించితిని. మఱల నావిషయము తోనే ముగింపవలెను.

భారతదేశమున పారతంత్ర్యము 1947 లో వదలినదిమొదలు ప్రపంచమున ననేకదేశములలో పరిపాలన మంతరించి స్వరాజ్యము ప్రజాతంత్రముగా స్థిరపడినది. ప్రజాప్రభుత్వములలో కొంతప్రతిష్ఠ గడించిన భారతదేశము ఇతరదేశములకును, అన్య ప్రభుత్వములకును మేలుబంతియై యనుకరణీయమయినది. ఈ రాజకీయపరిస్థితులు, సామాన్యజనులకు పరిపాలనలో గల బాధ్యత, భాషలపయినిగల యభిమానము, ప్రభుత్వముదృష్టిని మార్చినవి.

ఆంగ్ల సంస్కృత భాషలకును నాఁడు ఉండిన ప్రాబల్యము నేఁడు అనేకవిషయములలో తగ్గినది. వానియందలి పాండిత్యమును జనులలో వెనుకఁబడినది. ఇఁక దేశభాషలే వారికి ఆదరణీయములు. ఈ పయిలక్షణములు భారతదేశభాషలయం దెల్లెడలను గలిగినవి. ఇఁక తెనుఁగున ప్రత్యేకతను పరిశీలింపవలెను. గ్రాంథిక, వ్యావహారికము లను పేర 1918 సంవత్సరమున నుండిన వైమత్యము 1948 లో చాలవఱకు నశించిపోయినది. 1968 లో ఆ భేదమే చెప్పుకొనవలసిన యవసరము లేదు. అయినను కొందరు మృతసర్పములను మోదువారు ఎప్పుడైనను ఆ భేదమును స్వలాభముకొఱకు పేర్కొనుచున్నారు. ప్రజారంజనముకొఱకు బయలుదేరిన సినిమాలు, రేడియోప్రసారములు, వారపత్రికలు, దైనికపత్రికలు భాష కొక నూతన స్థితిని తెచ్చిపెట్టినవి. చేత్రాటివలె పొడుగైన సంస్కృతసమాసములను వాడువారు మిక్కిలి తక్కువ. కారణము అందు పాండిత్యము లేకపోవుట. తమకు పరిచితములయిన పరిమితపదములలోనే యున్నతభావములను చెప్ప ప్రయత్నించుచుండుటవలన స్వాభావికమయిన తెలుఁగుశైలి సిద్ధమగుచున్నది. ప్రజాపోషణము కలుగుటచేత ప్రతిభావంతులయినవారు క్రమక్రమముగ తెలుఁగున వ్రాయుచుండుటవలన మంచినవలలు, కథానికలు, నూతనాశయములు, రచనాప్రణాళికలు, జీవన ప్రతిబింబములను వాఙ్మయమున ప్రతిఫలింపజేయుటతోపాటు చక్కని తెనుఁగు నుడికారము సిద్ధమగుచున్నది. అది మనము మాటాడుభాషకు విశేషముదూరముకాక, మాండలికభేదములను తొలగించి, మధురమై విశిష్టముగా నున్నది. ఇంకను ప్రతిభావంతులయినవారు ఈ భాషలో వ్రాయుచున్నయెడల ఇంతకంటె మెరుగుగా తెనుఁగు వెలుగగలదు. అచిరకాలములోనే అది సిద్ధమగును.

పయివిషయము కేవల జనాదరణమును గోరిన రచనలు. వైజ్ఞానికమైన రచనలలో ఇంకను పరిపక్వశైలి పూర్ణరూపమును పొందలేదు. శాస్త్రగ్రంథములు, చట్టములు తెలుఁగులోనికిని, ఇతరదేశభాషలలోనికిని అవతరింపజేయవలయునని ప్రయత్నములు జరుగుచున్నవి. ఇందు కొన్ని యిబ్బందులు తప్పలేదు. నూతన

పదసృష్టి జరుగుచున్నది. దానికి సంస్కృతమే యాధారము. ప్రత్యయాత్మకమయి యనేకనూత్నపదసృష్టికి సులభమగుటచేతను, అఖిలభారతమునకు సమరూపమున నుండు నను నాశచేతను సంస్కృతము మన కనివార్యమయిన ఖని యయిపోయినది. కాని యట్లు సృష్టములయిన పదములకు ప్రయోగము కలిగి గ్రంథవ్యవహారము లేకపోవుటచేతను, ఆ స్రష్టలకు కొంత సంస్కృతపాండిత్యము చాలకపోవుటవలనను, భిన్నప్రాంతములలో ఏకపదమునకే అర్థభేదము లుండుటచేతను పూర్ణమయిన సత్ఫలిత మింకను కలుగలేదు. ఏది యెట్లున్నను సంస్కృతమును, ఆంగ్లమును ఇంతసులభముఁగా విడువదగని భాషలు. ఆంగ్లమునను మొదటినుండియు పదసృష్టికిని, ప్రత్యయప్రయోగములకును లాటినును, గ్రీకు భాషలే యాధారము లయినవి. మనకును నట్లే సంస్కృతాంగ్లములు తప్పవు. వాని సాయము మనకు సులభముగా నుండును గాని తెనుఁగుభాష స్వభావమును మార్చి మనకు విదూరముగా చేయున ట్లుండవు. ఒకప్పు డేదో క్రొత్తశైలి యేర్పడినను అది ముఖ్యవ్యవహారములో నుండుటవలన పరిచితమయి ఉపాదేయమయి యోగ్యమయినదను భావన యేర్పడును.

ఏది యెట్లున్నను తెనుఁగువారిలోని ప్రతిభావంతులు తెనుఁగున నున్నత గ్రంథములను వ్రాసినప్పుడుగాని యీ భాషకు గొప్పదనము పూర్తిగ సిద్ధింపదు. అట్లు సిద్ధించుటకు దారులేర్పడినవి. 1988 లో మఱల విమర్శించుకొను నవకాశ మున్నపుడు మన యభివృద్ధి బోధపడును.

ఇతి శమ్!